గోపీనాథము వేంకటకవి, 1820-1892

శ్రీమదాంధ్ర రామాయణమహాకావ్యము

వేంకటగిరి, 1894

Record no. 640

Gōpīnāthamu Vēṅkaṭakavi, 1820-1892

Śrīmadāndhra Rāmāyaṇamahākāvyamu

Vēṅkaṭagiri, 1894

Record no. 640

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

గోపీనాథము వేంకటకవి, 1820-1892.

శ్రీమదాంధ్ర రామాయణమహాకావ్యము / గోపినాథ వేంకటకవీంద్ర ప్రణీతం.- 2. కూర్పు.- వేంకటగిరి : కాశీవిశ్వనాథ ముద్రాక్షరశాల, 1894.

495, 360 p. ; 24 cm.

Record no. 640

Gōpīnāthamu Vēṅkaṭakavi, 1820-1892.

Śrīmadāndhra Rāmāyaṇamahākāvyamu / Gōpinātha Vēṅkaṭakavīndra praṇītaṃ.- 2. kūrpu.- Vēṅkaṭagiri : Kāśīviśvanātha Mudrākṣaraśāla, 1894.

495, 360 p. ; 24 cm.

Record no. 640

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began: 23 January, 2006

శ్రీ ర స్తు.

శ్రీరామదేవోజయతు.

శ్రీవేంకటగిరి పురవరాధీశ్వరులగు మహారాజరాజశ్రీ

శ్రీమద్వెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్ర

బహదుర్ వారియానతిచే

---

బ్రహ్మశ్రీ

గోపినాథ వేంకటకవీంద్ర ప్రణీతంబయిన

# శ్రీ మ దాం ధ్రి రా మా య ణ మ హా కా వ్య ము

---

ఇది,

బ్రహ్మశ్రీ - దేశభట్ల జానకీరామ సుధీమణిచేతను

మ-రా-శ్రీ, బి-శేషాద్రి రాజ కవిచేతను

ముద్రాప్రమాదాది దోషంబులులేకుండఁ

బరిష్కరింపఁబడి

---

మహారాజరాజ శ్రీమన్ముద్దుకృష్ణయాచ మహీమండలాఖండలు నాజ్ఞచే

వేంకటగిరియందలి

శ్రీకాశీవిశ్వనాథ ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడి ప్రకటితంబయ్యె.

---

రెండవకూర్పు - ౨౫౦,

౧౮౯౪-వ సం॥ 1894

కాపీరైట్.






శ్రీరస్తు.



శ్రీగణేశాయనమః

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

## శ్రీమద్రామాయణము * బాలకాండము.

శ్రీమీఁఅన్వనజాసనాదికులు ప్రార్థింపన్ ఖలశ్రేణి సం। గ్రామక్షోణిజ యించిసాధుజనులన్, రక్షించిభూభారము। ద్దామప్రీతి హరించి ధర్మమును సం, స్థాపింపఁ గృష్ణాకృతిన్। భూమానందముతో జనించినకృపా, పూర్ణున్ హరింగొల్చెదన్ ॥ (చ) కలశపయోధిపుత్త్రియల,కాంచనగర్భునిఁగన్నతల్లిక। ల్వాలదొరతోడఁబుట్టు హరి,వల్లభ లేములఁబాపులేమసాం। పలరఁగఁబద్మషండముల,యందు వసించెడుతన్విలచ్చినా। కెలమిసమస్తసంపదల, నిచ్చి కృతార్థునిఁజేయుఁగావుతన్ ॥ (సీ) కరటిచర్మముఁదాను,గట్టిభక్తులకు సువర్ణచేలంబులె,వ్వాఁ డొసంగె। ఫణిహారములుదాను, పైఁదాల్చియెవ్వాఁడు మణిహారములుదాస,గణమునకిడెఁ। గాలకూటముఁదాను,గబళించిసేవకతతుల కెవ్వాఁడమృతం బొసంగెఁ। దానుకపాలంబు,ధరియించియెవ్వాఁడు మితిలేనిభాగ్యమా,శ్రితులకిచ్చె ॥ (తే,గీ) నట్టిపరమదయాశాలి,నబ్జమౌళి। నఖిలలోకేశుభూతేశు,నభ్రకేశుఁ। బ్రమథగణనాథువినతసు,పర్వనాథుఁ। బార్వతీనాథుమదిలోనఁ,బ్రస్తుతింతు ॥ (మ) పతిసామేనవసించిభారతియులో,పాముద్రయున్లక్ష్మియున్। సతతంబున్భజియింప భూరికరుణా,చంచత్కటాక్షంబులన్। బతికన్నన్నతకోటికెక్కుడుగసం,పద్భోగసౌభాగ్యముల్। జతురత్వఁబుననిచ్చుగౌరినను వా,త్సల్యంబునన్బ్రోచుతన్ ॥ (మ) హరినాభీకమలంబునం బొడమిభాషాజ్యేక్షణంబత్నిగాఁ। గరమర్థింగొనితత్సమేతముగ వే, డ్కన్బద్మపీఠస్థుఁడై ప। రమప్రీతిసనందనాదులుభజిం,పన్ నేర్పుమీఱన్ద్రయీ। సరణిన్ ముజ్జగముల్ సృ

జించినజగ,త్స్రష్టన్విధిఁ గొల్చెదన్ ॥ (శా) వీణాపుస్తకపాణిపట్పదలస,ద్వేణిన్ బృహన్నేత్రైనకత। శ్రోణిన్ బద్మజురాణిసర్వసుగుణక్షోణిన్ బురాణిన్న తేం।ద్రాణిన్నేత్రజతైణిఁబాదగతగీ,ర్వాణిన్ బ్రవృద్ధాశ్రిత। శ్రేణిన్వాణినభీష్టసిద్ధికిఁబదిన్ సేవింతు నశ్రాంతమున్ ॥ (పంచచామరము) అజాదిదేవబృందమే మ,హాత్మభక్తినాత్మలో। నజస్రమున్భజించివాంఛి,తార్థసిద్ధిఁగాంచునా। గజాస్యుసర్వదేవతాగ్ర, గణ్యుఁగార్తికేయుపూ। ర్వజున్ గణాధిపుంద్రిలోక వందితున్ భజించెదన్॥ (సీ) రామనామాంకిత,రత్నముద్రికయిచ్చిజనకజప్రాణమే,ఘనుఁడు నిలిపె। మైథిలీవరశిరో,మాణిక్యమర్పించికడిమి నెవ్వాఁడురా,ఘుపునిఁబ్రోచెఁ। బ్రతికించె నెవ్వాఁడు, పరమదివ్యౌషధీదానంబుచే సుమి,త్రాతనూజుఁ। బూని యెవ్వాఁడురా,మునిరాక యెఱిఁగించిభరతశత్రుఘ్నుల,బ్రతుకఁజేసె ॥(గీ) సమరమునమూర్ఛనొందిన,సకలకపులఁ। బ్రాణములొసంగి యేమహా,బలుఁడుమనిచె। నట్టిపరమోపకారిజి,తాఖిలారి। నద్భుతవిహారి, సామీరినభినుతింతు ॥ (చ) సరసిజగర్భనిర్మితల,సచ్ఛతకోటివిశాలతాఘువే। శ్వరచరితంబులోకహిత,సంగతినిర్వదినాల్గువేలుగా। వరుసరచించినట్టి ముని,వల్లభునాది కవీంద్రుయోగవి।స్ఫురితువిరించనాంశభవుఁబుణ్యుఁబ్రచేత సపుత్రుఁగొల్చెదన్ ॥ (చ) తొలుతజగద్ధితంబుగశ్రు,తుల్ విభజించితదర్థయుక్తిచే। నెలమిఁబురాణముల్పదియు,నెన్మిదియున్ రచియించిసన్మతిన్। బలువుగభారతంబనెడు,పంచమవేదముఁజేసినట్టిని। ర్మలునిఁద్రివిక్రమాంశజుఁబరాశరపుత్రుని సన్నుతించెదన్ ॥ (సీ) వేడ్కతోనెద్దాని,వినినఁబఠించినఁ గరమర్థిభోగమో,క్షములొసంగు। నరుదారనెద్దిగా, యత్ర్యాఖ్యమగుపరబ్రహ్మనివాసమై,పరఁగుచుండు। రత్నాఢ్యమగుసము,ద్రముభంగి సత్కథావిస్తీర్ణమై యెద్ది,వినుతికెక్కు। నొక్క పాదంబైన,నొక్కపదంబైననెద్దానిఁబఠియింప,నిచ్చుఁబరము ॥ (తే,గీ) శ్రుతిమనోహరమెద్ది వి,శ్రుతపురాణ। మునిరచితమెద్ది సత్కావ్య, ముఖ్యమెద్ది। యట్టి బుధసేవ్యమైన రా,మాయణమున। కాదికావ్యంబునకు నతు, లర్థిఁజేతు ॥ (ఉ) శంకరపంకజాక్షగిరి,జాహనుమన్ముఖ దేవతానుకం। పాంకకటాక్షలబ్ధకవి,తాకరులై బహుకావ్యనాటకా। లంకృతులాచరించి విపు,లంబగువిశ్రుతిగన్నయట్టిని। ష్పంకులఁగాళిదాసముఖ, సత్కవులన్మదిసన్నుతించెదన్ ॥ (ఉ) భారతరామసచ్చరిత, భాగవతాదిమహాపురాణము। ల్గోరితెనుంగునన్నిఖిల,



లోకహితంబుగఁజేసినట్టియా ! ధీరులనన్నపార్యకవి తిక్కన భాస్కర పోతనాదులన్ । సూరివరేణ్యులంబరమ శుద్ధులఁజిత్తమునందలంచెదన్॥ ॥ (చ) సరసపదార్థసంగతులఁ జారుతరంబుగ సత్ప్రబంధము । ల్వొసరచించి ప్రీతిమధు వైరికొసంగికృతార్థులైరహిం। బరరచితప్రబంధముల బాగుగఁ గన్గొనియాదరింపుచున్ । వఱలెడువర్తమానకవి వర్యులనార్యులఁ బ్రస్తుతించెదన్॥ (మ) ఇలసర్వజ్ఞుఁడుపార్వతీప్రియుఁడుగాకెవ్వాఁడులేఁడన్యుఁడే। నెలమిన్నేర్చినభంగిఁజెప్పితిశుభశ్రీరామ చారిత్రమున్ । బలుమాఱందులఁ దప్పులుండినగణిం పన్బోక సద్భక్తితోఁ। డిలకింపందగు భావిసత్కవులమం దీభూతచేతస్కులై ॥ (ఉ) కొంచపువిద్యలన్గడుపు కూటికినన్యులయొద్దఁజేరితా। రించుకపారమార్థికము నెంచకనన్నియునేర్చినట్లుగ। ర్వొంచికృతుల్రచించుటకులేకమహాకవులన్ గుయుక్తులన్ । వంచనసేయుదుష్కవుల వారకబుద్ధినిరాకరించెదన్ ॥ (చ) నృపతులవేఁడిన్ గరుణ నిచ్చిననిత్తురుదంతివాజిర। త్నపటధనాగ్రహారములు దప్పకయన్నియునస్థిరంబులా। విపుల కృపాపయోధియదువీరునివేఁడినఁబ్రీతినిచ్చుని। త్యపదమునట్టివానిఁగొని యాడక యన్యులవేఁడనేటికిన్॥ (చ) స్థిరమతిమాధవాంకితముఁ జేసిరచింపఁగఁబొలుసత్కృతు । ల్దఱుచుగనందుఁజెప్పఁబడు లక్షణదోషములెన్నియున్ననా। హరికరుణావిశేషముననన్నియుఁ జాలగుణంబులైచనున్ । బరుసువుసోఁకలోహముధుర్వంబుగఁగాంచనమైనకైవడిన్ ॥ (చ) చతురతమీఱఁబాకములు శయ్యలు రీతులలంకృతుల్ ధ్వనుల్ । వితతరసంబులున్ మఱియు వృత్తులు దోషములున్ గుణంబులు। న్నతిఁబరికించిసత్కృతియొనర్చినఁదత్కృతిలోకపూజ్యమై। యతులితభంగివృద్ధిఁగను నావిధుభాస్కరతారమైభువిన్॥ (చ)అరుదుగ నాణిముత్తెములహారముగూర్చిన మాడ్కిలోవెలిన్। మెఱుఁగులు దేరుశబ్దములు మెచ్చుగఁగూర్చి రసార్థగౌరవ। స్ఫురణదలిర్ప సత్కృతులు పూనిరచించిన సత్కవిత్వమున్। సరసకవిత్వమంద్రుకవి సత్తములన్యకృతుల్గణింతురే ॥ (వ) అనియివ్విధంబున నభీష్టదేవతా ప్రార్థనంబును సుకవిజన బహూకరణంబును గుకవిజననిరాకరణంబును సత్కృతి ప్రస్తుతియుం గావించి మద్వృత్తాంతంబు వివరించెద నేనుపదియాఱువత్సరంబులవాఁడనై యుండుతఱి నొక్కనాఁడు సింహ

వేదశైలంబునకుంజనియందొక్కమహాయోగివలననొక్కవిద్యవడసితత్ప్రసాద
లబ్ధకవిత్వవిద్యావిశేషుండనై యుదంచితమందారకుసుమబృంద నిష్యందమకరంద
బిందుసందోహపేశలసుధామయమంజులశబ్దప్రపంచంబును నవరసోచితచాతు
ర్యసౌకర్యనిగూఢార్థసంగ్రహ సాహిత్యసాధ్య నానాలంకార సంగ్రహంబునుధ
ర్మార్థ కామమోక్షప్రదంబును బురాణమునికథితంబును సకలవిద్వజ్జనసేవ్యంబు
ననగునొక్కమహాకావ్యంబుభగవత్ప్రీతికొఱకుంగవిజనానుమతంబునరచియిం
పందలంచియట్టిమహాకావ్యంబెయ్యదియామహాప్రబంధరాజంబునకు నాయకర
త్నంబెవ్వండొకోయని విచారింపుచున్న సమయంబున॥ (సీ) లలితహాసమువాఁ
డురతిరాజుఋతురాజువలపించురహిమించుచెలువువాఁడు। మొయిలువన్నియ
వాఁడుమురిపెంపుమురిపెంపు దులకించుచక్కనిగళమువాఁడు। కోమరుప్రాయ
మువాఁడుకమలారికొమరొలిఁబురుణించుసొబగైనముఖవాఁడు । వలుదచెక్కు
లవాఁడుబంగారుపొంగారువలిపెంపుజిగిమించువలువవాఁడు॥ (తే,గీ)చారుకో
టీరకేయూరసారహార। హారకుండలధాళధళ్యములవాఁడు। బర్హిబర్హావతంసుఁ
డుపరమపురుషుఁ। డొకఁడుకలలోనఁజూపట్టెనుత్సుకతను ॥ (ఉ) మీఱినవేడ్కన
వ్వనద మేచకదేహమువానిఁగాంతిపె। ల్లూరెడుతమ్మిఱేకులన నొప్పెడుకన్నుల
వానిఁబూర్ణిమాం। భోరుహవైరిమండలవిభూతిఁగనందగు మోమువానిసొం।
పారెడువానిఁగాంచిమది నద్భుతమున్ముదమంకురింపఁగన్॥ (తే,గీ) కువలయా
నందరసమొనగూర్చువిధున। కలరుపద్మానుమోదియై వెలయుహరికి। మహితసు
మనః ప్రబోధియై మలయుమాధ। వునకు నిట్లంటి వినయోక్తిననుపమముగ॥
(తే,గీ) అనఘపూర్ణకళానిధియనఁగలోక। బాంధవుఁడనంగఁజతురాస్యభవ్యుఁ
డనఁగ। మాధవుఁడనంగసర్వజ్ఞమహిముఁడనఁగ। వఱలునీవెవ్వ రయ్యయోప
రమపురుష॥ (క) హరుఁడవొమధుకైటభసం। హరుఁడవొ పల్కులవెలంది
యగువాణిమనో। హరుఁడవొఘనశంబరసం। హరుఁడవొ శితకరుఁడవొ మ
హాత్మతెలుపవే॥ (గీ) దివ్యపురుషనీదుతేజోరుణాలోక। నమునఁదమమువిరిసెవి
మలవృత్తి। బొసఁగఁ దెలివిఁదాల్చె బుద్ధిప్రపంచంబు । చిత్తపంకజంబుచెలు
వుమీఱె॥ (క) అనవుఁడునద్దేవుఁడుమె। ల్లనవదనసరోజగంధ లహరీలబ్ధా। ళి
నిచయముకరణి మోమున । ఘనాలకము లలరఁబలికె ఘన నాదమునన్॥
(తే,గీ) ఏనుకృష్ణుండయుష్మదహీనభక్తి। కలరియీపుట్టువునకు నత్యంతకీర్తి।



సౌఖ్యములనంతరంబ మోక్షములొసంగఁ। దలఁచిసాక్షాత్కరించితిఁ దపము
కలిమి॥ (ఆ,వె)నన్నుమున్ను నెన్నుచున్నకతంబున । నతజనావనముగుణమ్ముగా
న। నిన్నుమెచ్చికడుఁబ్ర సన్నుఁడనైతిలే। కున్నఁగానవశమె నన్నుఁగుట్టి ॥ (క)
వచ్చితివరమిచ్చితిని। న్మెచ్చితినీభాగ్యమెన్న నేర్తురెయొరులో। సచ్చరితసక
లదోషస। ముచ్చయములఁబాసితివిసమున్నతిఁబుత్రా॥ (వ) వత్సానీవు పవి
త్రంబులైన మదీయదివ్యావతార చరిత్రంబులలో నీకభీష్టమెయ్యదిదాని మ
దంకితఁబుగానాంధ్రభాషరచియింపుమకావ్యంబునిర్విఘ్నంబుగాఁబరిసమా
ప్తినొందించునట్టిభారంబేనుపూనెద నీకునునీవురచించినకావ్యంబునకు నభ్యుద
య పరంపరాభి వృద్ధియగునట్లుగా ననుగ్రహించెద నీకీ జన్మంబుదక్క నొం
డుజన్మంబులేదీజన్మాంతంబునఁ బునరావృత్తి రహితంబైనపరమపదంబుఁ బ్రా
పించెదవు॥ (క) అనియాకమలాక్షుఁడున। గ్గనియుప దేశంబొసంగి ఘనకరు
ణాసం। జనితానందమునవెసం। జనెఁదానందమునసనంద సంభవుఁడంతన్ ॥ (వ)
ఏను మేలుగాంచి మేలుగాంచితినని యనంతసంతోషకలితస్వాంతుండనగుచు
దదుదంతంబంతయు నార్యులకెఱింగించి తదనుమతంబునఁ బురాతనపుణ్యశ్లోక
బ్రహ్మర్షివిరచితంబును ననేకార్థప్రతిపాదకంబును నానావిధవిచిత్ర మధుర
శబ్దప్రపంచంబును వివిధాలంకారభూషితంబును గాయత్రీబీజ సమ్మితంబు నగు
టంజేసి వేదతుల్యంబును సకలరత్నంబులకు సముద్రంబునుం బోలె బహువిధే
తిహాసంబులకుఁ దానకంబును నాదికావ్యంబును సమస్తసురమునిగణ సేవ్యం
బును వక్తృశ్రోతలకుభవ్యంబును బురుషార్థంబులకు నివాసస్థానంబునగురా
మావతారచరిత్రంబు భగవంతుండగు వాల్మీకి సెప్పిన క్రమంబునఁజతుర్వింశతి
సహస్ర పరిమితగ్రంథములోనం ద్రయోవింశత్యుత్తర సప్తశతవింశతి సహస్ర
పరిమితంబైన బాలకాండప్రభృతి షట్కాండ కథా ప్రపంచంబంతయు సమ
గ్రంబుగా నాంధ్రభాష రచియింపనిశ్చయించి॥ (శా) వ్యాప్తిన్రామ కథాసు
ధార్ణవముని త్యంబుద్దమింగ్రోలియుం। దృప్తింజెందని పుణ్యునాదిమకవిన్
దివ్యప్రభా వాధ్యునిన్ । సప్తార్చిఃప్రతిమాను బింగళజటాసందోహు నుద్యత్త
ప। స్తప్తుంగొల్చెదనిష్టసిద్ధికిమరుత్సంపూజ్యుఁబ్రాచేతసున్॥ (క) అనియమ్ము
నిఁబ్రార్థించినఁ। బనిఁగొనిముదమలరనాకుఁబ్రత్యక్షుండై। తనకజుఁడొసఁగిన
తెల్విని। ఘనముగనాకొసఁగిచనియెఁ గారుణ్యమునన్ ॥ (వ) ఇట్లమ్మహాముని

యంతర్ధానంబుచేసిన నేనుబహుజన్మకృత సుకృతపరిపాకంబున నిమ్మహాకావ్యరాజంబు దొరకొనియెఁగదాయని సంతసిల్లి రామాయణకథాప్రపంచ విరచనాదక్షుండనై యాభిముఖ్యంబునొందితి॥ (ఉ) మున్నలభాస్కరాదికవిముఖ్యులుప్రీతిరచించిరీకథం। జెన్నుగనీవుఁగ్రమ్మఱర చించుటకెయ్యది హేతువంచుమీ। రన్నబుధేంద్రులారవినుఁడారఘునాథ చరిత్రమెందరె। ల్లెన్నిననన్నిమాపులక హీనగతిన్దగియుండునుర్వరన్॥ (వ) అదియునుంగాక తిక్కనసోమయాజి హరిహరనాథునిం గృతినాథునింజేసి భారతంబు సాంగోపాంగంబుగా రచించెఁ బోతనామాత్యుండు సీతాపతింగృతిపతింజేసి భాగవతంబు రచించెఁ గంకంటి పాపరాజప్రధానుండు రుక్మిణీశ్వరుం గృతీశ్వరుంజేసి యుత్తరరామాయణంబు రచించె నాదికావ్యంబును మహాముని ప్రణీతంబును షట్కాండ కథాప్రపంచ సంచితంబైన యీపూర్వరామాయణంబు భాస్కరాదులొక్కమర్త్యునిం గృతినాథునింజేసిరచించి రిదిసమీచీనంబుగా దిమ్మహాకావ్యంబునకు రమానాథుండె కృతినాథుండైన బదియాఱువన్నెబంగారునకు మాణిక్యంబుతోడి సంపర్కలబ్ధిగలిగినచందంబున నధికోదయంబై యుండుఁగదాయనితలంచియీ రామాయణకావ్యంబు తొలుతంగుశలవులవలన రామరూపధరుండైన నారాయణుండె వినియెఁగావున నేనునుదత్క్రమంబున శ్రీకృష్ణరూప ధరుండైన రమావల్లభునిం గృతినాథునింజేసి యీపుణ్యకావ్యంబు రచింప నిశ్చయించితి నీరామాయణ రహస్యార్థతత్త్వంబు తెలియుటకు వామలూరతనయుండొక్కండుదక్క నన్యులెవ్వరును సమర్థులు గారైనను నాయెఱింగినంతఁ దేటపఱచెద నత్యాదరంబున నంగీకరింపవలయు నింక మదీయవంశావతారం బభివర్ణించెద॥ (చ) జలజభవాన్వయాటవివసంతుఁడుపావన గోపినాథస। త్కులకలశాబ్ధికైరవహితుండుకళాఢ్యుఁడులోకబాంధవుం। డలఘుపదార్థకర్తచతురాస్యుఁడుకామహరుండునిమ్మహీ। స్థలిసుమనోవిభూతిఁదగుసాధుఁడు వేంకటశాస్త్రిధీరుఁడై ॥ (తే,గీ) అట్టి సర్వజ్ఞునకు గౌరియనఁగ నార్య। యనఁగ శ్యామయనఁగశివయనఁగసర్వ। మంగళయనంగ సతియున మహితభద్ర। యగుచుఁగామాక్షి దేవియర్ధాంగియయ్యె॥ (క) ఆయిరువురకుదయించిరి। పాయకభగవంతుఁడైన భగవంతుఁడును। శ్రీయుతుఁడుబుచ్చనార్యుం। డాయతసత్ప్రభగులగుచు నర్యమసములై॥ (తే,గీ) అంతభగవంతు పత్నియగు నంత



రమున। నతనికూరిమితమ్ముఁడ,ద్భుతుఁడుబుచ్చ। నార్యుఁడారీతిననసూయనత్రివోలెఁ। బ్రేమతోఁగోనమాంబనుఁ, బెండ్లియయ్యె॥ (క) ఆమిథునమునకుఁ గల్గిరి। ధీమహితులు నారసింహ, ధృతిశాలియశో। ధానుడుఁరామాగ్రజను। త్రాముఁడు విభవాభిరామ, రామాతనులై॥ (క) అందగ్రజుండువిప్రపు। రందరుఁడనఁబొగడుగనెఁబు, రందరకరిస। త్కుందేందుశారదాంబుద। చందనయశుఁడగుచునరస, శాస్త్రివసుధలోన్॥ (తే,గీ) ఆనరసశాస్త్రి సతివెంక,మాంబపతికి। భోగసౌభాగ్య నిత్యవిభూతులొసఁగుఁ। దనువుసగముగ నొనరించి,ధవుని బికర। మెత్తఁజేసిన గిరిపుత్రి, నీసడించి। (ఉ) ఆమహనీయమూర్తికిస, మంచితకీర్తికి వెంకమాంబయం। దీమహిఁబద్మనాభుఁ,డన, నెంతయునొప్పెడుపద్మనా, భుడున్ సోమనిభుండు బుచ్చనఁయు సొంపలరన్ వరదుండు భూరివి। ద్యామహిమాఢ్యుఁడీతఁడన. నాభగవతుఁడు గల్గిరిమ్మగన్॥ (క) వారలలోనగ్రజుఁడగు। నారాయణసముఁడు పద్మనాభుఁడు వెలసెన్। హారాంబుజ హీరాంబుజ। వైరిపటీరారహారవర్ధితయశుఁడై ॥(తే,గీ)నయవిశారదుఁడగుపద్మనాభునకుఁ బు। రంధ్రివేంకటలక్ష్మ్యంబ రహివహించెఁ। గలిమి జవ్వనియననెల్ల, కడల సిరులు। పరఁగ వెదఁజల్లుజలజాత,పాణియగుచు ॥(క) హరునకును మకైటభసం। హరుకురమపద్మయోని, కలవాణినిశా। కరునకురోహిణిక్రియనా। సరసునకద్దేవిధర్మచారిణియయ్యెన్॥(ఆ,వె)చంద్రశేఖరునకుశైలజకెనయగు। పద్మనాభునకును బరఁగలక్ష్మి। కొనరవెంకటాఖ్య, నుదయించితిఁగుమార। మదనుఁడనఁగ నేనుమహిని వెలసి॥ (సీ)చిత్తంబుహరిగుణ,చింతనంబులయందుఁగుశయములువిష్ణుపూజనములందుఁ। బాదంబులురమాధిపతిభజనమునందువీనులువిభుకథ,ల్వినుటయందు। శిరముకైటభదైత్య, హరనమస్కృతులందు రసనగోవిందకీర్తనమునందుఁ। జక్షువుల్హరిరూప, సందర్శనమునందుఁ,గాయంబుశౌరికైం,కర్యమందు॥ (తే,గీ) సంతతముగీలుగొల్పి, ప్రసన్నబుద్ధి। నన్యమేమియునెఱుఁగక,నవ్విభుండె। శరణమనినమ్మికొలుచుచు,ధరశరీర। యాత్రసలుపుదుసన్మార్గమధిగమించి॥(మ)జననంబాదిగ రామపాదయుగళీ, సంసక్తచిత్తుండనై। జనితోత్సాహములందదీయ కరుణా,సంలబ్ధనానాకళా। ఖనినై తద్గుణవైభవప్రచురమైకన్నట్టురామాయణం। బనువొందన్విరచింతుఁ బ్రౌఢకవితా, వ్యాపారమేపారఁగన్॥ (వ) మఱియు నమ్మహాకావ్యంబు ధర్మార్థకామమోక్ష ప్రదంబై పు

త్రపౌత్రప్రవర్ధనంబై యాయుఃకీర్తికరంబై కల్పద్రుమంబు చందంబున నందంబై యుండునని యిట్లు మద్వృత్తాంతంబును, రామాయణకావ్య కరణసామర్థ్యంబుగలుగుటకుం దగినయుపపత్తియు శ్రీకృష్ణదేవునింగృతినాథునిం జేసిరచించుటకుందగిన కారణంబును, మద్వంశ క్రమంబును, వివరించి, నాచేతరచి

——(గ్రంథకర్త తనగ్రంథము ప్రసిద్ధికెక్కిన చందంబెఱింగించుట.——

యింపంబడిన యీరామాయణంబు లోకంబునం బ్రసిద్ధికెక్కిన చందంబుం దేటపఱచెదనేను శ్రీకృష్ణ దేవాంకితంబుంజేసి తదనుగ్రహ బలవిశేషంబున నిరంతరాయంబుగా నిమ్మహాపుణ్య కావ్యంబు వక్ష్యమాణక్రమంబున సాంగోపాంగంబుగా రచియించి దీనిని లోకంబునం గల పండితసభలయందు విస్తరింపం జేయుటకుం దగిన శ్రద్ధాభక్తులుగల మహీపతులెవ్వరో కోయని వితర్కించునట్టి కాలంబున॥

——(*) వెంకటగిరి పురీవర్ణనము.(*)——

(సీ) కమలాప్త బింబంబుఁ గలశంబు గాఁజేసి కోనేజాలు పడగలఁ, దనరురథము। లటుకరంబులు సాచి, యమరధునీ సరోజములఁ ద్రుంపఁగఁజాలు,సామజములు। హరి తేరిబాబాల,కర్ధపులాయిత క్రమముఁ జెప్పఁగఁజాలు, ఘనహయములు। పిడికిటి పోటుల, బిరుదు కొండలనైనఁ బిండిసేయఁగనోపు,వీరభటులు ॥ (తే,గీ) కనక రౌప్య వినిర్మిత, గగనచుంబి । మేరుకైలాససన్నిభా, గారములును । నందనోప మోద్యాన వ,నములు గలిగి । వఱలు వేంకటగిరినామ, పురవరంబు ॥ (క) సిరకిరవైకవిశేఖర । పరిశోభితమైయనంత, వైభవ యుతమై। నిరుపాధిక సుఖమైయ । ప్పురమలవైకుంఠ పుర

——(*)శ్రీవెంకటగిరిపురాధిరాజ వంశావతారవర్ణనము.(*)——

ము,పోలికెనమరుర్॥(సీ.సమాల) ఏవంశకర్తయై,యెసఁగెఁ బరాక్రమ ఘనుఁడు రుద్రాదిత్య,జనవిభుండు। ఆచంద్రతారార్క,మైయుండ సప్తసప్తతి గోత్రముల నుర్వి,బాదుకొల్పి। కోరి యేకాదశ,గోత్రంబులొక్కొక్క గణముగా విభజించి,క్రమముతోడ। నాగతాళంబులు, నయముతో వృషభంబు పంచవర్ణంబుస,మంచితముగ। రమ్యభేరుండవ, రాహఖడ్గంబులు వానికిఁబడగలు, గానొనర్చి। ఖడ్గనారాయణ,ఖ్యాతి సంపాదించి వారలచేతఁ గ,ప్పములువడసి। పరగునయ్యనపోత, నరనాథతిలకుఁడేపుణ్య వంశంబునఁ, బుట్టియలరె। జగతిలో



శ్రీరంగజంబుకేశ్వరపుర సీమాపరిచ్ఛేదశీలుఁడగుచుఁ। పాండ్యకిరీటంబు బలిమిచేఁగొన్నమాధవభూధవుం డెందు నవతరించెఁ। బటుశక్తిసింగభూపాలీయమనెడు నలంకారశాస్త్రంబు లలిరచించి। యరుదార రాయవేశ్యా భుజంగుండన బిరుదుఁగాంచియుదారచరితుఁడగుచుఁ। వెలుగొందు సర్వజ్ఞసింగభూపాలుఁడే యమలాన్వయంబున నవతరించె॥ (తే,గీ) నట్టివెలుగోటివంశమందవతరించి । వెలయ రేచర్లగోత్రప విత్రుఁడగుచు। వీరవర్యుండు విద్వత్కుమారయాచ । జనవిభుండప్పురంబేలుఁ జతురుఁడగుచు॥ (తే,గీ) విశ్వనాథప్రతిష్ఠఁ గావించి వెలసి। నట్టిపుణ్యుండు బంగారు యాచవిభుఁడు। తనయుఁడై పుట్టె నతనికా ధరణివిభుఁడు । విమలునిఁగుమారయాచ భూవిభునిఁ గాంచె॥ (తే.గీ) ధన్యుఁడగురాజమౌళికిఁ దనయుఁడగుట । విబుధగణములఁ బోంచువి వేకియగుటఁ। బొసఁగఁ దారక హారయశః స్ఫూర్తిఁగనుట। నామహీనేతకుఁగుమార నామ మమరె॥ (చ) వెలయఁగనన్న రేశ్వరుఁడు విష్ణుపురాణము నాంధ్రభాషనిం। పలరరచింపఁజేసి దనుజారి కృపాప్తికిఁ బాత్రభూతుఁడై। చెలఁగి జగంబులం గడుప్రసిద్ధికి నెక్కఁగ విశ్వనాథుని। శ్చలవిభవంబులందని పిచక్కఁగదత్కృపఁ గాంచెనుర్వరన్॥ (తే, గీ) ఆమహారాజునకుఁ బుత్రుఁడతిపవిత్రుఁ। డాదిరాజవిభుండు దివ్యప్రభుండు। దానమాన ధనుండు విద్యాఘనుండు। వఱలు బంగారు యాచభూపాలమౌళి॥ (చ) అరులకుఁగాలదండమఖ లార్థులకున్ సురశాఖిశాఖభూ। భరముధరింప భోగిజయపద్రకుఁజక్కనిజీవగఱ్ఱయై। పరఁగుజయాభిరాముఁడగు బంగరు యాచమహీవరేణ్యుసు। స్థిరతర బాహుదండమని ధీవరులెన్నఁ జెలంగెనిమ్మహిన్॥ (ఉ)

—(*) శ్రీవెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రభూపాల ప్రశంస (*)—

ఆజ్ఞకుబద్ధులై నృపతు లందఱుఁగొల్వఁగఁ బెక్కువర్షముల్। విజ్ఞులు మెచ్చభూతిసతి విశ్రుతవై ఖరినేలనమ్మహా। ప్రాజ్ఞునకుద్భవించె నిర పాయమహా విభవోన్నతుండుస। ర్వజ్ఞకుమార యాచనర పాలుఁడ మేయగుణాభిరాముఁడై॥ (మ) గణనాతీతగుణోన్నతుండునుద్రిలో కఖ్యాతచారిత్రుఁడుం। బ్రణుతప్రాభవుఁడిద్విభుండుధృవుఁడో ప్రహ్లాదుఁడో యావిభీ। షణుఁడో యంచు బుధుల్నుతింపభగవత్సంసేవనాసక్తి। క్షణచిత్తంబులకుం బ్రియుండగుచు నాక్ష్మానాథతన్ప్రోచునమ్మహిన్॥ (మ) అనిశంబుం ద్విజకోటిచేమఖములు దృప్తిఁ జేయిం

చియో । దనదానంబునమర్త్యులం బహువిద్యానంబులఁ వేల్పులం । దని యం జేసిమహీసుపర్వులకు నందంబొప్పభూవస్త్రగో । ధనదానంబు లొసంగి మించెశుచియై ధన్యాత్ముఁడై యుర్వరః ॥ (సీ) అలతర్కశాస్త్ర యుక్తులుపన్య సించుచోఁ గణుతింప రెండవ గౌతముండు । బహువిధశబ్దని ష్పత్తిఁగావించు చోఁ దలపోయనపరపతంజలియగు । నఖిలవేదాంత శాస్త్రార్థ తత్త్వవిచార మందుసాత్త్వజ్ఞనకాధిపుఁడగు । లలితకావ్య నాటకాలంకార కవితాప్ర ముఖవి ద్యలందన్యభోజన్నృపతి ॥ (తే,గీ) యుత్తరోత్తర యుక్తినొం డొకసురేజ్యుఁ । డతులగాంధర్వ విద్యయందనుపమానుఁ । డనుచుజనములు దనుఁగొని యా డవాసి । కెక్కెసర్వజ్ఞయాచమహీవరుండు ॥ (తే,గీ) ధరణి నెవ్వానికీర్తి పరితాపరుచులు । వరుసనిఖిలదిశాంగనా వక్షములకు । సరసచందనకాశ్మీర చర్చలయ్యె । నన్నరేంద్రునిఁ గీర్తింప నలవి యగునె ॥ (వ) ఇట్లనన్య సామాన్య ప్రభావుండై రాజ్యంబుఁ జేయుచు నారాజన్యశేఖరుండు భారత భాగవత రామాయణప్రముఖ నిఖిలపురాణంబులఁ బరిశోధించి భాస్కరాదులు రచించిన యాంధ్రరామాయణంబులందు వాల్మీకివిరచిత శ్రీమద్రామాయణంబునంగల యర్థంబంతయు సమగ్రంబుగాఁ గథితంబైనయదిగాదనియు భగవదంకితము గాకున్నదనియుం దలంచి యిమ్మహా కావ్యంబు గీర్వాణంబున కన్యూనానతిరిక్తంబుగా భగవదంకితంబుఁ జేసియాంధ్రభాషరచియింప సమర్థుండగు పండితుం డెవ్వఁడోయనివిచారింపుచు నేనికావ్యంబు గీర్వాణంబున కనురూపంబుగాఁ బద్యప్రబంధంబుఁగావించుటయంతయువినిప్రీతిపూర్వకంబుగా నన్నురావించి యొక్కనాఁడు సువర్ణమణిగణస్థగితంబై సుధర్మకు సాటిసేయందగిన సభామంటపంబున నగణితమణిగణ ప్రభాపటల జటిలంబైన భద్రపీఠంబున సుఖాసీనుండై యుదయమహీధర శిఖరోపరిస్థితుండైన లోకబాంధవువిభంగి వెలుంగుచు సకలవిద్వజ్జనంబులుపరివేష్టింప బృందారకపరివృతుండగు సహస్రాక్షునిచందంబున నందంబగుచు మద్విరచితంబైన యాంధ్రరామాయణకావ్యంబంతయు సమగ్రంబుగానత్యాదరంబున నాకర్ణించి యిదిమదీయాభిప్రాయ ప్రకారంబున గీర్వాణంబున కనురూపంబై శ్రీకృష్ణాంకితంబై యున్నదని బహూకరించి పరమానంద భరితాంతఃకరణుండై చారుచామీకరరత్నకటకాంగుళీయక హారాగ్రహారాది ప్రదానంబులనన్ను సత్కరించి పరమభాగవ



తోత్తముండును శ్రీరామచంద్రచరణ సేవాసంసక్తచిత్తుండునుగావున లోకహితార్థంబుగా నిమ్మహాపుణ్యకావ్యంబు జగంబునందు విస్తరింపం జేసి శ్రీరామభద్రుని యపార కృపారసంబు నకుఁ బాత్రభూతుండయ్యె ॥ (చ) వెలయఁగనీకథంజగతి విశ్రుతికెక్కఁగఁ జేసిపుణ్యుఁడై వెలసినయమ్మహీపతికి వేడ్కననంత యశంబు నాయువుం । బొలుపుగ వంశవృద్ధియును భోగసమృద్ధియు రాజ్యవృద్ధియుం । దొలఁగకయిచ్చిసత్కరుణ తోఁగృతినాథుఁడు ప్రోచునిత్యముః ॥

—(*) షష్ఠ్యంతములు (*)—

(క) శ్రీవల్లభునకుబుధసం । భావితునకు భావుకప్ర భావునకువిభా । ప్రావీణ్యాహసితకోటివి । భావసునకుభక్తలోక పరతంత్రునకుః ॥ (క) హీరామృత చందనశశి । హారాయితకీర్తిఘృణికి నదితిజమణికిః । వీరాగ్రణికిజగన్నుత । సూరిమరున్మణికి యోగిచూడామణికిః ॥ (క) వ్రజయువతినయనకుముద । ద్విజరాజునకఖిలలోక విశ్రుతునకునం । డజరాజగమను నకుబుధభజనానందునకు హరికి భద్రాత్మునకుః ॥ (క) పరమర్షివినుతునకుభా । స్వరతనునకుఁగనకచేల వరకౌస్తుభభా । సురపాంచజన్యధరునకు । నిరుపమవిభవునకురుక్మిణీ నాథునకుః ॥ (క) గోపాలనందనునకుధ । రాపాలకిరీటరత్నరంజితదివ్య । శ్రీపాద పద్మునకునత । గోపాలావళికి మదన గోపాలునకుః ॥

—(*) శ్రీరామాయణ కథాప్రారంభము (*)—

(వ) శ్రీకృష్ణదేవునకు సమర్పితంబుగా నాయొనర్పంబూనినశ్రీమద్రామాయణంబునకుఁ గథాప్రారంభంబెట్టిదనిన శతకోటిప్రవిస్తరంబై బ్రహ్మలోకంబునందు సుప్రసిద్ధంబైన రామచరితంబు భూలోకవర్తులయిన నాలుగు వర్ణంబులవారికిఁ దాపత్రయవిమోచనంబుకొఱకు సంక్షేపించి రచియింప నుద్యుక్తుండై పరమకారుణికుండైన పరమేష్ఠి వాల్మీకిరూపంబున విశ్వంభరయం దవతరించె నట్టి బ్రహ్మాంశ సంభూతుండైన వాల్మీకి తనచేతఁ జికీర్షితంబైన రామచరితంబు గురుముఖంబువలన వినంగోరి భగవత్కథోప దేశంబునందు సర్వగురుండైన నారదుంబ్రతీక్షింపుచుండ నొక్కనాఁడు భగవంతుఁడైనయన్నా

—(*) నారదమహర్షి వాల్మీకికడ కేతెంచుట (*)—

రదుండుబ్రహ్మనియోగంబున వాల్మీకికడకుంజను దెంచిన నత్తపస్వివర్యుండు తపస్స్వాధ్యాయనిరతుండును వాగ్విశారదుండును దేవముని శ్రేష్ఠుండునైననార

దునవలోకించిపూజించిమునీంద్రా యిప్పుడీలోకంబునదృష్టగుణవ్యతిరిక్తప్రశస్త గుణవంతుఁడును దానశీలుండగుచుఁ బరులజయించువీర్యవంతుఁడునుసామాన్యవిశేషరూపధర్మజ్ఞుండును దనకొఱకుఁ గావింపంబడిన యుపకారంబల్పంబైనను బహుత్వంబున నెఱుంగునట్టికృతజ్ఞుండును సర్వావస్థల యందును సత్యవచనశీలుండును ఫలపర్యంతంబు సమారబ్ధంబైన వ్రతంబు విడువనట్టి స్వభావంబుగల దృఢవ్రతుండును వంశక్రమాగతాచారయుక్తుండును నపరాధంబుఁ గావించిన వారికైనను హితంబుఁ జేయునట్టి శీలంబు గలవాఁడును విదితసకలవేద్యపదార్థుండును నన్యులచేత నిర్వహింపంబడనికార్యంబు నిర్వహించుటకు సమర్థుండును నద్వితీయప్రియదర్శనుండును నసమానసర్వాంగ సుందరుండును నాత్మవంతుండును విధేయకోపుండును జితారిషడ్వర్గుండునునసూయారహితుండును నగుపురుషుం డెవ్వఁడు సంయుగంబునందు జాతరోషుండగునప్పుడెవ్వానికి సురాసురాదులుఁదలంకుదురట్టివానివినం గుతూహలం బగుచున్నదట్టి పురుషశ్రేష్ఠు నెఱుంగనీవెసమర్థుండవు కృపామతి నెఱింగింపుమని యభ్యర్థించినఁ ద్రిలోకగోచరజ్ఞానుండయిననారదుండవ్వాల్మీకి ప్రశ్నజాతంబువిని యమ్మునిశ్రేష్ఠునేకాగ్రసిద్ధికొఱకు నభిముఖుం గావించి యాప్రశ్నముసకలగుణవిశిష్ట సార్వభౌమ విషయకంబైయున్నదైనను సార్వభౌమమాత్రంబునందు నీయడుగంబడిన ప్రశస్తగుణసంపత్తియంతయు సంభవింప నేరదు సకలజగద్రక్షణార్థంబు మనుష్యరూపంబున నవతీర్ణుండైన పరమపురుషు నందు సులభంబగు దైవయోగంబునఁదద్గుణకీర్తనంబు లబ్ధంబయ్యెననిప్రహృష్టుండై ప్రాచేతసు నవలోకించి నీచేతఁ గీర్తితంబులైన యావీర్యాది గుణంబులన్నియు దుర్లభంబు లేతాదృశప్రశస్తసమస్తగుణవిశిష్టుండైన మహాపురుషు నిశ్చయించి చెప్పెద నట్టిపురుషు నాకర్ణింపుమనియిట్లనియె ॥

### (*) నారదుఁడు వాల్మీకికి శ్రీరామకథ నెఱింగించుట. (*)

(మ) మతిమంతుండును నీతిమంతుఁడును శ్రీమంతుండు సర్వజ్ఞుఁడుర్వ । ధృతిమంతుండును వాగ్మియుఁ వశియు విద్విడ్వర్గసంహర్తయుం। ద్యుతిమంతుండు గుణోన్నతుండు నియతాత్ముండు న్మహావీర్యుఁడుర్వ । హితుఁడు నా రాముఁడనంగఁ జెన్నలరు నయ్యిక్ష్వాకువంశంబునన్ ॥ (సీ) వెడఁదకన్నులవాఁడు విపులాంసముల వాఁడు రాకేందుబింబవక్త్రంబు వాఁడు । కంబుకంఠమ్ము వాఁడు



ఘనలలాటము వాఁడు కమనీయమృదుకపోలముల వాఁడు । పీన వక్షము వాఁడు పృథునితంబము వాఁడు సముదగ్ర చారుమస్తకము వాఁడు । దివ్య దేహము వాఁడు దీర్ఘబాహువుల వాఁడు కమనీయశుభలక్షణముల వాఁడు॥ (తే,గీ) ప్రబలచాపంబుమూపునఁ బరఁగువాఁడు । శ్యామవర్ణంబు వాఁడు ప్రశస్తగూఢ। జత్రుదేశంబుగలవాఁడు సమవిభక్త । సముచితమనోజ్ఞసుందరాంగముల వాఁడు ॥

(వ) మఱియు వృత్తపీవరబాహుండును గామాది వికార రహితుండును గజసింహగతిసదృశగమనుండును షణ్ణవత్యంగుళ విగ్రహుండునునిర్ణిక్తేంద్రనీలవర్ణుండును శ్రవణమాత్రంబున శత్రుహృదయ విదారకత్వంబుచేతఁ బ్రశస్తపౌరుషుండును సర్వోత్తమావయవ సౌభాగ్యయుక్తుండును సాముద్రికశాస్త్రోక్తమంగళాయతన సర్వలక్షణలక్షితుండును శరణాగతరక్షణరూపధర్మజ్ఞుండును సత్యప్రతిజ్ఞుండును బ్రజాహితకరణ తత్పరుండును నాశ్రితరక్షణముఖ్యయశుండును సర్వవిషయజ్ఞానశీలుండును బాహ్యాభ్యంతరశుద్ధియుక్తుండును నాశ్రితపరతంత్రుండును బిత్రాచార్యవినీతుండును నాశ్రిత రక్షణచింతాభిరతుండును జగద్రక్షణార్థంబుప్రజాపతితుల్యత్వాపతీర్ణుండునునఖండితైశ్వర్యసంపన్నుండును సకలలోకసముద్ధరణపరిపోషణశక్తియుక్తుండును నాశ్రితజన విరోధి నిషూదనుండును బ్రజలకరిష్టనిరసన పూర్వకంబుగా నభీష్టప్రాపణకర్తయు వర్ణాశ్రమధర్మపరిపాలకుండును శరణాగతపరిపాలనరూపధర్మ రక్షకుండును యజనాధ్యయనదానాదిస్వధర్మపరిపాలకుండును నాశ్రితబాంధవాదిజీవలోకంబులసంరక్షితయు యాజుషాది చతుర్వేద పదార్థవిదుండును శిక్షాదిషడంగపారగుండును ధనుర్వేదనిష్ఠితుండును సాంఖ్యయోగతర్కవైశేషికపూర్వోత్తరమీమాంసావ్యాకరణధర్మశాస్త్రాదిశాస్త్రార్థతత్త్వజ్ఞుండును విజ్ఞాతార్థవిషయంబునందు సదావిస్మరణలేశరహితుండును బ్రతిభానవంతుండును సర్వలోకప్రియుండును నపకారులయందైననుపకారశీలుండునువ్యసనపరంపరలయందైన నక్షుభితాంతఃకరణుండును నతిగంభీరప్రకృతియుక్తుండును దత్తత్కాలకర్తవ్య చతురుండును నై ప్రకాశించుచున్నదియునుంగాక ॥ (క) సింధువులతోడఁగూడిన । సింధువు చందాన గుణవిశిష్టుఁడు కరుణా । సింధువు రాముఁడు ప్రజ్ఞా । సింధువులగు బుధులఁగూడి చెలఁగుననిశమున్ ॥ (తే,గీ) అనుదినంబు సర్వావస్థలందు సారె । సారెకవలోకితుండయ్యె జనుల చేతఁ । బరఁగ మున్నెప్పుడును జూడఁబడని

వాని । యట్లవిస్మయదర్శనుం,డై నవాఁడు ॥ (క) అలఘుచరిత్రుఁడు పూజ్యుఁడు । సలలితచిత్తుండుమిత్ర,శత్రూదాసీ । నులయందవిషమభావము ।గలవాఁడానందకరుఁడు, కౌసల్యకొగిన్ ॥ (సీ) గాంభీర్యమందు సా,గరముఁబోలినవాఁడుధైర్యంబుచేమహీ, ధరనిభుండు । వీర్యసంపదచేత,విష్ణుతుల్యుఁడుశశధరునికై వడిఁబ్రి,దర్శనుండు । కరముక్రోధమునందుఁ, గాలాగ్ని కెనయగుక్షమచేతఁబృథివికి,సాటివచ్చుఁ । ద్యాగంబునందుధ, నాధీశసదృశుండునపరధర్మండుసత్యంబునందు ॥ (తే,గీ) భూరివిజ్ఞానరమకుదాఁ,బుట్టినిల్లు । దానదాక్షిణ్యదయలకుఁ,దానకంబు । నీతిసత్త్వధర్మములకు,నిలయమతఁడు । లలితసద్గుణసందోహ,ములకుఁబేటి ॥ (వ) అనియిట్లునారదుండు సాక్షాద్భగవదవతారంబైన రామభద్రు నందలి సకలానంతకల్యాణ గుణంబుల వక్కాణించియిక్ష్వాకువంశప్రభువుండనుశబ్దంబునరామావతారకథనంబును శత్రుదమనుఁడనుశబ్దంబునఁదాటకాదివధంబునుమహావీర్యుండను శబ్దంబునసర్వాస్త్రశస్త్రగ్రహణంబును లక్ష్మీవంతుండను శబ్దంబున సీతాపరిణయంబును సత్యపరాక్రముండనుశబ్దంబునఁబరశురామభంగంబును మొదలుగాఁగల బాలకాండ కథయంతయు సంక్షేపంబుగాసూచింపంజేసి యయోధ్యాకాండ కథాక్రమణిక నెఱింగించువాఁడై వెండియు వాల్మీకినవలోకించియిట్టిసమస్తసద్గుణగరిష్ఠుండునుబురుషశ్రేష్ఠుండును రాజ్యాభిషేకసముచిత విశిష్ట గుణవరిష్ఠుండును నమోఘపరాక్రమవంతులలోన నతిశ్రేష్ఠుండును బ్రకృతిజనేష్టుండును గుమారజ్యేష్ఠుండు నైన కల్యాణగుణాభిరాము రామునింజూచితండ్రియగు దశరథుండు పరమానందభరితాంతఃకరణుండై సకలజనంబులకుహితంబుసంపాదింపఁదలంచియావరాజ్యంబున నభిషిక్తునింజేయసమకట్టిన నయ్యభిషేకార్థం సంభృతదధ్యాదిమంగళద్రవ్యవిశేషంబులవిలోకించి దశరథునికొండొకభార్యకైక యనునదిమంథరావాక్యచోదితయై తొల్లిదేవాసురయుద్ధంబునందు వల్లభునిచేతదత్తవరయైనది గావుననాసమయంబునఁ గట్టడితనంబునదిట్టయై రామునకువివాసనంబునునిజపుత్రుండైన భరతునకురాజ్యాభిషేకంబునుంగోరిన నమ్మహీరమణుండు సత్యవాదిగావున ధర్మమయపాశబద్ధుండై విడివడసమర్థుండుగాక ప్రియపుత్రుండైనను రామునివనంబునకుంబనిచిన నవ్వీరోత్తముండు కైకేయీప్రీతినిమిత్తంబు పితృవచననియోగంబువలనఁ దద్వచనపరిపాలనవిషయస్వకృతప్రతిజ్ఞనుబరిపా



లింపుచు వనంబునకుంజనిన నమ్మహాత్మునితమ్ముండు సుమిత్రానందవర్ధనుండగులక్ష్మణుండు సహజప్రీతిమంతుండును నిష్టుండును గావున వినయసంపన్నుండై సౌభ్రాత్రంబుఁ జూపుచు స్నేహంబువలన ననురూపంబగు వ్రతంబగీకరించి యన్న వెంటనరణ్యంబునకుంజనియె ॥ (ఉ) ఆరఘునాథుభార్య జన,కాలయజాతసమస్తలక్షణ । శ్రీరమణీయరూపసమ,శీలసతీ తిలకంబునిందిరా । కారయుసాధ్విప్రాణముల,కంటె గరీయసియైనసీతసాం । పారఁబతింభజించిచనె,నప్పుడురోహిణిచంద్రునింబలెన్ ॥ (క) పౌరులచేజనకునిచే । దూరం బారాముఁడనుగ,తుండగుచురయం । బారఁగననుజుఁడు సీతయు । వారకఁదనతోడరాఁగ,వనమునకరిగెన్ ॥ (తే,గీ) ఈతెఱంగునఁజనిజాహ్న,వీతటమున । శృంగిబేరాఖ్యపట్టణ,మేలువానిఁ । బరమసఖుని నిషాదాధి,పతినిగుహునిఁ । జేరిసూతునిఁగ్రమ్మఱ,నూరికనిచి ॥ (ఆ,వె) అటనిషాదనాథుఁ,డైనయాగుహునితో । నలఘుయశుఁడుచాలఁ,జెలిమిఁజేసి । వానియనుమతమున,వైదేహిలక్ష్మణ । కలితుఁడగుచువేగ,గంగదాఁటి ॥ (క) భూవల్లభుండురాముఁడు । తేవనమున వనముసొచ్చి,ధీరత్వముసం । ద్రోవనవవారిపూరిత । పావననదులుత్తరించి,పరమప్రీతిన్ ॥ (తే,గీ) చతురుఁడగు భరద్వాజుని,శాసమునఁ । జిత్రకూటాద్రిఁజేరిత,చ్ఛిఖరిమీఁద । వేడ్కతోఁబర్ణశాలఁ గా,వించియందు । నిండుసుఖగోష్ఠివసియించి,యుండునంత ॥ (వ) దేవగంధర్వసంకాశులైన సీతారామలక్ష్మణులుముప్వురు చిత్రకూటోపాంతవనంబు నందు రమమాణులై సుఖంబుగానివసించి యుండిరిట సాకేతపురంబున ॥ (క) ఆరఘువర్యుఁడుశైలముఁ । జేరుటవినిపుత్రశోక,చింతార్దితుఁడై । దారుణగతివిలపించుచు। భూరమణుఁడుమేనువిడిచి,పోయెన్ దివికిన్ ॥ (వ) దశరథ మరణానంతరంబున మహాబలుండగు భరతుండు వసిష్ఠప్రముఖమహర్షులచేత రాజ్యంబునందునియుజ్యమానుండయ్యును దానినంగీకరింపక చతురంగబలంబులతోఁ గూడి రామపాదప్రసాదకుండై వనంబునకుంజనియార్యభావపురస్కృతుండై మహాత్ముండును సత్యపరాక్రముండును నభిరామదర్శనుండునునగు రామునింజేరి మహాత్మా నీవు సర్వగుణశ్రేష్ఠుండైననుకనిష్ఠునకు రాజ్యార్హత్వంబులేమి యెఱింగిన ధర్మజ్ఞుండవుగావున నీవెరాజవనిపలికిన సర్వస్వరూపగుణంబులచేతనాశ్రితచిత్తరంజకస్వభావుండయ్యును వనీపకాభీష్టప్రదానతత్పరుండయ్యును యాచకజనలా

భంబుచేతఁ బ్రసన్న వదనుండునుమహాయశుండయ్యును నేకసాయకవిమోచ
నమాత్రంబున సమస్తదానవహనన సమర్థుండయ్యునురాముండు పితృవచన
గౌరవంబున రాజ్యంబగీకరింపక రాజ్యంబుసేయుట కహల్యాదృష్టవైభవపాద
సంస్పృష్టంబులైన పాదుకలు న్యాసరూపంబున భరతునకొసంగి బహువిధ
సాంత్వవచనంబుల సారెసారెకునతనిఁగ్రమ్మఱించిన నాభరతుండభిషేకార్థం
బురామప్రత్యానయనలక్షణమనోరథంబునొందక నందిగ్రామంబునందనుదినం
బునురామపాదుకలకునమస్కరింపుచురామాగమనకాంక్షుండై రాజ్యంబు బా
లింపుచుండెనంతసర్వాతిశయకాంతిమంతుండునుసత్యప్రతిజ్ఞుండును రాజ్యభోగ
లౌల్యరహితుండునగు రాముండుభరతుండాదిగాఁగలపురజనులందఱు వెండియుఁ
జిత్రకూటంబునకుం జనుదెంతురనితలంచిపితృవచనపరిపాలనంబునందేకాగ్రచి
త్తుండై దండకారణ్యంబుఁబ్రవేశించె నని యిట్లయోధ్యాకాండకథయంతయుసం
క్షేపంబుగా నెఱింగించి యద్దేవమునిశ్రేష్ఠుండారణ్యకాండకథాక్రమంబెఱిం
గింపువాఁడై వెండియు నిట్లనియె నట్లు రాజీవలోచనుండగు రాముండు మ
హారణ్యంబగు దండకారణ్యంబుఁబ్రవేశించి యపూర్వసంస్థానవనవిలోకనజనిత
కుతూహలంబుచేతను మహావనప్రవేశసంభావిత రాక్షసరణారంభార్జిత హ
ర్షంబు చేతను వికసితలోచనారవిందుండై ॥(తే,గీ) మునివిరోధి విరాధుని
మొనసిచంపి । మాననీయాంగు శరభంగమౌనిఁజూచి । ఘనుసుతీక్ష్ణ మహా
మునిఁ గనియగస్త్య । ననుజుఁ జూచియగస్త్యునిఁ గనిముదమున ॥ (తే,గీ)
ఆయగస్త్యమహాముని యనుమతమున । నైంద్రమగుకార్ముకంబుమహాసిపు
త్రి । దారుణాక్షయ బాణతూణీరములును । రిపు వినిగ్రహార్థంబుపరిగ్రహిం
చె ॥ (వ) ఇట్లుజగదేకవీరుండగు రాముండు స్వవీర్యసదృశ వరాయుధలా
భంబు నొంది పరమప్రీతుండై శరభంగవనంబున నివసించియుండ నప్పుడచ్చ
టి మహర్షులు చిత్రకూటపంపావన నివాసులయిన వానప్రస్థులుం గూడియ
సురరాక్షసవధాకాంక్షులై రాముని సమీపంబునకుం జనుదెంచి రాక్షసబాధ
నెఱింగించిన నారఘుపుంగవుండు రాక్షసావాస భూతంబైన వనంబు నందు
నమ్మహా మునుల ప్రార్థనావచనం బంగీకరించి ॥ (ఆ,వె) దహనకల్పులైతె
న దండకారణ్య । వాసిమునుల మ్రోల వరుసతోడఁ । సంగరమున నింక,
సకలరాక్షసుల వధించువాఁడననిప్రతిజ్ఞఁజేసి ॥ (క) అనఘుఁడురాఘవుఁడకాన



నమున నివసించి తగ జనస్థాననివా । సినియగుశూర్పణఖను గని । ముక్కునఁబ
ట్టి విరూపఁ జేసె, ఘోరాసిహతిని ॥ (వ) ఇట్లు కామరూపిణియైన శూర్పణఖ
నుగర్ణనాసికాచ్ఛేదంబునవిరూపిణిం జేసి ॥ (క) శూర్పణఖాప్రేరితుఁడై । దర్పం
బున సమరమునకుఁ దఱిసిన ఖరుని । న్నేర్పున వధించె రాముఁడు । సప్తా-
ర్చిలోగ్రతీవ్ర, శాతశరమునన్ ॥ (వ) ఇట్లు రాక్షససేనాధ్యక్షుండైన ఖరుం
బరిమార్చి తదనుచరులైన దూషణత్రిశిరుల వధించి పదంపడి చతుర్దశసహ
స్రసంఖ్యాకప్రధానరాక్షసుల నాజిరంగంబున నంతంబునొందిచి తదనుచరులై
న యామినీచరుల నందఱ నిశ్శేషంబుగా రూపుమాపె నంత నకంపన శూ
ర్పణఖలవలన జ్ఞాతివధం బంతయు విని రావణుండు క్రోధమూర్ఛితుండై సీ
తాహరణకార్యంబునందు మారీచుండను రాక్షసుని సహాయునిఁగా వరించి బ
లవంతుండైన యారాముని తోడి విరోధంబు యుక్తంబుగా దనుగుమని బ
హుప్రకారంబులన మ్మారీచునిచేత నివార్యమాణుండయ్యును వాని వచనం బ
నాదరణంబుఁ జేసి కాలచోదితుండై మారీచ సహితంబుగా రాముని యాశ్రమ
స్థానంబునకుం జనుదెంచి ॥ (శా) మారీచుండొక మాయఁబన్ని యలరామ
భ్రాతవరుం లక్ష్మణుఁ దూరంబున్గొనిపోవ నప్పుడనయన్ దోషాచరాధీశ్వరుం । డా
రామామణి సీత నెత్తికొని ఘోరాకారుఁ బక్షీంద్రుఁడో । స్సారోదారుఁజటాయు
వుండునిమిషాస్త్రల్లీలనేగెన్వడిన్ ॥ (తే,గీ) అంత రాముండుదైత్యశితాసిలూన ।
పత్రపాదుఁగొ పడియున్న, పక్షినాథుఁ । గనిమహీపుత్రిహృతియాట వినిదురం
త । గాఢతరదుఃఖభరమున,గాసిపడుచు ॥ (క) చలితేంద్రియుఁడై మిక్కిలిఁ । బ
లించుచు రామవిభుండా పక్షీంద్రునకు । నొలసిత శాశ్వత సౌఖ్యము । గలుగఁగ
సంస్కార విధులఁగావించి వెసన్ ॥ (క) వనమున జానకి వెదకుచుఁ । జని చ
ని యొకచోటఁ గాంచె,సత్త్వోద్రేకం । బునఁజగముబ్రమింగఁజాలెడు । ఘనరూ
పుని ఘోరవికృత,కాయుఁగబంధున్ ॥ (వ) కనుంగొని వాని భుజంబులు రెండు
ను నిశాతఖడ్గంబుల ఖండించి పంచత్వంబు నొందించి తత్కళేబరంబు దహించి
న వాఁడుస్వర్గగమనయోగ్యంబగు స్వకీయంబైన గంధర్వరూపంబు నొంది రా
మునిం జూచి మహాత్మా నీవు శ్రవణకీర్తనాది భగవద్ధర్మాచరణశీలయు సామాన్య
విశేషధర్మనిపుణయుఁజతుర్థాశ్రమప్రాప్తజితేంద్రియత్వపూర్వక మోక్షోప
యుక్తాచారనిష్ఠయునైన శబరిఁగానంజను మని పలికె దివంబునకుం జనిన నార

ఘువల్లభుండు తద్వచనప్రకారంబున శబరింగానం జనిదానిచేత నర్ఘ్యాదిఫల
సమర్పణాంతోపచారంబున నర్చితుండయ్యెనని యిట్లు సత్యప్రతిజ్ఞత్వప్రధానం
బైనయారణ్యకాండచరిత్ర సంక్షేపంబుగా సూచింపంజేసి మిత్రకార్యనిర్వాహ
కత్వపరంబైనకిష్కింధాకాండకథావృత్తాంతంబు నెఱింగించువాఁడై వెండియు.
వల్మీకజన్మున నవలోకించి మునీంద్రా యిట్లు రాముండు శబరిచేతఁ బూజితుండై పం
పాసరోవరతీరవనంబునందు హనుమత్సమాగమంబుఁ జేసి హనూమద్వచనంబు
న సుగ్రీవుని తోడ సాచివ్యంబుఁ జేసి మహాబలుండగు రాముండు జన్మప్రభృతి
స్వవృత్తాంతంబును రావణహృతాదిసీతావృత్తాంతంబును సర్వంబును సుగ్రీవున
కుం జెప్పిన నా సుగ్రీవుండు రామసంబంధియైన తత్సర్వంబును విని. సమానదుఃఖి
మహాబలసంబంధంబు గలుగుటకు సుప్రీతుండయి రామునితోడ వహ్నిసాక్షికం
బుగా సఖ్యంబుఁ జేసి సుహృత్సన్నిధియందు స్మృతదుఃఖుండై తనకును వాలి
కింగల వైరంబంతయు సాకల్యంబుగాఁ బ్రణయంబువలన నెఱింగించిన నా రఘు
సత్తముండు వైరవృత్తాంతంబు విని వాలిం బరిమార్చెదనని ప్రతిజ్ఞఁ జేసిన సు
గ్రీవుండు రామునకుత్సాహప్రదర్శనార్థంబు వాలిపౌరుషంబంతయు నెఱిం
గించి రామునకు వాలిహనన సామర్థ్యంబు కలదో లేదో యని శంకించి బల
పరిజ్ఞానార్థంబు తొల్లి వాలిచేత నిహతుండైన దుందుభియను రాక్షసుని కళేబ
రంబు మహాపర్వతసంకాశంబైన దాని రామునకుం జూపి యీ రాక్షసకళేబరం
బు వాలిచేత నింత దూరంబు విక్షిప్తంబైనదని పలికిన విని నఖాగ్రంబున లోక
విరోధి సకలదానవదైత్యాది హననశక్తియుక్తుండును నపరిమేయ బలుండున
గు రాముండు దారబలోత్సాహ వికసితాననుండై యస్థినిచయరూపంబైన రా
క్షస శరీరంబుఁ జూచి దానిదశయోజనపరిమిత మాత్రంబు దవ్వులం బడఁ బా
దాంగుష్ఠంబునం జిమ్మి తచ్ఛరీరంబు తొల్లి యార్ద్రంబనియు నిప్పుడు శుష్కం
బైయున్నదని మొదు సుగ్రీవుని యభిప్రాయంబు విమర్శించి వెండియు విశ్వాసం
బుఁ బుట్టింపుచు సప్తసాల వృక్షంబులును దత్సమీప శైలంబును రసాతలంబును నొ
క్క సాయకంబున భేదించిన నవ్విధంబాలోకించి సుగ్రీవుండు సర్వప్రకారంబు
ల రాముండు దర్శనమాత్రంబున వాలిని వధింపంగలఁడని విశ్వాసంబునొం
ది కపిరాజ్యంబు శీఘ్రంబునఁ గరగతంబగునని హర్షించి॥ (క) భూవరునను
మతమునను । గ్రీవుఁడు కిష్కింధకేఁగి, కీశాధీశున్ । దేవేంద్రసుతుని వాలిని



గారవమున ననికిఁ బిలిచె, ఘననాదమునన్ ॥ (క) పిలిచిన వాలిరయంబున । స
లవడుచుగు మనుచుఁదార, వారించినఁదా । నిలువక వచ్చి భుజాబల । మలరి
రవిజుఁ దాఁకె నాతఁ, డాతనిఁ దాఁకెన్॥ (క) ఇత్తెఱఁగునఁ దలపడి కపి । సత్త
ములుగ్రగతిఁ బోరు, సమయంబున రా । జోత్తముఁ డొకబాణమునని । యత్త
లమగ్రువంగ వాలి, ననిఁ బడ నేసెన్॥ (మ) అటు వాలిం బరిమార్చి రాముఁడు
తదీ, యంబైన సామ్రాజ్యముం । తటసుగ్రీవున కిచ్చినం గొని సము, ద్యత్ప్రీతి
తోనాతఁడుం । తటనల్దిక్కుల కమ్మెయిం బనిచి సీ, తంజూచి రమ్మంచును । త్క
ట వేగోద్ధతులన్ వళీముఖులనం, పంబొప్పఁ బంచెన్ వడిన్॥ (వ) అనియిట్లు కి
ష్కింధాకాండకథా సంగ్రహంబెఱింగించి వెండియు నిట్లనియె నంత బలవం
తుండగు హనుమంతుండు దక్షిణదిక్కునకుం జని సంపాతివచనంబున శతయో
జనవిస్తీర్ణంబైన సముద్రంబు, దాఁటి లంకాపురంబు సొచ్చి యందశోకవని
కాఖ్యంబైన రావణప్రమదావనంబున ( తే,గీ ) ఒనర రామునిఁ జింతింపుచు
న్నదాని । సీతఁ గనుఁగొని ప్రమదంబు, సెలఁగ విభుని । కుశలమెఱిఁగించి ము
ద్రిక, గురుతొసంగి । మానితంబైన తచ్ఛిరో, మణిగ్రహించి॥ (ఆ,వె) వనము
నిఱుఁ జేసి, వనపాలకులఁ ద్రుంచి । సప్తమంత్రిసుతుల, సంహరించి । పంచసైన్య
పతులఁ, బంచత్వమొందించి । యసమసమరదక్షుఁ, నక్షుఁ దునిమి॥ (ఆ,వె) శ
క్రజిత్ప్రయుక్త, చటులలోకేశాస్త్ర । పాశమునరణోర్వి, బద్ధుఁడయ్యు । విధి
వరంబుకలిమి, వేగ విముక్తుఁడై । దేవరిపులయవమ, తికి సహించి॥ (ఆ,వె)
పరఁగఁ దనకుఁ దానె, బద్ధుఁడై రాక్షస । వరుని పాలికేగి, వానితోడ । నతని
విభునిమహిమలన్నియుఁ, బ్రకటించి । చుట్టనున్న రాక్షసులవధించి॥ (మ) ఘన
వాలాగ్నిశిఖాపరంపరలలం, కాపట్టణంబంతయుం । దనుశక్రాదులు మెచ్చ
నొక్కత్రుటిలో, దగ్ధంబు గావించి గ్ర । క్కనభూపుత్రికిఁ జెప్పి రామునకు సీ, తా
క్షేమముం దెల్పఁగా । వనధిం గ్రమ్మఱ దాఁటివచ్చె విజయ, వ్యాపారధౌరేయుఁడై॥
(వ) ఇట్లు చనుదెంచి మహాత్ముండగు రామునకుఁ బ్రదక్షిణంబుఁ జేసి యమే
యాత్ముండగు హనుమంతుండు తనచేత సందృష్టయయ్యె సీత యని యెఱిం
గించెనని యిట్లు సుందరకాండవృత్తాంతంబు సంక్షేపంబుగా నెఱింగించి క్రమ్మ
ఱ నిట్లని యెనట్లు సీతావృత్తాంతంబెఱింగించిన విని రాముండు సుగ్రీవసహితం
బుగాఁ గదలి మహోదధిదక్షిణతీరంబుఁ జేరి సంతరణోపాయంబెఱింగించుటకు

సముద్రునిం బ్రార్థించి యతండు పొడసూపకున్న నలిగి ॥ (క) ఇనకిరణ నిభశ
రంబుల । వననిధి శోషింపఁజేయ, వారని భీతిం । జనుదెంచి రాఘవుని ముఖ ।
వనజము వీక్షించి మధురవైఖరిఁ బలికెన్ ॥ (వ) మహాత్మా యిన్నలుండు సేతువుఁ
గావించుంగాక యని యరిగిన నారఘుపుంగవుని శాసనంబున సముద్రవచనప్ర
కారంబున నలుండు సేతువుఁ గావించె నంత రాముండు నలవిరచిత సేతుమార్గం
బున శరధిం దాఁటి లంక మీఁదికిం జని ॥ (క) దురమున దశకంఠుని శిత । శరముల
వధియించి పిమ్మట, జనకకుమారిం । బరమపతివ్రతఁ గనుగొని । నరపతి వ్రీడాభ
రమున, నతవదనుండై ॥ (వ) వానరరాక్షస సభామధ్యంబునఁ బరుషంబులాడి
నన ద్దేవి పాతివ్రత్యవిషయసంశయవచనంబు సహింపక వహ్నిప్రవేశంబుఁ జేసినన
య్యగ్నిదేవుండ ద్దేవి కతిశీతలుండై రామునకుం బొడసూపి సీతనర్పించి మహాత్మా వి
శుద్ధభావయగు సీతం బరిగ్రహింపుమని పలికిన నారాముండగ్నివచనంబువలన జా
నకి విగతకల్మషఁగా నెఱింగి సీతాదేవిం జేకొని సంప్రహృష్టుండై దేవతల చేత నర్చి
తుండై ప్రకాశించె నప్పుడయ్యద్భుత కర్మంబుఁ జూచి చరాచరాత్మకంబై
న త్రైలోక్యం బంతయు సంతోషంబు నొందె నంత రాఘవుండు విభీషణుని లం
కారాజ్యంబున కభిషిక్తునిం జేసి కృతకృత్యుండును విగతమనస్తాపుండును నై
జగత్కంటకుండైన రావణుని వధించుట వలనం బొడమిన హర్షవశంబునం
దన్ను విలోకింపం జనుదెంచిన శంకర హిరణ్యగర్భ మహేంద్ర ప్రముఖబృం
దారకుల చేత దుర్లభంబులైన వరంబులు వడసి రాక్షసుల చేత నిహతులైన
వానరుల నందఱం బునస్సంజీవితులం జేసి సీతాలక్ష్మణహనుమత్సుగ్రీవాంగదవి
భీషణాదులం గూడి పుష్పకవిమానం బారోహించి యయోధ్యాపురంబున
కుం బోవుచు భరద్వాజాశ్రమంబుఁ బ్రవేశించి నిజాగమన బోధనంబు కొఱకు హ
నుమంతుని భరతుని పాలికిం బనిచి యతం డెదుర్కొని తోడ్కొనిపోవ సీతకుం
బూర్వవృత్తాంతం బెఱింగింపుచుం జనిచని నందిగ్రామంబుఁ జేరి యందు భ్రా
తృసహితంబుగా మునివేషంబు విడిచి చతుర్విధాలంకారంబులఁ గైసేసి సీతాసా
దృశ్యంబు నొంది గ్రమ్మఱ నయోధ్యాపట్టణసింహాసనాధ్యక్షుం డయ్యెనని యిట్లు
యుద్ధకాండకథాప్రపంచంబు సంగ్రహంబుగా నెఱింగించి వెండియు నిట్లనియె
నట్లు సామ్రాజ్యపట్టాభిషిక్తుండై మహాత్ముండగు రాముండు రాజ్యపరిపాలనంబు
సేయునప్పుడు సర్వజనంబు సంజాత రోమాంచంబై ముదితాంతఃకరణంబైన



ర్వకామలాభజనితప్రీతియుక్తంబై రామసంశ్లేషణపరిపుష్టసర్వాంగంబై యి
ష్టదేవతా నమస్కారాదిరూపధర్మఫలలాభ సమన్వితంబై మనఃపీడారహి
తంబై వ్యాధిరహితంబై దుర్భిక్షభయవర్జితంబై యలరె. అప్పుడు లోకానొక్కపుత్ర
ననొక్కండైన బుత్రమరణంబు లేక సుఖింపుచుండిరి యువతులు వైధవ్యం బెఱ్ఱుం
గక పతివ్రతలై సుఖింపుచుండిరి జలాగ్ని వాతజ్వరతస్కరక్షుత్పిపాసాప్ర
ముఖాధ్యాత్మికాధిదైవికాధిభౌతిక బాధలం బొరయక జనంబులానందింపుచుండి
రి నగరంబులు రాష్ట్రంబులు ఘన ధాన్యోపేతంబులై ప్రహృష్టజనాకీర్ణంబు
లై నిత్యోత్సవయుక్తంబులై కృతయుగంబునందుంబోలె ప్రముదితంబులై యొప్పె
బహుసువర్ణాఢ్య యాగవిశేషంబుల నశ్వమేధశతంబుల దేవతలం దృప్తిఁ
బొందించి రాజవంశ్యులఁ బ్రముఖులఁ బ్రత్యేకంబుగా రాజ్యదానంబున సంస్థా
పించి యసంఖ్యేయంబగు ధనంబును గోకోటిసహస్రంబులను బ్రాహ్మణులకొ
సంగి యీలోకంబునందు నాలు వర్ణంబుల వారిని స్వస్వధర్మనిరతులం జే
సి పదునొకండు వేలవత్సరంబులు రాజ్యంబుఁ జేసి స్వలోకంబైన వైకుంఠంబు
నకు వేంచేయఁగలండు ॥ (క) అనఘము శ్రుతినిభము శుభం । బనుపమ సేవ్యం
బు మరి తత్, హరమగు నీ రా । మునిచరితముఁ బఠయించిన । జనుఁ డఘములఁ బా
సి పొందు శాశ్వతసుఖముల్ ॥ (క) ఆయుష్యంబగు నీ రా । మాయణముఁ బఠించు
మనుజుఁ, డైహికసౌఖ్య । శ్రీయుతుఁడై సుతపౌత్రస । మాయుక్తుండై యమ
ర్త్యుఁ, డగు నటమీఁదన్ ॥ (ఉ) భోగము మోక్షమిచ్చు రఘుపుంగవు దోశ్చ
రిత ప్రబంధముల్ । బాగుగ విన్న విప్రనరపాలక విట్పదజుల్ గ్రమంబున । స్వా
గృహభత్వముల్ క్షితిప్త, వత్వము పణ్యఫలత్వమున్ సుము । ద్యోగమహత్వముం
గలిగి యొప్పు దురంతయువిత శోకులై ॥ (వ) అని యిట్లుత్తరకాండ కథా స
మన్వితంబుగా సప్తకాండ కథావృత్తాంతం బంతయు సంక్షేపంబుగా నెఱిం
గించిన వాక్యవిశేషజ్ఞుండును ధర్మాత్ముండును మహామునియు నగు వాల్మీకి య
న్నారదుని సంపూర్ణార్థ ప్రతిపాదక పదసమూహంబైన తత్ప్రశ్నానురూపో
త్తర వాక్యంబు విని శిష్యసహితుండై యద్దేవర్షివర్యుం బూజించిన నన్నార
దుండ వ్వాల్మీకి చేత యథార్హంబుగాఁ బూజితుండై యామంత్రణంబు వడ
సి యాకాశంబునకుఁ గ్రమించి స్వల్పకాలంబులోన బ్రహ్మలోకంబునకుం జనియె ।

(*) వాల్మీకి స్నానార్థము తమసానదికరుగుదెంచుట (*)

(ఉ) అజటినాథుఁడుం జనిన యవ్వలనమ్ముని స్నానకాంక్షియై । యోజఁదలిర్ప
వేఁవమున, సూరెతుభక్తిరసంబుతో భర । ద్వాజుఁడు వెంటరానికచ తామర
సోత్పల భూరిసౌరభ । భ్రాజితదివ్యగంధవహ, బంధుర యా తమసాస్రవంతి
కిన్ ॥ (క) చనితత్తటిసీమహిమతు । జనితప్రముదాభియోగ, సంభ్రమమతియై
ఘనసుజనావనపావన । వనగాహనమాచరింప, వడిఁదివురుటయున్ ॥ (తే. గీ)
తగనకర్దమమ్మైనయ, త్తటినితీర్థ । మదిఁవిలోకించి తనప్రేవ, నతివినీత । చి
త్తుఁడై యున్నయమ్ముఖ్య, శిష్యుఁగని । యింపుదళుకొత్త మధురోక్తి, నిట్టు
లనియె ॥ (ఆ. వె) ఘనఘకంబెరిమ్య, మైనివ్వఁశంకమై । స్వాదుయుక్తమై ప్రస
న్నసలిల । మైనుతింపనయ్యె, నీనదీతీర్థంబు । సాధుపురుషమాన, సంబుకరణి ॥
(క) కలశంబచ్చట నిట్టుము । తలఁగక వల్కలము చెమ్ము, తమసాతటినీ । జ
లమజ్జన మొనరించెద । మలఘుగుణా సాంధ్యకృత్య, మదిదీర్పుటకున్ ॥ (క)
అనిపలుక భరద్వాజుఁడు । ఘనముగ వల్కలమొసంగఁ, గైకొని ఘనుఁడ ।
మ్మునితత్తీరవనంబున । వినుతతపోధనుఁడు వేడ్క, వీక్షించునెడన్ । (మ) హరి
దశ్మస్ఫుటవర్ణతుల్యనవదూ, ర్వాంకూరకాంతిచ్ఛటా । భరితస్నిగ్ధవిశాలశా
ద్వలచర, త్పంచాస్త్రకేళీవినో । దరసోన్మత్త మనోజ్ఞనాదశకున, ద్వంద్వంబు
క్రీడింపఁగాఁ । దరులంబొంచినిషాదుఁడొక్కఁడలుకన్, దర్పాంధుఁడై క్రక్కు
నన్ ॥ (క) మించినవేడ్కరమించెడు । క్రౌంచంబుల రెంటిలోనఁగనుఁగొని పురు
ష । క్రౌంచమునుజంపెనురువడి । వంచించినిషాదుఁడెంత, పాపాత్ముఁడో ॥
(వ) అప్పుడు శోణిత పరీతగాత్రంబుతో విచేష్టమానుండై నేలంబడియున్న ని
జవల్లభుంజూచి భర్తృమరణశోకాక్రాంతయై సహచరియగు క్రౌంచాంగనదీన
స్వనంబునఁ గరుణంబుగా విలపించిన ॥ (ఉ) ఆరవమాలకించిముని, యద్దెస

## (*) వాల్మీకిమహర్షి క్రౌంచమునువధించిననిషాదునిశపించుట (*)

ఘోరనిషాద పాతితుం । డైరసస్రావియున్న విహ, గాధిపురక్తపరీతశీర్షుని ।
న్వారకఁగాంచిభూరికరుణ, న్మధురోక్తులనాదరించియా । కారయధర్మమింతత
గునాయని బుద్ధిఁదలంచియిట్లనున్ ॥

శ్లో ॥ మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః ।
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితం ॥

(మ) అనియిట్లామునిరాజు వల్కెనదిదీ; యాలాపముల్ శ్లోకమై । తనరం



క్రౌంచవిధంబుఁగాంచి వగచే, తందూలునాచేతఁ జ । య్యనని లక్షణయుక్తపద్య
మెటులా, హా వ్యాహృతంబయ్యెనే । డనిచింతింపుచుశిష్యుఁబిలిచినెయ్యం
బొప్పఁగానిట్లనున్ ॥ (వ) క్రౌంచీశోకార్తుండనై యిప్పుడేను నిషాదుని శపించి
న శాపోక్తులు చతుష్పాదయుక్తంబై సమాక్షర పదంబై లక్షణోపేతంబై య
నేకార్థప్రతిపాదకంబై తంత్రీలయ సమన్వితంబై శ్లోకరూపంబయ్యె శ్లోకం
బుకంటె నన్యంబైన కేవలపదసందర్భంబుగాదు వింటివేయని పలికిన నా భ
రద్వాజుండు వాల్మీకివచనంబువిని హృష్టచిత్తుండై బహుప్రకారంబుల ననుత్త
మంబైన యాశ్లోకరాజంబుఁ బఠించిన సంతుష్టాంతరంగుండై ॥ (తే. గీ) స
త్వరంబుగ వాల్మీకి, సంయమీంద్రుఁ । డన్నదీపుణ్యజలమున, నహర్భంగి । స్నాన
మొనరించియుదిమెమ, న్త్రింబుగాఁగ । నచలభక్తిజపింపుచు. నచటఁబాసి ॥
(మ) తనవెంటంజలకుండిఁగైకొనిభర, ద్వాజుండుసంతోషియై । చనుదేరంగన
నేకవైఖరులఁబా, స్వత్పద్యభావంబుశి । ష్యునకుంజెప్పుచు నాశ్రమంబునకుఁ
బు, న్నోదారుఁడేతెంచి తా । ననిశధ్యాతతదర్థవర్ణపదుఁడై యాసీనుఁడైయుం

## (*) వాల్మీకిమహర్షికడకుపరమేష్ఠి యేతెంచుట (*)

డఁగన్ ॥ (ఉ) బంగరునంచ తేజిపయి, బాగుగ నెక్కి సనందనాదులుం ।
బొంగుచు వెంటరాఁగ నలు, మోములవేదరవంబులుప్పతి । ల్లం గమలాస
నుండు ముని, రాజునుబుణ్యచరిత్రుఁ గన్గొనన్ । సంగతిమీఱవచ్చె సుర సా
న్యులుమ్రోలజొహారుసేయఁగన్ ॥ (ఉ) వచ్చినధాతఁగాంచి ముని, వర్యుఁడు
దిగ్గునలేచి యాత్మలో । నొచ్చములేనిభక్తిరస, మూరఁబ్రదక్షిణముం బ్రణామ
ము । న్నెచ్చుగ నాచరించితమి, మించియథావిధిపూజలిచ్చి తా । నచ్చుగఫా
లభాగఘటి, తాంజలియై గురుబుద్ధినుండఁగన్ ॥ (క) వనజాసనుండుముదము
నఁ । బనిఁగొని వాల్మీకి దత్త, పరమాసన మం । దనువుగనాసీనుండై । ముని
పతిఁగూర్చుండఁబనిచె, మునుకొనిప్రేమన్ ॥ (వ) ఇట్లుబ్రహ్మచేత ననుజ్ఞాతుం
డై వామలూరుతనయుం డుచితనిజాసనంబునంగూర్చుండి క్రౌంచగతంబైన
చిత్తంబున ధ్యానంబుబూని యెవ్వండు చారురవంబైన తాదృశ క్రౌంచంబు
నకారణంబుగావధించెనట్టినిషాదుం డెంత పాపాత్ముం డెంతవైరగ్రహణబుద్ధి
యయ్యెనని సారెసారెకుఁ గ్రౌంచాంగననుద్దేశించి దుఃఖింపుచు హృద్గతావ
శోత్పన్న శ్లోకార్థంబునందు నివేశిత చిత్తుండై సాక్షాల్లోకపితామహుండై

న పరమేష్ఠికిట్లనియె ॥ (మ) కలుషాత్ముండు నిషాదుఁ డొక్కఁడలుకం, గ్రౌంచం బు హింసింపఁగా । నలుకన్నర్తృవియోగదుఃఖమున నా, క్రందించుఁ గ్రౌంచాంగన । న్బలుచం గన్గొని యేను శోకమున వా, నిం దిట్టితిం దిట్టన । ప్పలుకుల్ శ్లోక పద్యమైతనరెశుం, భల్లక్షణోపేతమై ॥ (వ) అని పలికి యాశ్లోకంబుఁ బఠించి దేవా యిది యేమి కారణంబున నుత్పన్నం బయ్యె నాశ్చర్యరసావిష్టచిత్తుండనై యున్నవాఁడ నెఱింగింపవే యని యభ్యర్థించిన నాకర్ణించి విరించి యుచితకరుణాకటాక్ష వీక్షణంబుల నిరీక్షించి మదాజ్ఞానుసారంబున నవతీర్ణయైన సరస్వతి నెఱుంగఁడయ్యెనని మందహాసంబుఁ జేసి యిట్లనియె (తే, గీ) తాపసోత్తమ మత్ప్రసా, దమునఁ జేసి । భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె । నట్లుగాకున్న నేనీచేత, ననఘ గ్రంథ । పరఁగ నీశ్లోకము ప్రబంధగి బద్ధమగునె ॥ (తే, గీ) అనఘ నీమీఁదికూర్మిఁ జే, నమరమౌని । నారదుఁడు సర్వలోకవి, శారదుండు । తెలిపిపోయిన రాముని, దివ్యచరిత । మఖిలము సవిస్తరంబుగా, నర్థిఁ జెపుము ॥ (క) శ్రీమంతుఁడు గుణవంతుఁడుఁ । ధీమంతుఁడు ధార్మికుఁడు ధీరుండగు నా । రాముని చరితముఁ జెప్పుట । పామరుఁడు పుట్టువునకుఁ ఫలమగుసుమ్మీ ॥ (ఉ) ఉత్తమవిక్రముండగు రఘూత్తము సచ్చరితంబు జానకీ । వృత్తము సర్వరాక్షసుల, వృత్తములక్ష్మణువృత్తమంతయుం । జిత్తముఁ జేరియున్న యవి, సేరక యున్నవి నేఁడు పూర్ణవి । ద్వత్తమ మత్ప్రసాదమునఁ దప్పక తోఁచెడు నీకు సర్వముఁ ॥ (క) దురితహరంబును జేతో । హరమీ ద్విశ్లోకబద్ధ మగు రాముని స । చ్చరితముఁ జేయుము నీపలు । కరయఁగ నీకబైన నన్నృతమై యుండదు గిర ॥ (మ) క్షితి నెందాకఁ గులాచలంబులు రహిం జెల్వొందుఁ బున్యాపగా । తతి యెందాకఁ జరించు నర్ణవములెం, దాకం జెలంగున్నవ । తత్కృతరామాయణకావ్య మంతనుక సూరిస్తుత్యమై యుండు సం । వ తినందాక సుఖం చేదీవృత గన, స్వర్లోక సంవాసివై ॥ (మ) అని దీవించి విరించి సమ్మదరస, వ్యాకోచచిత్తాబ్జుఁడై । చనియెం బిమ్మటఁ దాపసోత్తముఁడు చం, చచ్ఛ్రీతినా శ్లోకముం । బనిగా శిష్యులు సారెసారెకుఁ బఠిం, ప న్వేడ్కనాలించి త । ద్ఘనరామాయణ పుణ్యకావ్యరచనా, కౌతూహలోల్లాసియై ॥ (వ) మఱియుఁ గ్రౌంచాంగనా దీనస్వరసమాకర్ణన సంజాతశోకంబు సమాక్షర చతుష్పాదగీతంబైన శ్లోకం బయ్యె నింక నాశీర్నమస్క్రియావస్తు నిర్దేశితముఖంబును



నితిహాస కథాసంయుక్తంబును నితరద్వార సంశ్రయంబును జతుర్వర్గఫల ప్రదంబును జతురోదాత్తనాయకంబును నగర సముద్ర శైలర్తు చంద్రసూర్యోదయోద్యాన జలక్రీడా మధుపానోత్సవ విప్రలంభ వివాహ కుమారోదయ మంత్రకరణ దురోదర ప్రయాణ నాయకాభ్యుదయవర్ణనంబులచేత సమలంకృతంబును నసంక్షిప్తంబును రసభావనిరంతరంబును సుసంధి శ్రావ్యవృత్తానతివిస్తీర్ణసర్గోపేతంబును లోకరంజనంబును నగు యశస్విరామచరితరూపమహాకావ్యంబు వృత్తాశ్రయంబులైన శృంగారాది రసంబులును నర్థాశ్రయంబులైన ద్రాక్షాపాక నారికేళపాక రసాలపాకంబులలో బహిరంతర్వ్యాప్తరసంబైన ద్రాక్షాపాకంబును బదాశ్రయంబులైన శయ్యలును వైదర్భీ గౌడీ పాంచాలీ ప్రముఖరీతులలోన బంధపారుష్య శబ్దకాఠిన్యాతిదీర్ఘసమాసవర్జితంబైన వైదర్భీరీతియును విషమాక్షరవృత్తరాహిత్యంబును శబ్దార్థాశ్రయంబులైయనుప్రాసోపమాద్యలంకారజాతంబును శబ్దావయవాశ్రయంబులైన గుణంబులును గైశిక్యాదివృత్తులును దేటపడునట్లుగా రచించెద సమాసదోష సంధిదోష పదదోషాది సమస్తదోషపరివర్జితంబగు దాని నన్యూనాతిరిక్తమహానందైకరసోపనత వాక్యబద్ధంబగు దాని మద్విరచితంబగు దాని రావణవధం బధికరించి కావింపంబడిన దాని నీరామచరితంబు సమాహితచిత్తులై వినుం డని శిష్యులతోడం బలికి కీర్తిమంతుండును నుదారబుద్ధియునగు నమ్మునిశ్రేష్ఠుండు ప్రక్షాళిత పాణిపాదుండై ప్రాచీనాగ్ర దర్భాసనంబున నుపవిష్టుండై యంజలిఘటించి విరించనోక్త ప్రకారంబున నచలసమాధియోగంబుఁ బూని నారదోక్తంబైన రామచరితవస్తుతత్వంబు వ్యక్తంబగునట్లు కథా రహస్యంబుల న్వేషింప నప్పుడు చతుర్ముఖప్రసాద బలంబున దశరథుని వృత్తంబును సీతారామలక్ష్మణు లయోధ్యయందు నివసించు నప్పుడే వృత్తంబు సంజాతంబయ్యెఁ దద్వృత్తంబును వారల హసిత భాషిత గతి చేష్టితంబులును సాకేతపుర నిర్గమనానంతరంబున వనవాసంబునం దెయ్యది సంజాతంబయ్యె నట్టివృత్తంబును సత్యసంధుండగు రామునిచేత రచింపఁబడిన కార్యంబు లన్నియుఁ గరతలగతామలకంబునుం బోలె నిరీక్షించి ॥ (తే, గీ) అఖిలధర్మార్థగుణయుక్త, మైనదాని । రమ్యకామార్థగుణవిస్తరంబునైన । దానినీరధిఁ బోలె రత్ననిభ లలిత । మాని

## (*) వాల్మీకిమహర్షి రామాయణమహాకావ్య మొనరించుట. (*)

తపదార్థసంపూర్ణ,మైనదాని॥ (సీ) షడ్జాదికస్వర,సంబంధి కాంతాదిక
ఖిలశ్రుతిహృద్య,మైనదాని । వేడ్కతోవినువారి,వీనులఁజిత్తంబునభిముఖంబుగఁ
జేయు,నట్టిదాని । సర్వోపనిషదర్థ,సారసంభూతాశయ ప్రతిపాదకం, బయిన
దాని ।నరసురగంధర్వ,పరమర్షియక్షవిహంగకిన్నరసేవ్య,మయినదాని॥(తే,గీ)
నర్కకులమున నవతీర్ణుఁడైన పరమ । పురుషుఁడగురామభద్రుని,పుణ్యచరిత।
మమరముని నారదుఁడుచెప్పి,నట్టిఘనతి । నంతయునుగావ్యమొనరింప,నాత్మఁద
లఁచి॥(వ)రామునిజన్మంబును దన్మహావీర్యంబును సర్వానుకూలత్వంబును సర్వ
ప్రియత్వంబును క్షాంతియు నిరతిశయప్రియదర్శనత్వంబునుసత్యశీలత్వంబును
నానావిచిత్రకథలునువిశ్వామిత్రసమాగమంబునుజానకీవివాహంబును ధనుర్విభే
దనంబును రామరామవివాదంబును దాశరథిగుణానుకీర్తనంబును రామాభిషేక
సమారంభంబును గైకేయీదుష్టభావంబును నభిషేక వ్యాఘాతంబును రామవి
వాసనంబును దశరథశోకవిలాపంబును దశరథునిపరలోకగమనంబును బ్రకృతివి
షాదంబును బ్రకృతి విసర్జనంబును నిషాదాధిపసంవాదంబును సుమంత్రోపా
వర్తనంబును గంగానదీతరణంబునుభరద్వాజదర్శనంబునుభరద్వాజునిశాసనం
బునఁజిత్రకూటప్రవేశంబును జిత్రకూటంబునందు గృహనిర్మాణంబునుబర్ణశాలా
వస్థానంబును భరతాగమనంబును రామపాదప్రసాదనంబును దశరథునకు సలి
లప్రదానంబును బాదుకాగ్రాభిషేకంబునునందిగ్రామంబునందు భరత నివాసం
బునుబాదుకాస్థాపనంబును ననసూయాసందర్శనంబును నంగరాగసమర్పణం
బును దండకారణ్యాగమనంబును విరాధవధంబును శరభంగదర్శనంబును సుతీ
క్ష్ణసమాగమంబునునగస్త్యదర్శనంబును శూర్పణఖంజూచుటయు శూర్పణఖ
సంవాదంబును విరూపకరణంబును ఖరాదివధంబునురావణుని జానకీ హరణో
ద్యోగంబును మారీచవధంబును వైదేహీహరణంబును రామునివిలాపంబును జ
టాయునిబర్హణంబును గబంధదర్శనంబును బంపాదర్శనంబును శబరీదర్శ
నంబును హనుమద్దర్శనంబును ఋశ్యమూకగమనంబును సుగ్రీవసమాగమం
బును సాలభేదనంబున సుగ్రీవునకు విశ్వాసంబుఁబుట్టించుటయుసుగ్రీవునితోడి
సఖ్యంబును వాలి సుగ్రీవుల యుద్ధంబును వాలిప్రమథనంబును సుగ్రీవ రాజ్య
సంస్థాపనంబును దారావిలాపంబును రామసుగ్రీవుల సంకేతంబును వర్షరాత్ర
నివాసంబునురామునికోపంబునువానరుల పరస్పరమేళనంబును హరిత్ప్రస్థాప



నంబును సుగ్రీవునిచేత వానరులనుద్దేశించి పృథివీసంస్థాపనకథనంబును నంగు
ళీయకదానంబును బిలదర్శనంబును బ్రాయోపవేశంబును సంపాతిదర్శనం
బును బర్వతారోహణంబును సముద్రలంఘనంబును సముద్రునివచనంబున మై
నాకదర్శనంబును సింహికాదర్శనంబును సింహికానిధనంబును లంకాద్వీప
గతమలయగిరి దర్శనంబును నేకాంతవిచింతనంబును రాత్రియందు లంకాప్ర
వేశంబును రావణదర్శనంబును బుష్పకదర్శనంబును నాపానభూమిగమనం
బును నవరోధదర్శనంబును నశోకవనికాయానంబును సీతాదర్శనంబును త్రి
జటాస్వప్న దర్శనంబును నంగుళీయకప్రదానంబును సీతా సంభాషణంబు
ను సీతామణిప్రదానంబును వృక్ష భంగంబును రాక్షసవిద్రవంబును గింకరని
బర్హణంబును వాయు సూనుగ్రహణంబును లంకాదాహాభిగర్జనంబును బ్ర
తిప్లవనంబును మధుహరణంబును రాఘవాశ్వాసనంబును మణినిర్యాతనంబును
విభీషణసంసర్గంబును వధోపాయ నివేదనంబును సముద్ర సంగమంబును సే
తు బంధనంబును సముద్రప్రతారణంబును రాత్రియందు లంకావరోధంబును
గుంభకర్ణ నిధనంబును మేఘనాద నిబర్హణంబును రావణవినాశంబును న
రిపురంబున సీతావాప్తియు విభీషణాభిషేకంబును బుష్పక దర్శనంబును న
యోధ్యాగమనంబును భరతసమాగమంబును రామాభిషేకోత్సవంబును సర్వ
సైన్యవిసర్జనంబును నివియన్నియు విచిత్రపదార్థంబులగు యిరువది యొక్క
వేయుం బదియుఁదొమ్మిది శ్లోకంబులును నేనూట ముప్పదియేడుసర్గలును నాఱు
కాండంబులును జేసి యాత్మవంతుండును భగవంతుండును మహర్షియు నైన
వాల్మీకి విచిత్రపదంబును రామచారిత్ర ప్రతిపాదకంబును నైన కావ్యంబుగారా
ముండు సంప్రాప్తసామ్రాజ్యుండై యుండునప్పుడు లోకహితార్థంబు రచించి
స్వరాష్ట్రరంజనంబును సీతావిసర్జనంబును బ్రాహ్మణపుత్ర జీవనాశ్వమేధాది
భవిష్యత్కథలను నుత్తరకాండంబుగారచించె నుత్తరకాండంబుతోఁ గూడ
నీ రామాయణంబునందిప్పుడా ఱూటనలుబదియేడు సర్గలును నిరువదినా
ల్గువేల యిన్నూట యేబదిమూడు శ్లోకంబులును గలిగియుండు నందు బాల
కాండంబునందు డెబ్బది యేడు సర్గలును రెండువేల యిన్నూట యేబదియా
ఱుశ్లోకంబులును నయోధ్యాకాండంబు నందు నూటపందొమ్మిది సర్గలును
నాలుగువేల నన్నూటపదియేను శ్లోకంబులును నారణ్యకాండంబునందు డెబ్బ

దియాఱుయిదు సర్గలును రెండువేల యేడ్నూట ముప్పది రెండుశ్లోకంబులును గి
ష్కింధా కాండంబు నందఱువది యేడుసర్గలును రెండువేల యాఱ్నూట
యిరువదిశ్లోకంబులును సుందరకాండంబునం దఱువది యెనిమిది సర్గలును
మూఁడువేలయాఱుశ్లోకంబులును యుద్ధకాండంబునందు నూట ముప్పది యొ
క్క సర్గలును నయిదువేలతొమ్మన్నూట తొమ్మిదిశ్లోకంబులునునుత్తరకాం
డంబునందు నూటపదియు సర్గలును మూఁడువేల యిన్నూట ముప్పది నా
ల్గుశ్లోకంబులునుం గలిగియుండు మహర్షియగు వాల్మీకి చతుర్వింశ త్సహస్ర
శ్లోకపరిమితంబుఁజేసి యిమ్మహాకావ్యంబురచించెఁ గావునఁ దక్కిన యిన్నూట
యేబదిమూఁడుశ్లోకంబులు జగతీచ్ఛందంబాదిగాఁగల ఛందంబులవలనంబుట్టి
నవృత్తంబులయక్షరాధిక్యంబుననుత్పన్నంబులయ్యెనని కొందఱందురుబహుయు
గంబు లతీతంబులగుటవలన వాల్మీకి ప్రతిజ్ఞాత సంఖ్యకు వ్యత్యయంబుగలుగుట
యుక్తంబని కొందఱందురు వాల్మీకి మహర్షి వరుం డిరువదినాల్గువేల శ్లోకం
బులు పరిమితంబుజేసి గ్రంథంబురచించె ననియెడునది వాల్మీకిసంకల్పమా
త్రంబుబేకాని పరిసమాప్తిదశయందు గ్రంథ పరిపూర్తికొఱకు నీశ్లోకంబులు
కథితంబులై యుండఁబోలునని కొందరువక్కాణింతురుచతుర్వింశ త్సహస్రశ్లో
కనిర్ణయంబు కావ్యంబుకొఱకు నన్యూనాభిప్రాయంబు కాని యనతి రిక్తాభిప్రా
యంబుకాదనికొందఱు వచింతురు యిరువదినాల్గువేలశ్లోకంబులమీఁదనల్పసం
ఖ్యాతంబులైన యిన్నూట యేబదిమూడు శ్లోకంబు లధికంబులై యుండుట
ది వ్యత్యయంబుగాదెట్లనిన విరించికి మహాయుగంబులు వేయుచనిన నొక్క
పగలనియు నాపగటికిఁబదునలుగురుమనువులుచనుచురనియు మనుకాలంబుడె
బ్బదియొక్క మహాయుగంబులనియుఁ బురాణంబులందు వినంబడు వేయుమహా
యుగంబులఁ బదునాల్గు మనువులకు విభాగించినడెబ్బదియొక్క మహాయుగం
బులకంటె నించుకకాలంబధికంబై కానఁబడినది యెట్లు వ్యత్యయంబుగా గ
ణింపంబడ కుండునట్లు నయ్యల్పంబైన యాధిక్యంబు పరిగణితంబుగానేరదు
భగవంతుండగు ప్రాచేతసుండు చతుర్వింశత్యక్షర సంఖ్యాక గాయత్రీవర్ణం
బు లీరామాయణంబునందు వేయుశ్లోకంబుల కొక్కొక యక్షరంబు శ్లోకప్ర
థమాక్షరంబుఁజేసి బాలకాండంబునందు మూఁడక్షరంబులును నయోధ్యా
కాండంబునందు నాల్గక్షరంబులును నరణ్యకాండంబునందు రెండక్షరంబులును



గిష్కింధాకాండంబునందు రెండక్షరంబులును సుందర కాండంబునందుమూఁడ
క్షరంబులును యుద్ధకాండంబునందాఱక్షరంబులును నుత్తరకాండంబునందునా
ల్గక్షరంబులును సంస్థాపించిరచించె నికావ్యంబు చతుర్వింశ త్యక్ష రాత్మక
గాయత్ర్యాఖ్యపరబ్రహ్మనివాసంబైయుండు నుత్తరకాండంబునందు సమస్తజను
లకుభగవంతునితోఁగూఁడఁ దల్లోక ప్రాప్తియ తిశయంబై యుండుటంజేసి
యిక్కావ్యంబుప్రాచుర్యంబుగాఁ బరత్వాభివ్యక్తి కలిగియుండు దానంజేసి స
ర్వోత్తరత్వంబువలన నిదియుత్తరకాండం బనంబరఁగె నివ్విధం బున రామా
యణంబుసమగ్రంబుగారచియించి ॥ (క) మునిపతికృతార్థుఁడైతా । నొనరిం
చినరామచరిత మొప్పారఁగ నె। వ్వని చేఁజదివించెదనో। యనిమదిఁతలపోయుచుం
(*)వాల్మీకిమహర్షి శ్రీరామాయణమహాకావ్యముఁగుశలవులకుపదేశించుట(*)
డనాసమయమునర ॥(సీ) రూపవంతులుతుల్యరూపులుతుల్య, వయస్కులుధర్మ
కామార్థవిదులు । సుకుమారమూర్తులు, సుందరాంగులుయశస్కరులన్నద
మ్ములు,చారుముఖులు। లలితలక్షణలక్షి, తులుమధురస్వర భాషులుగంధర్వవేష
ధరులు। శ్రుతినిష్ఠితులుబహు,శ్రుతులుమేధావులుముని వేషధరులుసంపూర్ణతేజు॥
(తే,గీ)లఖిలగాంధర్వతత్వజ్ఞు, లఖిలశాస్త్ర । విదులుమూర్ఛనాస్థానకో, విదు
లురాజ । నందనులుస్వరసంపన్ను,లిందుసదృశ । లపనులు కుశీలవులు కుశ, ల
వులువచ్చి॥ (తే,గీ)భక్తివాల్మీకిమునినాథుపాదములకు । వందనముఁజేసి పేశల
వాగ్విభూతి । మమ్ముఁజదివింపుఁడనవుడు, మానివిభుఁడు । కరుణదళుకొత్త వా
రల, గారవించి ॥ (తే,గీ )పరఁగ రామదేహాఖ్య బిం, బంబువలన । సముది
తములైన యుపరబిం, బములరీతి । నమరువారి మనోజ్ఞవే, షములవారి । న
క్కుమారోత్తములఁ జాల, నాదరించి ॥ (మ) సమతంత్రీ లయయుక్తమైమధు
రమై, సప్తస్వరోపేతమై । రమణీయామృత కల్పమై నవరస, ప్రాగల్భ్యమై స
న్నసో । రమమైయొప్పెడు రామచంద్ర చరితా, లంకారకావ్యంబున । ర్వము
సార్థంబుగ నక్కుమారులకున, వ్వాల్మీకి సెప్పెన్మహర్షి ॥ (తేగీ) చెప్పినఁగుశీల
వులుముద, మొప్పమాని । కరుణనక్కావ్యమంతయువరుసఁజదివి । రమణసా
ర్వంబువాగ్విధేయముగఁజేసి । తాపసకులోత్తమునిప్రసా, దంబువడసి ॥ (మ)
మదనాకారులురాజనందనులు సమ్యగ్గానవిద్యారహా । స్యధురీణుల్మధురస్వరుల్గ
వలుచం,చన్మూర్ఛనాస్థానకో । విదులై రామకథాప్రబంధములసద్వీణానుకూలం

బుగా । ముదమొప్పన్మునినేతయొద్దసతతం, బున్బాడిరింపొందఁగన్ ॥ (తే.గీ) మ
ఱియుఁగడువేడ్కనమ్మునివరునికడకు । వరుసమానులుసాధులువచ్చినపుడు । వా
రిమ్రోల నప్పార్థివవరతనయులు, గానమొనరించి రమ్మహా కావ్య కథను ॥

—(* కుశలవులుశ్రీరామయజ్ఞవాటములోశ్రీరామాయణమునుగానముఁజేయుట.(*)—

(వ) మఱియునిసర్గమధురశబ్దప్రపంచసంచితంబైనయక్కావ్యంబుతదీయమ
ధురస్వరవాగ్విధేయంబైపరిమళోపేతంబైన కుందనంబుచందంబుననందంబై
యొప్పెనంతనొక్కనాఁడుసర్వాంగసుందరులగునారాజనందనులుమునిపతిచేతన
నుజ్ఞవడసిమునివేషంబులుధరించిసాకేతపురంబున కరిగి రాముభద్రుం డశ్వమే
ధయాగంబుఁజేయుచుండ నయ్యజ్ఞవాటంబుఁబ్రవేశించి మునిసభామధ్యంబున
విపంచిక లలవరించి రంగు రక్తులు గులుకఁగవగూడిజంత్రగాత్రంబు లొక్కటి
గాఁ మధురంబుగా మ్రోయఁ జేతనాచేతనత్వనిరూపణంబులేర్పడకుండ సమా
క్షర పాదవిచిత్ర పదార్థవ్యక్తంబగు దానిస్వరూపోచ్చారణ మాత్రంబునం
దును స్వరవిశేష సమన్వితగానంబునందును మధురంబగుదానిఁ ద్యశ్రచతుర
శ్రమిశ్రసంజ్ఞిక ద్రుతమధ్యవిలంబితగాన ధ్వనిపరిచ్ఛేదకాన్వితంబగు దానిష
డ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవతనిషాదసంజ్ఞికసప్తజాతిబంధం
బగు దాని వీణాతంత్రియం దధి రోపించితాలవేణుమృదంగాది వాద్యంబుల
తోఁగూడ నభివ్యక్తంబుగాఁ బాడందగిన దాని శృంగార కరుణహాస్య వీరభ
యానకరౌద్ర బీభత్సాద్భుత శాంతరస సహితంబగుదాని నుద్దీపనాలంబనాది
విభావయుక్తంబగు దానిసంభోగ విప్రలంభసంజ్ఞికద్వివిధశృంగారరసోపేతం
బగుదాని సీతాచరితపౌలస్త్యవధరామశోక ప్రతిపాదకంబగుటంజేసి శృంగా
రవీరశోకరసప్రధానంబగు దాని సర్వాలంకారపూర్ణంబగుదాని వేదార్థ
వ్యక్తీకరణంబుకొఱకు వాల్మీకిచేతఁ గథితంబైన దాని సీతాచరిత రావణవధ
ప్రతిపాదకంబైనదాని రామాయణ కథాప్రబంధంబు మునిపతి యభిప్రాయం
బు మనంబున నిడికొని శృంగారాది రసావిర్భావంబెట్లగు నట్లు మధురంబు
ను రంజనంబునుసమీచీనరాగయుక్తంబునుంగాఁబాడిన॥(శా) ఆశ్లోకప్రచురత్వ
మామధురశ, బ్దార్థోపమానోపమే । యశ్లేషాదిక సౌష్ఠవంబుఘనగీ, తాచా
ర్య మాలించి పు । ణ్యశ్లోకుల్మునిపుంగవుల్భువన వి, ఖ్యాతుల్ ప్రశస్తప్రభా । వ
శ్లాఘ్యుల్పరమాద్భుతంబుముదమ్మున్, వైదుష్యమేపారఁగన్॥ (శా)ఆహా యెం



త విచిత్రమంచుఁ గనులన్, హర్షాశ్రువార్బిందు సందోహంబుల్ జినుకంగ
మారకుల నస్తోకప్రభావాఢ్యుల । న్నీహారాంశుసమానవక్త్రులరహి, న్వీక్షిం
చికారుణ్యము । త్సాహంబుం జెలఁగన్నుతించిరతిచి, త్రప్రౌఢివాగ్వైఖరిన్ ॥
(వ) మఱియు నీరామచరితంబు బహుకాల నిష్పన్నంబైనను బాకవిశేషంబు
నఁ బ్రత్యక్షంబుగా ననుభూయ మానంబైన పగిది దర్శితం బగుచున్న దని
యిట్లుప్రశంసించి॥ (సీ) ఒకమానివల్కలం, బకలంకమతి నిచ్చెఁగరుణతోనొక

(*)కుశలవులకు మునీశ్వరులు బహుమతు లొసంగుట. (*)

మాని, కలశ మొసఁగెఁ । దపసియొక్కఁడు కూర్మిన్, జపమాల దయచేసెఁ
ముదముతోనొకమాని, బ్రుసినొసంగె । నొకసంయమీంద్రుఁడా, యుష్యంబుకృ
పనిచ్చె యతియొక్కఁడిచ్చెఁగృ, ష్ణాజినంబు । మాని యొకండిచ్చె, మౌంజి
యుదండంబుమఱియొక్కఁడిచ్చెఁగమండలువును॥ (తే,గీ) దపసియొక్కఁడు య
జ్ఞసూ, త్రంబొసంగె । మఱియుఁ బెక్కండ్రుమానులు, వరుసతోడఁ। దమకుఁ
గలిగినవస్తువుల్, దయదలిర్ప । నొసఁగిరవ్వేళ నక్కుమా, రోత్తములకు॥(వ)
ఇట్లు రామాయణ కథాశ్రవణ సంజాత పరమానందానుభవ పరవశులై ము
నీంద్రులుచిత సత్కారంబుల నారాజపుత్రులఁ బ్రీతచేతస్కులం జేసి మహా
త్ముండగు వాల్మీకి చేత నిక్కావ్యంబు కల్పితంబయ్యె నీయాఖ్యానంబింక సమ
స్తకవులకాధారంబయిసర్వగీతంబులయందుత్తమ గీతంబై సర్వశ్రుతి మనోహ
రంబయి మహాభ్యుదయ కారణంబై యాయుష్కరంబైయద్భుతకరంబయిప్రా
శస్త్యంబువహించుఁగాక యనిపలికి రంతనక్కుమారు లొక్కనాఁడయోధ్యాన
గర రాజమార్గంబులందుసుధామధురపేశలసమాక్షరవిచిత్రపదార్థభవ్యం
బైనయక్కావ్యంబుఁ గాంతాప్రభావతీప్రభృతి సర్వశ్రుతిమనోహరంబగునట్లు
గా గానంబుఁజేసిన। (క) కలరవమైజితకోకిల। కులరవమైయారవంబకుంఠితగ
తివీనులవిందై యమృతపుసో । నలపొందై పురమునిండనలువుగమ్రోసెన్॥(ఉ)
మ్రోసిననాలకించిరఘు,ముఖ్యుఁడురాముఁడుభూరిసమ్మదో। ల్లాసవిలాసియైతపన

(*)శ్రీరాముండు కుశలవులం దనగృహంబునకు రావించుట.(*)

రాజులకైవడిఁ గ్రాలువారిఁ బే। రాసఁగనుంగొనన్నిజగృహంబునకుం బిలిపించి
మించియాకోసలనాయకుండుకడుఁగూరిమితోడబహూకరింపుచున్॥(వ)సచివ
సామంతభృత్యసమన్వితంబుగానొక్కకమనీయకాంచనకమ్రకిరణ సముజ్జ్వల

దివ్యసింహాసనంబున నాసీనుండయియుదయమహీధరోపరిభాగ సముజ్జ్వలపుండ
రీకవనబంధుఁడునుంబోలెఁ దేజరిల్లుచు లక్ష్మణభరతశత్రుఘ్నులనవలోకించి॥(ఉ)
వీరిమనోజ్ఞవేషములు,వీరివచోరచనాచమత్కృతుల్ ।వీరివిలాసవైఖరులు,వీరిమృ
దుస్వరకల్పనంబుల ।న్వీరికళాకలాపములు,వీరిసముంచితగానసాహితుల్ ।చా
రుతరంబులై ముదమొ, సంగుచు నున్నవిమీరు వింటిరే॥ (చ) సరసవిచిత్రశ
బ్దపద, సంగతమై కడువిశ్రుతార్థమై । సురుచిర రక్తిఁ దంత్రిలయ, శోభితమై
మధురాంచితాయత । స్వరమయిపొల్చుమామకర, సస్ఫుటదోశ్చరిత ప్రబంధ
ముం। గరమనురక్తిఁబాడెదరు, కంటిరెయీసుకుమారసుందరుల్ ॥(క) మానస
హారమైకర్ణపు। టానందంబై సుధాభ, మైమధురంబై । యీనవ్యకథాగా
నంబానందబ్రహ్మ మయ్యె, నాలించితిరే॥ (వ) అనిపలికియ మందానందకందా
యమాన మానసుండై రాముండు ముఖారవిందంబునకుంమందహాసంబు చె
లువొసంగ సుమిత్రానందనాదు లభినందింపఁ దత్కథాశ్రవణకుతూహలపరుం
డై మెల్లనసింహాసనంబుడిగ్గి సభామధ్యంబున నాసీనుండై తత్సభాసదనంబు
నెల్ల నలంకరింపంజేయుచు।(చ) సురుచిరమూర్తుల న్భువన, సుందరులన్ముని
వేషధారులన్ । వరనృపలక్షణాఢ్యుల ది, వాకరతేజుల దివ్యబోధను । స్థిరు
ల సమానరూపులఁగు, శీలవులం గనిమాకు వేడ్క ని । న్నిరుపమ కావ్యరా
జకథ, నేర్పలరన్వినిపింపుఁడింపుగన్॥ (వ) అనిపలికి సభాసదులనందఱవిలో
కించి మహానుభావులగు యీకుమారులు పార్థివలక్షణ లక్షితులయ్యు మహా
తపస్వులై యొప్పుచున్నవారు వీరివలన శ్రేయస్కరంబైన మదీయ చరితంబు
వినుండని పలికెనంత నారాజనందనులు సభామధ్యంబున విపంచిక లలవరించి
ఘనరక్తి రాగంబు లెఱింగి కాలంబువీక్షించి మధురస్వరజాతు లేర్పఱిచిసా
ర్వత్రికంబైన మార్గంబును గ్రావిత్కంబైన దేశీయంబునుం దెలిసిమధురం
బును మనోహరంబును రంజనంబును స్వేచ్ఛానురూప స్వరాయామంబునుదం
త్రీలయవంతంబును బ్రసిద్ధార్థంబును మనస్సంహ్లాదజనకంబును శ్రోత్రేంద్రి
యసుఖకరంబును సకలవిద్వజ్జనసేవ్యంబునగు శ్రీమద్రామాయణమహాకావ్యం
బుగానంబు సేయనుపక్రమించి కావ్యముఖంబునం దాశీర్నమస్క్రియావస్తునిర్దేశం
బునొక్కటియావశ్యకంబని యాలంకారికోక్తి గలుగుటం జేసి రామరూపవస్తుని

—(*) శ్రీరామునిసభయందుఁ గుశలవులు రామాయణంబు గానము సేయుట.(*)—



ర్దేశపూర్వకంబుగా నిట్లని చదువందొడంగిరి॥ (సీ) తొల్లియీవైవస్వతుఁ
డుమొదల్గాఁగొని యేవంశజులదయ్యె, నీధరిత్రి । యేవంశమునఁబుట్టె, నృపలో
కవిద్వేషి సమవర్తి సగరాఖ్య, చక్రవర్తి । వారిధులేపుణ్య, వంశసంభవు
లచే నటుద్రవ్వఁబడిసాగ, రాఖ్య నొందె । నేవంశమునఁబుట్టె, నిలకుమందా
కినిఁగోరి తెచ్చినయాభ, గీరథుండు॥ (తే, గీ) నట్టియిక్ష్వాకువంశంబు, నందు
శుభద । మైనరామాయణాఖ్యమ, హాప్రబంధ । ముంచితంబుగ నుత్పన్న, మ
య్యె నిదియె । ధర్మకామార్థ సహితమై, తనరుచుండు ॥ (క ) ఈయా
ఖ్యానము సర్వమ । నూయారహితాత్ము లగుచు, సూరిజను లుపా । దేయం
బుగఁ గొని వినఁదగుఁ । బాయక వినకున్నఁబ్రత్య, వాయము గల్గున్॥ (క) స్ఫీ
తంబై ధనధాన్యో । పేతంబై ముదితమైయ, పేతదురితమై । ఖ్యాతిగ సరయూ
నామన । దీతటమునఁ గోసలాఖ్య, దేశంబలరున్॥ (సీ) ప్రకటీకృతానంత, ల
క్ష్మీవిలాసమై పొలుపారు వైకుంఠ,పురముభంగి । రాణించుఁ జతురాస్య, వాణీ
సుహృద్యమై కమనీయసత్యలో, కంబుకరణి । గురుసుధర్మామోఘ, సురభి
శతక్రతుకలితమై స్వర్గలో, కంబుకరణి । ధననాథవరపుణ్య, జనసమాకీర్ణ
మైరాజిల్లు నలకాపు, రంబురీతి॥ (తే,గీ) వీరభద్రగణేశకు, మారసహిత । మై
నగాధీశుపురముచం, దానఁదనరుఁ । గనకకలశితదినమధ్య, గతమనోజ్ఞ । ధా
మనిధిగోపురంబయో, ధ్యాపురంబు॥ (క) ఆనగరంబు తొల్లి మను, వానఁగ
ఱని మనోరథంబుతో । శ్రీనలువందఁగా సరయు, చెంగటద్వాదశ యోజనా
యతం । బై నిడిమూఁడుయోజనము, లంత తనర్చును గల్గునట్లుగా । దానిర
చించె నేర్పలర, ధారుణిఁ గోసలదేశమండలిన్ ॥ (క) ముక్తాప్రసూనకలికా ।
యుక్తంబై శీతపటిమ,లోపేతపయస్సి । క్తంబై తనరెడుసువి । భక్తమహాపథము
చేత, వఱలుచునుండున్॥ (తే,గీ)చారుశిల్పవిశేషంబు, సర్వశస్త్ర । యంత్రము
లు సువిభక్తాంత, రాపణములు । హాటకవిచిత్రసౌధక, వాటగోపు । రములు
గలిగి చెలంగునా, రాజధాని॥ (క) అతులప్రభమైనుశ్రీ । యుతమైయట్టాలక
ధ్వ, జోపేతంబై । వితతశతఘ్నీశతపరి । వృతమైయప్పురమువఱలు,విశ్రుతభం
గిన్ ॥ (తే, గీ) సూతమాగధయుక్తమై, సురుచిరామ్ర । వణమహోద్యానర
చితమై, వరణధామ । కలితమై కామినీనాట, కప్రకీర్ణ । మై యనారతమ
హ్వరి, యలరుచుండు ॥ (క) కరిహరిరథోష్ట్రగోఖర । పరివృతమైఘనగభీర, ప

రిఖావృతమై । పరులకు దురాసదంబై । కరమద్భుతభంగిఁ బురము, గ్రాలుచు
నుండుఁ ॥ (సీ) బలికర్మ సామంత పార్థివసంఘంబు వివిధదేశాగతవిజ్ఞజనం
బు । రత్ననిర్మితబహు, ప్రాసాదపఙ్క్తులత్యున్నత క్రీడాశి, లోచ్చయములు ।
మహనీయకూటాఖ్య, మందిరశ్రేణులు హృద్యమృదంగాది, వాద్యములును । న
టువొప్పవరనర, నారీగణంబులు నిక్షుకాండరసస, దృశజలము ॥ (తే, గీ)
సర్వరత్నంబులు విమాన, సమగృహములు । శాలితండులములు చిత్ర, శాలల
ఖిల । మణినిబద్ధభూములు హేమ, మంటపములు । గలిగియప్పురి భువనవి, ఖ్యాతి
వడయు ॥ (తే, గీ) అనుపమాష్టాపదాకార, మైవిచిత్ర । మైయవిచ్ఛిద్రమైరమ్య
మైదివమున । సిద్ధులు తపంబు చేఁబడసిన విమాన । మట్లు సురుచిరగతినొప్పు నప్పు
రంబు ॥ (సీ) వరసతీక్రీడా వి, భవభంగమాటచే జగతిఁ గామ్యవనంబు, శప్తమ
య్యె । వసుమతీజార్తిసం, పాదకమగుటచేఁ దగ నశోకవనము ఖ్యాతమయ్యె ।
నజరభుజంగభో, గాస్పదంబగుటఁ బుణ్యజనశూన్యంబయ్యె నందనంబు । కౌశి
కార్థీనమై, క్రాలుచుండుటఁ జేసి ధరను ఖాండవవనీదగ్ధమయ్యె ॥ (తే, గీ) ననుచు వి
నినస్మింటిని, నపహసించి । రాజరాజసేవ్యములౌట, రమణ చైత్ర । రథములౌట
నొక్కింత చైత్రరథమీడు । సేయఁదగి యొప్పు నుద్యానసీమలందు ॥ (ఉ) పా
ఱెడు వానిఁ గైదువులఁ బట్టనివాని వివిక్తునింగులా । ధారుని భీరుఁ గాంచి రణ, ధా
త్రిమహోలఘుహస్తులయ్యుసాం । పారగయుద్ధధర్మవిధ, మంతనెఱింగి వధిం
పకెంతయుఁ । వారలఁ గాంచి పుచ్చుదురు, వారక వీటిమహారథోత్తముల్ ॥
(చ) నిరుపమబాహుసత్వమున, నేర్పున వ్యాఘ్రవరాహభల్లకే । సరిముఖవన్యస
త్వముల, సాహసమొప్పఁగఁ గాననంబులోఁ । గరమునఁ బట్టి వాఁడిగల, ఖడ్గముచే
తఁ దలల్ గఱుక్కునన్ । నరికెదునట్టి సాహసజ, నంబొక కోటివసించు నప్పురిన్ ॥
(చ) అనఘులు బ్రహ్మకల్పులు మహాత్ములు వేదషడంగపారగుల్ । మునిసములాహి
తాగ్నులతి, పూజ్యులు శాస్త్రవిశారదుల్ తపో । ధనులు సహస్రదుల్ సుగుణ,
ధాములు సత్యరతుల్ జితేంద్రియుల్ । దనరుదు రందు భూసురులు, తామరసప్రి
యతుల్యతేజులై ॥ (సీ) రమణీయచారుస, రస్వతీకలితులై చతురాస్యులనఁగవి,
శ్రుతివహించి । యరుణప్రభామనో, హరసారసహితులై లోకబాంధవులనా, రూ
ఢిమెఱసి । సమధికాతురసమ, స్తపదార్థకర్తలై పుణ్యజనేశ్వర, స్ఫూర్తిఁ
గాంచి । సమవర్తిగురుదత్త, సత్కళావాసులై ద్విజరాజులనఁ జాల, వినుతి కె



క్కి ॥ (తే, గీ) ధరశతానందునులుసుత్రయీ, తనులనంగ । ధనదులనఁగ జైవా
తృకులనఁగఁ జాలఁ । బొగడువడసి సర్వజ్ఞతా, స్ఫురణనెగడి । వఱలుదురు వి
ప్రులప్పుర, వరమునందు ॥ (చ) అతులితదివ్యశక్తిధరు, లైన కుమారులు జన్యదు
ర్గరా । హితబలహంతలై తగు మహేంద్రులు రాత్రిచరైకశిక్షణో । ద్ధతుల
గు నారసింహులు మహోహవదీక్షితదక్షభంజనో । ద్యతులగు వీరభద్రులు జిత
శ్రీము లప్పురి రాజనందనుల్ ॥ (మ) తనమిత్రుం డొగి భైక్షవృత్తినటు నిత్యం
బుం బ్రవర్తింపఁగాఁ । గనివారింపని శ్రీదుఁ డెంతనిరహీఁ, గర్వించి సన్మిత్రులన్ ।
ఘననానావిధకామదానముల వేడ్కం బ్రాప్తినొందించిమిం । చినతింగాంచె దర
ప్పురివర్యమునం, జెల్వొందు వైశ్యోత్తముల్ ॥ (మ) వల నొప్పన్ హల ముం ధరిం
చి కుజన, వ్రాతంబులం ద్రుంచెనా । బలభద్రుం డదియే ఘనంబు ముదమొప్పన్నే
ము తత్పీరముం । బొంగు పారం గొని నిత్యముం గుజనులం, బోషింతు మీఁడానెని ।
స్తులతం జేకొనుమాకు నామ సలియం, చున్ బొల్తురప్పాదజుల్ ॥ (తే, గీ) లలి
నదీజవనాయుజా, రట్టజములు । చీనబాహ్లీకకాంభోజ, సింధువిషయ । సంభ
వంబులు హరిహయ, సన్నిభంబు । లగుహయంబుల చేనొప్పు, నప్పురంబు ॥ (చ)
అనుపమసార్వభౌమకుము, దాభ్రమువల్లభ రమ్యవామనాం । జనవరసుప్రతీకకుల,
సంభవము ల్గిరితుల్యములుద్ధరం । తనిబిడభూరిసత్వ కలితం బులునైనమదేభ
సంఘము । ల్ఘనతరబృంహితధ్వనిసె, లంగ రహిన్విహరించు నప్పురిన్ ॥ (తే, గీ) భ
ద్రమంద్రమృగంబులు, భద్రములును । మంద్రములు మృగములు భద్ర, మంద్ర
ములును । భద్రమృగములు మఱిమృగ, భద్రములును । మదరసకటంబులైయొ
ప్పు, మత్తకరులు ॥ (వ) మఱియు నప్పురంబునందల్పసన్నిచయుండును నసిద్ధార్థుం
డును గామైకపరుండును గదర్యుండును నృశంసుండును నవిద్వాంసుండును నాస్తి
కుండును నకుండలియు నమకుటియు నస్రగ్వియు నల్పభోగవంతుండును ననిర్మ
లశరీరుండును నననులిప్తాంగుండును నసుగంధుండును నమృష్టభోజియు నవదా
న్యుండును ననంగదనిష్కుండును హస్తాభరణరహితుండును ననాత్మవంతుండును
ననాహితాగ్నియు యాగరహితుండును క్షుద్రుండును దస్కరుండును వర్ణసం
కరుండును ననృతవాదియు నబహుశ్రుతుండును నసూయకుండును నసమర్థుండు
ను నషడంగవిదుండును నపండితుండును నవ్రతుండును నసహస్రప్రదుండును
దీనుండును విక్షిప్తచిత్తుండును వ్యాధితుండును నరూపవంతుండును నరాజన్యభ

క్తిమంతుండును నొక్కండైన లేఁడు బ్రాహ్మణజనంబులు ధర్మాత్ములును ముదితు
లును బహుశ్రుతులును సత్యవాదులును ద్యాగశీలురును గుటుంబవంతులును గ
వాశ్వధనధాన్యవంతులును సుసంతుష్టులును శీలవంతులును వృత్తసంపన్నులు
ను మహర్షికల్పులును స్వకర్మనిరతులును విజితేంద్రియులును దానాధ్యయ
నశీలురును బ్రతిగృహంబునందు సంయుతులును నై ప్రకాశింపుచుండుదురు క్షత్రి
యులును వైశ్యులును జఘన్యజులును నీమూఁడువర్ణంబులవారు కృతజ్ఞులై శూరు
లై వదాన్యులై విక్రమసంయుతులై యలరుచుండుదురు మఱియు నప్పురంబునం
గలసర్వజనంబులు దీర్ఘాయుష్మంతులై సత్యధర్మరతులై పుత్రపౌత్రసహి
తులై కళత్రవంతులై వఱలుదురు మఱియును॥ (క) ద్విజుల భజింతురు నృపతు
లు । ద్విజనృపుల భజింతు రెపుడు, వీటికిరాటుల్ । ద్విజనృప వైశ్యులనిత్యము ।
భజియింతురు పాదజనులు, పరమప్రీతిన్॥ (శా) హర్యక్షప్రతిమానశౌర్యులుమ
హా, హంకారులుం గాంచనా । హార్యాభస్ఫుటధైర్యులుగ్రసమర, వ్యాపారులుర్
విక్రమా । దార్యస్ఫీతమతుల్ మహామహులు యో, ధగ్రామణుల్ నిత్యముర్ । హ
ర్యక్షంబులు వోలె దిర్మరుదురుత్, ద్యత్ప్రీతితో నప్పురిన్॥ (సీ) రంభ యూడను
బెట్టు, లలితోరుకాండము ల్వరికించి సిగ్గున శిరము వంప । హరిణిజోడను బెట్టు,
స్ఫురితేక్షణవిలాసమది కాంచినంతనే, బెదరిపఱచు । నలతిలోత్తమసాటి, య
నుబెట్టు నాసికాకృతిఁ గనుంగొని తల, క్రిందు వడును । శశిరేఖ సరిసేయఁ, జను
బెట్టు నెన్నొసల్ పసఁ గాంచి కళలకుఁ, బాసిపోవు॥ (తే,గీ) హేమ యెనయగు బె
ట్టున, హీనగాత్ర । కాంతిఁ జూచిన మాత్రనే, కరఁగిపోవ । నఖిలభువనమనో
జ్ఞరూ, పాఢ్యలగుచుఁ । జెనరు నవ్వీటి వారకాంతామణులకు॥ (తే,గీ) అల
ఘుతరతారకాహృద్య, మైయమేయ । వసువిశాలమై యుచ్ఛ్రిత, ధ్వజమునగు
చు । రాజమార్గంబు కరణి నా, రాజధాని । రాజమార్గంబు శోభిల్లు, ర
మ్యమగుచు॥ (తే,గీ) ఎలమి శక్రుండు సురలోక, మేలినట్లు । శ్రీదుఁడలకాపురం
బుఁ బా, లించినట్లు । ధరణిరాజోత్తముండైన, దశరథుండు । లీలతో నప్పురంబుఁ
బా, లింపుచుండు॥ (చ) అలఘుతరప్రతాపమున, కార్యయశీతలచిత్తవృత్తికిం
ఫలతఁగ నామసామ్యమునఁన యిన రాజులె సాక్షిగాఁ జతు । ర్జల నిధులెన్ని
చూడవరుస న్పొలిమేరలుగా, సమస్తభూ । తలగురుభారవాహి యయ్యె, తద్దయ
నొప్పె నతండు ధారుణిన్॥ (వ) మఱియు నెచ్చట నివసించి దశరథుండు జగం



బుఁ బరిపాలింపుచుండు నట్టి యోజనత్రయ విస్తారంబైన సాకేతపుర మధ్యం
బునందు యోజనద్వయమాత్రప్రదేశంబున కయోధ్య యనెడు నామంబు స
త్యనామంబై యుండునట్టి మహారాజధానిఁ బరిపాలింపుచు నమ్మహారాజశేఖ
రుండు సర్వవిదుండును సర్వసంగ్రహుండును ధర్మరతుండును దీర్ఘదర్శి
యు మహాతేజుండును పౌరజానపదప్రియుండును నిక్ష్వాకుశ్రేష్ఠుండును యా
గశీలుండును ధర్మరతుండును నియతేంద్రియుండును మహర్షికల్పుండును
రాజర్షిముఖ్యుండును త్రిలోకవిశ్రుతుండును బలవంతుండును జితామిత్రుండు
సుమిత్రవంతుండును విజితేంద్రియుండును శక్రవైశ్రవణసంకాశుండును నై ప్రసి
ద్ధివహించిన వాఁడు మఱియును॥ (క) అనిమిషపతి సురలోకం । బనుపుగఁ బా
లించు భంగి, నన్నరపతి మే । దినిఁ బాలింపుచునుండును । మను విక్ష్వాకుండు
వోలె, మంజులఫణితిన్॥ (తే,గీ) ఆమహారాజమౌళి క, ధార్మికులగుచు । గ
రిమతో సర్వమంగళా, ఖ్యాతిపడసి । వరసతీత్వవిశేషవి, స్ఫురణఁ బోల్తు । రెల
మి మునుప్పాటరోఁ బండ్రు, జలజముఖులు॥ (తే,గీ) మించి కౌసల్య కైక సు, మి
త్రయనఁగ । హంసగతి సతీజలజాత, హస్తలగ్ర । సతులు గలరందుమువ్వురా
సకలలోక । ధవున కారాజమౌళి కా, దశరథునకు॥ (క) ఆరాజవరునకభిమ
త । కారులు ఋత్విజులు మునులు, గలరిరువురు సాం । పారఁగ వసిష్ఠుఁడనఁగా ।
ధీరోదారుండు వామ, దేవుండనఁగన్॥ (చ) వినయపరుల్ వివేకగుణ, విశ్రుతధ
న్యులు మంత్రకోవిదుల్ । జనపతికార్యసాధనవి, చారసమర్థులు శత్రుమర్మ
జ్ఞే । దనసదుపాయధుర్యులతి, ధార్మికులుత్తములష్టమంత్రులా । ర్యనుతులు
సత్యవాదులును, హామహుల్మిం గలరాజితారికిన్॥ (తే,గీ) అర్థసాధకవిజయ
సిద్ధార్థదృష్టి । మంత్రపాలకాశోకసు, మంత్రులును జ । యంతుఁడను పేర్ల
నొప్పగు, నట్టివారు । ధన్యులు సునీతిపరులు ప్రధానవరులు॥ (తే,గీ) క్రోధము
ననైనఁ గామంబు, కోఁలకునైన । నర్థకారణమున నైన, నన్నృతమాడ ।
రన్యులం దైన స్వజనులం, దైన వారి । కవిదితంబైన కార్యమింతైన లేదు॥
(తే, గీ) సంతతము చారముఖమున, సర్వరాష్ట్ర । కృత్యములెఱింగి హితశ
త్రు, వృత్తిఁ దెలసి । పరుల కలిమియు లేమియు, నరసి యభయ । మొసఁగి వ్య
వహారకుశలురై, యుందు రెపుడు ॥ (తే, గీ) తప్పుగలిగిన వేళ నం, దనుల
నైనఁ । గూర్మివిడిచి దండింతురు, ధర్మభీతిఁ । దప్పులేనిచో నరినైన, నొ

ప్పువిడిచి । కడిమి వండింప రెంతయుఁ, గలుషభీతి ॥ (క) సతతలఘువిషయవా
సుల । వ్రతశీలుర శుచులనరసి, రక్షింపుచుదు । మర్తుల వెదకి శిక్షింపుచు ।
క్షితిపతికోశాభివృద్ధిఁ, జేయుదు రెలమిన్ ॥ (చ) పురుష బలాబలం బెఱిఁగిఁ,
ఘోందుఘటింపుచువర్ణధర్మముల్ । దఱిగకయుండునట్లుసత, తంబునుబ్రో
చుచు నేకబుద్ధులన్ । వైరవరులం దగంబనుల, వెంటఁజరింపఁగఁ బంపుచున్
మహీ । వరునకుఁగీర్తిలాభవిభ, వంబులఁదారొన గూర్తు రెంతయున్ ॥ (క)
పురమందు రాష్ట్రమందును । బరదారరతుండు కల్లఁ, బలికెడువాఁడున్ । గు
రుద్రోహకుండుఖలుఁడో । క్రూరుఁడైనం గలుగకుండఁ, గాతురు మిగులన్ ॥
(క) పతిహితముకోరకుననిశము । చతురతనయలోచనమున,జాగరయుతులై ।
వితతమతి నఖిలకార్యము । లతులితముగఁ దీర్పుచుందు, రధికప్రీతిన్ ॥ (క)
మతినిశ్చయంబువలనను । వితతపరాక్రమమువలన,వీర్యమువలనన్ । ధృతిపెం
పునఁ బరవిషయ । ప్రతతులయందైనఁ బొగడు, వడయుదు రెందున్ ॥ (క)
ప్రకృతివినీతులు జితరిపు । లకలంకులు కపటరహితు, లద్భుతశీలుర్ । సకల
జ్ఞులు ఘనబృందా । రకగురుసన్నిభులువరక, ళాశాలురిలన్ ॥ (వ) మఱియు
మంత్రజ్ఞులును ముఖవికాసాది చిహ్నంబులఁబరాభిప్రాయ విదులును ప్రియహి
తరతులును విద్యావినీతులును నియతేంద్రియులును హ్రీమంతులును బరస్ప
రానురక్తులును నీతిమంతులును బహుశ్రుతులును శ్రీమంతులును మహాత్ములును
శాస్త్రజ్ఞులును దృఢవిక్రములును గీర్తిమంతులునుసర్వకార్యంబులయందుసా
వధానులును నానాశాస్త్రప్రయోగ ప్రతిపాదక ధనుర్వేద విదులును యుక్తవ
చనకారులును దేజఃక్షమాయశోవంతులునుస్మితపూర్వాభిభాషులునువీరులును
సువాసులును సువేషులునుసుశీలురును విఖ్యాత పరాక్రములునుగుణదోష
విశారదులును సర్వాభిజ్ఞులును మంత్రరక్షణంబు నందుయుక్తులును సూక్ష్మా
ర్థవిషయనిశ్చయంబు నందు శక్తులును నీతిశాస్త్ర విశేషజ్ఞులును బ్రి
యవాదులును భృశాను రక్తులును సమర్థులునై యొప్పుచుండు రిట్టిమం
త్రులచేత నద్దశరథుండు పరాభిభవ సార్థ్య ప్రచురమయూఖ సహస్రంబు
లచేత నుదితార్కుండునుం బోలె దీప్తినొంది సర్వగుణంబులకు మూల
ంబై యద్దశరథుండు చారముఖంబు వలన స్వపరరాష్ట్రకృత్యంబు లెఱిం
గి ధర్మంబునఁ బ్రజలరక్షింపుచుఁ ద్రిలోకంబులయందుఁ బ్రసిద్ధి వహించి త



నకు సమానునిఁ దనకంటె నధికునిం గానక ప్రతాప నిహత కంటకుండై
వశీకృత సామంతుండై మిత్రవంతుండై శక్రుండు స్వారాజ్యంబునుంబోలె స్వ
రాజ్యంబుఁ బెద్దకాలంబుఁ బరిపాలింపుచుండె ॥ (ఆ, వె) నీతిధర్మవిదున,
కేతాదృశప్రభా । వునకుసుతనిమిత్త మనవరతముఁ । దపముసలుపు, నట్టిదశ
రథునకువంశ । కరుఁడునందనుండు, గలుగఁడయ్యె ॥ (క) ఘనముగఁజింతించె
డునా । మనుజవిభునికిన్నినాళ్లు, మఱియేనేలా । తనయార్థ మశ్వమేధ । మ్మొ
నరింపఁగ నైతిననుచు. నొకమతివొడమెన్ ॥ (ఉ) మానుగ నమ్మహీవిభుఁడు,
మంత్రులునందఱుఁగూడి యాగమ్ముం । బూనుకసేయువాఁడనని, మోదముతో
మదినిశ్చయించితా । మానకమంత్రిసత్తముసు, మంత్రునిఁగన్గొని నీవుసర్వ
వి । ద్యానిధులైన మద్గురుల, నందఱఁ దోడ్కొనిరమ్మునావుడున్ ॥ (వ) ర
యంబునం జనిపురోహితుండగు వసిష్ఠుని వేదపారగులైనసుయజ్ఞ వామదేవ
జాబాలి కాశ్యపులను మఱియుందక్కినబ్రాహ్మణోత్తముల రాజప్రియచికీర్షు
లరాజసకాశంబునకుం దోడ్కొని వచ్చిన నద్దశరథుం డమ్మహాత్ముల నుచితస
త్కారంబులఁబ్రీతులంజేసి మృదుపూర్వకంబుగా ధర్మార్థ సహితంబగు
వాక్యంబుననిట్లనియె ॥ (తే, గీ) వరసుతార్థము పెక్కుసు,వ్రతములేను । చా

(*) దశరథుండుపుత్రార్థమశ్వమేధచికీర్షుఁడైవసిష్ఠాదులతోనాలోచించుట(*)

లఁజేసియుఁబడయంగఁజాలనైతి । ననఘమతులార యిపుడుమీయనుమతమునఁ ।
బూనిహయమేధమొనరింప, బుద్ధివొడమె ॥ (క) కావునహయమేధంబేఁ । గా
వించెద శాస్త్రదృష్ట, కర్మంబుననా । కేవిధితనయునిఁ బడయం । గావలనగు
నట్టితెఱఁగు, ఘటియింపుఁడీకన్ ॥ (చ) అనిజనభర్తవల్కుటయు, నమ్మునినా
థులుతన్ముఖేరితం । బునుబరమార్థసాధనము, మూల్యమునైన తదుక్తికౌశ
లం । బునువిని కౌతుకంబు ముద, ముంజెలువారబహూకరింపుచున్ । మను
జవరేణ్యుతోననిరి, మానులు వెండియు మంజులోక్తులన్ ॥ (చ) క్షితివరనీత
లంపుపరి, కింపఁగ మంచిది దీననీదువాం । ఛితముఫలించు నిక్కముగఁ, జె
ప్పెడిదేమిఁకఁ దత్ప్రయత్నముం । జతురతఁజేయుమశ్వమును, సత్వరతన్విడి
పింపు మాప్తసం । యుతముగయజ్ఞశాలసర, యూత్తరమందురచింపుమింపు
గన్ ॥ (చ) అనవిని భూమిభర్తముద, మందియమాత్యులఁజూచి వారికి । ట్ల
నుగురువాక్యపద్ధతిమ, ఖాశ్వము నుగ్రబలాన్వితంబుగా । నొనరిచిచెచ్చెరస్విడు

వుఁడొప్పఁగ నాసరయూతటంబునన్ । ఘనతరశాస్త్రసమ్మతము, గాఁ రచియిం
పుఁడు యజ్ఞవాటికన్ ॥ (వ) మఱియుఁ గల్పోక్తప్రకారంబున యథాశాస్త్రం
బుగా యజ్ఞవిఘ్ననివారకకర్మంబులు నిర్వహింపుఁడీ యజ్ఞంబునందు మం
త్రలోప క్రియాలోపాద్యపరాధంబులు గలుగకుండ నేని యీ యజ్ఞంబు మహీ
పతిచేతఁ బ్రాపించుటకు శక్యంబై యుండు విద్వాంసులు బ్రహ్మనుంబోలె వి
ద్వాంసులగు బ్రహ్మరాక్షసులిందు ఛిద్రంబన్వేషింపుచుండుదురు వారివలన యజ్ఞం
బు నిహతంబయ్యేనేని యజ్ఞకర్త నశించు మీరు సమర్థులుగావున నట్టి విఘ్నం
బులెవ్వియుఁ గలుగకుండ శాస్త్రదృష్టవిధానంబున యజ్ఞంబుఁ బరిసమాప్తి నొం
దించునట్టి భారంబుఁ బూనవలయునని పలికిన నయ్యమాత్యులు మహీరమణుని
వచనంబులకలరి దేవాభవత్ప్రసాదంబున నెల్లపనులు గొఱంతవడకుండ నిర్వ
ర్తించెదమని పలికి యతనిచేత ననుజ్ఞాతులై నిజనివాసంబులకుం జనిరి వసిష్ఠా
దిమహర్షులు యుక్తప్రకారంబున దశరథునిచేతఁ బూజితులై యాశీర్వదించి య
నుజ్ఞవడసి తమతమవిడుదులకుం జనిరంత నమ్మహీకాంతుండు సచివులనందఱి
నిజనివాసంబులకుం బోవంబనిచి తానునభ్యంతర మందిరంబునకుం జని మనో
హారిణులగు నిజపత్నులం జూచి యేనును సుతార్థంబు హయమేధ యాగంబుఁ
జేసెద మీరు దీక్ష వహింపుండనిన మనోహరంబైన పతివచనంబు విని హిమాత్య
యంబునందలి పద్మంబులుం బోలె ముఖపద్మంబు లత్యంతకాంతిసౌకుమార్యం

—(*) సుమంత్రుండు దశరథునకు సనత్కుమారోక్త రహస్యముం దెల్పుట (*)—

బునం దనరఁ బరమానందభరితహృదయలై యుండి రప్పుడేకాంతంబున సూ
తుండంజలి ఘటించి దశరథున కిట్లనియె॥ (తే,గీ) నరవరోత్తమ తొల్లి సన
త్కుమార । మౌనివర్యుండు మునిసభా, మధ్యమందుఁ । బొసఁగ మీకుఁ గుమా
రులు, పుట్టునట్టి । విధము తెలియంగఁ బలికె సవిస్తరముగ॥ (మ) అది యేను స్వి
నియున్నవాఁడ దగ నయ్యర్థంబు మీకర్థిఁ దె । ల్పెద నాలింపుము కాశ్యపా
త్మజుఁడు నక్లిష్టస్వభావుండుని । ర్మదుఁ డార్యుండు విభాండకుండనఁగ, విప్ర
శ్రేష్ఠుఁడుద్యద్గుణా । స్పదుఁడొక్కండు గలండు నిశ్చలతప, స్సంపన్నుఁ డమ్మౌని
కిన్॥ (చ) ఘనమతి ఋశ్యశృంగుఁ డనఁ, గా నొక పుత్రుఁడు గల్గునాతఁడా । వ
నమున నిత్యముం జరిగి, వారకఁ బిత్రనువర్తనంబు చే । ననవరతంబుఁ గాన
నము, నంచరింపుచు నుంటఁ జేసి తా । మనమున నించుకైనఁ బర, మనుష్య



నెఱుంగకయుండు నెంతయున్॥ (క) ధీవరుఁ డగు నమ్మౌనికిఁ । బావనలోకప్రసి
ద్ధ, పరమర్షికృతం । బై వఱలు బ్రహ్మచర్య । ద్వైవిధ్యము గలుగు నధిక, తా
త్పర్యమునన్ ॥ (క) పితృశుశ్రూష యొనర్చుచు । సతతముఁ బావకుని సేవ
సలుపుచు యోగ్యా । న్వితుఁడై యాగతినిత్య । వ్రతుఁడై మునిసుతుఁడు కాన, వ
ర్తించు నెడన్ ॥ (చ) అనఘవిచారుఁడంగ విభుఁ, డద్భుతవీర్యుఁడు రోమపా

(*) రోమపాద మహారాజ వృత్తాంతము. (*)

దుఁడ । త్యనుపమలీల లోకనుతుఁ, డై బుధసమ్మతుఁడై యరాతిసూ । దనుఁడ
యి రాజధర్మమది, దప్పక రాజ్యము సేయుచుండఁ జం । దనశశి కుందపారద
సు, ధామవిడంబియశోభిరాముఁడై ॥ (వ) అమ్మహీపతి విధినిషేధోల్లంఘనంబు
న॥ (తే,గీ) అఖిలభూతక్షయావహం, బైన సుఘోర । మై సుదారుణంబై లోక, మ
బ్జదళసలిలముగఁ దల్లడిలననా, వృష్టి దోఁచె । నమ్మహీపతి సేయు రా, జ్యం
బునందు॥ (తే,గీ) అట్టి కాలవిపర్యాస, మంతఁ జూచి । ధారుణీభర్త శోకసం,
తప్తుఁ డగుచు । వేదవేదాంగవిదులైన, విప్రవరులఁ । బిలువనంపించి యిట్లని
పలుకు నపుడు॥ (క) మునివర్యులార మీరెఱుఁ । గనియర్థ మొకింత లేదు, క
దత్రైలోక్యం । బున నేయుపాయమొనరిం । చిన వానలు గురియు దానిఁ జెప్పుఁడు
మీరల్॥ (వ) అనియడిగిన నమ్మునీంద్రులన్నరేంద్రునిం జూచి యీ యనావృష్టి
పాయుటకుం దగిన యుపాయంబెఱింగించెదము వినుము॥ (క) ఘనుని విభాండ
కతనయునిఁ । బ్రణుతగుణుని ఋశ్యశృంగు, రావించి భవ । త్తనయను శాంత
నొసఁగి మిం । చిన యనురాగమునఁ బెండ్లి, సేయుము ప్రీతిన్॥ (గీ తే) ఈ యుపా
యంబుఁ దక్క నొం, డేయుపాయ । మునఁ జనదు ఈ యనావృష్టి, యని మునీం
ద్రు । లానతిచ్చిన విని విభుఁ, డా మునీంద్రుఁ । డిచటి కరుదెంచుట కుపాయ, మె
ద్దియొక్కొ॥ (వ) అని బహుప్రకారంబులం దలపోసి నిశ్చయించి॥ (క) తనమం
త్రులను బురోహితుఁ । గనుఁగొని ముని నాథు నింద, గం దోడ్కొ నిరం । డనిపలికి
న వారు మనం । బున నెక్కుడు భయముగదుర, భూపతితోడన్॥ (క) మోము
న దైన్యంబడరఁగ । నేమా ముని సుతుని పాలి కేఁగఁగలేమో । భూమీశ యను
చు వేఁడిన । నా మనుజవిభుండు చిత్త, మందుఁ దలఁకుచున్॥ (వ) ఇంక నెయ్యది

(*) రోమపాదుండు వేశ్యలచే ఋశ్యశృంగుఁ దోడి తెప్పించుట (*)

కార్యంబని విచారించుచున్నంత॥ (క) లలితసుకుమార యౌవన, । కలితాంగు

లురూపవతులు, గణికలు నృపుముం । గలనిల్చి వినయమున నం । జలిఁ జేసిమ్రొ
చ్చూక్తులలరఁ, జతురత మెఱయన్॥ (క) జనవర యేమా మునిసుతు । ననుపమచా
తుర్య మొప్ప, నతిరయమునఁ దో । డ్కొనివచ్చెద మిప్పురమున । కనుపుము మ
ము మాకసాధ్య, మవనిం గలదే॥ (వ) అని పలికి యమ్మహీపతిచే ననుజ్ఞాతలై
యవ్వారకాంతలు వనంబునకుం జని వివిధోపాయంబుల నమ్మునిచిత్తంబులోఁ
గొని పురంబునకుం దోడ్తెచ్చి రట్లు దోడ్కొని వచ్చిన॥ (క) మునిపతి వ
చ్చిన మాత్రనె । తనివి చనన్వృష్టిగురి సెఁ ధరణీవిభుఁడా । యనసత్కరించి గ్ర
క్కునఁ దనకూఁతు నుశాంత నొసఁగెఁ దద్దయుఁ బ్రీతిన్॥ (తే,గీ) రోమపాదుని
జామాత, లోకనుతుఁడు । ఋశ్యశృంగుఁడు మీకుసం, ప్రీతి సుతుల । నిచ్చు
నని పల్కెఁ దొల్లిము, నీంద్రుఁడాస । నత్కుమారుఁడు మునులు వి, నంగ
నధిప॥ (వ) ఏనత్తెఱంగు సంక్షేపంబుగా మీకుం జెప్పితి నని విన్నవించిన విని
యద్దశరథుండు సంతుష్టాంతరంగుండై సుమంత్రుతో ఋశ్యశృంగుండు గణికల
చేత నెత్తెఱంగున నానీతుండయ్యె దానిసవిస్తరంబుగా వినవలతుం జెప్పుమని
యడిగిన నతండు సనత్కుమారోక్త ప్రకారంబున మహీరమణున కిట్లనియె

*సుమంత్రుఁడు దశరథునకు ఋశ్యశృంగానయనవిధంబుఁ దెలుపుట*

(ఆ,వె) అధిప రోమపాదుఁ, డా ఋశ్యశృంగుఁడిం । కెవ్విధమున నిచటి, కే గు
దెంచు । ననితలంపుచుండె, నా సమయమునఁ బు । రోహితుండు పలికె, నూహఁ
జేసి॥ (తే,గీ) మాకు శక్యంబుగాదు అమ్మౌని సుతుని । దోడితెచ్చుట కాత్మలోఁ
దోఁచినంత । పాటినిరపాయమైనయు, పాయమొకటి । యేనుసెప్పెద వినుము
మహీశ, వశ్య॥ (ఉ) ఆమునినందనుండుదయ, మాదిగఁ గానలనుంటఁ జేసి తాఁ
గామిని రూపయౌవనవి, కాసము నింద్రియసౌఖ్యసౌష్ఠవం । బేమి యెఱుంగ
డించుకయు, నెప్పుడు నన్యులతోడిపొత్తుఁగై । కోమిగుణప్రభూతమగు, కోప
ముఁగైకొనకుండుఁ గావునన్॥ (వ) ఇప్పుడు రూపయౌవనసంపన్నలగు వారకాం
తలు బహువిధాలంకారంబులం గైసేసి మునిపాలికిం జని మనోరమాభిమతేం
ద్రియార్థంబులచేత నతనిచిత్తంబు వడసి, నానావిధోపాయంబుల నిచ్చటికిం
గొని తెచ్చెదరు శీఘ్రంబున నట్టివారి నేర్పఱిచి పంపుమనిన నమ్మహీరమణుండు
రూపయౌవనవిలాసతిరస్కృతాప్సరఃకాంతలగు వారకాంతల నమ్మునిపుత్త్రుపా
లికిం జనుండని॥ (చ) పనిచిన వేడ్కతోఁ దపసి, భవ్యతరాశ్రమభూమి కేగి తా ।



వనరుహగంధులందమున, వారక గంధవహాన్యపుష్పనూ । తనశుక శారికాభి స
ము, దాయ మరాళమయూరపఙ్క్తులో । య్యాన సయి దోడుగా నడువ, నవ్వల
రాయని తూపులోయనన్॥ (వ) ఇట్లు తదాశ్రమ సమీపంబునకుం జని॥ (తే,గీ)
వనచరుఁడు ధీరుఁడాశ్రమ, వాసి పురుష । మానినీతారతమ్యమింతైన నెఱుఁగఁ
డమ్మునికుమారుఁ జూచు టెట్ల తనితోడఁ । బలుకుటెట్లు తచ్చిత్తంబు వడయు
టెట్లు॥ (క) పితృపూజాతత్పరుఁడై । సతతతపోయుక్తినాత్మ, సంతుష్టుండై ।
చతురతనొప్పెడునమ్ముని । పతి యెట్లాశ్రమము విడిచి, పఱతెంచునొకో॥ (తే,గీ)
జననమాదిగ నమ్మహా, మునిసుతుండు । పురమునందు రాష్ట్రమునందుఁ, బుట్టినట్టి
పురుషునైనను సతినైన, మఱియునన్య । మెద్ది యెనియు నెఱుఁగఁడో కించుకై
న॥ (క) అనుచుఁ దలపోయు నెడన । మ్మునిపుత్త్రుఁడు దైవయోగమునఁ జేసి తనం ।
తనె తాను వారియొద్దకుఁ । జనుదెంచినఁ జూచి చెలులు, సంభ్రమమలరన్॥ (వ)
సలలిత చిత్రకంచుకము, చాటునఁ గుల్కు మిటారి గబ్బిగు । బ్బలొఱయఁగా హి
రణ్మయవిపంచికలం ధరియించి వారకాం । తలు మునిపుత్త్రుకట్టెదుటఁ, దంత్రులు
మీటుచు రాగసంపద । ల్దలకొనఁ బాడిరందు మధు, రస్వరముల్ సరవిం జెలంగఁ
గన్॥ (వ) ఇట్లు సుస్వరంబుగా గానంబుఁ జేయుచు నమ్మునిచెంత నిలిచి యతని
తోనిట్లనిరి॥ (క) ధరణీసుర నీవెవ్వఁడ । వరయఁగ నతిఘోరమీమ, హాగహన
మునన్ । జరియించె దేల యొంటిగఁ । దిరముగ నీకల తెఱంగుఁ దెలియం జెపుమా॥
(ఆ,వె) అనుచు వారలడుగ, నమ్ముని తనయుండు । హృష్టచిత్తుడై యదృష్టపూ
ర్వ । లగుటఁ జేసి మిగుల, హార్దంబు వలనన । య్యిందుముఖులఁ జూచి, యిట్టు
లనియె॥ (తే,గీ) బ్రహ్మసముఁడు మాతండ్రి వి, భాండకాఖ్యుఁ । డతని కౌరసపు
త్రుండ, నాదునేను । బృథివినానామమది ఋశ్య, శృంగుఁడనఁగ । నధికవిశ్రుతమై
యొప్పు, ననుదినంబు॥ (వ) ఇది మదీయాశ్రమంబు మీకందఱకు విధిపూర్వకంబు
గా నతిథిసత్కారంబుఁ గావించెద ప్రతిగ్రహింపుండని పలికిన నతని పలుకులక
లరియవ్వాలందులు పర్ణశాలలోనికిం జనిన॥ (క) మునినందనుండు వారికిఁ । బ
నిగొని యుచితాసనార్ఘ్య, పాద్యంబులు నూ । తన మూలఫలంబులు చ ।
య్యననొసఁగి కృపఁ గ్రహింపుఁ, డని వేడుటయున్॥ (క) వారందఱుత్సుకంబున ।
గౌరవమునఁ దపసిపూజఁ, గైకొని మఱలన్ । శైరీషకుసుమ పేశల । సారామ్ర
తకల్పసూక్తి, సంయమితోడన్॥ (ఆ,వె) మునికుమారనీకు, ముఖ్యఫలంబులు ।

తివిరికాన్కఁగాఁగఁ, దెచ్చినార । మిమె పక్వఁ గ్రహింపు, మిప్పుడే భక్షింపు । మలఘు తేజశుభము, గలుగునింక ॥ (చ) అనినయమారఁబల్కి చెలు, లందఱు కౌతుక ముప్పతిల్లఁగా । మునిసుతుఁ గౌఁగలించుకొని, మోదమెలర్పఁగ మోదకాది నా । తనబహుభవ్యభక్ష్యము లు, దారత నిచ్చిన నారగించె బా । వనగుణమూర్తి నిక్కముగ , వన్యఫలంబు లటంచు నెంచుచున్ ॥ (వ) అంత నకాంతలు మునివలని భయంబున వ్రతచర్యాప దేశంబు నతనికిం జెప్పి యరిగిన నవ్విభాండకనందనుండ స్వస్థహృదయుండై తద్వియోగజనితదుఃఖంబునం జిటిలిపడుచు నారేయిఁగడపి మరునాఁడు తదాశ్రమసమీపంబున విహరించుచునెడ నెప్పటియట్ల యలంకృతలై వెలయాండ్రమ్మునికిం బొడసూపి తగుతెఱంగున నుపసర్పించి త్వచ్చిత్తంబాత్మాయత్తంబయ్యెనని హర్షించి యతనికిట్లనిరి ॥ (చ) అనఘచరిత్ర తాపసకు, లాంబుధిపూర్ణ శశాంక మీతపో । వనమున కే గుదెంచితిమి , వారక మేమిఁక మీరుమాతపో । వనమున కర్థిరావలయు, వంచనసేయక యంచుఁబల్కన । మ్మునిసుతుఁ డట్లకాకయని, మోదమెలపఁగ సమ్మతించినన్ ॥ (చ) తరుణులునత్తపస్విని ము, దంబునఁ గ్రుచ్చికవుంగిలించిచె । చ్చెరనధరంబునానితమిఁ, జెక్కిలినొక్కి యురంబురంబునన్ । గరమునరక్తి హత్తిజత, నంబున హస్తముఁబట్టియిమ్మెయి । న్వరఁకులఁబెట్టి తెచ్చిరియ, వార్యగతిన్ నృపవర్యువీటికిన్ ॥ (క) ఈకరణి మునికుమారుం । డాకమలాసన సమానుఁ, డప్పురమునకున్ । వీకఁజనుదేరనప్పుడె । ప్రాకటముగ వృష్టిగురిసె, బర్జన్యుఁడిలన్ ॥ (మ) జననాథుం డెదురేగు దెం చిమదిలో, సంతోషమేపారఁగాఁ । బ్రణతుండై పురవాసులందఱునుతిం, పన్ వైభవాడంబరం । బుననత్తాపస పుత్రుఁడచ్చెరువుతో, మోదింపసద్ధాంతరం । బునకుందోడ్కొని వచ్చి యర్హవిధులం, బూజించి యత్యున్నతిన్ ॥ (చ) తనకూఁతుం దరలేక్షణం దతకటిం, దారుణ్యవారాన్నిధిన్ । ఘనవేణిన్ నతనాభి నిందువదనం, గళ్యాణిశాంతన్ మహా । మునిరాజాను మతంబునందపసికామోదంబుతో నిచ్చియ । జ్జననాథాగ్రణి పెండ్లిఁజేసెన్నృపులెం,చన్మంచి లగ్నంబునన్ ॥ (క) ఈసరణిందనపుత్రిక । నాసంయమికొసఁగఁగూఁతు, రల్లుఁడునింటం । బాసిల్లఁగఁ దద్దేశము । శ్రీసం యుతమై సుఖంబుఁ గడునొప్పెన్ ॥ (వ) ఇట్లుబుశ్యశృంగుండు శాంతావశంగతమానసుండై యంగపతిగృహంబున



నభీష్టవినోదంబులం దేలుచుం డ. (సీ) అత్తఱిభానువం, శాంభోధిచంద్రుండు దశరథుండనియెడు, ధరణివిభుఁడు । సత్యప్రతిశ్రవుం, డత్యంతశౌర్యుండు కొడుకులఁబడయంగఁ, గోరిక్రతువుఁ । గావింపఁదలఁచియు, నక్షితీశ్వరుఁడైన రోమపాదునితోడ, రూఢిమెఱయ । సాచివ్యమొనరించి, చతురతనాతనియనుమతివడసిమ, హాత్ముఁడైన ॥ (తే, గీ) బుశ్యశృంగునిఁ బత్నిస, హితునిఁ జేసి । వేడ్కఁగొనివచ్చియమ్మహాద్విజవరేణ్యు । నధ్వరప్రజాస్వర్గార్థ,మటువరించి । శిష్టసమ్మతి జన్నంబు, సేయఁగలఁడు ॥ (వ) మఱియునమ్ముని పుత్రుని ప్రసాదంబున నిమ్మహీపతికి వంశప్రతిష్ఠాను కరులును సకలలోకవిశ్రుతులును వీర్యవిక్రమసంపన్నులునగు కుమారులు నలుగురుదయింతు రని భగవంతుండునుదేవప్రవరుండునగు సనత్కుమారుండుమున్నె ఱింగించెఁగావున ॥ (చ) పురుషవరేణ్య నీవిపుడు, పొందుగసర్వబలాన్వితుండవై । గురుమతినిమ్మునీంద్రుకడ, కుంజని సత్కృతిఁజేసివీఁకతో । నరుదుగఁగోరితెచ్చి తగ, నాయనచే హయమేధయాగముం । జిరశుభలీల సాంగముగఁ, జేసితివేనిజనింతురాత్మజుల్ ॥ (క) అనియాసచివాగ్రణియా । యనతోమునిపుత్రుచరిత, మంతయుఁ జెప్ప । న్వినిసంతోషము కుతుకము । జనియింపఁగ దశరథుండు, సంభ్రమపరుఁడై ॥ (క) ఆవేళనె వసిష్ఠుని । రావించి యమాత్యవరుల, రావించినతుల్ । గావించి చాలమన్ననఁ । గావించి యనుజ్ఞవడసి, గమనోన్ముఖుఁడై ॥ (తే, గీ) మంత్రిబాంధవసచివస, మన్వితముగఁ । గదలి వనములు నదములు, నదులఁగడచి ।

### (*) దశరథుడుబుశ్యశృంగమహాముని దోడితెచ్చుట (*)

విషయములఁ గొన్ని ద్దాఁటియ, వ్విభుఁడు బుశ్య । శృంగముని యున్న దేశంబుఁ, జేరఁబోయి ॥ (క) అలరు మఖాయతనంబున । విలసిల్లెడుదీప్తవహ్ని, విధమునననిత్యం । బలరోమపాదుగృహమున । నలరారెడుబుశ్యశృంగు, నర్మిలిఁ గాంచెన్ ॥ (క) కనివినయవిధేయుండై । జననాథకులోత్తముండు, సముచితగతిన । మ్మునివంశశిఖామణికా । సనార్ఘ్యపాద్యాదిపూజ, సలిపిముదమునన్ ॥ (వ) నానావిధనయ వాక్యంబులం బ్రస్తుతించియున్నంత ॥ (క) ఆ రోమపాదుఁడల్లుని । తోరమణీయార్కవంశ, తోయధిచంద్రుం । డీరాజువ శరథుండను । పేరన్ విలసిల్లువాఁడు, పృథుబలుఁడుర్విన్ ॥ (ఆ, వె) అనుచుఁ దెలిపియుంగ, జనపతి దశరథ । జనవరేణ్యుఁ బ్రీతి సత్కరించి । ప్రాభవమునఁ

జాలఁ బ్రార్థింపఁబడినయెడు । దినములుండిమొక్క, దినమ్మునందు ॥ (వ) దశర
థుఁడు రోమపాదునకిట్లనియె ॥ (క) జనవరనీపుత్రిని శాం । తనుగాంతో పేతఁ జేసిద
యమత్పురికిం । బనుపంగవలయుమాకొక । పనిగలదమ్మానివలనఁ, బరికింపం
గన్ ॥ (చ) నావినిరోమపాదుఁడుమ, నంబుననంతసమందియల్లునిం । ధీవరుఁ
గాంచియిూమనుజ, దేవునివెంటసతీ యుతంబుగాఁ । బోవలెనన్న నాజటిల,
పుంగవుఁడట్లగుఁగాక యంచునా । ప్పొవరువెంటనేగెఁగుతు,కంబలరన్ వని
తాయుతంబుగన్ ॥ (వ) ఇవ్విధంబున నవ్వసుమతీవల్లభుండు రోమపాదుని చే
త సంభావితుండై యతనిఁదగిన తెఱంగున సంభావించియతండుచిల సత్కా
రంబులఁ బ్రీతునింజేసి యనుప శాంతా సమేతుండైన ఋశ్యశృంగునిం దో
డ్కొని పరమానందంబునమగుడఁ దనపురంబునకుం జనుదెంచుచుఁ బురం బ
లంకరించువారుగాఁ బౌరుల నియోగింపుండని శీఘ్రగమను లగు దూతల న
యోధ్యకుం బనిచిన వారలతి త్వరిత గమనంబునంబఱచి రాజాగమనం బెఱిం
గించి పురం బలంకరింపుండని యాజ్ఞాపించిన వారను సమ్మదాయత్త చిత్తులై
తత్తరంబున సిక్త సమ్మార్జిత పథంబును సముచ్ఛ్రితధ్వజ పతాకా శోభితంబు
ను నానావిధ సుగంధద్రవ్య వాసనావాసితంబునుం గానగరం బలంకృతంబుఁ
గావించి రంత నమ్మహీకాంతుండు శంఖదుందుభి నిర్ఘోష పూర్వకంబుగా
ఋశ్యశృంగునిం బురస్కరించికొని పురంబుఁ బ్రవేశించి రాజమార్గంబునం
జని పురజనులమందానందంబున నభినందింప సుముహూర్తంబుననంతఃపు
రంబుఁ బ్రవేశించి వివిధప్రకారంబుల నమ్మహర్షినందనుం బూజించితన్ను గృ
తకృత్యునింగాఁ దలంచుకొనుచు సుఖంబుండెనంతఃపుర కాంతలెల్ల శాంతా
మహాదేవి సర్వవిధులఁ బూజించి యుపసర్పించి వివిధోపచారంబుల సంప్రీ
తం జేసి రిట్లుఋశ్యశృంగుండు సత్కార సత్కృతుండై శాంతంగూడి పరమా
నందంబున నభీష్టోప భోగంబు లనుభవింపుచు సుఖంబుండు నంత నొక్కింత
కాలమునకు సకలజగన్మనః కాంతంబైన వసంతంబు వనాంతంబులనలంకరిం
చిన నమ్మేదినీకాంతుండు స్వాంతంబున మఖంబుఁ జేయందలంచి శాంతాకాం
తునిరావించి నమస్కరించి ప్రసన్నుంగావించుకొని కులసంతానంబు కొఱకు
హయమేధంబుఁ గావింప నిశ్చయించితి సాంగ్రహణేష్టిఁ గావించుటకు మొద
లఁ బ్రమ్మత్వంబున ఋత్విగ్వరణంబుఁ గావించెద నంగీకరింప వలయు ననిప్రా



ర్థించిన ॥ (క) నావినియామునిపుత్రుఁడు । భూవరుతో మంచిపనియె, పూని
తివింకన్ । నీవాయత్నము సేయుము । పావనగుణ విడుపుమింక, భద్రహయం
బున్ ॥ (క) అనిపలుకనతనియనుమతిఁ । గొనిభూరమణుండుమంత్ర కోవిదు
నిసుమం । త్రునిఁ గనియస్మద్గురులం । గొనితెమ్మనవుడునతండు, కుతుకంబెసఁ
గన్ । (చ) రయమున నేగి కోసలధ, రావరు నానతిఁ బుణ్యకర్ములన్ । నియ
తులవేదపారగుల, నిత్యతపోధనులన్ మహాత్ములన్ । నయవిదులన్ వసిష్ఠముని,
నాథముఖాఖిలసంయమీంద్రులం । బయనముఁ జేసిభూవిభుని, పాలికిఁ గ్రక్కునఁ
దోడితెచ్చినన్ ॥ (క) భూవిభుఁడు వారినెల్లయ । థావిధిఁ బూజించి వినయతత్ప

(*దశరథుఁడుఋశ్యశృంగమునియనుమతంబున నశ్వమేధంబుఁ జేయఁబూనుట*)

రమతియై భావించిభక్తినంజలిఁ । గావించిముదంబెలర్ప, గానిట్లనియెన్ ॥ (తే,గీ).
వరసుతార్థము పెక్కుసు, వ్రతములేను । జాలఁ జేసియుఁబడయంగఁ, జాలనైతి
ననఘుమతులార యిపుడుమీ, యనుమతమునఁ । బూనిహయమేధ మొనరింప, బు
ద్ధివొడమె ॥ (క) కావునహయమేధంబేఁ । గావింపెద శాస్త్రదృష్ట, కర్మం
బుననీ । పావనుఁడగుమునిపుత్రు ప్రభావంబున నిష్టసిద్ధి, వడసెదనింకన్ ॥ (చ)
అనిజనభర్త వల్కుటయు, నమ్మునినాథులు తన్మఖేరితం । బునుసకలార్థసాధ
న మ, మూల్యమునైన తదుక్తికౌశలం । బును విని కౌతుకంబుమద, ముం జె
లువార బహూకరింపుచున్ । మనుజవరేణ్యుతోననిరి, మానులు వెండియు
మంజులోక్తులన్ ॥ (చ) క్షితివరనీతలంపు కడుసిద్ధము యాగమొనర్ప నీదు
వాం । ఛితము ఫలించునిక్కముగఁ, జెప్పెడిదేమికఁ దత్ప్రయత్నమున్ । జతు
రతఁ జేయు మశ్వమును, సత్వరతన్ విడిపింపుమాప్తసం । యుతముగ యజ్ఞశా
ల సరయూత్తరమందు రచింపుమింపుగన్ ॥ (తే,గీ) ధారుణీనాథ నీవిట్లు, ధ
ర్మసహిత । మైనయాబుద్ధిజనియించి, నందువలన । భూరివీర్యులనల్వురఁ, బు
త్రవరుల । నెల్లభంగులఁబడసెద, విదినిజంబు ॥ (చ) అనవినిభూమిభర్త ముద,
మారనమాత్యులఁ జూచి వారికి । ట్లను గురువాక్యపద్ధతిమ, ఖాశ్వముసుగ్రబలా
న్వితంబుగా । నొనరఁగచిచెచ్చెరన్ విడువుఁడొప్పుగ నాసరయూతటంబునన్ ।
ఘనతరశాస్త్రసమ్మతము, గారచియింపుఁడు యజ్ఞవాటికన్ ॥ (వ) మఱియుఁ
గల్పోక్తప్రకారంబున విధిపూర్వకంబుగా శాంతిక్రియలు నిర్వర్తింపుఁడిమ్మ
హాయజ్ఞంబెల్ల నృపులకు దుర్లభంబు కావున నిందొక్కింతైన నపరాధంబు

గలుగకుండ నిర్వర్తింపుండు విద్వాంసులగుబ్రహ్మరాక్షసు లిందు ఛిద్రంబు లన్వేషింపుచుండుదురు వారివలన యజ్ఞంబునకు విఘ్నంబుగలిగెనేని యజ్ఞకర్త నశించుంగావుననట్లు గాకుండ మీరుసమర్థులై యిమ్మఖంబు శాస్త్రదృష్టవిధానంబుననిర్విఘ్నంగాఁబు బరిసమాప్తి నొందించునట్టిభారంబుఁబూన వలయునని చెప్పిన నయ్యమాత్యు లుమహీరమణుని పలుకుల కలరిభవత్ప్రసాదంబున నెల్లపనులు గొఱంత పడకుండ నిర్వర్తించెద మనిపలికి యతనిచేత ననుజ్ఞాతులై నిజనివాసంబులకుంజనిరి. వసిష్ఠాదిమహర్షులును యథోచితవిధానంబుల నద్దశరథునిచేత నభీష్టపూజలు వడసి యతనినను రూపవాక్యంబులం బ్రశంసించియతనిచేత ననుజ్ఞవడసి తమతమ విడిదులకుంజనిరంత నమ్మహీకాంతుండు సచివుల నందఱ నిజనివాసంబులకుం బోవంబనిచి తానునభ్యంతర మంధిరంబునకుం జని ప్రథమవసంత చైత్రపౌర్ణమాసి యందుసాంగ్రహణేష్టిఁ గావించి రెండవనాఁడు బ్రాహ్మణాచ్ఛాదనంబును నుత్తమాశ్వబంధన ప్రోక్షణ విమోచనాదికంబునుం గావించి ప్రతిదినంబును సావిత్రాదికర్మంబులు సలుపుచుండ సంవత్సరంబుపూర్ణంబగుటయు రెండవవసంతకాలంబుసంప్రాప్తంబయ్యెఁ బ్రథమసంవత్సరాంతిమామావాస్యయందుఁగావింపందగినయుఖాసంభరణత్రైధాతవీయదీక్షణీయాదికంబులునైన దేవయజనంబులునిర్వర్తించిచైత్రపౌర్ణమాసియందు సంతానార్థం బశ్వమేధ యాగంబుఁ గావింపనుద్యుక్తుండై యధ్వర్యుత్వంబునవరింపంబడిన వసిష్ఠునవలోకించి నమస్కరించి పూజించి వినయంబుననిట్లనియె.॥ (సీ) అనఘాత్మ నీవుమా, కనిశంబుసఖుఁడవు గోప్తవుశాస్తవు, గురుఁడవట్లుఁ। గాననే నూరింపఁబూనినయిమ్మహాక్రతుభారమునునీవు, కరుణఁదాల్చి। విఘ్నంబుగాకుండ విధియుక్తినాచేతఁ జేయించినాదువాం,ఛితముఁదీర్పు। మనవుడునమ్మహా, ముని నేతనీచెప్పినట్లుసర్వముఁదీర్తు నను చుఁబలికి॥ (తే,గీ) యజ్ఞకర్మసునిష్ఠితుల యినద్విజుల। ఖనకకర్మాంతికులశిల్ప, కరులనటుల। నర్తకులగణికుల మఖన్యాయవిదుల। వేదవిప్రుల నెల్లరావించి పలికె॥ (వ) మీరు రాజశాసనంబున యాగకార్యంబులన్నియు నిర్వర్తింపుండిష్టకాసహస్రంబులుశీఘ్రంబునం దెండౌన్నత్య విశాలత్వాది బహువిధ గుణసమన్వితంబులైన రాజ గృహంబులు రచింపుండు బహువిధభక్ష్యాన్న పానసమేతంబులుగా వృష్టివాతంబులచేత నప్రకంప్యంబులుగా శుభంబులైన బ్రాహ్మణగృహంబులునిర్మింపుండట్లు పౌరజ



నంబునకు బహుభక్ష్యంబులయి సర్వకామసమన్వితంబులైయుండునట్లుగా ననేకనివాసంబులుగల్పింపుండట్లు జానపదజనంబునకు నుచితనివాసంబులు గల్పించిసత్కరించిసరసపదార్థ సంపన్నంబైనయన్నంబు యథేష్టంబుగాఁగుడువంబెట్టుఁడు వారలనవజ్ఞ సేయవలదుచతుర్విధవర్ణంబులవారికినత్యాదరంబు ననుచితసత్కారసత్కృతులం జేయుండు కామక్రోధవశంబువలననైననవజ్ఞ సేయవలదు మఱియు యజ్ఞకర్మంబునందు పరినిష్ఠితులగు పురుషుల విశేషించివసుభోజనాదిదానంబుల సత్కృతులం జేయవలయు మఱియు నెల్లపనులకుంజాల నేర్పరులయి వర్తింపవలయునని పలికిన వారలందఱువసిష్ఠుండు చెప్పినక్రమంబున సర్వంబునిర్వహించుటకుంజాలియర్హ కృత్యంబులుసల్పుచుండిరంతవసిష్ఠుండు సుమంత్రునిరావించి యిట్లనియె॥ (మ) ధరణీచక్రమునందుఁగల్గిననసమ, స్తక్ష్మాతలాధీశులన్। మఱియుందక్షిణదేశవాసులగుబ్రహ్మక్షత్రవిట్ఛూద్రులన్। నరనాథాగ్రణిశాసనంబున వెస,న్జన్నంబు వీక్షింపఁగా। నరుదారం దగఁ బిల్వ నంపుము సమ,స్తాశావకాశస్థులన్॥ (మ) మిథిలాధీశునిసత్య సంగరుని స,న్మిత్రున్ మనీషాంబుధిన్। విధి సంకాశుని శాస్త్రనిష్ఠితుఁజత్వ,ర్వేదజ్ఞు నుద్యన్మతిన్। ప్రథనోత్సాహువిదేహరాజుజనకే, లానాథుఁదోడ్తెమ్ము శౌ। ర్యధురీణుం డతఁడీమహావిభునకత్యంతప్రియుండౌ రయన్॥ (క) సతతప్రియవాదిని రణ। చతురుని సద్వృత్తు దేవ,సన్నిభుఁ గాశీ।పతిని జగన్నుతశీలుని।నతిరయమునఁదోడితెమ్ము యజ్ఞముఁజూడన్॥(క)నృపశార్దూలునిమామను। విపులపరాక్రమునిఁబరమ, వృద్ధునిధర్మా। ధిపునిన్ గేక యరాజున్। జపలమ్మునఁదోడితెమ్ము,జన్నముఁజూడన్॥ (క) అంగేశ్వరుని మహాగుణ। సంగుని నలరోమపాదు,జననాథుని మి। త్రుంగాంచనగిరిధైర్యుని।సంగతిగాఁదోడితెమ్ముసవనముఁ జూడన్॥ (మ) పరమోదారు లుదాత్తసత్వులు కురుల్, పాశ్చాత్యకోదీచ్యకు।ల్వరుసంబ్రాచ్యులుసింధుమాత్యకులు సౌరాష్ట్రీయ సౌవీరకుల్।మరియుందక్షిణదేశనాథులుజగ,న్మాన్యుల్ బలోపేతులై।తఱుచై వీటికి వచ్చువారలుగసూ,తాసేయుముద్యన్మతిన్॥(ఉ)నావినిసూతుఁడాజటిల,నాథుడుచెప్పినయట్లసర్వధా।త్రీవరులన్ మహామహులధీరులఁ జారులచేతఁగొందఱం।గోవిడుఁడౌటఁదానెసనిఁగొందఱనందఱినందమొందఁగా।క్ష్మావిభుమాటఁదెల్పినరు,సన్నెసఁ దోడ్కొనివచ్చె వీటికిన్॥(క)అంతభవచ్ఛాసనమునఁ। బంతంబునవల

యునట్టి పనులన్నియు నే। మెంతయుఁ దీర్చితి మసిక। మార్గాంతికులరు దెంచి పలికి, ర ష్యునితోడన్ ॥ (చ) పలికిన నాలకించి ముని, పాలుఁడు వారి బహూకరించి సొం। పలరఁగ నిష్మహామఖము, నందపరాధములు గల్గ నేని యు। న్దలఁగక యజ్ఞకర్తకు వి, నాశము చేకురు నట్లుగాన మీ। రలుదగ నిర్వహింపుఁ డప, రాధ మొకింతయుఁ గల్గకుండఁగన్ ॥ (వ) అనిపలికి బహుప్రయత్నంబుల నప్రమాదులై యుండుండని నయ్యాపనుల వెంటం బంచి తానును దగిన చందంబునం బ్రవర్తింపుచుండు నంతఁ గొన్ని వాసరంబులకు యాగోత్సవ సమాలోకన కౌతుకోల్లాసంబున నానాధనరత్నసం

## (*అశ్వమేధయాగంబునకు నానాదేశములనుండి రాజులేతెంచుట*)

చయంబులు పాయనంబులుగాఁ గొని నానాదేశాధీశులందఱుఁ జతురంగ బలపరివృతులై యయోధ్యకుం బఱతెంచిన వారినందఱ నుచిత సత్కారంబులం బ్రీతులం జేసి యథార్హస్థానంబుల విడియ నియమించి మునిశ్రేష్ఠుండగు వసిష్ఠుండు దశరథునకిట్లనియె ॥ (క) నరవర నీశాసనమున। నరపతులందఱును వచ్చినారలు వారిం। బరమప్రీతులఁ జేసితి। సరసత్వముతో యథార్హ సత్కారములన్ ॥ (క) క్షితివర సరయూ తటమునఁ। జతురత శాస్త్రోక్తభంగిఁ, జక్కఁగ యజ్ఞా। యతనము రచించి నారము। వితతంబుగ నెల్లపనులు, వేడుక నయ్యెన్ ॥ (చ) నృపవర జాగు సేయ నిఁక, నేటికి సన్మఖదీక్షితుండవై। నిపుణుల వేదపారగుల, నిర్మలచిత్తులఁ గూడి వేడ్కతో। నుపహృత సర్వకామముల, నొప్పగు నధ్వర శాలఁ జొచ్చి ని। ద్దపుఁ దమి యజ్ఞకర్మము యథావిధిగా నొనరింపుమిత్తఱిన్ ॥ (వ) అనిపలికిన నమ్మహీరమణుండు వసిష్ఠానుమతంబున ఋ

## (*)శ్రీమదశ్వమేధ యాగప్రారంభము. (*)

శ్యశృంగుం బురస్కరించుకొని వసిష్ఠ వామదేవాది మహర్షి సమేతుండై సునక్షత్రంబైన యొక్క శుభదినంబున నానావిధ మంగళవాద్యఘోష స్వస్తివాద పూర్వకంబుగా సరయూతట విరచితంబైన యజ్ఞవాటంబుఁ బ్రవేశించి శాస్త్రంబు నతిక్రమించక కల్పసూత్రానుసారంబుగా యజ్ఞకర్మారంభంబుఁ గావించి హయాగమనంబు గోరుచుండ సంవత్సరంబు పరిపూర్ణంబగుటయు నయ్యుత్తమాశ్వంబు చనుదెంచె నంత వసిష్ఠాది మహర్షులు ఋశ్యశృంగుం బురస్కరించుకొని కల్పసూత్ర ప్రకారంబున మఖకర్మం బాచరింప నుపక్రమించి శాస్త్రోక్తభంగిఁ బ్రవర్గ్యంబు నుపసదంబును గావించి యుపదేశశాస్త్రంబున



కంబైన నికంబైనకర్మం బంతయు నిర్వర్తించి బహిష్పవమానాదుల చేతఁ దత్తత్కర్మదేవతలం బూజించి ప్రాతస్సవనంబుగావించి పదంపడి యింద్రగ్రహనిష్ఠంబైన సోమాంశంబు విధ్యుక్తంబుగా నింద్రున కొసంగి పాపనివర్తకుండైన సోమరాజును స్తోత్రశస్త్రంబుల చేత నభినుతించి యథాక్రమంబుగా మాధ్యందిన సవనంబును దృతీయ సవనంబుం గావించి పాత్రాదిస్ఖలన ప్రభృతి దోషంబులెవ్వియుం గలుగకుండ సర్వంబును మంత్రవంతంబుగా నిర్విఘ్నంబుగా నిర్వర్తించి ॥ (తే, గీ) పరఁగ నయ్యజ్ఞమునఁ గలపాఱులందు। నాతురుండన శ్రాంతుఁడు। శ్రాంతుఁడు పరీక్షితుఁడు విద్యరాని మూఢుఁ। డరసి చూచిన లేఁడొక్కఁడైనఁ గాని ॥ (చ) వరమునులగ్రజుల్ నృపులు, వైశ్యులు పాదజనుల్గ్రమంబునం। దరుణులు బాలవృద్ధులును, దత్క్రతురాజ మహోత్సవస్థితిన్। సురుచిరభంగి బ్రత్యహముఁ, జూచియు స్వాదు రసోచితాన్నముం। జిరశుభలీల నిత్యముభుజించుచుఁ దృప్తి వహింతురెంతయున్ ॥ (శా) అశ్రాంతంబును బ్రోయునమ్మఖమునం, దాలించిరన్ దట్టమై। యశ్రాంతస్ఫుటయాజకోక్తమగు స్వా, హానాదమాత్రావయా। స్తశ్రౌషణ్ణినదంబు తీవ్రముగ వాసోదీయతాందీయతాం। చశ్రౌతౌ దన మానవంబు కృపయా, క్షంతవ్యమన్నాదమున్ ॥ (ఆ, వె) అన్నపర్వతంబు, లాజ్యప్రవాహముల్। భవ్యసూపశాక, భక్ష్యరాసు। లేమి చెప్పవచ్చు, నేకోత్తరశతంబు। లగుచుఁ జూడనయ్యె, ననుదినంబు ॥ (శా) నానాదేశనివాసులైన పురుషుల్, నారీమణుల్నాగరుల్। నానాభంగుల నన్నపాననసువిన్యాసంబులం దృప్తులై। యానందంబున భద్రమస్తు నృపతే, యంచున్ నుతింపంగ రం। బానాదంబు వినంగ నయ్యె పతికిం, బారంగ నశ్రాంతమున్ ॥ (తే, గీ) విప్రవరులకలంకృత, వేషులైన। జనము లిష్టపదార్థముల్, ప్లాలనొసఁగి। రందుఁ గుండల శోభితులైనకొంద। ఱనుసరించిరి వారి సాహాయ్యమునకు ॥ (మ) అనిశంబున్మఖమందు విప్రులు సువేష, ాథ్యాల్ప్రతాలంకృతు। లనదుద్యన్మణి కుండలస్ఫురితులై, కర్మాంతరంబందుఁ బా। యనిపై దుష్యమునం బరస్పర జిగీ, షాయత్తచేతస్కులై। ఘనయుక్తిం బహుహేతువాదములొగి, న్గావింతు రత్యున్నతిన్ ॥ (క) ధరణీసురులమ్మఖమున। నొఱపుగ నానాఁటికిం బ్ర, యోగకుశలురై। గురుమతిఁ గర్మములన్నియుఁ। గరమరుదుగ యుక్తిభంగిఁ, గావించిరొగిన్ (తే, గీ) వెలయ నయ్యజ్ఞము

నంగల, విప్రులందు । నవ్రతుండవాదరతుండను, డంగకోవి । దుండగుణవంతుండబహుశ్రుతుండయోగ్యుం। డనను లిప్తాంగుం డొక్కరుండైన లేండు ॥ (వ) ఇట్లభినవ విభవ విశేషంబున నయ్యాగంబు చెల్లుచుండ నప్పుడయ్యాగశాస్త్రజ్ఞులగు ఋత్విజులు ప్రయోగ కుశలురై యజ్ఞవేదికయందు నడుమ యొక్క శ్లేష్మాతక యూపంబు సంస్థాపించి దాని దక్షిణోత్తర పార్శ్వంబుల బాహుద్వయ మాత్రంబు దవ్వుల రెండు దేవదారు యూపంబులును దాని దక్షిణోత్తరపార్శ్వంబులనంతియదూరంబున నాఱు బిల్వయూపంబులును వాని దక్షిణోత్తర భాగంబుల నంతియదూరంబున నాఱుఖాదిర యూపంబులును దాని దక్షిణోత్తరపార్శ్వంబుల నంతియ దూరంబున నాఱు పాలాశయూపంబులుగాని యేకవింశత్యరత్నిప్రమాణంబులైన యేకవింశతియూపంబులు శాస్త్రోక్తక్రమంబున సంస్థాపించి శోభార్థంబు నొక్కొక్క యూపంబు నొక్కొక్క చేలంబుచే నాచ్ఛాదించి గంధపుష్పంబులచేత నలంకరించిన నమ్మహా యూపంబులన్యూనాతిరిక్తంబులై సుషిరాది దోషవర్జితంబులై యష్టాశ్రయంబులై దివియందు దీప్తిమంతులైన సప్తర్షుల చందంబునం బ్రకాశింపుచుండె నిత్తెఱంగున యూపోచ్ఛ్రియంబుం గావించి శుల్బకర్మంబులయందు నిపుణులైన బ్రాహ్మణోత్తములు యూపసంస్థాపనంబుకంటెం బూర్వంబె కావింపందగిన చయనంబుం గావింప సమకట్టి యథాశాస్త్రంబుగాం బ్రమాణవిశిష్టంబులైన యిష్టకల నగ్న్యాగారవేదియం దుపధానంబుం జేసిన నది స్వర్ణగర్భపక్షంబై యధోగత వీక్షణంబై ప్రాఙ్ముఖంబై యష్టాదశప్రస్తారాత్మకంబై గరుడాకారంబుగా నొప్పుచుండె నంతంబూర్వోక్త యూపంబులందు శాస్త్రానుసారంబుగా నింద్రాదిదేవతల నుద్దేశించి గ్రామ్యపశువులం బంధించి యారోకంబులందు సూకర పన్నగపతత్రి ప్రముఖారణ్యపశువులం బంధించి వేదోక్త ప్రకారంబునం బర్యగ్నికృతంబులైన యారణ్యపశువుల విసర్జించి శామిత్రస్థానంబునందు యాగీయంబైన హయంబును గూర్మాదిజలచరంబులను దదన్యంబైన గ్రామ్యపశుజాతంబును విశసనార్థంబు సంగ్రహించిరిట్లు యూపనిబద్ధంబులైనముమ్నూఱు ప్రధానపశువులను సర్వరత్నవిభూషితంబైన హయరత్నంబును విశసించి రంతం గౌసల్యాదిరాజపత్నులు శామిత్రస్థానంబునందు మృతంబైన హయంబు కడకుం జని సవ్యాపసవ్యంబుగాం బరిచరించి నిరవధికశ్రద్ధచేత సువర్ణముఖంబైన



సూచిత్రయంబున నయ్యశ్వశ్రేష్ఠంబున కసిపథంబులం గల్పించిరంతం గౌసల్య ధర్మసిద్ధినడయంగోరి మృతహయకళేబర స్పర్శ నిందారహితచిత్తయై యయ్యశ్వంబుతోంగూడ నొక్కరాత్రి నివసించె నప్పుడు తత్కాల దక్షిణార్థంబు దశరథుని వలన బ్రహ్మమహిషిని హోతవావాతను నుద్గాత పరివృత్తిని నధ్వర్యుండు పాలాకలిని గ్రమంబునం బ్రతిగ్రహించి భర్తయుంబోలె హస్తగ్రహణంబుం గావించి యద్దశరథుని వలనం దత్ప్రతినిధిద్రవ్యంబుం గొని వారలం గ్రమ్మఱ నతనికొసంగి రంత నధ్వర్యుండు తురంగమవపనాకర్షించి నియతేంద్రియుండై వహ్నియందు ప్రక్షేపణంబుం గావించి శాస్త్రోక్త ప్రకారంబున హోమంబుం జేసె నప్పుడు ॥ (తే,గీ) ధన్యచారిత్రుండైన యద్దశరథేంద్రుం । డొప్పుమీఱంగ నవ్వపా హోమధూమ । గంధమాస్వాదనముం జేసి, కలుషనిచయ । మంతయును బాసి మిగుల గృతార్థుండయ్యె ॥ (క) పదియాఱ్వురు ఋత్విజులింపొదవ హయాంగములు పచన, మొనరించి ముదం । బొదుగ శిఖియందు వేల్చి । పదపడి తచ్ఛేషమర్థిం బ్రాశించిరొగిన్ ॥ (తే,గీ) వసుధలోనన్యపశువుల, వపను బ్లక్ష । శాఖయం దిడి వేల్తురు, శాస్త్రఘణితిం । బరంగ హయమేధమఖమందు, వైతసంబు । మీంద నిడి హోమ మొనరింతు, రాదరమున ॥ (వ) మఱియు నయ్యశ్వమేధంబునకుం జతుష్టోమాత్మకంబైన జ్యోతిష్టోమంబు ప్రథమాహంబనియు నుక్థ్యంబు ద్వితీయాహంబనియు నతిరాత్రంబు తృతీయాహంబనియు నిట్లుం గల్పసూత్రంబుచేతను వన్మూలభూతులైన బ్రాహ్మణుల చేతను బలుకంబడుటవలనం దన్మహాయజ్ఞంబు త్ర్యహంబనంబడు నిట్లుక్తప్రకారంబున నశ్వమేధంబుం గావించి తదంగభూతంబులైన జ్యోతిష్టోమాయురతిరాత్రద్వయాప్తోర్యామాభిజిద్విశ్వజిత్ప్రభృతిబహుయజ్ఞంబులం గావించె నిత్తెఱంగునం దొల్లి బ్రహ్మనిర్మితంబైన యమ్మహాయజ్ఞంబు సాంగంబుగాం బరిసమాప్తి నొందించి ॥ (సీ) హోతకుం బ్రాగ్దేశ, ముద్గాతకుత్తరంబు దార బ్రహ్మకు, యామ్యదేశ । మధ్వర్యునకు వేడ్క, నపరదేశంబును యాగదక్షిణగాంగ, నర్థి నొసంగె । నొసంగిన వారు తాపసుల మైవనమున వర్తించు మాకు నీ, వసుధ యేల । మనుజేంద్ర నీకుం గ్రమ్మఱ విక్రయించెద మావుల స్వర్ణ రత్నాదికముల ॥ (తే,గీ) నిచ్చి కైకొని సంప్రీతి, నేలు మనినం । గోటిగోవుల మఱిపది, కోటిమణులం । గాంచనం బొకశతకోటి, గరిమ నొసంగి । ధాత్రిం గ్రమ్మఱం గొని యేన, దశరథుండు॥ (వ) అంత నాఋత్విజులందఱు యాగదక్షిణార్థంబు లబ్ధంబైన ధనంబంతయు వసిష్ఠఋష్యశృంగులకు సమర్పిం

చిన సమ్మహాత్ములు యథాశాస్త్రంబుగా విభాగించి ఋత్విజుల కందఱకు వేఱ్వేఱ
నొసంగిన బ్రతిగ్రహించి యేమందఱము సంతుష్టాంతరంగులమైతిమని పలికి యి
మ్మునిపుంగవులం గొనియాడి రంత సమ్మహీరమణుండు యజ్ఞదర్శనార్థంబు
సమాగతులైన బ్రాహ్మణులకు జంబూనదీప్రభవంబైన హిరణ్యం బొక్కకోటి
యొసంగి హస్తాభరణంబులఁ గోరిన దరిద్రులైన యాచకులకు హస్తాభరణంబు లొ
సంగి వారలందఱు సంప్రీతు లగుచుండ దాను హర్షపర్యాకులేక్షణుండై
భక్తిపూర్వకంబుగా నందఱకు దండప్రణామంబుఁ జేసిన॥ (ఆ,వె) అభిమతార్థసి
ద్ధి, రస్తు తే భూపతే। రాజశేఖరాయ, రాఘవాయ। యనుచు బ్రాహ్మణగతుల, నాశీ
ర్వదించిరా। ధరణిదివిజు లెల్లఁ, గరుణ నృపుని॥ (ఆ,వె) దురితహరము గీర్తికరము
న్వరాజదు। ష్కరము స్వర్గసౌఖ్య, కరము నైన। మఖముఁ జేసి రాజు, మహనీ
యచరితుఁ డా। ఋశ్యశృంగమౌని, కిట్టు లనియె॥ (క) అనఘాత్మ మీప్రసాదం।బు
న యజ్ఞము పరిసమాప్తిఁ, బొందె నిఁక ముదం।బున వంశవర్ధనుండై। తనరారె
డునట్టి సుతుని, సయ సేయు మొగిన్॥ (ఉ) నావిని యత్తపస్వికుల, నాథుఁడొకిం

(*) ఋశ్యశృంగముని పుత్రకామేష్టిఁ జేయ నారంభించుట. (*)

చుక సేపు ధ్యానని। ష్ఠావశుఁడై పదంపడి ర, సాపతి కిట్లను నీమనంబునం। భావ
రచింత సేయకుము, పుత్రచతుష్టయ ముద్భవించు నీ। కావిధమంతఁ గాంచితిఁ ద,
దర్థముగా నొక యిష్టిఁ జేసెదన్॥ (వ) అనిపలికి సమాహితచిత్తుండై యతీంద్రి
యార్థదర్శి యగు నమ్మునిపుంగవుండు వహ్నిప్రతిష్ఠాపనంబుఁ జేసి యాథర్వణో
క్తప్రకారంబున మంత్రప్రకాశితకర్మంబగు హోమంబు గావింపఁదొడంగిన నప్పు
డు భాగప్రతిగ్రహార్థంబు దేవర్షిగంధర్వసిద్ధవిద్యాధరాదు లచ్చటికిం జనుదెం
చి యంతకు మున్న మానిమంత్రబలాహూయమానులై చనుదెంచి యున్న లోక

(*) పుత్రకామేష్టియం దాహూతులగు దేవతలు బ్రహ్మతో మొఱలిడుట. (*)

కర్త యగు విరించి నవలోకించి యిట్లనిరి॥ (సీ) వాణీమనోనాథ, వాసవవందిత
లోకనాయక భక్త, లోకవరద। మును మీ రొసంగిన, ఘనవరంబునఁ జేసి రావణుండని
యెడు, రాక్షసుండు మత్తుఁడై ఘనబలో, ద్వృత్తుఁడై నిత్యంబు లోకత్రయంబుఁ జీ
కాకుఁ జేసి। శక్రాదిసకలది, క్పాలకులఁ దోలి గంధర్వ యక్షుల, గాసిపఱచి॥
(తే,గీ) ద్విజుల హింసించి తపసుల, వెదకి చంపి। సురల బాధించి జన్నము, ల్చెఱచి
సిద్ధ। సాధ్యవిద్యాధరాదుల, సమయఁ జేసి। కన్నుఁ గానక వర్తింపుచున్న వాఁడు॥



(చ) పవనుఁడు వీవనోడె సిత, భానుఁడు వెన్నెలగాయనోడెనా। రవితపియిం
పనోడె జల, రాసులుపొంగి చెలంగనోడె మృ। త్యువు దలఁజూపనోడె విభ,
వోన్నతిఁ జూపఁగనోడె శక్రుఁడున్। భువనభయంకరస్ఫురణఁ, బొల్చు దురం
తదశాస్యధాటికిన్॥ (చ) అసురుల చేత బాధితుల, మైపను లన్నియు మాని రేప
వ। ల్దెస చెడి భీతిఁ జేయునది, లేక తపింపుచు నున్న వారమో। యసురవిరోధ
నందనద, యాహృదయా మము నాదరించి వాఁ। డసువులకుం దొలంగిచను,
నట్టి యుపాయముఁ జింతసేయవే॥ (మ) అనియిట్లాసురకోటి వల్కనను కం,
పాయత్తచేతస్కుఁడై। వనజాతాసనుఁ డంతఁ గొంత యడి భా, వంబందు యో
చించియ। మ్మనుజాంధఃప్రభుఁ డీల్గునట్టి విధముం, బాటించి యూహించి ప
ర్విన మోదంబున వారి కిట్లనియెఁ బ్రా, వృట్కాల మేఘార్భటిన్॥ (మ) వినుఁ
డో నిర్జరులార మున్న తఁడొగిం, బెక్కేండ్లు నన్నార్చి కా। ననభూమిం గడు
ఘోరనిష్ఠఁ దపముం, గావించి మెప్పించి చా।య్య నగంధర్వవిహంగచారణమరు,
ద్యక్షోరగశ్రేణిచే। ననిలో నాశము నొందకుండ వరమొ, య్యంగొన్న వాఁడెం
తయున్॥ (ఉ) కావున రావణుం గెలువఁ, గా సమకూడదు మీక తండు నా। చే
వరమందునాఁడు మఱచెన్న రవానరజాతిచే ననిం। జావని యవ్వరంబడుగ,
సంభ్రముఁడై యటుగాన వాఁడిఁకం। జేవదలిర్చు మానవుని, చేతను గాని
యడంగఁ డెంతయున్॥ (క) ఇంతటిపని సాధింపన। లంతులచే నగునె శరధి
రాజకుమారీ। కాంతునకుఁ గాక మనకిఁక। నింతవిచారం బిదేల, హితమతు
లారా॥ (క) కరుణారతు శరణాగత। భరణోచితు నఖిలభువన, పాలనదీక్షా।
చరణోద్ధతు దనుజాహితు। శరణముఁ గొనిమనుట యొప్పుఁ, జాలఁ దలంపన్॥

(*) బ్రహ్మాది దేవతలకు శ్రీనారాయణుండు పొడసూపుట (*)

(వ) అనిపలుకుచున్న సమయంబున॥ (సీ) బుధజనకులవనం, బులుపల్లవింపఁ జే
యుటఁ మాధవ, స్ఫూర్తి నొనరఁ గాంచి। కొమరొప్పనతలోక, తమముఁ బాయఁ
గఁ జేయు కతన విధుండనా, ఖ్యాతివడసి। సాధుమానస సరో, జము వికసింపఁ
జేయుటఁ జేసి హరియను, నుతిఁ బూని। భూరివిశ్వంభరా, భారంబుఁ దాల్చుట
వలన ననంతాఖ్య, వాసికెక్కి॥ (తే,గీ) గదయు శంఖంబు చక్రంబు కౌస్తుభంబు।
రమయు నందక శ్రీవత్స, లాంఛనములు। శార్ఙ్గ వనమాలికలు హైమ, చారుపట
ము। మేన దీపింప భార్గవీ, జానిదోఁచె॥ (క) ఈవిధమునఁ బొడసూపిన। శ్రీ

వల్లభుఁగాంచివినతిఁ జేసిప్రమోదం । బావహిలశక్రవిధముఖు । దేవతలిట్లనిరిఘ

(*) దేవతలు శ్రీనారాయణునికి తమబాధలనెఱింగించుట. (*)

లదీప్తాంజలులై ॥(శా) దుష్టాత్ముండగురావణుండనెడునా,దోషాచరాధీశ్వరుం ।
డష్టాశేంద్రులఁబాఱఁదోలిదివిష,ద్యక్షోరగాదుల్ మహా।కష్టంబంచుఁదపింపఁ జుం
బఱవను,గ్రస్ఫారదోస్సారుఁడై।శిష్టాచారవిహీనుఁడైజగములం, జీకాకుఁజేసెన్ర
హిం ॥(సీ) రమణీయనందనారామదేశంబులవిహరింపమఱచిరి, వేల్పుచెలులు।పస
నీఱమిన్నేటి,యిసుకతిన్నెల వేడ్కఁగ్రీడింపవెఱచిరి, కింపురుషులు । నధ్వరంబు
లయందు , నర్హభాగంబులఁగైకొన వెఱచిరి, నాకివరులు ।చటులమణిప్రభో,
జ్జ్వలవిమానము లెక్కి తిరుగంగ వెఱచిరి, పరమసిద్ధు ॥ (తే,గీ) లఖిలదిగధీశ్వరు
లుభీతి,యావహిల్లఁ। దివిరిపురముల వాకిళ్లఁ, దెఱవవెఱచి। రేమి చెప్పుదుమయ్య
ర,మేశమీకు । దానవేంద్రు నిరాఘాట, ధాటిఁ జూచి॥ (మ) వనజాక్షా మునుమీరు
సత్కరుణ న, స్వాప్నత్వమున్ సంతతం।బనిమేషత్వమొసంగినందునమహా,త్మా రే,
పవల్లానిరా । కనిరీక్షించి మొఱంగిపాఱి చని వీఁ,కన్నంటి మబ్బంగి మా । క
న్నువైతోడ్పడకుండినంగలదె దే,వా ప్రాణమిన్నాళ్లో గీ ॥(శా) సామాన్యేతరభం
గిఁబేర్చియనిలోఁ, జంపంగ నీవోపితే । నేమో కాని దురంతదుస్సహఘనా,హీ
నస్ఫురద్ఘోరసం । గ్రామపరిస్ఫుట బాహుశౌర్యమున లీ, లం గ్రాలువానిన్సమి ।
ద్భూమి న్నేము వధింపఁజాల మసురేం,ద్రుని మాట లింకేటికిన్ ॥ (క) అనిశంబు
మేలు మేలని । సనకాదులు వొగడరాత్రి! చరవిభునిదశా । స్యునిదునిమిము
జగంబులఁ । బ్రణుతగుణాకరుణ వెలయ? రక్షింపఁగదే ॥ (చ) అనిసురలాడి

(*) దేవతలు శ్రీనారాయణునికి రావణవధోపాయంబుఁ దెల్పుట. (*)

నన్విని ర, మాధిపుఁడిట్లను సాధురక్షణం । బునుమఱిదుష్టశిక్షణము, పొల్పు
గమాకు నిసర్గధర్మమిం। తనఁబనిలేదు మీరు సుగుణాకరులార రణంబునర్
దశా । ననునివధించిమీకు భువ, నంబులకుం గడుమేలు సేసెదన్ ॥ (క) సం
దియమువిడిచిరణమున । నందముగావానిఁజంపు, నట్టియుపాయం । బందఱు
యోచించిరహిం । డెందము రంజిల్ల మాకుఁ దెలియం జెపుడీ ॥ (చ) అనవి
ని నిర్జరప్రవరు, లామధువైరికి విన్నవించిరో । ప్రణుతగుణా సుదర్శనధ,
రాసకలజ్ఞుఁడవీవుమమ్ముఁజ । య్యానసదుపాయం దెలుపుఁ, డంచు వచించుటచా
లఁజిత్రమై । ననుమదిఁదోఁచినంత యుఘనం బుగఁ దెల్పెద మాలకింపవే॥



(శా) దేవాతొల్లి విరించిఁగూర్చి హఠము,ద్దీపింపఁబ్రక్కేండ్లునా। దేవారాతితపం
బుసల్పుటయు న, ద్దేవుండు తా వచ్చిత । త్పా వీణ్యంబున కిచ్చ మెచ్చి కృప
సాం, పారన్వరంబిచ్చెద । న్నావాక్యంబదె నమ్మి ఘోరతపమున్, దైత్యేంద్ర
చాలింపుమా ॥(వ) అని పలికిననద్దశముఖుండు సుధారసోపమంబైనయరవిం
దగర్భునివచనంబుల కలరి తపంబు సాలించినమస్కారంబుఁగావించి యంజలిఁ
గీలించి యోగమసూక్తులం బ్రస్తుతించి మహాత్మానాయందుఁ గృప కలదేని మ
నుష్యులవలనం దక్కఁదక్కిన సమస్తభూతంబులవలనంజావు లేకుండ వరంబుఁ
గృపసేయు మని యడిగిన నప్పరమేష్ఠి యట్లయగుం గాక యని పలికి యంత
ర్ధానంబుఁ జేసెనిత్తెఱంగున నద్దైతేయవల్లభుండు మనుజులుహీనబలురనిత
లంచి సరకుఁగొనక వారిని నిరాకరించి తక్కిన వారివలన మృత్యువు లేకుండ
వరంబు వడసి వీర్యదర్పితుండై యవక్ర పరాక్రమంబున ముల్లోకంబుల నాక్ర
మించి సమస్తభూతంబులబాధింపుచు విశేషించికామవ్యసనంబునఁ బాపం బ
ని తలంపక పుణ్యాంగనలం జెఱపట్టుచున్నవాఁ డప్పాపాత్ముని మనుష్యావతా
రంబునం గాని తక్కినయవతారంబులచేత వధింపఁగూడదు కావున మీరుమ
నుష్యరూపంబుననవతరించి రావణునివధించి లోకంబులకుఁ బరమకల్యాణంబు
సంపాదింపవలయునీవే గతి యనిశరణాగతులమై మొఱలిడుచున్న మమ్మురః
క్షింపవేయని యభ్యర్థించిన నవ్విరించిగురుం డుదంచితకరుణాకటాక్షవీక్షణం

(*) శ్రీనారాయణుఁడు దేవతలక భయదానం బొసంగుట. (*)

బుల నిరీక్షించి వారికిట్లనియె ॥(చ) అనిమిషులార మీరలిప్డు, డాడినకైవడిమా
నుషాకృతిన్ । దనుజునిఁజంపి మీకుఁబ్రమ, దం బొనఁగూర్చెద నెందుఁబుట్టుదుం।
జనకునిఁగాఁగ నెవ్వనిఁబ్ర,సన్నమతి న్వరియింతు నేక్రియం। దనరుదు నెన్నిరూ
పములు,దాల్పుదునింత యెఱుంగఁ బల్కుఁడీ। (ఉ) నావినినిర్జరుల్ కమల, నా
భునికిట్లనిరయ్య సర్వగో । త్రావరమౌళిరత్నరుచి, రంజితపాద సరోరుహుండ
యో । ధ్యావిభుఁడార్యుఁ డాదశర, థావనినాథుఁడు పుత్రకాముఁడై । వావిరిదీ
క్షఁ గైకొనిహ,వం బొనరింపుచునున్నవాఁడిలన్ ॥ (శా) సుశ్రావ్యస్ఫుట వీరశబ్ద
ధరుఁడై, శోభిల్లు నాతేనికిన్ । హ్రీంశ్రీకీర్త్యుపమాన లైకలరునా ,రీరత్నముల్
మువ్వరు। గ్రశ్రోతవ్యలువారియందుఁజతురాకారంబులంబుట్టి దైత్యశ్రేష్ఠు నవధి
యించి సత్కరుణ దేవా మమ్మురక్షింపవే ॥ (వ) అని విన్నవించినవిని సర్వలోక

నమస్కృతుండగు నాసుదర్శనధరుండు సంపూర్ణమనోరథుండై కరుణాతరంగితాపాంగవీక్షణంబు లొలయం బురందరాదిబృందారకులం జూచి మీరు వెఱవవలదు మీచెప్పినక్రమంబున నిద్దశరథునకు నాల్గురూపంబుల నవతరించి యొక్కరూపంబున సబాంధవుండైన రావణుని నొక్కరూపంబున నింద్రజిత్తు నొకరూపంబున గంధర్వుని నొక్కరూపంబున లవణుని సంగ్రామరంగంబునం బరిమార్చి లోకంబున కత్యంతసంతోషంబు సంపాదించి పదునొకొండు వేలవత్సరంబులు రాజ్యంబుం జేసి కృతార్థుండనై క్రమ్మఱ మదీయదివ్యస్థానంబునకుం జనియెద నని యభయదానంబొసంగి బృందారకసందోహవంద్యమానుండును గంధర్వగీయమానుండును సనందనాదిమహాయోగిసేవ్యమానుండును నై యప్పరమపురుషుం డంతర్ధానంబుం జేసె నంత మహేంద్రప్రభృతిబృందారకులు యాగభాగంబులం బరితుష్టులై రావణునివలని భయంబు వదలి పితామహుం గొల్చి నిజనివాసంబులకుం జని రంత॥(తే,గీ) పుత్రకాముండై దశరథ, భూవిభుండు । ఋశ్యశృంగుండు

—(*)ప్రాజాపత్య పురుషుండు దివ్యపాయసంబు దశరథున కొసంగుట.(*)—

చెప్పిన, రీతి నియతి । గ్రాలఁదగుభంగి వేదమంత్రముల చేతఁ దవిలి హోమంబుఁ గావించు, నవసరమున॥ (సీ)కంజాతసఖసమా, కారంబుగలవాఁడు జ్వలితాగ్ని, శిఖిభంగిఁ జెలఁగు వాఁడు । రమణీయతరకృష్ణ, రక్తాంబరమువాఁడు తామ్రమయూఖవ, క్త్రంబువాఁడు । సముదగ్రదివ్యభూ, షావిశేషమువాఁడు కమనీయశుభలక్ష, ణములవాఁడు । శైలశృంగముమాడ్కిఁ, జాల నొప్పగు వాఁడు ప్రబలశార్దూలవి, క్రమమువాఁడు॥(తే,గీ)బలము వీర్యంబు, తేజంబుగలుగువాఁడు।దివ్యరూపంబు వాఁడు ప్రదీప్తకనక । వర్ణముల వాఁడు దుందుభి, స్వనమువాఁడు । చారు సుస్నిగ్ధఘన శిరో, జములవాఁడు ॥ (తే,గీ) నిరుపమాన ప్రభావుఁడు, పురుషుఁ డొకఁడు । దివ్యపాయస సంపూర్ణ, దీప్తకనక । రాజితాంతఃపరిచ్ఛద, రమ్యపాత్రిఁ । గాంతనుంబలె బాహులఁ, గదియఁ బట్టి॥ (క) ఘనయాగదీక్షఁ గైకొని । తనయుల వడయంగఁ గోరి, తప్పక హోమం । బొనరించుచున్న నరపతిఁ । గని ప్రాజాపత్య పురుషుఁ, గాననుఁ గను మా ॥ (క) అనవిని యద్భుతరూపం । బునఁ గ్రాలెడు యజ్ఞపురుషుఁ, బొడగని నృపుఁడి । ట్లనుఁ గేలు మొగిచి దేవా । పనియెయ్యదినాకు ఘనకృ, పం దెలుపఁగదే॥ (వ)అనిన నాప్రాజాపత్యనరుండు క్రమ్మఱ నమ్మహీపతికిట్లనియె ॥ (ఉ). భూవ



రనీవొనర్చుఘన, పూజలు కూర్మిఁ బ్రతిగ్రహించియు । దేవతలెల్లమెచ్చి తమి, దీరఁగనీకు నొసంగుమంచునా । చేవర దివ్యపాయసముఁ, జెచ్చెరఁ బంపఁగఁ దెచ్చినాఁడ సొం । పావహిలం బ్రజాకరము, నయ్యెడు దీనిఁ బ్రతిగ్రహింపుమా ॥ (తే, గీ) ధన్యమారోగ్యవర్ధన, మన్యదుర్ల । భంబునగుదీని నీకూర్మి, పత్నులకు నొ । సంగుమన్నైన వారుకాం, క్షఁగొని మెసవి । కడుముదంబునఁ గొడుకులఁ గాంతురనఘ ॥ (వ) అనిపలికి యద్దివ్యపురుషుండు దేవాన్నసంపూర్ణంబైన హిరణ్మయకలశంబొసంగినం గైకొని యద్దశరథుండు నిర్ధనుండు ధనంబు నొందినచందంబునం బరమానందచేతస్కుండై ప్రియదర్శనంబైన యయ్యద్భుతభూతంబునకు భక్తిపూర్వకంబుగాఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి తన్నుఁ గృతార్థునింగాఁ దలంచుకొనుచుఁ దనయనుమతంబున నమ్మహాభూతం బంతర్ధానంబుఁ జేసిన యనంతరంబ యజ్ఞకర్మంబు సాంగంబుగా నిర్వర్తించి సాదరంబున నప్పాయసకలశంబు శిరంబున నిడికొని పత్నీసమేతంబుగా నంతఃపురంబుఁ బ్రవేశించి శారదాభిరాముండగు చంద్రుండు నిజకరంబులచేత నభంబునుంబోలె నిజానందరశ్ములచేత నయ్యంతఃపురంబును బ్రకాశింపఁజేయుచు దేవదత్తంబు యమృతోపమానంబైన యమ్మహనీయ పాయసాన్నంబు దైవచోదిత బుద్ధిం జేసి ప్రత్యేకంబుగా విభాగించి ॥ (తే, గీ) సగముఁ గౌసల్యకొసఁగియా, సగములోన । స

(*) దశరథుండా దివ్యపాయసంబు విభజించి భార్యలకొసంగుట. (*)

గము లసుమిత్రకొసఁగియా, సగములోన । సగముఁ గైకేయికొసఁగి ప్ర, సన్నదృష్టి । మిగిలిన సగంబు మఱల సు, మిత్రకొసఁగె ॥ (క) ఒసఁగిన నయ్యమృతాన్నము । మెసవి మిసిమి పసలు పొసఁగ, మెల్లనఁ దగనా । కిసలయపాణులు మువ్వురు । వెసఁ దాల్చిరి గర్భములఁ బ్ర, వీణత మెఱయన్ ॥ (ఉ) ఆరఘువంశవర్యుఁ డపు, డయ్యలనాగల గర్భచిహ్నముల్ । వారకఁ జూచి చిత్తమున, వారని కౌతుక హర్ష రాగముల్ । గూరఁగ నన్యకార్యములఁ, గూడక రేపవలొక్కరీతినా । దారలఁ గూడి చెన్నలరెఁ, దారలఁ గూడిన రాజు కైవడిన్ ॥ (వ) మఱియు నారూఢగర్భలై యారాజపత్నులు హుతాశనాదిత్యసమానతేజులై యభూతపూర్వ శోభావిశేషంబున నలరిరా దశరథుండు సురేంద్రసిద్ధర్షిగణాభిపూజితుండైన హరిచందనంబునం దేజరిల్లుచుండె ॥ (తే ,గీ)ఇ

ట్లునారాయణుఁడు దేవ, హితముకొఱకు ॥ నుర్వివిభునకపత్యత్వ, మొందుచుం
డె । సకలలోకేశ్వరుండైన, జలజగర్భుఁ । డఖిలదివిజులఁగూర్చి యి, ట్లను

(*) బ్రహ్మ దేవతల వనచర యోనులఁ బుట్టనియోగించుట. (*)

చుఁబలికె ॥ (చ) మనకుహితంబు సేయుటకు, మాధవుఁ డుర్విజనింపుచున్నవాఁ ।
డనిమిషులార యవ్విభున, కాజిసహాయ మొనర్పఁగా రహిన్ । మనమును ధాత్రిఁ
బుట్టనగు, మానక ఋక్షవనాట యోనులం । దనువుగ వీర్య వంతులగు, నట్టి
వలీముఖులన్ సృజింపుఁడీ ॥ (వ) మఱియు బలవంతులును గామరూపులును
మాయావిదులును గరుడానిల తుల్యవేగులును శూరులును నయజ్ఞులును బుద్ధి
సంపన్నులును విష్ణుతుల్యపరాక్రములును నుపాయజ్ఞులును దివ్యదేహాయుక్తులు
ను దుర్జయులును సర్వాస్త్రసంయోగసంహారాది గుణయుక్తులును నమృత
ప్రాశనులునగు భల్లూక గోలాంగూలవానరుల యక్షగంధర్వ పన్నగ సిద్ధవి
ద్యాధర కిన్నరాప్సరఃకాంతలయందు మీమీయంశంబుల వేఱ్వేఱ సృజింపుఁడు ॥
(తే, గీ) సృష్టి నింతకు మున్నె నా, చేత సృష్టుఁ । డయ్యె జాంబవంతుండు ఋ,

(*) దేవతలు వనచరయోనులఁ దత్తన్నామంబు నవతరించుట. (*)

క్షాధినాథుఁ । డతఁడు కడుజృంభమాణుండ, నైననాఁడు । ముఖమువలన జనిం
చెస, ముత్సుకమున ॥ (చ) అనినయమారఁ బద్మభవుఁ, డాడిన నట్లొనరింతు
మంచున । య్యనిమిషవర్యులందఱుని, జాంశములన్ సృజియించిరాధ్యులన్ ।
ఘనతరసింహవిక్రముల, గ్రావసమానుల నాత్మతుల్యులన్ । వనచర వీరులన్
బలవివర్ధనులన్ భువనప్రసిద్ధులన్ ॥ (చ) పొలుపుగ శక్రునంశమునఁ, బుట్టెఁ
బ్రతాప జితాంశుమాలిదో । ర్బలపరిపాలితాగచర, పాళిదురంతనితాంతవి
ద్విష । త్కులవనకేలిహైమశీత, తోయజమాలియనారతాజిని । శ్చలజయశీ
లివాలిదివి, షద్గణసన్నుతశౌర్యశాలియై ॥ (క) ఉగ్రకరునంశమున విపులగ్రీ
వుఁడు లోకభీక, రస్ఫుటరిపువం । శగ్రావ ఘనశతారుఁడు । సుగ్రీవుఁడుపుట్టెఁ
బూర్ణ, సోమునిభంగిన్ ॥ (క) ధీరుఁడు శూరుఁడు వీరుఁడు । తారుఁడు కీర్తి
జితవిమల, తారుఁడు సుగుణో । దారుఁడు నరాతిలోచన । ఘోరుఁడు జన్మించె
దేవ, గురు నంశమునన్ ॥ (ఆ. వె) అవనిఁ గిన్నరేశు, నంశంబున జనించె । జగ
ములోకక్షభంగి, సన్నుతింప । దైత్యసూదనుండు, ధైర్య నిర్జిత గంధ ।
మాదనుండు, గంధమాదనుండు ॥ (తే ,గీ) విశ్వకర్మాంశమునఁ బుట్టె, వీర



లోక । నుతబలుఁడు భూరిశౌర్యని ,ర్జితబలుండు । సంతతౌదార్య ముఖగు
ణో, జ్జ్వలుఁడు కీశ । కులుఁడు రిపువంశవనదవానలుఁడు నలుఁడు ॥ (క) వాలాయ
మువినుత మహో । కాలుఁడు దుర్మదవిపక్ష, కాలుఁడు ఘనవా । గ్జాలుఁడు జగదభి
నుతరణ । శీలుఁడు నీలుఁడు జనించె శిఖియంశమునన్ ॥ (క) బృందారక కుల
వైద్యులు । పొందుగఁ దమ యంశములను బుట్టించిరి య । స్పంద పరాక్రమ
వంతుల । మైందద్వివిదు లనువారి, మర్కటవరులన్ ॥ (తే, గీ) ఘనబలుఁడు
సింధుపతియంశ, మున జనించె । నలసుషేణుఁడు వనచర, కులవరుండు । జ
వవినిర్జిత శరభుండు' శరభుఁడనెడు । వనచరవరుండు పర్జన్యు, వలనఁ గలిగె ॥
(ఉ) అంతఁ బ్రభంజనాంశమున, నద్భుతభంగి సమిన్నయాకర । స్వాంతుఁడు
నీతిమంతుఁడతి శాంతుఁడు వైరికృతాంతుఁ డుర్సుధీ । మంతుఁడు వీర్యవంతుఁ
డుస మంచితవిక్రమవంతుఁ డాహనూ । మంతుఁడు గల్గె సర్వసుర,మానిత చర్య
లనార్యధుర్యుఁడై ॥ (క) సురగంధర్వ భుజగఖే । చరకిన్నర సిద్ధసాధ్య, చా
రణవిద్యా । ధరమరుదంశంబులఁగ । ల్గిరి పెక్కండ్రు ఘనబలురు, కీశశ్రేష్ఠుల్ ॥
(తే, గీ) ఋక్షగోపుచ్ఛ వానర; స్త్రీత్వమొంది । నట్టిగంధర్వచారణ, యక్ష
సిద్ధ । పుణ్యసతులందుఁ గీశగో, పుచ్ఛభల్ల । వరులఁ బుట్టించిరఖిలదే, వతలు
ప్రీతి ॥ (క) ఏ వేల్పున కేరూపం । బే వేషం బట్టిశౌర్య, మెసఁగఁ బొసఁగునా ।
దేవుని తనయులకలవడె । నా వేషం బట్టిరూప; మా శౌర్యంబున్ ॥ (తే, గీ)
సమదగజశైలసంకాశు, లమిత బలురు । వీర్యధనులు విక్రాంతులు, వేగవం
తు । లసఘులు ప్రతాపవంతులు, ఘనులు వలయు । నట్టిరూపంబుఁ గొన నే
ర్చు, నట్టివారు ॥ (క) ఇతరేతరానురక్తులు । చతురులు సకలజ్ఞులాజి, సంసక్తులు
ను । ద్ధతిరిపులనోడవశక్తులు । మతియుక్తులు మంజు మధుర,మానితసూక్తుల్ ॥
(సీ) శరధినాథుని దాఁటఁ, జాలుదు రతిజవ గరిమచే గాంభీర్య, గరిమచేత ।
బిఱుసుకొండలు నైనఁ బ్రకలింప నేర్తురు బలము చేధీరత్వ, బలముచేత । మి
హిరాంశుధరునైన, మెప్పింపఁగలరు దోశ్శక్తిచే ఘనతప, శ్శక్తిచేత । హరినైన
నమీఖ నే, ర్తురు భూరిలాఘవ మహిమచే ఘనదీప్తి, మహిమచేత ॥
(తే,గీ) రూప వంతులు చటులప్ర, తాపనిధులు । పృషపాషాణనఖదంత, హేతు
లుగ్రు । లఖిలదివ్యాస్త్రకోవిదు, లమితయశులు । మేఘగంభీరఘోషు ల,మోఘ
బలురు ॥ (వ) మఱియు నప్రమేయపరాక్రములును బహువిధ సంస్థానవ్యంజనల

ఋణోపేతులును మేఘబృందాచలకూటకల్పులును యుద్ధకర్మవిశారదులునుదు
గ్రాకాంతారద్వీపసంభవులును శతసహస్రాయుతనియుతప్రయుతార్బుదసం
ఖ్యాతులును నైపుడమియీనిన తెఱంగున నిఖిలజలధివలయితమహీమండలంబె
ల్లనిండి మెండుకొని ప్రచండపరాక్రమంబునం గ్రాలుచు॥ (ఉ) కొందఱు శక్రనం
దనుసేఁ, గొందఱు పంకజమిత్రపుత్రునిం। గొందఱు మారుతాత్మజునిఁ,
గొందఱునీలునిఁ గొంద ఱానలుం। గొందఱు తారముఖ్యులను, గొల్చి హిమా
చలమందుఁ గొందఱుం। గొందఱు మేరుముఖ్యగిరి, కూటముల న్వసియించి రెం
తయున్॥ (తే,గీ) ఋక్షగోపుచ్ఛవానర, శ్రేణికెల్ల। నాథుఁడై నిర్జరకులేం
ద్రనందనుండు। వాలి తనతండ్రి గీర్వాణపాళిఁ బోలెఁ। బ్రీతి భుజగర్వగరిమఁ
బ్రాలింపుచుండె॥ (వ) అంతనిక్కడ నయోధ్యాపురంబునందుఁ బూర్వోక్తప్ర
కారంబున హయమేధంబు పరిసమాప్తినొందుచుండ దేవతలందుహవిర్భా
గంబుఁ గొని నిజనివాసంబులకుం జనిన యనంతరంబున నద్దశరథుండు స
మాప్తదీక్షానియముండై సుహృదమాత్యబాంధవబలవాహనంబులఁ గూడి ప
త్నీగణసమేతంబుగాఁ బురంబుఁ బ్రవేశించి యజ్ఞదర్శనార్థంబానీతులైన నా
నాదేశాధిరాజుల నెల్ల యథార్హసత్కారంబులం బూజించిన వారు సంతు
ష్టులై వసిష్ఠునకు నమస్కరించి తమయట్లవస్త్రాదిదానంబులచేత సంతుష్టం
బులయినబలంబులం గూడి నిజదేశంబులకుఁ జనిరి యనంతరంబ యమ్మహీరమణుం
డు శాంతాసహితుండయిన ఋశ్యశృంగుని బహువిధపూజలందనిపిన నమ్మహర్షి
పుంగవుండు సంతుష్టాంతరంగుండై యంగపతియైన రోమపాదునిచేత నా
హూయమానుండై పత్నీసమేతంబుగా నతని వెంటఁ జనియె నిత్తెఱంగున సక
ర్వజనంబుల యథార్హసత్కారంబులఁ బ్రీతచేతస్కులం జేసి స్వదేశంబులకుం
బనిచి దశరథుండు పుత్రోదయంబుఁ గాంక్షింపుచు సుఖంబుండె నంత॥ (క)
పంతంబున దశరథభూ। కాంతుని కాంతామణులకు, గర్భంబులునం। తంతకుఁ
దరమెదుగఁగ నా। వంతనడుము లెంత బటువు, లై తనరారెన్॥ (సీ) నాగేం
ద్రయానల, నడలు మందములయ్యెఁ బదపడి రుచికోర్కి, బహుళమయ్యె।
గండరేఖలు, పాండు, డిండీరరుచిఁ బొల్చెఁ గమ్మనిట్టూర్పులు, గ్రమ్మసాగె। ల
లిముద్దుమోములఁ, గళలయింపులు దేఱెఁ దెలివాలుకనుడాలు, తేటయెసఁగె।
ముసమూరఁ జూచుకంబుల నల్పు రెట్టించె వళులునా నాఁటికి, వన్నెకెక్కె-



(తే,గీ) రుచిరమేచకరుచిఁ బొల్చె, రోమరాజి। నాదమంతంతకెలమిమం-చత
వహించెఁ। బేదకౌనుల మొలనూలు, బిగువుఁ జెందెఁ। బలుచమేనులకొక్కవింత,
పసలు గలిగె॥ (తే,గీ) పూర్ణగర్భలగుచు నా, పుష్పగంధు।లతివిశదకాంతి
నలరారి, రద్భుతముగఁ। గలువపూఁ జేనిగర్భంబు, నలరఁ దాల్చి। వఱలు ప్రా
చీదిశాంగన, యొఱపుఁ దెగడి॥ (క) నెలలంతంతకు డగ్గర। నలసటలందఱు చు
నిగుడ, నభినవగతి నా। పొలఁతుకలకు నా నాఁటికి। నలవడ నీల్లాడఁ బ్రొద్దు, ల

—(*)శ్రీరామావతారఘట్టము. (*)—

య్యెన్మిగులన్॥ (ఉ) మేటిగఁ జైత్రశుద్ధన, మీబుధవార పునర్వసూడు। కర్కాటక
లగ్నమందు గురు, రాజులు నొక్కటఁ గూడి పర్వస। య్యాటముతో శుభగ్రహము,
లైదు సముచ్చగతిం జరింప నా। ఖేటవిభుండు మింటి నడు, కేవ సముజ్జ్వలుఁ
డై వెలుంగఁగన్॥ (వ) ఇట్టి శుభసమయంబున॥ (సీ) మొలకనవ్వుల వాని, నలరాజు
నలరాజు వలపించు, నవకంపుఁ జెలువువాని। నరచందురుని యందమిరువొందనను
వొందుపసమీఱుమిసిమి, నెన్నొసలువాని। నలతమ్మివిరియమ్ము, లపహాస్యముగాఁ గొ
న్నగరువంపుఁ దెలిసోగ, కనులవాని। నెలమావినన కావి చెలువులోఁ గొనిచాల
మురువుఁ గాంచిన ముద్దు, మోవివానిఁ॥ (తే,గీ) జారులక్షణశుభవిలాసముల
వాని। నచ్యుతార్ధాంశమగువాని, నరివిరాము। సకలగుణధాము రాముఁ
గౌసల్యగనియెఁ। గలువదొరఁ బూర్వదిక్సతి, గన్నయట్లు॥ (క) ఘనతేజుఁడైన
యీనం। దనుచేఁ గౌసల్య పుడమిఁ, దద్దయు నొప్పె। న్ననిమిషలోకవిభుండై।
యనువందెడు వజ్రిచేత, నదితియుఁ బోలెన్॥ (చ) అలికులవేణి కైకగనె, నా

—(*)భరతలక్ష్మణశత్రుఘ్నులు కైకేయీసుమిత్రలయందుదయించుట. (*)—

దశమి గురుతారయందుసాం। పలరఁగ మీనలగ్నమున, నబ్జముఖున్ సుముఖున్
జగత్సుఖు। స్థలగిరిధైర్యసజ్జనమ, నోహరుఁ బద్మవిశాలనేత్రునిన్। లలితగు
ణాఢ్యునిన్ సుజనలాభరతున్ భరతున్ముదంబునన్॥ (మ) ఘనకర్కాటకలగ్నమం
దు ఫణినక్షత్రంబున న్సూరిశో। భనవిస్ఫూర్తిన్ సుమిత్రగాంచె సుతులం,
బంచాంబకాకారుల। న్మనువంశాధ్యుల దీర్ఘబాహుల మహా; నందాత్ముల
న్వంశవ। ర్ధనుల న్లక్ష్మణునిన్ జగన్నుత కళా, ధౌరేయు శత్రుఘ్నునిన్॥
(తే,గీ) వరకుమారునిఁ గన్న పార్వతివిధమునఁ। జంద్రుఁ గాంచిన పూర్వది
క్సతి సొబగున। హరిహయుని వామనునిఁ గన్న, యదితికరణి। మెఱసెఁ గౌస

ల్య కైక, సుమిత్ర మిగుల ॥ (వ) ఇట్లు గౌసల్యాదేవియందు నారాయణార్ధాంశంబున రాముండును సుమిత్రయందుఁ దచ్చతుర్థాంశంబున లక్ష్మణుం డును దదష్టాంశంబున శత్రుఘ్నుండును గైకేయియందుఁ దదష్టాంశంబున భరతుం డును నవతరించి దశరథుని కనురూపులై గుణవంతులై నిజద్యుతులచేతఁ బ్రోష్ఠపదోపమానులై యొప్పిరప్పుడు ॥ (క) మొరసెను సురదుందుభులటు । కురిసె న్మందారకల్ప, కోమలసుమము । ల్మొఱసెం గిన్నరగీతో । త్కరము లెసఁగెని ర్జరవని, తానటనంబుల్ ॥ (సీ) సకలామరశ్రేణి, చటులాపదలు దీరె దివిజారి గుండెల, దిగులు చేరెఁ । బాపసంతతులుప, టాపంచలై పాఱె విమలచిత్తులమన స్తమము జాఱె । లలితాంబుధులఁ బుష్కరములు తేటలు దేరె దిఙ్ముఖంబులవింత, తెలుపులూరె । రవిశశధరమండలములఁ గాంతులు మీఱె వసుధాచకోరాక్షి, వగపు దీరె (తే, గీ) మహితతాపస సందోహ, మానసాంబు । జములు వికసించి తనరారె, సకలలోక । ములకుఁ గళ్యాణసుఖములు, మొలకలెత్తె । నచ్యుతుండు రాముఁడై పుట్టి, నట్టివేళ ॥ (వ) అప్పుడప్పురవరంబు నటనర్తక గాయక వాధక జనసంకుల రాజమార్గంబై యుత్సవ నృత్యంబు సేయుచుండె నంతనద్దశరథుండు పుత్రులుదయించుట విని పరమానంద భరిత హృదయారవిందుండై తత్ప్రియాఖ్యులకు రత్నాంబరభూషణాదు లొసంగి బ్రాహ్మణులకు ధనంబును ధేనువులు నొసంగె నంతఁ బదునొకొండవ దినంబున మహర్షిశ్రేష్ఠుండగు వసిష్ఠుండు

—(*)వసిష్ఠమహర్షి రామాదులకు నామకరణంబుఁ జేయుట.(*)—

(తే, గీ) క్రమముగా నగ్రసుతునకు, రాముఁడనఁగఁ । బరఁగఁ గైకేయిసుతునకు భరతుఁడనఁగ । మఱి సుమిత్రాత్మజులకు లక్ష్మణుఁడనంగ । రమణ శత్రుఘ్నుఁడనఁగఁ బేళ్ల మరనిడియె ॥ (వ) ఇట్లు నామకరణంబుఁ జేసి జాతకర్మాదిశుభకర్మంబులన్నియు నిర్వర్తించి బ్రాహ్మణులకుఁ బుష్కలంబుగా నన్నంబుఁ బెట్టించి యభీష్టంబుగా మణిసువర్ణవస్త్రాదికంబు లొసఁగి యమందానందంబునం బొదలుచుండె నంత నారాజనందనులు పూర్వపక్షశశాంకుని పోలిక దినదిన ప్రవర్ధమానులై జననీజనకులకు ముదంబు రెట్టింప బాల్యంబు వీడి సకల జగన్మోహనంబైన యౌవనంబు నొంది శాస్త్రంబులయందుఁ బరిచయంబు గలిగి నీతులయం దభిరతులై ధర్మశాస్త్రంబులయందుఁ బరిజ్ఞాతలై కోదండపాండిత్యంబులం దారితేరి గజహయాధిరోహణంబుల జితశ్రములై పరిపంథిమర్మభేదనవ్యూహద్వంద్వయుద్ధచిత్రశస్త్రాస్త్రనైపు



ణ్యంబులం బ్రవీణత గలిగి చతుర్విధోపాయంబులం బ్రసిద్ధులై గర్భైకాదశ వర్షంబుల నుపనీతులై వేదాధ్యయనంబు సేసి కళంకరహితశశాంకు పోలికం బున నలసత్వరహిత కుసుమశరు పోలిక సకలజగన్మోహనాకార లీలా విహార చాతుర్యంబుల నిఖిల జనమనోహరులగుచు వినోదింపుచుండి రందు ॥ (క) జ్యేష్ఠుండగు రాముఁడు బ్వం । దిష్టుండై జనులకెల్ల నేర్పునఁ బురుష । శ్రేష్ఠుండై విధుకైవడిఁ । బ్రేష్టుండై దశరథునకుఁ, బెలసెం బృథివిన్ ॥ (క) ధీరుండై ఘనసుగుణో । దారుండై కీర్తివిజిత, తారుండై గం । భీరుండై ధీరుండై శూరుండై యొప్పెనతఁడు, సురుచిరభంగిన్ ॥ (క) పితృశుశ్రూషణరతుఁడై । శ్రుతివిదుఁడై చాపవేద, శోధకుఁడై సు । వ్రతుఁడై యతిరథుఁడై బుధ । హితుఁడై తనరారెనాతఁ, డెంతయుఁ బ్రీతిన్ ॥ (మ) ఘనుఁడుర్వి స్నిగ్ధుఁడు లక్ష్మివర్ధనుఁడై, మోఘప్రేముఁడా లక్ష్మణుం । డనఘుం డన్నయు లోకరాముఁడు హిత, వ్యాపారుఁడౌ రామభ । ద్రునకుం దక్షిణబాహువై ప్రియుఁడునై, తోడై సదాభూరిశో । భనసంధాయకుఁడై రహిం దగ బహిః, ప్రాణంబు చందంబునన్ ॥ (క) సొంపార రామభద్రుఁడు । నింపుగ లక్ష్మణుని విడిచి, యించుకయున్నిం । ద్రింపఁడు సరసాన్నము భుజి । యింపఁడు క్రీడారతిఁ జరి, యింపఁడు నెపుడున్ ॥ (క) ఆరామవి । భుఁడు చటులా । శ్వారూఢుండగుచు వేఁట, కరిగెడుఁ దఱిద । ద్వ్యారిశరాసనధరుఁడై । వీరుఁడు లక్ష్మణుఁడు పోవు, వెనుకొని ప్రీతిన్ ॥ (తే, గీ) ఇంపుసొంపార లక్ష్మణుం, డెల్లప్రొద్దుఁ । బూని రాముని కతిహితుం, డైనభంగిఁ । బరఁగ శత్రుఘ్నుఁడనుజాల, భరతునకును । బ్రీతినెప్పుడు కడుహితుం, డై తనర్చె ॥ (తే, గీ) మఱియు దశరథధారుణీ, మండలేంద్రుఁ । డక్కుమారోత్తములచేత, ననవరతము । సేవ్యమానుఁడై మిక్కిలిఁ, జెలఁగుచుండె । ననిమిషులచేతఁ బంకజాసనుఁడుపోలె ॥ (వ) ఇట్లు దశరథుండు నందనులచేత నుపాస్యమానుండై యక్కుమారులు లారూఢయౌవనులగుటఁ దలపోసి తగినకన్యకలం దెచ్చి వివాహంబులు సేయుటకు నుపాధ్యాయ బాంధవ సహితంబుగా విచారింపుచున్న సమయంబున ॥ (సీ) అలవసిష్ఠునితోడఁ, గలహించి యెవ్వాఁడు సదమలబ్రహ్మర్షి పదము వడసె । సురలపై నలిగి భూవరునకై యెవ్వాఁడు ప్రతినాక మొనరించె వితతమహిమ । ఘనతపంబునకు విఘ్నము సేయవచ్చిన రంభ నెవ్వాఁడు దిట్టె, రాయిగాఁగఁ । బరఁగ నెవ్వాఁడు యాగ, పశువుగాఁ గొనిపోవు ద్విజపుత్రుఁ బ్రతికిం

చె, విపులకరుణ ॥ (తే, గీ) నట్టితాపసకులవర్యుఁ, డమితతేజుఁ । డంబురుహ

(*) విశ్వామిత్రమహర్షి దశరథమహారాజుకడకేతెంచుట (*)

గర్భసముఁడుమహామహుండు । గాధినందనుఁడమ్మహీం, కాంతుఁజూడ । న
క్కజంబుగఁ జనుదెంచె, నొక్కనాఁడు ॥ (తే, గీ) వచ్చివాకిటనిలచిద్వా, వారికు
లను । గాంచిమారాక యానృపా, గ్రణికిఁ దెలుపుఁ । డనుడు రయమున నొక
ఘణి, హారుఁడరిగి । నరవరాగ్రణి గొలువున్న, నగరు సొచ్చి ॥ (ఉ) ఏలికఁగాం
చి కేలుఘటియించి నృపాలమణీ పరాకునా । యేలినసామి కౌశికము, నీంద్రుఁ
డుపాత్తలసన్మహాతప । శ్శీలుఁడు వచ్చిసంభ్రమము, చేఁదలవాకిటనున్నవాఁ
డుతే । జోలసితుండనునావుడల, సూర్యకులేంద్రుఁడు హృష్టచిత్తుఁడై ॥ (క) గు
రుసహితుఁడై మహేంద్రుఁడు । వరచతురాననున కెదురు, వచ్చినభంగిన్ । గు
రుసహితుఁడై మహీంద్రుఁడు । కరమద్భుతభక్తి నెదురు, గాఁజనుదెంచెన్ ॥
(తే, గీ) అట్లుచనుదెంచిప్రజ్వలి, తాగ్నిమాడ్కిఁ । గ్రాలుమునినాథు సంశ్రిత,
వ్రతునిగాంచి । భక్తిఁదత్పదాబ్జములకుఁ, బ్రణతిఁజేసి । యర్ఘ్యపాద్య ప్రముఖ
పూజ, లాచరించి ॥ (వ) వినయంబున గృహంబులోనికిం దోడ్కొని చని కాం
చనాసనంబున నాసీనుం జేసి శాస్త్రదృష్టవిధానంబున నర్చించిన నప్పరమతప
స్వి తత్పూజనంబుఁ బ్రతిగ్రహించి పుర రాష్ట్ర కోశ జనపద బాంధవ సుహృజ్జ
నంబులయందుఁ గుశలం బడిగి ॥ (తే,గీ) అనఘపగతులునిర్జితు, లైరెమంత్రివ
రులు వశవర్తులై, చరింతురే సమస్త । నృపులుసన్నతులగుదురే, నీకుఁ జేయఁ ।
గంటివే దైవమానుష, కర్మచయము ॥ (వ) అనిపలికి పదంపడి వసిష్ఠమునిశ్రే
ష్ఠునింజూచి సత్కారవంబును సస్నేహంబును సవినయంబుగా సేమంబరసి తక్కి
నమహర్షుల నందఱనయ్యైతెఱంగుల సంభావించి వారిచేతనుపాస్యమానుం
డై నిజతేజోజాలంబుల దత్సభాంతరంబెల్లవెలుంగం జేయుచు సుఖాసీనుం
డైయుండె నప్పుడద్దశరథుండు విశ్వామిత్రునవలోకించి వినయంబుననిట్లనియె॥
(ఆ,వె) అమృతకలశమబ్బినట్లు నుదకమందు । నీరుచెందినట్లు, నిర్ధనునకు ।
నమితధనము దొరికి, నట్లుగాదె మీరాక । నేఁడు మాకు గాధి, నృపకుమార ॥
(ఆ,వె) ధర్మపత్నులందుఁ దనయులఁబడసిన । నాటికంటె మాని, నాథ నేఁడు ।
యుల్లమడించెనాదు, హృదయమందుఁ బ్రమోద । లాభ మనఘు నీదు, రాక
లన ॥ (క) మునినాథ దైవికంబునఁ । జనుదెంచితినీవునాదు, సదనంబునకుం ।



బనులన్నియు సమకూడెను । పనివడిమీకృపకుఁ జాలఁ, బాత్రుఁడనైతిన్ ॥
(తే,గీ) సంయమీశ్వరఘోర, సంసారజలధి । మగ్నమాదృశనరపాలమండ
లంబు । నుద్ధరింపంగ సదుపాయమొండుగలదె । యుష్మదీయకృపాపోత, మొ
కటిదక్క ॥(మ) అనఘంబై సుపవిత్రమై శుభకరం, బై యొప్పు మీదర్శనం । బున
నాజన్మము సార్థమయ్యె యశము, న్బొల్పొందె బల్మిష్టఁజే । సినపుణ్యంబు ఫ
లించె నిత్యశుభము, ల్చేకూడె నో గాధినం । దన వెయ్యేటికి సర్వభూపతులలోఁ, ధ
న్యుండనైమించితిన్ ॥ (తే, గీ) మొదల రాజర్షివై చాలఁ, బొగడువడసి । పి
దపఁదపమున బ్రహ్మర్షి, పదముఁగాంచి । మున్నుభువనప్రసిద్ధిఁగై, కొన్న నీదు ।
మహిమ లెఱిఁగి నుతింపంగ, మాకువశమె ॥ (క) గురుఁడవు హితకరుఁడవు శుభ
కరుఁడవు బలదాయకుఁడవు, కర్తవు సంప । త్కరుఁడవు దైవతమవు సుఖ । కరుఁ
డవు మాకెపుడు నీవ, కావె మహాత్మా ॥ (వ) మునీంద్రా మిముబోఁటి పరమ సి
ద్ధులకు మమ్మడుగవలసిన కార్యంబొక్కింతైనఁ గలుగమి నిక్కువంబై ననునడుగ
వలసియడిగెదనేమిఁ దలంచి విజయంబుఁ జేసితిరి నాకయ్యదికర్తవ్యంబానతిం
డు పాత్రభూతుండ నగుటం జేసి భవత్కామితంబుఁ దీర్చెద మహానుభావుండై
ననీవు మద్గృహంబున కరుదెంచుట నాయందుంగల వాత్సల్యాతిశయంబునం గ
దా యని శ్రవణసుఖంబుగాఁ బల్కిన నప్పలుకుల కలరి నిజతేజోధరీకృతశతప
త్ర మిత్రుండగు విశ్వామిత్రుండు హర్షపులకిత గాత్రుండై యజరాజపుత్రునకి
ట్లనియె ॥ (చ) మనుకులసంభవుండవ, సమానవసిష్ఠ కృతోపదేశసం । జనిత
లసద్వివేకుఁడవు, సాధువిధేయుఁడవన్వయోచిత । ప్రణయవిదుండవీవగిదిఁ,
బల్కుట నీకనురూపమే కదా । మనుజవరేణ్య నీవనిన,మాట కసత్యము గల్గ
దె న్నఁడున్ ॥ (క) హితమతిన స్మన్మానస । గతకార్యంబెఱుకపఱుతుఁ, గ్రతుక
నదానిం । జతురత నొనర్చి సత్య । ప్రతిశ్రవుఁడవగుమునీవు, పార్థివముఖ్యా ॥
(వ) అనిబహూకరించి వెండియు ॥ (చ) అనఘచరిత్ర యేనొకమ, హాధ్వరక
ర్మమొనర్పఁబూనిమ । ద్వనమునదీక్షఁగైకొనియు, థావిధహోమము సేయు
చుండఁగా । దనుజవరేణ్యులిద్దఱతి దర్పితులుగ్రులు కామరూపులై । వెనుకొ
ని వచ్చి దానికడు, విఘ్నమొనర్తురు సారెసారెకున్ ॥ (క) ఏనెన్ని మా
ఱ్లు సేయం । బూనిన వారన్నిమాఱ్లు, పూని చలమునన్ । నానావిధ విఘ్నం
బుల । దానిం గొనసాగనీరు, దశరథ నృపతీ ॥ (ఉ) నెత్తురుపప్పి కుండముల,

నించుచుఁ బావన యజ్ఞవేదిపైఁ । గుత్తుకబంటి మాంసమును, ఘోరము గా దివినుండి వైచుచుం । దత్తరపాటుతో మునులఁ, దద్దయుఁ గాఱియపెట్టుచుం గడుం । జిత్తముగందనత్తపముఁ, జెల్లఁగనీరికనేమి చెప్పుదున్॥ (చ) మెనుకినుకన్ని శౌటుల శ,పింపఁగడంగియు దీక్షితుండ నై । మనమున నల్కఁ బూనిన స్వమంచితయాగఫలంబు వ్యర్థమై । చనునని యుం జిరాజితవి,

—(*)విశ్వామిత్రుండు యాగరక్షణార్థమై రాముని దనకొసంగఁ గోరుట(*)—

శాలతపంబున కర్థహానిగల్గునని యుఁదాల్మిచేత మదిఁ, గూరిన కిన్కనడంతు సారెకున్॥ (తే,గీ) వారుసుందోపసుందకు,మారు లమితవిక్రములు కాఘ, రూపులు, వీరకర్మవిదులు మాయావులు వశౌస్య,వీరభటులు । జనవరసుబాహుమారీచు,లనెడువారు॥ (చ) జవయుతులన్ని శౌటుల వెసందును మన్భవదగ్రనందనున్ । భువనమనోహరున్బలరి. పుణ్యప్రతిమున్ సుగుణాభి రామునిన్ । రవికులవార్ధిసోముని న,రాతివిరామునిరాము నెంతయున్ । న్నరణమీఁడదోడ్కొనిచ్చనం జనుదెంచినవాఁడ వేడుకన్॥ (క) భూమీశతిలకసుగుణో । ద్దాముని ఘనకాకపక్షధరునిస్ఫూర్తిన్ । భీమసమాన పరాక్రము । రాముని నాకొసఁగు మిపుడ,రాతుల నోడువన్॥ (క) ఇతఁడెంతయు నాచేఁబా । లితుఁడై యాత్మీయ దివ్య, పృథుతేజమునన్ । దితిజులవినాశనమునం । దతులితగుణధుర్యశక్తుఁడై తనరారున్॥ (క) ఎద్దానివలననీతఁడు । తద్దయుముజ్జగములందు,ధన్యుఁడనంగాఁ

(*)దశరథుఁడు రాముని వెంటఁదన్నునుదోడ్కొనిపొమ్మనుట(*)

బెద్దయు విఖ్యాతివడయు । నద్దివ్యానేకరూప, యశమునొసఁగెదన్ । (క) రాముని ముంగల నిలువఁగ । నామనుజాశనులుచాల, రనిలోవారిన్ । రాముండు దక్కనన్యుండిమహిలోఁ దునుమఁ జాలఁ, డినకులతిలకా ॥ (తే,గీ) అధిప బలవీర్యదర్పితు, లగుట్లఁజేసి । ప్రాప్తులై కాలపాశని,బద్ధులగుచు । నున్నవా రన్ని శౌటులు,యుద్ధమందు । ఘనబలుండైన రాముని, గడవలేరు॥ (క) విమలాత్మకపుత్రస్నే । హము విడువుము నీదు భావ,మంత నెఱుఁగుదున్ । సమరమున దానవుల నిక్కము రామశరాభిహతులఁ,గా నెఱుఁగు మొగిన్ ॥ (తే,గీ) రామభద్రుఁడు సత్యవి,క్రముఁడు లోకహితుఁడును మహాత్ముఁడని మది,నే నెఱుఁగుదు । వివసిష్ఠమహాముని, యెఱుఁగు మఱియు । నితరతాపసు లెఱుఁగుదు,రతనిమహిమ (తే,గీ) శాశ్వతంబైన యశమును, సర్వధర్మ । లాభము నఖండభూరిక, ల్యాణలాభ । మునువడ



యుఁగోరితేనియో, భూతలేంద్ర । చంద్రరాముని నాకు నొసంగు మిపుడు ॥ (తే,గీ) అధిపనావెంటఁబంపుట, కఖిలమంత్రి । వరులును వసిష్ఠముఖమునివరులు సమ్మ । తించియున్నారు నీవు సం,దియము దక్కి । నాకొసంగుము రాముని, లోకనుతుని ॥ (వ) మహాత్మా యే నొనర్పంబూనిన దశరాత్రయాగకాలం బతీతంబు గాకుండ శీఘ్రంబున భవత్కుమారకుండైన రాముని నాకిచ్చి యందంబంపి సత్యప్రతిశ్రవుండవు గమ్మెట్లైన నీకు శుభంబుగలుగు ననిధర్మార్థ సహితంబులగు పలుకులఁబలికి క్రమ్మఱనతండిచ్చు సదుత్తరంబు వినువాఁడై యూరకున్నా విశ్వామిత్రుని వచనంబు వినియద్దశరథుండు వ్యథితమనస్కుండై తీవ్ర శోకంబున నొక్కింతసేపు మైమఱచి యుండి క్రమ్మఱ లబ్ధసంజ్ఞుండై మొగంబున దైన్యంబుదోఁప నిరుద్ధబాష్పోదయ సన్నకంఠుండై యిట్లనియె ॥ (తే, గీ) అనఘ రాజీవలోచనుండైన రాముఁ । డూనషోడశవర్షుండు, వీనికాజి । నసురుల నెదిర్చి పోరాడు, నట్టిభూరి । కర్కశంబైన భుజశక్తి, గానమిపుడు ॥ (ఉ) బాలుఁడు ధీరుఁడై రిపుల, పాలి నెదిర్చి రణంబొనర్పఁగాఁ । జాలఁడు అస్త్రశస్త్రముల, చందమొకింత యెఱుంగఁడాజివి । ద్యాలసితుండు గాఁడరిబ, లాబలయుక్తులెఱుంగఁ డుగ్రదై । త్యాళినెదిర్చి పోరనకృతాస్త్రుని రాముని బంపఁ జెల్లునే॥ (తే, గీ) నిన్నమొన్నటివాఁడు నీ, చిన్నకుఱ్ఱఁ । డకటరాఘవుఁ డెక్కడ, యసురులెడ । సమరమున వారినీతఁడు,చంపుటెడ । యింతచింతింపవలదెమీ, కేమిచెప్ప॥ (మ) సుతులంగానక పెద్దకాలము మదిన్, శోకించి పెక్కేండ్లకీ । సుతులంగంటిఁ గృపన్ భవాదృశజటీ, శుల్సేయు నాశీర్వరో । న్నతిమద్భాగ్యవిశేషమున్ భవదధీ, నంబేకదా యీజగ । ద్ధితునింగైత్యులతోడఁ బోరుటకు నే, నేలాగు పుత్తెంచెదన్ ॥ (చ) ఘనగుణశాలి ప్రాణముల, కంటెఁ బ్రియుండగు రామచంద్రునిన్ । జననుతు నొంటిఁ బంపి నిమి, షంబయినన్ మనఁజాలవంశవ । ధనుఁడగు నట్టి యాతలిరు, ప్రాయపుముద్దులకుఱ్ఱఁ డేలనీ । యనుమతినే నెవచ్చెదను, రారులఁజంపి మఖంబుఁ గావఁగన్ ॥ (వ) మహాత్మా మిముబోఁటి మహాత్ముల యనుగ్రహవిశేషంబున నాకక్షోహిణీ పరిపూర్ణంబైన సైన్యంబు గొఱంత పడకుండఁ గలిగియున్నది మఱియు సర్వాస్త్ర కుశలురగు వీరులు దండనాథులనేకులున్నవారు వీరందఱు భవత్ప్రసాదంబున రక్షోగణ నిగ్రహంబునందు సక్తులై యుందురు రట్టివీరభటకోలాహలసంకులంబైన బలంబుగూడి

ధనుర్ధరుండనై యేనుజనుదెంచి రణంబున నసురుల నెదిర్చి ప్రాణంబులుదాం
పక సాయకపరంపరల నిశ్శేషంబుగా రూపుమాపి భవదాచరిత బ్రహ్మచర్యనిర్వి
ఘ్నంబుగా సమాప్తినొందించి వచ్చెద రాముని దోడ్కొనిపోవ నిశ్చయించితి రే
ని చతురంగబలోపేతుం జేసి మత్ప్రహితంబుగాఁ దోడ్కొని చనుము నాకును
ల్వురు పుత్రులుగలరైనను వారిలోన రాముండు జ్యేష్ఠుండును ధర్మప్రధానుం

—(*)దశరథుఁడు విశ్వామిత్రుని సుబాహుమారీచాదుల సమాచారంబడుగుట(*)—

డును గావున నితనియందు మిక్కిలిం బ్రీతిగలిగియుండు నద్దనుజులెట్టివా రెవ్వనికొ
డుకు లెవ్వనిచేత రక్షితులగుదు రెట్టి పరిమాణంబుగలవారు నాకును రామున
కు నెత్తెఱంగున బ్రవర్తింపవలయు నేయుపాయంబునం బరిమార్పవచ్చు నె
చ్చటనుండి చనుదెంతు రేచందంబున సంచరింతు రింతయు నెఱింగింపుం డనిన
మునిగ్రామణి నృపగ్రామణికిట్లనియె ॥ (సీ) జననాథ యలపుల స్త్యబ్రహ్మమ
నుమఁడు రావణుండని యెడు, రాక్షసుండు । విధిదత్తవరజాత, వీర్యగర్వంబు
న మత్తుఁడై తనయట్ల మత్తులైన । దుష్టనిశాటుల, తోఁ గూడి యనిశంబు ఘనబల
ప్రౌఢిలోకముల నెల్లఁ । బ్రతిహతద్యుతిఁ గాఁగ, బాధింపుచున్నవాఁడమమాట
మన మెల్లనాలకించి ॥ (తే, గీ) నది యొకదయద్దశాస్యుఁడు, యక్షనాథు । ననుజుఁ
డల విశ్రవుని పుత్రుఁ డధిక సత్వుఁ । డయ్యు జగతి నాసుర భావుఁ డగుటవలన । గ
హ్వరీనాథమఖవిఘ్న, కర్తయయ్యె ॥ (శా) ఆరక్షఃపతి పంపునన్ ఘనమహోగ్రా
కారులుద్యద్బలుల్ । శూరుల్ దుష్టులు కామరూపధరులుగ్ సుందోపసుందాత్మ
జు । ల్మారీచుండు సుబాహుఁడన్ సురరిపుల్ ధైర్యోద్ధతుల్ క్రవ్యభు । గ్వీరుల్
సారెకు వత్తురా సవనముల్, విఘ్నంబుఁ గావింపఁగన్ ॥

—(*)దశరథుఁడు రాక్షసుల బల్మింబువిని వెఱచి రాముని బంపనొల్లననుట(*)—

(క) అని పలికిన మునినాథువ । చనముల్ విని యొల్లం బొయ్యు, జననాథుఁడు నెమ్మ
నమున భీతి గదుర నాననమున దైన్యంబుదోఁప నమ్మునిం డగుచున్ ॥ (వ) అంజ
లిఁ గీలించి యిట్లనియె ॥ (చ) మునివర రావణుం డనఁగ, మున్న సహాయతఁ బ్రక్క
మాఱు లయ్యనిమిష దైత్యసంగరముల్ అందు దిగీశులతోడఁ బోరునాఁ । డను
పమవిక్రమాప్తి బిరుదండి నమేటి మగండు వానితోఁ నళ్ళి నెదిరించి పోర, దివిజా
ధిపముఖ్యులైన జెల్లునే ॥ (తే,గీ) అంతలంతటి వేల్పులట్లగుచునుండ । దానవుని
తేజము సహింప, మానినాథ । మనుజులన నెంత వారలు, మనుజులఁ దినువారి మను



జొల్లు వధియింపఁ, గోరుటెట్లు ॥ (క) ఆ రావణుండు సమరజితై రావణుఁడనఁగ వి
నమె యాతనితోడన్ । మాత్రోడ్డి సంగరంబున । బోరఁగ నాతరమె మౌని
పుంగవ తలఁపన్ । (వ) మఱియు సుందోపసుందనందనులగు మారీచసుబాహులు
వీర్యగర్వమున నెవ్వరి మెచ్చక మాయాబలవిశేషంబునం బురందరాది బృం
దారకుల లెక్కసేయక యుక్కునం గ్రాలుచు యజ్ఞవిఘ్నకరులై ప్రవర్తింతుర
నునది జగత్ప్రసిద్ధంబై మ్రోయుచుండు నే నెట్టి జెట్టి జోదులనైన బిట్టదిరించి క
ట్టలుకఁ గట్టితనంబుఁ జూపి యిట్లట్లనుడి వెట్టనోపుదుంగాని కాలాంతకయమోప
ములగు నమ్మారీచసుబాహుల నోర్వం జాల ననేక సంగ్రామంబుల నారితేరి పేరు
కొన్న నాయట్టి శూరునకుం దీర్పరాని కార్యంబు బాలుండును నకృతాస్త్రుండు
నగు రాముఁ డెత్తెఱంగునం దీర్చువాఁడు నీవు సర్వజ్ఞుండవు గురుండవు నాకు దైవ
మవు కావున మందభాగ్యుండనైన నన్నుం గరుణించి రామునియందుఁ బ్రసాదం

—(*) విశ్వామిత్రుఁడు దశరథవచనంబు విని క్రుద్ధుఁడగుట-(*)—

బు సేయుము ॥ (మ) అని ధాత్రీవరమౌళి పల్కవిని యత్యంతాగ్రహంబందియా ।
యనయజ్ఞాయతనంబునందలి యుదారాజ్యాహుతీద్ధాగ్నిభం । గిని శాంతద్యుతి
తోఁ నుదీర్ణుఁడగుచున్, గెంజాయ రంజిల్లుచోఁ । చనకోణంబుల రాజుఁ జూచి పలి
కెన్, శస్త్రోపమానోక్తులన్ ॥ (ఉ) అచ్చపడంగ మే మడిగి, నప్పుడె లేదనిపల్కు
టొప్పుఁగా । కిచ్చెదనంచుఁ బల్కి తుది, నీగతిబొంకుట రాజనీతియే । రచ్చల నీ
వలెన్ రఘుకులంబునఁ బుట్టిన రాజులెన్నఁడుం । బొచ్చెములాడ రన్వయము, పుణ్య
ము చేసితి వేమిఁ జెప్పుదున్ ॥ (శా) ఎంతో గౌరవ మింత యయ్యె నయిననే మా
యేఁ గానిమ్ము మా । కింతే చాలుఁ గొంతయేమి పనులింకేరీతిచేనైనన్ నాకిం
తెనందుదిముట్టదే పలుకులింకేలా మృషావాదివై । సంతోషంబుననుండు మీ
వు సుఖివై నాథ యేంబోయెదన్ ॥ (వ) అని పలికిన నవ్విశ్వామిత్రుని దుర్నివా
రక్రోధరసోదీర్ణంబైన రూపలక్షణంబు పలక్షించి ॥ (క) ధర దిఱిఁగెం గులశైల
ములల్లాడఁగ దిగ్భిత్తులగలె, నుడుతతి రాలెన్ । శరనిధులింకెన్ భూతము లుఱి

—(*)వసిష్ఠుఁడు రాముని విశ్వామిత్రునకొసంగుమని దశరథునకు బోధించుట(*)—

ములివడఁ బడ వడఁ కె హరివరుఁ డదిరెన్ ॥ (శా) అంతం గాంతవసిష్ఠుఁ డాజటిలుకో
పాటోపముం జూచిలో । వంతం జింతిలి కోర్కెఁ దీర్పని మునిన్ వ్రాక్రుచ్చి యి
మ్మేదినీ । కాంతుం దీని క్రతంబునం దపసి శంకంపాలగ్గోపించినాఁ । డెంతో మో

సముపచ్చె నంచు వెసఁబృథ్వీశేంద్రుతోనిట్లనున్ ॥ (మ) జననాథా సుపవిత్రమైన
మనువంశంబందుజన్మించిన । జ్జనమాన్యుండన సుప్రతుండనఁగ సా,ధుధర్మతు
ల్యుండనా।వినుతప్రజ్ఞానాడుమహాద్యుతియునా,విఖ్యాతివాటించినేఁ। డనుమానిం
పక వంశధర్మమెడసే,యంబూనఁగాఁజెల్లునే॥ (చ) ఇనకులవర్య తాఁదొలుత.
నిచ్చెదనంచువచించి వేడఁబో । యినగడులోభబుద్ధిమది ,నీకపెనంగినయా
గపూర్తమున్ । పనిచెడిపోవునంచు మును,పల్కిరికాన నధర్మవృత్తిఁగై ।కొన
కస్వధర్మ మూఁదిరఘు; కుంజరరామునిఁ బంపుమిత్తఱిన్ ॥ (తే, గీ) అధిప
యకృతాస్త్రుఁడైనఁ,గృతాస్త్రుఁడైన । సేమికౌశికగుప్తుఁడై యెసఁగునట్టి । రా
మువీక్షింపఁగాలేరు, రాత్రిచరులు । దారుణానల గుప్తామృత మునుబోలె ॥
(ఉ)ఈమునివంశశేఖరున, హీనమహత్వము లెన్నఁ జిత్రముల్ । భూమివరాగ్ర
గణ్యకుల, భూషణపూర్వమఖండచండని । ష్ఠామహిమంబుచేఁదపము, సల్పిత
దద్భుతశక్తియోగవి । ద్యామహిమాధికుండనఁగ, నద్భుతశీలముఁ గన్నవాఁడి
లన్ ॥ (మ) ఘనుఁడీసంయమి నేతదివ్యశరశ్రీ, ఘోశాలివ్యాత్తాండవ ।హ్మా
నిభుండుగ్ర తపంబునన్ మునుభవా, నీనాథుమెప్పించియా । యనచేఁబెక్కు
నిశాతసాయకములు, దృప్తిస్ఫూర్తిఁ జేకొన్నవాఁ । డెనయెయ్యాయన కెవ్వరైన వి
పులా, హిస్వర్గ లోకంబులన్ ॥ (చ) వెలయఁగనిమ్ముని ప్రభుఁడు, విగ్రహ
వంతుఁడుధర్మశీలుఁడున్ । బలరిపుతుల్యవిక్రముఁడు, పావనమూర్తి తపఃప
రాయణుం ।డలఘుయశుండునద్భుతవి, హారుఁడుబుద్ధ్యధికుండుముజ్జగం । బు
లఁగలదారుణాస్త్రచయ, మున్ సకలంబునెఱుంగుభూవరా ॥ (వ)మహీంద్రా
నీకుమారుండైన రాముండు సువిగ్రహవంతుండును సహజవీర్యుండును సహజ
జ్ఞానశక్తియుక్తుండును దపంబునకుఁ బరమప్రాప్యంబును నై యుండు మఱియు
నతండు చరాచరాత్మక త్రిలోకస్థ సమస్తాస్త్రశస్త్రంబుల నెఱుంగు నతనిప్ర
భావం బెవ్వరెఱుంగరు శక్రాది దిగీశులైన నతనికిసములుగా రదియట్లుండని
మ్ముత్తొల్లి భృశాశ్వుండు తనుమధ్యలగు దక్షకన్యలజయసుప్రభలనువారి నిర్వ
రఁబరిణయంబై యక్కాంతలయందు రాక్షసవధార్థంబు క్రమంబుననస్త్రశ
స్త్రస్వరూపులఁ బరమభాస్వరుల నతిధార్మికుల నానావర్ణరూపుల మహా
వీర్యుల దీప్తిమంతుల జయశీలుర నప్రమేయ ప్రభావుల నదృశ్యరూపులనప్రతి
హతతేజులఁ గామరూపుల దుర్ధర్షుల బలవంతుల నేవురఁ బుత్రులం బడసె



నంకరుం డితనితపంబునకు మెచ్చియయ్యస్త్రశస్త్రంబులనన్నింటి నిమ్మునీం
ద్రునకొసంగె దానంజేసియితండు సర్వాస్త్రశస్త్ర కుశలుండై యస్త్రవిదుల
లోనుత్తముండై త్రిలోకప్రసిద్ధుండై యుండుఁజరాచరాత్మకంబులైనజగంబుల
నిమ్మునీంద్రుం డెఱుంగనియర్థంబొకింతైన లేమినిక్కంబు మహావీర్యుండు
నుమహాతేజుండును మహానుభావుండునగు నితండు రాక్షసవినాశంబునందుఁదా
నుశక్తుండయ్యును భవన్నందనుండైన రామునకు మేయుకల్యాణంబొసంగంగలం
చిక్రుపావిశేషంబునఁ జనుదెంచినాఁడు కావున నీవు సందియంబువదలి పరమానం
దంబున రాము నిమ్మునిరాజునకొసంగు మనిబోధించిన సద్గురువచనంబు విని

(*)దశరథుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రుని వెంటఁ బంపుట. (*)

యన్నరశార్దూలుండు ప్రసన్నచిత్తుండై యానందించి మహాత్ముండగు విశ్వామిత్రు
నకు రామునిచ్చెదనని నిశ్చయించి। (ఉ) ఆమనుజాధిపుండరయ,మారఁగసూ
తునిఁజూచి రాజసు। త్రాముని రాఘవాన్వయల,లాముఁనిఁ గోమల నీలనీరద ।
శ్యాముని బూర్ణకాముని స,ముంచితచారుగుణైకధాముని న్ । రాముని వేడ్కఁ
దోడుకొని,రమ్మిటు లక్ష్మణసంయుతంబుగన్ ॥ (చ) అనినమహాప్రసాదమని,యా
తఁడు గ్రక్కుననేగి మానినా । థునిమదికింపుగానటకుఁ , దోడ్కొనివచ్చెఁ
బ్రతాప సాంద్రునిన్ । జననుతరూప నిర్జితవ, సంత జయంత రతీంద్రచం
ద్రు న। త్యనుపమ భోగభాగ్యవిజి, తాని మిషేంద్రుని రామచంద్రునిన్ ॥
(ఉ) వచ్చినపుత్రుఁ గాంచి జన, వర్యుఁడు చాలముదంబుఁ బొందితాఁ । గ్రు
చ్చి కవుంగిలించి వెసఁ,గూఁకటి దువ్వినిజాంకపీఠిపై। ముచ్చట నుంచి తచ్చిర
ము, మూర్కొని చెక్కిలి ముద్దుఁగొంచిలో। హెచ్చిన కూర్మి నివ్వటిల, సి
ట్లనిపల్కె సుధామయోక్తులన్॥ (ఆ,వె) నన్నుఁగన్న తండ్రి, నాముద్దులయ్య
నా । చిన్నియన్న నిన్నుఁ, జెన్నుమీఱ। గుశికసుతుఁడు దోడు, కొనిపోవ వచ్చి
నాఁ । డరుగుమితని వెంట,ననుజుఁ గూడి ॥ (వ) అని పలికి యద్దశరథుండు ప్రీ
తచేతస్కుండై ప్రాస్థానికంబగు స్వస్త్యయనంబుఁ బ్రయోగించి ప్రియనందనుం
డైన రాముని విశ్వామిత్రుని కొసంగిన ॥ (తే,గీ) తల్లులకు మ్రొక్కి పతికివం,
దనముఁ జేసి । మౌనివరునకుఁ బ్రణమిల్లి, మంగళాభి । మంత్రితుండయి గాధే
య, మౌనివెంట । హర్ష మిగులఁదొత్తనరుగు న,య్యావసరమున ॥ (క) మందా
రవృష్టి గురిసెను । బృందారకబృందమెందు, భిధ్వను లెసఁగెన్ । మందానిలంబు

నీఁ ఘెను । గ్రందుగ నడిమొఱసె శంఖకాహళరవముల్ ॥ (చ) నిరుపమ దివ్యమౌక్తికమణీముకుళీకృతకాకపక్షుఁడై । సురుచిర దివ్యహారపరిశోభితరమ్యవిశాలవక్షుఁడై । శరములు కార్ముకంబసిని, షంగములుంగొని మౌని వెంటఁ దా । నరిగెఁ బినాకి వెంట ముద, మారఁగనే గుహకుమారుఁడో యనన్ ॥ (క) రాము నెడఁబాయ కప్పుడు । భీమశరాసన శరాసి, పృథుతూణములు । ద్దామగతిఁ దాల్చి వెంటనె । సౌమిత్రి కుతూహలంబె, సంగంజనియెన్ ॥ (శా) రాణింప న్రఘువర్యులీక్రియఁదను, త్రాణుల్ కృపాణుల్ ధను । ర్బాణుల్ శౌర్యధురీణు లద్భుతులు భా, స్వద్బద్ధగోధాంగుళీ । త్రాణుల్ తాపసరాజు వెంటఁ జనిరం, బొప్పలీలారతిన్ । వాణీనాథుని వెంట నంటిచను నాస్వారై వ్యద్యులం బోలుచున్ ॥ (వ) ఇత్తెఱంగున నత్తరణికులగ్రామణులు నిజ తేజోజాలంబుల దశదిశల వెలుంగం జేయుచు ద్విశీర్షంబులగు పన్నగంబుల కరణి నలరుచు విశ్వామిత్రుని వెనుకొని యెడనెడఁ జనువుఁ గఱపుచు మందాంచిత గమనంబునం బోవు నప్పు డమ్మునీంద్రుండు లబ్ధమనోరథుండై యక్కుమారులతోడి లీలావినోదంబులం దగిలి దయార్ద్రస్నేహభూయిష్ఠంబైన చిత్తంబునందు హర్షంబు పల్లవింపఁ జనిచని సార్ధయోజనమాత్రంబు దవ్వులం గల సరయూనది దక్షిణతీరంబుఁ జేరం బోయి రామా యని మధురంబుగాఁ బేర్కొని యిట్లనియె ॥

*విశ్వామిత్రమహర్షి రామలక్ష్మణులకు బలాతిబలల నెడుమంత్రంబుల నుపదేశించుట.

(చ) అనఘ మహానుభావ సుకృతాత్ముల చిత్తము భంగి రమ్యమై । తనరుచు నున్న దీతటిని, తప్పక నీవిపుడీ జలంబు గ్ర । క్కునఁ దగ సంస్పృశించి బలు, కోరికతోఁ జనుదెమ్ము సజ్జనా । ఘనగుణధుర్య నీకిట ధ్రు, వంబుగ విద్యలు రెండొసంగెదన్ ॥ (సీ) చతురత నెద్దాని, జపియింప రుజయును జరయు నాఁకలి దప్పి, పొరయకుండు । నెద్దానిఁ బేర్కొన్న, నెట్టియవస్థలందైన దైత్యుల బాధ, లన్నిఁ దొలఁగు । నెద్దానిఁ దలఁచిన, నీరేడు జగములం దసమాన తేజుఁడై, యలరుచుండు । భక్తితో నెద్దానిఁ, బఠియింప రణములం దనుపమ జయశాలి, యైతనర్చు ॥ (తే,గీ) నవని నెద్దానిఁ గొనియాడ, నమితసత్వ । మాయురారోగ్యములును సర్వార్థసిద్ధి । గలుగునట్టి బలయు నతిబలయు ననెడు । విద్యలత్యంతకృపనిత్తు, వేడ్కఁగొనుము ॥ (వ) మఱియు నమ్మహావిద్యలు లోకకర్తయగు పరమేష్ఠివలన సృజింపంబడిన యవి యేను దపఃప్రభావంబునం బడసితి నమ్మంత్రంబు



లు వీర్యతేజస్సమన్వితంబులై యుండు వానిన భ్యసింపఁ జేసి యమహత్త్వం డవు తత్ప్రభావంబునం జేసి సౌభాగ్య దాక్షిణ్య జ్ఞాన బుద్ధి నిశ్చయోత్తర ప్రతివాక్యంబులం దునీకు సమానుండు లేక యుండు దానం జేసి యతులంబైన యశోలాభంబు గలుగు నానావిధంబులగు గుణంబు లన్నియు నీయందు సన్నివిష్టంబులై యుండు బహువర్షంబు లంగీకరించి వలసిన కార్యంబు లన్నియు సాధింపుచుండు సమాహితమనస్కుండవై ప్రతిగ్రహింపుమని పలికిన నారఘూత్తముండు ప్రహృష్టవదనుండై జలంబు లుపస్పృశించి శుచియై వినయపూర్వకంబుగా నుపసర్పించిన నవ్విశ్వామిత్రుండు కరుణావిధేయుండై యమ్మహావిద్యనుపదేశించిన నది బాలసూర్యమండలంబు వలన నిర్గమించిన పరమద్యుతి స్ఫురత్పద్మంబుఁ బ్రవేశించిన పగిది నమ్మహర్షివదనంబు వలన నిర్గమించి రాముని ముఖంబుఁ బ్రవేశించె నంత నారాముండు విద్యాసముదితుండై శరత్కాలంబు నందలి సహస్రరశ్మియగు దివాకరుండునుం బోలె నభిరాముండై పాదోపసంగ్రహణాది గురుకార్యంబు లన్నియు నిర్వర్తించి ॥ (చ) అనఘపవిత్రుఁడా రఘుకులాగ్రణి రాముఁడు పర్ణశయ్యపై । మునిపతిచే నమేయగతిఁ, బుణ్యకథాశ్రవణంబుఁ జేయుచు । న్ఘనముగ నన్నదీతటమునన్ సుఖలీల వసించె నాఁటిరే । యనుజునితోడఁ గూడి శశి, రానిలముం బయిపైఁ జుచుండఁగన్ ॥ (క) మఱునాఁ డరుణోదయమున । గురుమతి కౌశికుఁడు మేలుకొని మృదుతృణసం । స్తరమందుఁ బవ్వళించిన । తరణికులోత్తములఁ జూచి తగ నిట్లనియెన్ ॥ (క) కౌసల్యాసుత రాఘవ । భాసురముగఁ బూర్వసంధ్య, పరఁగెడు నిఁక నుల్లాసమున నిద్రలెమ్ము సు । ధీ సన్నుతయాహ్నికంబుఁ, దీర్పుము ప్రీతిన్ ॥ (చ) అని ముని రాజు వల్కు విని, యారఘువీరులు మేలుకాంచి చ । య్యన సరయూనదీ ప్రవిమలాంబువులన్ వడిఁ జల్లులాడినె । మ్మనమున భక్తి మీఱఁ బర, మంబగు మంత్రము గింజపించి య । మ్మునికి నమస్కరించి కడు, మోదమునం గృతకార్యసిద్ధులై ॥ (తే,గీ) తపసి యనుమతివడసి తత్సహితులగుచు । నచటఁ బాసి రయంబున, నవలనరిగి । మహిత సరయూనదీసంగ, మంబునందు । భువనపావని యైన జాహ్నవిని గాంచి ॥ (చ) అనుపమవృక్షశోభిత త, దంతికకాననసీమయందు మిం । చిన నియమంబునం దపముఁ, జేసెడు వారి నమేయదీప్తిచేఁ । దనరెడు వారిమౌనుల నుదారతఁ గాంచి మునీందు తోడ మొ । ల్లనవినయంబుతోఁ బలికె, రాఘవరాముఁడమోఘధాముఁడై ॥ (క) ఈ పుణ్యాశ్రమ

మెవ్వరి । దేవుఁ డేచరిత్రుఁ డిప్పు డిచ్చటనుండుఁ । గోపాలవనముఁ బోలెడు। తా
పసకులవర్య మాకు, దయఁ జెప్పఁగదే ॥ (క) నావిని కౌశికుఁడిట్లను । భూవరనం
దను నితోడఁ, బాలుఁడు విను మీ । పావనతపోవనోత్తమ । మేవిధమునఁ గలిగె దా
ని, నెఱిఁగింతుఁ దగన్ ॥ (వ) తొల్లి భగవంతుండగు శశాంకశేఖరుం డుద్వాహా
నంతరంబునఁ బార్వతీసహితంబుగా సమాహితమనస్కుండై యిచ్చట నఖండ
చండ నిష్ఠాసౌష్ఠవం బేర్పడఁ దపంబుఁ జేయుచుండ నప్పుడు సురప్రార్థితుండై
కందర్పుండు దర్పం బేర్పడ నహంకరించి దర్శించిన నద్దేవదేవుండు కినుకపా
ఱమిన చిత్తంబున మూఁడవకన్ను విచ్చి చిచ్చురులం జూచి హుంకరించినఁ దదీయ
నేత్రానల జ్వాలాజాలదందహ్యమాన శరీరుండై యక్కాముఁడు నాఁటంగోలె
యనంగుఁడనం బరఁగె నిచ్చట మదనుం డంగవిమోచనంబుఁ జేసెం గావున నీవి
షయంబంగవిషయంబు నా విశ్రుతి వహించె నీయాశ్రమం బాదికాలంబున శంకర
స్థానంబనం బరఁగు నిప్పుడయ్యాది దేవుని శిష్యులు పరమ ఋషులు ధర్మ
పరులిచ్చట నున్నవా రిచ్చట వసించు వారికిఁ బాపంబు లేదని శివుని వచనంబుగ
లదు కావున । (తే, గీ) నరవరకుమార యీరెండు, నదులనడుమఁ । బొల్చుపావ
నమైనత, పోవనమున । నేఁటిరాత్రి ముదంబున, నిలచి యెల్లి । మిహిరుఁ డుదయిం
చునంతకు, మేలుకాంచి ॥ (తే, గీ,) స్నానమొనరించి జపియించి, సముచితముగ ।
వహ్నికార్యంబు సలిపి యు, వ్వలస్రవంతి । దాఁటి తాపసాశ్రమము లందం
దుఁ జూచి । కొనుచు. మాయాశ్రమమునకుఁ, జనుద మనఘ ॥ (వ) అనిపలికి
యవ్విశ్వామిత్రుండు తదనుమతంబున మనోజ్ఞంబైన గంగాసరయూ
మధ్యప్రదేశంబున నివసించియుండ నప్పుడు ॥ (ఉ) అచ్చటిఁ దాపసప్రవరు,
లద్భుతశీలుని గాధినందనున్ । వచ్చిన వానిఁ గానెఱిఁగి, వన్యఫలంబులు సంగ్ర
హించి తా । రచ్చుపడంగ సమ్మదర, సాతిశవీకృత మానసాబ్జులై । చెచ్చెర వచ్చి
యుక్తవిధి, చేసిరి రాసన మర్ఘ్యపాద్యముల్ ॥ (తే, గీ) అంచితంబుగ నిట్లుపూ
జించి భక్తి । ఫలములర్పించి పదపడి, భానువంశ । శేఖరులకు యథావిధిఁ జేసిర
పుడు । తాపసోత్తము లతిథిసత్కారములను ॥ (వ) ఇట్లుచితసత్కారంబులఁ
గావించి ॥ (ఆ, వె) మఱలి వారు సేయు, మహితసత్కారంబు । లందికొని సమా
హితాత్ములగుచు । సముచితముగ మునులు, సంధ్యనుపాసించి । పుణ్యకథలఁ గొం
త, ప్రొద్దుఁ బుచ్చి ॥ (క) ప్రియమున వారలఁ దోడ్కొని । రయమున నుటజమున కే



గి, రమణీయకథా । ధ్యయనముఁ జేయుచు నా పు । ణ్యాయుతులు నాఁ డచటనుండి,
రతిసుఖలీలన్ ॥ (క) మునిపతి విశ్వామిత్రుఁడు । ఘనకృప నెఱిఁగించు పుణ్యక
థలు వినుచు నా । జననాథతనయులా నిశ । ననుపమపుణ్యాని శఁ జేసి, రద్భుత భం
గిన్ ॥ (వ) ఇట్లా రఘుపుంగవులు శీతవాతానీత వన్యపరిమళాఘ్రాణంబుఁ జేయు
చునుచితకథావినోదంబున నారాత్రిఁ గడపి మఱునాఁడు ప్రభాతకాలంబున లేచి
యాహ్నికక్రియలు నిర్వర్తించి విశ్వామిత్రసహితులై యచ్చటిమునులు కలుపి
న తెఱంగున యోడ నెక్కి వారలు సంప్రీతితో నొసంగు బహువిధాశీర్వాదంబు
లఁ గైకొని యమ్మహాత్ముల నానావిధపూజనంబులఁ బరితుష్టులం జేసి యనుజ్ఞఁగా
ని యమ్మహానదీమధ్యంబునం బోవుచుఁ బ్రావృట్కాలధారాధరగర్జాసము
జ్జృంభితంబైనయొక్క నిర్ఘోషంబు విన వచ్చిన నాలించి రాముండు విశ్వామి
త్రుననలోకించి మహాత్మా యొక్క గంభీరశబ్దంబు తుములంబై వినంబడియె నిది
యేమికారణంబున నుత్పన్నంబయ్యె నెఱింగింపవే యని యడిగిన సకలగుణాభి
రాముండగు రామునకు జగత్పవిత్రచరిత్రుండగు విశ్వామిత్రుం డిట్లనియె ॥ (మ)
మనువంశాంబుధిపూర్ణసోమ రఘురామా రాజసుత్రామవి । న్ననుకైలాసన
గంబునందుఁ ద్రిజగత్పూజ్యుండు లోకేశ్వరుం । డనఘంబైన మనంబుచే నొ
కసరం, బారూఢి నిర్మించె నా । య్యనఁ గీర్తింతురు దానిమానస సరం,
బంచున్ సురగ్రామణుల్ ॥ (క) ఆసరసియందు సముదిత । యై సరయు న
నంగ నొకమహానది పుణ్య । శ్రీసంతతులకు నెలవై । భాసురముగ నలరు భువ
న, పావనియగుచున్ ॥ (తే, గీ) పరఁగ నన్నది సాకేత, పురముఁ దిఱిగి । వచ్చి
జాహ్నవినదిలో న, వార్యభంగిఁ । గలసె నచ్చటఁ బొడమిన, ఘనతరంగ । ఘ
ట్టనోద్భూతరవ మిది, కంటె వత్స ॥ (క) వసుధేశతనయ నీవ । ద్దెసకుం బ్రణ
మిల్లు మనిన, ధీరుఁడు రాముం । డసమాన తేజుఁ డాదెస । కసదృశగతి వినతిఁ జే
సె, ననుజయుతముగాన్ ॥ (వ) ఇట్లు కృతప్రణాముండై యమ్మహానది నుత్తరిం
చి యవ్వలం బోవుచు రవికిరణంబులకుం జొరవయీక సాంద్రతరువిటపపలా
పటలపరిచ్ఛన్నంబైనయొక్క వనంబు విలోకించి విశ్వామిత్రునిం జూచి మహాత్మా
యమ్మహాగహనంబు మత్తవేదండశుండాదండ కాండాభిహత మహానోకహ
మండలంబై సింహవ్యాఘ్రఘూకరాహాభైరవనిర్ఘోష సంకులంబై మృగేంద్ర
విదళిత మత్తమాతంగ కుంభపరిపతిత ముక్తాఫల విరాజిత వనాంతం

యై దారుణారావనానాపతత్రికంఠకుహూకారంబై ఝిల్లికాగణనాదితంబై గంభీరస్వనశ్వాపదసంపూర్ణంబై ధవాశ్వకర్ణకకుభబిల్వతిందుకపాటలబదరీసంకీర్ణంబై దుష్ప్రవేశంబై యున్నయది దీని తెఱం గెఱింగింపవే యనియభ్యర్థించిన నమ్మునిమండలాఖండలుండు రఘువంశపద్మినీమార్తాండునకిట్లనియె ॥ (శా) కాలాంభోధరతుల్యమూర్తి గిరిసం, కాశుండు వృత్రుండు శౌ । ర్యాలంకారుఁడు తొల్లిఘోరతప, ముద్యత్ప్రీతిఁ గావింపఁగా । నాలోకించి బలాంతకుం డలుకతో, నాభీలవజ్రాహతిన్ । వేలోపాంతనితాంత కాననమున, న్వేఁ ద్రుంచెఁ దన్మూర్ధమున్ ॥ (ఉ) ద్రుంచినయంతలో హరికిఁ, దోడనె గ్రక్కున బ్రహ్మహత్యప్రా । ప్తించినఁ జూచి తాపసులు దేవతలున్ వగఁగూర నాత్మఁ జిం । తించియు ఘాపనోదనవిధిం దగుభంగిఁ బ్రబుద్ధులై విచా । రించి బలారినీడకు నిలింపులు దోడ్కొని వచ్చి సమ్మతిన్ ॥ (తే, గీ) కలశతటినీ[illegible]జలంబులం, గమునఁ జిలికి । బాధకంబైన నిర్జర, నాథగాత్ర । కలితమలముఁ గరూశంబు, నలఘుభంగి । నిచట విడియించి ప్రీతులై, రెల్లవారు ॥ (ఆట, వె) అటుల నిర్మలాత్ముఁ, డై నిష్కరూశుఁడై । పాకశాసనుండు, భవ్యుఁడగుచు । మునులు దేవతలును, మోదింప భాసిల్లె । హిమము విరియ వెలుఁగు, నినుని కరణి ॥ (వ) ఇట్లు కృతార్థుండై మహేంద్రుండు మదీయాంగమలకరూశంబుల ధరించిన చోట నీజనపదంబులు మలదకరూశనామంబులం బ్రసిద్ధికి నెక్కుంగాక యని యుద్దేశంబులకు వరం బొసంగిన ॥ (చ) అనిమిషు లవ్విధంబు విని, హర్షము మీఱఁగ నాబలాంతకుం । బనిఁగొని సాధువాక్యములఁ, బ్రస్తుతిఁ జేసి సురాధినాథనీ । వనిన తెఱంగు నర్థశుభములై ధన । ధాన్యసమృద్ధి నిమ్మహా । జనపదముల్ సమస్తగుణ, సంపదలం జెలువారు నిత్యమున్ ॥ (వ) అనిపలికి బృందారకబృందంబు పురందరసహితంబై దివంబునకుం

(విశ్వామిత్రుఁడు రామునికిఁ దాటకా వృత్తాంతంబు దెల్పి దానిఁ జంప నియోగించు

జనియె నంతఁ గొంతకాలంబునకు సుందుం డనువాని భార్య తాటక యను నొక యక్షి కామరూపిణియై వేయిమదపుటేనుంగుల కుంగల బలంబు గలిగి తన పుత్రుండగు మారీచుం డను రాక్షసుని శక్రతుల్యపరాక్రముని మహాబాహుని సంకాశదేహుని విపులాంసుని మహాశీర్షు నింగాంచి మలదకరూశసంజ్ఞ లయీజనపదంబుల రెంటి నాక్రమించి నిత్యంబు వినాశంబు నొందింపుచు ధనుల హింసింపుచు దుష్టచారిణియై సో... యోజన మాత్రంబు దవ్వు

తార మార్గంబు నిరోధించి యున్నది యక్షిచేత విజనీకృతంబైన యీగహనంబు విడిచి దేశోపప్లవంబు కంటె మున్ను నివసించియున్న జనం బిప్పటికిని మఱల ప్రవేశింపకున్నది గావున ॥ (సీ) మనుజేంద్రనందన, మన్నియోగంబున నాత్మీయ భుజబలం, బాశ్రయించి । యీదుష్టచారిణి, నీయక్షి వధియించి నేఁడె యీదేశంబు, నిర్భయంబుఁ । గాఁజేయు మిమ్మహా, కాంతారమును జొర వెఱతు రింద్రాదిదిగ్వరులు దీని । వలనభయంబున, వాఁడిదీపింపంగ దీని నోర్చెడు నట్టి, ధీరుఁ డెందుఁ ॥ (తే, గీ) గానమం బకహాతి దీనిఁ, గడపిపుచ్చి । పుడమి నత్యంత విఖ్యాతి వడయుమయ్య । తెలియఁ జెప్పితి నీకు నీ, దేశవిధము । రమ్యగుణసాంద్ర రాజేంద్ర, రామచంద్ర ॥ (క) అనియ ప్రమేయుఁడగున । మ్మునిపతి వల్కిని రాజపుత్రుఁడు రాముం । డనియెం గ్రమ్మఱ మానికి । ఘనవిస్మయ మాత్మలోనఁ, గడలుకొనంగన్ ॥ (తే, గీ) అనఘ యక్షులు ధాత్రిలో, నల్పసత్వ । లనఁగ వినియుందు మబలక, ట్లనుపమాన । మదకరిసహస్రసత్వమే మాడ్కిఁ గలిగెఁ । గరుణదళుకొత్తఁ దెల్పుము, గాధితనయ ॥ (వ) అనియడిగిన విదితాత్ముండగు రాముని వచనంబు విని విశ్వామిత్రుండిది యొక్క వరప్రభావంబునం గలిగిన సత్వంబ త్తెఱం గెఱింగించెద వినుమని యిట్లనియె ॥ (చ) అలఘుయశుండు ధార్మికుఁడు, యక్షవరుండు సుకేతునామకుం । డలరు నొకం డతండు తన, యార్థముగా నతిఘోరనిష్ఠతో । జలజభవుం గుఱించి మును, సంయమియై బహువర్షముల్ దమం । బలవడ సాంద్రదుర్గగహ, నాంతరసీమఁ దపంబుఁ జేయఁగన్ ॥ (ఉ) మెచ్చి పయోజసంభవుఁడ, మేయకృపాకలితాంతరంగుఁడై । వచ్చి కుమారు నీక వెస, వానికిఁ బుత్రిక నిచ్చి సమ్మదం । బచ్చుపడంగ దానికి సహస్రమదావళసత్వమిచ్చి తా । మెచ్చుగఁ దాటకాఖ్య నిడి మెల్లన నేగె సుపర్వయుక్తుఁడై ॥ (వ) అంత సుకేతుండు రూపయౌవనశాలిని యగు తనపుత్రికను దాటకను ఝర్ఝరపుత్రుండగు సుందునకుఁ బత్నిగా నొసంగె నంతఁ గొండొకకాలంబునకు నయ్యక్షి మారీచుం డనువాని నొక్కకొడుకుం బడసె సుందుండు నిహతుండైన యనంతరంబ పుత్రసహితయై వనంబునం జరింపుచు నొక్కనాఁడు జాతసంరంభయై గర్జింపుచు భక్షార్థం బగస్త్యమునీంద్రుని పైఁ గవిసిన నమ్మహానుభావుండు ॥ (మ) కడకన్నెఱ్ఱఁ జేసి రాక్షసుఁడవుం గమ్మంచు మారీచునిం । గడు నల్కన్ శపియించి తోడనె జగత్కల్యాణుఁ డత్తాటకం । బడిమిం దారుణవక్త్రయై వికటరూ, పస్యాకృతిం...

ల్చి కా। యిడనిర్మర్త్యులందించు నుండుమసకో, పాటోపుండై తిట్టెనర్॥ (క) ఆపా పయక్షియీగతి। శాపకృతామర్షయగుచుం, జల మడరంగంద। తాపసవర చరితంబగు। నీపావనవనమునర్రహింజరియించుర్॥ (క) క్షితివరసుత నీ వీదు। మఱితని దురాధర్షదుష్ట, రాక్షసిని మహో। ద్ధతసత్వను గోబ్రాహ్మ ణ। హితార్థము వధింపుమయ్య,యినకులతిలకా॥ (తే.గీ) అనఘ శాపసం స్పృష్టయైనట్టి దీనిం। జంపముల్లోకముల యందుం, జాలినట్టి। ఘనుండు పు రుషుం డొక్కరుండైనం, గానంబడండు। లోకసన్నుతనీవొక్కరుండవుదక్క॥ (మ) వనితంజంపుట నీతి గాదనుచు భావంబందు రాజేంద్ర నీ। వనుమానిం చెదవేమొ ధాత్రిజనరక్షార్థ్యయుండౌ తేనికి। న్ననిగాదౌష్ట్యము గల్గుచోంబురు షునైనం గాంతనైనందగర్। ఘనవర్ణాశ్రమరక్షణార్థము వడిర్, ఖండింప ధర్మంబగుర్॥ (చ) వెనకి దురాత్ములం దునిమి, వీరత సాధులంబ్రోచు చుం తయు। న్మదనసమానసుందర సనాతన ధర్మము రాజమౌళికి। న్సదమలకీర్తి గల్గు వృజి, నంబుఘటిల్లదుకావునంబటు। ప్రదరహతిర్ జగంబు లల్లరర్ వ డిఁద్రుంపుము పేశినుద్ధతిర్॥ (చ)మును పృథివిర్ వడింజెఱుపం, బూనిన దానివి రోచనాఖ్యనం। దననలమం దరందునుమం, డామఘవుండు జగంబపాక సూ। దనము గంజేయుఁబూనినయసరవిచారిణికావ్యమాతప। ద్మనయను చేరహిం చెగడె,దాశరథీ వినమే తదర్థముల్॥ (వ) మఱియు ధర్మపరిపాలనతత్పరు లగుమహాత్ములుమహీపతులు పెక్కండ్రధర్మ నిరతులగు యువతులం బెక్కం డ్రవధించిరి కావున నీవునుసంశయంబువదలిదుష్టచారిణియగుదీనింజంపిలోకం బులకుంబరమకల్యాణంబుసంపాదించికీర్తి వడయుమని పలికిననక్లీబంబగుముని వచనంబువినిదృఢవ్రతుండగు రాఘవుండుప్రాంజలియైవెండియునిట్లనియె॥ (ఉ) తాపసరాజుమాటజవ,దాటకచేయుమురామయంచయో। ధ్యాపురమందు స ద్గురుసభాంతరమందు మహాత్ముండైనధా। త్రీపతిచేత నేనునుపదిష్టుండనైతినివచ్చు వేళభా। పాపతితుల్యయప్పలుకు,సత్యముమీఱంగ రాదునాకింకర్॥ (ఉ) కావున మద్గురుండనిన, కైవడినీడగుశాసనంబునం। గావరమెత్తిలోకములం, గాఱియ పెట్టుచు నున్న తాటకర్। వేవధియించి గోవులకు,విష్టపపఙ్క్తికి విప్రకోటికిర్। దీవరమేలు చేసిజగ,తిర్మహనీయయశంబుంగాంచెదర్॥ (వ) అనిపలికియ రిందముండగు రాముండు మహనీయశరాసనంబు లీలం గేలనందుకొని ముష్టి

నలవరించి తీవ్రంబుగా గుణప్రణాదంబుం జేసిన॥ (శా) ఘోరంబైన తదీ

## (*) శ్రీరాముండు తాటకను సంహరించుట. (*)

యనాదము కుల, క్షోణీధ్రభాస్వద్గుహా। ద్వారోద్యత్ప్రతిశబ్దముర్ దళితది, గ్దంతావళఘోషముర్। దోరంబై కుహరంబు నిండంబరవం,దోద్ధ్వా నభో భూదిశా। పారావారవిహారజంతువులు వి, భ్రాంతింగొనెన్నారెరుర్॥ (క) ఆరావము వీనులకుంగ। దోరంబై యురమునకుంబట్టు ప్రహృదినిజ్జైయై। కారింప మదవిఘూర్ణిత। ఘోరానన యసుచు యక్షి,క్రోధవివశయై॥ (మ) ఎల మిం బాదయుగాహతిర్ క్షితితలం,బిట్టట్టునల్లాడంగాం। బ్రళయాబ్దంబు విధం బునర్ భయదరుం, భద్మ్భారిగర్జాధ్వనుల్। సెలంగర్ మార్వినినాదమెందు బొడమెర్, శీఘ్రింబయిచ్ఛోటికిర్। గులశైలాకృతి నేగుదెంచెం గనులర్, ఘోరాగ్ని కీలల్ పడర్॥ (ఉ) భూరినిశాతఖడ్గముల,పోలిక నొప్పు మహో గ్రదంష్ట్రిలుర్। బారుణభంగి నూతులవి,ధంబునం గ్రాలెడు వృత్తనేత్రముల్। ఘోరనినాదముల్ సెలంగం, గోపమునర్ దనపైకివచ్చు దు। శ్చారిణి యక్షిం గాంచిరఘు,చంద్రుడు లక్ష్మణుతోడ నిట్లనుర్॥ (క) కనుంగొంటె లక్ష్మణా యీ। దనుజనుఘోరమగుమేనుః, దప్పకదీనిర్। ఘనభీషణవక్త్రినుగనుం। గొ నంతనె యలంతివారి,గుండెలవియవే॥ (మ) గరితం జంపుట పాడిగాదుజ ముల్, కైవారముల్ సేయ భీ। కరఖడ్గంబునదీని ముక్కు చెవులర్, ఖండించి పోత్తోడ దు। ర్ధరసత్వంబును దేజముర్ గతియుశౌ,ర్యంబుర్ హరింతుర్ గ వా। కరవంశోత్తమచూడు మిప్పుడు సమ,గ్రంబైన మద్వీర్యముర్॥ (వ) అని రాముండు పల్కుచుండ నప్పుడు నిశాటియగు తాటకక్రోధమూర్ఛిత యై యాటోపంబున భుజంబులెత్తి గర్జింపుచు నారఘుపుంగవుని డాయ వ చ్చినట్లైఅంగువిలోకించి బ్రహ్మర్షిపుంగవుండగు విశ్వామిత్రుండు దానిహుం కారంబుననదల్చి రాఘవులకుస్వస్తియగుంగాక విజయంబుగల్గుంగాకయనిప ల్కినంతనయ్యక్షి యక్షీణబలంబున సాంద్రరజోవృష్టిఘోరంబుగానారాఘవు లం బొదివియొక్కముహూర్తంబునిరంతరరజోమేఘంబున వెగడుపఱచి ప ఱపడిమాయంబన్ని నీరంధ్రింబుగా శిలావర్షంబుంగురిసినంగోపించి॥ (క) రాముండుశరవర్షంబున। భీమశిలావృష్టిమాన్పి, పృథుకాండముల్। యా నిచరిభుజయుగళము। భూమిందునిసిపడంగ సేసె, మునిపతిమెచ్చర్॥ (ఉ)

తోడనె లక్ష్మణుండు ముదితుండయి రాక్షసి కర్ణనాసికల్ । వాఁడిఁ జెలంగు
ఖడ్గమునఁ, వారక గాధిసుతుండు మెచ్చఁదా । నోడక నంతఁ గోసి రయ, మెప్ప వి
రూపిణిఁ జేసె మింటిపై । వేడుక మీఱ నిర్జరులు, వేయి ముఖంబుల సన్నుతింపఁ
గన్ ॥ (సీ) అంతఁ దాటక కోప, మగ్గలమై పర్వఁ గామరూపముల నేకములఁ దా
ల్చి । మింటిపై కెగసి భ్రమించుచుఁ దనమేను గన్పడకుండఁగ, గాఢభంగిఁ ।
జీకట్లఁ జేయుచు, శిలలు పైఁ బెట్టువ్రేయుచు రజము రేఁపుచు సాంద్ర, రక్తవృష్టిఁ । గురి
యుచు మేఘంబు, కరణి గర్జించుచు నట్టహాసముఁ జేయ నపుడు తెలిసి ॥ (తే, గీ)
యశ్మవృష్టి వికీర్యమాణాంగులైన । మనుజపతి నందనులఁ జూచి, మునికులాబ్ధి ।
హారిణరశ్మి విశ్వామిత్రుఁ, డమితయశుఁడు । హితము దీపింప మెల్లన, నిట్టులని
యె ॥ (చ) ఇనకులసార్వభౌమ తడ, వేల దినేంద్రుఁడు గ్రుంకుచున్నవాఁ । డ
నుపమ సంధ్య వచ్చెనసు, రాలికి రాత్రులయందు సత్వముల్ । ఘనతర తేజ మె
క్కుడగుఁ, గావున వే తెగఁ జూడు దీనిస । జ్జనులకు బాధఁ జేసెడుని, శాచరిపైఁ
గృపఁ గూర్పనేటికిన్ ॥ (క) ఈ యక్షీ మునివరేణ్యులు । సేయు మఖంబులకుఁ గీడు
సేయుచునుండున్ । వెయేల లోకహితమిది । పాయక తెగఁ జూడు దీని, భద్ర
ముగలుగున్ ॥ (వ) అని పలికిన నవ్విశ్వామిత్రుని వచనంబులు విని సంశయంబు
వదలి తీవ్రంబగు వీర్యంబంగీకరించి శబ్దవేదిత్వంబుఁ జూపుచు సాంద్రంబుగా శి
లావర్షంబుఁ గురిసెడు తాటకమీఁద సాయకపరంపరలఁ బరగించి యవరోధిం
చిన నది శరజాలపరీతయై మాయాబలవిశేషంబున దెరల్చుకొని గర్జింపుచు
నశనికరణి శీఘ్రజవంబున రామలక్ష్మణులం బట్టుకొనంగ మకించిన దానిం జూచి
రాముం డురయంబున నొక్క శిలీముఖంబు దాని యురంబు గాఁడ నేసిన నయ్యమ్ము
తాకున శోర్వక యక్షీ తత్క్షణంబ రోఁజుచుఁ బుడమిం ద్రెళ్లి విగతప్రా

—(*దేవేంద్రుడు ప్రీతుండై కౌశికునితో భృశాశ్వపుత్రుల రామున కొసంగుమనుట*)—

ణ యయ్యె నయ్యద్భుతకర్మంబు విలోకించి పురందరుండు బృందారక సందోహ
సహితుండై సాధువాక్యంబుల నభినందింపుచు నచ్చటికిఁ జనుదెంచి రామలక్ష్మ
ణులను బ్రీతభాంగిం బూజించి పదంపడి విశ్వామిత్రు నహార్హవిధంబునం బూజించి
మందమధురాలాపంబులం బ్రస్తుతించి పరమప్రీతుండై యిట్లనియె ॥ (సీ) మునినాథ
నీ మహా, ద్భుత దివ్యచారిత్ర మహిమ నుతింపంగ, మా తరంబె । యీ రాఘవుని చేత
నే పాపు తాటక జంపించి కరుణము, జగములకును । మేలుఁ గావించితి, మేమంద



అమునిర్జరయానందపరులమై, యలరఁగంటి । మితఁడు నిర్జరులకు హితముఁ జే
యఁగఁ బుట్టినట్టి మహామహుండట్లు గాక ॥ (తే, గీ) మున్ను నీవు తపోబలం, బునఁ
బడసిన । ధన్యుల భృశాశ్వ కూర్మినందనుల నస్త్ర । శస్త్రగాత్రుల సమదగ్ర,
శౌర్యనిధుల । నితని కొసఁగుము వేత్వేర, నింపు మెఱయ ॥ (క) అని పలికి గాధి
తనయుని । వినుతించి తగన్ రఘుప్రవీరుండగు రా । ముని వినుతింపుచు సురపతి ।
చని యెన్నరకలితుఁ డగుచు, సమ్మోదమునన్ ॥ (తే, గీ) అంతఁ దాటకావనవాసు,
లైన మునులు । భక్తిఁ జనుదెంచి కౌశికుఁ బ్రస్తుతించి । రాముని నాశీర్వదించి వాలాయ
మింక । దపములు ఫలించె నని పల్కి, తలఁగిచనిరి ॥ (వ) అంత విశ్వామిత్రుండు తా
టకావధతోషితుండై జగత్పవిత్రుండగు కౌసల్యాపుత్రుని బాహువులం బరిరం
భించి శిరంబు మూర్కొని మందమధురాలాపంబుల నిట్లనియె ॥ (తే, గీ) అమర
దూషిణియైన యీ, యక్షిఁ జంపి । రవికులోత్తమ నీవు ప్రత్రి, భువనములకు । నేఁడు
మితిలేని ప్రమదంబు, నించినాఁడ । వింక నీకు ధ్వరన సాధ్య మెద్ది లేదు ॥ (ఆ, వె) ఇనుఁ
డు గ్రుంకె సంధ్య, యేతెంచె నీరాత్రి । నిచట నధివసించి, యెల్లి గదలి । పోద మ
స్మదీయ, పుణ్యాశ్రమమునకు । నచటి మానులెల్ల హర్ష మొంద ॥ (క) నావిని
సంతోషము మది । నావిర్భవమంద రాముఁ, డయ్యామినియం । దావిపిన
మున వసించెను । ధీవరుఁడగు లక్ష్మణుండు, ధృతి సేవింపన్ ॥ (తే, గీ) దేవతలకై
నఁ జొరరాని, యీ వనంబు । ముక్తశాపమై నరమృగ, మునివరులకు । సుల
భమై చాలనవ్వేళఁ, జూడనొప్పె । రమ్యతరమైన యల చైత్రరథము కరణి ॥
(వ) ఇత్తెఱంగున నా రఘుసత్తముండు తాటకం బరిమార్చి సురసిద్ధసంఘంబు
లచేతఁ బ్రశస్యమానుండై విశ్వామిత్ర లక్ష్మణసహితంబుగా నారాత్రి నచ్చట
సుఖలీల నిద్రించి మఱునాఁడు ప్రభాతకాలంబున మేలుకాంచె నంతకు మున్న
మేల్కొని గాధేయుండు కరుణావిధేయుండై రామభద్రు నవలోకించి మధు
రాక్షరవ్యక్తంబుగా నిట్లనియె ॥ (ఉ) తామరసారితుల్య శుభ, దర్శన దా

(*విశ్వామిత్రుఁడు శ్రీరామునకు భృశాశ్వాపత్యంబులగు సమస్తాస్త్రంబుల నొసంగుట.*)

రుణశత్రుకర్శనా । రామ దినేశ్వరాన్వయల, లామ భవన్మహనీయ విక్రమం ।
బేమని చెప్పవచ్చు మది, కింపొనరించెఁ గృపాప్తి నీ కికం । బ్రేమ నొసంగెదం
గొనుము, పెంపలరంగ భృశాశ్వపుత్రులన్ ॥ (చ) నరసుర యక్షకింపురు
ష, నాగనభశ్చరసిద్ధసాధ్యఖే । చరగరుడాసురాద్యరుల, సంగరరంగమునం జ

యించి సు । స్థిరజయలక్ష్మిఁ జేకొనఁగఁ, జేయుప్రభావముగల్గు నట్టి భీ । కర నిఖిలాస్త్రశస్త్రములఁ, గైకొను మిచ్చెద నిష్టసిద్ధికిన్ ॥ (వ) అని పలికి జలంబు లుపస్పృశించి ప్రసన్నవదనుండై నియమంబున సర్వాస్త్రమంత్రంబులు సంస్మరింపుచుఁ దన యట్లు ప్రక్షాళిత పాణిపాదుండై శుచియై చను దెంచిన రామభద్రునిఁ బ్రాఙ్ముఖంబుగా నాసీనుం జేసి క్రమక్రమంబున దండచక్రంబును ధర్మచక్రంబును గాలచక్రంబును విష్ణుచక్రంబును నైంద్రాస్త్రంబును వజ్రంబును శైవం బగు శూలంబును బ్రహ్మశిరంబును నిషీకంబును బ్రహ్మాస్త్రంబును మోదకీశిఖరీ నామకంబైన గదాయుగ్మంబును ధర్మపాశంబును గాలపాశంబును వరుణపాశంబును శుష్కార్ద్రనామకంబైన యశనిద్వయంబును బైనాకంబైన యస్త్రంబును నారాయణాస్త్రంబును నాగ్నేయాస్త్రంబును శిఖరంబును వాయవ్యాస్త్రంబును బ్రథనంబును హయశిరంబును గ్రౌంచాస్త్రంబును విష్ణుశక్తి రుద్రశక్తి నామకశక్తిద్వయంబును మఱియు నసురులు ధరించు నట్టి కంకాళము సలకాపాలకంకణంబులును వైద్యాధరాస్త్రంబును నందనాస్త్రంబును నసిరత్నంబును గంధర్వాస్త్రంబును మానవంబును బ్రస్వాపనప్రశమనంబులును సూర్యాస్త్రంబును దర్పణంబును శోషణంబును సంతాపనవిలాపనంబులును మదనంబును బైశాచాస్త్రంబును మోహనంబును సౌమనంబును తామసంబును సంవర్ధనంబును మాసలంబును సత్యాస్త్రంబును మాయాధరంబును దేజఃప్రభంబును బరతేజోపకర్షణంబగు సోమాస్త్రంబును శిశిరాస్త్రంబును త్వష్టృదేవతాకంబైన యస్త్రంబును సుదామనంబును దారుణంబగు భగాస్త్రంబును శితేషువును మానవాస్త్రంబును మొదలుగాఁ గల యనేక దివ్యాస్త్రశస్త్రంబు లుపదేశించి యమ్మునిపుంగవుం డమ్మహాస్త్రంబు లన్నియు రామాధీనంబులఁ గావించుటకుఁ గ్రమ్మఱ సంస్మరించి మంత్రగ్రామంబంతయు జపియించిన నవి యన్నియు నవ్విశ్వామిత్రుని చేత ననుమతి వడసి భీమముఖంబులును విజయసంపాదనంబులును దంష్ట్రాకరాళ వక్త్రంబులును జ్వలన జ్వాలాభీలంబులును విస్ఫులింగ పటలీ సంచారఘోరంబులును జైత్రంబులును భీషణప్రతాపదుర్నిరీక్ష్యంబులును బ్రచండ తేజః కలితంబులును భయంకరాకారంబులును నానావర్ణరూపంబులును నై రాముని ముంగలం బొడసూపి కేలుమోడ్చి ఫాలంబునం జేర్చి యిట్లనియె ॥ (క) ఏపగిదిం జరియింతుము । ఏపగతుని మీఁదఁ జనుదు, మెయ్యది పనిమా । కీపట్ల నత సమస్తో । ర్వీపా నీకింకరులము, కృపనేలుమిఁకన్ ॥ (క) అన విని రాముఁడు వానిని । దనకరమున సంస్పృశించి, తప్పక మిమ్ముం । బనిగల యప్పుడు చిత్తం । బునఁ దలఁచెద నపుడు రండి,పుడు పొందు రహిన్ ॥ (క) నావిని యయ్యస్త్రంబులు । భావంబునఁ బొంగి రాము, పాదంబులకుం । గేవలభక్తి నమస్కృతిఁ । గావించి యథేచ్ఛఁ జనియెఁ,గౌతుకమలరన్ ॥ (తే,గీ) అంత రఘుపతి ముఖమున, హర్షరేఖ । గనుపడ మునీశ్వరుని పాద, కమలములకు । వందనముఁ జేసి పేశల,వాగ్విభూతి । వెలయు మధురోక్తి,నిట్లని విన్నవించె ॥ (తే,గీ) అనఘ సర్వాస్త్రకుశలుండ, నైతి నీదు । కరుణ ముల్లోకములయందు, నిరు, పమాన । మహిమ వడసితి నింక స,మంచితముగ । నస్త్రముల కుపసంహారమానతీవె ॥ (మ) అపు డిట్లా రఘునేత వల్కవిని బ్రహ్మర్షభుండు గాధేయుఁడో । నృపవంశోత్తమ యస్త్రకోటికి నయం,బేపారజన్యంబులం । దుపసంహారమెఱింగి కొండెయనువై, యొప్పారు సంప్రీతితో । నపురూపంబుగ నిచ్చెదం గొనుము సంహారాస్త్రముల్ చెచ్చెరన్ ॥ (వ) అనిపలికి ధారణశక్తియుక్తుండును సువ్రతుండును శుచియు నగు విశ్వామిత్రుండు సత్యవంతంబును సత్యకీర్తియు ధృష్టంబును రభసంబును బ్రతిహారతరంబును బరాఙ్ముఖంబును నవాఙ్ముఖంబును లక్షాక్షవిషమంబులును దృఢనాభసునాభ పద్మనాభ మహానాభ ధుంధునాభంబులును దశాక్షవక్ర దశశీర్షశతోదరంబులును జ్యోతిషంబును గృశనంబును నైరాశ్యంబును విమలంబును యోగంధరంబును హరిద్రంబును దైత్యప్రశమనంబులును సార్చిర్మాలియు ధృతిమాలియు వృత్తిమంతంబును రుచిరంబును బితృసౌమనసంబును విధూతమకరంబులును గరవీరకరంబును ధనధాన్యంబులును గామరూపంబును గామరుచియు మోహంబును నావరణంబును జృంభకంబును సర్వనాభంబును సంతానవరణంబులు మొదలుగాఁ గల పరమభాస్వరులఁ గామరూపుల భృశాశ్వతనయుల దివ్యదేహుల నొసంగి యిట్లనియె ॥ (తే,గీ) అమలగుణపాత్రభూతుండ,వగుటఁ జేసి । నీకు నొసఁగితి నీయస్త్ర,నిచయము వెల్ల । సమ్మతిఁ బ్రతిగ్రహింపుము, సంతతంబు । శుభము వీర్యంబు తేజంబు సుఖము గలుగు ॥ (క) అనిపలుక నపుడు రాముఁడు । మునివత్తభృశాశ్వసుతుల మునుకొని మోదం । బునఁ గైకొనియును తేజరి । ల్లెనఁ జూడఁగ నొప్పె నుదిత, పూ

షునిభంగిఁ ॥ (సీ) ప్రళయకాలాభీల, పావకార్చుల భంగిఁ గమల మిత్రునిమ
యూ, ఖములమాడ్కిఁ । గమనీయరాకేందు, కరములకై వడి దీప్త ఖద్యోతదీ
ధితుల రీతి । లలితక్షణప్రభా, లతికలసొబగున గాఢాంధకారసం, ఘములకర
ణి । భీషణాంగారకా,భీలరోచులయట్లు సముదగ్రధూమజా, లములపగిదిఁ ।
(తే, గీ) జతురమునిదత్తదివ్యాస్త్ర, శస్త్రములటు । మూర్తిమంతంబులై
రామ, మూర్తిమ్రోల । నిలిచిసేవాంజలులఁ జేసి, నిరుపమాన ।లలితసుమ
మంజులోక్తులఁ,బలికెనప్పుడు ॥(వ) దేవాయేము భవదీయ శాసనంబు శిరంబు
ననిడికొని యెద్ది పంచినఁ జేయంగలవార మానతిండనిన నారఘునందనుండు
మునిపతిమంత్రప్రభావంబున కచ్చెరువొందుచుఁ బనిగలయప్పుడుమిమ్ముందలం
చెద నప్పుడవచ్చి యభిమతార్థసిద్ధిఁ జేయుండనిపలికి బహుమానపురస్సరంబు
గాననిచిన నయ్యస్త్రంబులు రామునకభివాదనంబుఁ జేసి యతనిచేతననుజ్ఞఁ గొ
నియట్ల చేసెదమని పల్కి యథేచ్ఛం జనియెనంతనా రాముండు తనకు విశ్వామిత్రుం
డు కృపనొసంగిన శస్త్రాస్త్రంబులన్నియు లక్ష్మణునకుపదేశించి లక్ష్మణోపేతుం
డై విశ్వామిత్రసహితంబుగా నచ్చోటుఁ బాసి యవ్వల రమ్యంబులైన తాపసా
శ్రమంబులు విలోకింపుచుం జనిచని యొక్కచో టసుమనోవిరాజితంబై పుణ్యజ
నసమాకీర్ణంబై ఖగసంచారక్షమంబై యనంతలక్ష్మీవిరాజమానంబై మునీం
ద్రవాణీవిలాసంబై స్వర్గలోకంబు భంగిఁ జైత్రరథంబు మాడ్కి వియన్మార్గం
బు కరణి వైకుంఠంబుకై వడి సత్యలోకంబు చందంబున మనోరమంబై దివ్యం
బై భవ్యంబై సేవ్యంబై దర్శనీయంబై దూరవాసితాపసప్రవేశ సంకులం
బై యొక్కపర్వతసమీపంబున నొప్పునొక్క మహనీయతపోవనంబు విలోకిం
చి విశ్వామిత్రునకిట్లనియె ॥ (చ) అనఘ మహానుభావ కరుణాభరణా ముని
వంశవర్యయీ । వనమునఁ గల్గు పక్షిమృగ,వర్గము నగ్గలి భంగి నెప్పుడున్ ।
ఘనతర వేదమంత్రముల, గానముఁ జేయుచునున్న వేతపో।ధనుఁడు వసించు నా
శ్రమప,దంబిది దీని తెఱంగుఁ జెప్పవే ॥ (సీ) అనఘాత్మ నీదు ది, వ్యాశ్రమం బె
య్యది యల్లరారు నెచ్చోట, యజ్ఞవాటి । యజ్ఞవిఘ్నము సేయు,నట్టి పా
పాత్ములు దితిపుత్రులు వసించు, దేశ మెద్ది । యెచ్చోటనుండి వా, రేతెంతు రి
చటికి నెవ్విధంబునఁ జరింయించువారు । సవనంబుఁ జేయుంచు, సంయమిలె
వ్వారలిచ్చటికా దేశ, మెంతదవ్వు ॥ (తే,గీ,) నిజ శరులవధియించి,నీమఖంబు ।



కడమ పడకుండఁ గాచుటో, గాధితనయ । నానువలసిన కార్యంబు, నయ మెు
లప్ప । నన్నియును మాకుఁ గృపమీఱ నెన్ని చెప్పుమ ॥ (క) అనియడిగిన నస్త్రశర
(*విశ్వామిత్రుఁడు రామునకుఁ దనదగు సిద్ధాశ్రమము యొక్క ప్రభావంబు తెలిగించుట.*)
థ।జననాథ కుమారుఁ జూచి, సమ్మోదమున । న్మునికులశేఖరుఁ డిట్లని । విసిపింపఁ
దొడంగెనప్పుడు, విపినక్రమముల్ ॥ (చ) అనఘ రమాధినాథుఁడగు, నచ్యుతుఁడీ, విపి
నంబునందున । త్యనుపమ ఘోరనిష్ఠ చెలు,వార సమస్త జగద్ధితంబుగా । మును బ
హుదివ్యవర్షముల, మోఘతపంబొనరించె రాజనం । దనయిది వామనాశ్రమ
మనంగ రహిం దనరారు సుర్వరన్ ॥ (ఆ, వె) రామయిచటఁ దొల్లి, రాజీవనేత్రుం
డు । విపులనిష్ఠ ఘోర, తపముఁ జేసి । సిద్ధుఁడయ్యెఁ గాన, సిద్ధాశ్రమ మనంగఁ ।
బిదపఁ బేరువడసెఁ, బృథివియందు ॥ (చ) చెలువుగ నీగతిం దపముఁ, జేయుచు
మాధవుఁడున్న వేళదో । బ్బలమహిమాధికుం డుబలి, రాక్షసభర్త విరోచనా
త్మజుం । డలఘుయశుండు శక్రునిసు, రాళి రణంబునఁ దోలి ముజ్జగం । బులఁగడు
మేటియై త్రిదివ, మున్మహిళద్యుతి నేలుచున్నెడన్ ॥ (వ) దేవతలందఱు వహ్ని
పురోగములై యిచ్చటఁ దపంబుఁ జేయుచున్న విష్ణుకడకుం జనుదెంచి దేవా వి
రోచననందనుండైన బలియజ్ఞంబుఁ జేయుచు వనీపకులెద్ది గోరినదాని నెల్లనొసం
గుచున్నవాఁడయ్యజ్ఞంబు సమాప్తినొందించక మున్నె నీవు దేవతాహితార్థం
బుకొఱకు మాయాయోగబలంబున వామనత్వంబంగీకరించి దేవతా కార్యం
బుఁ దీర్చి యుత్తమంబైన కల్యాణంబుఁ జేయుము ॥ (ఆ, వె) అనుచుసురలు వేఁ
డ, నప్పుడు జితారియై । కాంతనదితిఁ గూడి, కశ్యపుండు । వ్రతముఁ బూని దివ్య,
వర్షసహస్రంబు।తపముసల్పుటయును, దయదలిర్ప ॥ (తే, గీ) కమలలో
చనుఁ డప్పుడున్నా, త్మ దర్శింప నలరి కశ్యపుఁ డతిభక్తి, నలఁగ మ్రొక్కి ।నిగమసూ
క్తులవినుతించి, నిరుపమాన । పేశలసుధామయోక్తులఁ బిదపననియె ॥(వ) దేవా
నీవు తపోమయుండవు తపోరాశివి తపోమూర్తివి తపస్స్వభావుండ వట్టినిన్ను దు
స్తరంబైన తపంబు చేతం గంటిఁ బురుషోత్తముండవైన నీశరీరంబునందుఁ జరా
చరాత్మకంబైన జగంబంతయుఁ గానంబడుచున్నది కుక్షినిక్షిప్తాఖిలలోకుండ
వైన నీవాదిమధ్యాంతరహితుండవనియు ననిర్దేశ్యుండవనియు శ్రుతులునొ
డువు నట్టినిన్ను శరణంబునొందెద ॥ (క) అనినానా సూనోక్తుల । విన్నుతించిన
నాత్మ మెచ్చి విష్ణుండనునో । యనఘు వరదాహుఁడవైతివి । కోరుము ఇచ్చెద వ

రమునీకుఁ, గుతుకంబెసఁగఁ ॥ (చ) అనవిని కశ్యపుండనియె, నంజలిఁజేసిమ హాత్మనాకునీ । యనిమిషకోటికీయదితి కంచితభంగివరంబొసంగున । కనుప మబుద్ధినీయదితి, యందుఁగుమారుఁడవై బలారిక । ట్లనుజుఁడవై జనించిపర, మాతుఁడలవేల్పులనుద్ధరింపుమీ ॥ (వ) మహాత్మా యిచ్చటఁ దపంబుసిద్ధించుటం జేసియీదేశంబుసిద్ధాశ్రమంబనంబడు ననికశ్యపుండు ప్రార్థించినమహాతేజుం డగువిష్ణుండు భక్తసులభుండుగావునఁ గశ్యపుండుగోరిన తెఱంగునఁదత్తేజంబు ననదితిగర్భంబునందు వామనరూపంబున నవతరించి యాగదీక్షితుండైన వై రోచనికడకుభిక్షురూపంబునంజని యతనినడిగి పదత్రయమాత్రంబుధాత్రిఁగొ నిత్రివిక్రమరూపంబునజగత్త్రియంబునాక్రమించిబలినిరసాతలంబున నుండనియ మించిక్రమ్మఱముల్లోకంబులింద్రునకొసంగిననతండుపూర్వప్రకారంబునఁద్రివిష్ట పరాజ్యంబుఁబరిపాలింపుచుండె ॥ (తే,గీ) మొదలవామనాశ్రమమునాఁ, బొగడుఁ గాంచి । పిదపసిద్ధాశ్రమంబనఁ, బేరువడసె । ననఘచారిత్రనాఁడునీ, యాశ్ర మంబె । నేఁడునీయాశ్రమంబెయీ, నెలవుదలఁప ॥ (మ) దితిజారాతి తపం బుసల్పితగసి, ద్ధింగాంచిజంభారికి । న్నితముంజేయఁగఁజన్నఁబిమ్మటముదం బే పారఁగొన్నాళ్లకే । నతినిష్ఠందపమిచ్చటన్సలిపిప, ద్మాధీశుచందానను, స్థితిసిద్ధిం గనిక్రొత్తఁజేసితిసుమీ, సిద్ధాశ్రమత్వంబొగిన్ ॥ (మ) రవివంశోత్తమయేమదీక్షి తుఁడనై, ప్రారంభ మేపారఁగా । సవనంబుద్ధతిఁజేయఁబూనినదురా, చారా ధ్యులై సారెకు । న్దివిషత్కంటకులేగుదెంచి నడుమ, న్విఘ్నంబుఁగావింతురా । జవ మొప్పారఁగ వారిఁద్రుంచి మఖము, న్సాఫల్య మొందింపవే ॥ (చ)

(*) విశ్వామిత్రుండురామలక్ష్మణులతోడస్వకీయాశ్రమంబుఁబ్రవేశించుట. (*)

ఇదియె మదాశ్రమంబు మను,జేశ్వరనందన రమ్ముపోదము । భ్యుదయము గ ల్గునంచు ముని, పూజ్యుఁడు గాధిసుతుండు రామునిన్ । సదమలచిత్తు లక్ష్మణు ని,సమ్మతిఁ దోడ్కొని యాశ్రమోర్వికిం । పొదవఁజనె న్బునర్వ సుయు, తో జ్జ్వలచంద్రుని భంగినొప్పుచున్ ॥ (వ) ఇట్లునిజాశ్రమపదంబుఁ బ్రవేశించి యనంతరంబ ॥ (చ) పొరుగిరుగాశ్రమంబులఁ ద,పోధ ను లార ఘువర్యు ల న్మునీ । శ్వరుఁ గనుతేద్క దెందముల,సందడిపెట్టఁగ నేగుదెంచి శం । క రనిభుదివ్యబోధఘును, గాధిసుతుం దగ సత్కరించి సురం । దరులను రామల క్ష్మణులఁ, దద్దయుఁబ్రీతి భజించిరెంతయున్ ॥ (ఆ, వె) అంత నొక ము



హూర్తమచ్చోట వసియించి । రాజమౌళిసుతుల్, రాత్రిదమను । లారఘు ప్రవీరు, లమ్మునిశార్దూలు । తోడననిరి కేలుదోయిమొగిచి ॥ (క) ఇం ప్పుడెవీక్షవహింపుఁడు । చెప్పెడిదేమింక మీరు, చెప్పినకరణిం । దప్పక యీ సిద్ధాశ్రమ । మిప్పుడు సిద్ధమగుఁ గాక, హీనగుణాఢ్యా ॥

(*) విశ్వామిత్రుఁడు యాగారంభముఁ జేయుట. (*)

(మ) అన నొఁగాకని మౌనిరాజు కుతుకవ్యాకోచచిత్తాబ్జుఁడై । మునుల న్మనిచీఱంబంచి నియమంబుంగ్రాలఁగా యాగదీ । క్షనితాంతస్పృహఁదాల్చి మౌనయుతుఁడై, సంపూర్ణయజ్ఞాంగసా । వనమై యొప్పెడుయజ్ఞవేదిపయి భా,స్వన్మూర్తియై యుండఁగన్ ॥ (వ) రఘునందనులు సమాహితమనస్కులై యారాత్రిఁగడపి మఱునాఁడు ప్రభాతకాలంబున లేచి జలంబు లుపస్పృశించి పూర్వసంధ్య నుపాసించి శుచులైనియమంబునంగ్రాలుచుహుతాగ్నిహోత్రుం డై రెండవవైశ్వానరుండునుంబోలెవెలుంగుచు వేది మధ్యంబున నాసీనుండై యున్నవిశ్వామిత్రునకునమస్కరించిదేశకాలతత్త్వజ్ఞులును వచనకోవిదులును దివ్యాయుధపరిష్కృతులును బరిపంథిశిక్షాచతురు లగు రామలక్ష్మణులు నమ్మ హాత్మున కిట్లనిరి ॥ (క) దానవులెక్కాలంబున । మౌనక చనుదెంతు రిటకు, మాకే కరణిం । బూని చరియింపగాఁదగు । మౌనికులాధీశ యింత, మాకుంజెపుమా ॥ (క) అని రాజతనయులడిగిన । విని యచ్చటిమౌను లెల్ల, వేమఱు వారిం గొ నియాడి మౌనిచందము । వినుఁడని యిట్లనిరివాక్ప్ర, వీణత మెఱయన్ ॥ (క) అక్షీణ మహిముఁ డీముని । దక్షత నేఁడాది గాఁగఁ, దగ నాఱు నిశ । ల్దీక్షఁ గొని పలుకకుండును । రక్షింపఁగవలయునన్ని, రాత్రులుమీరల్ ॥ (ఉ) నావినిరాజపు త్రులు ఘనంబుననుత్సుక మంకురింప సు । శ్రీవిలసిల్లుభీకరశ, రీముఖకార్ముకశ ముద్ధరించి ర । ఠావిధిఁగంటికిన్నిదురఁ, గానక రేపవలొక్క రీతిగాఁ । గేవలనిష్ఠఁ గాచిరి జి,గీషులు వర్మనిషంగధారులై ॥ (ఉ) ఆరయయాగమీకరణి, నైదుది నంబులుచెల్లెనంత న । య్యారవనాఁడురాముఁడు మ,హామతిలక్ష్మణుఁజూచిరాక్ష స్యుల్ వారక జన్నముంజెఱుప, వత్తురు నేఁడటు గానసావధానుల మై యుండవలెనంచువచించి సమాహితాత్ముఁడై ॥ (క) దానవులందు నిమిసవనము । మానకరక్షించి భువి స,మంచితకీర్తిన్ । న్మానుగఁబడసెదఁగాకని । యానృపమ ణి గాచి యుండె, ననుజయుతుండై ॥ (క) సోపాధ్యాయపురోహిత । మైపావనమ

శసమిల్లతాంతోచ్ఛయమై । యేపారు మౌనియుతమై । చూపట్టులకు యాగవేది, సొంపై యలరెన్ ॥ (వ) ఇట్లు కల్పసూక్తప్రకారంబున మంత్రవంతంబై యాగంబు చెల్లుచున్న సమయంబున ॥ (సీ.) తొలుదొల్తఁ గల్పాంతతోయదధ్వని భంగి వినువీధి దారుణస్వనములెసఁగె । నటుమీఁదఁ బద్మినీవిటుఁడు గన్పడకుండ సాంద్రరజోమేఘజాల మడరెఁ । దరువాతఁ జూపట్టు, ద్దల యెత్తరాకుండ వితతంబుగా శిలావృష్టి గురిసెఁ । బదపడి మఖశాల, పైగహనంబుపై వేదిపై శోణితవృష్టి గురిసె ॥ (తే.గీ) నసురసేనాసమేతులై; యంబరమునఁ ! బన్ని దుష్టాత్ముఁడైన సుబాహుఁడును । రంతసత్త్వుఁడు మారీచుఁ, డనెడువాఁడు । పాయ కురుశక్తిఁ గావించు, మాయవలన ॥ (ఉ) అంత దినేశవంశవరుఁ, డత్తఱిఁ గంతయుఁ జూచి యాత్మలో । నెంతయు కినుక పర్వఁగ న, హీనబలంబున మింటనుండి య । త్యంతరయంబునం బఱచు నట్టి నిశాటులఁ బోలఁ జూచి కా । లాంతకుమాడ్కిఁ గ్రాలుచు మహాద్యుతి లక్ష్మణుతోడ నిట్లనున్ ॥ (వ) వత్స దుష్టాత్ములగు పిశితాశను లంబరంబునం బ

(*) శ్రీరాముఁడు మానవాస్త్రంబున మారీచుని సముద్రంబునం బడవైచుట. (*)

న్ని మాయాబలవిశేషంబున యజ్ఞవిఘ్నంబుఁ గావింపుచున్నవారు సమీరణంబుచేత ఘనంబులం బోలె వీరినందఱ మానవాస్త్ర సముద్ధూతులం జేసెదఁ జూడుమని పల్కి సమాహితుండై చాపంబు సారించి మౌర్వి మ్రోయించి పరమసంక్రుద్ధుండై పరమభాస్వరంబును బరమోదారంబును మహావేగంబునగు మానవాస్త్రంబు సంధించి మారీచుని యురంబుఁ దాఁక నేసిన నారాక్షసుండు శితేషుబలతాడితుండై మైమఱచి యాక్రందనంబుఁ జేయుచు వజ్రప్రహారంబున ఱెక్కలు విఱిగి మహామహీధరంబు సాగరంబునఁ బడిన తెఱంగున శతయోజనమాత్రంబు దవ్వుల సముద్రజలంబులం గూలిన నవ్విధంబు విలోకించి రాముండు లక్ష్మణున కిట్లనియె ॥ (మ) అవలోకించితె లక్ష్మణా చటులదీప్యన్మానవాస్త్రప్రభా । వవిశేషంబు దురాత్ముఁడైన దనుజు, న్వంచించి కొంపోయి య । ర్ణవతోయంబుల పైచెఁ గాని వెసఁ బ్రాణంబుం గొనం జూడదెం । తవిచిత్రంబు మహాత్ముఁడైన మునిమంత్రం బిట్టిదె యొప్పఁగన్ ॥ (క)

(*) శ్రీరాముఁడాగ్నేయవాయవ్యాస్త్రంబులచే సుబాహుఁ దత్సైన్యంబులఁ గూల్చుట.

ఘోరాకారుల దుష్టవి । హారుల నిర్ఘృణుల ఖలుర, యజ్ఞఘ్నుల దే । వా



రుల రుధిరాహారుల । దారుణకర్ముల వధింతుఁ దడయక యింకన్ ॥ (వ) అని పలికి ॥ (శా) శోణభ్రాజితనేత్రుఁడై రఘుకులేశుం డుద్ధతి న్సర్వగీ । ర్వాణవ్రాతము మెచ్చిచూడ ననలాస్త్రప్రోద్ధతిం బూర్వగీ । ర్వాణశ్రేష్ఠు సుబాహుం ద్రుంచి పటుకాండస్ఫూర్తి న్వెంటన న్మరు । ద్బాణంబు న్నిగుడించి కూల్చె నిఖిలేంద్రద్వేషుల న్వేల్మిడిన్ ॥ (వ) ఇత్తెఱంగున నారఘుసత్తముండు యజ్ఞవిఘ్నకరులగు రాక్షసులనందఱ నిశ్శేషంబుగా రూపుమాపి తొల్లి రాక్షసజయంబునందు శక్రుండునుం బోలె సమస్తమునిగణపూజితుండై యొప్పె నప్పుడు ॥ (ఉ) అంతశ్రుతిప్రయత్నముగ నమ్ముని యమ్మఖ మొక్కఁడైనఁ గో । రంత గొఱంత లేక తుది నందఁగఁ జేసి కృతార్థుఁడై సుధీ । మంతుఁడు యాగనిష్ఠమగు, మౌనము వీడి నిరీతికౌశలిన్ । సంతస మంకురింపఁ గని, చయ్యన రామునితోడ నిట్లనున్ ॥ (క) గురుకార్యముఁ జెల్లించితిఁ । బరఁగఁ గృతార్థుండనైతిఁ, బార్థివతనయా । గుఱుతుగ నీయాశ్రమమున । కడుఁగ సిద్ధాశ్రమత్వ మది నిజమయ్యెన్ ॥ (వ) అని పలికె నంత నారామలక్ష్మణులు కృతకృత్యులై యారాత్రి సుఖలీల వసియించి మఱునాఁడు ప్రభాతకాలంబున మేల్కాని కాల్యకరణీయంబులఁ దీర్చి పరమానందరసపూరితహృదయులై పావకుని చందంబునం దేజరిల్లుచున్న విశ్వామిత్రుని చరణంబుల కభివాదనంబుఁ జేసి తక్కిన మునులకు నమస్కరించి విశ్వామిత్రు నవలోకించి మధురోదారంబగు వాక్యంబున నిట్లనిరి ॥ (తే.గీ) అనఘ నీ కింకరులము ద, యార్ద్రవీక్ష । ణముల వీక్షింపుమింక మాకొనర్ప వలసి । నట్టి పని యెద్ది తెలియంగ, నానతిమ్ము । కడిమిఁ దీర్చెద మెంతటికార్యమైన ॥ (క) అని పలికిన నద్దశరథ । తనయుల వా

(*) విశ్వామిత్రుఁడు రామలక్ష్మణుల జనకయాగముఁ జూడ రా నియోగించుట. (*)

క్యముల కలరి, తాపసవర్యు ల్మునిపతి యగు విశ్వామి । త్రుని మున్నిడుకొని రఘుపతి, తో ననిరి తగన్ ॥ (చ) అలమిథిలేంద్రుఁడైన జనకాధిపుఁ డుత్తమధర్మశీలుఁ డిం । పలరఁగ నద్భుతంబుగ మహాధ్వర మొక్కటి సేయుచున్నవాఁ । డలయక నమ్మఖంబుఁ గననచ్చటికేగద మేము విక్రమో । జ్జ్వలమగుఁ గూడి నీవును బ్రసన్నమతిం జనుదెమ్ము చెచ్చెరన్ ॥ (వ) అదియునుం గాక ॥ (ఉ) ఆనృపమౌళిమందిరము, నం దొకవిల్లు సుమేరుసారమై । మానుగ నొప్పియుండుఁ బురమర్దను విల్లది తొల్లి ప్రీతులై । దానవవైరు లిచ్చి రిము,

దంబునఁ దన్మహనీయ మూర్ధ్వాసం । ధాన మొనర్ప నీవు వసు,ధావర యోగ్యుఁ
డవెన్ని చూడఁగన్॥ (క) సురగరుడోరగ నరఖే। చరకిన్నర సిద్ధసాధ్య,చారణ
యక్షా। సురులాదిన్యశరాసన। వరమెక్కిడఁజాలరమర, వరసమ తేజా॥ (క)
జననాథు లనేకులు త।ద్ధనకార్ముకశక్తి వెలియఁ, గావచ్చి బలం । బునదాని
సమారోపణ । మొనరింపఁగ లేకచనిరి,యెవవి నలజ్జన్॥ (క) జనవరసుతమా
తోడను। జను దెమ్మచ్చటికి జనక, జనపతిచాపం। బును సముదితయజ్ఞంబును।గ
నవచ్చునుదాననీకుఁ. గలుగుశుభంబుల్॥ (వ) మఱియునయ్యుత్తమశరాసనం
బు దేవతలవలనంబడసినదై దేహుండు దానియజ్ఞఫలంబునుంగా సంభావింపుచు
గృహంబుననిడికొని నిత్యంబునుగంధపుష్పధూపదీపంబులచేత నర్చింపుచున్న

—(*)విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులఁదోడ్కొని మిథిలాపురంబునకరుగుట(*)

వాఁడనిపలికినన వ్విశ్వామిత్రుండు రామలక్ష్మణులం దోడ్కొని మునిసహితుం
డై యాసిద్ధాశ్రమంబు విడిచి జాహ్నవీనది యుత్తరతీరంబుననున్న హిమవంతం
బునకుంజనియెద మీకుస్వస్తి యగుంగాక యనియచ్చటి వనదేవతలకుం జెప్పి
యప్పుడకదలియయ్యాశ్రమంబునకుంబ్రదక్షిణంబుగాఁదిరిగియుత్తరాభిముఖుం
డై మిథిలానగరమార్గంబుఁబట్టిచనియె నప్పుడమ్మహనీయాశ్రమంబుననున్న బ్ర
హ్మవాదులైనమహర్షులగ్నిహోత్రసంభారంబులచేతఁబరిపూర్ణంబులైనశకటీ
శతమాత్రంబమ్మహాత్ముని వెనుకొని యరిగిరిమఱియు నయ్యాశ్రమంబునంగల
మృగపక్షిగణంబులు భక్త్యతిశయంబున నవ్విశ్వామిత్రుని వెంటం గొండొక
దూరం బరిగి యతనిచేతననుజ్ఞవడసి మఱలినిజనివాసంబులకుం జనియె నంత
గాధినందనుండు కొంతదూరంబుచని సూర్యుండు గ్రుంకువేళకు మునిసహితం
బుగాశోణనదీసమీపంబుఁ జేరి యన్నదిపుణ్యతీర్థంబులం గ్రుంకి యగ్నిసమా
రాధనంబుఁజేసి విశ్వామిత్రుండు తత్తీరంబుననివసించె నంతరాముండు లక్ష్మ
ణసమేతంబుగా సంధ్యనుపాసించి మునులకభివాదంబుఁజేసి మునిసభామ
ధ్యంబున విశ్వామిత్రునకభిముఖంబుగా సుఖోపవిష్టుండై మృదుమధురవాక్యం
బుల నమ్మహాత్మున కిట్లనియె॥ (తే,గీ) అనఘయీదేశ మతిరమ్య,మైతనరెఁ ।

—(*)విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకుఁ దనదువంశక్రమంబు దెల్పుట.(*)—

మంజులవనాంతజాతసం,పదలచేత । ననిశమేపుణ్యుఁడు వసించు,నట్టినెలవు ।
దీనివిధమెల్లఁ గృపతోడఁదెలియఁజెపుమ॥ (క) అనియడిగిన గాధేయుఁడు । త



నమునమునఁబొంగిరాజ,తనయునితోఁది । ఘనదేశక్రమ మెల్లను। వినుపింపఁగ
డంగ వాక్ప్రీతి,పీణిత. మెఱయన్॥ (తే,గీ)దశరథకుమార బ్రహ్మకుఁ,గుశుఁడనం
గ।నొక్కతనయుండుగలఁడుగుణోత్తరుండు।భూరిదివ్యప్రభావవి,స్ఫూర్తికలన।
నలరెనాతండు రెండవ,నలువకరణి॥ (శా) ఆపుణ్యుండువిదర్భరాజసుతను,వ్యత్ప్రీ
తితోఁబెండ్లియై। యాపద్మానన యందు నందనులనా. రంజారులం ధీయుల।
న్భూపాలోత్తములన్గుణోత్తరుల సం,పూర్ణప్రభావాఢ్యులన్ । శ్రీపుత్రా
కృతులన్సుధీరతులఁ గాం,చె న్నల్వురన్వేడుకన్॥ (తే,గీ)నరవరకుశాంబుఁడ
నఁగుశ,నాభుఁడనఁగ। వసువన నధూర్తరజుఁ డన,ప అలువారు। వారిజవన
ప్రియాభులై,వారలువారు । వాసవసమానులై,క్రాలువారువారు (క) వారివిలోఁ
కించిగుణో।దారుఁడుకుశుఁడిట్టులనియె ,ధర్మచికీర్ష। స్ఫురదురుధారుణీనయ।
మారఁగఁబంచికొని కుడువుఁ,డనురాగమునన్॥ (వ) అని నియమించి కుశుం
డుమహీమండలంబంతయుఁ జతుఃఖండంబులుగావిభాగించి యచ్చినంగైకొని
యన్నలువురు ధర్మపరులై లోకసమ్మతంబుగా రాజ్యంబుఁ,జేయుచు॥ (తే,గీ)
అంబురుహమిత్రతేజకు, శాంబుఁడనెడు । ఘనుఁడు తనపేరఁగౌశాంబి,యనెడు
పురము । మహిమనిర్మించియందుధ;ర్మంబుకలిమి। శిష్టసమ్మతిరాజ్యంబుఁ
జేయుచుండె॥ (తే,గీ) శక్రతుల్యుండు కుశనాభ,జనవిభుండు । పొలుపుగమహో
దయం బను,పుర వరంబు । వేడ్కఁగావించియందుఁబ్రా,వీణ్య మొదవ ।నింపు
సొంపారఁబ్రజలఁబా,లింపుచుండె॥ (క) అనఘుఁడధూర్తరజుండను । ధననా
థనిభుండు ప్రీతి , ధర్మారణ్యం । బను పురముఁ జేరియచ్చట। నినవంశో
త్తము ధరిత్రి,నేలుచునుండెన్ ॥ (క) వసువను వాఁడు పయోజా । క్షసమద్యుతి
యైగిరివ్ర,జంబనుపురమున్ । వెస నిర్మించి ముదంబున । వసుమతిఁ బాలిం
చె నంద,వార్యప్రౌఢిన్ ॥ (ఉ) మనుజవరేణ్య యీధరణి,మానుగ నవ్వసురాజ
మౌళియే । లినయదిగ్గ్రాలుచున్న యది,క్రేవమహీధ్రములైదుకంబెనూ । తనసి
తపుష్పమాలికవి,ధంబునమాగధి యీనగాంతరం । బునవిలసిల్లు చున్న యది
పొల్పలరన్మగధాత్మజాతయై ॥ (వ) మఱియునిమ్మహానదిప్రత్యగ్వాహినియైయుం
డు నిచ్చటివసుంధర వసురాజధర్మమహిమంజేసి మాగధీనదీ సలిలస్పర్శ
నంబున సంపూర్ణసస్యశాలినియైసుక్షేత్రమైయుండు ॥ (తే, గీ) తవిలి కుశ
నాభనృపతి, ఘృతాచియనెడు । నచ్చరనుబెండ్లియైదాని, యందుఁగాంచె ।

రూపసౌందర్యమహిమచే, రూఢిఁగన్న। యట్టితనయలనూర్వుర, నతిముదమున
న ॥ (ఉ) ఆనరనాథమౌళిసుత, లంచితరూపవిలాసయౌవన। శ్రీనిరవంద్యహా
రమ్యదు, చేలములంగయిసేసి మంజులో। ద్యానముఁ జేరియందు ముద, మార
గ వాదమొనర్చుచున్ మహీ। గానముఁ జేయుచున్ శిఖులకై నడి నృత్యములా
చరింపుచున్ ॥ (క) ఘనమధ్యస్థితశంపల। యనువున గగనగతతారకల్లు వెలుఁ
గుచు। న్వనమధ్యస్థితలై నృప। తనయలు విహరించిరద్భుతక్రమమెసఁగన్ ॥
(ఉ) వారిమనోజ్ఞవేషములు, వారినచోరచనాచమత్కృతుల్। వారివిలాసవైఖ
రులు, వారిసమంచితరూపసంపద। వారివిహారచాతురియు, వారియపాంగదృ
గంచలంబులుం। పారఁగఁ జూచి మన్మథశరాతురుఁడై పవనుండు చెచ్చెరన్ ॥
(తే, గీ) కన్నులారఁగ నయ్యళికచలచెలువుఁ। బోలుపలరఁ గాంచితమిమించి,
వలపునించి। ధృతిఁ దొలంగించి విచలితహృదయుఁడగుచుఁ। జేరవచ్చెంచిపలి
కెసమీరణుండు ॥ (చ) జలజదళాక్షులార నవచంపకనాసికలార యేను మీ। చె
లువముఁ జూచి మేలుపడి; చేకొనవచ్చితి నాకు భార్యలై। కలసిరమింపుఁ డుత్త
మము, ఖంబులు చేకురుమానుషత్వముం। దలఁగు శుభోదయంబెసఁగుఁ, దప్ప
కకల్గు జిరాయురున్నతుల్ ॥ (క) మనుజాంగనలకు జవ్వన। మనిత్యమమరులకు ని
త్యమటుగావున నీ। మనుజత్వము డిగి మీరిఁక। ననిమేషత్వమున సుఖము, నం
దఁగరాదే॥ (వ) అనిపలికిన నక్లిష్టకర్ముండగు సదాగతి వచనంబు విని
యపహసింపుచుఁ గన్యాశతంబతనికిట్లనియె ॥ (తే, గీ) అమరవర్య సమస్త
భూతములకీవు। పరఁగ నంతశ్చరంబైన, ప్రాణమగుట। నలువ నీకు జగ
త్ప్రాణ నామ మిడియె। నరయ నీయట్టిపూజ్యుఁ డిట్లాడ, నగునె ॥ (క)
అనిలా మముఁ గుశనాభుని। తనయలమని యెఱుఁగవే ప, దభ్రిష్టునిఁ గా।
నిసుఁ దిట్టఁగఁ జాలదుమై। నను సైఁచితి మిటుతపోవి, నాశనశంకన్ ॥ (ఆ, వె)
సత్యవాదియైన, జనకునకవమతిఁ। గూర్చి తుచ్ఛసుఖముఁ గోరుకంటె। మాన
వతుల కుర్వి, మరణమభ్యుదయంబు। గాదె పల్కెదేల, గాన కిట్లు ॥ (క) సు
రవర్య మాకుఁ దండ్రియె। పరమంబగు దైవతంబు, ప్రభువటు గానన్। గు
రుఁ డెవ్వనికొసఁగిన న। వ్వరమే దారుండె మాకు, భర్తదలంపన్ ॥ (తే, గీ) అన
ఘ మజ్జనకుండు నీ, కరయ నంత। కుండుగాకుండుఁ గాకయా, కోవిదున
కు। నవమతియొనర్చ కుమతుధర్మ, మాశ్రయించి। ధవుని వరియింపఁగోరియు, న్నా



రమేము ॥ (క) అని కుశనాభమహీపతి। తనయలు పల్కఁగ విని గాఢప్రదపశిఖ
మాడ్కి। న్ననలుచుఁ బ్రభంజనత్వము। తనరఁగ భంజించె వేగఁ, దద్గాత్రం
బుల్ ॥ (క) జననాథతనయ లీగతి। ననిలునిచే భగ్నగాత్ర, లై ఘనలజ్జా। వన
తాననలై గ్రక్కునఁ। జని తండ్రికిఁ గనుల బాష్ప, జలములు చినుకన్ ॥ (వ) ఇట్లు చను
దెంచిన కన్యలం జూచి సంభ్రాంతచేతస్కుండై కుశనాభుం డిట్లనియె ॥ (ఉ) కన్ని
యలార మీకుఁ గను, గానక యెవ్వఁడు గీడుఁ జేసెనా। పన్నతనొంటి త్రొల్లిటిజ, పాకు
సుమద్యుతి వీడి కుబ్జలై। కన్నుల నశ్రుబిందువులు, గారఁగ నేడ్చెద రేలమీరు మా।
కున్నది యున్న యట్లు రయ, మొప్పఁగఁ జెప్పుఁడు దాచ నేటికిన్ ॥ (తే, గీ) అని
యడిగి దీర్ఘనిశ్వాస, మడర నూర। కున్న జనకునిఁ గాంచియు, య్యువతులెల్లఁ।
జరణములముందలలు సోఁక, సాగి మ్రొక్కి। హస్తములు మోడ్చి యిట్లని, రడ
రు గదుర ॥ (మ) మన యుద్యానవనంబునందు విహరింపన్ దుర్మదుండై ప్రభం।
జనుఁ డచ్చోటికి నేగుదెంచి యశుభా, చారస్థుఁడై ధర్మమా। ర్గనిరూఢస్థితి వీడి
రాగవశుఁడై, కామాస్త్రసంవిద్ధుఁడై। తనకుం బత్నులఁ గమ్మటంచు మము వి
ఖ్యాణంబుగా వేడినన్ ॥ (తే, గీ) వెలఁదులు స్వతంత్రలు లేధర్మ, విధి యెఱుఁగవె।
కోర్కెగల దేని నీవుమ, స్మరుని నడుగు। మానవేంద్రుఁడు నీకిచ్చె, నేని ప్రీతి।
నిను వరించెద మిందఱ, మనఘచరిత ॥ (క) అని యేము పలుక వినక। య్యని
లుఁడు కోపించి చిత్త, మలమటఁ జెందం। బనిఁగొని మదంగములు గ్రిక్కినఁ
గుదియం బట్టె మమ్ముఁ, గుబ్జలఁ జేసెన్ ॥ (వ) అని విన్నవించిన విని పరమధా
ర్మికుండైన కుశనాభుండు కన్యాశతంబున కిట్లనియె ॥ (సీ) ఆత్మజలార మీ,
రైకమత్యము నొంది వంశధర్మస్థితి, వదలకుండ। సైరణఁ గావించి, చనుదెంచి
తిరి క్షమావంతుల కేమి గొ, రంత లేదు। లోకత్రయమునందు, మీకుఁ బో
లిన తాల్మి పరికింప మఱియు నెవ్వరికి లేదు। సురలయందైన దు, ష్కరమి
ట్టిశాంతంబు పురుషులకైనఁ బూ, బోండ్లకైన ॥ (ఆ, వె) క్షమయె భూషణంబు,
క్షమయె దానంబు య। జ్ఞంబు సత్యమార్జ, వంబు యశము। తపము శీలమ
ధిక, ధర్మంబు క్షమయండె। నిలచి యుండుఁ జూడ, నిఖిలజగము ॥ (క) అని
పలికి సుతలఁ బోవం। బనిచి మహీవిభుఁడు మంత్రి, బాంధవయుతుఁడై। తనయల
నెవ్వరి కిచ్చెద। ననుచు విచారింపుచుండ, నాసమయమునన్ ॥ (చ) ఘనుఁడు
జితేంద్రియుండు విధి, కల్పుఁడనల్పతపుండు చూళి నాఁ। బనరు తపస్వి బ్రాహ్మ్యస

ము, దగ్రతపంబొనరింపుచుండగా । ననిమిషలోక కాంత యగు, నట్టిదియూర్మిళ
ళ ముద్దుకూఁతురా । ననజితసోమ సోమద । య, నందగుయచ్చరమిన్న చెచ్చెరన్
(క)ముని వంశవార్ధిచంద్రుసిఁ । గనఁజనితచ్చరణములకు, ఘనతరభక్తి । న్వినతి
యొనరించి నిత్యం । బురు సేవ గొనర్పుచుండెఁ, బుత్రార్థినియై ॥ (తే,గీ)
అంతఁ గొంతకాలంబున, కమ్మునీంద్రుఁ । డాత్మ సంతుష్టుఁడై మెచ్చి, యన్నె
లంతఁ । జూచినీకిష్టమెద్దియో, సుదతిదాని । నడుగుమిచ్చెద ననిన న, ప్పడతి
యలరి ॥ (క)పలుకులనమృతపుసోనలు । చిలుకఁగ మధురస్వరంబు, చేనిట్లని
యెన్ । జలరుహ గర్భసమానున । కలచూళికి ఫాలకీలి, తాంజలియగు
చున్ ॥ (వ) మహాత్మా యేను బుత్రార్థినియై మిమ్ము భజించితి నేనింతకు ము
న్నపతినై యిప్పుడన్యునిం గోరక నైష్ఠిక బ్రహ్మచారిణినై యున్న దాన నీవు
బ్రహ్మతేజోసముదితుండవు బ్రహ్మభూతుండవు తపస్సంపన్నుండవు నాయందుఁ
గృపగలదేని బ్రాహ్మణోప గతనైన నాకు బ్రాహ్మణశక్తి యోగయుక్తుండైన
పుత్రుం బ్రసాదింపుమని యభ్యర్థించిన నప్పరమతపస్వి దయాళుండై యా
గంధర్వి కోరినయట్ల పరమధార్మికుండైన పుత్రునొసంగిన నతండు బ్రహ్మద
త్తుం డనఁ బరఁగె నట్టి చూళిమానసపుత్రుండైన బ్రహ్మదత్తుండు శక్రుండమరా
వతీ పురంబునుం బోలె కాంపిల్యానామనగరంబుఁ బరిపాలింపుచు మహాసంప
ద్యుక్తుండై యుండె నట్టి బ్రహ్మదత్తుని రావించి కుశనాభుండు ప్రీతచేతస్కుండై
సమస్తలోకసమ్మతంబుగాఁ గన్యాశతంబు నొసంగిన నా బ్రహ్మదత్తుం డక్కన్యల
యథాక్రమంబుగాఁ బాణి గ్రహణంబుఁ జేసిన ॥ (క) వరునిప్రసాదంబున । న
త్తరుణులు కుబ్జత్వముడిగి, తత్క్షణమె మనో । హరగాత్రలై తనర్చిరి । యను
దారఁగ మరుని మోహనాస్త్రముల క్రియన్ ॥ (ఆ,వె) వీతకుబ్జభావ, లై
తారకలమాడ్కి । వెలుఁగుచున్న సుతలఁ, గలయఁ జూచి । యద్భుతంబు
నొంది, యాకుశనాభుండు । గాఢహర్షమాత్మఁ, గడలుకొనఁగ ॥ (చ) త
నయల నల్లునిన్బహువిధంబులఁ గామితముల్ ఘటించి మిం । చిన యనుర
క్తి దివ్యమణి, చేలసువర్ణములిచ్చి యాదరం । బునఁదగ వీడుకొల్పినఁ బ్ర
మోదమునం జనిరగ్రభాగమం । దనుపమహృద్యవాద్యనిన, దార్భటులం
బరవీథి నిండఁగన్ ॥ (క) తనయునిఁ గోడండ్రనుగనుఁ । గొని సోమద హ
ర్షమొంది కుశనాభమహీం । ద్రునిఁ గొనియాడుచు వారల । ననుపమగ



తి గారవించె, నధికప్రీతిన్ ॥ (వ) ఇట్లు బ్రహ్మదత్తుండు కాంపిల్యానగరంబుఁ బ్ర
వేశించి పత్నీసహితుండై శక్రుండు త్రిదివంబునందుం బోలె సుఖింపుచుండె ॥
(తే,గీ) అంతఁ గుశనాభరాజు పు, త్రార్థమొక్క । యిష్టిఁ గావింప నాప్ర
త్యపీశుకడకుఁ । గోర్కెతో బ్రహ్మపుత్రుండు, కుశుఁడువచ్చి । యింపుసొంపా
ర మధురోక్తి, నిట్టులనియె ॥ (క)తనయా నీకు సమానుఁడు । తనయుఁడుగా
ధియనువాఁడు, ధార్మికుఁడుయశో । ధనుఁడుజనియించు ధరన । య్యనఘు
నిచే నీకనంత, యశముంగలుగున్ ॥ (క) అని పలికి కుశుఁడుముదమునఁ । దన
యునినాశీర్వదించి, తపనుని చందం । బుననుజ్వలుఁడగుచు సనా । తన మగు
విధిలోకమునకుఁ, దడయక చనియెన్ ॥ (ఉ) అంతటఁ గొంతకాలమున, కద్భు
త తేజుఁడు పుత్రుఁడా మహీ । కాంతుని గర్భవార్ధిమిహి, కాద్యుతియైజనియిం
చె మంజుల । స్వాంతుఁడు గాధిరాజను ప్రసన్నకళా కలితాత్ముఁ డమ్మహా ।
స్వాంతునకే జనించితి ర, సాపురుహూతుఁడనై రఘూత్తమా ॥ (సీ) అవ
నీశకుశవంశ, మందుఁ బుట్టుటఁ జేసి, కౌశికనామంబు, గలిగె నాకు । సరసాత్మ
మాయక్క, సత్యవతీదేవి దివ్యగుణాఢ్య స, తీలలామ । వెనుకొని తనప్రాణ,
విభుఁడైన ఋచికుతోఁ గూడి శరీరంబుతోడ నాక । లోకంబునకుఁ బోయి, లోక
హితంబుగా నిలోకమునఁ బర్వ, తేంద్రుఁడనగ ॥ (తే,గీ) బరఁగు ప్రాలేయ పర్వ
త ప్రాంతమందుఁ । జెలఁగి కౌశికి యను పేర, నలరు దివ్య । నిర్ఝరిణియయ్యెన
య్యమ, నిత్యమమ్మ । హాతటిని చెంత వసియింతు, నయ్యనేను ॥ (వ) పదంపడి నే
ను హిమవంతంబు విడిచి సిద్ధాశ్రమంబుఁ జేరి భవత్తేజంబునఁ దపస్సిద్ధుండనైతి
మద్భగిని యగు సత్యవతి మహానదీస్వరూపంబున లోకపావనియై సజ్జనుల దు
రితంబుఁ దొలంగం ద్రోయుచుండు రఘువరా మదీయవంశక్రమంబును దచ్చరి
త్రంబును నీ దేశవిశేషవిధంబును బ్రస్ఫుటంబుగా నెఱింగించితిఁ గదా యని ప
లికి హర్షపులకితగాత్రుండై విశ్వామిత్రుండు వెండియు నిట్లనియె ॥ (మ) అవ
నీశాత్మజ పూర్వరాత్రి సమయం, బయ్యెం దమోజాలము । ల్భువి నీరంధ్రము
గాఁగఁ బర్వెఁ డఱుచై, భూరిద్యుతిం దారక । ల్దివి పై నుజ్జ్వలభంగిఁ బొల్చె సుర
వి, ద్వేషుల్బలోద్రేకులై । ధవధూమాకృతి సంచరించెద రునం, దం బొప్పవీక్షించితే ॥
(క) గిరిగుహాలయందుఁ దరుకో । టరములయం దాపగాత, టంబులయందుం ।
దరులందు ఖగమృగంబులు । నెఱిసడి లీనంబులయ్యె, నిద్రాసక్తిన్ ॥ (చ) తొవ

లకుఁ బ్రేమఁ జూపియల, తోయరుహాంబకు నిద్రలేపిప। ద్మవనముకాంతిమాపిసుర, మండలికి న్సుధఁ జేపిచాలన। ర్ణవమున శుభ్రదాపి రఘు, నాయక తావక కీర్తిమూర్తినా నొం। దివెడ లెనాఁగనిష్ఠు హిమ, దీధితి యొప్పెడిఁగం పెబ్రాగ్గిరిన్॥ (వ) రాజనందనా రాత్రివిశేషకాలం బయ్యె మేల్కొనియుండుట వలన నెల్లిజాగరజనిత పరిశ్రాంతివలన మార్గవిఘ్నంబు సంభవించుం గావుననింక సుఖనిద్రసల్పుము॥ (చ) అనవిని తోడిమౌనివరు, లామునికిట్లనిరో మహాతపో। ధనవరతావకాన్వయవి, ధంబు యథావిధి గావినంబడె। న్ననఘులు బ్రహ్మతుల్యులుమ, హాత్ములు తావకవంశజాతుల। ట్లనెమహనీయదివ్య పృథు, లద్యుతివై తనరారితీవిలన్॥ (తే, గీ) నృపుఁడవై పుట్టిపదపడి, విపుల తపము। కలిమిబ్రహ్మర్షిపదమును, గన్నవాఁడ। వీవునీయంతవాఁడవు, నీవెకాక। జగతివేఱొక్కఁడును నీకు, సాటిగలఁడె॥ (వ) మహాత్మా భవత్సహోదరియైన సత్యవతి కౌశికి యనుపేరందనరు దివ్యనదియై భువనపావనియై కులద్యోతకరియై ప్రకాశింపుచున్నయదియని బహుప్రకారంబుల నత్తాపసులు విశ్వామిత్రునిం బ్రశంసించిన నమ్మునిశ్రేష్ఠుండుల్లంబు పల్లవింపసస్మితవదనారవిందుండై వారినందఱఁ దగిన తెఱంగున నభినందించి వారలుం దానును మంజుకిసలయ కుసుమ విరచిత శయ్యాతలంబుల నధివసించి యొక్కింతసేపు పుణ్యకథా వినోదంబులం బ్రొద్దుఁ బుచ్చిపదంపడి సుఖనిద్రఁ జేసిరి యారఘుప్రవరులును విశ్వామిత్రుని సేవించి యమ్మహాత్ముని వలన నిష్టకథాశ్రవణంబుఁ జేయుచు మృదుతల్పంబులం బవ్వళించి సుఖనిద్రఁ గావించిరి తదనంతరంబ॥ (క) శతపత్రకుట్మలబహి। ర్గతమధుపాంగనా నికాయరవంబు। లజ్జతఁ గూడి కేవలాదం। భత మీఱఁ బ్రభాతకాల, మహిమం దెలిపెన్॥ (తే, గీ) అంతఁ గౌశికమునియంతి, కావనీరు। హాగ్రసంగత పారావ, తారవములు। మేలుకొలుపులుపాడంగ, మేలుకాంచి। సరసమతిఁ దోడిమునులకెం, చ్చరికఁ జేసి॥ (చ) చెలువుగ రామలక్ష్మణులఁ, జీఁజిరఘూత్తములార మేలుకొం। డలతపనోదయావసర, మయ్యె నటంచు సుధామయోక్తిమే। ల్కొలిపిన నిద్రలేచి రఘు, కుంజరు లాహ్నికకృత్యము ల్నయం। బలరఁగఁ దీర్చి రత్తఱి నృ, పాగ్రణి కౌశికుతోడ నిట్లనున్॥ (తే, గీ) కంబెయీశోణ నదిమహా, గాధ మగుచుఁ। బులినమండితయై శుభ, సలిలపూర్ణ। మగుచు నొప్పెడు మనము సొం, పారనెట్టి। మార్గమున దాఁటి పోదము, మౌనివర్య॥ (క) అన వినిగాధేయుఁడురా।



మునకిట్లను దాపసోత్త, ములు దాఁటెదు రే। వునదాఁటిపోదమనిగ్ర। ద్దననన్న దిదాఁటెమౌని, తతియుతుఁడగుచున్॥ (వ) ఇత్తెఱంగున నత్తపోధనగ్రామణి రా

(*విశ్వామిత్రుఁడు రామలక్ష్మణసహితుండై గంగానదిఁ జేరనరుగుట*)

మలక్ష్మణసహితుండై తాపసులంగూడి శోణనదినుత్తరించి తత్తీరవనంబులు విలోకింపుచు దూరంబరిగి యినుండు నభోమధ్యగతుండగు నంతను సమస్తమునినిషేవితంబగు దాని హంససారసనాదితంబగు దాని పుణ్యోదకంబైన దాని గంగానది డాసి యమ్మహానదియందు సుస్నాతులై పితృతర్పణంబుఁ గావించి కృతాగ్నిహోత్రులై యమృతతుల్యంబైన హవిశ్శేషంబు భక్షించి యమ్మహానదీతీరంబున నొక్కరమ్యప్రదేశంబున నావాసపరిగ్రహణంబుఁ జేసి పరమానందభరితాంతఃకరణులై రచ్చట సమస్తమునిపరివృతుండై విశ్వామిత్రుండు నివసించె నంతనారాముండు విశ్వామిత్రుని కభిముఖంబుగా నాసీనుండై యమ్మహాత్మున కిట్లనియె॥ (క) తాపసయీాది వ్యాపగ। యేపగిదిజనించె జగము, లేక్రియనిండె

విశ్వామిత్రుఁడు శ్రీరామునికి గంగాపర్ణలసంభవప్రకారంబుఁ దెల్పుట.

న్నేపగిదిజలధిగలసెను। నాపైఁగృపఁ జేసియంత నయముగఁ జెపుమా॥ (క) అనవుడు రఘువరముఖసం। జనితవచోమృతముఁ జెవులఁ, జవిగొని స్మేరాననుఁడై సుమనోగతిన। మ్మునిరాజిట్లనియెఁ, గుతుకముండలుకొత్తన్॥ (క) కలదొకయగ్నిచికురసురా। చలపుత్రి మెఱుంగుఁదీఁగె, శశికళమరుగ। జ్జలగుఱ్ఱమఖిలసురరమ। ణులచూడాభూషణమును, నోరమయనఁగన్॥ (చ) హిమవదహార్యరాజుమది, హెచ్చినకోరిక నివ్వటిల్లఁగాఁ। బ్రమదమెలర్ప నక్కలువ, రాయని రేకఁ దృణీకరించు న। య్యమను యథావిధింబరిణ, యంబయి తత్సతియందుఁ గాంచెనా। సుమహితరూపయౌవన సు, శోభిత గాత్రులఁ గూఁతు లిద్దఱన్॥ (తే, గీ) సురలు దేవహితార్థమా, సుతలలోనఁ। బెద్దకూఁతురు గంగయన్పేరనలరు। దానినిమ్మని హిమధరా, ధరుని నెయ్య। మెసఁగనడిగిరి త్రైలోక్య, హితముపొంటె॥ (క) అడిగిననక్కుధరేంద్రుఁడు। పడఁతుకఁ దనపుత్రి భువన, పావని గంగన్నడువేడ్క లోకహితముగఁ। దడయక దేవతలకిచ్చెఁ, దద్దయుఁ బ్రీతిన్॥ (క) ఇచ్చినఁ గైకొని నిర్జరు। లిచ్చనలరి లోకములకు, హితమొనరింపం। జెచ్చెరగంగనుదోడ్కొని। యచ్చుపడఁగ నాకమునకు, నరిగిరి పెలుచన్। (వ) ఇట్లు స్వచ్ఛందపథగామినియైన గంగ సురలచేత నాహూయమానయై దివంబునకుంజని మ

నదీరూపంబున సురగరుడోరగమునిసేవితయై యెల్లవారలఁ బవిత్రులం జేయుచుండె నంత రెండవకూఁతురుమాదేవియుగ్రంబైనవ్రతంబంగీకరించి శైలసానుకందరంబులఁ దపంబుఁ జేయుచుండ నాహిమవంతుండక్కన్యకుం దగినవరుని విచారించి సకలలోకనమస్కృతుండైనరుద్రునకొసంగెనిది త్రిభువనాభివంద్యలైనగంగాపార్వతులసంభవప్రకారంబందుఁ ద్రిపథగయైన గంగానది మొదలఁ ద్రివిష్టపంబునధిగమించి యందుమహానదీస్వరూపిణియై స్వర్లోకంబునం బ్రవహించినచందంబు నెఱింగించితిననిపలికిననారామలక్ష్మణులిరువురుప్రీతిసంహృష్టసర్వాంగులై విశ్వామిత్రునవలోకించి మహాధర్మయుక్తంబైన యీగంగాఖ్యానంబు సంక్షేపంబుగా మీచేతఁ గథితంబయ్యె నీవుదివ్యమానుషసంభవప్రకారం బంతయు సవిస్తరంబుగా నెఱిఁగిన మహానుభావుండవు శైలపుత్త్రియైన గంగాదేవి మహానదీస్వరూపిణియై ముల్లోకంబులం బ్రవర్తించుటకుఁ గారణంబెయ్యది యేకర్మంబులం గూడి ముల్లోకంబులయందు విశ్రుతి వహించె నేకారణంబున మార్గత్రయగామినియయ్యెఁ దత్ప్రకారం బంతయు సవిస్తరంబుగా నెఱింగింపనీవె యర్హుండవనిన ఋషిసభామధ్యగతుండైన విశ్వామిత్రుండు హర్షపులకితగాత్రుండై యిట్లనియె॥ (చ) ఎలమి శశాంకమౌళి కుధరేశ్వరనందన నిట్లు పెం

*** విశ్వామిత్రుఁడు శ్రీరామునికిఁ బార్వతీవృత్తాంతంబుఁ దెల్పుట. ***

డ్లియై । చెలువుగఁ బువ్వుఁదావిగతిఁ జిత్తములొక్కటిగాఁ బరస్పరం। బలఘుముదంబుతో నహరహంబెడఁబాయక సౌఖ్యసంపదం। దలకొని పొల్చి రెంతయు సనాతనదంపతులై జగంబులన్ ॥ (వ) అంత ॥ (చ) మృడుఁడొకనాఁడు వేడుకన, మేయభుజాబలశాలి పుత్త్రునిం। బడయఁగఁ గోరి యుత్తుహినపర్వతరాజకుమారిఁ గూడి సొం। పడరఁగ నూఱువర్షముల, హర్షితముల్పరమానురక్తిచే । నెడఁబడకుండ నిత్యము ర,హిన్సురతం బొనరించుచుండఁగన్ ॥ (చ) జలజభవాద్యశేషసుర, సత్తము లొక్కట గుంపు గూడి యా । యలికవిలోచనుం డుతుహి, నాచలనందనతోడఁ గూడి మి । క్కిలి సురతం బొనర్పఁ దొడఁ, గెం దగవారల తేజ మేఘనుం ।డిల సహియింపనోపుమన,మిత్తఱి నవ్విధి మాన్పఁగాఁ దగున్ ॥ (మ) అనిచింతించి సురల్గుతూహలముతో,నచ్చోటికే తెంచి యం । దు నిరూఢేచ్ఛ నఖండతన్సురతమొం,తో వేడ్కఁ గావించులో । కనిదానం బగు శంకరుం గని నమ,స్కారంబుఁ గావిఁ



చి ఫా । లనిబద్ధాంజలులై నుతించిరి శుభా,లాపంబుల న్భక్తితోన్ ॥ (తే,గీ) దేవదేవమహాదేవ, దేవవినుత।లోకనాయక నతభక్త,లోకవరద । శర్వ శంకర యీశాన,చంద్రమౌళి । నీకు మ్రొక్కెద మాలింపు, నిర్మలాత్మ ॥ (తే,గీ) ఈశ యేపారు నీతేజ, మెవరు దాల్ప । నోపువారిట్టియతికృత్య,ము డుగవలయు । బ్రహ్మచర్యవ్రతంబునఁ, బరఁగవలయు । నివ్వరము మాకిఁక ననుగ్రహింపవలయు ॥ (వ) దేవా యమోఘంబైన భవత్తేజంబు సహింపజగంబులోపవు కావునఁ దేజంబు నీయందు ధరింపుము లోకహితార్థంబు దేవీసహితుండవై తపంబుఁ గావింపుమని ప్రార్థించిన దేవతల వచనంబు విని దయాళుండై సర్వలోకమహేశ్వరుండగు పార్వతీశ్వరుండు వేల్పులం జూచి మీచెప్పినట్ల మదీయంబైన తేజంబు నాయందె నిలిపెద స్వస్థచిత్తులుగండిప్పుడనుత్తమంబైన మద్వీర్యంబు రేతస్స్థానహృదయ సంపుటసంక్షుభితంబయ్యె దీని నెవ్వాఁడు ధరించువాఁడె ఱింగింపుం డనిన నయ్యాదిత్యులు వృషభధ్వజున కిట్లనిరి ॥ (క) విడువుము తావకతేజముఁ । దడయక తాల్పంగనోపు, ధాత్రియటన్నన్ । మృడుఁడోగాక నిగ్రక్కునఁ । బుడమిం గావించె దద్వి, మోచనమనఘా ॥ (వ) ఇట్లువిసర్జించిన నమ్మహాతేజంబు శైలకానన సహితయయిన మహి యెల్ల నిండెనప్పుడు ॥ (తే,గీ) అమరు లనలునిఁగనుఁగొని, యనిలుఁగూడి । చెలఁగి నీవిందుఁ దగఁ బ్రవేశింపుమనిన । విని యతండట్ల కావించె, జనవరేణ్య । యవని శ్వేతాద్రి యనొప్పె, నచటి నెలవు ॥ (వ) మఱియు రౌద్రింబైన తేజంబచ్చోట విస్తృష్టం బయ్యె నది కార్తికేయ జన్మస్థానంబైన దివ్యశరవణంబై పావకాదిత్యసన్నిభంబై విలసిల్లె నంత దేవతలుసమస్తమునిగణ సమేతంబుగా నయ్యుమామహేశ్వరులం బూజించిరప్పుడు ॥ (క) కట్టడి తనమున వేల్పులు । గట్టిగఁ దన కప్రియంబుఁ, గావించుటకుం । గట్టలుకఁ దత్ఫలంబును । గట్టిరుడుచునట్లొనర్తుఁ, గాకనియుమయున్ ॥ (క) కనుఁగొనలఁ దామ్రదీధితి । తనరారఁగ మేను దీప్త,దవశిఖిచందం । బున నలరఁ గ్రోధమదిపై । కొనఁగా దోయిట జలంబుఁ, గొని యిట్లనియెన్ ॥ (చ) కొడుకును గోరి ప్రాణవిభుఁ, గూడి సుఖించెదు నాకు నిమ్మెయిం । విడువక దుష్టులైన మమ, విఘ్నమొనర్చితి రిట్లు గాన నిం । పడరఁగ వేల్పులార యిది,యాదిగఁ బత్నులయందు మీకిఁకం । గొడుకులు పుట్టకుండెదరు,శోకశపించితి నిక్కమింతయున్ ॥ (వ) అనిపలికి వెండియు ॥ (తే,గీ) ఇల

నువీక్షించి క్రుద్ధయై, యేనుదాల్పఁ । దగినయీ తేజమీవెట్లు, దాల్చితివిది । మొదలు బహునాయకత్వంబుఁ బొందుమనుచు । శాపమిచ్చెఁ బదంపడి, శైల తనయ ॥ (వ) మఱియువసుంధర నుద్దేశించియూషరత్వాదినానావిధరూపిణి వై మచ్ఛాపరూప క్రోధవిపర్యస్తప్రకృతివై పుత్రకృత ప్రీతి నొందకుండుమని యిట్లుకఠోరంబుగా శపించెనంత దేవతలు పార్వతిచేతశప్తులై మొగంబులల జ్జావిషాదంబులు వొడమనిజనివాసంబులకుం జనిరి శంభుఁడు దేవీసహితుం డై యచ్చోటువిడిచి తుషారగిరియుత్తరభాగంబునకుం జని తదీయంబైనయొ క్క మహోన్నతశృంగంబుమీఁద దపంబుసేయుచుండెనిది పార్వతీవృత్తాంతం బిం

## (*) విశ్వామిత్రుఁడు శ్రీరామునికి గంగావృత్తాంతంబుఁ జెల్పుట. (*)

క గంగావృత్తాంతంబెఱింగించెద వినుము ॥ (సీ) అమరులందఱునుమ, హర్షిస సమేతులై కడువేడ్కఁ బ్రహ్మనుగానబోయి । వినయంబుభక్తి వివేకంబులేర్పడఁ దత్పాదములకువందనముఁ జేసి । నలువమాకొకఁడు సేనానాయకుఁడు లేమిఁ జే సిదైత్యులచేతఁ జిక్కుపడితి ; మష్టమూర్తికి బుట్టు, నట్టివానిగ్రహింతు మని యున్న నదియునాఁడట్లయయ్యె ॥ (తే, గీ) దామరసగర్భ మాకింకఁ దగినకార్య । మెద్ది యోచించి త్రైలోక్య, హితముపొంటె । నానతిమ్ము సమస్తవి, ధాన విదుఁడ । వీవు మాకం దఱకు దిక్కు నీవ కావె ॥ (వ) దేవా తొల్లి మాకుభగవంతునిచేత నెవ్వఁడు సేనాధిపతిగాదత్తంబయ్యెనమ్మహాత్ముఁడిప్పు డు మాసహితంబుగా దపంబుఁ జేయుచున్న వాఁడింక వేరొక్కనిని దేశింపుము ॥ (క) అనిసురలు విన్నవించిన । విని వేలుపు పెద్దవారి,వీక్షించికృపా । జనితా నురాగమున ని । ట్లనియెంబలుకులు సుధామ, యములై యుండన్ ॥ (చ) పరమసతీలలామయగు, పార్వతివల్కిన భంగినింకమీ । గిరితలయందు నందనులు, గల్గుటచొప్పడదింత నిక్కవం । బరమర లేకపావకుని,యందు సమున్నతమైన శూలభృ । త్పరమ పవిత్ర తేజ మది భాసిలు చున్నది హేమరూపమై ॥ (తే, గీ) శాంభవంబైనదివ్య తేజంబుచేతఁ । జిత్రభానుండుకడువేడ్క శీతశైల పుత్రియగుగంగయందు సత్పుత్రునొకనిఁ । బూనికలిగించు మీకుసే,నానిఁగాఁగ ॥ (వ) మఱియునాగంగాదేవి హిమవంతంబునకుం బెద్దకూఁతురుంగావున నుమాదేవిధరింపందగిన శైవంబగు తేజంబుతానశ్రమంబునందాల్పనోపు నవ్వి ధంబయ్యేమకును సమాధానంబైయుండు నని పితామహుండానతిచ్చిన నిలిం



పులు కృతార్థులమైతిమని సంతసిల్లి యమ్మహాత్మునిం బూజించి యనుజ్ఞవడసి బహుధాతుమండితంబైన కైలాసనగంబునకుం జని సర్వదేవ పురోహితుండైన పావకునిం జూచి మహాత్మానీయందు నిక్షేపించియున్న మాహేశ్వరంబగు తేజం బుపుత్రార్థంబుగా శైలపుత్రియగు గంగయందుఁ జేర్చి దేవతలకుహితంబుఁ జేయుమని నియోగించిన నప్పావకుండు గంగకడకుం జని సర్వదేవతాహితార్థంబుగర్భంబు ధరింపుమనిపలికిన నద్దేవి దివ్యస్త్రీరూపధారిణియై పొడసూపినఁ దదీయసౌందర్యాతిశయంబు విలోకించి మోహితుండై పావకుండు తన యందువ్యాప్తంబైన తేజంబు సర్వావయవంబుల వలన విసర్జించి గంగాదేవి సర్వావయవంబులయందుఁ బ్రసరింపంజేసిన నద్దివ్య తేజంబు ముఖనాసాది సర్వావయవంబులయందు నిండిన నద్దేవిప్రవ్యథిత చేతనయై పావకుంజూచి యిట్లనియె ॥ (క) అమరపురోహితనీ తే । జముఁ దాల్పఁగనోపనైతి, జాంబూనదశైలముభంగిఁ జాలవ్రేగై । విమలలయాగ్నిశిఖమాడ్కి, వెలిఁగెడుఁ గంటె ॥ (క) అనిపలికిననద్దేవికి । ననలుండిట్లనియె నపుడు, హైమవతీశం । భుని తేజమిదిసుతార్థము । పనిఁగొని నీయందునించఁ, బడెనాచేతన్ ॥ (ఆ, వె) మోయఁజాలవేని, మునుకొనినీవతి । గౌరవంబుఁగనిన, గర్భమహిమ శిఖరిపాదమందుఁ, జేర్పుముగ్రక్కున । ననిన నట్లచేసె, నమరతటిని ॥ (వ) ఇట్లు గంగాదేవితనయందుఁ జేర్చినయద్దివ్య తేజంబువహ్నివ్యాప్తశైలీకృతశివ తేజోరాశియందువిసర్జించినఁ దద్గర్భనిక్షిప్తమాత్రంబునఁ దత్తేజంబుచేత నభిరంజితంబై పూర్వోక్త శ్వేతపర్వతసహితంబైనశరవణంబు సర్వంబునుగాంచనమయంబయ్యె నందు భాస్వరతరదివ్యదేహుండును జిత్రభానుసమప్రభుండును నగుకుమారుండుజన్మించెఁ దచ్ఛోణితాధిక్యంబువలనఁ దప్తజాంబూనదప్రభంబైనకాంచనంబును నిర్మలంబైనరజతంబును బొడమియచ్చటి మేదినియందువ్యాపించెఁ దత్తారగుణంబువలనఁ దామ్రకృష్ణాయసంబులును దన్మలంబువలనఁ ద్రపుసీసకంబులును బుట్టెనద్దివ్య తేజఃప్రభావంబువలన నచ్చటితరుగుల్మలతాప్రతానంబులన్నియు సువర్ణమయంబులై తేజరిల్లెన చ్చటినెలవునానాధాతు మండితంబై యొప్పెనాఁటంగోలె హిరణ్యంబునకుజాతరూపవిఖ్యాతియు వైశ్వానర సమప్రభయునుంగలిగె ॥ (చ) ర యమునననక్కుమారునకుఁ, గ్రమ్మఱఁ క్షీరములిచ్చిపెంపఁగాఁ । బ్రియమున వేల్పులందఱును, గృత్తికలన్నియమింప వారలెం । తయుఁగృపమీఱఁగాఁ దమకు,నందనుఁ డంచుఁ దలం

చియూతని । న్బ్రియమునఁజన్నుపాలొసఁగి, పెంచిరిలోకహితార్థ మత్తఱిన్॥ (తే,గీ) కృత్తికాస్తన్యపానప్ర, వృద్ధుఁడగుట।వలననిక్కుమారుండు సొంపలరఁ గార్తి । కేయుఁడనముజ్జగంబులఁగీర్తితుఁడగు ।ననుచుసంప్రీతితోఁవేల్పులా డిరపుడు ॥ (క) ఇందుధరునిఘనరేత । స్కందంబునజననమౌట, కతముననత నిన్ । బృందారకసందోహము ।స్కందుండనిపొగడెనపుడు, కౌతుకమలరన్॥ (తే,గీ) గరిమగర్భోదకంబందు, స్కన్నమగుచు । నధికకాంతిచేదీప్యమా, నాగ్నిభంగి । వెలుఁగుపుత్రునిఁగనికృత్తి, కలుచెలంగి । స్నపనమొనరించిర ప్పుడు, సంతసమున ॥ (తే, గీ) అరయఁగృత్తికలట్లాఱ్వు, రగుటవలన । నాఱు మోములుఁదాల్చిసొం, పారనొక్క । దివసమునవారిచనుపాలు,తవిలిత్రావి । మిగులసుకుమారదేహుఁడై, పొగడుఁగాంచె ॥ (తే, గీ) సముదితంబైనదివ్య తే, జంబుచేత । సురబలాధీశుఁడై రాక్ష, సులవధించె । నందువలననతండుష, డాస్యుఁడనఁగ । గరిమసేనానియనఁగవి, ఖ్యాతిఁగనియె ॥ (చ) అమరసమా న గంగవిధ, మద్భుతమైనకుమారసంభవ । క్రమమునుసర్వముందెలియఁ,గా వినుపించితిఁగార్తికేయునం । దమలినభక్తిఁజేయునరుఁ, డాయువుగల్గి సపుత్ర పౌత్రుఁడై । క్షమసుఖియైచరించితుదిఁ, గాంచుసమంచితతత్సలోకతన్ ॥ (వ) అనిపలికి విశ్వామిత్రుండు వెండియు రామభద్రునవలోకించియిట్లనియె ॥ (చ) అలరుభవత్కులాంబుధిహి, మాంశుఁడునా సగరావనీశ్వరుం । డలఘుతరప్ర తాపమున, నాతఁడుసాగరవేష్టితావనీ । తలమనిశంబుధర్మగతిఁ దప్పక నే

(*)విశ్వామిత్రుఁడుశ్రీరామునకు సగరచక్రవర్తికథఁదెల్పుట(*)

లుచుఁ జక్రవర్తియై । బలరిపువైభవస్ఫురణ, భాసిలుచుండు నమానుషప్ర భన్ ॥ (తే,గీ) దశరథకుమారవినుమువి, దర్భరాజ । తనయధర్మిష్ఠ సత్య వాదినిపతివ్ర । తాగ్రగణనీయకేశిని, యనెడుసాధ్వి । యగ్రగేహినియయ్యెన య్యవనిపతికి ॥ (తే,గీ) మఱియునారాజమౌళికి, గరుడభగిని । కామునిజయా స్త్రిమునరిష్ట,నేమిదుహిత।సుమతియనుపేరనొప్పారు, సుందరాంగి । నా య మెసఁగద్వితీయద్వితీయయయ్యె ॥ (క) ఆయిరువురుపత్నులుతన । కాయతసౌ ఖ్యంబొసంగ, నభినవవిభవ । శ్రీయుతుఁడై బహుకాలము।పాయకనిలయేలెనా నృ, పాలుఁడుప్రీతిన్ ॥ (వ) ఇట్లురాజ్యంబుఁజేయుచు ॥ (క)తనయులులేమికివ గవె । క్కొనఁబత్నీయుతముగాభృ,గుప్రస్రవణం । బనుశైలమందు నేమము ।



తనరారఁగనుగ్రభంగిఁ, దపమొనరించెన్ ॥ (వ) అంత ॥ (క) నూఱేండ్లు సని నవెనక, ను। రారాధ్యుండైనభృగుమ, హామునికరుణో । దారుఁడుప్రత్యక్షుం డై । కూరిమితోనిట్టులనియెఁ, గువలయపతికిన్ । (చ) అలఘుచరిత్రనీకు స ము, దంచితమైతగుపుత్రలాభముం । గలుగుననంతవైభవము, ఖండయశంబు నువృద్ధిఁబొందునీ ।యలికచలంధునొక్కతెకు,నఱ్వదివేలసుతుల్ జనింతురిం।ప లరనొకతెకొక్కఁడుగు,ణాఢ్యుఁడువంశకరుండుగల్గెడున్॥న(క)అనిమునిపతిప రమిచ్చిన । వినినరపతిసు తలతనికి, వినతల యిముదం ।బునవినయవాక్యములఁ నిట్లనిరప్పుడుఫాలకీలాంజలిపుటలై, ॥(తే,గీ)నీపలుకునిక్కమగుఁగాక, తాప సేంద్ర। పరఁగఁజెక్కండ్రసుతులనే,తరుణిగాంచు । నొక్కసుతుఁడేమ్ము గాక్షికి నుద్భవించుఁ । గరుణదళుకొత్తనింతయు,నెఱుఁగఁజెప్పుమ॥ (క) ఆరామల వచ నము విని ।. సారసగర్భాత్మజుండు,సంయమివలికెన్। మీరెవ్వరెట్లు గోరిన । నారీతిజనింతురె దియథార్థ ముచుండీ॥ (క)ఒక్కఁడువంశకరుం డగుఁ ।బె క్కండ్రుసుతుల్ ధరిత్రిఁ,బృథుబలయుక్తిన్।నిక్కిలిఁగీర్తివహింతురు। నిక్క మునావచనమింక,నృపసుతలారా॥ (ఆ,వె) అనిన నగ్రపత్ని,యగుకేశినికుమా ర। వరునిఁగోరెనొకని,వంశకరునిఁ। దక్కినట్టిసుదతి, తనయులఁజెక్కండ్ర।నధి కబలు రగోరె,నద్భుతగ॥ వ॥ అమ్మునీంద్రుండక్కాంతలు గోరిన వరంబులొ సంగె నారాజశేఖరుండులబ్ధమనోరథుండై భృగువునకుఁబ్రదక్షిణంబునుఁబ్రణా మంబునుం గావించియతనిచేత ననుజ్ఞవడసిపత్నీసమేతుండై నిజపురంబునకుఁ జనుదెంచి పుత్రోదయంబుఁ గోరుచున్నంతఁ గొంతకాలంబు సనినయనంతరం బ (క) జనవిభుని యగ్రసతికే । శినిగాంచె సమస్తసాధు, శిక్షారతునిన్ । జ నకంటకు నసమంజుం । డను పుత్రునివంశకరు మ,హాబలునొకనిన్ ॥ (ఆ,వె) అంత సుమతియనెడు, కాంతగర్భంబునఁ । దుంబ మొకటిపుట్టెఁ, దొలుత నదియు । విరియఁ దోడుతోడ, నఱువదివేవురు । సుతులుపుట్టిరందు, సురుచి రముగ ॥ (ఆ,వె) వారినెల్ల దాదు,లారూఢిగానాజ్య । పూర్ణ ఘటములం దుఁ, బొసఁగనునిచి । సంతతంబుఁ బెనుపఁ, గొంతకాలమునకు । శైశవంబువీ డి, సంభ్రమమున ॥ (చ) భువనమనోహరస్ఫురణఁ,బొల్చు సమంచితయౌవ నప్రభా । సువిహితరూపులై మిగుల,సొంపును బెంపును గల్గితేజమున్ । జవ మును విక్రమంబు భుజ, సత్వముఁ గ్రాలజగత్త్రియైక సం । స్తవమున నొప్పి

రెంతయును, దండ్రికిం జాల ముఖంబులపరంగెన్ ॥ (ఉ) అయసమంజుఁడెంతయు దురాత్ముఁడై బహుళాపలేపతం । బాయక సంతతంబు బుధపాళికిబాధ యొనర్చుచున్ రహిన్ । డాయుచు బాలురన్ బహువిధంబుల నొక్కట జిక్కఁబట్టి కు । య్యోయని తల్లడిల్ల సరయూనదిలోఁ బడవైచు నుగ్రతన్ ॥ (వ) ఇట్లు పాపసమాచారుండును సజ్జనప్రతిబాధకుండునై వర్తింపుచుండ నంతఁ గొంతకాలంబున కయ్యసమంజునకుఁ దేజోజితాంశుమంతుండై యంశుమంతుండనుకుమారుండుదయించిననతనిసద్గుణంబులకుసంతసిల్లిపితామహుండైన సగరుండు కొడుకువలనిమోహంబువిడిచి యతనిదుశ్చారిత్రంబులు వినరామికి రోయుచు సకలజనానురాగంబుగాఁ బురంబు వెడల ననిచి ఋత్విక్పురోహితుల విచారించి నిశ్చయించి సకలమహీనాయకత్వంబునకు సార్థకముగా నొక్క యశ్వమేథయాగంబుఁ గావించె నని పలికిన విశ్వామిత్రుని పలుకుల కలరి రాముండమ్మహాత్ము నవలోకించి మునీంద్రా మదన్వయంబునం బుట్టిన పూర్వికుల చరిత్రంబు వినవలతు సగరుని యజ్ఞం బెత్తెఱంగునం బ్రవర్తిల్లె సవిస్తరంబుగా నెఱింగింపవేయని యభ్యర్థించిన నమ్మునిస్వామిరఘుస్వామికిట్లనియె ॥ (మ) హిమవింధ్యాచల మధ్యదేశమున ధాత్రీశుండు చిత్తంబునం । బ్రమదంబొప్పఁ దురంగమేథ మొనరింపం బూని కావించుచో । రమణీయుం డగు నంశుమంతుఁడు లెద, ర్థంబైన యశ్వంబున । య్యామ

(*)ఇంద్రుఁడువంచనచేసగరునియాగీయాశ్వమునుగొనిపోవుట(*)

రాపుల్ గొనిపోవకుండఁగసముద్యచ్ఛక్తిరక్షింపఁగన్ ॥(చ)అనిమిషనాథుఁడొక్కకుహనాసురవేషముఁదాల్చియంశుమంతుని వెసదాఁగుజెంచిరుపితుండయిపర్వమునందునశ్వముంగొనిఫణిరాజలోకమున,కుంజనియందతిగుహ్యమైనయా । ఘనకపిలాశ్రమంబువెను,కన్ వడిదాఁచిచనెర్ రయంబునన్ ॥ (సీ) అంతఋత్విగ్వరు,లధ్వరాశ్వముపోవ బెఱికిగిమహీపతి,కిట్టులనిరిపార్థివోత్తమయాగపశువుహృతంబయ్యె వెసనశ్వచోరుని, వెదకిచంపి । హయమును దెప్పించు, మధ్వరంబునకుఛిద్రముగగ్లైనేనియుఁ, దప్పకిపుడు । మనకందఱకునున్న, మంగళం బొనఁగూడునట్లుగాకుండనీ, యధ్వరంబు ॥ (తే,గీ) సాంగముగఁ జేయు మనవుడు, జనవిభుండు । చాలమననమున్నఁజింతించి, సభకు వేగ । నమితసత్త్వులషష్టిసహస్రసుతుల । నపుడరావించివారికి, ట్లనుచుఁబలికె ॥ (ఉ) పుత్రకులారయే



లనఁ, బూర్వసుపర్వులఁజూడఁగానమీ । సత్రము శాస్త్రదృష్టవిధి, సాగుచునున్నదియధ్వరక్రియా । సూత్రవిదుల్ మహామునులు,సూ దసదస్యులు నేలొక్కోమహా । చిత్రముగామహాశ్వమది, చెచ్చెరసంహృతమయ్యె నీయెడన్ ॥ (ఉ) మీరఘుదాజ్ఞచేరయము, మీఱఁగనేగి పయోధిచేతనొ ।ప్పారెడుమేదినీజగము,,నారసియశ్వము లేకయున్నన । ట్లారకధారుణీతలము, నొక్కొకఁడొక్కయోజనంబుసాం । పారఁగఁద్రవ్వుఁడధ్వరహయంబదిగన్పడుదాఁకనుద్ధతిన్ ॥ (తే, గీ) భుజబలంబునినబ్భంగి, భుజగజగము । దాఁకవడినంతఁ ద్రవ్వియస్తోకమహిమ । నందుశోధించిహయచోరు, నరసిచంపి । సవనహయమునుగొనితెండు, సత్వరముగ ॥ (వ) ఏనుదురంగ దర్శనంబగుదాఁక పౌత్రకుండైన యంశుమంతునింగూడి యుపాధ్యాయగణసహితుండనై దీక్షవహించి యిచ్చటనుండువాఁడ ॥ (చ) అనినమహాప్రసాదమని, యాసగరుల్ ప్రళయావసానసం । జనితపయోధరారవము, చాడ్పుననింగిచెలంగ నార్చియే । చిన బడబాగ్నికీల

(*)సగరపుత్రులుభూమియంతయుఁద్రొప్పనారంభించుట.(*)

ల వి, శేషముదోఁపఁబ్రదీప్తమూర్తులై । చనిరిమఖాశ్వముస్వదక శక్తిగదాప్రముఖాయుధాఢ్యులై ॥ (వ) యిత్తెఱంగున నిజగురూప దేశక్రమంబునఁదూర్పుదెస మొగలుగా జంబూద్వీపంబు చుట్టురాఁదిరుగ నొక్కొక్కఁడొక్కొక్కయోజనంబుఁద్రవ్వదమనివజ్రస్పర్శసమంబులై నభుజంబులబలంబుననశనికల్పంబులై నశూలంబులదారుణంబులైనహలంబులనిశాతనఖంబుల మహీతలంబుభేదింపందొడంగిననప్పుడుభిద్యమానమహీ నినాదంబును వధ్యమాన నాగాసుర నానాసత్త్వనిర్ఘోషంబును సగరులకోలాహలంబును సాంద్రంబుగానొక్కటియై భూనభోంతరాళంబునిండి చెలంగె ॥ (చ) నిరుపమభంగినిట్లుధరణీతలమున్ భుజశక్తియుక్తిచే నఱువదివేలయో జనము, లద్భుతవైఖరిఁద్రవ్విరానరే । శ్వరసుతులంత సిద్ధముని సాధ్యసురల్ భయమందిభారతీశ్వరుకడ కేగి తచ్చరణ,వారిరుహద్వయికిన్ వినమ్రులై ॥ (క) పటుతరభంగి [illegible] ఘటి

(*)దేవతలుసగరపుత్రకేళులుపైబ్రహ్మతోమొఱలిడుట.(*)

యించిహృదంతరమునఁ, గౌతుకమలరన్ । నిటలతటన్యస్తాంజలిపుటు యిట్లా నిరికడుప్రబుద్ధతవెలయన్ ॥ (చ) వెలయఁగమీకుఁదెల్పనొక,విన్నపమున్నదిచిత్తగింపుమో । జలరుహగర్భ యాసగర, సంభవులుర్విఁబ్రదక్షిణంబుగాఁ జలము

నముష్టిముద్గరక, శా నఖసీర ముఖంబులఁ రసాతలభువనంబుదాఁకఁ జనఁద్ర
వ్వెరి భూరిభుజాబలంబునన్ ॥(ఉ)వీఁడెమఖాశ్వచోరకుఁడు, వీఁడెదు రాత్ముఁడు
వీఁడెవైరి వీఁడెసుమీతలఁపమఖ విఘ్నకరుండు వధింపుఁడంచునె । గ్గాడు
చువీఁడువాఁడనక , నతులులకుంగనుపడ్డవారిమో । మోడకత్రుంచి రింకఁగమ
లోద్భవ తద్విధివేగ మాన్పవే॥(మ)అనియా వేల్పులు విన్నవించుటయుభా, పా
ధీశుఁ డవ్వేల్పులం । గనియోనిర్జరులారశౌరికపిలా,ఖ్యన్మౌనియై యున్న వాఁ।
డనిశంబామహనీయమూర్తిఁ ఘనకో,. పాగ్నిచ్ఛటాలంగాలిచ । య్యానఁబంచ
త్వమునొందఁగాఁగలరుమీ, కత్యంతహర్షంబుగన్ ॥ (క) మీమీ నెలవులకుంజ
నుఁ । డీమనమునసమ్మిమీరు,ధృతి వదలకమీ । కీమీదశుభ ముగలిగెడు । నామా
ధవుకరుణఁజేసి, యనిమిషు లారా । (క)అనిద్రుహిణు ఁడానతిచ్చినఁ । జనిర
య్యాదిత్యులాత్మ, సదనంబులకున్ । వినయమునమ్రొక్కి-వీడ్కొని । ఘనతర
సంతోషకుతుక, కలితహృదయులై ॥ (వ) అంతనిక్కడ । (ఉ) ఆసగరావనీం
ద్రసుతు, లయ్యహిలోకముదాకఁద్రవ్వియ । చ్చో సవనాశ్వమున్ జనిన, చో
ప్పుగనుంగొనలేక మిక్కిలి । న్వేసరితంద్రిచక్కటికి, వెండియువచ్చినమస్కరిం
చియు । ల్లాసములేనిమానసము, లన్వచియించిరి దీనవక్త్రులై ॥ (ఉ) అయ్యధ
రిత్రియంతయురు, యంబునఁద్ర వ్వితి మెందునశ్వముం । జయ్యన నశ్వచోరుఁజ
లు, చంగననైతిమిదోర్బలంబుచే । నయ్యెడయక్షదైత్యపత, గాదులఁ జంపితి
మింక మీఁదమా । కెయ్యదికార్యమన్న వసు, ధేశ్వరుఁ డిట్లనుజండ కోపియై ॥
(ఉ) క్రమ్మఱనే గిమీరలుధ, రాతలమున్వడిఁద్రవ్వి లోకముల్ । ద్రిమ్మరి యశ్వ
చోరకునిఁ, దేకువఁగన్గొని వేఁగ్రుతార్థులై । సమ్మతిరండుపొండనినఁ, జయ్యన
వార్థురసాతలప్రదే । శంబునకేగి కొక్కమొగి, సత్వరతన్ జవ యుక్తి వెండి
యున్ ॥ (క)ఈగతిభుజావలేప । శ్రీగరిమదలిర్ప భుజగ, సీమకుఁజనియెం తోగా
ఢకుతూహలమునఁ । బ్రాగాశకుఁజనిరి మొదలఁబ్రాభవమొప్పన్ ॥ (వ) ఇవ్వి
ధంబునఁజని యందుసర్వకాలంబునం దెయ్యదిభూభారవహన జనితఖేదంబున
నొక్కింతవిశ్రమార్థంబుశిరంబుఁజలింపంజేసిదానభూకంపంబుఁగలుగంజేయు
నట్టిదానిఁబర్వతారణ్యసహితంబై నమహీతలంబంతయుశిరంబునమోచికొనియు
న్నదాని మహాపర్వతసన్నికాశంబై నదానివిరూపాక్షనామకంబై నదిగ్గజంబు వి
లోకించిసమ్మానించిదానికింబ్రదక్షిణంబుఁజేసియచ్చోటుఁబాసియామ్యది శకుం



జనియందు ॥ (ఆ, వె) అఖిలభువనభార, మంతయుశిరమునఁ । దాల్చి హేమప
ర్వతంబుకరణి । నలరుదానిన లమ, హాపద్మమనుదిశా । గజముఁగాంచియరు
దుగఢలుకొనఁగ ॥ (తే, గీ) దానివలగొనియవ్వల, మానితముగఁ । బశ్చిమాశ
కుఁజనియందుఁ, బర్వతంబు। మాడ్కినొప్పెడుదానిసౌ, మనసమనెడు । సామ
జంబునుగనిదా, నిసేమమరసి ॥ (తే, గీ) దానికిఁప్రదక్షిణముఁజేసి,ధరణియెల్లఁ।
ద్రవ్వికొనుచుబలప్రౌఢి, నివ్వటిల్ల । నరిగితుహినాద్రిభాషితం, బైనయుత్త ।
రాశఁజేరిరినృపాత్మజు, లందఱచట ॥ (క)హిమశైలపాండురంబై।క్షమాభరము
నెల్ల భద్ర, గాత్రముచేన । శ్రమమునఁదాల్చియలరునా । గముఁగాంచిరి భద్ర
నామ, కంబగుదానిన్ ॥ (వ) ఇత్తెఱంగున విలోకించి దానినభినందించి ప్రదక్షి
ణంబుఁగావించి యచ్చోటుఁబాసి మహీతలంబుభేదించుకొనుచునీశాన్యదిక్కు
నకుంజని యందొక్కచోటదపంబుగావింపుచున్న కాపిలరూపధరుండగు వా
సుదేవునింజూచి తత్పరిసరంబునం జరింపుచున్న హయంబునవలోకించి సంహృ
ష్టచిత్తులై యమ్మహాత్ముని హయచోరకుంగాఁ దలంచి ఖనిత్రలాంగల శిలా
పాదపంబులు ధరించి క్రోధ పర్యాకులే క్షణులై యమ్మహాత్ముని డాయం

(*)కపిలమహర్షిక్రోధానలంబున సగరపుత్రులు దగ్ధులగుట. (*)

జని ॥ (తే,గీ) ఔరదుష్టాత్మ నిలు నిలు , మస్మదీయ । తురగమునుగొని తెచ్చి
న , దొంగ వీవు । మమ్ముసగరపుత్రులను గా, మదినెఱుంగు । మనుచుఁ బలి
కిననమ్ముని, కినుకఁబూని ॥ (తే,గీ) ఘోరహుంకారమొనరింప,వారలమ్మ । హా
త్మకోపాగ్నిదగ్ధులై,యద్భుతగతి । క్షోణిపైభస్మరాసులైకూలిరపుడు । దైవ
కృతమెవ్వరికినైన,దాఁటవశమె ॥ (వ) అంతఁజిరవిప్రోషితులైనపుత్రులందఱఁచు
కొనిసగరుండు॥ (ఉ) అచ్చువడంగఁబుత్రులు మ,హాధ్వరసైంధవ రాజమున్
వెసం। దెచ్చెదమంచుఁబోయిరతి, తీవ్రగతిన్ బహుకాలమయ్యెరా । రెచ్చటికే
గిరోమదికి, నెంతయునెవ్వగనివ్వటిల్లెడుం । జెచ్చెరవారల న్మదముఁ, జెందఁగ
నెన్నఁడుచూడఁగల్గునో॥ (చ) అనితలపోసియమ్మనుకులా,ధ్యుఁడు పౌత్రకునంశు
మంతుఁగ । న్గొనియనువత్సనీదు జ,నకుల్ సవనాశ్వముఁ దెత్తుమంచుఁజ।య్యె
నఁజనిరారుపెక్కహము, లయ్యె నహంకృతి నెందుఁబోయిరో । జనకులజాడ
గాంచిమఖసైంధవముంగొనితెమ్ముసీవిఁకన్ ॥ (వ) మఱియు నీవుశూరుండవుకృ
తవీర్యుండవు కృతవిద్యుండవు పూర్వరాజసంకాశుండవు గావున నీకుంజెప్పవ

లసినవిశేషం బెద్దియు లేదాంతర్యామంబులగు మహాసత్త్వంబులు వీర్యవంతంబు
లై యుండు నీవు నిరాయుధుండవై పోవం జనదు కార్ముకఖడ్గంబులు ధరియిం
చి యిపుడు కదలి పెద్దలగువారి సమ్మానింపుచు విఘ్నకరులగు వారి వధియించుచు
నప్రమాదుండవై యరిగి సిద్ధార్థుండవై క్రమ్మఱం జనుదెమ్ము యజ్ఞపారగుండవు
గమ్మని పల్కి యనిచిన నయ్యంశుమంతుండు పితామహుని శాసనంబునం జా
పఖడ్గంబులు ధరియించి పితృఖాతంబైన యాంతర్యామమార్గంబునం జని దై
త్యదానవరక్షఃపిశాచపతంగోరగంబుల చేతం బూజ్యమానుండగుచు దిగ్గజంబు
కడకుం జని ప్రదక్షిణంబుం జేసి హయవార్త నెఱింగింపు మనియడిగిన నద్దంతా
వళరాజంబు పరమానందంబున నిట్లనియె ॥ (తే,గీ) రాజనందన నీవు శీఘ్రంబె
పవన । తురగమును వెంటఁ గొని కృతార్థుండ వగుచు । నరుగుదెంచెదవిది
నిక్క,మరుగుమనిన । నతఁడు మనమున హర్షించి, యవలఁ బోయి ॥ (ఆ,వె)
దాని నడిగి నట్లు,తక్కిన దిక్పాల । సామజముల నడుగఁ బ్రేమనవియు । నశ్వ
గజము చెప్పి,నట్లు చెప్పినఁ బ్రీతి । నంశుమంతుఁ డవల,నరిగి యరిగి ॥ (వ)
(*)అంశుమంతుఁడు కపిలాశ్రమంబున నశ్వమును భస్మీకృతజనకులనుం గాంచుట.(*)
మహోన్నతంబైన కపిలునిదివ్యాశ్రమంబునకుం జనియందు ॥ (చ) తురగముఁ
గాంచి సంతసిల్లి,తోడనె యమ్మునినాథు చెంగటన్ । గుఱుతుగ భస్మరాసులయి,
కూలిన తండ్రులఁ గాంచి భూరిశో । కరసని మగ్నచిత్తుఁ డయి గాసిలి పెక్కు
విధంబులం గడుం । దలఁచుచుఁ గొంతసేపునకుఁ, దద్దయు ధైర్యసమావలంబియై ॥
(క) జనకులకు నుదకతర్పణ । మొనరింపఁ దలంచి యచట, నుదక మరసి యెం ।
గరుడుం డంశుమంతునికిఁ బొడసూపి తజ్జనకులకు సద్గతి కలుగు నుపాయం బెఱిఁగించుట
దును గానక నద్దెసల । త్యనుపమగతిఁ జూచుచుండ, నాస్సమయమునన్ ॥ (ఉ) ఆ
యతపక్షవాతచలి,తాచలుఁడై ఖగవంశనాయకుం । డాయెడ కేగుదెంచి నమ,
హాత్ముని తండ్రుల మేనమామనుం । బాయక కాంచి యంఘ్రులకు, భక్తి నమ
స్కృతి యాచరించి కేల్ । దోయి ఘటించి చాల వినుతుల్ బచరించి భజించుచుం
డఁగన్ ॥ (వ) మనుమనిం గని సాంత్వవచనంబుల ననునయించి యిట్లనియె ॥
(మ) అనఘా నీజనకుల్ వడిం గపిలుకో,పాగ్నిచ్ఛటార్చిర్భస్మమై । చనిరీవింకిట
వారికై వగుచుటే,సాధించు కార్యంబు గ్ర । న్నన నెవ్వారికినైన నవ్వైవకృతముం
దప్పింపఁగా వచ్చునే । వినుకర్మంబులు కాలచోదితములై, వెన్నాడి వర్తిం



పవే ॥ (తే,గీ) జనవర కుమార వీరల, చావు లోక । సమ్మతము దీని కింత శోక
మ్ము వలదు । కపిలు కోపానలంబునఁ,గాలి నిరయ । గతికిఁ జనియున్న వారు నా,గ
లు వీరు ॥ (క) కావున నీజలదానముఁ । గావించిన ఫలము లేదు,ఘనముగ వీ
రల్ । దీవర్య వినుము శుచులై । దేవత్వము నొందు నట్టి, తెఱవెఱిఁగింతున్ ॥ (క)
జగతీశతనయ హిమవ । న్నగపతి యగ్రసుత గంగ,నాఁగల దయ్యా । పగ యందుఁ
దండ్రులకుం జ । క్కఁగ నుదకక్రియ యొనర్పఁ,గలుగు శుభగతుల్ ॥ (క) మఱియు
నమ్మహానది లోకపావని గావునఁ దద్విమలజలంబుల నీభస్మరాసులం దడిపితివేని
పరిశుద్ధులై యూర్ధ్వలోకంబునకుం జనియెద రిప్పు డిచ్చట మసలక శీఘ్రంబున హ
యంబును గొని చని పితామహుని చేత యజ్ఞంబు సాంగంబుగాఁ జేయింపు మ
నిన నా సుపర్ణుని వచనంబు విని వీర్యవంతుండగు నంశుమంతుండు హయం
బును రయంబున గొని దీక్షితుండైన సగరుని యొద్దకుఁ గ్రమ్మఱం జని యశ్వో
త్తమంబు సమర్పించి తండ్రులపోక యెఱింగించి సుపర్ణునివచనంబు విన్నవించిన
విని యమ్మహీరమణుండు దుఃఖితుండై కొండొక ధైర్యంబున నమ్మహాయజ్ఞంబు
సమాప్తి నొందించి నిజపురంబునకుం జనుదెంచి స్వర్గగంగను బుడమికిం దెచ్చు
టకుఁ దగిన యుపాయంబుఁ జింతించి నిశ్చయింపం జాలక ముప్పదివేల సంవత్సరం
బులు రాజ్యంబుఁ జేసి కాలధర్మంబు నొందె నంత ॥ (తే,గీ) మంత్రులయ్యంశు
మంతుని,మహితరాజ్య । మందు నభిషిక్తుఁ గావించి, రన్నరేంద్రవరుఁడు దిలీ
పుఁ బుత్రుఁ గాఁ,బడసి యతనిఁ । జెలఁగి సామ్రాజ్యమం దభి,షిక్తుఁ జేసి ॥ (గీ) గరి
మతోఁ దుహినాద్రిశృం,గంబు మీఁద । బ్రీతి మెఱయంగ ముప్పది, రెండు వేల । యేం
డ్లు తపముఁ గావించియ,భీష్టసిద్ధిఁ । గాంచఁ జాలక యతఁడు నా,కమున కరిగె ॥
(సీ) అంత దిలీపభూ,పాగ్రణి తాతల మరణంబు విని చాల,మనములోన । దుఃఖించి
హిమశైల,దుహితయౌ గంగ యెబ్బంగి ధాత్రికి వచ్చుఁ,బరఁగ సలిల । తర్పణం బె
టుల నొ,నర్పంగఁ జేకురు నోనరవారల నెట్లు,నుద్ధరింతు । ననుచుఁ జింతాపరుం,
డై నిశ్చయింపంగఁ జాలక ముప్పది,వేలయేండ్లు ॥ (తే,గీ) రాజ్య మొనరించి బహు
ళాధ్వ,రములఁ జేసి । రమణ ధార్మికుఁ డగు భగీ,రథుని ఘనుని । సుతునిఁ గాఁ
గని యతని భూ,పతిని జేసి । వ్యాధిపీడితుఁడై దివి, కరిగె నతఁడు ॥ (ఉ) ఆ నరరా

(*) భగీరథుఁడు గంగావతరణమునకుఁ గాఁదప మొనర్చుట. (*)

జసూనుఁడు మహాద్భుతవీర్యుఁడు వంశపావనుం । డైన భగీరథుండు నిఖిలావని నే
లుచునుండి ధాత్రికిన్ । మానుగ గంగఁ దెత్తునని,మంత్రుల రాజ్యమునందు నిల్పి

లో । నానిన కౌతుకంబు చెలువారఁ దపంబున కేగెఁ బ్రీతితోన్ ॥ (వ) ఇవ్విధం
బున నమ్మహీమహికాంతుండు గోకర్ణాశ్రమంబునకుం జనియందు ॥ (సీ) కుడికా
లి పెనువ్రేలు, పుడమిపై మోపి డాపలికాలు కుడికాలు, పైఁ ఘటించి । చేదోయిఁ
బెనువ్రేల, నూఁది మీఁదికిఁ జూఁపి జగతిఁ జూడక యెగు, మొగముఁ జేసి । కట్రికి
వేసవియందు, ఘనచతుర్వహ్ని మధ్యమున నిల్చి మహోగ్ర, హంసమండలంబుఁ
గన్గొనుచు వర్షాకాలమున వారి నడుమ నిల్చుచు నిట్లు, కడు సమాధి ॥ (తే,గీ) నచ
లనిష్ఠమా సాహసుఁ, డై యమోఘ । ఘనతపోవహ్ని శిఖలులో, కములఁ బ
ర్వ । ప్రళయకాలాగ్ని హేతుల, పగిది నేర్చఁ । దవిలి యబ్ద సహస్రముల్, త
(. భగీరథునకు బ్రహ్మప్రత్యక్షమై గంగాపాతము సహించుట కైయీశ్వరుఁ బ్రార్థింపుమనుట
పమొనర్చెన్ ॥ (ఉ) అంత సమస్తలోక గురుఁ, డంబుజగర్భుఁడు వేల్పుపె
ద్దవా । క్కాంతుఁడు మెచ్చి నిర్జరని, కాయ సమన్వితుఁడై రయంబునం ।
బంతముతో నమేయగతి, భవ్యతపం బొనరింపుచున్న భూ । కాంతునిఁ జేర
వచ్చి కుతు, కంబలర న్మధురోక్తి నిట్లనున్ ॥ (ఉ) మెచ్చితి ధారుణీ రమణ,
మించిన పేర్కొవరం బొసంగఁగా । వచ్చితి నీతపం బుద్ధిగి, వాకొని యిష్టము
దెల్పుమన్నా । సచ్చరితుండు తచ్చరణ, సారసముల్ దలసోఁక మ్రొక్కి
లో । హెచ్చినభక్తి తేఁటపడ, నింపుగ నంజలిఁ జేసి యిట్లనున్ ॥ (క) నిక్క
ముగ నీకు నాపై । మక్కువగలదేని దేవ, మాతాతలు పెం । పెక్కఁగ నాచే
సలిలము । గ్రక్కునఁ గొనువారు గాఁగ, ఘటియింపఁగదే ॥ (వ) మఱియు
నాతపం బమోఘంబేని భస్మరాసులు గంగాసలిల క్లిన్నంబులగుచుండ సాగ
రులూర్ధ్వగతికిం జనువారు గాఁ బ్రసాదింప వలయు నదియునుంగాక ఘోరం
బైన యనపత్యతాదోషంబున సౌమనస్యంబుఁ గానక శోకింపుచున్న నాకు
వంశకర్తలగు పుత్రుల ననుగ్రహింపవలయు ననియడిగిన సర్వలోక పితా
మహుండగు విరించి యుదంచిత కరుణా కటాక్షవీక్షణంబుల భగీరథు నిరీక్షిం
చి మంజుమధురాక్షర వ్యక్తంబుగా నిట్లనియె ॥ (తే,గీ) అనఘచారిత్ర నీకోర్కి,నట్ల
నెయగు । డెందమున నింక సందియ,మందవలదు । వితతమతి నీకు నింకొక్క,
హితము జెప్పె । దను సమాహిత బుద్ధివై, వినఁగవలయు ॥ (చ) హిమగిరిపుత్రి గం
గనొగి, నిమ్మని పల్కితి వట్లయిచ్చితిన్ । విమలగుణాఢ్య తత్పతన, వేగము ధాత్రి
సహింపఁజాలదా । ప్రమథగణాధి నాథుఁడగు, రాజకిరీటిఁడు దాల్పఁ గావలెం ।



బ్రవిమల తేజు నవ్విభునిఁ, బ్రార్థన సేయు మమోఘ నిష్ఠతోన్ ॥ (వ) మఱి
యు నాగంగానది హిమవంతునకు జ్యేష్ఠపుత్రిక గావున దాని ధరింప నీశ్వరుం
డె యర్హుండగు నమ్మహాత్ముండు దక్క నన్యుండు గంగాపతన వేగంబు స
హించుటకు శక్తుండు గాఁడద్దేవదేవు నారాధింపుము ॥ (చ) అనియిటులా
నతిచ్చియజుఁ, డానృపమౌళికి వంశకర్తలం । దనయుల నిచ్చి క్రమ్మఱను, దం
బున గంగను బిల్చి యామహా । త్మునివెనువెంట నేగుము స, ముద్ధతిఁ గోరిన
యప్పుడంచుఁ జ । య్యన నియమించి యాత్మనిల, యంబునకుం జనియెన్ సతే
భగీరథునికిఁ బరమేశ్వరుండు ప్రొడసూపి గంగను శిరంబున వహింతునని కరుణించుట. (*)
ఖుఁడై ॥ (ఉ) అంతసరస్వతీరమణు, నానతి నమ్మహికాంతుఁ డద్రిజా । కాం
తునిఁ గూర్చి వత్సరము, గ్రక్కునఁ బాదతలాగ్రమూర్విపై । నెంతయు మోపి బా
హుయుగ, మెత్తి నిరాశ్రయుఁడై చలింపక । భ్యంతర సిద్ధినొందిపవ,నాశనుఁడై
తపమాచరించినన్ ॥ (వ) అంత సంవత్సరంబు పరిపూర్ణంబగుటయుఁ ద
త్ప్రయాసంబుఁ జూచి కరుణించి సర్వలోక నమస్కృతుండైన యుమావల్ల
భుండు క్షమావల్లభునకుం బొడసూపి యిట్లనియె ॥ (క) నరనాయక నీనిష్ఠకు ।
నిరుపమ సంతోషమొదవె, నీకుఁ బ్రియముగా । గిరిరాజపుత్రి గంగను । శిర
మున ధరియింతుఁ దెమ్ము, చెచ్చెరదానిన్ ॥ (క) అని రాజమౌళి పల్కిన । జ
ననాయకుఁ డుల్లసిల్లి, చతురత చేన । య్యనిమేష ధునిని వేఁడుట । యనుద
యనప్పావ నాప, గోత్తమమంతన్ ॥ (తే,గీ) సంగతా భంగరంగత్త, రంగ
సంగ । ఘట్టనో ద్భూత రవములో, కత్రయంబుఁ । బగులఁ జేయంగ సకల
ది, గ్భాసమాన । యగుచు మిన్నేఱు గగనంబు, దిగివెనపుడు ॥ (వ) ఇట్లు
(.) గంగావలేపంబునకుఁ గ్రుద్ధుఁడై పరమేశ్వరుఁడు తనజటాజూటంబుఁ జాచుట. (*)
దుర్వార వేగంబునం బఱతెంచి శివంబగు శివశిరంబునం బడియంత నిలువక మ
దీయస్రోతోవేగంబున శంకరుం బరిగ్రహించి పాతాళలోకంబుఁ బ్రవేశించెదఁ
గాక యని సరభసంబుగాఁ బఱవం దొడంగిన నయ్యాదిదేవుండు దాని యవలే
పనం బెఱింగి క్రుద్ధుండై యొక్కింత గర్వవిమోచనంబుఁ జేయుదుఁ గాక య
ని తలంచి వాటంబుగా జటాజూటంబుఁ జాచిన నయ్యేఱయ్యుమావల్లభుని జ
టామండల గహ్వరమధ్యంబునఁ దుషారకణమాత్రంబై చిక్కుపడి తనశక్తి కొ
లంది మహీతలంబున కవతరింప నతిప్రయత్నంబుఁ జేసి మఱల వెడలు తెఱం

గెలుంగక ననేక వత్సరంబులు తిరుగుడు పడుచుండెనంత ॥ (ఉ) ఆమను
భగీరథుఁడు శివశిరంబునఁబడినగంగంగానక తపంబొనరింపశివుండుకరుణించుట.
జేంద్రచంద్రుఁడు వి,యన్నదిఁ గానక యెందుఁ బోయెనో । నామదిఁ జూడఁ గో
రిగణ, నాథుశిరంబున నెందుడాఁగెనో । యేమియొనర్తు వాఁడనిక, నెయ్యది
కర్జము టంచుఁ గ్రమ్మఱం । గామహరుం గుఱించి కుతు,కంబున ఘోరతపంబొ
నర్చినర్ ॥ (క) మేటిగనతఁ డొనరించెడు । గాటపుఁదపమునకుఁ గరుణ,గ
దురనిజజటా । జూటంబువలన శంభుఁడు । వాటముగా విడిచె దేవ,వాహినినం
తట ॥ (వ) ఇట్లు హిమవన్నందన యైన గంగ సర్వలోకనమస్కృతుండైన
పినాకధరుని జటాజూటంబువలన నిర్గమించి బిందుసరోవరంబునం బడి సప్త
ప్రవాహంబులు తూర్పుదెసకుం జనియె సితాసింధుసుచక్షుసంజ్ఞలంగలమూ
డు ప్రవాహంబులు పశ్చిమదిక్కునకుం జనియె మఱియును ॥ (సీ) దివి కేగ
మదిలోనఁ, దివురుభూజనులకు నిశ్రేణు లననూర్మి,నికరములును । జెలిమిఁ
దారలతోడఁ, జేయంగఁ జనుమాడ్కి, వినువీధి కెగయు జీ,వనకణములు । ధ
ర్మాత్ములగువారి, నిర్మలకీర్తుల కరణి నొప్పెడు ఫేన, ఖండతతులు । నీరీతిఁ
ద్రిప్పుదు,నెల్లదోసములంచుఁ దెల్పు చందంబునఁ,దిరుగుసుళ్లు ॥ (తే,గీ) వెల
యవినువీధి శరదభ్ర,విభ్రమంబు । గలిగి యొకదివ్యవాహిని, యల భగీర ।
థావనీనాథు వెనువెంట, నంటియఘుస । మూహములఁ బాపభూలోక, మునకు
వచ్చె ॥ (వ) అది మఱియు శంకరజటాజూటతటాధివాసుండగు హిమకరుని
కిరణములన్నియు సర్వతోముఖత్వంబు మాని యేకీభవించి యక్కురంగలాం
ఛనుని శరీరంబున నుండి దీఁగెసాగి బయలెంచుచున్న చందంబున నందంబై
యుల్లోలకల్లోల మాలికాడోలికా కలితరథాంగ బాలికా తనుచ్ఛాయావిలా
సంబులు తదీయస్రోతో వేగబాహుళ్యంబున గగనంబున నుండఁ జాలక పుడ
మింబడనడరు ధారాధరమండలంబువలన నెడ తెగక పడునిరమ్మదముల సంపద
సొంపు సంపాదింప విలింపులు తమకు నిరంతర జీవనంబైనమిన్నేఱు పుడమికి ది
గుటకుఁ జిరకాలసంస్తవంబున నోర్వక భాష్పధారాపూర వ్యాజంబున వగవఁ
గతకిసలయంబులు సాఁచి మంజువాక్యంబుల వారి ననూయించుచున్నదో
యన నంబరచుంబి సముత్తుంగతరంగత్తరంగంబులు ఘుమఘుమారావంబు
లతో నొండొంటిం దాఁక భవద్విషయకృతాపచార దోషవిశేషంబున న



శేషంబుగా నిరయగతికిం జనిన సగరధరణీ తరుణీపురందర నందన సందో
హంబు సద్గతి నొందింపం బూని యనుజ్ఞవడయుటకు మదుత్పత్తి స్థానం
బైన భవదీయచరణ మూలంబులు సేవింప వచ్చుచున్న దాన మద్వాంఛి
తంబు ఫలింపం జేయవే యని కపిల మహామునిం బ్రార్థించుటకుఁ
గరంబులు తిరంబుగా మొగిచెనో యని యుపమింపసొంపైన తదీయవిమలసం
వర్ధిత జాంబూనదారవింద కుట్మలంబులు నయనానందకరంబులై యలరన
మృతరసాధిదేవత సమస్తభువనజీవనంబైన తనజీవనంబునకు ననవరతసర్వతో
ముఖతావిచ్ఛేదకత్వంబు సంపాదింపందలంచి జగన్మాతనావహింపం జేసిపరిపూ
ర్ణ పరికీర్ణఘరాగపటలపరిలేపనంబు సంఘటించి వినూతనకేసరవిసర హరి
ద్రాక్షితంబులు సమర్పించి రంజన్మకరందబిందుబృందపాద్యంబొసంగి సమం
చితరంజత్కింజల్కపుంజచ్ఛాయ దీపాంకురంబులిడి మకరందపానమత్తమధు
కర గానమంత్రంబు లుచ్చరింపుచు ముహుర్ముహు లుర్ఘ దదభంగతరంగ
మృదంగనిస్వనంబు చెలంగ నర్చించిన సంపూర్ణసుధాపూర్ణ కనత్కనక
కలశంబుల చెలువున నలరు వినూతన చారుచామీకరసారసకోరకంబులఁ గలఁ
చిసఖండకాండంబులు మెసవి తదీయమధుర మధుపాన వశంబున మదించిన
యంచతండంబుల పక్షవిక్షేపణసంజాతసముద్ధూత శీతలజలబిందుబృందంబు
లు వాయువశంబున మింటికెగసి తత్పతనచాతురీసమాలోకన కౌతుకాతిరేకం
బున విమానారూఢులై చనుదెంచి తదుపరిప్రదేశంబునఁ జాలుగొనియున్న సి
ద్ధవిద్యాధరాంగనల కొప్పకప్పుకొప్పులకుం జుట్టిన దట్టంపుఁ గ్రొత్తముత్తియం
పుసరుల మొత్తంబుల గతి నతిరమణీయంబులై చూపఱులచూడ్కులకు వే
డ్కఁ జేయఁ బెక్కుకాలంబున నుండి హిరణ్యగర్భుండు కమలంబున నివసించి
న కారణంబున నతని మేనిజిగి సోఁకి కుందనపుఁ జాయలనలరు కేసరవిసంబు
లనడుమ వాసంబుఁ జేయుటం జేసి నిజమాలిన్యంబు దొలఁగి పుటపాకశోభితకా
ర్తస్వర కలికాసుషమాభిరామంబులైన చందంబున నందంబులగు కమలప
రాగపటలపిశంగీకృత పుష్పంధయ సముదయంబులు సరోజపరిమళరసాస్వాద
నంబునం దనివి సనక మిన్నునం జాలుగొని యున్న కిన్నరాంగనల చికురబం
ధంబులం జుట్టిన సంతానకుసుమవాసన లాఘ్రాణింప మింటికెగసి జంటంగూ
డి ఝుంకారంబులు సేయుచుఁ దదీయ మధుర గానంబున కనురూపంబైన శ్రు

తిసౌదవిలసనంబు హత్తింప నాచార్యదార పరిగ్రహదోష విశేషంబున దోషా కరుండు పవిత్రంబైన సర్వజ్ఞునిశిరంబుననుండ నవతీర్ణుండుగాక యద్దేవవుని చేత వెలువరింపంబడి ప్రవాహంబు వెంటం బఱతెంచి తుమురైన తచ్ఛీకరంబుల భంగి నిండుకొని యున్న జలబుద్బుదంబులు గలిగి సగరమహీమండలాఖండలతనుజాత సమాజాఘ వ్రాతంబుల నిత్తెఱంగున సుడిఁబెట్టెద నింక సందియంబు నొందకుమని యమ్మహానది భగీరథ నరేంద్రచంద్రునకు సాంద్రానందంబుగాఁ దెల్పినట్లుల్లసిల్లు సుళ్లు పెల్లునకుఁదల్లడిల్లుచు నుత్ఫుల్ల సల్లలితహల్లకాంత బర్హిర్గతమత్తమధువ్రతవ్రాతంబులు సుడివడి మునుంగ నిత్తెఱంగున మదీయపావనజీవనంబులఁగనుంగొనిన వారిమునింగిన వారికలుషవ్రాతంబులు వారింతునని యత్తరంగిణీమణి యెల్లవారికెఱింగించె ననియుపమింపం దగి యలర నద్దివ్య వాహినీరత్నంబు తనకుంగల మహిమాతిరేకంబితరతరంగిణులకు లేదనియుభయతటనటత్కరండవ పటలస్వనమిషంబున నాడుచునవ్విన చిఱునవ్వు చందంబుననందంబగు పాండుర డిండీరఖండకాండంబులు కాఠిణంబులపై మెండుగ నిండుకొని నిండువేడుక నెఱప భగీరథమహీపాలునిపైఁ బొడమినరుద్రదేవుని కరుణారసంబు వాహినీ రూపంబునొంది సితశతపత్రాత పత్రంబులతోఁ గాశచామరంబులతో రంగద్భృంగ సంగీతనాదంబులతో రథాంగదంపతీనిర్ఘోషసాహసనినాదంబులతోఁ దరంగపాళీకేళీకలితమరాళీగణంబులు మంజులశబ్దంబులజోహారుసేయఁ గల్లోలమాలికాపరస్పర సంఘట్టన సంజాతబహుళస్వనంబులు మంగళతూర్యనిస్వనంబులఁ దెలుపఁ జలిమలనుండి భగీరథమహీమండలాఖండలుని వెంట భూలోకంబుఁ బావనంబుసేయుటకు మీఱిన కోరికతో నూరేగుచుఁ జనుదెంచుచున్నదోయని యుత్ప్రేక్షింపం దగిన పట్టరాని వేగంబున మట్టుమీఱియుట్టట్టుగదల్ప రాక యెదురుధట్టించిన బెట్టిదంబులగు పెనుగట్టులనెల్లఁ బట్టబయలు సేయుచు భగీరథుని మనోరథంబు సఫలంబుఁ జేయుటకు దుర్వారవేగంబుననరుగుదెంచుచుండె నప్పుడు ॥ (క) ఎడతెగక మింటివలనం । బడియెడు ఘనమత్స్య కచ్ఛపంబుల చేతన్ । వడిఁబారు జలము చేతను । బుడమి కడువిచిత్రభంగిఁ, బొలుపైయొప్పెన్ ॥ (క) దితిజారుల చేవిలస । ద్వితతతదీయావతంస, దీధితిచేతన్ । గతతోయదమగు గగనము । శతార్కమయినక్రియనలరె సాంద్రద్యుతిమై ॥ (తే, గీ) చంచలములైన మత్స్య, కచ్ఛపవిహంగ । శింశుమారగణంబుల, చేతనపుడు । గగనమొప్పారె మఱియుభా, స్కరకులాబ్ధి । శీతకరదీప్తశంపల, చేతఁబోలె ॥ (తే, గీ) మఱియుగగనంబుసంకీర్య, మాణవిమల । ఫేనములచేత నపుడంచపిండుచేతఁ । బరివృతములైన శారదా, భ్రములచేతఁ । బరివృతంబైనకరణిన, చ్చెరువొనర్చె ॥ (క) రొదసేయుచు సుడిదిరుగుచు । నెదురేగుచు గగనమునకు, నెగయుచు వడితోఁ । బదపడి ధరపైప్రాలుచు । ముదమునఁజనుదెంచె గంగ, భూపతివెంటన్ ॥ (క) ఏమార్గమున భగీరథ । భూమీశలలాముఁడరిగెఁ, బొలుపుగ నదియుం । బ్రేమదళుకొత్త రయమున । నామార్గముఁబట్టిచనియె, నాతనివెంటన్ ॥ (వ) అప్పుడు ॥ (చ) సరసిజగర్భుఁడాదియగు, సర్వదివౌకసులమ్మహాపగన్ । సరసతఁజూచు వేడుకఁ బ్రసన్నమణీమయహారచేలనూ । పురమకుటాంగదాదివర, భూషణముల్ ధరియించి మించియు । ప్పరమున నిల్చి మ్రొక్కి బహు, భంగుల నంజలిఁ జేసియింపునన్ ॥ (చ) ఆతులితభక్తియుక్తులయి, యన్నది నందఱు వేయినోళ్లఁ బ్ర । స్తుతులొనరించినేర్పుమెయిఁ, దొరపు వేడుకగట్లఁజూడనం । చితగతిడిగ్గి తద్విమల, శీకరపఙ్క్తులుమీఁదవ్రాలఁగాఁ । జతురతఁబుణ్యతీర్థముల, స్నానముఁ జేసిజపించి రెంతయున్ ॥ (శా) ఆనందంబునఁగూడియాడిరి పద, వ్యక్తంబుగానచ్చరల్ । నానాసూనవితానమాలికలనం; దంబొప్ప నర్పించిరా । మౌనిశ్రేష్ఠులు మ్రోసె నారపటుశం, ఖతూర్యనిర్ఘోషముల్ । గానంబున్నతిసల్పి రశ్వవదనుల్, కల్యాణభావంబునన్ ॥ (క) సురసిద్ధసాధ్యకిన్నర । గరుడోరగ యక్షదైత్య, గంధర్వాదుల్ । బఱతెంచుచుండిరప్పుడు । ధరణీపతిరయము వెంటఁ, దద్దయుఁ బ్రీతిన్ ॥ (క) తనపావనజీవనములఁ । గనువారిమునుంగువా, రికలుషౌఘంబుల్ । మునుముట్టఁ గొట్టిపెట్టుచు । ననిమిషనది నృపుని వెంటనరుదెంచె రహిన్ ॥ (మ) అ



### (*) జహ్నుమహాముని గంగానది యంతయు మ్రింగుట. (*)

నువందం దగజహ్నువయ్యేడమఖం, బారూఢిఁగావింపఁద । ద్ఘనయజ్ఞాయతనంబు వారిమయముం, గావించినన్ దానిఁజ । య్యనవీక్షించి బళాయటంచుఁగుపితుండై యమ్మహాపుణ్యుఁడా । ననగోళంబుఁ దెరల్చి మానుల రుదం, దన్మ్రింగెనవ్వాహినిన్ ॥ (ఉ) ఆమహిమంబుఁ గన్గొని మ, హర్షులు లేఖవరుల్
థ । భ్రామరనేతయున్ వివిధ, మార్గములం దనుసన్నుతింపఁగా । నా
డితానుమిసి, యన్నది నెంగిలిసేయనొల్లికెం । తోముప మొప్పఁగా

తిసాదనిలసనంబు హత్తింప నాచార్యదార పరిగ్రహదోష విశేషంబున దోషాకరుండు పవిత్రంబైన సర్వజ్ఞుని శిరంబుననుండ నహుళించుగాక యద్దేవవుని చేత వెలువరింపంబడి ప్రవాహంబు వెంటం బఱతెంచి తుమురైన తచ్ఛకలంబుల భంగి నిండుకొని యున్న జలబుద్బుదంబులు గలిగి సగరమహీమండలాఖండలతనుజాత సమాజాఘవ్రాతంబుల నిత్తెఱంగున నుడిఁబెట్టెద నింక సందియంబు నొందకుమని యమ్మహానది భగీరథ నరేంద్ర చంద్రునకు సాంద్రానందంబుగాఁ దెల్పినట్లుల్లసిల్లుసుళ్ల పెల్లునకుఁ దల్లడిల్లుచు నుత్ఫుల్ల సల్లలితహల్లకాంత బహిర్గతమత్తమధువ్రతవ్రాతంబులు నుడిపడిమునుంగ నిత్తెఱంగున మదీయపావనజీవనంబులఁ గనుంగొనిన వారిమునింగిన వారికలుషవ్రాతంబుల వారింతునని యత్తరంగిణీమణి యెల్లవారికెఱింగించె ననియుపమింపం దగి యలర నద్దివ్యవాహినీరత్నంబు తనకుం గల మహిమాతిరేకంబితరతరంగిణులకు లేదని యుభయతటనటత్కాండవ పటలస్వనమిషంబున నాడుచున వ్విన చిఱునవ్వు చందంబున నందంబగు పాండుర డిండీరఖండకాండంబులు కూలంబులపై మెండుగ నిండుకొని నిండువేడుక నెఱప భగీరథమహీపాలునిపైఁ బొడమిన రుద్రదేవుని కరుణారసంబు వాహినీ రూపంబునొంది సితశతపత్రాతపత్రంబులతోఁ గాశచామరంబులతో రంగద్భృంగ సంగీతనాదంబులతో రథాంగదంపతీనిఘోషసాహానినాదంబులతోఁ దరంగపాళీకేళీకలితమరాళీగణంబులు మంజులశబ్దంబుల జో హారుసేయఁ గల్లోలమాలికాపరస్పరసంఘట్టనసంజాతబహుళస్వనంబులు మంగళతూర్యనిస్వనంబులఁ దెలుపఁ జలిమలనుండి భగీరథమహీమండలాఖండలుని వెంట భూలోకంబుఁ బావనంబు సేయుటకు మీఱిన కోరికతో నూరేగుచుఁ జనుదెంచుచున్నదోయని యుత్ప్రేక్షింపం దగిన పట్టరాని వేగంబున మట్టుమీఱియుట్టట్టుగ దల్పరాక యెదురుఘట్టించిన బెట్టిదంబులగు పెనుగట్టుల నెల్లఁ బట్టబయలు సేయుచు భగీరథుని మనోరథంబు సఫలంబుఁ జేయుటకు దుర్వారవేగంబున నరుగుదెంచుచుండె నప్పుడు ॥ (క) ఎడతెగక మింటివలనం । బడియెడు ఘనమత్స్య కచ్ఛపంబుల చేతన్ । వడిఁ బారుజలము చేతను । బుడమి కడువిచిత్రభంగిఁ, బొలుపైయొప్పెన్ ॥ (క) దితిజారులచే విలస । ద్వితతతదీయావతంస; దీధితిచేతన్ । గతతోయదమగు గగనము । శతార్కమయినక్రియ నలరె సాంద్రద్యుతియై ॥ (తే, గీ) చంచలములైన మత్స్య, కచ్ఛపవిహంగ । శింశుమా



రగణంబుల, చేతనపుడు । గగనమొప్పారె మఱియు భా, స్కరకులాబ్ధి । శీతకరదీప్తశంపల, చేతఁబోలె ॥ (తే, గీ) మఱియు గగనంబు సంకీర్య, మాణవిమల। ఫేనముల చేత నపుడంచపిండు చేతఁ । బరివృతములైన శారదా, భ్రముల చేతఁ । బరివృతంబైన కరణిన, బ్బెరువొనర్చె ॥ (క) రొదసేయుచు నుడిదిరుగుచు । నెదురేగుచు గగనమునకు, నెగయుచు వడితోఁ । బదపడి ధరపై వ్రాలుచు । ముదమునఁ జనుదెంచె గంగ, భూపతి వెంటన్ ॥ (క) ఏమార్గమున భగీరథ । భూమీశలలాముఁ డరిగెఁ, బొలుపుగ నదియుం । బ్రేమ దళుకొత్త రయమున । నామార్గముఁ బట్టి చనియె, నాతని వెంటన్ ॥ (వ) అప్పుడు ॥ (చ) సరసిజగర్భుఁ డాదియగు, సర్వదివౌకసులమ్మహాపగన్ । సరసతఁ జూచు వేడుకఁ బ్రసన్నమణీమయహారచేలనూ । పురమకుటాంగదాదివర, భూషణముల్ ధరియించి మించియు । ప్పురమున నిల్చి మ్రొక్కి బహు, భంగుల నంజలిఁ జేసి యింపునన్ ॥ (చ) అతులితభక్తియుక్తులయి, యన్నది నందఱు వేయినోళ్లఁ బ్ర । స్తుతులొనరించి నేర్పమెయిఁ, దోరపు వేడుక గట్లఁ జూడనం । చితగతి డిగ్గి తద్విమల, శీకరపఙ్క్తులు మీఁద వ్రాలఁగాఁ । జతురతఁ బుణ్యతీర్థముల, స్నానముఁ జేసి జపించి రంతయున్ ॥ (శా) ఆనందంబునఁ గూడి యాడిరి పద,వ్యక్తంబుగా నచ్చరల్ । నానాసూనవితానమాలికల నం;దం బొప్ప నర్పించిరా । మౌనిశ్రేష్ఠులు మ్రోసె నారపటుత్వం, భతుర్యనిఘోషముల్ । గానంబున్ మతిసల్పి రశ్వవదనుల్, కల్యాణభావంబునన్ ॥ (క) సురసిద్ధ సాధ్యకిన్నర । గరుడోరగ యక్షదైత్య, గంధర్వాదుల్ । బఱతెంచుచుండిరప్పుడు । ధరణీపతి రయము వెంటఁ, దద్దయుఁ బ్రీతిన్ ॥ (క) తనపావనజీవనములఁ । గనువారి మునుంగువారి కలుషౌఘంబుల్ । మునుముట్టఁ గొట్టిపెట్టుచు। ననిమిషనది నృపుని వెంట నరుదెంచె రహిన్ ॥ (మ) అ

(*) జహ్నుమహాముని గంగానది యంతయు మ్రింగుట. (*)

నువందం దగ జహ్నువయ్యెడ మఖం, బారూఢిఁ గావింపఁద। ఘ్నునయజ్ఞాయతనంబు వారిమయముం, గావించినన్ దానిఁ జ । య్యన నీక్షించి బళాయటంచుఁ గుపితుండై యమ్మహాపుణ్యుఁడా। ననగోళంబుఁ దెరల్చి మానులరుదం,దన్మ్రింగెనవ్వాహినిన్ ॥ (ఉ) ఆమహిమంబుఁ గన్గొని మ,హర్షులు లేఖవరుల్ భగీరథ। భూమరనేతయున్ వివిధ,మార్గములం దనుసన్నుతింపఁగా। నామునివెండితానుమిసి, యన్నదినెంగిలి సేయనొల్లికెం। తోముదమొప్పఁగా విడిచెఁ, దో

దనకర్ణబిలంబులన్ రహిన్ ॥(వ) అప్పుడమ్మహానదిం జూచి దేవతలు జాహ్నవియని
పొగడిరిట్లు జహ్నుకర్ణబిలంబు వలన నిర్గమించి మఱల నెప్పటియట్ల నప్పుడు
మిఱేని రథంబు వెనుకొని మహామహిమాతిశయంబున సంజని సాగరంబున గలసి
కడలెత్తి నిండి వెల్లిగొని రసాతలంబునకు డిగ్గి భగీరథుని మహాప్రయత్నంబునకు
సార్థకంబుగా నమ్మహానది భస్మరాశీకృతులై యున్న సాగరులమీఁదం బ్రవహిం
చినం దత్క్షణంబ సాగరులు వీతకల్మషులై త్రిదివంబునకుం జని రప్పుడచ్చటికిం జ
నుదెంచి ॥ (ఉ) అంబుజసంభవుండు ముద, మంది భగీరథుఁ గాంచి పల్కె
నో। యంబుజమిత్రవంశకల, శాంబుధిచంద్ర మహీవరేంద్ర యీ। యం
బుధియందు నెందనుక, నప్పులు భాసిలు నంతదాఁక ని। క్కంబుగ నీదు
తాతలు సుఖంబులఁ గాంతురు నాకమందు దొరిగన్ ॥ (వ) మఱియును.

(*) బ్రహ్మ భగీరథునిఁ బ్రశంసించి వరంబు లొసంగుట.)

(సీ) దివ్యభూషణములు, దివ్యాంబరంబులు దివ్యమాల్యంబులు, దివ్యగంధ।
ములఁ దాల్చి ఘనదివ్య, మూర్తులఁ గైకొని దివ్యభోగముల నర్థింతు
రింక। నినవంశ యిది మొద, లీనది నీపేర భాగీరథి యనంగఁ బ్రణుతి కెక్కు।
నదిగాక త్రిపథగ, యనఁగ సరిద్వర యనఁగ జాహ్నవియన, నలరు ధాత్రిఁ॥(తే,గీ)
దవిలి యీధునిలోన నీ, తాతలకు స।మంచితంబుగఁ దర్పణ, మాచరించి।కోర్కెఁ
తోడఁ బిత్రృణముక్తుఁడవు గమ్ము। జనవరేంద్ర సత్యప్రతిశ్రవుఁడవగుచు ॥(తే,గీ)
ధర్మవంతులలోన నుత్తముఁడనంగ। భూరియశుఁడన నత్యంత, శూరుఁడనఁ
గ।ఖ్యాతి వడసిన నీదు ము, త్తాతయైన।సగరుఁ డిప్పని సాధింపఁ, జాలఁడయ్యె॥
(తే,గీ)అంశుమంతుని చందాన, నధికతేజుఁ। డంశుమంతుఁడు మీతాత, యమర
తటినిఁ। దెత్తునని యత్నమొనరించి, తెచ్చుటకు ను। పాయమెంతయు నెఱుఁగక
పోయెనతఁడు ॥(తే,గీ)అనఘరాజర్షి ఘనుఁడు మహర్షితేజుఁ।డమితతపమున
మత్సముం, డగు దిలీప।నృపుఁడు మీతండ్రి గంగ న, ర్థించి వడయఁ। జాలక
దివంబునకు నేగె, జనవరేణ్య। (మ) మును మీపెద్దలు గాఢనిష్ఠురతపం, బుల్ సేసి
సాధింపఁ జా।లని యీకార్యము నేఁడు నీవలన సా, ర్థంబయ్యె నీయంతధ।
న్యుని నెవ్వాని నెఱుంగ ముజ్జగములన్, భూమీశ గంగానదీ। కనదుత్తుంగతరం
గమంగళసమా, ఖ్యంబొందు మింపారఁగన్ ॥(చ)అరయ సమస్తసద్గుణగ, ణా
కరులై నిజవంశకర్తలై। పరమపవిత్రులై జగతి, భాసిలు పుత్త్రులఁ గాంచు మింకని।



ద్ధఱ నొగి సర్వధర్మసుకృ, తంబులకుం దగ నాలవాలమై। వఱలితి వింద్రుఁ గ్రుం
కినరవర్య కృతార్థతనొందు మెంతయున్ ॥(మ)అని దీవించి విరించి సమ్మదర
స,వ్యాకోచచిత్తాబ్జుఁడై। చనియెం బిమ్మట నాతఁ డాతటినిలో, స్నానంబుఁ గావిం
చి గో।బ్బున సిద్ధాత్మకుఁడై పితామహులకుం, బుణ్యోదకం బిచ్చి మిం।చిన ప్రీతిం గృ
తకృత్యుఁడై మఱలవచ్చెన్ వీటికిం బౌరుఁగన్ ॥(క)వచ్చిన నరపతిఁ గనుఁగొని। చె
చ్చెరఁ బురజనులు ముదముఁ జెందిరి మేనం।జొచ్చిన ప్రాణముఁ గనుఁగొని।క్రచ్చ
ఱ నలరారు సర్వ, కరణముల క్రియన్॥ (వ) ఇట్లు పురంబుఁ బ్రవేశించి సకలప్రజా
ను రాగంబుగా రాజ్యంబుఁ బరిపాలింపుచుండె నని చెప్పి వెండియు విశ్వామి
త్రుండిట్లనియె రాజనందనా పరమశుభంబైన యీగంగావతరణోపాఖ్యానం బ
వ్యగ్రుండై యెవ్వండు వినిన నతండు సర్వపాపవిముక్తుండై సర్వకామంబులం
బొందియాయుఃకీర్తిలాభంబు వడయు దేవతాపితృగణంబు లతనికొఱకు సం
తోషింతురు మఱియు నిది ధన్యంబును యశస్యంబును స్వర్గ్యంబును నాయుష్యం
బునై యొప్పు ॥ (క)అని మునిపతి గంగాకథ। వినిపించినఁ జిత్తమలర, విని క్ర
మ్మఱ నమ్మునిపరిబృఢునిఁ గనుంగొని। యినకులవర్ధనుఁడు రాముఁ, డిట్లనిప
లికెన్॥ (మ) ఘనకీర్త్యన్వితనేఁడు మీవలన నీ, గంగాప్రభావంబుఁ బ।ర్విన మో
దంబున నానుపూర్వికముగా, వింటిం గృతార్థుండనై। తిని మీకీయఖిలప్రపంచ
కథ లెం, తేపాణి నీరంబుగా।యని యెగ్గింపుచు రాజపుత్రులు ప్రభూ, తాశ్చర్యులై
రత్తఱిన్॥ (వ) ఇట్లు పరమానందంబు నొంది॥ (మ) అనువందందగమందసుంద
రసమీ, రాందోళితైలాసుగం। ధనికుంజాంతమునందమందముదమం, దంగూ
ర్కెయా రాత్రి వేఁ। గినమత్తాఁడు ప్రభాతకాలమున దత్తీరంబులం గ్రుంకిగో।
బ్బునఁ బూర్వాహ్ణికకృత్యముల్ సలిపి సం, పూర్ణప్రభావంబునన్॥(చ) ము
నిపతిఁ గాంచి మ్రొక్కి రఘుపుంగవుఁ డంజలిఁ జేసి పల్కె నో।యనఘ భవన్ముఖేరి
తసమగ్రవియత్తటినీ ప్రభావమున్। వినుట కతంబునం గరము, వేడుక నీనిశ
స్వల్పకాలమై। చనియె జగత్ప్రశస్తగుణ, చాతురిధన్యుఁడ నైతి నీకృపన్ ॥(వ)
మునీంద్రా హిరణ్యగర్భసమానులరైన మీరాక యెఱింగి మహర్షులారో
హింపందగిన రమణీయపోతం బాసన్నంబై యున్నది దీనినారోహించి భాగీరథి
నుత్తరించియవ్వలం బోదమనిన నమ్మహర్షిశ్రేష్ఠుండట్ల కాక యని యాయక్కొ
నిమునిసమేతుండై రామలక్ష్మణసహితంబుగా నావయెక్కి యమ్మహానదినుత్తరిం

చిత దుత్తరతీరంబుఁ జేరి యచ్చటి మునిగణంబులం బూజించియచ్చటనొక్కిం
తసేపు విశ్రమించి కొండొకదూరంబరిగి ॥ (శా) భూకాంతామణిఫాలభూషణ
మనాఁ, బొల్పొందిన నానావిధా। స్తోకశ్రీకరమైకనుంగవకు నెంతో వేడ్కఁబుట్టిం
పుచుం। బ్రాకారవృతమైనయొక్కపురముం, భాన్వన్వయాంభోధిరా। రాకా
బ్జుండు రఘూత్తముండు గనియుల్లంబందునుల్లాసియై ॥ (చ) కరములుమోడ్చి
మరాళగతి, గాధికుమారునిఁ జూచి పల్కెనో। పరమమునీంద్ర మ్రోలనొక
పట్టణ మాసురలోకతుల్యమై। గురుతరపుణ్యసంపదలఁ, గుంగనిదై తనరారు
చున్నదె। వ్వారిపుర మెద్ది నామముద్ధు,వంబుగ నాకెఱింగింపు మింతయున్ ॥

***విశ్వామిత్రుండు శ్రీరామునికి సముద్రమథనవృత్తాంతం బెఱింగించుట***

(వ) అనియడిగిన గాధేయుండు కృపావిధేయుండై యప్పురీవృత్తాంతంబు శక్రక
థాపూర్వకంబుగా నిట్లని చెప్పం దొడంగె ॥ (చ) విడువక యాది కాలమున,
వేల్పులు దైత్యులు మైత్రితో సుధం। బడయుద మంచు మాధవుని, పంపున
వాసుకిఁ గ్రాడుఁ జేసియె। క్కడు తమిమందరాచలము, గొబ్బునఁ గవ్వము జే
సియుగ్రులై। కడువడి దోర్బలంబు లెసఁగ, గంగలశాంబుధిఁ ద్రచ్చిరుద్ధతిన్ ॥
ఇట్లపారబలసంపన్నులై రాక్షసులు ఫణంబులును దేవతలు పుచ్ఛంబును బ
ట్టి సవ్యాపసవ్యపరిగ్రహణవిశేషంబు లేర్పడఁ బెక్కు సంవత్సరంబులు దరు
వఁ దరిత్రాడైనవాసుకి శిరంబులు మహోన్నతంబులైన గండశైలంబులఁ గఱ
చుచు హాలహల విషంబునుం గ్రక్కిన నది కాలాగ్ని సదృశంబై దేవాసురమ
నుష్యసహితంబైన జగం బంతయుదహింపం దొణంగిన దానిసహింపంజాలక॥

**హాలాహలమును విష్ణ్వాదులచేఁ బ్రార్థితుఁడై శివుండుమ్రింగుట.**

(క) శరణార్థులై దివౌకసు। లరుదారఁగ రక్షరక్ష,యనుచునుమాధీ। శ్వరు
కడకుంజనిభక్తిం। గరములు ముకుళించి వినుతిఁ, గావించిరొగిన్ ॥ (ఉ) అత్త
ఱి శంఖచక్రధరుఁ, డైనరమాపతి సర్వదేవతా। సత్తముఁడీశ్వరుండటకుఁ, జ
య్యనవచ్చి యుమాధినాథునా। త్త్యుత్తముశూలధారి దివి,జోత్తముఁ గన్గొనిభూ
రిసమ్మదా। యత్తమనస్కుఁడై పలికె,నాస్యమునం జిఱునవ్వు దోఁపఁగన్ ॥ (చ)
వినుముసురేశ నీవఖిల, వేల్పులలోఁగడు పెద్దగావునన్। బనివడి నిర్జరాసురులు,
పట్టిమథించెడువార్ధి లోపలన్। మునుకొని బల్విడిన్ మొదలఁ,బుట్టిన యావిష
మగ్రపూజగా। మనమున నెంచికైకొని సమస్తజగంబుల నుద్ధరింపవే॥ (వ)



అని పలికి వాసుదేవుండంతర్ధానంబుఁ జేసిన ॥ (తే,గీ) సురల కోడవిన భ
యమును, జూచిశౌరి। వాక్యమాలించియలభగ, వంతుఁడైన। హరుఁడు హా
లాహల విషంబు, నమృతకబళ. । మట్లమ్రింగి యంతర్హితుం, డయ్యెనపుడు

**(*) మందరగిరిని విష్ణువు కూర్మరూపంబున వీపుమీఁద ధరించుట. (*)**

(వ) అంత దేవాసురులు వెండియు సముద్రంబు మథింపం దొడంగిన॥ (ఆ,వె)
మొనసిమందరాద్రి, వనరాశినిర్మగ్న। మై రసాతలంబుఁ, జేరినపుడు। దానిఁ
జూచిసురలు, దైత్యాంతకుండైన। విధునిశరణ మొంది,వినుతిఁ జేసి॥ (వ) దేవా
నీవుసమస్తభూతంబులకుఁబర మగతివందు విశేషించి మాకుశరణ్యుండవు గా
వున జలరాశిలోనమునింగిన మంథానశైలంబుఁ గ్రమ్మఱనుద్ధరించి మమ్మురక్షిం
పుమని ప్రార్థించిన॥ (తే,గీ) వారి మొఱవిని భార్గవీ,వల్లభుండు। కమఠరూపం
బుఁ గైకొని,కంధిలోన। మునిఁగిశైలంబుఁ బైకెత్తి, మూపుమీఁదఁ। బరఁగనిడికొ
ని జలధిపైఁ బవ్వళించె॥ (వ) ఇట్లు రమావల్లభుండు మందరశైలంబుఁ గమఠా
కారుండై తనవీపునందు ధరించి దానియగ్రంబు కరంబులం బట్టికొని దేవతా
మధ్యంబున నుండియపారబలంబునఁ బెక్కువర్షంబులు మథించిన నందు మొ
దల దండకమండలుహస్తుండై ధన్వంతరిపుట్టెఁ బదంపడి రూపయౌవన సంప
న్నలయిన యువతులు పెక్కండ్రుపొడమిరి నిర్మథనంబువలన నప్పులంబొడ
మినకారణంబున నయ్యంగనలచ్చరల నం బరఁగిరి వారలలోన నఱువదికోట్ల
యప్సరసలు ప్రధానభూతలైరి వారిపరిచారికాజనం బసంఖ్యంబై యుండు
వారినందఱఁ బరిచారికాయుక్తంబుగా దేవదానవులు ప్రతిగ్రహించిరి వెండియుం
దరువ నందువరుణకన్యయైనవారుణి యనుసురాధిదేవతపొడమి పరిగ్రహవిచా
రంబుఁ జేయుచున్న దానిరాక్షసులు గైకొనరోసి విడిచిన దేవతలు పరిగ్రహిం
చిరి నాఁటంగోలె సురాపరిగ్రహణంబున దేవతలు సురలైరి సురాపరిత్యాగంబు
న రాక్షసులసురులైరి మఱియుందరువ నుచ్చైశ్శ్రవంబను హయశ్రేష్ఠంబును
మణిరత్నంబగు కౌస్తుభంబును నుత్తమంబగు నమృతంబునుం బుట్టిన నయ్యశ్వం
బు నశక్రుండు గైకొనియెఁ గౌస్తుభంబు విష్ణువక్షంబున వెలింగె నయ్యమృ
తంబు సురులు చేకొనిన సహింపక॥ (మ) అనిమేషుల్కడునుగ్రులై చటులనా,నా
మోఘహేతిద్యుతు। ల్వినువీథింగడుచిత్రభంగి మెఱయ,న్వీరాంకులై వాసవా।
నికాయంబులఁదాఁకవారు నటువారిందాఁకఁ ద్రైలోక్యమో। హనసంగ్రా

మముసెల్లెనయ్యుభయసైన్యశ్రేణికినాఘ్నవా॥ (మ) అపుడానందకపాణి రమ్య

(*)విష్ణువు మోహినీవేషంబున నమృతంబు సురలకుఁ బంచిపెట్టుట.(*)

మగుమాయా మోహినీరూపముం గపటత్వంబునఁ దాల్చి దైత్యవరుల న్వంచిం
చి పీయూషము న్నిపుణత్వంబునఁ గ్రమ్మఱం గొనివెసన్, దేవాళికందీయ వా
రపురూపంబుగఁ గ్రోలఁ జూచి ఘనకోపాటోపులై రాక్షసుల్॥ (చ) అమరులఁ దాఁ
కి దారుణవరాయుధదీప్తులు నింగిముట్టఁగా। సమరమొనర్ప వేల్పులు ప్రసన్న
సుధారసపానజోగ్ర తే। జమున నసాధ్యులై హరిలసత్కృపఁ దోడ్పడి విక్రమిం
పఁగా। నమరవిరోధులందు నిమి, శాజినఖండపరాక్ర మంబునన్॥ (వ) ఇట్లు
నిలింపులు రణంబున నసురులనందఱ నిశ్శేషంబుగాఁ బరిమార్చిన నిలింపవల్ల
భుండు విజయలక్ష్మీవిరాజమానుండై దేవర్షిగంధర్వచారణసహితంబుగా న
మరావతికిం జని జగత్త్రయంబుఁ బరిపాలించుచుండెనంత॥ (మ) తనపుత్రులు స
మరంబులో సవతిసంతానంబుచేఁ జచ్చినా। రనివిన్నంతనె పుత్రమోహము
న శోకాక్రాంతయై ప్రవాలి దూ। లినధైర్యంబున నొక్కనాఁడు దితియుద్రేకంబు
నం బ్రాణనా। థునితో నిట్లనె శోకపావకశిఖా, దోధూయమానాంగియై॥ (శా)
(*)దితికిఁ గశ్యపుం డింద్రుని జయించుఁ బుత్రుని బడయ వరం బొసంగుట.(*)
దేవావేల్పులు మించి ఘోర రణవీథి న్మత్కుమారావళిం। బ్రావీణ్యంబున వి
ష్ణుదేవు కరుణ న్మర్దించిరింకేమినీ। సేవల్సేయుచుఁ బుత్రహీన నగుచున్, జీ
వింతు దోశ్శక్తిచే। దేవేంద్రుం బరిమార్చు పుత్రునిఁ గృపా, దృష్టిన్ బ్రసాదింప
వే॥ (తే,గీ) అనుడు ననుకంప గదుర గశ్యపుఁడు పలికె। నబల వ్రతనిష్ఠ శుచి
వై సహస్రవర్ష। ములు గడప నట్టి తనయుండు గలుగు ననుచు। వరమొ
సంగి యమ్మహాముని వరుఁడు ప్రీతి॥ (వ) తనహస్తంబున నమ్మహాదేవి యుద
రంబు సంస్పృశించి పుత్రోత్పత్తిరూపంబైన శుభంబు గలుగుఁగాక యని య
నుగ్రహించి తపంబునకుం జనియె నిట్లు కశ్యపుండు చనిన యనంతరంబ యద్దే
వి బలవంతుండును మహేష్వాసుండును స్థితిజ్ఞుండును సమదర్శనుండు నైన కొడు
కుం బడయుదునని కశ్యపోక్తప్రకారంబున వ్రతం బంగీకరించి కుశప్లవనంబునం
దు దారుణక్రమంబునఁ దపంబుఁ జేయుచుండె॥ (ఉ) అంత నెఱింగి దంభవిన,

(ఇంద్రుఁడు కపటంబునఁ బరిచరింపుచు దితిగర్భంబును ఖండించుట.)

యంబె సంగన్ దితి పాలికేగి జం। భాంతకుఁ డించుకై నఁదనవ్యాజము గన్న



డకుండ మాటియ। న్కాంత మనం బెఱింగి యతి, గౌరవ మొప్పఁగ భక్తియు
క్తుఁడై। సంతస మంకురింపఁ బరిచర్యలొనర్చుచునుండె నిష్ఠుఁడై॥ (వ)
ఇట్లు శ్రమాపనయనంబులగు గాత్రసంవాహనంబుల జలాగ్ని కుశకాష్ఠ ఫల
మూల ప్రదానంబుల నిత్యంబును దితికిఁ బరిచర్యఁ జేయుచుండె నంతఁ దొమ్మ
న్నూటతొంబది యబ్దంబులు చనిన యనంతరంబ (ఉ) అపు డొకనాఁడు మా
నిని రహస్యము దాఁచఁగ లేక భూమిభృ। ద్రిపుఁ డొనరించు సేవకు మదింగ
డు సంతసమొంది మోమునం। గృపదళుకొత్త నయ్యనిమి, షేంద్రునిఁ గన్గొని
పల్కె నక్కటా। కృపణమనస్కులం దెలియ, లేరు గదా యువతుల్ రఘూత్త
మా॥ (సీ) వాసవ వినుము భవత్సమానుని నొక్క కొడుకును బడయంగఁ,
గోరియేను। గశ్యపుఁ బ్రార్థింపఁ, గరుణతో వెయ్యేండ్లు వితతంబుగా దృఢవ్ర
తము సల్పి। తేని యొఁగల్గున, చానతియొసఁగెఁ గావున నింకఁ బది యేండ్లు కనఘ
మూర్తి। యనుఁగు దమ్ముండవు నీ కవతారమందెడుఁ గడఁగి మీరిరువురే, కత్వ
మొంది॥ (తే,గీ) మొనసి క్షీరోదకన్యాయ, మునఁ దనర్చి। మూఁడు లోకం
బులొక్కట, భూరిసత్వ। మహిమ రక్షింపుఁ డన్యోన్య, మైత్రి గలిగి। యనుచుని
ర్వ్యాజమునఁ బల్కి, నాలకించి॥ (క) తరుణి యుదరస్థుఁ డగువాఁ। డరయఁ
గఁదన కరియౌటంచు, నతని వధింప। న్వైర మెఱుఁగక తఱినరయుచు। స్థిరమతి
నింద్రుండు సేవఁ జేయుచునుండెన్॥ (వ) అంత నొక్కనాఁ డత్తలోదరి పు
లోమజాకాంతుం డొనరించు బహువిధోపచారంబులు తనహృదయంబునకు
ముదావహంబులై తనర శారీరసుఖంబులు మరిగి వ్రతదీక్షా సమయ భంగంబె
ఱుంగక కాలచోదితయై మధ్యాహ్నసమయమున మఱచి కాల్గడతలయంపిగా
సుఖసుప్తి వహించిన॥ (చ) ఇది సమయం బటంచు దివి, జేశ్వరుఁ డుల్లము ప
ల్లవింపఁగా। భిదురముఁ గేలఁ బూని ఝుళి,పించుచు ధీరత యోగశక్తిచే। ను
దరములోనఁ జొచ్చి రయ, మొప్పఁగ దిత్యుదరస్థబాలకున్। గదురుచు సప్తఖం
డములు, గాఁ నరికెం దన కోర్కి దీరఁగన్॥ (ఆ,వె) రాజ్యకాంక్షఁ జేసి, రాజు
లు సతినైన। బాలునైనఁ జంపఁ, బాలుపడుదు। రఘుభయంబు వారి, కనిశంబునది
దోషమనఁగ వినమె రఘుకులాబ్ధిచంద్ర॥ (వ) ఇట్లు బలారాతిచేత వ్రేటుపడి దితి
గర్భంబు ఘోషలుం గెత్తి బిట్టేడ్చిన నదరిపడి దితి మేల్కాంచెనప్పు డమ్మఘవుం
డు మారుద మారుదయనుచు లఘురీతిం బలికి వృథాగర్భంబేల వధించెద

వు, చాలు చాలుసుడుగు మని పలుకు దితివాక్యం బాకర్ణించి రయంబునం దద్గర్భంబు నిర్గమించి వచ్చి తనచేసిన యపకారంబునకుఁ గినుకఁబూని శపించునో యని శంకించి యొడలు వడంకఁ బ్రదక్షిణపూర్వకంబుగాఁ బ్రణామంబుఁ గావించి నిటలతట ఘటిత కరపుటుండై గుణవతీ మతల్లియగు తల్లి మ్రోలనిలచి యిట్లనియె ॥ (క) వ్రతనిష్ఠాభంగం బది । మతిఁదలఁపక సుప్తభంగి, మానకనిద్రిం । చితివాదోషంబున నీ। గతినాచే లూనమయ్యె, గర్భముతల్లీ ॥ (వ) అదియునుంగాక ॥ (క) తఱి యెఱిఁగి రిపువధించుట । నిరుపమధర్మంబు గాన, నీయుదరమునం । బెరిగెడు బాలుఁడు మదినా । కరియని ఖండించినాఁడ, నలుగకుమింకన్ ॥ (క) నావిని గర్భము వృథయై । పోవుటకు దురంత దుఃఖపూరితమతివై । దేవేంద్రునిఁ గని యపుడ । ద్దేవిమదిన్గినుకవిడిచి; ధీరతఁబలికెన్ ॥ (క) సురలోకనాథ నీయం । దరయఁగదోషంబుఁగాన, మరుదారఁగ మ । ద్దురితమున నయ్యెనింతయు । దురితహరునినిన్ను దూర, దోసమువచ్చున్ ॥ (వ) స్వయంకృతాపరాధంబున నైన కార్యంబునకు వగవం బనిలేదు నిరపరాధివైన నీకపరాధంబు సేయంబూనిన దైవంబు సమకూర నిచ్చునే యింక నీసప్త ఖండంబులు నీచేత మారుదయని పలుకంబడినవి గావున మారుత సంజ్ఞకంబులై యుండునదియునుం గాక యివహ ప్రవహ నివహోద్వహ వివహ పరవహ పరావహాఖ్యలం గల సప్తవాతాభిమానదేవతలం దొక్కటి మేఘమండలంబునందును నొక్కటి సూర్యమండలంబునందును నొక్కటి చంద్రమండలంబునందును నొక్కటి నక్షత్రమండలంబునందును నొక్కటి గ్రహమండలంబునందును దక్కినవి సప్తర్షి చక్ర స్వర్గ మర్త్యలోకంబు లందునుం బ్రవర్తిల్లుచుండు నట్టి సప్తగణ స్కంధంబులకు నాయకులం జేసి సప్తఖండంబులైన మత్పుత్రుల రక్షింపుమనిన నతండట్ల కావించి యద్దేవిచేత ననుజ్ఞాతుండై నాకంబునకుం జనియె నీదేశమందున నాఖండలుండు దితికి శుశ్రూషఁగావించె ననిపల్కి విశ్వామిత్రుండు.

(*) విశ్వామిత్రుఁడు రామునికి విశాలపురవృత్తాంతంబుఁ జెల్పుట. (*)

వెండియు రామచంద్రున కిట్లనియె ॥ (తే,గీ) పొసఁగ నిక్ష్వాకునకునలంబుసకుమున్న । పుట్టినట్టివిశాలుఁ డన్నృపమౌళి । పుడమి యేలీవిశాలయన్పురమొనర్చె । నిచటరాజేంద్ర తనపేర,నింపుమీఱ ॥ (తే,గీ) ఆవిశాలునిపుత్ర



కుం, డైన హేమ । చంద్రునకుఁ బుట్టె ఘనుఁడు సు, చంద్రుఁడతఁడు । సరగ ధూమ్రాశ్వునతఁడు సృం, జయునిఁ గాంచె । నతఁడు సహదేవు నతఁడు కుశాశ్వుఁగాంచె ॥ (తే,గీ) ఆకుశాశ్వుఁడు సోమద, త్తాఖ్యుఁ గనియె । నతఁడు కాకుత్థ్సుఁగాంచె న,య్యవనివిభుఁడు । సుమతియనువానిఁ గనియె నా,సుమతి యిప్పు । డీవిశాలపురం బేలు, నిర్ధయశుఁడు ॥ (వ) మఱియు నిక్ష్వాకుప్రసాదంబున వీరందఱు వైశాలికుల నం బ్రసిద్ధికెక్కి దీర్ఘాయువులును మహాత్ములును వీర్యవంతులును బరమధార్మికులును నై యుందు రీరాత్రి యిచ్చట వసియించి యెల్లిమిథిలకుం బోదమని పలుకుచున్న సమయంబున ॥ (చ) ఘనత

(*) సుమతి యనురాజు విశ్వామిత్రుని బూజించుట. (*)

రసుప్రభావుఁడగు, కౌశిక సంయమినాథు రాకయు । న్విని సుమతిక్షమాపతి న, వీనముదంబుధిపూరమగ్నుఁడై । తనదు పురోహితుల్హితులు, దాసులు జుట్టలు వెంటరారయం । బునఁ జని కాంచి యమ్మునికి, మ్రొక్కి సపర్యలొనర్చి యిట్లనున్ ॥ (మ) అనిశంబున్హృదయ ప్రపంచము సము,ద్యద్భూరి తేజంబుచే । ననువైమించెను లోచనాంబురుహముల్, వ్యాకోచతంజెందెఁ జ । య్యన దట్టంపుఁ దమశ్చటల్విరిసెవ, స్వావాప్తి చేకూరెనేఁ । డనువయ్యెంగద యిన్నిమాకిచట విశ్వామిత్ర మీరాకచేన్ ॥ (క) మాన్యుఁడవగు నీకృపచే । ధన్యుండను పేరుగల వ,దాన్యుం డనురా । జన్యులలో మాన్యుఁడ సౌ । జన్యుండను నైతినేఁడు, సంయమివర్యా ॥ (వ) అని బహుప్రకారంబుల సన్నుతించి యొండొరులు కుశలప్రసంగంబులు గడపిన యనంతరంబ విశ్వామిత్రుని యిరుగెలంకుల నలంకృతులై సూర్యసోముల చందంబున నింద్రోపేంద్రుల కైవడి యశ్వినీదేవతల పొందున మనోహరాకారంబులం దేజరిల్లుచున్న రామలక్ష్మణులం జూచి కౌశికునకిట్లనియె ॥ (సీ) గజసింహగమనులు, ఖడ్గతూణీధనుర్ధరులు శార్దూలవిక్రములు రాజ । సింహులు గుణరూప, చేష్టితంబులఁ బరస్పరసమానులుచారు, చంద్రముఖులు । రమణీయమూర్తులు, కమలపత్రవిశాలనయనులు సురభువ,నంబువిడిచి । ధరణికివచ్చిన, సురలకైవడిఁ గ్రాలువారు దస్రులభంగి,వఱలువారు ॥ (తే,గీ) రాజభానులగతిదివ్య, తేజమునహారిన్నికాయము వెలిఁగింపుచున్న వారు । ధీవరేణ్యవీరెవ్వరు, తేవనమున । నేలచను దెంచి రిచటికి, నింతఁ జెప్పుమ ॥ (క) మునినాథ నీతపంబును । ఘనకీర్తియుఁ దనువులి

ట్లు, గైకొని వెంటఁ । జనుదెంచె నొక్కొ హరిహరు । లననొప్పెడు వీరిచంద,మా
నతియీవే ॥ (క) అనవిని మునిపతిసుమతిం । గనుఁగొని యిట్లనియె వీరు,కా
కుత్థ్సవపు । ఘనమతులు రామలక్ష్మణు । లనువారలు దశరథాధి,పాత్మజు లన
ఘా ॥ (సీ) రాజేంద్ర నాచేతఁ, బ్రార్థితులై వేడ్క జంటగా నావెను, వెంట
వచ్చి । తాటక యను ఘోర, దానవి ఖండించి పరగ మారీచసు, బాహులనె
డు । దైత్యుల సంగ్రామ, తలమున భంజించి కరుణతో నాదు యా,గంబుఁ గా
చి । జనకు జన్నముఁ జూడఁ, జనుచున్న వారలు ఘనులు పాపౌఘులం, ఘనులు
శౌర్య ॥ (ఆ,వె) ధనులుపుణ్యఘనులు, ననవినిసుమతి య । చ్చెరువు గదురఁ
బూజఁ, జేసి తనదు । యింటనాఁటిరాత్రి, యెలమితో నిడుకొని । వేఁగుటయు
సుభక్తి,వినయమెసఁగ ॥ (తే,గీ) అతిథిసత్కారము లొనర్చి,యనుపనతని।
వీడ్కొని రఘూత్తములు ముని,వితతి వెంట । రావిదేహక్ష్మాపతి,రాజధాని।క
రుగు తెరువునఁ గౌశికుఁ,డరిగెనపుడు ॥ (వ) ఇట్లు చని దవ్వుల నతిరమణీయ
కాంచనప్రాకార శోభితంబైన దాని నంబరచుంబి శిఖారేఖామయూఖ పుంజ
రంజిత శర్మద భర్మహర్మ్యంబైన దాని కుసుమ కిసలయ ఫలభరిత విటపి
వాటికావిహరమాణ మత్తమధుకర కీరశారికా కలకంఠమధుర శబ్దాఢ్యమా
న మంజులోద్యాన పరివృతంబైన దాని మిథిలాపురంబుఁ గనుంగొని తదీయ
సుషమా విశేషంబున కిచ్చమెచ్చుచుఁ దదుపవనంబునందుఁ బురాణంబై ర
మ్యంబై నిర్జనంబైయున్న యొక్క మహనీయాశ్రమంబు విలోకించి ॥ (మ)
జలజాతాకర తీరరంజదవనీ, జాతావళీనీతశీ । తలమార్గంబటు పట్టిపోవునె
డ నం,దంబొప్పఁగా భానువం । శలలాముండగు రామచంద్రుఁడు ముని,స్వా

(*)విశ్వామిత్రుఁడు రామునికి నహల్యావృత్తాంతంబుఁ దెల్పుట.(*)

మిన్విలోకించి సొం । పలరంబల్కె గిరీశమౌళి గళదు,ద్యద్వ్యోమ గంగాభర
ట్టీ ॥ (మ) అనఘాత్మా రమణీయమై సురుచిరం, బై శ్లాఘ్యమై యొప్పు నీ ।వ
నమిట్లేలకొ నిర్జనంబయియసే,వ్యం బయ్యెమున్నీడనే । మునియుండెం గృప
నింత నాకుఁ దెలియ, న్మోదంబుతోఁ దెల్పవే । యని ప్రార్థించినఁ జెప్పఁ
గాఁ దొడఁగె వి, శ్వామిత్రుఁ డుద్యన్మతిన్ ॥ (తే,గీ) అనఘ మున్నీ వనం
బు మ, హాత్ముఁడైన । గౌతముని యాశ్రమం బన, ఘనత కెక్కు । నిది స
కల దేవపూజితం, బిది సురేంద్ర । నందనోపమమై యొప్పు, నయచరిత్ర ॥



(చ) లలనలలోఁ ద్రిలోకనుత, లక్షణయైన యహల్యతోడుతం । గలసి
సుఖాత్ముఁడై యిచట, గౌతముఁ డుంచప మాచరింపఁగా । నలరి బలాంతకుం
డల యహల్య వయోవిభవాతి రేకముం । దొలఁగక చూచి యవ్వెలఁది,
తో సుఖియింపఁగఁ గోర్కి పుట్టినన్ ॥ (వ) ఒక్కనాఁ డమ్ముని వల్లభుండు
స్నానార్థియైయరిగిన నప్పు డెడఁగని పురందరుండు మునివేషధరుండై య
హల్యకడ కరుగు దెంచి యిట్లనియె ॥ (తే,గీ) అంబుజేక్షణ కాముకో,గార్తు
లైన । పురుషు లెప్పుడు ఋతుకాల, మరయుచుండు । రట్లు గావున నీతోడఁ
నతనుసౌఖ్య । మనుభవింపంగఁ గోరితి, నబ్జవదన ॥ (తే,గీ) అనిన నమ్మాయత
పసివాక్యముల పటిమ । మొగముఁజాయయుఁ గాంచినా,మగని కింత । సర
సమేడదిశ క్రుఁడి, కక్కరణి నాదు । వలని మోహంబుచే నిట, వచ్చెననుచు ॥
(వ) తలంచి యతనిం గూడి కందర్పక్రీడానందరసంబనుభవించి వెండియున
హల్యశక్రునిం జూచియేను నీవలనఁ గృతార్థనైతి నింక నిచటనుసలవలవదు
నన్నును నిన్నును రక్షించుకొనుచు శీఘ్రంబునంజనుమనిన నయ్యింద్రుండునీవల
నఁ బరితుష్టుండనైతి నింక రయంబునంజని యెద నని యద్దేవిచేననుజ్ఞాతుండై
యప్పర్ణశాలనిర్గమించి గౌతమాగమనంబు శంకింపుచు ససంభ్రముండై
రయంబునం బోవుచు ॥ (చ) అనిమిషలోక నాథుఁడుని, జాశ్రమవాటికి నేగు
దెంచున । మ్మునిపతిదీప్త పావకని, భుం బరమేష్ఠిసముం డపోధను । న్మనుశిఖ
వేల్పు నెచ్చెలిస, మిత్కుశహస్తుఁగృతాభిషేకునిం । గనుగొని సాంద్రభీతి పరి,

(*)గౌతముఁడు దేవేంద్రుని శపించుట.(*)

కంపితుఁడై చనుదెంచుచుండగన్ ॥ (చ) తనుఁగనిభీతుఁడై మొగము,దద్దయు
వెల్వెలఁబాఱఁగ్రమ్మఱం । జనియెడు వజ్రిఁగన్గొనిని,శాసమయంబుననిట్టులేలో
కో । యనిమిష నేతవచ్చె నని, యంతయు గ్రక్కున యోగదృష్టిచేఁ । గనుఁగొ
ని రోషశోణితవి, కంపితలోచనుఁడై రయంబునన్ ॥ (వ) పరుష వాక్యంబున ని
ట్లనియె ॥ (ఉ.) ఓరి దురాత్మ యోరి శఠ, యోరి మదాంధుఁడ శక్ర మానికాం।
తారతి దూషితం బని మ,నంబున నించుకఁగొంక కిట్లుమ । న్నారిని వంచనం గ
పట,తాపసివై రమియించితీవిదే । కారణమై యముష్కుఁడవు, గమ్మని శాపమొ
సంగె నుద్ధతిన్ ॥ (వ) ఇట్లు నిష్ఠురంబుగా శపియించి నంతక్షణంబు వజ్రప్రహారం
బునఁ దునిసిపడిన చందంబున నింద్రుని వృషణంబులు దెగి ధరణిం బడియె నంత

నమ్మునివరుండు ॥ (తే,గీ) పర్ణశాలకుఁబోయి వి. శీర్ణకేశ । పాశయై దస్సిను రతవిభ్రమముఁ దెలుపు । చున్న యన్నారిఁగనుఁగొని, క్రన్నుఁగవకుఁ। గోపుసాం

## (*)గౌతముముఁడహల్యను శపించుట.(*)

పార నిట్లని, కెరలి పలికె ।(తే,గీ)నీవు నిజవంశ ధర్మంబు, నీఱుఁజేసి । పుష్ప విశిఖార్తవై పరపురుషరక్తి ।బయిసి మాలినీవిటువంటి, పను లొనర్చి ।మా కుఁ దలవంపుఁ జేసితి, మగువనేఁడు ॥ (ఉ) ఈయటవీప్రదేశమున, నెవ్వరుఁజూ డక యుండ నిత్యముర్వి । వాయువు నారగింపుచుఁ బ్రభూతజభూరిరజఃపరీతవై। పాయక పెక్కువర్షములు,పాపవశంబున నుండుమంచువా । జ్ఞానయకతుల్య వర్సనుఁడు,గౌతముఁ డాలి శపించె నుద్ధతిన్ ॥ (వ) ఇట్లు శప్తయై యహల్య భ యంబున వడంకుచుగౌతముని యంఘ్రిలంబడిలేచి మహాత్మా కృతాపరాధనైన నన్నుశపించుట న్యాయందుం గలదయాతిశయంబున నిష్కళంకఁగాఁ జేయుటకే. కదాయీనిష్ఠురశాపంబునకుఁమదియెయ్యది తన్మోక్షణప్రకారం బాన తిమ్మనిప్రార్థించినఁ బ్రియురాలికడంకకుమెచ్చియతీతానాగతవర్తమానవిశారదుండగు గౌతముండిట్లనియె॥ (తే,గీ)అతివదశరథనందనుం,డైనరాముఁ । డె ప్పుడీఘోరవనమున, కేగుదెంచి। యంఘ్రివిన్యాసమొనరించు,నపుడు తత్ప । దాబ్జరేణువుచేఁబూత,వయ్యెదీవు॥ (తే,గీ) అమ్మహాత్మున కాతిథ్య,మాచరించి । యపగతాఘవై లోభమోహములువిడిచి । మత్సకాశంబునందు సమంచితముగ । ధన్యవైపూర్వరూపంబుఁ,దాల్చెదీవు॥ (వ) అనియిట్లు గౌతముండహల్యకు శాపంబిచ్చి పదంపడి తన్మోక్షణప్రకారంబెఱింగించి యచ్చోటుఁ బాసి సిద్ధచారణ సేవితంబయిన హిమవంతంబునకు జనియందుఁదపంబుఁజేయుచుండె॥ (చ) అటబలవైరిశప్తుడయి,యాఱనినెవ్వగవేల్పు వీటికిం । దటుకున నేగి శోకపరితాపమునం గడుడస్సిలజ్జన ।క్కటపరకాంతనిట్లు కను, గానకబొందఁగ నే లదానిచే । నిటుసమకూర,నేల విధి, యెంతటి పాటొనరించె నియ్యెడన్ ॥(వ) అని విచారగ్రస్తమానసుండై దేవతలనందఱ రావించి గౌతముండు సర్వదేవతాపదచ్యవన కారణంబైన తపంబుఁ గావింపుచుండ నేనాతపంబువిఘ్నంబుసేయుటకు సమకట్టిక్రోధంబుఁబుట్టించినం గానితపోభంగంబు గాదని నిశ్చయించి క్రోధోత్పాదనంబుకొఱకమ్మహామునిపత్నియగు యహల్యతోడంగ్రీడించినన మ్మునిపుంగవుండలిగి మదీయవృషణంబులు దునిసిపడ నన్ను శపించి పదంపడి



తనపత్నికి శాపంబొసంగె నేనాకారణంబున విఫలుండనైతి ॥ (ఆ,వె) వేల్పు

## దేవేంద్రుఁడు మేషవృషణుఁడగుట.

లారయిట్లు విఫలుండనై యేను । భువన జాలమెట్లు ప్రోచువాఁడ । హితముఁ గోరిమీర లిందఱాలోచించి । దేవకార్యమిపుడు తీర్పవలయు ॥ (వ) అని పురందరుండు పలికిన బృందారకు లందఱు పితృదేవతల కడకుంజని శక్రున కుంబాటిల్లిన వైఫల్యంబెఱింగించి యిప్పుడు యజ్ఞంబు నందు మీకొఱకు నిర్జ్యమానంబైన యీ మేషవృషణంబు లింద్రున కొసంగుఁడిమ్మేషంబు వృషణరహితంబయినను మీకుఁ బరమతుష్టి నొసంగుంగాక యనియు నేమానవులు భవత్ప్రియంబు కొఱకు నముష్కంబైన మేషంబు నొసంగుదు రట్టి దాతలకు ఫలలోపంబు గాకుండ సంపూర్ణ ఫలం బొసంగుంగాక యనియు నను గ్రహింతుమని పలికిన నగ్నిపురోగములైన దేవతల వచనంబువిని పితృదేవతలు యూపనిబద్ధంబైన మేషవృషణంబు లుత్పాటించి తెచ్చి సహస్రాక్షున కు సంఘటించిరి నాఁటంగోలెఁ బితృదేవతలు తత్సజాతీయంబు లగుటం జేసి యవృషణంబులైన మేషంబులభుజింపుచు దాతలకు సవృషణమేషదానఫలంబు నొసంగు చుందురు ॥ (తే,గీ) అనఘచారిత్ర వినుమునాఁ డాదిగాఁగ। సరసిజాసన తుల్యుండు సకలమౌని । వర్యుఁడగు గౌతమునిప్రభావంబువలన । వృత్రదైత్యాంతకుఁడు మేష వృషణుఁడయ్యె ॥ (చ) అనిశము తావకాగమన మాత్మఁ దలంపుచు నాఁటఁ గోలెనీ । ఘనవని ఘోర శాపమున గౌతమపత్ని యహల్య యేరికిం । గనుపడకుండ నున్నయది గ్రక్కన నాశ్రమభూమిసొచ్చి నీ। వనుపమ సత్కృపాగరిమ నమ్ముని గేహిని నుద్ధరింపుమా॥ (క) అనియిటు కౌశికుఁ డాడిన । ఘనుఁడా రాముండు కౌశిక పురస్కృతుఁడై । యనుజన్మయుతంబుగన । వ్వనముఁ బ్రవేశించె దీప్త వర తేజుండై॥ (వ) ఇట్లు గౌతమాశ్రమంబుఁ బ్రవేశించి యందు వాయు భక్షణాది తపం

## రామపాదస్పర్శంబున నహల్య శాపవిముక్తయగుట.

బుచేతఁ బ్రద్యోతిత ప్రభ యగుటంజేసి సురాసుర మనుష్యులకు దుర్నిరీక్ష్య యగుదాని విరించిచేత నతిప్రయత్నంబున నిర్మింపఁబడిన యతి మానుష రూపయగు మాయపగిది నలరుదాని వృక్ష లతా పుష్ప పటల పరిచ్ఛన్న యగుటంజేసి తుషారాభ్రపటల పరిచ్ఛన్నయైన పూర్ణచంద్ర ప్రభ సొబగు

ననొవ్వఁదాని నక్రూరత్వ దుర్నిరీక్ష్యత్వాదులచేత నుదకమధ్యంబునం బ్రతిబింబించిన ప్రదీప్తభాస్కర ప్రభచందంబున నందంబగుదాని నహల్యనవలోకించె నప్పుడద్దేవి గౌతమ శాపంబున రామసమాగమ పర్యంతంబు త్రైలోక్యంబున కదృశ్యయైయుండి యప్పుడు శాపాంతంబునొంది యెప్పటిశరీరంబుతోడఁ జూపట్టె నిట్లు సందృష్టయైన యహల్యచరణంబులకు లక్ష్మణసహితంబుగా రాముండు నమస్కారంబుఁ గావించె నప్పుడద్దేవి గౌతమవాక్యంబుఁ దలంచి వారినిరువురనాదరించి యర్ఘ్యపాద్యాదికంబులర్పించి యాతిథ్యంబొసంగినఁ బ్రతిగ్రహించిరంత॥ (క) మొఱసెఁ సురదుందుభులటు । గురిసెఁ మందారవృష్టి కోమల ఘణితిఁ । వరగంధర్వులుపాడిరి । యరుదారఁగ మేనకాదు లాడిరివరుసఁ॥ (తే,గీ) అప్పుడచటికి సురసిద్ధులమరమునులు । గరుడ గంధర్వ కిన్నరు లరుగుదెంచి । రాఘవుననేకభంగులఁ బ్రస్తుతించి । యల యహల్యను బూజించి రతిముదమున॥ (తే,గీ) అంతలోగౌతముండట కరుగుదెంచి । పొలుపుమీఱంగ రామునిఁబూజచేసి । ఘనతపోబల పరిశుద్ధ గాత్రియైన । వెలఁదితోఁ గూడితపముఁగావింపుచుండె ॥(వ) అంతనారాముండు లక్ష్మణసహాయుండై విశ్వామిత్రునింగూడి యప్పుణ్యాశ్రమంబుఁ బాసి యీశాన్యదిగ్భాగంబుఁ బట్టి యొక్కింత

(*) విశ్వామిత్రుఁడు రామలక్ష్మణసహితుఁడై జనకునియజ్ఞవాటంబుఁ జేరుట. (*)

దూరంబరిగి పావనంబైన జనకుని యజ్ఞవాటంబుఁ జేరి ముని శార్దూలుండైన విశ్వామిత్రునవలోకించి యిట్లనియె॥ (చ) అనఘ మహాత్ముఁడైనజన కాధిపు యజ్ఞసమృద్ధిసాధ్వియై । తనరెడుపుణ్యమూర్తులతి ధన్యులు వేదషడంగపారగుల్ । దినకర తేజులుఁ సకల దేశనివాసులుసత్తపఃపరా । యణులగు బ్రాహ్మణుల్ బహుసహస్రములిచ్చట నున్నవారొగిఁ ॥ (క) శకటీశత సంకులమై । ప్రకటితమునినిలయరాజ రాజిల్లెడునిం। దొక చోటమనకువాసం । బకలుషధిషణావిధింపు మనుపమభంగిఁ॥ (క) అనవినివిశ్వామిత్రుఁడు। ఘనతరసలిలావృతంబు కమనీయతరం । బనుపమమువివిక్తంబగు । ఘనదేశమునందువసతిఁగావించెరహిఁ॥ (సీ) జనకుండుగాధిపుత్రునిరాక వినిశీఘ్రి మునశతానందునిమున్నిడుకొని । ఋత్విజు ల్గొందఱు ప్రీతితో నర్ఘ్యంబుఁ బాద్యంబుఁ గొనివెంట వచ్చుచుండ । వినయము తోనెదు రొక్కనిసమం త్రకముగా నర్ఘ్యంబు విమలపాద్యంబొసంగ । జనకుం డొసంగుపూ జనమంత యుగ్ర



హించి పావనిరామయముఁ ద,చ్ఛివమునరసి ॥ (తే,గీ) కూర్మిఁ మెఱయశతానందు,కుశలమడిగి । ప్రీతిఁ బూజించినట్టి,ఋత్విజులసేమ । మదివిచారించి పిదప వా,రడుగఁదనదు । కుశలమంతయు నెఱిఁగించె,గుశికసుతుఁడు ॥ వ। ఇట్లు పరస్పర నివేదితకుశలవృత్తాంతులయిన యనంతరంబ జనకమహీనాథుండు గాధేయు నవలోకించి మహాత్మా యీ యాసనంబులయందు మునిసమేతంబుగా నాసీనుండవుగమ్మని ప్రార్థించిన నమ్మునిపుంగవుండు జనకోక్త ప్రకారంబున నుచితాసనంబున నాసీనుండయ్యెఁ దక్కిన మునులు యథార్హపీఠంబుల యందాసీనులైరంత జనకుండు విశ్వామిత్రునియనుమతంబున సకలమంత్రిబాంధవ సహితంబుగా నర్హపీఠంబుననాసీనుండై యమ్మహాత్మునకిట్లనియె ॥ (సీ) నేఁడుగా నాకనిం,దిత యజ్ఞఫలవృద్ధి సఫలంబు మీరాక,సంయమీంద్ర। నేఁడు గానాకుమానిత జన్మసంసిద్ధిగలిగె మీకరుణచే,గాధితనయ । నేఁడుగా నేనుభూనేతలలోఁ జాలమాన్యుండనైతినో,మానివర్య । నేఁడుగానాకు ని,న్నియు సమకూరెనీయాలోకనమునఁ బద్మాప్త తేజ ॥ (తే,గీ) బ్రహ్మతుల్యుండవైననీపాదరజముసోఁకనాయజ్ఞసదనమస్తోకభంగిఁ । గడుపవిత్రమైతనరారెఁ గల్మషంబు । లడఁగెమిక్కిలిధన్యుండ, నైతినేఁడు ॥ (తే,గీ) వినుముయజ్ఞంబుపండ్రెండు, దినములింకఁ । గొదవయున్నదటంచుఁ గో,విదులువలికి । రంత భాగార్థులై వే,ల్పు,లరుగుదేరఁ । గలరువారలఁజూచిపోవలయుమీరు ॥ (వ) అనిపలికితత్పరిసరంబున ॥ (సీ) గజసింహగమనుల,ఖడ్గతూణీధనుర్ధరులశార్దూలవి,క్రముల రాజ । సింహులగుణరూప,చేష్టితంబులఁ బరస్పరసమానులఁజారు, చంద్రముఖుల । రమణీయమూర్తులఁ,గమలపత్రవిశాలనయనులసురభవ,నంబువిడిచి। ధరణికివచ్చిన,సురలకైవడిఁ గ్రాలువారిదస్రులభంగి, వఱలువారి ॥(తే,గీ) రాజభానులక్రియదివ్య, తేజమునహా। రిన్ని కాయము వెలిఁగింపుచున్న వారిఁ । గప్రతరకాకపక్షముల్,గలుగువారి। మహితకీర్తులరామల,క్ష్మణులఁజూచి ॥ (ఉ) వారిమనోజ్ఞవేషములు, వారివచోరచనా చమత్కృతుల్ । వారివిలాసవైఖరులు వారిపరస్పరబద్ధభావముల్ । వారలఁజూచిమెచ్చుచు,నవారితసమ్మదమంకురింప నా।భూరమణీపురందరుఁడు,పొల్పుగఁగౌశికుతోడనిట్లనుఁ॥ (ఉ) ఈశరచాప

(*) విశ్వామిత్రుఁడు జనకునికి రామలక్ష్మణుల వృత్తాంతంబుఁ దెల్పుట . (*)

ఖడ్గధరు,లీసుకుమారులుసంయమీశ్వరా। యీశుభమూర్తుల్ చతురు,లెవ్వరి

వారిటకేలవచ్చినా । రీశఘరధ్వజప్రతిము, లింతయు నాకెఱిఁగింపు మన్నన ।
క్కౌశికుఁడిట్లుపల్కె-జన,కక్షితినాథునితోముదంబునన్ ॥ (సీ) అనఘాత్మదశరథ
జననాథతనయులు రామలక్ష్మణులను, నామధేయు । లమితవిక్రములు ధర్మా
త్ములుదారులుశూరులు ధీరులు వీరుబాహులు । శక్తిఁ జేమద్యాగ, సంరక్షణముఁ
జేసిపరఁగనహల్య శా,పంబుమాన్చి । నిరుపమలీలతో,నీయింటఁబోలుపొందు
పంచాస్త్రవైరిచా,పంబుఁజూడ ॥ (తే,గీ) నరుగుదెంచినవారన,నపుడుగౌత ।
మాత్మజుండుశతానందుఁ, డధికహర్ష । మలరరోమాంచకంచుకి,తాంగుడఁ
గుచుఁ।గనులనానానందబాష్పముల్,గ్రమ్మదేర ॥ (తే,గీ) విమలపీఠంబులను
ఖోప,విష్టులయిన । దాశరథుల ముఖారవిం,దములఁగనుల । కఱవుదీఱంగఁగ
నుఁగొని,కౌశికునకు । నింపుసొంపార మధురోక్తి,నిట్టులనియె ॥ (సీ) ముని

—(*) శతానందుఁడు విశ్వామిత్రునిం రామునిఁ బ్రశంసించుట. (*)

నాథమాతల్లి, మునుకొనిమీచేఁ బ్రదర్శింపఁ బడియెనె,దాశరథికి । నతిభక్తిన
ర్ఘ్యపా,ద్యములచేనద్దేవిపూజించెనే మహా,పురుషమణిని। దేవేంద్రకృత్యమా
దిగఁబూర్వవృత్తంబు నెఱిఁగించితివెసర్వ,మినకులునకు । మనువంశ్యుఁగన్న పి
మ్మటనహల్యాదేవి రహిఁగూడుకొని యేనె,ప్రాణవిభుని ॥ (తే,గీ) ఘనునిరా
మునిఁజూచెనే, గౌతముండు । పూజలొనరించెనేభక్తి,పూర్వకముగఁ । బత్ని
తోఁగూడిచేసెనే,పటుతపంబు । ధన్యయయ్యెనె మాతల్లి,తాపసేంద్ర ॥ (క)
నావిని కౌశికుఁ డిట్లనుఁ । గావింపఁగఁ బడియె నిన్ని గౌతముఁ గూడెన్ ।
వావిరినహల్య రేణుక। కోవిదజమదగ్నితోడఁ,గూడినమాడ్కిన్ ॥ (వ) అనిపలి
కిననిజప్రభావతిరస్కృత శతానందుండగు శతానందుండు పరమానందరసపూ
రితహృదయారవిందుండై కౌసల్యానందనుని వదనారవిందంబుపలక్షించిమంద
మధురవాక్యంబుననిట్లనియె ॥ (సీ) దశరథసుతనీవు,దైవయోగంబునవచ్చితివి
టకు నేఁడచ్చుపడఁగ । ననఘమజ్జనని య,హల్యపాపము నేఁడు కడిగెయుష్మ
త్పాద,కమలజలము । గౌతమశాప దు,ర్గముహనిస్తరించి వెండియుభర్తతోఁ
గూడె,నేఁటికధిప । రాఘవనీపాదరాజీవమహిమంబు నెఱిఁగినుతింపంగనెవ్వఁ
డోపుఁ॥ (తే,గీ) గనకగర్భసమానుఁడీ,కౌశికుండు । రక్షకుండఁట నీకుఁగొ
ఱంతయేమి । విమల చారిత్ర నీకంటె వేఱొకండు । ఘనుఁడు ధన్యుండు లేఁ
డు, జగత్త్రయమున ॥ (వ) మహాత్ముండైన యీవిశ్వామిత్రుండు జగత్ప



విత్రచరిత్రుండ వైననిన్నుఁ దోడ్కొని వచ్చి మమ్మందఱఁ గృతార్థులం జే
సె నిట్టిమహోపకారి జగత్త్రయంబు నం దెవ్వండైనఁ గలఁడేయని పలికి యం
తకంతకుఁ బ్రసంగవశంబున విశ్వామిత్రుని ప్రభావంబు లన్నియు విస్పష్టంబు

—(*) శతానందుఁడు రామునికి విశ్వామిత్రవృత్తాంతంబు దెల్పుట. (*)—

గా నెఱింగించువాఁడై శతానందుండు రామచంద్రునకిట్లనియె ॥ (క) అతులప్ర
భుఁడపరాజితుఁ । డతర్క్యకర్ముండ మర్షియగు కౌశికుది । వ్యతరప్రభా
వములఁ బ్ర । స్తుతిసేయఁగ నాకువశమె, సుగుణోదారా ॥ (క) దశరథకుమా
రబ్రహ్మకు । గుశుఁడన నొకరాజుపుట్టెఁ గుశునకుసుతుఁడా । కుశనాభుఁడతనిక
సదృశ।యశుఁడౌగాధీశుఁడతని కాత్మజుఁడితఁడే॥ (చ) ఇతఁడతిధర్మనిష్ఠనిల
నేలెననేకసహస్రవర్షముల్ । చతురతనెల్లలోకములు, సంతతముందను స
న్నుతింపఁగా । నతులితవైభవంబెసఁగ నందొకనాఁడుచమూసమేతుఁడై । క్షి
తిఁగలశైలదుర్గవన,సిద్ధతపోవనముల్ చరింపుచున్ ॥ (వ) చనిచని యొక్కచో
ట ॥ (సీ) కలితనానావిహంగమసంఘములుల సత్స్మృతిపురాణార్థసంతతులు దె
లుప । నెలమావిమ్రానికొమ్మలశుకసంతతుల్ జతగూడిశ్రుతులలో,జటలుచదు
వ । సరసకాసారరంజద్రాజహంసలు, చటులవేదాంతముల్ చర్చసేయఁ ।
బరపుష్టములుమనోహర మాధురీనిస్వనముల శాస్త్రప్రసంగము లుసలుప ॥
(తే,గీ) జాతివైరంబులుడిగి, మార్జాలమూష । కోరగశిఖండిగణము ల,న్యో
న్యమైత్రి । నెఱపనిరుపమతరులతో, తక్కరముగలిగి । రాజిలువసిష్ఠముని వరా
శ్రమముఁగనియె॥ (వ) మఱియుబాహ్యేంద్రియ వ్యాపారంబులు వర్జించిరాగ
ద్వేషంబులుడిగి ఫలమూలంబులుపయోగించి జపహోమార్చనపరాయణులై
పెద్దకాలంబుఘోరతపంబుఁజేసి సిద్ధింబడసివహ్నియుంబోలె వెలుంగుచు సా
క్షాత్పితామహునకు సాటిసేయందగిన దేవర్షిబ్రహ్మర్షిమహర్షివాలఖిల్యవైఖాన
సులుంగలిగి దేవదానవగరుడగంధర్వకిన్నర కింపురుషసిద్ధచారణులకాశ్రయం
బై ప్రశాంతసింహవ్యాఘ్ర వరాహభల్లూక ప్రముఖనిఖిల మృగంబులకాటప
ట్టై రెండవబ్రహ్మలోకంబుకరణి నందంబగుచున్న వసిష్ఠుని దివ్యాశ్రమంబుఁజూ
చి యచ్చెరువందుచుఁదన్మధ్యదేశంబు నంజని యొక్కచోట॥(సీ) ఒకనాఁడుజ

—(*) విశ్వామిత్రుఁడు వసిష్ఠాశ్రమముఁ జేరుట. (*)—

లపాన,మొనరించివేయేండ్లు తపముఁ గావించిన ధన్యమతులు। నొకనాఁడుగా

ద్వుగ్రోలికలంత కాలంబు నిష్ఠసల్పిన మహనీయమూర్తుల । లోకనాఁడుజీ
ర్ణపర్ణాశనయోగమొనర్చి పెక్కేండ్లు తపముసల్పినమహాత్ము ।లాహారవ
ర్జితులై కల్పకాలంబునచల యోగమొనర్చి నట్టిఘనులు॥(తే,గీ) సమరసా
ధ్యాత్మవిద్యాప్రసంగవశత । బలిసితనుఁగొల్వవారికిఁ బ్రకటితార్థ । బోధసే
యుచుదీప్తాగ్నిఁ బోలెఁ దేజ । రిల్లుచున్న వసిష్ఠునత్యుల్ల యశుని ॥(ఉ) కాంచిత
దంఘ్రిమూలములు, గ్రక్కునఫాలము సోఁకమ్రొక్కి దీ ।వించిమునీశ్వరుండుచి
తవిష్టరమందు వసింపఁబంచిఫ్రా । జించిఫలంబు లిచ్చిన విశేషమతిందగసంగ్ర
హించియ । భ్యంచితభక్తిఁ గేల్మొగిచియానృపుఁడమ్ముని నేతకిట్లనున్॥(మ)అన
ఘా సేమమెమీకు మీఘనతపం,బవ్యాహతంబేతపో । ధనులై శిష్యులుగొల్తురే ద
నుజబాధల్ లేవుగా సంతతం। బనలోపాసనచెల్లునే ద్రుహిణ,పుత్రాగ్రేసరా యు
న్ననా । యనసేమంబుననున్నవారమని యాత్మాధీశుతో నిట్లనున్ ॥(సీ)పార్థి
వోత్తమనీవు; ప్రజలఁ బాలింతు వేతంద్రికై వడిఁ బాడిదప్పకుండ । నవనీశసం
భృతులై భృత్యవర్యులు చరియింతురే నీదు శాసనమున । బలకోశమిత్రసంప
త్పుత్రపౌత్రులందరయుదే కుశలమహర్నిశంబు । మనుజేంద్రరాజ ధర్మప్ర
కారంబునఁ బగతులగెలుతువే ప్రాభవమున॥(తే,గీ) సాధుజనులరక్షింతువే సవ
నకలన । వేలుపులఁదృప్తినొందింతు,వేయటన్నఁ । గుశలుఁడుపల్కె సర్వత్రకు
శలమనుచు । వినయమిగురొత్తనమ్ముని,విభునితోడ॥ (వ. ఇట్లుధర్మనిష్ఠులగువ
సిష్ఠవిశ్వామిత్రులుపరమసంతుష్టులై పరస్పర ప్రియాలాపంబుల నొక్కింతసే
పు కథాప్రసంగంబులుసలిపి బద్ధానురాగులై యున్నంతఁగథాంతంబున భగవం
తుండగు వసిష్ఠుండు విశ్వామిత్రునితో నిట్లనియె ॥ (మత్తకోకిల) రాజశేఖరనీ

(*) వసిష్ఠుఁడు విశ్వామిత్రునిచమూయుతముగఁ బూజఁగైకొనఁగోరుట. (*)

వుధాత్రికిరాజవైనకతంబునన్ । బూజనీయుఁడ వెల్లభంగులఁ, బుణ్యమూర్తి
వినీకునేఁ । బూజఁజేసదనర్హభంగిఁ జమూయుతంబుగ నేఁడుమ । త్పూజ
నంబుఁ బ్రతిగ్రహింపుము, భూతపూర్వసుఖంబుగాన్ ॥ (తే,గీ) మనుజనాయక
యీవేళ,మాగృహమున । నంచితంబుగ విందారగించియెల్లి । చనవలెనటం
చుఁబలుకనా,జనవిభుండు । నింపుసొంపార,నమ్మానికిట్టులనియె ॥ (చ)అనఘ
చరిత్రమీరుదయ, నానతియిచ్చిన మాటకంటెభో । జనమదియెక్కుడే సెలవొ
సంగినఁబోయెదనంచుఁబల్కిన । ట్లనవలదంచుసారెకును, బ్రార్థనఁజేసినమీరు



పల్కిన । ట్లనెయగుఁగాకయంచునుని లాప్రభుఁడెంతయు సమ్మతించినన్ ॥
(సీ) మునినాథుఁడప్పుడు తనహోమధేనువు మానుగా రప్పించి దానికనియె।
నందినివినవెయీ నరనాథునకుబలం బునకు విందొనరింపఁ బూనినాఁడ । మ
చ్ఛాసనమునని మహిమ తేటపడంగ వలయువస్తువులు నవ్వారిగాఁగ । క్షణ
ములోనచ్చటఁగల్పింపు మనిపల్క మీఱినభక్తినాసౌరభేయి ॥ (తే.గీ)షడ్రస
సమన్వితములుగా స్వాదుసంగ । తములుగాఁబరిపాకభేదములుగాఁగ । రు
చ్యములుగాఁగ నమ్మునిలోకవిభుఁడు । హర్షమొందఁ బదార్థంబు లప్పుడు

నందినీధేనువు విందునకువలయువస్తువులువర్షించుట

గురిసె॥ మఱియుఁ బర్వతోపమంబులగు చిష్టకింనిదుష్టాన్నరాసులును సూపం
బును సద్యోఘృతకూపంబులును దధికుల్యంబులును నిక్షురస మధుమైరేయవ
రాసవంబులును మహార్హంబులగు పానంబులును నుచ్చావచంబులగు భ
క్ష్యంబులును సహ్యంబులైనలేహ్యంబులును దూష్యంబులుగాని చోష్యంబులు
ను షాడబంబులగు నానాస్వాదు రసంబులును గుడపూర్ణంబు లగు భోజ
నంబులును బరమాద్భుత ప్రకారంబుగ ననంతంబుగా సృజియించిన నత్తెఱం
గు విలోకించి యద్భుతంబు నొంది బ్రాహ్మణ పురోహితామాత్య మంత్రిసు
భృత్యసహితుండై॥ (చ) కడుముదమందిరాజుముని కాంతునిభూరితపోవిభూ
తికిం । బడరఁగహోమధేనువుమహామహిమంబునకచ్యుతంబుసం । ధిలమతివే
యిభంగులను తింపుచుఁగాంచనభాజనంబునన్। గడియొకమాడగాఁ గుడిచెఁ
గాంక్షలుదీర యథాక్రమంబుగన్॥ (క) మఱియుం దక్కినవారలు । వరుసన్
దమకిచ్చవలయు వస్తువులెల్లం । గరమరుదుగభుజియించిరి। పరమానందాత్ముల
గుచుభానుకులేశా॥ (చ) జనపతితృప్తినొందిముని చంద్రుని హోమగవిన్ గ్ర
హింపనె । మ్మనమునఁగోరియమ్మునికి మానుగనిట్లనె లక్షగుఱ్ఱము । ల్ఘనముగల
క్షధేనువులు లక్షమణుల్మఱి లక్షకాంచనం । బెనయఁగనిత్తునోయనఘ యీ

—(*) విశ్వామిత్రుఁడు నందినీధేనువును గ్రహింపనిచ్ఛయించుట. (*)—

మొదవుంగృపనిమ్మునాకొగిన్॥ (క) మునివర గోరత్నంబిది । యనిశము పా
ర్థివుఁడురత్నహారియగాన్। వినుముపరికింపనిదినా । ధనమొసఁగుముదీని
నాకు ధర్మముపేర్మిన్ ॥ (సీ) అనుచువిశ్వామిత్రుఁడాడినమ్మాటవినివసిఁ

ష్ఠుఁడుచాల విహ్వలించి । ధరణీశమాకేల కరులుహయంబులు మణిరత్నములుధేనుమండలములు । హవ్యకవ్యములకు నాధారమగుదానిఁ బ్రాణయాత్రకు మూలమైనదాని । స్వాహావషట్కార సర్వమంత్రక్రియా విద్యకునిలయమై వెలయుదాని ॥ (తే,గీ) నగ్నిబలిహోమసాధనంబైనదాని । నాత్మవంతుసత్కీర్తి యట్లనవరతము । నాశమునులేని దానిసంతసమొసంగు । దానినీదివ్య శబళనీ దగమనీకు॥ (ఆ,వె) విడువ దఁగనిదాని విడిపింపుమనినీకుఁ। బలుకధర్మమగునె పార్థివేంద్ర । గోసువర్ణవాజి కోటులువేయైన । సురభి కెనయెగాధీవరకుమార॥ (వ) అనిపలికిన విశ్వామిత్రుండు సంరంభవిజృంభితుండై వసిష్ఠునవలోకించి మహాత్మా హైరణ్యకక్ష్యాగ్రైవేయ తోమరాంకుశభూషితంబులగు పదునాల్గువేలమత్తకుంజరంబులను గింకిణీజాల విభూషితంబులును వేగవంతంబులును గాంభోజ సింధుదేశ సంభవంబులగు పదివేలహయంబుల శ్వేతాశ్వచతుష్టయ యుతంబులగు నెనమన్నూరు కాంచనరథంబులను నానావర్ణ విభక్తంబులగు కోటిపాడిమొదవులను మఱియు యథేష్టంబుగా మణిసువర్ణంబుల నిచ్చెదఁ బ్రతిగ్రహించి యీకల్మాషినొసంగుమనిన నవ్వసిష్ఠుం డిట్లనియె॥ (ఉ) రాజవరేణ్య మాకిదియె రత్నసువర్ణ ధనాదికంబులున్ । వాజులుధేనుసంతతులు వారణముల్రథముల్మఖక్రియల్ । జేజెలుమెచ్చు పూజలును జీవితమాత్రతపఃఫలంబువి । ద్యాజయశీలవృత్తగుణ ధర్మములున్ గృతకార్యసిద్ధియున్॥ (వ) కావున॥ (ఉ) ఎంతబహూకరించినన హీనహయంబుల నెన్నియిచ్చినం । బంతముతోడ ధేనువుల భద్రగజంబులవేయికోట్లఁగొం। డంతధనంబొసంగినజ నాధిపధేనువునీమనీకునేఁ । డింతదురాశయేలజని యించెవచింపకపో

—(*)విశ్వామిత్రుఁడు నందినీధేనువునుబలాత్కారముగాఁగొనిపోవుట(*)—

మ్మునెమ్మదిన్॥ (చ) అనవుడుగాధినందనుఁడ హంకృతినీతనినింత వేఁడఁగా। మనకిఁకనేలమానిబలుమానిసిచందమెఱుంగనేర్చునే । వనములనాకలంబుఁదినివాడుటమొక్కటిగాకయంచుఁజ । య్యనశబళన్ గ్రహించిచతురంగయుతంబుగఁ బోవుచున్నెడన్॥ (తే,గీ) మనుజనాథునిచేహ్రియమాణయగుచుఁ। జాలదుఃఖితయైమౌనిశబళయపుడు। దారుణధ్వనినేడ్చుచుఁదనమనమున । నిట్లనికడంకఁజింతించెనినకులేశ॥ (చ) తనహృదయంబుఱెంగిసతతంబు మెలంగుచువాత్మనోగతుల్ । తనపయిఁజేర్చిభక్తనయి తద్దయుఁగొల్చెడు నన్నుగావరం । బునవిపు



డిట్లు బల్మిఁగొని, పోవఁగఁ జూచి వసిష్ఠుఁడేలకో । కనల కుపేక్షఁ జేసెనప, కార

—(*) విశ్వామిత్రగృహీతయైననందినివసిష్ఠునియొద్దకువచ్చి మొఱలిడుట.(*).—

మొకింత యెఱుంగనక్కటా ॥ (వ) అనిబహుప్రకారంబులం దలపోసి పిట్టార్పునిగుడించి ॥ (ఉ) వారినిజీఱికింగొనక, వందరచిందరలాడికొమ్ములం । జీఱి ఖురమ్ములం జదిపి, చిక్కక చిక్కులఁబెట్టి, బెట్టుహుంకారముతో నదరల్చి కినుకన్వడి దాఁటిమునీంద్రచంద్రునిం । జేరఁగఁబోయి యిట్లనె వసిష్ఠపదంబులవ్రాలి దీనయై ॥ (మ) ననుబల్మిన్ గొనిభూవరుండరుగుచున్నాడీవు వారింపకట్లునికింబాడియె నీకునన్నతనికి, ట్లొప్పింపఁగాఁజెల్లునే ।యనఘా సేనపరాధిఁగానకటయిట్లన్యాపుంగృత్యముల్ । గనిమీరూరకయుండుటల్ప్రపదోలం, గంద్రోచుటింతేగదా ॥ (వ) అనిపెక్కువిధంబులభగినియుంబోలెవిలపింపుచుఁగన్నీరుమున్నీరుగా రోదనంబుఁజేసిన నమ్మొదవు దృఢభక్తివినయములకు మెచ్చి సస్నేహంబును సగౌరవంబునుగా నిట్లనియె ॥ (ఉ.) ఏటికినిన్నునేవిడుతు నెంతయునీతఁడుదోర్బలంబునం ।బోటరియౌచునిన్నుఁగొని, పోయెడుఁగాని పరాధిసంఘముల్ । ధాటికిమేరమీఱిన విధంబున రాజులున్యాయహీనులై । పాటిదొఱంగివచ్చినను, బ్రాహ్మణులెంతటివారుచెప్పుమా ॥ (క) ఈక్షోణికి విభుఁడీతం । డక్షౌహిణీబలసమేతుఁ, డదిగాకనితం । డక్షీణసమరదోహలుఁ। డీక్షితిపతినెట్లుగడుతు, నింతయుఁజెప్పుమా ॥ (ఉ) నావినివేల్పుటావుముని, నాథుని కిట్లనుబ్రహ్మతేజమున్ । క్ష్మావరభూరితేజమున, కంటెను మిక్కిలిగానెఱుంగుదుం । గావుననీపరితాపమున, కంటెన్నృపాలుని తేజమెక్కుడా । నావసుధేశుసైన్యములు, నామమడంచెదఁబంపు నన్నన్ ॥ (వ) అనివలికిన యానందినివచనంబువిని వసిష్ఠుండుదానినవలోకించి శత్రుసైన్యంబుల నాశంబునొందించునట్టి సైన్యంబుసృజింపుమని యాజ్ఞాపించిననాసురభి బ్రహ్మతేజోసంభృతయై హుంకారంబుఁ గావించిన నమ్మహారవంబు వలనఁ బహ్లవులనేకులు జనించి విశ్వామిత్రుని సర్వసైన్యంబు నాశంబునొందించిన నతండు కోపించి రథంబుదోలించియాక్రమించి॥(క) కడువడి లోచనములఁ గెం । పడరఁగ నుచ్చావచంబు, లగు శస్త్రములన్ । విడక నరాతుల నందఱఁ । బొడిపొడి గావించె భూరి, భుజబలమలరన్ ॥ (తే,గీ)మానవేంద్రశస్త్రాదిన్తు,లైన వారిఁ । బహ్లవులఁ జూచి శబళకోపంబు గదుర । యవనపహ్లవ

మిత్రశత్రు,లైనశకుల । నప్పుడు పుట్టించెఁ గ్రమ్మఱ, నద్భుతముగ ॥ (వ) ఇట్లు సృజించిన వారు దీర్ఘాసి పట్టసప్రాస పాణులును హేమకింజల్క సన్నిభులును గాంచనవర్ణాంబరావృతులును మహాప్రభావసంపన్నులునై పుడమి నాచ్ఛాదించి పావకశిఖలుఁ దృణారణ్యంబు నేర్చు విధంబున విశ్వామిత్రుని బలంబు నెల్ల నిర్దగ్ధంబు గావించినం గినిసి ॥ (క) మానవపతి శరజాలము । జానుగఁ బరఁగింప యవన, శకబల మెల్లన్ । మీనక్షోభప్రచలిత । మైనమహాప్రావము భంగి, నాకుల మయ్యెన్ ॥ (క) నరపతిచేతను సైన్యము । కరువలిచేఁ బండుటాకు, గతి సుడి బడినన్ । బరికించి తపసి ధేనువు । నరుదుగ బలముల సృజింపు, మునిపురి కొల్వన్ ॥ (వ) ఇట్లు వసిష్ఠచోదితయై యక్కామదోహిని తత్క్షణంబ హుంకారరవంబుల వలన రవిసన్నిభులగు కాంభోజులను బొదుగు వలన నానాశస్త్రాస్త్రపాణులగు పహ్లవులను యోనిదేశంబువలన భీషణాకారులగు యవనులను శకృద్దేశంబువలన నంతకరూపులగు శకులను రోమకూపంబులవలన దంష్ట్రాకరాళవక్త్రులగు కిరాతులం బుట్టించి నబ్బలంబులు విశ్వామిత్రబలంబులపయిం గవిసి శతాంగమాతంగ తురంగ భటాంగంబుల నాజిరంగంబునఁ గసిమసంగి పొడవడంగించిన ॥ (చ) తనబలమంతయున్ మునియు, దారతపోబలసంపదన్ జెడ । గ్గనుఁగొని మానవేంద్రుఁ డమ, నంబున నచ్చెరువొందిచూడఁ ద । త్తనయులు నూర్గురుద్ధతు, లుదగ్రులు రోషవిభీషణాంగులై । మునిపతి డాసిబిట్టవియ, మొత్తుదమంచుఁ గడంగి శూరతన్ ॥

(*) వసిష్ఠునికోపంబున విశ్వామిత్రుని సైన్యంబులు హతములగుట. (*)

(తే,గీ) గిట్టిబిట్టుగ నమ్మౌని, జుట్టుముట్టి । యట్టహాసంబు చేసిన,నట్టె గినిసి । యట్టికన్నుల మిడుఁగురు, లుట్టిపడఁగ । గట్టితనమునఁ జెడుఁ డంచుఁ, దిట్టుటయును ॥ (క) వారామునికోపంబున । వీరత్వము శూరతయు వి, వేకము సెడఁగా । నీరై చనిరి మునులకప । చారంబులొనర్చునట్టి, శఠులుమడియరే ॥ (వ) ఇట్లు బలంబును గుమారులును నిశ్శేషంబుగా వసిష్ఠుని దివ్యప్రభావంబున హతులైనం జూచి విశ్వామిత్రుండు వ్రీడితుండై నిర్వేగంబగు సముద్రంబు చందంబున భగ్నదంష్ట్రింబగు భుజంగంబు కైవడి నుపరక్తుండగు భాస్కరుని భంగి లూనపక్షంబగు విహంగమంబు చాడ్పున హతపుత్రుండును హతబలుండును హతదర్పుండును హతోత్సాహుండును బరమనిర్వేదనపరుండునై ని



ష్ప్రభత్వంబు నొంది ॥ (ఉ) కొడుకుల పాటుఁ జూచి నృప, కుంజరుఁ డెంతయు దుఃఖరోషముల్ । వొడమఁగఁ బట్టణంబునకుఁ, బోయి యుదారుఁ గుమారు నొక్కనిన్ । బుడమికి రాజుఁ జేసి చల,మున్ మెఱయన్ హిమశైలమందులో । నడరిన భక్తిమీఱ నలి, కాక్షుని గూర్చి తపంబొనర్పఁగన్ ॥ (క) జన

(*) విశ్వామిత్రుఁడు శివునివలన సమస్తాస్త్రంబులు వడయుట. (*)

వరుఁ డొనరించు తపం । బున కెంతయు మెచ్చి భుజగ, భూషణుఁడు రయంబునఁ బ్రత్యక్షంబైనె । మ్మనమునఁ గృపగదురఁ బలికె మధుమధురోక్తిన్ ॥ (క) నరవర ఘోరతపం బిట్టు । కరమరుదుగ నేమిగోరి, కావించెదవో । వరమొసఁగ వచ్చినాఁడను । గురుమతి నిష్టమగుదానిఁ, గోరు మొసఁగెదన్ ॥ (క) నావిని విశ్వామిత్రుఁడు । భావంబునఁ బొంగి శివుని, పాదంబులకుం । గేవలభక్తి నమస్కృతిఁ । గావించి వచించె ఫాలక, లితాంజలియై ॥ (మ) కృపనాపైఁ గలదేని శంకర ధనుర్వి, ద్యారహస్యంబు య । క్షపతంగోరగ సిద్ధచారణ మరుత్క్రవ్యాదశస్త్రాస్త్రముల్ । విపులప్రక్రియ సర్వమున్ దెలియఁగా, వేద్యోపసాంగంబుగా । నుపదేశింపుమటంచు శత్రుమథనప్రోత్సాహియై వేఁడినన్ ॥ (క) మెచ్చి వచించిన వన్నియు । నిచ్చితి నరపాల యనిమ, హేశ్వరుఁ డుముసం । బచ్చుపడ వెండికొండకు । విచ్చలవిడి నరిగె దేవ, వితతులుగొల్వన్ ॥ (వ) అంత ॥ (క) అన్నరవిభుఁ డివ్విధమున । నన్నగకార్ముకుని చేత, నఖిలజగములం । దెన్నిగల వన్నిబాణము । లున్నతగతిఁ బడసి సంగ, రోత్సాహమునన్ ॥ (శా) శుంభల్లీలమహోగ్రుఁడై కుపితుఁడై, సొంపొందు కల్పాంతకృ । చ్ఛుంభుండో యన దుస్సహప్రకటదో, స్సారంబు దీపింపఁగా । నంభోధిక్రియ నింగిఁబొంగి సమర, వ్యాపారలీలాకళా । రంభం బొప్ప వసిష్ఠునాశ్రమము సే, రం బోయి యత్యుద్ధతిన్ ॥

(*) విశ్వామిత్రుఁడు మహాస్త్రంబుల వసిష్ఠునాశ్రమముమీఁదఁ బ్రయోగించుట. (*)

(మ) నియతిన్ ఘోరశరంబు లేసిన మహా, గ్నిజ్వాలికామాలికల్ । వియదాభోగము భూతధాత్రియు దిశల్, భీమాకృతిన్నిండఁగా । భయదప్రక్రియ విస్ఫులింగచయ శ, బ్దంబుల్ రహిన్మ్రోయఁగా । న్రయమొప్పారఁ బొగల్ మహీస్థలమున,న్ధత్వంబు నొందింపఁగన్ ॥ (వ) అమ్మహనీయ దివ్యాస్త్రంబులు రభసాతిశయంబునం బఱతెంచి వసిష్ఠముని యాశ్రమవనంబుఁ జుట్టుముట్టి దహింపం దొడంగినఁ దదీయభీషణ జ్వాలాసంతప్తంబులై శిగమృగంబులును వసిష్ఠ

శిష్యులును దక్కినమునులును భయభీతులై విరావంబులు సేయుచు దశదిక్కులకుం బఱచిరి తదీయాశ్రమం బొక్కముహూర్తమాత్రం బిరిణసన్నిభంబై యుండె నప్పుడక్కలకలం బాలించి యది విశ్వామిత్రుని కృత్యంబని యెఱంగి భాస్కరుండు నీహారంబునుం బోలె గాధేయు నిప్పుడ నాశంబు నొందించెద నోడకుం డుండని వారికం దఱ కభయంబు దెల్పి పాదవిన్యాసంబునం బుడమి గ్రక్కదల బ్రహ్మదండంబు మహోద్దండపండ ధరకాల దండంబుకరణిం బ్రచండ లీలం గేలం గ్రాల విధూమకాలాగ్నియుం బోలె మండుచు రౌద్రరసోల్లాసమూర్తియై శీఘ్రంబునం బఱతెంచి నిజకోపాగ్నిజ్వాలాజాలదహ్యమాన విశ్వామిత్రప్రయుక్త విశిఖశిఖాపరంపరుండగుచు విశ్వామిత్రు నాలోకించి ప్రళయజీమూత సంఘాత సంజాత గర్జాసముజ్జృంభణ గంభీర భాషణంబుల నిట్లనియె ॥ (తే,గీ) వినుము మూఢాత్మ చిరపరి, వృద్ధమైన । యాశ్రమము దగ్ధమొనరించి, తండువలనం । గడు దురాచారపరుఁడవు, కలుషబుద్ధి । వైతి వింక నశించెదు, నీతిదూర ॥ (వ) అనిపలికిన నవ్విశ్వామిత్రుండు కోపించి చాపంబునం దాగ్నేయాస్త్రంబును సంధించి నిలునిలుమని యదల్చిన నవ్వసిష్ఠుండు కాల దండంబుం బోని బ్రహ్మదండంబు బట్టి పరమసంక్రుద్ధుండై విశ్వామిత్రున కిట్లనియె ॥ (తే,గీ) ఓరి రాజ్యమదాంధుఁడ, యోరి శఠుఁడ । కడఁగి పుణ్యాశ్రమములిట్లు, కాల్పఁదగునె । యింతకే నేడ నీ వేడ, నిట్టిపాప । కార్యము లొనర్పఁ బాడియె, కలుషబుద్ధి ॥ (ఉ) బ్రహ్మబలంబెఱుంగక నృపాలుఁడనంచు మదాభిమానివై । బ్రహ్మసమాను నన్ను వడి, బాములఁ బెట్టఁగ వచ్చితీవు మ । ద్బ్రహ్మబలంబున న్నినుఁ శ్శరంబుల వ్రేల్మిడి గీటణంచెదన్ । బ్రహ్మవిరోధి నీదగు బలంబది సర్వముఁ జూ

(*)వసిష్ఠుఁడు బ్రహ్మదండమున విశ్వామిత్రుని యస్త్రములనన్నియు మడియఁ జేయుట.(*)

పుమిత్తరిన్ ॥ (వ) అనిపలికి కాలదండంబుం బోని బ్రహ్మదండంబుచే విశ్వామిత్రుని యాగ్నేయాస్త్రంబును సలిలంబున వహ్నివేగంబుం బోలె శాంతినొందించి హోమధేనువు నెడనుడితంబైన కామంబునకుం బుత్రమరణశోకసంజాతక్రోధంబు సహాయం బాచరింపఁ గనలి విశ్వామిత్రుండు క్రమంబున రౌద్రంబును నైంద్రంబును బాశుపతంబును నైషీకంబును మానవంబును మోహనంబును గాంధర్వంబును స్వాపనంబును జృంభణంబును సంతాపంబును విలాపంబును శోషణంబును మారణంబును సుదుర్జయంబగు వజ్రంబును



బ్రహ్మపాశంబును గాలపాశంబును వరుణపాశంబును బినాకాస్త్రంబును శుష్కార్ద్రనామకంబైన యశనిద్వయంబును దండాస్త్రంబును బైశాచంబును గ్రౌంచంబును ధర్మచక్రంబును గాలచక్రంబును విష్ణుచక్రంబును వాయవ్యాస్త్రంబును మథనంబును హయశిరంబును శక్తిద్వయంబును గంకాళంబును గాపాలంబును గంకణంబును ముసలంబును వైద్యాధరాస్త్రంబును గాలాస్త్రంబును దారుణంబగు త్రిశూలంబును మొదలుగా ననేకాస్త్రశస్త్రపరంపరలు వరఁగించిన ॥ (చ) ఇటు కుశవంశజుం డడరి యేయు మహోగ్రశితాస్త్రశస్త్రముల్ । చటుల రవంబులన్ భువనజాలములన్ సుడిఁబెట్టెఁ గానియా । జటి నొకఁడేని నొంచుటకుఁ, జాలదు తత్పృథుశక్తి యెట్టిదో । కుటిలురు చేయుకృత్యములు, కోరి మహాత్ముల చెంతఁ జెదునే ॥ (ఉ) అప్పుడు బ్రహ్మదండమునఁ, దమ్ముని శేఖరుఁ డుప్పరంబునం । దెప్పరమైతనర్చి పఱతెంచు నరేంద్రుని యస్త్రపఙ్క్తినే ర్పొప్పఁగ నద్రుంచి యొప్పెసఁగ, యోగివరేణ్యుఁ డుత్పత్తబోధచేఁ । గప్పిన యింద్రియస్ఫురణ..గ్రక్కున మాన్చి చెలంగు కైవడిన్ ॥ (శా) బ్రహ్మణ్యుండగు మౌనిచేఁ దనశర, వ్రాతంబు లిట్లౌటకున్ । బ్రహ్మణ్యుం డితఁ డన్యసాధనములన్, బంచత్వ మొందం డికన్ ॥ బ్రహ్మాండంబటు తల్లడిల్లఁగఁ జతు, ర్వారాసులింకన్ దగన్ । బ్రహ్మాస్త్రం బడరింతునంచుఁ జలమొ, ప్పం గౌశికుం డుద్ధతిన్ ॥ (మ) తగ నయ్యస్త్రము మార్వితో నియమమం, త్రస్ఫూర్తిన్ సంధించినన్ । బగిలెన్ మిన్ను కులాద్రులొడ్డగిలెఁ గం, పం బొందె మ్రోసెన్ దిశల్ । ఖగరాజుల్ గతిదప్పి రంబునిధి, కీలాలంబులింకెన్ గజో । రగముల్ ప్రొగ్గె జగంబు ఘూర్ణిలెఁ బది, త్రస్తాత్ములై రందఱున్ ॥ (వ) ఇట్లు సముచితంబుగా సంధించి విశ్వామిత్రుఁ డమ్మహనీయాస్త్రంబు లోకక్షోభంబుగాఁ దిగిచి విడిచిన ॥ (మ) చటుల స్ఫూర్తి మిడుంగురుల్ సెదరఁ, దిక్చక్రంబునం దుర్జట । చ్ఛటశబ్దంబులు పెల్లు రేఁగి దివియున్ ద్యోభాగమున్ నిండను । త్కట వేగంబున లోకజాలములు మ్రిం, గన్ వచ్చు మాడ్కిన్ మహో । త్కటమై మండుచు బ్రహ్మదండమును గి, న్కన్ దాఁటి యేతేరఁగన్ ॥ (చ) కనుఁగొని మౌనిముఖ్యు లయ, గస్త్యమునీశ్వరుఁ డబ్ధిపూరమున్ । ఘనముగ నొక్కఁ గ్రుక్కఁ గొను, కైవడి గ్రుక్కిన వక్త్రగహ్వరం । బనువుగ విచ్చి మ్రింగెనపు, డస్త్రము తాపసు గర్భమందుఁ జ । య్యన వెలిఁగెన్ మహార్ణవము, నందు వెలింగెడు బా

డబంబనన్ ॥ (వ) అప్పుడత్తేజోమూర్తి దివ్యరూపంబు త్రైలోక్యమోహనం
బై రౌద్రంబై దారుణప్రకారంబునంబొలిసెమఱియు ॥ (ఉ) ఆరయనిట్టులమ్ము
నికు, లాగ్రణితత్స్థితాస్త్రరాజము । న్వారకమ్రింగి భాస్కరుని, నైఖరిశో
భిలెనంతనమ్మహా । దారునియంగరోమసము,దాయములగ్నిశిఖలుప్పతిల్లెబల్ ।
దారుణభంగిలోకములఁ, దద్దయునేర్చఁదొడంగెనయ్యెడన్ ॥ (వ) ఇట్లు భువన
భయంకరుండై ప్రళయకాలమార్తాండుండుపోలె దుర్నిరీక్ష్యుండై వెలుం
గుచున్న వసిష్ఠునిం జూచి భయంబుఁగొని దేవర్షిగణంబులచ్చటికిం జనుదెం
చిప్రస్తుతింపుచునిట్లనిరి ॥ (ఉ) మానవభర్తబల్ దురభి, మానమునంజెనకం
గవచ్చినీ । చేనిగృహీతుఁడయ్యె ముని, శేఖరనిన్గనిలోకముల్ భయ । స్థానము
లయ్యె నింకిటఁబ్ర, సన్నుఁడవై కృపఁబూని. భూతముల్ । దీనతవీడమీదుఘనతే
జము తేజమునన్ ధరింపుఁడీ । (క) అనిప్రార్థించిన మునిపతి । తనరౌద్రతవి
డిచిసౌమ్య, దర్శనుఁడయ్యెన్ । మునులు తెలివొందిరనిమిషు । లనుపమహ

(విశ్వామిత్రుఁడువసిష్ఠునిచే నవమానితుండై తపంబుఁజేయబోవుట)

షార్థినోల, లాడిరివరుసన్ ॥ (వ) అంతవిశ్వామిత్రుండు పరాభవంబునొం
ది సారెసారెకు నిట్టూర్పులుపుచ్చుచు నమ్మునీంద్రుండొక్కబ్రహ్మదండంబున
మదీయ దివ్యబాణంబు లన్నియు నాశంబునొందించె బ్రహ్మతేజోబలంబే బలం
బుగాక క్షత్రియబలం బేటిబలంబని నిందించి ప్రసన్నేంద్రియమానసుండనై త
పంబుచేసి బ్రహ్మత్వంబువడసెదఁగాకని నిశ్చయించి వసిష్ఠుతోడఁ గృతవైరుం
డై భార్యాసమన్వితంబుగా దక్షిణదిక్కునకుంబోయి యందొక్క తపోవనంబు
నఫలమూలాశనుండై మానసేంద్రియంబులుజయించి ఘోరతపంబు సేయుచు
హవిష్యంద మధుష్యంద దృఢనేత్ర మహారథులనుసత్యధర్మపరాయణులనల్వు
రఁబుత్రులంబడసి ॥ (మ) చలమున్ డింపక గాధి నందనుఁడు నిష్ఠాభక్తి యు

(*)బ్రహ్మవిశ్వామిత్రునకుఁబ్రత్యక్షమై రాజర్షిత్వంబొసంగుట(*)

క్తంబుగా । జలజాతప్రభవుంగుఱించి, బహువర్షంబుల్ తపంబుద్ధతిన్ । స
లుపన్ మెచ్చివిరించి వచ్చి వసుధేశానీతపఃప్రౌఢికిం । ఫలరన్ మెచ్చితి సంస్తు
తిన్ బడయుమ, య్యా యింకరాజర్షివై ॥ (వ) అనిరాజర్షిపదం బొసం
గెద్రుహిణుం, డంతర్హితుండైన న । య్యనఘుండింత తపంబుఁజేసియునుబ్రహ్మ
ర్షిత్వముంగాంచనై । తనిరాజర్షిపదంబి దేలయకటాగేనొల్లనంచుద్ధతిన్ ।



ఘనకౌతూహలియై యఖండతపముం, గావింపుచుం డెన్ రహిన్ ॥ (సీ) అ
ప్పుడిక్ష్వాకు వంశాంభోధిచంద్రుండువినుతకీర్తి త్రిశంకు, జనవిభుండు । తను
వుతోఁగూడఁగఁ దానాకలోకంబు నకుఁబోవఁదగుజన్న, మొకటిసేయఁ । బూ
ని భక్తివసిష్ఠ, మునిపాలికేతెంచి యుచితసపర్యల, నుపచరించి । యనఘు యి

(*)త్రిశంకుమహారాజు సదేహముగా స్వర్గముఁబొందఁగోరుట(*)

క్ష్వాకువం, శాధీశులకునెల్ల నిఖిలకామదుఁడవు, నీవెకావె ॥ (తే, గీ) మిగుల
మీకృపగలవారి, కగునెకోఱత । లమరలోకంబునకును దేహం, బుతోడ ।
నరుగఁదగినట్టిమొక యాగ, మర్థితోడ । నమరనాచేతఁజేయింపు, మయ్యయ
నిన ॥ (చ) ఘనుఁడువసిష్ఠుఁడిట్లనియె, గాత్రముతోసురరాజుపీటికిన్ । జనఁగ
నసాధ్యమెవ్వరికి, క్ష్మావరమున్నిటువంటి యాగమే । జనపతులైనఁజేసిరెవి,చా
రముసేయక యిట్టియధ్వరం ॥ బొనరుపఁబూను టెట్టులిటు, లొప్పనికార్యము
కాదుపొమ్మికన్ । (వ) అనిపలికిన నమ్మహీరమణుండు వసిష్ఠునిచేతఁ బ్రత్యా
ఖ్యాతుండై లజ్జావనత వదనుండగుచు దక్షిణంబునకుంజనియందుసంశ్రితవ్రతు
లై తపంబుసేయుచున్న వారిసూర్యసంకాశుల వసిష్ఠపుత్రుల నూఱ్వురంగని
యానుపూర్వకంబుగా నగ్గురుకుమారులకు నమస్కరించికృతాంజలిపుటుండై

*త్రిశంకుఁడువసిష్ఠుచేతఁ దిరస్కృతుడై వసిష్ఠపుత్రులపాలికరుగుట*

యిట్లనియె ॥ (సీ) అనఘాత్ములారయే, నంగంబుతోఁగూడ దివికేగఁదగునట్టి
సవనమొకటి । సేయంగఁబూనివ, సిష్ఠునికడ కేగి ప్రార్థింపఁగాదుపొమ్మని
యె నింక । మీకన్న నెవ్వారు,నాకుశరణ్యులుగురుసుతులకు మీకు,శిరముతోడ ।
నభివాదనముఁ జేసి, యాచించెదఁ గృపాప్తియాజకులై మీర, లట్టిక్రతువు ॥
(తే,గీ) తవిలినాచేతఁజేయింపుఁ, డవనిపతులు । గురువుల ప్రసాదమునఁ గా
దె,కోర్కివడయు । ఠెల్ల మీకృపనయ్యాగ, మొలమిఁజేసి । నేను జరితవ్రతుండ
నై,నెగడవలదె ॥ (వ) అని పలికినఁద్రిశంకుని వచనంబులు విని వసిష్ఠపుత్రుల
తనికిట్లనిరి ॥ (మ) భువినిక్ష్వాకుల కెల్ల నొజ్జత్రిజగ,త్పూజ్యుండు సత్యప్రతి ।
శ్రవుఁడస్మద్గురుఁ డత్తపస్వి పలుకుల్,దాఁటంగ లేరెవ్వరా । రవితుల్యుండు గు
రుండు కాదనినఁగా, ర్యంబట్టె యోనీకభూ । ధవ శాఖాంతరగ మొందితీవు తగు
నే,ధర్మంబుఁ దప్పింపఁగన్ ॥ (వ) భగవంతుండగు వసిష్ఠుండాడినమాట
సత్యంబగుంగాని రిత్తయగునే నీవు బాలిశుండ వగుటంజేసి మమ్మడుగ వచ్చి

వమ్మహానుభావున కవమానంబు సేయుటకు సహింపం జాలము నీవీదుర్విచారంబు విడిచి పురంబునకుంబొమ్మని పలికిన( గ్రోధపర్యాకులాక్షురం బగు వాసిష్ఠుల వచనంబు విని వెండియుఁ ద్రిశంకుం డిట్లనియె ॥ (తే,గీ) తొలుత సీతండ్రిచే నట్లు, తోసియఁ బడితిఁ । బిదప మీచేతనిటులైతిఁ; బద్ధసేయఁ । జనునె మిమ్మింక నేనన్య, శరణమొంద । నరిగెద శుభంబు గలుగుఁ గాకరయ మీకు ॥



(వ) అనిన ఘోరాభిసంహితంబగునమ్మహీపతి వచనంబు విని ॥ (క) మండిపడి మునికుమారుల । ఖండ తపోమహిమ నెలయ,త్మాతలవిభునిం। జండాలుండవు గమ్మని।చండతరక్రోధ మలర,శపియించిరొగిన్॥ (వ)ఇట్లుశపించి మునిపుత్రులునిజాశ్రమంబుఁ బ్రవేశించి రంత నా రాత్రిచనినమఱునాఁడు॥(క) దండిసెడి మునికుమారక । చండతరక్రోధజనిత , శాపంబునభూ। మండలపతి కష్టంబగు।చండాలత్వము వహించె,జనవరతనయా (సీ) అపుడు వాసిష్ఠకోపాగ్ని తేజంబున నలిఁగాలెననమేను, నల్లనయ్యె । నెతిమించు పైఁడివన్నియసన్నమగుపట్టుకమ్మిచీరయుమేచ, కత్వమొందె। బ్రణుత కాంతిస్ఫూర్తిఁ,బరఁగెడుసౌవర్ణ మణిహారములు లోహ,మయములయ్యె।వీడినశిఖతోడఁ, బోడిమిసెడినీచ నామోక్తిభేదంబు,లాముకొనియె॥ (తే,గీ) నరయఁదజ్జాతి కనురూప,మైనవేష। మంతయునుదాల్చికన్నవా,రంతనంతఁ। బఱవఁగేవల చండాల, భావుఁడగుచుఁ । బురమునకువచ్చె నంతనా భూవిభుండు ॥ (తే,గీ) అతనిచండాలరూపంబు, నరసిచూచి। పౌరులు నమాత్యభృత్యులు,బంధుజనులు । నతనివర్జించి రంతన, య్యవనినాథుఁ। డార్తిఁగుందుచు నేకాకి,



యైరయమున॥ (క) జనములఁజూచిన నొడుగుచుఁ। జనదురవస్థకును జాలఁ,దలఁకుచుమదిలో, మునిసుతులశాపతకులుకుచు।ఘనుఁడగునగ్గాధిసుతునిఁ,కడ కుంజనియెన్॥(క)తనపాలికిఁజనుదెంచిన।జననాథవరేణ్యుమేని,చండాలతయుం।గనికరమువిస్మయంబునఁ।గనికరమెదఁబొదువననియెఁ,గౌశికుఁడలర్కన్ ॥(చ)నరవరసర్వధారుణికి,నాథుఁడవైనయధర్మశీలివై । వఱలెడునీకునిట్టిదుర,వస్థపురూపమిదేలవచ్చెనా। కెఱుకపడంగఁజెప్పుమన,నంతయునాన్నృపమౌళిదీనుఁడై।కరములుమోడ్చిసిగ్గుగొని,గద్గదికందలవాంఛియట్లనున్॥(చ)వెలయఁగ మౌనితోఁడఁదివి,కేఁగ



గఁజాలినయొక్కయాగముం। బొలుపుగ సేనొనర్పమదిఁ బూనివసిష్ఠునితోడఁజెప్పని। వ్వలవనిజొలియేటికిటు,వంటిముఖంబొనరింపఁబోలదం। చలవడఁజెప్పిఁజెప్పుటయు, నమ్మునిసూనులఁ జేరివారితోన్॥ (వ) నేనిట్లంటి॥ (తే,గీ) దేహయుక్తుఁడనై యేను, దివిజలోక। మునకుఁబోవుట కహాస, వనము సేయ।బూనితిని దానినాచేత, మానితముగ। నర్థిఁజేయింపుఁ డనినఁగా, దనిరి వారు॥ (ఉ) అంతటఁగొన్నినిష్ఠురము,లాడిననమ్మునినాథపుత్రులు। త్యంతదురంతరోషమత్తులై ననుమాలవుగమ్మటంచున । శాంతిశపించిరప్పుడది, గారణమే నిటులాటకోమహీ। కాంతశిఖావతంసదన,కర్మఫలంబులురిత్తవోవునే॥(ఆ,వె) పెక్కుధర్మములును,జెక్కుదానంబులు। జెక్కుజన్నములును, జెంపుతోడఁ । జేసి గురులకర్చఁ, జేసితిగురువుల। కరుణలేమినిట్టి, కార్యమయ్యె॥ (తే,గీ) అనఘ నావచనము కల,నైనబొంకు।గాదు నేఁడిట్టిమునిశాప,కారణమున। నధ్వర మొనర్తుననుమాట,యనృతమయ్యె ।ననుచు నామది వొక్కెడు, నహరహంబు॥ (తే,గీ) ఇట్టియాపదలందైన, నింక మీఁద। బట్టిసత్యంబుపాలింతుఁ,బరమనిష్ఠ। నీదు గాఢానుకంపచే, నోదయాబ్ధి। దైవమైననుఁ జేపట్టి,ప్రోవుమయ్య॥(క)దైవం బెక్కుడుపౌరుష । మేవంకనిరర్థకంబ, హీనగుణాఢ్యా । దైవాధీనము సర్వము । దైవమె పరమగతియనుచుఁదలఁ చెదబుద్ధిన్॥(తే,గీ) అట్టిదైవంబుచేనుపహతుఁడనైన।నాకునీకంటె శరణమన్యంబులేదు। పురుషకారంబుచే దైవ,మునుగడంగి।



క్రమ్మతింపఁగఁదగుదీవు,గాధితనయ॥ (చ) అనినదయాళుఁడై కుశకులాగ్రణి యిట్లను నోడకుండుమో । జనవరదీనునిన్నుఁ బ్రసన్నతఁ బ్రోచితినింకమానులఁ। గ్గనముగఁబిల్వనంపి సవ, నంబొనరించి వపుర్యుతంబుగా । ననిమిష నాథులోకమున, కంపెద నీవచనంబు చెల్లఁగన్ ॥ (క) అనఘాత్మశరణ్యుఁడ నగు।నను శరణము నొందినకత, నం దగనీకున్ । మునుకొని నిర్జరలోకం । బనిశముఁ గరకలితమైన , దనుచుఁ దలఁ చెదన్ ॥ (వ) అని యూరడిలం బలికి విశ్వామిత్రుండు తనపుత్రుల మహాప్రాజ్ఞుల హవిష్యందాదుల నవలోకించి మీరు యజ్ఞసంభారంబు లన్నియు నొనగూర్పుఁడని నియమించి శిష్యులం బిలిచి మీరతిత్వరితగమనంబునం జని మదీయశాసనంబుఁ దెలిపి బ్రహ్మవాదులును బహుశ్రుతులునగుమహర్షుల నందఱ శిష్యసుహృత్సహితంబుగామత్సకాశంబునకుఁదోడ్కొ

ని రండు మద్వాక్యంబలఁజో దితుండై యెవ్వండు రాక నిరాకరించి నిందావా
క్యంబుఁ బలుకు నతనిచేత నుక్తంబైన దానినంతయు నాకెఱింగింపుఁ డని పలి
కిన వారలు శీఘ్రంబున దశదిక్కులకుం జని విశ్వామిత్రునివచనంబుఁ దెలిపి సమ
స్త సంయములం, దోడ్కొని వచ్చి విశ్వామిత్రు నుచితభంగి సందర్శించి కేల్మో
గిచి యిట్లనిరి ॥ (ఉ) వీరె సమస్త సంయములు, వేగమె వచ్చిన వార లెంతయు ।
నాఱిరు వసిష్ఠు నాశ్రమము, నం గల మానులు వారుదక్కనీ । ధారుణిలోపలంగ
లుగు, తాపసులందఱు నేగుదెంచిరిం । కారయ న వ్వసిష్ఠసుతు, లాడినపల్కు
లు చిత్తగింపుఁడీ ॥ (సీ) చతురత వాటించి జన్నంబు సేయించు వాఁడు రాజఁట
మాల ' వాఁడు సేయు । నఁట వాని మఖమున, నఖిలసంయమివర్యు లుండి భు
జింతురే, యుక్తిఁ జేసి । యచటి కెవ్విధమున, నరుదెంచెదరు హవిర్భాగంబుఁ
గొన సర్వ; యాగభుజులు । చెలఁగి గాధేయర, క్షితుడైన వాఁడెట్లు సురవిష్టప
మునకు, నరుగఁగలఁడు ॥ (తే.గీ) వినవిన విచిత్రమిమ్మాట, యనుచు వార । లమ్మ
హోదయసంయుతు, లగుచుఁ జాల । నేత్రముల రక్తిమ చెలంగ, నిష్ఠురముగఁ ।
గనలి దూషించి రనవుడు, గాధిసుతుఁడు ॥ (క) కటము లదర లోచనములఁ ।
జిటచిట పావకకణములు, సెదరఁగ రోషో । త్కటమున మేను వడక మి । క్కు
టముగఁ గలుషించి పండ్లు, గొఱుకుచుఁ బలికెన్ ॥ (వ) అదూష్యుండనై నన్ను
దూషించిన దురాత్ములగు వాసిష్ఠులు భస్మభూతులై గాలపాశంబునం గట్టువడి
నిస్సంశయంబుగా నిప్పుడ యమసదనంబునకుం జని యందు నానావిధ నరకం
బు లనుభవించి పదంపడి సప్తజడజన్మంబుల నీచజాతులం బుట్టి నిర్ఘృణులై వి
కృతులై విరూపులై మృతశునక మాంసభక్షకులై భూలోకంబున వర్తింతు
రుగాక మఱియు నన్ను దూషించిన దుర్బుద్ధియగు మహోదయుండు సర్వలో
క దూషితుండై నిషాదత్వంబు నొంది ప్రాణాతిపాతనిరతుండై నిరనుక్రోశంబు
నొందిమత్క్రోధంబువలన దీర్ఘకాలంబు దుర్గతి నొందుం గాక యని యిట్లు
మహాతేజుండగు విశ్వామిత్రుండు మహోదయ సహితులైన వసిష్ఠపుత్రులఁ
దపోబల నిహతులం గావించి ఋషిమధ్యంబున నొక్కింత సేపూరకుండి తనచు
ట్లనున్న మహర్షుల నందఱవిలోకించి యిట్లనియె ॥ (మ) మునులారా వినుఁ
డింక నీమనుజరా, ణ్ముఖ్యుం డ్రిశంకుర్ సుశ్రీ । లుని ధర్మజ్ఞుని సత్యసంధునిఁ గృ
పా, లోలున్ మహావైభవున్ । ఘనపుణ్యుం గరుణార్ద్రదృష్టిఁ గని యీ, గాత్రం



బుతో జంభసూ । దనులోకంబున కేగు నట్టిమఖము, ద్యత్ప్రీతిఁ గాంవిపరే ॥
(వ) అని విశ్వామిత్రుం డాజ్ఞాపించిన నమ్మును లొక్కింత తమలో విచారించి యీవి
శ్వామిత్రుండు పరమకోప నుండితండు చెప్పిన కార్యంబు ధర్మసహితంబు గా
దంటిమేని రోషితుండై దంభోళికఠోర ఘోరవాక్యంబున శపించుం గావున నితం
డు గఱపిన మార్గంబున నిమ్మహీరమణుండు సశరీరుండై విశ్వామిత్రుని తేజంబున
దివంబునకుం జనునట్టి మహాధ్వరంబు సేయించుట కర్తవ్యం బని నిశ్చయించి
మంత్రకోవిదులగు మహర్షులు యాగకర్మకౌశలంబు మెఱయఁ గల్పోక్తప్ర
కారంబున సర్వకర్మంబులు నిర్వర్తింపుచుండి రప్పుడు ॥ (క) ఆగాధిసు
తుఁడు యాజకుఁ । డై గీర్వాణాధిపతుల, హవదత్తహవి । ర్భాగముఁగొనఁ
బిల్చిన వా । రాగతిరామ నుచుఁ బలికి, రంబరవీథిన్ ॥ (క) అన విని రోషము
మదిలోఁ । బెనఁగొనఁ గౌశికుఁడు కుశపవిత్రము కేలన్ । దనర స్రువ మెత్తి
(*) విశ్వామిత్రుఁడు తనతపోమహిమచేఁ ద్రిశంకుని స్వర్గమునకుఁ బంపుట. (*)—
కొని య । జ్జననాథుని తోడ ననియె, సమ్మతితోడన్ ॥ (మ) జగతీనాయకచిం
తసేయవలద, శ్రాంతంబు నే సత్యవా । క్యగరిష్ఠుండన యేని ఘోరతపము, ద్య
న్నిష్ఠఁగైకోర మా । దిగఁ గావింపుదు నేని నాకమున కీ, దేహంబుతోఁ గూ
డఁ బో । యిగరీయస్థితి నుండు వొమ్మనిన ధా, త్రీశుండు సోల్లాసుఁడై ॥ (క)
అచ్చటి మును లందఱు కర । మచ్చెరువడి సూచుచుండ, నపుండగముతోఁ । జె
చ్చెరదుర్లభమైనవి । యచ్చర లోకమునకరిగె, నద్భుతభంగిన్ ॥ (వ) ఇ
ట్లు త్రిశంకుండు దివంబుకుం జనినఁ బురందరుండు బృందారకులతోడ నాలోకిం
చి ॥ (క) చండాలుండవు నీవిం । ధుండఁగ దగదనుచు శక్రుఁ, డాగిఁ ద్రోయింపన్ ।
బెండుసెడి శిరముక్రిందై ॥ మండలపతివచ్చుచుండె, మానముదూలన్ ॥ (వ) ఇ
ట్లంతరిక్షంబున నుండి తలక్రిందుగా మహావాతపతితంబైన కల్పద్రుమంబు చం
దంబున విశ్వామిత్రా రక్షరక్షయనుచు విలాపంబునం బ్రలాపించుచు వచ్చుచు
న్న త్రిశంకుం జూచి కరుణావిధేయుండగు గాధేయుండు నిలునిలుమని పలికి తీవ్ర
రోషపరీతుండై సాక్షాత్ప్రజాపతియునుం బోలె ఋషిమధ్యంబున వెలుంగుచుఁ ద

(*) విశ్వామిత్రుఁ నకై యన్యస్వర్గంబు సృజియించుట. (*)

నతపఃప్రభావంబున ॥ (క) ఆక్షణమున నలుకసహా । స్రాక్షునితోఁ జలము మె
ఱసి యన్యస్వర్గం । బాక్షణమున సృజియించెను । దక్షుండై సకలభూతత

తివెలుఁగందన్ ॥ (తే,గీ) ఇట్లు ప్రతినాఁగ మొనరించి, యెలమిఁదార । కలను స
ప్తర్షులనువేఱె, గలుగఁజేసి । వేఱెసురలకు వజ్రికి, వేఱెవజ్రి । నపుడెగల్పింతు
ననిపల్కునంతలోన ॥ (సీ) పరమసంభ్రాంతులై సురసిద్ధచారణగరుడగంధర్వ
కి, న్నరులుమునులుఁ । గౌశికుపాలికిఁ,గడురయంబునవచ్చి సానునయోక్తినిట్ల
నుచుఁ బలికి । రనఘాత్మయీనృపుఁ డరయంగగురుశాప హతుఁడయ్యెఁగావు
న, నమరపదముఁ । బడయనర్హుఁడు గాఁడు, పరికింపకిట్లు కోపింపనీకవునెశ
మింపవయ్య ॥ (ఆ, వె) యనినగాధితనయుఁ డమరులఁజూచి యీ । నృపుని
మేనితోడఁ,ద్రిదివమునకు । నర్థిఁబంపువాఁడ,నని ప్రతిజ్ఞయొనర్చి । తింక నా
డుపలుకు, బొంకుగాదు ॥ (సీ) ఎందాఁకభూలోక,మెందాఁకమీలోక, మందాఁక
నీలోక , మందునిలిచి । కడఁగి పావకవీధి,కంటెఁ పైనుడుగక దివ్య తేజోజా
ల,దీప్తుఁడయ్యె । నంబుజారిస్ఫూర్తిఁ, నలరుచు దేవత్వగతినొప్పితలక్రిందు, గాఁ
గనీతఁ । డీతారకలఁగూడి, యెలమివాటింపుచుఁ గృతపుణ్యుఁడై భూరి కీర్తిఁ
కలితుఁ ॥ (తే, గీ) డగుచు వెలుఁగొందుఁగాకని, యమ్మునీంద్రుఁ । డానతిచ్చి
నదేవత, లట్లగానెయగుననుచుఁబలికివిశ్వామిత్రు,నభినుతించి। చనిరి యజ్ఞాం
తమందాత్మ,సదనమునకు ॥ (వ) అంతవిశ్వామిత్రుండు త్రిశంకునకు శాశ్వతం
బైన దివ్యస్థానంబొసంగి కృతకృత్యుండై యచ్చటిమహర్షులనవలోకించియి
ట్లనియె ॥ (తే,గీ) ఇమ్ములేదిందు మనకుఁద,పమ్ముసేయ। మిక్కుటంబుగవిఘ్న

(*)విశ్వామిత్రుఁడు పశ్చిమదిక్కునకరుగుట. (*)

మీ, ప్రకటఁగలిగెఁ । గానమనమింకనొండొక కడకుఁబోద । మనుచు వారల
తోఁగూడి,యచటువాసి ॥ (వ) విశాలతపోవనవతియైన పశ్చిమదిక్కునకుంజ
ని యందుఁబుష్కరతీరంబు లందుమూలఫలాశనుండై యత్యుగ్ర తపంబుఁగా
వింపుచుండెనాసమయంబున ॥ (చ)కలఁడొకఁ డిందుకుందశితి, కంఠపురందర
నాగవాహసం । కలితయశుండుసూర్యకుల, కంధిశశాంకుఁడుఁగోసలేంద్రుఁడ।
త్యలఘుఁడు నంబరీషుఁడన, నవ్విభుఁడొక్క మఖంబుసేయుచోఁ । దలకొని పాక
శాసనుఁడు, తత్పశుపుంగొనిపోయిడాఁచినన్ ॥ (క) అతనిపురోహితుఁడిట్లను।
నతనికిన్నృపనీదు దుర్ణ,యమునఁబశువొగిన్ । హృతమయ్యెన రక్షితయగు ।
క్షితివిభుహింసించునాత్మ, కృతదోషంబుల్ ॥ (క) జనవర ప్రాయశ్చిత్తం । బొ
నరింపఁగవలయునిక్క, మొగినరపశువుం । గొనితెమ్ముయజ్ఞకర్మం । బనుప



మగతిఁజెల్లుచుండు, నంతటిలోనన్ ॥ (క) నావినిమానవనాథుఁడు । గోవుల
నొకలక్ష వెంటఁ,గొనిరయముననా । నావనజనపదనగరత ।పోవనవిషయములు
నెమకి, పోవుచునొకచోన్ ॥ (క)భృగుతుంగమునకుఁ జనియ । చ్చగనచ్చటఁ
బేదయగుచు, సువ్రతనియతిం । దగియున్నఋచీకుండను। జగతీసురవర్యుఁగాం
చి, సమ్మదమొదవన్ ॥ (తే,గీ) తపము పెంపున రెండవ, తపనుమాడ్కిఁ । దన
రుమునివర్యుపదములు, తనశిరంబు । సోఁకఁబ్రణమిల్లిపూజించి, సువినయోక్తి।
నిట్లనియెఁగేలుమోడ్చిమ,హీవరుండు ॥ (వ) మహాత్మాయేనొక్క జన్నంబు సే
యుచుఁబ్రమాదంబునయాగపశువుంగోల్పడి ప్రాయశ్చిత్తంబునకుపాధ్యాయుం
డుచెప్పిన తెఱంగున నానాదేశంబులనరపశువునరయుచు నెందుఁబడయఁజాలక
నీకడకుంజను దెంచితి లక్షధేనువులనొసంగెదఁ బ్రతిగ్రహించి పశ్వర్థంబుగా
నీకొడుకులలోనొక్కనిదయచేయుమనియడిగిననతండతనికిట్లనియె ॥ (చ)మను
జవరేణ్యనీపలుకు, మంచిదినిత్యముఁబెద్దవానిపై । ఘనముగ వేడ్కసేయుదును
గావునవానినొసంగనన్ననా । తనిసతిపిన్నవాని పయిఁ, దద్దయుఁ గూర్మినొన
ర్తుఁగానఁ ద । త్తనయునొసంగనన్నఁదలి,దండ్రులమాటలకుమ్మలిఁ పుచున్ ॥
(ఆ, వె) వారిలోననడిమి,వాఁడుశునశ్శేఫుఁ । డవనివిభునకనియె, నగ్రసుతునిఁ।
దండ్రిప్రోచుఁబిన్న, తనయుజననిప్రోచు । వారలట్లునీకు,వత్తురయ్య ॥ (క) జన
యిత్రీజనకులచే । తనువిడువంబడితినేను, దగనీవెంటం । జనుదెంచెద వారల
కుం । గొనకొనివెసనిమ్ములక్ష,గోధేనువులన్ ॥ (చ) అనినధరాధినాథుఁడుర,
యంబుననట్లొనరించి తేరిపై । మునివరపుత్రునుంచుకొని, మోదమెలర్పఁగఁబు
ష్కరాశ్రమం । బునకటుపోయి యప్పటికి, మూఁడవకాలముడాయవచ్చినం।
బనివడివిశ్రమించెనర,భర్తపథశ్రమవాయనచ్చటన్ ॥ (మ) అపుడచ్చోటఁ ద
పంబుసేయుచుజితా, హంకారుఁడైయున్నలో । కపవిత్రుండపనాభతేజు నన
ఘున్,గాధేయునుద్యన్మతిన్ ।విపులశ్రేయునిబ్రహ్మతుల్యునిజగ,ద్విఖ్యాతచారిత్రుఁ

(*) శునశ్శేఫుఁడు విశ్వామిత్రుని శరణము నొందుట. (*)

జూ । చిపరోద్వేజితుఁడైనబాలుఁడు శున,శ్శేఫుండు శోకాతురుఁడై ॥(క) తన
మేనమామ గావున । ఘనముగ నేమఱల బ్రతుకఁ, గంటిననుచుఁ జ । య్యా
న మునిపదములపైఁ బడి । తనమోమున దైన్యమడరఁ, దా నిట్లనియెన్ ॥
(క) ఓతాపస వంశోత్తమ । మాతల్లియుఁ దండ్రియు నను,మఖపశువుంగా ।

భూతలనాథున కిచ్చిరి । గోతతినొకలక్షనీఁడు, గొని ముదమలరన్ ॥ (ఉ)
తల్లియుఁ దండ్రియున్ గురువు, దైవము దాతవు బాంధవవ్రజం । బుల్లమునం
దలంప జటి, లోత్తమ నాకిఁక నీవెసుమ్ము మే । నల్లుని దీనుని న్నను ద,యామ
తివై బ్రతికించి యీమహీ । వల్లభు జన్న మింక నని, వార్యముగా ఫలియిం
పఁజేయవే ॥ (సీ) అనినవిశ్వామిత్రుఁ, డతిదయాకలితుఁడై తనతనూభవుల
కం, దఱకుననియె । సుతులార పరలోక, సుఖమునకే కదా సుతులఁ గోరుట
యెల్ల, సుతులు మఱియు । జనకుని కోర్కులు, సఫలంబు సేయుట కే కదా
యిదిసర్వ, లోకధర్మ । మదిగాన మాపాలి, కిదెపరలోకంబుశరణంబు నొం
దె సీ, సత్యశాలి ॥ (తే,గీ) మీరు పుణ్యులు ధర్మావి, చారపరులు । ప్రాణ
మాత్రంబుచే నాకుఁ, బరమనిష్ఠఁ । బ్రియ మొనర్పుఁడు తండ్రికిఁ, బ్రియమొ
నర్చ । కం టెసుతులకు వేఱొక్క, ఘనత లేదు ॥ (వ) కావున మీయందొ
క్కరుండు మహీపతియాగ పశుత్వంబున కొడంబడి బాలుండగు శునశ్శేఫునిఁ
బ్రతికించి దేవతలఁ దృప్తినొందించి యంబరీషునకు యాగఫలం బొసంగి నా
వచనం బమోఘంబు సేయుండనిన మధుష్యందాదులు సాభిమానంబుగా ని
ట్లనిరి ॥ (క) తనసుతుల విడిచియన్యుని । తనయునిరక్షింప నీవు,దలఁచితి వ
దిభో । జనమందు నిందితంబగు । శునకపిశితమట్టులిపుడు, చూచెదమనఘా ॥
(క) నావిని విశ్వామిత్రుఁడు । భావంబున నుమ్మలించి, పటురోషమునన్ । దా
వాగ్నిమాడ్కి మండుచుఁ । గేవల కఠినోక్తి ననియెఁ, గెరలి సుతులకున్ ॥
(వ) నావచనం బతిక్రమించి పితృవచన భయరహితంబును ధర్మవిగర్హితం
బును దారుణంబును రోమాంచవికారంబు నైన యీవాక్యంబు పలికితిరి గా
వున మీరింక వసిష్ఠపుత్రులభంగి ముష్టికజాతులం బుట్టి శునకమాంసభక్షకులై
భూలోకంబున వేయి సంవత్సరంబులు వర్తింపుఁడని శపియించి యాతుర్యం

(శునశ్శేఫుఁడువిశ్వామిత్రప్రభావంబుననింద్రోపేంద్రులయనుగ్రహంబువడయుట.)

డైన శునశ్శేఫునకు నిరామయం బగు నట్లు మంత్రిత భస్మధూళ్యాది ప్రక్షేప
రూపంబైన రక్షఁగావించి యిట్లనియె ॥ (ఉ) ఇంపుగ నీకొసంగెద మ,హీసు
రనందన రెండుమంత్రముల్ । దెంపుననిన్ను యాజకుల, తిస్ఫుట యూపము
నందుఁ గట్టిహిం । సింపఁ గడంగునప్పుడు వి,శేషమతిన్ జపియింపుమంతఁగీ ।
ర్తింపుము శక్రముఖ్యు లరు,దెంచి కృపన్ నినుఁ గాతురత్తఱిన్ ॥ (వ) అని



పలికి యింద్రోపేంద్రదేవతాకంబులైన యద్దివ్యమంత్రంబు లుపదేశించిన బ్ర
తిగ్రహించి శునశ్శేఫుండుధీరుండై యతనిచేత ననుజ్ఞాతుండై యంబరీషుం గ
నుఁగొని మహీంద్రా యింకనిచ్చటఁ దడవుసేయనేల. శీఘ్రంబుగం జని యజ్ఞ
కర్మంబులన్నియు నిర్వర్తింపుమనిన నతని పలుకుల కలరి యంబరీషుండు
రయంబున యజ్ఞవాటంబునకుం జని యాజకానుమతంబున రక్తమాల్యాంబరా
నులేపనంబుల శునశ్శేఫుని యాగపశువుఁగా నలంకరించి పవిత్రపాశంబుల
వైష్ణవంబగు యూపంబున బంధించె నిట్లు బద్ధుండై యతండు వహ్న్యభిము
ఖుండై విశ్వామిత్రుం డుపదేశించిన దివ్యమంత్రద్వయంబు రహస్యంబుగా నచ
లనిష్ఠజపించిన స్తుతితర్పితుండై తత్క్షణం బాసహస్రాక్షుండు పరమానందం
బున నచ్చటికిం జనుదెంచి శునశ్శేఫుని బంధవిముక్తునిం జేసి దీర్ఘాయు వొ
సంగి యంబరీషునకు ద్విగుణంబుగా యాగఫలం బొసంగి నిజ నివాసంబున

(*) బ్రహ్మ విశ్వామిత్రునకు ఋషిత్వం బొసంగుట: (*)

కుం జనియె నమ్మహీవిభుండును గృతార్థుండై నిజ పురంబునకుం జనియె ॥
(తే,గీ) అంతఁగౌశికుఁ డచట స,హస్రవత్స । రంబు లత్యుగ్రతపము స,ల్పఁగ
విరించి । వచ్చి కుశికవంశజనీవు,వరఋషిత్వ । మొందితనిచెప్పి చనియెన,మం
దగతిగ ॥ (క) తనివి సనక గాధేయుం । డనిశముఁ బరమేష్ఠిఁ గూర్చి,యద్భుత
భంగిన్ । ఘననిష్ఠాతిశయంబున । సునిశితగతిఁ దపము సేయు,చుం దనరు నె
డన్ ॥ (క) సురసంప్రేషితయైయ । చ్చరమేనక యచటికర్థిఁ, జనుదెంచి మనో ।
హరవేష యగుచుఁ దగఁ బుష్కర జలముల మజ్జనంబు, సలుపుచునుండెన్ ॥
(క) ఘనుఁడు మహాతేజుండగు । మునిపతి కౌశికుఁ డతుల్య,మోహనరూపన్ ।

(*)మేనక విశ్వామిత్రు తపంబునకు విఘ్నముఁ జేయుట.(*)

ఘనమధ్యస్థితసౌదా।మినిగతిఁ దనరారు దాని,మేనకఁ గనియెన్ ॥ (క) కని దాని
తోడ నిట్లను । వనిత మదాశ్రమమునందు, వసి యింపుమిం । చిన యను
రాగంబునన । న్ననంగమోహితునిఁ బ్రోవు, మనుపమబుద్ధిన్ ॥ (వ) అని నిజా
భిప్రాయంబు తేటపడ నెఱింగించి యొప్పుల కుప్పయగు నప్పువ్వుఁబోఁడి నొ
డంబఱిచి ॥ (ఆ,వె) కేళివనములందు, గిరులందు నదులందుఁ । గొలఁకులందుఁ
గుంజ,తలములందు । నన్నెలంతఁ గూడి, యబ్దంబు లొకపది । యతను కేళిఁ
దేలె, నమితగతుల ॥ (ఉ) అంత వివేకియై కుశికు, లాగ్రణి యెంతటి మోసమ

య్యె ని। క్కాంతకతంబునఁ సకల, కల్మషముల్ వోదలెం దపోధనం। బంత
యు వీటఁబోయె దివి, జాధిపు కృత్య మెఱుంగ నక్కటా। యెంత వివేకులైన
భువి, నీశ్వరు మాయఁదలంప నేర్తురే॥ (చ) అని యిటు చింత నొంది ముని,యా
దట మేనక నింద్రు పాలి క। ట్లనిచి కడంగి కామవిజ, యం బొనరించెద నం
చుదీచికి। న్జని హిమపర్వతాంతికము, నం దగఁ గౌశికిచెంతఁ జేరి ని। ష్ఠనుదప
మాచరించెఁ బ్రకటంబుగఁ దాను సహస్రవర్షముల్॥ (వ) అమ్మహాతపంబున
కు భయంబుఁ గొని వేల్పులు మహర్షి సమేతులై బ్రహ్మకడకుం జని విశ్వామి

(*)బ్రహ్మ విశ్వామిత్రునకు మహర్షిత్వ మొసగుట.(*)

త్రునకు మహర్షిశబ్దం బొసంగుం డని ప్రార్థించిన నవ్విరించి దేవతా సమ
న్వితంబుగాఁ గౌశికుకడకుం జనుదెంచి మునీంద్రా యేనుభవత్తపంబునకు సం
తోషించితి నీకు మహర్షిశబ్దం బొసంగెదఁ జాలింపు మని పలికిన నవ్విశ్వా
మిత్రుండు విషణ్ణుండును సంతుష్టుండునుంగాక సర్వలోకేశ్వరుండైన యప్పితా
మహునకుఁ బ్రణతుండై యంజలిఁ గీలించి స్వార్జితంబులైన శుభకర్మంబుల
చేత ననసమానంబైన మహర్షిశబ్దంబు నీచేత దత్తంబయ్యె నేని యవ్వల నేను
జితేంద్రియుండనే కదాయని యడిగిన నప్పరమేష్ఠి యతని వాక్యంబు విని
మునీంద్రా వికార కారణవస్తు సన్నిధానంబునం దైన నెంతకాలంబు వికా
రంబు గలుగుచుండు నంతకాలంబు నీకు జితేంద్రియత్వసిద్ధి గలుగ నేరదు
గావున నీవు తావత్కాలపర్యంతంబు తపంబుఁ గావింపుమనిపలికి యంత
ర్ధానంబునొందె॥ (క) అట విశ్వామిత్రుఁడు ను। త్కటనిష్ఠామహిమఁ దప
ముఁ,గావింపుచు నా।దట బ్రహ్మర్షిస్థానముఁ।బటుతరముగఁ గాంతుననుచుఁ,బ్రజ్ఞా
న్వితుఁడై॥(ఉ) ఊరుపు వుచ్చక ట్లుతగ,నూర్ధ్వకరుండయి మారుతాశియై। వారక
మండు వేసవిని,వహ్నులమధ్యమునందు నిల్చి సొం।పారఁగఁ బుండువంటివలి,యం
దుజలంబుల నిల్చి వృష్టియం।దూరక మింట నిల్చి కడు,నుగ్రతపం బొనరించె ధీరతన్

(*)ఇంద్రుఁడు విశ్వామిత్రుని తపము మాన్ప రంభను నియోగించుట. (*)

(ఉ) అంత బలాంతకుండదరి,యాతని యుగ్రతపంబు మాన్పన। త్యంతరయంబు
నం గువల, యాక్షిని రంభను జీరి పల్కెనో। కాంత కుశాన్వయోత్తముని,
గాఢతపోద్ధతి మాన్చి మాకిఁకన్। సంతతసౌఖ్యసంపదలొ, సంగుము వేగమ
పొమ్ము సావధాన॥ (ఉ) అక్కలకంఠి యిట్లనియె, నక్కట వహ్నియుఁ బోలె



నుగ్రుఁడై। యుక్కున ఘోరనిష్ఠఁ దప, ముగ్ధతి సల్పెడు వాఁడు కౌశికుం।
డక్కడ నుండు నన్నుఁ గని, నంతనె యల్గి శపించుఁ గాన న। న్నక్కడికిం
బల్వదు సురాధిప నీపదమాశ్రయించెదన్॥ (చ) అన విని శక్రుఁడిట్లనియెఁ
నంగన యింత భయం బిదేల నా। పనుపున గీరశారికలు, బాలసమీరుఁడుఁ
దోడువత్తురే। ననుపమలీల మన్మథుఁ, హాయుఁడనై వెనువెంట వచ్చెదం। బ్ర
ణుతవిలాసరూప మల, రంజని తన్మనముం హరింపవే॥ (వ) అని నియోగిం
చిన నెట్టకేలకు నియ్యకొని సకలజగన్మోహనంబైన రూపంబుఁ దాల్చి॥ (చ) మల
యసమీరపుష్పశర, మాధవకోకిలకీరశారికల్। మలయుచు వెంట రాఁ గదలి
మౌనివనంబున కేగి యచ్చటన్। సొలయక లాస్యముల్ సలుపు, చుం లలి
తంబుగఁ బాట వాడుచుం। గలయఁ జరించె రంభ యల, కౌశికు ముంగల
ననేకభంగులన్॥ (చ) చిలుకలు రద్దిసేయుటయుఁ జెంగటఁ గోయిల కూయు
టల్ తరుల్। దలముగఁ బల్లవించుటయుఁ, దప్పక వెంటనె రంభ వచ్చుటల్।
గలయఁగఁ జూచి చిత్తమున, గాధికుమారుఁడు సంశయించి యా। బలరిపు
కృత్య మింత యని, భావమునం దలపోసి కోపియై॥ (చ) మెలపున శక్రుఁడం
పమును, మేనక వచ్చి కలంచి నట్ల కా। వెలయఁగ మత్తపంబునకు, విఘ్న

విశ్వామిత్రుఁడు రంభను శపించుట.

ము సేయఁగ నేఁడు వచ్చితే। పలుమఱు మోసపోవుటకు, బాలుఁడ నేయది
చెల్ల దింక నో। యలికులవేణియుండు మిట, నశ్మమవై పదివేల వర్షముల్॥
(వ) అనియిట్లు పట్టరాని కోపంబున విశ్వామిత్రుండు వేల్పువెలయాలిని దిట్టి
పదంపడి దయాళుండై తపస్స్వాధ్యాయసంపన్నుండైన వసిష్ఠువలన శాపమో
క్షణం బగు నని యనుగ్రహించిన నారంభ తత్క్షణంబ పాషాణం బయ్యె మీనకే
తనుండు భీతుండై పాఱెనంత విశ్వామిత్రుండు తనతపం బొక్కింత దఱుఁగుట
కుఁ బరమ నిర్వేదనపరుండై స్వార్జితంబైన తపంబంతయు మొదలఁ గామం
బునకుఁ బదంపడి క్రోధంబునకును సమర్పించితి నింకఁ గామక్రోధంబులు
జయించి జితేంద్రియుండనై యాహారంబు వర్జించి యూర్పుఁ బుచ్చక శరీ
రంబు శోషింపఁ జేసి తపస్సమార్జితంబైన బ్రాహ్మణ్యంబు లభించు నందాఁ
కఁ బెక్కుసంవత్సరంబు లచలనిష్ఠ ఘోరతపంబుఁ గావించెదఁ దపస్సంతప్తుం
డనైన మచ్ఛరీరావయవంబులు క్షయంబు నొందకుండుఁగాక యని యిట్లు నిష్ఠ

నంబుగాఁ బ్రతిజ్ఞఁజేసి దీక్షితుండై ॥ (ఉ) అక్కడనుండి యుత్తరాశకు, లాంబు
ధిపూర్ణశశాంకుఁ డంతఁ బ్రా । గ్దిక్కునకేగి వాసవుఁడు, కిన్కనొనర్చెడు
విఘ్నకోటికిం । జిక్కక నక్కడక్కడఁ బ్ర, సిద్ధపదంబులఁ బెక్కువర్షము ।
లెక్కలి ఘోరనిష్ఠనచ, లీకృతభక్తిఁ దపం బొనర్చెఁ బో ॥ (తే, గీ) అంత సిద్ధా

ఇంద్రుఁడు వృద్ధబ్రాహ్మణరూపుఁడై విశ్వామిత్రుకడ కరుగుట.

శ్రమంబున, కరుగుదెంచి । యందు బ్రహ్మర్షి ననిపించు, కొందు ననుచుఁ ।
దలఁచి వర్షసహస్రంబు, తపము సల్పి । తవిలి పారణసేయంగఁ, దలఁచు
నప్పుడు ॥ (వ) ఆఖండలుం డొక్క ముదిపాఱుండై చనుదెంచి సిద్ధాన్నం బొ
సంగుమని యభ్యర్థించిన నక్కౌశికుం డయ్యన్నంబొసంగిన నమ్మాయావి
ప్రుం డద్దాని నంతయు నిరవశేషంబుగా భుజించినం జూచి వెండియు విశ్వా
మిత్రుండు పూర్వప్రకారంబున మౌనంబుఁ బూని యూర్పువుచ్చక వేయిసం
వత్సరంబు లత్యుగ్రతపంబు సేసిన ॥ (ఉ) ఆముని యాదలం బొడమి, యద్భు
తధూమము లష్టదిక్కులన్ । భూమియు నాకముం బనన, భోజన లోకము
నెల్ల నిండినన్ । భూమివడంకె దిక్కరులు, మ్రొగ్గె నగంబులు గ్రుంగె దారకా ।
స్తోమము వ్రాలె దూలె రవి, తోయధు లింకెను బర్వెఁ జీకటుల్ ॥ (తే, గీ) అప్పు
డు నిస్తేజులై వేల్పు, లమరమునులుఁ । గష్టలోపహతాత్ములై, కమలయోని ।
కడకుఁ జని భక్తిఁ దత్పాద, కమలములకు । మ్రొక్కి యిట్లని రిటుకర, ములు
మొగిడ్చి ॥ (ఉ) వారిజగర్భ కౌశికుఁడు, వార్యతపం బొనరింపుచున్నవాఁ ।
డారయఁ దన్మనోరథము, నర్థి నొసంగి తపంబు మాన్పకి । ట్లూరక యున్న నీ
జగము, లొక్కటదిక్క జితత్తపోగ్నివి । స్ఫారశిఖాపరంపరల, దగ్ధములై చనుఁ
గాక దక్కునే ॥ (వ) మహాత్ముం డితఁడు కామక్రోధంబులు వర్జించి గాఢ
నిష్ఠఁ దపంబు సేయుచున్నవాఁ డతనియందు వృజినం బించుకేని లేదమ్మహాత్ము
ని తపంబునకుఁ బ్రతివిధానం బెద్దియుఁ గాన మైతి మఖిలజగత్సంక్షోభవశం
బువలన జనంబంతయుఁ గర్మానుష్ఠానశూన్యం బైయున్నది త్రైలోక్యంబు
సంక్షుభితమానసం బయ్యె మఱియు మహాద్యుతియగు నతండు సాక్షాద్వై
శ్వానరుండుం బోలె వెలుంగుచున్నవాఁడు నిజతపోవహ్నిశిఖాపరంపరల లో
కంబుల నన్నింటి నొక్కపెట్ట భస్మంబు సేయక మున్నె యనుగ్రహింపవలయు ॥
(చ) తపము ఫలించు టొండెవిత, తంబుగ ఘోరతపోగ్ని పేర్చెఁ । గృపణత



లోకజాలము ద, హించుట యొండె నటంచుఁ గ్రుద్ధుఁడై । తపమొనరింపఁ
గాఁ దొడఁగె, ధాత యతండు సురాధిపత్యమ । ట్లపుడ యొసంగు మన్న మన,
కీయక తీరదు మాటలేటికిన్ ॥ (సీ) అని విన్నవింపుడు, నమరులవాక్యంబు

బ్రహ్మ విశ్వామిత్రునికి బ్రహ్మర్షిత్వ మొసగుట.

విని పద్మభవుఁడు మ, న్నన యెలర్ప । వారెల్లఁ దనుఁగొల్వ, వరదుఁడై రాయం
చ నెక్కి కౌశికు పాలి, కేగుదెంచి । వినుము కౌశిక యింత, విపరీత తపమేల
మానుము మానుస, మ్మద మొసంగెఁ । బ్రబలతపంబున, బ్రహ్మర్షివైతివి
దీర్ఘాయువును బ్రహ్మ, తేజమేను ॥ (తే, గీ) దయ నొసంగితి నీకు భ, ద్రం
బు గలుగు । నింక సుఖలీల వలసిన, యెల్ల లోక । ములఁ జరింపు మటన్న న,
మ్మునివరుండు । మ్రొక్కి కడుభక్తిఁ గరములు, మోడ్చి పలికె ॥ (వ) దేవా
నాకు భవత్ప్రసాదంబున బ్రాహ్మణ్యంబును దీర్ఘాయువును సంప్రాప్తం బగుట
నిక్కంబేని యోంకారంబును వషట్కారంబును వేదంబులును నన్ను వరించుం
గాక యనిపలికి వెండియు నిట్లనియె ॥ (తే, గీ) బ్రాహ్మణక్షత్రవేదసం, పన్నుఁ
డైన । యల వసిష్ఠుండు బ్రహ్మర్షి, వైతివనుచుఁ । బలికెనేనియు నమ్మెదఁ, బలు
కకున్న । నమ్మఁగాఁజాల నిదియును, నాతలంపు ॥ (క) అనిపలికిన వినిద్రుహి
ణుం । డనిమిషులును బిల్వవచ్చి, యమ్మునిసత్యం । బనుపమతపోబలంబున ।
ననఘా బ్రహ్మర్షివైతి, వని పల్కుటయున్ ॥ (వ) విశ్వామిత్రుండును బర
మానందకందళిత హృదయారవిందుండై వసిష్ఠుని నానావిధపూజావిధానం
బులఁ దృప్తినొందించె నంత విరించనాదిబృందారకులు విశ్వామిత్రుని దీవించి
తత్ప్రభావంబుఁ గొనియాడుచు నిజనివాసంబులకుం జనిరి వసిష్ఠుండును విశ్వా
మిత్రునితోఁ సఖ్యంబుఁ జేసి నిజాశ్రమంబునకుం జనియె. విశ్వామిత్రుండు ప్రా
ప్తకాముండై బ్రహ్మతేజంబున దిశలు వెలింగింపుచు యథాసుఖంబుగా విహ
రించె నీవిశ్వామిత్రుండు దివ్యతపఃప్రభావవిశేషంబున బ్రహ్మర్షులలో నధికుం
డని విశ్రుతిం గన్నవాఁ డిమ్మహాత్ముండు విగ్రహవంతంబగు తపంబును వీర్యం
బునకుఁ బరాయణంబును ధర్మపరుండునని పల్కి శతానందుం డూరకున్న
నతనిపలుకులు విని రాముండును దదనుజుండును జనకాదులైన సభాసదులును
బరమానందరసపూరితహృదయులై సాధువాక్యంబుల నభినందించి విశ్వా
మిత్రునిం బూజించి రంత జనకుండు విశ్వామిత్రు నవలోకించి యిట్లనియె ॥

(క) కాకుత్స్థసహితముగ మీ । రీకరణి మదీయమఖము, నీక్షించుటక । స్తోకి
గతివచ్చినందున । నేకడు ధన్యుండ ననుగ్ర, హీతుఁడనైతిన్ ॥ (తే, గీ) తాప
సోత్తమ నీదు సం, దర్శనమున । బహువిధగుణంబులిపుడు ప్రా, ప్తంబులయ్యెఁ ।
బరఁగ మీచేత నెంతయుఁ, బాలితుండ । నైతి నిష్టార్థసంసిద్ధి, యయ్యె నేఁడు ॥
(తే, గీ) మానితంబుగఁ బరికీర్త్య, మానమైన । నీమహాతపమంతయు, నిరుప
మగతి । నేఁడు నాచేత నీరఘు, నేతచేత । నింపుసొంపార నిచట నా, లింపబ
డియె ॥ (తే, గీ) కుశికకులవర్య మీబహు, గుణము లిప్పు । డీసదస్యులచేత
ను, నింపుమీఱ । వినఁబడియె నీదు గుణములు, వీర్యబలము । లప్రమేయంబు
లు నుతింప, నలవి యగునె ॥ (చ) అనఘచరిత్ర పుట్టినది, యాదిగఁ బెక్కు
విచిత్రసత్కథల్ । వినఁబడె నెద్దియేని కడు, వేడుక నీకథ యట్లనెమ్మనం । బు
నకు నొసంగ దిశ్రుతులు, పుట్టినయందుకు నీచరిత్రము । న్వినుట ఫలంబుగా
దె పృథి, విం గడుధన్యుఁడనైతి నెంతయున్ ॥ (క) ఇనుఁడస్తగిరిసమీపం । బు
నకుం జనె నుక్తకర్మ, ముం దీర్పఁగనా । కనఘాత్మ సెల వొసంగుము । ఘన
ముగ రేపకడఁ జూడఁ, గార్ముకృపక ॥ (వ) అని పలికి పురోహితామాత్య
బంధుసహితంబుగా విశ్వామిత్రునకుం బ్రదక్షిణంబుఁ జేసి యనుజ్ఞాతుండై
యునిచిన నమ్మహర్షివరుం డచ్చటిమునులచేతఁ బూజితుండై జనకునిం బ్రశం
సించి రామలక్ష్మణసహితంబుగా నిజనివాసంబునకుం జనియె నంతఁ బ్రభాత
కాలంబున జనకుండు కృతకర్ముండై రామలక్ష్మణసహితుండైన విశ్వామిత్రుని
రావించి శాస్త్రదృష్టంబైన కర్మంబుచేత నమ్మునిపతిం బూజించి పదంపడి
రామలక్ష్మణుల నుచితసత్కారంబులఁ బ్రీతచేతస్కులం జేసి విశ్వామిత్రునవలో
కించి మహాత్మా మీరాక మాకు శుభంబయ్యె నాకెయ్యది కర్తవ్యంబు మీచేత

### జనకుండు విశ్వామిత్రునకు శివధనుర్మాహాత్మ్యంబుఁ దెల్పుట.

నాజ్ఞాపింపం దగినవాఁడఁ గావునఁ గర్తవ్యకార్యం బానతిమ్మని యడిగిన నవ్వి
శ్వామిత్రుండు జనకున కిట్లనియె ॥ (మ) ఇనవంశోత్తము లిందుసన్నిభులుధా,
త్రీశాత్మజుల్ సాధుస । జ్జనసంస్తుత్యులు మన్మథాకృతులు ఖ్యా, స్వద్వీర్యులై
యొప్పువీ । రనఘా నీగృహమందుఁ బొల్చుహరువి, ల్లాసక్తితోఁ జూడఁగా ।
నను వొందం జనుదెంచి నారు నృపవ, ర్యాదానివేమూపుమా ॥ (క) అనిన
జనకుఁ డప్పలుకులు । విని విస్మయమొంది వింటి, విధమెల్లనుగ్రా । క్కునఁ జెప్పఁ



బూని యిట్లనె । మునినాథునితోడ నప్పుడు, ముద మొదవంగన్ ॥ (తే, గీ) అన
ఘ మద్వంశకూటస్థుఁ, డైననిమికి । నాఱవతరంబువాఁడు మ, హాభుజుండు । దే
వరాతుండు గలఁడాధ, రావిభునకు । నమరులొసఁగిరి చాపంబు, న్యాసభణితి ॥
(సీ) అనఘాత్మ మును దక్షు, యాగవిధ్వంసన కాలంబునందు శం, కరుఁడు
గినిసి । విల్లు సజ్యముఁ జేసి, వేల్పుల నందఱ నటుసూచి భాగార్థ, నైన నా
కుఁ । గర మర్థి భాగంబుఁ, గల్పింపరైతిరి గాన మీయుత్తమాం, గములు దు
నిమి । వైచెద నని యిట్లు, పటురోషమునఁ బల్క విని సురలందఱు, భీతి
నొంది ॥ (తే, గీ) కరములు మొగిడ్చి ప్రార్థింప, హరుఁడుకోప । మంతయు
నువీడి సంప్రీతుఁ, డగుచుఁగరుణ । మీఱనీ చాపరత్నంబు, వారికిచ్చె । నిచ్చి
నఁ బ్రతిగ్రహించి సం, హృష్టులగుచు ॥ (క) మెచ్చుగ దేవతలందఱు । నచ్చప
డఁగ న్యాసరూప, మగు నాధనువుం । జెచ్చెరమత్పూర్వకునకు । నిచ్చిరి వా
త్సల్య మలర, నినసమతేజా ॥ (క) అదిమొదలుగ మాయింటం । గొదువ
పడక యుండఁబూజఁ, గొనుచు శుభదమై । పొదలుచునున్నది యావిలు । త్రిద
శాలయమందరక్షి, తిధరసదృశమై ॥ (సీ) కౌశిక యేను యా, గము సేయఁ
గాఁ బూని గురుబుద్ధిభూశుద్ధి, కొఱకుఁ బుడమిఁ । గడఁగి దున్నింప నా, గటి
చాలులో నద్భుతంబుగా నొక్క, ముం, దసము వొడమెఁ । దడయక దాని ము,
ద్రాభంగమొనరింప రాకానిశాకరు, రేకవోలె । జలదంబు నెడఁబాసి, జగతికి
వచ్చిన మెఱుఁగారు క్రొక్కారు, మెఱుపువోలె ॥ (తే, గీ) నొక్క కన్నియ
దోఁచె నం, దక్కజముగ । దానిఁ జేకొని యేనుసం, తస మెలర్ప । సీతయను
పేరు వెట్టి యీ, చిన్నికూన । నబ్బురంబుగఁ బెంచితి, ననుదినంబు ॥ (వ) ఇట్లు
దినదినప్రవర్ధమానయైన యక్కన్య యయోనిజ గావున వీర్యశుల్క యనం
బరఁగె నాసమయంబునఁ జారులక్షణలక్షితయు ననన్యసామాన్య లావణ్యయు
దేవతారూపిణియు వీర్యశుల్కయు నైన మత్కుమారిం బెండ్లియాడ నఘుందా
నందంబున ధరణీపురందరనందను లెందఱేనియుం జనుదెంచి తమతమబిరుదాం
కంబులు వక్కాణించి కన్యనిమ్మని యడిగిన వారల కెల్లఁ బ్రత్యుత్తరంబుగా నేని
ట్లంటి ॥ (ఉ) కన్నియ వీర్యశుల్క యటు, గావున నీఁదగ దిప్పుడూరకే । పన్న
గమన్నిశాంతమునఁ, బర్వతభంగిఁ జెలంగుచున్నయా । పన్నగరాజభూషణుని,
భవ్యశరాసన మెక్కుపెట్టినన్ । సన్నుతగాత్రి నిత్తునిది, సత్యము పల్కినవాఁడ

నెంతయుఁ॥ (వ) అనిన నమ్మహీవరులందఱు ముందుముందుగాఁ దలమిగిలి తమతమభుజాబలంబుల కొలందు లెఱుంగక బహువిధంబులఁ బోరి యవ్విల్లు నిట్టట్టుగదల్పఁజాలక ఖిన్నులవడి సిగ్గునం దలలెత్తక నిరాశులై తమతమదేశంబులకుం జని॥ (తే, గీ) తరుణి నిచ్చెద నన్నుచుఁ గో, దండ మొకటి। ఘనత నెప మిడి గారించె, మనలజనకుఁ। డత్తని నేచందమున నైన, నాజిఁ గెలిచి। యన్నె లంతను గొనివత్తె, మనుచుఁ గడఁగి॥ (మ) సకలక్ష్మావరకోటులద్భుతభుజా, సంరంభ మేపారఁగా। సకలానీకముతోడ వచ్చి విలస, చ్చాపార్యాతి కేకంబున నం। బ్రకటప్రక్రియ మత్పురీవరణము, ల్సన్నాహులై చుట్టుఁబ। ర్వికఁ ఘోరంబుగ నాక్రమించుటయు నే, వీక్షించియత్యుగ్ధతిన్॥ (క) చతురంగంబులు గొల్వఁగ। నతులితవిభవంబు మెఱయ, నాహవనిపుణో। ద్ధతి వెడలి తీవ్రబాణ। ప్రతతులఁ బరఁగించి భుజబ, లంబలరారన్॥ (వ) నానాప్రకారంబుల నొక్క సంవత్సరంబు రణంబుఁ జేసి మదీయ సాధనంబులన్నియు సంక్షయించిన భృశదుఃఖితుండనై సమాహితచిత్తంబున వేల్పులనారాధించిన వారు ప్రత్యక్షంబై చతురంగబలంబు లవిచ్చిచనిన దేవదత్తచమూసమేతుండనై క్రమ్మఱ రణంబునకుం జని బహువిధ శరపరంపరలు నిగుడించిన॥ (క) కొందఱు దెసచెడి పాఱిరి। కొందఱు మద్బాణనిహతిఁ, గూలిరి మఱియుం। గొందఱు శరణమునొందిరి। యందఱుగానిట్టు విజయ, మందితిఁగడిమిన్॥ (క) అనఘాత్మ పరమభాస్వర। మనుపమసారప్రవిష్ట, మగునాధనువున్। మునుకొని తెప్పించి యిఁకం। గనుపించెద రాఘవులకుఁ, గడుమోదమునన్॥ (క) ఆవిల్లు నీరఘూత్తముఁ। డేవిధమున నైన బలిమి, నెక్కిడ నేర్చిన్। నావరపుత్రిక నిచ్చెదఁ। బావకగగనాంబుభూమి, పవనులు గుఱిగాన్॥ (క) నావిని విశ్వామిత్రుఁడు। భూవల్లభుఁ జూచి పలుకుఁ, బొలుపుగ ధనువున్। వావిరి తెప్పించి ముదం। బావహిలం జూపుమీ నృ, పాత్మజున కొగిన్॥ (క) అనిన విని జనకుఁ డమ్ముని। యనుమతమున గంధమాలి, కార్చిత మగుత। ద్ధనువు దెప్పింపుఁడని, పనివడి మంత్రులకుఁ జెప్పఁ, బ్రాభవ మలరన్॥ (వ)

—(*) జనకుఁడు విశ్వామిత్రునకు శివధనువు దెప్పించుట. (*)—

ఇట్లాజ్ఞాపించిన వారు రయంబునఁ బురంబులోనికిం జని॥ (సీ) కమనీయసుమనః ప్రకాండసంకీర్ణమై కనకాచలముభంగిఁ, దనరుదాని। నగరాజనందినీ, నాథాంకయుక్తమై యలరజతాద్రి యట్లలరు దానిఁ। జటుల వేగోద్ధత, చక్ర



సందీప్తమై యుదయాచలము మాడ్కి, నొప్పు దాని। నసన్నుత శ్రీగంధ, సంఘుమంఘుమితమై గంధమాదన మట్లఁ, గ్రాలు దాని॥ (తే, గీ) ననుపమాయస నిర్మితం, బైన దాని। మహితగతి నొప్పుదాని నా, మందసమును। గాంచికడుదీర్ఘ దేహులై, గ్రాలు నమిత। బలురఁ బంచసహస్రవీరులను బంచి॥ (వ) వారిచేత దాని నతి ప్రయత్నంబున నెత్తించుకొనివచ్చి సురసదృశుండైన జనకుని ముంగలఁ బెట్టించి రాజేంద్ర సర్వరాజులచేతఁ బూజితంబైన యిమ్మహాకార్ముకరత్నం బానీతం బయ్యెనిదె విలోకింపుఁ డనిన నమ్మంత్రివాక్యంబులు విని జనకుండు విశ్వామిత్రునిం జూచిబద్ధాంజలియై రామలక్ష్మణులను ద్దేశించి యిట్లనియె॥ (క) మునివరమా పెద్దలచే। ననిశముఁ బూజింపఁ బడియె, నతిశయభక్తిన్। వినుఁ డీచాపము దీనిన్। మునుకొని పూరింప లేక, పోయిరి నృపతుల్॥ (వ) నరసురయక్షకింపురుష, నాగగన్ధర్వసిద్ధసాధ్యాకి। న్నరవసురప్రభాస్కరవి, తానములైనను జూడ నెక్కిడం। గరమున నంటఁగా నలవి, గాని దియ్యామహనీయచాపముం। బనివడి దీని నెక్కిడఁగ, మానవు లెంతటి వారుచూడఁగన్॥ (వ) ఇమ్మహాధనుశ్శ్రేష్ఠంబు నిట్టట్టు గదల్చుటకుఁ బూరించుటకు నారోపణంబు సేయుటకు శరంబుఁ గూర్చుటకు నాకర్షించుటకు మున్లోకంబులయందు నెవ్వండు సమర్థుండు లేఁడట్టి దానిభవద్వచన ప్రకారంబున నతిప్రయత్నంబున నిచ్చటికిం దెప్పించితి దీనిని రాజపుత్రులకుం జూపుమని పలికిన ధర్మాత్ముండగు విశ్వామిత్రుండు జనకుని వాక్యంబు విని రామునిం జూచి వత్సా ధనువు విలోకింపు మనిన నమ్మహర్షి వాక్య ప్రకారంబున నయ్యనువంశతిలకుం

(*) రాముఁడు శివధనువు భగ్నముఁ జేయుట. (*)

డు మంజూషాముద్రాదళనం బొనరించి తన్మధ్యనిక్షిప్తంబైన మహాకార్ముకంబు నవలోకించి విశ్వామిత్రున కిట్లనియె॥ (తే, గీ) మునికులోత్తమయీధనుఁ, మున్ముఖ్యమేను। గరముచే సంస్పృశించితిఁ, గడఁగి దీని। నశ్రమంబున మోపిడి, యనుపమగతి। వెస సమాకర్షణంబుఁ గా, వించువాఁడ॥ (వ) అనిపలికి విశ్వామిత్రజనకుల యనుమతంబు వడసి సభాసదు లయిన మహర్షులు మహీపతు లందఱుఁ జూచుచుండ రాముండవలీల నమ్మహాకార్ముకంబు పయి కెత్తిగొని యంబెక్కిడించి యాకర్ణపూర్ణంబుగాఁ దిగిచి విడిచిన (తే, గీ) ఆరఘుస్వామి సత్వమే, మనఁగవచ్చుఁ। బగిలి ఫెళ్ళని జగములు, పల్లవింపఁ। గరికరాహ

త్తి విఱిగిన, చెఱకు పోలె। ఘనరవంబునఁ దచ్ఛరాస, నము విఱిగె ॥ (చ) విఱిగెఁ
గులాచలంబు లట, బీఁటలు వాఱెది గంతకుడ్యముల్ । పఱి యొలువాఱె భూతల
ము, పాన్నిధులుంగలఁగెన్ వెసన్ దిశా। కరులు వడంకె భూతతతి, గం పెగు శౌన్వ
యుఁడాపి దేహదా। శరథులుఁ దక్క సర్వజన, సంఘముమూర్ఛమునింగె నత్తఱిన్॥
(ఆ,వె) అంతఁ గొంతవడికి, నమ్మహాశబ్దంబు । శాంతినొందెఁ బిదప, సభికులెల్ల।
మూర్ఛ దేరి చాల, మోదంబు నొందిరి..। జనక విభుఁడు సాధ్వ,సంబు విడిచె ॥
(క) అత్తఱి జనకక్షితినా । థోత్తముఁ, డత్యంతసమ్మ దోత్కర్షమునం । జి
త్తమిగురొత్తె నమ్ముని । సత్తమునింజూచి పలికె, సవినయుఁ డగుచున్ ॥
(క) జగతీసుర దశరథసుతుఁ । డగురాముఁడు దృష్టవీర్యుఁ, డయ్యె నితని
ధో । ర్యుగగతవీర్యము చింత్యం । బగణ్యమమితం బమోఘ, మత్యద్భుత
ము ॥ (క) జనవినుతుఁడైన రాముని । బెనిమిటిగాఁ బడసి సీత, పృథుగు
ణయుక్తిన్ । జనకకులంబున కెంతయు । ఘనతర యశమాహరింపఁ, గలదు
మహాత్మా ॥ (తే,గీ) సుగుణమండనవినువీర్య, శుల్కయనుచుఁ । బట్టినప్రతి
జ్ఞసత్యమ్మె, పరఁగ నేఁడు । ప్రాణబహుమత యగుసీత, రాఘవునకు । నిచ్చెద

(*) జనకుఁడు దశరథునియొద్దకు దూతలఁ బంపుట. (*)

భవాదృశులుసూచిమెచ్చిపొగడ॥(చ) అనఘచరిత్రశీఘ్రగతు, లైనయమాత్యు
లనయ్యయోధ్యకుం। బనిచి కుమారభద్రమును, భర్గధనుర్దళనంబు వీర్యశు
ల్కనుముదమారనిచ్చుటయుఁ, గౌశికురాకయుఁ దెల్పి పెండ్లికై। యనుపమవైభ
వున్ దశరథాధిపునిం బిలిపింతు నీయెడన్ ॥ (క) నావిని సంతోషముమది। నావిభ
వమందఁ గుశకులాధిపుఁడనునో। భూవల్లభ నీవల్లనె। కావింపుము తడవు సేయఁ, గ
వలదింకన్ ॥ (వ) అనిన నమ్మహీవల్లభుండు వికసితముఖుండై శీఘ్రంబుగ మంత్రుఁ
రావించి యొక్క కాంచన పట్టికయందు యథాక్రమంబున శుభవాచకాక్షర
బులు లిఖించి కుంకుమంబలది మంత్రుల చేతికొసంగి మీరతిత్వరగమనంబున నయో
ధ్యకుంజని దశరథునుచితభంగి సందర్శించి రామలక్ష్మణుల కుశలంబుఁ దెల్పియి
చ్చుటశుభప్రసంగంబంతయుఁ బ్రకటించి కుటుంబపరివార సమేతంబుగా నవ
హీపతిని సీతారాముల పరిణయంబునకుఁ దోడ్కొని రండు పొండని పనిచిన
(ఉ) వారుమరుజ్జవంబులగు, వాహనరాజము లెక్కి వేడుకల్ । మీఱఁ బథంబ
నన్ శుభనిమిత్తములం గనుగొంచుఁ గౌతుకం । బార దినత్రయంబునకు, ।



ద్భుతవేగముతో నయోధ్యకుం । జేరఁగఁ బోయి రాజగృహ, సీమ రయంబునఁ
జొచ్చి యచ్చటన్ ॥ (తే,గీ) కనకమంటపమునఁ బెద్ద, గద్దెయందు । నల సుధ
ర్మాసనాసీనుఁ, డగుబలారి । పగిదిఁ గొలువుండి కొడుకుల, పైనొకింత । కూ
ర్మిఁ దల పోయుచున్న కా, కుత్స్థవరుని ॥ (వ) సముచితంబుగా సందర్శించి బ
ద్ధాంజలిపుటులై మధురాక్షరవ్యక్తంబుగా నిట్లనిరి ॥ (చ) అల మిథిలేంద్రుఁ
డైన జన,కాధిపుఁ డెంతయు సంత సంబునం। బలుమఱు మంజులోక్తులభ, వ
త్కుశలంబు పురోహిత ప్రధా। నుల కుశలంబు బాంధవము,నోజ్జ సతీకుశలంబు
వహ్నికొ । శలియును సర్వమున్ దెలియ, సమ్మతితో నడిగెన్ నృపాగ్రణీ॥ (ఆ,వె)
మఱియుఁ గౌశికాను, మతిచేత నమ్మహీ । విభుఁడు చెప్పు మన్న, వృత్త మెల్ల ।
వేడ్కతోడ మీకు, విన్నవించెద మిపు । డింపు మీఱఁ జిత్త, గింపుఁ డధిప ॥(సీ)
పృథ్వీశ మత్పుత్రి, వీర్యశుల్క యటంచుఁ జెలఁగ నేను బ్రతిజ్ఞ, సేయుటయును।
జనపతులరుదెంచి, శంభుని చాపంబు మోపి డలేక వై,ముఖ్యమంది। పరఁగ ని
ర్వీర్యులై, యరుగుటయును మీకు విదితమై యున్నది, గద మహాత్మ। మానుగ న
కన్య, మద్భాగ్యవశమునఁ బరఁగఁ గౌశికు వెంట, వచ్చినట్టి ॥ (తే,గీ) భూరివి
క్రముఁ డగు భవ,త్పుత్రుచేతఁ । జాలనిర్జిత యయ్యెనా, చంద్రమౌళి । కా
ర్ముకంబు సభాసదుల్, గనుఁగొనంగఁ । గడిమి మెఱసి రాముండు భ,గ్నంబుఁ జే
సె ॥ (తే,గీ) అనఘచరిత మహాత్ముఁడై, నట్టి రామ। భద్రునకు వీర్యశుల్కయై, ప
రగు సీత। నిచ్చెదన టంచుఁ బల్కితి, నింపుతోడ। సమ్మతించి యనుజ్ఞ యొ, సంగవ
ము ॥ (వ) మహాత్మా నీవు పురోహితోపాధ్యాయ బంధు మిత్రామాత్య సహితుం
డవై కుమారుల పరిణయంబునకు శీఘ్రంబున నరుదెంచి మదీయ సమ్మదంబునకు
సార్థక్యంబు సంపాదించి కుమారకల్యాణోత్సవ సమాలోకన సంజాత పర
మానందం బనుభవింప నర్హుండవని యిట్లు జనకుండు విశ్వామిత్ర శతానందా
నుమతిస్థితుండై పలికెనని విన్నవించిన నజ్జనకామాత్యుల వచనంబు విని

(*) దశరథుఁడు కుమారకల్యాణంబును గూర్చి ప్రశంసించుట. (*)

యద్దశరథుండు పరమహర్షసహితుండై వసిష్ఠవామదేవులను దక్కిన మంత్రుల
నవలోకించి యిట్లనియె ॥ (క) మన రామలక్ష్మణులునె । మ్మనమున సంతోష మొ
దవ, మౌనిసహితులై । జనకమహీపతిసదనం । బున శోభిలుచున్నవారు, పొలు
పుగ వింటే॥ (ఉ) ఆనరనాథు నింటఁ జెలు, వారుచు వేల్పుల కైన దుస్సహం

బైన పురారిచాపము ర, యంబున రాముఁడు ద్రుంప మెచ్చి సు । శ్రీనిధి నాత్మ పుత్రికను, సీతను రామున కీఁదలంచియమ్మా । నవభర్త పెండ్లికిటు, మమ్మునుర మ్మని పంచె మంత్రులన్ ॥ (తే, గీ) అనఘచారిత్రులారఘు, హోత్ముఁడైన । యవ్వి దేహుని సంబంధ, మరయ మీకు । నభిమతం బయ్యె నేని ర, యమున నచటి । కరుగుదము కాలయాపన, మనుచితంబు ॥ (క) అన విని మంత్రులు మునివరు । లనుపమహర్షమునఁ బొంద, మనిపలికిననన । జ్జనపతిసుప్రీతుండై । యనువుగ రేపకడఁ బయన, మనిపల్కె తగన్ ॥ (క) జనకుని మంత్రుల నందఱు । ననుపమగతి సత్కరించె, నప్పుడు వార । ఘనసర్వగుణాన్వితులై । యనువుగ నారాత్రియుండి, రచ్చటఁ బ్రీతిన్ ॥ (వ) అంతఁ బ్రభాతకాలం బగుటయునద్దశరథుండు హర్షవికసితాననుండై యుపాధ్యాయ బాంధవపరివృతుండై సుమంత్రునింజూచి యప్పుడ ధనాధ్యక్షు లందఱుఁ బుష్కలంబుగా ధనంబుఁ గొని నానారత్నసమన్వితులై సుసమాహితులై యగ్రభాగంబునం జనువారుగా నియోగింపుము చతురంగబలంబును నను త్తమంబులైన యానంబులును యుగ్యంబులును సత్వరంబునుంజనునట్లు గావింపుము వసిష్ఠ వామదేవ జాబాలికశ్యప కాత్యాయన మార్కండేయ ప్రభృతిమహర్షులందఱు ముంగలం జనువారుగా విజ్ఞాపనంబుసేయుము జనకామాత్యులు వేగిరపడి పలుకుచున్నవారు గావు

**దశరథుండు ఋత్విగుపాధ్యాయసహితుఁడై మిథిలకరుగుట.**

న నింకఁ దడవుసేయుట యుక్తంబుగాదు మదీయరథం బాయితంబుసేయుమని పలికిన నతండట్లగావింప రథారూఢుండై ఋత్విగుపాధ్యాయ సహితంబుగాఁ జనియె నమ్మహీపతి వెనుకొని చతురంగ బలంబును దక్కినవారును బరమానందంబున నరిగిరి యిత్తెఱంగునంగదలి దశరథుండు నాలుగుదినంబులకు మిథిలానగరంబుఁ జేరంబోయెనంత ॥ (చ) ముదమున నవ్విదేహపతి, పుణ్యచరిత్రకుఁడైన యాజిక । ప్పెదురుగవచ్చి ప్రేమయున, హీనకుతూహల మాత్మలోపల । న్గదుర హితోపచారము లో, నర్చనబహువాక్కృతు లాచరింపుచున్ । సదమలచిత్తుఁడై కుసుమ, సన్నిభమంజుల సూక్తి నిట్లనున్ ॥ (క) జనవర మాభాగ్యంబునఁ । జనుదెంచితి వీవువీర్య, సముపార్జితనం । దనసంప్రీతిని బొందితి । వనుపమపుణ్యమున నేఁగృ, తార్థుఁడనైతిన్ ॥ (క) సురపరివృతుఁడగు శక్రుని । కరణి సమంచితమహర్షి, కలితుండైమ । ద్గురుతరపుణ్యవశంబున । నరు



దారఁగ నీవసిష్ఠుఁ, డరుదెంచెఁగృపన్ ॥ (తే, గీ) ఈమునీంద్రులఁగూడి మ, హాశవర్య । నీవు విచ్చేయు కతమున, నెగడెశుభము । విఘ్నములడంగెఁ గోర్కులు, విస్తరిల్లె । నన్వయంబది పావనం; బయ్యెనేఁడు ॥ (ఉ) తోయజమిత్రవంశజుల, తోఁదగవియ్యము గల్గెసంతతం । బాయతకీర్తి నైతి మను, జాధిప యెల్లిమహాత్రమింక నీ । రేయెడ నెల్లకార్యముల, కెంతయుఁజాలి ప్రసన్నచిత్తులై । పాయక యుండుఁడంచు నిటు, పల్కెన నయ్యజసూనుఁ డిట్లనున్ ॥ (క) అనఘ చరిత్రా దాన । మ్మనిశము దాతృ వశమనిరి యటుగావుననీ । వానరింపు మనినకార్యం । బొనరుతుస్వాతంత్ర్యమింకను న్నదెమాకున్ ॥ (క) నిర్మలకీర్తికరంబును । ధర్మిష్ఠంబైనయట్టి, దశరథువాక్యం । బర్మిలి విని జనకుఁడునృప । ధర్మవిదుఁడుమిగుల నద్భు, తమునొందెరహిన్ ॥ (ఆ, వె) అచటనున్నమాను, లందఱన్యోన్యస । మాగమంబునందు, హర్షయుక్తు । లగుచు నతిసుఖముగ, నారాత్రివసియించి । రుచితపదములందు, నొప్పమీఱ ॥ (క) మనుకులుఁడగు దశరథనృపుఁ । డనఘులనందనులఁ జూచి, హర్షంబలరన్ । జనకునిచేఁ బూజితుఁడై । ఘనమతి సుఖలీలనుండెఁ, గౌతూహలియై ॥ (వ) అంత మహాతేజుండగు జనకుండవశిష్టయాగకర్మంబు నిర్వర్తించి యారాత్రి వివాహాంగభూతంబైన యంకురార్పణాదికంబుఁ గావించి యథాసుఖంబుగా వసియించి ప్రభాతకాలంబున సమాప్తయజ్ఞక్రియుండై పురోహితుండైన శతానం

**జనకుండు దనతమ్ముండగు కుశధ్వజుని రావించుట.**

దునవలోకించియిట్లనియె ॥ (సీ) అనఘాత్మ నాతమ్ముఁ, డలకుశధ్వజుఁడతి ధార్మికుఁడు జగన్ను, తప్రభుండు । గరిమవార్యాఘల, కప్రాంతమైయొప్పు నిక్షుమతీజల, మింపుతోడఁ । గ్రోలుచుస్వర్గంబు, లీల విమానంబు కైవడి నలరుసాం, కాశ్యమందు । నలరారుచున్నవాఁ, డతఁడునా చందానఁ జెలఁగియాప్రీతి భజింప నర్హుఁ ॥ (ఆ, వె) డతఁడుయజ్ఞగోప్త, యతనివిలోకింపఁ । గౌతుకంబు చాలఁ, గలదు నాకుఁ । గానఁదగిన వారిఁ, గడువడిఁ బుత్తెంచి । పిలువనంపుమతనిఁ, బ్రెండ్లిఁజూడ ॥ (ఆ, వె) అనుచుఁబలికిప్రీతి, నప్పుడేచారుల । నతని పాలికనుప, హయములెక్కి । సత్వరమున నేగి, సముచితగతిఁగుశ । ధ్వజునిఁ గాంచి కుశల, వార్తఁ దెలిపి ॥ (ఆ, వె) ఇంద్రు నాజ్ఞ చేసు, పేంద్రునిఁ దోడ్కొని । వచ్చినట్లనంత, వైభవమున । జనకు నాజ్ఞచేఁ గు, శధ్వజుఁ దోడ్కొని ।

వచ్చి రపుడు వేగ, వంతుల గుచు॥ (క) ఘనుఁడు కుశధ్వజుఁ డీగతి । తనయా
ద్వయయుక్తుఁ డగుచుఁ, దడయక వేగం । బునవచ్చి గౌతమజునకు । జనకునకును
మ్రొక్కి వారి, సమ్మతినొకచోఁ॥ (తే, గీ) శశిరకరకాంతపీఠి నాసీనుఁ డయ్యె ।
నటసుదాముఁ డనుమంత్రి, కనియెజనకుఁ । డాజనిసుతాప్త గురుబాంధ, వా
న్వితముగఁ । ధోడుకొనిరమ్ము పొమ్ము సం, తోషమెసఁగ॥(వ)అనిపలికి ననతఁడు
రయంబున॥ (క) చని దశరథునకు నతుఁడై । జనవర మిముఁ బిల్వనంపె, జన
కుఁడు నన్నుఁ । దనయగురుమంత్రియుతముగఁ। జనుదేరఁగవలయు మీరు, సమ్మ
దమలరన్॥ (క) అన నాఁగా కనిదశరథుఁ । డనుపమసంతోషమలర, నంద
అతోడం । జని భమార్గాసనమునఁగూ । చుండనియిట్లనె జనకుతోడ, సొంపల
రారన్॥ (చ) నరవర యీవసిష్ఠముని, నాథుఁడు మత్కుల దైవతంబుగా ।
నెఱుఁగుము సర్వకృత్యముల, కీయనవక్తగురుండు దేవతా । గురునిభుఁడైన కౌశి
కునిఁ, గూడి మహర్షులసమ్మతంబునన్ । సరసత మత్కులక్రమము, సర్వ
ము మీకెఱిఁగించు నింపుగన్॥ (ఉ) నావిని యవ్వసిష్ఠముని, నాయకుఁ డాజనక

(*)వసిష్ఠుఁడు జనకునికి దశరథాన్వయక్రమం బెఱింగించుట.(*)

క్షితీశుతో । నావనజాప్తవంశవిధ, మంతయుఁ జెప్పఁగఁ బూనియిట్లను । న్భూ
వరసత్యవాక్యగుణ, భూషణవేదుక సర్వలోకసం । భావితమైనసూర్యకుల, ప
ద్ధతిఁ జెప్పెద నాలకింపుమా॥ (సీ) అవ్యక్తసంభవుం, డవ్యయుఁ డజుఁడు శాశ్వ
తుఁడు చతుర్ముఖ, బ్రహ్మవనరు । నతని మానసపుత్రుఁ, డై మరీచి జనించె
నతనికిఁ గశ్యపా, హ్వయుఁడు పుట్టె । నతఁడు సూర్యునిఁ గాంచె, నతఁడు వైవ
స్వతుఁ డను మనువునుఁ గాంచె, నమితయశుని । నాతఁ డిక్ష్వాకుమ, హారాజుఁ గాం
చె నాతఁడు కుక్షిఁ గనియె, నాతఁడు వికుక్షి॥ (తే,గీ) నతఁడు బాణునిఁ గనియె
న, య్యధిపతి యన । రణ్యుఁ డనువానిఁ గనియె నా, రాజు పృథునిఁ । గాంచె
నతఁడు త్రిశంకునిఁ, గనియె మఱియు । నాతనికి దుందుమారాఖ్యుఁ, డవతరించె
(క) అతఁడు యువనాశ్వుఁ బడసెను । నతనికి మాంధాత పుట్టె, నన్నరపతికిన్ ।
సుతుఁడై సుసంధి వాఁడమెను । నతనికి ధ్రువసంధి వాఁడమె, నవనీనాథా॥ (వ) అత
నితమ్ముండు ప్రసేనజిత్తనంబడు॥ (చ) చతురత నొప్పునట్టి ధ్రువ, సంధికి ల
న్భరతుండు పుట్టెనా । స్తుతచరితుండు గాంచె నసి, తుం డనువాని నతండు ధా
త్రిన । త్యతులవిభూతి నేలఁ గని, యాతని శత్రులు హైహయుల్మహా । గ్రత



శశిబిందులాజికిన, ఖర్వగతిం జనుదెంచి యుద్ధతిన్॥ (వ) అయ్యసితుని రణం
బునకుం జేరిన నతండు వారలతోడ నోపినకొలంది సంగ్రామంబుఁ గావించి
యల్పబలుండగుట వారలనోర్వఁజాలక పలాయితుండై మంత్రిసహితంబుగా
హిమవంతంబుఁ జేరి యందు భృగుప్రస్రవణంబున నివసించి కొంతకాలంబునకు
మృతుండయ్యె నతని పత్నులిరువురు భర్తృమరణకాలంబునకు గర్భిణులై
యుండి యందొక్కతె యొక్కదాని చూలుఁ జెఱుప గరంబుఁ బెట్టిన నక్కాళిం
ది విషవేదన సహింపంజాలక యమ్మహాపర్వతంబు మీఁదఁ దపంబుఁ గావింపుచు
న్న వాని భృగువంశశ్రేష్ఠుండైన చ్యవనుం జేరి పుత్రార్థినియై యమ్మహాత్మున
కు నమస్కరించి శరణంబు వేఁడిన॥ (చ) కరుణ దలిర్ప నమ్ముని శి, ఖామణి యత్తర
లాక్షిఁ జూచి యో । తరుణి విపక్షశిక్షకుఁడు, ధార్మికుఁ డుత్తముఁ డర్కతేజుఁడ
త్యురుతరపుణ్యుఁ డొక్కసుతుఁ, డొయ్యన నీకుదయించు నంచుఁ జె । చ్చెరఁ గ
రుణింపనత్తరుణి, శీతకరానన సంతసంబునన్॥ (క) మునినాథుని పాదంబులు ।
తనఫాలము సోఁక మ్రొక్కి, తప్పక పురికిం । జని యొక శుభలగ్నంబునఁ । గనియె
న్నందనుని నమృత, కరసమమూర్తిన్॥ (గీ) గరముతోడ నెజన్మించెఁ, గాన నతఁడు
సగరుఁ డన నొప్పె సంతతై, శ్వర్యుఁ డగుచు । నతనికి నసమంజుఁ డనఁబుట్టె, నత
నికంశు । మంతుఁ డుజనించె భుజవీర్య, వంతుఁ డగుచు॥ (క) ఆవసుధేశునకు
దిలీ । పావనినాథుండు పుట్టె, నా నృపతికి గం । గావతరణ కారణమగు । జ్యా
విభుఁడు భగీరథుండు, జనియించె నృపా॥ (క) ఆత్మానాథునకుఁ గకు । త్థ్స
త్మానాథుండు పుట్టె, సతత ప్రాలే । యత్మాధరధైర్యుండై । యాత్మాపతికుదయ
మయ్యె, నటరఘు నృపా॥ (సీ) అతనికి నగ్నివ, ర్ణాభిధుఁ డుదయించె న
తనికి శీఘ్రకుం, డవతరించె । నతనికి మరువు మ, హాత్ముఁడు జనియించె నతఁడు
ప్రశుశ్రుకు, నర్థిఁ గనియె । నంబరీషుని నాతఁ, డమితసమాఖ్యునిఁ గడు వేడ్క
నహుషునిఁ, గాంచె నతఁడు । ధన్యు యయాతి నా, తఁడు నాభాగుని నాతండు
నజుని న, య్యమలచరితుఁ॥ (తే,గీ) డీదశరథునిఁ దగఁ గాంచె, నితనికిఁ గుల । జల
ధిహరిణాంకుఁడైయుల, శంభుచాప । విదళనోచితభుజబలా, విష్టుఁడైన । రా
ముఁ డుదయించె లోకాభి, రాముఁ డగుచు॥ (వ) ఈరాముండు త్రిలోక
విఖ్యాత పౌరుషుండును ననన్యసామాన్య ప్రతాప దీపితుండును సురాసురుల
కభేద్యంబైన చంద్రమౌళిశరాసన భంగంబు సాక్షిగా నితని మహత్త్వంబు దెలి

ప్రవృత్తులఁ దెలియఁజేయ । నొకదెసఁ బాశ్చాత్త్యు లొగిఁ దమమనవుల కిది యె
కాలంబని యెచ్చరింప । నొకక్రేవఁ దగసుదీ చ్యులు కరములు మోడ్చి కరములు
గొనుమని కరము వేడ ॥ (తే, గీ) నన్యులగు కాననమహీధ్ర రాంతవాసు । లైన
మ్లేచ్ఛులుగొలువఁ దదంతరమున । దివిజపరివృతుఁడైన వాసవునిభంగి । నిండు
కొలువుండి దశరథనృపవరుండు ॥ (సీ) ఇనకులాంబుధిసోము నిందీవర శ్యాముఁ
గమనీయగుణశీలు ఘనకపోలు । సురుచిరకీర్తిని సుకుమార మూర్తిని సద్గుణ
గేహు నాజానుబాహు । రమణీయవదనుని లావణ్య సదనుని నేత్రోత్సవప్రదుని
త్యవరదు । నధికతేజోలాభు నాదిత్యరాజాభు సౌవర్ణమణిభూషు సత్యభాషు ॥
(తే, గీ) విమతవిధ్వంసనోచిత వీర్యయుతుని । భవ్యచారిత్రు నూతనదివ్య హేమ
రథగతుని నతజనమనోరథఫలదుని । రామచంద్రునిఁ గాంచె నా రాజవరుఁడు ॥
(క) కనితృప్తిఁ బొందఁడయ్యెను । మనమున ఘర్మాభితప్త మనుజులను ముదం ।
బునఁ బొదలఁ జేయు పర్జ । న్యుని క్రియ నలరారు నందనుని సుందరునిన్ ॥ (వ) మఱి
యు గంధర్వశ్రేష్ఠసుందరుం డగువాని విఖ్యాత పౌరుషుం డగువానిఁ బౌరుషోప
యుక్తసమాన సత్త్వ మహాదీర్ఘబాహుం డగువాని మహాసత్త్వుం డగువానిఁ
దదనుగుణవిశేష మత్తమాతంగ గమనుం డగువానిఁ జంద్ర కాంతాననుం డగు
వాని నత్యంతప్రియదర్శనుం డగువాని రూపౌదార్యగుణంబులచేతఁ బురుషుల
దృష్టిచిత్తాపహారకుం డగువాని తనసమీపంబునకు వచ్చుచున్న వానిఁ బ్రతిక్షణ
దర్శనంబున నవనవ ప్రేమాస్పదుం డగువాని రామభద్రుని నిర్నిమేషదృష్టి న
వలోకించి పరమానందభరితాంతఃకరణుండై యుండె నప్పుడు ॥ (క) అంత
సుమంత్రుఁడు సీతా । కాంతుని యరదంబు దిగిచి, కడువేడుక గు । ర్వంతికమున
కరుగు నతని । చెంతం జననొసలఁ గేలు, సేర్చి ముదమునన్ ॥ (చ) జన
కసుతావిభుండు నృపసత్తముఁ గన్గొను వేడ్కతో గిరీ । శనగసమాన నవ్య
ఘన, సౌధము మీఁదికి నెక్కి భక్తిచే । జనకు పదాంబుజంబులకు సాగిలి
మ్రొక్కి తదంతికంబునం । దనుపమలీల నుండె ఘటి, తాంజలియై వినయంబు
బుద్ధితోఁ గనన్ ॥ (వ) ఇవ్విధంబునం దనకు నమస్కరించి పార్శ్వభా
గంబునం గొలిచియున్న కుమారశేఖరు నవలోకించి బాహువుల నాకర్షిం
చి కొండొక సేపు గాఢాలింగనంబుఁ గావించి [illegible] దివ్యకాంచనమణిభూ
షిత రుచిరపీఠంబునం గూర్చుండ [illegible]

(అయోధ్యాకాండము.) ౧౯౩

ర్యుం డుదయంబునందు సుమేరుశైలంబునుం బోలె స్వశరీరకాంతిచేత నయ్యాసనం
బును భాసమానంబుగాఁ గావించె మఱియు నత్సభామంటపంబు వసిష్ఠదశరథాదిబ్రహ్మ
ర్షిరాజర్షులచేత భ్రాజమానంబయ్యును విశేషించి రామునిచేత విమలగ్రహన
క్షత్రశోభిత శారదాకాశంబు సంపూర్ణచంద్రునిచేతం బోలె నుద్దీపితవర్ణం బై
యుండె నిట్లు సుఖోపవిష్టుం డైన ప్రియకుమారు నవలోకించి యాదర్శతలసంస్థితుం
డైన తన్ను విలోకించి యలరు మనుజునిమాడ్కి దశరథుండు సంతోషించి మందహా
సనుందరవదనారవిందుండై కాశ్యపుండు పురందరునకుం బోలెఁ గౌస
ల్యానందనునకిట్లనియె ॥ (ఆ, వె) రామభద్ర నీవు, రమణతో ననురూప । పత్ని

## (*దశరథుఁడు శ్రీరాముని ధరణీభారంబు వహింపనియోగించుట,*)

యగు మదగ్ర, పత్నియందు । సదృశసుతుఁడవగుచు, జనియించితివి నాకు ।
సకలసద్గుణముల, సత్ప్రియుఁడవగ ॥ (తే, గీ) ధారుణీప్రజ లెల్లనీ, చేరమింపఁ ।
బడిరి కావున నింకవై, భవము మెఱయఁ । బుష్యయోగంబునం దెల్లి, పుడమికెల్ల
నాథుఁడవు గమ్ము జానకీ, నాథ నీవు ॥ (తే, గీ) ప్రకృతిచేతనె మిక్కిలి రామ నీవు ।
విమలగుణరాశివైతివి, వేఱె చెప్ప । నేటికైన ననుగృపనొక్క, హితము నీకుఁ । దె
లియఁ జెప్పెద వినుము సం, దేహముడిగి ॥ (తే, గీ) వినయమూఁది జితేంద్రియ,
వృత్తి గలిగి । యంగనాదికకామజ, వ్యసనములను । వాక్పరుషతాదికోపజవ్య
సనములను । విడువుమిది నీతి విదుఁడైన, విభుని గుణము ॥ (తే,గీ) మఱియుఁ
బ్రత్యక్షవృత్తిచే, మంత్రివరుల । నింపు సొంపార నెపుడు రం, జింపు మీవు । తక్షు
ముఖసర్వజనులఁ బ్రత్యక్షపదముఁ । జేర్పక పరోక్షవృత్తి రం, జింపు వత్స ॥ (వ)
మఱియుఁ గోష్ఠాగారాయుధాగారంబులతోఁ గూడఁ బ్రశస్తవస్తునిచయంబులు
సంపాదించి ॥ (క) పరమానురాగుఁ డై యే । పురుషుఁడు ధర నేలు నతనిఁ బొడ
గని ప్రకృతు । లకరమా మోదింతురు మది । నఱమఱలేక ధిగతామృ, తామరుల
క్రియన్ ॥ (క) కావునఁ గుమారవరయీ । భావము భావంబునందు, భద్రంబు
గసం । భావించి ప్రజలనందఱఁ । బ్రోవుము జగదేకరాజ, పూజ్యుఁడవగుచున్ ॥
(క) అనిపలుక నతనిపలుకులు । వినియచ్చటనున్న రామ, విభునాప్తులు వేఁ ।
జని కౌసల్యకుఁ జెప్పిరి । ఘనమతి రామాభిషేక, కథముదమలరన్ ॥ (క) ప్రమదా
రత్నంబగున । య్యమనానారత్న కాంచనాంబర ధేనూ । త్తమమాల్యహారము
లనె । య్యామెలపర్వఁగఁ బ్రీతిఁ దత్ప్రియాఖ్యులకొసఁగెన్ ॥ (క) అంత ధరిత్రీ

తనయా । కాంతుఁడు జనకునకు మ్రొక్కి, కాంచనరథము । త్యంత ముదంబు
న నెక్కి ని । జాంతఃపురమునకుఁజనియె, ననుచరయుతుఁడై ॥ (ఉ) పౌరులు మే
దినీవిభుఁడు, పల్కిన వాక్యములాలకించియా । ధారుణినాథు వీడ్కొనిము, దం
బున నిండ్లకుఁబోయియుండుసీ । తా రమణీవిభుండువసు, ధాధవుఁ డయ్యెడునం
చు నెంచుచున్ । సారమతి న్సురార్చనలు, సల్పిరిభక్తినిబద్ధచిత్తులై ॥ (క) అ
టదశరథ నృపరజనీ । విటుఁడు ప్రధానయుతుఁడు గుచు, వెండియు హర్షో ।
త్కటమున మంత్రంబొనరిచి । పటుమతినిశ్చయముఁజేసి,పదపడిపలికెన్ ॥ (క)
ఎల్లితగఁ బుష్యయోగం । బల్లనజలజారుణాక్షుఁ, డగుజనకసుతా । వల్లభుని
నిఖిలజగతీ । వల్లభునింజేయువాఁడ, వరమతులారా ॥ (చ) అనియిటులానతి
చ్చివిభుఁ, డాత్మగృహంబునకేగిసూతుని । న్వినమితగాత్రురాఁబనిచి, వెండియు

(*సుమంత్రుఁడు వెండియు దశరథునికడకు రాముని దోడి తెచ్చుట,*)

రామునిఁదోడి తెమ్మనీ । వనినమహాప్రసాదమని, యాతఁడురాముని దివ్యమంది
రం । బునకురయంబునంజనియె, మోమునసంతస మంకురింపఁగన్ ॥ (వ) ఇ
వ్విధంబునంజని దౌవారికులచేతఁ దనరాక నెఱింగించిపుచ్చిన నారాముండు
శంకాసమన్వితుండగుచు నతనిరయంబున రావించియిట్లనియె ॥ (క) అనఘా
త్మనీదురాకకుఁ । బనియెయ్యది యనినరాజు, పదపడిమిముఁగ । న్గొనఁదోడ్తె
మ్మనవచ్చితిఁ । బనిగలిగినఁవినఁదగున్నృపా, లునివలనన్ ॥ (క) అనవినిరా
ముఁడుగ్రమ్మఱ । జనకునిఁగనువేడ్క మదిని, సందడిపెట్ట । న్ఘనరాజభవనము
నకుం । జనియెనతఁడు వెంటనడువ, సత్వరుఁడగుచున్ ॥ (క) వచ్చినతనయు
నిఁగన్గొని । ముచ్చటపడి దశరథుండు, మోమునమోదం । బచ్చుపడఁగరుచిరా
సన । మిచ్చిహితము దోఁపఁబలికె, మృదుమధురోక్తిన్ ॥ (ఉ) మించినవే
డ్కతోజనులు, మెచ్చఁగఁబెక్కుదినంబు లుర్విజీ । వించిన కారణంబునఁ బ్ర
వృద్ధుఁడ నైతిననారతంబున । భ్యంచితభూరిదక్షిణల, నన్నవతీప్సితశతంబులుర్విఁ
గాం । వించితి సంతతం బనుభ, వించితి నీప్సితభోగభాగ్యముల్ ॥ (తే,గీ) అట్టి
సకలార్థసిద్ధుండ, నైననాకు । నిరుపమేష్టసుతుండవై, నీవుప్రీతిఁ । బుట్టితివి
గాననాచేతఁ బుత్రవర్య । దత్తమగురాజ్యముభరింపఁ, దగుదువీవు ॥ (వ) ఋజి
యునభీష్టంబులగు వీరసుఖంబులు నాచేతననుభూతంబులయ్యె యాగాధీతపుత్ర
దత్తసుఖోపభోగంబులచేత దేవర్షిపితృవిప్రాత్మ ఋణంబులవలనవిముక్తుండనై



తి నింకభవదభిషేకంబుకంటె నొండుకార్యంబెద్దియుఁ గోఱఁ దలేదు కావున నే
నెద్దిఁగఱపిన దానింగాదనక చేయవలయునని పల్కి వెండియునిట్లనియె ॥ (తే,గీ)
అనఘయిప్పుడు ధారుణీ, జనములెల్ల । నిన్నుఁబతిఁగాఁదలంపుచు, నున్నవారు।
గాన యువరాజ్యపట్టంబు, గట్టెదను భ । రింపుమా సర్వభూభార, మింపుమెఱ
య ॥ (సీ) అనఘాత్మ ఘనదారు, ణాశుభంబులు పెక్కు కలలోననిప్పుడు, కానఁ
బడియెఁ । జటులనిర్ఘాతని, స్వనమహోల్కాతతు ల్పడసాగె మత్తార ధా
మరాహు । రవిముఖదారుణ, గ్రహములచే నవష్టబ్ధయయ్యెనటంచు, సకలదై
వ । చింతకులిప్పుడు, చెప్పిరి కావున నిట్టియుత్పాతముల్పుట్టు నెల్ల ॥ (ఆ, వె) నన
నిపతికిఁజేటు, యగుఁగాని చోమితి । పెట్టరానివగపు, పుట్టునింక । నిట్టి దశల
లోన, నెద్ది పొందకమున్నె । ధారుణీభరంబుఁ, దాల్పుపుత్ర ॥ (వ) అదియునుం
గాక ॥ (క) అనఘాత్మ శరీరులనె । మ్మనములుఁదలపోయనిమిష, భంగురములు
గా । వునఁదలఁచినపనియిప్పుడె । యనుకూలముఁజేయవలెన, మంచితబుద్ధిన్ ॥
(వ) అట్లుగావున నాలస్యంబుఁజేయుట కర్జంబుగాదు నేఁడు చంద్రుండు పు
నర్వసూనక్షత్ర సహితుఁడై యున్నవాఁడెల్లి పుష్యయోగంబు నియతంబని దైవ
జ్ఞులాదేశించిరి కావుననమ్మహనీయ శుభలగ్నంబునందు సకలమహీరాజ్యంబున
కభిషిక్తునింజేసెద నేఁటిరాత్రి సీతాసమేతంబుగా దర్భప్రస్తరశాయి యగుచు
నుపవసింపు మేతాదృశశుభకార్యంబుల కనేకవిఘ్నంబులు సంభవించు నట్లు
గాకుండ నప్రమాదులగు సుహృజ్జనంబులెల్లెడలం గాచికొనియుండువారుగాని
యోగింపుమనిపలికి యద్దశరథుండుతొల్లి కేకయరాజునకు రాజ్యంబుంకువఁజేసి కై
కేయిని బెండ్లియైనవాఁ డుగావునఁ దద్వృత్తాంతంబు మనంబుననిడికొని వెండి
యు నిట్లనియె ॥ (క) భరతుఁడు గ్రమ్మఱఁ బురమున । కరుదేరక మున్నె ర
ఘువ,రా నీవు మహీ । వరుఁడవగు టొప్పుననియె । నరయుదుఁ జిత్తంబునం

(*) దశరథుఁడు భరతునిఁ గుఱించి శంకించుట. (*)

దు, ననవరతంబున్ ॥ (వ) అని యిట్లు భరతుని సాధువృత్తంబు నెఱింగియు
రామస్నేహంబువలన రాజ్యంబుకోఱకు నెట్లు తనచిత్తంబును శంకించెనట్లు భ
రతచిత్తంబును శంకించి పలికి సద్గుణయుక్తుండైన భరతునం దిట్టి శంకయుక్తం
బుగాదని పలుకునో యని యాలోచించి తత్పరిహారంబు కొఱకు మఱల నిట్లని
యె ॥ (చ) అనఘుఁడు ధర్మశీలుఁడు దయాహృదయుండు జితేంద్రియుం

ఘునై । లనరుసతండు సాధులప్రథంబు మనంబునఁ బట్టినీయెడ । ఘనతర భక్తి గౌరవముఁ, గల్గిన వాఁడగునైన నేమి యీ । మనుజులచిత్త మస్థిరము, మాటికినమ్మఁగరాదు తద్గతిన్ ॥ (తే,గీ) కుజనుల మనంబెగాక య,క్రూరజనుల।మనముచపలత్వమొందునే,యనఁగవలదు ।సత్యధర్మాభిరతులైన, జనులచిత్త।మైనకృతశోభియగు నిక్క,మనఘచరిత ॥ (వ) అని పలికి వీడుకొల్పినఁదండ్రిచేత ననుజ్ఞాతుండై రాముండు తచ్చరణంబులకుం బ్రణమిల్లి నిజనివాసంబునకుం జని యమ్మహోత్సవంబు నిజజనని కెఱింగించుఁ తలంపునఁ బదంపడి తదీయ.

(*) శ్రీరాముఁడు దశరథాభిప్రాయంబుఁ గౌసల్యకుఁ దెల్పుట. (*)

మందిరంబునకుం జనియందు ॥ (క) రాముండు గనియెఁబూజా । ధామంబునక్షౌమపటముఁ, దాలిచినియతిం । దామోదరుఁ దలఁపుచును ।ద్దామశ్రీఁగోరుచున్న,తల్లినిప్రీతిన్ ॥(వ) మఱియునంతకు మున్న చనుదెంచి యున్న సుమిత్రాసౌమిత్రి ధరిత్రీపుత్రికలం గూడి లక్ష్మణుని వలన రామాభిషేక వృత్తాంతంబు విన్నదగుట హర్షపులకిత సర్వాంగియై కనుంగవమూసి ప్రాణాయామంబునఁ బరమపురుషుండైన జనార్దనుని ధ్యానంబు సేయుచున్న తల్లినవలోకించి తచ్చరణంబులకునియమంబున నభివందనంబుఁగావించి యనిందితయగుయద్దేవికిఁ బ్రియంబుగా మధుర వాక్యంబున నిట్లనియె ॥ (తే,గీ)అంబ రాజ్యపాలనకర్మ, మందుఁ దండ్రి। చేతనేఁడు నియుక్తుడ, నైతినేను । నెల్లిపుష్యయోగమున న,హీనరాజ్య । పట్టబద్ధుఁ జేసెద నన్ని,పలికె విభుఁడు ॥ (వ) మఱియు నీరాత్రి సీతా సమేతంబుగా నుపవాసం బుండు మని ఋత్విగుపాధ్యాయసహితుండై రాజేంద్రుండు నన్ను నియోగించెంగావున నెల్లి మత్పట్టాభిషేకంబునందు సీతకేయే మంగళకర్మంబు లాచరింపం దగు నవియెల్లఁ జేయింపుండని పలికినఁ జిరకాలాభి కాంక్షితంబైన తత్ప్రియవృత్తాంతంబు విని యానందబాష్ప ధారాపూరిత లోచనయై యిట్లనియె ॥ (తే,గీ) అనఘ రామ చిరంజీవి, వగుము నీదు । రిపులు హతులైరి నీవు సు,శ్రీయుతుండ । వగుచు నాబంధుజనముల నలసుమిత్ర । బంధువులఁబ్రోవు మానంద,పరులఁజేసి ॥ (తే,గీ) వత్స నీచేత మీతండ్రి,వరగుణముల । చేతనారాధితుండయ్యె,చెలఁగెఁగాన । భవ్యనక్షత్రదినమందు, భద్రమూర్తి ।వైజనించితివి దదనా,యందునీవు ॥ (తే,గీ) రామయిబ్భంగినిక్ష్వాకు, రాజ్యలక్ష్మి । యింపుసొంపార నిన్నాశ్ర,యించెఁగాన । న



చ్యుతుని యందునేఁ జేయు, నస్తసుప్ర.। తంబు నేఁటికి మోఘమ్మె, తనరెఁ గా దె ॥ (క) అని యిట్లుజనని పలికిన । వినిరాముఁడు సంతసిల్లి వినయుతుఁ డై । తనసమ్మోల నున్నలక్ష్మణుఁ । గనుఁగొనియిట్లనియె హాస,కలితాననుఁడై ॥ (తే,గీ) అనఘ నాయంతరాత్మవై, నట్టినిన్ను । రమణతోఁ బొందె నిక్ష్వాకు రాజ్యలక్ష్మి । సంతతంబును నసుఁగూడి, సంతసమున । నింపుసొంపార ధాత్రిఁ బా,లింపుమింక ॥ (తే,గీ) అభిమతపదార్థ భోగ్యప,దార్థ రాజ్య । ఫలములను బ్రీతిభుజియింపు, మలఘుచరిత । రాజ్యమును జీవితంబును, రమణ నెపుడు । మించిభవదర్థ మాత్మఁగా,మింపుచుండు ॥ (వ) అని పలికి లక్ష్మణు మనంబుఁ గలపికొని తల్లికి నమస్కరించి సీత కనుజ్ఞ యొసంగి నిజనివాసంబునకుం జనియె నట్లు దశరథుండు వ్రతోపవాసాదికంబుఁ గావింపుమని

(*) దశరథుఁడు రామునిచే నుపవాసంబుఁ జేయింప వసిష్ఠుని నియోగించుట. (*)

రాముని నియోగించి పదంపడి వసిష్ఠు రావించియిట్లనియె ॥ (సీ) అనఘాత్మ నీపుర,యంబునఁ జనిరమాబలయశోరాజ్యలా, భంబుకొఱకు । రాముని నేఁడు భా,ర్యాయుతంబుగ నుపవాసంబుఁ జేయింప,వలయుననిన । నమ్మౌని యట్లకా, కనిబ్రాహ్మణోచితంబైనరథం బెక్కి, మానితముగ । రాముని మణిమంది,రమునకుఁ జనిమూఁడు వాకిళ్లుదాఁటిపో, వంగనతని ॥ (తే,గీ) రాకఫణిహారు లెఱిఁ గింప, రామవిభుఁడు । సత్వరంబున నమ్మునిసత్తమునకు । నెదురుగావచ్చి సంతోష, మెసఁగరథము । డించి పూజించి నుతులుగా,వించెనపుడు ॥ (వ) ఇట్లు భగవంతుండును మంత్రకోవిదుండునగు వసిష్ఠుండు రాముని చేత నవతారితుండును సత్కార సత్కృతుండునై. ప్రియార్హుండగు రామభద్రు. నవలోకించి ప్రసాదసుందర వదనారవిందుండగుచు నమందానందంబున నిట్లనియె ॥ (చ) నెనరున నీగురుండు కరు,ణించె రహీన్నహుషుండు వంశవ ।ర్ధనునియయాతిఁబోలెదగ,రాజ్యపదస్థునిఁజేయుఁగాక నె । ల్లినిఖిలరాజ్యభారమును,బ్రీతివహించెద వీవునేఁడు పా । వనగుణ పత్నితోడ నుప,వాస మొనర్పుము మంగళార్థమై ॥ (క) అని పలికి మునిప్రవరుఁడు । జనకజతోఁ గూడరామ,చంద్రుని వేగం । బున నుపవాసముఁజేయిం । చెను విధిపూర్వకముగాఁగ, సిరియుల్లసిల్లన్ ॥ (వ) ఇట్లు ధృతవ్రతుం గావించి రాముని చేత నర్చితుండై యామంత్రణంబు వడసి తదీయదివ్యసదనంబు వెలువడి మఱలరథారూఢుండై గా

జమార్గంబుఁ బట్టిచనియెఁ దదనంతరంబ ॥ (తే,గీ) అవనిజాపతి ప్రియవా
దులగు సువ్రాజ్ఞ। నములతోఁ గూడ నంతఃపురమునకరిగె । నచటవారలకం
దఱ,కాత్మనిలయ । ములకు విచ్చేయుఁ డీకనని,సెల వొసంగె ॥ అప్పుడు ॥
(క) తగ హృష్టయువతిజనయుత । మగు రామాలయము వికసి,తాంభోజము
మత్తగసత్ప్రకర యుతం। బగుకాసారంబుభంగి, నలరారెరహిఁ ॥ (వ)
ఇత్తెఱంగున నవ్వసిష్ఠుండు రాజభవనప్రఖ్యంబగు రామనివేశంబువలన నిర్గ
మించి రాజమార్గంబు విలోకించె నది మఱియు రామాభిషేక దర్శన కుతూ
హల జనసమూహంబుల చేత నభిసంవృతంబై తోలంగంద్రోయ రాకయుండెజ
నబృంధోర్మి సంఘర్షహర్ష స్వనవంతంబైన తదీయ నిస్వనంబు సాగరస్వ
నంబు భంగి నింగిఁజెలంగుచుండె నయోధ్యా పట్టణంబు సిక్త సమ్మృష్ట రథ్యా
సందర్భ వనమాలియును సముచ్ఛ్రిత గృహధ్వజంబునై చూడ్కికి వేడ్కఁ
జేయుచుండె నప్పట్టణంబునం గల స్త్రీబాలవృద్ధ జనంబు లెల్ల రామాభిషేకం
బను శుభవార్త వినిప్రజాలంకార భూతంబును సకలజనానంద వర్ధనంబు న
గు తన్మహోత్సవంబుఁగనుంగొనుతలంపున సూర్యోదయంబుఁ గోరుచుండెనిట్టి
జనసంబాధంబగు రాజమార్గంబునవలోకింపుచు నజ్జనౌఘంబును విభజింపు
చున్నవాఁడుపోలె మందగమనంబునం జని చని సితాభ్రశిఖర ప్రఖ్యంబగురాజ
ప్రాసాదం బారోహించి శక్రునిచేతబృహస్పతియునుంబోలె నద్దశరథునిచేతఁబ్ర
త్యుద్గతుండును సమర్చితుండును గల్పితాసనుండునై యతనిచేత నామంత్రణంబు
వడసి సభాసదులకుంజెప్పి నిజనివాసంబునకుంజనియె దశరథుండు నచ్చటివా
రలనెల్ల విడుదులకుంబోవంబనిచి దృప్త కంఠీరవంబు గిరికందరంబునుం బోలె
నగ్ర్యవేష ప్రమదాజనాకులంబును మహేంద్రవేశ్మప్రతిమంబునగు నిజాంతఃపు
రంబుఁబ్రవేశించి చంద్రుండు తారాగణసంకులంబగు నభంబునుం బోలె నద్ది
వ్యభవనంబు వెలుంగంజేయుచుండె నంతనిక్కడ ॥ (క) మునివరుఁడు చనినపి
మ్మట । జనకసుతావల్లభుండు స్నాతుండై నె । మ్మనమున నియతిఁ మధుసూ । ద
నునినుపాసించెనాత్మ దయితాయుతుఁడై ॥ (తే, గీ) శిరమునందు హవిష్పాత్ర
నిరవుకొల్పి । మాధవునకుఁబ్రియంబుగ మంత్రపూత । మగుఘృతంబునుబ్రజ్వలి
తాగ్నియందు । హోమమొనరించెనతులక లోకసరణి ॥ (మ) చెలువొప్ప
న్రఘునాయకుండల హవిశ్శేషంబుఁబ్రాశించి కే। వలభక్తిఁ గృహదేవసద్మమున



భాస్వన్మాత్మదర్భాసన । స్థలిపై జానకిఁగూడి శాశ్వతశుభా దార్యంబువర్తిల్ల
దో । హలనిష్ఠఁ శయనించెమాధవగుణ ధ్యానంబుఁగావింపుచున్ ॥ (వ) ఇట్లు
సుఖనిద్రఁజేసి ప్రభాతకా లంబునమేల్కని ॥ (క) వంది జనంబులు మాగధు ।
లందందయొనర్చుశ్రుతి సుఖావహమగువా । గ్బృందమువినిరఘునాథుఁడ । మం
దానందరసభరిత మానసుఁడగుచున్ ॥ (మ) విమలక్షౌమ పటంబుఁదాల్చినియ
తిన్ వేగంబెసంధ్యాదికృ । త్యములుందీర్చినితాంతభక్తియుతుఁడై యంభోధ
రాటఙ్కన్యకా । రమణుం జిత్తములోఁ దలంపుచు నతుల్గావించి భూదేవతో ।
త్తములన్ మన్ననఁజేసె భావిశుభసంధానక్రియాపేక్షచేన్ ॥ (వ) అంత ॥ (క) ధ
రణీసురకృతపుణ్యా । హరవంబును భూరి కాహళాభటిమధురో । త్కరతూర్య
ధ్వానముద । త్స్వరముప్రతిధ్వనులెసంగఁ బూర్ణంబయ్యెన్ ॥ (క) పురజనులు
రామవిభుఁడ । త్తఱిసీతాయుక్తుఁడగుచుఁ దడయక వ్రతమున్ । గురుభక్తిసల్పు
టయువిని । కరమామోదించిరధిక కౌతూహలులై ॥ (క) అంతటఁబురమునఁగ

### రామునిపట్టాభిషేకంబునకుఁ బురజనులు పట్టణమలంకరించుట.

లవా । రెంతయురామాభిషేక మేర్పడవినిత । వ్యాంతంబునబట్టణమా । ద్యం
తముగయిసేయఁదొడగి రామోదమునన్ ॥ (సీ) శీతాద్రి శిఖరోప మాతత దేవ
తా యతనంబులందునంచితనగంబు । లందుఁజైత్యములందునట్టాలకములందు
లలితశృంగాటకరథ్యలందు । శ్రీమత్కుటుంబస మృద్ధగేహములందు సౌవర్ణ
మయసర్వసభలయందు । వివిధపణ్యసమృద్ధ విడ్జనాపణములం దతులిత ధ్వజ
ములాతతపతాక ॥ (తే, గీ) లలరెగాయకులును గణికలును నటులు । నర్తకు
లుఁబురినందంద నయనహృదయ । కర్ణశర్మావహంబులు గాఁగఁబాడి । రా
డిరితదుత్సవజనిత హర్షులగుచు ॥ (వ) మఱియు రామాభిషేకార్థంబు
చనుదెంచియున్న జనంబులురమ్యచత్వర మందిరంబులఁగూడికొని యన్యోన్యం
బు రామాభిషేక కథాప్రసంగంబులుసేయుచుండిరిప్రతి గృహద్వారంబునందు
గుమిగూడి క్రీడావినోదార్థంబు విహరింపుచున్న పృథుకజనంబులును రామా
భిషేకసంయుక్తంబులగు శుభకథా సల్లాపంబులుసేయుచుండిరి యుత్సవ లక్ష్మీ
నృత్యరంగంబగు రాజమార్గంబు కృతపుష్పోపహారంబును ధూపగంధాధివా
సితంబునుంగా నాగరికులచేత రచింపంబడియె రామాభిషేక మహోత్సవంబు
పరిసమాప్తినొందకమున్నె రాత్రికాలంబువచ్చుననుశంక చేతఁ బ్రకాశ కరణా

ఖ్యంబు పురవీథులందు వృక్షాకార దీపస్తంభంబులు నిల్పిరిట్లు పురంబు స
ర్వంబునలంకరించి పురవాసులు రాముని యౌవరాజ్యాభిషేకంబుఁగోరుచుండి
రప్పుడు ॥ (ఉ) ప్రాకటభూరిచత్వరసభాభవనంబులయందుభూజనుల । మూఁ
కలుగట్టిభూవరుఁడు పుత్త్రులనాత్మనెఱింగిరామున । స్తోకమనీషనిప్పుడువసుంధ
రకుంబతిఁజేయఁబూనెనా । హా కడుసమ్మదంబని జనాధిపునిం గొనియాడి రెంత
యుఁ ॥ (తే, గీ) నేఁడుమనభాగ్యములుపండె నృపునికరుణ । మనకురక్షకుఁడు
నుజగన్మాన్యుఁడుఁగుల । దీపకుఁడుదృష్టలోకపరావరుండు । నగు రఘూత్తముఁ
డుర్వీంద్రుఁడగుటఁజేసి ॥ (తే, గీ) పండితుఁడు ధర్మవంతుండు భ్రాతృవత్స
లుండుసుస్నిగ్ధుఁడగు రాఘవుండుమిగులఁ । దనదు తమ్ములయెడఁజేర్పఁ దగిన
కరుణ । మనయెడలఁజేర్చుఁ నినుమడిననుదినంబు ॥ (తే, గీ) ఎవ్వనిప్రసాదము
నధాత్రికిప్పుడుసమభి । షిక్తుఁడగురామవిభుని వీక్షింపఁగలిగె । నట్టి పుణ్యుండు
ధర్మాత్ముఁడైనదశర । థాధిపుఁడుచిరజీవియైయలరుఁగాక ॥ (వ) అని యిట్లు
పొగడు పౌరుల ప్రశంసావచనంబులాకర్ణించి రామాభిషేకమహోత్సవవిలో
కన కౌతుకాతిరేకంబున దిక్కులనుండి చనుదెంచియున్న జానపదజనంబులుసే
యు హర్షనాదంబులు పరస్పర వచనాకర్ణనంబుగాకుండ నప్పురంబు నిండి
చెలంగె మఱియును ॥ (తే, గీ) ఆమహాధ్వనిపర్వములందుదీర్ణ । రంహుఁడ
గుకంధివిభునివిరావమట్ల । యావిసర్పత్ప్రజాసమూహంబుచేత । బంధురంబు
గనాలింపఁబడియెనపుడు ॥ (చ) సనినదమైత్రివిష్టపముచాడ్పునభాసిలునప్పురం
బుత । ఘనతరదివ్యవైభవముఁ గాంచుటకై చనుదెంచియున్నభూ । జననికరం
బుచేతఁగడు సంకులమయ్యెఁదిమింగిలాదిజం । తునివహ సంకులంబయిన తో
యధిరాడుదకంబుచాడ్పునన్ ॥ (వ) ఇప్పగిది నప్పురవరంబు సకలమహోత్స
వంబులకెల్ల నాటపట్టై యొప్పుచుండె నప్పూర్వదివసంబున దశరథుండు కొలు
వుకూటంబున నెల్లవారలువిన నెల్లి రామాభిషేకంబని ప్రకటంబుగాఁ బలికి
యంతఃపురంబునకుంజనిన యనంతరంబ కైకేయీ జ్ఞాతిదాసియునవిజ్ఞాతగృహ

పురాలంకారంబుఁజూచి మంథర యాశ్చర్యపడుట.

మాతృకయునైన మంథరయను నొక్క కుబ్జ స్వోదరపూరణార్థంబు కైకేయి
యొద్ద దాసీకృత్యంబులు సేయుచునుండుటంజేసి యాసమయంబున నది యదృ
చ్ఛచేతఁ జంద్రసంకాశంబైన ప్రాసాదంబారోహించి ప్రకీర్ణకుసుమోత్కరం



బును వరార్హధ్వజ పతాకాభిశోభితంబును బూరిత నిమ్నోన్నత ప్రదేశమా
ర్గాలంకృతంబును గృతమంగళస్నాన జనసంవృతంబును మాల్యమోదకరూ
పమంగళద్రవ్యకలితహస్త ప్రశస్తధరణీదేవతాభినాదితంబును సుధాధవళితదే
వగృహద్వార బంధురంబును వేదఘోషాభి నాదితంబును సర్వవాదిత్రని
ర్ఘోషసన్నాదితంబును సంప్రహృష్టజనాకీర్ణంబును సంతుష్టవరకరితురగం
బును సంప్రణర్దితగోవృషంబును బ్రహృష్టముదితపౌరజన సముచ్ఛ్రితధ్వజవి
రాజితంబునై యొప్పు నప్పురంబునవలోకించి పరమవిస్మయాలోడితచిత్తయై యుత్త
రంబునఁ దన్మహోత్సవశ్రవణజనిత పరమానంద రోమాంచ కంచుకిత శరీరిణి
యగుదానిఁ బాండురక్షౌమపటశోభితకటియగుదాని నభ్యాశప్రదేశ సంచారిణి
యగుదాని నొక్కధాత్రినవలోకించి ధనపరయయ్యు రామమాతయుత్తమహ
ర్షకలితయై యర్థులకుధనంబొసంగుచున్నది జనంబంతయు నతిమాత్ర
హర్షంబైకానంబడుచున్నదిమహీపతిసంప్రహృష్టుండై యేమిసేయందలంచియు
న్నవాఁడెఱింగింపుమనియడిగిననది హర్షోపచితగాత్రయైముదంబుననిట్లనియె ॥
(క) జనవిభుఁడు పుష్యయోగం । బున నెల్లి ప్రశాంతచిత్తుఁ, బుణ్యచరితు న ।
త్యనఘుజితేంద్రియురాముని । మునుకొని యువరాజుఁ జేయఁ, బూనె ముదము
నన్ ॥ (వ) అని పలికిన ॥ (శా) ఆపాపాత్మకురాలు మంథర ప్రశో, కాకల్పిత
స్వాంతయై । కోపోద్రేకమునన్ దహింపఁబడి సం, క్షోభంబునన్ దుస్సహా ।
వ్యాపారప్రతిబద్ధబుద్ధి యగుచున్, హర్మ్యంబు వే డిగ్గి శో । కాపాంగంబు
లు దీటుచుం బలికెవ, జ్రాభోక్తి న్నకైకకున్ ॥ (సీ) వనజాక్షి కడుమౌఢ్య,ము
న సమాగతమైన భయము నెఱుంగక, పవ్వళించి । నిదుర వోయెద విట్లు, ని
రుపమ ఘోర దుఃఖౌఘ నిపీడిత, నైతి నింక । నెయ్యది తెఱఁగునా, కేమిసేయు
దునంచుఁ బరితపింపవదేల, భావమందు । సౌభాగ్య మది నాకుఁ, జాలఁగల్దని
వృథా, యోగంబుచే విఱ్ఱ, వీఁగెదీవు ॥ (తే,గీ) నీదు సౌభాగ్య మంతయు, నేఁటి
తోడ । నిండువేసవి, నాఁటిథు, నీప్రవాహ । మట్లశోషించి చనెనిఁక, నైనలె
మ్ము । విభునకప్రియవైతివి, వేయు నేల ॥ (వ) అనియిట్లు పాపదర్శిని యును
దుష్టస్వభావయునగు కుబ్జ తన్నుం బదరి పలికిన నప్పలుకుల కులికిపడి విషణ్ణ
వదనయై కైకేయి తనపురోభాగంబున దీన ముఖియై దుఃఖించుచున్న మంథ
రంజూచి ప్రియసఖియెవ్వనిచేతఁ బరాభవింపఁబడితి వెఱిఁగింపు మనవుడు మ

ఘురాయమానంబగు కైకేయీవాక్యంబు వినిక్రోధసంరక్తలోచనయై మనో
వ్యథాకరంబును రామునియందు విరోధసంభవకారణంబునగు పరుషవాక్యం
బుననిట్లనియె ॥ (క) పతికౌసల్యకువశుఁడై । యతివాత్సల్యనాశ హేతు, వగు
నై దేహీ । పతినియువ రాజ్యమునకుం । బతిఁజేయఁ దలంచెనీదు, బ్రతుకేటికిఁ
కక ॥ (క) ఈవృత్తాంతము వినిముది । తావహ్నింగాల్పఁబడిన,దాని క్రియక
దుః । ఖావిలమానసయైయుట । కేవచ్చితి వేగనీకు, హితమొనరింపక ॥ (తే,గీ)
దేవినీదుఃఖమున నాకుఁ దీర్చరాని । దుఃఖమొదవుననీవుసం తోషమంద । నా
కుమితిఁజెట్టరానియా, సందమొదవు । నింద్యులకుమదిసందియ, మొందనలదు॥
(క) ధారుణిరాజకులంబున । నారయజన్మించిదశర, ధావనిపతికిక । దారవ
యిరాజధర్మ । క్రూరత్వంబెఱుఁగవేల. కువలయనేత్రా॥ (క) పలుకులు తీపు
నుధర్మశ్రముఁ । గలిగిహృదయమందుఁజాలఁ, గలుషముగ్రార్యం । బలవడఁగనా
టనుండియు । మెలఁగుక నీమగఁడు తెలియ, మిక వంచించెక ॥ (చ) జనపతి
నిష్ఫలంబయిన, సాంత్వము నీపయిఁజేర్చి యిప్పుడ । త్యనుపమరాజ్య రూపక
ను.హర్షముచేఁ ప్రథమద్వితీయనే । మ్మనమలరించెఁ గానియెడ మామనుజూచు
టకై భవత్సుతుం । బనిచిధరాసుతాపతికిఁ, బట్టముగట్టనుపక్రమించునే॥ (చ)
అతిఫ వృథాప్రసాంత్వుఁడగు, నానరనాథకులోత్తముండనా । రతమునుఖోచి
తంబయిన,రాజ్యమునందువసుంధరాత్మజా । పతినభిషిక్తుఁజేయనీక, బాంధవ
సంఘసమన్వితంబుగా । క్షితినిసజీవవయ్యాగత, జీవితవై తివి మాటలేటికిక ॥
(క) సుతునకుహితంబు నాకు । న్నతహర్షము నీకుమేలొ, నర్చు తలఁ పునీ ।
మతిఁగలిగిననభిషేకముఁ । జతురతవిఘ్నితముఁ జేయఁ జనునీకబలా ॥ (వ)జా
లాదశరథుండు నీకుఁ బతివ్యాజేశంబుచేత శత్రుండగు. ఛన్నహృదయుండగు న
తండు బుజుస్వభావవైన నీచేత సర్పశిశుపోషయిత్రిచేతంబోలె హితాచరణే
చ్ఛచేతఁ బ్రతిచ్ఛన్నాంతర్విషయంబైన సర్పంబువోలె నుత్సంగంబునందుఁ బరి
భృతుండయ్యె నుపేక్షితంబులైన శత్రుసర్పంబులచేతంబోలెఁ బాపస్వభావుం
డును వృథాసాంత్వుండును నగునద్దశరథుని చేతనిత్యసుఖోచితవైననీవుసపత్నీపు
త్రాభిషేకరూపాపకారంబు నేఁబుత్రమిత్రబంధుసహితంబుగా హతవైతివింక
నైనవివేకంబుగలిగితత్కాలోచితోపాయ విచారకుశల వుగావునశ్శీఘ్రంబున
రామాభిషేకంబునకువిఘ్నంబుఁగావించి భరతునివిన్ను నన్నుసంరక్షింపుమని ఘ



(*)రామునికిఁబట్టాభిషేకంబుజరుగుట మంథరవలనవిని కైకేయిసంతసిల్లుట(*)

లికిన వినియక్కేకయరాజపుత్రి రామాభిషేకకథాశ్రవణసంజాత పరమానం
దరసపూరితహృదయయై చంద్రరేఖాలంకృతయైన శరద్రజనియుంబోలె సభి
రామదర్శనయై యొప్పుచు. రయంబున లేచి పర్యంకమధ్యంబునం గూర్చుండి
వికసితమనోహరముఖారవిందయై కన్నుల నానందబాష్పధారలు గ్రమ్మఁజేర
సరసమణిప్రభాపటలశోభితంబైన యొక్కదివ్యాభరణంబొసంగి యిట్లనియె ॥
(క) చెలియాపరమప్రియమగు । నలజనక సుతాధినాథు, నభిషేకము సొం ।

(*)మంథరదుర్బోధనలవిని. సరిగాదనుచుఁగైకయి దానినిసమ్మతిపఱచుట. (*)

పలరంజెప్పితిదీనికిఁ । గలప్రత్యుపకారమేమిఁ, గావింతునిఁకక ॥ (వ) అనియు
త్సాహంబుదీపింపఁ బలికి వెండియు ॥ (క) ఈరాముఁడుభరతుఁడునా । కారయ
గానొక్కరూప; యటుగావుననా । భూరమణుఁ డతనిరాజ్య । శ్రీరమణునిఁజే
యుటరయఁ బ్రియమగుఁగాదే ॥ (వ) ప్రియాహక నాకీరామాభిషేక కథనం
బుకంటె నన్యంబొక్కటి యెక్కింతైననభిమతంబగు శ్రేష్ఠవాక్యంబునీచేతఁగ్రి
మ్మఅంజెప్పుటకశక్యంబైయుండునట్లు సర్వప్రియంబులకంటె నుత్తమంబైనప్రి
యంబుఁజెప్పితి వింతకంటెఁ బ్రియోత్తరంబును బారితోషికరూపంబును శ్రే
ష్ఠంబునువరణీయకంబైన వేఱొక్కవస్తువు గలదేని యారసిచెప్పుము దానినొ
సంగెద ననిననమ్మంథర యమ్మాటగీటునంబుచ్చి యద్దేవిమొసంగిన యాభరణం
బుఁబాఱవైచి దండతాడితభుజంగంబుచందంబున సక్రోధయై దుఃఖశోకంబులు

(*)మంథరయతికఠినముగాఁగైకేయికి దుర్బోధనలఁజేయుట (*)

ఫెనంగొనసిట్లనియె ॥ (తే, గీ) దారుణాపత్సముద్రమ, ధ్యస్థనైతి । ననుచునిను
నీవెఱుంగక, యపరిమాద । విషయమందిట్లు ముదముఁగా, వించెదీవు । వనిత
నీబాలిశత్వమేమనఁగవచ్చు । (తే, గీ)రామభద్రు సామ్రాజ్యసం, ప్రాప్తిరూ
ప । మగుమహావ్యసనము నొంది, వగవకిట్లు । హర్షమొందితి కానదుఃఖార్త
నగుచు । నిన్నుఁదూఱెద మదినవినీతవనుచు ॥ (మ)మగువానీకు సపత్నిపుత్రుఁ
డగురా, మస్వామిమృత్యూపముం । డగుశత్రుండుదలంపవానిదగు రాజ్యప్రా
ప్తికిన్నీవయో । పగ సాధింపక మోద మంది తిదియే, ప్రజ్ఞావిశేషంబుమెచ్చ
గునే తావకదుర్మతిత్వమున కేనా,త్మక విషాదించెదక ॥ (తే,గీ) అకటరా
జ్యసాధారణుండైన భరతు । వలన రాముని కిద్యోడు, భయముదలంచి । మి

క్కలివిషణ్ణనైతిని, మ్మెయిధరిత్రి । భీతిభీదున కోదవించు, భీతుఁడబల ॥ (వ) మఱి
యు మహేష్వాసుండగు లక్ష్మణుండు మనోవాక్కాయకర్మంబుల చేతరాము
నిం బొంది యుండు సన్నికృష్టంబైన పునర్వసునక్షత్ర జననక్రమంబుచే నైన
నుభరతునకెరాజ్యప్రాప్తియగుఁగనిష్ఠులైన లక్ష్మణశత్రుఘ్నులకురాజ్యక్రమంబు
వ్యవహితంబయ్యెలక్ష్మణశత్రుఘ్నులువ్యవహితులైనను బరతంత్రులైనను రాజ్యవిష
యంబునందభిలాషంబు రామభరతులకుం బోలెవారలకుం గలిగియుండునైనను
మొదలరామునకుఁబిదపభరతునకుఁబదంపడి లక్ష్మణశత్రుఘ్నులకురాజ్యక్రమం
బు సన్నికృష్టంబై యుండునట్లు గావునఁ బ్రథముండగు రాముండు ద్వితీయుం
డగు భరతుని హింసించుంగావున రామునివలన భయంబు భరతునకే కాక ల
క్ష్మణ శత్రుఘ్నులకుం గలుగనేర దిట్లు రాజ్యక్రమంబు భరతునకు సన్నిహితం
బైనను రాముండు మొదట నేలుట కర్హుండై యుండ భరతున కెట్లు రాజ్య
శంక గలుగు నని యంటివేని వివేకశాలియు క్షత్రచారిత్రంబునందుఁ బ్రాజ్ఞుండు
ను గాలోచిత కర్తవ్యార్థ కారియు నైనరాముని వలన నయ్యెడు భావ్యన
ర్థకారణభయంబు వలనఁ బూర్వోక్తవైశారద్యాది రహితుండైన భవత్పుత్త్రు
నుద్దేశించి పరితపింపు చున్నదాన ననియిట్లైనంగున భరతునకు రాజ్యసాధార
ణ్యంబుగ్గడించి వెండియుఁ గౌసల్యకుం గల సౌభాగ్య ప్రసంగంబునఁ గైకకు
నీర్ష్యోత్పాదనంబుఁ జేయుతలంపున నిట్లనియె ॥ (ఉ) ఎల్లి సమస్తబంధుజ
ను, లెంతయుమెచ్చఁగఁ బుష్యయోగమం । దల్లనధారుణీసురకు, లాఢ్యులచే న
భిషిక్తుఁడై మహీ । వల్లభుఁడెల్ల మ్రొక్కులిడ, వారకగద్దియనున్న జానకీ । వ
ల్లభుఁ జూచిమోదమున, వ్రాలఁగ నీసవ తేమి నోఁచెనో ॥ (తే,గీ) పగతు లె
ల్లను నిర్జింపఁ, బడిరికాన । నధికవిశ్రుతి సంప్రీతి, నలరియున్న । నీసపత్నికిదా
సివై, సేనరువుట్టఁ । బనులు సేయంగవలసె నీ, కనిశమబల ॥ (క) ఏమెల్ల ని
న్నువీడ్కొని । రామజననిఁ గొలిచియునికి, ప్రాప్తించెదగన్ । రామునకునీకు
మారుం । డోమహిళా ప్రేష్యభావ, మందఁగవలసెన్ ॥ (క) భరతుని గృహ
మున నీస్నుష । లరుదారఁగ నప్రహృష్ట, లై వర్తింపం । బరికించిరామయువతు
లు । కరమానందంబు నొందఁ, గన్గొన వలసెన్ ॥ (వ) అని యిట్లు పాపవ్య
వసాయంబునందుఁ జిత్తంబు తగులువడు నట్లు బోధించు పరిచారిక నవలోకిం
చి రాముని యందు సన్నివిష్టంబులగు సద్గుణంబు లభివర్ణింప నుపక్రమించి



(*) కైక మంథరకు రాముని సద్గుణంబులఁ జెప్పుట. (*)

కైకయిట్లనియె ॥ (మ) గురుదాంతుండు కృతజ్ఞుఁడార్తిహరుఁడ, క్రూరుండుఁ
ధర్మజ్ఞుఁడుం । గరుణోదారుఁడు సత్యవాది శుచియుం, గాకుత్స్థవంశేంద్రుఁ
డా । ధరణీజాపతి యాజికగ్రసుతుఁడై, తాఁబుట్టెఁగానన్ ధరం । బరిపాలింపఁ
నతండెయర్హుఁడుజగత్, త్ప్రఖ్యాత నీతింజెలీ ॥ (క) అనుజుల భృత్యులబంధు
ల । ననవరతముఁ దండ్రివోలె, నారసిప్రోచున్ । మనరాముఁడతని యభిషే ।
చనమునకు న్వగవఁదగునె, సకియానీకున్ ॥ (క) అవనిసుతా విభుఁడెలిన ।
యవల మహీచక్రమెల్ల, నస్మత్తనయుం । డువిదా పాలింపఁగలం । డువిచార
ము దక్కునన్ను, దూరకు మింకన్ ॥ (క) ఎడఁబడక మీఁద భరతుఁడు । పుడ
మికి తేఁడగుచు నుంట, బుద్ధిఁదలఁపకి । ప్పుడు రామాభ్యుదయమునకుఁ । బడ
తీయిప్పగిది నడలు, పడనేటికిటన్ ॥ (క) జనకతనయాకళత్రుం । డనిశము ని
జజననికంటె, నతిశయభక్తిన్ । ననుఁజేరికొలుచుఁ గావున । మన భరతునికం
టెనతఁడు, మాన్యుఁడునాకున్ ॥ (చ) అనవరతం బతండు తన, యట్లనె తమ్ము
లఁజూచుగాన న । య్యనఘునియందుఁ జెందిన మహాప్రియ మంతయు మత్కు
మారునం । దును దగఁజెందు నట్లుగఁ గడున్మదినెంచుచు నుందుదీని కై । మన
మున నింతవట్టిపలు, మాటెదఁ గుందఁగనేలదీనతన్ ॥ (వ) అని యివ్విధంబు
నం గైక తనమనంబున రాముని యందుం గల వాత్సల్యంబు తేటపడం బలికిన
నక్కుబ్జశోక శిఖిశిఖాదందహ్యమాన మానసయై నిట్టూర్పు పుచ్చి యొక్కింత
సేపూరకుండి వెండియుఁ గైక కిట్లనియె ॥ (ఆ,వె) వినుము వ్యసనశోక, విస్తీ
ర్ణమగు దుఃఖ । వనధిమగ్న నైతి, ననుచు నిన్ను । మది నెఱుంగలేవు, మా
ఖ్యానంబువలన న । నర్థదర్శినివి గ, దాలతాంగి ॥ (వ) అని యిట్లు కైక
యభిప్రాయం బనాలోచితం బని నిందించి రామ రాజ్యానంతరంబున నైన భ

(*) మంథర కైకకు నానాప్రకారంబుల బోధించుట. (*)

రతునకు రాజ్యంబులేమి తెల్లంబుగా బోధించుతలంపున నిట్లనియె ॥ (సీ) ధ
రణీశ్వరులు రాజ, తంత్రంబులును జ్యేష్ఠసుతునందె ఘటియింత్రు, రతిగుణాఢ్య ।
లై నతక్కిన వారి, యందుఁజేర్పరు రాజునకుఁ గలసుతులెల్ల, నరపతులెవ్వ । మొం
దలేరబ్బంగి, నొందినచోఁ జాలననయంబు వాటిల్లు, నగ్రపుత్రుఁ । డగు రాముఁ
డేలిక, యైనపిమ్మట వానితనయుండె భూపతి, త్వమువహించు ॥ (తే,గీ) రాజ

పంశంబువలన వ్వారకసుఖంబు । వలననత్యంత నిర్భాగ్యు,డగుచునీదు । సు
తుండు భరతుండనాథుఁడై,సొంపుసెడియ । రణ్యమునకేగఁగలడు పు,రంబువిడి
చి ॥ (ఆ,వె) కాంత నీకుమేలు, ఘటియించు తలఁపున । హితముఁ గఱపవ
చ్చు,నెఱుఁగకిట్లు । సవతిభాగ్యమందు, సంతసించెదవయా । యెంత చెనటి
వైతి,క్షేమిసేతు ॥ (తే,గీ) రాముఁ డధినాథుఁడైన నీ,రాజ్యమునకు । హానితే
కుండ నీపుత్రు,నన్యదేశ । మునకు నైన లోకాంతర,మునకు నైనఁ । బనుచుని
క్కువ మీచండ, మనుపమాంగి. ॥ (వ) దేవీ బాలుండగు భరతుని మాతుల
గృహంబునకుం బుచ్చితి విది యవివేకంబు నేఁడతండు సమీపంబున నుండెనేని
యు మహీపతికి రామభరతాదుల యందు సమాన సౌహార్దంబు సంఘటిల్లుఁ
తృణగుల్మలతాది స్థావరంబుల యందైనను నత్యంత సన్నిధానంబు వలన న
న్యోన్యసంశ్లేషరూప సుహృద్భావంబు జనించుఁ బ్రాజ్ఞులైన రామ భరతాదు
ల యందు జనించుట కేమియరిది యట్టి సన్నికర్షంబు నీచేత విఘటితం బ
య్యె లక్ష్మణుండు రామునకుంబోలె శత్రుఘ్నుండు భరతునకు వశుండై యుం
డు నతండైన సమీపంబున నున్నఁ దదీయ స్నేహంబువలన భరతుని యందు
సౌహార్దంబు గలుగునతండును బ్రస్థాపితుండయ్యె వనోద్భూత తృణకాష్ఠజీవు
లగు వ్యాధాదులచేత ఛేత్తవ్యంబగు కొండొక వృక్షంబు కంటక ప్రచుర వేత్ర
తృణలతాదులచేత సన్నికర్షంబువలన ఛేదనరూప భయంబువలన మోచితం
బగు నని వినఁబడుంగావున సన్నికర్షంబు రక్షణకారణంబై యుండు నది నీ
చేతఁ బరిహృతంబయ్యెనని పలికి వెండియుఁ గుబ్జయిట్లనియె ॥ (తే,గీ) రాఘ
వుఁడు లక్ష్మణునిఁ బ్రోచు, లక్ష్మణుండు । బ్రోచు రాముని నశ్విని, పుత్రులట్లు ।
వారిసౌభ్రాత్ర మఖిలభు,వనమునందు । నధిక విశ్రుతమైయుండు, నట్టులగుట॥
(క) సౌమిత్రిపై రఘూత్తముఁ । డేమియపాపంబు సేయఁ,డించుకయైనన్ ।
లేమా మనభరతునిఁ జెనుఁ । బాముపగిదిఁ గినుకఁ బూని,బాములఁ బెట్టున్ ॥
(వ) కావున భవత్కుమారుండు మాతుల గృహంబుననుండి వనంబునకుం జ
నుంగాక భరతుండు ధర్మంబుదప్పక పిత్ర్యంబగు రాజ్యంబుఁ బరిపాలించె నే
ని నాకుఁ బరమహితంబును నీకత్యంత హర్షంబును భవదీయజ్ఞాతుల కధికో
దయంబును సంభవించు నదియునుంగాక ॥ (తే,గీ) అతిసుఖోచితుఁ డగుభ
వత్సుతుఁడు రామ । చంద్రునకుం జూడఁ గేవల, సహజశత్రుఁ । డతఁడు సత



త సమృద్ధార్థుఁ, డగుచునుండ । నితఁడు నష్టార్థుఁడై యిట్లు,బ్రతుకుఁ డెన్వ ॥(క
వనితాంబలుసింగముచే । వనమున వెసనాక్రమింపఁ, బడినకరివిధం । బున
మునిచేఁబొందుఁవంబ । డినభరతునిఁబ్రోవుమతని, డెందంబలరన్ ॥ (మ) ఇప
మ్మున్ను విభుండు నీకువశుడై,లాలించు నాఁడీవుగ । ర్వమునం జేసిన యగ్గులన్ని
ను దాఁ బల్మాఱుచ్చింతించిగ । న్కమదిన్ డాఁచిననీసపత్నియగు నక్కౌసల్య రా
ముండురా । జ్యముఁబాలింపుచు నుండెనేనియు నినున్, సాధింపదే గ్రమ్మఱన్ ॥
(తే; గీ) రామచంద్రుండు సకలసా, మ్రాజ్యమునకు । నాయకుండయ్యె నేని సీ.
నందనునకు । నీకునీబంధుజనులక స్తోకదైన్య । వృత్తివాటిల్లునిక్కువ మిప్పు
డు॥ (క) కావునభరతునిరాజ్య । శ్రీవిభుఁగఁ బగతుఁడైన శ్రీరామునర । ణ్యావా
సునిఁగాఁదలఁపుము । భావంబుననుతుఁడునీవు బ్రతుకఁదలఁచినన్ ॥ (వ) అని బ
హుప్రకారంబుల నమ్మంథర తననేర్పుకొలంది వ్యాపాదంబునందుఁ జిత్తంబుత
గులువడునట్లుబోధించిన నక్కైకకేయియెట్టకేలకు నియ్యకొని క్రోధానలజ్వలిత
వదనయై నిట్టూర్పునిగుడించి క్రమ్మఱ నక్కుబ్జకిట్లనియె॥ (చ) అనుపమ బుద్ధి
నీకఱపి, నట్లనెరామునరణ్యభూమికిం । బనిచెదమత్కుమారునకుఁ బట్టముగట్టు
తెఱంగొనర్చెదన్ । మనమునదీనికిందగిన మంచియుపాయముఁ జూచిచెప్పుమీ ।
వనినమదిన్ ముదంబలర నప్పరిచారికవల్కెఁ గ్రమ్మఱన్ ॥ (ఉ) ఓయెలనాగ నీదు
తలఁపొప్పిదమయ్యె వసుంధరాసుతా । నాయకుఁ దుగ్రసత్వభయ దాటవియం
దుఁజరింపనీసుతుం । డాయతరాజ్యవైభవస మంచితుఁడై తనరారు నట్టిసూ ।
)మంథర కైకకు రామవివాసన భరతాభిషేచనములకుపాయంబెఱింగించుట.(
పాయముఁ జెప్పెదన్ వినుమ పారసుధీరచనాధురీణవై ॥ (వ) దేవీనీచేతబహు
ప్రకారంబుల నుచ్యమానంబైన యాత్మప్రయోజనంబు నావలన వినంగోరితివి
దీనికిందగినయుపాయంబు నీవెఱుంగక యడిగితివో యెఱింగి ప్రకటంబుగానీక
మనంబుననిడుకొని యడిగితివో. యెఱుంగరాదు నాచేతఁ బలుకంబడినదానివి
న నభిలాషంబగునేని యెఱింగించెద దానినాకర్ణించి యవ్వలవిమర్శింపుమని
పలికిన నమ్మంథరావాక్యంబువిని యక్కైకకేయిస్వాస్తీర్ణంబైన శయనంబుననుం
డి యొక్కింతలేచి మంథరకిట్లనియె ॥ (ఆ, వె) ముదిత యేయుపాయ మునమ
త్కుమారుండు । రాజ్యమధిగమించు రామభద్రుఁ । డడవికిప్పుడరుగు నట్టియు
పాయంబుఁ । జెప్పుమీవుతడవుసేయనేల॥ (క) అనిపలికిన నమ్మంథర । ఘనతర

రామాభిషేక కార్యవిఘాతం । బొనరింపుచుం గైకేయిం । గనుఁగొని యిట్లని
యెనుఁ బలుఁ గడుహర్షముననౌ ॥ (వ). దేవి తొల్లి దేవాసుర సంగ్రామంబునఁ
బురందరాదిబృందారకులు రాక్షసులకోడి పోడిమిసెడి నీమగనిం దమకుఁదోడు
పడుమని ప్రార్థించిననతండు నిన్నుం దనకు బాసటగాఁగొని రాజర్షిసమేతుం
డై దక్షిణదిశకుంజని దండకారణ్యంబుఁ బ్రవేశించి యందు వైజయంతంబను
పురంబునకధివిభుండైన తిమిధ్వజుండగు శంబరుండను మహారాక్షసుని మహా
మాయునిం దాఁకి వీఁకశరాస్త్రారభ్ఘోరంబుగాఁ బోరిపోరి ప్రొద్దు గ్రుంకినఁ దదీ
యశూలాభిసంజాతక్షత వేదనాపనోదనార్థంబు నిదురించియుండనప్పుడప్పూ
ర్వగీర్వాణులు నిశాసమయంబున సుప్తులైనవారినందఱ నానావిధ ప్రహరణం
బులఁబ్రహరించిన నక్కైదువుల తాఁకున కోర్వక దశరథుండు మేల్కని నిజస్యంద
నంబు గడప నిను సారథిఁగా నియోగించుకొని రాక్షసులతోడ దారుణ ప్రకారం
బున రణంబుఁజేసి రాక్షసప్రయుక్త శూలపట్టస ప్రాసాది సాధనంబుల నొచ్చి
నష్టచేతనుండైన నీవప్పు డద్దశరథుని రణంబునకుఁ దొలంగించి దానవ కృత్యం
బులంబడి మడియకుండ రక్షించితి పదంపడి రాక్షసులు పైనెత్తివచ్చినఁ దత్తత్ప్ర
హరణంబులం బొలియకుండఁ గాచితి విట్లు ద్వివారంబులు నీచేత రక్షితుండై
యతండు మెచ్చి వరంబులు రెండొసంగెద వేఁడుమనిన వలసినయపుడు గోరెద
నొసంగుమనవుడు నద్దశరథుండట్లయ్యెడునని నీయకొనియె నీవృత్తాంతంబు తొల్లి
యొక్కనాఁడు స్నేహబలంబున నాకుం జెప్పితివేను నాఁటనుండి మనంబున నిడు
కొని తద్వినియోగ సమయాన్వేషణంబు సేయుచుండఁ బెద్దకాలంబునకుఁ దగిన
సమయంబు దొరకొనియెఁ బదునాల్గువత్సరంబులు రామున కరణ్యవాసంబును
భరతునకు రాజ్యాభిషేకంబునుంగా నివ్వరంబు లొసంగ వలయునని మగనిబ
లాత్కరించియడిగి రామాభిషేక సంభారంబులు నివర్తింపుమట్లైన భర
తుండు ప్రజాభిప్రాయసంప్రాప్తస్నేహుండై సుస్థిరుండగు దానంజేసి నీకు వశు
లై సపత్నులెల్లఁ బనులు సేయుచుండ మాబోంట్లనెల్ల రక్షింపుచు నీశ్వరివై యుం
డెదవని సౌభాగ్యంబునం దాశాకల్పనాపూర్వకంబుగా రామవివాసంబునకుం
దగిన యుపాయంబెఱింగించి వెండియు నిట్లనియె॥ (క). చెలువంబు దక్కి బలు
వడి । మలినపటముఁగట్టి క్రోధ మందిరమునసా । మ్ములుడుల్చి నేలపైఁగ । ట్టలు
కంబడియుండుమిపుడె యధిపుఁడు వచ్చుఁ॥ (క) వచ్చినమగనిం గన్నులు । విచ్చి



ఖనుం గొనక పూర్వ విధమునఁ బ్రేమ । న్మచ్చటలాడక తగమన । సిచ్చికలయ కే
డ్చుచుండు మెంతయుఁగినుకన్ ॥ (వ) అట్లైన భర్తృపరిత్యాగరూపానర్థంబు
వాటిల్లునని తలంచి తేనివినుము॥ (క) మానినిమగనికిఁ గూర్చిన । దానవుగా ప్ర
ననతండు త్వత్కృతమందెం । తో నెనరుగలిగి ప్రజ్వలి । తానలమందైనఁ జొచ్చు
నదినిక్కమగున్ ॥ (తే, గీ) నెనరుగలవాఁడు గావున నీమగండు । నెలఁత నినుఁ
గడదానిఁగాఁ దలఁచిదారు । నోర్తుఁ గోపింపఁ జాలఁడు యుష్మదర్థ । మాస
సేయకననువుల నైనవిడుచు॥ (క) పాటలగంధిరొ వినునీ । మాటకుజవదాఁట
లేఁడు మానవపతియు । ప్పాటభవదీప్సితార్థము । వాటముగాఁ జేకురుఁ ద్రువం
బదినీకున్॥ (వ) ఇట్లలుకవొడమిన డెందంబుతో నీవు క్రోధాగారంబుఁ బ్రవే
శించి శయనించియున్న సమయంబున నీవిభుండరుదెంచి నీచిత్తంబువడయుటకు
బహురత్న సువర్ణభూషణాంబరమాల్యాదు లొసంగంజూచు మనోవిభ్రమ
కారణంబులైన యప్పదార్థంబులందాస సేయక తొల్లి దేవాసుర సంగ్రామ
సమయంబున సంప్రీతుండై యొసంగెదనన్న వరంబులిచ్చునంతకుఁ గోపంబుడిం
పకుండుమట్లైన నతండు మోహావిశేషంబున నవ్వరద్వయం బొసంగువాఁడై
కోర్కికిందగిన ప్రయోజనంబు లెఱింగింపుమని యడుగునప్పుడు నీవు భయం
బువిడిచి యమ్మహీవిభుని సత్యంబునందు సంస్థాపించి పదునాల్గువత్సరంబులు రా
మునకు వనవాసంబును భరతునకు రాజ్యాభిషేకంబును గోరు మతండివ్వరంబు
లనుమానంబు దక్క యొసంగునంతట రాముండు వనంబునకుం జనిన భరతుం
డు సామ్రాజ్యపదవిం గైకొని వశీకృతమూలబలుండై పగతులం బరిమార్చి సంగ్ర
హీతమనుష్యుండగుచు నిష్టజనంబులఁ గూడి మహీభార ధౌరేయుండై యొప్పు
నవ్వల నారాముండు చతుర్దశవత్సరంబులు వనవాసంబు సల్పి గ్రమ్మఱఁ బురం
బునకుంజనుదెంచెనేని భరతుని జయింప సామర్థ్యంబు లేమింజేసి యూరకుం
డునంతట రాముండు రాముండయ్యెడు భరతుండు చతుర్దశవర్ష వ్యతిరిక్త
పురుషాయుఃకాలంబంతయు నేకచ్ఛత్రాధిపత్యంబుగాఁ బుడమి నేలుంగావున
నెల్లభంగుల సందియంబు దక్క నిర్బంధంబున దశరథుని స్వాధీనుం గావించు
కొని రామాభిషేకంబునకు విఘ్నంబు సేయు మిదియె భరతునకుఁ బ్రాప్తకా
లంబని పలికిన నక్కుబ్జపలుకుల కలరి యక్కైకేయి యనుకూలార్థ రూపం
బునం బ్రతిబోధితమైన యయ్యనర్థంబుం బరిగ్రహించి సంతసించి వియన్మా

## (*) కైక మంథరనుశ్లాఘించుట. (*)

ర్గగతమైన కిశోరీచందంబున విరుద్ధదర్శనయై మిక్కిలి విస్మయంబు నొంది మంథరకిట్లనియె॥ (తే, గీ) బుద్ధినిశ్చయమందు నీపుడమిలోనఁ । గలుగుకుబ్జలలోన నగ్రగణ్యవైతి । వింతహితమతివనుచుని న్నెఱుఁగనైతి । నెంత శ్రేష్ఠాభిధాయినివే మృగాక్షి ॥ (క) సతతము మదర్థములయం । దతులితముగఁ గూడియుండ వటుగావునభూ । పతిపూనినకార్యంబెఱిఁ । గితినే నెఱుఁగంగనైతిఁ, గేవలజడతన్॥ (వ) ప్రియసఖి దారుణస్వభావలును వక్ర రూపిణులును దుష్టావయవ సంస్థానవిశేషసంయుక్తలునగు కుబ్జలుపెక్కండ్రుగలరు నీవు వారల సాటిసేయందగదు ప్రియదర్శనవగు నీవు పద్మంబుకరణి వాతంబుచేతనమ్రవైతివైననేమి సహజసుందరంబయిన పద్మంబు వాతంబుచేత నమ్రంబైననెట్లు నింద్యంబై యుండునట్లు సహజసౌందర్యశాలినివగు నీవు వాతోద్రేకంబువలన వక్రత్వంబునొందియు ననింద్యవైతివని పలికి వెండియునిట్లనియె॥ (తే, గీ) స్కంధపర్యంతమును నొప్పుగలిగియుభయ । పార్శ్వములనొత్తికొని యున్న ప్రబలమయిన । యురముఁగనిసిగ్గువడిసునాభోదరంబు । శాతతవహించెననఁజాల సన్నమయ్యె॥ (క) పరిపూర్ణజఘనమునులస । దురుకుచములు విమలహిమకరోపమవక్త్రం । బరుదారనీకెకలిగెను । వరవర్ణిని యెంత రూపవతివే తలఁపన్॥ (చ) ఘనరవకింకిణీకలిత కాంచియుతంబగు నీనితంబమున్ । గనక నిషంగకాహళవికాసములైనత్వదీయజంఘిక । లునిశితభంగిదీర్ఘమయి శోభిలు నీదు పదద్వయంబుకాం । చనరుచిశోభితావయవ సౌష్ఠవ మింత పొసంగునే చెలీ॥ (క) క్షౌమాంబరంబుఁదాలిచి । కామిని నీవాయతోరుకాండంబులచే । నాముం గలఁజనుబిసభ । గ్యాముపగిదిఁజూడ్కికింపుఁ గావించెదిఁకన్ ॥ (క) ఘనమాయుఁడైనశంబర । దనుజునియందుఁగల బహువిధ స్ఫుటమాయ । ల్వనజాతనేత్రనీయం । దనవరతము నొప్పు శతగుణాధికములునై॥ (తే, గీ) సకియ యేనీస్థగు ప్రదేశంబుదీర్ఘ । మగుచు రథఘోణమువలెనాయతత గలిగి । యలరునచ్చోటరాజనీ తులుమతులువి । చిత్రకుత్సితశక్తులుఁ జేరినిలిచె॥ (వ) అనియిట్లు బహుప్రకారంబులఁ గుబ్జారూపంబు కురూపంబైనను సురూపంబుగాఁ గొనియాడి తదీయవాక్యంబులు లోకగర్హితంబులని యెఱుంగక కార్యసాధకంబులనితలంచి హర్షోత్కర్షంబునఁ గైకేయి వెండియునిట్లనియె॥ (చ) తల



కొనిమత్సుతుండఖిలధారిణినేలఁగఁ గల్గెనేనియో । నెలత మహోన్నతంబయిన నీస్థగువందుసుగంధిచందనం । బలఁది సువర్ణకంచుకము నమర్చిలి నిచ్చెదనీ మొగంబునం । దిలకముదిద్దెదన్విమల దివ్యవిభూషణపఙ్క్తినిచ్చెదన్॥ (తే, గీ) పూర్ణచంద్రుని గేరునీ ముఖమునాదు । లోచనేందీవరములకు రుచులొసంగ । ధౌతకాంచనపరిధాన, ధారిణీపయి । నచ్చరవలెంజరించెద, వతివనీవు॥ (తే, గీ) నీవునాకెట్లు దాసివై, నెనరువుట్ట । సేవఁజేసెదవారీతిఁ, జెలియనీకు । సకలకుబ్జలు విమలభూషణవిభూషి । తాంగులై సేవఁగావింతు, రనుదినంబు॥ (క) అనియిటుతనుఁ గొనియాడుచుఁ । దనబుద్ధికిఁజిక్కివేది, తలశిశిఖచా । ప్పునఁదల్పముపై శయనిం । చినకైకం గాంచికుబ్జ, చెచ్చెరఁబలికెన్॥ (చ) అతివ వృథాప్రసంగమిపు, డపర

## (*) మంథరోపదేశంబునఁ గైకేయిక్రోధంబుఁబూనుట. (*)

మెశత్రుపుఁడైనరాముఁడా । తతసకలావనీభరముఁ, దాల్చినపిమ్మట నీప్రయత్నముం । గతజలసేతుబంధనము, కైవడి శూన్యనివాసదీపముం । గతియగుఁగాన నాపనుపుఁగైకొనివేగమెసేయుమిత్తఱిన్ (ఆ, వె) అనిననట్లకాక, యనికైకరయమునఁ । గుబ్జతోడఁగూడి, క్రోధగృహము । సొచ్చిమైలఁగట్టిసొమ్ములుర్వరవైచి । ధరవసించి మఱల, దానికనియె ॥ (చ) క్షితితనయావిభుండు వనసీమకుఁబోవుచునుండమత్సుతుం । డతులితపూజ్యరాజ్యవిభుఁ, డయ్యెనఁటంచలకేక యావనీ । పతికెఱిఁగింపు కానియెడఁ బ్రాణసఖీమదినుక్కదక్కినా । మృతినెఱిఁగింపుమాదశర, థేశునకాతనియుల్లమువ్బఁగన్ ॥ (వ) అనియిట్లతిక్రూరంబుగాఁ బలికిన నక్కుబ్జతన తలంపిడేరెనని మనంబునఁబ్బుచు రాముండు రాజ్యస్థుండైననీకుఁజేటు వాటిల్లుంగావున నెల్లభంగుల నతండువనంబునకుం జను నంతకు నిమ్హాఖ్యంబు విడువకుండవలయు ననియక్కైకకునొత్తిచెప్పిన నద్దేవి మహాకూరంబులగు తదీయవచశ్శిలీముఖంబుల ముహుర్ముహుర్లులితాంతరంగయగుచు హస్తంబులురంబున నిడికొని యమ్మంథరమతంబునకు బహువారంబులుకైవారంబులుసేయుచు నీతావల్లభున కరణ్యవాసంబొండెనాకు జీవితాంతంబొండె నందాకనీయలుక డింపకయుండు దాన నదియునుంగాక నిక్కార్యంబొడఁగూడునందాకభోజనమజ్జనపానశయనాదులుడిగి స్రక్చందనాదిపదార్థంబులందాసమాని దివ్యాంబరాభరణాదులం గైసేయకుండెదననినిష్ఠురంబుగాఁ బ్రతిజ్ఞఁజేసి సర్వాభరణంబులు పుడమింబడవైచి పుణ్యాంతంబు నం

దుదివంబుననుండి నేలంబడిన కిన్నరాంగన తెఱంగున ననాస్తరణ సంవృతమేది
నిపయింబడియుండె నప్పుడప్పుడంతి యుదీర్ణసంరంభతమోవృత ముఖియును
విముక్తముక్తామాల్య విభూషణయునై తారకాస్తమయసమయంబునందమశ్ఛ
న్నంబైన నభంబుననుకరించె నప్పుడకుబ్జ మణికాంచన విచిత్రంబులైన తదీ
య దివ్యాభరణంబులుకీలుడిపి యెల్లకడలంజల్లె నవినక్షత్రంబులు నభంబునుం
బోలె నచ్చటివసుంధరనుం బ్రకాశింపంజేసెనిట్లేకవేణియును విముక్తభూషణాం
బరయునై కేకయరాజపుత్రి విపరీతార్థబోధితయై యొంటినేలంబడినాగాం
గనభంగి నూర్పులు వుచ్చుచుమంథరోపదిష్ట కార్యంబుయుక్తంబనినిశ్చయిం
చి మనచేతనాలోచితంబైన సర్వంబుసమీచీనంబని మెల్లన మంథరకుం జెప్పు
చు నిజోద్యోగంబగునో కాదోయని నిశ్చయాభావంబువలన దీనయై సారెసా
రెకు నాత్మసుఖావహంబైన తన్నిశ్చయోపాయం బొక్క యూహాసార్థంబు
చింతించి నిశ్చితార్థయై భ్రుకుటిబంధోదీర్ణవదనయైయుండె నప్పుడ కుబ్జ
కైకేయీకృతకార్యనిశ్చయం బెఱింగిరససాధనాదిసిద్ధినొందినదాని తెఱంగునం

(*ద)శరథుండు కైకేయీగృహంబునకువచ్చుట. (*)

బరమప్రీతయయ్యెనంత॥ (చ) ఇనకులవార్ధిశీతకరుం డెల్లిజనుల్విన రాఘవాభి
షే। చనమని తెల్పియవ్వలను, సభ్యులవీడ్కొని తత్ప్రియప్రమో। జనముం
బ్రియార్హయైన తనచానకు గైకకుం దెల్పువేడ్కఁజ। య్యనంజనియెం దదీ
యవిపు, లాయతనంబున కాతఁడున్నతిర్ ॥ (వ) అదిమఱియును ॥ (సీ)క్రౌం
చమరాళ సా,రసనాదయుక్తంబు శుకపికశారికా, శోభితంబు। చంపకాశోకర
సాలప్రసవ గంధమిళిత లతాగృహవిలసితంబు। తపనీయరౌప్యవి, తర్దికా
లంకృత రమ్యనిశాంతవి, రాజమాన। మమృతోపమానభ, క్ష్యాన్న పానాది
కసరసపదార్థోప, సంభృతంబు ॥ (తే, గీ) నిత్యపుష్పఫలోపేత, నిఖిలతరు
వి। కాసితోద్యానసహితంబు, కనకరత్న। భూషణ విభూషితంబునై, పొసం
గనింద్రు। కాంతసదనంబు క్రియమనః, కాంతమగుచు ॥ (క) వాపీకూపంబుల
చే। నాపాండురదాంతరాజ,తాసనములచే। నేపారెడుకుబ్జలచే। దీపించెడు
దానిరుచులం,దేలెడు దానిన్ ॥ (క) కైకేయి గృహముంగనుంగొని । ప్రా
కటముగ రాహుయుక్త, పాండుఘనచ్ఛ। న్నాకాశముం జేరెడుదో। పా
కరు గతినమ్మహార్హ,సదనముం జేరెన్ ॥ (వ) ఇట్లుప్రవేశించి ॥ (ఆ,వె) కా



మబలయుతుండు, గావున సురత సు। ఖంబుం గోరి తృష్ణ, గదురశయ్య। కడ
కుంబోయి యందుం,గైకేయిం గానక। మనుజవిభుఁడు తనదు,మానసమున ॥

(*) దశరథుఁడు కైకేయిం గానక పరితపించుట. (*)

(సీ) రమణి నిత్యముమదా, గమనవేళ యెఱింగి మాల్యచందనచేల, మండన
ములం। గయిసేసి మోహనా, కారయై నారాక కెదురు సూచుచునుండు, ని
ప్పుడేల। తొల్లింటిచందానం, దొయ్యలిచూపట్టదని విషాదమునొంది, యచట
నున్న। ప్రతిహారిణిం గని, భామినియెక్కడం జెప్పుమీవన నది, చేతులెత్తి ॥
(తే,గీ) భాగమునం జేర్చిదేవర, వారిదేవి। యలుకవొడమిన డెందాన, నల్ల
క్రోధ। సదనముననొంటిం గఠినభూ, శయ్యమీఁద। దీనయయి పడియున్నది, దే
వయనిన ॥ (వ) విని యదర్శన మాత్రంబున మొదల సంప్రాప్తవిషాదుం
డై యున్న యన్నరపతి క్రోధాగారప్రవేశ శ్రవణంబువలన ద్విగుణీకృతవిషా
దుండై లుళితవ్యాకులేంద్రియుం డగుచు మెల్లనం గ్రోధాగారంబు లోనికిం జని
యందు వినిష్కృత్తయైన లతికపగిదిం బుణ్యక్షయంబు వలన స్వర్గంబుననుం
డి పుడమిం ద్రెళ్ళిన దేవత విధంబున ధరణికిం జను దెంచిన వేల్పు వెలయాలి
చందంబునం బరమోహనార్థంబు ప్రయోగింపంబడిన మాయకరణిం బరిమ్లా
నయైన పుష్పమాలిక కైవడి వాగురాదికంబుల చేత నిబద్ధయైన హరిణిపోలిక
వేఁటకాని చేత వనాంతరంబున విషదిగ్ధబాణంబున నభిహతయైన కరిణి భంగి న
సంవృతమేదినిపయిం బడియున్న దాని నతథోచితయగు దానిం బ్రాణంబులకం
టె గరీయసియగు దాని రామాభిషేకవిఘాతానుకూల సంకల్పయగు దానిం డ
రుణి యగు దానిం గైకేయినవలోకించి యపాపుండును వృద్ధుండునగుదశరథుం
డు పరమదుఃఖితుండై డాయంజని యరణ్యమధ్యంబున మహాగజంబు పూర్వోక్త
విశేషణ యుక్తయైన కరిణింబోలె స్నేహంబున నద్దేవిం బరామర్శించి కరంబుల
చేతం బరిమార్జనంబుంగావించి మదన బాణబాధితుండు గావున మిక్కిలిసం

(*)దశరథుఁడు కైకేయిని నానాప్రకారంబుల ననునయించుట. (*)

త్రస్తచేతనుండై యిట్లనియె ॥ (ఉ) ఎవ్వనిచేత భంగపడి, తేమృదుకోకిల వా
ణినీమనం। బెవ్వఁడు నొవ్వఁజేసె నబ, గేటికిం దప్పె మనోహరాంగి నీ। కివ్విధి
నాపయింగినుక, యేలజనించినదో యెఱుంగ నా। కవ్విధమంతం దెల్పఁగల, వా
కమలాయత చారులోచనా ॥ (ఉ) ముద్దులగుమ్మ నాదు ముని,ముక్కున నూ

పిఱిఁగల్గియుండ నీ । విద్దురవస్థ నొంది తపియింపుచు ధాత్రివసింప నేల నీ । ముద్దుమొగంబు పాంసుకణపూరితమైయిటులుండఁగాంచినా । కెద్ది సుఖత్వమేటిబ్రతుకేగతిఁ దాళుదు నింకఁ జెప్పుమా ॥ (క) రాకేందువదన భూతము । సోఁకెనొ శారీరరుజల, జొక్కితొ దానిన్ । వాకొనుము నాకు వేగమె । చేకొని దివ్యౌషధంబు, సేయింతునొగిన్ ॥ (మ) వనజాక్షీయటు గాకయున్నఁ బరుఁడెవ్వాఁడైన నీకప్రియం । బొనరింపంగఁదలంచెనే మఱియుఁ గోపోద్వృత్తి నెవ్వానికై । నను నీవప్రియముం ఘటింపమదిలో, నంబూని తేతెల్పుమెవ్వని శాసింపుదు నెవ్వనిన్ సుఖినిఁగా భావింతు నేనియ్యెడన్ ॥ (ఉ) మానినియిట్టులుండఁజల, మాభవదిష్టముఁ దెల్పుమెత్తెఱం । గేని యవధ్యునైన వధియించెద వధ్యునినైనఁ గాచెదం । బూని దరిద్రునైన ధనపూర్ణునిఁ జేసెద విత్తవత్తముం । డైన దరిద్రుఁడైనగచు, నట్లొనరించెద సిద్ధమితయున్ ॥ (క) జలరుహపత్రేక్షణనా । బలమును నాధనము నాదుపత్నులు నామి । త్రులు నేను నాకుఁగల బం । ధులు నీయాజ్ఞం జరింపుదుము గాదె రహిన్ ॥ (ఆ,వె) బిసరుహాక్షి నీ యభిప్రాయమింతైనఁ । గాదనంగ రాదు, గాననాదు । జీవితానిలంబు, చేనైననొకటెద్ది । గలిగనేని దానిఁ, దెలియఁజెపుమా ॥ (తే,గీ) రమణి నీమీఁదఁ గల యనురాగబలము । నెఱిఁగియును మది శంకించుటిది యుచితమె । జలజనేత్ర మత్సుకృతంబు, సాక్షిగాఁగఁ । జెలఁగి నీకోర్కెఁ దీర్చెదఁ, జెప్పు మిపుడు ॥ (మ) జలజాక్షీ సకలాబ్ధిముద్రితధరాచక్రంబు నాయాజ్ఞలో । మెలఁగున్వంగ కళింగ మత్స్యకురు కాశ్మీరాది దేశాధినా । థులు నాకున్వశులై చరింతు రతిచే, తోభీతినచ్చోటులం । గల వస్తుప్రకరంబులెవ్వి యయినం, గామించినం దెల్పవే ॥ (వ) దేవి నాయందుం గల సామర్థ్యంబును నీపయింగల ప్రేమాతిశయంబును విచారించిన భవన్మనోరథంబు సిద్ధించుటకు సందియంబులేదు ప్రయాసంబు విడిచి శయనస్థానంబునం గూర్చుండి స్వస్థచిత్తవై నీకు సంప్రాప్తంబైన భయంబుఁ దెలుపుము సూర్యుండు నీహారంబునుం బోలె దాని నపనయించెద నని బహుప్రకారంబుల నమ్మహీవల్లభుం డద్దేవి చిత్తంబు వడయుటకుం దగిన తెఱంగున ననూనయించిన నమ్మత్తకాశిని రామాభిషేక విఘ్నరూపంబైన యప్రియం బెఱింగింప నిశ్చయించి ప్రతిజ్ఞాకరణంబుచేతఁ గ్రమ్మఱ నిబంధింప నుపక్రమించి మన్మథశరవిద్ధుండును గామవేగవశానుగుండునగు ద



(*) కైకేయి దశరథునిచే శపథంబుఁ జేయించుట. (*)

శరథు నవలోకించి దారుణ వాక్యంబున నిట్లనియె ॥ (తే,గీ) మానవేశ్వర యేను నెవ్వానిచేతఁ । బరుషతఁ బరాభవింపంగఁ బడినదానఁ । గాను నాకొక్క కార్యంబు గలదు దానిఁ । గూర్మిన్ పెంపునఁ దీర్పఁగ, దగుదువు నీవు ॥ (క) మోసము సేయక యప్పనిఁ । జేసెదనని నీవు బాసఁ, జేసితివేని । నృపసంక్రందన యవ్వలఁ । జేసెదవని నమ్మి తలఁపుఁ, జెప్పెద నీకున్ ॥ (వ) అనిన విని యద్ధరారమణుండు భవదాజ్ఞాకారినైన నాయందు శపథాకాంక్ష పరిధృతం బయ్యెనని యుద్గతస్మితుండై యద్దేవి శిరంబు నిజాంకంబున నడికొని స్వాభిముఖీకరణంబు కొఱకుఁ జికురబంధంబునం గరంబిడి యిట్లనియె ॥ (క) నాకుంగల స్త్రీపూరుషు । లో కాంతా జానకీప్రియునకంటెఁ దగన్ । నీకంటె నన్యులెవ్వరు । లేకునికి యెఱుంగవొక్కొ, ప్రియులగు వారల్ ॥ (సీ) కమలాక్షి యెవ్వానిఁ, గానక యొక్క ముహూర్తమైనను మనియుండఁజాల । ఘనుఁ డెవ్వఁడసువుల, కంటెఁదక్కిన పుత్రకులకంటె నిలఁబ్రాణికోటికంటె । నధికముఖ్యుఁడు జీవనాహారుఁడజయ్యుఁడు సదయుఁడు నగు రామచంద్రుతోడు । రమణి నీవచనకరణమునుద్దేశించి శపథంబుఁ జేసితి, శంకవిడిచి ॥ (తే,గీ) నీకుహితమాచరింపంగ; నిశ్చయించి । యున్నమద్బుద్ధిఁ దిలకించి యుష్మదిష్ట । కథనమున నన్నుఁ బ్రోవుము కల్లగాదు । సత్యమాడితిఁ బుణ్యంబు, సాక్షిగాఁగ ॥ (వ) అని పలికిన నద్దేవి దశరథుండు తనవలని మోహంపు టురిం దగులువడియె నని యూహించి రామశపథపూర్వక స్వవచన క్రియావాక్యంబున సంహృష్టయగుచు నిజపుత్రపక్షపాతంబువలనను సర్వప్రకారంబుల విభుండు తనకార్యంబు సఫలంబుఁ గావించు ననెడుహర్షంబువలనను శత్రువులకైన వచించుటకశక్యంబైన వానిన భ్యాగతాంతకుని చందంబున నతిఘోరంబగు దానిఁ బుత్రాభిషేచన రామవివాసనరూపాభిప్రాయంబెఱింగించెదఁ గాకని నిశ్చయించి రాజప్రతిజ్ఞ దుష్కరదారుణ ప్రయోజనవిషయంబగుటవలన విఫలత్వంబునొందునోయని శంకించి దానినశేషసాక్షీకరణంబున సుస్థిరత్వంబునొందింపందలంచి భర్తనుద్దేశించి దేవా యిప్పుడు సకలభూతంబులును చంద్రాదిత్యాది గ్రహంబులును నగ్నిపురోగములైన దేవతలును భూమ్యంతరిక్షంబులును దిక్కులును నహోరాత్రంబులును గంధర్వరాక్షసాది దేవయోనివిశేషంబులును నిశాచర భూతంబులును

గృహదేవతలును సాక్షులుగాఁ బ్రియపుత్త్రసుకృతాదిపరిగ్రహక్రమంబున శపథం బుఁ జేసితివి తత్పూర్వకంబగు వరంబు నాకొసంగితివి నీవు సత్యసంధుండవు ధర్మజ్ఞులలో నుత్తముండవు మహాతేజుండవు సకలభూతసమక్షంబున నీపలికినపలుకు లర్థవంతంబు సేయుటకు సందియంబు లేదు గదా యని యిట్లు దశరథుని స్వమతంబునందు సంస్థాపించి సత్యసంధాది విశేషంబుల స్వవచనకృతార్థసైర్యంబుకొఱకుఁ బ్రశంసించి నిజాభిప్రాయంబు తేటపడ నిట్లనియె ॥ (సీ) అవనీశ తొల్లి దేవాసురసంగ్రామమున శంబరుండను దనుజవరుని । చేనష్టసంజ్ఞుఁడ, వైననీవపుడు నాచే రక్షితుండవై చిత్తమందు । మెచ్చి వరద్వయ, మిచ్చెదనంటివి తఱియగునంతకుఁ, గరము నమ్మి । నీయొద్ద డాఁచితి; నేఁడవ్వరంబులు దయసేయుమటుగాక, తక్కేనేని ॥ (తే, గీ) నేఁడె మదుపేక్షకుఁడవైన, నీవు చూడ । జీవితంబులు విడిచెద, సిద్ధమట్లు । గాననను దక్కఁగొనుకోర్కి, గలిగెనేని । వరము లొసఁగి యభీష్టము, లడయుమిపుడు ॥ (వ) అని పలికిన నద్దశరథుండు విశేషంబుగా పరస్వరూపంబుకత్తంబు గాకున్నను బూర్వదత్తవరస్మారకవచనమాత్రంబునఁ గైకేయీవశీకృతుండై మృగశబ్దానుకరణలుబ్ధకవాక్యంబున వశీకృతంబైన మృగంబె వాగురాదిపాశంబునం దగులువడినచందంబున ననుకూలవరప్రదానాభ్యుపగమసంజ్ఞంగు పాశంబునందగులువడియె నిట్లు మహీపతిని సత్యపాశబద్ధుం గావిం

-*) కైకేయి దశరథుని భరతాభిషేచన రామవివాసనరూపవరద్వయంబడుగుట (*-

చి కైకేయి వెండియు నిట్లనియె ॥ (సీ) భూనాథ యొకవరం,బున కుమత్పుత్త్రునకు ఘనరాజ్యపట్టంబుఁ, గట్టవలయు । వినుము రెండవవరం,బునకు రాముఁడు జటాజినచీరధారియై, సిరికిఁ బాసి । తాపసవేషంబుఁ, దాల్చి చతుర్దశవర్షము ల్దండకా, వనము నందుఁ । జరియింప వలయు ని,త్తెఱఁగున ఘటియింపుమిదియె నామనమున, నిరువుకొనిన ॥ (అ, వె) కార్య మట్లు గానఁ, గడఁగి నీవిప్పుడు । రాఘవాభిషేక, లగ్నమందె । పూజ్యయౌవరాజ్య, మునకు నాతనయుని । విభునిఁ జేయు మవని, విభులు వొగడ ॥ (చ) అటమర దక్కి యివ్వరము, లర్థి నొసంగుము సత్యసంగర । స్థిరుఁడవు గమ్ము జన్మకుల,శీలములందగఁ గాచికొమ్ము భూ ॥ వరులకు సత్యమే సిరియు,వైభవముం బరలోకసాధనో। త్కరమని తాపసు ల్బహువి,ధంబులఁ బల్కుదురు జాటిచెప్పరే ॥ (వ) రాజేంద్రా యేను నీచేతదత్తంబైన వరంబు నేయడిగితిం గాని నూతనవరంబడిగిన దానఁగా



నని యిట్లు కర్ణశూలాయమానంబగు దారుణవాక్యంబు పలికిన వినికొంచొకసేపు నిశ్చేష్టితుండై చిచ్చుతాఁకునం దపించు మహాగజంబు పోలిక నేలం బడి పొరలుచు నిజాంతర్గతంబున ॥ (క) ఊహింపనూత్మకారణ । దేహావస్థలో కోరు

——(*) దశరథుండు నానాప్రకారంబులఁ గైకేయి నిదూఱుట. (*)——

జయొ, తీరని చేతో । మోహంబొ గాక తక్కిన । నాహా యేనింత వెఱ్ఱి, నగుదునె యకటా ॥ (మ) అని చింతిపుచు గేహినీవచనవ, జ్రాభోగ్ర నా రాచదు। ర్దినసమ్మూర్ఛితమానసుండగుచు ధా, త్రీనాథుఁ డొక్కింతసే । పున కుందేరి యసంవృతావనిపయిం, బొల్పేది కూర్చుండి మో । మునదీనత్వము గానుపింపవిపదం, భోరాశినిమగ్నుఁడై ॥ (మ) ఘనమంత్రౌషధరుద్ధవిక్రమమహా, కాలాహిమాడ్కిం గడం । గిన నిట్టూర్పుని గుడ్చి యొంటి మయి వ్యాఘ్రింగన్న పెన్నిట్టిచా । డ్పున భార్యం గని భీతినొంది మఱల న్మూర్ఛాగతుండై రయం । బునఁ దెల్వొంది సుదుఃఖితుండగుచు న,ప్పాపోఁడితో నిట్లనుఁ ॥ (తే, గీ) పుత్రగర్ధినిదుష్టచా,రిత్రకులవి । నాశిని నృశంస జానకీ నాథుచేతఁ । బరఁగ నాచేత నేమి పా, పంబొనర్పఁ । బడియె నిట్టి దుర్వాక్యంబుఁ, బలికెదేల ॥ (చ) సతతముఁ దల్లియట్లు బలు, చందములన్నిటఁ గొల్చు జానకీ । పతికహితంబు సేయమదిఁ బట్టితి వేమి నిమిత్తమేనుదు । ర్మతి వగు నిన్నుఁ దీక్ష్ణగర, ళప్రథితోరగియట్ల యిల్లు సే । ర్చితి జడబుద్ధిచేఁ జనువుఁ, జేసితి నాత్మవినాశనార్థమై ॥ (ఆ వె) సకలజనులు రాముఁ, డకలంకగుణధాముఁ । డనుచు సన్నుతింతు, రట్టి పుణ్యు । నందు నేమి నేర, మొందించి ఘోరకా । ననమునం జరింపఁ, బనుపవాఁడ ॥ (ఆ, వె) పుడమినైన రాజ్య భోగసంపదనైన । బలమునైనఁ బ్రాణ,పవనునైన । నా సుమిత్రనైనఁ, గౌసల్యనైనను । విడుతుఁగాని యతని, విడువఁజాల ॥ (ఆ, వె) అగ్రపుత్త్రుఁడైన, యవనిసుతాపతిఁ । గనిననాడు ప్రీతి, ఘనత కెక్కు । నతనిఁ గానకున్న, నబలమచ్చిత్తమా । నందరహితమగుచుఁ, గుందుచుండు ॥ (తే,గీ) పన్నగ సరోజసఖుఁడు లేకున్న జగము । నీరు లేకున్న సస్యంబు, నిలుచుఁగాని । రమణి రాముఁడు లేకున్న, నిమిషమైన । నాదు తనవునఁ బ్రాణంబు, పాదుకొనదు ॥ (క) అటుగావున నీపదములు । పటురయమున శిరము సోఁకఁ, బ్రణమిల్లెదనీ । విటు క్రూరచింత సేయక । కుటిలాలకయొండుకోర్కిఁ, గోరుము సఁగెదఁ ॥ (తే, గీ) పరమదారుణమయినయీ, పాపమెట్టు । లకట నీచేతఁ జింతితం

బయ్యె నేఁడు । పుణ్యవర్తనుఁడైన రా, మునకు నెగ్గుఁ । దలఁచు దానికి నిహపరం
బులును గలవె ॥ (వ) దేవి నీ విప్పు డాడిన వాక్యంబు భరతప్రియా ప్రియవిష
యంబునందు మచ్చిత్తంబుఁ బరీక్షించుటకని తలంచెద నదియె భవదభిప్రా
యంబేని భరతాభిషేకంబే గోరవలయుఁ గాని రాముని వివాసనంబుఁ గోరనే
ల తొల్లి నీవు రాముండు నాకు జ్యేష్ఠపుత్త్రుండు ధర్మజ్యేష్ఠుండని పలికితివది ప్రి
యవాదిని వగు నీచేత రామకృతశుశ్రూషాపార్థంబొం డె మదీయచిత్తంబు భవ
దాయత్తంబై యుండుటకు నొండెఁ గథితంబయ్యె నని యిప్పు డూహించెద నట్లు గాదే
ని రామాభిషేకంబునకు సంతసింపక శోకసంతప్తచిత్త వై యిత్తెఱంగున నన్నేల
పరితపింపం జేసెద వైనను శూన్యగ్రహంబు సోఁకి తత్పారవశ్యంబున నిట్లప్రియం
బుఁ బలికితివి గావలయుఁ దొల్లి యిక్ష్వాకులయొక్కఁ డైన భవదీయచిత్తం బధర్మాయత్తం
బు గాకుండునట్టి వినయసంపన్న వైన నీ విప్పు డీ యధర్మకార్యం బవలంబిం
చుటవలన ధర్మనిష్ఠం బైన యిక్ష్వాకువంశంబునందు నివార్యం బైన యనర్థం
బు సంప్రాప్తం బయ్యె నని తోఁచుచున్నది మున్నొక్కఁ డైన లోకవిరుద్ధంబగు
ప్రతికూలవాక్యంబు నీవలన విని యెఱుంగని కారణంబున నేఁ డీవాక్యంబు న
మ్ముటకు నర్హం బై యున్నయది నాకు రాముండు భరతసముండని బహుప్రకారం
బుల నాకుం జెప్పుచుండు నట్టి సమచిత్త వైన నీకు రామునియందు విరోధభావం బె
ట్టెఱంగున నుత్పన్నం బయ్యె ॥ (చ) అనిశము ధర్మమార్గరతుఁ, డై యశమె

(దశరథుఁడు కైకేయికి రాముని సద్గుణంబుల భివర్ణించి బోధించుట).

ల్లెడఁ గూడఁ బట్టి వా । రని సుకుమారతన్వి యలు, రాముని నీ పయిఁ గల్గు భక్తి
నై । నను దలపోయ కిట్లు పదు, నాలుగు వర్షములుగ్రకాననం । బునఁ జ
రియింపఁ బంపుమన, మూఢమతీ మది నెట్లు సైఁచితే ॥ (తే, గీ) ఘనుఁడు
రాముండు భరతున, కంటె నధిక । భక్తి శుశ్రూషఁ గావించుఁ, బరఁగ నీకు ।
నారఘూత్తముకంటె నీ, యందు భరతు । నకుఁ గల విశేష మేమి గా, నమ
లతాంగి ॥ (తే, గీ) కమలలోచన నీకు రా, ఘవుని కంటె । నన్యుఁ డెవ్వాఁ
డు వచన క్రి, యాప్రణామ । వినయగౌరవ సేవాది, వృత్తులందుఁ । జతురుఁ
డంతైన నెఁ గలఁ డేము, జ్జగములందు ॥ (తే, గీ) తరుణి కాంతోపజీవి శ, తంబు
లోన । రమణి యొక్కని చే నైన, రామునందుఁ । బలుకఁబడు పరివాదాప
వాదములుద । లంపలేనట్టి ఘనుఁడని, కంప నేల ॥ (తే, గీ) రాఘవుఁడు శు



ద్ధబుద్ధిచేఁ, బ్రాణికోటి । నెపుడు రంజిల్లఁ జేయుచు, నిష్టకామ । దానములచే
త స్వవశీకృ, తస్వదేశ । వాసిజనుఁడై ప్రకాశించు, వనజనేత్ర ॥ (తే, గీ) దా
నమున దీన జనుల స, త్యమున లోక । ములను శుశ్రూషచే గురు, వులను వింటి ।
చే రణంబున దుస్సహా, వైరివరుల । ననిశము జయించి యున్న వాఁ, డతఁడు
తన్వి ॥ (వ) మఱియు సత్యంబును దానంబును దపంబును ద్యాగంబును మి
త్రత్వంబును శుచిత్వంబును నార్జవంబును విద్యయు గురుశుశ్రూషయు నివి
మొదలగు సకలగుణంబు లక్కుమారునందు సన్నివిష్టంబులై యుండు నట్టి శ
మాదిగుణసంపన్నుండును దేవతుల్యుండు నగు రామునియం దెవ్విధంబునఁ బా
పంబు దలంచితివి లోకప్రియవాదియును మహాప్రియుండు నగు రాముని వి
వాసవిషయవాక్యంబు స్మరించుటకు నైన శక్తుండఁ గానట్టి యేను ప్రియుండ
గు నా రాముని భవదర్థంబు నందు వనంబునకుఁ బొమ్మని యెట్లు పలుకుదు న
ని పలికి వెండియు శోకంబు బగ్గలం బైన దీనవదనుం డగుచు గద్గదకంఠుండై యి
ట్లనియె ॥ (తే, గీ) శమదమంబులు సత్యశౌ, చములు భూత । దయయు దా
క్ష్యంబు ధర్మమే, ధన్యునందు । నిలిచె నట్టి ధరాసుతా, నేతవనికిఁ । జనిన పి
మ్మట నేగతిఁ, జనుదు నేను ॥ (వ) అని పలికి దుఃఖాతురుం డగుచుఁ గ్రమ్మఱన
మ్మహీవల్లభుండు ఘూర్ణమాన శరీరుండై శోకార్ణవంబునకుఁ బారంబుఁ
బ్రార్థింపుచు నయ్యంగన చరణంబులం బడి లేచి యంజలి ఘటియించి యి
ట్లనియె ॥ (సీ) చతురబ్ధిముద్రిత, క్షితియందుఁ గల సర్వమును నీకొసంగెదఁ,
గనుక విడిచి । తలకొని ధర్మంబు, తప్పక యుండ రాఘవునకు శరణంబు, గమ్ము
పెక్కు । దినములు పుడమిపై, మనినకతంబునఁ గడువార్ధకంబున, బడలిమి
గుల । దైన్యము నొంది పు, త్రవియోగ జనితార్తిఁ గోర్వఁ జాలక చేతు, లో
గ్గి వేఁడు ॥ (తే, గీ) మామకాంజలిఁ గైకొని, మంజువాణి । చాలఁ గారుణ్య
మొనరింపఁ, జాలుదనిన । విని బడబచందమున దీప్త, వేషయగుచు । నలుకరె
ట్టింపఁ బలికె న, వ్వెలఁదిపతికి ॥ (సీ) భూనాథ మునువరం, బు లొసంగి క్రమ్మ
ఱఁ బరితపించెదవు నీ, పాటి నృపులు । విన్నమెత్తురె వారు, విన నీదు ధార్మిక
త్వంబెట్లు వాక్రుచ్చి, పలుకఁ గలవు । మఱియు నా భూపతు, ల్మద్వరదాన ప్రసం
గంబుఁ జేసిన, సమతవారి । కుత్తరం బెయ్యది, యోజించితివి నీవు భయదదే
వాసుర, భండనమున ॥ (తే, గీ) నన్నుఁ గాచిన కేకయ, నాథపుత్త్రి । కేనొసంగిన వరము

లు, పూని మిథ్య । యనుచుఁ బల్కెదవో నృపజనుల కెల్ల । నపయశంబొడఁగూర్చితివి, నధిపనీవు ॥ (వ) అని గహించి పలికి క్రమ్మఱ సత్యంబు ప్రకటంబుగా నిరూపించు తలంపున నిట్లనియె ॥ (చ) విమల విచారులైన నృప, వీరులు మెచ్చఁగ పోతరక్షణా । ర్థమము మును శైబ్యుఁడర్క నృపుఁడు, తత్పిశితార్థియైనయొక్క శ్యేనమునకు నెంత పుణ్యాకల్పనం దనకండలు గోసియిచ్చి స । త్యముఁ బ్రకటంబుగా నిలిపె, ధారుణి నత్తెఱఁగీ వెఱుంగవే ॥ (చ) అదియునుఁగాక లర్కుఁడను, నాతఁడు నేత్రములిచ్చి పుణ్యాసం । పద నిరవంద్యుఁడే యది ధర్మవంబుగ నిల్చెనో లేదో వార్ధియుం । త్రిదశగణార్థితుండయి తు,దిన్న మయం బొనరించి వేలఁదాఁ । బదపడి దాఁటె నే ధరణి, పాలక సత్యము నూఁదినేఁటికిన్ ॥ (చ) జనవర పూర్వవృత్తముఁ బ్రసన్నమతిం గనిమున్ను నీవుచే । సిన సమయంబు దప్పకుము, శీలము సత్యముఁ బాయఁబట్టిరా । మునిఁ బృథివీశుఁ జేసి యిఁక, ముప్పునఁ దప్పక నగ్రపత్నితో । ననిశముఁ గ్రీడ సల్ప హృదయంబునఁ జూచితివేమొ దుష్కృతీ ॥ (తే,గీ) జనవరోత్తమ నాకొక్క, సత్యధర్మ । యుక్తమయినను దద్వ్యతిరిక్తమైన । నిపుడు నీ ప్రేమాల నాచేత, నద్దిపలుకఁ । బడియె దానికి నన్యథా, భావమెట్లు ॥ (తే, గీ) ఎంత లేదని త్రోచినీ, వెల్లిపుడమ్మి । కన్నె మగనికిఁ బట్టంబుఁ గట్టతేని । గరళమైనను గ్రోలి నీ కనులు చల్ల । గాఁగ మేనికిఁ బాసెద, గల్లగాదు ॥ (తే, గీ) వైభవంబునఁ బోరలు సవతిని గాంచి । యొక్క నిమిషమైన నోర్వలే నకట దాని । విభుత కేల్మోడ్చి దీనవై । వినయవృత్తి । బ్రతుకుకంటెను జచ్చుట పాడిగాదె ॥ (క) జనవర రామ వివాసన । మునకంటెను వేఱకార్యముననా చిత్తం । బున కానందము గలుగదు । విను భరతుని మీఁది యాన, వేయుననేలా ॥ (వ) అని యిట్లు పరమదారుణంబైన వాక్యంబుఁ బలికి యూరకుండిన నమ్మహీరమణుండు మిక్కిలి యవాచ్యంబైన రాముని వనవాసంబును భరతుని రాజ్యాభిషేకంబును విని పరమశోకాక్రాంత చిత్తుండై కోపంబునఁ గొండొకసేపు రెప్ప వేయక యప్పడంతి మొగంబుఁ దప్పక చూచుచు నిశ్చేష్టితుండై యూరకుండి వెండియు నద్దేవి వ్యవసాయంబును దాను చేసిన శపథంబునుం దలంచి యశక్యప్రతిక్రియత్వంబువలన నించుక సేపు ధ్యానంబుఁ జేసి రామాయని నిట్టూర్పుపుచ్చి సన్నిపాతాదులచేత విపరీత ప్రకృతియైన వాని చందంబున వ్యాధిగ్రస్తుండైన వాని పోలిక



నున్మత్తునికైవడి మంత్రాపహృతవీర్యంబయిన మహాసర్పంబు భంగి నష్టచిత్తుండై పరశుచ్ఛిన్నంబైన తరువు మాడ్కి ధరణిపయిం బడి కొండొకసేపునకు లబ్ధసంజ్ఞుండై వెండియు దీనవాక్యంబున నిట్లనియె ॥ (క) రమణి యనర్థంబఖార్థ । హమ్ముగా నెవ్వఁడుగఱపె, నకట పిశాచా । క్రమితమతివోలె దుర్వాక్యముఁ బల్కెద కోడవెంత, యవివేకినివో ॥ (క) ఈసద్వృత్తభ్రంశన । మే సరణి న్మున్నెఱుంగ, మిపుడీశీలం । బో సుదతీ విపరీతం । బై సర్వముఁ గానఁబడియె, నటు నీయందున్ ॥ (క) నీకీభయంబు వొడముట । కే కారణమాత్మసుతున, కీశత్వము సీ । తాకాంతునకు వివాసన । మే కరణిం గోరితివి వి,హీనప్రజ్ఞా ॥ (తే, గీ) మగఁడ నగు నాకు సుతునకు, జగమునకును । దప్పక ప్రియంబుఁ గావింపఁ, దలఁచితేని । రాఘవ వనవాస భరతసామ్రాజ్యరూప । మైన యీపాపభావంబు, మానుమిపుడు ॥ (క) రామునియం దపరాధం । బేమి విలోకించి పలికి, తే నీకిపుడే । నేమి విరోధముఁ జేసితి । నీమాటలు నీతిశాస్త్ర, నిర్ణీతములే ॥ (తే, గీ) అతివ నా చిత్తమెరియించు, టంతె గాని । రాముఁడు భరింపఁదగిన సామ్రాజ్యభార । మేల భరతుఁడు పూనుసీ, తేశుకంబె । భరతుఁ డధికుఁడు నృపనీతి, పరతఁ జేసి ॥ (తే, గీ) అనఘ వనమునకీవు పొమ్మని నయంత । శాపసంగ్రస్తుఁ డగు నహుష,రాజుపగిదిఁ । బ్రబలవైవర్ణ్యమొందిన రామచంద్రు । వదనమే రీతిఁ గనుఁగొను, వాఁడఁ జెపుము ॥ (ఆ, వె) మఱియు సకలరాజ,మధ్యంబునఁ బ్రధాన । హితులఁ గూడి నిశ్చ,యింపఁబడిన । దానిదుష్టరాల, దళితసైన్యము నట్ల । కలుషచిత్త యెట్లు, గ్రమ్మఱింతు ॥ (వ) అదియునుండగాక ॥ (సీ) జడబుద్ధియైన దశరథుండు చిరకాల మెత్తెఱంగున రాజ్య, మేలె ననుచు । గుణవంతులగు రాజ,కుంజరుల్నను వెలిఁ బెట్టరే జానకీ,ప్రియుని యుత్సవముఁ జూడవచ్చిన,వసుమతీధవులు రాఘవుఁడడవికిఁ జనేమి,కారణమున నిర్వాసితుండయ్యె,నేఁడని రామునుద్దేశించి పలికినఁ,దిరిగి వారి ॥ (తే,గీ) కేమియుత్తరమొసఁగుదు,నిపుడు మఱియుఁ । గైకచేఁ బీడితుండనై కాననమున । కనిచితినటంచుఁ జెప్పుదు, న్యాయమైన । సత్యవిచ్యుతికే నోర్వఁజాలు టెట్లు ॥ (సీ) ఆనిశముఁ బ్రియపుత్ర, యున్ముఖ్యవాదిని ప్రియకామయును మహా, ప్రియయునైన । కౌసల్యయయ్యయి, కాలంబులను దాసి యును పునసఖియట్లు జననిపగిది । భగినిచందంబున, భార్యపోలిక నొప్పు నట్టి కాంతకు మార్కుఁ, డడవికేగు । చుండనన్నేమ

ని, యొప్పిదంబులు పల్కు నీదృశంబగుపాప; మేనుచేసి ॥ (తే,గీ) యేమనిప్రియం
బుఁ జెప్పుదు,నింతకాల । మేనునీయందుఁ జేసిన, హితమునన్నుఁ । బరితపింపఁ
గఁ జేసె న,పథ్యభోజ । నంబువిషరోగినింబలె; నాతినేఁడు ॥ (వ) మఱియు స
త్కారోచితయైనయకౌసల్యభవదై్వమనస్యంబుననాచేతఁనొక్కనాఁడైననస
త్కరింపంబడిన యదిగాదయ్యె నదియునుగాక ॥ (క) వనసంప్రయాణరూపా ।
వనిజాప్రియవిప్రియంబు, వదలకవినిగ్ర । కుక్కన నలసుమిత్ర నన్నే । మనిమన
మునవిశ్వసించు, నక్కట చెప్పుమా ॥ (వ) సకలలోకానందకరుండైన రామభ
ద్రునిఁ బరిత్యజింపం దలంచిన దశరథుండింక నేమి యకార్యంబుఁ గావించు
టకు వెఱచు నని ధిక్కరింపదే యని వెండియు నిట్లనియె ॥ (ఆ, వె) విపినవాసి
యైన, విభునిలోకాంతర । వాసియైననన్ను వరుసతోడ । జనకరాజపుత్రి, వి
నుటకు నెట్లోర్చు । నకట రెండునప్రియములుగావె ॥ (తే,గీ) పతివిపినయాత్ర
యునునాదు పంచతయును । వినిమహీసుత కృపణయై,వెండికొండ । క్రేవఁగిన్న
రుఁ బాసిన కిన్నరిక్రియ । వెతలఁబొంది ప్రాణంబులు, విడువకున్నె ॥ (క) వనము
నకుఁజనినరాముని । వనగతుఁడగు విభునిఁగూర్చి, వగచుమహీజం । గనుఁగొ
ని యేనుధరణిపై । వనితాచిరకాలమింక, బ్రతుకఁగఁజాలఁ ॥ (క) జననుతుఁ
డగురామునివన । మునకుఁ బనిచి నన్నుదుఃఖ, మునఁజంపిరయం । బునభరతుఁ
గూడిమోదం । బునవిధవారాజ్యమేలఁ, బూనితొ బుద్ధిఁ ॥ (తే,గీ) అసతివ
గునిన్నుమదిసతి వనుచునమ్మి । పిదపదుఃఖార్తి నిట్లుతపింపవలసె । నరుఁడు
మోహావశంబున , గరళయుక్త । మద్యమునుగ్రోలి దుఃఖించు, మాడ్కినబ
ల । (క) వన్యమునలుబ్ధుఁడుగీత । ధ్వనిచే మృగమునుగడంగి,వంచించినచాఁడ్పు
ననన్నృతసాంత్వమునసను । దినమును వంచించితుది వధించితివకటా ॥ (తే, గీ)
ఎంతపాపాత్ముఁడీనృపుఁ, డిపుడుగ్రామ్య । సుఖముకొఱకుఁ గుమారుని, సూరి
నుతుని । వనమునకుఁ బంచె ననుచుస, జ్జనులునన్ను । దూఱరేకల్లుఁద్రావిన, పా
ఱునట్లు ॥ (వ) దుష్టచారిణివరదానవిషయంబునందు రాముండుజటాజినచీరధా
రియై మునివేషంబునవనంబుకుం జనవలయునని పలికితివిట్టిక్రూరవాక్యంబులువి
శ్రమింపవలసెంగావున మత్పూర్వకృత దుష్కృతంబివ్విధం బపరిహార్యత్వంబున
నవశ్యంబనుభావ్యంబయ్యె నక్కటాయిది యెంతకష్టంబెంతదుఃఖంబుచిరకాలం
బుననుండిసౌఖ్యం కొఱకునాచేతననుష్ఠితంబైనభవద్రక్షణంబుకంఠలగ్నంబైనపా



శంబు భంగి స్వనాశనంబుకొఱకుఁ బరిణతంబయ్యెననిపలికి వెండియునిట్లనియె ॥
(క) బాలుండేకాంతంబునఁ । గాలాహినిముట్టినట్లు, గానకజడతఁ । వాలా
యముసతివనిదు । శ్శీలాపాణిగ్రహంబుఁ, జేసితినిన్నుఁ ॥ (ఉ) కాంతకుఁ బ్రీ
తిసేయనను కంపదలంపక రామునిన్వనా । భ్యంతరసీమకుం బనిచె నక్కట
యీనృపుఁడెంతచంచలుం । డెంతవివేకశూన్యుఁడని, యెన్నికవెట్టదెసర్వలో
కమా । వంతయుశంకలేకయది, యంతయు నిక్కము గాదెధూర్తతీ ॥ (తే గీ)
రమణిసువ్రతబ్రహ్మచర్య ములచేత । గురులచేతను నృపధర్మ, పరులచేత । స
తతముపకర్షితుండైన, సుతుఁడు మఱల । భోగవేళదుఃఖంబులు పొందెనక
ట ॥ (క) వనమునకుఁబొమ్ముసుతనీ । వనినంతనె యట్లు గాక,యనిశీఘ్రమునం ।
జనుఁగాని మఱలఁదానొం । డనఁజాలండట్టిసుమతి,ననుచుటతగవే ॥ (క) తనయా
నీవిపుడువనం । బునకుం బొమ్మనుచుఁ బల్కఁ,బోననినాతో । మునుకొనిప్రతికూ
లముఁబ । ల్కనమేలగు బల్కఁడట్లు , కేవలభక్తిఁ ॥ (తే, గీ) పాపచారిణి
పరిశుద్ధభావుఁడగుట । రామభద్రుండునాయభి, ప్రాయ మించు । కైన నెఱుఁగ
కననికిఁబొమ్మనినఁదడవు । సేయ కప్పుడెచనునేమి, సేతునింక ॥ (వ) మఱియు
మహాత్ముండగు రాముండు వనంబునకుంజనిన సర్వలోకధిక్కారంబు సహింపం
జాలక యేనుయమక్షయంబునకుం జనియెద రామప్రవ్రాజన మన్మరణా నంత
రంబున నిష్టంబైన కౌసల్యాది జనంబునందేమి పాపంబాచరింపఁబెదవో యనిభ
యంబువొడము చున్నయది యవ్వలమన్మతానుసారిజనంబంతయు మనోవాగ
గోచరంబైన దుఃఖంబునొందు నీవలననిక్ష్వాకుకులోచితంబైనయశంబంతయు
బరిక్షీణంబయ్యెరామునకుసహచరుండగుటఁజేసి లక్ష్మణుండతని విడువంజాలక
వెనువెంటనరణ్యంబునకుంజనునంతఁగుమారవనవాసంబును భర్తృమరణంబు
నుందలఁచి శోకించి కౌసల్య ప్రాణంబులు విడువంగలదంతట సుమిత్రనన్నును
గౌసల్యనురామలక్ష్మణభరతశత్రుఘ్నులంగానక శోకంబున సహగమనంబుఁ జేసి
పంచత్వంబునొందునట్లు కౌసల్యాసుమిత్రలను నన్నును రామలక్ష్మణశత్రుఘ్ను
లను దుఃఖనిమగ్నులంజేసి నాచేతను రామునిచేతను విడువంబడినశాశ్వతంబై
న యిక్ష్వాకులంబాకులంబుగాఁ బరిపాలింపుచు సుఖంబుండుము భరతునకు
రామవనవాసంబుప్రియంబయ్యెనేనిగతజీవితుండనై ననాకుఁబ్రేతకృత్యంబుసేయు
టకు నతండర్హుండు గాఁడు మేమందఱమరిగిన పిదపనీవు లబ్ధకామితవై పు

త్రునింగూడి విధవారాజ్యంబుగాఁ బరిపాలింపు మీవు రాజపుత్త్రి వ్యపదేశమాత్రంబున మద్గృహంబుఁ బ్రవేశించుటం జేసి నాకుఁ బాపాత్మునకుంబోలె నపయశంబును మహాజన సమక్షంబున ధిక్కారంబును సర్వభూతంబులయం దవమానంబును సంప్రాప్తంబయ్యె ననిపలికి వెండియు నమ్మహీరమణుండు శోకోద్రేకంబుననిట్లనియె (మ) అతివేగాన్వితఘోటకవ్రజముతో హస్తీంద్రసంఘంబుతోఁ । జతురస్యందనరాజితో నెపుడు సంచారంబుఁ గావించు నా । క్షితికన్యాధవుఁడుగ్రకంటకశిలాశ్లిష్టాటవీభూమినే । గతిఁ బాదంబులచేఁ జరింపఁగలఁడిం కన్భర్తృవిద్వేషిణీ ॥ (చ) సరసపదార్థముల్వలయు, చందములన్పచనంబుఁ జేయనేర్పరులగుపాచకుల్ తనకుఁ, బక్వతరోదనభక్ష్యభోజ్యముల్ । వ్వరుసనొసంగ నిత్యముఁ గరంబనురక్తి భుజించు జానకీ । వరుఁడిఁకఁ గందమూలముఖ వన్యము లెట్లు భుజించునక్కటా ॥ (ఉ) ధౌతసువర్ణవర్ణపరిధానములన్ గయిసేసి పుష్పశ । య్యాతలమందు నుండెడుమహాసుకుమారుడు నాకుమారుఁడే । రీతిని మంజులాజినమలీమసవల్కలముల్ ధరించి ఘో । రాతతకంటకాత్మకశిలావనియందు వసించుఁ జెప్పుమా ॥ (చ) మదనవసంతవాసవకుమారమహాసుకుమారమూర్తి వా । రిదనిభగాత్రు నద్భుతచరిత్రుని బుత్రుని జూచి నప్పుడే । ముదుకఁడనయ్యు గ్రమ్మఱ నమున్న తయౌవనమొందినట్లునే । మ్మదిఁ దలపోతునట్టి జనమాన్యుని బాసి మనంగ నేర్తునే ॥ (వ) మఱియు రామారణ్యగమనపూర్వకంబైన భరతాభిషేకం బతిదారుణకృత్యం బవ్వాక్యంబెట్టి దుష్కర్మునకైన విన దగియెడు నది గాదు యువతులు నిందింపం దగియెడు వారని పలుకు లోకవాక్యంబు సర్వసాధారణంబైనను స్వార్థపరవగు నీయందుం గాని పతివ్రతలయం దవ్వాక్యంబు సార్థకంబై యుండదు నీవు స్వపరానర్థసాధనస్వభావసంయుక్తవు మత్పరితాపనివేశితాంతఃకరణశీలవు స్వార్థసాధనపరవు నీచందంబిట్టిదని మున్నెఱుంగనైతి సమస్తజగద్ధితానుసారియగు రామునియందును నాయందు నేమియపరాధంబు విలోకించితివి రామప్రవాససాధకంబైన భవద్వ్యాపారంబును వ్యసననిమగ్నుండైన రాముని నిరీక్షించి జగంబంతయు నతికుపితంబై పితృపుత్త్రవధూవరు లనన్యోన్యంబు పరిత్యజించు సూర్యుండు తపింపకున్న నింద్రుండు వర్షింపకున్న లోకంబు జీవించుంగాని వనంబునకుం జనురాముని విలోకించి యననుభూతరామస్వభావుండైనను జీవింపం జాలఁడే నెట్లు జీవింపంగలవాఁడ భార్యాకారాగతమృత్యువని నిన్నెఱుంగక యజ్ఞానంబు



న నీతోడం గ్రీడించితిఁ గామభారాపన్నుండనైన యేను మహావిషంబైన సర్పంబునుంబోలెఁ జిరకాలంబుననుండి నిన్నంకభాగంబున నిడికొని తుదినిట్లు నీచేతం వధియింపం బడితి దురాత్ముండనగు నాచేత మహాత్ముండగు రాముండు పితృకుండయ్యె సపుత్త్రకుండనైన నాచేతఁ బరిత్యక్తంబైన యీ భరహితేక్ష్వాకురాజ్యంబును భరతుండు చేకొని సర్వజనంబుల విడిచి బంధువుల నెల్ల వధించి భవత్సహితంబుగాఁ బరిపాలింపం గలఁడు నీవు మద్విమతులయందు స్నేహయుక్తవై యుండుము నేఁడిట్లు పతివత్నీభావంబుఁ దిరస్కరించి యాపత్కాలమందు నుపద్రవకారిణివై క్రూరవాక్యంబుఁ బలికితి విప్పాపంబున భవదీయదశనంబులు విశీర్యమాణంబులై పుడమిం బడ కేల తక్కె భవదీయరసన సహస్రప్రకారంబుల వ్రయ్యకేల యుండు నెన్నఁడేనియు నప్రియంబులగు పరుషవాక్యంబులు పలికి యెఱుంగం డట్టి యభిరామవాదియు గుణనిత్యసమ్మతుండునగు రామునియం దేవిధంబున దోషంబులు వలికితివి కైకేయీ గ్లాని నధిగమించిన నధిగమింపుము కోపించినఁ గోపింపుము నశించిన నశింపుము సహస్రప్రకారంబుల విస్ఫుటితవై మహీతలంబుఁ బ్రవేశించినఁ బ్రవేశింపు మప్రియంబైన భవద్వచనంబు సఫలంబు నొందింపం జాల క్షురోపమానయు మిథ్యాప్రియవాదినియు దుష్టస్వభావయు స్వకులోపఘాతినియు మనోహారిణియుఁ బ్రాణహారిణియు నగు నీవు జీవించి యుండుటకు సహింపం జాల నని పలికి వెండియు నిట్లనియె ॥ (తే.) రామభద్రుండు లేనిచో, రమణి నాకుఁ । బ్రాణము సుఖంబు యశమును, రతియు లేదు । నీదు పదములు ముట్టెద, నెలఁత సుప్ర । సన్నవై ప్రోవు రాముని, నన్నుఁ బ్రీతి ॥ (క) అని యీగతి విలపించుచు । మనుజేంద్రుఁడు దుఃఖశోకమయనీరధిలో । మునుఁగుచుఁ దేలుచుఁ గ్రమ్మఱ । వనితపదంబులను వ్రాలె, వ్యాధితుమాడ్కిన్ ॥ (వ) ఇట్లనాథుని భంగి విలపించుచు నతిక్రాంతమర్యాదయైన కైకేయిచేత నికృత్తమర్మాంగుండై చిత్తమూర్ఛాయు. జీవితవై మనస్యంబునుం బైకొనినఁ బ్రణామపరిహారబుద్ధిచేత నొండు దిక్కులకుం బ్రసారితంబులైన యద్దేవి చరణంబులు సంస్పృశింపక యాతురుని పగిది దారుణంబుగాఁ బుడమిం బడి పుణ్యాంతంబున దేవలోకంబుననుండి ధరణిపయిం బడిన యయాతిచందంబున దీనవదనుండై యసంవృతమేదినిపయిం బడి రోదనంబు సేయుచున్న మగనిం గని యువతులకుం బ్రణామంబు సేయుట కనర్హుండని

యు నంతకుమున్న ననుభూత తాదృశవ్యసనుం డనియును బుడమిం బడియున్న వాఁడనియుఁ దలంపక యనర్థరూపయు ననిష్పన్న ప్రయోజనయు నభీతయు భయదర్శినియు నైన యక్కైక జనాపవాద శంకారహితచిత్తయగుచు వెండియుఁ బూర్వదత్తవరంబుల నుద్దేశించి దశరథుని సంబోధింపుచు నిట్లనియె ॥ (క) జననాథ సత్యసంధుఁడ । వని నినుజనులాడుకొందు, రశ్రాంతముగా । ము ను వరములిచ్చి లోభము । దనరఁగ నేఁడేల యీక, తప్పెద వకటా. ॥ (చ) మునుకొని నేఁడు తుచ్ఛజన, ముల్ వినఁ బల్కిన రాఘవాభిషే । చన మొనరింప కుండిన న,సత్యజదోషమువచ్చునంచుఁ బే । ర్కొనియెద వీవు తొల్లి యమ, రుల్వినఁ నిచ్చెదనన్న మద్వరం । బు నొసఁగకున్న సూనృత స,ముద్భవ పుణ్యము నిన్నుఁజెందునే ॥ (చ) అన వినియమ్మహీరమణుఁ, డద్భుతశోక పరీతచిత్తుఁడై పనివడి కొంతకాల మటు,వల్కక యూరక యుండి. వెండియు । న్వనితమొగంబుఁ జూచి వద, నంబునఁ గోపము చెంగలింపఁగాఁ । గనుఁగవ నశ్రువుల్దొరుఁగ, గద్గదికన్ దలయెత్తి యిట్లనున్ ॥ (క) మానితగుణుఁ డగు రాముఁడు । కాననమునకేగఁ బరమ,గతికేఁ జనఁగా । మానిని యవ్వల రాజ్యముఁ । బూనికిఁ పాలింపు మొద[illegible], బుణ్యము సుఖమున్ ॥ (ఉ) ఏనటు దేవలోకమున,కేఁగ సురల్ ననుఁజూచిజానకీ । జానిసుఖాత్ముఁడేయనినఁ, జయ్యన నేమని చెప్పువాఁ డనా । ధీనసధిఁ గానకుం బనిచి,తిన్ సతికిం బ్రియమారనంటినే । దీనత నొంది కోపమున, ధిక్కృతి సేయుదు రేమిసేయుదున్ ॥ (వ) మఱియుఁ గైకేయి కొసంగిన వరంబునకుఁగా సత్యవశుండనై రాముని వనంబునకుం బుచ్చితి నని సత్యంబుగాఁ బలికితి నేని సకలజన సమక్షంబున నెల్లి రాముని రాజ్యంబున కభిషిక్తునిఁ జేసెద నని పలికిన వచనంబున కసత్యదోషంబుకలుగునని పలికి యప్పుడమిఱేఁ డంత కంత కినుమడించిన శోకంబున నిట్లనియె॥ (తే,గీ) తరుణియనపత్యతాదురి, తమునఁ బెక్కు । సమములత్యంతదుఃఖశో, కములబడలి । తుదినతనిఁ బుత్రుఁగాఁగంటి,దుష్కరముగ । నట్టిప్రియపుత్రు నెబ్భంగి, ననుప నేర్తున్ ॥ (క) శూరుండును గృతవిద్యుఁడు । వీరుండు క్షమాపరుండు, విజితేంద్రియుఁడు । న్నారస నేత్రుఁడు రాముఁడు । వారక నేలాఁగు విడువఁ,బడు నాచేతన్ ॥ (క) రాముని నీలోత్పలసమ । ధాముని నాజానులంబి, తత బాహునినను । ద్దామబలుని నభిరాముని । భామిని యేపగిది వనికిఁ, బంపుఁగ



నేర్తున్ ॥ (ఆ, వె) సుఖము లొసఁగ దుఃఖ,శోకంబులనుఁ బాప । నహున్న డైన రాము, నకట నేఁడు । వనికి నెట్లుపుత్తు, వరసుఖాన్వునిఁ జేసి । దీన నేమి కోర్కి,దీఱునీకు ॥ (తే, గీ) కమలనేత్ర దుఃఖాపహుండు, గాని రాఘు । వునికి దుఃఖంబుసేయక, తనువువిడిచి । యనిమిషేంద్రు లోకమునకుఁ,జనితి నేని । యెుదవుసౌఖ్య మందైనఁ గా, కున్నఁ గలదె ॥ (క) ఓకలుషచిత్త రాముని । నాకుం బ్రియుఁడైనవాని, నయధర్మవిదుం । జేకొని సుజనులు దూఱఁగ । నీకరణి న్వనికిఁబనిచె, దేటికిఁజెపుమా ॥ (క) వనితా రాముని వనికిం । బనిచిన సత్సభలయందుఁ, బరిభవముజగం । బున ననుపమానయశమును । ముసుకొనినా కొదవు నిక్క,ముగఁ దోత్తోడన్ ॥ (వ) అని యిట్లు బహుప్రకారంబులఁ బరిభ్రమిత చేతస్కుండై యార్తుండై విలపింపుచుండ నమ్మహీపతికిఁ జంద్రమండలమండితయైన యారాత్రి యతి కష్టతరంబునఁ గించిద వశేషంబుగా నతిక్రమించె నప్పు డద్దశరథుండు వేడినిట్టూర్పు నిగుడించి గగనాసక్తలోచనుండై యంజలిఁగీలించి పరమార్తుండై విలపింపుచు యాశర్వరి నుద్దేశించి యిట్లనియె ॥ (సీ) విమలనక్షత్రశో,భితయైన శర్వరి యంజలి ఘటియించి, యర్థకభక్తిఁ । బ్రార్థింతునినుఁ దెల్ల,వారిన రామునకటవీప్రయాణమ్,ట్లావహిల్లుఁ । గావున నామీఁదఁ, గరుణించి వేఁగకు మటుగాక వేఁగుట, యుదియునొక్క । హితమని గణుతింతు, నెట్లన్న నెద్దాని వలననాకిట్లని,వార్యమైన ॥ (తే,గీ) యమితదుఃఖంబు ప్రాప్తించె,నట్టిక్షుద్ర । శీలయుఁబతిఘ్నియును దుష్ట,చిత్తయుఁ గుల । ఘాతినియుఁ గ్రూరయైన యీ,కైకయానన । ంబుఁ జూడకతప్పఁగఁ జనంగవచ్చు ॥ (వ) అని పలికి వెండియు నతండు శోకరోషంబులొక్కింత తనలోనఁదానయుపశమించుకొని యప్పుడంతి దిక్కు మొగంబై దేవి సాధువృత్తుండును దీనుండును నల్పావశేషాయువును సత్యవశగతత్వంబు నభవద ధీనుండును విశేషించి వల్లభుండనైన నాకుఁ బ్రసాదంబొసంగుము నీచేత వరబలంబునఁ బ్రతిగ్రహింపఁబడిన రాజ్యంబును మత్ప్రీత్యర్థంబుగా రామున కొసంగుము రామాభిషేకంబు నాచేత నిర్జనప్రదేశంబు నందు సముదాహృతంబైనది గాదు రాజసభామధ్యంబునం బలుకఁ బడిన యది గావున దాని కసత్యత్వంబు గలుగకుండ సార్థకత్వంబు నొందించి సత్యవశగత్వంబు వలనభవద ధీనుండనైన నన్నుం బ్రోచి కీర్తిలాభంబు వడయు మిక్కార్యంబునా

కును రామునకు లోకంబునకు గురువులకు భరతునకుఁ బ్రియంబై యుండునని ధర్మబోధంబుగాఁ బలుకుచు శోకరోదనతామ్రాక్షుండై కన్నీరు నించుచు విలపించుచున్న యద్దశరథుం గనుంగొని తదీయ విచిత్రకరుణవిలాపంబు విని యద్దేవి కోపరసాధి దేవతయుం బోలె నేత్రకోణంబులఁ దామ్రదీధితులు నిగుడ మొగంబు త్రిప్పి యతనిం దనచూపు చిచ్చునం గాల్చుచు నదత్తప్రతివచనయై యూరకుండె నప్పుడమ్మహీనాథుండు నిత్యంబును మనోనుసారిణియై యుండి తత్కాలంబున బుద్ధివైపరీత్యంబు వలనఁ బ్రతికూలభాషణంబులు వలుకుచున్న కైకేయి మొగంబు బట్టి చూచె రామవివాసనరూపంబగు వరంబుఁ దలంచి చిరపరిచిత ప్రేమంబున నద్దేవి నిధిక్కరింపం జాలక ప్రియపుత్రుని వనంబునకుం బనుచుట కోర్వక మూర్ఛాక్రాంతుండై ధరణిపయిం బడి యెనిట్టు విసంజ్ఞుండై పడియున్న యద్దశరథునకుఁ దెలివి దొరఁకొనుటకు నవ్విభావరి యనుగ్రహించె నంత దూర్త్వెట్టనగుచు వచ్చెఁ బదంబడి బోధనసాధన మంగళగీతాదికంబు సెలంగె నప్పుడు దాని వారించి పుత్రవియోగజనితశోకంబు సహింపం దరంబు గామికి నేలం బడి వివేష్టమానుండై విలపించుచున్న రాజు నవలోకించి మఱలనత్తెఱవ యిట్లనియె ॥ (తే, గీ) జనవరోత్తమ మును నాదు, సంశ్రయంబు । స్వీకరించియుదురితంబుఁ, జేసినట్లు । ధరణిపయిఁ బడి మిక్కిలి, పరితపించె । దేలస్థితియందు నిల్చుఁగాక దిగుణంబె ॥ (తే, గీ) ధర్మవిదులగు వారు స, త్యంబు పరమ । ధర్మమని పల్కి రేను నుధర్మయుక్తిఁ । దడయక డిగిలితి నీవును, ధర్మమూఁది । వరములొసఁగకయుబ్బంగి, వగచెదేల ॥ (చ) మును తన మేనుఁ గోసి నృప, ముఖ్యుఁడు శైబ్యుఁడు పక్షికిచ్చుట । ల్ప్రవిణుతవదాన్యశేఖరుఁ, డలర్కుఁడు పాఱునకక్షులిచ్చుట । ల్వననిధి వేలదాఁటి సుక, రంబుగ మేదిని ముంపకుండుట । ల్దినకరుఁ డెండ గాయుటయ్యు, ధీవర సత్యమునూఁది యేకదా ॥ (క) సత్యమునఁ గలుగుఁ బరమును । సత్యంబున నుండు ధర్మ, సంచయమెల్లన్ । సత్యంబె శ్రుతులు బ్రహ్మము । సత్యేతరమైనదొకటి, జగతిం గలదే ॥ (వ) రాజేంద్రా యేను ధర్మపరిపాలనార్థంబు నిన్నుం బ్రేరేపించితి నీకు ధర్మసంరక్షణంబునందు నియతి గలదేని మత్ప్రేరణంబునఁ బుత్రుండగు రాముని వనంబునకుం బంపు మిమ్మాటము మ్మాటికిం బలికితినని యిట్లు కైకేయిచే నతిప్రచోదితుండై యద్దశరథుం డుపేంద్రకృతంబైన పదత్రయప్రతిశ్రవరూపంబగు పాశంబునం గట్టుబడిన బలిచందంబున నాత్మవినాశకరం



బైన సత్యపాశంబునం గట్టువడి విడివడసమర్థుండుగాక యుగచక్రాంతంబునం జిక్కిన ధుర్యుని పగిది నుద్భ్రాంతచిత్తుండును వివర్ణవదనుండునై నేత్రంబుల నశ్రుకణంబులు దొరుఁగఁ గొండొక సేపూరకుండి వెండియు నొక్కింత ధైర్యంబవలంబించి యక్కైకయాననంబు విలోకింప రోసి యవాఙ్ముఖుండై యిట్లనియె ॥ (తే,గీ) నిగమసంస్కృతమైన యే, నీకరంబు । శిఖిసమక్షమునందు నాచే గ్రహింపఁ । బడియె నప్పాణి నిప్పుడు, విడుతు నాకుఁ । బ్రియసుతుండైన భరతుఁ బరిత్యజింతు ॥ (వ) మఱియు సూర్యోదయం బయ్యె నింక గురుజనంబు లభిషేకార్థంబు కల్పితంబులైన సంభారంబులచేత రామాభిషేకంబు నుద్దేశించి నన్ను వేగిరపడి పలుకుదురు గావున రాముండు కృతాభిషేకుండై యుండగలం డట్లుగాక నీచేత విఘ్నంబు సంభవించె నేని యతనియాననం బాలోకింపనోడి యేను బరిత్యక్తకళేబరుండనై లోకాంతరంబునకుం జనియెద నప్పుడు మృతుండనైన నాకు సలిలక్రియ సల్పుటకు రామభద్రుండె యర్హుండగుం గాని సమాతృకుండైన భరతుండర్హుండు గాఁడేను దొల్లి రామాభిషేకప్రారంభవేళయందుఁ దాదృశసుఖయుక్తంబైన జనంబున వలోకించి యిప్పుడు హతహర్షంబగుటవలన నిరానందంబైయున్న జనంబును గ్రమ్మఱ నవలోకింపం జాలనని పలికినఁ బాపచారిణియగు కైక క్రోధమూర్ఛితయై వెండియు నిట్లనియె ॥ (చ) జనవర క్రూరశస్త్రసదృశంబగు వాక్యముఁ బల్కెదేల నీ । తనయుని రాముఁ రాఁ బనిచి, దారుణకాననసీమకున్ వెస । న్బనిచి మదీయపుత్రునకుఁ, బట్టముఁ గట్టి మహాత్మ నన్నుఁ జ । య్యనసపత్నఁ జేసి చరితార్థుఁడవై సుకృతంబుఁ గాంచుమీ ॥ (వ) అని పలికిన నమ్మహీరమణుండు తీక్ష్ణంబైన ప్రతోదంబుచేతఁ దాడితంబైన హయంబు భంగి సారెసారెకుఁ గైకేయీ వాక్యచోదితుండై యద్దేవి నవలోకించి యేను ధర్మపాశంబున బద్ధుండనైతి మద్బుద్ధి ప్రణష్టయయ్యె యశస్వియు జ్యేష్ఠపుత్రుండును బ్రియుండును ధార్మికుండును నగు రామునిం జూడఁ గోరెద నతని రావింపుము ॥ (క) అని యిట్లు పలు దెఱంగుల । జననాథుఁడు పరితపించు సమయంబునఁ బూ । ర్వనగశిఖరోపరిస్థిత । ఘనరత్నము వోలె దీవ్ర కరుఁ డుదయించెన్ ॥ (వ) తదనంతరంబ మహాత్ముండగు వసిష్ఠుండు సరయూనదియందు స్నానాద్యనుష్ఠానంబులు దీర్చి సునక్షత్రయోగంబైన సుముహూర్తంబరసి శిష్యగణంబు లభిషేకసం

(*)వసిష్ఠుఁడుదశరథునిమందిరంబునకువచ్చుట, (*)

భారంబులు సంగ్రహించుకొని దోడనడువ సిక్తసమ్మార్జిత పథంబును బతాకాధ్వజభూషితంబును విచిత్రకుసుమాస్తీర్ణంబును సంహృష్టమనుజోపేతంబును సమృద్ధవిపణాపణంబును మహోత్సవసమాకీర్ణంబును సర్వరాజాభినందితంబును సమంతతశ్చందనాగరుధూపపరిధూపితంబైన పురందరపురంబునుం బోలె సమస్తకళ్యాణభాజనంబై యొప్పునప్పురవరంబుఁ బ్రవేశించి రాజమార్గంబునం జనిచనియందు నానాద్విజగణయుతంబును బౌరజానపదాకీర్ణంబును బ్రాహ్మణోపశోభితంబును యజ్ఞకర్మవిశారద పరమఋత్విగ్జన సదస్యసంపూర్ణంబునైన యంతఃపురంబు డాయంజని యచ్చటివారినందఱ నతిక్రమించి రాజమందిరద్వారంబుఁ బ్రవేశించి యచ్చటికింజనుదెంచి యున్నవానిఁ బ్రియదర్శనుండగు సుమంత్రుండను సూతునవలోకించి మహీపతికి మారాక యెఱింగింపుమని పలికి వెండియునతనికిట్లనియె ॥ (సీ) నిర్మలమందాకి, నీకంధిజలపూర్ణకమనీ

(వసిష్ఠుఁడుసుమంత్రునితోదశరథునికిఁదనరాక యెఱింగింపు మనుట.)

యకాంచన,ఘటశతంబు । ధర్మదామపినద్ధ, పాండురవృషభంబు భూరిచతుర్దంత, వారణంబు । నభినవౌదుంబరం బగుభద్రపీఠంబు నసమాన రుచిరక, న్యాష్టకంబు । కాంచనాలంకృత, ఘనకేసరాన్వితరమణీయభవ్యతు, రంగమంబు ॥ (తే, గీ) చామరంబులుశశినిభ చ్ఛత్రములుస । మగ్రశార్దూలచర్మ సింహాసనంబు । ఖడ్గమునుగార్ముకంబును,గనకరథము । వర్ణితంబైననరయుక్తవాహనంబు ॥ (వ) మఱియుహిరణ్మయంబగు భృంగారువును సర్వబీజంబులును గంధంబులును వివిధంబులగురత్నంబులును క్షౌద్రంబునుదధియును ఘృతంబును క్షీరంబులునులాజలునుసమిత్కుశప్రముఖహోమద్రవ్యంబులును సర్వవాదిత్రసంఘంబునుబుణ్యంబులగుమృగపక్షిగణంబులునుస్వలంకృతలగుయువతులునుబౌరజానపదశ్రేష్ఠులునునాచార్యులునుబ్రాహ్మణులునుశ్రేణిముఖ్యులును ధేనువులునుబార్థివులునుమఱియుం దక్షిణమంగళద్రవ్యంబు లన్నియునోడఁగూడె మఱియుసమస్తజనంబులునుకుతూహలపరులై యున్నవారుగావుననీపురయంబున రాజసన్నిధికిఁ జనినారాక యెఱింగించి రామాభిషేకముహూర్తసమయంబాసన్నంబయ్యెనని చెప్పుమనిన నతండట్లకాక యనియవార్యగమనంబునసంతఃపురంబుఁబ్రవేశించిదశరథునకుంబాటిల్లినదురవస్థ యెఱుంగనివాడగుటంజేసి



యెప్పటియట్ల నమ్మహీపాలుని కడకుంజని సంప్రీతచేతస్కుండగుచునిటలతటఘటితాంజలిపుటుండై ప్రాతఃకాలాహ్ణంబులును బరితోషకారణంబులునైన

సుమంత్రుఁడు దశరథుని మేలు కొలుపుట.

వాక్యంబులనిట్లనియె ॥ (తే, గీ) అధిపసంపూర్ణ చంద్రోద యంబునందు । సంక్రమితతన్మనోజ్ఞతే జమునజలధి । చెలఁగిసుప్రీతుఁడగుచురం జిల్లఁజేయు । కరణిరంజిల్లఁజేయుము కరుణమమ్ము ॥ (ఉ) మాతలిజంభసూదనుని మాడ్కిశ్రుతుల్పరమేష్ఠియట్లయ । ధాతసఖుండుచంద్రుఁడును బాయకనెప్పుడుమేదినిం బలె । న్భూతలనాథ యేనినుఁబ్ర బోధితుఁజేసెద మేలుకొమ్ముసం । జాత కుతూహలంబునఁబ్ర సాదముఖుండవు గమ్మునాయెడన్ ॥ (ఉ) రాజవరేణ్యమోదమల, రంగృతకౌతుకమంగళుండవై । యోజదలిర్పరత్నరుచి, రోత్తమ భూషణభూషితుండవై । తేజమెలర్పభాస్కరుఁడు, దేవనగంబుననుండిసర్వది । గ్రాజివెలుంగవెల్వడిన, కైవడిలెమ్ముప్రసన్నమూర్తివై ॥ (క)జననాథపవనసోములు। దిననాథుఁడుషణ్ముఖుండు దేవాధిపుఁడు । స్వననిధివిభుండుశంకరుఁ । డనిశము జయమిత్తురతిద యామతినీకున్ ॥ (సీ) మనుజనాయకరాత్రి చనియెసహస్రాంశుఁ డుదయించెమేల్కాంచి యుచితవిధులు । సలిపిరామాభిషే చనకార్యమొనరింపఁ గడఁగుమరుంధతీకాంతుఁడఖిల । సంభారములఁగూర్చి సకలభూసురయుతుండై నగరద్వార మందునిలిచి । యున్నవాఁడెల్లవా రుత్సవశ్రీదర్శనోత్సాహులై కూడి యున్నవారు ॥ (ఆ, వె) చందురుండు లేని శర్వరికరణిఁగా । పరియులేనిపసుల ఘగిదిగిబ్బ । లేనిమొదవుభంగి నై నీవులేనిపీ । డొనర వేడ్కసేయకున్నదిపుడు॥ (వ) అనిపలికిన నతనిస్తుతివచనంబు లాకర్ణించి క్రమ్మఱ నమ్మహీపతి శోకమూర్ఛాపరవశుండగుచు నెఱ్ఱనివిరితామరలందెగడు కన్నులు విచ్చి సుమంత్రునవలోకించి నష్టహర్షుఁడై కైకేయీ క్రూరవచన నికృత్తమర్ముండనైన నన్ను స్తుతివాక్యంబులచేతఁ గ్రమ్మఱ నేలపరితపింపఁ జేసెదవనిననతండమ్మహీవిభుని దీనస్వరంబునువదనంబునందలి వైవర్ణ్యంబును బరికించి యిదియేమియొకోయని వెఱఁగందుచు నేమియుం బలుకనేరక యూరకుండెన

కైక రాముని దోడి తెమ్మని సుమంత్రునియోగించుట.

ప్పుడు స్వకార్య వక్తవ్యవిచారయగు కైకసూతపుత్రునవలోకించియిట్లనియె॥ (ఉ) ఓయిసుమంత్రరామవిభ వోత్సుకుఁడై జననాథుఁడీనిశ । న్బాయక నిందుజా

గరమొ నచ్చుటచేఁగడుడస్సియిందుసి। ద్రాయుతుఁడయ్యెనీవరిగిరాజకుమా రవరేణ్యుఁజానకీ। నాయకురామభద్రునిజనప్రియుఁదోడ్కొనిరమ్ము చెచ్చెరన్॥ (వ) అని వేగిరపడిపలికిన నద్దేవి పలుకులందోఁచు విశ్వాసంబువలన నిక్కంబుగా మహీపతిశాసనంబున నద్దేవియభిషేకార్థంబు రామునిం దోడ్కొనిరమ్మనియెనని తలంపుచుఁ బ్రీతచేతస్కుండై సాగరహ్రద సంకాశంబయిన యంతఃపురంబు నిర్గమించి జనసంబాధంబగు మొగసాలకడకుం జనుదెంచి యచ్చటనున్న మహీపతులను బౌరులను పహారపాణుల నుపస్థితులవిలోకింపుచుం బోవుచుండె నప్పుడు సభాసదనంబునందు నిండియున్న వేదపారగులగు విప్రులును బలముఖ్యులును మంత్రులును మహీపతులును రాజపురోహితులునుదక్కిన సమస్తజనంబు లొక్కటగుంపులుగట్టితమలోన సూర్యుఁడుదయించెఁగర్కాటకలగ్నంబు డగ్గరియె సమగ్రవ్యాఘ్రచర్మ సమాస్తీర్ణంబగు రథంబును గాంచనమయంబగు భద్రపీఠమును సాగర గంగా యమునా సరస్వతీప్రముఖ ముఖ్యాపగా సరోవరహ్రదకూపజలపూరిత క్షీరయుక్తపల్లవోపేతంబులై పద్మోత్పల కైరవశోభితంబులై సరస చందంబునం దనరు ధౌత కలధౌత ఘటంబులును దధిమధుఘృతలాజదర్భ పుష్పక్షీర ప్రముఖ మంగళద్రవ్యంబులును సర్వాభరణభూషితలగువారకాంతలునుజంద్రాంశువికచప్రఖ్యంబులునురత్నదండమండితంబులునుగంధపుష్పాలంకృతంబులునైన వాలవ్యజనంబులును సుధాకర మండలసంకాశపాండరచ్ఛత్రంబునుబాండురవృషభంబునుబాండురాశ్వంబును ప్రశస్తమదద్విపంబును రాజవాహ్యంబులును స్వలంకృతంబగు కన్యాష్టకంబును సర్వవాదిత్రంబులును సూతమాగధవందిగాయకులును దక్కిన సమస్తమంగళద్రవ్యంబులును సన్నిహితంబులయ్యె నింకఁదడవేలయని వేగిరపడుచుండిరి మఱియు యోగ్యానర్ఘ రత్నవస్తుజాతం బుపాయనంబుగాఁగొని రాజశాసనంబున రామాభిషేకంబునకుం జనుదెంచిన మహీపతులందఱుఁగూడుకొని మహీపతిం జూడమైతిమి సూర్యుండుదయించె రామాభిషేక సంభారంబంతయుసజ్జంబయ్యె మనరాక మహీపతికెఱింగించువాఁడెవ్వండొక్కో యని విచారింపుచుండ సార్వభౌములైన యమ్మహీపతుల నందఱవిలోకించి రాజసత్కృతుండగుచు సుమంత్రుఁడేను రాజశాసనంబున రామునిం దోడితెచ్చుటకుఁబోవుచున్నవాఁడ మీకు దశరథునకు రామునకు విశేషించి పూజ్యులు గావున దీర్ఘా



యుష్మంతులైన మీవచనంబువలన దశరథుని కుశలంబడిగి దర్శనంబునకు రా

(*) సుమంత్రుఁడు మహీపతుల నియోగంబున మఱలదశరథునియొద్దకరుగుట.(*)

కుండుటకునైన కారణంబు నడిగెదనని చెప్పి సామంతరాజానువర్తన రూపపురాణ వృత్తాంతాభిజ్ఞుండైన సుమంత్రుఁడు మఱలి యంతఃపురంబుదాఁటిసదాసక్తంబైన యమ్మహనీయమందిరంబుఁ బ్రవేశించి యమ్మహీపాలుని వంశంబుఁ గొనియాడుచు శయనగృహంబులోనికింజనియవనికమాటున నుండి గుణయుక్తంబులైన యాశీర్వచనంబులచేత స్తోత్రంబు గావించు తలంపున నిట్లనియె॥ (క)రవిసోములు వాసవవై। శ్రవణులు వహ్నియును మఱియు,జలధివిభుండున్॥ శివుఁడును గారుణ్యంబున। నవనీశ్వర విజయమిత్తు,రనిశము నీకున్॥ (ఆ,వె) అధిపరాత్రి చనియె, నర్యముఁడుదయించె। సర్వకృత్యములును, జతనుపడియె। రాజచర్య యింక, రమణతో మేల్కొన। వలయుఁ గార్యమెల్ల, సలుపవలయు॥ (క)బలముఖ్యులు భూసురులును। చెలువుగ నైగములు వచ్చి, చిత్తంబునమి। మ్మలఘుమతిఁ జూచుకోరికఁ। దలవాకిట నున్నవారు, ధరణీనాథా॥ (క( అని పలుకు నలసుమంత్రుని। ఘనబుద్ధిని మంత్రవిదునిఁ,గనియతని సుమం। త్రునిఁ గా నెఱింగి వెస న। య్యిన కులహారిణాంకుఁడతని, కిట్లనిపలికెన్॥ (సీ సూత



శేఖర నీవు, సీతాధి పతిని శీఘ్రమునఁ దోడ్తెమ్మని, కైక చేతఁ। బరఁగ నియోగింపఁ, బడితి వట్లనుమత మనిషిద్ధ మనెడు న్యాయంబుచేత। మొనసి మచ్ఛాసనం, బున వచించిన కైక వచన మమోఘమ, వ్వాక్యమేల। దీర్ఘ కమఱలనే, తెంచితి వది నాదు మత మొ కాదోయని, మానసమున॥ (ఆ,వె)సంశయించినట్లు, చనుదెంచితివొ జాగు। సేయ వలదు మఱలఁ, జెప్పనేల। రయముమీఱ నేగి, రాముని రవివంశ। తోయరాశిసోముఁ, దోడి తెమ్ము॥ (చ) అనిన మహాప్రసాద మని, యాతఁడు నేలిన వానియాజ్ఞఁజ। య్యనఁ దలఁ బూనిభక్తి వినయప్రమదంబులు మానసంబున। న్బెనఁగొన సంతతోత్సవన, వీకృత రాజపథంబునంబుర్తీ। జనములు తన్నుఁజూచి కడు, సంతస మందఁగ నేగె నున్నతిన్ (తే,గీ) రాజవీధుల నందంద, రమణతోడఁ। జెలఁగి శ్రీరామచంద్రాభి,షేక కథలఁ। జెప్పుకొను వారి మాటలు, చిత్తమలర। నాలకింపుచు రయమున్నన

—(*)సుమంత్రుఁడు శ్రీరామ మందిరముఁ జేర నరుగుట.(*)—

రిగెడు నతఁడు॥ (వ) ఇత్తెఱంగునఁజని॥ (సీ) సురుచిరోరు కవాట, శోభితంబగు దాని వేది శతంబుల, వెలయుదానిఁ। గాంచనప్రతిమావి, కాసితంబగుదాని శరదంబుదములీల, వఱలుదాని। రత్నప్రవాళతో,రణయుక్తమగు దాస యమరాచలగుహాభమైనదానిఁ। జందనాగరుధూప, సంయుతంబగుదానిమణి మౌక్తికంబుల, మలయుదాని॥ (తే,గీ) నమలకైలాసశిఖరాభ, మైనదాని। బలరిపుని మందిరము భంగి నలరుదాని। రుచిర మగుదాని రామభ,ద్రునిమనోజ్ఞ। దివ్యమణిమయ హేమమందిరముఁగనియె॥ (తే,) మఱియు వరమాల్యాంతరాళ విళంబమాన నూతనమణిగణాలంకృతంబును మనోహరసుగంధ బంధుర దర్దురశైల శిఖరసంకాశంబును సారసమయూర నినద సంకులంబును సుకృతేహామృగా కీర్ణంబును భక్తి రచితంబును సూక్ష్మచిత్ర శిల్పోత్కీర్ణంబును సకలజన దృష్టిచిత్తాపహారంబును జంద్రభాస్కరసంకాశంబునుగుబేరభవనోపమంబును నానాపత్త్రిసమాకులంబును సుమేరుశృంగ సన్నిభంబును మహామేఘ ప్రఖ్యంబును నానారత్నసమాకీర్ణంబును గుబ్జకైరాతకావృతంబును నుపస్థితాంజలికారిజన సమన్వితంబును నుపాయనపాణిజానపద జనోపేతంబును నగు రామభద్రుని భద్రభవనంబువిలోకించి రథంబుతోఁగూడఁ బ్రవేశించి పురస్థిత జనంబులచిత్తంబు రంజిల్లంజేయుచు యమ్మందిరంబు మహాధనంబై మహోన్నతంబై మృగమయూర సంకీర్ణంబై మహాజనసంకులంబై మహేంద్రభవనంబుకరణి నలరుచునికి నానందింపుచుఁ గైలాస సన్నిభంబులై స్వలంకృతంబులై త్రిదశాలయోపమంబులై యొప్పుద్వారంబులవలోకింపుచు నచ్చటనున్న రామమతానుసారులగు ప్రియజనంబులనతిక్రమించి శుద్ధాంతంబుడాసి యచ్చట హర్షయుక్తంబులును రామాభిషేకప్రయుక్తంబులును రామచంద్రమంగళ ప్రతిపాదన ప్రయోజనంబులును నగు జనవాక్యంబులు వినియలరుచు మహేంద్రసద్మప్రతిమంబును రమ్యంబును మృగపక్షిజుష్టంబును సుమేరుశృంగోన్నతంబును మనోహరప్రభా విరాజమానంబునునగు యమ్మహనీయ మణిసద్మంబు విలోకించి యందువిముక్తయానులై యుపాయనపాణులై మ్రోలనిండియున్న జానపదుల నంజలికారులఁ గోటిపరార్ధ సంఖ్యాతుల విలోకించి వారలచేతనభిసంవృతంబైన ద్వారపథంబుఁజూచి యచ్చట మహామేఘ మహీధరసంకాశంబై మదధారాకలిత గండభాగంబై యతిక్రాంతాంకుశంబైయ



ప్రసహ్యంబై యుదగ్రకాయంబై యొప్పుచున్నదాని రామౌపవాహ్యంబైన శత్రుంజయాఖ్య మహాగజంబు నీక్షింపుచుం జనిచని యుభయపార్శ్వంబుల స్వలంకృతులై గజాశ్వరథారూఢులై యొప్పువారి రాజప్రియుల శతసంఖ్యాతుల నందఱ నతిక్రమించి యమ్మహాద్వారంబుదాఁటి యచ్చటఁ దేరుడిగ్గి యవ్వలనాసంబాధంబై ప్రాసకార్ముకహస్తులై మృష్టకుండలులయి యప్రమాదులయి యేకాగ్రమనస్కులయి పరస్పరానురక్తులై యొప్పు యువపురుషులచేత నభిరక్షితయయిన వేరొక్క కక్ష్య డాయంజని యందు కాషాయ కంచుక ధారులై స్వలంకృతులై సుసమాహితులై యలరు నంతఃపుర ద్వారరక్షకులఁ బరమవృద్ధుల రామప్రియచికీర్షుల విలోకించి వారందఱుఁ దన్ను సందర్శించి రయంబున నాసనంబులనుండి లేచి ససంభ్రములై యెదుర్కొనినవారి నభినందించి వినీతాత్ముండును సేవానిపుణుండునగు సుమంత్రుండిట్లనియె॥ (తే, గీ) చెలువు మీఱంగ మీరులో,పలికిఁబోయి। రహి సుమంత్రుండువచ్చిద్వా,రమున నిలచి। యున్నవాఁడని నారాక, యొప్పమీఱ। మొనసి రామున కెఱిగింపుఁ, డనినవారు॥ (క) రయమునలోపలికింజని। ప్రియసహితుండైనరామ విభునుచితగతిన్। నయమారఁగాంచి దెల్పిరి। ప్రియమలర సుమంత్రురాక, వినయముతోడన్॥ (క) చెప్పినరఘుసత్తముఁ। డప్పుడు గుర్వంతరంగుఁ,డయిన సుమంత్రుం। దప్పక దోడ్తెమ్మనిముద। మొప్పఁగ సెలవొసఁగ వార,లుత్సాహముతోన్॥ (వ) శీఘ్రంబున మఱలంజనుదెంచిన సుమంత్రునకు రామశాసనంబెఱింగించిన నతండు ప్రభూతరత్నంబగు సముద్రంబుఁ బ్రవేశించు మహామకరంబుకైవడి మహావిమానోత్తమ వేశ్మసంఘవంతంబైన యంతఃపురంబుఁ బ్రవేశించి యందొక్క సువ

—(*)సుమంత్రుండు రామునికి దశరథనియోగంబెఱిగించుట.(*)—

ర్ణపర్యంకమధ్యంబునందు॥ (సీ) కటితటిశోభిల్లు, కౌశేయచేలంబు ఘనము చెంగటి మించు, కరణిఁదనర। హరిచందనార్ద్రకా యంబుసంధ్యారాగ ఘనయుక్తనీలాద్రి, గతి వెలుంగ। ఘనహారకలితవ, క్షములసన్నక్షత్రశోభితాభ్రముభంగి,సొంపెలర్ప। నిఱువంకసేవించు, పరరాజకీర్తుల కరణిముత్యాల చౌకట్లుమెఱయ। (తే, గీ) రత్నహారంబులురమునఁ,గ్రాలవామ। భాగమున నుండిజానకి, భర్మదండ। చామరము వీవఁ దారకా,జానిభంగి। వెలయురాఘవుని సుఖోప,విష్టుఁగనియె॥ (క). కనివినయజ్ఞుఁడుసూతుఁడు। మునుకొనితల

త్పాదమూల, ములువలసోఁకం । బ్రణమిల్లి కృతాంజలియై । వినయంబుననిట్టులని
యె విశ్రుతిఘనకీర్తి ॥ (క) అనఘాత్మ నృపతి కేకయ । మనుజేంద్రకుమారికాస
మన్వితుఁడగుచు । న్నినుఁజూడఁగోరెననుఁదో । డ్కొనిరమ్మనవచ్చితి, నుత్త్వ
రితగతిన్ ॥ (క) నావినిరాముఁడు మోదం । బావిర్భవ మొందసూతు, సహర్ష
విధులసం । భావించివేగసీతా । దేవికినిట్లనియె వదన, దీధితులడరన్ ॥ (క) వ
నితానృపతియుఁగైకయు । ఘనబుద్ధిమదర్థమందుఁ గడువడినభిషే । చన
సంయుతపర్యాలో । చనమునుగావింపుచున్న, చందముదోఁచెన్ ॥ (వ) మఱియు
కేకయరాజనందన రాజసౌముఖ్యాది ప్రయోజనంబుకొఱకు సంతతంబు మృదు
మధురభాషణపరిచర్యాభక్తియోగంబుల నమ్మహీపతి చిత్తంబెఱింగి వర్తింపు
చుండు నట్టిహితకామానువర్తినియుమదర్థ వృద్ధ్యపేక్షిణియునైన యద్దేవి
వృద్ధుండగు మహీపతియభిప్రాయంబెఱింగిసుదక్షిణగావున రాజునకుఁ బ్రియం
బుపుటఁబరమానందంబున మదభిషేకంబుం గూర్చిచింతింపుచున్నదనియూ
హించెద నట్లుగాదేని ప్రియసహితుండై మహీరమణుండు మదర్థ కామకరుం
డైన సుమంత్రుని మత్సకాశంబునకుం బుచ్చునే మదర్థైక ప్రయోజనుండగు
సుమంత్రుండుచనుదెంచుటంజేసిరాజాంతఃపురంబునందుమదర్థైకప్రయోజనం
బైనపర్యాలోచనంబు ప్రవర్తింపుచున్నదిసందియంబులేదుమహీరమణుండిప్పు
డు నన్ను సామ్రాజ్య పట్టభద్రునిం జేయు నమ్మహాత్ముని సదనంబునకుం బో
యి వచ్చెద నిచ్చట సఖీజనంబుల తోడం గ్రీడింపుచు సుఖంబుండుమని ప
లికినఁ బతిసన్మానిత యగు సీత సంతుష్టాంతరంగయై మృదుమధుర భాషణం
బులనిట్లనియె ॥ (సీ) ప్రాణేశ సర్వశు, భంబులు నినుఁ బొందుఁ బరమేష్ఠి య
ల శచీ, పతికిఁబోలె । సుర్వీశ్వరుఁడు నీకు, యువరాజ్యపట్టంబుఁ గట్టువాఁ డు
త్తర, కాలమందు । రాజసూయ మహాధ్వ, రమున దీక్షితుఁడవై యజనంబుఁ
జాల్చి మహావిభూతి । పటుకురంగవిషాణ, పాణివై యలరారు నినుఁ గాంచి
భజియింతు, నెమ్మితోడఁ ॥ (ఆ, వె) బోయిరమ్ము వజ్రి, పూర్వాశ మనుండు ।
పరగఁ దక్షిణాశఁ, బాశపాణి । పశ్చిమాశయందు, పాలుఁ డుత్తరదిశఁ । గాతు
రెపుడు నిన్నుఁ, గరుణతోడ ॥ (వ) అనియిట్లు మంగళం బొసంగి పతి వెం

(*) రాముండు దశరథ మందిరంబునకుఁ బోవుట. (*)

ట ద్వారపర్యంతం బరుగుదెంచి సముచితంబుగా వీడుకొల్పిన ననుష్ఠితార్థ



మంగళుండగు నా రఘుపుంగవుండు సీతచేత నామంత్రణంబు వడసి గిరిగుహా
ముఖంబు వలన నిర్గమించు దృప్తకంఠీరవంబు చాడ్పున నిజ మందిరంబు వె
లువడి యంతఃపురద్వారంబు నందు బద్ధాంజలియై కాచికొని యున్న లక్ష్మ
ణుం గలిపికొని మధ్యమ కక్ష్యాంతరంబు నందు వ్యాఘ్రచర్మ యుక్తంబును
మణిహేమ విభూషితంబును మార్తాండ మండలదుర్నిరీక్ష్యంబును మేఘగం
భీర నిర్హ్రాదంబును గరేణు శిశుకల్పజవతురంగ సంగతంబును నసంబాధం
బును నగు సుందరస్యందనం బారోహించి దివ్యరథాధిరూఢుండైన సహస్రా
క్షుని చందంబున నందంబగుచు మహాభ్రంబు వలన నిర్గమించు శశాంకుని
భంగి వెలుంగుచు గగనంబునందు స్వనవంతుండైన పర్జన్యుని సొబగునరథ
నేమి ఘట్టన సంజాత నిస్వనంబున దిగంతంబులు పూరింపుచు నానావనీపక
లోకంబు మీఁదఁ దనచల్లని చూపులు వెదచల్లుచు ఛత్రచామర హస్తుండై ల
క్ష్మణుండు పిఱుంద డెస రథంబు మీఁద నుండి బహు ప్రకారంబుల రక్షించు
కొనుచుం జనుదేర వాయువేగంబులగు హయంబులును గిరి సన్నిభంబులగు
గజంబులును శతసహస్రంబులు పశ్చాద్భాగంబునం జనుదేర సన్నద్ధులై ఖడ్గ
చాపధరులై చందనాగరు రూషితులై యోధు లనేకు లగ్రభాగంబున నడువ
సూతమాగధవంది గాయక పాఠకజనంబు లమందానందంబున నభినందింప
మురజమృదంగ పణవశంఖ కాహళ నిస్సాణ వేణువీణా ప్రముఖనిఖిల మంగళ
వాద్యరవంబులు చెలంగ హయ హేషితంబులును గజబృంహితంబులును రథ
నేమినిస్వనంబులును దూర్యఘోషంబులును మాగధాదుల స్తుతినాదంబులును
గాయకుల గానస్వనంబులును భూసురుల యాశీర్వాదనాదంబులును జనంబుల
హర్షశబ్దంబులును వారకాంతల చరణనూపుర క్రేంకార నినదంబులును వే
త్రపాణులసాహోనాదంబులు నొక్కటియై మిన్నుముట్టి ప్రాయహర్మ్యాగ్ర
భాగంబులనుండి పురాంగనలు పుష్పంబులు సేసలుఁ జల్ల భూసురాంగనలు క
ర్పూరదీపకళికల నివాళింప ననంతవైభవాభిరంజితుండై యా రఘు కుంజరుం
డు శ్రీమంతుండగు వైశ్రవణుని భంగి వెలుంగుచుఁ గరేణు మాతంగ రథా
శ్వసంకులం బగు దాని మహాజనాఘ ప్రతిపూర్ణ చత్వరంబగు దానిఁ బ్రభూ
తయానంబగు దాని బహు పణ్యసంచయంబగు దానిఁ బతాకాధ్వజసంపన్నం
బగు దాని మహార్హ చందనాగరు ధూప వాసితంబగు దాని నానాజనసమా

కులంబగు దాని మహాభ్రసంకాశ పాండురమందిరోపశోభితంబగు దాని ముఖ్యచందనాగరు సంచయంబుల మహార్ఘగంధంబుల క్షౌమకౌశాంబరవితానంబుల ననర్ఘ ముక్తాజాలంబుల మహనీయ స్ఫటికోపమంబుల నానాపణ ప్రసారిత నానావిధ భక్ష్య పదార్థంబుల దధ్యక్షత హవిర్లాజ చందనాగరు నానామాల్యోప గంధంబులచేత నిరంతరాభ్యర్చితంబులైన శృంగాటకంబుల నభిరంజితంబగు దానిం బాండుర విమానంబుల చేత గగనంబునుం బోలెం గైలాసశిఖరోపమ పాండురమేఘసంకాశరమణీయ ప్రాసాదశృంగంబుల చేత నభిరామంబగు దాని రాజమార్గంబుం బ్రవేశించి సుందరమందగమనంబునం బోవు సమయంబున ॥ (చ) లలిత విచిత్రహర్మ్య పటలంబులపై నలరారు

(*) పౌరులు రాముని నానావిధంబుల నభినందించుట. (*)

పౌరకాంతలు తమలోన నీరఘువర, తంసుఁడు రాజ్యపద ప్రవిష్టుఁడై । యిల నతులప్రభావమునఁ నేలఁగ నేఁటికిఁగంటి మెంతయుం । దలఁపఁగ నస్మదీయ సుకృతంబు గణింపఁదరంబెథాతకున్ ॥ (తే, గీ) చెలఁగి సామ్రాజ్య పట్టాభిషిక్తుఁడైన । సుతవరుని సిద్ధయాత్రునిఁ జూచి నేఁడు । పుణ్యసాధ్వి కౌసల్యయ భూతపూర్వ । ఘనతరానందకలితయై, తనరుఁగాదె ॥ (తే, గీ) సోముఁగూడిన రోహిణీ, భామ పగిది । నిజగన్మోహనునిఁ గూడి, యింపు మెఱయ । సర్వ భోగంబులు భుజించు,జనకతనయ । సకలసీమంతినీవతం, సంబుగాదె ॥ (క) ఈఘనునికుఁ బ్రియగేహిని । యై ఘనరాజ్యాభిషిక్తయగుట కుమున్నా । మేఘలసత్కచ మహిజ య । మోఘతపం బేమి నిక్కముగసల్పెనొకో ॥ (క) అనియిట్లు రామభద్రుఁడు । వినుచుండఁగఁ జెప్పుకొనుచు, వేడుకతోడం । గొనియాడుచు నప్పుణ్యునిఁ । గనుఁగొనుచుండి రటుకౌతుకంబలరారన్ ॥ (వ) మఱియును ॥ (ఉ) ప్రాకటభూరిచత్వర రస, భాభవనంబులయందు భూజనుల్ । ల్చోఁకలుగట్టి యీపరమ, పుణ్యుఁడు దీనశరణ్యుఁ డిప్పురా । జైక్య కపదస్థుఁడయ్యెనహా, హా మముఁ బోంట్లకు నెల్లసంతతా । స్తోకతరేష్ట సంపదలు, సొప్పడుఁగాదె దలంచి చూడఁగన్ ॥ (ఆ, వె) ఈమహానుభావుఁ, డేలు రాష్ట్రింబునఁ । గాపురములు సేయు,ఘనులకమర । లోకమేల యన్య, లోకంబులేలయ । భీప్సితార్థసిద్ధి,లిందె కలుగు ॥ (తే, గీ) అనఘుఁ డీరాముఁ డధినాథుఁడగుచు నుండ । నప్రియము దుఃఖ మొక్కింత, యైనఁ గలుగ । దింతకంటెను మ



డ్కసేయుచున్న రాజమార్గంబునం జసిచని ముందఱ రత్నజాల పరిష్కృతంబులైన వర్ధమానగృహంబులచేత శారదాభ్ర ప్రతీకాశంబులైన విమానంబులచేతఁ గైలాసశిఖరాకారంబులైన మహోన్నత ప్రాసాద శిఖరంబులచేత నభిరామ దర్శనంబైయున్న రాజభవనంబుఁ గాంచి హర్షపులకితగాత్రుండై యమ్మణిమయ మందిరంబుఁ బ్రవేశించి కక్ష్యాత్రయం బతిక్రమించి యచ్చటరథంబుడిగ్గి తేవనంబున నవ్వలికక్ష్యాద్వయంబుదాటి సహచరులనందఱ నచ్చటనిలువనియమించి క్రమంబునఁ గక్ష్యాంతరంబులన్నియు నతిక్రమించి శుద్ధాంతఃపురంబుఁబ్రవేశించె జనంబంతయుఁ జంద్రోదయంబు నాకాంక్షించు సరిత్పతిభంగి రాముని పునరాగమనంబుఁ గోరుచు మధ్యమద్వారంబుననుండె రామ

రాముఁడు దుఃఖితుండగు దశరథునిఁజూచి విచారపడుట.

భద్రుం డట్లు సముచితంబుగా నంతఃపురంబునకుంజని యందుఁ గైకేయీసహితుండై పర్యంకమధ్యంబునం బవ్వళించి మొగంబున వైవర్ణ్యంబు దోఁపఁగ న్నుంగవమోడ్చియున్న తండ్రినవలోకించి తదీయ చరణంబులకు నిజనామోచ్చారణపూర్వకంబుగా నభివందనంబుఁ గావించి పదంపడి కైకేయి పదంబులకు నమస్కరించిన నద్దశరథుండు మెల్లనఁ గన్నులువిచ్చి కుమారు వదనంబువిలోకించి రామాయని పేర్కొని బాష్పపర్యాకులేక్షణుండై యతని విలోకించుటకుం జాలక క్రమ్మఱ నేత్రంబులుముకుళించి రామాయనెడు నక్షర ద్వయోచ్చారణంబుకంటె నధికంబుచ్చరించుటకు భరంబైతోఁచిన నతనితోడ సంభాషించుటకుం జాలకుండె నివ్విధంబున నింకిన సముద్రంబు పగిది నుపప్లుతుండైన సూర్యునిభంగి ననృతంబులాడినమహర్షిపోలిక వ్యథితాకులిత చిత్తుండై తేజోహీనుండై శోకసంతాపకర్శితుండై యదృష్టపూర్వవిషాదుండై యప్రహృష్టేంద్రియగోచరుండై యూర్పులువుచ్చుచున్న దశరథుంజూచి పాదంబుచేతఁ బన్నగంబును సంస్పృశించినవానిపగిది భయంబుఁ గొని యచింత్యకల్పంబైన జనకు నిశ్శోకంబు విలోకించి పర్వకాలసముద్రునిభంగి సంరబ్ధతరుండై పితృహితతత్పరుండగు రాముండు తొల్లి పరోక్షంబునందు నాయందుఁ గుపితుం డయ్యును నన్ను విలోకించినప్పుడు ప్రసాదంబొసంగు నట్టిపరమదయాళుండైన యిమ్మహీరమణుం డిపుడేలొకోనన్ను విలోకించి ప్రీతిసేయక దుఃఖంబునొంది యున్నవాఁడని విచారించి విషణ్ణవదనుండై దీనుండునుంబోలె శోకార్తుండై కైకేయికి

హిఁ బ్రజ, కెద్దిలాభ । మితఁడు చిరజీవియై ధాత్రి, నేలుఁగాక ॥ (వ) మఱియు
రాముండు రాజ్యాభిషిక్తుం డగుచుండఁ బితృపితామహులచేత నుపలాలితులైన
పుత్రపౌత్రకులభంగి మనమందఱము. సర్వసుఖంబులు వడయంగలవారము మ
న కిప్పుడు భోజనం బేల పరమ పురుషార్థ సాధనంబులైన తపస్స్వాధ్యాయజ
పహోమధ్యానాదికంబు లేల యితండు రాజ్యంబునందు సుప్రతిష్ఠితుండై శత్రుం
జయం బను మహానాగంబు నారోహించి రాజమార్గంబునం జనుదెంచునప్పు
డిమ్మహనీయ మూర్తి నవలోకించు నదియె మనకు సుఖలాభం బైహికవిష
యంబులచేతను దజ్జన్యసుఖంబులచేతను శ్రేష్ఠార్థంబులైన స్వర్గాదుల చే
తను దజ్జన్య సుఖంబులచేతను దృప్తి నొందిన వారమగుటకు సందియంబు లేదు
మహాతేజుండగు రాముని యభిషేకజన్య భూమానంద బ్రహ్మసాక్షాత్కార సు
ఖంబునకంటెఁ బ్రేమాతిశయాస్పదంబగు నొండు కార్యం బొక్కింతయైనం గ
లుగ నేరదదియునుం గాక యీరాఘవుండు దృష్టిపథంబు నతిక్రమించిన వాఁ
డయ్యును సకలజనమనోనయన సమ్మోహనాకారానుభవజనిత వాసనాబలం
బునం గట్టెదుటం గనుపట్టి నట్లొప్పుచున్న వాఁ డమ్మహాత్ముని వలనం జిత్త వీక్ష
ణంబులు గ్రమ్మఱించుట కొక్కపురుషుండైన సమర్థుండు లేఁడు కాంతలం
జెప్ప నేల యొక్కసారియైనం దత్సాన్నిధ్యా సాన్నిధ్యంబులయందుఁ జక్షుర్దా
నసంబులచేత నెవ్వండు రామునిం జూడకుండుఁ గరుణాతరంగితాపాం
గ వీక్షణంబుల రాముం డెవ్వని విలోకింపకుండు నట్టివాని లోకంబు గర్హిం
చు నంతియె కాదే నెంతదుర్భాగ్యుఁడనని తన్నుఁదాన గర్హించుకొను నీపర
మోదారుండు సకలవర్ణంబులకు సకలజనంబులకు వయోనురూపంబైన ద
యనొసంగుం గావున సర్వజనంబు లితనికనువ్రతులై యుందురని యిట్లు పెక్కు
తెఱంగుల వినుతించువారి భద్రవాక్యంబు లాకర్ణింపుచు నెల్లవారిని యథా
ర్హంబుగా వీక్షణోక్తిభ్రూవిక్షేపణాంజలులచేతఁ బూజింపుచుఁ బితృ పితా
మహులచేత నధిష్ఠితంబైన ధర్మమార్గంబు ననుసరించి యభిషిక్తుండవై చి
రకాలంబు రాజ్యం బేలుమని పలుకు పరమవృద్ధుల యాశీర్వాదంబులు వీనులం
బొరయ నుత్సుకుండై మనోహర్షకరంబులైన సుహృజ్జనుల హితప్రసంగం
బులు వినుచుఁ జైత్యాయతన దేవాగారంబులకుఁ బ్రదక్షిణంబు సేయుచుఁ గృత
పుష్పోపహారంబై నక్షత్రశోభితంబైన యాకాశపథంబు మాడ్కిఁ జూడ్కికి వే



(*) రాముఁడు దశరథ దుఃఖకారణముఁ గైకేయి నడుగుట. (*)

ట్లనియె॥ (చ) అతులకృపాసమృద్ధి ననుఁ నక్కునఁ జేర్చెడు నట్టితండ్రి నేఁ । డతి
కుపితాత్ముఁడై యునికి కైనవిధం బెఱిఁగింపుమేను దు । ర్మతి నొనరించి నట్టి యప
రాధ మొకింతయు లేదు తల్లి తో । హితమతితోడ నీవయిన నివ్విభు వేఁడు మనుగ్ర
హార్థమై॥ (చ) ఇలఁ బయి దేహధారులకు నెప్పుడు పాయము లేని సౌఖ్యము । ల్గలు
గుట చాల దుర్లభము గావున మానవభర్త కంగహృ । త్కలితరుజా విశేషము
లు గల్గెనొ లేక నృతంబులాడెనో । కల తెఱఁగంతయుం దెలుపఁ గాఁదగు నీకిటు దాఁ
చ నేటికిన్॥ (క) భరతునియందు సుమిత్రా । వరపుత్రుని యందు మాతృ వర్గ
మునందు । న్నరవరుఁ డశుభం బేమియుఁ । బరికించెనొ దానిఁ దెలియఁ బలుకుము
నాతోన్॥ (క) జనకునకుఁ బ్రీతి సేయక । జనకుని వాక్యంబు భక్తి సలుపక ధరలో
జననీ యొకత్రుటియైనను । మనఁజాలఁడు కుపితుఁడైన మనుటకు వశమే॥ (క) తన
పుట్టువునకు మూలం । బని యెఱుఁగు వివేకశాలి యగు నరుఁ డేలా । జనకుని నను
వర్తింపఁడు । తనకిలఁ బ్రత్యక్షదైవ తంబగుచుండన్॥ (ఆ, వె) జనని నీవు గర్వ
మునఁ గోపచిత్తవై । పరుషభాషణములు వలికితో కో । తండ్రి చందమెల్లఁ దగఁ
జెప్పకుండిన । నిమిషమైన నోర్వ నేరనింక॥ (క) శ్రీమహిత రూపుఁడగు నీ । భూ
కైక రామునికి మున్ను తనకు దశరథుఁడు వరద్వయం బిచ్చిన తెఱంగెఱింగించుట.-
మీశ్వరునందభూత పూర్వవికారం । బేమికతంబునఁ బొడమెద । యామతి నెఱిఁ
గింపుమమ్మ యనవద్యగుణా॥ (వ) అనిన విని యయ్యంగన శంకారహితాంత
రంగయై సిగ్గువిడిచి రఘుపుంగవు నవలోకించి పుత్రా భవజ్జనకుండు కుపితుండు
గాఁ డతనికి వ్యసనంబు లేదొక్కింత మనోగతంబైన కార్యంబు గలదు ప్రియా
ర్హుండవైన నీతోడ నప్రియంబుఁ బలుకం జాలక భయంబుఁ గొని యున్నవాఁ
డు నేను జనకుని యట్ల నీకు మన్నించుటకుం దగినదాన నగుటం జేసి నాచేత
నేదిపలుకంబడు నక్కార్యంబు నీకవశ్యకర్తవ్యంబు గదా తొల్లి యీమహీరమ
ణుండు దేవాసుర సంగ్రామంబున నన్ను మన్నించి వరద్వయం బిచ్చెదనని పలికి
పదంపడి ప్రాకృతుని యట్ల పరితపింపుచు సకలధర్మమూలంబైన సత్యంబు విడి
చి భవన్నిమిత్తంబున నాయందుఁ గుపితుండై రోషదోషంబున నవ్వరంబులు వ్య
ర్థంబు సేయం దలంచియున్న వాఁడు తన్మనోగతంబైన కార్యంబు నీవు నిక్కం
బుగా నెరవేర్చెదనంటివేని యతండు చెప్పకున్న రాజానుమతంబున నేను దెలి

యఁజెప్పెద నిమ్మహీపతి వరంబులిచ్చెదనని పలికి క్రమ్మఱ లోభంబునఁ దప్పించు
కొనఁ దలంచు టెల్ల గతజలసేతుబంధనంబుగదా యని పలికిన రాముండు వ్యథి

రాముఁడు దశరథానుమతంబు నెరవేర్చెదనని ప్రతిజ్ఞఁ జేయుట.

తుండై రాజసమక్షంబునఁ గైకేయికిట్లనియె ॥ (ఉ) ఇచ్చట రాజు దానొడువనిచ్చఁ
దలంచిన మాటఁ జెప్పుమేఁ । జెచ్చెరఁ జేయువాఁడ నృపశేఖరునాజ్ఞ విషంబునైననే।
నొచ్చెము లేక క్రోలెదఁ బయోధి హలుతాశనులందునైననేఁ । జొచ్చెద రాఘవుం
డరసి చూచిన నాడిన మాటఁ దప్పునే॥ (వ) దేవీ యిమ్మహాత్ముండు నాకు గురుండు
ను దండ్రియు నృపుండును హితుండునుగావున నట్టివాని వాక్యకరణంబునందు
సందేహవిషయీభూతునింగా నన్నుఁ దలంచుట నీకుయుక్తంబుగాదు॥ (చ) అన
విని కైకయిట్లనియె నాతనితో మును దేవదైత్యభం । డనమున భూవరుండు జగ
డంబొనరించి నిశాటబాణపా । తనమున మూర్ఛవోయినఁ బదంపడి యేను
సజీవుఁ జేయలో । ననుఁ గరుణించి సమ్మదము నర్థి, వగయుగ్మ మొసంగె మె

కైక రామునికిఁ దాను వరద్వయంబునకుఁ గోరిన తెఱంగుఁ జెప్పుట.

చ్చుచుఁ ॥ (క) అనఘాత్మ యొక వరంబున । కనుపమగతి మత్తనయున
కభిషేకముఁ ద । క్కిన రెండవ వరమునకుం । గొనకొని నీకడవి నునికిఁ గో
రితి నిచటఁ ॥ (క) జనకుని సత్యవ్రతునింగ । నొనరింపఁగఁ దలచితేని
యుత్తమగుణయు । క్తిని నాచెప్పెడు వాక్యము । వినుము విచారంబుఁ దక్కి
విమలవిచారా ॥ (సీ) జనకుని శాసనంబున నీవు ఘనజటాజినచీరధారివై,
సిరిని విడిచి । తాపసవేషంబుఁ, దాల్చి చతుర్దశ వర్షముల్దండకా, వనము
నందు । విహరింప వలయు నీ,విభునిచే భవదర్థ మందె భరతుఁడు కృ, తా
భిషేకుఁ । డై యయోధ్యాపుర, మందు రాజ్యం బేలు నిమ్మాటఁ జెప్పుట, కీనృ
పుండు ॥ (తే, గీ) నేరక విషణ్ణవదనుఁడై, నిన్నుఁ జూడ । వెఱచి యున్నాఁ
డు గావున, విభునిమాట । దప్పకుండంగ వనమున, కిప్పుడరిగి । నృపవరుని స
త్యమునను ద్ధరింపు మనఘ ॥ (వ) అని పలికిన మరణోపమంబైన యద్దేవి ప
రుషవాక్యంబాకర్ణించి యవ్వాక్యం బప్రియంబైనను మహానుభావుండు గా
వున నొక్కింతయైన మనంబున శోకంబు నొందక వదనంబున వైవర్ణ్యాది
బాహ్యవికారంబు నొందనీక వెండియుఁ గైకేయి కిట్లనియె ॥ (చ) అనఘ



(*) రాముఁడు కైకేయి చెప్పినప్రకారము సమ్మతించుట. (*)

విచారుఁడైన పత్నియాజ్ఞ శిరంబునఁ బూని వేడ్కతో । ననుపమబుద్ధి నీకటుపి
నట్ల జటాజినముల్ ధరించి కా । ననమునకేగెద న్మనుజ, నాయకుఁ డేటికిన
న్నుఁ జూచి నె । మ్మనమున విశ్వసింపక విపన్నత నొందె నెఱుంగఁ జెప్పుమా॥
(క) మనమున దైన్యము విడువుము । వనికరిగెద నిపుడు జడలు, వల్కలము
లు గ్ర । క్కునఁ దాల్చి సంతసింపుము । పనివడి నీమ్రోలనిజముఁ, బల్కితిఁ ద
ల్లీ ॥ (క) క్షితివిభుఁడు గురుఁడు తండ్రియు । హితుఁడు కృతజ్ఞుండు నమ్మహీ
శువచనము । న్హితమతి విస్రబ్ధుఁడనై । చతురతఁ గావింతుఁ గాక, జవదాఁటు
దునే ॥ (క) జననీ భరతుని యభిషే । చన మీనరవిభుఁడు తానె, సమ్మతి
తోఁ జె । ప్పని కారణమున నామన । మనలజ్వాలికల నేర్చె, నట్లయ్యె రహిఁ ॥
(ఆ, వె) అప్రచోదితుండ, నేయ్యనుభరతున । కఖిలరాజ్య మిచ్చు,నట్టివాఁడ।
జనకు చేత నిట్లు, సంప్రచోదితుఁడనై । యిచ్చుటకు విచార,మేల గలుగు ॥
(సీ) కావున జనని భూ,కాంతుఁ డాడినమాటఁ జెల్లించుటకుఁ బూని, యెల్లసి
రులు । భరతునకొసఁగి సం,పద్భోగములు వీడి నయశాలినికి నీకుఁ, బ్రియము
గాఁగఁ । బదునాల్గువర్షము, ల్వనమున నుండెద నిపుడు భూవిభుఁ డేల, హి
తము విడిచి । యాస్యంబు వాంచిధ,రాసక్తనయనుఁడై కన్నీరునించుచు,నున్న
వాఁడు ॥ (తే, గీ) మానవేంద్రుని వేగన, నూనయింపు । మిపుడె కేకయ
ధరణీశు, నింటనున్న । భరతు నిచటికిఁ దోడ్తేరఁ, బటురయమునఁ । జారులను

(*) కైకేయి రామునితో భరతాగమనపర్యంతంబుండవలదని వేగిరపడి చెప్పుట; (*)

బుచ్చుము నృపాలు,శాసనమున ॥ (వ) అని పలికిన నారఘుపుంగవుండు స
మ్మతించుటకు సంతుష్టాంతరంగయై యయ్యంగన నీచెప్పినట్ల శీఘ్రగతు లగు
దూతలం బంచి మాతులకులంబుననున్న భరతుని రావించెద నతండరుగుదెం
చు నందాఁక నీవిచ్చట నుండవలదు రయంబున నిపుడె వనంబునకుం జను మి
మ్మహీరమణుండు నిజసత్యంబునకుఁ బారప్రాప్త్యదర్శన సంజాతవ్రీడాభ
రంబున మొగంబు వాంచి మూర్ఛాక్రాంతుండై సంభాషించుటకుం జాలక
యున్నవాఁ డిట్టివాని సంభాషణంబునుం గూర్చి చింతించుట కార్యంబు గా
దు నీ వవిలంబగమనంబున నిద్ధరాపతి దైన్యంబు బపనయింప వలయు నదియు
నుంగాక నీవరణ్యంబునకుం జను నందాఁక భవజ్జనకుండు మజ్జన భోజనాదులు

సలుపండని వేగిరపడి పలికిన నక్కైకేయి దారుణవాక్యంబు విని యక్కకుత్థ్సకులతిలకుండు ధైర్యధుర్యుండు గావున నొక్కింతయైన మనంబున శోకింపక కైకేయి వచనంబునకు నోర్చుచు శోకపరిప్లుతుండై యూర్పులు పుచ్చుచు హేమభూషితంబైన పర్యంకంబు మీఁదం బడి పొరలుచున్న తండ్రిం గ్రుచ్చియెత్తి సాంత్వవచనంబులం దేర్చుచుఁ గశచేతఁ దాడితంబైన వాజిచందంబున వనగమనంబునందుఁ గృతత్వరుండై వెండియుఁ గైకకిట్లనియె ॥ (సీ) జనని నే ధనపరుండను గాను లోకంబు నొగి సంగ్రహించుట, కుత్సహింప। నను మునిసమునిఁగా, నయసత్యధర్మతత్పరునిఁగా నెఱుఁగుము, పరఁగ నద్ది। నా చేతఁ బతికిఁ బ్రాణత్యాగముననైన నత్ప్రియం బొనరింప, శక్యమదియుఁ। గృతమయ్యె ననినీవు, మతి నెఱుంగుము జనవిభునకు హితముఁ గా, వించు కంటెఁ ॥ (తే, గీ) దలఁపనాకుర్వి వేఱొకట్టి, ధర్మమెద్ది। లేదు గావున నృపుఁడు తాఁ, నూఁది చెప్ప। కున్న నీయాజ్ఞ శిరమున, నునిచిగహన। వాటి నుండెదఁ బదునాల్గు, వత్సరములు ॥ (వ) తల్లీ నీవు నాకత్యంత నియంత్రితవయ్యు భరతున కభిషేకంబుఁ గావించి నీవు వనంబునకుం జనుమని భవద్వచనకారి నైన నన్ను నియోగింపక మహీవిభుని నిర్బంధించితివి గావున నాయందు సన్నివిష్టంబులైన యూర్జవౌదార్యాదిగుణంబు లించుకయైన నెఱుంగని దానవని యూహించెద ॥ (ఆ, వె) జనని వగపుఁ దీర్చి, జనకకుమారి న। నూనయించి పిదపఁ,

## (*) రాముఁడు దశరథునకు నమస్కరించి బయలుదేఱుట. (*)

గాననమున। కిపుడె పోవువాఁడఁ, గృపఁ జేసి యుండాఁక। దడవొసంగవలయు ధర్మయుక్తి ॥ (క) భరతుఁడు రాజ్యం బేలుచు। గురునకు శుశ్రూష సేయు గుణమగు నెట్లా। తెఱఁగున నీచే సుగుణో। త్కరమునఁ గర్తవ్యమది ప్రథమధర్మమగుర్ ॥ (క) అని పలుకు సుతుని మాటలు। విని భూపతి భూరిశోక, వివశాత్ముఁడై। కన్నుఁ గొనల నశ్రులొలుకఁగఁ। గనుఁగవ ముకుళించి ఘోర, గతి దుఃఖించెన్ ॥ (ఉ) అంత మహీశు పాదముల, కా రఘునేత నమస్కరించి త। త్కాంత పదద్వయంబునకు, దండముఁ బెట్టి తదీయ మందిరాభ్యంతరసీమఁ దా వెడలె, నశ్రులు నించుచు లక్ష్మణుండు తా। నెంతయుఁ గ్రుద్ధుఁడై వదన, మెత్తక వెంబడి నేగుదేరఁగన్ ॥ (తే, గీ) జానకీజానియాభిషేచనికభాండ। మపుడు వలగొని చని యొందా, నందు మిగుల। దృష్టి సారనీక కర



ము సాఁ, పేఁయోఁడగుచు। మందగతి నిష్ట, జనములు సందడింప ॥ (ఆ, వె) రజనికాంత జగతి, రాకాసుధాంశుని। కాంతి మాప లేని, కరణి రాజ్య। నాశము తని మోము, నంగల ఘనకాంతి। నపహరింపఁజాల, దయ్యె నహహ ॥ (తే, గీ) అవని దిగనాడి వనమున, కరుగనున్న। యతని మానసవైక్లబ్య, మచటివారి। కేమిఁ గనుపట్టదయ్యె న, వెంత చిత్ర। మఖిలలోకాతిగుని చిత్త, మట్లసమము ॥ (క) విగతాతపత్రచామరుఁ। డగుచు రథముడిగ్గి యనుచ, రాలి విడిచి యొ। ప్పుగ నింద్రియములు వెంటం। దగులక మది దుఃఖమడఁచెఁ, దద్దయుఁ దాల్మిన్ ॥ (క) అంతటఁ బురజనములు శ్రీ। మంతుండగు నతని వదన, మండలమున నొ। క్కింతైన విషాదముఁ గన। రెంత మహాత్ముండు జనక, జేశ్వరుఁ డహహా ॥ (తే, గీ) శరదుదీర్ణాంశుఁడగు పూర్ణ, చంద్రుఁడాత్మ। తేజమును బోలె నమ్మహా, ధీరవరుఁడు। వితతమగు నిజహర్షంబు, విడువఁడయ్యె। విమల విజ్ఞానధైర్యవి, వేకయుక్తి ॥ (వ) అప్పుడు విపుల విక్రముండగు లక్ష్మణుండు రాముని యట్ల దుఃఖంబు మనంబున నిడికొని యమ్మహాత్ముని వెంటం జనుచుండె నివ్విధంబున నా రఘుపుంగవుండు సమాన శోకుండగు సౌమిత్రితోడ నరుగుదేరఁ బ్రాణనాశశంక చేత సుహృజ్జనంబుల కభిషేకవిఘాత కథావృత్తాంతంబుఁ జెప్పక యెప్పటియట్ల మధురవాక్యంబున మన్నింపుచు సాటోత్కృత నిత్యనిరతిశయానందాత్ముండై కౌసల్యానివాసయోగ్యంబైన దివ్యమందిరంబునకుం జని యె నంతనిక్కడఁ బురుషశార్దూలుండగు రాముఁడు మాతృగృహంబునకుం జనినపిమ్మట దురంతచింతాభరపరిశ్రాంతలై యంతఃపురకాంతలెల్ల నొక్కరీతి నార్త

## (*) అంతఃపురస్త్రీలందరు విలపించుట. (*)

ధ్వనులు సేయుచు దమలో నిట్లని విలపించిరి ॥ (ఉ) నెయ్యము మెలఁగ నెవ్వఁడిట, నిత్యము భూపతిచేన చోదితుం। డయ్యును రాష్ట్రకృత్యముల, యందు జితశ్రముఁడై చరించుసా। హాయ్యము నొందియెవ్వఁడు జ, నాలికి సద్గతియై చెలంగువాఁ। డయ్యవనీసుతాపతిమ, హాగహనంబున కేగునకటా ॥ (తే, గీ) దాశరథిజన్మమాదిగఁ, దల్లియందు। ననిశమెరీతి వర్తించు, మనలయందు। నట్లెయంగున వర్తించు, నమ్మహాత్ముఁ। డకట నేఁడు నిర్వాసితుం డయ్యె నేల। (వ) మఱియు నెవ్వాఁడు శ్రుత పారుష్యుండైనను గ్రోధింపక క్రోధహేతుకర్మంబులు పరిత్యజించి కుపితులగు వారలఁ బ్రసాదంబు నొందించునట్టి పరమదయాళుండగు రాముని వనంబునకుం బుచ్చి

నయచ్చపలాత్ముండగు దశరథుండు జీవలోకంబు నెల్లహింసించుటకొర్చువాడ
ని దశరథునినిందింపుచు ననేకు లనేకప్రకారంబుల లేఁగల బాసిన మొదవుల
చందంబున విలపింపుచున్న వారల రోదనంబువిని పుత్రవియోగ సంజాతశోకాభి
తప్తుండైన యద్దశరథుండు పర్యంకంబుమీఁదంబడి లజ్జితుండై దుఃఖింపుచుండెనం
తనిక్కడ ॥ (సీ) స్వజనదుఃఖప్రాప్తి సంజాతఖేదుఁడై రఘుపతిమత్తవారణముక
రణి। నూర్పులుపుచ్చుచు, నేర్పునఁదద్దుఃఖ మపనయింపుచు మాతృవిపులగృ
హము। సేరంగఁబోయిహజారంబునందున్న వారిఁగన్గొనుచున ప్పలిద్వితీయ।
కక్ష్యడగ్గరియందుఁ గడువృద్ధులగు విప్ర వరులకుమ్రొక్కుచుఁ, బరఁగనవలి॥
(తే, గీ) నలరుమూడవ కక్ష్యడాయంగఁబోవ। నందుఁగావలియున్న స్త్రీబృం

(*) రాముండు కౌసల్యకడకుఁ బోవుట. (*)

దముపుడు। త్వరితముగ లోపలికిఁబోయి, తత్ప్రియంబుఁ। బ్రీతినెఱిఁగించె నా
రామమాతతోడ॥(వ)ఇట్లు రాముండుతనరాక యెఱింగించి పుచ్చితోడన తాను
నద్దేవి యున్నకడకుం జనియందు దేవపూజార్థంబు సంగ్రహింపఁ బడియున్న
దధ్యక్షతఘృతహవిర్లాజంబులును మోదకంబులును శుక్లమాల్యంబులును బాయ
సంబును గృసరంబులును సమిధలును బూర్ణకలశంబులును గనుంగొనుచు స
మాహితచిత్తయై యారాత్రి యుపవాసంబుసలిపి సూర్యోదయసమయంబునం గృ
తస్నానయై శుక్లక్షౌమచేలంబుఁదాల్చి తనయాభ్యుదయంబు కొఱకు విప్రులచే
త మంత్రపవిత్రాగ్ని హోత్రంబునందు హోమంబు సేయింపుచు దేవతాసంతర్ప
ణంబుఁగావించుచున్న నిజజననిం గాంచి బాలాశ్వంబు నెదుర్కొనిన హయాం
గనభంగి తన్నెదుర్కొనిన యద్దేవిచరణంబుల కభివందనంబులుగావించె నప్పు
డద్దేవి సమాగతుండైన కుమారునవలోకించి కనుంగొనల నానందబాష్పధార
లు జడిగురియ హర్షోత్కర్షంబున నిజకరంబులఁ గ్రుచ్చియెత్తి చుబుకంబు
పుణికి శిరంబు మూర్కొని వదనంబు ముద్దుకొని వాత్సల్యంబు దీపింప మధురవా
క్యంబున నిట్లనియె॥ (తే,గీ) అనఘశీలురు ధర్మాత్ము, లమితతేజు। లధికవిశ్రు
తులైన పూర్వాధిపతుల। యశము నాయువు ధర్మంబు నఖిలహితముఁ। బొం
దుమీవింక సతతంబుఁ, బుత్రవర్య॥ (ఆ,వె) సత్యవాదియైన జనపతిఁగనఁ జను।
మమ్మహాత్ముఁడిపుడె, యఖిలధరణి। కధిపుఁ గాఁగ నీకు నభిషేకమొనరించు।
నిఖిలనృపులు మెచ్చ, నేఁడు వత్స॥ (వ) అనిపలికి యొక్కకనకాసనంబిచ్చిన నా



(*) రాముఁడు తనకు సంభవించిన యరణ్యగమనంబుఁ గౌసల్యకెఱింగించుట. (*)

రాముండు భోజనార్థంబు తల్లిచేత నిమంత్రితుండగుచు నయ్యాసనంబు వ్రేల
ముట్టి స్వభావవినీతుండై ననుమాతృత్వప్రయుక్తగౌరవంబువలన మిక్కిలి వినీతుం
డై వ్రీడానమ్రవదనుండగుచు దండకారణ్యగమనంబున కనుజ్ఞాకాంక్షియై కేలు
దమ్మిఫాలంబునం గీలించి కౌసల్యకిట్లనియె॥(క) జననీ యేమని చెప్పుదు। ననివార్యం
బైనయొక భయంబు గలిగె నీ। కును సీతకు సౌమిత్రికి। ఘనతరదుఃఖైక
హేతుకంబది తలఁపఁ॥ (తే,గీ) కొనలు గలపంచవింశతి కుశవినిర్మి। తాసన
విశేష సముచితంబైన కాల। మిపుడు దొరకొనె దండకావిపినమునకు। నరు
గుచున్నాఁడ నేల యీయాసనంబు॥(సీ) ధరణీవిభుఁడు నన్ను దండకాటవి కేగు
మనిపంచె నమ్మనుజాధినాథు। నానతి నమ్మహాకాననంబున కేను జనిపదునాల్గు
వత్సరములకట। కందమూలముల నాఁకలిదీర్చికొనుచుఁ దాపసవేషధరుఁడ
నై, పరమశాంతి। యుక్తి వానప్రస్థయోగ్యకర్మంబుల నాచరింపుచు వల్క
లాజినములు॥ (తే,గీ) మునుకొని ధరించి మాంసంబుఁ, దినక కాన। నునికిఁ
జేసెద నిపుడు రాజోత్తముండు। భరతునిసమస్తసామ్రాజ్యపట్టభద్రుఁ। జే
యువాఁడద్భుత దయావిశేషమతిని॥ (వ) అని వన ప్రయాణంబెఱింగించిన నవ

(*) కౌసల్య రామునిమాటవిని మూర్ఛవోవుట. (*)

ద్దేవి పుత్రవియోగ సంజాతశోకంబు సహింపంజాలక మూర్ఛాక్రాంతయై ప
రశుని కృత్తయైన సాలయష్టిచందంబున స్వర్గపదభ్రష్టయైన దేవతాంగనకై
వడి మహావాత పతితంబైన కదళీద్రుమంబు పోలిక ధరణి పయిం బడియె ని
ట్లువశయై పడియున్న తల్లిం దనకరంబులం గ్రుచ్చి యెత్తి యొక్క కనకాసనం
బునం గూర్చుండఁబెట్టి శ్రమనివృత్తి కొఱకుఁ బుడమిం బడి పొరలి క్రమ్మఱలేచి
భారవహనంబుఁ బ్రాపించిన బడబ చందంబునఁ బాంసుకుంఠితసర్వాంగియై యు
న్న యద్దేవిశరీరంబంతయుఁ గరంబులం బరిమార్జించి వివిధ వినయ వాక్యంబు
లం బ్రబోధించినఁ గొండొక సేపునకు మూర్ఛ దేఱి నిజ కరంబున నకు
మారశేఖరుని నెమ్మేను సంస్పృశించి కనుంగొనల నశ్రుకణంబు లొలుక
గద్గద స్వరంబుతో సుమిత్రాపుత్రుండు వినుచుండ రామున కిట్లనియె॥

(*) కౌసల్య రామునితోఁ దనదుఃఖంబులన్నియుఁ జెప్పికొనుట. (*)

(సీ) అనఘాత్మ ధాత్రి వంధ్యకు నపుత్రికనై తిననియొక్కటియె దుఃఖ, మన్యదుఃఖ। మది

యించుకయుఁబుట్ట, దట్లేను నినుఁబ్రియపుత్త్రునిఁబడయక, పుట్టనట్ల । వంధ్యనై యున్నని, న్వాడుపున్ననభిమతపుత్రవిశ్లేషసంభూతదుఃఖ । మొందికృశింపక, యుండుఁగదానేఁడుకోమరులు లేనిదుఃఖమునకంటెఁ ॥ (తే,గీ) బుత్రవిశ్లేషసంజాత, భూరిదుఃఖ । మెక్కుడై యుండదానిసహింపఁగూడ । దకటనినుఁబాసి యేలాగు, నసువులాడల । నిలిపికొనియిచ్చటవసింప, నేర్తుఁజెపుమ ॥ (చ) అరయమహీశుపౌరుషము, నందు లభించుమనోజ్ఞభోగము । లుసురుచిరసౌఖ్యముల్మృదువ, చోగరిమంబులొకప్పుడైననే । నెఱిఁగిన దానఁగానుజగ, తీంద్రుఁడిఁకన్నినుజూచినైయు నసు । స్థిరముగనాపయింగరుణఁ, జేచునటంచుఁ దలంతునెమ్మదిన్ ॥ (క) జనవిభున కగ్రసతినై । కనిష్ఠలగుసవతులెల్లఁగడుగర్వమునన్ । ననుఁదూలనాడుచుండఁగ । వినియేగతిఁదాళుదానవిమలవిచారా ॥ (తే,గీ) జనవినుతపుత్ర యుతులగు, సవతులాడు । వివిధపరిహాసవచనముల్వినుటవలనఁ । బుట్టు నాదుఃఖ శోకంబు, లిట్టివట్టి । వనఁగవచ్చునె వానికి, యవధిగలదె ॥ (ఆ,వె) పాయకెపుడు నీవు, నాయొద్దనుండంగ । నధిపహీనవృత్తి, నడలుదేను । నీవుగహనమునకుఁ, బోవుచుండఁగనాకు । మరణమేనిజంబు, వరగుణాఢ్య ॥ (వ) మఱియు నమ్మహీపతి కిన్నగ్రపురంధ్రినై యుండియు నతండు నన్నవమానపురస్సరంబుగాఁ జూచుటవలన నప్రధానీకృతనై కైకేయిపరిచారికాజనంబులకంటె నొక్కింతయవరనై తినదియునుంగాక భరతుండు ప్రాప్తరాజ్యుండై ననతనివిలోకించి నిత్యంబు నన్ను సేవించుజనంబును వాని భయంబు వలన నింక నన్ను సేవింపకుండు నని పలికి వెండియు నిట్లనియె ॥ (చ) అనిశము వైరిభావమున, నద్భుత కోపరసంబు ముక్కునం । గనుపడ భాగ్యగర్వమునఁ, గష్టదురుక్తులఁ బల్కు కైకయా । నన మెటు చూచి యోర్చెద ఘనంబుగ దుర్దశ నొంది యుండి నే । నినకులదీప మానవతు, లలఘుజీవన మోర్చియుందురే ॥ (సీ) మది నుక్కడక్కి సప్తదశాబ్దములనుండి యేక్షోభమునకుఁ బరిషయంబు । సతతంబు నాచేత, నతికాంక్షితంబయ్యె నాక్షోభమక్షయం, బయ్యెనిపుడు । భాగ్యగర్వమున సపత్నులుగావించు విప్రకారముమది, వెగడుపఱుప । హీనదశాప్రాప్తి, కేనోర్చి ధరమని యుండలేనదియు నట్లుండనిమ్ము ॥ (తే,గీ) కమల పత్రంబులను బోలు, కనులతోడఁ । బూర్ణశశిబింబసదృశమై, భూరికళల । నొప్పునీమోముఁ జూడక, యొక్కనిమిష । మైన నేగతి జీవించు, దానఁదండ్రి ॥ (వ) వత్సా నీవు



భాగ్యరహితనైన నాచేత నుపవాస దేవతాధ్యాన వ్రతంబులచేత నిష్ఫలంబగు నట్లు సంవర్ధితుండవైతివి భవదీయపరివర్ధనం బిప్పుడు దుఃఖంబుకొఱకుఁ బరిణతం బయ్యెఁ బ్రావృట్కాలంబునందు మహానదీప్రవాహసలిలంబుచేతఁ దత్తీరంబు నశించిన పగిది భవద్విప్రయోగ శ్రవణంబున సహస్రప్రకారంబుల వ్రయ్యలై పోకయుండుట వలన మదీయహృదయం బతి కఠినం బని తలంచెద ॥ (సీ) వలనొప్ప కంఠీరవంబు బిట్టేడ్చెడు మృగినిఁ గొంపోయిన, పగిదినన్నుఁ । గ్రుద్ధుఁడై శమనుండు, గొనిపోని కతమున నల దండధరలోక, మందునాకు । స్థానంబు లేదని, తలఁచెద నాకింక జగతి నెన్నటికిని, జావులేదు । కడువడి నిట్టిదుఃఖంబుచే నుపహతం బయ్యును నాహృద, యంబుమేను ॥ (తే,గీ) మాన కిటు వేయివ్రయ్యలై, పోనికతన । నాయసాకృతిగాఁబోలు, ననితలఁచెద । నందనయు కాలమున నిధనంబుగలుగ । దేమిసేయుదు నింక నా, కేదిదిక్కు ॥ (తే,గీ) నయవిశారద పిన్నట, నాఁటనుండి । యేను గావించువ్రతములు దానములును । దపములు సపర్యలును నిరర్థకములయ్యెఁ । జవుట విత్తినవిత్తుల, చందమునను ॥ (తే,గీ) పృథివి దుఃఖకర్శితుఁడెవ్వఁ, డేనితలఁచి । నపుడు శమనుని వీటికి, నరిగనేని । యేనును భవద్విహీననై, ధేనువట్ల । తనువు విడిచి యముని గృహంబునకుఁ బోనె ॥ (ఉ) ధీవర నీవు నన్నిచట, డించి వనంబున కేగితేని గ । ర్వావహచిత్తలై సవతు, లాడుదురుక్తులు విన్నమేనిలో । జీవమునిల్వదట్లగుటఁ, జేసిమదిం దనివారఁ జూచుచు । న్నీ వెనువెంట వచ్చెద న, నిందితశీలయరణ్యభూమికిన్ ॥ (వ) అని యిట్లు పెక్కుతెఱంగులఁ గుమారుండు సత్యపాశబద్ధుండయ్యెనని యెఱింగి యతని వనగమనంబు నివారించుటకు సామ

(లక్ష్మణుండు మన్మథవశుఁడైన దశరథునిమాటవినుటయుక్తముగాదని చెప్పుట.)

ర్థ్యంబు లేమింజేసి భావిసంభావితవ్యసనంబు దలంచి కిన్నరియుంబోలె విలపించుచున్న కౌసల్యనవలోకించి సుమిత్రానందనుండు మొగంబున దైన్యంబు దోఁపఁ దత్కాలసదృశంబగు వాక్యంబున నిట్లనియె ॥ (క) పడఁతుక మాటకు రాజ్యము । విడిచి రఘూత్తముఁడు ఘోర, విపినంబునకి । ప్పుడు పోవఁ దలఁచు టెంతయుఁ । గడువడి నామదికయుక్తి, కరమైతోఁచెన్ ॥ (క) జనపతి విషయగతుండై । యనిశము సతిమాటఁ బట్టి, యనుచితముగఁ బల్కినఁ । బలుకఁగ నిమ్మదిమన । మునగట్టిగఁబట్టి చేయఁ, బూనఁగనేలా ॥ (క) దీపస

మున మనుజవిభుం । డేమితగని దోసమెంచి, యిప్పుడుకినుకన్ । రాముని సుగుణోద్దాముని । భూమి వెడలి ఘోరవనికిఁ, బొమ్మనిపలికెన్ ॥ (క) ధర నెవ్వాఁ డరి యైనను । నిరస్తకుండైన నీయ,నింద్యగుణుని పైఁ । గరమొక దోషం బెన్నఁడుఁ । బరోక్షమందైన నూఁది, పలుకు టెఱుంగన్ ॥ (తే, గీ) ఘనుని దాంతుని ధర్మవి,గ్రహుని ఋజుని । నమరతుల్యుని రిపుల యం,దైనఁ గరుణ । గలుగునట్టి కుమారునిఁ, గనియు కారణమున నెవ్వాఁడు ఘోరవ,నమున కనుచు ॥ (తే, గీ) అంగభవజాతపారవ శ్యమున మేను । మఱచి నోటికి వచ్చిన ట్లఱచు నృపతి । యట్టి మాట మనంబునఁ బట్టి రాజ । ధర్మ మరయక నెవ్వాఁడు దవిలి సేయు ॥ (వ) అని పలికి యన్నదిక్కు మొగంబై యిట్లనియె ॥ (తే,గీ) అనఘ యీయర్థ మొకనరుం డైననేమి । యెంతలో వినఁ జాలఁడీ వంతలోన । మత్సహాయుండవగుచు సామ్రాజ్యమెల్ల । నాత్మ వశముగఁ జేసి కొమ్మది హితంబు ॥ (వ) అట్టిది యెట్లు శక్యం బగు నంటి వేని ॥ (సీ) ధనువుఁ గైకొని పార్శ్వమున నేను రక్షింపనలజము మాడ్కి నీ వలరుచుండ । నప్పు డెవ్వాఁడు నీ యాజ్ఞ దాఁటి చరింప దక్షుఁ డవ్విధిగాక తక్కనేని । కాలసర్పాభీల ఘన బాణముల నయోధ్యాపురి నిర్మనుష్యఁగ నొనర్తు । భరతుఁ డిక్కడ రాజ్యపదమెల్లఁ జేయుగాకని కోరువారల యమునిపురికిఁ ॥ (తే,గీ) బనుతుఁ గామాంధుఁడై యాలి,పలుకులు విని । బుద్ధి నరయక లోకవి,రుద్ధవృత్తి । మూఁది పరిపంథిభూతుఁడై,యున్న నృపునిఁ । గడఁగి చంపెదఁ గానిచోఁ, గట్టి వైతు ॥ (వ) తండ్రి కపరాధంబు సేయం దలంచుట ధర్మవిరుద్ధం బని తలంచితేని వినుము ॥ (తే, గీ) విషయపరతంత్రుఁడై ధర్మ,విధికిఁ దప్పి । మది ననారతమిది కార్య,మిది యకార్య । మని యెఱుంగక వర్తించు, నతఁడు తండ్రి । యైనఁ గడువధ్యుఁ డని పల్కి,రార్యులధిప ॥ (క) జనపతి నీదగు రాజ్యముఁ । గానుటకు నేబలము విదప,గుణహీనతఁ దా । మునుకొని యేకారణమునఁ । దనమదిఁ గైకేయి కొసఁగఁ దలఁచె మహాత్మా ॥ (తే, గీ) పరఁగ నీతోడ నాతోడ వైరముఁ గొని । యరినిషూదన కులయోగ్య మయిన యట్టి । ధర్మవిధి నీవు దాల్పఁగఁ దగిన సిరిని । భరతుని కొసంగఁ బతికేటి బలము చెపుమ ॥ (వ) అని పలికి క్రమ్మఱఁ గౌసల్య నవలోకించి తల్లీ యేను సర్వప్రకారంబుల రాముననురక్తుండ నైతి నిది యసత్యంబు గాదు సత్యచాపదానేష్టంబుల చేత శపథంబుఁ



జేసి పలికితి రాముం డరణ్యంబునం దె కాదు దీప్తాగ్ని యందుఁ బ్రవేశించిన నే నంతకు మున్నె ప్రవేశించెద నట్టివానిఁగా నన్నెఱుంగుము ॥ (చ) జననిరో నా ప్రతిజ్ఞ విను సత్యము నీవును రాఘవుండుఁ గ । న్గొని మది మెచ్చ దీప్తశర కోటి నరాతుల గీటడంచి మిం । చిన యనురక్తిచే నినుఁడు చీఁకటి నట్ల భవన్మనోవ్యథం । బనివడి తీర్చెదన్ ధరణిఁ బట్టముఁ గట్టెద రామ భర్తకున్ ॥ (వ) అని యిట్లు వీరాలాపంబు లాడుచున్న సుమిత్రా పుత్రుని వాక్యంబు లాలకించి యద్దేవి రాముని వదనం బుపలక్షించి దుఃఖింపుచు నిట్లనియె ॥ (మ)

(*) కౌసల్య రామునికి లక్ష్మణుడు చెప్పినట్ల చేయుమని బోధించుట. (*)

అనఘా తమ్ముని మాటవింటివె హితం బై యున్న దారీతి నీ । వనుమానింపక చేయు టొప్పు నృపవంశాచార మీచందమై । చనుఁ గాకీవు సపత్ని మాటకయి రాజద్రాజ్య భోగంబు మా । ని నను న్నెవ్వగ ముంచిపోవఁ దగవౌ నేకాననక్షోణికిన్ ॥ (వ) మఱియు నీవు పితృవాక్యకరణరూపంబగు ధర్మంబనుష్ఠించుట సమస్తధర్మంబులలో నుత్తమ ధర్మం బని దలంచితి వది నిక్కంబైనను నీలోకంబున మాతృశుశ్రూషాపరుండై ప్రవర్తిల్లు మహాత్మున కెల్ల లోకసుఖంబులు కరతలామలకంబులై యుండుఁ దొల్లి గృహంబున నుండి మాతృశుశ్రూషఁ గావించి తద్బలంబునఁ గాశ్యపపుత్రులలో నొక్కండు ప్రాజాపత్య పదంబుఁ బ్రాపించెఁ గావున నీవును నావచనంబుఁ బట్టి భక్తిపూర్వకంగా నాకు శుశ్రూషఁ గావింపుచు గృహంబున నుండు మేనును దండ్రి యట్ల పూజించుటకుం దగిన దాన నట్లగుటం జేసి నా యనుమతి లేక నీవు వనంబునకుం బోవుట ధర్మంబుగా దదియునుంగాక శోకాకులితనైన నన్ను విడిచి వనంబునకుం జనితేని భవద్వియోగదుఃఖంబులం బ్రాయోపవేశనంబుఁ జేసి ప్రాణంబులు విడిచెద దానం జేసి తొల్లి సముద్రుండు పిప్పలాదముని విషయకృతాపరాధంబువలన బ్రహ్మహత్య నొందిన విధంబున నీవును విశ్రుతంబైన పాపంబున నిరయంబునొందఁ గలవు నీవు వనంబునకుం జనినపిమ్మట నాకు సుఖజీవనంబుల చేత నయ్యెడు కార్యంబేమి భవత్సహితనై యున్నానాకుఁ దృణభక్షణంబైనను శ్రేయస్కరంబై యుండునని పలికి దుఃఖభరంబున రోదనంబు సేయుచున్న తల్లిం గాంచి మహానుభావుండైన రాముండు ధర్మసహితంబగు వాక్యం

—(*)రాముఁడు కౌసల్యకు సయుక్తికంబుగా సమాధానంబుఁ జెప్పుట.(*)—

బుననిట్లనియె ॥ (క) జనకునివాక్యము నదిగా । దనిమీఱఁగ నాకశక్యమటుగానమహా । వినయమున మ్రొక్కి వేఁడెదఁ । బనివిని వనమునకు నన్నుఁ బనుపుము తల్లీ ॥ (ఆ,వె) పరమపండితుండు, వ్రతచారియును ధర్మ । కోవిదుఁడు మహాను, భావుఁడైన । కండువనెడుముని శిఖామణి జనకు వ । చనముఁబట్టి, గవినిఁ, జంపలేదె ॥ (తే,గీ) వినుమదియుఁగాక జమదగ్నితనయుఁడైన । రాముఁడతనియసుజ్ఞ శి, రంబునందుఁ । దాల్చి దయమాని మనమునఁ, దల్లియనక । పట్టి రేణుకఁ ద్రుంపఁడే, పరశుహతిని ॥ (వ) మఱియుఁ బ్రాణంబులనైనఁ బరిత్యజించి పితృవాక్యంబు పరిపాలనీయంబని పండితులైన కండుముఖ మహర్షులు పలికిరి పితృవాక్య గౌరవంబున గోవధ మాతృవధాదికంబు మహాత్ములగు పూర్వికులచేత నాచరితంబయ్యెఁ బితృవాక్యంబెట్లలంఘనీయంబట్లు మాతృవాక్యంబు నలంఘనీయంబై యుండు నైననేక కాలంబున నుభయవాక్యకరణంబునం బ్రవర్తిల్లుట దుర్లభంబగుటం జేసి పితృవాక్యంబు ప్రథమకర్తవ్యంబని పలికిర దియునుంగాక పితృవాక్యోల్లంఘనంబునఁ బితృవధ పాతకంబు వాటిల్లునే నొక్కరుండనే కాను నాచేతఁ బరికీర్తితులైన వీరందఱుఁ బితృశాసనంబుఁ గావించి కృతార్థులైరి గావున నాకునుం బూర్వాచారవిరుద్ధంబైన ధర్మంబునం బ్రవర్తిల్లుట పాడిగాదు తొల్లి మహాత్ములగు వారిచేత నంగీకృతంబైన మార్గంబవలంబించి యెల్లభంగులఁ బితృనిర్దేశంబున వనంబునకుం జనియెదనని పలి

(*)రాముఁడు లక్ష్మణునకు సమాధానంబుఁ జెప్పుట.(*)

కి లక్ష్మణుని నవలోకించి యిట్లనియె ॥ (చ) అనఘవిచారనీదగు మ, హత్త్వముఁ దావక తేజముం ద్వదీ । యనిబిడదోర్బలంబు భవదద్భుతశౌర్యము నాపయిం జనిం । చిన ప్రియములు సమస్తమును, జిత్తమునందు నెఱుంగుదు న్యశో । ధనులకుఁ గల్గుటబ్బురమె, తద్దయు లక్ష్మణ నీకు నింతలే ॥ (చ) పరమవివేక సత్యశమభావము భావమునం దెఱింగియుం । గరమనురక్తిఁ బ్రాకృతుని, కైవడి నీవటు దుఃఖమొందదు । ర్భరతరశోకవేగమునఁ, గ్రాఁగెడు నీయమతాల్మిఁ దక్కితా । మఱిమఱి పొక్కఁగాననిఁక మానుము తాదృశదీనవాక్యముల్ ॥ (తే,గీ) ధరణిఁ బురుషార్థములలోన, ధర్మమెక్కు । డట్టిధర్మంబునందు సత్యంబు నిలిచి । యుండు నన్నిటికంటెన, త్యుత్తమంబు । గురునియోగనతి నడుచుట, గురుగుణాఢ్య ।



(తే,గీ) జనక వాక్యంబు జననీవ, చనము బ్రాహ్మ । ణోత్తముని మాట ధర్మసంయుక్తమగుట । నుచితగతిఁ జేయవలయు నట్లొపఁడేని । యలఘుతర కల్మషాత్ముఁ డౌననిరి మునులు ॥ (వ) కావున నేనుఁ బితృశాసనంబునఁ గైకేయిచేతఁ బ్రచోదితుండనైతి నింకదానిఁ గడువంజాల నీవశుభంబైన క్షత్త్రధర్మంబునందు బుద్ధిఁ జొరనీక తీక్ష్ణస్వభావంబు విడిచి పరమశ్రేయోనిష్ఠయైన మద్బుద్ధిననుసరింపుమని సౌహార్దవిశేషంబునం బలికి వెండియు నక్కకుత్స్థకులదీపకుండు కౌసల్యదిక్కు మొగంబై వినయవినమితోత్తమాంగుండగుచుఁ గేలుదోయి ఫాలంబునం గీలించి యిట్లనియె ॥ (క) వేవేగ విపినసీమకు । వావిరిఁ బోవంగవలయు వారింపకుమ । జీవితము లాన గ్రక్కున । దీవనలిపుడొసఁగి పనుపు దేవీ నన్నున్ ॥ (తే,గీ) గురునివాక్యంబు నెఱవేర్చి, మఱలవేగ । నడవి నుండి పురంబున, కరుగుదెంతు । మునుధరకు వచ్చి మఱల విబుధనిలయము । నొందిన యయాతిరాజర్షి చందమునను ॥ (క) జననీ నీకును నాకును । జనకజకును మిత్త్రకల్, సౌమిత్త్రికిఁగ । న్కనఁ బతియానతిఁ బోఁపఁగ । జనునిది యె సమస్తధర్మసమ్మతముసుమీ ॥ (వ) తల్లీ యభిషేక సంభారంబులు విసర్జించి మనంబున దుఃఖంబు నిగ్రహించి ధర్మంబునవలంబించి వనవాసంబునకుం బోవ నిశ్చయించినవాఁడ నేను వనంబునకుం బోయి వచ్చునందాక శోకంబు దక్కి ధైర్యంబవలంబించి యుండవలయు నని పలికిన నమ్మహాత్ముని ధైర్యస్థైర్యంబుల కచ్చెరువంది యక్కౌసల్య వెండియు మనంబునఁ బుత్త్రవియోగంబుఁ దలంచుకొని మూర్ఛాక్రాంతయై చచ్చినదానియట్ల నేలంబడి యుండి క్రమ్మఱ నొక్కింత సేపునకు నానావిధోపచారంబులం దెలివొంది బాష్పధారాపూరిత లోచనయై గద్గ

(*)కౌసల్య రాముని వనంబునకుం బోవలదని నిర్బంధించుట.(*)

దస్వరంబున నిట్లనియె ॥ (చ) అనఘవిచార యేనుగురునట్లనె ధర్మసుహృద్విశేషతం । దనరిన పూజకుం దగిన దానను మద్వచనంబు నెమ్మనం । బున నిరసించి దుఃఖరస పూరిత భూరిగభీరవార్ధిలో । ననుఁ బడఁద్రోచి నీకుఁ దగునా యిటు కాననసీమకేగఁగన్ ॥ (సీ) వినునీవు కాననంబునకుఁ బోయిన నాకు నీలోకమున లోకమేల ప్రాణ । మేల సంపద్భోగమేల స్వధాపునర్భవముల నేమికార్యంబు సర్వ । లోకసంస్థితజీవలోకసాన్నిధ్యంబు కంటె నొక్క ముహూర్త

కాలమైన । సరసగుణాఢ్యనీసన్నిధానమునాకు ఘనతరశ్రేయమైతనరుచుండు
(తే.గీ) సిద్ధమననాతఁడుల్కఱల చేనపోహ్య । మానమైన మహేంభంబుమార్గ
మనుస । రించినట్లు తమక్తులా లించికలఁగి । క్రమ్మఱస్వవంశధర్మమార్గ

—(*)రాముఁడుపితృనియోగంబవశ్య కర్తవ్యంబనినిరూపించుట.(*)—

స్థుఁడగుచు ॥ (వ) వెండియునా రఘుపుంగవుండు విసంజ్ఞయై పడియున్న తల్లిని దుఃఖపీడితుండైన తమ్మునిఁజూచి యధర్మారంభంబునకు సుముఖుండుగాకధర్మసహితంబగు వాక్యంబున లక్ష్మణునవలోకించి రఘువరానీవు ధర్మైకనిష్ఠారూపంబైన మదీయాభిప్రాయంబు నెఱుంగక పుత్రవాత్సల్యంబున నగచు తల్లింగూడిదుఃఖించెద వీదుఃఖంబు మచ్చిత్తంబుగలంచుచున్నయది పురాకృతపుణ్యావిశేషంబునం గలిగినభార్య యొక్కటియయ్యును ననుకూలయై ధర్మంబును నభిమతయై కామంబునుసుపుత్రయై యర్థంబునుబతికింజతగూర్చిన తెఱంగున సకలపురుషార్థ మూలంబైన ధర్మంబొక్కటియయ్యును నిజానుష్ఠానంబున ధర్మార్థ కామఫలంబులు సిద్ధింపంజేయు నిధిమదీయ చిత్తంబు నంగలయర్థంబుగావున నేకమార్గంబునందు ధర్మార్థకామంబుల సన్నివిష్టంబులగు నట్టికర్మంబుపక్రమింప నర్హంబుగాదు యెల్లభంగుల నెద్దానివలనధర్మంబుగలుగునట్టి కర్మంబనుష్ఠింపవలయు లోకంబునం గేవలార్థపరుండగువాఁడు ద్వేష్యుం డగుఁగేవల కామపరత్వం బప్రశస్తంబగుగురుండును వృద్ధుఁడును స్వామియును జనకుండునగు మహీరమణుండు కోపంబునం గాని ప్రసాదంబునం గాని కామంబునం గానిసత్యప్రతిజ్ఞత్వరూప ధర్మం బవలంబించి తత్పరి పాలనంబు కొఱకు నేకార్యంబు సేయుమని నియోగించె నక్కార్యంబు నన్నృశంసవృత్తి యగు వాఁడెవ్వాఁ డాచరింప కుండు నట్టి యపాపుండ నగు నేను వరదాన హేతుక భరతాభిషేక మద్వివాసనరూపకంబైన పితృప్రతిజ్ఞను యథోక్త క్రమంబున సర్వంబును గావింప కుండుటకు సమర్థుండఁ గాను నాకును భరతునకును మహీ రమణుండు నియోగంబునందు సమర్థుండగు నంతియె కాదు మజ్జనని యగు కౌసల్యకును భర్తయుఁ బరమగతియుఁ గావున నద్దేవియును మనయట్ల పతియాజ్ఞ ననుసరించివర్తించుటది పరమ ధర్మంబై యుండు నిద్దేవి పుత్రవాత్సల్యంబున నన్ను విడువంజాలక నాతోడ వనంబునకుంజను దెంచెదనని తలంచియున్నది ధర్మ



ప్రవర్తకుండును బూర్వరాజులకంటె నధికుండును స్వకులాచార ధర్మసంస్థితుండునగు మహీరమణుండు జీవించియుండ సహధర్మచారిణియైన యిమ్మహాదేవిపుత్రుండనైననాతోడ నన్యయువతిచందంబున వనంబున కెవ్విధంబునం జనుదెంచుఁ బతిహీనయగు వనిత పుత్రునితోఁగూడఁ జనుదెంచుటది యుచితంబగుంగాని సభర్తృకయైన యువతిచనుదెంచుట యుచితంబుగా దదియునుంగాక॥ (చ) అతివలకిందునందభిమ తార్థకరుండు విభుండుతన్నహో । గతినతియుక్తిచేఁగనియ కల్మషభక్తినిదామనంబులో । నతఁడె గురుండు దైవమఖిలార్థదుఁడంచుఁ దలంపుచున్నము । న్నతమతిఁగొల్చి యుండుటస నాతన ధర్మములాఁడువారికి॥ (క) కావునఁ యమమగనిం । దావిడిచియధర్మముగ వనంబునకిపుడు । న్నా వెంటరాఁబొ సంగదు । ధీవిలసితధర్మసరణి తెలియదె నీకు॥ (వ) అనిపలికి క్రమ్మఱ నమ్మహానుభావుం డమ్మకిట్లనియె॥ (క) జననీపదునాల్గబ్దము । లనఁగాఁబదునాల్గుదినము లట్లగడపిచ । య్యనవత్తుమఱలవీటికిఁ।

(*) రాముఁడు కౌసల్య ననూనయించుట.(*)

బనివడిదీవించినన్నుఁ బనుపుమడవికి॥ (వ) తల్లీ యేను ధర్మవిరహిత రాజ్యకారణంబున మహోదయంబగు యశంబునుం దిరస్కరించుటకుంజాల జీవితం బల్పకాలంబగుచుండ నధర్మంబునకుం దలంకక తుచ్ఛరాజ్యంబుగోరుట తగవుగాదని యిట్లు జనయిత్రి ననూనయించి పలికి క్రోధశోకాకులుండగు తమ్మునికి ధర్మరహస్యం బుపదేశించి పదంపడి నిజజననికిఁబ్రదక్షిణంబుఁజేసి వనప్రయాణోన్ముఖుండై వెండియు మహావ్యథంజెంది గుందుచు మహాసర్పంబు కరణి రోఁజుచు రోషవిస్ఫారితేక్షణుండై యున్న సౌమిత్రింజూచి సౌహార్దవిశేషంబున నభిముఖుండై ధైర్యంబునఁ జింతాదివికృతులు వదనంబునందోఁప

(*)రాముఁడు లక్ష్మణుని ననూనయించుట.(*)

నీక మనంబుననడంచుచు నిట్లనియె॥ (చ) అనుపమధైర్యముంగొనిరయంబున శోకమురోషము న్మనం । బునఁజొరనీకయెంతయుఁబ్రమోదమునొందిమహీశుపై జనిం । చినపెనుకిన్కమానియభిషేకవిచారముఁదక్కిసత్వరం । బునవనవాసకార్యముప్రభూతవివేకతఁజేయుమి త్తఱిన్ ॥ (తే, గీ) అస్మదీయాభిషేకార్థ,మందు నీకు । సముదితంబైనసంభార, సంభ్రమంబు । లవియెయిప్పుడుతన్ని వృ,త్యర్థమందుఁ । జెల్లుఁగాక మనంబునఁ జింతయేల॥ (ఆ,వె) అనఘమదభిషేచనార్థ

మందేఁగేని । మానసంబుచాలమలఁయుచుండు । నట్టితల్లి హృదయమందుఁబుట్టిన
శంక । వాయునట్లుగాఁగఁ జేయుమయ్య॥ (క) ఆమగువమనోగతశం । కామయదుః
ఖంబొకింతకాలంబైనన్ । దీమసమునఁగనుఁగొనుటకు । నామదికిం దాల్మిలేదునయ
గుణశాలీ॥ (వ) వత్సా యేను జ్ఞానంబుచేతఁగాని యజ్ఞానంబుచేతం గాని తల్లిదండ్రు
లకించుకైన విప్రియంబొకానొకప్పుడైనఁ గావించుటకునోడుదుఁగావున॥ (తేగీ)
తల్లిదండ్రు లొకానొక తఱినొనర్చు । నప్రియ మొకింతయైననే నాడుకొనుట ।
యెన్నఁడేనియుఁ గలదెవే యేలవినుము । హృదయముననైన నిలుపుట లేదుసు
మ్మి (క) సత్యుండు సత్యసంధుఁడు । సత్యపరాక్రముఁడునైన జనకుఁడు పరలో ।
కాత్యంతభయము వలనను । నిత్యమువిలసిల్లుగాక నిర్గతుఁడగుచున్॥ (తేగీ)
అడవికేఁబోకయున్న నా యనకు సత్య । హానియగు దాననాక సత్యాగమొదవు ।
నవలఁబతికిమనస్తాప మతిశయిల్లుఁ । బిదపనదినన్నుఁ జాలఁదపింపఁజేయు॥ (వ)
కావున నేను సామ్రాజ్యంబునం దాససేయక శీఘ్రంబున వనంబునకుం జనియెదన
పత్నిమాతయగు కైకేయి చీరాజిన జటామండలధారినై వనంబునకుంజనుచున్న
నన్నవలోకించి పరమానందభరితాంతఃకరణయగుచుఁ గుమారునిం బ్రాజ్య
రాజ్యంబున కభిషిక్తుంజేసి కృతకృత్యయగు మఱియు మందరాదిజనంబుచేతనీ
బుద్ధి ప్రణీతయయ్యె దీనియందు మనంబును సమాహితంబై యున్నది యేను
వనంబునకుంబోవకుండిన మజ్జనకునకు మనఃఖేదంబుగలుగు నెవ్వని శిక్షోపదే
శంబులచేత మనంబునకు సౌగుణ్యంబు జాతంబయ్యె నట్టిజనకుని సంక్లేశింపఁ
జేయుటకుం జాలశీఘ్రంబున వనంబునకుంజనియెదనని ప్రవాసంబునందు మ
నంబుగట్టిపఱిచి కైకేయినిమిత్తశంకచేత నద్దేవియందు లక్ష్మణునకుఁ గ్రోధని
వారణంబుసేయు తలంపుననిట్లనియె॥ (క) చేవచ్చినసిరిఁగ్రమ్మఱఁ । బోవుటయు

**రాముఁడు లక్ష్మణునికిఁ గైకమీఁదంగల కోపమును బోఁగొట్టుట.**

సుఘోరవిపినభూమినివాసం । బావహిలుటయునుదలంపఁగ । దైవకృతముగా
కయొరుల తరమె కుమారా॥ (తే, గీ) అనఘ కైకభావంబుకృతాంతవిహిత ।
మైనయదియట్లుగానిచో మానకిట్లు । తివిరియనివార్యమగుచున ద్దేవిబుద్ధి । ప
రఁగమత్పీడనమునందుఁ బరిణమించె॥ (వ) మఱియు నద్దేవి భావవైపరీత్యంబు
దైవకారణంబనిపలికి తదీయ సహజభావం బెఱింగించు తలంపున నిట్లనియె॥
(తే, గీ) అమలగుణ నాకుఁదల్లుల యందొకింత । యైన వైషమ్యమెట్లులే దట్లు



సంత । తంబునాయందు సుతునందుఁ దారతమ్య । మేమియునుఁ గైకకును లేమి
యెఱుఁగవొక్కొ॥ (అ, వె) అట్టికైక నన్ను నభిషేచనముమాని । భూరిగహ
నమునకుఁ బొమ్మటంచు । నశనిపాతకల్పమైనమాటాడుట । దైవకృత మటం
చుఁదలఁతుసుమ్మి । (ఉ) ఆవిధిగానిచో నరవరాత్మజయింతకు మున్ను భూరిహ ।
ర్షావహచిత్తయై ప్రియములాడుచునున్న సపత్నిమాతగో । త్రావరుమోలిఁ
దానిపుడు, ప్రాకృతకాంతబలెన్ దర్ఘణమం । దివిరసోక్తులేలమదినించుక గొంకక
పల్కుఁ జెప్పుమా॥ (వ) మఱియు నెయ్యదిభూతంబుల కనివార్యంబై యిట్టిద
ట్టిదని నిర్ణయించుట కశక్యంబైయుండు నదియెదైవం బాదైవంబు పూర్వ
స్థితవాత్సల్యాపగమరూపంబునఁ గైకయందును స్వగతరాజ్యభ్రంశరూపంబు
నఁ నాయందును విపరీతంబై సన్నివిష్టంబయ్యె దైవస్వరూపంబుజ్ఞానసాధనం
బగుచుఁ గార్యభూతఫలంబులకంటె నొండువిధంబునఁ గానంబడకుండు నట్టి
దైవంబుతోడ నొడ్డారించుట కెవ్వండును సమర్థుండుగాఁడు లాభాలాభంబు
లును సుఖదుఃఖంబులును భయక్రోధంబులును భవాభవంబులు నెయ్యదిగలు
గఁజేయు నదియెదైవంబు విశ్వామిత్రాదితపోధనులు జితేంద్రియు లయ్యు
ను దైవప్రపీడితులగుచు నియమంబువిడిచి కామక్రోధాసక్తులై యుండుటయెల్ల
వారికిఁ దెల్లంబుగదా యీలోకంబునం దారబ్ధ కార్యంబుఁ గ్రమ్మఱించి యసంకల్పి
తంబగు కార్యంబాకస్మికంబుగాఁ బ్రవర్తింపఁ జేయుటదియెదైవకార్యం బనియె
ఱుంగవలయునిట్టినిశ్చయబుద్ధిచేతనంతరింద్రియంబునిరోధించిచూచిననవ్యాహ
తంబైనమదీయాభిషేకంబునందుఁ బరితాపంబు పుట్టదుగావుననీవుపదిష్టబుద్ధి
యోగబలంబునసంతాపంబువక్కణమద్బుద్ధి ననుసరించి యభిషేకాలంకారాది
కర్మంబులం బరిహరింపుమని పలికి వెండియుఁ గౌసల్యానందనుండు సుమి
త్రానందనున కిట్లనియె ॥ (తే, గీ) వినుము పట్టాభిషేక సంభృతములైన ।
కాంచన మయాఖిల ఘటోదకముల చేత । మహిత తాపసయోగ్యకర్మం
బునందు । మిగుల నాకు వ్రతస్నానమగు నిజంబు ॥ (తే, గీ) అరయ నా
జ్యార్థమానీతమైనయట్టి । యాసలిలమేలమనచేత నింపుమీఱు । నుపహృ
తంబైన సలిలంబె యొసఁగనరసాకు । దేనవ్రతస్నానమిపుడు గావించునఘ ॥
(తే, గీ) నాకుఁ జూడఁ బ్రజాపాలనమునకంటె । నవిపిన వాసమధికోద
యంబుగాన । ననఘ లక్ష్మి విపర్యయమందు నీవు । మదివిషాదంబు విడువుము

మమతదక్కి ॥ (వ) అది యెట్లనినఁ బ్రజల కృత్యాకృత్య వ్యాపేక్షా రాహిత్యంబునను సంతతంబుఁ దపఃప్రవృత్తి సాధనత్వంబువలనను విశిష్ట పితృవాక్య పరిపాలన విశేష ప్రయోజనత్వంబు వలనను రాజ్యపాలనంబుకంటె వనవాసంబు మహాభ్యుదయసాధనం బగు మఱియు మదభిషేచన విఘ్నంబు కనిష్ఠమాతయైన కైకేయివలన నయ్యెనని శంకింప వలవదద్దేవి దైవాభిపన్నయై యనిష్టంబులు పలికె దైవం బట్టి ప్రభావంబు గలదియని యెఱుంగుదువు గదాయనియిట్లు పెక్కుభంగులం బ్రబోధించిన రాముని వచనంబులు విని సుమిత్రానందనుండు శిరంబువాంచి దుఃఖహర్షంబులు మనంబునం బెనంగొన నొక్కింత

(*) లక్ష్మణుఁడు రామునితో దైవంబు ప్రబలంబు గాదనుట. (*)

సేపూరకుండి పదంపడి రోషం బగ్గలంబైన బొమలు ముడివడఁ బేటికా బిలస్థంబైన మహాసర్పంబు పగిది రోఁజుచు నిజవదనంబు కోపోద్దీపితంబైన సింహాముఖంబు కరణిం జూపట్టఁ గన్నులం గెంజాయ రంజిల్ల మదోద్దండ వేదండ శుండాదండంబునుంబోలె నిజభుజాదండంబు విదుర్చుచుఁ గ్రోధాతిశయంబున శిరోధూననంబు సేయుచుఁ దీక్ష్ణబాణంబులం బోని కటాక్షవీక్షణంబుల నిరీక్షించి దేవా పితృవచన పరిపాలన తదకరణరూపధర్మ దోషప్రసంగంబుచే తను దండ్రివచనంబు గావింపని రాముండు మనల నెట్లు రక్షించు నని జనంబునకుం బొడముశంకనపనయించుటకు ననవకాశంబు నందే యీసంభ్రమంబు నీకుదయించె నది భ్రాంతిమూలంబంతియె గాక యుక్తంబైనయది కాదు నినుఁబోఁటి యసంభ్రాంత చిత్తుండట్లనం దగదు తనంతందాను ముంగల నిలిచి యొక్కింతయైననెద్దియుం జేయుటకు సామర్థ్యంబు లేమింజేసి స్వాపేక్షార్థకరణంబునం బురుషాంతరంబు నపేక్షింపుచుండు నట్టి యశక్తంబును కృపణంబునగు దైవంబు ప్రబలం బని పలికెదవు దైవంబు నిరాకరించుటకు సమర్థుండుగాని ప్రాకృతునకుం గాక శౌండీరుండగు భవాదృశక్షత్రియ శ్రేష్ఠునకుఁగొ

(*) లక్ష్మణుఁడు రామునికిఁ గైకేయిదుర్మంత్రం బెఱింగించుట. (*)

నియాడం దగవుగాదని దైవాలంబనవాదంబు ప్రక్షేపించి ధర్మదోష ప్రసంగంబును బరిహరించు తలంపునఁ గ్రమ్మఱనమ్మహానుభావు నవలోకించి దేవా పాపాత్ములగు కైకేయీదశరథుల విషయంబునందుఁ బాపిత్వాశంకనీకేలకలుగద యెవ్వారిదువురు నిక్కంబుగా నీకుఁ బాపంబాచరింప సమకట్టిరట్టి పాపాత్ము



లగు కైకేయీదశరథుల వాక్యాకరణంబునందు నిర్దిష్టుండవైన నీకు ధర్మహానిప్రసక్తి గలుగ నేరదు లోకంబున నొండొరులు దోషమతులయ్యును గపటధర్మాచరణ కంచుకంబుచేత స్వదోషంబునుం గప్పికొని యుందురు నీవుధర్మైకశ్రవణ స్వభావశాఠ్యంబువలన భవదభిషేక రూపప్రయోజనంబుఁ బరిహరింప నుపక్రమించి యక్కైకేయీ దశరథులు గావించిన దురాలోచనంబిది యని యేల యెఱుఁగవైతి వది యెట్లనిన భరతున కవశ్యంబు రాజ్యంబొసంగం దగినయది రామునకు జ్యేష్ఠత్వంబునఁ దద్విషయంబైన యభిషేక కార్యం బారంభించెద నప్పుడు నీవు వరద్వయం బడుగుము తద్వ్యాజంబున రాముని వనంబునకుం బనిచి భరతున కభిషేకంబుఁ గావించెద నని యిట్లు కైకేయీదశరథులచేత సంకేతితంబైన కార్యంబిది యట్లు గాదేని యదేవియే తాత్పర్యంబు వరద్వయం బేల యాచింపకున్న యది యవ్వరద్వయం బయాచితంబైనను నీతిజ్ఞుండగు దశరథుండైన నింతక మున్నె పరిహరింప కేల యుపేక్షించి యున్నవాఁ డెల్లభంగులనిది వరవ్యాజం బునభవత్సంపద నపహరింపం గోరి చేసిన దుర్మంత్రంబగుటకు సందియంబు లేదని పలికి వెండియు నిట్లనియె ॥ (శా) శిష్టాచారము మాని రాజునుగుణున్, జ్యేష్ఠున్ విసర్జించి తాఁ। గష్టుండైన కనిష్ఠునుర్వికి విభుం, గాఁ జేయుటే ధర్మని। దిష్టంబైనవిధంబు దైవమనియే దీనుండనై లోకవి। ద్విష్టంబైన తెఱంగుసైఁతునె మహావీరోత్తములెమ్మెత్తురే॥ (వ) మహాత్మా యేధర్మంబుచేత భవద్బుద్ధి రాజ్యపరిత్యాగ వనగమనాంగీకార రూపద్వైధంబునొందె నేధర్మంబువలనఁ బితృవాక్యకరణంబునందుఁ బ్రత్యవాయంబగునని మోహంబు నొందితి వట్టిధర్మంబు నాకు ద్వేష్యంబై యున్నది నీవు ప్రతీకారకర్మంబునందుశక్తుండవయ్యును గైకేయీ వశవర్తియైన దశరథుని వాక్యంబు ధర్మిష్ఠంబతిలోకనిందితంబని ద్రోచిపుచ్చక యెత్తెఱంగున నంగీకరించితి వభిషేకకార్యవిఘాతంబు వారలచేతఁ గిల్బిషంబు వలనఁ గృతంబైనదని యెఱింగి పరిహరింపనికారణంబున నాకుమిక్కిలిదుఃఖంబువొడముచున్నయది యిట్టిధర్మాచరణంబు లోకవిరుద్ధంబు కామమన్యుపరీతచిత్తులును బితృప్రవాదశత్రువులునగు కైకేయీదశరథుల శాసనంబు మనంబునంజైన సంస్మరింపందగినయదియే యనిపలికి వెండియునిట్లనియె॥ (క) అనఘా వారలయభిషే। చనవిఘ్నుటనబుద్ధి దైవ సంకల్పముగా। కనిపలికెదవా దైవం

బనవరతము పేక్షణీయ మనుచుఁ దలఁచెదర॥ (క) వినుమ సమర్థుఁడు దైవం । బనుకొను సంభావితాత్మ లగు వీరులు ద్రో । చినడు తురుగాక దైవం । బనిదాని ప్రశంస సేయ రతిధీయుక్తిఁ॥ (క) ధరనెవ్వఁడు పౌరుషమునఁ । దఱిఁగని దైవము నుగడవ దక్షుండగున । ప్పురుషుండా దైవము చేఁ । గరము నిరోధింపఁ బడఁడు కాకుత్స్థవరా॥ (క) దైవబల మెక్కుడో నృప । భావితుఁడగు శూరవరుని పౌరుష మెఘనం । బోవీక్షింపుము ధీవర । దైవపురుషశక్తి తారతమ్యము దెలియఁ॥ (క) ఏదైవము చేనిప్పుడు । నీదగు సిరిపరులయందు నెఱపఁ బడియెనేఁ । డాదైవమును మదీయబ । లౌదార్యాభిహతమునుగ నరయుదు రార్యుల్॥ (వ) దేవా యేనతిక్రామితాంకుశవ్యాపారంబై విశృంఖలవృత్తి నభిముఖంబుగాఁ జనుదెం

## లక్ష్మణుఁడు తాను రాజ్యమును రామునికి లోఁబఱుతుననుట.

చు మదబలోత్కట వేదండంబునుంబోలె దైవంబును బౌరుషంబునఁ గ్రమ్మరించెద నదియునుంగాక॥ (మ) అనుమానం బొకయింత లేక రఘువర్యా నీదు రాజ్యాభిషే । చనవిఘ్నంబొనరింపఁ బూనిపటుదోస్సత్వంబు తో లోకపా । లనికాయంబరుదెంచెనేని విశిఖవ్రాతాహతిం బోరిలోఁ । దునుమంజాలుదు నట్టి నాకు నరనాథుండెంత చింతింపఁగఁ॥ (క) రవికులవర సన్నిప్పుడు । వివాసితునిఁ జేసినట్టి విమతులు గరిమం । దవిలిపదునాలుగబ్దము । లవిరళగతి నడవి నుండ నట్లొనరింతుఁ॥ (క) జనవిభునకుఁ గైకేయికి । నెనయువిధి న్భరత రాజ్యమందు మదిం బు । ట్టిన దుర్భరాశనష్ట । ఘ్నన బాహుబలాసి చేత ఖండింతు నొగిఁ॥ (వ) మహాత్మా మదీయంబైన మహోగ్ర పౌరుషంబు విరుద్ధ జనులకు దుఃఖంబు కొఱకు నెట్లగు నట్లు దైవబలంబు సుఖంబు కొఱకుఁ గానేరదని యెఱుంగుమని పలికి వెండియు లక్ష్మణుండు కానొకప్పుడైన భరతునకు రాజ్యంబు లేమిఁ దెల్లంబుగాఁ బోధించు తలంపున నిట్లనియె॥ (తే,గీ) అనఘ చిరకాల మీవు రాజ్యంబుఁ జేసి । వనమునకుఁ బోవుచుండ నవ్వాలభవత్సు । తులె ప్రజారక్షణ మొనరింపఁ గలరుఁ గాని । భరతునకు లేదు స్వాతంత్ర్య మరసి చూడ॥ (వ) అని పలికి స్వోక్తవనవాసంబు శేషజన సమ్మతంబని యిట్లనియె॥ (తే,గీ) వినుము నుతవత్స రాజర్షులు నిఖిలత్రి । భువని భారంబు సుతులయం దమరఁ జూని చి । రమ్ము ప్రాలనవణ్యమున కేగు టహర్షమనుచు । వేదవిదులు ఘటించిరి గాదె తొల్లి॥ (వ) మఱియు దశరథుండిట్లు చలచిత్తుండగుచు మఱి యీ రాజ్యవిభవ



మశంకచేత నీయందు రాజ్యం బంగీకరింపవేని భవదీయరాజ్యంబును నేను చెలియలికట్ట సాగరంబునుంబోలె రక్షించెద దానం జేసి జనాపవాదంబు నిన్నుం బొందనేరదట్లు సేయనైతినేని వీరలోకసుఖంబు నాకుఁ గలుగకుండుం గాక యని నిక్కంబుగా నీతోడ శపథంబుఁ జేసెద మంగళద్రవ్యయుక్తంబులగు జలంబులచేత నభిషిక్తుండవగు మయ్యభిషేకకర్మంబునందు వ్యాసక్తచిత్తుండవగు మే నొక్కరుండ సకలమహీపాలుర నివారించుటకుం జాలుదునని పలికి వెండియు నిట్లనియె॥ (తే,గీ) అనఘ మద్బాహువులు చాపమసియు శరము । లరయ నివియలంకారంబు కొఱకుఁ గావు । యతులపరిపంథిదురభిమానాపనోద । నార్థమని చిత్తమునఁ జూడు మనుదినంబు॥ (వ) మఱియు నెవ్వండు నాకు మిక్కిలి శత్రుండై పరీక్షకులచేత సమ్మతుండగు వానియునికి సహింపంజాల॥ (తే,గీ) ఖాసవుండల్క మెయి నెత్తి వచ్చెనేని । వాఁడిగల ఖడ్గధారచేఁ బోడిమి సెడ । నిగ్రహించెద నట్టినే నుగ్రభంగిఁ । దుచ్ఛునన్యుని సరకు గొందునె మహాత్మా॥ (క) నిరుపమ సుగుణాకర మత్కరోల్లసచ్చండఖడ్గ ఖండితకరిరా । ణ్ణరహరి శిరముల చేధర । కరముగ హానమట్లు గానగ వ్యతరమగుఁ॥ (వ) మఱియు మదీయఖడ్గధారా వినిపాతితంబులైన మత్తశుండాలంబులు తీవ్రవ్రణసంజాత రక్తధారా స్నపితంబులై విద్యుత్సమన్వితంబులగు మేఘంబులకరణి గైరికాది ధాతుమండితంబులైన పర్వతంబుల పోలిక ధరణిపయిం బడియెడుఁ గాక బద్ధగోధాంగుళిత్రాణుండనై శరాసనంబు కేలం దాల్చి పురుషమధ్యంబున నిలిచియుండఁ బౌరుషంబు ప్రకటించి నన్నుఁ దేఱిజూడం జాలువాఁడు గలఁడె యిట్లు సంరంభవిజృంభితుండనై పెక్కండ్ర నొక్కబాణంబునను పెక్కుబాణంబుల నొక్కనిం గాఁ గుదులుగ్రుచ్చినట్లు విచిత్రవిహారంబున క్రీడసల్పునప్పుడు మదీయ దివ్యాస్త్రప్రభావంబు మీరెచ్చిత్తగించెదరు మద్దివ్యాస్త్రప్రభావంబు దశరథునకప్రభుత్వంబును నీకుఁ బ్రభుత్వంబును గావించుటకు సమర్థంబైనదని యెఱుంగుమిప్పుడు మదీయబాహువులు చందనపంకంబునకును గేయూరధారణంబునకును ధనత్యాగంబునకును సుహృత్పాలనంబునకును యోగ్యంబులైన నవియన్నియుఁ బరిత్యజించి భవదభిషేచనకర్మవిఘాతంబుఁ గావించినట్టి దురాత్ముల వధంబునందు సమర్థంబులుగాఁ గలవు తమ్ముండనైన నాకు నీకు హితంబు సేయుటకంటె నొండు కార్యంబు లేదుగావునఁ గింకరుండనైన నావచనం బంగీకరించి కార్యం

బునడుపు తెఱంగానతిమ్మని ప్రార్థించుచున్న లక్ష్మణుం జూచి తదీయ నేత్రగళదశ్రు బిందుసందోహంబుఁ గొనగోట మీటుచుఁ బితృవచనవ్యవస్థితుండై యావజ్జీవపర్యంతంబు వాక్యకరణంబును బ్రత్యబ్దంబు భూరిభోజనంబును గయయందుఁ బిండప్రదానంబునను నిమ్మూటిచేతఁ బుత్రత్వంబు ప్రాపించుఁ గావున నెల్లభంగుల వనంబునకుం జనియెద నీవంగీకరింపవలయునని ధర్మసహితంబుగా బోధించుచున్న రామునింగని బాష్పధారాపూరితలోచనయై కౌసల్య యిట్లనియె॥ (సీ) ఎవ్వఁడు ధర్మమూర్తి యెవ్వాఁ డదృష్టదుఃఖుఁడు సర్వభూతప్రియుఁడు మహాత్ముఁ। డెవ్వాఁడు దశరథోర్వీశునివలన నాయందు జన్మించె సమంచితముగ। నెవ్వాని దాసులు భృత్యులు మృష్టాన్న మారగింతురు నిత్య మట్టి నీవు। భీకరవనములో నాకలంబులు దిని యేరీతినుండెద విట్లు రాముఁ॥ (ఆ,వె) డడవికేగెననఁగ నాలించి విభుని నె। వ్వాఁడు విశ్వసించు వసుధ సుగుణ। వనధివైన నీవు వనమున కరుగనే। మందు దైవమింత యధికమగునె॥ (సీ) అనఘాత్మ వినుమ దర్శనమారుతోత్థితమై దేహజాతశోకానలంబు। గాఢవిలాపదుఃఖసమిత్సమన్వితమగుచు సమ్యగ్గళదశ్రుఘృతము। చేవ్రేల్వఁ బడి మహాచింతోష్ణధూమంబు వఱలనూర్పుల సమావర్తనమునఁ। గడువృద్ధిఁ బొందిమద్గాత్రంబు నేర్చుచు నతులదావాగ్ని హిమాత్యయమున॥ (తే,గీ) నెండుపొదను దహించిన ట్లీవునడవి। కరుగ నన్నుఁ దపింపఁ జేయదెకడంగి। కుఱ్ఱనెడఁ బాయఁజాలని గోవుపగిది। నేను నీవెంటవచ్చెద నిప్పుడువనికి॥ (క) అనియీఁగతి విలపించుచు। మనమున సంతాపవహ్ని మల్లడిగొనఁగాఁ। దనతోడ మాటలాడెడు। జననికి నిట్లనియె రామచంద్రుఁడు సూక్తిన్॥

రాముఁడు కౌసల్యనుఁ దాను వనమునకుఁ బోవుటకు సమ్మతిపఱచుట.

(మ) జననీ యేనల డావసీమ కరుగన్ త్వన్నేతకై కేయిచే। సినపాపంబునకుం గృశించుమఱి నీచే నిప్పుడీరీతిఁ జ। య్యనఁ దావీడ్వడె నేని ఘోరతరదుఃఖార్తిన్ మదిం గుందియా। యనజీవింపఁడుగాన నీకతనిఁ బా యం బోలదీపట్టునన్॥ (క) రమణులకుఁ బతిపరిత్యా। గము కేవలపాపహేతుకంబగుఁ గానన్। సముదితగుణుఁడగు పతినో। రమణీయగుణాఢ్య విడువ రాదిట నీకున్॥ (మ) జననాథోత్తముఁ డెంతకాలమిలపై సప్రాణుఁడై యుండునం। తనుమానింపక యంతకాలము సముద్యద్భక్తియోగంబుచే। తనుశుశ్రూష యొనర్పఁ బోలునిదియుక్తంబీవు నే నప్పుడా। యనపాయ్యం బొనరింపఁ బోలుఁ బతియున్ క్ష్మాధీశుఁడుంగావునన్॥ (వ) అని బ



హుప్రకారంబుల బోధించి యద్దేవి నెట్టకేలకు నొడంబఱచి పితృవచనప్రకారంబునఁ బదునాల్గువత్సరంబులు వనవాసంబుఁ గావించివచ్చి భవదీయపాదారవిందంబులు గొల్చుచుండువాఁడనని పలికిన నద్దేవి వెండియుఁ గుమారుని వనవాసంబుఁ దలంచి కనుంగొనల నశ్రుకణంబులొలుక నకుమారవరు నవలోకించి యిట్లనియె॥ (చ) జనకుని మాటఁ గైకొని వెసన్ విపినంబునకీవు పోయిన। న్నేను ము సపత్నిమధ్యమున నేసరిగా మనియుండఁజాలఁ జ। య్యనవిపినంబున న్బోడమి నట్టిమృగింబలెనన్ను వెంటఁ దో। డ్కొనిచను మేగుదెంచెద నకుంఠిత భంగి నరణ్యసీమకున్॥ (వ) అనిపలికి రోదనంబుఁ జేసిన తల్లిం జూచి తానును దుఃఖాక్రాంతచిత్తుండగుచు ధైర్యధుర్యుండు గావున నొక్కింత యుపశమించుకొని క్రమ్మఱ నయ్యమ్మ దిక్కు మొగంబై యిట్లనియె॥ (చ) పతియె మృగాక్షికి న్విభుఁడు బంధుఁడు దైవతమట్లు గావునన్। క్షితిపతి నీకు నాకెపుడుఁ గేవలపూజ్యుఁడు దమ్మహాత్ముఁడ। ద్భుతకరుణాకరుండు నినుఁ బ్రోవక యేటికిఁ బేక్షసేయు న। మ్మతిని టుచింతవీడి గుణమండన గేహమునం దెయుండుమా॥ (క) ఏనడవికరుగ భూపతి। దానెంతయు దుఃఖశోకతాపము చేతన్। మ్రానుపడి యుండుఁ గావున నీ నేర్పున నమ్మహాత్మునెగులుడుపఁదగున్॥ (వ) అదియునుంగాక॥ (క) పరమోత్తమయై యే సతి। నెఱిగల్గి వ్రతోపవాస నిరతయగుచుఁ దా। వరుని భజియింపదా సతి। నిరయపదంబునకుఁ బోవునిక్కము జననీ॥ (క) ధాత్రీసురసురపూజలు। పాత్రమెఱిఁగి చేయకున్నఁ బతిశుశ్రూషా। మాత్రమున సాధ్వి కెంతయుఁ। జిత్రంబుగ స్వర్గపదవి ,చేకురుఁ దల్లీ। (క) జననీ యే యుత్తమసతి। తననాథుని ధర్మసరణిఁ, దప్పక నెపుడున్। ఘనభక్తిఁ గొలుచునా యమ। యనిమిషలోకైకసౌఖ్య మందుచు నెలఁగున్॥ (క) వగపెంత తనకుగలిగిన। మగువకుఁ బతిసేవ శ్రుతిస,మంచితధర్మం। బగుఁ గాన దీనిఁ గనుఁగొని। మగనిఁ గొలుచుచుండు మెపుడు మాన్యచరిత్రా॥ (వ) అనిపలికి భర్తృశుశ్రూషయందు యద్దేవిచిత్తంబు గీలుకొల్పి వెండియు నిట్లనియె॥ (క) భరతుఁడు ధర్మరతుండును। గరుణ గలుగువాఁడు గానఁ గైకను నినుఁ దా। సరిగాఁగఁ జూచు నా రఘు। వరు నన్నుం బోలెఁ జూడు, వాత్సల్యమునన్॥ (చ) అనుపమశాంతి హోమముల,యందు ఘృతాహుతిచేత వేల్పులన్। వినుతధనంబులం బుడమి,వేల్పులఁ దృప్తులఁ గాఁగఁ జేయుచున్। జనపతి రక్షణంబునకుఁ జాలిమదాగమనంబుఁ గోరుచున్। మునుకొని కాల మొక్కగతిఁ,

బుచ్చుచునుండుము పోయివచ్చెదర్ ॥ (వ) ఏనుగ్రమ్మఱ బురంబునకుం జన
నెంచు నందాకమహీరమణుండు సప్రాణుండై యుండెనేని సకలాభీష్టఫలంబు
లు వడయంగలదాన వనిపలికిన నత్తల్లోదరి యొక్కింతచిత్తంబు శోకాయత్తం
బు చేసికొని వెండియునక్కుమారున కిట్లనియె ॥ (గీ) వినుతగుణశీల వినునీకు,విపి
న గమన । మంపఁబుట్టిన బుద్ధినా,వంతమైన । నిలువరింపంగ లేనైతి, నేర్పుతే
ల । కాలముదురత్యయంబంత, ఘనుననైన ॥ (వ) పుత్త్రాయేకాగ్రచిత్తుండవై
నీవుచనుము నీకెల్లప్పుడు భద్రంబుగలుగుంగాక నీవుకృతార్థుండవై చరితవ్ర
తుండవై వనంబున నుండి క్రమ్మఱంజనుదెంచినప్పుడు నిన్నువిలోకించి యేనుగ
తక్లేశనై సుఖంబుఁబ్రాపించెద ననిపలికి వెండియు ॥ (క) కుడువుము గట్టుముపె
ట్టుము । ముడువుమనుచుం గఱపదగియు,మునుకోనినేనే । యడవికరుగుమనవ
లసెను । గడుదుష్కరమహహా కాల,గతినేమందున్ ॥ (క) తనయా వనమునకి
ప్పుడు । చనుముకుశలివగుచు మఱల, జనుదెంచిముదం । బునఁజూతు సామసూ

(*) కౌసల్యారామునికిఁబ్రాస్థానికస్వస్త్యయనంబుఁ గావించుట. (*)

క్తుల । ఘనమతి ననుహృష్టచిత్తఁ,గాఁ జేయుమొగిన్ ॥ (వ) వత్సానీవువనవా
సవ్రతంబుపరిసమాప్తి నొందించి జటామండలధారివై చతుర్దశవర్షాంతం
బున మఱలిమత్సమీపంబునకుం జనుదెంచి నన్నుం దేర్చునట్టి కాలం బిదియకా
యని తలంచెదనని పలికి దుఃఖంబడంచుకొని నిర్మలజలంబులుపస్పృశించిశుచి
యై ప్రాస్థానికంబగు స్వస్త్యయనంబొసంగనుపక్రమించి శ్రీరామునుద్దేశించి॥
(క) అతులితముగ నియమముచే । ధృతిచేనీచేతమిగుల, నేధర్మముపా ।లి
తమయ్యె నట్టిధర్మము । సతతము నినుఁబ్రోచు నడవి,సత్యవిచారా ॥ (వ) అ
దియునుంగాక చైత్యాయతనంబునందునిత్యంబునీచేత నెవ్వారువందితులగుదు
రట్టిదేవతలు మహామునులంగూడి నిన్ను రక్షింతురుగాక మహాత్ముండగు విశ్వా
మిత్రుండు తొల్లి నీకొసంగినదివ్యాస్త్రంబులునీకుజయప్రదంబులగుంగాక మా
తాపితృ శుశ్రూషాసత్యంబుచేత రక్షితుండవై బలాయురారోగ్యంబులు గలి
గి వర్ధిల్లెదవు గాక మఱియు సమిత్కుశపవిత్ర వేదికాయతనస్థండిలంబులును
శైలవృక్షంబులును హ్రస్వశాఖావృక్షంబులును హ్రదంబులును నిన్ను నిరంతరం
బు రక్షించుం గాక పతంగ పన్నగ సింహంబులు నీకుశుభంబు లొసంగుంగాక సా
ధ్యులును సర్వమరులును వాయువును ధాతయు విధాతయు సూర్యుండును లోకపా



లకులును మహర్షిగణంబులంగూడి సుఖప్రదులై రక్షింతురుగాక భగవంతుం
డగుస్కందుండును సోముండును బృహస్పతియు సప్తర్షులును నారదుండును
సర్వకాలంబు నీకుమంగళంబొసంగుదురు స్మృతియును శ్రుతియును ధర్మంబు
ను సముద్రంబులును నదులును భూమ్యంతరిక్షదివంబులును దిక్కులును ఋతు
సంవత్సరమాసపక్షంబులును నహోరాత్రంబులును గ్రహనక్షత్రంబులును సం
ధ్యలును గళాకాష్ఠాముహూర్తాదికాలంబులును నిత్యంబును మునివేషధరుండ
వై వనంబునగుందిరు నీకు సకలమంగళప్రదములై వెలయుంగాక మఱియుభూ
తప్రేతపిశాచ బ్రహ్మరాక్షస రక్షోయక్షప్లవంగ వృశ్చిక దంశ మశక సరీసృపకీ
ట సింహశరభశార్దూలగజగవయ వరాహభల్లూక మహిషాది క్రూర సత్వభ
యంబువలన సర్వదేవతలేమఱక నిన్ను రక్షింతురు గాక యింద్రాది దిక్పాలురు
దండకారణ్యనివాసివైననీకు సర్వోపద్రవనివారణంబుసేయుచుందురుగాక మా
ర్గంబులు కందమూలమధుసంపన్నంబులై యుండుఁగాక మునిముఖచ్యుతంబు
లగు మంత్రంబులును నగ్నియు మారుతంబును హోమధూమంబునునుపస్పర్శన
కాలంబున నిన్ను రక్షింతురుగాక శిరంబుదివంబును శ్రోత్రంబులు దిక్కులును
ముఖంబునింద్రాగ్నులును నేత్రంబులుసూర్యుండును మనంబుచంద్రుండునుప్రా
ణంబులువాయువు నాభినంతరిక్షంబును బాదంబులుభూమియు రక్షించుఁగాక య
ని యీదృశంబులగు మంగళవాక్యంబుల స్వస్తివచన పూర్వకంబుగా నంగర
క్షఁగావించి గంధపుష్పాక్షతంబులచే దేవగణంబులంబూజించి రామునకుమం
గళాభ్యుదయ పరంపరాభివృద్ధికొఱకు ఘృతంబునుబుష్పంబులును శ్వేతసర్షం
పంబులును సమిధలునుఁ గల్పోక్తప్రకారంబున బ్రాహ్మణునిచేత నగ్నియందు
హోమంబుసేయించి మఱియు నారామునకు మంగళంబుకొఱకు స్వస్త్యయనక్రి
యనాచరించి యవ్విప్రముఖ్యులకు గోభూహిరణ్యాది దానంబులొసంగి వెండి
యుసీతావల్లభునుద్దేశించియిట్లనియె॥(సీ) వృత్రనాశమునందు, నింద్రునకమరసు
పూజమిచ్చినయట్టి, మంగళంబు । నమృతంబుఁదేఁబోవు,నహికులారికి వినతాం
గనయిచ్చిన, మంగళంబు । నమృతంబు వడయనాఁ, డదితిదైత్యులగెల్వ మ
ఘవునకిచ్చిన, మంగళంబు । బలిఁగట్టనరుగునాఁ, డలవామనునికింద్ర మాతయి
చ్చిన,శుభ మంగళంబు ॥ (తే, గీ) నీకెయగుఁగాక యని రఘునేతశిరము । నం
దుమంత్రాక్షతలనిడి, చందనార్ద్రి । శేషసువిశల్యకరణిది, వ్యౌషధులను ।గు

ళికఁ గావించి ముంజేతఁ గూర్చి కట్టె ॥ (వ) ఇట్లు రక్షాబంధనంబుఁ గావించి దాని వీర్యవంతంబులగు మంత్రంబులచేనభిమంత్రించి చుబుకంబు పుణికి శిరంబు మూర్కొని చెక్కిలి ముద్దుగొని గద్గదస్వరంబున నిట్లనియె ॥ (సీ) అనఘాత్మ పోయిర, మ్మడవికి సుఖివై యరోగుండవై యందు, రాఘవ మెఱయ । సమయంబుఁ దీర్చి ప్రసన్నాననుండవై మఱలఁ బురంబున, కరుగుదెంచి । యవనిజఁ గూడి పట్టాభిషిక్తుండవై యతులితవజ్రసింహాసనమునఁ । బూర్వాద్రిపైఁ బొల్చు పూర్ణచంద్రుని మాడ్కిఁ జెలఁగుచుఁ బ్రజలర, క్షించుచున్నఁ ॥ (తే,గీ) గన్నులారంగఁ జూచెదఁ గాక యనుచు । నడవి వర్తించుచున్నశి. వాదిసురులు । సమరమునులును నీకుదీ, ర్ఘాయువొసఁగి । కాచి రక్షింపుచుందురు, గాక వత్స ॥ (వ) అని పలికి స్వస్త్యయనంబుఁ బ్రయోగించి రఘూర్థంబు ప్రదక్షిణంబు చేసికొడుకుం

(*రాముఁడు స్వగృహంబునకరుగుట. (*)

గౌఁగిలించుకొని పోయిరమ్మని పంచిన నా రఘుపుంగవుండు తల్లిపాదంబులకుఁ బ్రదక్షిణపూర్వకంబుగా సారెసారెకు నమస్కారంబు గావించి దీవనలం బొంది తదీయమందిరంబు వెలువడి నిజదేహప్రభాపటల సమలంకృతరాజమార్గుండగుచుఁ బూర్వభాషితప్రియవాది ప్రభృత్యుక్త విశిష్టగుణత్వంబున జనంబుల చిత్తంబులు సంకోచింపం జేయుచు సంప్రాప్త జనాకీర్ణంబును గాత్రస్వర విభూషితంబునగు స్వగృహంబునకుం జనియందు పట్టాభిషేక విఘాతాదికం బెఱుంగనిదగుటవలన నాయావరాజ్యాభిషేచనంబె మనంబున నిడికొని దేవపూజాదికంబు నిర్వర్తించి యభిషిక్త భర్తృ విషయంబునందుఁ బట్టభార్యల చేతఁ జేయందగిన పాదార్చనాది సమాచారం బెఱింగిన దగుటం జేసి సాక్షత గంధపుష్ప పాత్ర హస్తయై యభిషిక్త రాజసాధారణ లక్షణపాండుర చ్ఛత్ర చామర పురస్కృత భద్రాసనాదికంబు లెఱింగినది గావున నుక్తలక్షణ విశిష్టుండై వల్లభుం డెప్పుడు వచ్చునో యని తదాగమనంబుఁ బ్రతీక్షింపుచున్న సీతకడకుం జని యద్దేవి కెవ్విధంబున నేతాదృశ విప్రియం బెఱింగింతు నని వ్రీడానమ్రవదనుండై యుండె నప్పుడు ॥ (తే, గీ) విభుని ముఖమునఁ గనుపట్టు, విన్నఁదనముఁ । జిత్తమునఁ గూరియుండిన, చింతఁ జూచి । యొక విధంబునఁ జూపట్టు, చున్నదనుచుఁ । గాంత చింతాకులిత సర్వ, కరణ యయ్యె ॥ (చ) అతివ తెఱంగుఁ జూచి హృదయంబునఁ దాలిమి నిల్వలేకఁ దా ।



(*)సీత రామునిముఖంబునంగలదుఃఖమునకుఁ గారణంబడుగుట .(*)

నతిశయదుఃఖ వేగమున, నశ్రులు రాల్పఁ దొడంగ నప్పు డా । పతికడఁ దోఁచు లజ్జయుఁ బి,పన్నతయుం బరికించి మేదినీ । సుతకడు నివ్వెఱ న్మనిఁ గి,శోకముతోని జభర్త కిట్లనున్ ॥ (తే, గీ) దేవ నేఁడు బృహస్పతి,దేవతాక । మైన పుష్యమి నీదు రా, జ్యాభిషేక । మునకుఁ దగు యని విప్రోత్త,ములు వచించి । రది నిరర్థక మే భంగి, నయ్యెఁ జెపుమ ॥ (క) జలఫేన సన్నిభము శత । శలాక సంయుతము పూర్ణ,చంద్రసదృశము ॥ జ్వలమగు శ్వేతచ్ఛత్రము । సులలితముగ శిరముమీఁద,శోభిల దేలా ॥ (తే,గీ) నవసరోరుహపత్త్రాభ,నయనమైన ॥ నీదు వదనంబు మణిదండ,నిర్మితాచ్ఛ । చంద్రహంసప్రతీకాశ,చామరముల । చేత రంజింపఁబడదేల,చెపుము నాకు ॥ (తే,గీ) నిఖిలమంగళతూర్యవి,నిస్వనములు । సూతమాగధపాఠక,స్తుతిరవములు । సకలభూసురస్వస్తి వా,చననినాద । మిపుడు వినఁబడ వేల ప్రా,ణేశ చెపుమ ॥ (తే,గీ) వేదవేదాంతవిదులైన,విప్రవర్య । లధిపమూర్ధాభిషిక్తుఁడ,వైననీదు । శిరమునందుఁ దీర్థాంబుమి,శ్రితమనోజ్ఞ । దధియుక్షౌద్రంబు నిడ రేల, తపనతేజ ॥ (క) పరిషన్ముఖ్యులు మంత్రులు । పరమర్షులు జానపదులు,పౌరులు భృత్యుల్ । పరమానందంబున నీ । పిఱుంద దెసరార రేల, ప్రియమల రారన్ ॥ (తే,గీ) ముఖ్యములు వేగసంపన్న,ములు మనోజ్ఞ । కాంచనవిచిత్రభాండయుక్తంబులైన । భూరిహయములఁ బూన్చిన పుష్యరథము । భానుతేజుని మ్రోలఁ జూ,పట్ట దేల ॥ (తే, గీ) నీలమేఘనిభప్రభా, నిరుపమాన । కుసుమపూజిత సుందర, కుంజరంబు । పృథుపరిష్కార రేఖాగ,భీర మగుచు । దేవ నీ మ్రోల రాదేఁ, తెలియఁ జెపుమ ॥ (క) హరిహయ సన్నిభవిక్రమ । సురుచిర మణివజ్రచిత్ర, సుందర చామీ । కర భద్రాసనముఁ బుర । స్కరించుకొని రావదేల, సముచితభంగిన్ ॥ (చ) సలలితచంద్రబింబ సదృ,శం బగు నీవదనం బదేలొకో । చెలువము డక్కి నేఁడు వెను,చింత వివర్ణత నొందియున్నదు । ల్లలదురు రాజలక్షణవి,లాసము లేమియుఁ గాన రావు నా । కలవడఁ దెల్పుమింతయు మ,హాపురుషా యనుమాన మేటికిన్ ॥ (చ) అనివిలపింపు

(*) రాముఁడు సీతకు దశరథ నిదేశంబుఁ దెల్పుట, (*)

చున్న ప్రియుఁ, రాలికి నాత్మవివాసనంబుఁ దా । ముని వినిపించినం బిదప, మోసము వచ్చు నటంచు భద్రయు । స్ఖనగుణ కీర్తనంబున మ,నంబు తిరం

బుగఁ జేసి రాఘవుం । డనియె మహీజతోడ ముదితాత్ముఁడు పోలెనయంబుఁ దెల్పుచున్ ॥ (చ) సరసిజనేత్ర తొల్లి నృపచంద్రుఁడు కైకకు మెచ్చి వేడ్కతో । వరములు రెండొసంగె విభవంబున నాయమ నాఁటనుండి దా । మఱచి వివేకయై యిపుడు, మానవనాథునితోడ నెంతయు । న్భరతున కుర్విరాజ్యమును, నాకుఁ బ్రవాసముఁ గోరెఁ గోరినన్ ॥ (చ) జనపతి సత్యవాదియును సత్యవిచారుఁడు గాన మున్ను దా । ననుమతిఁ జేసి వేడ్కమెయి, నాడిన వాక్యముఁ దప్పలేక నె । మ్మనమునఁ గైక పుత్రునకు, మానవరాజ్యము నీఁదలంచిన । న్వనమున నుండు పొమ్మనెన, హారణలీలఁ జతుర్దశాబ్దముల్ ॥ (వ) నీచేత ననుజ్ఞాతుండనై కాదె వనంబునకుం బోవువాఁడనై నిన్నుం జూడ వచ్చితి మఱియు భరతుని సమీపంబునం దేను నీచేత నొకానొకప్పుడైన శ్లాఘనీయుండఁ గాను సమృద్ధియుక్తులగు పురుషులు పరస్తవంబు సహింపం జాలరు గావున మద్గుణంబులు భరతునిముందఁ గథ్యంబులు గావు సర్వప్రకారంబుల నతని సమీపంబున ననుకూలత్వంబున వర్తించు టిది యోగ్యంబు నీవు

(*) రాముఁడు సీతకు బుద్ధులు గఱపుట. (*)

బంధుసాధారణ్యంబున భరణీయవుగాని భర్తవ్యవు గావు సనాతనం బగు రాజ్యంబు తండ్రిచేత నతనికి దత్తం బయ్యెఁ గావున నతండు నరపతి యగుటం జేసి నీచేత విశేషించి ప్రసాద్యుండై యుండుఁ బితృవచనప్రకారంబున నేను వనంబునకుం జనియెద నానచ్చునందాఁక వ్రతోపవాసంబులు సలుపుచుఁ గాలంబు దప్పకుండ దేవతా సపర్యలు గావింపుచు నిత్యంబుఁ గౌసల్యాదశరథులకు నమస్కరింపుచు విశేషించి మజ్జనని యగు కౌసల్య శోకసంతాపకర్శిత గాకుండ సన్మానంబు సేయుచు స్నేహప్రణయపాలనంబులచేత నాకుఁ దల్లులందఱు నొక్కరూపు గావున నద్దేవుల కందఱకు వందనంబు లాచరింపుచు మఱియు నాకుఁ బ్రాణతుల్యులును భ్రాతలును బుత్రసములు నగు భరతశత్రుఘ్నుల యెడ వాత్సల్యంబు నెఱపుచు విశేషించి భరతుండు దేశకులంబులకు రాజు గావున నతనికి విప్రియంబుఁ గావింపక ప్రియవాదినివై యుండు మనుకూలవృత్తిచేత నాలస్యత్యాగాదులచేత నవనీపతులారాధితులై ప్రసన్నులగుదురు తద్విపర్యయంబునఁ గుపితులగుదురు గుణంబు లేని యెడఁ బుత్రులనైనఁ బరిత్యజింతురు గుణంబుగల చోట నన్యులనైనం బరిగ్రహింతు రట్లుగావున నీవియు



ధర్మంబు మనంబున నిడికొని ధర్మంబు దప్పకుండ భరతుని కనువర్తినివై సత్యవ్రతపరాయణవై యొక్కనికైన నప్రియంబొనరింపక ధర్మైకనిష్ఠవై కాలంబు గడపుచు మదాగమనంబుఁ బ్రతీక్షింపుచుఁ గౌసల్యయొద్దనుండు మేను వనంబునకుం బోయి వచ్చెద ॥ (క) అనియీవిధమునఁ బలికిన । లిక్కనఁ బ్రణయమువలనం గోపగించినయటులా । వనజాతనేత్ర నిజనా । థునిఁ గనుఁగొని పలికె మఱల

(*) సీత రామునితోఁ దాను వెంట నేవత్తుననుట. (*)

దుఃఖముగదురన్ ॥ (తే, గీ) అనఘ యేమివచించెద వలఁతిమాట । లఖిలధర్మపారంగతులైన మీరె । తగవువిడనాడి పలుకు టెంతయును నాదు । మదికిఁ బరిహాసమై తోఁచె మానవేంద్ర ॥ (వ) అది యెట్లంటేని ॥ (చ) తనయుఁడు భ్రాతయున్స్నుషయుఁ దల్లియుఁ దండ్రియు నైజకర్మసం । జనిత ఫలంబులం గుడువఁ జాలి స్వభాగ్య నియుజ్యమానులై । మనుదురు భర్తృభాగ్యమును మానినియొక్కతెపొందుఁ గావున । న్ననుజవరేణ్య యేనును వనంబున నుక్కుమొనర్పఁ గాదగున్ ॥ (వ) అదియునుంగాక (అర్ధో వా ఏష ఆత్మనో యత్పత్నీ) యను వేదవాక్యంబు గలదు గావున భవదర్ధశరీర భూతనైన యేనును మహీపతిచేత వనవాసంబునందు నియోగింపం బడినదాననైతిఁ గావున నేను నీతోడ వనంబునకుం జనుదెంచెద ॥ (క) జనకుఁడు జననియు సకియలు । దనయుండును దనకుఁ గారు తథ్యము ధరలో । వినుము సతికిం దునందును । ఘనుఁడగు పతియొకఁడె పరమ గతి తలపోయన్ ॥ (క) అనఘా నీ విపుడే వనమునకుం జని తేని నీదు ముంగలఁ గుతుకంబునఁ గుశకంటకములనొగి । వని మృదువుగఁ జేసికొనుచు, వచ్చెదఁ బ్రీతిన్ ॥ (తే, గీ) రోషమునసూయయును మృషాభాషణంబు । భుక్తశేషోదకంబును బోలె విడిచి । కొనిచనుము నన్ను నిర్విశంకుండవగుచుఁ । బ్రాణనాథ నాయందుఁ బాపంబు లేదు ॥ (వ) మఱియు వల్లభుండు ప్రాసాదాగ్రస్థితుండైనను స్వర్లోకస్థితవిమానగతుండైనను యోగబలంబువలనఁ గేవలవైహాయసగతుండైనను సర్వావస్థలయందు నతనితోఁగూడఁ దత్పాదచ్ఛాయభంగి యువతి ప్రవర్తింపవలయునని విధింపఁబడియె నదియునుం గాక ॥ (ఉ) తల్లియుఁ దండ్రియున్బహువిధంబుల బుద్ధులఁ జెప్పుచోట నా । కెల్లెడ భర్తృసేవ మది నేమఱకుండుమటంచుఁ బ్రీతితోఁ । దెల్లముగాఁగ ధర్మవిధిఁ దెల్పిరి గావున నత్తెఱంగు నా । యుల్లమునందుఁ బాదుకొని యున్నది వెండియుఁ జెప్ప నేటికిన్ ॥ (ఆ, వె) పురుషవర్జితంబు భూరి

మృగాకీర్ణ । మైనవిపినమునకు నరుగుదెంచి । తండ్రిగృహమునందుఁ దగవసిం
చినమాడ్కి- । నిన్నుఁగూడియచట నిలుచుదాన॥ (క) అతులత్రిలోకసుఖసం ।
తతిసైయైనన దేలవినుము ధరణీశపతి । వ్రతలగు సతులకునిత్యముఁ । బతిసేవ చతు
ర్విధేష్ట ఫలదముగాదే॥ (ఉ) కావునజీవితేశఘున కాననసీమ ఫలంబులస్మదం।
బావహిలక్ గ్రసింపుచున మాహితబుద్ధి భవత్పదాబ్జముల్ । వావిరిఁ గొల్చుచు
న్నఘుసు వాసితభూములనిన్నుగూడిఁయు । చ్ఛావిధిఁగ్రీడసల్పెదఁబ్ర సన్నతఁ దో
డ్కొనిపొమ్మువచ్చెదన్॥ (క) దేవాయన్యులనైనను । బ్రోవసమర్థుఁడవునీవు
పొలుపుగనన్నుం । బ్రోవఁగఁజాలవెమునుకొస! నీవెంటనరణ్యమునకు నిజముగ
వత్తున్॥ (వ) మహాత్మా న్యాయప్రాప్తానుగమనత్వంబువలన నేను క్రమ్మఱించు
టకు నశక్యనైతి నన్నుపానవిశేషసంపాదనంబుకొఱకు నీకు దుఃఖంబుఁగావింప
ఫలమూలంబులాహరించి నిత్యంబు నిన్ను సేవింపుచుఁ త్రైలోక్యైశ్వర్యంబు
నైనగణింపక పాతివ్రత్యంబుచింతింపుచుఁ దపశ్చరణశీలనై నియమ యుక్తనై
నిన్నుంగూడియుండెద నిదియునుంగాక॥ (సీ) మనుజేంద్రగుహలందు మధుగం
ధివనముల యందుఁ బల్వలముల యందుశైల । ములయందు శాద్వలం బుల
యందుసానుదేశములందుబకహంస చక్రవాక । కారండవాకీర్ణ కాసారము
లయందు మించినీతోడఁగ్రీడించుకంటె । నాకలోకంబైన నామనంబున కెక్కు
డగునెమహాత్మయిప్పగిదిఁబెక్కు॥ (తే, గీ) వత్సరంబులుచరియింప వచ్చుగాక।
చిత్తమునకొక్కదురవస్థ చిక్కుపడునె। నిన్నుఁబాసినయెడనింట నున్నభోగ ।
మెంతగలిగినసంతోష మింతలేదు॥ (ఉ) కావుననేనవశ్యమును గారుణికోత్తమ
కాననోర్వికి । న్నీవెనువెంటవచ్చెదను నేర్పులుదెల్పుచుకాదఁటన్నచో । వావిరి
దుఃఖశోకమయ వారిధిలోనమునింగిచెచ్చెరన్ । జీవితముజ్ఞ్యజింతునిది సిద్ధ
ముపల్కులువేయినేటికిన్॥ (వ) దేవా మృగయుతంబును వానర వారణసమ
న్వితంబును సుదుర్గమంబునగు వనంబునకుంజనుదెంచి యందు భవత్పాదా
రవిందబులుసేవింపుచుఁబితృగృహంబునందుంబోలె సుఖంబుగానుండెదనిరంత
రానురక్తచిత్తనైయనన్యభావనై భవద్వియుక్తత్వంబున మరణంబు కొఱకుని
శ్చితనై ప్రార్థింపుచున్ననన్ను శీఘ్రంబున వనంబునకుందోడ్కొనిచను మిది
నీకు భారంబుగాదు॥ (చ) అనియిటుసర్వధర్మకలితాత్మకమైనమహీకుమా
రివ । ల్కినవినిరాఘవుండువలికెకమఱలన్ నిజపత్నిఁజూచికా । ననమునఁగల్గు



బాములుమ నంబుననెంచుచుఁదద్విలోలలో । చనగళి దశ్రుపుల్ దుడిచి సాం
త్వమృదూక్తి ననూనయింపుచున్॥ (తే, గీ) అంబుజేక్షణనీవుమ హాకులీన । వ
గుట ధర్మవిశారద వైతివిచట । నిలిచి మనమున కింపుగానలరుధర్మ। మా
చరింపుమునను(గూర్చి యనుదినంబు॥ (క) ఏనెద్దిబుద్ధిగఱపిన । దానినొనర్పం
గనీకుఁదగుఁగావునఁబ । ద్మానన కాననసీమకు । మానుగ రానలదునిలువు మాని
లయమునన్॥ (ఉ) కోమలికాననంబులత కూనలకుంజొర రాదుదుర్జన । స్తో
మనివాసమున్నహుళ దుఃఖతరంబుభయస్వరూపము । ద్దామమృగప్రకాండము
తి దారుణమచ్చటనెంతయున్సుఖం । బేమియులేదునామతిగ్ర హించిసుఖస్థితినిం
టనుండుమా॥ (క) గిరినిర్ఝరజనితములగు । పరుషనినాదములుభయద బం
ధురగిరికం । దరవాసిసింహనినదో । త్కరములువీనులకుదుఃఖ కరములుగావే॥
(క) జనశూన్యములగుఘోరవి । పినదేశములందుభూరి భీషణఘోషం । బునఁ
గ్రీడసలుపుమృగములఁ । గనుఁగొన్నభయమువొడముఁ గాదెమృగాక్షీ॥ (క)
దారుణనక్రవిహారో । దారములైబురదగల్గి దందంతీశ్వరసం। చారమ్ములైతనన్పె
డు । భూరిమహానదులుదాఁటఁ బోలునెచెప్పుమా॥ (క) హరిణాంకవదనభీషణ ।
తరకృకవాకూపనాది తములులతాప్ర । స్తరకంటక యుతములు నగు । నరణ్యా
మార్గములనడువ నలవియెనీకున్॥ (క) వనజాతనేత్రతనయం । తనెరాలిన

(*)రాముఁడు సీతకు వనవాసంబునంగల యిడుములఁదెల్పుట.(*)

పర్ణతల్ప తలములయందుం । బనివడినిద్రించుటయును । ఘనసుకుమారులకు
మిగులఁ గష్టముగాదే॥ (క) కమలాక్షితరువులనం । దమయంతనెపడినఫలవి
తానముఁదినికా । లముపుచ్చుచునాఁకటికో । ర్చిమనంగాఁ జెల్లునొక్కొ మృ
గనేత్రలకున్॥ (మ) చలిగాలింబడినిత్యముంద్రిషవణ స్నానంబుఁగావించుచున్
ఫలమూలంబులదేవతాతిథిపితృ వ్రాతంబులన్భక్తినిచ్చలుఁబూజింపుచు సంతత
వ్రతవిధుల్ సంధింపుచున్దీర్ఘవ । ల్కలముల్ దాల్చివసింప వచ్చునెవనిం
గాశ్యోపవాసంబులన్॥ (క) వానప్రస్థోచితవిధి । చేనిత్యము వేదియందు క్షితి
జాతగళ । త్పూనార్చలుసలుపఁగవలెఁ । గాననరణ్యంబుదుఃఖకరములతాంగీ॥
(తే,గీ) మానినీమణిలబ్ధంబు లైనమూల । ఫలములవికొంచమైనను బరగవాని।
చేతనెమనంబునకుఁదృప్తి సేయవలయు । గహనవాసంబుకడుదుఃఖకరమున్మిన్॥
(వ) మఱియు మహావాతంబులు రజోరూషితంబులై సుడియుచుండురాత్రుల

యందుగాఢతిమిరంబువ్యాపించియుండు సర్వకాలంబు మిక్కిలిభీజనేచ్ఛగలి
గియుండుగిరిసర్పంబులు బహురూపంబులై యతికుటిలసంచారంబులై మార్గం
బు నావరించుకొనియుండుఁ బతంగవృశ్చికకీటదంశ మశకంబులునిత్యంబునుబా
ధింపుచుండుఁ గంటకవంతంబులైనద్రుమంబులును గుశకాశంబులును వ్యాకుల
శాఖాగ్రంబులై యుండు నదియునుంగాక యరణ్య వాసంబునందుఁ గాయక్లేశక
రంబులైన వ్రతోపవాసాదికంబులు గావింప వలయు నుక్తవిలక్షణంబులైన
భయంబుల నేకంబులుగలిగియుండుఁ గ్రోధలోభంబులు వర్జించినిత్యంబునుద
పంబునందుబుద్ధినిలుపవలయుఁగావుననివిధావస్థాప్రాప్తిహేతువగుకాంతారవా
సంబునీకశక్యంబైయుండు నెల్లభంగుల మదీయవాక్యంబంగీకరించి వనప్రయా
ణంబుపసంహరింపుమనినానావిధానూనవాక్యంబులననూనయింపుచున్న ప్రాణ
వల్లభుంగనుంగొనికన్నీరునించుచుంగద్గదస్వరంబుననిట్లనియె॥ (తే,గీ)అనఘమీ
రానతిచ్చిన యటులఘోర। గహనమునదోషములుపెక్కుగలుగుటదియు। ని
క్కమైననునీదుసన్నిధివశంబు। వలన నవియుగుణంబులై యలరుచుండు॥(తే,గీ)
దేవసింహాదిమృగములదృష్టపూర్వ। మెననీవిగ్రహముఁజూచి యధికభీతిఁ। బఱ
చు నెవ్వారికైనను, భయముపుట్టుఁ। దవిలి భయహేతువస్తుసం, దర్శనము
న ॥ (క) మానకమును గఱపిన గురు। నానతి నీతోడ వనికి,నరుగుటయొం
డెం। గానియెడజీవితము లు। ర్వీనాయక విడుచుటొండె, వేఱొక టగునే ॥
(ఉ) మానవనాథ యింత పలు,మాఱుభయంబిటువల్కనేల నీ। మానితబా
హుదుర్గముల, మాటుననిల్చిన నన్ను వాసవుం। డైనను జేటిచూడఁ।గ
లఁ,డా భవదీయపరాక్రమక్రమం। బేనిపుడాత్మలోఁదెలియ,కిట్లు దలంతునెసా
హసంబునన్ ॥ (ఆ, వె) భానువంశవర్య, పతిహీనయగు సాధ్వి।జగతిలోనఁ
బ్రతుకఁ, జాలదనుచుఁ। బెక్కుమారులీమీరె, ప్రీతతోఁజెప్పితి। రిప్పుడన్య ధ
ర్మ,మెట్లుగలిగె ॥ (వ) అదియునుంగాక ॥ (క) మును జనకుని గృహము
న స। జ్జనులగు భూసురులు పరమ,సాధ్వీపతితో। వనయాత్ర సలుపఁగలవ
ని। యనఘా వచియించిరదియు, నన్నృతంబగునే ॥ (వ) మఱియును ॥(ఆ,వె)
రాజవర్య సాముద్రిక,లక్షణజ్ఞు। లతివ పతితోడ వనమున, కరుగఁగలవ।టం
చురేఖా విశేషంబు, లరసిచెప్పి। రదినిరర్థక మగునె మ,హాత్మయిపుడు ॥
(ఆ, వె) వానవాభ విప్ర,వరులచే నుపదిష్ట। మైన విపినవాస,మనుభవింప।



కేల తక్కునాకు, హితబుద్ధినీవెంటఁ। బూని కాననమున, కేనువత్తు ॥ (క) వ
నవాసమందు దోసము। లనఘాత్మక పెక్కు గలుగు,టది నిక్కంబై। నను వి
షయలోలుపులఁజ। య్యనఁ గలఁచుంగాక నియమి,తాత్ములకగునే ॥ (తే,గీ)
పిన్ననాఁడేను గురునింట, నున్నవేళఁ। దల్లిమ్రోల నొకానొక,తపసివలన। వి
పినవాసంబు గలుగుట,విఁటినాఁట। నుండి యదియె కాంక్షింపుచు,నున్నదా
న ॥ (తే, గీ) అధిప మనమిద్దఱము విలా,సార్థ మర్థి। వేడ్కవిహరించు
టకు జాహ్న,వీతటస్థ। విపినమున కేగుదమె యంచుఁ, బెక్కుగతులఁ। బ్రీతి
తోడుత నిన్నుఁబ్రా,ర్థింపలేదె ॥ (తే, గీ) కాంత నేటికి దైవయో,గమున న
దియు। దొరకొనియె మాటలింకేల, పరమభక్తి। కాననంబున నీపాద,కమల
సేవ। సేయుచుండెద సంతుష్ట,చిత్తనగుచు॥ (వ) మఱియు నాకు భర్తకంటె
నొండు దైవంబు లేదు గావున నట్టి దైవస్వరూపకుండవైన నీచరణసేవావిశే
షంబున విగతకల్మషనై యుభయలోక సుఖంబులం బడసెద నది యెట్లనినఁ
దండ్రిచేత సలిలధారాపూర్వకంబుగా దత్తయైన యువతి యీలోకంబునఁ బ
తివ్రతాధర్మంబునం బ్రవర్తించెనేనియు నది పరలోకంబు నందును నతనికే
హితైషిణియై యుండునని బ్రాహ్మణముఖ నిర్గతంబైన వేద వాక్యంబువలనవి
నఁబడుచుండు శ్రుతిస్మృతి న్యాయంబులవలన మన కిరువురకు నిత్య సంబంధం
బు సిద్ధంబగుచుండ సదాచారసంపన్నను బతివ్రతను స్వకీయ నైననన్నుఁబురం
బున నుండి వనంబునకుం దోడ్కొనిపోవుట కేల యనుమతి సేయవు సమా
నసుఖదుఃఖ నగు నన్ను నీతోడ వనంబునకుం దోడ్కొని పొమ్ము దీని కొడంబ

—(*) సీత తన్ను వనమునకుఁ దోడ్కొని పోవలయునని నిర్బంధించుట . (*)—

డవేని విషాగ్నిజలంబులవలనం బ్రాణంబులు విడిచెదనని నానావిధ న్యాయా
ను సరణంబు లగు వాక్యంబులం బ్రార్థించి యతని చిత్తంబు ప్రసాదా యు
త్తంబు గాకున్నం గనుంగొని యద్దేవి ప్రణయాభిమానంబుల నీషత్కోప దీ
ప్తవదనయై వెండియు నిజవల్లభున కిట్లనియె ॥ (చ) విను మిథిలాధినాథుఁడతి
విశ్రుతకీర్తి విదేహుఁడైన మ। జ్జనకుఁడు పత్నినైన నను, సమ్మతిఁ బ్రోవఁగఁ
జాల కొంటిమై। వనమున కేగు నిన్ను విని,వారక లోపల స్త్రీస్వభావము।
ఘనపురుషాహరూపమును, గల్గిన యల్లునిఁగాఁ దలంపఁడే ॥ (తే,గీ) రామ
మాతండ్రి జనకుండు,రమణతోడ। రూపమాత్రంబుచేతఁ బు,రుషుఁడవైన। ని

న్ను స్త్రీనిఁగా నెఱుఁగక, నన్నొసంగె । నెట్టిఁగి యుండినఁ గని కని,యేలయి
చ్చు ॥ (తే,గీ) అనఘ మాయయ్యజనకుండు, నినుమహాత్మ । నల్లునిఁగఁ గొ
ని భువనత్ర, యంబునందుఁ । గలుగుభవదన్య పురుష వి,గ్రహముసర్వ ।మా
త్మలోనెంచె స్త్రీయని, యనుదినంబు ॥ (క) ఆతతబుద్ధి విదేహా। జ్యాతల
నాథుండు మాత,యగు కేకయభూ । నేతృసుతవలనఁ గలహం । బితఱేఁబుట్టు
నని యెఱుఁగ, కిచ్చెన్నన్నుఁ ॥ (వ) మఱియును ॥ (తే, గీ) కాంతమాతం
డ్రిపురుషవి,గ్రహుఁడవనుచు । రామ జామాత వనుచుఁ గ,రంబునిన్నుఁ।గాం
చి యుభయలోకసుఖంబుఁ, గరము తుచ్ఛ । ముగఁ దలంపుచు నానంద,పూ
ర్ణుఁడయ్యె ॥ (వ) ఏతాదృశసర్వానంద కరుండవైన నీవు నన్నేల పరితపిం
పం జేసెద వని పలికి వెండియు నిట్లనియె ॥ (శా) అస్తీనేతపతీవ రామనృప
తా,వత్యంత తేజః పరం । చాస్తోకంబనుమాట లన్నిచటఁ బ్రా,యంబ్బట్టనీ వేగి
న । న్నాస్తీనేతపతీవరామనృపతా,వత్యంత తేజఃపరం । చాస్తోకం బని మ్రో
యునింక భువిలో,నార్యాస్యసందీప్తమై ॥ (తే, గీ) అనఘ యేల విషణ్ణుఁడ,
వైతివీవు । నీకుభయమెట్లు గలిగె న,నింద్యశీల । యోగ్యనై నీవె గతియని,యు
న్న నన్ను । రమణ విడుచుట కేమి కా,రణము చెపుమ ॥ (క) అనఘ ద్యు
మత్సేనజుఁడును । జననుతుఁడగు సత్యవంతు, సతియగు సావి। త్రినిఁ బోలెభ
వద్వశవ । ర్తిని నగుననుఁ జిత్తమందుఁ, దెలియుమధీశా ॥ (చ) అనఘవిచా
ర మేను పరు,నాత్మఁదలంచి యెఱుంగ నక్కటా । పనివడి యిట్లు నన్నుఁ గు
ల,పాంసనియట్లత్యజింపనేల చ । య్యనఁ గొనిపొమ్ము ఘోరవిపి,నావనికిన్ననున
ట్లసేయ నె । మ్మనమున నోపవేని ఘన,పాతకి వయ్యెద వింతయేటికిఁ ॥ (క) దే
వ యనపాయను గుమా । రావస్థాపరిణతను మ,హాసతి ననఘుఁ । దేవి నగు న
న్ను జాయా । జీవుని కరణి నొసఁగఁ దలఁ,చితివి పరులకుఁ ॥ (తే,గీ) అధి
ప వంశపరంపరా, ధ్యాగతయును । భతృ్యయోగ్యయు సతియును, భద్రదయు
ను । లలితకౌమారయును నగు, రాజ్యలక్ష్మి । నకట భరతాదుల కొసంగు,ట
హ్యమగునె ॥ (ఉ) ఎవ్వని యర్థమందు నిగ్ర,హీతుఁడ వైతివిధర్మయు
క్తిచే । నెవ్వనికిఁ హితంబు హృద,యేశ యొనర్చితి వట్టివానికిఁ । నవ్వలు
గాఁగ నెంతయు వి,నమ్రుఁ డవిష్టకరుండవై మదిఁ । నెవ్వగ మాని యుండు
మిట,నిన్ను జనంబులు మెత్తురెంతయుఁ ॥ (వ) అని కోపంబు పెంపున నా



క్షేపించి వెండియు నిట్లనియె ॥ (క) తపమైన నాకమైనను । విపినమయినని
రుపురకును, వెసనొక్కటియా । విపరీతమేల పల్కెదు । చపలత లేకుండ వని
కిఁ, జనుదెంతురహిఁ ॥ (తే, గీ) నిన్నుఁగూడి వనంబున, నున్నవేళ । నిడు
మలెన్నియుఁ గలిగిన,హృదయమునకు । స్వర్గభోగ సమానమై, వఱలునాకు
దేవదోడ్కొని పొమ్ము సం,దియముదక్కి ॥ (ఆ, వె) అధిప నీవిఱుంద, నరు
దెంచునాకు ను । ద్యానవనవిహార,మందుఁబోలె । నధ్వమం దొకింత,యైననా
యాసంబు । గలుగదిడుము లనుచుఁ, దలఁప వలదు ॥ (మ) మనుజేంద్రోత్త
మనిన్నుఁగూడి యటవీ,మార్గంబునం బోవునా । కనిశంబుంగుశకాశముఖ్య
కఠిన, జ్యాజాతముల్ భూరిశో । భనసంధాయ కతూలతల్ప కసమ,స్పర్శం
బులై యుండు న । న్ననుమానింపక నీదు వెంటఁ గొనిపొ, మ్మా కాన నక్షోణి
కిఁ ॥ (తే,గీ) అధిప జంఘానిలోద్ధూత, మైన యేర । జంబుచే నస్మదీయ
గా, త్రంబుచాల । ధూసరితమయ్యె నమ్మహీ,ధూళినతుల । చందనముగాఁ ద
లంపుదు, డెందమందు ॥ (తే,గీ) చెలఁగి నీతోడ వనమధ్య,సీమయందు । ర
మణ శయనించు తఱి శాడ్వ,లములకంటె । సదనమునఁ గల్గు ఘనచిత్ర, మృదు
లతరకు । థాస్తరణతల్పకము లంత, యధిక మగునె ॥ (తే, గీ) అధిప నీవు
కాంతార మ,ధ్యంబు నందుఁ । గరుణఁ జేసి యొసంగిన, కందమూల । ఫలపలా
శాదికములు స్వ,ల్పంబులైన । నవియొనాకు సుధాభంబు, లని తలంతు ॥ (క)
జనకునిఁ దల్లిని గృహమును । మనమునఁ దలపోయ నెపుడు, మత్కృతముననీ।
కనిశము శోకము గలుగదు । ననుఁ దోడ్కొని పొమ్ము కాన,నంబున కధిపా ॥
(క) నినుఁ గూడి యున్న చోటది । వనమైనను స్వర్గసన్ని,భం బగు మఱి
యు । న్నినుఁ బాసి యున్నచోటది । ఘనపట్టణమైన నార,కసమం బధిపా ॥
(క) కావున ననుఁ దోడ్కొని విపి । నావలికిం బొమ్ము దేవ,యటు గాని యె
డ । న్నీవవలోకింపవిషముఁ।ద్రావియయిననిపుడెజీవి,తంబులువిడుతుఁ ॥(ఉ)అ
క్కటికంబుఁబూని హృదయాధిప నన్విడనాడి కానకుఁ । గ్రక్కననీవుపోవన
సుఖస్థితి నవ్వలనైనమేనిలో । నిక్కడఁ బ్రాణముల్నిలువవింతయునిక్కముగా
ననవ్వలం । దిక్కఱి చచ్చుకంటెనిపు డేతగనిక్కడఁ జచ్చుటొప్పదే ॥ (చ)
అనఘభవ ద్వియోగజనితార్తిని నొక్కముహూర్తకాలమై । ననుభరియిం
పఁజాలఁబదు,నాలుగువర్షములెట్లెఱుంగునఁ । మనముననోర్చియుందునని మా

నినిదుఃఖవిధూయమానయై । తనపతిఁగౌఁగిలించుకొని తద్దయునేడ్చెఁగలస్వనం బునన్ ॥ (తే,గీ) మఱియినద్దేవి విషదిగ్ధ శరనివిద్ధ । యైనకరిణిచందంబుననధి పవాక్య । విద్ధయైఘనచిరసన్ని రుద్ధలోచ । నాశ్రువులునించె నరణిఘోరాగ్ని నట్లు ॥ (తే,గీ) స్ఫటికసమములు సంతాపసంభవములు । నగులసద్బాష్పబిం దువు,లపుడుచాల । జలజలోచనకన్నుల వలనఁదొరఁగెఁ । గమలదళముల వల ననీరములఁబోలె ॥ (తే,గీ) లలితకైరవ మిత్రమం డలసమంబు । దీర్ఘదృ గ్వ్యాప్తమైనతదీయవదన । మశ్రుబిందు సంఛాదిత మగుచునొప్పె । సలిలసం

(*)రాముఁడుసీతనువనమునకుఁ దోడుకొనిపోవుటకు సమ్మతించుట.(*)

పృక్తనవపంకజంబుకరణి ॥ (క) అప్పుడు రఘునాథుఁడు దయ । ముప్పిరిగొన దుఃఖవేగ మునఁ గ్రాఁగెడునా । కప్పురగంధినిఁగుతుకము । కుప్పలుకొనఁగౌఁగి లించుకొని యిట్లనియెన్ ॥ (చ) అమలశశాంకబింబవదనావినుమెంతయునీవియో గదుః । ఖమునలభించునట్టి బల ఘస్మరసంపదయైననామచి । త్తమునకునించు కైనఁ బ్రమదంబొనగూర్పదు దెల్లభంగులం । గమలజసూతికిం బలెను గల్గ దు నాకుభయంబొకింతయున్ ॥ (ఉ) ఆయతశక్తిరక్షణమునందు సమర్థుఁడ నయ్యునీయభి । ప్రాయమెఱుంగఁగోరి వన వాసమువల్దనియంటిఁగాకవి । చ్చే యుమునాదువెంట వనసీమకు నిన్నెడఁబాయఁజాలనీ । తోయముద్రిప్ప నాతర మె తోయరుహాయతచారులోచనా ॥ (వ) దేవినీవు నాతోఁడగూడ వనవాసం బుకొఱకు నిప్పుడునిశ్చయింపఁ బడితివిగావున శీలవంతునిచేతఁగీర్తియుంబోలె నాచేతవిడువంబడుట కశక్యవైతివి ధర్మాత్ములగు పూర్వరాజులచేతఁ బత్నీస మేతంబుగా వానప్రస్థధర్మం బాచరింపం బడియెఁ గావున నేనును సువర్చల సూర్యునిననువర్తించినకైవడిఁబూర్వరాజాచరితధర్మంబుననుసరించెదసత్యో పబృంహితంబైన తండ్రివచనంబు నన్ను వనవాసంబుకొఱకుఁ దొరసేయుచున్న

(రాముఁడుసీతకుగుర్వాజ్ఞానువర్తనధర్మమునుబ్రశంసించిచెప్పుట)

ది శీఘ్రంబునవనంబునకుం బోవలయుఁ దల్లిదండ్రులకు విధేయుండై యుండు టదియె పుత్రునకుఁ బరమధర్మంబు గావుననమ్మాతృ పితృ విధేయత్వరూపధ ర్మంబు నతిక్రమించియేనుజీవింపఁజాల ॥ (తే,గీ) వినుముస్వాధీనమగు మాతృ పితృగురుస్వ । రూపదైవంబునవలఁబొద్రోచి తనకు । వశముగానట్టి యన్యదై వంబునెట్లు । మచ్చకంటియారాధింప వచ్చుఁజెపుమ ॥ (తే,గీ) ఎచటఁబితృమా



తృగురురూప మెసఁగుచుండు । నచటలోకత్రయంబుండునట్లుగాన । దేవితత్సే వచేజగత్త్రితయవర్త్య । శేషదేవపూజనఫల సిద్ధిగలుగు ॥ (వ) కావునఁ గ త్సమంబైన పవిత్రం బన్యంబులేదక్కారణంబున మాతృపితృ గురురూప త్ర యంబు నవశ్యంబారాధింపవలయు మఱియుఁబరలోక సాధనోత్కరంబులైన పితృమాతృసేవాదులచేతం బడయంబడు లోకంబులు జపతపస్స్వాధ్యాయ వ్ర తక్రతువులంబడయరా దదియునుంగాక గురుచిత్త ప్రవృత్త్యనువర్తనంబున స్వ ర్గధనధాన్య విద్యాపుత్ర ప్రముఖనిఖిల సంపద్విశేషంబులు సిద్ధించు మాతా పితృపరాయణులగు మహాత్ములు దేవగంధర్వగోలోకబ్రహ్మలోకంబులు వడయు దురు గావున సత్యధర్మ మార్గస్థితుండై దశరథుండు గఱపిన మార్గంబున నవశ్యంబు వనంబునకుంజనియెద భవదీయ భావాపరిజ్ఞానంబువలననిన్ను వనం బునకుం దోడ్కొని పోవుటకు మొదల మదీయచిత్తంబు పరిక్షీణంబయ్యె నీవున న్ననుసరించి వనంబునకుంజనుదెంచెద ననిపలుకుటవలననిప్పుడునిన్నుందోడ్కొ ని పోవుటకుగ్రమ్మఱ నుద్యుక్తంబయ్యెఁ గావుననీవును గురూపదిష్ట ధర్మప్రవర్త కుండనైన నన్ననుసరించి సహధర్మచారిణివై వనంబునకుంజనుదెమ్ము పత్యనుసర ణాధ్యవసాయంబునధిగమించుటవలన నీవుసర్వప్రకారంబుల నాకునుగులంబు

—(*)రాముఁడు సీతతోబ్రాహ్మణులకుదానములుసేయుమనుట.(*)—

నకును సమ్మతవైతి విదినీకు సదృశంబును బరమశోభనంబైయుండునింకవిశేషిం చి వనవాసక్షమంబులగు దానంబులఁగావింపుము శీఘ్రంబున భిక్షులకు భోజ నంబునువిప్రులకు సువర్ణ రత్నాదికంబులిచ్చి పదంపడిమనకిరువురకుం గలవ స్త్రమాల్యాభరణ శయనాసనంబులును గ్రీడార్థంబుసంగ్రహించిన జాతరూప మయకృత్రిమపుత్రికాచయంబులును భృత్యులకొసంగుమనిపలికినన్దేవిపరమా నందభరితాంతఃకరణయై పతివచనప్రకారంబున బ్రాహ్మణులకు భృత్యవర్గంబుల కుధనధాన్యరత్నాదికంబు లొసంగుచుండె నాసమయంబున సుమిత్రానందనుం డచ్చోటనున్నవాఁడగుటం జేసి తదీయసంవాదంబువిని యర్ధశరీరభూతయైన జా నకి వనానుగమనంబే బహుప్రయత్నంబున నంగీకృతంబయ్యె నాకెవ్విధంబున సంభవించునని విరహసంజాత శోకంబుసహింపంజాలక యన్నచరణంబులకుం

—(*)లక్ష్మణుఁడుతానునువనమునకువచ్చెదననిఁ రామునిఁబ్రార్థించుట(*)—

బ్రణమిల్లి నిజాభిమతసంసిద్ధికి సీతాశరణాగతి యమోఘంబైన యుపాయంబని

యాలోచించిమదీయప్రార్థన పురుషకారత్వంబుననంగీకరింపుమని సీతంబ్రా
ర్థింపుచురామునకిట్లనియె ॥ (సీ) అనఘాత్మ నన్నొక్కరుని లాఁతివానిఁగాఁబోఁ
ద్రోచియడవికిఁ బోవనీకు । న్యాయంబెనినుఁబాసి నాకలోకాధిపత్యంబైననమ
రత్వమైనఘునవి । భూతియైననుగోరఘూరిచాపముదాల్చికడఁగిమీయగ్రభాగముఁ
నగాన । నావనికరుదెంతునచటమదీయదోర్గలఘనప్రాకారరక్షితుండ॥(తే,గీ)
వగుచునీదేవిఁగూడి నానాటవులను । సంచరించెదుగాకని సవినయోక్తిఁ । జే
సిప్రార్థించిరాముని చేనిషిద్ధుఁ । డగుచుఁగ్రమ్మఱ నతనికిట్లనియెనతఁడు ॥ (చ)
ఘనకరుణా విశేషమునఁ గాననమేదినినున్కినాకు ము । న్ననుమతిఁజేసి యిప్పు
డద యామతిఁగాదనిపల్కెదేలొకో । పనివడిబాల్యమాదిగ భవత్పరతంత్రుఁడ
నైననన్నువ । ల్దనుటకుఁ జోద్యమయ్యెడిమహాపురుషాయిదియేమి చెప్పవే ॥
(క) అనియిట్లు సుమిత్రానం । దనుఁడునిటల ఘటితహస్త నలినుండై ప । ల్కిన
వినిగ్రమ్మఱ రఘునం । దనుఁడిట్లనె ధర్మసంయుతంబగుసూక్తిన్ ॥ (తే,గీ)స్ని

—(*)రాముఁడులక్ష్మణుని వనము నకురావలదనుట.(*)—

గ్ధుఁడవు పటుఁడవుధర్మ శీలుఁడవుప్రి । యార్హుఁడవునీతిపరుఁడవు,ప్రాణస
ముఁడ । వార్యనుతుఁడవుసఖుఁడవుశౌర్యనిధివి । యనుజుఁడవుగావెనాకుగుణా
ఢ్యునీవు ॥ (తే,గీ)అనఘనీవునాతోడఁ గాననధరిత్రి । కరుగుదెంచినఘోరదుఃఖా
ర్తిఁగ్రాఁగి। బడలుకౌసల్యనిడుములఁబడుసుమిత్ర ।నింకభరియించువారెవ్వరిచ
టఁజెపుమ ॥ (క) అనఘాపజన్యునిక్రియ । ననవరతముఁగామవృష్టి నర్థుల
మీఁదం।దనివారఁగఁగురియించెడు। జననాథుఁడుకామపాశసంయుతుఁడయ్యెన్॥
(తే,గీ) అనఘచరితమహీనాథుఁ డై భరతుఁడు । కైకపనుపున మాతృత్వగౌర
వంబు । విడిచిమజ్జననియిత్రుల వెతలఁబెట్టు । మదిదలంపఁడువారిసేమంబునెపు
డు॥ (చ)తనయునియాధిపత్యమును ధారుణినాథువశంకరత్వముం। గనుఁగొనికై
కభాగ్యభవ గర్వమునన్ మనయమ్మలన్నుభా । ననలననారతంబునుగ నారిలఁజే
యుచునుండుఁ గావున । న్బనివడి వత్సనీవయిన వారి మనోవ్యథ దీర్పవల్వదే॥
(తే,గీ) అనఘ చరిత రాజానుగ్ర హమునసైన । నిత్య మతిభక్తినీయంత నీవ
యైన । నరసిరక్షింపుమిచటమా యమ్మనెపుడు । ధరణి గురుపూజనముచేత ధ
ర్మ మొదవు॥ (తే,గీ) అనఘ యిట్లుమదాజ్ఞచే నతులభక్తి । నిచట మన్మాతృ
పూజన ముచితకరణిఁ । జేయుచుండుమువాయుందుఁ జేయుభక్తి । కిదియె సా



ర్థక్యమనుచునే మదిఁదలంతు॥ (మ) అనియిట్లారఘునేతపల్కవినినె య్యాం
బొప్పఁగాలక్ష్మణుం । డనియెంగ్రమ్మఱనోదినేశకులవ ర్యామీయనుజ్ఞన్భవ । జ్జన

(*)లక్ష్మణుండు సయుక్తికంబుగా రాముని వేడుట. (*)

నీ మజ్జననిన్నితాంతసముదం చద్భక్తిచేసంతతం । బునుశుశ్రూష యొనర్పుచు
న్భరతుఁడే పోషించుసౌఖ్యంబుగన్॥ (తే,గీ) దేవయేదేవికృపనుప జీవిశతము ।
లగ్రహారశతంబుల నధిగమించె । నట్టికౌసల్యమాదృశస హస్రములను । సంత
తముఁబ్రోచుస్వభరణ మెంతచెపుఁడి॥ (క) ఆయమ్మఁగూడినిత్యము । మాయ
మ్మయునెగులుదక్కి మహితసుఖాప్తిం । బాయక సేవించును దే । వాయీయెడ
సందియంబు వలవదుబుద్ధిన్॥ (వ) దేవా నన్నుచరునిఁగాఁ బరిగ్రహింపు మీ
యనుచరత్వకరణంబునందు సేవ్యసేవక ధర్మరాహిత్యంబును వైపరీత్యసాధ
కంబునులేదు నారాకవలన నీకు ఫలమూలా ద్యాహరణం బనాయాసంబుగాఁ
గల్పింపంబడు నేనును భవత్సేవ వలనఁ గృతార్థుండ నగుదు నట్లు గావున॥
(క) నిరుపమఖనిత్రపిటకా । ధరుండనై సగుణమైన ధనువుఁగొనివెసం । దెరువె
ఱఁగింపుచుముంగల । నరుదెంచెదనట్లొనర్పు మయ్యమహాత్మా॥ (చ) పవలుస
మస్తవన్యఫల పఙ్క్తులఁ దెచ్చియొసంగు చున్నిశ । ల్పవినయబుద్ధిబద్ధగుణ చాప
ముఁదాల్చిసుషుప్తిఁదక్కక । న్గవకటుఱెప్పవ్రేయకసుఖస్థితినెప్పుడుఁగాచుచుండఁ
గా । నవనిజఁగూడినీవుగిరులందువిహారమొనర్పుటొప్పదే॥ (క) అనియిట్లుసు
మిత్రానం । దనుఁడువివిధవినయవాక్య నైపుణమలరం । దనువేఁడినఁ గౌసల్యా ।
తనయుఁడుహర్షించిమఱల దమ్మునకనియెన్॥ (వ) వత్సాయేను నీవనప్రయా

(*)రాముఁడు లక్ష్మణవనాగమనంబున కొడంబడుట. (*)

ణంబున కొడంబడితి నాతోడంజనుదెమ్ము జనక యజ్ఞంబునందు మహాత్ముండగు
వరుణుండొసంగిన మహాకార్ముకంబులును నభేద్య కవచంబులును నక్షయ
బాణతూణీరంబులును హేమపరిష్కృతంబగు ఖడ్గద్వయంబునుఁ బూజార్థం
బాచార్యమందిరంబున నిక్షేపించియున్నయవి వానిఁగైకొని యిష్టులకుంజెప్పి
రమ్మనవుడు నతండు వనవాసనిశ్చితుండగుచు సుహృజ్జనంబు లందఱి వలన నా
మంత్రణంబువడసి సంభ్రమంబునఁ దదీయ గృహంబునకుంజని ధనురాదిసాధ
నంబులఁగొని రయంబునఁ బఱతెంచినంజూచి కాలవిడంబనంబుసేయక చను
దెంచితివని బహూకరించి వెండియు రఘువల్లభుండిట్లనియె ॥ (క) అనఘాత్మ

మామకంబగు । ధనమునువిప్రోత్తములకు దానముసేయం । జనుఁగాన నిపుడె సనితో । డ్కొనిరమ్మసుయజ్ఞునింబ టుత్వరితగతిꣳ॥ (వ) మఱియును మననగరంబున గురు శుశ్రూషా పరాయణు లగువా రెవ్వరుగల రట్టివారికి నుపజీవులకు నిత్యంబుకంటె నధికంబుగా ధనంబొసంగ నిశ్చయించితి వారి నందఱం

## (*) రాముఁడు వసిష్ఠపుత్రుండగు సుయజ్ఞురావించుట. (*)

దోడ్కొనిరమ్ము శిష్టులైన బ్రాహ్మణోత్తములనందఱంబూజించి వారిచేత ననుజ్ఞవడసి వనంబునకుం జనువాఁడనని యానతిచ్చిన నతం డట్లకాకయని వసిష్ఠపుత్రుండగు సుయజ్ఞుని నివేశనంబునకుం జని యందు॥ (తే, గీ) అగ్నిశాలాగతుండైన, యతనిభక్తిꣳ । గాంచిమ్రొక్కి దుష్కరకర్మ కారియైన । రామభద్రువేశ్మమునకు రమ్మకృత్య । మంతయునుదగవీక్షింపు మనిననతఁడు॥ (తే, గీ) సంభ్రమంబుననప్పుడే సంధ్యవార్చి । లక్ష్మణోపేతుఁడై శుభ లక్షణాభి । రంజితంబైనరాముని రమ్యసదన । రాజమునకేగెరయమునఁ దేజమలర॥ (క) వచ్చిన మునిసుతుఁ గనుఁగొని । యిచ్చనలరిరాఘవుఁడుమ హీజాన్వితుఁడై । చెచ్చె

## (*) రాముఁడు సుయజ్ఞాదులకు ధనధాన్యమణి గోభూషణాదుల నొసంగుట. (*)

రనెదురుగఁ జనికొని । తెచ్చి సుఖాసీనుఁజేసి దృఢతరభక్తిꣳ॥ (వ) జాతరూపమయ కటక కుండల సువర్ణసూత్రగ్రథిత వైడూర్య పద్మరాగ మణిభూషిత కేయూరాంగద ప్రముఖ నిఖిలశ్రేష్ఠ భూషణంబుల చేతం బూజించి పదంపడి సీతాప్రచోదితుండై ముక్తాహార హేమసూత్ర రశనావిచిత్ర కేయూరాంగదవరాస్తరణ నానారత్న విభూషిత హేమపర్యంకంబు లొసంగి యివి యన్నియు జానకి భవత్పత్నికొసంగుమని పంచెఁగావున నమ్మహాసాధ్వికిమ్మమాతులదత్తంబైన శత్రుంజయాఖ్య మహానాగంబు గజసహస్రంబుతోఁగూడ నీకొసంగెదఁ బరిగ్రహింపుమని పలికిన నాసుయజ్ఞుండు రామదత్తంబైన తత్సర్వంబునుం బ్రతిగ్రహించి సీతారామలక్ష్మణుల నాశీర్వదించెనంతఁ బ్రియంవదుండును బరమేష్ఠిసముండునగు రాముండు ప్రియుండు వాసవ సంకాశుండునగు లక్ష్మణుంజూచి నీవు శీఘ్రంబున నగస్త్యవిశ్వామిత్ర పుత్రులరావించి వర్షోదకంబులచేత సస్యంబునుంబోలె నానావిధచిత్ర దివ్యాంబర గోసహస్ర సువర్ణరజత మహాధనంబులచేతఁ బూజించి సంతుష్టులంగావింపుము నిత్యంబును గౌసల్యాదేవినాశీర్వదింపుచు భక్తుండై యాశ్రయించియున్న తిత్తిరి సంబద్ధ శాఖాధ్యేతల



కాచార్యుండైన విప్రోత్తమునకుఁ బుష్కలంబుగాఁ గౌశేయ చేలంబులును మహార్హయానంబులును దాసీజనంబుల నొసంగుము చిరకాలంబుననుండి మనగృహంబున నివసించియున్న వాని రాజ సచివుండగు వాని చిత్రరథుండను సూతునిరావించి వేయిగోవులనజాదికంబులనిచ్చి మహార్హరత్న వస్త్రధనంబులొసంగి ప్రీతచేతస్కునింజేయుము కఠకలాపిప్రోక్త శాఖాధ్యాయులును బలాశదండయుక్తులును మృద్వన్నకాములు సజ్జన సమ్మతులును నిరంతర స్వాధ్యాయశీలత్వంబువలన నన్యంబేమియు నెఱుంగని వారునగు బ్రహ్మచారులకు రత్నపూర్ణంబులగు నశీతియానంబులును బలీవర్ద సహస్రంబును గర్షణప్రవీణ మహావృషభంబుల నిన్నూటిని దధిఘృతాది వ్యంజనార్థంబు గోసహస్రంబునొసంగుము మఱియు వివాహార్థంబు కౌసల్య నాశ్రయించియున్న మేఖలిసంఘంబునకుఁ బ్రత్యేకంబుగా గోసహస్రంబు లొసంగి మఱియు నయ్యంబకు మనోమోదంబు గలుగునట్లు యథేష్టంబుగా ధనంబొసంగుమని పంచిననతండు యథోక్తప్రకారంబున బ్రాహ్మణోత్తములకు ధనదునిపగిది ధనమణివస్త్రాదులొసంగెనంత నారఘుపుంగవుండు బాష్పగద్గదకంఠులై తనప్రోలనిలువంబడియున్న నిజభృత్యులకుఁ బ్రత్యేకంబుగా ననంతద్రవ్యంబులొసంగి నావచ్చునందాక నామందిరంబును లక్ష్మణునిగృహంబునుం గాచికొని యిచ్చటనేయుండుండని పలికి వెండియుఁ బరమదుఃఖితులై యున్నవారి నవలోకించి ధనాధ్యక్షురావించి ధనంబుఁ దెమ్మనవుడు నతండట్లగావింప రాశీభూతంబైన యమ్మహాధనంబంతయు బ్రాహ్మణులకు భృత్యులకుఁ గృపణులకు బాలవృద్ధుల కొసంగుచుండెనాసమయంబున॥ (సీ) చతురుఁడు గర్గవంశజుఁడు పింగళవర్ణుఁడనఘుఁడు

## —(*) త్రిజటుఁడను బ్రాహ్మణోత్తముఁడు రామునికడకే తెంచుట. (*)—

త్రిజటాఖ్యుఁ డగుద్విజాన్వ । యాగ్రణిగలఁ డొకఁ డాతఁడుఫాలకుద్దాలలాంగలములఁ దాల్చినిత్య । మడవిలోఁ జతవృత్తి నాఁకలిదీర్చుచునుండ నాతనిభార్య యొకనాఁడు । దారకులనుజూచి, దారిద్ర్యమునఁబొక్కి తనపతితోడనిట్లనియెదేవ॥ (తే,గీ) ఫాలకుద్దాలకములటు పాఱవైచి । తగవదాన్యశేఖరు రాముఁ దడయకిపుడు । గానఁజనుము దారిద్ర్యంబు గడువనగుమ । హాత్మనావచనంబు సత్యంబుచువ్వె॥ (చ) అనవినిభూసురేంద్రుఁడుర యంబునదుశ్చదశాటిమేనిపైఁ । దనరఁబ్రదీప్తపావకువిధంబున హేళిక్రియన్వెలుంగుచుꣳ । వనము

నసుండిశ్రద్ధయున వార్యగతింజనుదెంచినసజ్జన । ప్రణుతగుణాతిరేకుఁడగురాము
నిముంగల నిల్చియిట్లనుౘ ॥ (వ) రాజనందనా యేను బహుపుత్రకుండ ధనంబు
లేమింజేసి బాలకులకు నాచ్ఛాదనంబులకు దుఃఖింప వారినూరార్చుట కుపాయం
బు లేక దారిద్ర్యంబునకంటె నొండు కష్టంబద్దియు లేదని తలంపుచు దానిం బా
పికొన వదాన్య శేఖరుండవైన నీకడకుం జనుదెంచితి ననిన నారాముం డవ్విప్రు
నింజూచి చిఱునగవునగుచు నామందలోఁగల గోసహస్రంబులలోన నొక్క సహ

—(*) రాముఁడు త్రిజటునికి బహుసహస్రంబులు గోవులొసంగుట. (*)—

స్రంబు ప్రత్యేకంబుగా నీకొసంగలేదీదండంబెంతదవ్వు వీచివైచిన నంతదవ్వు నిండి
యున్న గోజాతంబు నీకొసంగెద ననిపలికిన నవ్విప్రుండు సంతుష్టుండగుచు శీఘ్రం
బునఁ గటితటంబున శాటి బిగియించి భుజాబలంబు కొలంది దండంబు విసరివైచిన
నది సరయూతటంబున బహుసహస్రంబగు గోవ్రజంబున వృషభసన్నిధిం బడి
న నా రఘూత్తముండు సంతసిల్లి యమ్మహీసురుఁ గౌగిలించుకొని సరయూత
ట పర్యంతంబు నిండియున్న గోవులనన్నింటి గోపాలకులచేత శీఘ్రంబున నత
ని యాశ్రమంబునకుఁ దోలించి బహూకరింపుచు నిట్లనియె ॥ (తే,గీ) దివ్యమ
గు నీ ప్రభావంబు తెలియఁగోరి । యనఘచరిత వినోదార్థమంటిఁగాక । నద
టుపడి లోభబుద్ధిచే నన్నవాఁడఁ । గాను దయచేసి నా మీఁదఁ గనలవలదు ॥ (క)
ధనధాన్య కోశ సంపద । లనవరతము బ్రాహ్మణార్థ మగుఁ గాదొకొనా । మన
మెప్పుడు గోబ్రాహ్మణ । జనరక్షణమందుఁ జిక్కి చతురత నొప్పన్ ॥ (వ) మహా
త్మా యతివృద్ధుండవైన భవదీయదురత్యయ శక్తి నెఱుంగంగోరిన నాచేత నీదండ
ప్రక్షేపణరూపార్థంబు నుద్దేశించి ప్రచోదితుండవైతివి గోవులకంటెనన్యంబై
నదాని నెద్దియేని వరింపందలంచితివేని నిర్విశంకుండవై వరింపు మొసంగెద నివ్వా
క్యం బుపచారమాత్రంబు గాదు సత్యంబుగాఁ బలికితి సంకోచంబు వలవదు నా
చేత నుపార్జితంబైన ధనంబంతయు విప్రప్రయోజన సంపాదనార్థంబని యె
ఱుంగుము భవాదృశులయందు సమ్యక్ప్రతిపాదనంబుచేత నాకు నితాంతప్రీతియ
శంబులు గలుగు ననిపలికిన నారఘుపతివచనంబుల కలరి యవ్విప్రోత్తముండు గో
సమూహంబునుం బ్రతిగ్రహించి యశోబలప్రీతికరంబులు గలుగుఁగాక యని యా
రఘుపుంగవు నాశీర్వదించి భార్యాసహితుండై నిజాశ్రమంబునకుం జనియె నం
త నారాముండు ప్రతిపూర్ణపౌరుషుండై ధర్మయుక్తపరాక్రమార్జితంబైన ని



జధనంబంతయు యథార్హసమ్మాన వచఃప్రచోదితుండై ద్విజసుహృద్భృత్యజ
న దరిద్రభిక్షాచరణులకు యథేష్టంబుగా నొసంగి సీతాలక్ష్మణసహితుండై మా
లానిచయసమాబద్ధంబులును గంధపుష్పాద్యలంకృతంబులగు ఖడ్గాదిసాధనంబు

(*) రాముఁడు దశరథదర్శనంబున కేగుట. (*)

లుద్ధరించి పితృసందర్శనోత్సుకుండై రాజమార్గంబుఁబట్టి తదీయమందిరంబు
నకుం బోవుచుండెనప్పుడు పౌరజనంబులు బహుజనాకులంబులైన రాజమార్గం
బులం జననేరక ప్రాసాదహర్మ్యవిమానాగ్రంబులెక్కి వర్జితాతపత్రుండై
పాదసంచారంబునం జను రామభద్రునవలోకించి శోకవ్యాకులచిత్తులగుచు మొ
గంబుల దైన్యంబు దోఁపఁ దమలోనిట్లనిరి ॥ (చ) అనుపమలీలఁ బెక్కు చతురంగ
బలావళు లేమహాత్ముని । న్వెనుకొని పోవునట్టి రఘువీరపిఱుంద సుమిత్రపట్టిదా ।
జనకజతోడ రానొకఁడె సంభ్రమియైచనుచున్నవాఁడుగ । న్గొనుఁడకటా విరిం
చి కఠినుండుగదా తలపోసి చూడఁగన్ ॥ (తే,గీ) అతులితైశ్వర్యసారజ్ఞుఁడగుచుఁ
గాము । కులకు సకలేష్ట ఫలదాయకుండునయ్యు । ధర్మగౌరవమునఁ జాలఁ
దండ్రి వాక్య । మనృతముగఁ జేయఁదలపోయఁ డయ్యె నేఁడు ॥ (తే, గీ) కాంక్ష
తోడ నే సాధ్వి గనుఁగొనంగ । నభ్రచరభూతములకైన నలవిగాక । యుండు
నా సీత నీక్షింపుచున్నవారు । పురములోఁగల పురుషులందఱును నేఁడు ॥ (తే,గీ)

(*) జనులందఱు రామునిఁ జూచి పలుతెఱంగుల విలపించుట. (*)

సురుచిరాంగరాగార్హయు శోణగంధ । సేవినియునైన సీతను దావమందు ।
మొనసి శీతోష్ణవాతంబులనవరతము । దీనతయును వైవర్ణ్య మొందింపకున్నె ॥
(ఉ) ఇన్ని తలంపులేల మనుజేశ్వరుఁడిప్పుడు సత్యమూఁదియా । పన్నశరణ్యు
నీసుజన పాలునిఁ గానకుఁ బుచ్చనోపఁడె । ట్లన్నను ధాత్రి నెంత కఠినాత్ముఁడైన
సుతున్ సునీతిసం । పన్నునిఁ బాసి నిందలకుఁ బాల్పడియొంటి మనందలంచునే ॥
(తే,గీ) పుడమి గుణహీనుఁడైనను బుత్రు విడువఁ । డెందు జనకుఁడే ఘనుని యహీ
నవృత్తి । చేత సతతంబు జనము రంజింపఁబడియె । నట్టి రాముని విడుచు నెయ్యవని
విభుఁడు ॥ (తే,గీ) దమము శీలంబు శ్రుతము నుశమము దయయు । నానృశంస్యం
బును నెడునీ యాఱుగుణము । లనవరత మీ రఘుస్వామి ననఘచరితు । నింపుసొం
పారఁగ నలంకరింపఁ జేయు ॥ (ఆ,వె) అట్టి పుణ్యపురుషుఁ డడవికిఁ బోయిన । ఘ
ర్మకాలతప్త ఘనజలాశ । యమున నున్న మీనుల ట్ల లోకులు దుఃఖ । తప్తుల

గుచు భీతిం దలంకఁగలరు॥ (చ) ఇతఁడు జగత్కుజంబునకు నెంతయు మూలము సర్వమానవ। ప్రతతులు పుష్ప పల్లవఫలంబులు గావున నీ త్రిలోకస। మ్మతు పరిపీడనంబున సమస్త జనంబు విపన్నతం బరి। ప్లుతమగు మూలఘాతమునఁ బుష్పఫలోపగశాఖికైవడిన్॥ (మ) అతులోద్యానమునన్ గృహంబులను మాన్య క్షేత్రవిత్తాదులం। జతురత్వంబునఁ ద్రోచిపుచ్చి మనమీ సౌమిత్రి మాడ్కి న్సమున్। న్నత సౌహార్దము దోఁప నీ రఘుకులోత్తంసంబు వెంటన్ సతీ। సుతవర్గంబులఁ గూడి పోద మిచటన్ శోకింపఁగా నేటికిన్॥ (మ) లలితైణాంక సమాన వక్త్రుఁడగు నీ రాముం డరణ్యావనీ। స్థలికిం బోయిన వెన్కఁ బాడఱిన సద్మంబట్ల నిస్తేజమై। ఖలచిత్తాకృతి నొప్పు నీపురములోఁ గైకేయి దానొంటి వ। ర్తిలుఁ గాకేటికి నిచ్చటన్ మనకు సస్వృత్తిన్ బ్రవర్తింపఁగన్॥ (ఆ,వె) రాఘవుండు లేని రాజ్యంబు కాంతార। మమ్మహాత్ముఁ డున్న నదియె పురము। మనము రాముఁ గూడి మనుటొప్పుఁ గైకపాఁ। డఱిన వీటనుండి, వఱలుఁ గాక॥ (వ) మఱియు సముద్ధృత నిక్షేపంబులును బ్రభగ్నాంగణంబులును నుపాత్త నిక్షిప్త ధనభూషణ పశుధాన్యంబులును నపహృత శయ్యాసనాదికంబులును రజోవకీర్ణంబులును గృహదేవతా పరిత్యక్తంబులును సముద్భిన్న బిల పరిధావ న్మూషకావృతంబులును నపేతోదక సేచన ధూమంబులును హీనసమ్మార్జనంబులును సంప్రణష్ట పూజా కర్మ యాగ మంత్ర హోమ జపంబులును ఘోరరాజక్షోభయుక్త కాలంబుచేతం బోలెఁ బ్రభగ్నంబులును భిన్న భాజనవంతంబులు నగుచు శూన్యంబులై మనచేత విడువంబడిన సదనంబులం గైకొని కైకేయి శూన్యకుడ్యంబుల కాధిపత్యంబు సేయం గల యది మన మందఱము వనంబునకుం జనిన నస్మద్భయ భీతంబులై గజసింహాది మృగంబులును విహంగమంబులును సర్పంబులును వనాంతర పర్వత ప్రస్థ బిలంబులు పరిత్యజించి మనచేత సంత్యక్తంబైన యీపురంబుఁ బ్రవేశింపం గలయవి మన మా యరణ్య మధ్యంబున రామునిం గూడి సమాన సుఖ దుఃఖులమై పురంబునందుం బోలె సుఖాత్ములమై యుండుద మా కైకేయి సపుత్ర బాంధవయై తృణమాంస ఫలాదంబులైన పశు వ్యాఘ్ర మృగ ద్విజంబుల కాటపట్టయిన యీ నగరంబు పాలింపుచుండుం గాక యని యిట్లు పురజనులు పెక్కువిధంబుల విలపింపుచుండ వారి దీనాలాపంబులు వినుచు మనోవికారంబు నొందక నిశ్చలుండై మత్తమాతంగ గమనంబునం జని యన్నరశార్దూలుండు కై



(*) రాముఁడు దశరథునకుఁ దనరాకఁ దెల్పుమని సుమంత్రు నియోగించుట. (*)

లాస శిఖరాకారంబైన పితృమందిరంబు డాయం బోయి వినీత వీరపురుషంబైన రాజాలయంబుఁ బ్రవేశించి యచ్చట దుఃఖ పరిపీడితంబై కూడియున్న జనంబును వీక్షించి తానార్త స్వరూపుండు గాక చిఱునగవు నగుచు మెల్లనం జని ధర్మవత్సలుండు గావునఁ దండ్రిచేత ననుజ్ఞఁ గొని వనంబునకుం బోవుట యుచితం బని తలంచి ద్వారమధ్యగతుండైన సుమంత్రు నాలోకించి నారాక మహీనాథుని కెఱింగింపు మనవుడు నతండు సంతాప కలుషేంద్రియుండగుచు రయంబునం జని యభ్యంతర మందిరంబున రాహుగ్రస్తుండైన సూర్యుని పోలిక భస్మచ్ఛన్నుండగు వైశ్వానరు చందంబున నిస్తోయం బగు తటాకంబు పగిది దుఃఖపరిత్రస్తుండై యున్న వానిఁ బరమాకులచేతస్కుండగు వాని రామునిం బేర్కొని విలపించు వాని దశరథుం గాంచి వివిధ వాక్యంబులం బ్రస్తుతించి నిటల ఘటితాంజలి పుటుండై యిట్లనియె॥ (చ) అనఘ భవత్కుమారుఁడు వ,నావనికిం జనఁ బూని రత్నముల్। ధనమును విప్రసంతతికి, దత్తముఁ జేసి కృతాభ్యనుజ్ఞుఁడై। జననికిఁ జెప్పి మీవలన,సమ్మతిఁ గైకొని పోఁదలంపున। న్వనివడి వచ్చి భానుకుల, నాయక వాకిట నున్నవాఁడొగిన్॥ (తే,గీ) అధిపరశ్మిసహస్రసమావృతుఁడగు। భాస్కరుని చందమున సర్వ, పార్థివగుణ। పరివృతుండయి యున్ననీ, వరకుమారు। శిష్టసమ్మతుఁ గరుణ నీక్షింపుమిపుడు॥ (తే,గీ) రాజశేఖర నీవంబ,రంబు కరణిఁ। గరము నిష్పంకుఁడవు మహా,ఘనుఁడ వబ్ధి। సదృశగాంభీర్యుఁడవు మఱి,సత్యవాది। వఖిల ధర్మజ్ఞుఁడవు పుత్రు, నరయు మనిన॥ (మ) అతఁడా సూతకుమారుఁ గన్గొని సుమం,త్రా నీవు శీఘ్రంబ మ। త్సతులం దోడ్కొని రమ్ము పొమ్మనిన న్యా,తండట్ల గావింపన। ప్రతిమార్తిక్షుభితార్థ సప్తశతభా,ర్యావేష్టితుండై మహీ। పతి దాఁ గ్రమ్మఱ రాముఁ దోడు

(*) రాముఁడు సుమంత్రుఁడు వెంట రాఁగ దశరథుని కడకేగుట. (*)

కొని రమ్మా సూత పొమ్మా యనన్॥ (క) పతి పనుపున నతఁ డారఘు। పతిని సుమిత్రాతనూజ,వసుధాతనయా। యుతముగ నెంతయు సత్వర। గతిఁ దోడ్కొని వచ్చెఁ దత్స,కాశంబునకున్॥ (ఉ) అంత మహీవరుండు ఘటి,తాంజలియై చనుదెంచు రాము న। ల్లంత నె చూచి కన్నుఁగవ, నశ్రులు గ్రమ్మఁగ దుఃఖశోక వి। క్రాంత మనస్కుఁడై ధృతి దొ,లంగి కడంగిన మూర్ఛతోడ న।

త్యంతరయంబునం బడియె, నప్పు డిలం బెనుఁద్రాను కై వడిన్ ॥ (చ) పతి తె
ఱఁగెల్లఁ జూచి బహు, భంగుల శోకముఁ బట్టలేక త । త్సుతులతి దుఃఖ వేగము
నఁ, దత్సదనాంతర కుడ్యభాగముల్ । ప్రతి నినదంబు లీన విక, లంబుగ నేడ్చి
చు గాఢమూర్ఛచే । క్షితిపయి వ్రాలి తల్లడముఁ, జెందిరి వాడిన తీఁగెలో
యనన్ ॥ (ఉ) అప్పుడు రామలక్ష్మణులు, నారఘువీరునిఁగాంచి యాత్మలో।
ముప్పిరి గొన్నశోకమునఁ, బొక్కుచు డగ్గరి క్రుచ్చి యెత్తి నే। పొప్పఁగ మం
జుశయ్యపయి నుంచివచోమృతసేచనంబునన్ । దెప్పరమైన తాపమును దేర్చి

---(*) రాముఁడు వనమునకుఁబోవ ననుజ్ఞయిమ్మని దశరథుని వేఁడుట. (*)---

రితల్లులు వెంటదేరఁగన్ ॥ (వ) ఇట్లు దశరథుండు లబ్ధ సంజ్ఞుండై వేడి నిట్టూ
ర్పులంగందిన ముఖారవిందంబుతోఁ జెలువఱియున్నఁ దండ్రింగని సీతావల్లభుం
డు కృతాంజలిపుటుండై యిట్లనియె॥ (క) దేవా మాకంద అకును । దేవరవ
టుగాన మీరు ధృతిఁబూనియర । ణ్యావనికింజనఁబూనిన । నావంకఁగృపావిలోక
నంబునఁగనుఁడీ॥ (క) జానకియులక్ష్మణుండును । బూనుక నాతోడ విపిన భూ
మినునికిడెం । దానంగోరిరిగానన్ । త్క్ష్మానాథయనుజ్ఞయిమ్ము మాముప్వరకున్ ॥
(చ) అనవుడుభూమిభర్తహృద యంబుననెవ్వగనివ్వటిల్లరా । మునిఁ బరికించి
యోపురుష భూషణకైకవరప్రదానరూ । పనిబిడదీర్ఘపాశమునబద్ధుఁడనైతి
నన్నుసునీతిదూ । రునివడినిగ్రహించియవి రోధముగా మహి నేలు మిత్తఱిన్ ॥
(ఉ) నావినిరాఘవుండురఘు నాథునకిట్లనుఁ గేలుమోడ్చిగో । త్రావర నీయను
జ్ఞనుశి రంబునఁబూనిచతుర్దశాబ్దము । ల్వావిరిదండకాటవిని వాస మొనర్చి
కృతవ్రతుండనై । తావక పాదపద్మములు తప్పక గొల్వఁగ వత్తుఁ గ్రమ్మఱన్ ॥
(తే,గీ) రాజశేఖరపెక్కువ ర్షములుసీవు । పుడమి యేలితి వత్యంత పుణ్య
మూర్తి। వై ననిన్ను మృషావాదిఁగానొనర్పఁ । జాలనిప్పుడేనడవికిఁజనెదఁదండ్రి॥

—(*) దశరథుఁడు రామునికి వనమునకుఁ బోవ ననుజ్ఞ యొసంగుట. (*)—

(క) ఒండుదలంపకననువన । మండలికింబంపుమోక్షు మావరయనఁదా । వెండి
యుసీతాపతికా । తండిట్లనుఁగనులనశ్రు తతులుదొరంగన్॥ (తే, గీ) వివిధభం
గులనిహలోకవృద్ధికోఱకు । వితతముగఁబారలౌకిక హితముకోఱకు । మనుకులో
త్తమపునరాగ మనముకోఱకు । స్వస్తియగుమంచి తెరువునవనకిఁజనుమ॥ (చ) అ
తులితసత్యధర్మవిన యాన్వితచిత్తుఁడవైననీదుస । మ్మతినిఁకఁగ్రమ్మఱించుటకు



మాకునశక్యముగానఁగానకు । న్నతగతినేగుమచ్చటవ్రతంబొకవై ఖరిసల్పవేగ
స । మ్మతిఁజనుదెమ్ముసంతతశు భస్ఫురితుండవు గమ్ముపుత్రకా ॥ (ఉ) తల్లియునే
నుజాలఁబ్రమ దంబునఁగామితముల్ ఘటింపఁగా । నుల్లముచల్లనై సిరుల,నొందు
చుభృత్యుల కెల్లఁబ్రీతిసం । ధిల్లఁగనీవిభావరిసుధీవర నాకడఁబుచ్చిసాధ్వసం। బల్ల
నఁదేర్చి రేపకడనంపక మైచనుమావనోర్వికిన్ ॥(వ) పుత్రానాకుఁబ్రియంబుసేయు
టకుసర్వైశ్వర్యంబువిడిచి హితజనంబులఁబరిత్యజించివనంబునకుంబోవ నుపక్ర
మించితివికార్యం బతిదుష్కరంబైనయది గదాయనిపలికి వెండియునిట్లనియె ॥
(మ) కలితచ్ఛన్నకృశానుకల్పయగునీ కైకేయిచే నెంతయుం। జలితప్రజ్ఞుఁడనైతి
నీదువనవా సంబించుకై నన్గుణో । జ్వలనాకర్థిఁ బ్రియంబుగాదువినుమే సత్యం
బుగాఁబల్కితిం । గలకాలంబును నీ వెఱుంగ వెజగ తక్కల్యాణ మద్భావమున్॥
(తే,గీ) అనఘకులవృత్తసాదిని యైనకైక । చేత సంప్రోదితుండవై చెలఁగియి
పుడు । పరఁగవంచించియడిగిననరమునర్థ । వంతముగ జేయఁ బూనితి వెంత
యరిది॥ (తే,గీ) ఘనతనన్నువీతాన్నృత కథునిఁగాఁగఁ । జేయుటదిధర్మరతుఁ
డవు జ్యేష్ఠసుతుఁడ । వర్ణవంశప్రదీపుఁడ వలఘుమతివి । ధార్మికుఁడ వైన
నీకుఁజి త్రంబుగాదు॥ (క) అనియీగతివిలపించుచు । మనుజవరేణ్యుండువలు
కు మాటకుదీనా । ననుఁడైయతఁడుసుమిత్రా । తనయుఁడువినుచుండమఱియుఁ
దండ్రికిననియెన్ ॥ (తే,గీ) అధిప నీయాజ్ఞచేనర ణ్యమునకరుగు । కం టెనొం
డొకకామంబు గలదెనాకుఁ । జెలఁగినినుసత్యవాదిఁగాఁ జేయు టదియె । య
ఖిలకామానుభవసిద్ధి యనితలంతు॥ (క) తరణికులోత్తమనాచే । నిరవందఁగ
విడువఁబడినయీసర్వమహిన్ । వరముసఫలమగునట్లుగ । భరతునకునొసంగుఁ
డిపుడు ప్రాభవమలరన్॥ (సీ) అవనీశ వనవాస మందునిశ్చితయయ్యె పరఁగ
నామతియది దిరుగదింకఁ । గరముసంప్రీతితోఁ గైకకుమీచేత దత్తమైనవరంబు
దప్పకుండ । భరతునిసామ్రాజ్య పట్టభద్రునిఁజేసి జగతి సత్యప్రతి శ్రవుఁడవగు
ము । నీనియోగంబున నెఱఁబదునాల్గేండ్లు వనచరయుతుఁడనై వని వసింతుఁ ॥
(ఆ, వె) గౌతుకమునఁబ్రియసు ఖంబులకొఱకురా । జ్యంబు నిచ్చగింప నధిప

(*) రాముఁడు దశరథు నూరార్చుట. (*)

యేను । మీరుచెప్పినంత మెయికొనికావించు । టదియెగోరువాఁడననుదినంబు॥
(క) మనమునశోకమువిడువుము । కనులన్ బాష్పములునించఁ గావలవదుమే ।

దినిలోఁదటినీవల్లభుఁ । డినకులవరయెన్నఁడైన నింకునెచెప్పుమా ॥ (వ) దేవా యేను రాజ్యసుఖంబులును జీవితంబునుసీతను సర్వకామంబులును స్వర్గంబు నైన మనంబున నిశ్చయింప మహానుభావుండవైన నిన్ను సత్య యుక్తునిఁగాఁ దలంచెదఁ బ్రత్యక్షదైవభూతుండవైన నీసన్నిధియందు సత్య సుకృతంబులుసా క్షిగా శపథంబుఁజేసితి నేనొక్కక్షణంబైన నిప్పురంబున నుండనోప సంకల్పి త వనగమనోద్యోగనివృత్తి నాకుంగలుగనేరదు నీవు శోకంబువిడువుము వనం బునకుంజనుమని యేను గైకేయిచేతఁ బ్రార్థితుండనై యట్ల సేయంగలవాఁ డనని నీయకొంటి దాని సత్యంబుగాఁ బరిపాలించుచోఁడ నీవీ మనోవ్యథవిడిచి యెప్పటియట్ల స్వస్థచిత్తుండవుగమ్ము ప్రశాంత హరిణాకీర్ణంబును నానాపక్షిగ ణయుతంబునగు వనంబున సీతాలక్ష్మణసహితుండనై యథాసుఖంబుగావిహరిం చెద లోకంబున దేవతలకైనఁ దండ్రికంటె నొండుదైవంబు లేదని యార్యులు నొడువుదురుగావునఁ బ్రత్యక్ష దైవస్వరూపుండైన తండ్రివచనంబు యథోక్త ప్రకారంబున నిర్వర్తించెద॥ (క) నరనాథచతుర్దశవ । త్సరము లరణ్యము ననుండితడయకమఱలం । బురికింజనుదెంచిననుఁ । బరికించెదునీమనమునవగ వకుమింకన్॥ (తే, గీ) అనఘయీబాష్పగళమైన జనములెల్లఁ । దగువిధంబు నఁదేర్పంగఁ దగినమీరె । తాల్మివిడిచియిబ్భంగిసం తాపమొంద । నింకనినుఁ దేర్చువారెవ్వరిచటఁజెప్పుమ॥ (తే, గీ) క్షితి వరోత్తమ నాచేవి సృష్టమైన । సాగరపురాద్రికానన సంయుతమగు । ధరణియంతయుఁజేకొని భరతుఁడేలుఁ । గాకనీమాటకనృతంబు గలదెయధిప॥ (క) ఫలమూలంబులు మెసవుచు । సొలయక గిరినదులు వేడ్కఁ జూచుచు సౌఖ్యం । బలరారఁ గాననంబునఁ । గల యఁగఁజరియింతుసుఖివి గమ్మిటనీవున్॥ (వ) అనిపలికిన నద్ధరారమణుండు శో కసంతప్తచిత్తుండై కొడుకుంగౌఁగిలించుకొని మోహ విశేషంబున రోదనంబు సేయుచు నొక్కింతసేపు నష్టచేష్టితుండై యుండెఁ గైకేయి దక్కఁ దక్కిన రా జపత్నులందఱు నాహాకారంబులు సేయుచు మూర్ఛాక్రాంతలైరి సుమంత్రుం డును దుఃఖాతిశయంబున వినష్టచేతనుండై ధరణిపయింబడియె నిట్లందఱుఁగొం

(*) సుమంత్రుఁడు కైకేయి నధిక్షేపించి దూఱుట. (*)

డొకసేపు వివశులై హాహాకారంబులు సేయుచుండి వెండియుం దేఱిన యనంత రంబ సుమంత్రుండు కటకటంబడి క్రోధాతిశయంబున శిరఃకంపంబు సేయుచు ని



ట్టూర్పులు పుచ్చుచు బొమలుముడివడఁ గన్నులం గెంజాయ రంజిల్లఁ గైకేయి దిక్కు మొగంబై మహీపతి మనోవిధం బంతయు నెఱింగి నిశితంబులగు వాగ్బా ణంబులచేత నద్దేవి హృదయంబుఁ గంపింపం జేయుచు వజ్రోపమానంబు లగు వాక్యంబులఁ దదీయమర్మంబులంగలంచుచు దేవియెద్దానిచేత భర్తయు స్థా వరజంగమాత్మకంబై సర్వజగంబునకు నాథుండు నగు దశరథుండు విడువంబడి యె నట్టినీకు నింకఁజేయరానికార్యం బొక్కింతయైనఁ గలుగదు మహేంద్రుం డునుంబోలె నజయ్యుఁడును మహాశైలంబునుం బోలె నప్రకంప్యుండును మహా ర్ణవంబునుం బోలె నక్షోభ్యుండు నగుమహీపతిని నీక్రూరవ్యాపారంబులఁ బరి తపింపం జేయుట వలన నిన్నుఁ బతిఘ్నివనియుఁ గ్రమంబునఁగులఘ్నివనియుఁ ద లంచెద నని పలికి వెండియు నిట్లనియె ॥ (తే,గీ) తనయు లొకకోటి గల్గిన,ధ రణిలోన । నంబుజాక్షికి భర్తృ మ,నోనుసరణ । మరయ నిఖిలార్థ సాధన మైచెలంగుఁ । గానఁబతినింక నేఁచక,గావు మబల ॥ (తే,గీ) అతివ యిక్ష్వా కుకులవిభుం,డితఁడు సుగతి । కరిగిన యనంతరంబ జ్యే,ష్ఠానుపూర్వ । కముగ రాజ్యభారముఁ దాల్పఁ,గలరుపుత్రు । లిపుడుతద్ధర్మ మెటుపాలియించెదకట॥ (మ) అమలుం డీనృపుఁ డట్టివానిపయిఁ బూ,ర్వాచార ధర్మంబు హై । న్య ము నొందింపఁ దలంచితీవు జననిం, దన్నీ సుతుం డాధిప । త్యముఁ గావింపుచు నుండ నిమ్ముచెలువొం,దన్నేము నిత్యంబు దా । వమున న్రామునిఁ గూడి నిశ్చ యమతిన్, వత్తుంతుమిచ్ఛారతిన్ ॥ (ఆ,వె) యోగ్యుఁడైన విప్రుఁ, డొక్క రుండైన నీ । విషయమందు నిలిచి,వెలయఁజాలఁ । డట్టి పాపకర్మ, మాచరిం చితివిచె । చెట్టిఁదనమికేమి, చెప్పవచ్చు ॥ (తే,గీ) రామునకు నెగ్గుసేయఁద, లంచియున్న । నీకు బ్రహ్మర్షి వాగ్దండ,నికరమేల । హింససేయదు నీవుకా, లిడిన పుడమి । వ్రయ్యలైపోవ దేల చి,త్రంబుగాదె ॥ (తే,గీ) భర్త కెప్పు డు భవదను,వర్తనంబు । కోమలివృథాప్రయాసంబు, కొఱకునయ్యె । రమణి చూతంబు ద్రుంచినిం,బమును బాలుఁ । బోసిపెంచిన మధురిమ, పుట్టఁబోనె ॥ (వ) అని కోపంబు పెంపునం బలికి వెండియు మర్మవచనంబుల నిట్లనియె ॥ (క) తల్లికిని బోలె నీకును । నుల్లంబునఁ గ్రూరచింత, యొప్పుచు నడుం । గ ల్లనఁగ వలదువేఁపకుఁ । దెల్లంబుగ విసమెకాక, తీపు గలుగునే ॥ (వ) అధి

## (*) సుమంత్రుండు కైకేయితల్లి దురాచారంబు లుగ్గడించుట. (*)

యెట్లనినం దొల్లి భవజ్జనకుండగు కేకయమహీనాథుం డొక్కయోగివలన సకలభూతరుతార్థజ్ఞాన విషయకంబైన యొక్కవరంబు వడసి తత్ప్రభావంబున సర్వభూతరుతంబును దదభిప్రాయంబు నెఱింగె దానం జేసి పశుపక్షి మృగాదులవచనం బతనికి విదితంబై యుండు నంతనొక్కనాఁ డద్ధరారమణుండు శయనకాలంబునందు నొక్క జృంభనామకంబైన పక్షిరుతంబు విని దాని యభిప్రాయం బెఱింగి నవ్విన నది విని మృత్యుపాశంబు నభిలషింపుచు మీతల్లి కోపించి హాసకారణం బెఱింగింపు మనిన నతండు తత్ప్రకారం బెఱింగించిన నిప్పుడు నాకు మరణంబు సంభవించు ననిన నది వినక నీవెట్లైన లెస్స నాకు నవ్వుటకుం గలిగిననిమిత్తం బెఱింగింపుమని నిర్బంధించిన నన్నరవరుండ వ్విధంబంతయు వరదాయకుండగు యోగికెఱింగించిన నతండు మోహావశంబున నాలికిఁ జెప్పి మరణంబునొందక దానినిరసింపుమనిన నక్కేకయుండు గురువచనప్రకారంబున భార్యనునిరసించి మృత్యువుందిరస్కరించి సుఖియైకుబేరుండునుం బోలె యథా సుఖంబుగా విహరించె నిది మీతల్లి వృత్తాంతంబెల్లవారికిఁ దెల్లంబై యున్నయది యట్టిక్రూరచిత్తకుం బుట్టిననీకు మంచిగుణం బేలదొరకొనుఁ దల్లియట్ల నీవును దుర్జన సమాచరిత మార్గస్థితవై మోహంబున మహీపతిం జంపం జూచితివి పుత్రులకుఁ దండ్రి గుణంబును బుత్రికలకుఁ దల్లిగుణంబును నిక్కంబుగా సన్నిహితంబై యుండు నీవును దల్లిగుణంబంగీకరించి జనాపవాదంబున కోర్చి మహీపతిచిత్తంబుఁ గలంచెద విమ్మహీపతిసభామధ్యంబునం బలికినరామాభిషేకంబునకు విఘ్నంబుఁ జేసితి వేని నితనికసత్యదోషంబువచ్చు జ్యేష్ఠునిం బరిహరించి కనిష్ఠునభిషిక్తునిం జేసిన రాజధర్మంబునకు

## (*) సుమంత్రుండు కైకేయికి నీతులు దెల్పుట. (*)

హానిఘటిల్లు నిమ్మనుజపుంగవుండు దేవరాజసమప్రభుండును గీర్తిరథుండును సత్యవాదియుఁ గావున నమ్మహాత్మున కపయశంబు గలుగకుండ సత్యంబుననుద్ధరింపుమనిపలికి వెండియునిట్లనియె ॥ (చ) అనఘచరిత్రుఁడీరఘుకులాంబుధిచంద్రుఁడు రాఘవుండు కా । ననమున కేగుచుండ ననుడు నాథుఁడు లేనితమిస్రభంగిశో । భనరుచి దక్కి దిక్కుసెడి పాడఱియున్న పురంబులోపల । న్మనుజుఁడొకండు నిల్చునె వనంబున కేగక దుష్టచారిణీ ॥ (తే.గీ) రామభద్రుండు దండకారణ్యమున



కుఁ । జనిననీకపవాదంబు సంభవించు । వంశధర్మమునకు హాని వచ్చు మనుజ । పతికిఁదీర్పంగరాని యాపదఘటిల్లు ॥ (క) కావుననవేకఘనదో । షావహమగునీవిచార మటువోనిడిసీ । తావిభునిసకలరాజ్య । శ్రీవిభునిఁగఁ జేయుమిపుడు చిత్తములలరన్ ॥ (శా) సీతానాథుఁ డశేషరాజ్యపదవీసింహాసనాధ్యక్షుఁడై । చేతోజాత సమానమూర్తులు నృపశ్రేష్ఠుల్సుమిత్రాతనూ । జాతుల్మీతనయుండుఁ గొల్వఁ బ్రజలన్ సంప్రీతితో నేలఁగాఁ । బూతాత్ముండగు రాజు కానకరుగుం బూర్వాధిపప్రక్రియన్ ॥ (క) అనియిట్లు పెక్కుభంగులఁ । బనివడిసూతజుఁడు తీక్ష్ణభాషితముల మె । త్తనిమాటలన్యాయప్రవ । చనములఁగొంతవడి ధర్మసరణిఁబలికినన్ ॥ (క) పడతుక దుర్మతిమదితా । విడువకజనులాడుసడికి వెఱవకమదిలోఁ । బొడమినగోపముమత్సర । ముడుగకమఱుమాటవలుకకయూరకయుండెన్ ॥ (వ) అంతనమ్మహీనాథుండు ప్రతిజ్ఞాపీడితుండై నిట్టూర్పునిగుడించి కన్నుల బాష్పకణంబు లొలుక సుమంత్రుదిక్కు మొగంబై రత్నసంపూర్ణంబులగు వరూధినీశతంబులును మాతంగతురంగ సహస్రంబులును జమూకదంబంబును బరచిత్తాపకర్షణ చతుర వచనలగు వారకాంతలును సంప్రసాదితులగు వణిగ్జనంబులును ముఖ్యంబులగు వరాయుధంబులును నాగరంబులగు శకటంబులును కాంతారగోచరులగు వ్యాధులును ధనధాన్యకోశంబులును రాముని పిఱుందవనంబునకుం జనునట్లుసేయుము సేనాయుతుండై కుంజరాదిమృగంబులం జంపుచు సహాయసంపన్నుండై యారణ్యకంబగుమధువుఁగ్రోలుచు ధనవంతుండై పుణ్యప్రదేశంబులందుయాగంబులఁ జేసి బ్రాహ్మణులకుఁ బుష్కలంబుగా దక్షిణ లొసంగుచు మునులతోడఁ బుణ్యకథావినోదంబులం బ్రొద్దుపుచ్చుచుఁ బురంబునందుం బోలె రాముండుసుఖగోష్ఠి వనంబునందువిహరింపుచుండు నిచ్చటభరతుం డయోధ్యఁ బాలింపుచుండుఁ బదంపడి రాముండువనవాసానంతరంబున సకలమహీరాజ్యభారధారేయుండై ప్రజలఁబాలింపఁగలండనిపలికినఁ గైకేయిభయభ్రాంతయై మొగంబున వెల్లదనంబు గదుర నద్దశరథున కభిముఖియైయిట్లనియె ॥ (క) రమణాగతజనమగురా । జ్యము నకటాపీతమండ మగుమద్యమున । ట్లమలినమతిచేఁ గడుఁగ్రూ । రమయుక్తినొసంగఁదలఁచితే భరతునకున్ ॥ (క) దానినతఁడేల చేకొను । నీనేర్పులు దెలిసెనింక నిలుపుమనినన । మ్మానవపతి లజ్జాభయ । హీనయగు వెలంది గనియె

నెంతయుఁగినుకన్ ॥ (క) వినువారికయుక్తంబగు । పనిమైనను సత్యపాశ బ
ద్ధుఁడనై కై । కొనిసేయఁగడంగినన । న్ననుమానముదక్కియేమియుఁజెదవిం
కన్ ॥ (తే,గీ) పాపమతి రామునడవికిఁ బంపుమనుచుఁ । బలికితివిగానినాప్రెమో
ల బలయుతముగ । ననుపవలదనియంటివే యపుడునాతుఁ । దోఁచినట్లిప్పుడోన

(*)కైకేయిదశరథునితో సగరుఁడసమంజసునట్లు రామునివనముకుఁబంపుమనుట.(*)

రింతుదోసమేమి ॥ (క) అనిపలికిన వినియమ్మా । నినితనపతికంటెమిగుల నె
ఱిగల్గినబల్ । కినుకహృదయమునఁగదురఁగ । ననుమానమువిడిచిమఱల నాత
నికనియెన్ ॥ (ఉ) ఇంతవిచారమేల పృథివీశ్వర మీకులమందుఁదొల్లివి । క్రాం
తధురంధరుండు సగరక్షితినాథుఁడు జ్యేష్ఠపుత్రున । త్యంతగుణప్రవీణునిమ హా
త్ముని నయ్యసమంజునిన్సుధీ । మంతునిఁద్రోచి పుచ్చఁడెయీమావర యాతని కె
గ్గుకల్గెనే॥ (వ) మహేంద్రా యసమంజుని చందంబున నీరాముండు నిర్వాసితుఁ
డగుఁగాక యనినప్పుడంతివాక్యంబులువినరోసి మహీనాథుండూరకుండె జనం
బంతయు వ్రీడితంబయ్యె నప్పుడు మహావృద్ధుండగు సిద్ధార్థుండనుమంత్రిపుంగ
వుండు కైకేయికిట్లనియె ॥ (క) ఆయసమంజుడు క్రీడా । వ్యాయామమువలనఁ
దెరువులందు శిశువులం । బాయకకొని చనిసరయూ । తోయంబులవైచు
భూరి దుర్మద లీలన్ ॥ (వ) దానింజూచి సహింపక పౌరులమ్మహీ ప

—(*)సిద్ధార్థుండను వృద్ధమంత్రికైకేయికి నయంబుఁదెల్పుట.(*)—

తిపాలికిం జని భవన్నందనుండు దుర్మదంబున నస్మత్పుత్రులం గొనిచనిమా
ఱ్ఱాణంబున సరయూనదీ జలంబులం బడవైచు నిట్టి దుష్టునొక్కనిం జే
కొని మమ్మునందఱ నుపేక్షించుట ధర్మంబుగాదని యాక్రోశించినవారికిం బ్రి
యంబుగా సభార్యుండైనయసమంజుని యావజ్జీవపర్యంతంబు వనంబున నుండు
మని రాష్ట్రంబు వెడల ననిచిన నయ్యసమంజుండు ఫాలపిటకధరుండై గిరిదు
ర్గంబులనాశ్రయించి కందమూలఫలాశనుండై పాపకర్మంబునంబోలె సంచ
రింపుచుండె నక్కుమారుండు జనకంటకుండగుటంజేసి పరిత్యజించుటకుం దగి
యెడువాఁడయ్యె నక్కుమారుని యందుంబోలె రామునియం దేమి పాపంబు
గంటిమి శశాంకునియందు మాలిన్యంబట్లులే దట్లు రామునియందునిరయహే
తుభూతంబైన దోషంబించుకయైనలే దిమ్మహాత్ముండు విడుచుటకుం దగియెడు
వాఁడేయని పలికి వెండియునిట్లనియె॥ (క) మానినిసీతాపతిపైఁ । బూనుక నిం



దైనదోష ముంగలదేనిన్ । దానింబేర్కొనుమిప్పుడె । కానకుఁదగఁబుత్తుమిట్లు
కారణమేలా॥ (క) ముదితా సత్పథనిరతుం । డదుష్టుఁడగువానిత్యాగ మందుఁ
దలంపం । ద్రిదశాధీశునిపటుసం । పదనైనదహించుధర్మ పథ రోధమునన్ ॥
(క) మునుకొని రామునివనికిం । బనిచిననీకేమిఫలము వచ్చు మృగాక్షీ । విను
మీదుమర్రాత ముడుగుము । గొన కొని జననిందఁ బాపి కొనుము సుమతివై ॥
(మ) అని యిట్లాడు ప్రధానశేఖరుని మా టాలించి భూభర్తదా । ఘన శో
కోప హతేంద్రియుం డగుచు న, క్కైకేయినెమ్మోముఁగ । న్గొనిమందధ్వనినిట్లు
నెన్ జనులుప క్రోశింపకుండన్ మహా । ఘనుఁడీమంత్రివరుండుపల్కునయవాక్యం
బర్థినాలింపుమా॥ (తే,గీ) లేమయీమంత్రివాక్యమా లింపవేని । పొరిదినీకునునా
కును సుఖములేదు । వృజినపథమొందినీవుగా వించునట్టి । కర్మమిదిసాధులో
కవి గర్హితంబు॥ (చ) పలుకులువేయునేలకుల పాంసనినీవునునీకుమారుఁడీ।
యిలనవిరోధతంగుజను లెల్లనుతింపఁగనేలుచుండుఁడే । లలితగుణాభి రాముఁడ
గు రామునిఁగూడివనోర్వికేగెద । న్దలువలపొత్తుఁబోదు రెఘు నుండెడఁ బాసిన
చోయశోధనుల్ ॥ (చ) అనిజనభర్తపల్కునపు డారఘురాముఁడుమంత్రివా
క్యము । ల్వినివినయంబుదోఁపఁబ్రృథి వీపతికిట్లను నోమహాత్మశో । భనకరరాజ్య

(*) రాముఁడు దశరథుని వల్కలము లడుగుట. (*)

సంపదలఁ బాసివనంబుననుండువాఁడనై । చనియెడునాకునీసకల సైన్యసమా
గమమేలచెప్పుమా॥ (మ) నరనాథోత్తమయెవ్వఁడర్థిగజముం దానిచ్చి తత్క
క్ష్యయం । దురుమోహంబునఁగామకాఁరియగునో హారజ్జుసంస్నేహత । త్వర
తన్వానికిఁగార్యమేమిగలదీ దాక్షిణ్యమున్నానిచె । చ్చెరఁదెప్పింపుము నారచీరల
వియే శ్రీలంచునూహించెదన్॥ (మ) అనిసీతావిభుఁ డాడు వాక్యములకు న్హా
షించిక్కైకేయిచ । య్యనవల్కంబులఁ దెచ్చి రామగయికో మ్మంచున్వచింపం
గఁజే । కొని రాముండటు సూక్ష్మవస్త్రముజను ల్క్షోభింపఁగాఁబుచ్చిదా । ముని
వస్త్రంబులుగట్టె నాయమకు సమ్మోదంబు సంధిల్లఁగన్॥ (ఉ) ఆదటలక్ష్మణుం
డునుశు భాంబరమల్లనఁబుచ్చి తాపసా । చ్ఛాదన ముద్ధరించెఁ దమ యయ్యెగ
నుంగొనుచుండనంతరా । కాథవ శాంశు వక్త్రియుజ గన్నుతశీలయు భర్తృన
దుఃఖవి । చ్ఛేదినిజాతరూపమయ చేలయునైనధరాకుమారియున్॥ (తే,గీ) కైక

——(*) రాముఁడు సీతకు వల్కములఁ గట్టుట. (*)——

కఠినాత్మయైకృప లేకతనకొ । సంగిన యమంజుతాపసా చ్ఛాదనంబు । హరిణి వారగుయట్లతా నందికొనిసు । బాష్పపూర్ణాక్షియైనిజ భర్తఁజూచి॥(తే,గీ) పురుషవరయిట్టికఠినఁగపుఁబుట్టమెట్టు । మునులు దాల్పంగనోపుదు రనుచుఁగను ల । నశ్రుపులుగ్రమ్మవ్రీడిత యగుచుదానిఁ । గట్టనేరక శోకంబు గడలుకొనఁగ॥ (తే,గీ) అంసముననొక్కపరిధాన మలవరించి । పాణిచేనొక్కవసనంబుఁ, బట్టి విభుని । మోముఁజూచుచుమనమున నేమిదోఁచ । కూరకున్న మహీపుత్రి నూ రడించి॥ (క) రాముఁడురయమునసీతా । భామిని కనకాంబరంబు పై వల్కల ము । ద్దామగతిఁగట్టఁగనుఁగొని । భూమీశ్వరుసతులుచాలఁ బొక్కుచ నంతన్॥ (ఉ) రామునిఁజూచియిట్లనిరి రాజకులోత్తమయీధరిత్రిక । న్యామణిబాల గో లయుమ హాసుకుమారియుఁబుట్టియెన్నఁడు । న్యాములెఱుంగనట్టిఘనభాగ్యయుఁ గావునసీసతిన్వనీ । భూమికి నేఁడుదోడుకొని పోవఁగ యుక్తము గాదు చూడఁ గన్॥ (తే,గీ) ధన్యచరితనీవచ్చునం దాకనిన్నుఁ । గాంచియానందమునఁబొం గు కరణిజనక । సుతనుగనుఁగొనిసంతోష యుతలమగుచు । నసువులు ధరించి యుండెద మంచితముగ॥ (క) జనపతినిన్నొంటిగఁగా । ననమునకరుగుమనిపం చె నరవరయటుగా । వునజనకసుతనుదోడ్కొని । చనుటొప్పదు తండ్రి మాట సత్యముకాదే॥ (క) మామాటఁబట్టిసీతా । భామిని నిచ్చోట నునిచి భద్రయ శుండీ । సౌమిత్రివెంటరావన । భూమికిఁ జను మిదియనీకుఁ బోలుఁగుమారా॥ (క) అనియిట్లుతల్లులందఱుఁ । దనకుహితముఁబల్కవినుచుఁ దడయకరాముం। డనుమానింపకధాత్రీ । తనయకువల్కలముఁగట్టెఁ దత్పరమతియై॥ (వ) ఆసమ యంబున నృపపురోహితుండగు వసిష్ఠుండు సీతాదేవిని నివారించి కైకేయిన

——(*) వసిష్ఠుఁడు కైకేయిని దూరుట. (*)——

వలోకించియిట్లనియె॥ (తే,గీ) శీలమెన్నకమగనివ చించి రామ । భద్రునడవికిఁ బొమ్మని పలికితాఁబ్ర । మాణమందునునిలువకీమానవతికి । సీతకిచ్చితి వేటికిఁజీర లిపుడు॥ (ఉ) ఆతెఱఁగెట్లుచొప్పడుమ హాసుకు మారిపవిత్ర శీలయీ । సీతని ఖాధినాథుఁడెడ సేయకక్రమ్మఱవచ్చునంతకి । ట్లాతనిశాసనంబునధ రాధిపతిత్వ మునొందియుండుఁగా । కాతతకంటకాత్మకఠి నావని కేటికిఁ బోవు నిత్తఱిన్॥ (తే,గీ) ఇంతివినుముగృహస్థుల కిల్లఁబత్ని । యాత్మయైయుండు రామున కాత్మ



యైన । ధాత్రికన్యతత్ప్రతినిధి త్వమునఖిల । వసుధఁబాలించుఁ దనపతివచ్చు దాక॥ (ఆ,వె) అట్లుగాకయీమ హాసాధ్విపతిఁగూడి । యడవికరిగెనేని య తులసుఖము । లిచటవిడిచిపిదప నేమందఱముచను । వారమతఁడువోవు ఘోర వనికి॥ (తే,గీ) తండ్రిచేధర్మయుక్తిన త్తంబుగాని । యుర్వి బాలింప భరతుఁ డ హర్హుఁడుగాఁడు । నృపతికిఁజనించుటదినిక్క మేనియింకఁ । దల్లివలెనిన్నుఁ జూడఁడుతథ్యమతఁడు॥ (ఆ,వె) మఱియువిషయజనులు పురజనంబులుదండ । నాయకులుసతీస హాయులగుచు । నెచటరామభద్రుఁ డింపారవసియించు । న చటికిపుడెపోదు రనృతశీల॥ (వ)దుష్టచారిణి నీవు భూతలంబునుండి గగనం బునకెగసినఁ బితృవంశచరిత్రవిశారదుండగు భరతుండు భవన్మతం బంగీకరిం పఁడు పుత్రవినాశినివగు నీచేత భరతున కప్రియంబుగావింపంబడియె మఱియు లోకంబున నెవ్వఁడు రాముని ననుసరింపకుండు నతనిలేనివానిఁగా నెఱుంగు ము పశువ్యాళమృగద్విజంబులును బాదపంబులును దదున్ముఖంబులై రాముని తోఁగూడ వనంబున కిపుడె పోవఁగలయవి తత్ప్రకారంబు విలోకింపంగలవు భరతుండును శత్రుఘ్నుండును రామునియట్ల తాపసవేషంబులుదాల్చి దండకా రణ్యంబున వసియింతు రంతట గతజనంబై శూన్యాకృతినున్న యిప్పురంబుచేకో ని విగతఫలంబులైన వృక్షంబుల కాధిపత్యంబు సేయుచుండుము మఱియు రా ముండులేని పురం బరణ్యసమానంబగు నమ్మహాత్ముండు వసియించియున్న నెలవు విపినంబైనను నానాజనశోభితంబై నపురంబైయుండు మఱియు నొక్క రాముని వనవాసంబె నీచేతఁ బ్రార్థితంబైనయదిగాని వరప్రదానంబునందు సీతా వన వాసంబు ప్రార్థితంబైనయది గాదుగావున నలంకార నియతయైన యీసీత సర్వాలంకారభూషితయై మహార్హయాన పరిచారక వస్త్రభూషణ విధానస హితంబుగా వనంబునకుంజని యందు రామునితోఁగూడ నివసించి యుండంగ లయది నీవీవైదేహికి దివ్యాంబరాభరణ మాల్యాదు లొసంగి వల్కలంబులు గ్రమ్మఱఁ బ్రతిగ్రహింపుమని యిట్లు కైకేయిం బదరిపలికి జానకిని నివారించిన నద్దేవి యమ్మహాత్ముఁ డెంతఁజెప్పిననుడుగక ప్రతీకార కామగావున నిజవల్లభుని

——(*) దశరథుఁడు కైకేయి యన్యాయంబు నుగ్గడించుట. (*)——

రూపంబున కనురూపంబుగా వల్కలంబుధరించె నప్పుడచ్చటి జనంబులందఱు దుఃఖించిన నమ్మహాధ్వనివిని దశరథుండు శోకవ్యాకులిత చిత్తుండగుచు యశో

ధర్మజీవితంబులయందుఁ బ్రియత్వంబు విడిచి నిట్టూర్పు నిగుడించి కైకేయి
నవలోకించి యిట్లనియె॥ (సీ) పుట్టియెన్నఁడుదుఃఖ ములనెఱుంగక సరసాన్నం
బుఁగుడిచిచీనాంబరములఁ। దాల్చిమహోన్నతిఁ బొల్చి యుండెడు నట్టి యీ
బాల యీగోల యీసుఖార్హ। యీ మహా సుకుమారి యీ ధరిత్రి కు
మారి కుశ చీరఁ దాల్చి యీ కులత కోర్చి। ఘోర వనావని కేరీతిఁ బో
నేర్చు గురునివాక్యంబునిక్కమనుచు వ్వె॥ (తే,గీ) ఘనసుఖోచితయైనయీజనకక
న్య। తనయలంకార రూపమంతయును విడిచి। తాపసులు గట్టు పుట్టంబుఁ,
దాల్పఁజూచి। కన్నవారల మనములు, గంద కున్నె॥ (తే,గీ) చీరలు పరి
త్యజించి యీక్షితికుమారి। కనకభూషణ భూషితాకార యగుచుఁ। గడు
సుఖంబుగ వని కేగఁ, గలదుశ్రమణి। యగుట కేనీయకొంటినె,మగువ యిపు
డు॥ (తే,గీ) అకట వల్కముఁ దాల్చిన, భాంతరమున। శ్రమణి చందాన
నొప్పెడు, జనకపుత్రి। నెవ్విధంబున వీక్షింతు, నెట్లు సైతు। నీవెలంది యె
వ్వని కేమి, యెగ్గుఁ జేసె॥ (తే,గీ) రమణి జానకి నారచీరలు ధరించి।వని
కిఁ బోవుట కేనీయ, కొనుట లేదు। గావున సమస్త భూషణ, కలిత యగు
చు। భూరి సుఖలీల నడవికిఁ, బోవఁ గలదు॥ (వ) దేవి ముమూర్షుం
డనైన నాచేత భవత్ప్రార్థనంబుఁ గావించెద నని శపథ పూర్వకంబుగా
నతి క్రూరంబైన ప్రతిజ్ఞ మొదలఁ గావింపం బడియెఁ బదంపడి నీచేత నజ్ఞా
నంబున రామ ప్రవ్రాజన భరతాభిషేకరూప ప్రయోజనంబు ప్రతిపన్నంబయ్యెఁ
గాని సీతా ప్రవ్రాజన రూప ప్రయోజనంబు ప్రతిపన్నంబైన యది గాదే
నందు కీయకొనిన యది లేదిప్పుడు ముఖ్యంబుగా సీతా ప్రవ్రాజనంబె
యారంభింపఁ బడియెఁ గావున నీకార్యం బాత్మపుష్పంబు వేణువుం బో
లె నన్ను దహింపంగలయది యనిపలికి వెండియు నిట్లనియె॥ (తే,గీ) ఈమ
హీంజాత నీకేమి, యెగ్గుఁజేసె। రాముఁడేమింత నీకు గారాముఁడయ్యె। నీదు
రత్యయబుద్ధి నీకేలగలిగె। మంచి కులమేల నీఱు గావించెదకట॥ (తే,గీ)
పరమసాధ్వి మృదుస్వభావయునుగోల। మంజుభాషిణి హారిణీసమాననయ
న। బాలసుకుమారి ధర్మైకపరయునైన। సీత యేమి విరోధంబు,సేయునీ
కు॥ (వ) దుష్టచారిణీ నీకు నరకానుభవంబు కొఱకు నీరామ వివాసనంబె
చాలు వెండియు నింతకంటె నధికంబుగా నీచేత ననుష్ఠీయమానంబైన యీ



యవాచ్య దుఃఖప్రద సీతాప్రవ్రాజనరూప పాతకంబుచేత నేమి యనుభవించె
ద వభిషేకార్థం బిచటికి సమాగతుండైన రాము నుద్దేశించినీచేతఁబలుకంబ
డిన రామవివాసనవిషయకంబైన వాక్యం బాకర్ణించినాచేత రామవివాసన
మాత్రంబె ప్రతిజ్ఞాతం బయ్యెఁ గాని సీతావివాసనంబు ప్రతిజ్ఞాతంబైన యది
గాదిప్పుడు మత్ప్రవృత్తంబైన రామవివాసనం బతిక్రమించి యప్రవృత్తంబై
న సీతావివాసనంబునుం గోరితివిది ధర్మవిరోధంబు చీరధారిణియైన వైదేహి
నీక్షింప నిశ్చయించితివి గావున నీవు నిక్కంబుగా నిరయగతి నొందఁగలవు॥
(ఉ) లోకముతోడిదానవని,రూఢిగ నెమ్మది నమ్మి యంత క। స్తోక ముదంబు
నం బ్రియము, దోఁపఁ గుమారుని మేలు కార్యము।న్వాకొని చెప్పవచ్చితు
ది, వారని దుఃఖము నొందితకటా। నీకడకేగుదెంచు టది,నేరము వచ్చెఁ
దలంపు లేటికిక॥ (మ) అని యిట్లాజనభర్త శోకమున భార్యన్నూఱుచుం
గోడలిం। గనిశోకింపుచు బాష్పతోయకణముల్, గన్గోనలందాల్చుచు। న్త
నయు న్బాయుట కోర్వఁ జాలక మన,స్తాపంబు వాటిల్లఁగ। న్ననదుఃఖంబు
సహింప లేక సొరిగెం, దల్పప్రఘాణంబునన్॥ (వ) ఇట్లు మూర్ఛితుండై ప
డియున్న తండ్రిం దేర్చి సీతావల్లభుండు గమనోన్ముఖుండై వెండియు నిట్లని
(*) రాముఁడు కౌసల్యను సన్మానింపుచుండుమనిదశరథునిఁబ్రార్థించుట. (*)
యె॥ (సీ) అనఘాత్మ మాతల్లియైన యీకౌసల్యకడు వృద్ధ కీర్తిసంకలిత
పుట్టి। యెన్నఁడు దుఃఖంబు,లెఱుఁగనియతిసుభద్రశీల మహాధర్మచిత్తనన్ను।
నిమిషమైనను బాసి,నిలువ నేరని దట్లుగావునఁ బుత్రశోకమునఁ గుంద। కుం
డ సన్మానింపు, మురుసమాదరమున నట్లుగావింపక,యలఁతిగాఁగఁ॥ (తే,గీ)
జూచి తేనియు దారుణశోకవహ్నిఁ। గ్రాఁగి యసువులువిడిచిని,కముగయ
మపు। రంబునకుఁబోవుననిన నా,రాజవరుఁడు। మహితశోకాబ్ధి దోధూయ,
మానుఁడగుచు॥ (వ) మునివేషధరుండైన కుమారునవలోకించి వదనం బె
త్తి యతనిం జూచుటకు నతనితోడ సంభాషించుటకుం జాలక పత్నీసహితం
బుగా మూర్ఛితుండై వెండియు నొక్కింత సేపునకుం దేఱి॥ (క) ముదము
న మున్నె మొదవుల। వదలక కుఱ్ఱలకుఁ బాపి, భంజించితినో। పదుగుర హిం
సించితినో। యది యెంతయుఁగట్టికుడువ, నయ్యెన్నాకుర్॥ (ఉ) అక్కట
కైకమాటలకు, నంగములెల్లమహోగ్రవేదన। న్పుక్కియు మానివేష మది,

చొప్పడఁ గైకొనియగ్రభాగమం । దుక్కఱియున్న పుత్రుఁగని, యున్మనియుం డుటఁజేసి ధాత్రిలో । గ్రక్కునఁజేటు కాలమునఁ, గల్గమినిక్కము ప్రాణికోటి కిన్ ॥ (తే,గీ) నను నిరోధించిస్వప్రయోజనమునందుఁ । బ్రియము గలిగిన కైకేయి,కృతమునందు । జనముకటకట పడుచున్న, దనుచుఁబలికి । యశ్రువు లుగారనంతలో, నవశుఁ డయ్యె ॥ (వ) ఇట్లు మూర్ఛాక్రాంతుండై ముహూర్తమాత్రంబునకుఁ గ్రమ్మఱ లబ్ధసంజ్ఞుండై రామాయనిపేర్కొని క్రమ్మఱ నుచ్చరింపం జాలక కొంతసేపూరకుండి వెండియు బాష్పకణంబులు కొనగోట మీటుచు సుమంత్రుంజూచి నీవురయంబునం జని యుపవాహన మాత్రో

(*) దశరథుఁడు సీతకు దివ్యవస్త్రాభరణాదుల నొసఁగుట. (*)

పయుక్తంబైన రథంబు నుత్తమాశ్వంబులం బూన్చి తెమ్ము నాథుండును వీరోత్తముండు నగు రాముండు తల్లిదండ్రులచేత ననుపం బడియెనను ప్రవాదంబు గుణవంతుండనగు నాగుణంబునకు ఫలంబు గదాయనిదుఃఖాతిశయంబునంబలికిన విని యతండు రాజానుమతంబున సువర్ణ రత్నభూషితంబైన రథంబాయితంబుఁజేసి తెచ్చిముందటం బెట్టి కృతాంజలిపుటుండై కొలిచియుండెనప్పుడ ద్దశరథుండు దేశకాలజ్ఞుండును బాహ్యాభ్యంతరబుద్ధియుక్తుండునుదత్తత్కాలోచిత వస్తువిషయనిశ్చిత జ్ఞానవంతుండునగు ధనాధ్యక్షుని రావించిమంజువస్త్రంబులును మణిభూషణంబులును బదునాల్గు వర్షంబులకుం జాలునట్లుగా వేర్వేఱ వైదేహి కొసంగుమని పంచిన నతండు కోశ గృహంబునకుం జని వస్త్రాభరణంబులు దెచ్చి యద్దేవి కొసంగిన నయోనిజయు సాముద్రికోక్తసర్వలక్షణ సంపన్నయు నగునమ్మహీపుత్రి వివిధవిచిత్ర ప్రభాపటల జటిలంబులగు మణిభూషణంబులు దాల్చి ప్రాతఃకాలంబున నంతరిక్షంబు నలంకరించు భానుప్రభయుంబోలె నమ్మహామందిరంబు వెలుంగం జేయుచుండె నప్పుడప్పుడమికన్నె నవలోకించి భుజంబులం బరిష్వజించి శిరంబుమూర్కొని బాష్పధారాపూరితముఖియై కౌసల్య యిట్లనియె॥ (క) క్షితిలోనఁగులటలెంతయు ।

(*) కౌసల్య సీతకు హితోపదేశముఁ జేయుట. (*)

సతతమునిజ విభులచేత, సత్కృతలయ్యుం । బతికృచ్ఛ్రగతుండగుచో । క్షితితనయా నిగ్రహంబు,సేయుదు రంతన్॥ (తే,గీ) పార్థివాత్మజ మున్నలభర్తవలనఁ । బెక్కుసుఖములువడసియుఁ, బృథివిలోన । వరునకొక్కింతయాపద,వచ్చినప్పు । డతనివిడచుటకులటల, కాత్మగుణము॥ (తే,గీ) కల్లనిజముగఁ బల్కుట,కలుషవృత్తి । కఠినచిత్తంబుఁదాల్చుట,కపటబుద్ధి ।తవిలిపురుషునివంచించి,తనకుఁదలఁకు । వానిఁజేయుట కులటల, వర్తనములు॥ (క) విపరీతకర్మాయుక్తలు । కపటపచోరతలు కృతము, గానని కుమతు । ల్చపలాత్మలువారిమనః । కపటత్వము దెలియరాదు, గాపురుషులకున్॥ (తే,గీ) ధరనవిశ్వాసనీయలు, దురితచిత్త । లగుటఁగులకృత దానవిద్యాదికములు । సంగ్రహంబును నసతుల,స్వాంతవృత్తిఁ । గ్రమ్మఱింపంగఁ జాలవు,రాజతనయ॥ (క) సతులగు కాంతామణులకు । లితశమదమసత్యశీల,కృతములయందు।న్నతిసేయు నట్టివారికిఁ । బతియొక్కఁడెగతియు నతఁడెపరమార్థ మిలన్॥ (వ) కావున మత్తనయుండు ధనవంతుండైనను నిర్ధనుండైనను నీకు దైవం బట్లగుటంజేసి యమ్మహాపురుషునిఁ బరిచర్యాభక్తియోగంబుల నిత్యంబునుసేవింపుచుండుమనిపలికిన ధర్మార్థసహితంబైన యక్కౌసల్య వాక్యంబెఱింగి కృతాంజలియై యద్దేవికిట్లనియె॥ (మ) క్షితిలో మెచ్చుగనాకుఁ దొల్లిపతిసం, సేవావిధం బంతయుం । జతురత్వంబునఁదల్లిదండ్రులు మహా సంప్రీతితోఁ జెప్పిరా । గతిమీరిప్పుడుక్రొత్తఁజేసితిరి వే డ్కన్భక్తియోగంబుచేఁ । బతిశుశ్రూషయొనర్చుచుండెదజగ, త్ప్రఖ్యాతచారిత్రనై॥ (క) ధరణినతిదుర్జనులతో । సరిగాననుఁదలఁచితోఁకొ, శశిఁబాయనిత । త్పరమద్యుతిగతినేనును । దలఁకవతిఁ దు నిత్య, ధర్మమువలనన్॥ (ఆ,వె) వినుఁడుతంత్రిలేని వీణమ్రోయదురథాం । గములు లేనిరథము గదలలేదు । సుతులునూర్వురున్నఁ బతిభక్తిలేసితో । య్యాలిసుఖంపఁజాల దవనియందు॥ (క) జననీజనకులుతనయులు । ననుజులుమితసుఖము నిత్తు రంతియెవిభుఁడిం । దునునందమితసుఖదుఁడగు । ననిశంబె సాధ్విగొల్వ దాతనిభక్తిన్॥ (క) కృతధర్మపరాపరసం । చితపాతివ్రత్యధర్మ శీలనయిననే । మతినొండు తెఱఁగుఁదలఁతునె । పతియెసతులకేడుగడయువాఁడగుచుండన్॥ (వ) అనిపలికిన హృదయంగమంబులగు కోడలి పలుకులువిని శుద్ధగుణాఢ్యయగు కౌసల్య కనుంగొనల దుఃఖహర్ష సంభూతంబులగుబాష్పకణం

(*) రాముఁడు కౌసల్య నూరార్చుట. (*)

బులునించుచు సపత్నీమధ్యంబున నుండెనప్పుడు కల్యాణ గుణాభిరాముండగు రాముండు నిజజననికిం బ్రదక్షిణంబుఁ జేసి కృతాంజలి పుటుండై యిట్లనియె॥

(క) జననీశోకింపకుమా । జనకునిఁగనుఁగొనుము సత్యసంధుఁడు కరుణా । వన
ధిసుగుణుఁడీమహనీ । యునినఱమఱలేక ప్రోచు చుండుము భక్తిన్ ॥ (క) విను
ముచతుర్దశవర్షము । లనఁగఁజతుర్దశదినంబు లట్లగడపిచ । య్యనవత్తునం
తపడవీ । వనుమానముదక్కి యుండు మధికప్రీతిన్ ॥ (వ) మఱియునేకరాత్రం
బునందు నిద్రవోయెడు నీకుఁజతుర్దశఘటిక లెట్లుచను నట్లు చతుర్దశవత్స
రంబులుత్రుటిమాత్రంబుగాఁజనునందాఁకకనుంగవమూసికొని దుఃఖంబుగణిం
పకుండుమని సవినయంబుగాఁబలికి గ్రమ్మఱఁ బ్రదక్షిణంబు చేసి పరమ దుఃఖా
క్రాంతలై తన్నువిలోకింపుచున్న తక్కినతల్లులనందఱ నీక్షించి యేను సంవా
దంబువలన నొక్కింత యపరాధంబుఁ గావించిన నదియంతయు సంస్మరింపక
కృపఁజేసి యనుజ్ఞ యొసంగుదురుగాకయని పలికిన ధర్మయుక్తంబును సమీ
చీనార్థసమన్వితంబునైన రాముని వచనంబు విని శోకోపహత చిత్తలగుచు
నక్కుమారుని బహు ప్రకారంబులఁ బ్రస్తుతింపుచుఁ గైకేయి నిందింపుచు బ
హువిధాలాపంబుల విలపింపుచుండి రప్పుడు తదీయాక్రందిత నినాదంబు
క్రౌంచీనిస్వనంబుభంగిఁ జెలంగె నమ్మందిరంబు మురజపణవ మేఘఘోష స
హితంబై విలపిత పరిదేవనాకులంబై వ్యసనగతంబై యుండె నంత రాముం
డును లక్ష్మణుండును సీతయును పాదగ్రహణపూర్వకంబుగా దశరథునకుం బ్ర
ణామంబుఁజేసి కృతాంజలిపుటులై తల్లిదండ్రులకు శుశ్రూషయొనర్పక వనం
బునకుం జనవలసెఁగదా యనువిచారంబున దీనవదనులై ప్రదక్షిణంబుఁజేసి
యనుజ్ఞఁగొని పదంపడి మాతృదుఃఖసందర్శనంబువలన శోకసమ్మూఢుం
డై రాముండు సీతాసహితంబుగాఁ గౌసల్యకుం బ్రణామంబునుంగావించితో
డనె సుమిత్రచరణంబులకుం బ్రణమిల్లె లక్ష్మణుండును రామునియట్లకౌసల్య
కుం బ్రణామంబులాచరించి నిజజననియగు సుమిత్రచరణంబులు శిరంబునోఁకఁ

(*) సుమిత్ర లక్ష్మణునకు హితోపదేశముఁ జేయుట. (*)

బ్రణమిల్లె నపుడద్దేవి దుఃఖింపుచు నిజనందనుండగు లక్ష్మణునిశిరంబు మూ
ర్కొని ప్రేమాతిశయంబున నిట్లనియె ॥ (మ) క్షితినెవ్వాఁ డెడఁబాయ కెప్పు
డనురక్తిన్ జ్యేష్ఠుసేవించువాఁ । డతులశ్రేయమునొందుఁగావునసము ద్యత్ప్రీ
తితోనీవున । ద్భుతచారిత్రకుఁడైన రామునిపదాంభోజాతసంసేవనా । రతిచే
నెప్పుడుఁగాచుచుండుముమహారణ్యంబునం బుత్రకా ॥ (వ) పుత్రా నీవు సు



హృజ్జనంబునందుఁ బరమానురక్తుండవైనను వనవాసంబుకొఱకు నాచేతవిసృ
ష్టుండవైతివి రామసేవయందనవధానత్వంబుగావింపకుమతండు రాజ్యాభావం
బున వ్యసనియైనను రాజ్యప్రాప్తిచేత సమృద్ధుండైనను నీకుఁ బరమగతియై
యుండు నెవ్వండు జ్యేష్ఠవశగతుండై వర్తించు నతనికిఁ బరమశ్రేయంబు
ప్రాప్తంబగు నిక్ష్వాకుకులంబునం బుట్టినవారికి దానంబును యజ్ఞంబులయందు
దీక్షయు జ్యేష్ఠానువర్తనంబును రణంబులయందుఁ దనుత్యాగంబును బితృవా
క్యకరణంబును సనాతనధర్మంబుగావున రాముని సేవింపుచు వనంబునకుంజ
నుమనిపలికి వనవాసంబునందుఁ బితృమాతృ నగరస్మరణంబున మనశ్చాంచ
ల్యంబు గలుగునోయని శంకించి తత్పరిహారంబుకొఱకు వెండియు నిట్లనియె ॥
(తే,గీ) తనయశేఖరరాముని దశరథునిఁగ । గహ్వరీ పుత్రికను నన్నుఁ గాఁగ
దండ । కాటవి నయోధ్యఁగాహృద యమునఁనెఱిఁగి । భూరి సుఖలీల నడవికిఁ
బోయిరమ్ము ॥ (వ) అనిపలికి మఱియును ॥ (తే,గీ) రాజనందనదశరథు రా
మునిఁగను । నన్నుజనకాత్మజనుగాఁగ నయముతోన । యోధ్యనటవిఁగాఁ దలఁ
పుచు యుక్తభంగి । నన్నతోఁగూడిచనుముఘో రాటవులకు ॥ (తే,గీ) దశర
థకుమారరాముమా ధవునిఁగాఁగ । జనకపుత్రినిక్షీరాబ్ధి తనయఁగాఁగ । భూ
రిగహనంబువైకుంఠ పురముఁగాఁగ । నెఱిఁగి సుఖలీల వనమున కరుగుమీవు ।
(వ) మఱియు సపరిచారకా పరిచారకులగు గురువులయం దెవ్వండనువర్తిం
చుటకుఁ దగియెడువాఁడనియు నైహికసుఖరాజ్యభోగపారలౌకిక జ్యేష్ఠానువ
ర్తనలయం దెవ్వాఁడు గరీయుండనియు విచారింపుచు నరణ్యంబునకుం బో
యిరమ్మనిపలికి దీవించి సముచితప్రకారంబున వీడుకొల్పెనప్పుడు సుమంత్రుం
డు వినీతుండును వినయజ్ఞుండును ప్రాంజలియునై మాతలి యింద్రునింబోలె

(*) సీతారామలక్ష్మణులు రథారూఢులై తరలుట. (*)

రామభద్రునవలోకించి మహాత్మా నీకిష్టంబైనచోటికిఁ గొనిపోయెద నీరథం
బారోహింపుము కైకేయి వనంబునకిప్పుడేచనుమని పలికెఁగావున నద్దేవిచేత
నియోగింపఁబడిన చతుర్దశవర్షపరిమిత వనవాసవ్రతంబు నారంభించుట
కిదియె మొదలనిపలికె నప్పుడు రామునిచేత ననుజ్ఞఁగొని సీతాదేవి సూర్య
సంకాశంబైన కాంచన రథంబెక్కె నాసమయంబున ॥ (క) వనవాసమున
కువేడుకఁ । దనవిభునింగూడియరుగఁదలఁచినధాత్రీ । తనయకుఁగృపచేదశరథ ।

మనుజపతియొసంగెవ(స్త్ర) మణిభూషణముల్ ॥ (వ) అంత రామలక్ష్మణులు దివ్యాయుధపరిష్కృతంబును దివ్యఖడ్గకవచ సమన్వితంబుసుజామీకరవిభూషితంబునగు నమ్మహారథం బారోహించి రిట్లు ముప్వురు సముచిత ప్రకారంబున రథారోహణంబుఁ జేసినంజూచి సుమంత్రుండు యుగ్యంబుల పగ్గంబులువదలి యతిత్వరిత గమనంబునందోలిన నది మిన్నునంజను భానుని రథంబు తెఱంగున దుర్నిరీక్ష్యంబై పోవుచుండెనప్పుడు రాముని వనప్రయాణంబుఁ జూచి పురంబునంగలబాలవృద్ధజనంబులును గజాశ్వాదికంబులును నుత్సవార్థంబరుగుదెంచి నజానపదులునుమూర్ఛాక్రాంతులైహాహాకారంబులవిలపించిననయ్యాక్రందనస్వనంబును హయశింజితనిర్ఘోషంబును మత్తద్విప బృంహితంబులును బురంబునిండి చెలంగె నప్పుడు పౌరులు దుఃఖపీడితు లగుచు రథంబు వెనుకొని బాష్పపూర్ణవదనులై యట్టులెత్తి సుమంత్రు నుద్దేశించి యిట్లనిరి ॥ (తేగీ) విమలచారిత్ర హరుల పగ్గములు పట్టి । మందగతిఁదోలు మయ్యయ్యా, స్యందనమ్ము । రామచంద్రుని మోము నేత్రముల కఱవు । దీరఁ గనిసంతసంబునొందెదము గాని ॥ (వ) అనిపలికి మఱియును ॥ (తే,గీ) దేవగర్భసమానుఁడు ధీరవరుఁడు । రాజసమ్మతుఁడైన యీరాముఁడడవి । కేగఁ గనుఁ గొనికౌసల్యహృదయ మగల । దాయసాకృతి గాఁబోలు, నకటదలఁప ॥ (క) ఈయవనికన్య రాముని । ఛాయపగిది ననుసరించి, సమరస బుద్ధిం । బాయక కొల్చుచువనవా । సాయాసము నోర్చిధన్యయయ్యెడు సుమ్మీ ॥ (క) ప్రియవాదియైన రాముని । నయమొప్పఁగఁ గొల్చి లక్ష్మణకుమారుఁడుదా । భయదాటవికిం బోవ హ్వా । దయమునఁ దలపోయ కలన, ధన్యుండయ్యెన్ ॥ (ఆ.వె) రాజపూజ్యుఁడైన, రామభద్రుని భక్తి । ననుసరించి ఘోర, వనికిఁ బోవు । టదియ పరమసిద్ధి, యదియ మహోదయం । బదియ స్వర్గమార్గ, మదియ హితము ॥ (వ) అని పెక్కు చందంబుల దీనస్వరంబున విలపింపుచుఁ గన్నీరునించుచు రాముని రథంబు వెనుకొని చనుచుండిరట దశరథుండు భార్యాసహితుండై శోకావేశంబున రామునిం గూడఁ జనియెద నని మందిరంబు వెడల గమకించి యగ్రభాగంబునఁ బురుషకుంజరంబు నిరుద్ధం బగుచుండఁగ రేణువులుదుఃఖించిన తెఱంగున రోదనంబు సేయు వారి మహాధ్వనివిని ఖిన్నుండై రాహుగ్రస్తుండైన చంద్రుని చందంబున నొప్పియుండె నంత రఘుపుంగ



వుండు రథంబు రయంబునందోలుమని యాజ్ఞాపించిన సుమంత్రుం డట్ల గావింప రథచక్రయుగ్మ సముద్భూత మహీపరాగపటలంబు నీరంధ్రంబుగఁ గప్పినఁ బౌరజనలోచన గళద్బాష్పధారాసారంబున నది యడంగినఁ బదంపడి సకలజనంబులు దుఃఖపీడితులై హాహాకారంబులతోడ విలపించిరప్పుడు మీనసంక్షోభచలితంబులగు పంకజంబులవలనం దొరఁగు సలిలంబునుం బోలెఁ గామినీనయనంబుల వలన నాయాససంభవంబగు బాష్పజలంబు సాంద్రంబుగాఁ గురిసె నంత మహీనాథుం డేకచిత్తగతంబైన పురంబు నాలోకించి దుఃఖాతిశయంబునఛిన్నమూలంబైన పాదపంబు మాడ్కి ధరణిపయిం బడియె నప్పుడు పౌరజనంబులు భృశదుఃఖితుండైన దశరథు నవలోకించి రామునిరథంబు వెనుకొని యుచ్చైస్నాదంబున హాహాకారంబులుసేయుచుంజనుచుండిరియంతఃపురకాంతలు రామ లక్ష్మణ జానకీ కౌసల్యలం బేర్కొని యొక్కపెట్ట నార్తనాదంబున రోదనంబుఁ గావించి రమ్మహాధ్వని విని రాముండుమఱలిచూచి విషణ్ణుండైన జనకుని భ్రాంతచిత్తయైన జనయిత్రి నవలోకించి తదీయదుఃఖాతిశయంబు సహింపంజాలక తోత్త్రార్దితంబైన మహాద్విపంబు చందంబున సంతప్తచిత్తుండై పాశబద్ధంబైన బాలాశ్వంబు పోలికఁ దల్లినుద్దేశించిధర్మపాశబద్ధుండై సంకుచిత దర్శనవ్యాపారుం డయ్యెనప్పుడు సుమంత్రుండు రామ ప్రచోదితుండై రథంబు రయంబునం దోలిన నవ్వేగిరపాటునకుఁ దలంకుచు సీతారామలక్ష్మణులం బేర్కొని దుఃఖింపుచుఁ గన్నీరు నించుచు గౌసల్య పుత్రవత్సల యగుటం జేసిరామవియోగంబు సహింపం జాలక బద్ధవత్సయైన గోవు పగిది దుఃఖపరిత్రస్తయై రాముని వెంటం జనియెద ననిగ్రహంబు నిర్గమించి రోదనంబుసేయుచు వాతాందోళిత వనలతభంగి నడలుచువచ్చుచున్నయమ్మహాదేవి నచ్చటి వారడ్డంబు వచ్చి మఱల్చిన మఱలంజాలక విలపింపుచుండెనయ్యవస్థ విలోకించి రాముండు పరమదుఃఖితుండై మఱలి మఱలి చూచుచుం బోవుచుండె నప్పుడు నిలు నిలు మని పలుకుదశరథుని వాక్యంబును రథంబురయంబునం దోలుమనియెడు రామవాక్యంబును విని సుమంత్రుండు నెద్దియుం జేయ నేరక చక్రమధ్యంబునం జిక్కినపురుషునిచందంబున దశరథ రామవచన మధ్యంబునం జిక్కి యాందోళింపుచున్నం జూచి ॥ (ఆ,వె) ఏను మాటిమాటి, కిటు విలపింప నా । మాట వినకపోవ,

(*) రాముఁడు సుమంత్రుని రథమును వేగముగఁ దోలు మనుట. (*)

మంచిదగునె । తనయయనుచునిట్లు తండ్రిచేఁగరముపా । లభ్యుఁడయ్యెఁ జాల రామవిభుఁడు॥ (క) పరువడిఁదనమదిలోని । స్థిరగతిననుభూయమాన శోకంబునకుఁ । జిరకాలావస్థానము । కరమిదిదుస్సహమటంచు గణుతించి తగన్॥ (వ) సుమంత్రునవలోకించి॥ (మ) ధరణీశుం డెడఁబాయలేక మనలన్ దాక్షిణ్యావిస్ఫూర్తిం జే । మఱలంజీరుచునున్న వాఁడుమనకు న్మర్యాదగాదట్టిచేఁ । తరథంబు న్వేసఁబోవ నిమ్మనినతాతండట్లగావింపఁద । త్తురగవ్రాతము వాయులీలఁ జనియెం ధూళిప్రతిచ్ఛన్నమై ॥ (వ) ఇట్లతిత్వరితగమనంబునంబోవుచుఁదన్నుంగూడి వనంబునకుంబఱ తెంచెదమని ప్రార్థింపుచువచ్చువారిసామంతబాంధవ మంత్రిసంఘంబుల నంతఃపురజనంబుల నుపజీవి సహస్రంబుల భృత్యులఁ బౌరజానపదజనంబుల నిలువనియమించిన వారందఱు బాష్పధారా పూరితముఖులై యతనిశాసనంబు నుల్లంఘింపంజాలక నంతనంతనిలువంబడి యుఁజిత్తవృత్తులంగ్రమ్మఱింపంజాలకరథమార్గాసక్త వీక్షణులై యుండిరి పౌరజనంబు మఱలక వెంటంబోవుచుండె నప్పుడు పుత్రవియోగసంజాతశోకంబునం బ్రటిలిపడుచున్న దశరథునవలోకించి శాస్త్రార్థకథనంబుననూనయింపుచుమంత్రిపుంగవులిట్లనిరి ॥ (క) జననాథ యేమివగచెదు। తనయుఁడు దూరంబుచనియెఁ దడయకమఱల । న్జనుదెంచిన పుత్రునిఁగని । మనమున నలరుదువుగాక మననంబేలా ॥ (వ) అనియాశ్వాసించిన వినియప్పుడమితేఁడు విషణ్ణముఖుండై యుండె నంతనంతఃపురకాంతలు పరమ చింతాక్రాంతలై యార్తనాదంబులుసెలంగఁ దమలోనిట్లనిరి ॥ (క) దిక్కెవ్వడు దుర్బలురకు । దిక్కెవ్వడనా

—(*)అంతఃపురస్త్రీలు రామవివాసనంబునుంగూర్చి విలపించుట.(*)—

థులకుసుధీజనములకుం । దిక్కెవ్వఁ డట్టినాథుం । డొక్కటనేఁడెందుఁ బోవుచున్నాఁడకటా ॥ (క) ఎంతయభిశప్తుఁడైనను । బంతంబునఁగ్రోధకరణ పరివర్జితుఁడై। సంతతమనుగ్రహమెమది । నెంతయుఁజింతుంచునాథుఁ డెందరిగెడినో ॥ (తే, గీ) ఏమహాత్ముఁడుతనతల్లి నెట్లుప్రోచు । నట్లనారతమధిక భక్త్యాదరముల । మనల రక్షించునట్టి క్షమాసుతాధి । వల్లభుండెందుఁ జనుచున్నవాఁడునేఁడు॥ (తే,గీ) మఱియుఁగైకేయిచేఁ గ్లిశ్యమానుఁడైన । యవని పతిచేఁబ్రచోదితుం డగుచునెవ్వఁ । డఖిలజనులకు రక్షకుం, డట్టిరాముఁ । డుగ్ర



కాననమునకేగు, చున్నవాఁడు ॥ (తే,గీ) అకటదుఃఖసంతప్తుఁ డయ్యెరాజు । సత్యధర్మవిచారుండు, సర్వసముఁడు । సూరినుతుఁడైన రాముఁడు, ఘోరవనికి । నొంటిఁబోవఁ గనుంగొను,చున్నవాఁడు॥ (వ) అనిబహుప్రకారంబులవివత్సలగు ధేనువులచందంబున విలపించుచు రోదనంబుఁ జేసిన వినిపుత్రశోకాభిసంతప్తుఁడైన మహీవరుం డినుమడిగాదుఃఖింపుచుండె నప్పుడు పట్టణంబునంగలగృహమేధులగు విప్రులగ్నిహోత్రకృత్యంబులు నన్నపానాదికృత్యంబులు మఱచి యిచ్చవడియుండిరి రామశోక కర్శితుండైన వాఁడుపోలె సూర్యుండస్తమించినట్లుండె మృగాశ్వకుంజరధేనుకదంబంబులు కబళంబులకుం బాసికన్నీరునించుచు వత్సంబులఁగైకొనకుండె నంగారకుండును త్రిశంకుండును బుధబృహస్పతులును దక్షిణగ్రహంబులన్నియు వక్రగతిచేతసోమునాక్రమించిదారుణంబులయియుండె విశాఖాప్రభృతినక్షత్రంబులుదారుణగ్రహపీడితములై పొగలుమియుచు మార్గంబునకుందప్పియుండె మేఘంబులు వాయుహతంబులై సముద్రంబునంబడుచుండె మఱియు సకలజంతుస్వాంతసంచార చతురుండైన రాముఁడు వనంబునకుం జనుచుండ నగరంబు కాలికానిలవేగంబున నుద్ధితంబైన సముద్రంబు భంగిఁజలించి నట్లయ్యె హరిదంతంబులు తిమిరసంవృతంబులై పర్యాకులంబు లయ్యెఁ బట్టణంబునం గల సర్వజనంబులు గుంపులుకట్టి కటటా యనువారును నింతపుట్టునె యనువారును నింకనేమిగలదనువారును దశరథుం డెంత కఠినాత్ముం డయ్యెననువారును నింతకుం గారణంబు పాపాత్మయైన కైకేయి గదా యను వారును దైవంబునుం దిట్టువారును సతీసుత బంధుమిత్రుల యందు మమత్వంబు విడిచి గృహకృత్యంబులు దలంపక రాముని మంగళగుణకీర్తనంబు సేయుచు నిరానందులై కన్నీరు నించుచు బహుప్రకారంబుల విలపించువారునై యుండిరి పవనుండు శీతలుండై వీవకుండెఁ జంద్రుండు సౌమ్యదర్శనుండు గాకుండె సూర్యుండు తపింపకుండె మఱియుఁ బౌరులు రాము నట్ల కుమారులు తల్లి తండ్రులను గైకేయి భంగి యువతులు భర్తలను గౌసల్యాదశరథుల కరణిఁ దల్లితండ్రులు కుమారులను గుమారులును భరతుని చందంబున నన్నదమ్ములను బరిత్యజించిరి సాగరసరిద్ద్వీపవనశైలసహితంబుగా మహియెల్ల సంచలించెనప్పుడు ॥ (క) అనఘాత్ముఁడైన రాముఁడు । జనకజతోఁ గూడి వనికిఁ,జనియెడు తఱిఁ జే । తనములు దుఃఖించె ననం । బని లేదు

జడంబు లెల్లఁ బ్రాన్పడి యుండెన్ ॥ (క) పొందుగ నరిగెడు రాముని । స్యం
దనగణచక్రయుగళ, సంజాతరజం । బెందాఁక దోఁచెనురువడి । నందాఁకమ
రల్పఁ డయ్యె, నధిపుఁడు చూడ్కిన్ ॥ (చ) అనఘుఁడు పుత్రదర్శనము నం
దు మహావ్యసనంబు గల్గునీ । మనుకుల నేతకంచు గరిమం దలపోసి మహీపరా
గ మా । మనుజవరేణ్యుఁ డెందనుక, మక్కువతోడ సుతు న్గుణాకరుం । గ
నుఁగొనుచుండె నందనుక, గాఢతరంబుగఁ బర్వె నార్తిన్ ॥ (తే.గీ) రజము
గనుపట్టు నందాక,రాజవర్యుఁ । డనఘునిఁ గుమారుఁ గనుఁగొని, యంతకంత
కది యడంగిన భూరిశో, కార్తుఁడగుచు । మూర్ఛ పైకొన నంతలోఁ, బుడ
మిఁ బడియె ॥ (వ) ఇట్లు మూర్ఛాపరవశుండై నేలంబడి యున్న నిజవల్లభు
నిం జూచి కౌసల్యదాపటను గైక వలపటం గ్రుచ్చి యెత్తి యాసీనుం గావిం
చినఁగూర్చుండి యమ్మహీపతిశోకంబు పెంపున వ్యథితేంద్రియుం డగుచుఁ గైకే

## (*) దశరథుఁడు కైకేయిని దూఱుట. (*)

యి నవలోకించి యెట్లనియె ॥ (క) ఓకలుషచిత్త నన్నుం । దాఁకకు నిజక
రము సోఁకఁ, దనువంతయు న । స్తోకగతి వాఁడి సూదులు । సోఁకిన యట్లా
ర్తినొంది, స్రుక్కెంగడిమిన్ ॥ (వ) నీవదనంబుఁ జూడ నొల్ల నాకుఁ బత్నివి
గావు బాంధవవుగావని పలికి కోపం బగ్గలం బగుటయు నంతనిలువక ॥ (క)
సువిచారుఁడైన రాముని । నవిచారత నడవి కనిపి, నందున వంశ । ఘ్నివిబం
ధుఘ్నివిభర్తృ । ఘ్నివివైతివి నిన్నుఁ జూడ, నేర్తునె యింకన్ ॥ (తే, గీ)
జగదుపక్రోశితాచార,సరణి నొంది । త్యక్తకులధర్మ వైతివి, దానఁ జేసి ।
యాలి వని నమ్మఁ జనునె నీ,యాననంబుఁ । గన్నసురఁ ద్రావి నంత యఘంబు
రాదె ॥ (చ) పురుషులచే ధరిత్రిపయిఁ, బొల్పుగనగ్ని సమక్షమందునుం ।
గరము గ్రహింపఁగాఁ బడిన, కాంతలలోఁ బతికి న్నిరంతరం । బఱమఱలేక ధ
ర్మమును, నర్థము కామముఁగూడఁ బెట్టునే । ర్పరి వొక నీవె కాకకుల,
పాంసని వేటొక తెందుఁ గల్గునే ॥ (వ) తొల్లి వహ్నిసమక్షంబున ధర్మా
ర్థకామంబులయందు నీతోడఁ జరించెద నని పలికి భవత్పాణిగ్రహంబు చే
సితి నింక మీఁద నిహసౌఖ్యకరంబులైన భవత్క్రీడాది వ్యవహారంబులును బర
లోకసాధనంబులైన భవదగ్ని హోత్రాదికర్మంబులును బరిత్యజింపం గల
వాఁడ నని పలికి వెండియు నిట్లనియె ॥ (క) భరతుఁడు రాజ్యస్థుండై । చిర



భక్తిని నాకుఁ బూజ, సేయుటకొఱకై । కరమొద్ది నొసఁగునది నే । నరయుదు
జన్మాంతరమున, కయ్యెడుననుచున్ ॥ (వ) మఱియు భరతుండు సామ్రాజ్యం
బుఁ జేకొని సంతుష్టుం డయ్యె నేని మన్మరణానంతరంబున నతండు పితృప్రీత్య
ర్థం బయ్యెడి యొసంగు నది మత్ప్రీతి కొఱకుఁ గాకుండుం గాక యని యి
ట్లు కైకేయిని నిందింపుచు రాముని పిఱుందం బోవనుద్యోగించిన నప్పుడు కౌ
సల్య పతికడ్డంబు వచ్చి మఱల్చినం బ్రతిహతగమనుండై కామాతిశయంబున

## (*) దశరథుఁడు రాముని బేర్కొని విలపించుట. (*)

బ్రాహ్మణుం జంపిన వాని యట్ల కరంబునఁ జిచ్చునంటినవానిక్రియఁ గుమారు
నిం దలంచి సంతపించుచు రాహుగ్రస్తుండైన భానుని చందంబున దీనవదనుం
డై రథమార్గంబుఁ జూచి యెలుంగెత్తి రామునిం బేర్కొనుచు నక్కుమా
రుండు పురం బతిక్రమించినం జూచి శోకవేగంబున నిట్లని విలపించె ॥ (చ)
అరదము దూర మయ్యె జవ,నాశ్వము లద్భుత వేగలీల బం । ధురగతిఁ బో
వుచున్న యవి, ధూళికతంబున నాకుమారకుం । డరసినఁ గాన రాఁడు తను,
వంతయు నేర్చెఁ దొడంగె నింక నే । తెరువునఁ బోదు నెవ్వరిఁక, దిక్కెకటా
విధి నేమి సేయుదున్ ॥ (చ) సరసపదార్థము ల్గుడిచి, సన్నపుటొల్లియ
గట్టి దీప్తహే । మరచిత సౌధభాగముల, మంజుల శయ్యను బవ్వళించు నా ।
నరసుతుఁ డాకలంబుఁదిని, వల్కముఁ దాల్చి మహీజమూలమం । దురుకఠి
నాత్మతల్పమున,నొప్పఱి యెట్లు వసించు నక్కటా ॥ (చ) అడవిఁ జరించు
నప్పుడు మృగారవము ల్వినువేళ నాఁకటన్ । దడువడు వేళఁ గంటకపథం
బున నేగెడు వేళ నెండచే । బడలినవేళ నాకొడుకు, భావమునందు ననుం ద
లంచి హా । యిడుములఁ బెట్టెఁ దండ్రియని, యించుకయైనఁ దలంపకుండు
నే ॥ (క) జనకసుత యెంతఁ జెప్పిన । వినక మగనిఁ గూడి ఘోర, విపినంబు
నకుం । జనుచున్న దతి సుఖోచిత । మనమున దుఃఖించి యెంత, మఱుఁగునొ
యచటన్ ॥ (వ) అని విలపించి కైకేయి దిక్కు మొగంబై యిట్లనియె ॥
(చ) అకలుషచిత్తుఁ డంచితగుణాస్పదుఁడైన సుతుండు కాననో । ర్వికిఁ జ
నియె న్మనంబు చెయిఁ, బెట్టి కలంచిన రీతిఁ జాలఁ ద్రి । ప్పకొనఁ దొడంగెఁ
బైపయిని, మూర్ఛముసుంగిడుచున్న దిప్పుడం । బకములు గాన రావు ప్ర
సభంబున నంగములార్తి నొందెడిన్ ॥ (వ) నీవు విధవవై పతిపుత్ర పరిత్య

క్తంబైన రాజ్యంబు పాలింపు మని బహుప్రకారంబుల విలపించుచు నచ్చోటనిలువక శూన్యచత్వరవేశ్మాంతంబును సంవృతాపణదేవతంబును గ్లాంతదుర్బలదుఃఖార్తజనంబును నగు పురంబుఁ గనుంగొని దుఃఖింపుచు సూతికాగృహంబునుం బోలెఁ గశ్మలంబై యున్న యంతఃపురంబున కరిగి క్షోభించిన మహా

(*) దశరథుఁడు కౌసల్యా సదనమున కరుగుట. (*)

హ్రదంబు చందంబున సుపర్ణాహృతంబైన పన్నగంబు కైవడి రామలక్ష్మణవైదేహీ రహితంబై దిక్కఱి యున్న దాని నవలోకింప నొల్లక దౌవారికులం జూచి కౌసల్య సదనంబునకు నన్నుం దోడ్కొని పొండొండు చోట నీమనఃపరితాపంబు దీఱదనిన వారు రయంబున వామ దక్షిణ పార్శ్వంబులఁ గ్రుచ్చి పట్టి తోడ్కొనిచనిన నద్దేవి మందిరంబుఁ బ్రవేశించి తల్పంబునం దనువ్రాల్చి యసంవృతమేదినిం బడి పొరలుచు నడలూనిన చిత్తంబున భుజంబత్తి దీర్ఘస్వరంబున రోదనంబు సేయుచుఁ బెక్కువిధంబులఁ గుమారుని గుణంబు లగ్గింపుచుఁ బుత్రవియోగ సంజాత శోకానలంబునం గాఱియపడుచుండ రాత్రిసమయం బయ్యె నారాత్రి దశరథుని పాలికిఁ గాళరాత్రియై దోఁచె నప్పుడన్నరపతి కౌసల్యకిట్లనియె ॥ (మ) అతివారాముని వెంటనంటినమదీయాలోకమాశానుష । క్తి తదీయాకృతిపై రమింపుచును దృష్టిం జెందకీవేళకున్ । ధృతిచేఁ గ్రమ్మఱ దట్లుగావుననిను స్వీక్షింపఁగాఁ జాలస । మ్మతిచేనీదు కరంబునం దనువు సంభావింపుమా యిత్తఱిన్ ॥ (వ) అనినియోగించిన నద్దేవి రామగుణ కథన పరవశుండై తన్నామంబునె పేర్కొనుచున్న దశరథుని దురవస్థఁ జూచి బహుప్రకారంబుల నాక్రందనంబు సేయుచుఁ గన్నీరునించుచు వేఁడినిట్టూర్పులు పుచ్చుచు శోకభారావసన్నుండైన యమ్మహిపతిశరీరంబు పాణితలంబునఁ బరిమార్జించుచు నిట్లనియె ॥ (క) వీరోత్తమ రామునిపైఁ । గూరిమి యించుకయు లేక గుబుసము వీడన్ । ఘోరవిషము గ్రక్కెడు క్రూ । రోరగిగతిఁ గైకగనలు చుండుం గాదే ॥ (ఆ,వె) అట్టిదానిఁ

(*) కౌసల్య పుత్రునిఁ బేర్కొని విలపించుట. (*)

గూడి యధిప నాకేగతిఁ । బూనిపొత్తుమనఁగఁ బోలునకట । క్రూరపన్నగంబు చేరినయింటిలో । నూహఁ జేసి మనుజులుండ వశమె ॥ (తే,గీ) తవిలిరాముని గైకకు దాసునిఁగనొ । నర్పవైతివి యటులైన నగరమందు । భైక్షవృత్తి



జరింపుచు భవనమందె । యునికిఁ జేసిన వీక్షింపుచుండుదుఁ గద ॥ (వ) మఱియు నాహితాగ్నియగు వానిచేత దర్శపూర్ణమాసరూపపర్వంబునందు ప్రోహిగత తుషాజాలంబట్లు రక్షోభాగత్వంబుచేత నిరస్తంబయ్యె నట్లనీచేతఁ గైకకుం బ్రియంబు సంపాదించుటకై రాముండు స్వరాజ్యావస్థానంబు వలనను స్వగృహావస్థానంబువలనను బరిత్యక్తుండై యథేష్టంబుగా రాక్షసభాగత్వంబున వినియుక్తుండయ్యెనని పలికి వెండియు నిట్లనియె ॥ (క) గజరాజ గమనుఁడమల । ద్విజరాజముఖుండు వినుత వీర్యుండు భృత । ద్విజుఁడగు నా తనయుఁడు జన । కజతో నెటు కూడి నిల్వఁ గా నేర్చు వనిన్ ॥ (క) కట్టా కైకేయికిఁ గాఁ । బుట్టెన్నఁడు దుఃఖములను బొందని వారిం । గట్టిఁడి తనమున నిప్పుడు । నట్టడవికిఁ బంపనీకు న్యాయమె యధిపా ॥ (వ) అని దూరవగచి యంతనిలువక ॥ (చ) తరుణులు రూపవంతులును దంచితమూర్తులు రామలక్ష్మణుల్ । వ్వరఫలకాల మందిటువి వాసితులై రటురత్నహీనులై । పరువడిఁ గందమూలఫల భక్షకులై యలకాననంబులోఁ । గరమతిదీనవృత్తి నిలుఁ గానక నెట్లు వసింతురక్కటా ॥ (ఉ) తమ్ముఁడు ప్రీతితో బహు విధంబుల సేవయొనర్చుచుండనం । దమ్ముగ సీతఁ గూడి ప్రమదంబున నిష్టసుఖైకశీలుఁడై । సమ్మతితో నయోధ్యఁ గల సర్వజనంబు నుతింప నాధిప । త్యమ్మొనరించు కాలము జనాధిప యెప్పుడు జూడఁ గల్గెడిన్ ॥ (వ) అని యాసపెంపునం బలికి వెండియు ॥ (ఉ) క్రన్నన రామలక్ష్మణుల రణ్యము వెల్వడి వీటికి రాకెదా । రెన్నఁడు వత్తురిష్టసుఖ మెన్నఁడు గాంతురు భానుమత్కులం బెన్నఁడు తేజ మొందు మను జేశ్వర మత్ప్రథు దుఃఖశోకమిం । కెన్నఁడు దీఱు బంధుజను లెన్నఁడు గాంతురనంత మోదమున్ ॥ (క) పంకజపత్ర నయనుని నకళంకేందు సమానముఖుని రమణీయగుణా । లంకృతుని నా కుమారుని । నింక విలోకింపఁగలనె యీజన్మమునన్ ॥ (క) వనవాసము సల్పి రయం । బునఁ దమ్ముఁడు గొల్వ సతిని మున్నిడుకొని చ । య్యన మఱల వచ్చు రాముని । గనుఁగొను భాగ్యంబు నాకుఁ గలదో లేదో ॥ (ఉ) పొందుగ రామలక్ష్మణులు భూమికుమారియు రాజవీధి నా । నందముతోడ రాఁగని మనంబునఁ గోర్కులుపల్లవింపఁగాఁ । జందురుఁ గన్న యోషధుల చందము నొంది పురీకులాంగన । బృందముఁ గట్టి ప్రీతిమెయి నెన్నఁడు గాంతు రభీప్సితార్థముల్ ॥ (ఉ) పన్నగ రాఘవుండడవిఁ బాసిపురంబున కేగుదెంచియు । భ్యున్నత వైభవస్ఫు

రణ నుర్విశకుమారికతోడ సౌఖ్యవా । రాన్నిధి నోలలాడుచుఁ దిరంబుగ రాజ్యము సేయుచుండనా । కన్నులు చల్లగాఁగనిసుఖస్థితిఁ బ్రీతియొనర్పఁ జెన్నఁడో ॥ (మ) రమణీయోజ్జ్వల కుండలంబులలరన్ రాముండు సౌమిత్రిఖ । డ్గముచాపంబునుదాల్చి శృంగవదగా, కారంబులం బొల్చుచుం । బ్రమదం బొప్పఁగ విప్రకన్యకల పుష్పంబుల్ఫలంబుల్ గ్రహిం । చిమహార్ఘంబు ప్రదక్షిణంబుగఁ బురిస్సేవించుటెంకెన్నఁడో ॥ (తే,గీ) ప్రాయమున శక్రతుల్యుండు ప్రజ్ఞచేతఁ । బరిణతుండు ధర్మజ్ఞుండు నిరుపమాన । తేజుఁడగు రాముఁ డెపుడరు దెంచినాడు । బ్రోలమూఁడేండ్ల బాలుని లీలనాడు ॥ (సీ) నరనాథ తొల్లి నందనులు తల్లులపాలుఁ గ్రోలునప్పుడు తదురోజములను । గప్పితిఁ గాఁబోలుఁ గాకున్నచో లేఁతదూడగల్గినమంచి పాఁడిమొదవు । చందాననధిక వత్సలత నొప్పెడు నేను మృగరాజుచేఁ గోవు పగిది భూరి । కల్మషమతియైన కైకేయిచే ముద్దుకొమరునిఁబాసి శోకమునఁ గుందఁ ॥ (తే,గీ) గావలసె బుత్రుఁ డొక్కఁడే కాని వేఱె । యొకఁడు లేదట్టి సుగుణాభి, యుక్తుఁ బాసి । యెట్లు బ్రతుకుదు శోకాగ్ని, యేర్చుఁ దొడఁగె । నేమి సేయుదు నెద్దిదిక్కిందుఁ, జొత్తు ॥ (తే,గీ) రాజవర్య నిదాఘకాలంబునందు । నుత్తమప్రభుండైన సూర్యుండు తిగ్మ । కరముల ధరిత్రి నింబోలె గాఢశోక । మేర్చుచున్నది యధిపనన్నెట్లు పాయు ॥ (వ) అనిబహుప్రకా

(*) సుమిత్ర కౌసల్య నూఱడించుట. (*)

రంబుల విలపించుచున్న కౌసల్యనవలోకించి యుపశమనవాక్యంబుల ననూనయింపుచు సుమిత్ర యిట్లనియె ॥ (ఉ) మంచివివేకయుక్తవిటుమానిని ప్రాకృతకాంతయట్లదుః । ఖించెదవేల నీసుతునిఁ గేవలమర్త్యునిఁగాఁ దలంచితో । కాంచనశైలధీరుఁడు నకల్మషబుద్ధి మహానుభావుఁడ । భ్యంచితసద్గుణాభిరతుఁ డాతని కెందును గీడుల్గునే ॥ (మ) అతులాముష్మికసౌఖ్యమెంచి ఘనశిష్టాచారధర్మాధ్వసం । స్థితుఁడై తుచ్ఛసుఖంబుఁ గోరక పితృ, స్నేహంబున న్మేదినీ । పతివాక్యంబొనరింపఁ బూనినయమొ ప్పంగాన కేగెన్భవ । త్సుతుఁడా నీతివిచారుఁ బాయుటకున్నై, శోకింపఁగానేటికి ॥ (మ) ముదితా లక్ష్మణుఁడన్న పైఁగలదయా మోహంబుల్ల జేసిత । త్పదపద్మంబులు గొల్చుచుఁ ఫలములుద్యత్ప్రీతి నర్పింపుచుఁ । ముదమేపారన హర్నిశంబు శరిరిమైయమున్నాఁడి రక్షింపుచుం । డదవ క్షోణిని వాసమాతనికి సంతాపంబుఁ గావించునే ॥ (క) పతిసేవ సేయుతలఁపున ।



క్షితిసుతధర్మాత్ముఁడైన శ్రీరామునిస । మ్మతితో వెనుకొని విపిన । క్షితికిం జనుచున్న దేల చింతింపంగన్ ॥ (తే,గీ) తామరసనేత్ర సత్యంబు దమముశమము । నార్జవముశీల శ్లాఘ్యంబు లతనియందె । సన్నివిష్టంబులై యుండు జగములందుఁ । బరఁగఁగీర్తిధ్వజంబును బాదుకొలిపె ॥ (చ) అతనిప్రతాపమున్న తిమహాత్వముశౌర్యమెఱింగి కానన । క్షితిసహిమాంశుఁ డంశువులచేతఁ దపింపఁగఁ జేయఁజాలఁడం । చితగతి గాడ్పు రేపవలు చిత్తహరంబుగ వీచుచుండు । సమ్మతి జలజారి రాత్రులస మద్యుతివెన్నెల గాయునిత్యమున్ ॥ (మ) అనిలోఁ గూలిన శంబరాత్మజుని దైత్యశ్రేష్ఠు నీక్షించి చ । య్యనవవ్వానికి భారతీ ప్రియుఁడు దివ్యాస్త్రింబు లర్పించెన । య్యనఘుండా ధ్యుఁడు రాఘవుండు నిజబాహాశౌర్యమేతోడుగా । వనదేశంబుననింటనున్నపగిదిన్ వర్తించు నిర్భీకుఁడై । (క) భువి నెవ్వని శరపథముం । గవిసిపగతులంతకాంతికఱ్ఱులగు దురా । రవికులపతి శాసనమం । దవనియెటులనిల్వఁ బోలదంభోజాక్షీ ॥ (తే,గీ) వనితయెవ్వాని శౌర్యమవార్యమేవి । భూతకల్మషు తేజంబు దుర్నిరీక్ష । మారఘుస్వామి వనవాస, మర్థిసలిపి । యవలఁ గైకొను సామ్రాజ్య, మది నిజంబు ॥ (చ) ఇనునకినుండు నీశ్వరున, కీశ్వరుఁ డగ్నికి నగ్ని కీర్తికి । న్ఘనమగు కీర్తి గహ్వరికి, గహ్వరి లక్ష్మికి లక్ష్మి పెద్ద వే । ల్పున కిలువేల్పు భూతములలో ఘనభూతము నీకుమారుఁడ । య్యనకులనేత తోడ సరి, యెవ్వరు రాష్ట్రమునంబురంబునన్ ॥ (చ) మెలపుగ లక్ష్మి తన్నధిగమింప మహీసుతఁ గూడి రాఘవుం । డిలకభిషిక్తుఁడై జనుల, కేలికగాఁ గలఁడేల సందియం । బలికచ పౌరజానపదు, లాతని కభ్యుదయంబుఁ గోరి ని । శ్చలమతి సర్వదేవతల, సన్నుతి సేయుచునున్నవారొగిన్ ॥ (చ) అనుపమ శోకవేగహతు, లై పురిలోఁగలవార లెవ్వనిం । గనుఁగొని యశ్రుబిందువులు, గాఱఁగ నేడ్చుచు నున్నవారలా । యనఘుఁడు లక్ష్మితోడ జన, కాత్మజతోడ ధరిత్రితోడ సాం । పెనయఁగఁ గూడి రాజ్యమున, కేలికగాఁ గలఁడెన్నిమూఁడఁగన్ ॥ (తే, గీ) అంబురుహనేత్ర వల్కల, మద్దిదాల్చి । వనమునకుఁ బోవు రామభద్రుని పిఱుంద । జనకసుత మాఢ్కి విడువక, చనియె రాజ్య । లక్ష్మి యాతని కెద్ది దు, ర్లభము చెపుమ ॥ (తే, గీ) చాపశర ఖడ్గములఁ బూని, శస్త్రభృద్వ । రుండు లక్ష్మణుఁడు గ్రవీ, ర్యుండు డుమోలి । నప్రమాదుఁడై ప్రోచుచు, నరుగుచుండ । రామభద్రుని కెద్ది దుర్లభ

భము చెప్పుము ॥ (క) వనవాసము సల్పిరయం । బునఁ గ్రమ్మఱ నరుగు దెం
చి, పొలుప్పుగఁ జరణం । బునకుఁ బ్రణమిల్లు రాముని । గనుఁగొని మది సంత
సించు, కాలము వచ్చున్ ॥ (క) రమణీమాదృశులను శో । కమునఁబడలకుం
డఁ దేర్పఁ, గాఁ దగు నీవీ । క్రమమున శోకింపఁగ నిను । హిమకరముఖి దేర్చ
వార, లెవ్వా రిచటన్ ॥ (క) తరుణీ రామునికంటెను । బరుఁ డొకరుఁ డు లేఁ
డు ధర్మ, పరుఁడు జగతిలో । నరుదార రాఘవుని యం । దరసిన లేదించు
కైన, నశుభం బబలా ॥ (వ) మహానుభావుండగు రాముండు లక్ష్మణసహితుండై
యరణ్యంబున నుండి క్రమ్మఱఁ బురంబునకుం జనుదెంచి సామ్రాజ్యపట్టాభిషిక్తుం
డై జానకింగూడి రోహిణీయుక్తుండైన చంద్రునిభంగి వెలుంగుచు మృదుపీ
నంబులగు కరంబులచేత భవచ్చరణంబులు సంస్పృశింపం జనుదెంచునప్పుడీవు
మేనురాజి శిలోచ్చయంబునుం బోలెఁ బరమానంద సంభూత బాష్పజలంబుల
చేత నక్కుమార శేఖరునిం బ్రోక్షించెదవు సత్యంబుగాఁ బలికితి. శోక మోహం
బులు విడిచి యూరడిల్లుమని యిట్లు సుమిత్రాదేవి పూర్వజన్మకృత భగవదా
రాధనజనితసుకృతపరిపాకంబున శ్రీరామునిం బరమాత్మఁగా నెఱింగి వివిధవిన
య సాంత్వవాక్యోపచారంబుల ననేకప్రకారంబుల నాశ్వాసించిన నాసుమిత్రా
దేవి వాక్యంబాలకించి శరద్గతంబగు నల్పతోయ మేఘంబుభంగి నరదేవపత్ని
యగు నక్కౌసల్యాదేవి శరీరంబు నంపలి శోకంబు వినాశంబు నొందె నంతని
క్కడ ॥ (చ) జనకుని మిత్రవర్గమును సర్వవిధంబుల వీడుకొల్పి కా । ననము
నకేగు రాముని జనప్రియుఁ బాయఁగ లేక రక్తులై । పనివడి పౌరజానపదవర్గము
బల్విడి నమ్మహాత్ముని । న్వెనుకొని యంతఁ జెప్పిన నువీడక వోవుచు నుండి రత్త
ఱిన్ ॥ (తే,గీ) సముదితుండైన పూర్ణిమా చంద్రు మాడ్కి । రామ
భద్రుండు సాకేత రాజధాని । నిలయులగు వారి కందఱ కలఘుసద్గు । ణా
భి గావున సత్ప్రియుండై తనర్చె ॥ (క) వనికిం జన వలదని చ । య్యనరాముఁ

—(*) రాముఁడు పౌరుల నూఱడించుట. (*)—

డు వారిచేత యాచితుఁ డయ్యున్ । జనకుని సత్యాత్మునిఁగా । నొనరింపఁగఁ
బూని నిలువ కొయ్యనఁ జనియెన్ ॥ (వ) ఇవ్విధంబునం బోవుచు నార
ఘువంశ శేఖరుండు వారి నందఱఁ గరుణా తరంగితాపాంగ వీక్షణంబుల ని
రీక్షించి స్నేహయుక్తంబులగు మంజు వాక్యంబుల నిజ పుత్రులం బోలె నెనూన



యింపుచు నిట్లనియె ॥ (తే, గీ) చెలఁగి మీరలు నాయందు, సలుపునట్టి ।
భక్తి బహుమానగౌరవ, రక్తులను వి । శేషముగ భరతుని మీఁదఁ, జేర్పుఁడిం
క । మామసంబున కదియె సమ్మద మొసంగు ॥ (చ) అతఁడపరాజితుండు
ను మహాత్ముఁడు కీర్తిరథుం డమర్షిఁ ద్రొ । క్కతముఁడు పిన్నవాఁడయిన, జ్ఞా
నముచేఁ గడుఁబెద్దసాధు స । మ్మితుఁడగుఁ గాన నింకఁ దగ, మీకను రూప
కుఁడైన నాథుఁడై । తత మతిచేఁ బ్రియంబును హితంబును జేయుచు నుండు
నిచ్చటన్ ॥ (క) జనకుని పనుపున భరతుఁడు । ఘనరాజ్యపదస్థుఁ డయ్యెఁ
గావున మన మ । య్యనఘుని యానతిఁ గైకొని । యనిశము వర్తింప వల
యు, నతిశయబుద్ధిన్ ॥ (వ) కావున మీరు మత్ప్రీతికొఱకు నతం డెట్లు పరి
తపింపకుండు నట్లనూన యింపుచు నతని యాజ్ఞ నుల్లంఘింపక మదాగమనం
బుఁ గోరుచుఁ దద్వశవర్తులై యుండుం డని పలికిన నప్పు డప్పౌర జనంబులు
రామభద్రుం డెట్లు పితృవచన పరిపాలన రూపధర్మంబునందు సంస్థితుండ
య్యె నట్లు తదాధిపత్యంబుఁ గోరుచు నమ్మహాత్ము నుద్దేశించి విలపించుచుఁ గన్నీ
రు నించుచుండిరప్పుడా రాముండు సౌమిత్రిసహితుండై బాష్పపిహిత లోచ
నులైన పురజనంబుల రజ్జువులచేతం బోలె స్వగుణంబులచేత నాకర్షింపుచు
నతిత్వరితగమనంబునం బోవుచుండనప్పుడు వయోజ్ఞానతపోవృద్ధులైన విప్రులు
పయఃప్రకంపితమస్తకులై మిక్కిలి వృద్ధులగుటవలన సమీపధావనాశక్తిచేత
దవ్వులం జూచి రాముని కృపావిశేషంబు గ్గడించుటకుఁ దదీయరథకీలితహయం
బుల నుద్దేశించి యిట్లనిరి॥ (ఉ) రామరథప్రకీర్ణహయ, రాజములార సమీ
రసన్నిభో । ద్దామరయంబునం జనక, దాశరథి న్వెసఁ గ్రమ్మఱింపుఁడ । ట్లేమని
బ్రాహ్మణోత్తమము, ఖేరితసూక్తిఁ దిరస్కరించినం । దామదిలో సహింపఁడతి, ధా
ర్మికుఁ డౌటరఘూద్వహుండొగిన్ ॥ (తే,గీ) అవనిలోఁ గర్ణవంతంబులై
నభూత । సంఘములయందు మిక్కిలి, శ్లాఘనీయు । లట్లుగావున మీరుద, యాస
మృద్ధి । మామనవి బుద్ధిఁ గైకొని, మఱలుఁడిపుడు॥ (చ) రవికులసార్వభౌము
నిఁబరాక్రమశీలుని రామునిం బురో । పవనవిహారమర్థిఁ సలుపం గొని పోవు
టమాని మీరుభై । రవతరసింహముఖ్యమృగ, రాజివిరాజితమైన దండకా । టవికి
టుసాహసంబునఁగ, డంగి వెసం గొనిపోవఁ జెల్లునే॥ (వ) అనియిట్లు విలపించు

—(*)విప్రులందఱు రాముని వనమునకుఁ బోవలదని ప్రార్థించుట.(*)—

చున్న యావిప్రవరుల దీనాలాపంబులాలకించి రాముండు బ్రాహ్మణవాక్యశ్రవ
ణానంతరంబున రథగమనంబునందు దోషంబగుననియును బ్రాహ్మణాశ్వాసనం
బున వ్రతభంగంబగుననియును దలంచి రథంబుడిగ్గి తదాగమనపర్యంతంబుస
న్నికృష్టపదన్యాసుండై చారిత్రవత్సలుండుగావున బ్రాహ్మణులయందతివిశ్వా
సంబువలనఁ దాను రథారూఢుండై యుండియుఁ బదాతులయినవారలఁగ్రమ్మ
ఱింప నుచితంబుగాదని నిశ్చయించి పాదసంచారంబున వనపరాయణుండై
మెల్లనంబోవుచుండె నప్పు డారఘుపుంగవుని డాయంజని యా వృద్ధవిప్రులు
సంతాపితాంతఃకరణులై యిట్లనిరి॥ (సీ) అనఘాత్మనీమంగళాకృతిఁజూడక
యొకనిమిషంబైననోర్వలేమిఁ। జేసినీమృదువాగ్విశేషంబుచేబహూకృతుల
మైవనభూమి నతిసుఖాబ్ధి। నలరుచునుండెద మనునాసపెంపున వచ్చు మమ్మి
టఁద్రోచి పుచ్చినీకుఁ। బోవంగఁజెల్లునె భూత దయాళుండ వైననీవెదయావి
హీనబుద్ధి॥ (తే,గీ) ద్విజవరోపేక్షఁజేసిన వేఱెయొకఁడు। కడఁగిరక్షింపఁగల
వాఁడు కలఁడెజగతి। నకటయీచందమైనని న్నధికధర్మ। నిష్ఠుఁడనిసూరిజ
నులాడ నేర్తురెట్లు॥ (వ) మఱియు బ్రహ్మసంబంధి సకల మంత్ర తంత్రజ్ఞా
నోప యోగానుష్ఠానరూపంబులైన మదీయ కర్మంబులును బాత్రాారణిద్వా
రంబున ద్విజస్కంధాధిరూఢంబులైన గార్హపత్యాహవనీయ దాక్షిణాగ్ను
లును గౌతుకాతిరేకంబున ననుసరించివచ్చుచున్న యవి వాజ పేయసముత్థి
తంబులైన యస్మదీయ పాండురచ్ఛత్రంబులు శరన్మేఘంబులభంగివెలుంగుచు
నివియె వెనుకొని యరుగుదెంచుచున్న వీయాతపత్రంబులచేత ననవాప్తచ్ఛ
త్రుండవైననీకు రవికిరణంబులవేఁడిమి సోఁకకుండ నీడఁగావించెద మస్మద్బు
ద్ధి వేదమంత్రంబువలన నుపవాసాదికంబు పరిత్యజించి భవన్నిమిత్తంబు వన
వాసానుసారిణిగా నొనర్పంబడియెఁ బాతివ్రత్య రక్షితలగుదారలు గృహంబు
నందుంబోలెనస్మదీయ హృదయంబులందునివసించియున్న వేదంబులును శా
స్త్రంబులును వనవాసోన్ముఖంబులయియున్నవి భవన్నివర్తనంబునం దస్మద్బు
ద్ధిసునిశ్చితయయ్యె నింకనీచేత వనగమన నిశ్చయం బకార్యంబై యుండు ధ
ర్మపరాయణుండవైన నీవు బ్రాహ్మణప్రార్థనాచరణ రూపధర్మ నిరపేక్షు
కుండవగుచుండ నింక ధర్మం బెత్తెఱంగునం బ్రవర్తిల్లు నిభృతాచారుండ



వైన నీవు హంసశుక్లశిరోరుహంబులగు శిరంబులచేతను మహీపతనరజోవ్యా
ప్తంబులగు దేహంబులచేతను యాచితుండవై మఱలుమనిపలికి వెండియు నిట్ల
నిరి॥ (చ) రవికులవర్యనీవుమఱలంజను దెమ్మటు సేయవేని భూ। దివిజులుత్వ
ద్వియోగజవితీర్ణమహావ్యసనాభిపన్నులై। తవిలిద్విజాహ్వ యాగములు
దంచితభక్తినొనర్పరందున। న్ననవవిఘాతదోషమది సంగతమయ్యెడు నీకుఁ
జూడగన్॥ (క) వినుముచరాచరభూతము। లనఘాత్మకభక్తియుతము లైదై
న్యమున। న్నినుఁబ్రార్థింపుచునున్నవి। సునిశితముగ భక్తులందుఁ జూపుము
కరుణన్॥ (వ) మఱియు నఖిలజన హృదయ నయనానందకరుండవైన నిన్ను
విడువంజాలక నీవెంటంజనుదెంచుచున్న యస్మదాదిపురజనుల భాగ్యంబునా
లోకించి రాముని వెనువెంటంబోవ గమకించి మూలంబులచేత హతగమన
వేగంబులై పురజనులకుంబోలెఁ దమకు రాముని యాన భాగ్యంబు లేద
య్యెనని చింతించి వాయువేగంబుచేత నాక్రోశింపుచున్న వానియట్లు చూప
ట్టుచున్న మహోన్నతంబులైన పాదపంబులును హత సంచారంబులై చేష్టలుద
క్కి వృక్షైకస్థాన స్థితంబులై సర్వభూతాను కంపివైన నిన్నుఁ బ్రార్థింపు
చున్న ఖగంబులును విలోకింపుమని యిట్లు బహుప్రకారంబుల దుఃఖింపుచు
న్న యావిప్రోత్తముల దీనాలాపంబులాలించి కల్యాణగుణాభిరాముండైన రా
ముని నివారించుట కడ్డంబువచ్చెనో యనం దమసానది యాసన్నంబయ్యె న

(*)రాముండు తమసాతీరంబుఁజేరుట. (*)

ప్పుడు సుమంత్రుండు మార్గపరిశ్రాంతంబులైన హయంబులఁ దెచ్చి యమ్మ
హానదీజలంబులఁ గడిగి మృదుమధురఘాసంబు మేపి తత్క్షణంబునకం జాలి
యుండె నిట్లు రమ్యంబగు తమసాతీరంబునాశ్రయించి రాముండు సీత నవలో
కించి లక్ష్మణునకిట్లనియె॥ (క) అనఘరవియస్తమించెను। వనవాసం బునకు
నొక్క వాసరమయ్యెన్। మునుపటివలెనీవుమనం। బునగృహ సౌఖ్యాది వాం
ఛఁ బొందకుమింకన్ ॥ (క) పగలెల్లనడవిఁగ్రుమ్మరి। ఖగమృగములు తమకు
వలయు కందువలందుం। దగురీతిఁజేరినందున। సుగుణాఢ్య వనములు కంటె
శూన్యములయ్యెన్॥ (క) వినుమిప్పుడయోధ్యాపుర। జనులందఱుబాలవృద్ధ
సహితంబుగనె। మ్మనమునవడలుచునుండుదు। రనఘా మనరాకఁదలఁచి యం
ధులభంగిన్॥ (క) అనుపమసద్గుణములచే। ననవరతమువిషయవాసు లవ

నీపతికిన్ । మనకుభరతశత్రుఘ్నుల । కనురక్తులుగారెవారి కడలు జనించున్॥
(క) జననీజనకులుసారెకు । వనగమనముఁదలఁచితలఁచి వారక మదిలో । ఘ
నశోకంబునఁగుందుదు । రనఘాత్మ తదార్తికాత్మ నడలెదసుమ్మీ॥ (ఆ,వె)అఁయి
ననేమిభరతుఁ డఖిలధర్మవిదుండు । కరుణఁ జేసియేలకావకుండు । నతనిభక్తి
భావ మరసిడెందంబునఁ । గుందకున్న వాఁడఁ గొంతధృతిని ॥ (వ) మఱియు
నన్ననుసరించి వనంబునకుంజను దెంచుచున్న నీచేత హితంబాచరింపఁబడియె
నింక వైదేహీరక్షణార్థంబునందు సహాయత్వంబు సంపాదింపం దగినయది
నేఁడు వనవాసోపక్రమ దివసం బీతమసాతీరంబు మహాక్షేత్రంబుగావున నీరా
త్రి జలపానంబుఁ జేసి యిచ్చట నుపవాసంబు సేయుదమని పలికి సుమంత్రుం
జూచి నీవశ్వరక్షణంబునం దప్రమత్తుండవై యుండుమని నియమించిన నతం
డయ్యశ్వంబులబంధించి సమృద్ధఘాస నంతంబులఁగావించి ప్రత్యాసన్నుండై
సంధ్యనుపాసించి మంజుపల్లవంబులఁ దల్పంబుఁ గావించిన నారఘువరుండు
కృతానుష్ఠానుండై సీతాసహితంబుగా సుమంత్రవిరచిత పల్లవతల్పంబు నధిశ
యించెఁ బురజనంబులు మార్గాయాసఖేదంబున నైమఱచి నిద్రింపుచుండి
రంత లక్ష్మణుం డన్నదిక్కుఁగనుంగొని సూతునితో ననేక ప్రకారంబులఁ దదీ
యకల్యాణగుణవిశేషంబులు వక్కాణింపుచు నిద్రా సుఖంబులు విడిచి జాగ
రూకత్వంబున నప్రమత్తుండై రక్షింపుచుండె నిట్లు గోకులా కులంబైన తమ
సానదితీరంబున నారాత్రివసియించి యరుణోదయకాలంబున రాముండు మే
ల్కని నిద్రింపుచున్న ప్రకృతిజనంబుల నవలోకించిపుణ్యలక్షణుండై నలక్ష్మణు
నకిట్లనియె॥ (క) అనఘాచూచితెయీపుర । జనులెంతయుమనలవిడువఁజాల
కవనికిం । జనుదెంచెదమనికుతుకం । బునఁబడియున్నారు వృక్ష మూలములం
దున్॥ (క) ఉడుగుఁడనియెంత చెప్పిన । నుడుగరువలదనుచునింక నొత్తి పలికి
నం । గడువడిఁ దమప్రాణంబులు । విడిచెదమని యున్నవారు వెఱ్ఱి తనమునన్॥
(ఆ,వె) వీరెఱింగి రేనివిడువక మనవెంట । నరుగుదెంతురదియు భరముగానఁ ।

—(*)రాముఁడు నిద్రితులగు పౌరుల వంచించి వనమునకరుగుట.(*)—

గడఁగినిద్రలేచు కంటెముంగలమన । మరదమెక్కిపోద మతిరయమున॥ (వ)
మఱియు నీయిక్ష్వాకుపురవాసులు నాయం దనురక్తులై నన్ను విడువంజాలక
వృక్షమూలంబుల నాశ్రయించి నిద్రింపుచున్న వారుగావున వీరలవంచించి చ



రటొప్పు వీరరణ్యంబునందు సంచరింపుచు నిడుములఁగుడువంజాలరని పలికిన
పాథోధవర్ణస్వరూపుండైన రామునింజూచి లక్ష్మణుండు దేవా యిదియె నా
కుంజూడ యుక్తంబై తోఁచుచున్న దట్లుగావింపుమనిన నారాముండు సుమం
త్రుంజూచి రథంబు రయంబున నాయితంబుగావింపుమనవుడు నతండు జవస
త్వసంపన్నంబులైన హయంబులంబూన్చి సజ్జంబుఁ జేసి తెచ్చిన నారఘుపుంగ
వుండు సీతాలక్ష్మణసహితంబుగా రథారోహణంబుఁ జేసి యమ్మహానదినుత్తరిం
చి మహామార్గంబునాశ్రయించి శీఘ్రంబునంబోవుచుఁ బురజన మోహనా
ర్థంబు సుమంత్రునవలోకించి మనపోయిన తెఱంగు పౌరులెఱుంగకుండువిధం
బున నీవుకొంతదూరంబు రథం బయోధ్యాపురంబున కభిముఖంబుగాఁదోలి
క్రమ్మఱ వనమార్గంబునకు మఱల్పుమనిన నతం డట్లకావించి క్రమ్మఱరథంబు
దోలుకొని రామునికడకుంజను దెంచిన నమ్మహాత్ముండు సీతా లక్ష్మణసహితంబు
గా సపరిచ్ఛదంబైన రథంబెక్కిన నాసుమంత్రుండు తపోవనమార్గంబుఁ బ
ట్టిహయంబుల రయంబునందోలిననవి వాయుజవంబునం బోవుచుండె నిట్లురా
ముండు జానకీలక్ష్మణసహితంబుగా రథారోహణంబుఁ జేసి ప్రయాణానుకూల
మంగళసూక్తనిమిత్త దర్శనార్థం బొక్కింత రథంబు దఙ్ముఖంబుఁ గావించి
నిమిత్తస్వీకారానంతరంబున దక్షిణాభిముఖంబుగా వనమార్గంబుఁబట్టి చని
యె నంతఁ దమసా తీరంబున నిద్రించి యున్న పౌర జనంబులు ప్రభాత కా
లంబున మేల్కాంచి రామునిఁ గానక దిక్కులు గలయం దిలకింపుచు

(*) పౌరులు నిద్రలేచి రామునిం గానక విలపించుట. (*)

శోకోపహత చిత్తులై కొండొక సేపు చేష్టలు దక్కి యుండి వెండియునొ
క్కింత తెలివిఁ దాల్చి కన్నీరు నించుచు విషాదవేదనా విశేషంబునఁ దమ
లో నిట్లని విలపించిరి ॥ (ఉ) అక్కట రాముఁడు న్మనల, నారట పెట్టి ద
యావిహీనుఁడై । చిక్కక త్రోచిపోయె దరి,చేరఁగ రాని విపత్పయోధినిం।
కెక్కడ నీఁదువార మిఁక, నెవ్వఁడు రక్షకుఁ డేది దిక్కు నేఁ । డెక్కడవచ్చె
నీనిదుర, యెంతటి మోసము వచ్చె నిత్తఱిన్ ॥ (ఉ) నిర్మలచిత్తుఁ డంచి
తస్వనీతివిదుండు దయాపయోధి స । ద్ధర్మ విశారదుండ భయదాయకుఁ
డీశ్వరుఁడంచుఁ జిత్తమం । దర్మిలి నమ్మి యున్నమము నక్కట యిక్కడ నొం
టి డించి యే । ధర్మమటంచుఁ బోయె నిల, ధార్మికు లీగతి విన్నమెత్తురే ॥

(ఉ) రాముని భానుమత్కులలలా, మునిఁ గోమలనీలనీరద । శ్యామునిఁ బాసి మేన నిఁకఁ బ్రాణము నిల్పఁగ నేల చిచ్చులో । వేమఱుఁ జొచ్చి యైన నడవి న్విషపానమొనర్చి యైన నిం । కేమియొనర్చియైన మన, మిచ్చటఁ జత్తము నిక్కువంబుగన్ ॥ (క) జాలిం బడి తనసుతులం । బోలె మనల నేఁ గనుంచు, భూరికరుణచేఁ । బాలించు నట్టి రాముఁడు । వాలాయము మనల విడిచి, వనమునకరిగెన్ ॥ (క) ఏలాగు బ్రతుకుదము మన । మేలీలఁ జరింత మెచటికి, కేగుద మకటా । బాళిం దల్లులఁ బాసిన । బాలురగతియయ్యె నేఁడు, పరికింపంగన్ ॥ (తే, గీ) రామభద్రుండు లేని పురంబు శూన్య । గృహముగతి నుండు దానినేరీతిఁ జూత । మచటి వారలు రాముఁ డెందరిగె నని న । నేమి చెప్పుద మింకఁ దెలియఁ, గద్దిమనకు ॥ (వ) అని బహుప్రకారంబుల భుజంబులెత్తి రోదనంబు సేయుచు రామరహితంబైన పురంబు సొర నొల్లక రథం బరిగిన చొప్పున కొంతదవ్వరిగి మార్గనాశనం బగుటయు విషాదంబు నొందుచుఁ జేయు నది లేక మఱలి పురమార్గంబుఁ బట్టి వివత్సలయిన మొదవుల చందంబున విలపించుచు దైవోపహతుల మైతి మింక నేమి సేయు వారమని చింతింపుచు నరిగి చంద్రహీనంబైన గగనంబుపోలికఁ దోయహీనంబైన సముద్రంబు భంగి గరుడుని చేత నుద్ధృతపన్నగంబైన హ్రదంబుపోలిక నిరానందంబైన యయోధ్యాపురంబు సొచ్చి దాని శోభాహైన్యంబునకు శోకింపుచుఁ గన్నీరు నించుచు విప్రణష్టప్రమోదులై పుత్రదారగృహక్షేత్రాదులయందు మమత్వంబు మాని యమూల్యంబులైన స్వగృహంబులు ప్రవేశించియు దుఃఖసహితంబైన స్వజనంబు నిరీక్షించి దుఃఖోపహతులై స్వపరవేశ్మస్వజనాన్య జనవివేకంబు లేక కొండొకసేపున కతిప్రయత్నంబునం దమవారి నెఱింగి వారలం గూర్చికొని వారికి రాముండు వంచించి యరిగిన చందంబంతయు వినుపించి బాష్పపిహితముఖులై కన్నీరు మున్నీరుగా రోదనంబు సేయుచుండిరప్పుడు విషణ్ణరూపులును శోకపీడితులును బాష్పవిప్లుత లోచనులును దుఃఖోపహత చిత్తులును రామపరిత్యక్తులు నగు నప్పురవాసుల ప్రాణంబు లుద్గతంబులయినట్లుండె వణిజు లంతర్బాహ్య సంతోషంబులు విడిచి బెహారంబులు సేయుటుడిగి ఱిచ్చవడి యుండిరి గృహస్థులు మజ్జనపాన భోజన శయనాగ్ని



(*) పౌరకాంతలు భర్తలతోడ నానాప్రకారంబుల విలపించుట. (*)

హోత్రాదికంబు విడిచి ధనలాభవ్యయంబు లెఱుంగక యేమియుందోఁచకుండిరి చాతుర్వర్ణ్యంబుల వారును దమకు నియతంబులైన ధర్మంబులకుం దప్పి చరింపుచుండిరి ప్రథమజులగు పుత్రులం బొంది తల్లులు హర్షింపక పరమ దుఃఖాక్రాంతలై యుండిరి యిట్లు గృహంబులకుం జను దెంచిన భర్తలం గూడి పౌరకాంతలు దుఃఖార్తలై తోత్రంబుల చేత ద్విపంబులఁ బోలెఁ దీక్ష్ణ వాక్యంబుల చేత గృహపతుల గర్హింపుచు నిట్లనిరి ॥ (చ) కరుణదలిర్ప లోకములఁ, గావ నరాకృతిఁ బుట్టినట్టి యా । హరి యగు రామభద్రుని మహామహు నెచ్చట నున్న సంభృతా । దరమునఁ జూడ కింటను సుత, దారలపై రమియించుచుండు నప్పురుషులు కల్మషాత్ములయి, పోదురు దుర్గతికిన్నిజంబుగన్ ॥ (క) పరమాత్ముఁడైన రామునిఁ । బరికింపఁగ లేని నీతి, బాహ్యుల కిలమం । దిరసుతభార్యాభోగో । త్కరసుఖముల చేత నేమి, కార్యము దలఁపన్ ॥ (చ) రయమునఁ గాననంబునకు, రాముని వెన్కనిపోయినట్టిదు । ర్ణయుఁడయినం బవిత్రుఁడయి, నవ్యశుభంబది గాంచు నన్న చోఁ । బ్రియుడగు రామునిం బరిచరింపుచు గానకు నేగి నట్టి సీ । తయు నలలక్ష్మణుండు సుకృతంబది గాంతు రనంగఁ జిత్రమే ॥ (క) రాముని వెంట వనంబున । కామెయిఁ జనినట్టి తమ్ముఁ డతఁడొక్కఁడెవో । ధీమంతుఁడు సత్పురుషుఁడు । శ్రీమంతుం డన్యజనులఁ, జెప్పఁగ నేలా ॥ (క) సదమలచరితుఁడు రాముఁడు । పదపడి మజ్జనమొనర్చి పానము సేయ । న్మది దలఁచునట్టి కొలఁకులు । నదులు తటాకములు కడు ఘనంబులుగావే ॥ (క) కడురమ్య కాననములగు । నడవులనూపములు సరసు లద్రులు నదము । ల్పడబడ రఘుకుల శేఖరు । నుడుగక శోభింపఁ జేయుచుండుం బ్రీతిన్ ॥ (వ) మఱియు వనంబులం గల విచిత్రకుసుమాపీడంబులగు నగంబులు రామునిం బరమాత్మగా నెఱింగి శిష్టభ్రమర ఝుంకారమంత్రోచ్చారణపూర్వకంబుగా స్వశాఖాకరధృత మంజరీరూప పుష్పాంజలుల చేత నమ్మహాత్ము ననుదినంబును బూజింపుచుండుఁ బర్వతంబులు సమాగతుండైన రామునిం జూచి యనుక్రోశంబువలన నకాలంబునందును స్వనిష్ఠ వృత్తు ద్వారంబున ముఖ్యంబులయిన ఫలపుష్పంబులొసంగుచు బహుధాతుమండితంబులైన నిర్ఝరంబులవలన విమలతోయంబుల నొసంగుచు నిత్యంబును సేవింపుచుం

డుఁ బాదపంబులు స్వమూలావకీర్యమాణ కుసుమపల్లవవిరచితశయ్యాతలం బులందధివసించిన రాముని రమింపఁజేయుచుండు మఱియు నెందెందు నసియిం చు నవియెల్లఁ బ్రియాతిథిం బోలె రామభద్రుని సత్కరింపుచు నుండు నమ్మహాత్ముం డెచ్చట వసియించు నచ్చట నించుకయైన భయంబును బరాభవంబును లేకుండు మహాశూరుండు మహాబాహుండు మహాతేజుం డా పుణ్యాత్ముండు సర్వభూతంబులకుఁ బరమ గతియుఁ బరమ పరాయ ణుండును గావున నమ్మహానుభావుని పాదసేవ మాకుఁ బరమ సుఖసాధన భూతమై యుండు మనమిప్పుడు వనంబునకుం జని మీరు రాముని సేవింపుచుం డుఁడేము సీతను సేవింపుచుండెద మరణ్యంబునందు మీకు రాముండును మాకు సీత యు నిత్యంబును యోగక్షేమంబు సేయుచుండుదు రట్టి పరమ స్థానంబున నుండ క దుఃఖశోకంబుల బడలుచు నిరానందులమై యమనోజ్ఞంబును నప్రశస్తంబు నుసోత్కంఠిత జనంబును జిత్తనాశకంబునైన పురంబున నెట్లుండుద మదియునుం గాక ॥ (తే,గీ) అకటకైకేయిదయ్యె రా, జ్యంబధర్మ । కలితమైనాథవంతరం బు, గాకయుండు । నిచటమనకు వసింపంగ, నెట్లువచ్చు । ధనము జీవితమది యేల, తనయులేల । (ఆ,వె) రాజ్యకారణమున,రమణునిఁదనయుని । విడిచెనట్టిదుర్వి, వేకయైన । కైకయింకనూరఁ, గలవారి నెవ్వారి । విడువకుండుదాని విడువవలదె ॥ (క)జీవించియున్న కేకయ । భూవరసుతప్రోలభృత్య, భూతుల మగుచు । జ్జీవించియుండఁజాలము । జీవితములుసాక్షిగాఁగఁజెప్పెదమింకన్॥ పరఁగ నెవ్వతెకృపమాలి పార్థివేంద్రు । తనయు రామునిఁ గానకుఁ బనిచె నట్టి లోకవిద్విష్టమతియైన,కైకప్రోల । నెగులుదక్కి యెవ్వా రెట్లు నిలువఁగల రు ॥ (ఉ) రాముఁడు కానకుం జనియె, రాజవరేణ్యుఁడు శోకకర్శితుం। డైమనియుండఁ జాలఁ డతఁ, డన్తమునొందిన వెన్క నీపురం । బీమహి యీ సమస్త జన, బృందము నాయకమై యుపద్రుతం । బైమితిలేని దుః ఖమున, నట్టె వినాశము నొందు నెంతయున్ ॥ (తే,గీ)మీరు పత్నీయుతం బుగ, ఘోర విషము । నర్థిఁ గ్రోలియు మృతినైన, నధిగమింపుఁ । డట్లు గాదేని సుగుణాఢ్యుఁ, డైనరాముఁ । డర్థి వసియించు వనమున, కైనబోం డు॥ (తే,గీ) అకటమిథ్యావివాసితుం,డయ్యె రాముఁ । డూరభరతుని ముం గల, నుంటఁజేసి । యుర్వి బశుమారకుని ప్రోల,నున్నపశువు । లట్ల నిశ్చిత



మరణుల, మైతిమిగద॥ (శా) రాజీవాక్షుఁడు గూఢజత్రుఁడు మహోరస్కుం డు లోకప్రియుం । డాజానుస్థిర బాహుఁడంచితఘన,శ్యాముండునుం బూర్ణో మా । రాజాస్యుండు మహారథుండు ఘనుఁడా,రాముండు నానావనీ । రాజి న్శోభిలఁ జేయుచుండు నెపుడు, నఁలింగత్తనూరోచులన్ ॥ (తే,గీ) మఱియుఁ బూర్వాభిభాషియు,మధురభాషి । యైనరాముండు శశిభంగి, నడవియందుఁ సమదదంతి యానంబున, సంచరింపఁ । గనివిపినవాసులు ముదంబుఁ, గాంతు రుగద॥ (వ) అనియిట్లు నాగరస్త్రీలు బహుప్రకారంబుల భోజన మజ్జనశయ నాదులుడిగి నానావిధదీనాలాపంబుల విలపింపుచు మృత్యుభయాగమంబునం దుంబోలె నాక్రందనంబు సేయుచుండఁ దదీయదుఃఖంబు సహింప లేనివాఁడు పోలె సూర్యుండస్తమించెఁ బదంపడి రాత్రిప్రవర్తించెనప్పుడు సాకేతనగరం బు గాఢసంతమసపరిపూర్ణంబై నష్టజ్వలన సంపాతంబై ప్రశాంతాధ్యయన పుణ్యకథేతిహాసంబై శూన్యవిపణిమార్గంబై ప్రణష్టహర్షంబై నిరాశ్ర యంబై నష్టనక్షత్ర గ్రహంబైన యంతరిక్షంబు ననుకరించె మఱియు నప్పుర స్త్రీలు వినయవివేకప్రియంబుల చేతఁ దమసుతులకంటె నధికుండైన రాముని దలంచి భాతృపుత్రసహితంబుగా రోదనంబు సేయుచుండిరి ప్రశాంతనృత్యో త్సవ గీతవాద్యంబై నిరానందంబై యుపగతపణ్యావస్తుప్రసారణంబై యయో ధ్యానగరంబు సంక్షుభితోదకంబైన మహార్ణవంబు భంగి నయ్యె నిట రా ముండు తమసాతీరంబునఁ బురజనుల విడిచి నాఁటిరాత్రి వేఁగునంతకుం జని సూ ర్యోదయసమయంబున నాహ్నికకృత్యంబులు దీర్చి పితృవాక్య పరిపాలనకు ముండై దూరంబు చనిచని కోసలదేశాంతంబు డాసి వికృష్టసీమాంతంబులగు

—(*)వనంబునకుఁబోవు రామునిఁజూచి గ్రామనివాసులు దుఃఖించుట.(*)—

గ్రామంబులును బుష్పితకాననంబులును విలోకింపుచు సీతాలక్ష్మణ సహితుం డై పోవుచుండ నప్పుడచ్చటి గ్రామోపగ్రామ నివాసులగు జనంబులు రా మునివన ప్రయాణంబుఁజూచి తమలోనిట్లనిరి ॥ (సీ) అక్కటదశరథుఁ, డాలి మాటకుఁ బ్రియపుత్రు నేగతి వనం,బునకుఁబనిచెఁ । దనవంశధర్మంబుఁ,దప్పి కై కేయిమగనికి దుర్నయమెట్లు,గలిగెనీతఁ । డసమాన బాహుబలాఢ్యుఁడయ్యును దాని హితమతిఁదా నెట్టు,లీయకొనియె । నతిసుఖోచితముగ్ధ, యబలమహాసు కుమారి యీధరణీకుమారి యెట్లు ॥ (తే, గీ) భయదవనమున నిడుమలు, పడఁ

దలంచె । నెంతయాపద వాటిల్లె,నిపుడువీరి । కేమిసేయంగఁ గలవారఁ, మీర్వ
రాజ్ఞ । మీఱినడువంగఁదరమె,య్వారికైన॥ (క) అనియీగతిఁగోసలవిష ।
యనివాసులుదుఃఖితప్తు, లై విలపింప । న్ఘనుఁ డారఘుపతివారల । యనూనదీ
నోక్తివినుచు, నటుచనిమ్రోలన్॥ (క) సాదరముగఁబరిమళశీ । తోదకపరిపూ
ర్ణయగుచు, నొప్పెడిదాని । న్వేదశ్రుతియనుదానిని । నదీవరమునుత్తరించి
నయగతిఁజనుచున్॥(క) విమలోదకమైకమనీ । యమరాళపతాభి యుక్త,
మైగోకులయు । క్తమనోజ్ఞానూపకమై । యమరెడుగోమతినిదాఁటి,యరుగు
చునవలన్॥ (క) నవరాజీవోత్పలకై ।రవగతమకరందలుబ్ధ, రమ్యభ్రమరీ । ర
వనాదితమైయొప్పుచు । నవజలయగు స్యందికాఖ్య, నదినిదరించెన్॥ (వ) ఇ
ట్లమ్మహానదినుత్తరించి తొల్లియిక్ష్వాకునకు మనువొసంగి నట్టి స్యందికాఖ్య న
దీమర్యాదంబైన దానినవాంతర జనపదావృతయగు దానిఁ గోసలదేశవిశేషం
బానై దేహికింజూపుచు నతిత్వరితగమనంబునం బోవుచు సుమంత్రుఁ నవలోకిం
చి మత్తహంసస్వరంబుననిట్లనియె ॥ (చ) కడఁగిచతుర్దశాబ్దములు కాననవా
సమొనర్చి క్రమ్మఱం । దడయక నేగుదెంచితలిదండ్రులుకామితమ్ముఘటింపఁ
గా । నుడుగక రేపుమాపు సరయూతటపుష్పిత కాననంబు నం । దడరినకా
తుకంబు చెలువారఁగనెన్నఁడువేఁట సల్పెదన్ ॥ (వ) వేఁటశిష్టా చారంబగు

(*)రాముఁడు జనపదనివాసులగు జనులనూఱడించుట.(*)

నే యంటివేని ॥ (సీ) అనఘాత్మయీ లోకమందు రాజర్షుల కడవిలోవేఁ
టక్రీడార్థమగుట । నవసరంబెజేఁగిసదాచారపరులచే మానకస్వీకృతంబైనదా
నిఁ । బరగధనార్థంబు శరచాపధరులచే ననిశమాకాంక్షితంబైనదాని । సర
యూనదీతీర సంజాతవనములో నించుక వేఁటఁగావించువాఁడ ॥ (తే,గీ) నర
యరాజుల కీరీతి యవనిలోన । నతులమై సమ్మతంబయి యలరుచుండు । నను
చునీభంగి రాఘవుఁ డమృతమధుర । భాషణంబులఁబలుకుచుఁ బ్రాభవమున॥
(వ) శీఘ్రింబుననగస్త్యదిశాభిముఖుండై పోవుచు విశాలంబులగు పురంబు ల
రణ్యంబులు గ్రామంబులువిలోకింపుచుఁ గోసలదేశాంతంబుఁజేరియయోధ్యా
భిముఖుండై యారబ్ధవ్రత నిర్విఘ్నపరిసమాప్త్యర్థంబునిర్గమనసమయం
బున శిష్టాచార ప్రాప్త పురదేవతానమస్కారంబునకు సంకటంబుచేత నవకా
శంబు లేమింజేసి యమ్మహాపురివలన ననుజ్ఞఁ గొనువాఁడై కైదోయి ఫాలం



బునంజేర్చి యిట్లనియె ॥ (ఉ) ఓపుర రాజమానుకపు రోపమధాము మనీకు
నిత్యముం । గాపుగ నున్నదైవతని కాయయుతంబుగ నానతిమ్ముమా । కీపుఁ
దీర్చిక్రమ్మఱ నహీనగతిం జనుదెంచి యవ్వలం । జూఁపుల విందుగాఁగ నినుఁ
జూచెద మింతయనుగ్రహింపవే ॥ (వ) అనిపలికి భక్తిపూర్వకంబుగా నమ
స్కరించి పదంపడి దర్శనార్థం బరుగుదెంచి దుఃఖింపుచున్న జానపదుల నవ
లోకించి వారలదుఃఖనివారణంబుకొఱకుఁ దానునుబొప్ప పూర్ణముఖుండై
దక్షిణభుజంబెత్తి యిట్లనియె ॥ (సీ) అనఘాత్ములారయథార్హంబుగాఁదొల్లి
నాయందు మీచే నొనర్పఁబడిన । యట్టి యనుక్రోశమనుకంపయును గడుఁబా
పీయమైతోఁచెఁ బరఁగమీకు । బహుకాలదుఃఖానుభవముకొఱకు నిదిచేకూడె
నేనేమి సేయువాఁడ । నిపుడుమీపనుల కేగుఁడేమర్థ సంసిద్ధికై కానన సీమ
కర్గెదఁ ॥ (తే,గీ) బోయివచ్చెదమనియిట్లు బొసఁగ రామ । చంద్రుఁ డవతరణ
ప్రయోజనమురాక । నాసురవధార్థ మని యతురార్థమెఱుక । పడవచించి
నవారు సంభ్రాంతులగుచు ॥ (ఆ,వె) రమ్యమూర్తియైన రామునకభివాద ।
నముప్రదక్షిణంబొనర్చి బాష్ప । పూర్ణవదనులగుచుఁబోవలేకందంద । నిలిచి
చూచుచుండి రలఘుసుతులు (వ) ఇట్లురామచంద్ర ముఖచంద్రామృతంబునే
త్రచకోరంబులం గ్రోలుచుఁ దనివినొందక తదీయగుణంబులచేత నాకర్షిం
పఁబడిన మనంబును గ్రమ్మఱింపంజాలక విలపింపుచున్న వారలకారఘువల్లభుం
డు సాయంకాలంబ నందు సూర్యుండునుంబోలె నగోచరుండై చక్షుర్విషయం
బతిక్రమించి నిజదేహ ప్రభాపటలంబుల నద్దేశంబువెలింగింపుచుం జని ధనధా
న్యోపేతంబులును దానశీల జనాకీర్ణంబులును శుభకరంబులును భయరహి
తంబులును రమ్యంబులును దేవతాయతన యాగీయపశుబంధనస్తంభసంకులం
బులును నుద్యానామ్రవణోపేతంబులును సంపన్నసలిలాశయంబులును హృష్ట
పుష్ట జనాకీర్ణంబులును గోపగోకుల సేవితంబులును నరేంద్రులకు రక్షణీ
యంబులును వేద ఘోషాభి నాదితంబులును నగు కోసలదేశస్థ గ్రామం

(*)రాముఁడు గంగానదిఁ జేర నరుగుట.(*)

బులన్నియు నతిక్రమించి ముందట ॥ (మ) కనియెన్రాఘవుఁ డభ్రమార్గ
విలసత్కల్లోల మాలామిళ । ద్ఘనహంసచ్ఛద జాతవాత నిపతత్స్వర్వృక్ష
కుసుమాళిచే । ననిమేషత్రిజగత్పవిత్ర మహిమ, న్వ్యాప్తిన్వితర్కించి

గాం। బ్బనఁబుష్పంబులఁబూజఁజేసిరనఁగాఁ, బొల్పొందుగంగానదిఁ॥ (వ) మఱియు దేవదానవగంధర్వ కిన్నరోరగ సేవితయగు దాని విమలపులిన విహరమాణ విద్యాధరసుందరీ సుందరకబరీసమర్పిత నూతనపారిజాత కుసుమరసాస్వాదన మత్తమధుకరఝంకార సంకులయగుదాని నిరంతరహోమధూమపటలఘనీభూత పుణ్యాశ్రమాభిరామ రమణీయతీరయగుదాని జలక్రీడా కుతూహల సమాగతవిహరమాణ దివ్యాప్సరోగణజలాశయయగుదాని నంతర్లీన దేవోద్యాన దేవక్రీడాపర్వత శతాకీర్ణయగుదాని దేవభోగ్య పద్మిని యగుదాని దేవప్రయోజనార్థం బాకాశంబున కుద్గమించినదాని దేవసంఘాప్లుత సలిలయగుదాని సముల్లసితపద్మోత్పలకైరవ షండమండలాంతర్గత విహరమాణమత్తమరాళ చక్రవాక సారస క్రౌంచరుతాభియుతంబగుదాని స్మరణ మాత్రంబున సకలకల్మషహరణ స్వభావయగుదాని దర్శనమాత్రంబున సమస్త మంగళప్రదశీలయగుదానిఁ ద్రిలోకవిఖ్యాతయగుదాని సకలలోకపావనియగుదాని జలఘాతాట్టహాసోగ్రయై మణినిర్మలదర్శనయై యాభోగపులిననితంబయై డిండీరఖండనిర్మలహాసయై శైవాలకేశయై నానాపుష్పపరాగపటల పటావృతయై వివిధకుసుమాలంకృతయై భూషణోత్తమ భూషితయైన యువతి భంగినలరుదాని దిశాగజవన గజదేవోపవాహ్యగజ ముహుర్ముహుస్స్నాదితాంతరయగుదాని శింశుమారచక్ర భుజంగనిషేవిత యగుదాని ఫలపుష్ప కిసలయద్విజగుల్మలతాశత పరివృతయగు దాని నిష్పాప యగుదాని విష్ణుపాదాంగుష్ఠనఖ నిష్ఠ్యూతయగుదాని శంకరజటాభ్రష్టయగుదాని సముద్రమహిషియగుదాని మఱియును॥ (సీ) తిలకింపనొకచోట స్తిమిత గంభీరత్వ మొకచోటవేగజ లోత్కరంబు। నొకచోట వేణీకృ తోదకం బొకచోట రమణీయ పులినాభి రంజితంబు। భీషణగంభీరఘోషణం బొకచోటనూర్మికా సందోహ మొక్కచోట। సముదంచితావర్త సముదయం బొకచోట నొకచోట ఘనవాలు కోత్కరంబు॥ (తే,గీ) నొక్కచోటఁ గైరవపంక జోత్పలంబు।లుభయతీరజతరుజాల మొక్కచోటఁ। గలిగియద్భుతవైఖరిఁ గ్రాలుదానిఁ। గలితరంగత్తరంగను గంగఁగనియె॥ (వ) ఇట్లు జాహ్నవి నవలోకించి రాముండు తనచరణంబుపగిదిఁ బద్మరేఖాలంకృతయై తనహృదయంబు కరణి నిష్పంకయై తనదానగుణంబుకైవడి బహుజీవనయై తన వనప్రయాణంబుభంగి వను



మతీజాతాభిరామయై యలరుటకానందింపుచుఁ దత్తీరంబున శృంగిబేరపురంబను నిషాదపట్టణంబుఁగని తత్సమీపంబునకుంజని సుమంత్రునవలోకించి యిట్లనియె॥ (ఉ) నూతనపుష్పపల్లవమ నోహరమైమనకాశ్రయాపర్ణమై। యీతటినీతటంబుపయి నెంతయునొప్పెడినింగుదీమహీ। జాతముఁజూచితేయిచట సమ్మతినేఁడు వసించియాపగా। జాతకళావిశేషములు సర్వముఁజూతముగాక సారథీ॥ (మ) అనినన్సూతుఁడులక్ష్మణానుమతిచేనచ్చోటికిం దేరుదోలిన రాముండురథంబుడిగ్గియలధాత్రీపుత్రియుం దమ్ముఁడో। య్యన సేవింపఁగ వృక్ష

—(*)శృంగిబేర పురాధీశుండగు గుహుండు రామునిం జూడవచ్చుట.(*)—

మూలముననధ్యాసీనుఁడై యుండెభ। క్తినిబద్ధాంజలియై సుమంత్రుఁడనురక్తిన్మందటంగొల్వఁగన్॥ (వ) అంత॥ (ఉ) ఆపురమేలువాఁడుసుగుణాభిరతుండునిషాదలోకర। క్షాపరతంత్రుఁడుగ్రబల శాలిగుహుండను పేరివాఁడు ప్రా। ణోపమమిత్రుఁడై తగుర ఘూత్తము రాక యెఱింగిసమ్మదో। ద్దీపితుఁడై హితాళిచను దేఱభజింపఁగవచ్చెరామునిన్॥ (ఉ) ఈగతినేగుదెంచు గుహు నెంతయునంతనెచూచిచాపదీ। క్షాగురుఁడైనరాముఁడుప్రసన్నముఖుండయిరమ్మురమ్మన। న్వేగమెడాయవచ్చికడు విశ్రుతకీర్తినిరామమూర్తినిం। గాఁగిఁటఁ జేర్చిమేనఁబుల కల్సెలఁగన్వినయోక్తినిట్లనున్॥ (ఆ,వె) ఓమహానుభావ యేమికారణమున। నీతపస్విరూపమిపుడుగలిగె। సఖుఁడనైననాకు సర్వంబుదయతోడఁ। జెప్పమధిపవేఱు సేయనేల॥ (క) పాయకమద్భాగ్యంబున। నీయట్టిప్రియాతిథిన్వి నిర్మలచరితు। న్శ్రీయుతునిఁ జూడఁగలిగెను। నాయట్టి కృతార్థుఁడుభువనంబులఁగలఁడే॥ (వ) అని స్వాగతంబడిగి యర్ఘ్యపాద్యాది విధులంబూజించి వెండియునిట్లనియె॥ (మ) ఇనవంశోత్తమయీధరిత్రికిఁగరంబీశుండవీవేమునీ। కనిశంబుంబనిసేయువారముమదీ యంబైన రాజ్యంబు గ్ర। ద్దనఁజేపూనిధరింపుమీపురమయో ధ్యాపట్టణం బట్లవే। డ్కనిరీక్షింపుము భక్ష్యభోజ్యములువేఁ గైకొమ్మునాపైఁగృపన్॥ (మ) అనిప్రార్థింపుచు నున్నయాగుహునిశా జాగ్రేసరుంజైనరా। మనరేంద్రుండుదయార్ద్రదృష్టిఁగనిసన్మానంబుఁగావించియి। ట్లనుఁబుణ్యాత్మకయేముసంతతమును ద్యత్ప్రీతినీచేతనుర్చనముంబొందిన వారమింతయుపుడే లానూత్నసంబంధముల్॥ (వ) అనిమైత్రింబ్రకటించి మృదుపీనంబులైన బాహువులంబరిష్వజించి వెండియు నిట్లని

యె॥ (చ) అనుపమపూర్వజన్మసుకృ తాతి శయంబున నిన్ను నేఁడులో । చన
ములు చల్లఁగాఁ గఁగని చాలఁ గృతార్థుఁడనైతి నీసుతుల్ । దనయులు చుట్టము
ల్సఖులు దాయలు సైన్యపతుల్కరుల్హయల్ । ఘనముగ సంతతంబునుసు ఖస్థితి
నొప్పదురే సఖాగ్రణీ॥ (చ) అనఘవిచారనీవొసఁగు నట్టి సపర్యలు మాకుస
చ్చెను । జనకుని యాజ్ఞ చేసి యతి సంధిలఁ దాపసవృత్తిఁ గానలోఁ । బనివడి స
ద్వ్రతంబు సలుపంజను నేనిట భక్ష్యభోజ్యము । ల్గొనుటయ సంగతంబున య
కోవిదయీవినయంబు చాలదే ॥ (వ) ఈ తురంగమంబులు మార్గాయాసం
బున డస్సియున్నయవి ఘాస పానీయంబులచేత వీనికిం దృప్తిఁ గావింపుము
నన్నుం బూజించినట్లకా సంతసించెదననిన నట్లకాయని తగువారల నశ్వరక్ష
ణంబునకు నియోగించె నంత నారఘుపుంగవుండు కాలోచితకృత్యంబులుదీర్చి
లక్ష్మణదత్తంబైన గంగానదీజలంబుఁ గ్రోలి సుమంత్రవిరచితంబైన పర్ణతల్పంబు
నఁ బత్నీసమేతంబుగా నధివసించె నప్పుడు లక్ష్మణుం డన్న చరణంబుల గంగో
దకంబులఁ గడిగి తడియొత్తి కొంతదడవు శుశ్రూషఁ గావించి పదంపడి ధనుర్ధ
రుండై కొలిచియుండె గుహుండును సూత సహితంబుగా సౌమిత్రితోడ సం
భాషింపుచు ధనుర్ధరుండై కాచియుండె నంతఁ గొంతరాత్రి చనిన యనంతరంబ
భ్రాతృ రక్షణాయత్తచిత్తుండై యదంభంబున నిద్ర వేఁగింపుచున్న లక్ష్మణుం
జూచి సంతాపసంతప్తుండై గుహుండిట్లనియె॥ (చ) అతులితవైభవోన్నతిను

—(*) గుహుఁడు లక్ష్మణుఁడు నిద్రపోక యుండుటను జూచి పరితపించుట. (*)—

హా సుకుమారుఁడ వయ్యు నీవు నీ । గతి నడురేయిఁ గాల్నిలిపి కంటికి నిద్దురఁ గా
చియున్కి నా । మతికి విషాదమయ్యెడిఁ దక మావరపుత్ర త్వదర్థ మిందుఁ గ । ల్పిత
మగు పర్ణతల్పమునఁ బ్రీతి సుఖస్థితిఁ బవ్వళింపవే॥ (ఆ,వె) అనఘ చరితకష్టమనుభ
వింపఁగ నాకుఁ । జెల్లుఁ గాక నీకుఁ జెల్లునయ్య । ఘనసుఖోచితుఁడవు కడుసుకుమా
రుఁడ । వతిమృదుండ వవనిపాత్మజుఁడవు॥ (చ) అనవరతంబు నీదు కృప నందిన వార
ముగా నిసజ్జనా । వనగుణధుర్య యేము కడ,వారముగాము సుమయ్య యీని
శం । బనివడి బంధువుల్సఖులు, భ్రాతలు జ్ఞాతులు గొల్వ నిద్రమే । ల్కని
యెడు నంతదాఁక మిముఁ, గాచెదఁ గంటికి ఱెప్ప కైవడిన్ ॥ (మ) ధరనె
వ్వాని కృపన్నితాంతయశము, న్ధర్మాత్మ కామంబులుం । బరమైశ్వర్యము
నాకుఁ గల్గె సుఖసం, పల్లాభముం గంటి నా । నరవర్యుం డగు జానకీప్రియున



కన్న స్సత్ప్రియుం డెవ్వఁడు । ర్వరలో లేమి యథార్థమింతయు సుమిత్రా
పుత్ర చర్చింపఁగన్ ॥ (తే,గీ) నరవరాత్మజ గహనగోచరుఁడనైన । నా
కుఁ దెలియని దీవిపినంబు నందొ । కింతయును లేదు బల మోపి, నంత గల
దు । శంక విడిచి నిద్రింపుము, శయ్యయందు ॥ (ఉ) నావిని లక్ష్మణుండు క
రుణంబుగ నాగుహుఁ జూచి పల్కెనో । భూవినుతప్రతాప విను,ముజ్జగమే
లుట కర్హుఁడైన యీ । భావజసన్నిభుం డిటులఁ, బర్ణతలంబునఁ బవ్వ
ళింప నా । కేవిధి నిద్రవచ్చు సుఖ,మేటికి జీవిత మేల చెప్పుమా ॥ (ఆ,వె)

(*) లక్ష్మణుఁడు రాముని వనవాసమును గుహునితోఁ జెప్పి దుఃఖించుట. (*)

అనఘ ధర్మవిదుఁడ,వైన నీచేత ర । క్షితుల మైన మాకు మది నొకింత । గ్రు
న భీతి పుట్ట, దన్యుఁడ వీవు గా । వాదరింపఁ బడితి, నదియె చాలు ॥ (క) ర
ణమున నేవీరుఁడు సుర । గణమునకైన నెదిరింపఁ, గా రాక బలో । ల్బణవృ
త్తి నలరు నాయన । తృణములపై నేఁడు పవ్వళించెం గంటే ॥ (తే,గీ) ఘ
నతపముచేత వివిధయాగములచేత । దానములచేత సకలమంత్రములచేతఁ ।
బ్రాప్తుఁడై తుల్యగుణుఁడయి,పరఁగెఁ గాన । జనకున కతిప్రియాత్మజుం డనఘ
యితఁడు ॥ (ఆ,వె) అట్టి రాఘవాన్వయ ప్రదీపకుఁడైన । యితఁడు ఘోరవ
నికి, నేగుచుండఁ । జూచి తండ్రియైన, క్షోణీశ్వరుఁడు మను । ననెడుమాట సం
దియంబు గాదె ॥ (వ) పితృమరణానంతరంబున మేదినియనాథయై యుండ
గలదు యువతు లందఱు నాక్రందనంబుఁ గావించి యలసి నిరానందలై యుం
దురని పలికి వెండియు నిట్లనియె ॥ (చ) నిరుపమ వాద్య ఘోషముల, నృ
త్యరవంబుల గీతనిస్వనో । త్కరముల భూషణద్యుతులఁ, దద్దయు సొంపు వ
హించు రాజమం । దిర మది నేఁడు సంక్షుభిత,నీరధి మాడ్కి వినష్టతారకాం
బరము విధంబున న్నిగులఁ, బాడఱి నట్లుగ నుండునే కదా ॥ (క) మాయ
య్యయుఁ గౌసల్యయు । మాయమ్మయు నేఁటిరాత్రి, మహనీయ గుణ । శ్రీయు
తుల మన్నుఁ గానక । పాయత నేపగిది వీట,బ్రతుకుదు రకటా ॥ (తే,గీ) అ
నఘ మాతల్లి శత్రుఘ్ను,నాశ్రయించి । యొకవిధంబున ధర మని, యుండుగా
ని । యేకసుతయైన కౌసల్య,యెట్లు బ్రతుకఁ । గలదు తీర్పంగరాని దుఃఖము వ
హించి ॥ (క) అనురక్తజనాకీర్ణం । బును లోకసుఖావహంబు, భూరిద్యుతి
యా । ఘనసాకేతము వ్యసనం । బునఁ గ్రాఁగి నశించు నింకఁ,బుణ్యచరిత్రా ॥

(తే, గీ) అగ్రతనయుండు ప్రియుఁడు మహాత్ముఁడైన । రామభద్రుని విడిచిన, రాజవరుని । యొడలఁ బ్రాణంబు లెబ్భంగి, నుండు నతఁడు । ప్రియ కుమారుఁడు వృద్ధుఁడు, నయవిదుండు ॥ (తే, గీ) విపులయశుఁడైన రాముని, విపినయాత్రఁ । దలఁచి శోకాగ్ని చేఁ గ్రాఁగి, తనువు విడుచుఁ । గాక కౌసల్య మని యుండఁ, గలదె యింక । నాయమవితాన మాయమ్మ, యడలుఁ గాదె ॥ (క) గ్రద్ధన భూమీశ్వరుఁడా । యిద్ధముముద్దియలపాటు, హృదయంబునఁదాఁ । దద్దయుఁ జింతించి ఘనవి । పద్దశచే డస్సిమేనుఁ, బాసెడుసుమ్మీ ॥ (ఆ, వె) ఇట్టిమాటఁ దలఁప, నెంతయు నాగుండె । యవియుచున్న దట్టి, యడలు మాని । సమ్మదమున నేఁడు, ఱొమ్మునఁజేయిడి । నిద్రవోవ నెట్లు, నేర్తు నయ్య ॥ (ఆ, వె) తనయు విపినయాత్రఁ, దలపోసి మృతుఁడైన । తండ్రి సంస్కరించి, ధన్యు లగుచు । వ అలుచుందురట్టి భరతాదులకుఁబోలెఁ । గలుగ దయ్యె భాగ్యగరిమ మాకు ॥ (ఆ, వె) తపము చేసి మమ్ము నపురూపముగఁ గాంచి । పెంచినట్టిజనకుఁ డంచితముగఁ । బ్రతికియుండెనేని క్రమ్మఱఁ జను దెంచి । నపుడు గాదె చూచి యుఱుదు సెల్ల ॥ (వ) మఱియు మృతుండైన దశరథుని సత్కరించి ధన్యులై భరతాదికుమారులు రమ్య చత్వరస్థానంబును సువిభక్త మహాపథంబును హర్మ్యప్రాసాద సంపన్నంబును గణికావరశోభితంబును గజాశ్వరథసంబాధంబును దూర్యనాద వినాదితంబును సర్వకల్యాణ సంపూర్ణంబును హృష్టపుష్టజనాకులంబును నారామోద్యాన సంపన్నంబును సమాజోత్సవశాలియగు సాకేతనగరంబున యథాసుఖంబుగా విహరించెద రేము వనవాసంబు నిర్వర్తించి సత్యప్రతిజ్ఞులమై సేమంబుతో నయోధ్యాపురంబుఁ బ్రవేసించి దశరథుండు జీవించియుండె నేనియు నమ్మహాత్మునిపాదంబులకభివందనంబుఁ గావించెద మని సత్యంబుగాఁ బలికిన నా సుమిత్రాపుత్రుని వాక్యంబు విని గుహుండు రాముని యందుగురు సౌహృదంబువలన జ్వరాతురంబైన గజంబుపోలిక సంతాప సంతప్తుండై కన్నీరు నించుచుండె నంతఁ బ్రభాతకాలం బగుటయు రాముండు మేల్కాంచి సౌమిత్రి నాలోకించి యిట్లనియె ॥ (మ) కృకవాకుల్ మొఱయందొడంగె శిఖులు గ్రీవంబులై మ్రోసెవిం । బికపుల్గూయఁదొడంగె నల్లదిగొ ప్రాగ్దేశంబినచ్ఛాయచే । సకలంకస్థితినొప్పె భానుఁ డుదితుండై రాఁగలండింకఁ ద । క్కక నీయాపగ దాఁటిపోద



(*లక్ష్మణునాజ్ఞ గుహుఁడు గంగ దాఁటుటకోడఁ దెప్పించుట*)

మనన్ గాకంచు నాతండాగిఁ ॥ (ఆ, వె) గుహునిఁ జూచి పల్కెఁ గొబ్బున నీవుసు । మంత్రుఁ గూడి నీదు మంత్రివరులఁ । బనిచి గంగ దాఁటి చనుటకు నోడ దె । ప్పింపు మనిన నతఁడు, పెంపుతోడ ॥ (వ) తనమంత్రులం జూచి మీరు రయంబునం జని సువాహనసంయుక్తయగు దానిఁ గర్ణగ్రాహవతి యగు దాని సుప్రతారయగు దాని దృఢసంధిబంధయగు దాని శోభన స్వరూపయగు దాని నొక్క నావ యవతరణమార్గంబునం దెండనిన విని నాగుహామాత్యు లట్టినావఁ దెచ్చి గుహునకు సమర్పించిన నతండు దాని రామునకుం జూపి ప్రాంజలియై దేవా యిమ్మహానది నుత్తరించుటకు యోగ్యంబైన సాధనం బుపస్థితం బయ్యె దీని నారోహింపుఁ డనిన నారాముండు గుహునిం జూచి నీచేతఁ గృతకాముఁడ నైతి నట్లు సేయంగల వాఁడ ఖనిత్రపిటకాది సాధనంబులును వైదేహీ వస్త్రాభరణాదికంబును నోడమీఁదం బెట్టింపు మని పలికి సౌమిత్రిస హితంబుగాఁ దనుత్రాణంబులు దొడిగి తూణీరంబులు బిగించి కృపాణంబులు ధరించి కోదండ పాణియై రథారోహణంబు సేయక వైదేహిం దోడ్కొని పాదసంచారంబున నోడసమీపంబునకుం జను సమయంబున సుమంత్రుండు నిటల ఘటితాంజలిపుటుండై దేవా యేమి సేయం గలవాఁడ నానతిం డని వినయంబునం బల్కిన నారఘువల్లభుండు గజేంద్రహస్తప్రతిమంబైన దక్షి

(*) రాముఁడు సుమంత్రు నయోధ్యకుఁ బొమ్మని చెప్పుట. (*)

ణకరంబున నతని సంస్పృశించి మందమధుర వాక్యంబుల నిట్లనియె ॥ (చ) భరతుఁడు వీట లేఁడు నరపాలుఁడు మద్వనయాత్ర కాత్మలోఁ । బరమవిషాద మొందుచు విపద్దశచే నడలూనుఁ గాన స । త్వరగతి నేగి నీవొక విధంబున నాయనఁ దేర్చుచుండు మో । పరమసఖా వనంబునకుఁ, బాదగతిం జనువార మెంతయుఁ ॥ (చ) అనిన నతండు దీనుఁడయి, యాయన కిట్లను దేవ యేమనం । జను వనితాయుతంబుగ నిజంబుగఁ గాఱడవిం జరింపు మం । చనయము నీకుఁ బ్రాకృతున, కట్ల కృతాంతుఁడు చేయుచుండ న । న్యునకు మనుష్యమాత్రునకు, నొక్కనికి న్వశమే మరల్పఁగ ॥ (తే, గీ) అనఘ చరిత నీయట్టిమహాత్ముఁ డిట్టి । కష్టదశ నొందుచుండంగఁ గాంచి మార్జ । వార్జవ బ్రహ్మచర్యంబు లందధీత । మందునుఫలోదయంబు లే దనితలంతు ॥ (వ) దేవా

నీవు పితృనియోగంబున వైదేహీలక్ష్మణ సహితంబుగా వనవాసంబు సలుపు టంజేసి ముల్లోకంబులనతిక్రమించి నిక్కవంబుగాఁబరసిద్ధివడసెదవు తమసా తీరంబున నిద్రాసమయంబునం దవిదితగమనంబునఁ బౌరులవంచించిచనుదెం చునప్పుడేను నిన్నుబలాత్కరించి క్రమ్మఱించినకతంబున నేమందఱము నీచేత వంచితులమైతి మింకఁ బాపభాగినియగు కైకేయికడ నెట్లుఱంగునజీవించెద మని దుఃఖార్తుండై రోదనంబుసేయుచుఁ బ్రాణసముఁడైన యమ్మహానుభావుని విడువంజాలక పరిభ్రమింపుచున్న సుమంత్రుంజూచి రోదన జనితా శుచిత్వ నివారణార్థంబు జలస్పర్శనంబుసేయించి పరిశుద్ధుం గావించి మధుర వా క్యంబుల ననూనయింపుచు నిట్లనియె॥ (క) మనువంశజులకునీతో। సెనయ గుసన్మిత్రుఁడన్యుఁ డికలేఁడటుగా। వునదశరథజనపతివగ। పునకుం జొరకుం డునట్లు బోధింపుమతఁ॥ (తే,గీ) అనఘమాయయ్యననుఁబాసి యడలుచుం డు। నమ్మహాత్మునిశోకంబుఁగ్రమ్మఱింపు। మధికవృద్ధుండుకామ భారావసన్నుఁ।

*రాముఁడుసుమంత్రునితోదశరథాదులకుఁదననమస్కారములుదెల్పుమనుట.*

డగుటనిట్లొత్తిచెప్పంగఁ దగియెనేఁడు॥ (వ) మఱియు మహీపతులుస్వతంత్రు లుగావున వలయు నెడల నిందాస్తుతివిచారంబుదక్క నిగ్రహా నుగ్రహంబులు సలుపుచుండుదు రట్టివారి చేతకుం దెగడుట బుద్ధిమంతుల కుచితంబు గాదు దశరథుండు కైకేయిచిత్తంబువడయుటకు నెద్దిపంచిన దానింగాదనక చేయు చుండుము మఱియు మహీరమణుం డేకార్యంబు నుద్దేశించి యప్రియంబును దుఃఖంబును సంతాపంబును బొందకుండునట్టికార్యం బట్లు గావింపుము నీవి ప్పుడురయంబునఁ బురంబునకుంజని వృద్ధుండును జితేంద్రియుండును నదృ ష్టదుఃఖుండుననగు మహీపతిని సముచితంబుగాసందర్శించియభివాదనంబుఁ గావించి నావచనంబులుగా నిట్లనుము॥ (చ) మిహిరకులేశ నీకుఁబ్రణమిల్లె దనేనును లక్ష్మణుండుభూ। దుహితయునీయనుగ్రహము తోడుగశోకముదక్కి దండకా। గహనవనంబునన్సమయ కాలముదాఁకవసించిగ్రమ్మఱ। న్నహిఁజను దెంచియవ్వలఁది రంబుగనీపదమాశ్రయించెదఁ॥ (తే,గీ) రాజ్యహీనులమైతి మరణ్యవాస। మావహిలెనంచుమదినించు కైనవగవ। కధిపయేనును లక్ష్మ ణుఁడవనిపుత్రి। సుఖులమైయున్న వారమి చ్చోటనిపుడు॥ (వ) అనివిన్నవించి పదంపడి మజ్జననియగు కౌసల్యాదేవికభయంబుఁదెలిపి సుమిత్రననూనయించి



కైకేయి సంతాపంబుమాన్చి తక్కినతల్లుల కారోగ్యంబుఁ దెలిపి విశేషించి మాముఖ్యవచనంబులుగా మజ్జననికి మత్కుశలంబుఁదెలిపి యభివాదనంబుఁ జేసి వెండియు జగతీపతితోఁ గార్యంబు తెఱం గిట్లనిచెప్పుము॥ (చ) భరతుని వేగరాఁబనిచి బంధువులెల్లనుసమ్మతింపఁగా। నిరుపమ రాజ్యపీఠమున నిల్పు మతండుభవన్మనోవ్యథ। న్బరువడిఁదీర్చునంచునర పాలునితో వివరింపుమమ్మ లం। దఱసమదృష్టిఁజూడుమని నాపినతమ్మునితోడనాడుమీ॥ (తే,గీ) తండ్రిప నుపునరాజ్యంబు తవిలియేలు। నతఁడుభయలోకసుఖతంత్రుఁ డగుచునలసుఁ। గానదశరథునానతిఁ బూనిరాజ్య। మేలుమని కైకకొడుకుతోఁ జాలఁజెపుమ॥ (తే,గీ) మఱియుఁదలిదండ్రులందుస మానభక్తి। గలిగివర్తింపుమనిశంబు కైకయందుఁ। బోలె నిశ్చలభక్తిస ల్పుముసుమిత్ర। యందుమజ్జననియుత్రియుం దనుచుఁజెపుమ॥ (వ) విశేషించి దూరం బరుగుఁదెంచితి నింక రథంబుఁ గొని యరుగుమనిన నతండు సంతాపసంతప్తుండై వెండియు స్నేహంబున రాముని విలోకించియిట్లనియె॥ (క) మునుకొనిభక్తిస్నేహం। బునసౌహృదముననవిక్ల

సుమంత్రుఁడు రామవియోగమునుదలంచి దుఃఖించుట.

బుఁడనై యేనా। డినమాటతప్పగాఁగొన। కినవంశశ్రేష్ఠ యేలు హృదయము నందుఁ॥ (తే,గీ) అనఘతనయునిఁబాసిన జననిమాడ్కిఁ। ద్వద్వియోగసం భూతమ ద్వారదుఃఖ। మున నిరానందమై యున్న పురవరమున। కెట్లు చను వాఁడనానతి యిమ్మధీశ॥ (తే,గీ) మిహిరకులవర్యమునుభవత్సహితమైన। రథ ముగ్రమ్మఱనిటుభవ ద్రహితమగుచు। నుండవీక్షించి వీటిలోనున్న వారు। పద్మ దళలగ్నజలముల భంగిఁగారె॥ (తే,గీ) సూతపరిశేషమైన యీ శూన్య రథ ము। నాజిహతవీరమైనసైన్యమునుబోలెఁ। జూచి సాకేతనగరంబు శోకతాప। యుక్తమైకడుదైన్యంబు నొందుఁగాదె॥ (తే,గీ) జనవరాత్మజదూరదేశమున నున్న। వాఁడవైననునినువీటి వారుమ్రోల। నున్నవానిఁగ మదినెంచి యోగి రంబు। గుడువనొల్లకయుందురు జడతనొంది॥ (చ) కడువడి నీవు ప్రోల్వెడలి కాననసీమకునేగుదెంచున। ప్పుడునినుఁబాయలేకబల ముఖ్యులు పౌరులమా త్యకుల్సుఖు। ల్దడయక దుఃఖశోకమునఁ దద్దయునాకుల పాటునొందుచు। న్జడత వహించియుండుటయు సర్వమునీక దిదృష్టమేకదా॥ (తే,గీ) సాధునుతశీల నీప్ర వాసనమునందు। నగరజనముచేనెద్దియో నర్పఁబడియె। నట్టిరోదనశబ్దమీ వట్టి

తేరు। దేఱిచూచినశతగుణాధికముగాదె॥ (తే,గీ) ఇనకులోత్తమయీదుఃఖ
మెల్లహారి। కోడకేనెయున్నర్చినవాఁడనగుదు। నన్నియునటుండనిమ్ముధరాధి
నాథు। శోకతాపంబునాకట్టె చూడవశమె॥ (తే,గీ) దోషముని యెన్నకిటున
న్న దుఃఖవార్థి। లోనఁబడఁద్రోచిపోవంగఁ బూనితేమ। హాత్మదయమాలి
యల్లైన నసువులిపుడె। విడుతుఁగాకేలపోదున వీటికధిప॥ (సీ) రాజవంశాం
భోధి రాజనిన్నిటఁబాసి యేనొంటిఁబురమునకేగనచట। మీతల్లికౌసల్య నాత
నూభవునెందు విడిచివచ్చితివని యడుగనామె। కేమని చెప్పుదు నోమహాదే
వినీకొడుకునుమాతులుకులమునందు। డించి వచ్చితినూఱడిల్లుమునీవని చెప్పు
దునేదానఁ దప్పుగలుగు॥ (తే,గీ) మానితాచారు నీపుత్రుఁ డైనరాము। నడ
విలోడించివచ్చితి నంటినేని। పిడుగువంటియీవాక్యంబు నొడివినంతఁ। దడ
యకప్పుడెయసువులు విడువకున్నె॥ (క) జననుత యీహయ రాజము। లన
ఘునినినుఁబాసిశూన్య మైనరథంబుం। గొనినేఁడుమఱలఁబట్టణ। మునకేగతిఁ
బోవనేర్చుఁ బురుషశ్రేష్ఠా॥ (వ) దేవా ప్రియ దర్శనుండవైన నిన్నుం బాసి

—(*)సుమంత్రుఁడు తానును రామునితోడ వనమునకు వచ్చెదననుట.(*)—

నిమిషంబైన జీవింపంజాల నీతోడ వనంబునకుం జనుదెంచెద ననుగ్రహింపు
మట్లీయకొనవేని రథంబుతోఁగూడ నగ్నిప్రవేశంబుఁజేసెదనని పలికి వెండియు
నిట్లనియె॥ (మ) అనఘాదారుణకంటకద్రుమశిలా వ్యాప్తంబులైనట్టియా। వ
నమార్గంబులయందుఁ బాదగతిఁబో వంజాల వీస్యందనం। బనుమానింపక
యెక్కుఁడేనుసుఖమిం పారంగనెచ్చోటికిం। జననిష్టంబగునట్టిదేశమునకిచ్ఛా
భంగిఁ గొంపోయెదన్॥ (వ) మహాత్మా కాంతారంబున మీకునెయ్యది తపో
విఘ్నంబుఁగావింపుచుఁ జరించునట్టి సత్వంబులనెల్ల నేనురథస్థుండనై బాధింపు
చుండెద రాజ్యాభిషిక్తభవద్రథ చర్యాకృతంబైన సుఖంబు భాగ్య హీనుండ
నైన నాచేత నలబ్ధం బయ్యెనైనను భవత్సాహాయ్య కరణంబు చేత వన
వాస కృత సుఖంబైన ననుభవింప నిశ్చయించితి నరణ్యంబు నందు నీక
నుకూలుండ నయ్యెద నీవు నాకుఁ బ్రత్యాసన్నుఁడ వగుమని ప్రీతిపూర్వం
బుగానీచేతఁ బలుకంబడు వాక్యంబేను వినంగోరెద హయంబులు వనవాసి
వైన నీకుఁ బరిచర్య సేయుచుఁ బరమగతింబ్రాపింపఁ గలయవి యేను నిన్నుం
బాసి యయోధ్యాపురంబునకుం గాదు దేవలోకంబునకైనం బోవనొల్లవనం



బునకు శుశ్రూషఁగావింపుచు సుఖినై యుండెదనని పలికి వెండియునిట్లనియె॥
(క) వినుమఘ చిత్తుఁడు బలశా। సనునగరంబునకుఁబోవఁ జాలనిమాడ్కిన్।
జ్జనవర నినుఁ బాసిపురం। బునకరుగంజాలనన్నుఁ బుచ్చకుమింకన్॥ (క)
వనవాస వత్సరంబులు। చనినవెనుక మిమ్మునర్థిఁజారుశతాంగం। బుననిడు
కొని గ్రమ్మఱఁబుర। మునకుంగొనిపోవు వాంఛపొడమెనధీశా॥ (తే,గీ,) ఘో
రవనిలోననీతోడఁ గూడియున్న। నాకుఁబదునాలు గబ్దము ల్నయచరిత్ర।
నిమిషకాలంబులైతోఁచు నిన్నువిడిచి। యున్ననవియె నూఱేడులై యుండు
నధిప॥ (వ) దేవానీవు పరమదయాళుండవు విశేషించి భృత్య వత్సలుండవు
ధర్మాత్ముండవేను భృత్యుండనపరాధరహితుండ రాజపుత్రాశ్రిత మార్గస్థితుం
డ నన్నువిడనాడి పోవుట ధర్మంబుగాదని యిట్లుదీనుండై బహుప్రకారంబు
ల సారెసారెకుఁ బ్రార్థింపుచున్న సుమంత్రునవలోకించి భృత్యానుకంపియగు
రాముండుమధురవాక్యంబులనాశ్వాసించిసుమంత్రానిన్నుభర్తృవాత్సల్యంబు

—(*)రాముఁడుసుమంత్రునయోధ్యకుఁ బొమ్మనుటఁగారణముజెప్పుట.(*)—

గలవానిఁగా నెఱుంగుదుఁ బురంబునకుంజనుమనుటకుఁగారణంబెఱింగించెద వి
నుమనియిట్లనియె॥ (క) చెచ్చెర నగరికిఁగ్రమ్మఱ। వచ్చిననినుఁజూచి కైకవ
దలకరాముం। డచ్చుపడ వనికిఁజనెనని। యిచ్చనలరుఁబ్రత్యయార్థమేగఁగ
వలయున్॥ (క) అనఘాత్మయెనుగానన। మునకరిగినవార్తవినిప్రమోదా
న్వితయై। జనపతిమిథ్యావచనుం। డనియెడుశంకవెసవిడుచుఁగైకమదిన్॥
(క) గురుతరభరతారక్షిత। సురుచిర సుతరాజ్య జన్య సుఖమయ్యా మకుం।
దిరముగదొరకొను టదియే। పరమసఖానాకు మిగులఁ బ్రథమార్థ మిలన్॥
(క) నాకును విభునకుఁ బ్రియముగఁ। జేకొనియరదంబుఁగొనుచు శీఘ్రంబు
నన। వ్యాకుల మతివై పురిక। స్తోకగతిం బొమ్ముసూత సుగుణవ్రాతా॥ (వ)
నాచేతఁ జెప్పంబడిన యీవాక్యంబులన్నియువారివారికి వేర్వేర నెఱింపు
మనియిట్లుపెక్కువిధంబుల సారెసారెకు ననూనయింపుచు సుమంత్రునినిలు
వం బనిచి గుహునింజూచి నాకుసజనంబగు వనంబునందునివాసంబయోగ్యం
బు జనపదరహితంబైన వనంబు నందువాసంబును వన్యాహారాధశయ్యాదికం

—(*)రామలక్ష్మణులు జడలఁ దాల్చుట.(*)—

బును గర్తవ్యంబుగావున నియమంబు పరిగ్రహించి సీతాలక్ష్మణదశరథులకు

హితకాముఁడనై వనంబునకుంజనియెద నిప్పుడు జటాధారణార్థంబు న్యగ్రోధక్షీరంబుఁ దెమ్మనిపలికిన నతండట్లగావింప రాముండు లక్ష్మణసహితంబుగా సముచితప్రకారంబున జడలఁదాల్చి దీర్ఘబాహులగు నమ్మహాను భావులు చీరసంపన్నులును జటామండల మండితులునై తపోనిష్ఠా గరిష్ఠులైన మునుల చందంబున నొప్పిరి యిత్తెఱంగున రాముండుసౌమిత్రిసహితంబుగా వానప్రస్థ మార్గాను సారి యగు వ్రతంబంగీకరించి వెండియు గుహునవలోకించి ॥ (క) బలకోశదుర్గ జనపద। ములయందుఁబ్రమాదముడిగి పుణ్యోచితమ। త్యలఘుతరం బగు రాజ్యము। నలయక పాలింపుచుండు, మయ్యామహాత్మా ॥ (క) అనియిటు నిషాదనాథున। కనుజ్ఞ యిడి రాముఁ డవనిజాను, జయుతుఁడై। పెనుపొందనోడ కడకుం। జనిలక్ష్మణుఁజూచి పలికె, సంతరణేచ్ఛన్ ॥ (క) జనకసుత యబలగావున। నినకుల దానెక్కఁజాల, దీయోడ పయిం। బనివడి మెల్లన నీసతి। ననఘా యెక్కింపుమనిన, నాతఁడుప్రీతిన్॥ (క) మాను గ రామునిపనుపున। జానకినెక్కించి పిదపఁ, జక్కఁగ నోడం। దానెక్కె విదపవీరుఁడ। హీనపరాక్రముఁడు రాముఁ, డెక్కెంగడిమిన్॥ (వ) ఇట్లునావ

—(*)సీతారామలక్ష్మణులు నౌకారోహణము జేయుట.(*)—

నెక్కి యాత్మహితంబుకొఱకు బ్రాహ్మణక్షత్రియార్హంబైననావారోహణమంత్రంబు జపియించి యథాశా(స్త్ర)ంబుగా నాచమనంబుజేసి సీతాలక్ష్మణ సహితంబుగా నమ్మహానదికి నమస్కారంబు గావించి ప్రీతిసంహృష్ట సర్వాంగుండై సుమంత్రునిబలసహితంబుగా గుహునిలువ నియమించి నావికులంజూచి రయంబుననోడ గడుపుండనిన వారట్లుగావింప నయ్యోడ కర్ణధారసమాహితయై మహార్ణవంబునంజను మందరాచలంబుచందంబునం బోవుచుండెనప్పుడు సీతాదేవి యంజలిఁగీలించి యమ్మహానదినుద్దేశించి యిట్లనియె ॥ (క) దేవీ

—(*)సీతాదేవి గంగానదినింబ్రార్థించుట.(*)—

యీ మనదశరథ। భూవల్లభసుతుఁడు, విపినభూమికరిగెడి। న్నీవచ్చటఁగృపమెఱయఁగ। వావిరిరక్షింపుచుండ, వలయుంజుందీ ॥ (క) ఈరేడబ్దంబులువన। ధారుణివసియించి యవలఁ,దమ్ముఁడునేనుం। గోరికసేవింపఁగఁజను। దేరఁగలఁడునిన్నుఁజూడ, దేవీమఱలన్ ॥ (తే,గీ) త్రిపథగయనంగసాగర దేవియనఁగ। నఖిలవిష్టపపావని, యనఁగబ్రహ్మ। లోకగామిని యనఁగన స్తోక



మహిమ। ధాత్రివిఖ్యాతిఁగైకొన్న, దానవీవు ॥ (తే,గీ) అట్టినీకు నమస్కార మాచరింతు। సర్వనామప్రసాదిని సపతినగుచు। మఱలవచ్చితినేని సమ్మద మెలర్ప। వివిధభంగులఁ దృప్తిగావించుదాన ॥ (క) పాయకమద్వల్లభుఁడగు। నీయనఘుఁడు మఱలభూమి,కేలికయైన। న్నీయానసీకుఁబ్రియముగ। వేయిమొదవులిత్తు వేదవిప్రులకెలమిన్ ॥ (వ) మఱియునరణ్యావాసంబు పరిసమాప్తినొందించి క్రమ్మఱ నయోధ్యకుం జనుదెంచునప్పుడు సురాఘటసహస్రంబుల మాంసభూతోదనంబున నీకుఁదృప్తిజెందించెద మఱియునేక సువర్ణవస్త్రాభరణాదులు బ్రాహ్మణులకొసంగెద భవదీయతీరనివాసులైన దేవతలను భవదంతర్లీనంబులైన ప్రయాగాదిపుణ్యతీర్థంబులను గాశ్యాద్యాయతనంబులును సంతుష్టంబులంజేసెద ననియివ్విధంబున నపాంసులా శిరోమణియగు వైదేహి భాగీరథింబ్రార్థింపుచుండ నయ్యోడతద్దక్షిణతీరంబుసేరం జనియెనప్పుడు సీతాలక్ష్మణసహితంబుగా నావడిగ్గి తటంబెక్కి తమ్మునింజూచి యిట్లనియె ॥ (క) సజనస్థలమునన నైనను। విజనంబగుచోటనైన వేయిగతులభూ। మిజనధికయుక్తిఁగాచుట। గజవిక్రమ మనకువలయు,కార్యముసుమ్మీ ॥ (క) కావునముంగలియైచను। మీవునడుమజనకపుత్రియే తెంచెడినే। వావిరిమీయిద్దఱకుం। గావలియైవెనుకప్రాపు, గాఁజనుదెంతున్ ॥ (తే,గీ) పురుషశార్దూలయిూగోల, పుట్టియెన్నఁ। డిట్టికష్టంబులెఱుఁగనిదిపుడుచారు। ణాటవీవాససంభవాయాసమొంది। యాత్మశోకింపుచున్నది, యకట్టకంటె ॥ (క) జనరహితము విషమముభయ। జనకంబగు గహనమందుఁ జనుచున్నదిగా। వున నేమఱకిప్పుడుమన। మనఘా రక్షింపవలయు, నంగనయగుటన్ ॥ (వ) అనియాజ్ఞాపించిననట్లకాకయని లక్ష్మణుండుమహాధనుర్ధరుండై యగ్ర భాగంబునం జనియె వైదేహిమున్నిడుకొనిరాముండు పిఱుందదెసం బోవుచుండెనంత సుమంత్రుండు భాగీరథీదక్షిణతీరంబునం బోవుచున్న రాముని దవ్వులంజూచి కూడముట్టుటకు సామర్థ్యంబులేమింజేసికన్నీరు నించుచుండె నిట్లురాముండు గంగానది నుత్తరించి శుభసస్య సమృద్ధంబులగుతత్తీరదేశంబులువిలోకింపుచు వ్యాఘ్రాది క్రూరమృగంబులం దోలుచు నాహార యోగ్యంబులగు వరాహ ఋశ్యరురుపృషత సంజ్ఞ మృగంబుల వధించి వానిం గొని బుభుక్షితులై ప్రొద్దు గ్రుంకు నంతకు నొక్క వనస్పతి డాయం జని వరుణప్రియ యగు సం

ధ్య నుపాసించి జానకీవల్లభుండు సౌమిత్రి నవలోకించి యిట్లనియె ॥ (క) ఏ
నిశ సుమంత్రవిరహిత । మైనేఁడిట మనకుఁ దోఁచె, నారాత్రి బహి । స్థానని
వాసంబున కిది । మానుగ మొదలిటిది గాదె, మనుజశరణ్యా ॥ (తే,గీ) అ
నఘ నేఁడాదిగాఁగ ని,త్యంబు రాత్రు । లందు సమధిజ్యధన్వుల,మై సహస్ర ।
గతుల నరయుచు నిద్దురఁ, గాచియుండ । వలయు సీతకు భయమింత,గలుగ
కుండ ॥ (ఆ,వె) మఱియు నేఁడు మొదలు, మనుకులవర్య ని । త్యంబు రా
త్రులందు, స్వార్జితంబు । లైన పర్ణతృణము,లవనిపైఁ బఱచి వ । సింత మొ
క్కచోటఁ, జేరుదనుక ॥ (వ) అని పలికి మహార్హశయనోచితుండైన కౌ
సల్యానందనుండు సీతాలక్ష్మణసహితంబుగా నవ్వనస్పతి మూలంబున నధ్యా
సీనుండై సౌమిత్రితోఁ బుణ్యకథాప్రసంగంబులు సేయుచు నంతకంతకుఁ బ్రసం
గవశంబునం బెరుఁగుతలంపు లూర వెండియు లక్ష్మణున కిట్లనియె ॥ (మ) అ

(*) రాముఁడు దశరథాదులఁ దలంచుకొని దుఃఖించుట .(*)

నఘా యీనిశ మేదినీవిభుఁడు శోకాకల్పితస్వాంతుఁడై । ననుఁ జింతింపుచు
నేమి దోఁచక నిరానందంబుగా నుండు న । ట్లనె కైకేయి సపత్ని పుత్రుఁడు
మహారణ్యోర్వికిం బోయెనే । ననిశంబింకఁ గృతార్థనైతి నని యాహ్లాదిం
పుచుండుం గదా ॥ (తే,గీ) మఱియు నద్దేవి మాతుల,మందిరమున । నుం
డివచ్చిన తనపుత్రు, నొప్పఁజూచి । రాజ్యకారణమున మహీ,రమణుఁ గూర్చి।
మిడుక మిడుక ప్రాణంబులు, విడువదు గద ॥ (తే,గీ) అకట వృద్ధుఁ డనా
థుఁడు,నగు నృపుండు । కామభారావసన్నుఁ డు, గాననేను । లేనిచోఁ దాను
గైకకే,ధీనుఁ డగుచు । నేమిసేయంగఁ గలఁ డిప్పు,డింకఁ జెపుమ ॥ (తే, గీ)
కైక యీవాక్యరశ్మిచేఁ గట్టువడిన । మనుజనాథుని మతివిభ్ర,మంబుఁ జూచి ।
రాజకులవర్య యర్థధ,ర్మములకంటెఁ । గామము గరీయమని తోఁచెఁ,గా
దెనాకు ॥ (తే,గీ) కానిచో నుర్వి నెంతదు,ష్కర్ముఁడైన । సుతుని సుగు
ణాభిరతుని సు,వ్రతుని నృపుని । కరణి నెవ్వఁడు విడుచు న,కారణముగ । ల
క్ష్మణా యది కామధ,ర్మంబు గాదె ॥ (మ) అనఘా యేభరతుం డొకండె
పితృద,త్తైశ్వర్యము నంతతం । బును బాలింపుచుఁ బత్నిఁ గూడి సుఖస,మ్మో
దాత్ముఁడై యుండు న । య్యనఘుం డేను ప్రవాసినై దశరథుం,డంతంబు నొం
దంగఁదా । ననిశం బేక ముఖంబుగా నఖిలరా,జ్యశ్రీలఁ బాలింపఁడే ॥ (క)



ధర నెవ్వఁడర్థధర్మ । స్ఫురణ ముడిగి ముఖ్యకామ,మున వర్తిలున । ప్పు
రుషుండు దశరథుక్రియ । భరతానుజ దుర్విచార,పరుఁడై యుండున్ ॥ (క)
అనఘా కేకయపతినం । దన మనయిలు సొచ్చు పెల్ల,నావనవాసం । బునకు
విభుని మరణమునకుఁ । దనయుని రాజ్యమున కనుచుఁ, దలఁచెద బుద్ధిన్ ॥
(క) కైకేయి తనసుతుండు ర । సాకాంతుం డగుచు నుండ, సౌభాగ్యమద ।
వ్యాకులతన్మన యమ్మలఁ । జీకాకుం జేయుచుండు, సిద్ధము వత్సా ॥ (క) నా

(*) రాముఁడు లక్ష్మణునయోధ్యకుఁ బొమ్మని చెప్పుట. (*)

కతమున మీయమ్మకు । నీకష్టపుపాటు గలిగె, నిఁక నాపనుపుం । గైకొని గ్ర
మ్మఱఁ బురికి । వ్యాకులమతి వగుచు నరుగు,మమ్మల కడకున్ ॥ (తే, గీ) ఏ
ను వైదేహితోఁ గూడఁ, గాననమున । కెల్లినొక్కెడ నరిగెద,హీనవృత్తి । బ
డలి దిక్కెవ్వరును లేక, నడలుచున్న । మాయమకు నీవు దిక్కయి, మనుపు
మచట ॥ (వ) మఱియు క్షుద్రకర్మయగు కైకేయి ద్వేషకృతోచితంబైనయ
న్యాయం బాచరించుగావున నీవు మజ్జననీరక్షణంబేమఱకుండుమని ధర్మజ్ఞుం
డగు భరతునకుం జెప్పుము॥ (తే,గీ) సాధునుతశీల తొల్లిమ జ్జననిచేత । రాజ
ముఖులు పెక్కండ్రు పుత్రకులచేత । నలవియోజితులైరిగా నలయునట్టి । పా
పమిప్పుడయ్యమకుసం ప్రాప్తమయ్యె॥ (తే,గీ) రాజనందన పెక్కుకా లమున
నుండి । ప్రీతితో బహువిధములఁ బెంచినట్టి । యంబనాచేత ఫలకాల మందువి
డువఁ । బడియెఁదల్లికి నాయట్టి కొడుకు లేల॥ (తే,గీ) మిగుల సమ్మోదమునొసం
గఁదగినయేను । గాఢసంతాప మొసఁగిన కారణమునఁ । బరఁగ నాయట్టి తన
యుఁడు ధరణి నెంత । కలుషచారిణికైనను గలుగవలదు॥ (గీ) శత్రుభూతౌ
తుపాదదం శనమొనర్పు । మనెడు సద్దాని పల్కుమ దంబచేత । వినఁబడియె
నట్టిశారిక వీరజనవ । రిష్ఠ నాకంటెఁ బ్రీత్యతిరిక్తయయ్యె॥ (వ) వత్సామాతృ
సంవర్ధిత తిర్యగ్జాతిసంభూత శారికాకృత ప్రియదానమాత్రంబైనను నాచే
నకృతంబయ్యెఁ బుత్రకృతప్రయోజనరహితయై శోకింపుచున్న యల్పభాగ్యయ
గు కౌసల్య కేను బుత్రుండనై జన్మించుటంతయు నిరర్థకంబుగదా యని మి
క్కిలివగచి వెండియునిట్లనియె॥ (తే,గీ) అనఘుననుఁబాసి ఘోరశోకాభిమ
గ్న । యైపరమదుఃఖసంతాప మనుభవించె । నకట కౌసల్యదానెంత యల్పభా
గ్య । యయ్యెనయ్యమ కెద్దిది క్కరయనింక॥ (చ) అనఘ చరిత్ర యేనొకఁడ

నల్క-వహించి యయోధ్యనుర్వర । న్సునిశితబాణజాలములఁ జూర్ణముఁ జేసి
విభుత్వమర్థిఁ గై । కొనుటకు మేటినయ్యునయ కోవిదవర్యయధర్మసాధ్వసం।
బునఁబరలోకభీతినది పోవుట కెంతయు సమ్మతించితిక్॥ (క) అనియీగతివిలపింపు
చు । జనకసుతావిభుఁడు శోక, సంతాపముచేఁ । గనుఁగొనలనశ్రుకణములు।
చనుదేఱఁగ నూరకుండె, జాలి జనింపన్ ॥ (తే,గీ) అంత సౌమిత్రి విగతా
ర్చి, యైనవహ్ని । కరణి నిర్వేగమైన సా,గరము పగిది । భూరి దుఃఖార్తిఁ
విలపించి, యూరకున్న । యగ్రజు ననూనయింపుచు, నతఁడుపలికె ॥ (తే,గీ)
దేవ మీచెప్పినట్లనె, నీవు వెడలి । రాఁగ గతపూర్ణశశి యైన, రాత్రిభంగి । ని
ష్ప్రభత్వంబు నొందుట, నిజమయోధ్య । తండ్రి పరితాప మింతని, తలఁప
రాదు ॥ (తే,గీ) నరవరోత్తమ సీతను, నన్నుఁ గూర్చి । డెందమునఁ బరితా
పంబు, నొందవలవ । దీవిచారంబు నినుఁ దపి,యింపఁ జేయు । ధైర్యవంతు
న కిది యుచి,తంబు గాదు ॥ (క) మనుకుల శేఖరయేనును । జనకజ యుజ

(*) రాముఁడు లక్ష్మణుఁడు వనమునకు వచ్చుటకు సమ్మతించుట. (*)

లోద్ధృతాంబు, చరముల భంగి । న్ఘనుని జగదేక పూజ్యుని । నినుఁ బాసి
మనంగ లేము, నిమిషం బైనన్ ॥ (ఆ, వె) అధిప నీవులేని, యలస్వర్గ
పదమైన। మదికిఁ దోఁచుఁ దృణస, మాన మగుచుఁ । దల్లి యనఁగ నెంత,
దశరథుఁ డననెంత । తమ్ముఁడనఁగ నెంత, దలఁప నాకు ॥ (వ) అని ల
క్ష్మణుండు పలికిన నత్యంత శ్రేష్ఠంబైన యతని వచనంబువిని రాముండు
కొండొకసేపు విచారించి ధర్మం బంగీకరించి తమ్ముని రాక కొడంబడి
యవ్వనస్పతి మూలంబున లక్ష్మణ విరచితం బైన పర్ణతల్పంబు నందు సీతా
సమేతంబుగాఁ బవ్వళించె నిట్లంధకారబంధురం బైన రాత్రియందు జనసంచా
ర శూన్యం బైన వనంబున మహాసత్వ సంపన్నులగు రామలక్ష్మణులు భయసం
భీమంబులం జెందక గిరిసాను గోచరంబులగు కంఠీరవంబుల చందంబున నొ
ప్పి రంతఁ బ్రభాతకాలంబగుటయు సాంధ్యాదికంబులు దీర్చి యచ్చోటు వాసి
గంగాయమునా సంగమప్రదేశంబునకుం బోవ సమకట్టి మహారణ్యంబుఁ బ్రవే
శించి వివిధంబులగు భూభాగంబులును మనోరమంబులగు వత్సదేశావాంతర
దేశంబులును నదృష్టపూర్వంబులగు వృక్షంబులును నంత నంత విలోకింపుచుఁ
జని చని దివసంబు నివృత్తమాత్రంబగుచుండ రాముండు సౌమిత్రికిట్లనియె ।



(చ) అనుపమలీలఁ గ్రాలెడుప్రయాగము నంతట నిండ్రమోలన । య్యనలుని
కేతువై యలరు నధ్వరధూమము మింటఁ బర్విను । తన ఘనత స్వహింప శిఖి
తాండవనాదములొప్పెనోయన । స్మునికృత వేదమంత్రరవ ముల్విన నయ్యెడు
వింటెలక్ష్మణా॥ (క) ఇందొకమునిపతిమనకా । నందంబుగ నేఁడుపదర్శ నంబొ
సఁగఁగలం । డిందులకునీమనంబున । సందియమందంగవలదు జననుత శీలా॥

(*) సీతా రామ లక్ష్మణులు భరద్వాజాశ్రమముఁ జేరుట. (*)

(క) గంగాయమునాతటినీ । సంగమదేశంబుఁ గంటె శైలతనూజా । ధూ౯ం
గుఁడగువృషభరాజతు । రంగుని గాత్రంబు పగిదిఁ గ్రాలెడి వత్సా॥ (క) సుశ్రీ
యుతమైబహుతరు । మిశ్రితమై ప్రశ్రితులగు మేటిమునులకు । స్వాశ్రమమగు భా
రద్వా । జాశ్రమమిదిదీనిఁ జూడు మనఘ విచారా ॥ (వ) అని భరద్వాజాశ్ర
మంబుఁ జూపి యమ్మహానుభావుండు మహాధనుర్ధరుండై మృగపక్షిసంఘంబు
ల వెఱపింపుచు సీతాలక్ష్మణసహితంబుగా ముహూర్తమాత్రంబున కయ్యాశ్ర
మంబు సేరంబోయి గంగాయమునా సంధిదేశంబున బ్రహ్మస్థానంబు పగిది నొ
ప్పుచున్న యమ్మునియాశ్రమంబుఁ బ్రవేశించియందు శిష్యగణోపాసితుండును
దపోలబ్ధనేత్రుండును సంశ్రితవ్రతుండును నేకాగ్ర చిత్తుండును గృతాగ్నిహో
త్రుండును మహాత్ముండునగు నమ్మహాముని సముచిత ప్రకారంబున సందర్శించి
సీతాలక్ష్మణసహితంబుగాఁ దదీయచరణంబులకుం బ్రణమిల్లి కేలుదోయిఫాలం
బునం జేర్చి త్రైకాలిక సకలజగద్వృత్తాంతాభిజ్ఞుండగు నమ్మునిగ్రామణి కిట్లని
యె॥ (తే,గీ) సూరినుతయేనుదశరథ సుతుఁడ రాము । డంద్రునా పేరువీఁడునా
యనుజుఁడితని । లక్ష్మణుండందురీగోల రమణినాకు । జనకపుత్రిక జానకి యనఁ
గనొప్పు॥ (సీ) మునినాథతండ్రిశా సనమాదలఁధరించి వనమున విహరింపఁజనె
డునన్ను । విడువకీ సౌమిత్రి వడి మహీపుత్రియు నాతోడఁ జనుదెంచి నారు
వీరిఁ । గూడివ్రతంబుఁగై కొనితపోవనముఁ బ్రవేశించిమూలఫ లాశనులము । ధ
ర్మమార్గప్రవ ర్తనులమునై విహరించెదమనివిన్న వించురాజ ॥ (తే, గీ)
వంశవరుమాటవినిభర ద్వాజుఁడర్ఘ్య । పాద్యము లొసంగి బహువిధ పక్వ
మూల । ఫలములర్పించిమృగపక్షి కలితుఁడగుచు । వివిధభంగులఁ బూజఁ గా
వించిపలికె॥ (క) వినుముచిర కాలమునకిట । నినుఁ జూడఁ గఁగలైనాకు నిష్కా
రణమి । ట్లనఘాత్మనీకుగహనో । ర్వనివాసముగలుగు టెల్లనింటిమిగాదే॥ (క)

ఇది పుణ్యప్రదేశము మహా । నదులు గలయు చోటు పావనము భూరిసుఖా । స్పదమటు గావున నిచ్చట । ముదితుఁడవై యునికి సేయుము రఘుప్రవరా ॥ (చ) అనవిని రాముఁ డిట్లనియె, నాయన కిచ్చట నుంటి నేని యా । మునివర పౌర జానపద ముఖ్యులు చాల సుదర్శుఁ డంచు న । న్ననవరతంబుఁ జూచుటకు, నవిరళి వచ్చుచుఁ బోవుచుండురీ । యనువున నుండఁ బోలదుర హఃపద మొండొకటాన తీఁగదే॥ (వ) అని యిట్లు రావణవధార్థంబు గూఢంబుగా నవతరించిన నన్నుఁ బ్రకటంబుగాఁ జేసితి రేని సర్వజనంబు నన్ను నారాయణుండని యునువై దేహీ నిందిర యని యుఁ దలంచి మమ్ము సందర్శించుటకు సులభంబుగా వచ్చుచుందురు గావున నిట్టి ప్రకటావస్థానంబు నొల్ల నెచ్చట మత్స్వరూపంబు ప్రకటంబు గాకుండు నెచ్చట వైదేహి హృద్యంబుగా విహరించు నట్టి యేకాంత స్థానంబు నాలోచించి చెప్పుండని యెడు తాత్పర్యంబు నం బలికిన నర్థగ్రాహకంబైన రామవచనంబు విని కాలత్రయాభిజ్ఞుండగు భరద్వాజుండు మహాత్మా యిచ్చటికి దశక్రోశమాత్రంబు దవ్వులఁ జిత్రకూటంబన నొక్క పర్వతంబు గలదది మహర్షిగణసేవితంబును సమంతతస్సుఖదర్శనంబును ఋక్షవానర గోలాంగూల ప్రముఖ నిఖిల మృగవ్రాతోపేతంబును బుణ్యంబును గంధమాదన సన్నిభంబునై యొప్పుచుండు నందుఁ బెక్కువర్షంబులు నిరాహారులై తపంబుఁ జేసి తన్మహిమ విశేషంబునఁ గపాలావశిష్టశిరంబులతోఁ గూడి దివంబునకుం జనిన మహాసిద్ధులు పెక్కండ్రు గలరు మఱియు నగ్గిరికూటంబులు విలోకించు వారికిఁ గల్యాణంబులొదవు వారల చిత్తంబులు వికారంబులఁ బొరయక నిర్మలంబులై యుండు నది వివిక్తంబు గావున నీకు నివాసయోగ్యస్థానంబై యుండు నచ్చట నివసింపు మట్లు గాదేని యిచ్చట మత్సహితంబుగా నివసింపుమని పలికి యమ్మునీంద్రుండు ప్రియాతిథియైన రాముని సర్వకాలంబుల సంతుష్టునిం జేసిన నా రఘుపుంగవుండు సీతాలక్ష్మణసహితంబుగా మునికృత సపర్యలఁ బ్రతిగ్రహించి మహర్షికథితంబులైన పుణ్యకథేతిహాసంబులు వినుచు నా రాత్రి యచ్చట వసియించె నుభయమహానదీకల్లోల మాలాసంఘట్టన సంభూత జలకణసిక్తుండై యాశ్రమస్థ వివిధ పక్వ ఫలకుసుమ సౌరభంబు సంగ్రహించి మందమారుతుండు మనోహరంబుగా విసరెనంతఁ బ్రభాతకాలంబున రాముండు మేల్కాంచి కాలోచిత కృత్యంబులు నిర్వర్తించి సముచితంబుగా భరద్వాజుని సందర్శించి విన



యంబున నిట్లనియె॥ (తే.గీ) అర్కనిభ నేఁటి రాత్రి మీ యాశ్రమంబు । నందు సద్గోష్ఠి సుఖముంటి మతిహితముగ । నింక భవదుపదిష్టము హీధరేంద్ర । గమనవాసంబునకు ననుజ్ఞ కరుణ నిమ్ము॥ (వ) అనిన మునీంద్రుం డిట్లనియె ॥ (తే, గీ) అనఘ చారిత్ర చిత్రకూటాచలమున । కరుగుమది మధుమూలఫలాన్వితంబు। కిన్నర విహంగ గంధర్వ పన్నగేంద్ర । భాసుర మునీశయుక్తని వాసమధిప॥ (క) పుణ్యము తపస్విలోకశ । రణ్యము బహుతరు సమృగాభి రాజిత రమ్యా । రణ్యము ధృతఫలజలలా । వణ్యక మాభూధరం బవారిత శౌర్యా ॥ (క) అన్నగవనాంతభూములఁ । గ్రన్నన మృగయూథములును గరి యూథంబు । ల్పన్నుగఁ జరింపుచుండుఁ జ । గన్నుతగుణ వానిఁ జూడఁ గలవీవచటన్॥ (ఉ) అచ్చటి సాను

## * భరద్వాజఁడు రామునకుఁ జిత్రకూటమునకుఁ బోవుదారి యెఱింగించుట. *

దేశముల నచ్చటి ప్రస్రవణంబులం గరం । బచ్చటి పుణ్యతీర్థముల నచ్చటి నిర్ఝరకందరంబుల । న్మెచ్చుగ సీతఁ గూడి తమినిం డరహిన్విహరించు వేళ నీ। యిచ్చకు సమ్మదంబొదవు నింతయథార్థము రాజనందనా ॥ (క) పికబర్హిణ కోయష్టిక । శుకనాదనినాదితంబు సురుచిర మృగయూథకలితమగు నగ్గిరిపై నకలంకస్థితి వసింపు మతిరమ్యముగన్ ॥ (వ) అని పలికి ప్రాస్థానికంబగు స్వస్త్యయనంబుఁ బ్రయోగించిన నా రాముండు సీతా లక్ష్మణ సహితంబుగా నమ్మహర్షి కభివందనంబుఁ గావించి యనుజ్ఞఁ గొని చిత్రకూటశైల నిరీక్షాపేక్షుండై యరిగె నప్పుడమ్మునీంద్రుండు జనకుండు సుతులవెంట నరిగిన భంగి రామలక్ష్మణుల వెంట నొక్కింతదూరంబరిగి యా రాజనందనులం జూచి మీరు గంగాయమునా సంగమంబు డాసి యచ్చటనుండి యొక్కింత పశ్చాన్ముఖోచ్ఛ్రితయగు కాళింది యుత్తరతీరంబునం జని యమ్మహానది యోడరేవునం దిగి గమనాగమనంబుల చేత నతిక్షుణ్ణంబును బురాణంబునగు యయ్యవతరణ ప్రదేశంబునఁ గాష్ఠసంఘాతవిరచిత ప్లవంబున నా సూర్యనందన నుత్తరించి యవ్వల బహువృక్షనిషేవితంబును హరితచ్ఛదంబును నీఘర్ఘ శాఖాశిఖోల్లసితంబును సిద్ధోపసేవితంబును శ్యామనామకంబునగు నొక్క న్యగ్రోధవృక్షంబు గల దావృక్షంబు డాయం జని యమ్మహాపాదపంబునకు సీతాదేవిని మ్రొక్కించి మాకు శీఘ్రంబునఁ బునరాగమనంబు గలుగుం గాక యని సీతాపురస్సరంబుగాఁ బ్రార్థించి తదాశీర్వాదంబులు గైకొని యచ్చట వసించియైన నతిక్రమించియైన నవ్వలఁ గ్రోశమా

త్రంబుదూరంబున యమునాతీరసంభూత వంశవిరాజితంబును బలాశ బదరీమి
శ్రంబునగు నీలకాననంబవలోకించి యవ్వల రమ్యంబును గంటకపాషాణవర్జితం
బునుదావపావకరహితంబునగు మార్గంబుఁబట్టి చిత్రకూటపర్వతంబుఁ బ్రవేశిం

—(*)భరద్వాజ వచనప్రకారముఁ రాముఁడు చిత్రకూటమునకరుగుట.(*)—

పుఁడేనీమార్గంబునబహువారంబులుచిత్రకూటంబునకుంబోయివచ్చినవాఁడనని
మార్గక్రమంబెఱింగించి వారిచేత నమస్కృతుండై దీవించి యనుజ్ఞఁగొనిమఱలి
యాశ్రమంబునకుం జనుదెంచె నిట్లుభరద్వాజుండుపావృత్తుండైన యనంతరంబ
రాముండుతదుపదిష్టమార్గంబునంబోవుచు సౌమిత్రికిట్లనియె॥ (తే,గీ) అనఘము
నినాథ కరుణారసానుభూతి। నతి కృతార్థులమైతి మయ్యనఘ మూర్తి।
చెప్పినవితాన నమ్మహాచిత్రకూట। శిఖరి శిఖరాగ్రమున నునికి సేయవలదె॥
(చ) అనియిటురాజపుత్రులగు, నయ్యనఘుల్ద మలోఁదలంపుచుఁ। జనకజ
ప్రమోల నుంచికొని, సత్వరలీలఁ బవిత్రతోయన। య్యనసుత డాయ నేగిమ
నమేక్రియ దాఁటుదమత్యగాధమై। తనరెడునీలతోయములఁ,దద్దయు శోభి
లుచున్న దెంతయుఁ॥ (మ) అనియోజింపుచుఁ దీర్ఘదేశమటుడా,యం బో
యిసౌమిత్రిగ్ర। ద్దన నత్యున్నతశుష్కవంశములచే,తం దెప్పఁగావించిలే। నన
లంబీట యొనర్పదానిపయివి,న్యాణంబుగారాముఁడో। య్యనఁగూర్చుండఁగఁ
బ్బైజానకిని లజ్జాలోల దృక్పంకజఁ॥ (తే,గీ) శీతనిటు రాఘవుఁడు సుఖా
సీనఁజేసి। యిరుదెసల భూషణంబులం బరములునిచి। కఠిన కాజంబులును
జాపఖడ్గబాణ।ములుకుదురుకొల్పితాను దమ్ముఁడునుబ్రీతి॥ (వ) అమ్మహాప్ల

(*) సీతారామలక్ష్మణులు యమునానదినుత్తరించుట.(*)

వంబుఁ బరిగ్రహించి యభంగతరంగ మాలికాడోలికాచకిత చక్రమరాళ బా
లికా మధుకర మధురశబ్దాయమానంబైన యమునానదీమధ్యంబునంబోవు
నప్పు డాసీతాదేవి ఘటితాంజలిపుటయై యమ్మహానదినుద్దేశించియిట్లనియె॥
(క) దేవీరాముఁడు దశరథ। భూవల్లభసుతుఁడు విపిన,భూమికరిగెడి। న్నీవ
ధికకరుణ నచ్చట। వావిరిరక్షింపుచుండ,వలయుంజుండీ॥ (క) ఈరేడబ్దంబు
లువన। ధారుణిఁజరియించివిపదపఁ దమ్ముఁడునేనుం। గోరికసేవింపఁగఁజను। దే
అఁగలఁడునిన్నుఁజూడ దేవిమరలఁ॥ (క) ఓయమ్మనీకుమ్రొక్కెద। నీయన
ఘుఁడుమఱలఁ బుడమి కేలికయైన। న్నీయానసీకుఁ బ్రియముగ। వేయి మొ



దవులిత్తువేవ, విప్రులకెలమిఁ॥ (వ) అనిసవినయంబుగా నక్కాళిందిం బ్రా
ర్థింపుచుం బోవుచుండ నయ్యేటి దక్షిణతీరంబాసన్నం బగుటయు రాముం
డును లక్ష్మణుండును సీతాసహితంబుగాఁ బ్లవంబుడిగ్గి యమునాతీర కాంతార
సంతానంబులు విలోకింపుచుం జనిచని యవ్వలశ్యామనామకంబైన న్యగ్రోధ
వృక్షంబుడాయంజని రప్పుడ వైదేహిరామునియనుజ్ఞవడసి యవ్వనస్పతికిన
మస్కరించి యిట్లనియె॥ (తే,గీ) పాదపోత్తమ నాపతి,వ్రతముపార। మొం

—(*)సీత శ్యామనామకంబైన న్యగ్రోధవృక్షంబునకు నమస్కరించుట.(*)—

దఁజేయుము కౌసల్య,నొగిసుమిత్ర। నర్థిఁగ్రమ్మఱవీక్షించు నట్లొనర్పు। మతిద
యాళుఁడవై నమస్కృతిగ్రహించి (క) అనియాగతిఁబ్రార్థింపుచు। జనక
సుతప్రదక్షిణంబు, సలిపెనపుడురా। మనరేంద్రుఁడు సౌమిత్రిం। గనుఁగొని
యిట్లనియెఁబ్రీతి,గడలుకొనంగఁ॥ (క) నీవిఁకముంగలియైచను। మావెంబ
డిజనకపుత్రి యరుదెంచెడునే। వావిరిమీయిద్దఱకుం। గావలియైవెనుకఁబ్రా
పు, గాఁజనుదెంతుఁ॥ (తే,గీ) క్రోవనెద్దానియందునీ,దేవిమనసు। దగరమిం
పుచు నుండనె,ద్దానిఁగోరు। నదికుసుమమైన,ఫలమైన ననఘచరిత। చెచ్చెర
మహీకుమారికి దెచ్చియిమ్ము॥ (తే,గీ) అనిన నతఁడగ్రభాగమం దరుగుచుం
డె। వెనుకరాముఁడు చనుచుండెవిల్లుఁపూని। పుడమికన్నె యయ్యిద్దఱ నడు
మనొప్పె। దంతియుగ మధ్యగతనాగ,కాంతఁబోలి॥ (వ) ఇత్తెఱంగునం బో
వుచు నమ్మహీపుత్రి కుసుమకిసలయఫలోపేతంబులై యదృష్టపూర్వంబులై
న తరులతాగుల్మంబులు విలోకించి తదీయసుషమావిశేషంబులు నిజనాథున
కుంజూపి చెప్పిననద్దేవి యభిప్రాయంబెఱింగి తత్తత్తరులతాగుల్మాధిష్ఠితం
బులైన ఫలకుసుమంబులు గోసితెచ్చి లక్ష్మణుండు సీతావచనసంరబ్ధుండైయొ
సంగినంగైకొని రాహ్లాదింపుచుఁ గుముదకైరవ నీలోత్పలపుండరీకషండమం
డలాంతర్గత మకరందబిందు రసాస్వాదనతుందిలేందిందిర బృందఝుంకా
రసంకులంబులైన యమునాసరోవరతీరంబులం గ్రీడింపుచునవ్వలఁగ్రోశమా
త్రంబుదూరంబరిగియందు॥ (ఉ) గ్రద్దన విండ్లునమ్ములును గైకొనిబల్లిదుల
న్నదమ్ములా। యుద్ధఱుశౌర్యవిస్ఫురణ, మేర్పడఁగ్రూరమృగాళిఁ ద్రుంచుచుం।
బ్రొద్దటుగ్రుంకునంతకును,బొందికతోవిహరించియొక్కచో। నొద్దికమీఱనుండి
రలయుర్విజకుంగుశలంబుఁదెల్పుచుఁ॥ (వ) ఇట్లుచిత్రవాలుకజలవిహారమా

ణహంససారస నినాదంబు లాకర్ణింపుచు నిర్మలసరోవర సలిలకణ సం
వర్ధిత పుష్పితైలా లతావాసనా వాసితశీతలానిలంబు పైవీవవానరవా
రణయుతంబైన యమునాతీర వనంబున నారాత్రి వసియించి ॥ (ఆ,వె) అంతరా
త్రిచనిన ననఘుండు రాఘవుఁ। డనుజు మేలుకొల్పి యనియె నింతె । శుకపికాది
పక్షి నికరనినాదంబు। ప్రొద్దుపొడిచె సింకఁ బోవవలదె ॥ (తే,గీ) అనుచు ల
క్ష్మణు బోధించి యతఁడు తాను । సవితృజావారి లోఁగ్రుంకి సంధ్యవార్చి ।

(*)రాముఁడు సీతకు వనంబులయందలి చిత్రంబు దెల్పుట.(*)—

చిత్రకూటాద్రి కరుగుచు సీతఁ జూచి । రాముఁ డిట్లని పల్కె గౌరవము తోడ॥ (క)
కాంతా పలాశవృక్షము । లంతటఁ జాలుఁ గొని నిజసుమావళి చేతన్ । దంతురి
తములై యొప్పెవ । సంత సమయమగుటఁ గంటె సంతస మలరన్ ॥
(ఉ) కాతరనేత్ర చూచితివె కమ్మని వాసనలుల్లసిల్లు భ । ల్లాతకవృక్షపఙ్క్తులు పలా
శఖలప్రసవప్రకాండవి । ద్యోతితమూర్తులై కడుభ రోద్ధతి నేలకు వీఁగి చిత్రవి ।
ఖ్యాతిఁ జెలంగుచున్న విమృగద్విజకోటికనాశ్రయంబులై॥ (ఆ,వె) మధురవా
ణికం కుమధుమక్షికాభిసం । భృతములగుచు భరముకతన వ్రేలి । తూలుచున్న వి
దిగొ ద్రోణప్రమాణంబు । లైన తేనెపెరలు మ్రానులందు॥ (తే,గీ) ప్రసవ సం
స్తరసంకట రమ్యవిపిన । దేశములయందుఁ దనుఁగాంచి ధీరఫణితి । మ్రోయు
దాత్యూహమునకాభి ముఖ్యమొంది । నెమలి గూసెడిఁ గంటివే నీరజాక్షి॥ (వ)
అనిబహుప్రకారంబుల నవ్వనవిలాసంబు లవ్వైదేహికిం జూపుచుం జనిచని
దవ్వులఁ జిత్రకూటంబుఁ జూచి రాముండు లక్ష్మణునకిట్లనియె ॥ (క) కరియూ
థానుసృతంబై । గురుతరవిహగప్రణాద ఘోషితమై నుం । దరశిఖరంబై యొ
ప్పెడు । నరవరసుత చిత్రకూట నగముం గంటే॥ (క) అతిరమ్యము బహుతరుమి।
శ్రితము సమతలంబు పుణ్యశేవధియగు నీ । క్షితిధర కాంతారంబున । జితవైరీ
మనము వసతి సేయుదము రహిన్॥ (మ) వనదంతావళకర్ణచామరలస ద్వా
తంబులన్ మార్గాసం । జనితాయాసముఁ దీర్చుచున్ జగభృక్శబ్దంబులన్ సంస్తు
తి । ధ్వనిఁ గావింపుచు నిర్ఝరాంబువుల పాద్యం బిచ్చుచున్ లక్ష్మణా । కనుఁ
గొంటే గిరిరాజు తా మనకు సత్కారంబుఁ గావించెడిన్ ॥ (మ) రుచిరామూ
ల్యఫలోపభోగకుతుకాలోలచ్ఛుక శ్యామమై । యచలద్భూరితమాలమేచక
ఘనంబై ధాతుసంరక్తమై । ప్రచురాబ్జాకరతీర శోభితమరాళస్వచ్ఛమై చూ



డుమీ । యచలోత్తంసము చిత్రకూటమనుటన్ సార్థక్యమొందించెడిన్॥ (శా)
నానాపక్షిరుతాన్వితంబు మృగసన్నాదాన్వితం బున్నతా । హీనానోకహపు
ష్పశోభితలతా, హేలాయుతం బుజ్జ్వలా । స్థానాలంకృత మాత్తమూల ఫ
లము, స్స్వాదూదకంబు ఘనో । ద్యానప్రావృతమైన యీశిఖరి మీఁద న్ని
ల్వఁ గాఁ బోలదే ॥ (క) ఇది మనకు యోగ్యవాసం । బిది రమ్యం బిది మ
నోజ్ఞ, మిచ్చటఁ బుణ్యా । స్పదులగు మునులు వసింతురు । సిదిరము లేదిచ్చ
ట సుఖ జీవన మబ్బున్ ॥ (మ) అని యోచింపుచు నమ్మహాశిఖరి డాయం
బోయి యప్పట్టునన్ । మునినాథేరిత వేదమంత్ర నినదంబు ల్నింగిపైఁ బర్వఁ
గా । ఘనహోమానల ధూమసంకలితమై, గన్పట్టు వల్మీక జ । న్ముని పుణ్యా
శ్రమముం గనుంగొనిరి తద్భూపాల వంశోత్తముల్ ॥ (వ) ఇట్లు వాల్మీకి

—(*) రాముఁడు వాల్మీకి మహాముని యాశ్రమముఁ జేరుట. (*)—

పుణ్యాశ్రమంబుఁ జూచి సీతాసహితంబుగా నమ్మహాముని కడకుం జని తదీయ
చరణంబుల కభివందనంబుఁ గావించిన నమ్మహర్షి శ్రేష్ఠుండు సమాదరసం
భృతాత్ముండై యమ్మువ్వుర నతిథిసత్కారంబుల సంప్రీతులం జేసి స్వాగతం బ
డిగిన నమ్మునికి రాముండు నిజవృత్తాంతం బంతయుఁ దెల్లంబుగా విన్నవించి
సౌమిత్రిన వలోకించి యిట్లనియె ॥ (క) భూరిశ్రేష్ఠములగు దృఢ । దారువు
లం దెచ్చి తగు విధంబున మనకున్ । వారక నిలువఁగఁ జిత్రా । కారంబు
గఁ బర్ణశాలఁ, గావింపుమిటన్ ॥ (క) అనవుడు లక్ష్మణుఁ డగుఁ గా । క
నుచుఁ గవాటాభిరామ, మగునట్లుగఁ జ । య్యన నాకుటిల్లు గట్టిన । నను
జుని నేర్పునకు మెచ్చి, యధిపతి వల్కెన్ ॥ (వ) వత్సా గృహాధిష్ఠిత శిఖిపర్జ
న్య ప్రముఖపంచచత్వారింశత్సంఖ్యాక వాస్తుదేవతలకు శాస్త్రచోదిత విధిప్ర
కారంబున బలిహోమనైవేద్యాదిపూజనంబుఁ గావింప వలయుఁ జిరంజీవులగు
వారిచేత నీవాస్తుశమనం బవశ్యకర్తవ్యంబు గావున నీవు విధిధర్మంబు సం
స్మరింపుచుఁ దదర్థంబు కృష్ణమృగంబును వధించి తెమ్మిదివసంబు శుభదివసం
బిమ్ముహూర్తంబు శుభముహూర్తంబు మనమిప్పుడె పర్ణశాలకు శాంతి
గావింత మనిన నాలక్ష్మణుండు మేధ్యంబైన కృష్ణమృగంబును వధించి యుప

(**)సీతారామలక్ష్మణులు పర్ణశాలాప్రవేశము చేయుట.(**)

రతశోణిత నిష్యందంబగు దాని వహ్నియందుఁ బక్వంబుగాఁ దప్తంబుఁ గావిం

చి తెచ్చి రామునకుం జూపి దేవా కృష్ణమృగంబన్యూనాంగంబై యనైకల్య దగ్ధత్వంబు వలనఁ గృష్ణవర్ణంబైన మృగంబు చందంబునం జూపట్టుచున్నది యీయైణేయంబగు మాంసంబుచేత వాస్తుదేవతాసంతర్పణంబుఁ గావింపుం డనిన నమ్మహాత్ముండు నిర్మలోదకంబులం గ్రుంకి నియతుండై గృహదేవవిని యుక్తంబులైన మంత్రంబులు సంగ్రహించి సంగ్రహంబుగా వాస్తుశాంత్యాది కంబుఁ గావించి పూర్వోక్తగృహాధిష్ఠిత పంచచత్వారింశద్దేవతాగణంబులఁ దృప్తులం గావించి శుచియై సంతుష్టాంతరంగుండై పర్ణశాలఁ బ్రవేశించివా స్తుదోషశమనంబులైన పుణ్యాహవాచనాది మంగళకృత్యంబులు నిర్వర్తిం చి క్రమ్మఱ స్నానపూర్వకంబుగా రౌద్రంబును వైష్ణవంబునైన వైశ్వదేవబలి గావించి నద్యంబువులఁ గ్రుంకి వీర్యవంతంబులైన మంత్రంబులు జపించి పాప సంశమనంబైన యుత్తమబలిఁ గావించి యష్టదిగ్వర్తి బలిహరణవేదిస్థలం బులును గణపతివిష్ణుప్రముఖదేవతాయతనంబులును నిర్మించి తత్తద్దేవతలకం దంద సూక్ష్మమార్గంబున నవస్థానంబులు కల్పించి వన్యంబులైన ఫలమూల మాల్యాపక్వ మాంససలిలదర్భసమిద్గణంబులచేత వేదోక్తప్రకారంబునసర్వ భూతంబులఁ దృప్తి నొందించి రాముండు సీతాలక్ష్మణసహితంబుగా సుము హూర్తంబున నంతర్బహిఃప్రాకారభిత్తిప్రతిష్ఠిత యగు దాని విశాల యగు పర్ణశాలఁ బ్రవేశించి సుధర్మాభ్యంతరస్థుండైన దేవేంద్రుని చందంబునం దేజరిల్లుచు ॥ (సీ) కమనీయఫలభరోన్నమితమాకంద నింబానోకహవ్యా ప్తసానువులను । సేడాకుల నటుల, నెలమావికానలఁ బుష్పితద్రుమకుంజ పుంజములను । సమదదంతావళ, శార్దూల ముఖసత్వ నినదఘూర్ణితమ హా, వనములందు । రమణీయపులినాభి, రామ మాల్యవతీనదీతీరపుణ్యప్ర, దేశ ములను ॥ (తే,గీ) వేడ్క విహరింపుచును దాను, వీరుఁ డయ్యె । లక్ష్మణబ లాభిగుప్తుడై, రమణ మెఱసి । సీతతోఁ గూడి సుఖలీలఁ, జెలఁగుచుండెఁ । గ రము పురవిప్రవాస దుఃఖంబు విడిచి ॥ (వ) ఇచ్చట గుహుండు జాహ్నవీ తీరంబున రాముండు దృష్టిపథం బతిక్రమించు నందాఁక నచ్చటనుండి తదీయ కల్యాణగుణగణ విశేషంబులు సుమంత్రునితో వక్కాణింపుచు నతనిచేతనా మంత్రణంబు వడసి నిజనివాసంబునకుం జనియె నంతసుమంత్రుండు గుహుని



(*) సుమంత్రుం డయోధ్య కరుగుట. (*)

చారుల వలన రాముని భరద్వాజాభిగమనంబును యమునాతీర ప్రాంతకాం తార ప్రవర్తనంబును జిత్రకూట ప్రవేశనంబును సవిస్తరంబుగా నెఱింగిన వాఁడై యరదంబుఁ దోలుకొని గాఢదుర్మనస్కుండై సుగంధబంధురంబులై న వనంబులును సరిత్సరోవరంబులును నగరగ్రామంబులును విలోకింపుచుం జ ని మూఁడవనాఁటి సాయాహ్న సమయంబునకు శీఘ్రవేగంబున నయోధ్యా పట్టణంబు సేరంజని నిరానందంబై నిశ్శబ్దంబై శూన్యాకారంబై యున్న య ప్పురంబుఁ గలయం గనుంగొని శోకవేగ సమాహతుండై నిజాంతర్గతంబు న ॥ (మ) కరులుం దేరులు గుఱ్ఱముల్ సుభటసంఘంబుల్ పురీసుందరుల్ । పురసంవాసులు దేశవాసు లెపుడా, మోదంబుతో నిండి యుం । డ రహిం గాలెదు పట్టణంబిపుడు సీ, తానాథుఁడు లేమిఁ బోం । పరిశోకానల హేతిఁ గాలిన క్రియ, న్వీక్షింపఁగా నయ్యెడిన్ ॥ (క) అని చింతింపుచు మెల్లనఁ । జనుచుండఁగఁ బౌరజనుల, సంఖ్యులు రథమున్ । వెనుకొని రాఘవునెచ్చట । ననఘాత్మక విడిచి వచ్చితని, యడుగుటయున్ ॥ (క) వారికిఁ గ్రమ్మఱ నిట్ల ను । శ్రీరాముని జాహ్నవీస, రిత్తీరమునన్ । దూరమునవిడిచి యారఘు । వీ రునిచే సెలవుఁగొని ని, వృత్తుఁడ నైతిన్ ॥ (తే,గీ) అనుచు వినిపింపవిని పౌ రు, లధిశోక । వేగమున వ్రాలి కన్నీరు, వెడలనూర్పు । సెగలఁ గందుచు నం దంద, చిత్తమెరియ । హారఘూర్ణము యనిపొక్కి, రార్తులగుచు ॥ (క) పు న్నమనాఁటికళానిధి । కెన్నఁగ సరియైన రాము నీయరదము పైఁ । గన్నా రఁ జూడదొరకమిఁ । బన్నగ నేఁడిట్లు చంపఁ, బడితిమిగాదే ॥ (చ) తపములు స ల్పియైన బహు, దానము లర్థుల కిచ్చియైన ని । శ్చపలతఁ బెక్కుజన్నములుఁ సమ్మతితో నొనరించియైన నీ । యపరిమితప్రభావుని న, నంత గుణాఢ్యునిఁ బోలు నాథునిన్ । నిపుణత నన్యునింబడయ, నేర్తుమె యింక జగత్త్రియం బునన్ ॥ (తే,గీ) రమణ జనకునిచేఁ బోలె, రాముచేత । నూరు పరిపాలితంబగు, చుండెనేని । యీపురంబునఁ గలవారి, కింతకంటెఁ । బ్రియము సుఖము సా మర్థ్యంబుఁ, బెంపు గలదె ॥ (తే,గీ) అనుచుఁ బౌరులు దుఃఖార్తి, నాడుమాట । లాలకింపుచు సౌధవాతాయనస్థ । పుణ్యపణ్యాంగనా శోక, మున కడలుచు । రాజవరుఁడున్న నగరు సే, రంగఁ జనియె ॥ (వ) యిట్లు సుమంత్రుండు పిహితాన

నుండై రాజమార్గంబునం జని చని రాజమందిరద్వార సమీపంబునం దేరు డిగ్గి మహాజనసమాకులంబు లైన గక్ష్యాంతరంబు లతిక్రమించి చనునప్పుడు రామరహితుండై హర్మ్య ప్రాసాద విమాన మాలినియగు నయోధ్యాప్రవేశం వచ్చుచున్న సుమంత్రునవలోకించి యంతఃపురకాంతలు రామాదర్శనకర్శితలై బాష్పవేగ పరిప్లుతంబులైన విమలాయత నేత్రంబుల చేత నొండొరుల నీక్షింపుచు హాహాకారంబులఁ గావింపుచు రాజ సాన్నిధ్యంబువలన మందంబుగా రోదనంబు సేయుచు రామశోకాభి తప్తలై గుసగుసలువోవుచు నీసుమంత్రుండు తొలుతరామసహితంబైన రథంబుగొనిచని యిప్పుడు రామరహితంబైనరథంబుఁగొని యొంటిమెయిం జనుదెంచు చున్నవాఁడు పుత్ర శోకాభిపీడితయైన కౌసల్య కేమిచెప్పఁగలవాఁ డీదేవిపుత్రుండు నిర్యాతుండగుచుండ సహించి జీవించుననియెడునది మిక్కిలిదుష్కరజీవనం బిట్టి జీవనంబు సుకరంబుగాదనిసత్యంబుగాఁదలంచెదమని విలపింపుచుండఁ బరమార్థభూతంబైన వారలవాక్యం బాలకింపుచుం జనిచని శోకంబు చేతఁ బ్రదీప్తంబైన దానిపగిదిం జూపట్టునట్టియొక్క పాండరగృహంబునఁ గుమారునింవలంచికొని

(*) సుమంత్రుఁడు దశరథుని సందర్శించుట. (*)

కొండొకసేపు కన్నీరుమున్నీరుగా రోదనంబుఁజేసి యలసిదీనుండై శోకనిద్రాపరవశుండై నేలంబడియున్న దశరథునుచితభంగి సందర్శించి మేల్కాల్పిన మస్కరించి రామవృత్తాంతంబంతయు నెఱింగించిన నతండూరకయవ్వాక్యంబువిని యేమియుందోఁచక విభ్రాంతచేతనుండై శోకమూర్ఛాపారవశ్యంబునఁగ్రమ్మఱ ధరణిపయింబడియె నప్పుడంతఃపురజనంబులెల్ల మహీపతి పాటంతయుంజూచి భుజంబెత్తి యుచ్చైస్స్వనంబున రోదనంబు సేయుచుండి రప్పుడుకౌసల్య సుమిత్రా సమేతయై మూర్ఛితుండై పడియున్న మగనిం గ్రుచ్చియెత్తి యాసీనుంగావించి శోకగద్గదస్వరంబున నిట్లనియె ॥ (సీ) లోకేశనీయాజ్ఞఁ గైకొనిరాముని దారుణారణ్యమ ధ్యమునవిడిచి। వచ్చినసూతునివంశఁగన్గొనిమన సిచ్చిసంభాషింప వేటికింత। యనయంబుఁ జేసితి ననిసిగ్గునొందియుత్తలవినుముని కధికసుకృత। మగుఁగాకయిటురిత్త వగచినఁబనియేమి యధిపయిద్దానిభ యంబువలన॥ (తే,గీ) సుతునివార్తవిచారింపఁ జూడవైతి। వట్టికైకేయియిచటలే దడలుమాని। కూర్మిఁ భాషింపుమనిపల్కికొండవంటి।



శోకభరమునవశయై సొలిసిత్రావాలె॥ (తే,గీ) ఇట్లుమూర్ఛిల్లిపరితాప మెదఁజెలంగ। నవనిఁ ద్రావాలినకౌసల్య నట్టిచూచి। యంతిపురమున విలపించు కాంతలెల్ల। సుస్వరంబుల నేడ్చిరి మూడలోక॥ (తే,గీ) అంతనంతఃపురసముత్థితార్తనాద। మాలకించిపురింగల బాలవృద్ధ। జనముఁ దరుణీ జనంబు రోదనముఁజేసె। నారవంబునఁ బురమెల్ల నాకులత కలిగె॥ (తే, గీ) అప్పుడుపచారములబోధితాత్ముఁడగుచుఁ। బుడమిఱేఁ డాత్మజుని వార్త, నడుగఁ దలఁచి। సూతు దిక్కు మొగంబైనఁ జూచి యతఁడు। ఫాలమునహస్తయుగ్మంబు, గీలుకొలిపి॥ (తే,గీ) భూరిశోకాభితప్తుఁడై పొగులు వాని। భుజగపతిభంగినూర్పులు పుచ్చువాని। ధ్యానశోకపరీతాత్ముఁడైనవాని। నధిక వృద్ధుని నృపునిడా యంగఁజనియె॥ (వ) మఱియు నవసూత్రబద్ధంబైనకుంజరంబుభంగి నస్వస్థుండైన దశరథుని సమీపంబున కరిగెనప్పుడు॥ (తే,గీ) వేఁడి యూ

() దశరథుఁడు సుమంత్రుని రామవృత్తాంతంబడుగుట. ()

ర్పులుసెలఁగంగ విన్నవాటు। వదనమునఁదోఁపఁ ఘనరజోధ్వస్తగాత్రుఁ। డగుచుశోకసంతప్తుఁడై పొగులుచున్న। వానిసూతునిఁజూచిభూ వరుఁడు పల్కె॥ (క) సూతాతరుమూలాశ్రితుఁ। డై తాపసవృత్తిఁదాల్చి యాపదలకువి। ఖ్యాతిగ సహించి యెచ్చట। సీతాపతి యున్నవాఁడు చెప్పుమునాకుఁ॥ (మ) అనఘాభూరిసుఖోచితుండతఁడుక ల్యాణాభిజాతుండునా। తనితమ్ముండునుమేటిసౌఖ్యములనొం దంజాలు వాఁడాయశో। ధనుఁడా మంజుల తూల తల్పముల మీఁదంగూర్కు నారావనా। వనిలో నెట్లువసింప నేర్తురిపుడీవైక్లబ్యమెట్లోఁగుదుర్॥ (చ) అనుదినమేఘునుండుతమి నాటకుసంగడికాండ్రఁగూడి గ్ర। క్కునఁజనువేళ నేనుఁగులు, ఘోటకముల్ రథముల్పదాతులుఁ। వెనుకొనిపోవునట్టిరఘువీరుఁడు నిర్జనమైనఘోరకా। ననమునన్నొంటినేవిధము, నంజరియించుసుమంత్రచెప్పుమా॥ (ఉ) క్రూరమృగప్రకాండమగు, ఘోరవనంబున నేఁడు పాదసం। చారమునం బవిత్రకుల, జాతమహాసుకుమారియైన యా। ధారుణిపుత్రిఁ గూడిబల, తావులనాఁకటిబాధ కోర్చినా। కూరిమి పుత్రులెట్లు నయకోవిద క్రుమ్మరు వారుచెప్పుమా॥ (ఉ) ప్రేమఁదొరంగియాలికటు, ప్రీతిగఁ గావలెనంచుఁ బుత్రునిం। దాముసుకానకుంబనిచి తద్వ్యథనిప్పుడుకుందినన్ఫలం। బేమి సుమంత్రయైనవిను మీవిటుక్రమ్మఱవచ్చువేళఁదా। నేమనెరాఘవుండనుజుఁ డేమనెనే

మనెనీతి చెప్పుమా॥ (తే,గీ) అశ్వినులభంగిసుందరులమిత తేజు । లైన మన్న
దనులు ఘోర కాననమున । కడగునప్పుడువీక్షించి నందు వలన । సూతనీవుని
ర్ధార్థుండనైతివిక ను॥ (తే,గీ) అమరపదతుల్యమైనరాజ్యంబువిడిచి । సాధు
గతిఁబూనియడవికిఁ జనినసుతుని । విధమువినుపింపుమన్లైన నిలుచుఁ గొంత
దడవుమేనఁ బ్రాణంబులుతడయ కిపుడు॥ (వ) మఱియు స్వర్గపదంబుననుం
డి సాధుమధ్యంబునంబడిన యయాతి రాజర్షి చందంబున స్వర్గతుల్య రా
జ్యంబువలన నిర్గమించి సాధుజనాశ్రమంబులయందు నివసించిన రాముని
వృత్తాంతంబుఁ జెప్పుముతదీయయానాది వ్యాపారశ్రవణంబున జీవించి యుండె
దనని రామ వచనాకర్ణనోత్కంఠుండై యడిగిన సుమంత్రుండ మ్మహీపతిఁ
జూచి యెలుంగుసవరించికొని కంఠగతబాష్ప నిరుద్ధంబగు వాక్యంబున నిట్లని

——(*)సుమంత్రుండు దశరథునికి రామ వాక్యంబులఁ జెప్పుట.(*)——

యె॥ (సీ) వసుధేశ నేనిట వచ్చునప్పుడురామచంద్రుండు నయధర్మసంహి
తముగ । నీతోడననుమని ప్రీతితోనాతోడఁ జెప్పినవాక్యంబు చిత్తగింపు । మం
దండశిరముచే వంద్యనీయుండగు మాయయ్యకిపుడునా మారుగాఁగ । నంజలిఁ
గావించి యభివాదన మొనర్చి యడుగులఁ బడి యెత్తు మనియె మఱియు॥
(తే, గీ) నంతి పురమునఁ గలవారి, కధిక భక్తి । వందన మొనర్చి వే
త్వేఱ, వరుసతోడ । సేమమభివాదనంబును, జెప్పుమనుచుఁ । బ్రియముతోఁ
జెప్పెనాతోడ నృపవరేణ్య॥ (వ) మఱియు మజ్జననియగు కౌసల్యకుఁ బ్రణా
మంబుఁ జేసి నావచనంబులుగా నద్దేవితోడం జెప్పుమని నాతోఁ జెప్పిన తెఱం
గువినుము॥ (క) ధర్మము వదలక నిత్యము । నిర్మల మతి వగుచు వహ్ని
నిలయము తఱియం । దర్మిలి సేవింపుచున । త్కర్మునిఁ బతిఁగొలుచు చున్న
కి, దగునీ కెపుడున్ ॥ (క) మానాభిమానముల గతి । మాని సవతులందు
నూడు, మానినృపుసికై । మానుగఁ గైకేయిని స । న్మానింపుచునుండు మ
న, మంచితబుద్ధిన్ ॥ (వ) తల్లీ భరతునియందు రాజత్వ ప్రయుక్తగౌరవంబు
జేర్పుము రాజులర్ధ జ్యేష్ఠులగుటం జేసి రాజ దత్తార్థ జ్యేష్ఠత్వంబువలన భర
తై ముఖ్యనివృత్తికొఱకు రాజ ధర్మంబుసంస్మరింపుమని పలికి పదంపడి భరతు
తోఁ జెప్పుమనిన తెఱంగు వినుము॥(ఉ) ఏనిటవచ్చునప్పుడు మహీవరసందే
పుపీటిలో । లేసికతంబునన్నతులఁ బ్రీతిగఁ జెప్పుటలేకపోయెన । మ్మానవవా



నానతిస, మంచిత రాజ్యముఁబూనిధర్మము । న్మానక తల్లులందఱస, మస్థితిఁ జూచు
చునుండు మెప్పుడున్॥(వ) మఱియు మహీనాథుండువయోవృద్ధుండు గావుననమ్మ
హాత్ముని రాజ్యస్థునింగా భావించి పాలింపుచు యౌవరాజ్యపదస్థుండవై రాజశాస

—(*)సుమంత్రుండు దశరథునికి లక్ష్మణువాక్యంబులఁ జెప్పుట.(*)—

నంబునజీవింపుము మఱియుఁ బుత్రాభికాంక్షిణియైన కౌసల్యను గైకేయినట్ల
సన్మానింపుచుండుము ॥ (క) అని చెప్పుమనుచు నాతో । మనుజేశ్వర రా
ఘవుండు, మాటికి వినయం । బునఁ బల్కి దుఃఖవశమునఁ । గనుఁగవ సాంద్ర
ముగ బాష్ప, కణములనించెన్ ॥ (ఉ)రాముఁడు పల్కుమాట విని, లక్ష్మణుఁ
డూర్పులు వుచ్చి క్రుద్ధుఁడై । నా మొగముట్టిచూచి ఘన, నాదనిభార్భటితో
డనిట్లనున్ । ఈమహనీయమూర్తి యిపు, డేయపరాధము చేసి రంతరో । ద్దా
మపురీసుఖస్థితులు, దక్క వివాసితుఁడయ్యెఁ జెప్పుమా ॥ (తే,గీ) దోసమెంచ
క కైకయీ, తుచ్ఛశాస । నంబు శిరమున నిడికొని, నరవరుండ । కార్యమైన
ను మది నొక్క, కార్యబుద్ధిఁ । జేసిపంచిన నప్పని, సేయఁ దగవె ॥ (చ) కప
టపుధర్మముం దవిలి, గ్రక్కున రాముని లచ్చినెంతయున్ । నిపుణత సం
గ్రహించుటకు, నేఁడు వరద్వయ మంచు నొక్క బ । ల్నెపమిడి కామదారు
ణశి, లీముఖవిద్ధుఁడు గాననాలికై । నృపుఁడిటు కాననకీయనఘు, నింబని చెన్నుఁ, వి
చార హీనుఁడై॥ (వ) సుమంత్రా దశరథుండు దైవప్రేరితబుద్ధిం జేసి మిమ్ముఁ
బరిత్యజించె నని యంటివేని దైవ ప్రేరితుండైన నొకానొక యపరాధం
బు ని, రూపించి కదా పరిత్యజింప వలయు నీరాముని యందొక్కింతయైన నప
రాధంబు లేదిట్టి నిరపరాధుండైనరాముని నెట్లు పరిత్యజించె నిది యుక్తంబు
గాదు వినుము ॥ (క) అనుచిత మిది యుచితంబిది । యనుచు విచారింప కా
నృపాగ్రణి రఘువ । ర్యుని లోకవిరుద్ధంబుగ । వనమున కనుచుటఁ దలంచి
వగచెదబుద్ధిన్ ॥ (చ)సకలజగద్ధితాచరణు, సర్వజగత్ప్రియునిం గుమారునిం
గ్రకచమువంటి చిత్తమునఁ, గానకుఁ బంచిన యట్టిరాజునం దిఁక గురుబుద్ధిఁ గూ
ర్పఁ దగ, దేటికి వేయన నీమహాత్ముఁడే । సకుఁడు గురుండు దైవమును, సర్వ
ము నాకుఁ దలంపసారథీ ॥ (తే,గీ) పూర్ణిమాచంద్రవదనునిఁ, బుణ్యమూ
ర్తిఁ । ననఘురాముని నిష్కారణముగ విడిచె । నిట్టిదుష్కర్మకారియై, న
ట్టిమనుజ । విభుని నెబ్బంగిలోకంబు విశ్వసించు ॥ (తే,గీ) సకలలోకాభిరా

ముని, సత్యరతుని । రాముని బరిత్యజించిభూ,రమణలోక । గర్హితుండ నై
యింక నేకరణిజగతి । నేలెద వటంచుఁ జెప్పుము, నృపునితోడ ॥ (తే,గీ)అ
నుచుమీతోడ భాషింపు,మనిసుమిత్ర । కొడుకు గనలుచుఁ బలికెఁ ద,త్కోప
వేగ । మేమని వచింప వచ్చుశ్రీ,రామునందుఁ । గూర్మి పెంపున నతఁ డంత,
కుసితుఁ డయ్యె ॥ (ఉ) రాముఁడు పల్కు చందమును, లక్ష్మణుఁడన్న విధంబుఁ
జూచి యా । భూమితనూజయూరుపులు, వుచ్చుచుఁ జిత్రసమర్పితాకృతిన్ ।
మోమఱ వాంచి శోకమున,మోమున నశ్రులు గ్రమ్మ దేఱఁదా । నేమియుఁ
బల్కకుండె మనుజేశ్వర రాముని మోముఁజూచుచున్ ॥ (తే,గీ) సీతయట్ల
నె రాముఁడు చిన్నవోయి । కనులనశ్రులుచనుదేఱ,ననుజబాహు । పాలితుం
డయి నన్నుమీ పాలికరుగు । మనుచుఁ దానెట్టకేలకుఁ, బనిచెనధిప ॥ (వ) ఏ
నుకృతాభ్యనుజ్ఞుండ నయ్యు నమ్మహాత్ముని విడువంజాలక హృదయంబునం బరి
తపించుచుఁ గొంతసేపుపురోభాగంబునఁ గృతాంజలిపుటుండనై కొలిచియుం
డియెట్టకేలకుఁ జిత్తంబుఁగట్టిపఱచుకొని రథంబు దోలుకొని గుహసహితంబు
గా శృంగిబేరపురంబునకుంబోయితి నప్పుడు వైదేహి భూతోపహతచిత్తయై
నదాని తెఱంగున విస్మృత సర్వప్రయోజనయై యెచ్చవడి యభూతపూర్వ
వ్యసనయైకన్నీరు నించుచు దీనవదనయై సారెసారెకు రాముని వదనంబు వి
లోకింపుచు మఱలి చనుదెంచుచున్న నన్ను విలోకింపుచుండె నంత రామల
క్ష్మణులు జటామండలమండితులై సీతా సహితంబుగా గంగానది నుత్తరించి
యేను విలోకింపు చుండ నవ్వలం జని రప్పుడు శతమఖముఖ విబుధదుర్ల
భంబైన శ్రీరామసేవాభాగ్యంబు మాచేతఁ బురాకృత సుకృత పరిపాకంబున
లబ్ధంబయ్యె నదియిప్పుడు దైవంబు చేతఁ గ్రమ్మఱ విఘటితంబయ్యె నింక నేమి
సేయుదము మనకు వ్యర్థజీవనంబేలయని తద్దుఃఖంబున నశ్రులునించుచు రా
ముండతికరిన హృదయుండై యరుగుచుండ రథ్యంబులు మఱలకున్న నేనతిప్ర
(*)సుమంత్రుఁడు దశరథునికిఁ దాను దారిలోఁ గన్న తెఱఁగుఁ జెల్పుట,(*)
యత్నంబునఁ గ్రమ్మఱించికొని శృంగిబేరపురంబుఁజేరి రాముండునన్ను మఱ
లఁ బిలుచునో యను నాశచేత నచ్చట గుహునితోఁ గూడఁ గొన్నివాసరం
బులుండి క్రమ్మఱఁ బురంబునకుం జనుదెంచునప్పుడు మార్గంబునందు ॥ (సీ)
రమణీయ పుష్పకో,రక శోభితములైన ప్రూకులు మలమల,ప్రగ్గిపోయె । న



దులు పల్వలములు, సదమలజలతటాకంబులుతప్తోదకంబులయ్యె । నుద్యానవ
నములు, నుపవనంబులు పరి శుష్కపర్ణంబులై,సొబగుదప్పె । సత్వసంఘం
బులు,సంచారములు మానెఁ గమలాకరంబులు, కలుషజలము ॥ (తే,గీ) ల
గుచుఁదప్తాంబుజంబులై హంసముఖ్య । ఖగవిరావంబులు నులేక,క్రాఁగుచుం
డె । రమ్యగుణమండనుండైన రాఘవుండు । కాననంబునకరిగిన కారణమున ।
(తే,గీ) మఱియునావచ్చునప్పుడు నిరుపమాన । విపినములయందుఁ గీరాదివి
విధవిహగ । రవములించుకయైనను జెవికి సోఁక । వేమిచెప్పుదు నాచిత్ర,మి
నకులేశ ॥ (వ) ఇట్టిపపర్యాసంబులఁ జూచుచుంజనుదెంచి యయోధ్యాపురం
బుఁ బ్రవేశించి రాజమార్గంబునం జనుదెంచునప్పుడు రామరహితంబైన ర
థంబుఁజూచి నిట్టూర్పు నిగుడింపుచుఁ గన్నీరు నించుచు నూరంగలవారిలో
న నొక్కండైన నన్నాశ్వాసింపండయ్యె మఱియుఁ బురంబునంగల పుణ్యాంగ
నలు ప్రాసాదహర్మ్య విమానాగ్రంబుల నుండి హాహాకారంబులు సేయుచు
బాష్పధారా పూరిత ముఖులై యన్యోన్య వదనావలోకనంబుసేయుచు దీర్ఘ
స్వరంబున విలపించుచుండిరి యేను రామప్రవాసజనితార్తిత్వంబునమిత్రామి
త్రోదాసీనజనుల విశేషంబించుకయైన విలోకింపనైతి నీయయోధ్యయప్రహృ
ష్టమనుష్యయు దీననాగతురంగమయు నార్తస్వరపరిమ్లానయు వినిశ్వసితని
స్వనయునిరానందయు రామప్రవ్రాజనాతురయునై పుత్రహీనయైనకౌసల్యకర
ణిం దోఁచుచున్న దనిపలికిన నాసుమంత్రుని వాక్యంబు విని యద్దశరథుండు
(*)దశరథుఁడు తన్ను దూఱుకొనుచు నానా ప్రకారంబుల దుఃఖించుట.(*)
పరమదీనుండై బాష్పోపహత వాక్యంబున సుమంత్రున కిట్లనియె ॥ (ఉ) మ
కుకవతోనయజ్ఞులగు మంత్రులనేకులు గల్గియుండఁగా । నొక్కనితోడనైన
ఘున మోచనసేయక యాలిమాటకై । గ్రక్కున రామునింగటికి, కానకుబొ
మ్మనియంటినక్కటా । యక్కడికేలపోయితిమ, హాగుణభూషణునేలవాసితిన్॥
(తే, గీ) మోహవశమునాలికై మోసపోయి । కులమునకుఁగీడుచేసితిఁదలఁప
నేల । మొదలఁగావలెననిచేసి పిదపనిట్లు । పరితపించిననవ్వోత పాసిచనునె॥
(తే,గీ) ఏమిచెప్పుదు సూతనాకించుకైనఁ । బుణ్యశేషంబు గలదేని భూరి
కరుణఁ । గూర్పుమలరాఘవునినన్నుఁ గూర్పకున్న । నొడలఁబ్రాణంబులుం
డవు తడవువలదు ॥ (చ) అనఘచరిత్ర యిప్పటికి నైనమదాజ్ఞఁజరించె దేని

పు । త్రుని మఱలింపు మత్తెఱఁగు దుర్ఘటమేని రథస్థుఁ జేసి గొ । బ్బున రఘువర్యుఁ డున్నవన భూమికి నన్గొనిపొమ్ము సూత యీ । ఘనునెడఁ బాసి యొక్క క్షణమాత్రటి కాలమిలన్మనఁ జాల నెంతయున్ ॥ (ఉ) చందురువంటి నెమ్మొగము చాఁగెడు కన్నులు వృత్తదంష్ట్రిలున్ । సుందర పల్లవాధరము సోగకురుల్మణి కుండలప్రభా । బంధుర కర్ణయుగ్మమును బారెడు చేతులు గల్గు రామునిం । బొందఁగఁ జూడకున్న నిలు । బోవదరంబె సుమంత్ర యిత్తఱిన్ ॥ (చ) గుణితుఁ రాఘుఁ డున్నయెడ కుం గొనిపోవుట యుండెఁ గాని చో । సురుచిరలీల నయ్యనఘు సుందరరూపము నాత్మలోపలం । దిరముగ నిల్పి చూచుచు నతి త్వరితంబుగ ధర్మరాజమం । దిరమున కేగుటొండె నిఁక నిల్వఁగ నేర్తునె యీ జగంబునన్ ॥ (తే,గీ) ఇట్టి దురవస్థ నొందియే నిపుడు రామ । చంద్రు సద్గుణసాంద్రు విశాలయశుని । సూర్యవంశప్రదీపకుఁ జూడనేని । యింత కంటెను ఘనదుఃఖ మెద్ది నాకు ॥ (వ) అని నిర్వేదించి యంతకంత కగ్గలంబగు శోకవేగంబున ॥ (శా) ఆభూనాయకుఁ డొంటి నన్నిచట దుఃఖాంభోధిలోఁ ద్రోచి మీ । రీభంగిన్ వనసీమ కేగఁ దగవౌనే కావరే వారిశో । కాభీలాంబుధి నుద్ధరింపఁగదరే హా రామ హా లక్ష్మణా । హా భూపుత్రిక యంచుఁ నించుగనులన్వ్యాలోల బాష్పాంబువుల్ ॥ (వ) అని యివ్విధంబునఁ గొండొకసేపు రామునిం బేర్కొని విలపించుచు నద్దశరథుండు కౌసల్యదిక్కు మొగంబై దేవి రామశోక మహావేగంబును సీతావిరహపారగంబును శ్వసితోర్మి మహావర్తంబును బాష్పఫేన జలావిలంబును బాహువిక్షేపమీనౌఘంబును విక్రందితమహాస్వనంబును బ్రకీర్ణకేశశైవాలంబును గైకేయీబడబానలంబును మదశ్రువేగ ప్రభూతంబును గుబ్జావాక్య మహాగ్రహంబును నృశంసావర వేలంబును రామప్రవ్రాజనాయతంబునగు నపారశోక సాగరంబున నిమగ్నుండనై తినింకఁ దరణి భూతుండగు రాముండు లేకున్న నిమ్మహాసముద్రంబు దాఁటి దరిచేరుట కేయుపాయంబు లేదని పల్కి శోకాయాస విశేషంబున దుఃఖసమర్పితచేతనుండై వివశత్వంబు నొంది శయనంబునం బడియె నప్పుడు కౌసల్య మహీపతి పాటంతయుం జూచి భయంబుఁ గొని ద్విగుణీకృతశోకతాపయై భూతావిష్టయైనదాని తెఱంగున వేపమానయై గతప్రాణయైన దానిపగిదిఁ బుడమిం బడి సుమంత్రునవలోకించి యిట్లనియె ॥ (ఉ) నాకొడుకున్న చోటికటు నన్నురహిం



గొనిపొమ్ము తన్ముఖా । లోకన మబ్బదేని మహిలోఁ బ్రతికి యెనను నిల్వఁ జాలనం । దాఁక సుమంత్ర వేగ నరదంబు మరల్పుము రాఘవుండునన్ । గైకొనఁ డేని తత్క్షణమె గ్రక్కున నేఁ గెదఁ గాలుప్రోలికిన్ ॥ (క) నా విని సుమంత్రుఁ డెంతయు ।

(*) సుమంత్రుఁడు కౌసల్య నూఱడించుట. (*)

భావంబునఁ జాలవగచి ప్రాంజలియగుచుం । దా వెండియు నిట్లనె న । ద్దేవికి మధురోక్తి వగపు దీరఁగ నంతన్ ॥ (మ) తుములంబై కులమెల్ల గ్రమ్మనుపడంగా దుఃఖించెదిట్లేల సం । భ్రమమున్ శోకము దైన్యమున్ విడువుమా రాముండరణ్యంబులో । నమితస్నేహము భక్తియున్వినయ మొప్పారంగ సౌమిత్రియు । ల్లమురంజిల్లఁ గఁ గొల్చుచుండ సుఖలీలం బొల్చియుండుం జుమీ ॥ (క) ధర్మజ్ఞుఁడైన లక్ష్మణుఁ । డర్మిలి రాఘవుని పదము లర్చింపుచుఁ దా । నివర్ణాల మతియై వనమున । శర్మాకరాముష్మికంబు సాధించు రహిన్ ॥ (క) జనకసుత విజనమగు కా । ననమున కేగియును దనమనంబున భయముం । గొనకెప్పటి వలె శ్రీరా । మునిపయి రమియింపుచుండు ముదిత హృదయయై ॥ (క) ఆ నెలఁత నెమ్మొగంబున । దీనత్వం బించుకైనఁ, దెలియని కతనం । బూని ప్రవాసము సేయఁగ । మానుగఁ దగునను చు నాదుమదికిం దోఁచెన్ ॥ (క) జానకి మున్నారామా । ద్యానంబులఁ గ్రీడసల్పి నట్లుగ విజనం । బైన గహనంబునందును । జానుగఁ గ్రీడించు రామసమ్మానితయై ॥ (తే, గీ) పూర్ణచంద్ర నిభాస్యయా భూమిపుత్రి । విజనమగు గాననంబున విభుని మనముఁ । బాయ కెప్పుడు రంజిల్లఁ జేయుచుండు । సాధ్వివారి నుద్దేశించి శంకవలదు ॥ (క) చిత్తము జీవితము తదా । యత్తంబుగఁ జేసి గృహము నందుం బలెన । య్యుత్తమసతి వనమునఁ బతి । చిత్తము రంజిల్లఁ జేయు, సేవాక్రియలన్ ॥) ఆ,వె) విపినమైన వీడు వీడైన విపినమా । యుర్విసుతకు రాముఁ, డొద్దనున్న । నెలవు నొద్దలేని నెలవు ప్రక్రమంబున । సాధ్వియి త్తెఱంగు సత్యమరయ ॥ (వ) మఱియు న ద్దేవి మార్గంబునం బోవుచు నెడనెడ గ్రామంబులు నగరంబులు నదీనదంబులు పాదపంబులు విలోకించి తత్తద్విశేషంబులన్నియు రామలక్ష్మణులనడిగి వారివలన నెఱుంగుచు నగరోపవనంబునం గ్రీడింపం బోవుచందంబున నుత్సాహోపేతయై సుఖలీలం జనియె నీవైదేహి సంబంధియైన యీ ప్రస్తుత వృత్తాంతజాతంబు సంస్మరించెదఁ గైకేయి నుద్దేశించి సీత చేతఁ బలుకంబడిన వాక్యంబు సంస్మరించుట

కుంజాల నని యిట్లయోధ్యా నిర్గమనకాలికంబైనసీతోక్తకైకేయీవిషయక ప
రుషవచనంబుకౌసల్యకుఁ బ్రియంబని చెప్పుటకుపక్రమించి వృద్ధులగువారలకు
జీవననైరాశ్య హేతుత్వంబువీక్షించి ప్రమాదంబునంబలికితి నిదిగోపనీయంబు
దీనినెఱింగింప నర్హంబు గాదనితలంచి పర్యుపస్థితంబైన తద్వాక్యంబునంబ్ర
చ్ఛాదించి యద్దేవికి సంతోష హేతుభూతంబైన వాక్యంబున వెండియునిట్లని
యె ॥ (తే,గీ) దేవియేమనిచెప్పుదుఁ ద్రోవనేగు । నపుడువాతాతపోద్ధతి నమ్మ
హీజ । మించువంటితనుచ్ఛాయ యించుకైనఁదఱుఁగదదియేమి చిత్రమోయె
ఱుఁగరాదు ॥ (క) తమ్మికిసెనయైపున్నమ । తమ్మిపగతుఁబోలుచాయఁ,దనరె
ను సతియా । సృమ్మించుకయైననుమా । యమ్మావసివాడదెంతయాశ్చర్యంబో॥
(క) ఆరామచరణములులా । క్షారస వర్జితములయ్యు సలలితరక్తాం । భో
రుహకోశసమప్రభ । నారూఢింబొల్చుచున్న, నమ్మాచూడర్ ॥ (వ) మఱియు
నద్దేవి వనగమనసమయంబునందు భూషణవిషయస్నేహంబునఁ జరణాద్యవయ
వ సమర్పిత సర్వభూషణయై నూపురాది శింజిత స్వనానుకారిలీలాయుక్తయై
న పగిది సఖేలంబుగాఁ బోవుచున్నదియునుంగాక ॥ (ఆ,వె) వారణాదిఘో
రవన్యమృగంబులఁ । గాంచియించుకైన, గాసిపడదు । రామబాహుసాలరక్షి
తయగుచు తు । మాకుమారివిపినమార్గమందు ॥ (వ) దేవి సీతాలక్ష్మణు
లు శోకింపం దగిన వారుకారు మనముశోంకిపందగినవారముగాము దశరథుం
డును శోకింపందగినవాఁడు గాఁడీ పితృవచనపరిపాలన రూపచరిత్రంబులోకం
బునందాచంద్రార్కంబుగాఁ బ్రతిష్ఠితంబైయుండు నీవుశోకంబువిడిచిస్వస్థచి
త్తవుగమ్ము మహర్షి జుష్టంబైన మార్గంబునందు సువ్యవస్థితులైకందమూలా
శనులై శుభంబైన పితృవాక్యంబు పరిపాలింపుచు వనంబున నివసించె
దరని యిట్లు సుమంత్రుండు పలికిన యుక్తవాదియగు నతనిచేత నివార్యమా
ణయయ్యు సుతశోకకర్శిత గావునసెంతచెప్పిన నుడుగక ప్రియపుత్ర రాఘవా
యని పేర్కొని బహుప్రకారంబుల విలపించుచునిజభర్తనవలోకించి యకౌ

(*) కౌసల్యదశరథుని నిందించుట. (*)

సల్యయిట్లనియె ॥ (శా) సానుక్రోశుఁడు సత్యవాదియు వదాన్యశ్రేష్ఠుఁడిం
ద్రాభుఁడీ । త్యానాథుం డని నీయశంబఖిలలోకస్తుత్యమైయుండుమ । తూనుం
గానకుఁబంచి కామపరతన్ దోషంబునార్జించి ధా । శ్రీనాథోత్తమ కాము



కుండనఁగఁ గీర్తింగాంచితీవెంతయున్ ॥ (ఉ) పిన్నటనాఁటనుండియును బెక్కు
సుఖంబులచేఁబ్రవృద్ధులై । నన్నియుఁ గన్నపుత్రిలిటు వంటియవస్థలకెట్టులో
ర్చువా । రన్నియటుండ నిమ్మతిసుఖార్హమహాసుకుమారిసద్గుణా । భ్యన్న
తయైనసీతఁదలపోసిన గుండియచాలఁగ్రుళ్లెడిన్ ॥ (క) చిన్నదిపెక్కుసుఖంబులు।
గన్నదిమున్నెన్నఁడిట్టి కష్టంబులుదాఁ । గన్నయదిగాదుకానం । బన్నగనె
ట్లోర్చునో తప మునకుఁజలికిన్ ॥ (శా) సారాన్నంబుభుజించి గీతకలని,స్వా
నంబుఁగావించువి । స్తారామంజుల తూలతల్పముల మీఁదంగూర్కువై దేహిసై।
వారాహారముమెక్కి కేసరిఘన ధ్వానంబు లన్వీంచుఁజె । న్నారంగన్ కశప
ర్ణా తల్పములన్పై, నాసీ నయా సెట్లోకో ॥ (క) తమ్మికి సెనయైపున్నమ।
తమ్మిపగతుఁ బోలికమ్మ, తావి పలుకులం । గ్రమ్ముకొను రాఘవుని వ।
క్త్రమ్మెన్నఁడు గాంతుఁ గనుల, తమిదీఱంగన్ ॥ (తే,గీ) కరికరోపమ పరి
ఘసంకాశమైన । కరముతలగడ నిడుకొని,కఠినభూమి । శయ్యపై నాకు
మారుఁడె, చ్చటవసించి । యున్నవాఁడొయరణ్యమధ్యోర్వియందు ॥(తే,గీ)
అధిపయేమందు నాగుండె, యశనిపాత । కల్పమగుభూరిశోకంబు, గాఢి
గ్గైన । వేయుపఱియలైపోవదు, వితతవజ్ర । సారమయముగాఁబోలుని,స్సం
శయముగ॥ (వ) దేవాసుఖార్హులైన రామలక్ష్మణులు సీతాసహితంబుగా
ననాదరింపంబడి నీచేతనిరస్తులై దారుణారణ్యంబునంజరించుచున్న వారనియె
డు నక్కర్మంబు శోచనీయంబుగాదె కరుణారాహిత్యంబున నీచేతనిదికృతం
బయ్యె ననివగచివెండియునిట్లనియె॥ (క) హృదయేశ్వరరాముఁడు పం । చద
శాబ్దము నందుమఱలఁ, జనుదెంచినను । న్నదుఁ డైరాజ్యముకోశము । పదప
డి రాఘవునికేల, భరతుండిచ్చున్ ॥(క) చెచ్చెర రాముఁడుసమయం । బచ్చు
పడందీర్చిమఱల,నరుదెంచినఁదా । నిచ్చునెభరతుఁడురాజ్యం । బిచ్చినఁగైకొను
నె యతఁడ.హీనగుణాఢ్యా॥ (వ) అదియెట్లనినవినుము॥ (చ)గుఱుతుగశ్రాద్ధ
కర్తలగు, కొందఱు విప్రులు బంధుకోటికిన్ । స్థిరమతిచేనిమంత్రణముఁ,జెప్పి
న పాఱుల కంటె మున్నె య । క్కరపడిభోజనంబిడిన,గ్రమ్మఱవారల యిం
డ్లనమ్మహీ । సురవరులర్థి మైఁగుడువ, జాతురాకోసుధనైనవల్లభా॥ (వ) మ
ఱియునని మంత్రితబ్రాహ్మణులుతృప్తులగుచుండ గుణవంతులును సురసమా
నులును బ్రాజ్ఞులును వృద్ధులునగు నిమంత్రితబ్రాహ్మణోత్తములు వృషభంబులు

శృంగచ్ఛేదంబునం బోలె నిజావమాన హేతుకంబైన భోజనంబుగావించుట
కుసమర్థుఁలు గారత్తైఱుంగున। (క) జగదీశ వృకముఖభక్షిం । పగఁదక్కిన వ
న్యసత్త్వ, మాంసముపిడప । న్వగ చెడియుపయోగింపఁగ । మృగపతి చిత్తము
నఁదలఁచు, నేహీనమతిఁ॥ (తే,గీ) మనుజనాయక యాతయా,మంబులగు ప।
లాశహపిరాజ్యకుశ పురో,డాశయూప । ఖాదిరాదిక మొండుమ,ఖంబుసేయు।
నప్పుడు వినియోగ మొనరింప, నర్హమగునె ॥ (క) హృతసారమైన సురా
క్రియ । గతసోమంబైన మఖము, గతిఁగైకేయీ । సుతభుక్తవర్జితంబగు ।
క్షితిరాజ్యము రాముఁడేల, చేకొనునధిపా ॥ (క) నిరుపమ బలవద్వ్యాఘ్రి
ము । నరవరవాలాభిమర్శ,నంబును బోలె । న్గురుమతి నిట్టియసత్కృతి । న
రుదార సహింపఁజాలఁ, డతిబలుఁడగుటఁ ॥ (చ) మనుజవరేణ్య రాముఁడు
స్సమంచితధర్మవిదుండు గాన దు । ర్జనులను బ్రీతితో నయ వి,చారులఁ
జేయఁగఁబూనినీదు శా । సనమున దండకాటవికి, సమ్మతిమీఱఁగ నేగెఁ గాక
యా । యనకు సురాసురప్రముఖు, లైననుగీడొనరింప శక్తులే ॥ (చ) అన
ఘ యముండు భూతముల, నట్ల శరార్చులచే సమస్తతో । యనిధుల నైనఁ
గాల్పఁదగు.నంతపరాక్రమశాలి యయ్యు మ । త్తనయుఁడు తండ్రిచేఁదనకుఁ,
దానె సమాహతుఁడయ్యె నక్కటా । మనమునఁ జూడఁదగ్గనిన,మత్స్యముచే
జిఱుమీను కైవడిఁ ॥ (క) సనయుండు సత్యరతుఁ డి । మ్మనుజవిభుం డను
చుఁబొగడు, పడయఁదలఁచిధ । ర్మనిరతునినయవినీతా । త్మనిరాముని వెడ
లనచిచ్చి, తోన్నృపతిలకా॥ (తే,గీ) అనఘుఁడుసుతుండువనమున, కరుగనీకు।శా
స్త్రస్పృష్టంబు రాజర్షి, చరితమును బ్ర । ధానము సనాతనం బగు, ధర్మమా
య్యె । నేనియుక్తమూధర్మంబు, గానమట్లు॥ (సీ) రాజేంద్ర విను పతివ్రత
యగుసాధ్వికి గణుతింపఁ బ్రథమర,క్షకుఁడుభర్త । రెండవగతి నంద, నుండు
మూఁడవగతి దాయలీమువ్వురు, దక్కనొండు । శరణంబులేదని, శాస్త్రంబు
లెఱఁగింపనదియునాపుట్టువు, కొదవదయ్యెఁ । గలకాలమునునీవు, కైకకువ
శుఁడవై యించుకయును గారవించవైతి॥ (తే,గీ) విపుడు ఫలకాలమున మ
హా,విపులయశుని । సుతునిఁగానకుఁబనిచితి, వితరులైన । చుట్టలెల్లను జులక
గాఁ,జూచునట్లు । చేసితివి వేఱెయిఁకనూఱు, చెప్పనేల॥ (చ) జనవర క్రూర
మన్మథవ,శంబున నెయ్యము దక్కి పుత్రుని । న్ఘనవని కంపి యిట్లువెను,కంబ



రితాపము నొందె దేల యీ । నిన పులి యాఁకటం దెలియ, నేరకపుట్టిన చి
న్నికూనలం । దనియఁగ మెక్కి యావెనుకఁ, దద్వ్యథ చేతఁ గృశించు చా
డ్పునఁ ॥ (క) జననాయక నీచేఁ బుర । జనులు సఖులు మంత్రివరులు స
తులును భృత్యు । ల్తనయులు బాంధవులాదిగ । జనులు నిహతులైరి కుల
ము,సంక్షోభించెఁ ॥ (వ) అనియిట్లు శోకాతిశయంబునఁ బరమసంక్రుద్ధయై
పరుషంబుగాఁబలికిన దారుణశబ్దసంశ్రితంబైన తద్వాక్యంబాలకించి యద్దశర
థుండు పరమదుఃఖితుండై దురంతచింతాభరంబున నొల్లంబోయి కొండొకసే
పునకుం దెలిసియేతాదృశదుఃఖంబునకు నిదానభూతంబైన దుఃఖంబెయ్యదిపూ
(*)దశరథుఁడు తాను మున్ను చేసిన మునికుమారవధముఁదలచుకొనుట.(*)
ర్వకృతంబయ్యెనోయని సంస్మరించి యీదేవిచేతఁగథితంబైనసర్వంబుసత్యం
బిట్టిదురవస్థ దొరకొనుటకుఁ బూర్వభవంబునం దేమియకృత్యంబు గావించితి
నోయని క్రమ్మఱవిచారించి వెండియు శోకవ్యాకులేంద్రియుండైమూర్ఛనొంది
దీర్ఘకాలంబునకతిప్రయత్నంబునం దేఱి వేఁడి నిట్టూర్పునిగుడించి తనపా
ర్శ్వ భాగంబునఁ దనయట్లదుఃఖింపుచున్న కౌసల్యనవలోకించి యత్యుత్కటం
బులైన పుణ్యపాపంబులచేత నిప్పుడే ఫలంబనుభవింపంబడు ననియెడిన్యాయం
బునఁ బ్రియ పుత్ర విశ్లేష దుఃఖంబే ననుభవించుచున్నవాఁడ దీనికి హేతు
భూతంబైన కర్మంబ్బద్ధియని పదంపడి విచారించి తొల్లిశబ్దవేదియైన తనచే
త నజ్ఞానంబువలనఁ గృతంబైన మునికుమారవధరూప దుష్కృత కర్మం
బు ప్రతీతంబైన నమ్మహీపతి నిజకుమార వియోగజనితశోకానలంబు మునికు
మారవధజనిత దోషస్మరణవాతంబునం బ్రజ్వలితంబై శరీరంబుపహింపం దొ
డంగిన సహింపజాలక మొగంబు వాంచి యంజలిఁగీలించి ప్రసాదంబు వేఁడు
నుకొను తలంపున నక్కౌసల్య కిట్లనియె ॥ (ఆ,వె) దేవి నీ గుణంబు, దే
వాదులకునైనఁ । బ్రస్తుతింప వచ్చు, భర్తృభక్తిఁ । జేసి ఘోర పాప
చిత్తుఁడ నగు నామొ । గంబురోయకిపుడు, కాంచుకతన ॥ (క) రిపులయందైద

(*)దశరథుఁడునమ్రుఁడై కౌసల్య ననూనయించుట.(*)

నఁగినియకకృపయొనర్చు । నంతశాంతియుఁగలదాన వింతయేల । నన్నువిడనా
డెదవునాదు విన్నపంబుఁ । గైకొనియనుగ్రహింపుము కమలనేత్ర ॥ (తేఁగీ) జ
లజలోచన ధర్మవిచారమైన । సాధ్వికెంతయు జగతిలో సగుణుఁడైన । ని

గర్భుండై సశాస్త్రోక్త నియతిఁజూడ । దయితుఁడొకండె ప్రత్యక్షదైవతం బు ॥ (ఆ,వె) సాధ్వినీవుదృష్ట జనపదా పరవున । యజ్ఞహర్త ధర్మవార్తి నొంది । తూలుచున్న నన్ను దుఃఖితవయ్యును । దారుణోక్తినింత దూఱఁదగ దు ॥ (వ) అనియివ్విధంబున దీనుండై ప్రార్థింపుచున్న యమ్మహీపతి వాక్యం బువిని యద్దేవి జలనిర్గమమార్గంబునవోదకంబునుంబోలె శోకబాష్పజలం బులునించుచునతని యంజలిపుటంబు పద్మంబునుంబోలె శిరంబునంగదియించి రోదనంబుసేయుచు శోకసంభ్రమ భయంబులు మనంబునముప్పిరిగొన నిట్లని యె ॥ (క) ధరణీశభూరిశోకము । దరికొనసైరింపలేక తాపముపేర్మిం । బరుషోక్తులంటిఁగాకిటు । తరమెఱుఁగక దూఱనంత ధర్మేతరనే ॥ (క) జన వరనిను యాచించెద । ననుగ్రహింపుమని పలికితమ్మాటకునె । మ్మనమున దుఃఖించి రయం । బునఁబుడమిం బడినదాన, మోహ వశమునన్ ॥ (వ)

(*)కౌసల్య దశరథు ననూనయించుట.(*)

దేవానీచేత యాచితనగుట వలన హతనైతి నేనుహంతవ్యనుగానె యుభయ లోకంబులయందు శ్లాఘనీయుండైన పతిచేత నేయువతి ప్రసాదింపఁబడు నదియుత్తమయువతి గానేరదు చాసికై హికాముష్మిక సుఖంబులు గలుగవదియునుంగాక॥ (సీ) అవనీశ పతిబుద్ధి, ననుసరించెడుసాధ్వి శుభయలోకసుఖంబు,లొందవచ్చు । ననుధర్మమెఱుఁగుదు, నినుసత్యవాదిఁగాఁదలఁపుదుఁదెలియని, దానఁగాను । పుత్రశోకార్తనై, పొగిలిమైమఱచిపల్కినమాట తప్పుగాఁగొనకుఁడిపుడు । శోకంబుధైర్యవివేకాదులనడంచుఁబూనిశోకసమానుఁడైనరిపుఁడు॥ (తే,గీ) మఱియొకఁడులేఁడుధాత్రినిష్ఠురరిపుప్ర । హారమైన సహింపశక్యంబు గాని । కటికికార్చిచ్చు వంటిశోకంబుచాలఁ । గొంచెమైనను సైరింపఁగూడదధిప॥ (వ) జితేంద్రియులైనయతులునుశోకంబున మూఢచేతస్కులైమోహితులగుదురు ॥ (క) తనయుండురామభద్రుఁడు । వనమునకుంజనిన పంచవాసరములునా । మనమునకుఁదోఁచెనెంతయు । జననాయక పంచ వర్షసదృశములగుచున్ ॥ (క) నరవర పుత్రవియోగజ । నిరుపమ శోకంబునాదు, నెమ్మనమున దు । ర్భరమై పెంపగుచున్నది । సరిదురువేగమున జలధి సలిలముమాడ్కిన్ ॥ (వ) అనియిట్లు కౌసల్య పతితోడఁ దగిన తెఱంగున మాటలాడుచుండ సూర్యుండు పశ్చిమమహీధర కందరాంతర్గ



తుండయ్యెఁ బదంపడి గాఢసంతమస పరిపూర్ణంబై రాత్రికాలంబుప్రవర్తించె నంత దశరథుండొక్కింత శోకోపహత చేతనుండైన యమ్మహీపతినిరామలక్ష్మణవివాసన సంజాతశోక మోహోపద్రవంబు స్వర్భానుండు సూర్యునింబోలె ననివార్యంబై యధిగమించెనిట్లుదురంతదుఃఖతాపంబునబడలుపడుచు నిస్తేజుండై యద్దశరథుండు పూర్వకృతంబైనమునికుమార వధరూపదుష్కృతంబంతయుఁ దెల్లంబుగా నెఱింగించు వాఁడై యాఱవనాఁటి నిశాసమయంబున శోకపీడితయైన కౌసల్యకిట్లనియె ॥ (తే,గీ) ధరణిలోపలఁబురుషుఁ డెద్దానిఁ జేయు । నదియశుభమైన మఱి శుభమైనఁ గాని । సందియము లేదు నిజకర్మ, జాతఫలము । నిక్కువంబుగఁ బ్రాపించు, నీరజాక్షి ॥ (తే,గీ) కర్మములుసేయఁ దలకొను, కాలమందె । కొసరిగురులాఘవంబులు, గుణముదోష । మరయకుర్వినెవ్వాఁడు కార్యంబు నడుపు । నట్టిమనుజుఁడుఁ బాలిశుం,డనఁగఁ బరఁగు ॥ (వ) అదియెట్లనిన వినుము సూక్ష్మతరపుష్పంబైన యామ్రవణంబు సూక్ష్మతరఫలంబుంబుట్టించు నను మోహంబున దాని ఛేదించి వర్ణంబుచేత సమాహితరమణీయ పృథుతరపుష్పంబైనపలాశవనంబు విలోకించిపుష్పంబున కనురూపంబైన పృథుఫలంబు గలుగు నని ఫలంబునం దాసక్తుండై తత్ఫలాశారోపణంబుఁ జేసి జల సేచనంబుఁ గావించు నతండనుభోగప్రాప్తి సమయంబున స్వోత్ప్రేక్షిత ఫలాభావంబువలనఁ బరితపించు నెవ్వండు భావిఫలంబు విచారింపక కర్మంబు సేయు నతండు ఫలకాలంబునందుఁ గింశుకసేచకుని పగిది దుఃఖింపుచుండు నత్తెఱంగున నేనును రామాభిషేక రూపంబైన శుభకర్మంబుఁ బరిత్యజించి దుఃఖరూపంబైన యాగామిఫలంబపేక్షించి కైకేయీప్రియరూపంబైన యశుభకర్మంబాచరించి కర్మఫలానుభవకాలంబున నశుభకర్మఫలత్వంబుచేత రామవియోగంబు నొంది రామత్యాగరూపఫల మనుభవింపుచు దుఃఖించుచున్న వాఁడఁ గుమారుండును ధనుష్మంతుండును శబ్దవేధిశబ్దప్రాప్త విఖ్యాతినైన నాచేత నీవక్ష్యమాణ మునికుమార వధరూపపాపకర్మంబు కృతంబయ్యె స్వయంకృతంబైన యమ్మహాపాపకర్మఫలంబే తాదృశ దుఃఖరూపంబై యజ్ఞానంబుచేత భక్షితంబైనగరళంబుభంగి సంప్రాప్తంబయ్యె నొకానొక పురుషుండు కింశుకపుష్పంబులు విలోకించి పుష్పంబెట్టిదట్టిఫలంబగు నని యెట్లు మోహితుండయ్యెడునట్లెనునుశబ్ద

వేధ్య వికారభూతంబైన ఫలంబు నెఱుంగనైతి నిట్లుశబ్దవేధనంబట్లుప్రాప్తిం
చెనంటివేని యే నకృతవివాహుండనై యువరాజ్యంబు సేయుచున్నసమయం
బున ॥ (శా) హర్షంబొప్పఁగ యౌవరాజ్య కటకా, ధ్యక్షుండనై వైభవో।
త్కర్షంబేర్పడ నేను భూప్రజల నందంబొప్పఁబాలింపగాఁ । గర్షన్నీల మహాప
(*)దశరథుండు కౌసల్యకుమున్ను తాను చేసినమునికుమారవధముఁ జెల్పుట.(*)
యోధరమహా, గర్జాసముజ్జృంభమై । వర్షాకాలముదోఁచె సస్యములకు
న్నైర్వదగ్ధ్యమేపారఁగఁ॥ (క) ఖగుఁడునిజతిగ్మకరముల । జగతిం దపియింపఁజే
సి, సర్వరసములం । దిగిచికొని మందకరుఁడై । యగస్త్యచరితయగు దక్షి
ణాశఁజరించెఁ ॥ (క) ఘనములు స్నిగ్ధములయ్యెను । వనముల దవశిఖిశమిం
చె, వలిగా డ్పెసఁగెఁ । వనముల మండూకంబులు । వనముల సారంగశిఖు
లు, వారకమ్రోసెఁ ॥ (తే,గీ) సిక్తపక్షోత్తరములౌటఁ, జేసిఖగచ । యము
లు సలిలసుస్నాతంబులైన మాడ్కి । వృష్టివాతావధూతాగ్ర, వృక్షసమితి।
యందధివసించెఁ గవగూడి,యత్నమలర ॥ (తే,గీ) పతితపతమానజలసిక్తభ
ద్రదంతి । యచలమగుతోయ రాశియట్లలరెఁబొండు । రారుణచ్ఛాయలగుసె
ల,యేఱులఁహులు । భంగి గిరిధాతువులనుండి, పాఱఁ దొడఁగె ॥ (వ) మఱి
యు నవరసాభిరామంబై యలంకారశాస్త్రంబు పగిది సమున్నతపయోధర
మండలంబై యౌవనవనితా రూపంబుకైవడి సుప్రసారిత వాహినీసందోహం
బై జయశీలునిదండప్రయాణంబుపై ఖరి సమంతతోవ్యాప్తచపలంబై కాముకు
నిచిత్తంబుభంగి సహస్రాక్ష శరాసనవిభాసితంబై దేవాసుర సంగ్రామంబు
చాడ్పున నిరంతరామృత ధారాపూర్ణంబై నాకలోకంబు కరణి నొప్పు న
క్కాలంబునందు ॥ (ఉ) ఏనొకనాఁటిరేయి రథమెక్కి శరాసనముగ్రకాండ
ముల్ । మానుగఁ దాల్చిమైమఱువు, మక్కువతోధరియించియాత్మలో । నూ
నినవేడ్కతోడ సర,యూతటపుష్పిత కాననంబులోఁ । బూనిమెకంబులందు
నుమఁ, బోయితి సాహసరేఖదోఁపఁగఁ ॥ (ఉ) ఈకరణి న్వనావనికి, నేగియ
నేకమృగవ్రజంబులఁ । వీఁక నమోఘబాణముల, వేమఱు రూపఱు నట్లుచే
సియా । చీఁకటి ప్రొద్దునం దటిని చేరువ నొక్కెడఁబొంచియుంటిన । వ్యా
కులమానసుండనయి, వాఁడిమెకంబులఁ ద్రుంచు వేడుకఁ ॥ (ఉ) అప్పుడుతన్మ
హాతటిని, యందొకభూరి గభీరనిస్వనం । బప్పులలో వినంబడిన, నప్పుడుదం



తిజలంబుఁ గ్రోలఁగా । నొప్పినచప్పుడంచు మదిసూహయొనర్చి శరంబుమూ
ర్విత్తోఁ । దప్పకఁగూర్చి యేసితిని, దద్ధ్వని లక్ష్యముగాఁగ నుద్ధతిఁ ॥ (సీ)
ఆసమయంబున, నక్కటా నడురేయి సలిలముఁ గొనిపోవ,సత్వరముగ । నే
గుదెంచితిని న,న్నెవ్వాఁడు కరుణలేకమ్మునఁ గ్రుమ్మెఁజీ,రాజినములఁ । దాల్చివ
న్యంబులఁ దక్కకమెసవుచుపండన బాధకుఁదప్పియున్న । నాయట్టితపసి,కన్యా
యంబుగానిట్టిపాటు వాటిల్లెనే,పాతకిగలదు॥ (తే.గీ) తల్లిదండ్రులువృద్ధులు,తప
సులట్టి । హారికింకదిక్కెవ్వఁడు.బాల్యమాది । గాఁగఁజెక్కువిధంబుల, గాఢ
భక్తిఁ । గొలిచి నేఁడిట్లువాసి పోవలసెనాకు ॥ (వ) ఏనెవ్వని కేమిపాపంబుఁ
జేసితి నాయట్టి యజాతశత్రునియందు శస్త్రం బెట్లు ప్రయుక్తం బయ్యెన్య
స్తపరపీడనుండనైన నాయట్టిఋషికి శస్త్రంబుచే వధంబెట్లు విధింపం బడి
యెఁగేవలానర్థసంహితంబంతియెకాని మద్వధంబువలన వానికయ్యెడుఫలం
బేమి గురుతల్పగమనునకుంబోలె నాకిట్టిదుర్మరణంబేలకలిగె మద్వధంబునకు
దుఃఖించు తల్లిదండ్రు లెట్లు జీవించెదరో యనివగచెద॥ (క) అనిపలుకు దీన
వచనము । వినవచ్చిన నదరి పడివి,వేకితనయ్యా । మునిసుతుఁడొక్కఁడునా
చే । వినిహతుఁ డయ్యెననియేను, వెఱఁగు జనింపఁ॥ (తే,గీ) శరముతోఁగూ
ర్చినట్టి ప్ర,చండచాప । మవనిఁ బడవైచి పాపభ,యంబు వలన । మేనుకం
పింపనయ్యెటి, పానయోగ్య । విషయమటుజేరఁ బోయితివేగమడర॥ (వ) ఇ
ట్లరిగి॥ (క) అవకీర్ణజటాభారునిఁ । బ్రవిద్ధకలశోదకునిఁ బ,రాగక్షతజ । ప్ర
విలిప్తగాత్రమద్విశి । ఖవిభిన్నాంగు మునిపుత్రుఁ,గనుఁగొనిభీతిఁ॥ (తే,గీ) ఏ
నుమెల్లన డాయంగ, నేగనపుడు । పుడమిఁబడియున్న యమ్మహా, మునిసుతుం
డు । గాఢకోపాగ్ని హేతులఁ,గాల్చుచున్న । వాడుఁపోలె నన్గాంచికం,పమునఁ
బలికె॥ (సీ) అవనీశవన్యమా,హారంబుగాఁగొనిఘన తపోవృత్తిచేఁ,గాననున్న।
యేనునీకపకార, మేమిగావించితిఁ దల్లిదండ్రులకును, దప్పిఁదీర్ప । నంబువు
ల్గొనిపోవ,నరుగుదెంచిననన్ను నిష్కారణంబుగ, నిశితబాణ । విద్ధుఁజేసితివేల
వృద్ధులంధకులుదుర్బలులురు నాతల్లిదం,డ్రులుపిపాసఁ ॥ (తే,గీ) గొనిమదాగ
మనంబును,గోరుచుందు । రట్టివారేను బోకున్న.నధికతృష్ణ । నలసి యసువు
లువిడువంగఁ, గలరుతెలియ । కెంతపాపంబుచేసితి,నేమిగలదు॥ (తే,గీ) ఇన
కులేంద్రమాతండ్రి యే,నిచటనీదు । దారుణశరాభిహతుఁడనై, ధాత్రిఁగూలి।

యున్న చందంబెఱుంగక, యున్న కతన । శ్రుతతపఃఫల యోగమీ, క్షోణిలేదు ॥
(క) ఎఱుఁగఁడనివగవనేటికి । నెఱిఁగినమజ్జనకుఁడిచట, నేమియొనర్చుం । బరి
సంచారాక్షములి । ద్ధరలో గిరికిగిరిఁ బ్రోవ దక్షతగలదే ॥ (చ) జనవరనీవు వే
గఁజని సర్వమున్ని ధనప్రపత్తిమ । జ్జనకునితోడఁ జెప్పుము ప్రశాంతివహిం
చి యతండునిన్నుఁగో । బ్బున శపియింపకుండునటు పోకయుపేక్షయొనర్చితేని
చ । య్యనననలుండు గాఅడవి నట్లువడి న్నినునీచేఱుసెడిన్ ॥ (క) లోకే
శతదాశ్రమమున । కేకపదీసరణి నేగుమిట్లరిగి కృపా । లోకనుఁడగుమ జ్జనకు
నిఁ । గైకొని ప్రార్థింపుమీవు కడుదీనుఁడవై ॥ (తే గీ) సలిలవేగ మత్యున్నతి
సహితమృదున । దీతటంబునుబోలె విశీర్ణశితశ । రంబునాడుమర్మంబుఁ గ
లంచుచున్న । యదివిశల్యునిఁ గావింపు మవనినాథ ॥ (వ) అనినవిని యేసి
మ్మునిసుతుండు సశల్యుండై బాణక్షతవేదన సహింపంజాలక కంపింపుచున్న
వాఁడు విశల్యునిం జేసితి నేని ప్రాణంబు విడువంగలవాఁడేమిసేయుదు ననిదుః
ఖితుండనై దైన్యంబునొంది శోకాతురత్వంబున నేమియుం జేయఁ జేతులాడ
కయున్న మచ్చింతాప్రకారంబెఱింగి యమ్ముని నందనుండు పరమార్తిన్ యు
క్తుండై యతిప్రయత్నంబున నాకిట్లనియె ॥ (సీ) మానవనాయక కానక చేసిన
పనికిదుఃఖించిన ఫలముగలదె । ధైర్యంబుచే శోక తాపంబునణఁగించి స్థిరచి
త్తుఁడవుగమ్ము చిత్తమోహ । మింతయునాకు లేదేను శూద్రికి వైశ్యువలన జనిం
చిన వాఁడఁగాన । బ్రహ్మహత్యా ప్రాప్త పాపంబునీకు లేదనిపల్కి బాణవేద
నసహింపఁ ॥ (తే,గీ) జాలకవిఘూర్ణితాక్షుఁడై జగతివేష్టి । తాంగుఁడైమా
టలుడిగిబిట్టలసియున్న । యమ్మునికుమారుఁగాంచి యేనుమ్మలించి । కడుభ
యంబున నడలుచుఁ గదియనేగి ॥ (వ) మహావ్యథచేత సంకుచితాంగుం
డై పుడమిం బడియున్న మునికుమారునిశరీరంబున నాటియున్న శరంబుఁ బెఱి
కిన నతండు తత్క్షణంబ సంప్రాప్తమరణుండయ్యెనిపలికి యద్దశరథుండు శో
కవేగంబునఁ గన్నీరునించి వెండియుఁ గౌసల్యకిట్లనియె ॥ (తే,గీ) బుద్ధినరయ
కచేసిన పుణ్యపాప । ఫలముగుడువక తీఱదత్యలఘుతరము । చిన్ననాఁడేనుగా
నక చేసినట్టి । పాపఫలము నేఁడనుభవింపంగవలసె ॥ (క) మునిసుతుఁడుచ
నినపిమ్మట । వనితాజలఘటముఁ గొనుచు వారనివేగం । బునఁ దదుపదిష్టమా
ర్గం । బుననయ్యాశ్రమము సేరఁ, బోయితినంతన్ ॥ (క) పెనుముదుసళ్ళై



కన్నులు । గనరాక విలూనపక్షఖగములమాడ్కిం । దనరెడునామునిదంప
తు । లనుగాంచికడిందినివ్వెఱన్మునిఁగవెసన్ ॥ (వ) మఱియునపరిణాయకులై హి
తాహితనిమిత్త పుత్రవిషయక దోషలక్షితులై సంచారాక్షములై మన్నిమిత్తం
బు పుత్రవిషయాశౌరహితులై ప్రయత్నశూన్యులై పుత్రునిరాకకెదురుచూచుచు
న్న మునిదంపతులనవలోకించి శోకోపహతచిత్తుండును భయసంత్రస్తచేతనుండు
నునై ॥ (ఆ,వె) వారిఁగొనుచునేనువారిడాయఁగఁబోవు । నంతఁ జరణశబ్దమాలకిం
చి । యధికతృష్ణఁ బుత్రుఁడనుతలంపుననమ్మ । హామునీంద్రుఁడిట్టు లనియెనపుడు ॥
(తే,గీ) పుత్రతడవేల చేసితంబువులుదెమ్ము । సరవినిందాఁక జలకేళి సలిపితో
క్కొ । దప్పిగొనియున్నదిదిగో మీతల్లి వేగ । నాశ్రమంబుఁ బ్రవేశింపుమనఘ
చరిత ॥ (క) ఏనునుమీతల్లియుమదిఁ । గానక యపరాధమేమిగావించినని । మా
నసమున నదియంతయు । మానుగ శమియింపవలదె మాన్యచరిత్రా ॥ (తే,గీ)
హీననేత్రుల మైగతియింత లేక । యున్న మేమీ వెగతియని గన్నులనుచు । నమ్మి
నీమీఁదమనసు ప్రాణములఁ జేర్చి । యుంటిమీలాగుపేక్షింప నుచితమగునె ॥
(వ) అనిపుత్రుండు మసలుటకు వేగిరపడి కరుణంబుగాఁ బలుకుచున్న య
మ్మునివాక్యంబువిని యేనుశోకవ్యాకులచిత్తుండనై పుత్రమరణం బెఱింగించు
టకు భయంబుఁ గొనియాకంపింపుచు నితస్తతఃపరిభావనంబును నుచ్చారణశ
క్తియు నీరెండును శరీరవ్యాపారంబులతోఁ గూడ సంస్తంభించి పుత్రవ్యసన
జంబైన భయంబునెఱింగించు వాఁడనై సజ్జమానంబును నస్పష్టాక్షరయుక్తం
బును నవ్యక్తంబునగు వాక్యంబున మెల్లననిట్లంటి ॥ (సీ) అనఘాత్మ యేసునీత
నయుఁడఁగాను మిత్రకులసంజాతుండ దశరథాభి । ధానుండ వినుధనుర్ధరుఁ
డనై నడురేయి సరయూతటంబున సలిలపాన । యోగ్యస్థలంబుననురుమృగం
బులఁ జంపనేఁగాచియుండఁ నన్నీటిమధ్య । మునఁ గుంభములకంబు పూరించుచ
ప్పుడు వినన్నైన నిదిమదద్విరదమొకటి ॥ (తే,గీ) నీరుఁ గ్రోలెడునప్పటి నినద
మనుచు । నదియెలక్ష్యముగా విషప్రదరమొకటి । దాఁక నేసినదానిచే నీకు
మారుఁ । డార్తరవములనిహతుఁడై యవనిఁ బడియె ॥ (క) ఏనారవంబువి
నియను । మానించుచునచటికరిగి మద్బాణహతుం । డైనేలంగూలిననీ ।
సూనునిఁ గనితీవ్రశోక శోషితమతినై ॥ (క) ఒక్కింత సేపుచింతిలి । గ్రక్కు
నఁ దద్వచనసరణిఁ గాండముబెఱుకన్ ॥ మిక్కిలికృపచేననుమీ । చక్కటికే

గుమని, చెప్పిచనియె మహాత్మా ॥ (ఆ, వె) అధిక వృద్ధులంధు లతిదీనులమితత । పోనుషక్తచిత్తులైననీకు । వేచియింతపాపమాచరించిననన్నుఁ । దాల్మిఁజేసి బ్రోవఁదగుమహాత్మా ॥ (వ) ఇంకఁజిత్తంబు కొలంది నవధరింతురుగాక యని విన్నవించిన యశనిపాతకల్పంబైన నావచనంబువినిభగవంతుండైన యత్తాపసోత్తముండు శోక జ్వాలాజాల దందహ్యమాన మానసుండై బాష్పంబులు నించుచు బహువిధంబులసంతపించుచుఁ గృతాంజలిపుటుండనై యున్ననాకిట్లనియె ॥ (సీ) మనుజేంద్రనీవొనర్చినయీమహాఘంబు నేర్పుననీయంత నీవెవచ్చి । చెప్పుటవలననీశీర్షంబు పదివేలవ్రక్కలై పోవక తక్కెనేఁడు । నరపతిచేత వానప్రస్థమండలి వధమనజ్ఞానపూర్వముగఁజేయఁ । బడెనేనిహర్మినైనఁబరగబదంభ్రష్టుఁగావించుబ్రహ్మనిష్ఠావిధిజ్ఞుఁ ॥ (తే, గీ) డైతపముసల్పుమునివరునందుశస్త్రం । మెఱఁగివిడిచినఁదన్మూర్ధమేడువ్రక్కలైచనదెకని చేయనిదగుటమంటి । వెఱఁగిచేసినఁ గులమెల్ల మఱఁగి పోదె । (చ) జనవర మత్సుతుండు శర సంహతుఁడై పడియున్న చోటికిఁ । ననుఁగొనిపొమ్ము వేగఁబితృనాథ వశంగతుఁడై విసంజ్ఞుఁడై । పనుపడనెత్తుటందడిసి, పశ్చిమదర్శనుఁడై ధరిత్రిమీఁ । దనొరిగియున్నవాని గుణధన్యునిఁబుత్రునిఁజూడఁగోరెదఁ ॥ (తే, గీ) అనుచు మునిపతిపల్కె నే, నాత్మనడలు । గూర నచటికి వారిఁదోడ్కొనిరయమునఁ । జనికుమారునిఁజూపినఁ, దడవుమీఁద । వ్రాలిశోకంబుచేమాని, వరుఁడుపలికె ॥ (ఉ) ఓయికుమారవర్య మము, నొంటిగనిచ్చటడించిపోవఁగా । న్యాయమెనీకుఁ దల్లివగ, పాఱఁబ్రియోక్తులు పల్కవేలతం । డ్రీయనిమ్రొక్కవేల నయ, మేర్పడఁగాఁగిటఁ జేర్పవేల యే । లాయిలపై వసింపఁగుపి, తాత్మఁడవైతివదేల చెప్పుమా ॥ (క) ఇఁకనెవ్వఁడు శాస్త్రంబులు । సకలామ్నాయములు సకల, సద్వృత్తంబుల్ । సకలాధ్యాత్మక కథలను । బ్రకటింపుచుఁబ్రియముఁదెల్పు, వాఁడెవ్వఁడికన్ ॥ (క) శీలంబు భక్తి నియమము । గ్రాలఁబవిత్రాగ్నిహోత్రుఁ, బ్రణయించిసదా । కాలంబుదప్పకుండగ । వాలాయముఘృతము వేల్చు, వాఁడెవ్వఁడికన్ ॥ (వ) పుత్రా సంచారాక్షముండడ ననుష్ఠానక్రియాశక్తుండును నీవారాది సంగ్రహరహితుండననాయకుండనైన నన్నుఁ బ్రియాతిథినల్లె నిత్యంబును గంధమూలాదికంబులచేత నెవ్వాఁడు సంతుష్టునింజేయు లోచనహీనమై జరాభారంబున డస్సి పుత్ర శో



కంబునం బొగిలెడి భవజ్జనని నెవ్విధంబున భరింతు మహాగుణ మండనుండవైన నిన్నుంబాసి యనాథులమైకన్నులంగానక యివ్వనంబున నెట్లుజీవింపంగలవార మెల్లితెల్లవాఱిన నేమునీతోడ యమక్షయంబునకుం జను దెంచెద మందాఁక నీకుం బోకయొప్పదు నీమసలుటకు యముండు గిసిసెనేని తల్లిదండ్రులమైన మమ్ముందోడ్కొని వచ్చుటకు మసలె ననుగ్రహింప వలయు నని యతనితోడం జెప్పెదము ధర్మాత్ముండగు యముండు మాయట్టి యనాథుల కభయదానంబొసంగఁడే యనియిత్తెఱంగున విలపించుచుఁ బాపకర్ముండగు నృపునిచేత నిహతుండవైతివి గావున నప్పాపంబున నిరయగతికిం బోక యపాపుండవై సగర శైబ్య దిలీప జనమేజయ దుందుమారాదులు చనిన లోకంబులకుం జనుము మఱియు శస్త్రయోధులును శూరులును స్వాధ్యాయసంపన్నులును దపోనిష్ఠులును భూదానపరులును నాహితాగ్నులును నేకపత్నీవ్రతులును గోసహస్రప్రదాతలును గురుసేవారతులును బరలోకప్రాప్తిసాధనత్వంబున గంగాయమునా సంగమాదియందుంగాని జలంబులందుంగాని వహ్నియందుంగాని తనుత్యాగంబుఁ గావించిన వారు నగు పుణ్యాత్ముల లోకంబులునీకుంగలుగుఁ దపోనిష్ఠులమైన మాకులంబునం బుట్టినవారికి నిరయగతి లేదెవ్వనిచేతనీవునిహతుండవైతి వట్టినృపుండేదుర్గతికిం జనుఁగాకయని పలికి యక్కుమారున కుదకప్రదానంబుఁ గావించిన నప్పుడమ్మునిపుత్రుండు దివ్యదేహధారియై శక్రసహితంబుగాఁ దల్లిదండ్రులనాశ్వాసించి మీకటాక్షంబున నేనుపరమస్థానంబునొందితిమీరుశీఘ్రంబున నాయొద్దకుంజనుదెంచెద రనిపలికి దివ్యతేజోజాలంబు దిక్కులం బిక్కటిల్ల దివ్యవిమానాధిరూఢుండై యింద్రసహితంబుగా సురలోకంబునకుంజనియెఁ దదనంతరంబ యమ్ముని వరుండు కృతాంజలిపుటుండనై కొలిచియున్ననన్నుంజూచియిట్లనియె ॥ (సీ) క్రూరాత్మ యేకపుత్రుఁడనైన ననుఁబుత్రహీనునిఁజేసితి, వింకనిధన । మందునాకించుక, యైనదుఃఖముతే దుహింసింపు మదయత, నిపుడెనన్ను । మునుకొనియజ్ఞాన, మునమత్కుమారునిఁ జంపితిగాననాచందముననను । బోడిమిసెడినీవు, పుత్రశోకంబునఁ జచ్చెదవజ్ఞాన, జనితమగుట ॥ (ఆ, వె) వలనబ్రహ్మహత్య, వావిరినినుఁజెంద । దనియనుగ్రహించి, యపుడెతపసి । పత్నితోడఁగూడి, పావకశిఖలందు । నపగతాసుఁడగుచు, నరిగెదివికి ॥ (వ) దేవీయిత్తెఱంగునం దొల్లి శబ్దవేధ్యా

నుశిక్షుకుండనైన నాచేత మౌఢ్యంబువలనఁ గృతంబైనయిమ్మహాపాతకంపబిప్పు డుస్స్మృతివిషయంబయ్యె నమ్మహాపాపకర్మఫలంబువిపక్వంబై యన్నరసంబుభు క్తంబగుచుండ వ్యాధివర్ధక వ్యంజనంబులతోఁ గూడి రోగం బుపస్థితంబైన మాడ్కి సముపస్థితంబయ్యె నమ్మహాత్ముని వచనప్రకారంబున మరణపర్యవసా నపుత్రశోకంబు సంప్రాప్తంబయ్యెనని రోదనంబుసేయుచు వెండియు నమ్మహీ రమణుండు కౌసల్యనవలోకించి దేవి పుత్రుండు దుర్వృత్తుండైననువాని విచ క్షణుండగు వాఁడెవ్వాఁడు పరిత్యజించుఁ బ్రవ్రాజ్యమానుం డయ్యును సుతుం డెవ్వాఁ డట్టితండ్రియం దసూయసేయకుండు రామునియందు నాచేత నెయ్య ది కృతంబయ్యె నదినాకు సదృశంబై యున్నది నాయందు రామునిచేత నెయ్య ది కృతంబయ్యె నది రామునకు సదృశంబై యున్నది రాముం డిప్పు డొక్కసా రియైన మదీయనేత్రంబులకుం జూపట్టిన మదీయగాత్రంబు సంస్పృశించిన స ప్రాణుండనై యుండుటకు శక్యంబై యుండు నది పరమ దుర్ఘటంబు గావున నింక జీవింపంజాల యమక్షయంబునకుం జనియెద జీవితంబు మేనిలోఁ జలింపు చున్న యది నేత్రంబులు గానరావయ్యె శమనకింకరులు వేగిరపడుచున్నవారు కల్యాణగుణాభిరాముండగు రాముం డరణ్యంబునకుం జనిననాఁటనుండి తద్విర హసంజాతశోకంబు ఘనాతపం బల్పజలంబుంబోలె మత్ప్రాణంబుల శోషిం పంజేయుచున్నది యింద్రియంబులు విషయంబులకుం దప్పెఁ జిత్తమోహంబు పైకొనియె నింక నీతోడ సంభాషించుటకుంజాల క్షీణస్నేహ దీప సంస్కార శ్మలుంబోలెఁ జిత్తనాశంబువలన సర్వేంద్రియంబులు శోషింపుచున్నయవి జీవి తక్షయకాలంబునందు సత్యపరాక్రముండును ధర్మజ్ఞుండునగు రామునింజూ డకున్నవాఁడ నింతకంటెనాకుదుఃఖకరంబెద్ది కనకకుండలవిరాజితంబునుబద్మప త్రనిభేక్షణంబును శశాంకసౌందర్య గర్వనిర్వాపణ చాతురీవిశేషభూయియుగసం శోభితంబును సుదంష్ట్రంబును జారునాసికంబును శరత్కాలరాకానిశాకర మం

(*) దశరథుఁడు పుత్రశోకమున మృతుఁడగుట. (*)

డలప్రియదర్శనంబునుసుగంధినిశ్వాససంయుక్తంబునైన రామునివదనంబు నె వ్వారువిలోకింతురట్టివారెల్లధన్యులయ్యెదరు మఱియు నివృత్త వనవాసుండై పంచదశవర్షంబునఁ గ్రమ్మఱనయోధ్యాపురంబునకుంజనుదెంచిన రామచంద్రు నిమౌఢ్యంబువిడిచి స్వేచ్ఛమార్గగతుండైన శుక్రునింబలె వీక్షించిసకలజనం



బులు సుఖులయ్యెద రిప్పుడాత్మభవంబైన శోకంబు నదీరయంబు కూలంబుం బోలె నచేతనుండనైన నన్ను శోషింపంజేయుచున్నదని పలికి వెండియు నద్దశర థుండు॥ (శా) హాకాకుత్స్థకులాగ్రణీగుణమణీ, హారామచంద్రానిసుం। గ్రై కేయీకృతపాపబోధనకథా, క్రాంతుండనై పాసితిఁ । శోకంబేర్చఁ, దొడంగె నింకఁబిత్రృ రాజుంగొల్వఁగా నేగెదఁ । హాకౌసల్యసుమిత్ర హాజనక కన్యా హాసుమిత్రాసుతా ॥ (క) అని విలపింపుచు దశరథ। జననాథుఁడు రామ జననిసన్నిధి యందుం। దనయునిఁ జింతింపుచుఁ జ। య్యన నడురేయింబర మార్తినసువులువిడిచెఁ ॥ (వ) అంతఁ బ్రభాతకాలం బగుటయుఁబరమసం స్కారు లగు సూతులును నుత్తమశ్రుతులగు మంగళపాఠకులును స్తుతిశీలుర గు గాయకులును వేర్వేఱ రాజవేశ్మంబునకుం జనుదెంచి స్తుతినాదంబులుగా వించిన నుదాత్తాభిహితాశీర్వాదులగు వారల స్తుతిశబ్దంబు ప్రాసాదాభోగ వి స్తీర్ణంబై మ్రోసెఁ బదంపడి పాణివాదకులు వృత్తాద్భుతకర్మంబు లుదాహ రించి పాణివాదంబులు గావించి రమ్మహాశబ్దంబు విని గృహారామవృక్షశాఖా పంజరస్థిత పారావతాది పత్త్రిప్రకరంబు మేల్కని సుకరంబుగాఁ గలకలధ్వ ని గావించె నంత వ్యాహృతంబులైన హరినారాయణాది పుణ్యశబ్దంబులును బుణ్యశ్లోకపురుషకీర్తనంబును వీణానిస్వనంబును నాశీర్వాదరూప గానంబును రాజచరిత్రపాఠకశ్లోకశబ్దంబులును మృదంగ భేరీ శంఖ కాహళాది వాద్యరవం బులునుసాంద్రంబులై రాజమందిరాభ్యంతరంబు నిండి చెలంగె నప్పుడు కాలో చిత పరిచర్యావిచక్షణులును శుచిసమాచారులునగు పరిచారకు లంతఃపుర సంచారాఢ్య స్త్రీజన వర్షధర సహితులై హరిచందన సంపృక్త పరిమళోద కంబు కాంచనఘటంబుల సంగ్రహించుకొని స్నానార్థం బవసరం బెఱింగి కాచికొని యుండఁ గొందఱు యువతులు మంగళరూపాను లేపన తైలోద్వ ర్తనంబులును బ్రాశనీయంబులైన సంపిష్టతిలనారికేళ జీరకాదిద్రవ్య విశేషం బులును దర్పణవస్త్రాభరణాద్యుపస్కరంబులునుం జేకొనివచ్చియనేకకన్యాయు తలై గాచికొనియుండిరి యిట్లు సర్వపరిజనజాతంబును సర్వలక్షణ సంపన్నం బై యథాయోగ్యంబుగా బహుకృతంబై రాజస్వీకార యోగ్యంబై లక్ష్మీవం తంబై సముత్సుకంబై నిండి సూర్యోదయసమయంబయ్యె మహీరమణుండేల కో మేల్కానకున్నవాఁడని శంకింపుచుండె నాసమయంబున॥ (సీ) మానవనా

ఘుని, మరణంబెఱుంగక యవబోధమచ్చటి, కరుగుదెంచి । క్షితినాథబోధనో,
చితమృదువినయ వాక్యంబులబోధించి, యతనిమేను। పరికించిముగు గ్రోళ్లఁ
ప్రాణసమీరసంచారంబు లేకున్న, శంకనొంది । గాత్రంబునిట్టట్టు, గదలించి
యొమ్మునఁజేయిడి ధాతువిశేషమరసి॥ (తే,గీ) ప్రాణలక్షణమేమి చూపట్టకు

(*)మృతుండగు దశరథునిఁ జూచి యంతఃపుర స్త్రీలందరు విలపించుట.(*)

న్న । నృపుడుమృతుఁడయ్యెనని మది,నిశ్చయించి । యేటివెల్లువ కెదురైన, తృ
ణముఖంబు । కరణిఁగఁపించి రారాజకాంతలపుడు॥ (సీ) జనపతిచెంతఁ గౌస
ల్యయుఁదత్సమీపమునసుమిత్రయు, బాధపుత్ర । శోకపరాజిత,లై కాలయుతలైన
చందానఘుననిద్రఁ,జెందిమేని। కాంతియంతయుమాయఁ, గడు వివర్ణతనొందితి
మిరసమావృతర్క్షములమాడ్కిఁ।గనుపట్టుచుదృగశ్రు, కణలుళితాస్యలై పడి
యుండుటయువారి,పాటుఁజూచి॥ (తే,గీ) విగతజీవితుఁడైనభూ,విభునిఁగాంచి।
యంతిపురమెల్లఁగెడసిన,యట్లదోఁచె । నడవివిభ్రష్టయూథప,లైనదంతి। సతు
లగతివిలపించిరా,చారుముఖులు॥(తే,గీ) వారియార్తానినాదంబు, ఘోరభం
గి। వీనులనుసోఁక విని లేచి, వెఱఁగు గదురఁ । దలరికౌసల్యయును సుమిత్ర
యుగతాసుఁ । డైనపతిఁ గాంచివిలపించి, రార్తలగుచు॥ (వ) అప్పుడకౌ
సల్య మగనిమరణం బెఱింగి శోకావేశంబున॥ (చ) మునుతనమానసంబున
స,ముత్థితమై పొగలెత్తియున్ననం । దనవిపిన ప్రయాణజని, తంబగు దారుణ
శోకవహ్ని య । మ్మనుజవరేణ్యుపాటుఁ గని,నంతనె మండినయట్లయైదహిం।
చినఁగడు నైరపలేక ధృతిచేడ్పడ నేడ్చుచు వ్రాలె నేలకున్॥ (మ) గగనప్ర
చ్యుతమైన తారపగదిం, గ్రవ్యాది విద్వేషిలో । కగళత్కిన్నర కాంతరీతి వి
షదిగ్ధ క్రూరఖడ్గప్రహా । రగతై రావణియట్ల నిష్ఠురకుఠా, రచ్ఛిన్న మూల
క్షమా । జగతిన్వ్రాలికలంగె వాతహత చం,చద్వల్లి చందంబునన్॥ (శా)ఈ
రీతిన్మహిప్రాలి శోకదహనుండే, చన్నరుత్పన్నరుల్ । జారన్భోరున నేడ్చుచు
న్న యలకౌసల్యన్విలోకించి శో । కారావంబునఁ గైకయీ ప్రముఖస,ర్వాం
తఃపుర స్త్రీజనం । బారూఢిన్విలపించెఁ దత్స దనకు, డ్యంబు ల్గదు ల్పోయఁ
గన్॥ (వ) ఇట్లు రాజాంతఃపురం బేనాదంబున మొదలఁబూరితం బయ్యెనమ్మ
హానాదంబనంతరప్రవిష్టకైకేయ్యాదుల చేత నభివర్థితంబై వెండియు మిక్కిలి
నాదవంతబుంగావించె మఱియుఁ దన్మందిరంబుపర్యుత్సుక జనాకులంబై సంత్ర



స్తసంభ్రాంతంబై తుములాక్రందంబై పరితాపార్తబాంధవంబై సద్యోనిపతి
తానందంబై దీనక్లబదర్శనంబై సొబగుదప్పియుండె మృతుండైనదశరథుంగౌఁ
గిలించుకొని తత్పత్నులంద ఱొండొరులకరంబులుపట్టుకొని యుచ్చైస్స్వనం
బునరోదనంబుసేయుచు దీనస్వరంబున విలపింపుచుండిరాసమయంబున॥(మ)
హతభానుండగు భానురీతి గతతో,యాంభోధి భంగిన్విని । ర్గతతేజుండగు వ
హ్ని కైవడి గత ప్రాణాసిలుండైనభూ । పతినీక్షించికడిందిశోకమునఁగం,పం

(*)కౌసల్యకైకేయిని దూఱుట.(*)

బొంది కౌసల్యయు । ద్గతశోకంబున నొడుదీటుకొనుచుం । గైకేయితో ని
ట్లనున్ ॥ (క) నీకోర్కికిఁ దగునట్లుమ। హీకాంతుఁడు దివికిఁ జనియెనిం
కవిధవవై । లోకంబకంటకముగాఁ । జేకొని పాలింపుమొంటిఁ జిక్కినృశం
సా ॥ (చ) ననువిడనాడి ఘోరవిపినంబునకుం జనియెంగుమారుఁడా। త
నినెడఁబాసి శోకమున ధారుణినాథుఁడుదీఱెఁగానలోన్ । జనియెడుసార్థ
హీనయగు,నాతిక్రియం బతిహీననై మహిన్ । మనుటకుఁజాల నమ్మనుజనా
థుగతిం జనుదాననెంతయున్ ॥ (క)తనకేడు గడయు నగునా । మనోవిభుఁ
డుచనినపిదప, మననేసతినె । మ్మనమునఁ దలంచు సంత్య । క్తనిజాచార
వగునీవొకర్తెవు దక్కన్ ॥ (తే'గీ) పరఁగలుబ్ధుండువిషమిశ్ర, పాకమాహ।
రించిదోషంబెఱుంగని రీతిఁగైక । చేతఁగుబ్జానిమిత్తంబు, శీలయుక్త । మై
నరఘువంశమదిహతమయ్యెనేఁడు ॥ (మ) అనియోగంబునధారుణీవిభుఁడుభా
ర్యాప్రేరితుండైసుపు । త్రునినిష్కారణ మంగనాయుతముగా, దూరస్థునిం
జేసినాఁ । డనివిన్నంతనె పుత్రహీననగునా, యట్లమ్మహో దారుఁడా । జన
కక్ష్మాపతినెవ్వగన్మనుఁగఁడేసంతాపసంతప్తుఁడై ॥ (మ) ధరణీనాథుని జీవనాశ
నముమదై వైధవ్యమున్విన్నవి । స్ఫురదంభోరుహతామ్రనేత్రుఁడగునాపుత్రుం
డు రాముండుదు । స్తరశోకంబునఁగుందకున్నె పతిచందాన న్మహీపుత్రిదుర్భ
రసంతాపమున న్మలంగుచు విపత్త్రిస్తాత్మగాకుండునే ॥ (క) రేలధిక భీమ
ఘోష । వ్యాలోల మృగద్విజారవాకర్ణనసం । కీలితసాధ్వసయైసతి।జా
లింగొని మగనిచెంత సంకటపడదే ॥ (క) తనకూఁతుపాటునెమ్మన । ము
నఁబలుమఱుఁ దలఁచియల్ప పుత్రుఁడువృద్ధుం । డనఘుఁడు వత్సలుఁ డగున ।
జ్జనకుఁడు పెనువగలఁ డగిలి,చావకయున్నే ॥ (ఉ) ఈనరనాథమౌళితను, వెం

తయుఁగాఁగిటఁజేర్చి చిచ్చులో । మానకచొచ్చి ప్రాణమును మానము లేక త్యజి
ంచు దానసం । చానృపపత్ని ఘోరునఁగ రాంబుజముల్వెస నెత్తి రోదన । ధ్వా
నమొనర్చె యంతిపురి, వారుమ్మదూక్తి ననూనయుంపఁగన్ ॥ (వ) అంతన
మాత్యులు వసిష్ఠాదులచేత నాజ్ఞప్తులై పుత్రుండొక్కరుండైన సమీపంబున
లేకుండుటవలన దహనాదిక్రియలు గావింపక యమ్మహారాజకళేబరంబు తైల
ద్రోణికయందు నిక్షేపించి సర్వప్రయత్నంబులం గాచికొని యుండందగువా
రలనియమించి దుఃఖాపనోదకంబులు గావించిరనంతరంబ యంతఃపురకాంత
లు పరమదుఃఖాక్రాంతలై కన్నీరునించుచు బాహువులెత్తి దీనస్వరంబున
నిట్లని విలపించిరి ॥ (ఉ) హా మనువంశ తోయధిశశాంక సదాప్రియవాది
వైనశ్రీ । రామునిఁబాసిచాల వగలన్నిగులం బొగలొందియున్నమ । మ్మి
మహినొంటి డించిచన, నేగతిఁజిత్తము వచ్చెమీకున । య్యోమమునింక నెవ్వరు
న్నృపోత్తమ దేర్చెడువారు సెప్పుమా ॥ (క) అస్తోక శోకభరమున । దుస్తామస
మైనకైకతోఁగూడియుటన్ । స్వస్తిగలిగి మని యుండుట । దుస్తర మగుఁ
గాదె మాకు, దుర్జనదూరా ॥ (మ) మముఁ గావం దగు నంతధీశరధిరా
మస్వామి రాజ్యేందిరన్ । సమతం బాసియరణ్యసీమ కలయో, పాయక్తుఁ
డై యేగెనీ । వమరస్థానగతుండ వైతి వీఁక దుష్టాచార దుశ్శీలక్రౌ ।
ర్యమునం గ్రాలెడు కైకచెంత మననర్హంబౌనెభూ వల్లభా ॥ (తే, గీ)
ప్రాణవల్లభ నీవును, రాఘవుండు । జానకియు లక్ష్మణుండు నెడ్డానిచేతఁ । గ
రము విడువంగఁ బడితి రా, కైకయింకఁ । బుడమిలో నన్యు నెవ్వాని విడువ
కుండు ॥ (క) అని పెక్కుచందముల న । జ్జనపాలపురంధ్రు లధిక, సంతా
పమునం । గనుఁగొనల బాష్పకణములు । చినుకఁగ విలపించి రతని, చెంగట
గుములై ॥ (క) ఉడుహీనమైన యామిని । వడవునఁ బతిహీనమైన, వనిత
పగిది న । ప్పుడు రాజహీనమై దెస । చెడి యప్పురి కంటికింపు, సేయక యుం
డెన్ ॥ (వ) మఱియు నప్పురవరంబు బాష్పపర్యాకులజనంబై హాహాభూత
కులాంగనాసందోహంబై శూన్యచత్వరవేశ్మాంతంబై నవాస్రకంఠాకుల మా
ర్గచత్వరంబై యాక్రందితనిరానందంబై పాడఱి నట్లుండె నప్పుడు మహిత
లగతులగు నృపాంగనలయందు నివృత్తకిరణసంచారుండై సూర్యుండపరశిఖ
రి శిఖరాంతర్గతుండయ్యెఁ దోడనె కైకేయీకృతంబగు పాపంబు వెల్లివిరిసి



న చందంబున గాఢసంతమసంబు రోదసీకుహరంబు నిండి యుండె నప్పురం
బునం గలనరనారీజనంబులు గుంపులు గట్టి యార్తనాదంబులు సేయుచుఁ గై
కేయి నిందింపుచు గాఢదుర్మనస్కులై యుండి రారాత్రి దుఃఖవశంబున దీర్ఘ
భూతమై తోఁచె నంతఁ బ్రభాతకాలం బగుటయుఁ బూర్వమహీధర మండ
లంబునకు మండనంబై పుండరీకవనబంధుం డుదయించిన యనంతరంబ ॥

( గౌతమాదిమునులు వసిష్ఠునితో రాజ్యమునకు రాజు నేర్పఱచవలయుననుట. )

(చ) విదితవివేకశీలురగు, విప్రులు గౌతమకణ్వకాశ్యపు । ల్మొదలుగ రాజకర్తల
గు, ముఖ్యుల మాత్యులతోడఁ దత్సభా । సదనముఁ జేరి చక్కఁగ వి, చారము సే
యుచు నక్తలై సభా । సదులు వినంగ నిట్లనిరి, సమ్మతి మీఱ వసిష్ఠమౌనికిన్ ॥
(క) ఈ రాజు పుత్రశోకము । చే రాయిడి నొంది విగత, జీవితుఁ డగుచో ।
నూరేడు లయ్యెఁ గడమన । కీరాతిరి తెల్లవాఱు, టెంతయు ననఘా ॥ (చ)
జనపతి పుత్రశోకమున, స్వర్గతుఁడయ్యెను రామలక్ష్మణు । ల్వనమున కేగి
రా భరత, లక్ష్మణసోదరు లశ్వరాణ్ణికే । తనమున నున్నవారు వసు, ధాభర మొ
క్కటఁ దాల్చి రాజ్యపా । లన మొనరింపఁగా, దగిన, రాజొకని న్నియమింప
వల్వదే ॥ (ఆ, వె) రాజులేని పురము, రాజులేని నభంబు । పగిదిఁ గాంతిహీన
మగుచునుండు । రాజహీనమైన, రాష్ట్రంబునకుఁ గీడు । పౌరయు జనులు మేలు
పొందరధిప ॥ (క) గర్జితము లెసఁగఁ జపలా । స్ఫూర్జితుఁడై విమలవా
రి, భువి నెల్లెడలం । బర్జన్యుఁడు గురియఁడు సుగు । ణార్జనుఁ డగు రాజులేని
యాదేశమునన్ ॥ (క) మునివర యరాజకం బగు । జనపదమున బీజముష్టి
సవరిల్లదు నం । దనులు గురుని మన్నింపరు । వనితలు పతివశతనొంది, వర్తిం
పరిలన్ ॥ (క) పెరుగవు శుభములు వ్యాధులు । దొరుఁగవు జనములకు
వృద్ధి దొరకొనదు నిరం । తరమున రాజక మగున । ప్పురమున ధనధాన్యవస్తుపుం
జములధిపా ॥ (క) అత్యాహితంబు గలుగును । నిత్యానందంబు యశము నిరతి
శయసుఖం । బత్యంతహితముఁ గలుగదు । ప్రత్యహము ను రాజులేని రాష్ట్రమునం
దున్ ॥ (క) మానిగ్రామణి రాజవి । హీనంబగు రాష్ట్రమందు హృద్యములగును ।
ద్యానంబులు ఫలపల్లవ । సూనసమృద్ధంబులగుచుఁ జూపట్టవిలన్ ॥ (వ) మఱియు
నరాజకంబగు దేశంబున నరులు మనస్స్వాస్థ్యాభావంబున సభ గావింపరు యజ్ఞ
శీలురగు విప్రులు సంశ్రితవ్రతులై దీర్ఘసత్రంబులు గావింపక యథోక్త దక్షిణ

లోసంగక పరిత్యక్తవిధికలాపులై యుండురు మహోద్యానంబులు పుణ్యసంపా
దకగృహంబులు రమ్యంబులుగాకుండుఁ బ్రభూతనటనర్తకులును రాష్ట్రవర్ధ
నులును సమాజోత్సవశీలురును వృద్ధినొందరు వ్యవహారులు పరస్పరంబు కు
తర్కవాదంబుసేయుచు నిర్ణీతార్థులు గాకుందురు వణిగ్జనంబులు క్రయవి
క్రయాదివ్యాపారంబులం దనిష్పన్న ప్రయోజనులగుదు రితిహాస పురాణాది
కథాకథనశీలురు కథాప్రియజనంబులచేత ననురంజితులుగాకుందురుమఱియు
హేమభూషితలై కుమారికలు సాయాహ్నకాలంబున సఖజనంబులం గూడి క్రీ
డాకరణార్థం బుద్యానంబునకుంబోవరు సకాములగు యౌవన పురుషులు
విలాసవతులంగూడి జనయుక్తంబులైన వాహనంబులెక్కి విహారార్థం బు
పవనంబులకుఁ బోవకుందురు కృషిగోరక్షజీవులగు ధనవంతులు వివృతద్వారు
లై సురక్షితులుగాక బద్ధకవాటులై యుందురు విషాణవంతంబులైన షష్టిహాయ
నకుంజరంబులు బద్ధఘంటాకలాపంబులై రాజమార్గంబులందుఁజరింపకుండు
నిష్వస్త్రాభ్యాసంబునందుజనించు శింజినీరవంబు వినంబడకుండు దూరగాము
లగువణిజులు బహుప్రియార్హవస్తుసహితులై క్షేమమార్గంబునం జనరు జి
తేంద్రియుండగు యతీంద్రుండు శుచియై యెచ్చటసాయంకాలంబగు నట్టిచోట
నివసించి స్వస్వరూపావలోకనంబు సేయకుండుఁ జతురంగ సమృద్ధంబగుసై
న్యంబు పగతులంబరిమార్చి విజయంబునొందకుండు జనంబులకుయోగక్షేమంబు
గలుగనేరదు రథవాజివారణంబులారోహించిపురుషులు మృగయార్థంబు వ
నంబునకుంజనరు శాస్త్రవిశారదులగునరులు వనోపవనంబులందు హేతువా
దంబుగావింపరు నియతజనంబులచేత దేవతాభ్యర్చనార్థంబు మాల్యమో
దకాదిపదార్థంబులు కల్పితంబులుగాకుండు రాజకుమారులు చందనాగరు
రూషితులై వసంతసమయ వృక్షంబులమాడ్కిఁ జాడ్కికి వేడ్కసేయకుండు
రిదియునుంగాక॥ (ఆ,వె) కసవులేనివనము కైవడిసదమల। జలములేనినదు
లచందముననుస। గోపహీనలైనగోవులకైవడి। రాజహీనమైనరాష్ట్రమొప్పు॥
(తే,గీ) అనలునకుధూమమలరథం బునకుధ్వజము। జ్ఞాపకంబైనభంగినేకు
నుఁడుమనకు। నిత్యమునుజిహ్మభూతుఁడైనెగడెనట్టి। వనజసఖవంశవరుఁడుదే
వత్వమొందె॥ (తే,గీ) వినుమనాయకమైనట్టి విషయమందు। మనుజు లన్యో
న్యపశువారధనగృహాప। హారులైయొండొరులఁబట్టి దారుణముగ। మ్రింగు



దురుజలచరముల భంగిననను॥ (తే,గీ) వసుధ నాస్తికులెవ్వారె వ్వరువివేక।
రహితులెవ్వారుభిన్నమర్యాదులట్టి। వారునృపతిదండ ప్రభావమున సాధు।
భావముకొఱకుఁగల్పింపఁ, బడుదురధిప॥ (తే,గీ) మేనికక్షిప్రవర్తకమైనభం
గి। రాజురాష్ట్రంబునకుఁబ్రవర్తకుఁడుగాన। నట్టినరపతిలేనిరా జ్యంబునందు
నురుభయోపద్రవముపుట్టకున్నె చెపుమ॥ (తే,గీ) నృపుఁడెసత్యధర్మములకు
నిలయమతఁడె। జగతిఁగులవంతులకుఁగులాచారసరణి। యతఁడెతల్లియుఁదం
డ్రియు నతఁడెప్రజకు। హితకరుఁడుసంతతంబును నీంద్రతిలక॥ (క) వరుణయ
మపాకరిపుకి। న్నరనాథప్రభృతిదిగధినాథులు సద్వ్ర। త్తిరతుండగు నరపతి
చే। గరముతిరస్కృతులుగారె ఘనగుణశాలీ॥ (క) తగవును ధర్మమునడ
పెడు। జగతీపతిలేకయున్న సంయమివరయీ। జగమినుఁడు లేనిదివసము। ప
గిదిఁదమోభూతమగుచుఁ, బసచెడియుండుర్॥ (వ) మునీంద్రా మహీపతిమ
నియున్నయపుడె సముద్రంబు చెలియలికట్ట నతిక్రమింపం జాలనికైవడి నేమం
దఱును భవద్వచనంబు నతిక్రమింపం జాలక యుందు మిప్పుడెట్టిదంగున
నతిక్రమింపం గలవార మీరాజ్యస్థాపన నిష్కాసనరూప సామర్థ్యంబు గలి
గిన మహీపతిలేమింజేసియరణ్యభూతంబైన రాష్ట్రంబుంబరికించివదాన్యండైన
యిక్ష్వాకు కుల సంభవునిఁ గుమారు నొక్కనిఁ బూజ్యంబైన సామ్రా
జ్యంబున కభిషిక్తునిఁ గావింపు మనిన నట్లగాక యని యమ్మునివరుండు జ
యంతాది మంత్రుల నవలోకించి ॥ (ఉ) ఆమునిరాజు వల్కె విన, యా
న్విత్తుఁ డాభరతుండు నేఁడు మా। తామహు నింటఁ దమ్ముఁడును,దాను సు
ఖస్థితి నున్న వాఁడు శ్రీ। రాముని తమ్ముఁ డాతనిఁ ద్వి,రంబుగఁ దోడ్కొని రం
డు విస్ఫుర। త్కామగమంబులైన తుర,గంబుల నెక్కి చనుండుగ్రక్కునన్॥
(వసిష్ఠుఁడు భరతశత్రుఘ్నులఁ దోడ్కొనిరమ్మని మంత్రుల నియోగించుట.)
(క) రాముని వివాసనంబును। భూమీశ్వరు మృతియుఁగ్రైక,బాహ్మెలతనితో
నేమియుఁ జెప్పక యూరక। నామాటగఁ దోడి తెండు, నయ మలరారన్ ॥
(ఆ,వె) ఎల్లవారు కుశల,మిచ్చట ననిపల్కి। పటవిభూషణము లు, పాయన
ములు। వారి వారి కెల్ల, వేఱువేఱ నొసంగి। భరతుఁ దోడితెండు, ప్రాభవ
మున ॥ (క) అని పయనముఁ జేసిన న। మ్మునినాథుని యాజ్ఞ మౌళిఁ, బూ
ని మనమునం। జనువగలు పొగులుకొనఁ జ। య్యనఁజనిరి హయాధిరూఢు

లై శీఘ్రగతిఁ ॥ (వ) ఇత్తెఱంగున నచ్చారులు పుష్కలంబుగాఁ బాథేయంబుఁ గొని చని మొదలఁ బశ్చిమాభిముఖంబుగా నిర్గమించి దక్షిణోత్తర భాగస్థంబైన యపరతాల ప్రలంబ నామగిరిద్వయ మధ్యంబుఁ బ్రవేశించి మాలీనీనదీతీర మార్గంబున నుత్తరాభిముఖులై యొక్కింతదూరం బరిగి యవ్వలఁ బ్రలంబపర్వతోత్తరభాగంబు నధిగమించి క్రమ్మఱఁ బశ్చిమాభిముఖులై హస్తినపురసమీపంబునందు గంగానది నుత్తరించి యంతట నుండి ప్రత్యఙ్ముఖులై కురుజాంగలదేశ మధ్యమార్గంబునం జని పాంచాలదేశంబుఁ బ్రవేశించి సంఫుల్ల కమల సుగంధ బంధురంబులైన సరోవరంబులును విమలోదకంబులైన నదీసంఘంబులును విలోకింపుచుఁ బ్రసన్న సలిలోపరి విహరమాణహంససారసాది నానావిహంగరుతాకుల యగు శరదండ యను దివ్యనదినుత్తరించి య మ్మహానది పశ్చిమతీరంబున నున్న సత్యోపయాచనంబైన పుణ్యవృక్షంబు కడ

—(*) వసిష్ఠ నియుక్తులగు చారులు గిరివ్రజపురంబుఁ జేరుట. (*)—

కుం జని దానికిఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి యవ్వలఁ గుళింగాఖ్య పురంబు దాఁటి యభికాలాఖ్యగ్రామంబుఁ గడచి బోధిభవనాఖ్యపర్వతంబు డాసి దశరథవంశానుభూతయైన యిక్షుమతియను పుణ్యనది నుత్తరించి యంజలి ప్రమాణజలమాత్రాహారుల బ్రాహ్మణుల వేదపారగుల నిక్షుమతీతీరవాసుల విలోకింపుచు బాహ్లీకదేశమధ్యంబునం జని సుదామాఖ్య పర్వతం బతిక్రమించి యచట విష్ణు చరణాంకితస్థానంబు విలోకింపుచు విపాశానామనది నుత్తరించి తత్తీరవర్తి శాల్మలీవృక్షంబు విలోకించి యవ్వల సరిత్సరోవర తటాకవాపీకూపా నూపంబులు నిరీక్షింపుచు సింహవ్యాళ మృగద్వీపిసంపూర్ణంబులైన మహారణ్యంబు లుత్తరించి మహామార్గంబుఁ బట్టి చని శ్రాంతవాహనులై కులరక్షణంబు కొఱకు నృపతిప్రియంబు కొఱకును వంశంబునకు భర్తృపరిగ్రహంబు కొఱకును బహుప్రయత్నంబున రాత్రి సమయంబున గిరివ్రజపురంబుఁ బ్రవేశించి యొక్కచోట విశ్రమించియున్నంత ॥ (చ) భరతుఁడు నాఁటి రేయి యొక,భంగిగ నిద్దురవోవుచుండి దు । ష్కరమగు నొక్క కీడుకలఁ, గాంచిదిగుల్గొని నిద్రలేచి ని । వ్వెఱపడి వేగునంతకును, వేగుచు వేగిరపాటుతో నినుం । డఱిముఱిఁ దోఁచి నంతనె స,భాంతరసీమకు వచ్చి



—(*) భరతునికి దుస్స్వప్నమగుట. (*)—

యచ్చటన్ ॥ (క) అక్కఱపడి చనుదెంచిన । మక్కువ చెలికాండ్రతోడ, మాటాడక యే । దిక్కును జూడక గ్రక్కున । చెక్కిట చెయిఁ జేర్చి చింత,సేయుచునుండెన్ ॥ (తే,గీ) అప్పుడు విషణ్ణవదనుఁడై, నట్టి భరతుఁ । జూచి ప్రియవాదులగు వయ,స్యులు తదీయ । చిత్తఖేదంబుఁ బాయ వి,చిత్రపుణ్య । కథలఁ జెప్పిరి కొందఱు,కౌతుకమున ॥ (క) మఱియుం గొందఱు మురళీ । కరతాళమృదంగములును,ఘనముగ వాయిం । చిరి వారయువతులెంతయు । సరసత నాట్యములు ద్రొక్కఁ, సల్పిరి వరుసన్ ॥ (తే,గీ) మఱియు సంస్కృత ప్రాకృత మాగధాది । గద్యపద్యాత్మకములైన, కావ్యనాట । కములు చదివిరి కొందఱు,కరము హాస్య । ములు వచించిరి పరిహాసకులు చెలంగి ॥ (తే,గీ) ఇవ్విధంబున హిత మతి,నెవ్వరెన్ని । ప్రమదజనకంబులగు వినో దములనేక । గతుల సలిపిన నమ్మహీపతిసుతుండు । చిత్తమున నించుకయు సంత,సింపకుండె ॥ (వ) అప్పుడొక్క ప్రియసఖుండు దీనుండై మొగంబు వాంచి యున్న భరతునుపలక్షించి యేమి కారణంబున నిట్లున్నవాఁడవని యడిగిన నతండతకిట్లనియె ॥ (క) ఇష్టసఖా యేమందు

—(* భరతుఁడు తన ప్రియసఖునికి స్వప్న ప్రకారముఁ దెల్పుట. *)—

న । రిష్టంబగు స్వప్న మొకటి, రేయాత్మకుసం । దృష్టంబైన కతంబున । నష్టమహుఁడనైతి నెమ్మనంబున గలంగెన్ ॥ (వ) అత్తెఱంగెఱింగించెద వినుము ॥ (సీ) అచలాగ్రమెక్కి మాయయ్య క్రొమ్ముడివీడ గోమయహ్రదములోఁ, గూలినట్లు । గోమయహ్రదములోఁ,గూలి తైలముఁ గ్రోలి ఘన తైలవాపిలోఁ,మునిఁగినట్లు । తైలంబు తలనంటి తైలాన్నము భుజించి నగము బ్రద్దలువాఱ, నవ్వినట్లు । రక్తగంధముఁ బూసి, రాసభస్యందనమెక్కి దక్షిణదిశ కేగినట్లు ॥ (ఆ,వె) వికృతవేషయైన యొక రాక్షసాంగన । రక్తపటముఁ దాల్చి, రాజవరుని । నెలమిఁ ద్రాటఁ గట్టి, యీడ్చినట్లుగ స్వప్న । మందుఁ గానఁబడియె నాప్తవర్య ॥ (క) అసితాంబరధరుఁడై యా । యసపీఠంబున నిషణ్ణుఁడగు దశరథుఁడ । త్యసితపిశంగ ప్రమదలు । వెసఁగశలన్మోదఁగలను వీక్షితుఁడయ్యెన్ ॥ (ఉ) వారిధులింకినట్లు శశి,వారకిలంబడినట్లు చిచ్చుచ । ల్లారినయట్లు భూమి నిబి,డాంధతమోవృతయైనయట్లు పూ । ర్వారణశృంగముల్విఱిగి, వ్రాలినయట్లు కుజంబులెండిన । ట్లూరక కొండలందుఁ బొగ,లూరిన యట్లుగఁ దోఁచె నెంతయున్ ॥

(తే, గీ) యిట్టిదుస్స్వప్న మొకటి, చూపట్టె నాకు। నదియు మొదలేమియు
నుదోఁచ, దయ్యె నెట్టి। మాట వినఁబడునో యని, మనుజనాథుఁ। డన్నద
మ్ములు వీట నెట్లున్నవారో ॥ (తే, గీ) రాసభంబులఁ బూన్చిన, రథము నె
క్కి। యేనరుండేని స్వప్నమం,దేగి నట్లు। దోఁచునట్టి మనుష్యుని,ధూమము
చిత। యందు చిరకాలమునఁదోఁచు, నదినిజంబు ॥ (క) కావున నదికారణ
ముగ। భావంబుగలంగి యొక్క, భంగిగనుండె। న్నావిరి విషణ్ణవదనుఁడ।
నై వగచెద నృపతికేమి,యగునో యనుచున్ ॥ (క) ఏమిట భయ మెఱుగఁ
ని నా। కేమో దిగులగుచుఁజిత్త, మెరియగఁజొచ్చెన్ ।రామునకు లక్ష్మణున
కును। భూమివిభున కేమికీడు, పుట్టునొయనుచున్ ॥ (తే, గీ) ఏమి హేతు
వో తెలియదు, హృదయమునకు। మందతఘటిల్లెఁ దనుకాంతి, మాసెనాస్య।
మునకు దైన్యంబువాటిల్లెఁ, బుట్టియెన్నఁ। డిట్టివైక్లబ్య మెఱుఁగ నే,నించుకై
న ॥ (క) మున్నెన్నఁ డిట్టికల నేఁ। గన్నది లేదేమి చెప్పఁ,గల నిఁక ధాత్రీ।
భృన్నుతుఁడగు మజ్జనకు గు। ణోన్నతుఁ జింతించి భీతి,నొందితిననఘా ॥ (క)
అని సచివునితో రాతిరిఁ। గనుపట్టిన యట్టికీడు, కల యంతయుఁ దా। వినిపిం
చి వెఱఁగుపడి నె। మ్మనమునఁ దలపోసి వెగడు, పడుచున్నంతన్ ॥ (క) పురి

—(*) అయోధ్యనుండివచ్చిన దూతలు భరతుని సందర్శించుట. (*)—

నుండి యరుగుదెంచిన। పరమహితులు దూతలతని, పాలికిఁజనిత। చ్చరణము
లకునతులిడి యక్కఱపడి యిట్లనిరి వగపు,గన్పడకుండన్ ॥ (క) అనఘ పు
రోహితుఁడు నమా। త్యనికరము శుభంబు దెలిపి, తడయక మిముఁదో। డ్కొ
ని రమ్మని మముఁ బనిచినఁ। జనుదెంచితి మచటి పనుల్, సమకూర్చుట
కున్॥ (క) మా తెచ్చిన మణిభూషణ। ధౌతాంబరములు గ్రహించి,తడయక
యుష్మ। న్మాతామహునకుసఖులకు। మాతులునకొసంగుమతిసముచితబుద్ధిన్॥
(వ) మఱియు మాతామహునకు వింశతికోటిమూల్యంబులును మాతులునకు
దశకోటిమూల్యంబులును వేర్వేఱనొసంగుమని సమర్పించినంగైకొని వారినభి
మతకామంబుల సంతుష్టులంజేసియిట్లనియె॥ (సీ) మాతండ్రిదశరథో ర్వీతల

(*)భరతుఁడు తనమాతామహుని నయోధ్యకరుగుటకు సెలవడుగుట.(*)

పతికిని క్షేమమె మాయన్న రామభద్రుఁ। డానందభరితాత్ముఁడై యున్నవాఁడె
లక్ష్మణునకు మేలెధ ర్మజ్ఞధర్మ। దర్శినిధర్మార్థ్య ధర్మవిచారిణి లక్షణ



వతియైన రామజనని। కౌసల్యకుశలమె కమనీయ గుణశీలయగు సుమిత్రకుభ
ద్రమగునె క్రూర॥ (తే,గీ) చిత్తనిజకార్యతత్పరోగ్రవృత్తశీల। యైనమాతల్లిసు
ఖయుక్త యగునెమఱియుఁ। దక్కినన్నృపాంగనలకుభ ద్రంబె యూర। నున్న
వారెల్లఁగుశలులై యున్నవారె॥ (క) అనియడిగినన చ్చారులు। విని భరతుని
తోడననిరి వెండియుదేవా। వినుమీరిపుడడిగినవా। రనువుగనున్నారు సమ్మదా
త్మకులగుచున్॥ (క) నీవడిగినయర్థమునకు। ధీవర పద్మకరలక్ష్మి దేవరవా
రిం। గావలెనని వరియించెం। గావున విచ్చేయవలయు గ్రక్కునఁబురికిన్॥(వ)
అనివేగిరపడిపలుకుచున్న చారుల వాక్యంబువిని భరతుండు శంకా కళంకిత
స్వాంతుండై మాతామహునకిట్లనియె॥ (క) అనఘా సాకేతపురం। బునకరి
గెదఁదండ్రిఁజూడ మునుకొనిమీర। ల్మనమునఁదలంచినప్పుడె। చనుదెంచెదనా
కు సెలవొసంగఁగవలయున్॥ (చ) అనుటయుఁ గేకయక్షితిత లాధిపుఁ డెంత
యుఁజిత్రకంబళా। జినములువారణాశ్వములు చీరలనేకధనంబుఁబ్రీతితో। ను
నుమనికిచ్చితచ్చిరము మక్కువమూర్కొనిసత్కరించిమిం। చినయనురక్తినంప

—మాతామహమాతులులు భరతునకుఁ గానుకలొసఁగుట.—

కముఁ జేసిముదంబుగురొత్తవెండియున్॥ (మ) అనఘా వీటికిఁబోయిరమ్మచటి
వృత్తాంతంబుసర్వంబుమా। కనుమానింపక చెప్పిపంపుమనిస య్యాటంబుగాఁ
బల్కినూ। తనహారంబులుధౌతచేలములమా త్యశ్రేణికర్పించిసం। జనితానం
దముతోడవీడ్కొనియెవా త్సల్యంబునీపింపఁగన్॥ (వ) ఇట్లుమాతామహుం
డు ద్విసహస్రవక్షోభూషణంబులును షోడశాశ్వశతంబులును నపరిమితధనం
బుభరతునకొసంగి గుణవంతులగువారిఁ గొందఱ మంత్రులనిచ్చి సముచితం
బుగాపీడుకొల్పిన నతనిమాతులుండును రూప సంపన్నంబులు నిరావదింద్రశి
రాఖ్యపర్వతోత్పన్నంబులునైన గజంబులను వాయువేగంబులైనసైంధవంబు
లను సంయుక్తంబులైన ఖరంబులను నంతఃపుర సంవృద్ధంబులును వ్యాఘ్రదీపి
ర్యబలాన్వితంబులును దంష్ట్రాయుధంబులును మహా కాయంబులునగు శున
కంబులనొసంగి యనంతధనంబిచ్చియనిచె నిట్లు కృతప్రయాణుండై భరతుం
డు మాతామహమాతుల దత్తధనాదులయం దభినందింపక స్వప్న దర్శన భ
యంబువలనను దూతప్రేరణంబువలనను త్వరమాణుండై మాతామహునకు
మాతులునకుంజెప్పి గమనసంవిధానంబుఁగావించి శత్రుఘ్న సహితంబుగా ర

ధారోహణంబుఁ జేసి రాజగృహంబు వెలువడి యింద్రలోకంబు వెలువడిన పరమ

**(*) భరతుం డయోధ్యకరుగుట. (*)**

సిద్ధుండుం బోలెఁ దేజరిల్లుచు రాజమార్గంబునం జనియె నప్పుడు భృత్యులు మండలచక్రరథహయఖరోష్ట్రధేనుసహితులై యతని వెంటం జనిరి యిట్లు భరతుండు మాతామహ బలాభిగుప్తుండై ప్రాణసఖులైన యమాత్యులం గూడి ప్రాఙ్ముఖంబుగాఁ బోవుచు మార్గంబున సుదామాఖ్యానది నుత్తరించి దూరపారయగు హ్లాదినీనది దాఁటి యేలాధాన నగరసమీపంబునఁ బశ్చిమాభిముఖప్రవాహతరంగ యుక్తయైన శతద్రూతరంగిణిం దాఁటి యపర పర్వటాఖ్య దేశవిశేషంబు లతిక్రమించి శిలాప కర్షణ స్వభావయగు కల్లోలిని దాఁటి యాగ్నేయ శల్యకర్తన సంజ్ఞికంబైన గ్రామద్వయం బతిక్రమించి శిలావహానది నవలోకింపుచుఁ జైత్ర రథంబను వనంబును లక్ష్యంబుఁ జేసి మహా శైలంబుల నతిక్రమించి గంగా సరస్వతీ సంగమ ప్రదేశంబు విలోకింపుచు వీరమత్స్యోత్తర దేశంబు లతిక్రమించి తదుత్తరంబున భారుండాఖ్య వనంబుఁ బ్రవేశించి పర్వతాభి సంవృతయైన కుళింగాఖ్య నదిని యమునా సమీపంబున దాఁటి యమునానదిడాయం జని యమ్మహానదియందు సుస్నాతుండై తజ్జలపానంబుఁ జేసి జలావగాహనాదికంబునఁ గ్లాంతంబులైన హయంబుల గాత్రంబు లుశీతీకరించి యాశ్వాసించి నిర్మలజలంబులు సంగ్రహించుకొని యన్నదినుత్తరించి భద్రజాతీయగజంబు నారోహించి గంధవాహుం డాకాశంబుం బోలె రయంబున నిర్జనంబైన మహారణ్యం బతిక్రమించి యంశుధానాఖ్య పురంబు దాఁటి ప్రాగ్వటాఖ్య పుణ్యపురతీర్థంబున భాగీరథి నుత్తరించి యవ్వలఁ గుటికోష్ఠికాఖ్యనిమ్నగ దాఁటి ధర్మవర్ధన గ్రామంబు గడచి యవ్వలఁ దోరణ గ్రామంబునకు దక్షిణభాగంబునం బొల్చు జంబూ ప్రస్థాఖ్యంబగు గ్రామంబుఁ బ్రవేశించి యచ్చటం గదలి రమ్యంబైన వరూథగ్రామంబునకుం జని తత్సమీప వనంబున నారాత్రి నివసించి యవ్వలఁ బ్రాఙ్ముఖుండై యరిగి యవ్వల నుజ్జిహానాఖ్యపురసమీపంబునఁ గదంబవృక్ష శోభితంబైన మహోద్యానంబుఁ బ్రవేశించి యచ్చటి మహోన్నత ప్రియకంబులు విలోకింపుచు రయంబున నవ్వనంబు దాఁటి సర్వతీర్థగ్రామంబున నొక్కరాత్రి నివసించి యవ్వల వెనుకొని రమ్మని సేనల కనుజ్ఞయొసంగి తాను రథారూఢుండై చని యుత్తానకీ ప్రభృతి పుణ్యన



దులన్నియు నుత్తరించి హస్తిపృష్ఠక గ్రామసమీపంబునఁ గుటికాఖ్యనదిం గడచి యవ్వల లౌహిత్యాఖ్యనగరసమీపంబునఁ గపీవతీతటిని దాఁటి యేకసాల గ్రామంబున స్థాణుమతి నుత్తరించి వినతాఖ్యనగరంబున గోమతీనది దాఁటి కళింగనగర ప్రాంతసాలవనంబుఁ బ్రవేశించి యచ్చట నొక్కింతసేపు విశ్రమించి యవ్వనంబు దాఁటి యవ్వలం జనిచని యేడవనాఁటి సూర్యోదయ సమయంబున మనునిర్మితంబైన యయోధ్యాపురంబుఁ గనుంగొని భరతుండు సారథిన వలోకించి యిట్లనియె॥ (ఉ) సారథి కంటెదవ్వులవి శైలరసాలమహీరుహాళిచేఁ, భూరిగభీరమై పొలుచు పుణ్యవనోపవనంబులన్నర । న్నీరదపఙ్క్తిఁ బోలు మణి, నిర్మలశర్మహర్మ్యపాళిఁ జె । న్నారెడు రాజమార్గముల నద్భుత భంగి వెలుంగు మత్పురిన్॥ (చ) మఱియు సమాహితాగ్నులసమానగుణాకరులైన భూసురు । లరమనురక్తిఁ జేయు సకలశ్రుతిమంత్ర రవంబు లొక్కటం । దఱుచుగ నిండి మ్రోయ విత తద్యుతి నొప్పెడు దాని రాజశే । ఖరపరిపాలితంబగుచు గ్రాలెడు దాని నయోధ్యఁ గంటివే॥ (శా) మున్నీపట్టణరాజమందు సతతం బుంబో ()భరతుం డయోధ్యనుజూచి యందలి దుఃఖనిమిత్తముల సారథికిఁ జూపుట() రకాంతాసము । త్పన్నంబైన రవంబు మానసరుజ ల్పాయంగ వీతెంచు చుం। డు న్నేఁ డేల వినంగ రాదు పురిచుట్టుం బొల్చు నుద్యానపా । ళి న్నారీయుతులై విలాసపురుషుల్ క్రీడింపరారేలొకో॥ (తే, గీ) అనుదినంబును సాయాహ్నమందుఁ గ్రీడ । సలిపియుపరతి నొందిన జనుల చేత । నలరు నట్టియుద్యానంబు లరయఁ జాల । నిష్ప్రభత నొందియున్న వి నేఁడిదేల। (క) వారణతురంగశకటర । థారోహకు లర్థినీవలావలికిఁ బుడే । లారారు పోరు సారథి । యూరడవిం బోలెఁ దోఁచుచున్నది మదికిన్॥ (వ) మఱియు ఫలపల్లవ కుసుమమకరంద రసాస్వాదనమత్తశుక పిక శారికాభ్రమర మరాళ విహంగమకూజిత స్వనసంకులంబులును నాలవాల కరణ దోహనసేచన కందళితంబులును వివిధకుసుమలతాగృహ దీర్ఘికా క్రీడాపర్వతాది శోభితంబులును రమ్యంబులునగు మహోద్యానంబులును ప్రస్తపర్ణద్రుమసంయుతంబు లగుటం జేసి నిరానందంబులై సొబగు దప్పియున్న వది యునుంగాక ॥ (ఉ) కోకిలశారికామధుర, కూజితము ల్వినరావు వేణువీ । ణాకల నిస్వనంబులు వినంబడవేలొకొ కుందచందనా । నోకహసారభాంచితమనోహరసుందరగంధవాహుఁడే । లాకలయంగ వీవఁడున ఖావినఁ గానము వాద్యఘోషముల్ ॥ (క)

దుర్నిమిత్తంబుల । నేకంబులుదోఁచుకతన, హృదయంబునకు । స్తోకపరితా
పమొనవెను । దేఁకువసెడి బుద్ధిచాలఁ, ద్రిమ్మటగొనియెఁ ॥ (తే,గీ) ఎల్లభం
గులనూహారి కెల్లమేలు । దుర్లభంబని యాత్మకుఁ, దోఁచుచున్న । దనుచు
నెలవెల వోవుచు,మనసుగలఁగ । భరతుఁడల్లన నప్పురీ వరముసొచ్చె ॥ (క)
దుర్నీతివైజయంత । ద్వారంబునఁబురముసొచ్చి త్వరితంబునఁ ద । ద్ద్వారపతి
పాలకులుశ । న్నోర మొగముఁబెట్టిచూచు, చుండఁగనరిగెఁ ॥ (వ) ఇవ్వి
ధంబున భరతుండు విషణ్ణశ్రాంతానేకాగ్ర హృదయుండును లుళితేంద్రియుం
డును శ్రాంతవాహనుండునై రయంబునఁ బురంబుసొచ్చిరాజమార్గంబునం
బోవుచుఁ బథశ్రమక్లాంతుఁడైన సూతునవలోకించివెండియునిట్లనియె॥ (క)
సూతానిష్కారణముగ । మాంతామహువిడిచి, మాని,మాటకు దూతా । నీ
తుఁడనై నేనేలా । యేతెంచితి నిట్టియశుభ, మేటికిఁదోఁచెఁ । (క) నృపనా
శనమునకేయే । నెపములుమునుచెప్పఁబడియె నేఁడవి యెల్ల । న్విపరీతభంగిఁ
గనుఁగవ । కిపుడెల్లెడఁదోఁచుచున్న వెంతయువీటఁ ॥ (వ) మఱియుఁగుటుం
బిభవనంబులు సమ్మార్జన విహీనంబులై యసంయత కవాటంబులై
ప్రభాహీనంబులై బలికర్మ రహితంబులై ధూప సమ్మోదనశూన్యంబులై
యభోజితకుటుంబంబులై శోభాహీన జనాకులంబులై యలక్ష్మీకంబులై సొబ
గు దక్కియున్నవి మఱియు దేవాగారంబులువ్యపేతమాల్య శోభంబులై య
సమ్మృష్టాంగణంబులై ప్రవిద్ధదేవతా విగ్రహంబులై శూన్యంబులై యున్నవి
యజ్ఞగోష్ఠంబులు పాడఱియున్న యవి మాల్యాపణంబులందుఁ బణ్యంబులుప్ర
కాశితంబులు గాకున్న వదియునుంగాక ॥ (ఆ, వె) ఎవ్వ రేమి చెప్ప, రేల
కొ పాడఱి । నట్లు దోఁచుచున్న, దకటపురము । వణిజులెల్ల సర్వ, వస్తువిక్రయ
లాభ । యుతులుగాని పగిది, నున్నవారు ॥ (క) సౌరాలయ చైత్యంబుల ।
పారావత శుకపికాది, పక్షిగణము సం । చారంబు దక్కియేలొకొ । యూరక
కన్నీరు నించు,చున్నది కంటే ॥ (తే, గీ) ఆననమునందు వైవర్ణ్య మడరన
శ్రీ । కణము లురులఁగ ధ్యానమూ,కత వహించి । విక్లబత నొంది యున్నదీవీ
టనున్న । నరసమూహంబు కంటివె,నవర్ణసచివ ॥ (క) అని భరతుఁడు సా
రథితో । ననిష్టశకునంబు లన్ని,యిటు పేర్కొనుచు । న్మనమున దైన్యం బడర
గఁ । జనియెం దొలుతొల్త రాజ,సదనంబునకుఁ ॥ (వ) ఇట్లు శూన్య శృం



గాటక మందిరరథ్యంబును రజోరుణద్వార కవాటయంత్రంబును నగు పితృమం
దిరంబు విలోకించి యందు దశరథుంగానక యప్రియంబులైన దుర్నిమిత్తంబు
లనేకంబులు గనుంగొనుచు దీనమానసుండై భయకంపితశరీరుండై మాతృమం

—(*)భరతుఁడు కైకేయిని సందర్శించుట.(*)—

దిరంబునకుం జని సముచితంబుగా నిజజనని సందర్శించితచ్చరణంబుల కభివం
దనంబుఁ గావించె నప్పుడక్కైకేయి సంప్రాప్తుండైన కుమారు నవలోకించి ర
యంబునఁ గనకాసనంబు డిగ్గి యొక్కింత సేపు పుత్రవాత్సల్యంబున గాఢంబు
గాఁ బరిష్వజించి నిజోత్సంగంబున సుఖాసీనుం గావించి చుబుకంబుపుణికి శిరం
బు మూర్కొని చెక్కిలి ముద్దుగొని చిరకాలంబునకు సమాగతుం డగుటవల
న నానంద పరిపూరితాంతఃకరణయై ప్రేమగద్గదస్వరంబుననిట్లనియె ॥(ఆ,వె)
అనఘయెన్ని దినము,లయ్యెమాతామహు। మందిరంబువిడిచి,మమతమాని । ని
న్నువిడువఁజాలనేయతండు పథశ్ర।మంబుదీర్చికొనుము, మాన్యచరిత ॥(మ)
తనయావచ్చితె మామయిల్విడిచి యెన్నాళ్లయ్యె మాయయ్యతా ।ననునిత్యం
బుమనంబునం దలఁచునే, నాయన్న సంతోషియే । నినుఁదానంపెడువేళనేమని
యెరాజ్ఞీశ్రేష్ఠ మాతల్లినా । యననిన్బాసిననాఁటనుండి కనుచెడ్డట్లయ్యె నాకెం
తయుఁ ॥ (చ) అనిప్రియమారఁ బల్కుతన యమ్మనుగన్గొని యాతఁడిట్లనుఁ ।
జననిరొ తాతనిత్యము మనంబున నిన్నుఁదలంపుచుండున । య్యనఘుఁడు మా
తులుండుసుఖియైసదనంబున నున్నవాఁడున । న్ననుపమలీల నేగుమని యం
పె బహూకృతిఁ జేసివేడుకఁ ॥ (తే,గీ) మామయొసఁగిన గజవాజి, మణిధ
నంబు । లధ్వమునఁజిక్కి నేనుర,యమునసేగు । డెంచితినృపాల దూతచో
దితుఁడ నగుచుఁ । దద్గృహముఁబాసి సప్తరాత్రంబులయ్యె ॥ (సీ) పవడంపు
కోళ్లసొంపగునీదుశయనీయ పర్యంకమేలొకో,పాడుదోఁచె । మాయయ్యదశ
రథ,క్ష్మాభర్తనుశలియైయున్నచందముదోఁచ,కున్న దేమొ । యిప్పుఁడునీయి
ల్లు, నెడఁబాయఁజాలని తండ్రినేఁడెచటికిఁ,దలఁగిపోయెఁ । గృతకాముఁడై య
గ్ర,సతియగు కౌసల్య యున్నతాలయమున,నున్నవాఁడొ ॥ (తే,గీ) యమ్మహా
త్ముని పాదపద్మముఁగొలువ । వలయు నెచ్చట నున్నాఁడొ, తెలియఁజెప్పు ।
మనిన నక్కైక భరతునా,ననముఁజూచి । యి ట్లనుచుఁబల్కె సందియమిం

(*) భరతుఁడు పితృమరణం బెఱిఁగి దుఃఖించుట. (*)

తలేక ॥ (క) చతురుండు యాయజూకుఁడు । జితేంద్రియుఁడు సత్యరతుఁడు క్షి
తివల్లభుఁడో । సుతభూతంబుల కెయ్యెది । గతియైతగు నట్టి చరమగతికిం జని
యెఁ ॥ (క) నావుడు భరతుఁడు జనయి । త్రీవాక్యం బాలకించి, పృథుప
రశుహతం । బై వసుధఁ బడిన విటపము । కైవడి మహిఁ ద్రాలి శోక, కంపితుఁడ
గుచుఁ ॥ (శా) ఈరీతి న్మహిఁ ద్రాలి శోకదహనం, దేప న్భుజం బెత్తి దీ । నా
రావంబున నేడ్చెఁ గన్నుఁగవ బా, ష్పాంబుల్ జడింగారఁగా । హా రాజోత్తమ
హా మహాగుణమణీ, హా తండ్రి మమ్మొంటి ని । ష్కారుణ్యంబునఁ బాసిపోవఁద
గవే, త్వన్నాథ యంచుఁ రహిఁ ॥ (క) అని యీగతి భరతుం డా । ననము
నఁ బట మొత్తి ఘోర నాదమునఁ బ్రతి । ధ్వను లీనఁగ నేడ్చుచు మే । దినిఁ బడి
విలపించెఁ జాల, ధృతివాయంగన్ ॥ (ఉ) శారదపూర్ణిమారజని, చంద్రవిరా
జితమైన వారిద । ద్వారము భంగిఁ బొల్చు నృప, తల్పము భూపతి లేమిఁ జేసి
నేఁ । డారయ వారివాహసమ, యాంచిత దర్శతమిస్రయందు నో । ప్పారున
భంబు మాడ్కి నకటా పడి యున్నది కాంతిహీనమై ॥ (చ) అనిబహుభం
గుల న్నముది, తార్తరవం బడరంగ నిష్ఠురా । వనిఁ బడి యేడ్చుచున్న హరి,
వారణసన్నిభు నిందుతుల్యుని । న్వనరుహ బాంధవప్రతిము, వారణవైరినిభుం
గుమారునిం । గనుఁగొని లెమ్ము లెమ్మనుచుఁ, గైకయి కౌఁగిటఁ బట్టి యిట్లనున్ ॥
(మ) అమలాత్మా నినుఁబోఁటి ప్రాజ్ఞులిటు శో, కాక్రాంతులై విక్లబ । త్వము
నం బ్రాకృతులట్ల దైన్యమున సం, తాపింతురే యిట్లు దుః । ఖమునం దూలినఁ
జన్నవారు మఱలం, గాంక్షించి యేతెంతురే । క్షమలోఁ దొల్లిఁటి రాజులంద
ఱును బం, చత్వంబుఁ బ్రాపింపరే ॥ (తే, గీ) అనఘచారిత్ర నీబుద్ధి, యనవర
తము । సవనదాన తపశ్శ్రుతి, సత్యశౌచ । శీలములయందు మిక్కిలి, చేరియుం
డు । నర్కరుచి మందరనగంబు, నందుఁ బోలె ॥ (క) అనవుడుఁ గొండొ
క సేప । య్యనఘుఁడు కఠినోర్వి నొరిగి, యారాటమునం । బెను వగలఁ బొ
గిలి క్రమ్మఱ । జననిం గని యిట్టు లనియె, సంతాపమునన్ ॥ (ఉ) ఉల్ల
ము నందుఁ బ్రేమ దళు, కొత్తఁగ రాముని రాజ్యలక్ష్మికి । న్వల్లభుఁ జేసి
తానొక హ, వంబొనరింపఁగలండు తండ్రియం । చుల్లమునందు నమ్మిరయఁ
యొప్పఁగ నేగతిఁగాని యిట్లుమా । కెల్లదురంత దుఃఖమిడి, యీగతిఁబోవు



రెఱుంగనక్కటా ॥ (ఉ) సాధుచరిత్రుఁ డార్జవవి, చారుఁడు సూనృతవా
దియైనభూ । నాథుఁడ మేయధైర్యగిరి, నాథుఁడు నాచను దెంచునంతలో । వ్యా
ధి నశించెనో తెలియ, నాడును నాయన సంస్కరించి రా । మాదికుమారు లెం
తయుఁ గృ, తార్థకులైరి కదా తలంపఁగన్ ॥ (ఉ) మాతులునింటనుండి గిరి, మం
జనుదెంచిన నన్ను మున్నువి । ఖ్యాతకృపానురాగములఁ, గౌఁగిటఁ జేర్చి రజం
బు నూడ్చి సం । భూతముదంబున న్శిరము, ముద్దిడి వేడ్కలు సేయుచుండు
నేఁ । డాతని యంగసంగమ మ, హాసుఖముం గననైతి నక్కటా ॥ (ఉ) ఎవ్వఁడు
ధాత్రి తతండ్రి సముఁ, డెవ్వఁడు రక్షకుఁ డెవ్వఁడింక నా । కెవ్వని కేను దాసుఁడ
మ, హీస్థలి నారఘురాముతోడ నా । నెవ్వగ లెల్లఁ దెల్పి జన, నీ రయమారఁగఁ
బిల్వనంపుదా । దవ్వులఁ జూచి తచ్చరణ, తామరసంబుల మీఁద వ్రాలెదన్ ॥ (క)
ధర్మవిదుఁడు ధర్మాత్ముఁడు । ధర్మాపథగరిష్ఠుఁడైన, ధరణీనాథుం । డమిఁ
లిఁగడచనుచో నయ । ధర్మాసందేశ మేమి, దడవెం జెపుమా ॥ (వ) అనినఁ గై
కేయి యిట్లనియె ॥ (శా) ఆభూనాథకులోత్తముం డలసతన్, హా రామ హా లక్ష్మ
ణా । హా భూపుత్రిక యంచుఁ బేర్కొని తదీయానూనరమ్యాకృతు । ల్దాభావం
బున నిల్పి సద్గుణగణ, ధ్యానంబుఁ గావింపుచు । న్శోభాహీనతనొంది మేను విడ
చెన్, క్షోభంబు వాటిల్లఁగన్ ॥ (తే, గీ) జానకీ లక్ష్మణులఁ గూడి, సంభ్రమమున ।
విపినమున నుండి క్రమ్మఱ, వీటికరుగు । దెంచిన రఘూత్తముని విలోకించి యె
ల్ల । జనులు సిద్ధార్థులయ్యెద, రనుచుఁ బలికె ॥ (వ) అని పలికిన నద్దేవి వచనంబు వి

—(*) భరతుఁడు కైకేయిని రామవివాసంబునకుఁ గారణం బడుగుట. (*)—

ని ద్వితీయాప్రియ శంసనంబువలన మిక్కిలి విషణ్ణవదనుండై వెండియు నద్దేవికి
ట్లనియె ॥ (క) జననీ కౌసల్యానం । దనుఁడవనీపుత్రిఁ గూడి, తమ్ముఁడు గొలువ
న్దనపురము విడచి యెచ్చట । నునికిం గావించెదాని, నొయ్యనఁ జెపుమా ॥ (చ)
అనవిని వేడ్కఁ గ్రాలు హృద, యంబున నజ్జగరాగ కూవిని । ట్లనునిసుమంత
కొంకక జటాజినము ల్ధరియించి భూమినం । దనయు సుమిత్రపట్టియు ము, దం
బునఁ దోఁ జనుదేర దండకా । వనమునకేగె రాముఁడు ధ్రు, వంబుగ రాజ్యముఁ
బాసి పుత్రకా ॥ (ఉ) నావిని విన్నవాటు వద, నంబునఁ దోఁప నతండు బాష్పము ।
ల్వావిరిఁ గ్రమ్ముదేర బలు, వంతలఁ గుందుచుఁ ద్రస్తచిత్తుఁడై । భూవియదంత
రాళపరి, పూరితకీర్తిని రామమూర్తినిన్ । భావమునందు నిల్పి నిజ, వంశసమాచి

తసూక్తినిట్లనున్॥ (ఉ) ఎన్నఁడు విప్రసొమ్ము భుజి,యింపఁడు ధర్మముత్రోవఁ
బోఁడు తా । నెన్నఁడునన్య కాంతపయి, నించుకయైనమనంబుసేర్పఁడా। పన్న శ
రణ్యుఁడంచితకృపాలుఁడు ధర్మవిధిజ్ఞుఁడైనమా । యన్నయదేలభ్రూణహ,ని
యట్లు వనంబునకేగఁ జెప్పుమా ॥ (చ) అనవిని యానృశంసినిని,జాత్మజుసిం
బరికించితానొన । ర్చినకొఁగాని కార్యములఁ,జెప్పినఁజాలఁ గృశించునేకదా।
యనిజగరాగ యాట హృదయంబుననించుక శంకనొందకా । యనువునస్త్రీ
స్వభావమున నాతనితో ముదమందియిట్లనున్ ॥ (ఉ) ధర్మముఁదప్పి కాదు

—(*)కైకేయిభరతునకు రామవివాసనంబునకు గారణంబుఁ దెల్పుట.(*)—

పరదారధనాదులఁగోరికాదుదు । ష్కర్మ మొనర్చి కాదుద్విజసత్తమునిన్వధి
యించికాదున । ధర్మ విశారదుండు నృప,ధర్మవిధిజ్ఞుఁడునైనరాఘవుం ।
డమిర్మాలిఁగానకుంజనుట, కైన తెఱంగెఱింగింతుఁ బుత్రకా ॥ (చ) అఱమఱ
యింతలేకవిను,మా మునుమీజనకుండునాకుఁదా । వరములురెండొసంగెనవి
వాకొని నీకు నరాధిపత్యముం । బరువడి రామభర్తకుఁ బ్రవాసముఁ గోరి
తిఁ గోరినన్మహీ । వరుఁడగుఁ గాక యంచతని వారక పొమ్మనిపంచెఁ గానకున్॥
(ఉ) పంచిన మంచిదంచు నర,పాలశిఖామణియైన రాముఁడ । భ్యంచిలీత
లవల్కల జటాజినము ధ్ధరియించి యాత్మలో । నించుకయైన స్రుక్కక మ,
హీజయు లక్ష్మణుఁ డంటి వెంట రా । వంచనయింతలేక వన,వాటికిఁ బోయెఁ
బితృణమీఁగఁగన్ ॥ (ఉ) ఈగతి రాఘవుం డడవి, కేగిన పిమ్మటఁ జాల్మివీ
డిలో । రాగము గూరనివ్వటిలు,రామవియోగజతాపవహ్నిచేఁ । గ్రాఁగుచు
రేపవల్వగలఁ, గంటికిఁగూరుకు రాకవంతల । న్వేఁగుచు మేదినీవిభుఁడు, వేఁజ
నియెన్సురరాజు వీటికిన్ ॥ (ఉ) రాముఁడు దాల్పఁగాఁదగిన, రాజ్యము నే
ర్పునఁజేసినీకుఁగా । భూమివరేణ్యు చేతఁబలు,పోకలవంచనఁ జేసి తెచ్చితి । న్నా
మదిచల్లసేయుచుజ,నంబులు సన్నుతి సేయఁజుట్టము । ల్బాములువీడనింక నర
పాలనశీలివి గమ్ముపుత్రకా ॥ (ఉ) ఈపురమీయ నామయము హేతలమీమణిర
త్నకాంచనం । బీపలుమూఁకలీధనము లెంతయునీయది గాననాత్మలో । భూ
పతిపోకకున్వగలఁ, బొందక ధైర్యమునూఁదుమింకని । న్నేపున సర్వరాజ్యము
నకేలికఁజేసెద రెల్లిసద్విజుల్ ॥(క)అనిపితృ మరణముభాషితల । వనగమనముఁ
జెప్పవినియు, వార్యచరితుఁడా । యనపిడుగువడినవానిం । బెనుగొఱవింగాల్చి



నట్లు,పిమ్మటిగొనుచున్ ॥ (వ) కొండొకసేపొల్లంబోయి మెల్లనఁ దెలిసి నిజజ

(*)భరతుండుకైకేయిని దూఱుట.(*)

నని నవలోకించి యిట్లనియె ॥ (ఆ, వె) అకటతండ్రిచేత నలతండ్రి కెనయైన ।
భ్రాతచేతవిడువఁబడి స్వధర్మ । హతుఁడనైకృశించు నట్టినాకీరాజ్య । మీధనం
బునగరమేల చెప్పుము॥ (క) ఘోరమణుఁ జంపి రాముని। వారక తాపసునిఁజేసి
వ్రిణమందు ఘన । ఘోరముబలెదుఃఖమునం । దారయ దుఃఖంబొనర్చి,తతిక
ఠినమతిన్ ॥ (క) మావంశము నిర్మలముఁ । గావింపఁగఁ గాళరాత్రి,గ
తి వచ్చితి వా । భూవిభుఁడు నిన్నుభస్మ । వ్యావృతశిఖికణమ వనుచు,నరయ
క చెడియెన్ ॥ (క) జనపతి నీచే గతిచే। తనుఁడై దివికనుపఁబడియె,దానర
ఘుకులం । బునఁగల ధర్మంబు నయం । బును వృత్తము సుఖము యశముఁ,
బొలిసెఁగులలక్ష్మి ॥ (తే,గీ) నీకరగ్రహ మొనరించి,నిత్యసత్య । ధర్మరతుఁ
డైనమాయయ్య, దరశథుండు । తీవ్రదుఃఖాభితప్తుఁడై, తీఱిపోయెఁ । ఫణినిఁ
జేనంటియజ్ఞుఁడు, పడినపగిది॥ (చ) అనుపమసత్యధర్మరతుఁ,డైన రఘూత్త
మునుగ్రకాననం । బునకనుపంగ నేలతన, పుత్రునివైభవమక్షికింపుగాఁ,గనుఁ
గొను వేడ్కనున్న మహి,కాంతునిఁ జంపఁగఁ నేలయక్కటా । కనికనిదీననే
మి వడి,గట్టఁ దలంచితివే నృశంసినీ॥ (మ) చిరకాలంబనపత్యతాఘమునగా,
సింజెంది నేఁడింతక । క్కఱతోఁ నమ్మహనీయులం గనియభం,గప్రీతి తోనున్న
ని । త్తఱిఁగౌసల్యకు నాసుమిత్రకు ననం,తక్షోభ మిట్లీవుమ ।త్సరితంజేసితివిం
కఁ దద్వదనమే, చందంబునంజూచెదన్॥ (క) గురువృత్తివిదుఁడు ధర్మో।త్త
రుఁడగు రఘునాయకుండు, తనతల్లిపయిం । గుఱిఁజేయు భక్తినీపయిఁ । బరి
కించుం గాదెయతనిఁ,బాపుటతగవే ॥ (మ) కరుణంజెల్లెలిజూచుకైవడినినుం
గౌసల్యదాసంతతం । బరుదారంజరికించు నాయమసుతుం, డైశ్వర్య భోగా
ర్హుఁడ । త్తఱిఁజీరాజినముల్ధరించి మునిచం దాన న్వన క్షోణిక । ట్లరుగం
జూడఁగ నెట్లుసైఁచితివి వంశాచార విద్వేషిణీ ॥ (ఉ) శూరుఁ డపాపచి
త్తుఁడు విశుద్ధ చరిత్రుఁడు కీర్తిమంతుఁడం । భోరుహ తామ్ర లోచ నుఁ
డు పుణ్యుఁడు సర్వశరణ్యుఁడంచితా । కారుఁడునైనరాముని జగన్నుతశీలున
కారణంబుగా । దారుణకాననంబునకుఁ దప్పకపంచితివేలచెప్పుమా॥ (తే,గీ)
కరమురాజ్యార్థమన్యాయ గతిననర్థ । మరయనీచేతనానీత మగుటవలన

నన్నకేఁజేయుభక్తిలా భ్యమునఁజేసి । నీకువిదితంబుగాదని నేఁ దలంతు॥ (క)
లలితయశోధనులినకుల । లలాములుత్తములురామ లక్ష్మణులటవీ । స్థలికేగిరిం
కనేనే । బలమునసామ్రాజ్యమెల్లఁ బరిపాలింతుర్॥ (తే,గీ) మేరు ధాత్రీధరం
బుసమీపవనము । నట్లబలవంతుఁడైననసీ తాధినాథు । నాశ్రయించిబలోన్నతుం
డయ్యెదశర । థాధిపుఁడుసేమమునరాజ్య మర్థినేలె॥ (వ) అట్టియేనుమహా
త్ముండగు దశరథునిచేతఁదాల్పంబడిన మహీసామ్రాజ్యభారంబేబలంబునందా
ల్చువాఁడ మహాబలీ వర్దంబుచేత సముద్ధృతంబైన భారంబు వత్సతరంబు
మోవంజాలునెయదియట్లుండ నిమ్ముపాయబలంబునగ్రహణధారణంబులవలన
నొక్కింత రాజ్యభారధారణంబునందు సామర్థ్యంబు నాకుఁగలిగియున్నను
బుత్రగర్ధినివగునిన్నుఁ గామితంబుచేత వెలయింపంజాల రామునకుఁ గౌస
ల్యయందుంబోలె నీయందు సంతతంబు మాతృత్వప్రయుక్తగౌరవంబు గలుగ
కుండెనేని నిన్నుంబరిత్యజింపవచ్చు నతండంతకంటె వినయగౌరవంబులఁ భా
టించుంగావున నత్తెఱంగవలంబించుట కయుక్తంబైయున్నదనిపలికి భరతుం
డు వెండియునిట్లనియె॥ (తే,గీ) సాధుచారిత్రవిభ్రష్ట సత్యరహిత । కులవినా
శనిపాపసం కలితచిత్త । మూఢపండితమానిని పూర్వరాజ । గర్హితంబైన
మతమెట్లుగలిగెనీకు॥ (తే,గీ) వంశపాంసనియీరఘు వంశమందుఁ । బూర్వ
కులలోన జ్యేష్ఠుండు భూమికధిపుఁ । డగుచునుండఁగనిష్ఠుల య్యానఘు ననుస
రించివర్తించుటదిధర్మ వృత్తిసరణి॥ (తే,గీ) స్వప్రయోజనపరవున్నృశంస
వగుట । నీవుశాశ్వతంబైనట్టి నృపతిధర్మ । మునున్నృపాచారపద్ధతి ననుపమా
న । సాధువృత్తమెఱుంగవు సత్యమింత॥ (తే,గీ) వంశపాంసనిజ్యేష్ఠానువర్త
నంబు । వివిధపార్థివవంశసం భవులకెల్ల । ధరణిసాధారణంబైనధర్మ మం
దు । రాఘవులకు విశేషధర్మంబుదలఁప॥ (తే,గీ) అట్టికులశీల యుతులుధ
ర్మైకరతులు । లైనయిక్ష్వాకుకులజధ రాధిపతుల । ధర్మచారిత్రగర్వితత్వం
బునిన్నుఁ । బొందిసర్వంబుశిథిలమై పోయెనేఁడు॥ (క) మునుకొని మీమాతృ
కులం । బునఁబుట్టినవారురాజ ముఖ్యులుజ్యేష్ఠుల్ । జనపతిఁ జేయరనీకీ । య
నర్థ మతి యెట్లుగలిగె నన్వయహారిణీ॥ (తే,గీ) యశముకులమునుజెఱచి
తివట్టినీకుఁ । గామమునఁదృప్తిసేయక రామభద్రు । నిపుడెతోడ్తెచ్చి పుడమిక
ధిపునిఁజేసి । యతనికతిభక్తిదాసుండనై చరింతు॥ (క) అనియిట్లువిప్రియము



లగు । సునిశితవాక్యములుపల్కి శోకంబునరో । దన మొనరింపుచుఁ గ్రమ్మఱ
జననింగనియిట్టులనియె సక్రోధుండై॥ (తే,గీ) పాపచారిణిరాజ్యలోభమునఁ
జేసి । యాన్వయికధర్మమునఁ బరిత్యక్తవైతి । వింకనిన్ననసేలనిశ్శంకనన్నుఁ ।
మృతునిఁగానెంచిరోదన యుతవుగమ్ము॥ (క) పతిదివమునకేలసీతా । పతికాన
నమునకునీదు పంపునఁజనుచు । న్నతిలోనవినుసతీగుణ । యుతవని నిక్కముత
లంచి యుండుదురెకదా॥ (క) కులమునునశింపఁజేయుట । వలనందగభ్రూణ
హత్యఁ బ్రాపించితివా । కలుషమునఁబతిసలోకత । నలరారకనిరయగతికి నరి
గెదవింకన్॥ (తే,గీ) సకలలోకప్రియునిరామ చంద్రునడవి । కనిచివిభునినా
కమునకుఁ బనిచినాకు । నెల్లవారికిభయమానహిల్లఁజేసి । పాపభాగినివై నిల్వఁ
బడితివీవు॥ (క) నీచేతఘోరకర్మ । ప్రాచుర్యముచేతనెద్ది పాపమిటులనేఁ
డాచరితమయ్యెనదిన । న్నేఁచుటయేకాదుజగము నేఁచఁదొడంగెన్॥ (వ) మ
ఱియు దుష్టచారిణివైన నీకతంబున మహీరమణుండు లోకాంతర గతుండ
య్యె రామభద్రుండు వనంబునకుంజనియె నేను వంశపాంసనినగు నీకుంబుట్టి
నకతంబున లోకంబునం దుపక్రోశమలీమసుండనైతి మాతృరూపంబునంజూ
పట్టు మృత్యువకా నిన్నుఁదలంచెద దురాచార సంపన్నవగు నిన్నవలోకించు
టయు నీతోడసంభాషించుటయు మహాపాతకంబని తోఁచుచున్నది పతిఘాతి
నివైననీవలన సుశీలలగు కౌసల్యయు సుమిత్రయుఁ దక్కినయంతఃపురకాంత
లుదుస్సహంబైన దుఃఖంబునొందవలసె నిరయ గామినివగు నీవు ధర్మా
త్ముండగునశ్వపతి వంశవినాశనార్థంబుపుట్టిన రాక్షసివిగానియమ్మహాత్మునకుం
బుత్రికవుగావు పరమధార్మికుండును నిత్యసత్యపరాయణుండునగు రాముని
వనంబునకుంబనిచి పుత్రవత్సలుండగు మజ్జనకుని దివంబునకుం బంచి యేపాప
కర్మంబాచరించితి వాపాపకర్మంబు పితృభ్రాతృపరిత్యక్తుఁడగుటవలనలో
కవిద్వేష్యుండనైన నాయందు సమారోపితంబయ్యెఁ గట్టిడితనంబున రట్టున
కొడిగట్టితివి ధర్మసంయుక్తయైన కౌసల్యాదేవినిఁ బుత్రహీనంజేసి యేలో
కంబుఁ బడయంగోరితివి బంధుసంశ్రయుండును నియతుండును జ్యేష్ఠుండును
బితృసముండునగు కౌసల్యా నందనునియందు నాకుం గల భక్తిస్నేహంబులు
మూఢచిత్తవగుటంజేసి పరామర్శింపవైతివనిపలికి పుత్రవిశ్లేషంబు తల్లికసహ్యా
తరంబని యెఱింగించువాఁడె యంగాదంగావచియెడు శ్రుతియర్థంబు మనం

(*) భరతుఁడు కైకేయికిం బుత్రశోకము దుస్సహమని యెఱింగించుట. (*)

బునసిడికొని వెండియు నిట్లనియె॥ (క) వినుమంగ ప్రత్యంగజుఁ। డను రాగస్థానభూత మగుహృదయమునన్। జనియించెఁగాన నౌరసుఁ। డనఁదగెనతఁడమ్మ కెక్కుడాత్మ్మఁ బ్రియలోనన్॥ (వ) అనిపలికి పుత్రపీడనంబుదుస్సహ దుఃఖకారణంబని సూచింపంజేయువాఁడై యొక్క యితిహాసరూపంబుగా నిట్లనియె॥ (సీ) వినుమున్నృశంసత్రివిష్టపంబుననన్న కెక్కొనసురభిదానొక్కనాఁడు। పుడమిపైనాఁగలిఁ బూనియామధ్వయపర్యంతమునుదున్ని బడలిదారు। ణాతపంబునడస్సి యడుగులుతడఁబడఁదూఁగాడుచున్నయుత్తుంగ వృషభ। ములరెంటిఁగనితన కుఁముననఁబుట్టినవౌటనందనులకా యాత్తఁదలఁచి॥ (తే,గీ)పుత్రశోకంబుచేఁజాలఁ బొక్కియేడ్వ। దానికన్నీటిచినుకుల ధఃప్రచారి। యగుసురేంద్రునిపైఁబడ్డ నతఁడుచూచి। మోడ్పుఁగేలొప్పఁబలికెన మ్మొదవుతోడ॥ (క) దేవహితైషిణినీవిటు। భావంబునఁగలఁగియేలవగచెదవిటులు। న్నావుడు నిజరధేనువు। దేవపతింజూచిజలికె దీనతవెలయన్॥ (వ) సురేంద్రా యుష్మద్భయాగమన శంకాహేతుభూతంబైన పాపంబులేదు కర్షకునిచేత దండితులై యెండంబడికృశింపుచు మొగంబుల దైన్యంబుదోఁప భూరిభార పీడితులౌటకతంబున దుఃఖింపుచు మహీతలంబున విషమస్థలంబునం జరింపుచున్న మత్పుత్రులంజూచి పుత్రునింబోలిన ప్రియవస్తువన్యంబెద్దియు లేదుగావున నేను శోకింపుచున్న దాననని పలికిన నయ్యమరవిభుం డెద్దాని పుత్రసహస్రంబులచేతలోకంబు వ్యాప్తంబయ్యెనట్టిదానిరోదనంబుఁ గావించు దానిఁ గామధేనువునవలోకించి పుత్రునికంటెఁ బ్రియుండన్యుండు లేఁడనితలంచిపరిమళోపేతంబులైనతదీయాశ్రుకణంబులు కొనగోటమీటుచు మృదుమధురవాక్యంబుల ననూనయించె నిత్యంబప్రతిమవృత్తియులోకసంరక్షణేచ్ఛయుగుణనిత్యయు సంపత్సమృద్ధియు శీల పరిపూర్ణయు బహు పుత్రయునైన కామధేనువొక్కనికిఁగా శోకించె నని శాస్త్రంబు లెఱింగింపుచుండ నేక పుత్రయగుకౌసల్య యతం డొక్కరుండును వనంబునకుం బోవుచుండ దుఃఖంబునం బరితపించుచున్న దనుట కేమి సందియంబని పలికి వెండియు నిట్లనియె॥ (మ) చిరకాలం బనపత్యతాఘమున గాసిం జెంది నేఁడింత కీ। కరుణోదారునిఁగాంచి కాంచితిఁ గదా, కల్యాణమంచుండ ని। త్తఱిఁ గౌసల్యకు దుస్సహంబ



యిన సంతాపంబుఁ గావించితీ। దురితంబుద్ధతిఁ గాల్పకున్నె నినుఁ దోడ్తో జన్మజన్మంబునన్॥ (తే,) పాపదర్శిని సుగుణసంపన్నయైన। పుణ్యసాధ్వి కౌసల్యకు,భూరిశోక। మాత్తనరయక కావించి, నందువలన। నిరయగతికేగఁ గలవీవు,నిక్కువముగ॥ (తే.గీ) అఖిల రాజవిగర్హిత,యైన నీదు। బుద్ధిగైకొన కేను సంపూర్ణకీర్తి। వర్ధనంబైజానకీ, వల్లభాంఘ్రి। పూజనంబర్థిసలిపెదఁ,బొంకుగాదు॥ (మ) నినువేభంగుల దూఱనేటికిఁ గులఘ్నీ। యిప్పుడే పోయి రా। మునిఁ గల్యాణ గుణాభిరాము నిటకుం, బొల్పొందఁ దోడ్తెచ్చి యగ్ర। కుటుంన సామ్రాజ్యమునందు వేడ్కనభిషిక్తుం జేసి యప్పూనికనై। కొని యే నేగెద దండకాఖ్యగహనక్షోణీస్థలిం ద్రిమ్మరన్॥ (ఆ,వె)బాష్పకంఠులైన పౌరులచే నిరీ। క్షితుఁడ నగుచు నీవు,చేసినట్టి। యీదురంత పాప, మించుకైన స। హించియుండఁజాల, నిచట నిపుడు॥ (వ) మహాత్ముండగు రామునకును బుణ్యసాధ్వియైన కౌసల్యకుబుద్ధిపూర్వకంబుగా మహాపకారంబుఁ గావించితివీపాపంబునకు మరణంబు దక్క నొండుప్రాయశ్చిత్తంబు లేదు చిచ్చులో నుఱికియైన గరళంబుఁ గ్రోలియైన దండకారణ్యంబునకరిగియైనఁ బాశంబుననురిగొనియైన నెట్లయినఁ గళేబరత్యాగంబుఁ జేసియీదుష్కృతంబుఁబాపికొను మేను సత్యపరాక్రముండగు రామునిఁ గోసల రాజ్యప

(*) భరతుండమాత్యమధ్యమునఁ బ్రమాణము సేయుట.(*)

ట్టాభిషిక్తునిం జేసియపనీతకల్మషుండనై కృతకృత్యుండనయ్యెదనని పలికిభరతుండుసంక్రుద్ధంబైనపన్నగంబుభంగిరోఁజుచుఁగాంతారమధ్యస్థితగర్తంబునందుఁ దోమరాంకుశవిద్ధంబైనమహాగజంబుపగిదినాకంపింపుచురోషరోదనతామ్రాక్షుండునుశిథిలాంబరుండును విధూతసర్వాభరణుండునైయుత్సవాంతంబునం దుఁబడమింబడినశక్రధ్వజంబుపోలికధరణిపయింబడి కొండొకసేపునకు లబ్ధసంజ్ఞుండై లేచినేత్రంబులనశ్రుకణంబులుదొరుఁగరక్తాంత వీక్షణంబులఁ గైకేయినిరీక్షించిగర్హింపుచుఁ దత్కాలసమాగతులైనయమాత్యులమధ్యంబుననిలువంబడి భుజంబెత్తి రామోపభోజ్యంబైన సామ్రాజ్యంబేనుగాంక్షింపలేదు కపటంబున రాజ్యగ్రహణార్థంబు కైకేయింబ్రేరేపించి యెఱుంగ రాజుచేత మన్నిమిత్తంబేయభిషేకంబు సమీక్షితంబయ్యె నయ్యభిషేకంబు నెఱుంగ శత్రుఘ్నసహితుండనై దూరదేశంబుననుండుటవలన రామలక్ష్మణుల వివాస

నం బెఱుంగనని ప్రామాణ్యంబుగాఁ బల్కి దీర్ఘస్వరంబున రోదనంబుఁగా
వించిన నతనికంఠశబ్దం బాకర్ణించి కౌసల్యసుమిత్ర నవలోకించి యిట్లనియె॥
(ఆ,వె) కలుషచిత్తుఁడైన, కైకేయి తనయుండు । వచ్చియుండఁబోలు, వాఁడు
దీర్ఘ । దర్శిగానవానిఁ, దడయక వీక్షింపఁ । బోదమనుచు వేగఁ బోయెనట
కు ॥ (క) ఆభరతుఁడు మనమున సం । క్షోభించుచు సుతవియోగ, శోకము
చేసం । క్షోభించుచున్న కోసల । భూభృత్సుతయున్న యెడకుఁ, బోయెరయ
మునన్ ॥ (క) ఈగతి నేగి కుమారవి । యోగజతాపశిఖిఁ గ్రాఁగి,యుడికెడు తత
ల్లి । న్వేగం బెకాంచియాప । త్సాగరమున మునిఁగి భరత శత్రుఘ్నులొగిన్ ॥
(క) పరశునికృత్తములగు సుర । తరువుల చందానఁ దత్పదములం బడిదు । ర్భ

(*)కౌసల్యశోకావేశంబున భరతుని దూరుట.(*)

రశోకంటున నడలిరి । మరుచ్చలిత కచ్ఛరుహాల, మాడ్కిం బెలుచన్ ॥ (వ)
ఇత్తెఱంగున నాకంపింపుచుండ నప్పుడు కౌసల్య శోకావేశంబున ॥ (ఉ) క
న్నుల నశ్రుపుల్లొరుఁగఁ, గన్నులనశ్రులనించువానినా । పన్నత నొందుచుంగ
డు వి,పన్నత నొందెడువాని మోమున । న్విన్నఁదనంబు దోఁపఁగడు, విన్నఁద
నంబున నొప్పువాని నా । చిన్నికుమారుని న్భరతుఁ, జిచ్చరలం బరికించి యి
ట్లనున్ ॥ (క) దుర్మతి కైకేయీదు । ష్కర్మంబున రామరాజ్య, కాముఁడ
వగు నీ । కర్మిలినకంటకం బతి । శర్మదమగు రాజ్యపదము,సమకూడెఁగదా ॥
(ఆ,వె) నారచీరలిచ్చి, నాపుత్త్రుమీయమ్మ । ఘోరకాననంబుఁ, జేరఁబనిచెఁ।
దనకు దీననేమి, ఘనత వాటిల్లునో । తెలియ దింతపనికిఁ, దెగియె నపుడు ॥
(తే,గీ) దారుణప్రజ్ఞయైన మీ,తల్లి కైక । భూవిభునిఁ జంపుటయును మ,త్పు
త్త్రుఁడైన । రామభద్రుని దారుణా,రణ్యసీమ । కనుచుటయు నిన్ని నీకొఱకా
చరించె ॥ (క) ఆలస్యమేల చేకొని । పాలింపుము రామరాజ్య,పదవి సభ
లనీ । శీలము మీయమ శీలము । వాలాయముఁ బెద్దలైన, వారునుతింపన్ ॥
(ఉ) చారుహిరణ్యనాభుఁడు వి,శాలయశుండు ప్రశాంతచిత్తుఁడ । బ్జారిస
మాన తేజుఁడు గు,ణాఢ్యుఁడు మత్ప్రియపుత్త్రుఁ డెచ్చటం । గోరివసించెనచ్చ
టికి, గొబ్బునఁ గైకకుఁ జెప్పినన్నుఁ బొ । ల్పారఁగఁ బంపుమయ్యనఘ, నాస్య
ముఁ జూడక యుండనేర్తునే ॥ (ఆ,వె) అట్లు సేయవేని, యగ్నిహోత్రంబు
పు । రస్కరించుకొని క,రంబు భయము । దొలఁగ నిడి సుమిత్ర,తోఁ గూడియు



ప్పుడే । పుత్త్రుఁడున్న యెడకుఁ, బోవుదాన ॥ (ఉ) నాయెడ నీకు భక్తియును వి
నమ్రతయుం గృపగల్గొనేని సు । శ్రీయుతుఁడైన రాఘవుని, చేరుపకున్వెసనన్ను
బంచి భ । ద్రాయతమూర్తివై సఖుల,కమ్మకు సంతసమంకురింప న । న్యాయవితీ
ర్ణార్జితంబగు న,నామయ రాజ్యము నేలుమిత్తఱిన్ ॥ (వ) అని యివ్విధం
బున దారుణంబులైన బహువిధ వాక్యంబుల గర్హించుటయు నవ్వాక్యంబులుం
బ్రవ్రణంబునందు వాఁడిసూదులఁ జొనిపినట్లయిన నతండు తీక్ష్ణవ్యథా బాధితుం
డై శోకమూర్ఛాపారవశ్యంబునఁ దదీయచరణంబుల పయింబడి బహుప్రకా
రంబుల నిర్వేదింపుచుఁ గొండొకసేపునకు లబ్ధసంజ్ఞుండై కేలుదోయి ఫాలంబు

—(*)భరతుఁడు కౌసల్యముందర తానురాజ్యరామవివాసనములఁ(*)—
*గోరలేదని శపథము సేయుట.*

నంగీలించి దుస్సహ పుత్త్రశోకబలార్దితయై విలపించుచున్న కౌసల్యచేతఁద
నయందు సమారోపితంబైన దోషంబు పరిహరించుకొనుటకు శపథవాక్యంబు
నిట్లనియె ॥ (క) జననీయకల్మషుఁడ నగు । నను గర్హించెద విదేల, నాకా
రఘు నా । థునిమీఁదం గల భక్తియు । వినమ్రతయు మున్ను నీకు విదితము గా
దే ॥ (క) ఏపాప మెఱుంగని న । న్నీపగిదిం దూఱనేటి, కింతకుమును సీ ।
తాపతి పదారవిందా । రోపిత యగు భక్తి నీవెఱుంగవె తల్లీ ॥ (క) జననీ రా
ఘవుఁ డెవ్వని । యనుమతమున నడవి కరిగె, నాతని కాచా । ర్యనిగదిత శా
స్త్రశిక్షిత । ఘనబుద్ధియుఁ గలుగకుండుఁ,గాదె గుణాఢ్యా ॥ (సీ) వృజినాత్మునకుఁ
బ్రేష్యవృత్తిఁ బూనినవాని యఘము మార్తాండున,కభిముఖముగ । మూత్రంబు
విడిచిన,మూఢుని దురితంబు పడియున్న మొదవును బాదనిహతిఁ । దన్నినవా
ని పా,తకము భృత్యునిచేతఁ బని గొని కుడువని,వ్వని నృపాలు । శాపంబు పు
త్త్రుల,పగిది భూతంబుల నరయు భూపతికి ద్రో,హంబు సేయు ॥ (తే,గీ) వానిక
లుషంబు రాముఁ, డెవ్వాని యనుమ । తమున రాజ్యంబు విడిచి సీతాయుత
ముగ । దారుణారణ్య దేశమధ్యమున కరిగె । నతని కగుఁ గాక ఘాతసం
తతులు గుఱిగ ॥ (క) కరషడ్భాగముఁ గైకొని । కరమనురాగమునఁ బ్రజలఁ
గావనిధాత్రీ । వరుని మహాకలుషము నీ । వరసుతునకుఁ గీడుఁదలఁచు, వా
నిది గాదే ॥ (సీ) వినుమధ్వరమున ఋ,త్విజులకు దక్షిణ యొసఁగని వా
నిమహోగ్ర దురిత । మశ్వగజస్యంద,నాకులంబగు సంగరమునఁ బాఱినవాని వ్రా

త ఫలము । సకలకర్మజ్ఞాన, శాస్త్రవినాశంబు సేయఁబూనిన దుష్ట,చిత్తునఘ
ము । గురువుల కిడక కృ,సరము ఛాగము పాయసముదిన్న నిఘ్నృణాత్మ, స్వాం
తుగతియు ॥ (తే,గీ) వ్యూఢబాహ్వంసుఁ బుష్పవ,ద్గాఢ తేజు । రాజ్యసింహా
సనాసీను' రామవిభునిఁ । గాంచిచూపోపని దురాత్ము,కల్మషంబు । చూడనొ
క్కటిగాదె వి,శుద్ధచరిత ॥ (క) గురువులఁ దిట్టుటగోవులఁ । జరణహతిం ద
న్నుటయును, సఖునకు ద్రోహం । బరయక సేయుట రామున । కురుదుర్మతిఁ
గీడొనచుఁ, టొక్కటిగాదే ॥ (క) అకటా రహస్యమును దాఁ । పకమై
త్రిం జెప్పినట్టి, పరివాదముఁ దాఁ । బ్రకటముఁ జేసిన నరుపా । తక మార్యద్వే
షి కవిత,ఘంబుగ రాదే ॥ (క) శ్రీరామున కపకృతి ని । ష్కారణముగఁ జే
సినట్టి,కష్టుఁడు శిష్టా । చారద్వేష్యుఁడు జగదప । కారియగుచు నాత్మహం,త,గ
తికిఁజని యెడిన్ ॥ (తే,గీ) ఆర్యునకుఁజాలఁ గీడెవ్వఁ, డాచరించె । నతఁడు
పుత్రకళత్రభృ,త్యాదిక పరి । వారితుండయి యొక్కఁడె, స్వగృహమందు ।
మృష్టము భుజింపుచుండు ని,కృష్టుఁ డగుచు ॥ (క) అకృతోపకారుఁ డగు
ణుం । డకృతజ్ఞుం డాత్మహంత,యపగతలజ్జుం । డకృతార్థుండగు భ్రాతక ।
పకృతింగావించు నట్టి, పాపాత్ముఁడిలన్ ॥ (తే, గీ) సత్యసంధుండు శ్రీరామ
చంద్రుఁ డతని । కెగ్గుఁ జేసిన నీచాత్ముఁ డిజ్జగమునఁ । బుత్రదార గృహక్షేత్ర
భూరిసౌఖ్య । హీనుఁడై దుఃఖభారంబుఁ, బూనుఁగాదె ॥ (వ) మఱియు రా
జస్త్రీ వృద్ధబాలకులం జంపిన దురితంబును భృత్యత్యాగదోషంబును లాక్షా
మధుమాంస లోహవిషవిక్రయంబులచేత నిత్యంబును భృత్యులం బెంచినపా
పంబును శత్రుపక్షభయంకరంబైన సంగ్రామంబున నిరాయుధుండై బెదరిపా
ఱువాని వధించిన వృజినంబు నుభయసంధ్యాకాలంబులందు నిద్రవోయిన వా
ని కల్మషంబును వహ్నిదాయకు కిల్బిషంబును గురుతల్పగమనుని పంకంబును
మిత్రద్రోహం బాచరించిన వాని పాతకంబును బితృమాతృ శుశ్రూషఁ గావింప
నివాని దుష్కృతియును దేవతాపితృపూజనంబు సేయని వాని కలుషంబును
నాశంసమానులును దీనులును నూర్ధ్వలోచనులునగు యాచకుల కామితం
బు విఫలంబుఁ జేసినవాని యఘంబును సకలలోక పవిత్ర చరిత్రుండగు భవ
త్పుత్రున కెగ్గుఁ జేసిన దుష్టాత్మున కగుంగాక యెవ్వానియనుమతంబున రాముం
డు వనంబునకుం జనియె నట్టి పాపాత్ముండు బహుపుత్రుండును దరిద్రుండును



జ్వరరోగసమన్వితుండును సురాపానరతుండును నపాత్రవర్షియుఁ గామ
క్రోధాభిభూతుండును నున్మత్తుండును సంత్యక్తకులధర్ముండును మూఢుండును
ధర్మదారపరిత్యాగియును బరదారాపహరణుండును మాయావాదియుఁ గప
టాత్ముండునై సత్పురుషుల లోకంబువలనను సజ్జనుల కీర్తివలనను సదాచా
రుల కర్మంబువలనను విడువఁబడి కపాలపాణియై యమంగళుండై భిక్షాచ
రణంబు సేయుచు మహీచక్రంబునఁ బరిభ్రమింపుచుండుఁ గాక మఱియు నత
ని నానావిధసంపాదిత విత్తంబంతయు దస్యులచేత నపహరింపం బడుఁ గాక మ
ఱియు నతనికి స్వదారలయందుఁ బుత్రోదయంబు లేకుండుం గాక మాతృశు
శ్రూషాపరుండు గాక స్వల్పాయువై దుర్గతికిం జనుఁగాక యని పలికి వెండి
యు భరతుఁడు ॥ (తే,గీ) విప్రలుప్తప్రజాతుఁ డా,విప్రు పాత । కంబుపానీ
యదూషకు,కల్మషంబు । గరదుని యఘంబు రాముఁ,డేకరనచిత్తు । ననుమ
తంబునఁ జనియెనా,తనిదిగాదె ॥ (క) పాలునకొసఁగు సపర్యను । వారించిన
యఘము బాల.వత్సయగు గవిం । గోరికఁ బిదికిన దురితము । శ్రీరామున కెగ్గుసే
యు,చెనటిదిగాదే ॥ (క) దప్పింబడి గ్రోలుటకై । యప్పులఁడుగ నతనికిడక,
యతిలోభమునం । దప్పించిన క్రూరునిగతి । కిప్పుడెచనువాఁడ నన్న.కెగ్గుదలఁ
చినన్ ॥ (వ) వాదిప్రతివాదులు వివాదంబుఁ గావింపుచుండ నొక్కనియందు
స్నేహంబుచేత జయోపాయమార్గం బెఱింగియుఁ బక్షపాతంబున నూరకు
న్న కలుషాత్మునకుం గల దురితంబు రామవిద్వేషి కగుంగాక యని యేతాదృ
శంబులగు దారుణశపథంబులఁ బలికి నిట్టూర్పులు పుచ్చుచుఁ బతిపుత్రవిహీ
నయై దుఃఖింపుచున్న కౌసల్యచరణంబులపయిం బడి యుచ్చైర్నాదంబున రో

(*) కౌసల్య దుఃఖసంతప్తుఁడగు భరతు నాశ్వాసించుట. (*)

దనంబు సేయుచున్న భరతునవలోకించి యద్దేవి యిట్లనియె ॥ (మ) భరతా నీ
శపథోక్తి సంజనిత శుంభద్దుఃఖ తాపాగ్నిన । న్మఱలం గాల్పఁ దొడంగెనీమ
దికి స,మ్యగ్రాజ ధర్మంబతి । స్థిరమైయున్నది నీయెడన్దురిత సం,దేహంబు లే
దింతయుం । గరణంబేటికిలెమ్ము సజ్జనుల లో,కంబింక నీకయ్యెడిన్ ॥ (క) అ
నియూఱడించి వెసనా । తని భుజములఁ గ్రుచ్చి యెత్తి,తనయుత్సంగం । బునఁ జే
ర్చితనువు నివురుచు । జనపతిమృతి నొడివిచాల, సంతాపించెన్ ॥ (తే,గీ) మా
తృరోదనరూపక,మారుతమున । నిజమనోగత శోకాగ్ని, నివ్వటిల్లి । యేర్పఁ

జొచ్చిననతఁడు సహింప లేక । లుళితచేతస్కుఁడై చాల, మలఁగుచుండె ॥
(వ) ఇట్లు లాలప్యమానుండును విచేతనుండును భ్రష్టబుద్ధియు దీర్ఘనిశ్వాస
మారుతమ్లానవదనుండును మేదినీపరిపతితగాత్రుండునై బహుప్రకారంబుల
దుఃఖింపుచున్న యమ్మహారాజనందనున కవ్విభావరియొక్క చందంబున నతిక్ర
మించెనంత సూర్యోదయానంతరంబున మునిశ్రేష్ఠుండగు వసిష్ఠుండు శోకతప్తుం
డైన భరతునకిట్లనియె ॥ (క) ఆలింపుము నామాటలు । చాలింపుము వేఱ
యొకవిచారము ధరణీ । పాలకునకు సంయానము । కాలంబదిదప్పకుండఁ, గా
వింపుమికన్ ॥ (తే,గీ) అనవుడు వసిష్ఠవాక్యంబు, లాలకించి । భరతుఁడెంతయు
స్వస్థస్వ, భావుఁడగుచు । ధర్మపద్ధతిఁ బ్రేతకృ, త్యంబులన్ని । శిష్టసమ్మతి నృపునకుఁ, జే
యఁగడఁగి ॥ (ఆ,వె) నూనెచేతఁ బక్వ, మైనది గానన్ । పీతవర్ణవదన, మైతన
ర్చు । నృపుని మేనురత్న, నిర్మితగుణశయ్య । యందుఁ జేర్చి యిట్టులనుచు
వగచె ॥ (మ) అనఘా రాముని లక్ష్మణు న్విపినదే, శావాసులం జేసి చ । య్యా
నసేవీటికి రాకమున్నె ఘను నత్యాక్లిష్టకర్మున్యశో । ధనుని న్నామునిఁ బాసి ఘో
రతరసం, తాపంబునం బొక్కుచున్ । జనముం బాసి సుపర్వ లోకమునకున్, క్ష్మా
నాథ యిట్లేగితే ॥ (క) రాముఁడు కానన సీమకు । భూమీశ్వర నీవు దివికిఁ, బో

—(*)భరతుఁడు దశరథునికి దహనసంస్కారముఁ గావించుట.(*)—

యిననిఁక నీ । భూమికి నెవ్వఁడు యోగ । క్షేమముఁ గావించువాఁడు, చెప్పుమధీ
శా ॥ (ఆ,వె) తండ్రి నీవు లేని, ధరవిధవాంగన । భంగి నున్నయది భ, వద్వి
హీన । మైన నగరిచంద్ర, హీనమై చూపట్టు । రాత్రి భంగిఁ గాంతిర, హితమ
య్యె ॥ (క) అనిబహుభంగుల శోకం । బున సంక్లేశించు రాజ, పుత్రుం గని
య । మ్మునియింత వగవ నగునే । జనకున కొనరింపు ముచిత, సంస్కారవిధుల్ ॥
(వ) అని యుపదేశించిన న వ్వసిష్ఠు వచనంబులం దేఱి భరతుండు ఋత్విక్పు
రోహితాచార్యులను దక్కినపరిచారకుల నయ్యైకృత్యంబులయందు యథార్హం
బుగా నియోగించినఁ దక్షిణంబ యాజకులును నుపద్రష్టలును హవిరాజ్య హో
మపవిత్రంబైన గార్హపత్యాగ్నిహోత్రంబులు సంగ్రహించుకొని పురోభాగం
బునం బోవుచుండఁ గొందఱు పరిచారకులు విగతచేతనుండయిన మహీపతిక
ళేబరంబు శిబిక యందిడి తదీయ దీర్ఘదండంబులు భుజంబులపై నిడికొని వి
మనస్కులై కన్నీరు నించుచుఁ జనుచుండిరి సువర్ణంబును రజతంబును ర



త్నంబులును నానావిధ వస్త్రంబులును రాజ మార్గంబున వెదఁ జల్లుచు
గొందఱు ముంగలివై నడువ నివ్విధంబునఁ బురంబు వెలువడి యుత్తర
దిగ్భాగంబునఁ జందనాగరు నిర్యాస సరళ పద్మక దేవదారు దారువినిర్మి
తంబైన చితామధ్యంబున నిగత ప్రాణుండైన మహీపతి నునిచి యుచ్చా
వచంబులైన గంధంబులొసంగి ఋత్విజులు వహ్నియందు హోమంబు గా
వించి ఋగ్యజుస్సామ మంత్రంబులు జపియించి యనలుం బరికొల్పి సవ్యాప
సవ్య ప్రదక్షిణంబుఁ గావించిరా సమయంబున దురంతచింతాభరంబునఁ గౌస
ల్యాది సర్వాంతఃపుర కాంతలు వృద్ధకాంతా సమేతంబుగా యథార్హంబు
లగు శిబికాయానంబు లారోహించి పురంబు వెలువడి చితామధ్యంబున వహ్ని
శిఖాపరంపరా దంధహ్యమానదేహుండైన నిజవల్లభు నశ్వమేధాది యజ్ఞకర్త
నాలోకించి శోకసంతప్తచిత్తలై గుంపులుగూడి యొండొరులం బట్టుకొని క్రౌం
చాంగనల చందంబున నుచ్చైర్నాదంబులఁ గొండొకసేపు దుఃఖాయాసభ
రంబునఁ గన్నీరు మున్నీరుగా రోదనంబుఁ జేసి యనంతరంబ భరతునితోఁ గూ
డి సరయూజలంబుల నమ్మహీపతి కుదకక్రియలు నిర్వర్తించి భరత శత్రుఘ్న
మంత్రి పురోహితసహితంబుగాఁ గ్రమ్మఱఁ బురంబుఁ బ్రవేశించి బాష్పపరీత
నేత్రలై దశరాత్రంబు విశేషశాస్త్రానుసార నిగదితంబైన యాశౌచంబంగీక
రించి రంత దశరాత్రంబు లతిక్రమించిన యనంతరంబు భరతుండు కృతశౌచుం
డై ద్వాదశదివసంబున నేకాదశ దివసకర్తవ్య శ్రాద్ధకరణ పూర్వకంబుగా
శ్రాద్ధకర్మంబు లన్నియు నిర్వర్తించి పరలోకక్రియనుద్దేశించి రత్నంబులు
ను ధనంబును బుష్కలంబైన యన్నంబును దానార్హంబైన భాగసమూహం
బును వస్త్రంబులును గోసహస్రంబులును గృహంబులును దాసదాసీజనం
బులును శయ్యాశకటాద్యుపకరణంబులును బ్రాహ్మణులకొసంగి పదుమూఁడవ
నాఁడు భరతుండు శోకవిశేషంబున రోదనశబ్దాపిహితకంఠుండై విలపింపుచు
నస్థిసంచయనార్థంబు చితామూలంబునకుం జని యందుఁ బితృమరణసంజా
త మహాక్షోభ క్షుభితాంతఃకరణుండై యిట్లనివిలపించె ॥ (తే,గీ) అలఘు
చరితుఁడు మద్భ్రాత యైనరాముఁ । డధిపనీచే వివాసితుఁ, డైనకతన । నతని

—()దగ్ధంబగు దశరథుని శరీరంబుఁ జూచి భరత శత్రుఘ్నులు విలపించుట.()—

యట్లనైన భయదస, త్వావృతమగు । నడవికేను నువిడువంగఁ, బడితిఁ గాదె ॥ (క)

తనకూర్మిఁ బట్టి రాముని । వనగమనముఁ దలఁచి వగఁపు, వదలక తాపం । బునఁ గ్రాఁగుచున్న కౌస । ల్యనువిడిచి త్రివిష్టపమున, కరిగితె తండ్రీ ॥ (వ) అనియి ట్లుబహుప్రకారంబుల దుఃఖింపుచు భస్మారుణంబును బితృశరీర నిర్వాణంబు ను దగ్ధాస్థి యుక్తంబైన చితాస్థానమండలంబవలోకించి రోదనంబు సేయుచు రజ్జు వులచేత నుత్థాప్యమానంబై పరిచ్యుతంబైన మహేంద్రుని యంత్రబద్ధధ్వజం బుచందంబున ధరణిపయిం బడియె నప్పుడు మహర్షులు పుణ్యక్షయకాలంబు నందు స్వర్గచ్యుతుండైన యయాతిం బలె నచ్చటిజనంబులు శుచివ్రతుండై న భరతునిం గ్రుచ్చి యెత్తి తత్కాలోచితవాక్యంబుల ననూనయింపుచుండి రా సమయంబున ॥ (శా) కైకేయీసుతుపాటుఁ జూచి యొడలాకంపింప శత్రుఘ్నుఁ డ । శ్శోకవ్యాకులచిత్తుఁడై వివశుఁడై క్షోణీస్థలిన్వ్రాలి గో । త్రాకాంతుం దల పోసి తద్గుణగణధ్యానంబుఁ గావింపుచు । న్శోకంబెంతయు నంతకంతకు మనః క్షోభంబుఁ గావింపఁగన్ ॥ (వ) ఇట్లని విలపించె ॥ (సీ) రాజేంద్ర మంథరా ప్రభవంబు కైకేయి గ్రాహసంకులము దుర్వారఘోర । వరదానమయమైన నిరుపమశోక సాగరమిట్లు మముఁగీవి, కరణిముంచెఁ । జాలనీచేనుప, లాలితుండ గుసుకుమారుండు బాలుండు, మానధనుఁడు । గురుభక్తియుతుఁడగు, భరతుని విడనాడి యెక్కడఁ జనితి నరేంద్రశేయన ॥ (తే,గీ) పానభోజనమజ్జనాభరణ వస్త్ర । ధారణంబుల యెడమమ్ముఁ దగినభంగి । నరయుచుండుదు వింక సత్కారణంబు పూర్వ । భంగినెవ్వాఁడు రక్షించువాఁడు తండ్రి ॥ (తే,గీ) సకలధర్మవిదుం డవు, సౌఖ్యకారి । వైననినుఁ బాసి నప్పుడే యవనివేయి । పఱియ లైపోవకున్న ది, ప్రళయవేళ । వచ్చినప్పుడైనఁ గ్రుంగిపో, వదు నిజంబు ॥ (క) క్షితినాథుఁడు లోకాంతర । గతుఁడయ్యె రఘూత్తముండు, కాననమునకు । న్వ్రతియై చనె నిఁ క నాకుం । బ్రతుకేటికి నగరమేల, పడియెదనగ్నిన్ ॥ (వ) ఏనుబితృ భ్రాతృ విహీనుండనై శూన్యంబైన పురంబు సొరనొల్లనిచ్చట నుండి వనంబున కరిగెద నని యిట్లు భరతశత్రుఘ్నులేకప్రకారంబునఁ గవగూడి దుఃఖింపుచుండఁ ద దీయ రోదనశ్రవణ సంజాతశోక విశేషంబున నచ్చటిజనంబులెల్ల హాహాకారం బులు సేయుచుండి రప్పుడు భగ్నశృంగంబులైన మహోక్షంబులకై వడి నేలంబ డి పరితపింపుచున్న యక్కుమారులం జూచి వంశగురుండును సర్వజ్ఞుండును బ్ర శస్తస్వభావుండును దీర్ఘదర్శియు నగు వసిష్ఠుండు భరతునిఁ గ్రుచ్చియెత్తి



యాసీనుం గావించి తత్కాలసదృశంబులగు వాక్యంబుల ననూనయింపుచు న ట్లనియె ॥ (తే,గీ) అనఘ మీయయ్య దశరథుండమరపదవి । కరిగి దినములు పదియు మూఁడయ్యె నిప్పుడు । సావశేషాస్థిసంచయ, మందు నీవు । కడఁగి యాలస్యమిటు సేయఁ, గార్యమగునె ॥ (క) జనులకు జన్మము మరణం । బును లాభాలాభములును, మోదము ఖేదం । బను భావ్యములని యెఱిఁగియు । ననఘా నేఁడిట్లు వగవ, నగునే నీకున్ ॥ (క) అని మునిపతి యోగతి న । మ్మనుకులు నిందేర్చునెడ సుమంత్రుఁడు శత్రు । ఘ్నునిఁ గ్రుచ్చి యెత్తి యట్లనె । జనులభవాభవముఁ దెల్పి, సమ్మతిఁ దేర్చెన్ ॥ (వ) ఇట్లు వసిష్ఠసుమంత్రబాహు సముత్థితులై యన్నరకంఠీరవులు వర్షాతపపరిమ్లానంబులగు శక్రధ్వజంబులపోలిక వే ర్వేఱఁ బ్రకాశించి రప్పుడమాత్యులు పరమార్తులును బాష్పపరిమార్జితులును ర క్తాక్షులునునై నయమ్మహారాజనందనులం జూచి యపరక్రియనుద్దేశించి వేగిరపడి నఁ దద్వచనానురూపంబుగాఁ గ్రియాశేషంబంతయు నిర్వర్తించి గృహంబుఁ బ్రవేశించి రంత లక్ష్మణానుజుండగు శత్రుఘ్నుండు రామానయన విచారదో లాందోళితచిత్తుండైన భరతునకిట్లనియె ॥ (సీ) సకలభూతములకు సంకటంబ రుదెంచి నపుడే మహామహుం డరసి ప్రోచు । నట్టి రాఘవుఁడొక్క కట్టడి మగువ చేవనవివాసితుఁడయ్యెఁ దనకు నింత । చెల్లునే జనక వాక్యోల్లంఘనముఁ జేసెఁ గాసలేయుఁడు రాజ్యకాంక్షఁ జేసి । యని దుష్టజనులాడుకొను సన్న సడికోడి యతఁడీయకోనియెఁ బో వితతవీర్య ॥ (తే,గీ) నిరతుఁడగు లక్ష్మణుఁడు తండ్రి ని

### శత్రుఘ్నుఁడు మంథరాకైకేయులఁ బట్టుకొని బెదరించుట.

గ్రహించి । యున్న నేటికి వారింపఁ డయ్యె భరత । యాలిమాటలు విని నీతిమాలి తిరుగు । నవనిపతి నిగ్రహించుట యంతతప్పె ॥ (మ) అనియిబ్భంగి సుమిత్ర పట్టి ఘనవీరాలాపముల్ గైకయీ । తనయుం దుల్కినఁ నాడుచుండ విరిదండ ల్మించి మైపూఁతఁ దా । ల్గను పుట్టంబున వీనభూషణములన్ గైసేసి యాఁడిజను । ల్దను సేవింపఁగఁ గుబ్జయన్నగరి ప్రాగ్ద్వారంబునం దోఁచినన్ ॥ (క) అచ్చటి కావలివా రలు । క్రచ్చఱ నప్పాపినంటఁ గట్టికొని వేసం । బెచ్చి సుమిత్రాసుతుతో । హెచ్చినకోపమునఁ బలికి రిట్లనుచుఁదగన్ ॥ (క) రాముని వనవాసమునకు । భూమీశ్వరు మరణమునకుఁ బుట్టినమూలం । బీమంథర దీనిం దగ । నీమదికిం దోఁచిన ట్లునెఱపుము శిక్షన్ ॥ (ఉ) నావిని కెంపు డాలు నయనంబులఁ గన్పడఁ గ్రుద్ధుఁడై

సుమి । త్రావరపుత్రుఁడెల్ల జనులం బరికించి సుఖావహుఁడైనసీ । తా విభుఁడే
నృశంసికకతంబునఁ గానకు నేగెదానినేఁ । డీవిధిఁ దత్ఫలంబు భుజి యింపఁగఁ జేసె
దఁ జూడుఁడిం దఱుఁగ॥ (మ) అనియిట్లుద్ధతిలక్ష్మణానుజుఁడు క్రూరాలాపముల్ప
ల్కఁగ్ర । క్కున నమ్మంథరఁ బట్టిఁబట్టుటయు నాక్రోశింపుచుం దత్సఖి । జనమ
త్యంతభయంబునం బఱచి కౌసల్యామహాదేవినా । య్యనభక్తిన్శరణంబునొం దెన
నుకంపాయత్తయాఁ గావునన్॥ (సీ) అప్పు డుశత్రుఘ్నుఁ డధికరోషంబున నార
క్తనేత్రుఁడై ఘోరభంగిఁ । గుబ్జనాకర్షించి కుంభినిఁ ద్రేసి కేల్మోడ్చి గావవె యని
యేడ్చుచుండ । నీడ్చుటయు నుదానిఁ బృథుచిత్రభూషణ మణులుర్విఁ బడిననమ్మం
దిరంబు । శారదగగనంబు చందాననొప్పె నిక్కరణిఁ గుబ్జను బట్టి మఱలఁ గ్రోధ॥
(తే,గీ) బలము పెంపునఁ గైకేయిఁ బట్టుకొనఁగ । దారుణోక్తుల బదరినఁ దను
వు వడఁకఁ । బ్రాణభయమున నేడ్చుచుఁ బరువువీడి । సత్వరంబున భరతుని శరణ
మొందె॥ (క) భరతుండీగతిభయమున । శరణాగతయైనయాత్మ జననిం గని
యి । ద్ధరసర్వభూతములలోఁ । దెలివయవధ్యయదిదీనిఁ దెగఁ జూడకుమీ॥ (క)
అనిక్రుద్ధుఁడైన తమ్ముని । దనధర్మసమగ్రవాక్సుధాధారాసే । చనమునఁ బ్ర
శాంతుఁ జేయుచు । నినవంశసమాహితోక్తి నిట్లని పలికెన్॥ (క) మనమీకైకను
గుబ్జను । జనదూషితవృత్తలనుచుఁ జంపితిమేని । న్ఘనధార్మికుఁడగు రాముఁ
డు । గనివిడువఁడే మనలమాతృఘాతకులనుచున్॥ (క) అనవుడు భరతుని వా
క్యము । వినిశత్రుఘ్నుండు ఘనవివేకముతోఁ గ్ర । క్కునఁ గైకేయిని గుబ్జను । ద
నవంశోచితనయంబుఁ దలఁపుచు విడిచెన్॥ (క) విడిచిననప్పుడఁతుకవగ । ప
డఁగనశ్వపతిపుత్రి యంఘ్రిద్వయిపైఁ । బడి నిట్టూర్పులు పుచ్చుచుఁ । గడువడి

()భరతుఁడు రాజాభిషేకకర్తలతో రామునకే యభిషేకముఁ గావించెదననుట.()

విలపించెశోకకంపితమతియై॥ (వ) ఇట్లు శత్రుఘ్నవిక్షేపమూఢసంజ్ఞయై భ
యత్రస్తయైన క్రౌంచాంగనభంగి నార్తరూపయై దీనస్వరంబున దుఃఖింపు
చున్న మంథరం జూచి కైకేయి బహుప్రకారంబుల నాశ్వాసించె నంత బదునా
లవనాఁడు సూర్యోదయసమయంబున రాజ్యాభిషేకకర్తలు భరతునొద్దకుం జ
నుదెంచి యిట్లనిరి॥ (ఉ) భూపతి రామునిన్వెపిన భూమికిఁ బంచి తదీయశోక
పం । తాపమహావ్యథం బిదపఁ డాఁద్రిదివంబున కేగెనింకగో । త్రాపరిపాలనవ్ర
తముఁ జాల్పుమనాయకమయ్యె రాజ్యమి । ట్లేపుననింతదాఁక నశియింపకయు



న్నది దైవికంబునన్॥ (ఉ) ఎప్పుడువచ్చుఁ గైకకొడు కెప్పుడు మాకు విభుండు గ
ల్గునం । చెప్పుడు నీదురాకఫురి నెల్లజనంబులు గోరుచున్నవా । రిప్పుడె సర్వరా
జ్యపదమింపుగఁ గైకొని పూర్వవృత్తముం । దప్పకయుండ నింకమము దాశరథీ
కృపనేలుమి త్తఱిన్॥ (వ) అనిన దృఢవ్రతుండగు భరతుండు పట్టాభిషేకోప
యుక్త మంగళద్రవ్యజాతంబు వలగొని వారలకిట్లనియె॥ (క) రాజకులమున
కు జ్యేష్ఠుని । రాజత్వంబుచితమనితి రంబుగమీర । ల్రాజచరిత్రం బెఱిఁగియు । రా
జితుఁడనినన్ను మదిఁ దలంచుట తగవే॥ (ఆ,వె) రాజసమ్మతుండు రఘుకులతి
లకుండు । రాముఁడన్నయగుట రాజుధరణి । కతని పూనిక్కఁ బూని యడివిలో
నొక్కెఁడ । నధివసించువాఁడ నన్నియేండ్లు॥ (చ) అఱమరయింత లేక చతురం
గబలంబులఁ గూర్పుఁడెల్లి త । త్పరతఘనాభిషేచనికభాండముఁ గైకొని కాన

*భరతుఁడు వనములలో మార్గాదికములఁ బరిష్కరించుట కాజ్ఞాపించుట.*

కేగిసు । స్థిరమతి నందె రామునభిషిక్తునిఁ జేసి కడంగి వీటికి । ధ్వరమునను౦డి పా
వకు ధ్రువంబుగఁ దెచ్చినభంగిఁ దెచ్చెదన్॥ (తే,గీ) రామునీరీతిఁ బుడమికి రా
జుఁ జేసి । యేనువనదుర్గమున వసియింతునింక । మీఁదఁ గైకను గామసమేత
గాఁగఁ । బూనికావించుకోరిక లేనికతన॥ (క) తెరువులు సుకరంబులుగాఁ ।
దరంగిణీగణము సుప్రతరముగ వనము । ల్గరము ప్రకాశములుగ స । త్వరముగఁ
గావింపుఁడిపుడు తడవేమిటికిన్॥ (క) అని శ్రీమంతముహృద్యం । బనుత్తమము
సుప్రసన్నమగుభాషితమీ । యనువునఁ బలికిన భరతున । కనియె నచటి జనము
సంభృతానందమునన్॥ (క) అనఘా జ్యేష్ఠుండగు నృప । తనయునకు ధరిత్రినొ
సఁగఁ దలఁచినకతనన్ । నినుఁ బొందు నిక్కువంబుగ । వనరుహపాణియగు ల
క్ష్మీవారనికరుణన్॥ (క) అనియిట్లు పూర్ణసమ్మద । జనితములగు బాష్పబిం
దుసందోహములా । తనిపైఁ గురియఁగఁ గౌతుక । మునసగ్గిం చెందదీయ ముఖ్య
గుణంబుల్॥ (వ) అంత భరతుని శాసనంబున నమాత్యప్రచోదితులై సర్వం
బును మకట్టి భూమిప్రదేశజ్ఞులును శిబికాదినిర్మాణంబునం దుసూత్రగ్రహ
ణకుశలురును దంతువాయులును స్వకర్మాభిరతులగు ఖననోపజీవులును
మృగపక్షిసాధన యంత్రకర్తలును భృతిజీవులును స్థపతులును రాజపురుషు
లును క్షేపణీయాది యంత్రకరణాభిజ్ఞులును జలయంత్రాది నిర్మాణచతురు
లును వర్ధకులును మార్గసమీకరణసమర్థులును మార్గనిరోధకవృక్ష

సుమి । త్రావరపుత్రుఁ డెల్ల జనులం బరికించి సుఖావహుండైనసీ । తా విభుఁడే
నృశంసికకతంబునఁ గానకు నేగెదానినేఁ । డీవిధిఁ దత్ఫలంబు భుజి యింపఁగఁ జేసె
దఁ జూడుఁ డిందఱుఁ॥ (మ) అనియిట్లుద్ధతిలక్ష్మణానుజుఁడు క్రూరాలాపముల్ప
ల్కఁగ । కున్నన నమ్మంథరఁ బట్టెఁ బట్టుటయు నాక్రోశింపుచుం దత్సఖీ । జనమ
త్యంతభయంబునం బఱచి కౌసల్యామహాదేవినా । య్యనభక్తిన్మరణంబునొం దెన
నుకంపాయత్తయాఁగా పున్॥ (సీ) అప్పు డుశత్రుఘ్నుఁ డధికరోషంబున నార
క్తనేత్రుఁడై ఘోరభంగిఁ । గుబ్జనాకర్షించి కుంభినిద్రేసికే ల్మోడ్చి గావ వె యని
యేడ్చుచుండ । నీడ్చుటయును దానిఁ బృథుచిత్రభూషణ మణులుర్విఁ బడిన నమ్మం
దిరంబు । శారదగగనంబు చందాననొప్పె నిక్కరణిఁ గుబ్జను బట్టి మఱలఁ గ్రోధ॥
(తే,గీ) బలము పెంపునఁ గైకేయిఁ బట్టుకొనఁగ । దారుణోక్తుల బదరినఁ దను
వు వడఁకఁ । బ్రాణభయమున నేడ్చుచుఁ బసువువీడి । సత్వరంబున భరతుని శరణ
మొందె॥ (క) భరతుండీగతి భయమున । శరణాగతయైనయాత్మ జననిం గని
యి । ద్ధర సర్వభూతములలోఁ । దెఱవ యవధ్య యదిదీనిఁ దెగఁ జూడకుమీ॥ (క)
అనిక్రుద్ధుఁడై నతమ్మునిఁ । దనధర్మసమగ్ర వాక్సుధాధారాసే । చనమునఁ బ్ర
శాంతుఁ జేయుచు । నినవంశసమాహితోక్తి నిట్లని పలికెన్॥ (క) మన మీకైకను
గుబ్జను । జనదూషితవృత్తలనుచుఁ జంపితిమేని । ఘ్ననధార్మికుఁడగు రాముఁ
డు । గనివిడువఁడె మనల మాతృఘాతకులనుచున్॥ (క) అనవుడు భరతుని వా
క్యము । వినిశత్రుఘ్నుండు ఘనవివేకముతోఁ గ । కున్నఁ గైకేయిని గుబ్జను । ద
నవంశోచితనయంబుఁ దలఁపుచు విడిచెన్॥ (క) విడిచిన నప్పడఁతుక వగ । ప
డరఁగ నశ్వపతిపుత్రి యంఘ్రిద్వయిపైఁ । బడి నిట్టూర్పులు పుచ్చుచుఁ । గడువడి
()భరతుఁడు రాజాభిషేకకర్తలతో రాముని కేయభిషేకముఁ గావించెదననుట.()
విలపించె శోక కంపితమతియై॥ (వ) ఇట్లు శత్రుఘ్నవిక్షేపమూఢసంజ్ఞయై భ
యత్రస్తయైన క్రౌంచాంగనభంగి నార్తరూపయై దీనస్వరంబున దుఃఖింపు
చున్న మంథరం జూచి కైకేయి బహుప్రకారంబుల నాశ్వాసించె నంత బదునా
లవనాఁడు సూర్యోదయసమయంబున రాజ్యాభిషేకకర్తలు భరతునొద్దకుం జ
నుదెంచి యిట్లనిరి॥ (ఉ) భూపతి రాముని న్విపిన భూమికిఁ బంచి తదీయశోక
పం । తాపమహావ్యథం బిదపఁ దాఁ ద్రిదివంబునకేగె నింకఁ గో । త్రాపరిపాలనవ్ర
తముఁ దాల్పు మనాయకమయ్యె రాజ్యము । ల్లోపునని౦త దాఁక నశి యింపక యు



న్నది దైవికంబున్॥ (ఉ) ఎప్పుడు వచ్చుఁ గైకకొడు కెప్పుడు మాకు విభుండు గ
ల్గునం । చెప్పుడు నీదురాక పురి నెల్లజనంబులు గోరుచున్నవా । రిప్పుడె సర్వరా
జ్యపదమింపుగఁ గైకొని పూర్వవృత్తముం । దప్పక యుండ నింకమము దాశరథీ
కృపనేలుమిత్తఱిన్॥ (వ) అనిన దృఢవ్రతుండగు భరతుండు పట్టాభిషేకోప
యుక్త మంగళద్రవ్యజాతంబు వలగొని వారలకిట్లనియె॥ (క) రాజకులమున
కు జ్యేష్ఠుని । రాజత్వంబుచితమని తిరంబుగ మీర । ల్రాజచరిత్రం బెఱిఁగియు । రా
జితుఁడనినన్ను మదిఁ దలంచుట తగవే॥ (ఆ,వె) రాజసమ్మతుండు రఘుకులతి
లకుండు । రాముఁ డన్నయగుట రాజు ధరణి । కతని పూనికఁ బూని యడివిలో
నొక్కఁడ । నధివసించువాఁడ నన్నియేండ్లు॥ (చ) అఱమఱయింత లేక చతురం
గబలంబులఁ గూర్పుఁ డెల్లి త । త్వరతఘనాభిషేచనికభాండముఁ గైకొని కాన

*భరతుఁడు వనములలో మార్గాదికములఁ బరిష్కరించుట కాజ్ఞాపించుట.*

కేగి సు । స్థిరమతినందె రామునభిషిక్తునిఁ జేసి కడంగి వీటికి । ధ్వరమునను౦డి పా
వకుధ్రువంబుగఁ దెచ్చిన భంగిఁ దెచ్చెదన్॥ (తే,గీ) రాము నీరీతిఁ బుడమికి రా
జుఁ జేసి । యేను వనదుర్గమున వసియింతు నింక । మీఁదఁ గైకను గామన మేత
గాఁగఁ । బూనికావించుకోరిక లేనికతన॥ (క) తెరువులు సుకరంబులుగాఁ ।
దరంగిణీగణము సుప్రతరముగ వనము । ల్గరము ప్రకాశములుగ స । త్వరముగఁ
గావింపుఁడిపుడు తడవేమిటికిన్॥ (క) అని శ్రీమంతము హృద్యం । బనుత్తమము
సుప్రసన్నమగు భాషితమీ । యనువునఁ బలికిన భరతున । కనియె నచటి జనము
సంభృతానందమునన్॥ (క) అనఘా జ్యేష్ఠుండగు నృప । తనయునకు ధరిత్రినొ
సఁగఁ దలఁచిన కతనన్ । నినుఁ బొందు నిక్కువంబుగ । వనరుహపాణి యగుల
క్ష్మీ వారనికరుణన్॥ (క) అని యిట్లు పూర్ణసమ్మద । జనితములగు బాష్పబిం
దుసందోహములా । తని పైఁ గురియఁగఁ గౌతుక । మునవగ్గించెం దదీయ ముఖ్య
గుణంబుల్॥ (వ) అంత భరతుని శాసనంబున నమాత్యప్రచోదితులై సర్వం
బును మకట్టి భూమిప్రదేశజ్ఞులును శిబికాదినిర్మాణంబునందు సూత్రగ్రాహ
ణకుశలురును దంతువాయులును స్వకర్మాభిరతులగు ఖననోపజీవులును
మృగపక్షిసాధనయంత్రకర్తలును భృతిజీవులును స్థపతులును రాజపురుషు
లును క్షేపణీయాది యంత్రకరణాభిజ్ఞులును జలయంత్రాదినిర్మాణచతురు
లును వర్ధకులును మార్గసమీకరణసమర్థులును మార్గనిరోధకవృక్ష

*భరతనియుక్తులగు కర్మకారులు వనంబున రాజమార్గంబుఁ గావించుట*
చ్ఛేదకులును గూపకారులును సుధాకారులును వంశకర్మకారులును మా
ర్గప్రదర్శకులును మొదలుగాఁగల సకలజనంబులు రామసందర్శన కుతూ
హలత్వంబువలనఁ బర్వకాలంబునందలి సముద్రుని మహావేగంబుకరణి శోభిల్లు
చుఁ దమవారింగూడికొని వివిధపిటకఖనిత్రకుఠారాదిసాధనంబులు పరిగ్రహిం
చుకొని రామాధిష్ఠితప్రదేశంబు నుద్దేశించి ముంగలఁజని రందుఁ గొందఱు
మార్గనిరోధకంబులగు శాఖాలతాగుల్మస్థాణువృక్షంబులు కుఠారటంకదా
త్రంబులనఱకుచు వృక్షరహితప్రదేశంబుల వృక్షంబులఁ బ్రతిష్ఠింపుచుఁ గొంద
ఱుబలవంతులు విషమభూప్రదేశములకుంజని తత్రత్య మహోన్నతోశీరజాతి
తృణవిశేషంబుల ఛేదింపుచుఁ గొందఱు మిఱ్ఱుపల్లంబు సమతలంబు సేయుచుఁ
గొందఱు వాపీకూపంబులు పూడ్చుచుఁ గొందఱు బంధనీయంబులైన పల్వల
క్షుద్రనదీ దుర్గమప్రదేశంబులు సేతువులబంధింపుచు క్షోద్యంబులైన క్షుద్ర
శిలా భూయిష్ఠప్రదేశంబులు చూర్ణంబులుసేయుచు భేదనీయంబులైన నదీ
తటాకాది జలప్రదేశంబుల జలదుర్గమార్గంబు భేదింపుచుఁ గొందఱుస్వ
ల్పప్రవాహంబుల బంధనంబులచేత బహుసలిలంబులంగావించుచుఁ గొందఱు
నిర్జలప్రదేశంబులయందు బహువిధవేదికా పరిమండితకూపంబులు ద్రవ్వు
చు నిట్లనేకప్రకారంబుల నయ్యైప్రదేశంబులు రమ్యంబులుగావించిన నాసేనా
మార్గంబు సుధాలిప్తనిబద్ధభూప్రదేశంబును బుష్పితమహీరుహంబును మ
దోద్ఘుష్టద్విజగణంబును ధ్వజపతాకాలంకృతంబును జందనోదక సంసిక్తంబు
ను నానాకుసుమ భూషితంబునై స్వర్గపంథబు చందంబుననొప్పె నంత భ
రతుని శాసనంబున శిబిరాదికరణనియుక్తులు పరస్పర సంగతులై బహుస్వా
దుఫలోపేతంబులైన రమణీయప్రదేశంబులయందు మహాత్ముండగు భరతుం
డు నివసించుటకు శుభనక్షత్ర ముహూర్తంబులయందు శిబిరంబులు నిర్మిం
చిన నవి భూషణసదృశంబులయ్యెను వితానకలశధ్వజాదులచేత మిక్కిలి భూ
షితంబులై దృష్టిచిత్తహారంబులై పాంసుసదృశసికతామయపరిఘాలంకృతంబు
లై యింద్రకీలాద్రిప్రతిమంబులై ప్రతోళీపరిశోభితంబులై ప్రాసాదమాలాసం
సక్తంబులై సౌధప్రాకారసంవృతంబులై పతాకాధ్వజశోభితంబులై సునిర్మి
తమహాపథంబులై గృహకపోత పాలికోపరివినిర్మిత మహోన్నతశిరోగృహా



లంకృతంబులై శక్రపురోపమంబులై యొప్పె నివ్విధంబున వివిధద్రుమకాన
నశీతనిర్మల పానీయమహామీనసమాకులయైన జాహ్నవీనది పర్యంతంబు శు
భశిల్పినిర్మితంబైన రాజమార్గంబు చంద్రతారాగణమండితంబైన రజనీ
నభంబుభంగి నతిరమ్యంబై ప్రకాశించెనంత ॥ (క) నాందీముఖియగు యా
మిని । యందు రహినుస్సూతమాగ, ధాదులుపరమా । నందమున భరతునిఁ
బొగడి । రందంద శుభస్తవము ల,నతినైచిత్రిన్ ॥ (తే, గీ) స్వర్ణదండాభిహ
తములై,చటులయామ । దుందుభులు మ్రోసె మురిగొద,ల్గిందుకొనియె ।మ
ఱియు నుచ్చావచస్వనో,త్కరములైన । వాద్యములఘోరు కలిగెన,వ్యక్తఫ
ణితి ॥ (క) ఆతూర్యరవము సకలా । శాతలముల నిండిశోక,సంతాపముచే
వీతధృతియైన భరతుని । నాతతదుఃఖమునమఱల,నారట పెట్టెన్ ॥ (తే,గీ)
అంత భరతుండు నేను,మీకధివిభుండఁ । గాను మీరేల నన్నింత,గలఁచెదరని ।
వారివారించి శ్రుతకీర్తి, వరునిఁగాంచి । కనులనశ్రులు గారని,ట్లనుచుఁ బలి
కె ॥ (క) పాపపుఁ గైకయి చేసిన । పాపంబున వ్యథయు మహాదు,పక్రో
శంబు । న్నాపై నిడితానక్కట । భూపాలుఁడు నాకమునకుఁ, బోయెంగంటే॥
(క) సుగుణుండు ధర్మరతుఁడగు । జగతీపతి రాజ్యలక్ష్మి,జలమధ్యమునం ॥
దగఁ గర్ణధారహీనం । బగు పోతము కరణినిట్ల,హాసుడి వడియెన్ ॥ (క)
మనకెవ్వాఁడు విభుండ । య్యనఘుండగు రామభద్రుఁ, డాకైకయిచేఁ । దన
కుండా నెవనంబున । కనుపంబడియెఁ గదయపగ,తైశ్వర్యుండై ॥ (వ) అని
బహుప్రకారంబుల విలపించుచు మూర్ఛితుండైన భరతునింగని యంతఃపుర
కాంతలు సుస్వరంబుగా రోదనంబుచేసిరంత రాజధర్మవిశారదుండగు వసి
ష్ఠుండు శాతకుంభమయంబును రమ్యంబును మణిరత్నసమాకులంబు నగు ని
క్ష్వాకునాథుని సభామంటపంబునకు శిష్యసహితంబుగాఁ జనుదెంచియందుఁ
బరార్థ్యాస్తరణ సంవృతంబైన కాంచనపీఠంబున నధివసించి బ్రాహ్మణక్షత్రి
యవైశ్యులను మంత్రిసేనానాయకులను భరతశత్రుఘ్నసుమంత్రులనుదోడ్కొ
నిరమ్మని దూతలంబంచిన వారట్లకావింప గజాశ్వరథ సంఘటన సంజాతమ
హాఘోషంబు భూనభోంతరాళంబు నిండఁజెలంగె నప్పుడు ప్రకృతిజనంబులు
సభామంటపంబునకుం జనుదెంచుచున్న భరతునింజూచి దేవతలు శతమఖు
నింబోలె నభినందించిరాసమయంబునఁ దిమినాగసంవృతంబును స్తిమితజలం

బును మణిశంఖశర్కరంబును నగు హ్రదంబుచందంబున నందంబై తత్సభాసదనంబు దశరథసుతశోభితంబై తొల్లి దశరథశోభితంబైనయట్ల ప్రకాశింపుచుండె.

—(*)వసిష్ఠుఁడు భరతునితో రాజ్యం బంగీకరింపుమని చెప్పుట.(*)—

నంత భరతుండార్యగణసంపూర్ణయగు సభను బూర్ణచంద్రుండు శుక్రబృహస్పతి ప్రముఖప్రకృష్ట గ్రహయుక్తయైన శర్వరింబోలె వెలింగించె నిట్లు రుచిరాసనాసీనులగు నార్యుల వస్త్రాంగరాగప్రభాద్యోతితయైయాసభ ఘనాపాయంబునందుఁ బూర్ణచంద్ర ప్రద్యోతితయైన రాత్రిచందంబునం దేజరిల్లె నప్పుడు మునిశ్రేష్ఠుండగు వసిష్ఠుండు సభాసదులందఱు వినుచుండ భరతునకిట్లనియె॥ (సీ) ధరణీశనందన, ధనధాన్య వతియైన ధారుణినీకిచ్చి, దశరథుండు। విఖ్యాతమగుశక్ర, విష్టపంబునకేఁగె రాముండు రాజధర్మజ్ఞుఁడతని। యానతి వనమున, కరిగెనీవిఁకఁబితృ భ్రాతృదత్తంబైన, రాజ్యమిప్డు। గైకొనివినిహత,కంటకంబుగ నేలు మనఘ ప్రత్యేకసింహాసనాధి॥ (తే,గీ) నాథులగు ప్రాచ్యులును దాక్షి, ణాత్యులును బ్ర। దీచ్యులును దీచ్యులు సముద్ర,దేశవాసు। లమితధనరత్న రాసుల, నధికభక్తి। కరములర్పించి గొల్చుచుం, దురు మహాత్మ॥ (ఉ) నావుడు ధర్మవిత్తముఁడ,నంబొగడందగు కైకయీసుతుం। డావచనంబు కర్ణపుట, మంటిన యంతనె శోకమూర్ఛితుం। డై వెసఁదెల్విఁ దాల్చిగురు, నర్మిలి దూరుచు ధర్మకాంక్షుసీ। తావిభునిందలంపుచుఁ బ,దంపడికన్నుల నీరునించుచున్॥ (వ) శోకగద్గదకంఠుండై కలహంసస్వరంబునఁ గొండొకసేపువిలపించి పురోహితునుద్దేశించి॥ (సీ) అనఘవిద్యాస్నాతుఁ,డాచరితబ్రహ్మచర్యుండుధీమంతుఁ,డార్యవినుతుఁ।డహర్ధర్మవిచారుఁ,డగు రామవిభునిరాజ్యంబుమాదృశుఁడెవ్వఁ, డపహరించు। దశరథునకుఁ బుట్టి,ధర్మంబునకుఁ దప్పి భ్రాతృరాజ్యంబు నే,భంగిఁగొందు। రాజ్య మేనును లచ్చి,రాముని సొమ్ముగా భావించి ధర్మంబుఁ, బలుకవైతి॥ (తే,గీ) జ్యేష్ఠుఁడును ధర్మ సంవేది, శ్రేష్ఠుఁడాది। రాజనహుషోపముండగు, రాఘవుండు। దశరథుని యట్లనాధిపత్యంబు సేయ। వలవదే శాశ్వతంబుగ, వసుధకెల్ల॥ (ఆ,వె) విను మనార్యజుష్ట మనుచితంబగు పాప। మేను జేయనోప, నీయకొనిన। రఘుకులప్రఖ్యాత,రాజులలో వంశ। పాంసనుండఁగానె, పలుకులేల॥ (తే,గీ) కైకచేసిన యపరాధ, కార్యమునకు। నీయకొనఁజాలనిప్పుడె, యిచటనుండి। దా



రుణారణ్యాగతుఁ డగు, దాశరథికిఁ। జాఁగిలినమస్కరింతుహ,స్తములు మోడ్చి॥ (క) రామునిఁ దోడ్కొని వచ్చుట। కీమెయిఁజనువాఁడ నతఁడ,హీనగుణాఢ్యుం। డీముల్లోకములైన న। సామాన్యప్రౌఢి నేలఁ,జాలుమహాత్మా॥ (క) అని ధర్మమూఁది పలుకుచుఁ। దనవాక్యము లాలకించి,తద్దయుఁబరి

(*)భరతుఁడు వసిష్ఠునితో శ్రీరాముఁడే రాజ్యాధిపతి కావలయు ననుట. (*)

షజ్జనము పులకింపుచుండఁగ। మునిపతి కనియెం బ్రసన్న,ముఖుఁడై వత్సలన్॥ (ఉ) వర్ధితధర్మకీర్తి రఘు,వర్యుని రాముని సాధుసన్నిధిం। బ్రార్థనఁ జేసి క్రమ్మఱఁ బు,రంబునకున్వెసఁ దోడితెత్తు న। య్యర్థము గాక తక్కనజ,టాజినముద్ధరియించి కానలో। సార్థకవృత్తి లక్ష్మణుని,చాడ్పున రామునిఁ గొల్చియుండెదన్॥ (వ) పురోహితామాత్య బాంధవు లందఱు వినుచుండ నానేర్చు విధంబున సర్వోపాయంబుల బలాత్కరించి రామునిఁ బురంబునకుం దోడ్కొని వచ్చెద॥ (క) ఇంతకుమును ఖనికులు క। ర్మాంతికులునుమార్గశోధ,కాదులు నాచే। నెంతయుఁ బ్రయుక్తులై చను। టంతయుమీ రెఱుఁగరయ్యె,యాత్రాభిరతిన్॥ (వ) అని యిట్లు వసిష్ఠునితోఁ దగిన తెఱంగునఁ బ్రత్యుత్తరం బిచ్చి సమీపంబుననున్న మంత్రకోవిదుండగు సుమంత్రు నవలోకించి నీవు మదీయ శాసనంబునఁ బురంబులోన యాత్ర సాటించి బలంబుల నాయితంబుగావింపు మనిన నతండట్ల గావించినఁ దత్క్షణంబ బలాధ్యక్షులును బౌరులును సమాజ్ఞప్తయైన బలయాత్ర నాకర్ణించి సంప్రహృష్ట చిత్తులై రప్పుడు యోధాంగనలందఱు యాత్రాగమనంబు విని పరమానందభరితాంతఃకరణలై సత్వరంబునఁ దమతమ వల్లభులం బ్రయాణంబున కుద్యుక్తులం జేసిరి బలాధ్యక్షులు హయగోరథస్యందనశకటమాతంగంబులచేత సజ్జంబైనచమూసమూహంబునుం బ్రచోదించి రంత భరతుండు గురుసన్నిధి యందు సుమంత్రుం జూచి రథంబాయత్తంబుఁ జేసి తెమ్మనిన నతండు తద్వచనానురూపంబుగా జవసత్వసంపన్నంబులైన హయంబులం బూన్చి సజ్జంబుఁ జేసి తెచ్చిన

—(*) భరతుఁడు సైన్యసమేతంబుగఁ బయనంబై వెడలుట. (*)—

దానిం బ్రదక్షిణపూర్వకంబుగా నారోహించి రామదర్శనలాలసుండై సైన్యసమేతంబుగా వెడలె నప్పుడు సుమంత్రచోదితులై పురంబునం గల బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులును బుత్ర మిత్ర కళత్ర భ్రాతృ సమేతంబుగా యథా

హార్హ యానంబులెక్కి యతని పిఱుందం జనిరి మంత్రిపురోహిత సామంత బంధు సుహృజ్జనంబులనేకశతాంగమాతంగతురంగంబులెక్కి భరతుని యగ్రభాగంబునం బోవుచుండిరి కౌసల్యయుఁ సుమిత్రయుఁ గైకయుఁ దక్కిన యంతఃపుర కాంతలు రామానయనసంహృష్టలై భరతనియోగంబునం జనుచుండి రివ్విధంబున (తే.గీ) భరతశాసనమున రామభద్రుఁ జూడఁ । గలిగెనని మేనఁ బులకలు,గ్ర మ్ముదేర । వేయిభంగుల భరతుని, వెంటఁ జనిరి । వీరువారననేమిటి, వీటివారు॥ (సీ) సజలనీలాంబుద, శ్యామకోమలగాత్రు రాకాసుధాకరోల్లాసివదను। రవికరోద్దీపిత,రాజీవతామ్రాక్షు నాజానుబాహుమ, హానుభావు। రమణీయగళుమహోరస్కుమహేష్వాసు సుకపోలు సులలాటు సుగుణజాలు । స్థిరసత్త్వుఁజారునాసి,కుదృఢవ్రతు గూఢజత్రు సుదంష్ట్రుఁబ్ర,సన్నతేజుఁ ॥ (తే.గీ) గౌసలేయుని నెప్పుడు, గాంచఁగలుగు । నెపుడు భాషింపఁగలుగు న' వ్విపులయశునిఁ । జూచినంతనె చనుఁగాదె, శోకమినునిఁ । గాంచినంతనె విరియు చీఁకటులకరణి ॥ (వ) అని బహుప్రకారంబుల రాముని మహిమంబులు వక్కాణింపుచుఁ దద్దర్శనలాలసులై హర్షవిశేషంబున నన్యోన్యాలింగనంబుఁ గావింపుచుఁ బెన్నిధి కడకుం జను పేదలచందంబునం జనిరప్పుడు పురంబునం గల గజంబులలోనఁ దొమ్మిదివేలగజంబులు నఱువదివేల రథంబులును లక్షగుఱ్ఱంబులును భరతుని పిఱుందం జనియె ముక్తాపద్మరాగాది మణిసంస్కారకులును గుంభకారులును సూత్రకర్మకాదులైన తంతువాయాదులును శస్త్రనిర్మాణోపజీవులును మయూరపింఛచ్ఛత్ర వ్యజనాదికారులును గరపత్త్రోపజీవులును దంతకుడ్య వేదికాది కాంత్యుత్పాదకులును దారురత్నాది రంధ్రకారులును దంతమయపుత్త్రికాపీఠ శిబికాదికారులును సుధాలేపన కర్మకారులును జందనకస్తూరికాది సుగంధద్రవ్యోపజీవులును దైలాభ్యంగనాది స్నానకారులును గంబళధావకులును నుద్వర్తన కారులును వైద్యులును ధూపాది వాసకులును మద్యకారులును రజకులును గ్రామస్థ జనమేళకర్తలును శైలూషులును గైవర్తకులును వేదవిదులైన బ్రాహ్మణులును మొదలుగాఁగల నాగరికులందఱుఁ దామ్రమృష్టానులేపనులును శుద్ధవస్త్రధారులును సువేషాఢ్యులునై పుత్త్రదారాదులం గూడుకొని గోరథాది యథార్హ యానంబులెక్కి మఱదనగం



## (*)భరతుఁడు గంగానదిఁ జేరుట.(*)

బున భరతుని వెనుకం బోవుచుండిరి యిత్తెఱంగునం జనిచని యెచ్చట రామసఖుండగు గుహుండు బంధుసహితంబుగా నివసించియుండునట్టి శృంగిబేరపుర సమీపంబునకుం జని యందుఁ జక్రవాకోప శోభితంబగు గంగానదీసమీపంబున సైన్యంబు విడిసె నప్పుడు గంగానది విలోకించి భరతుండు సచివునకిట్లనియె॥ (చ) బలముల నిచ్చటం దివియఁ, బంపుఁడు నేఁడిట విశ్రమించి స । ల్లలితజలంబులం దగని,లాపతికౌర్ధ్వదైహిక మాచరించిని । శ్చలమతి నెల్ల వేకువనె,చయ్య ననీనది దాఁటిపోదము । త్యలఘు పరాక్రమ క్రమున, నస్త్రశిలీముఖు రాముఁ జూడఁగన్ ॥ (చ) అనవిని యట్లగాకయని,యందఱుఁ బావన జాహ్నవీతటంబునఁ జతురంగసైన్యముల, మోదముతో విడియించి మించిభా । రనిరతులై యథార్హశిబిరంబుల నుండిరి కార్యచింతన । మ్మనుకులవర్ధనుండుచితమందిరమందు వసించె నంతయున్ ॥ (వ) అంతభరతుని రాక యెఱింగి నిషాదనాథుండగు గుహుండు తనవారి నందఱ రావించి గంగాతీరంబున సాగరసంకాశంబై యనంతంబై మనంబునకైన నచింత్యంబైయున్నది రథంబునందుఁ గోవిదారధ్వజంబు కనుపట్టుచున్నది గావున ॥ (మ) ధనకోశంబును దుర్గముల్బలము హృద్యంబైన సామ్రాజ్యముం । దనపాల్చేసి పితృఘ్నణమీఁగుటకుఁ గాంతారోర్వి వర్తింపఁబో । యిన నామిత్త్రుని రామభద్రుమఱల న్హింసింప సాటో

—(*)గుహుఁడు భరతునిఁ గూర్చి శంకించి తనవారితో నాలోచించుట.(*)—

పుఁడై । పనిగా నేగెడు సేనతో భరతుఁడీ,పాపాత్మునింగంటిరే ॥ (చ) ఇతఁడు దురంతవిక్రముఁడ, హీనభుజాబల శాలివీనిను । ద్ధతభుజ సత్త్వయుక్తి నరికట్టఁదలంచితిమేని క్రుద్ధుఁడై । యతుల శరోద్ధతిన్మనల, నందఱఁ గాఱియ పెట్టుఁ గానమీ । రతిశయ యుక్తి నొక్కమొగి నడ్డము పెట్టుఁడు నోడ రేవులన్ ॥ (చ) అనఘుఁడు సత్యవాది చరితార్థుఁడు రాఘవుఁ డెల్లభంగుల । న్మనకు విభుండు మిత్త్రుఁడతి మాన్యుఁడుగావున నాత్రిలోకపూ । జ్యునకొక హానియుం బొరయకుండు విధంబునఁ గావఁబోలు మీ । రనుపమబుద్ధి నాకఱపి నట్లయొనర్పుఁడు కర్ణధారకుల్ ॥ (వ) మఱియు మాంసమూలఫలాశనులగు నదీరక్షకులు బలవంతులు గూడికొని యేనూఱువాడల యందొక్కొక్క వాడకుఁ బ్రత్యేకంబుగాఁ గైవర్తకశతంబు నిలుచునట్లుగా సంఘటించి స్వబలంబులం గూడి

పోతారోపిత మధుమూలఫలాదికుఁడై తీర్థప్రదేశంబు రక్షింపుచుండుఁడు ॥ (క) అని వారివారి నగ్నెయ్యి । పనులకు నియమించిరుచ్య ఫలములు మధువుల్ । ఘనమాంసముఁగానుకఁగొని । పనివడి తానరిగె గుహుఁడు, భరతునిఁ జూడన్ ॥ (తే,గీ) ఇత్తెఱంగునఁ దమకడ, కేగుదెంచు । గుహుని నల్లంతటనెచూచి, గుణమనీష । నంజలి ఘటించి నయవినయజ్ఞుఁడైన । సూతపుత్రుండు భరతునిఁ జూచిపలికె ॥ (క) అనఘాయావచ్చునిషా । దనాయకుఁడు రామసఖుఁడు, తడయక మిముఁగ । న్గొన వచ్చుచున్న వాఁడీ । యనఁ జెప్పఁబడియున్న కందువది దెలియనగున్ ॥ (క) నావిని భరతుఁడు సంతో । షావిష్కృత చిత్తుఁడగుచు, న

## —(*) గుహుండు భరతునిఁ జూడనరుగుట. (*)—

తనిరయమున్ । రావించుమనవుడుఁ దదా । జ్ఞావిధి సూతుండు సమ్ముఖంబు ఘటించెన్ ॥ (వ) ఇవ్విధంబున ననుజ్ఞాతుండై గుహుండు జ్ఞాతి సమేతంబుగా భరతు నొద్దకుం జను దెంచి నమస్కరించి దేవా యీదేశంబు నీకు గృహారామభూతంబు భవద్గమనా నివేదనంబున వంచితుల మైతి మేమందఱము భవదధీనులము గావున స్వకీయంబైన దాసకులంబునందు నివసింపుమని విన్నవించె దమనిపలికి వెండియు నిట్లనియె ॥ (తే,గీ) ఆర్ద్రశుష్క ముచ్చావచంబగు పలలము । మృష్టఫలములు మధువుఁ బరిగ్రహించి । యిచట నేఁడెల్ల వసియించి, యెల్లి తెల్ల । వాఱినంతనె యరుగుము, బలయుతముగ ॥ (క) అని సౌహార్దవిశేషం । బునఁ బలికెడు గుహునివచన, ములువిని వదనం । బున దైన్యము దోఁపఁగనా । తనితో హేత్వర్థ సంహితంబుగఁ బలికెన్ ॥ (వ) పరమ సఖా నీ వొక్కండవె యీదృశంబగు సైన్యంబు నభ్యర్చింప నిశ్చయించితివి కావున రామునియందు నీకుంగల భక్తిస్నేహంబులెల్ల వారికిఁ దెల్లంబయ్యె నీయాదరణంబుచేతనే యేమందఱము నీచేత నర్చితులమైన వారమైతి మిదిదురత్యయంబగు గంగానూపంబీదేశంబు దుష్ప్రవేశం బేమార్గంబున భరద్వాజాశ్రమంబునకుం జని యెదమనిన విని గహనగోచరుండగు గుహుండు కృతాంజలిపుటుండై నరేంద్రా యేను ధనుష్మంతులైన మదీయజ్ఞాతులం గూడి నీవెంబడి నరుగుదెంచెద నీవు సేనాసమేతుండవై చనుటకుఁ గారణం బేమి మహాత్ముండైన రామునికపకృతి సేయుటకుం బోవుచున్నవాఁడవని సందియంబు వొడముచున్న యది యనవుడు గగనంబు మాడ్కి నిర్మలుండగు భరతుండు వెం



## —(*) భరతుఁడు గుహునకు నిజాగమన కారణముఁ దెల్పుట. (*)—

డియు గుహునిం జూచి శ్లక్ష్ణవాక్యంబుల నిట్లనియె ॥ (సీ) అనఘ రాఘవుఁడు నా, కన్నయుఁ బితృతుల్యుఁ డాచార్యవరుఁడునఁ, యూమకుండు । వందనీయుఁడు సదా, వర్ణనీయుఁడు గురుండమ్మహాత్ముని చరణాబ్జములకు । భక్తితోఁ బ్రణమిల్లి, ప్రార్థనఁ గావించి దండకారణ్యమధ్యమున నుండి । మఱలఁదోడ్కొనివచ్చి, మహితరాజ్యపదస్థుఁ జేయంగఁ గోరి యీ, సేనఁ గూడి ॥ (ఆ,వె) పోవుచున్న వాఁడ, బొంకుగాదీమాట । నమ్ము మదికి సంది, యమ్ము వలదు । కలియుగంబుగాదు, కల్లలాడుటకునీ । డెందమందు శంక, నొందవలదు ॥ (వ) అనిపలికిన సంహృష్టచిత్తుండై భరతునకిట్లనియె ॥ (ఆ,వె) అప్రయత్నలబ్ధమైన సామ్రాజ్యంబు । నవలఁద్రోచిపుచ్చి, నందువలన । దశరథేంద్రతనయ, ధన్యుండవైతివి । త్వత్సమానుఁడొరుఁడు, ధరణిలేఁడు ॥ (తే,గీ) గహనమునఁ గృచ్ఛ్రగతుఁడైన, కౌసలేయు । మఱలఁదోడ్కొనివచ్చుట, కరుగుచున్న । వాఁడననిపల్కితివిగాన, వసుధలోన । నీయశము శాశ్వతంబయి, నెగడునధిప ॥ (ఆ,వె) అనిబహూకరించె నంతసూర్యుఁడు గ్రుంకె । రాత్రిదోఁచెఁ దమము, గ్రమ్మె భరతుఁ । డచట సంధ్యవార్చి, యనుజయుతంబుగాఁ । బర్ణతల్పమందుఁ, బవ్వళించి ॥ (వ) అప్పుడు శోకానర్హుండును శోకమూలపాపశూన్యుండును మహాత్ముండునగు భరతునకు వాగగోచరంబైన రామచింతామయశోకంబు సముపస్థితంబయ్యెఁ బదంపడి కోటరసంసక్త వహ్నివనదాహాభితప్తంబైన పాదపంబుంబోలె శోకాగ్ని యంతర్దాహంబున భరతునిఁ దపింపఁ జేయుచుండె నిట్లు భరతుండు సూర్యాంశుసంతప్తుండైన హిమవంతుండు హిమంబుంబోలె శోకాగ్ని సంభవంబైన స్వేదోదకంబును సర్వగాత్రంబులవలన నించుచు ధ్యాననిర్దరశిలాసమూహంబును వినిశ్శ్వసిత ధాతుసంకులంబును దైన్యపాదపసంఘంబును శోకాయాసాధిశృంగంబును బ్రమోహానంతసత్త్వంబును సంతాపౌషధివేణువునగు శోకశైలంబుచేత నాక్రాంతుండై నిట్టూర్పులు వుచ్చుచు లోకాపవాదంబునకుఁ దలంకుచుఁ గైకేయి చేసిన దుర్మంత్రంబునకు నిందింపుచు దశరథునిం దలంచి కన్నీరు నించుచు రామభద్రు నెవ్విధంబునం జూతునని తనలోనఁ దానులజ్జింపుచు నతనిచిత్తంబు వడయుటకుఁ దగినయుపాయం బూహింపుచు హతయూథంబైన వృషభంబు భంగి నాకంపింపుచు హృదయజ్వరార్దితుండై సుఖంబెఱుంగక యేకాగ్రచిత్తుండై

గృహపరివారసహితంబుగా దుఃఖింపుచు నిట్లనేకప్రకారంబుల విలపింపుచున్నసమయంబున గహనగోచరుండగు గుహుండు భరతునిఁ దగినతెఱంగున

(*)గుహుఁడు భరతునికి లక్ష్మణుని సౌహార్దం బభివర్ణించి చెప్పుట.(*)

నాశ్వాసింపుచు రాముని మహానుభావత్వంబుఁ బ్రశంసింపుచు నంతకంతకుఁ బ్రసంగవశంబున లక్ష్మణునిసుహృద్భావంబు వర్ణించుతలంపుననిట్లనియె॥ (మ) అనఘా రాముఁడు పర్ణతల్పమున భార్యాయుక్తుఁడై పవ్వళిం । చినఁ దద్రక్షణమాచరించుటకుఁ బ్రస్ఫీతాంబకాసుల్కరా । సనముం గైకొనికన్నుమూయకమహాసంరంభియైయున్న స । జ్జనసన్మాన్యుసుమిత్రపట్టిఁగనినే సంతాపతప్తుండనై॥ (వ) ఇట్లంటి॥ (తే,గీ) భానుకులవర్యచూడుమీ పర్ణతల్ప । మింపుమెఱయనీకొఱకుఁగల్పింపఁబడియె । నిందుసుఖనిద్రసేయుము సందియంబు । వలదుసుకుమారుఁడవుపిన్న వాఁడవీవు॥ (చ) అనఘ చరిత్రనీదుకృప నందిన వాఁడనుగానిసజ్జనా । వనగుణధుర్యయేనుగడ వాఁడనుగాను సుమయ్యయీనిశం । బనివడిబంధువుల్సఖులుభార్యలుసైన్యముఁగొల్వనిద్రమే । ల్కనియెదునంతదాఁక మిముఁ గాచెదఁగంటికిఱెప్పకైవడిన్॥ (తే,గీ) నాకురామునకంటెమనఃప్రియుండు । వసుధలోపలనన్యుఁడెవ్వాఁడులేఁడు । దేవయీయర్థమందు సందియమువలదు । పరగనీమ్రోలబొంకులుపలుకఁగలనె॥ (క) రామునియనుగ్రహంబున । నీమహిలోయశముసౌఖ్య మీసంపదయు । న్నేమంబుఁగలిగెఁబ్రియసఖు । భామాయుతునిమ్మహాత్ముఁబరిపాలింతున్॥ (తే,గీ)గహనసంచారకుశలుండఁగాననాకుఁ । దెలియనిదొకింతలేదందు ధీరవర్య । భండనంబునఁ జతురంగ బలమునైన । సరకుగొనకవారించెద సత్యమింత॥ (ఉ) నావిని యాకకుత్థ్సకుల నాథుఁడునన్బరికించిపల్కెనో । భూవినుతప్రతాపవిను ముజ్జగమేలఁగఁజాలునట్టియీ । భావజసన్నిభుండిచటఁబర్ణతలంబునఁగూర్కుచుండనా । కేవిధినిద్రవచ్చుసుఖ మేటికిజీవితమేలచెప్పుమా॥ (తే,గీ) సంగరంబుననెవ్వాఁడుసకలనిర్జ । రాసురులకైనలక్షింపనలవిగాక । యలరునారామ విభుఁడుసీతాన్వితముగ । నేఁడుతృణతల్పమునఁగూర్కి నాఁడుకంటె ॥ (తే,గీ) ఘనతపము చేతవివిధ యాగముల చేత । దానముల చేతసకలమంత్రముల చేతఁ । బ్రాప్తుఁడై తుల్యగుణుఁడయి పరఁగెఁగాన । జనకునకతిప్రియాత్మజుండనఘుఁ డితఁడు॥ (ఆ,వె) అట్టిరాఘవాన్వ యప్రదీపకుఁడైన । యితఁడుఘోరవనికి నేఁగుచుండఁ ।



గాంచితండ్రియైన గహ్వరీపతిమను । ననెడుమాట సందియంబుగాదె॥ (వ) పితృమరణానంతరంబున మేదిని యనాథయైయుండఁగలదు॥ (తే,గీ) సాంద్రభంగినంతఃపుర సతులుఘోర । శోకరోదనమొనరించి సొలసియూర । కున్నను పరతనాదమై యుండురాజ, సదనమిప్పుడవితలఁచెద సచివవర్య ॥ (క) మాయయ్యయుఁగౌసల్యయు । మాయమ్మయునేఁటిరాత్రి మహనీయ గుణ । శ్రీయుతులమమ్మగానక । పాయక యేపగిదివీటఁబ్రతుకుదురకటా॥ (తే,గీ) వీరవరుఁడైనతనయుని విపినయాత్రఁ । దలఁచిశోకాగ్ని చేఁగ్రాఁగి తనువువిడుచుఁ । గానికౌసల్యమనియుండఁ గలదెయింక । నాయమవితాన మాయమ్మ యడల్చుఁగాదె। (క) గద్దనభూమీశ్వరుఁడా । యిద్దఱుముద్దియల పాటు హృదయంబునఁ దాఁ । బద్దయుఁజింతించిఘనవి । పద్దశఁ బ్రాపించిమేనుఁ బాయు నిజముగన్॥ (ఆ,వె ఇట్టిమాటవలఁపనెంతయునాగుండె । యవియుచున్నదట్టియడలుమాని । సమ్మదమున నేఁడు అొమ్మునఁజెయ్యిడి । నిద్రవోవనెట్లు నేర్తునయ్య ॥ (తే, గీ) ఏనులేకున్నమజ్జనయిత్రిపిన్న । కొడుకునీక్షించిజీవించు నడలు దక్కి । యీమహాత్ముఁడులేకున్నహితవరేణ్య । యేకసుతయైనకౌసల్య యెట్లుఁబ్రతుకు॥ (తే,గీ) రామభద్రునిఁగోసలరాజ్యపట్ట । భద్రుఁజేసిమనోరథప్రాప్తిఁగనక । మున్నెభూపతిపరలోకమునకుఁబోవుఁ । గార్యమంతయు వ్యర్థసంకల్పమయ్యె॥ (వ) అమ్మహాత్ముండు మావచ్చునందాఁక మని యుండఁడేని యతని సంస్కరించి భరతాదులు సిద్ధార్థులై రమ్యచత్వర సంస్థానంబును సువిభక్తమహాపథంబును రమ్యప్రాసాదసంపన్నంబును సర్వరత్నవిభూషితంబును గజాశ్వరథసంబాధంబును తూర్యనాదవినాదితంబును సర్వకళ్యాణసంపూర్ణంబును హృష్టపుష్టజనాన్వితంబును నారామోద్యానసంపన్నంబును సమాజోత్సవ సంకులంబునగు సాకేతనగరంబున సుఖంబు లనుభవింపుచుండుదు రేను సమయకాలం బతీతంబగుచుండఁ గృతప్రతిజ్ఞుండై సేమంబుననున్న రామునిం గూడి మఱలఁ బురంబుఁ బ్రవేశించువాఁడనని యేతాదృశంబులగు దుఃఖాలాపంబులు నాతో నాడుచుండ నంతలోనఁ బ్రభాతకాలంబయ్యె నంత రాముండు మేల్కాంచి తానును లక్ష్మణుండును నిమ్మహానదీతీరంబున జటావల్కలంబులు ధరించి బాణబాణాసనకృపాణంబులు ధరించి వ్యపేక్షమాణులై సీతా సహితంబుగా నిమ్మహానదినుత్తరించి గజయూథపుల చందంబున సుఖలీలం జనిరని యిట్లుగుహుం

డు రామవృత్తాంతంబును లక్ష్మణుని పరిదేవనంబును సవిస్తరంబుగా నెఱింగిం
చినవిని సుకుమారుండును మహాసత్త్వుండును సింహస్కంధుండును మహాభు
జుండును బుండరీక విశాలాక్షుండును దరుణుండును బ్రియదర్శనుండు నగు
భరతుండు స్వాభిలషిత కార్యసంకటంబు సంజాతం బయ్యెనని చింత నొంది
ముహూర్తమాత్రంబు పరమదుర్మనస్కుండై పదంపడి తోత్ర విద్ధంబైన
మహాద్విపంబు కైవడిఁ బుడమిపయింబడియె నతని దురవస్థఁ జూచి యాసన్న
స్థితుండైన శత్రుఘ్నుండు శోక కర్శితుండై యతనిం గౌఁగిలించు కొని యు
చ్చైస్స్వనంబున రోదనంబుఁ జేయుచుండె నయ్యవసరం బరికించి భర్తృ
వ్యసన కర్శితలగు రాజకాంత లాహాకారంబులు సేయుచు ధరణిపయిం
బడి దీర్ఘ స్వరంబున విలపింపుచుండి రప్పుడు తపస్విని యగు కౌస
ల్య శోకాలసుండైన భరతు ననుసరించి యుపగూహనంబుఁ జేసి శోకా
యాసవిశేషంబున విలపింపుచు నిట్లనియె ॥ (చ) అనఘ చరిత్ర నీతనువు,

(*) కౌసల్య భరతు నూఱడించుట. (*)

నంటవు రోగము లిప్పుడీకులం । బునకు విభుండ వీవు తల, పోయఁగఁ బ్రాణ
ము నీయధీనమా । మనుజవిభుండు పోయినఁ గు,మారుఁడు కానకు నేగినన
హో । న్నినుఁ గని యింక మాకు గతి, నీవె యటంచుఁ దలంచి నెమ్మదిన్ ॥
(తే, గీ) ఒడలఁ బ్రాణంబులు ధరించి, యున్నదాన । నట్టిధీరుండ వీవె ధై,ర్యం
బు విడిచి । యివ్విధంబున దుఃఖింప, నేమి గలుగు । నిచట మమ్మాదరించు
వా,రెవ్వరింక ॥ (ఆ, వె) అనఘ యేక పుత్ర,నైన నాసుతుఁడు సీ । తాన్వి
తముగ నడవి, కరుగుచుండ । నల సుమిత్రపట్టి, యంద ప్రియం బించు । వై
న శ్రుతముగాన, నడలనేల ॥ (క) అని యిట్లు పెక్కు,విధములఁ । దనునా
శ్వాసింపుచున్న, తల్లికిఁ దనపై । ననురక్తిఁ బొడమ గుహునిం । గనుఁగొని యి
ట్లనియె నతఁడు, గద్గదికోక్తిన్ ॥ (ఉ) ఓయి నిషాదనాయక స,మున్నత వి
క్రమ నాఁటిరేయి తా । నేయెడనుండె రామవిభుఁ, డెచ్చటనుండె మహీజ ల
క్ష్మణుఁ । డేయెడనుండె నేమి భుజి,యించిరి యెట్లు వసించి రెంతయు । స్నా
యెడఁగూర్మిఁ జేసి కరు,ణ న్వినుపింపఁగదయ్య నాకుఁ దున్ ॥ (ఆ, వె) గుహుఁ
డు హృష్టుఁడగుచుఁ,క్షోణీశ సుతుఁ జూచి । యో మహానుభావ,రాముఁడిచటి క
రుగుదేర నతని, కాహార మిడుటకు । నన్నమును ఫలంబు, లర్థిఁగొనుచు ॥



(తే,గీ) సఖులతోఁగూడి యేనట్లు,చని ముదంబు । వెలయ నాతెచ్చిన పదా
ర్థ, విసరమెల్ల । భక్తి నర్పించుటయు ధర్మ, యుక్తి నన్ను । గరిమ మ
(*)గుహుండు భరతునకిం గుదీతరుమూలంబుననుండు రామశయ్యం జూపుట(*)
న్నించి యవి, యన్ని పరిహరించి ॥ (తే, గీ) లక్ష్మణుఁడు తెచ్చియిచ్చిన ర
మ్యగాంగ । తోయమింపారఁ గ్రోలిసీ,తాయుతముగ । నోపవాస్యంబు సలిపి
త,మోరిగ్రుంకు । నపుడు సంధ్య నుపాసించి యంతమీఁద ॥ (వ) సౌమిత్రివి
రచిత కుశతల్పంబు మీద సీతా సమేతంబుగా నధివసించె నంత లక్ష్మణుండు వి
మలజలంబులఁ దదీయ చరణంబులు గడిగి తడియొత్తి కొండొక సేపు నానావి
ధశుశ్రూషలు గావించి పదంపడి జ్యాఘాత వారణాంగుళి త్రాణవంతుండై శ
రసంపూర్ణంబులైన తూణీరంబులు ధరించి సజ్యంబైన కార్ముకంబు కేలందా
ల్చి శయననిద్రాహారంబులు వర్జించి రాముని సమీపంబునం గొలిచియుండె
నేనును జాపబాణ ధరుండనై యతంద్రితుండనై యాత్తకార్ముకులైన జ్ఞా
తులంగూడి మహేంద్రకల్పుండగు రామునిఁ బరిపాలింపుచుఁ దదంతికంబు
నం గొలిచి యుండితి రాముండు పవ్వళించుటకు రచించిన తృణతల్పంబిదె యిం
గుదీతరుమూలంబున నొప్పుచున్నది విలోకింపుమని భరతునికిం జూపిన నతం
డు మంత్రిసహితంబుగా నమ్మహీరుహ మూలంబునకుం జనియచ్చట నున్న తృ
ణశయ్య నవలోకించి కన్నీరునించుచు జననియిత్రులకిట్లనియె ॥ (చ) గుఱుతుగఁ
దల్లులార గనుఁ, గొంటి రె రాముఁడు నాఁటిరేయి తా । నిరుపమధర్మయుక్తి శయ,
నించిన కర్కశ పర్ణ తల్పము । ప్పరమసుఖార్హుఁ డంచిత కృపాళుఁడు ప
జ్క్తిరథాత్మజుండు సుం । దరసుకుమారుఁ డిట్టి కఠి,నక్షితిపైఁ బవళింపనర్హుఁ
(*)భరతుఁడు శ్రీరాముఁడు శయనించిన తృణతల్పంబుఁ జూచి దుఃఖించుట.(*)
డే ॥ (చ) సరస పదార్థముల్గుడిచి, సన్నపుఁ బొల్లియఁ గట్టి దీప్తహేమ । ర
చిత సౌధ భాగముల, మంజులశయ్యలఁ బవ్వళించున । ప్పరమ సుఖోచితుండు
జల,పానముఁ జేసి మహీజమూలమం । దిరవగు పర్ణతల్పమున, నేకరణిన్వ
సియించె నక్కటా ॥ (సీ) పుష్పసంచయ చిత్ర,ములు చందనాగరుపరిమళ
యుతములు, పాండరాభ్రి । సందీప్తములు శుక, సంఘరుతంబులు మంజులాం
స్తరణస,మంచితములు । కృతహేమకుడ్యంబు, లతిగీతవంతము ల్హేమరాజతర
మ్య, భూములద్రి । కల్పంబులగు నవ్య,కాంచనప్రాసాద సౌధవిమాన రాజ

ములయందుఁ ॥ (తే,గీ) గాహళవిచిత్రరవ మృదంగ,స్వనముల । సూతమాగధగాయక,స్తుతిరవముల । సంప్రబోధితుఁడగు రామ,చంద్రుఁ డిట్టి । కఠినధారుణిపై నెట్లు,గావసించె ॥ (తే,గీ) లలితసుకుమార తనుఁడైన, రాముఁడేడ । రేయి కఠినోర్విపైఁ బవ్వ,ళించు టేడ । నుదకములఁ గ్రోలియుపవాసముండు టేడ । సకటస్వప్నంబుగాక య,థార్థమగునె ॥ (తే,గీ) మూఁడులోకంబులు భుజాగ్ర,మున ధరింపఁ । జాలినట్టి యినాన్వయ, స్వామికిట్లు । కఠినమేదినివసియింపఁ, గలిగెనకట । కాలముదురత్యయం బెంత, ఘనునకైన ॥(వ) ఇది మహాత్ముండగు రాముండు పవ్వళించినతృణతల్పంబు కఠినస్థండిలంబుమీఁద రచింపంబడియున్న దిచ్చటితృణంబంతయుఁ దదీయగాత్రంబుల చేత విమృదితంబై యున్నదని పలికి వెండియునిట్లనియె ॥ (ఉ) పోఁడిమితో విదేహపతి,పుత్రికనై యజరాజసూతికిం । గోడలనై జగజ్జనమ,నోహరు రామునిఁజెట్టఁ బట్టినేఁ । డాడికకిట్లుపాల్పడితి, నంచలజానకియేడ్వఁబోలునీ । వాడనె యంతనంతఁగను,ప్పటెఁ దదంజనమిశ్రితాశ్రుపుల్ ॥ (క) ఆభూసుతయిచ్చటది। వ్యాభరణోపేత యగుచు, నటు నిద్రించెం । బోభాతినూతనంతన । శోభిల్లెడుఁ దత్సువర్ణ,సుందరరోచుల్ ॥ (తే,గీ) మఱియునిచ్చోటభూపుత్రి,కుగనిఁగూడి । ధౌతకౌశేయ పరిధాన, ధారుణిపయిఁ । బవ్వళింపంగఁ బోలు త,త్పటని విష్ట। తంతుసంతాన మంతంతఁ, దఱచుదోఁచె ॥ (ఆ,వె) చాలగోలముద్దు,రాలుమహాసుకు । మారమేదినీకు,మారియిట్టి। కఠినభూమియందు,గాత్రంబువైచిన । గండుశిలలుదాఁకి,గందకున్నె॥ (క) పుట్టినదిమొదలుబంగరు । తొట్టెలలోనూఁగుసతికి,దుస్తరముగనేఁ । డిట్టిదురవస్థదారకొనెగట్టాదుశ్చిత్తమైన,కైకకతమునన్ ॥ (తే,గీ) సతియుసుకుమారయును సుఖోచితయునైన । జనకనందన నిజనాథ,సహితయగుచుఁ । బరగనీతృణ శయ్యపైఁ,బవ్వళించెఁ । గాంతులకు భర్తృశయ్యసు,ఖంబుగాదె ॥ (క) ఏరాముఁడుమత్కృతమున । దారయుతుండగుచు నిట్టి తల్పముమీఁదం । గూరికెనాతనిచేతన । కారణమునవిడువఁబడితిఁ, గాకు జనుక్రియన్ ॥ (చ) సరసుఁడు సార్వభౌమకుల, జాతుఁడు సర్వజగత్ప్రియుండుపు । ణ్యరతుఁడు పద్మనేత్రుఁడును, బాహుఁడుసత్ప్రియదర్శనుండుసుం । దరతనుఁడైన రాఘవుఁడ, నామయరాజ్యసుఖంబుమానితా । నఱమఱయింతలేక కఠినావని నెట్లువసించెనక్కటా ॥ (వ) మఱి



యువిషమకాలంబున నన్నయగు రామభద్రు ననువర్తించి ప్రియదర్శనుండును మహాభాగుండునగు లక్ష్మణుండు ధన్యుండయ్యెఁ బత్యనుసరణంబున వైదేహి కృతార్థయయ్యె మనము రామవిహీనులమై లోకవిద్వేష్యుల మైతిమి రాఘవుండరణ్యగతుండగుచుండ విశ్వంభరకర్ణధారహీనయైన నావచందంబున నాయక రహితయై తోఁచుచున్నది దశరథుండు స్వర్గగతుండగుచుండ రాముండు కానకుంబోవుచుండ నివ్వసుంధరాధిపత్యంబు సేయుట కేవాఁడు సమ్మతించు రాముండు వనవాసగతుండయ్యును విశ్వంభరతదీయభుజవీర్యాభిరక్షితగాఁ దలంచెద విహీనప్రాకార రక్షయు నసన్నద్ధాశ్వమాతంగయు నపావృత పురద్వారయు నరక్షితయు నప్రహృష్ట బలోపేతయు సాధన విహీనయు దుర్దశాపన్నయు ననావృత్తయునైన రాజధాని శత్రువులైన విషకృతంబైన భక్ష్యంబుం బోలెఁ బరిహరింతురు గాక నైకొనం దలంతురే యవియన్నియు నట్లుండనిండు నేఁడు మొదలుగ నేను జటావల్కల ధరుండనై నిత్యంబును ఫల మూలంబు లుపయోగింపుచుఁ

—(*)భరతుఁడు జటావల్కలధరుండై యుండెదనని ప్రతిజ్ఞసేయుట.(*)—

దృణశయ్యమీఁదం బవ్వళింపుచు రామకృత వనవాస ప్రతిజ్ఞను నాయందారోపించుకొని రామార్థంబుగాఁ జతుర్దశ వర్షాత్మక రామానుష్ఠేయవ్యతిరిక్తోత్తర కాలంబునువనంబునవసించెద నందువలన నారఘుపుంగవుని ప్రతిశ్రవంబు మిథ్యాభూతంబు గాకుండు శత్రుఘ్నుండు నాయట్లవ్రతం బంగీకరించి యనువర్తించియుండు రాముండులక్ష్మణసహితంబుగాద్విజశ్రేష్ఠులచేత సామ్రాజ్యంబునందభిషిక్తుఁడై యయోధ్యాపురంబుఁ బరిపాలింపంగలం డేతాదృశంబైన మన్మనోరథంబు దేవతలందరు సఫలంబుఁ గావింతురు గాక రాముండు నాచేతబహుప్రకారంబులఁ బ్రసాద్యమానుండయ్యును మత్ప్రార్థన నంగీకరింపఁడేని యమ్మహాత్మునితోఁ గూడవనంబునఁ జిరకాలంబువసించి యుండెద నద్దయాళుండు నన్నేలయుపేక్షించునని యీదృశంబులగుశపథంబులఁ బల్కుచు నంతలోనఁ బ్రభాతకాలంబగుటయుఁ గాల్యకరణీయంబులుదీర్చి శత్రుఘ్ను నవలోకించియిట్లనియె ॥ (మ) కమలాప్తుండుదయించెనింకమసలం, గానేటికిచ్చోటవే । గమెయివ్వాహినిదాఁటి పుణ్యరతునిం, గాకుత్స్థునింగానఁబో । దము ప్రాణోపమమిత్రుఁడైనగుహునం, దంబొప్పఁదోడ్తెమ్ముని । క్కమునాకీనిశనిద్రలే

దు మిగులం, గార్యాతురత్వంబునన్ ॥ (వ) అనియిట్లుభరతునిచేతఁ బ్రచోది
తుండై శత్రుఘ్నుండు నదీసంతరణార్థంబు వేగిరపడుచుండె నట్టిసమయంబు
న ॥ (క) ప్రాంజలియైగుహుండారఘు । కుంజరకడకరుగుదెంచి, గుణరత్నని
ధీ । కొంజకనీచేనిచ్చట । రంజితమైయొప్పెఁ గాదె,రాత్రిసుఖదమై ॥ (క)నా
వినిభరతుఁడతనితో । నీవాడినయట్లయయ్యె, నిఁక నన్నఁగనం। బోవఁగవలె
సత్వరమున । నావికులంబిలువ నంపు,నదిదాఁటుటకున్ ॥(క) అనవినిగుహుఁ
డాతనికా । సనమునఁ బురమునకుఁబోయి, జ్ఞాతులవెసన । ప్పనికినియమిం
చుటయు నా । రనుపమచాతుర్య మహిమ, నందఱుఁ బిలుచన్॥ (వ) గుహు
వచనప్రకారంబునఁదొల్లింటి యేనూఱుక్షుద్రనావలనుమఱియు విచిత్రపటసం
దీపితధ్వజాలంకృత దృఢసంధి బంధపర్యాప్తకర్ణధారయుక్త చారుఫలకభిత్తిస
మావరణ పరిమితవాతమహా ఘంటాధరవరా స్తరణోపేత స్వస్తికాఖ్య నాశ

—(*)భరతుఁడు సేనాసమేతంబుగ నోడనెక్కి గంగానదిదాఁటుట.(*)—

తంబును సన్నద్ధంబుఁ జేసి తెచ్చిరంత గుహుండయ్యోడలలోనఁ బాండు కం
బళసంవృతయు హర్షజనక కింకిణీ ఘోషయుక్తయుఁ గల్యాణియునైన స్వ
స్తిక విజ్ఞేయనావ నాకర్షించి తెచ్చినభరతుండు శత్రుఘ్నసహితంబుగా దా
నినారోహించె నంతకుమున్న సమాగతులైన పురోహితులును గురువులును
బ్రాహ్మణులును నారోహించిరి పదంపడి కౌసల్యాప్రముఖ రాజకాంతలారో
హించి రనంతరంబ శకటంబులు నాపణస్థపదార్థంబులునుం దగిన యోడల
యందునిచి రప్పుడుసేనాసన్నివేశంబు గావించువారి కలకలంబులును నవతర
ణప్రదేశంబున డిగ్గువారి ఘనారావంబులును నుపకరణంబు నందు కొను
వారి మహానాదంబులును నింగి ముట్టి చెలంగె నిట్లయ్యోడలు కొన్ని నా
రీజనంబును గొన్ని హయంబులను గొన్ని రథ శకటాది యానంబులను
గొన్నియుష్ట్రాశ్వ తరంబులను గొన్నిమహామూల్యంబులను గొన్నినానావిధ
జనంబులను గొన్నిరాజనందనపురోహితాంతఃపుర కాంతలను వహించి పతా
కావంతంబులై స్వస్వదాశాధిష్ఠితంబులై మహావేగంబున నమ్మహానదినుత్తరిం
చియవ్వలితీరంబున నందఱడించి నివృత్తంబులయ్యె నప్పుడు దాశశ్రేష్ఠులచేత
నివృత్తసమయభారావరోపణ లఘుత్వజనిత సౌకర్యంబునఁ గాండచిత్రంబులు
గావింపంబడియె సపతాకంబులైన గజంబులుగజారోహకులచేతఁ బ్రచోదితం



బులై సధ్వజంబులైన జంగమపర్వతంబులచందంబున నందంబగుచు నమ్మహా
నదినుత్తరించి చనియెనప్పుడు కొందఱోడలచేతను గొందఱు ప్లవంబులచేతను

—(*)భరతుఁడువసిష్ఠఋత్విగ్జనమాత్రసహితుండై భరద్వాజమహర్షిని(*)—
*సందర్శించుట.*

గొందఱుకుంభఘటంబుల చేతను గొందఱు బాహువులచేతను గంగానది దాఁ
టిరిట్లందఱుసుఖంబుగా నమ్మహానదినుత్తరించి మైత్రముహూర్తంబున కను
త్తమంబైన ప్రయాగవనంబునకుంజని రంతిమహాత్ముండగు భరతుండుబలంబు
లనాశ్వాసించి యథాసుఖంబుగా నొక్కచోట నిలువనియమించి రమ్యోటజ
వృక్షషండంబైన భరద్వాజాశ్రమంబు దవ్వులంజూచి ధర్మజ్ఞుండు గావునఁ
గ్రోశమాత్రదూరంబున రథంబుడిగ్గి న్యస్తశస్త్రపరిచ్ఛదుండై క్షౌమ పరిధాన
సంవీతుండై పురోహితుమున్నిడుకొని ఋత్విగ్జనపరివృతుండై పాదసంచారం
బుననమ్మహామునిసమీపంబునకుంజనియెనప్పుడు బృహస్పతినందనుండగుటవలన
దేవపురోహితుండగు భరద్వాజుండు వసిష్ఠునిదవ్వులంజూచిశీఘ్రంబునదర్భా
సనంబుడిగ్గి శిష్యులనర్ఘ్యంబుఁగొని వెంటనరుగుదేఱ సంభ్రమంబున నెదురు
గాఁజనివసిష్ఠునితోడసుహృత్సల్లాపంబుగావించిభరతునిచేతనభివాదితుండైయ
తనిదశరథపుత్రునిఁగానెఱింగి యయ్యిద్దఱకర్ఘ్య పాద్యంబులొసంగి ఫలంబు
లిచ్చి దశరథునివృత్తంబెఱింగిన వాఁడగుటవలన నతనికుశలంబడుగక కులబ
లపురకోశ మంత్రిమిత్ర బాంధవుల యందుఁ గుశలంబడిగిన నవ్వసిష్ఠుండును
భరతుండు నందఱుఁగుశలంబనిపలికి వెండియు శరీరాగ్ని శిష్యవృక్ష పక్షిమృ
గంబులయందుఁ గుశలంబడిగిన నమ్మహాత్ముండు సర్వంబును గుశలంబనిపలికి
రామవిషయ స్నేహబంధంబున భరతునకిట్లనియె॥ (ఉ) అగ్రజుఁడైనరాముని

—(*)భరద్వాజమహర్షి భరతునిదూఱుట.(*)—

యనామయరాజ్యమధర్మయుక్తిచే । వ్యగ్రతఁజేసిపుచ్చుకొని యంతటఁబోవఁ
గనీకఘోరస । త్వోగ్రవనంబులోఁదిరుగు చుండెడి యమ్మహనీయ మూర్తి
పై । నాగ్రహవృత్తిఁబోవఁదగు నానినుఁజూచినశంకదోఁచెడిన్ ॥ (క) పుడమి
యురాష్ట్రమునగరముఁ । గడువడిమీయమ్మమున్నె కైకొనియెఁబదం । పడియా
తనిజీవితమును । గడిమిన్నిపహరింపఁగావచ్చితివో॥ (క) కాంతా నియుక్తుఁ
డైభూ । కాంతుఁడుకాంతారమునకుఁ గనినతఁజనుమ । న్నంతనెవచ్చినసీతా ।

కాంతునిదే కాకతప్పఁ గైక దె చెప్పుమా॥ (క) అని పెనుఁ గొలిపిం గాల్చిన। యు
నుపునని ట్లాడ భరతుఁ డా రాటమునం। గనుఁగొనలన్రశ్రుకణములు। చినుకఁగ
నిట్లని యెడల్లి సేఁతకడలుచున్॥ (చ) అనఘుఁ గృతఘ్నునట్లయక టానను దూ
ఱఁగ నేలనా తెఱుం। గనిశము నీ రెఱుంగ రెమ హాత్ముఁడు పుణ్యచరిత్రుఁడైన రా।
మునివనయాత్ర నించుకయు భూతతతుల్గుటిగా నెఱుంగఁగా। దనిముది నమ్మ వేని
భవదంఘ్రిసరోజము ముట్టి చెప్పెదన్॥ (చ) అనిశము సత్యధర్మములయం
దనురక్తుఁడనయ్యు నాజికిం। దనయుఁడనయ్యు రామునకుఁ దమ్ముఁడనయ్యు వసిష్ఠ
మౌనిచే। ననవరతంబు శిక్షితుఁడ నయ్యును గైకకుఁ బుట్టినందునం। బనివడి యి
ట్టినిందలకుఁ బాత్రమునైతి నిఁ కేమి సేయుదున్॥ (క) పగపేల లోకనిందకు। జగతీ

—(*)భరతుఁడు భరద్వాజమహర్షికిఁ దన యనపరాధత్వముఁ దెల్పుట.(*)—

పతిమౌళిరత్న చారుపదాబ్జుం। డగు నన్న కెగ్గుఁ జేసిన। భగవంతుఁ డెఱుఁగియుం
డుభవ్యగుణాఢ్యా॥ (వ) మహాత్మా నీవు త్రికాలజ్ఞుండవయ్యును నన్నిట్టివానిఁగాఁ ద
లంచుటవలన నేను వ్యర్థజీవితుండనైతి నాయందు దోషగంధం బించుకయై
న లేదు మీరిట్లు కర్ణకఠోరంబుగాఁ బలికితిరి దీని కేనేమి మాఱు పల్క
వాఁడ మదసాన్నిధ్యంబునందు మదంబయగు కైకేయి చేతఁ బలుకంబడిన వా
క్యంబు నాకిష్టంబైన యదిగాదు దాని నంగీకరించిన యదియు లేదే నిక్కార్యం
బుచేత సంతుష్టుండనైన వాఁడఁ గానని యీ నృశంబులైన శపథవాక్యంబుల
చేత స్వారోపితదోషం బపనయించుకొని స్వాగతంబాఱంగించుతలంపున వెం
డియు భరతుండు భరద్వాజునకిట్లనియె ॥ (చ) అఱమఱ యింత లేదు విను,
మయ్య మునీంద్ర వనస్థుఁడైన భా। స్కరనిభతేజు రామునిఁ బ్రసన్నునిఁ జేసి
యయోధ్యకమ్మహా। పురుషుని వెండితోడుకొని, పోవుతలంపున వచ్చినాఁడ
న। త్తెఱఁగు సమస్తముం గరుణఁ, దెల్పి ప్రసాద మొసంగుమిత్తఱిన్ ॥ (వ) అ

——(*) భరద్వాజమహర్షి భరతునిం గొనియాడుట. (*)——

నియిట్లు భరతుండు వసిష్ఠాదిమహామునిసహితంబుగా రామవృత్తాంతం బడిగి
న ॥ (చ) మునిపతి సంతసిల్లి కృప మోమున నింపెసలారఁ గైకసుఁ త్తన
యునిఁ జూచి పల్కె నృపధర్మవిశారద రాఘవాన్వయం। బునఁ సవనప్రసా
దమునఁ బుట్టిన నీకిది యుక్తమివ్విధం। బునఁ గురువృత్తియున్ దమము పుణ్య
నకాచరణీయమే కదా ॥ (చ) రవికులవర్య నీవిపుడు, రాముని పైఁ గల భక్తి



పెంపున। న్నవినయబుద్ధి వచ్చుటది, సర్వమెఱింగియు నీదు కీర్తి యీ। భు
వనములందు నిత్యపరిపూర్ణము సేయఁదలంచి యింగితిం। బవినిభతీక్ష్ణవా
క్యములు, పల్కి నింతియె కాక వెట్టనే ॥ (చ) ఎఱుఁగుదు రాఘవుం డడవి,
కేఁగిన చందము సర్వ మమ్మహా। పురుషుఁడు చిత్రకూట మను, భూధరమం
దనుజన్మ యుక్తుఁడై। యిరవుగ నున్నవాఁ డతని, కల్లి గనంజనఁ బోలు
నేఁడిట। స్థిరముగ లీల నుండుము గుణిప్రవరా సపురోహితుండవై ॥
(వ) రాజనందనా నీవు వాంఛితార్థప్రదాన దక్షుండవు మదీయాభిమ
తంబు సిద్ధింపఁ జేయుమని ప్రార్థించిన నుదారదర్శనుండును బ్రశస్తకీర్తి
యు నగు భరతుండా రాత్రి యచ్చట నివసించుట కియ్యకొనియె నిట్లు భరద్వా
జుండు భరతుని నిలువనియమించి పదంపడి భోజనపర్యంతాతిథి సత్కా
రంబు కొఱకుఁ బ్రార్థించిన నా భరతుండు వెండియు నమ్మునిశేఖరుం జూ
తాపసేంద్ర యర్ఘ్యపాద్యంబులును వనంబునం గల కందమూలాదికంబును మీ
రొసంగితిరి మాకు సంతోషంబుఁ గావించుట కవియె చాలునని పలికిన నమ్మహర్షి
వల్లభుం డింతకంటె విశేషంబేమి యొసంగెదరని యెడు భరతాశయంబెఱిం

—(*)భరతుఁడు భరద్వాజానుమతంబునఁ దదాశ్రమమునకు సైన్య(*)—
()ములను రావించుట.()

గి ప్రహసాపేదకానుభావ యుక్తంబైన మద్విషయంబునందుఁ బ్రీతిసంయుక్తుం
డైనవానిఁగా నిన్నెఱుంగుదు నీకొక్కనికె కాదు భవదీయసైన్యంబులకెల్ల భో
జనంబొసంగఁ దలంచితి మదాశయం బంగీకరింప వలయు నీవు సబలుండవై
రాక బలంబుల దూరంబున విడియించి యొక్కరుండవై యేల వచ్చితి వనిన న
కైకేయీ నందనుండు కృతాంజలియై తపోధనా చతురంగసహితంబైన
మదీయసైన్యంబు ధరిత్రి నాచ్ఛాదించి వచ్చుచున్నది యందలి గజవాజి రథ
పదాతు లిచ్చటికిం జనుదెంచెనేని పావనంబైన భవదీయ తపోవనంబునకు
సంకటంబు వాటిల్లుననియును మహీపతిచేతఁ దపోధనులు విషయంబులయంద
తిప్రయత్నంబున వర్జనీయులనియును వనభంగంబువలన భవదీయచిత్తం
బున కేమి కినుక వొడమునో యనియును శంకించి దూరంబున విడియించి
యేనొక్కరుండ చనుదెంచితి నిప్పుడు భవదీయశాసనంబున నిచ్చటికి రా
వించెద ననిన నట్లు కావింపుమని పలికిన నతం డట్లు కావించె నంత నమ్మునివరుం

డు ప్రక్షాళిత పాణిపాదుండై యగ్నిశాలఁ బ్రవేశించి ముమ్మాఱాచమనంబుఁ జేసి రెండుమాఱు ముఖంబు పరిమార్జించి యొక్కసారి శిరశ్చక్షుశ్శ్రోత్రనాసికా హృదయంబులు సంస్పృశించి యాతిథ్యక్రియార్థంబు స్థిరసమాధినియుక్తుండై భరతున కాతిథ్యం బొసంగఁ దలంచితిఁ గావున మచ్ఛాసనంబున విశ్వకర్మయుఁ ద్వష్టయు గృహాది సంవిధానంబుఁ గావింతురు గాక

(*) భరద్వాజమహర్షి సైన్యసమేతుండగు భరతునికి విందుసేయుట. (*)

యింద్రాది దిక్పాలకులును వహ్నిపురోగములైన దేవతలును సన్నిహితులై యన్నపానాదికంబును రక్షింతురు గాక పూర్వపశ్చిమవాహినులగు భూమ్యంతరిక్ష దివంబులం గల నదులన్నియు నిక్షుకాండరసోపమంబులైన శీతసలిలంబులను ఖర్జూరతాళాది హేతుకంబైన మద్యవిశేషంబును గౌడీప్రముఖత్రివిధసురలును స్రవింపుచు సన్నిహితంబులగుంగాక మఱియు హాహాహూహూ ...వసు ప్రముఖ దేవగంధర్వులును ఘృతాచియు విశ్వాచియు నాగదంత ... మిశ్రకేశియు నలంబుసయు హేమయు మహేంద్రపర్వతకృతస్వయంప్ర బి ... హేమయు మొదలుగాఁగల దేవజాతిగంధర్వజాత్యప్సరసలును నింద్రలోకంబునం గల రంభోర్వశీమేనకాదులును బ్రహ్మలోకంబునఁ గల దివ్యా...లును స్వలంకృతలై నృత్తగీతాద్యుపకరణసహితలై గానశిక్షకుండగు ... బురు...ం గూడి చనుదెంచి నృత్తగీతాదికంబులు గావింతురు గాక వాసో...తవంతంబై దివ్యనారీఫలంబై దేవభోగస్థానంబైన యుత్తర కురు...ల కౌబేరంబైన చైత్రరథవనం బిచ్చట సన్నిహితం బగుంగా... వంతుండైన సోముండు శాల్యోదనంబును భక్ష్యభోజ్యచోష్య...ను సురాప్రముఖపానీయంబులును నానావిధమాంసంబులును బాతంబులైన విచిత్రమాల్యంబులును సృజించుం గాక యని యివ్వి... పతిమ తపోలబ్ధమహిమ విశేషంబునఁ బ్రాఙ్ముఖుండై యాహ్వాన...స్వరసంహితంబైన మంత్రంబు జపించినఁ దత్క్షణంబ మునివచన...కారంబున దేవతలందఱు వేర్వేఱ నచ్చటం బొడసూపి రప్పుడు ॥ (సీ) హారియై ఘనతాప,హారియై సంతోష కారియై పవనుండు, గలయవిసరెఁ బ్రహృష్టయై యుపగతా,రిష్టయై పరిమళో,త్కృష్టయై సురపుష్ప, వృష్టిగురిసె। నందమై శ్రుతిపుటా,నందమై సంతతా స్పందమై వాద్యము, ల్గ్రిందుకొనియె। ని



త్యమై యభినయా,ద్యత్యమై సజ్జనస్తుత్యమై యప్సరో,నృత్యమొప్పె ॥ (తే,గీ) వల్లకీదండములఁ బూని,స్వరయుతముగ। నేర్పుమీఱంగ రాగంబు, లేర్పఱించి। లయగుణాన్విత మగునట్లు,తాయిగరఁగఁ। బాడిరవ్వేళ గంధర్వ, భామలచట ॥ (క) ఆనినదము మధురంబై। మానసహారమై లయప్ర, మాణయుతంబై। వీనుల విందై యమృతపు। సోనల పొందైన నభంబు, క్షోణియునిండెన్ ॥ (తే,గీ) సారచందనోత్పత్తి బీ,జంబులైన। మలయదర్దుర పర్వతం,బులు స్పృశించి। వివిధగతుల యథోచిత, వృత్తిచేత। సుఖకరంబుగఁ బవనుండు,సుడిసె నపుడు ॥ (ఉ) అప్పుడు విశ్వకర్మ మహి, మాతిశయంబున రాజసైన్యము। ల్దప్పక శాస్త్రవైఖరి వి,ధానముతోఁగనుపట్టెనంతలో। నొప్పుగఁ బంచయోజనము,లుర్వి సమత్వమునొందె దానిపైఁ। జొప్పలు దోఁచె నీలతృణ,శోభితశాడ్వల సంయుతంబుగన్ ॥ (ఆ,వె) అంతలోనఁదోఁచె, నటఫలభూషణ। పనసబిల్వచూత,బదరనారి। కేళపూగవరర,సాలకపిత్థజం। బీరముఖ్య వివిధ,భూరుహములు ॥ (క) కమనీయోత్తర కురుదే। శములం గల దివ్యభోగ,సంయుతకాంతా। ర మొకింతలోన నచ్చట। సముచితగతిఁ దోఁచె నతివి,శాలంబగుచున్ ॥ (ఆ,వె) మఱియు నంతలోనఁ, బరికింపఁగా నయ్యె। నచటఁ దటజబహు వి,ధానసీజ। సురుచిర ప్రసూన, శోభితపులినసం। యోగమైన నిమ్న, గాగణంబు ॥ (చ) ఒక నిమిషంబులో నచట నున్నత వైఖరిఁదోఁచె సౌధము। ల్పరికటితహర్మ్యము ల్మణివి,రాజిత సద్మములు న్విమానము। ల్వికసిత పద్మశోభితన, వీనసరోవరము ల్సువర్ణ వేదికలును మంటపంబులును, దివ్యసభా సదనంబు లొక్కటన్ ॥ (క)ఆలోఁగనుపట్టెఁజతు। శ్శాలలు రథతురగ హస్తి,శాలలునుధను। శ్శాలలునుజంద్రశాలలు। సాలంబులుఁ దోరణములు,సముచితభంగిన్ ॥ (సీ) వెండియుఁ గనుపెట్టె, వేయునంతటిలోన నద్భుతభంగిఁ ద,దంతరమున। సితమేఘతుల్యమై,వితతమై సుందరంబై సుతోరణయుక్త,మై మనోజ్ఞ। దివ్యగంధాఢ్యమై దివ్యరసోపేత మైదివ్య భోజనా,చ్ఛాదనాన్న। శయనయానాసన, చ్ఛత్రచామరవంతమైచతురశ్రమై యతివిశాల॥ (తే,గీ) మైవినిర్మల భాజనమై సమస్త వస్తు విస్తార పూర్ణమై వైజయంత। సన్నిభంబగు నొకరాజసదనమచటఁ। గన్నులకు విందొనర్చుచుఁ, గానవయ్యె ॥ (వ) అంత మహాభాగుండగు భ

రతుండు భరద్వాజునిచేత ననుజ్ఞాతుండై రత్నసంపూర్ణంబైన యమ్మహానీయ మందిరంబుఁ బ్రవేశించి తదీయసంవిధానంబున కిచ్చ మెచ్చుచు నందొక్క దివ్యంబైన రాజాసనంబును వాలవ్యజనంబును ఛత్రంబును విలోకించియ మ్మాటికిం బ్రదక్షిణంబుగావించి పూజించి మనంబున రామునిం దలంచి నమస్కరించి వాలవ్యజనంబుఁ గైకొని యొక్క సచివాసనంబుమీఁదం గూర్చుండెఁ దక్కినమంత్రులుఁ బురోహితులును సేనానాయకులును నానుపూర్వకంబుగా భరతునిం బరివేష్టించి యుచితపీఠంబుల నాసీనులై రంత ముహూర్తమాత్రంబునకుఁ బాయసకర్దమంబులగు నదులు భరద్వాజుని శాసనంబున భరతునిసమీపంబునఁ బ్రవహించెఁ దదుభయతీరంబులందు మునిప్రసాదంబువలనఁ బాండుమృత్తికా లేపనంబులైన రమ్యావసథంబులు తోఁచె నప్పుడు ॥ (తే.గీ) వాసవునినందనోద్యాన వాటినుండి । పరఁగ నిరువదివేల యచ్చరలు దివ్య । గంధమాల్య విభూషణ, కలితలగుచు । నచటికొయ్యనఁ జనుదెంచి రద్భుతముగ ॥ (క) కనకమణి విద్రుమంబుల । ఘనతరనవమౌక్తికములఁ గైసేసి వెసం। జనుదెంచి రజునిశాసన । మున నిరువదివేల దివిజ, మోహనగాత్రుల్ ॥ (తే.గీ) చెలువుమీఱంగ నెవ్వారి, చేగ్రహీతుఁ । డైనపురుషుఁ డున్మాదుఁ, డనఁగఁబరఁగు । నట్టివారు యక్షేశ్వరు ననుమతమున । వచ్చి రటు వింశతి సహస్ర వనజముఖులు ॥ (తే.గీ) ప్రమద మెసఁగ విశ్వావసు, ప్రముఖనిఖిల । విబుధగంధర్వసతులు వే, త్వెఱవార । దుండు తుంబురుఁడును భరతునిసమీప । మునమధురభంగిఁ బాడిరి సునతమెఱసి ॥ (తే.గీ) పుండరీకయు నయ్యాలం, బుసయు మఱియు । వామనయు మిశ్రకేశియు వసుమతీశ । నందనుని ప్రోల సంభృతానందులగుచు । సరసగతినాడి రమ్ముని, శాసనమున ॥ (క) మునిపతిశాసనముననం । దనవనమునఁ జైత్రరథవ, నంబునఁ గలశో । భనకర మాల్యంబులును । తనరుచి గనుపట్టె నపుడు తద్విపినమునన్ ॥ (తే.గీ) బిల్వకలి వృక్ష కాశ్వత్థ వృక్షచయము । లపుడు మార్దంగికులును శమ్యాఖ్యతాళ । ధరులు నర్తక శ్రేష్ఠులై వరుసఁదోఁచి । రమ్మునీంద్రుశాసనమున నద్భుతముగ ॥ (క) తిలకములు సరళతరువులు । కలగొట్టులు నక్తమాల, కంబులువరుసం । దిలకింప వామనాకృతిఁ । గలయం గుబ్జలయియకట, కనుపట్టెరహిన్ ॥ (తే.గీ) శింశుపా మలకీ వంశ కింశుకములు । మఱియుదక్కిన వనజాత, వల్లికాది ।



లతలు స్త్రీరూపములు దాల్చి, లలితఘణితి । నపుడు కనుపట్టె భరతుని యంతికమున ॥ (వ) ఇట్లు కనుపట్టె ॥ (క) తనిమిదీఱ మధుపుఁ గ్రోలుఁడు । ప్రమదంబునఁ బాయసంబు, భక్షింపుఁడు మే । ధ్యములైన మాంసములు వెస । నములుఁ డనెడు పలుకులతిఘు, నంబుగఁ జెలఁగెన్ ॥ (వ) అంత సౌందర్యవతులగు నయ్యువతులుద్వర్తనంబుఁ గావించి విమలనదీజలంబుల మజ్జనంబాడి చతుర్విధాలంకారంబులఁ గైసేసి పెక్కండ్రొక్కొక్క పురుషునిం బరిగ్రహించి వల్గునదీతీరంబులఁ బాదసంవాహనంబు సేయుచు జలార్ద్రాంగంబును వస్త్రాదికంబులచేతఁ దుడుచి యలంకరించి మధ్వాదిక పానంబు సేయుచు యథాసుఖంబుగా విహరింపుచుండిరి మహాబలురగు మునిప్రభావసిద్ధ వాహనపాలకులు భరతవాహనపాలకులకు గజోష్ట్రహయ ఖరంబులకు యథేష్టంబుగా నిక్షుమధులాజ ప్రముఖభోజ్యపదార్థంబులు గుడువం బెట్టి రాభరతసైనికులు సర్వకామంబులచేతఁ దర్పితులై మధుద్రవ్యసేవచేత మత్తులును మధుపానంబునఁ బ్రమత్తులును స్రక్చందనాదిభోగాశయంబునఁ బ్రముదితులునై తమతమవాహనంబులెఱుంగక యప్సరోగణంబులం గూడి సరస సల్లాపంబులు సేయుచు యమునాతీరప్రాంత కాంతారంబులం ద్రిమ్మరుచుఁ బద్మోత్పలగంధియై మందానిలంబు పైవీవ శీతల సికతాలంబులం గ్రీడింపుచు భరద్వాజుం డెంత మహానుభావుండనువారును నింక సాకేతపురంబునకు దండకారణ్యంబునకును బోవ వలదిచ్చట సుఖంబుగాఁ గాపురంబు సేయుదమనువారును భరతునకు శుభంబుగలుగుఁ గాక రాముండు సుఖియై యుండుఁ గాకయని దీవించువారును నీతపోవనంబు స్వర్గతుల్యంబై యున్న దనువారునై విహరింపుచుండిరి తక్కిన సమస్తజనంబులు నేతాదృశసత్కారవిధి నధిగమించి సంప్రహృష్టచిత్తులై స్వతంత్రులై శుభ సల్లాపంబులు సేయుచు హర్షనాదంబులు గావింపుచు మాల్యోపేతులై కార్యాకార్యవిచార శూన్యులై నృత్యంబు సేయుచు గానంబుఁ గావింపుచు హాసం బొనరింపుచుఁ బరువెత్తుచుఁ బరస్పరాలింగనంబు సేయుచు లతాగృహంబులు దూఱుచుఁ బన్నిటియేటికాల్వలఁ నీఁదుచు బహుప్రకారంబుల విహరింపుచు నమృతోపమానంబైన తదన్నంబు యథేష్టంబుగా భుజించిన వారయ్యును దివ్యంబులైన పక్వపదార్థంబులు విలోకించి భక్షించుటకు సామర్థ్యంబు లేమిం జేసి నోరూరం జూచుచుండి కొం

డొక సేపునకు నాసపెంపున వెండియుం గుడువ నుద్యోగించి యోపినంత గుడిచి నెక్కసంబైనఁ బరిహరించుటకుం జాలక గుడువనోపక యెచ్చవడి చూచుచుండి రిట్లు సర్వజనంబులు సంతుష్టమానసులై యఖండ కౌశేయ చేలంబులు ధరించి యీదృశంబైన సుఖంబెన్నఁడేనియుఁ గంటిమేయని మనంబునమెచ్చుచుండిరి పరిచారికలును దాసీ జనంబులును యోధాంగనలును మఱియు సైన్యంబునంగల వారందఱునుం దృప్తులగుటవలన దృప్తులైనూతన చేలధరులై యథాసుఖంబుగా విహరింపుచుండిరి కుంజరోష్ట్ర హయ ఖర గోవృషభ మృగ పక్షి గణంబులు యథార్హపదార్థంబులు భుజించి మదవిశేషంబున మాఱుమసలుచుండె నప్పుడాభరతసైనికులలోన నశుక్లచేలుండును క్షుభితుండును మలినుండును రజోధ్వస్తకేశుండునైన నరుం డొక్కరుండును లేఁడయ్యె మఱియు భరద్వాజుని మహిమాతిశయంబున నజవరాహమాంసంబుల చేతను సమ్యఙ్నిష్పన్న ఫలయుక్త శర్కరాది క్వాథరసంబులచేతను సుగంధిరసాన్వితంబులైనసూపంబులచేతను శాల్యోదనంబు చేతనుబరిపూర్ణంబులై యలంకారార్థ పరికల్పిత పుష్పధ్వజ యుక్తంబులైన సువర్ణ పాత్ర సహస్రంబు లద్భుత ప్రకారంబునం గనుపట్టె నత్తపోవన పార్శ్వంబులఁ బాయసకర్దమంబులైన కూపంబులును సర్వకామంబులఁ బితుకుధేనువులును మధువులంగురియు వృక్షంబులును బ్రతప్తపిఠర మృగ మయూర కుక్కుట సంబధి మృష్టమాంస సంచయంబులచేతఁ బరివృతంబులైమైరేయపూర్ణంబులైనవాపీశతంబులును మఱియుశాతకుంభ మయంబులైన పాత్రసహస్రంబులును స్థాలీనియుతంబులునుభోజన భాజనన్యర్బుదంబులును దధిపూర్ణంబులైన స్థాలీ సహస్రంబులును గుంభీకరంభీ సహస్రంబులును రసాల ఫల రసోపేతంబులైనయనతి నూతనా నతి పురాణ గౌర కపిత్థ పరిమళ యుక్త శొంఠి మరిచ లవంగైలానాగ పుష్పఖండ శర్కరా శృంగిబేర జీరక మిశ్రిత తక్రపూర్ణంబులైన హ్రదంబులును శ్వేతదధి పూర్ణంబులైన తటాక కూపంబులును బాయస నదులును శర్కరాయావసంచయంబులును నామలకీ ప్రభృతి కల్కంబులును జూర్ణకషాయంబులును నానావిధస్నానీయద్రవ్యంబులును సరిత్తీర్థంబులందు భాజనంబులం దిడిన స్నిగ్ధదంతధావన సంచయంబులును సంపుటంబులం దుంచిన శుక్లచందన పంకంబులును బరిమృష్టంబులైన దర్పణం



బులును వాసస్సంచయంబులును బాదుకోపానద్యుగ్మ సహస్రంబులును నంజనయుక్తకరండికలును కేశమార్జనంబులును శ్మశ్రు ప్రసాదకంబులును శస్త్రంబులును ధనువులును విచిత్రతనుత్రాణంబులును శయనాసనంబులును ఖరోష్ట్ర గజహయంబులచేత భుక్తంబైన పదార్థంబు జీర్ణించుటకు బాహట శాస్త్రోక్తప్రకారంబున నెయ్యది ద్రావంబడియె నట్టి ప్రతిపానంబు చేత సంపూర్ణంబులైన హ్రదంబులును నవగాహనయోగ్య శోభనజలావతరణ ప్రదేశంబులై కమలకుముదకైరవ మండితంబులై యాకాశవర్ణప్రతిమంబులై స్వచ్ఛతోయంబులై సుఖప్లవంబులై యలరు జలాశయంబులును నీలవైడూర్యవర్ణంబులైన మృదుతృణసంచయంబులును విచిత్రప్రకారంబునం జూడనయ్యె నప్పుడచ్చటిజనంబులందఱు మహర్షి చేతభరతునకుంగావింపంబడిన తాదృశాతిథ్యకర్మంబు విలోకించియదృష్టపూర్వత్వంబువలన నయత్నసిద్ధత్వంబువలన నాశ్చర్యస్థానత్వంబువలన స్వప్నకల్పంబనితలంపుచుమహాద్భుతంబునొందుచుండి రిత్తెఱంగున నందనోద్యానంబున విహరించు దేవతలమాడ్కి రమ్యంబైన భరద్వాజాశ్రమంబున విహరించు భరతసైనికుల కారాత్రి సుఖతరంబుగా నతిక్రమించెనంతఁ బ్రభాతకాలంబగుటయు నమ్మహర్షి చేతననుజ్ఞవడసి గంధర్వులును దిక్పాలకులును సర్వదేవతలును నప్సరసలును నదులునుదివ్యచందనంబులును దివ్యమాల్యంబులును మఱియుఁ దక్కిన తపస్సంప్రాప్తపదార్థంబులన్నియు యథాస్థానంబులకుంజనియెఁ బదంపడిసూర్యోదయంబయ్యె సర్వజనంబులుపూర్వప్రకారంబున భోగంబులచేతఁ దృప్తులై మదిరాపానమత్తులై

—(*)ఆతిథ్యాంతమున భరతుఁడు భరద్వాజునిసందర్శించుట.(*)—

దివ్యాగరు చందనోక్షితులై రాత్రికాలవ్యాపారంబంతయు సత్యంబనిసూచింపంజేయుచుండిరి నానావిధ దివ్యపుష్పమాల్యంబులు మనుజ ప్రమర్దితంబులై పృథక్ప్రకీర్ణంబులైయుండెనంతభరతుండుసపరివారుండై రామదర్శన కామంబున భరద్వాజునిఁ గానంబోయిననతండు తనకడకుం జనుదెంచి ప్రాంజలియైయున్న యారాజకుమారునవలోకించిహుతాగ్నిహోత్రుండై సాదరంబుగానిట్లనియె॥ (క) భూమీశతనయనీకీ । యామినిమాయొద్దసుఖద,మైయొప్పెనెభృ। త్యామాత్యులుసైనికులును । సేమమున నెలంగిరే వి,స్రష్టశ్రములై ॥ (క) అనవినిభరతుఁడు వినయం । బున నమ్మునిపాదములకు, మ్రొక్కి కరయుగన । బ

నుపుగశిరముననిడుకొని । తనవాక్యాద్భుతపథ్యమలరఁ, దగనిట్లనియెఁ ॥ (తే,గీ) తాపసోత్తమనీప్రసాదమునఁ జేసి । విమలభంగిసమస్తకామములచేతఁ । దర్పితుండనై మంత్రిబాంధవచమూస । హితముగానేఁడు కడు సుఖోషితుఁడనైతి॥ (తే,గీ) అప్రతిమశోభనస్థానులై సుభక్ష్యు । లైయుపేత పరిశ్రములై యనంత । భోగులై ప్రేష్యయుతముగఁ, బొలుపుమీఱ । నఖిలజనులును ఖోషితు, లైరినేఁడు ॥ (చ) పరమతపోధనా సుజన, బంధునిరాముని గానఁ బోవలె । న్థిరమతి నిచ్చటందడవు సేయఁగఁ బోలదుపుణ్యుఁ డామహా । పురుషుఁడుసంవసించినతపోవనమిచ్చటికెంతదూరమొ । తెలుఁగునఁబోవు టొప్పగుసు, ధీవరనాకెఱిఁగింపుమింతయుఁ॥ (వ) అనినవిని॥ (సీ) మునినాథుఁడతనికిట్లనియెనిచ్చోటికి రాజనందనసార్ధయోజనద్వ । యంబు దవ్వుల రమ్యమై పుణ్యవిపినమై చిత్రకూటంబనుక్షితిధరంబు । తనరునగ్గిరికినుత్తరభాగమందు మందాకినీనామనిమ్నగచెలంగు । నారెంటినడుమఁజెల్వగు పర్ణకుటి యందు రాముఁడున్నాఁడుశీఘ్రముననీవు॥ (తే,గీ) సవ్య దక్షిణ పథమునఁజనిబలముల । భూధరప్రాంతకాంతార భూమినిలిపి । యవలఁదగువారిఁ దోడ్కొని యరిగితేని । కౌసలేయునినచ్చటఁగాంచవచ్చు॥ (క) అనిమునిపతి పలికినవిని । జననాథపురంధ్రులెల్ల సవినయముననఁ । య్యనఘాత్ముని కడకుంజని మునుకొనితచ్చరణములకు మ్రొక్కిరివరుసఁ॥ (తే, గీ) అంతఁబుత్రవియోగశోకానలార్చిఁ । జ్వాలసంతప్తయైనకౌసల్యయలసు । మిత్రతోఁగూడి పరమపవిత్రుఁడైన । జటిపదంబులుకరములసంస్పృశించె॥ (క) పదపడిమోమునసూతన । విధవాత్వము గానుపింప వృజినంబులకా । స్పదమగుకైకయుయమ్ముని । పదములు తగ సంస్పృశించెఁబాణిద్వయిచేఁ॥ (వ) అట్లుకైకేయి యమ్మహామునికి నమస్కరించి యతనిమ్రోలఁ గౌసల్యాసహితంబుగా నిలుచుటకుసిగ్గువడి ప్రదక్షిణవ్యాజంబున నవ్వలికింజని భరతుని సమీపంబున దీనవదనయై యుండెఁ గౌసల్యాద్యంతఃపురకాంతల నందఱ విలోకించుటకుఁ దపోవనబహిః ప్రదేశంబునకుంజనుదెంచి యున్నవాఁడగుటంజేసి యమ్మునిశ్రేష్ఠుఁడప్పుడు వారల నందఱఁ గలయవిలోకించి భరతునింజేరి రాజనందనా భవజ్జనయిత్రులలోన విశేషంబెఱిం

—(*) భరతుఁడు భరద్వాజునికిఁ దల్లులనందఱ నిరూపించి చెప్పుట. (*)—

గింపుము॥ (మ) అనినం బ్రాంజలియైయతండు మునివంశాగ్రేసరుంజూచియు।



ట్లనుఁబూతాత్మకపుణ్యశీలనిజవంశాచారసంసక్తచి । త్తనృపాలాగ్రణికగ్రపత్నియలసంధ్యాదేవి కిన్సాటియౌ । ఘనదాక్షిణ్యగుణాఢ్యధర్మరతయీకౌసల్యవీక్షించితే॥ (మ) అనఘాయీయమపుణ్యశీలుమనువంశాగ్రేసరున్సజ్జనా । వనధుర్యున్సుగుణాలవాలువిగత వ్యాపాదునిన్సింహాసం । హననునాత్మజకులైకభూషణుమనోజ్ఞాకారుధీరున్యశో । ధనునిన్రాముఁ గాంచెనయ్యదితి ధాతన్గన్నచందంబునఁ॥ (తే, గీ) గహనమునశీర్ణనవకర్ణికారశాఖ । కరణిఁగౌసల్యవామభాగంబునఱిమి । యతులశోకరసార్ద్రదే, హతయుఁబోలె । మెలఁగుచున్నయీదేవి సుమిత్రసుమ్మి ॥ (తే,గీ) ఇమ్మహాసాధ్వి తనయుల, హీనసయులు । సత్య విక్రమరతులుఁబ్రసన్నమతులు । వ్యాఘ్రవిక్రాంతగమనులు నరిదిమనులు । ఘనులు లక్ష్మణశత్రుఘ్నులనఘచరిత॥ (సీ) తాపసవర్య యెవ్దానికృతంబునఁగౌసలేయుఁడువనవాసియయ్యెఁ । బుత్రవిహీనుఁడై భూవిభుఁడెద్దాని కలుషంబుకతన స్వర్గస్థుఁడయ్యె । నట్టిదుశ్చిత్త న నార్యరూపిణి దృప్తనైశ్వర్యకామ న న్యాయమతిని । గ్రోధన నతిసతీ, లోకవిగర్హితఁ గైకను మాయమ్మఁ గానెఱుంగు ॥ (తే,గీ) మెల్లపాపంబులకు మూల, మిదియెదేవ । యను

(*) కైకయీస్మరణకుపితుండగు భరతుని భరద్వాజుఁడూఱడించుట. (*)

చునీరీతిగాఁగద్యమడరఁబలికి । క్రోధమున ఫణిభంగి నూర్పులు నిగుడ్చి । దీప్తముఖుఁ డయ్యెఁ గనులరక్తిమచెలంగ॥ (వ) ఇట్లు మాతృనామస్మరణసంజాత క్రోధవిశేషంబున దుర్నిరీక్ష్యుండైన భరతుంజూచిభరద్వాజుండర్థవంతంబైనవాక్యంబుననిట్లనియె॥ (క) ఊరక యొకకైపై దో । షారోపణమాచరించి, యలుగఁదగదునీ । కారామవివాసనమున । నారయజగమునకు సౌఖ్యమయ్యెడిసుమ్మీ॥ (వ) వత్సా యీరామ ప్రవ్రాజనంబువలన దేవదానవమహర్షులకు మిక్కిలిహితంబుగాఁ గలదనిపలికిన నాభరతుండు మునివచనశమితక్రోధుండై యత్తాపసశ్రేష్ఠునకుఁ బ్రదక్షిణ పూర్వకంబుగా నమస్కారంబుఁ గావించి తదాశీర్వాదంబులు గైకొని యా మంత్రణంబు వడసి మంత్రులం జూచి ప్రయాణంబాజ్ఞాపించిన వారు తద్వచన ప్రకారంబున నెల్లవారికిఁ బ్రయాణంబు సాటించిన యనంతరంబ నానావిధ జనంబు ప్రయాణార్థులై హేమపరిష్కృతియుక్తవాజిరథంబులనారోహించిచనియె హేమకక్ష్యంబులును బతాకావంతంబులునై కరిణీగజంబులు ఘనమార్గాంతంబునం

భరతుఁడు సైన్యసమేతుఁడై చిత్రకూటపర్వతంబునకేగుట.

డు ఘోషవంతంబులైన జీమూతంబులభంగి నలరుచుం జనియె మహాహర్యం
బులైన నానావిధ గురులఘుయానంబులెక్కి తక్కినజనంబుచనియెఁ బదాతు
లు పాదగమనంబునంజనిరి యానప్రవేకంబులారోహించి రామదర్శనలాలస
లై కౌసల్యాప్రభృతి రాజకాంతలరిగిరి తరుణచంద్రార్క సదృశశిబికనారో
హించి సపరిచ్ఛదుండై భరతుండుచనియె నిట్లు గజవాజిరథాకులంబైన య
మ్మహాసైన్యంబు మహామేఘంబుచందంబున నాగస్త్యంబగు దిగ్భాగంబు నావ
రించి మృగపక్షిజుష్టంబులైన గిరినదీతీరంబులంగల విపినంబు లతిక్రమించి గ
యంబునంబోవుచుండె నప్పుడు ॥ (చ) లలితవినీలశాద్వలచరన్మృగపఙ్క్తి
దవాగ్నిధూమమం । చలఘుభయంబునంబరువ నంచలువార్షికమేఘమంచు
భీ । తిలఁగవనాటకోటిపటు తీవ్రతమంబనియుక్కువల్సారం । బలుగతులం జెలం
గెనల భారతసైనికపాంసుజాలముల్ ॥ (క) ఆలోసైన్యముకుతుక । వ్యాలో
లంబై ధరిత్రి నాచ్ఛాదించెన్ । వాలాయము ఘనవర్షా । కాలాంబుదమాక
సంబుఁ గప్పినమాడ్కిన్ ॥ (క) హరిసామజోష్ట్రగోరథ । ఖరములచే సాంద్ర
భంగిఁగప్పఁబడివసుం । ధర చిరకాలముజనులకు । గరమద్భుత భంగి నపుడు
కనుపడకుండెన్ ॥ (క) ఏతాదృశఘనసైన్యో । పేతుండై భరతుఁడిట్లు పృథుసం
రంభ । స్ఫీతుఁడగుచు దూరముచని । చేతఃఖేదముననవ్వసిష్ఠున కనియెన్ ॥ (క)
సదయుండగుముని చెప్పిన । ప్రదేశమిదె చిత్రకూట పర్వతరాజం । బదె మందా
కినియదియ । ల్లదెయ దెయసితాభ్రతుల్య మగువనమనఘా ॥ (క) గిరితుల్య
మత్తమామక । కరటిఘటాదంతకాండఘట్టనముననీ । వరచిత్రకూటసానువు ।
లతిముదిఁద్రుటితాశ్మపఙ్క్తు లయ్యెడిఁగంటే । (క) జలధరములగు ఘనంబు
లు । జలములఁదొనలందుఁగురియు చందంబునని । ట్టలముగ నగములు చరులం ।
దలరులువడిఁగురియుచున్న వల్లవెకంటే ॥ (క) అంబుధి మకరవితతిచే । తం
బోలెనితాంతమృగవితతిచే వ్యాకీ । ర్ణంబగుచుఁ జిత్రకూటన । గంబొప్పెడుఁ
*) భరతుఁడు శత్రుఘ్నునితోఁ జిత్రకూటపర్వతము నభివర్ణించి చెప్పుట. (*
గంటె దేవ కాంతాలయమై ॥ (వ) అనిపలికి శత్రుఘ్నునవలోకించి ॥ (క) వా
తప్రవృద్ధఘనసం । ఘాతంబుఘనాత్య యమున గగనము నందున్ । బోతిరుగు
కైవడి మృగ । వ్రాతముచెలువారవేగ వంతంబగుచున్ ॥ (క) జలదప్రకాశ



ఫలకం । బులచేతన్ దాక్షిణాత్యపురుషులక్రియనా । దలలందుభటులుతమి భా ।
సిలఁగుసుమాపీడనములు చేసెడుఁ గంటే ॥ (వ) మఱియు నమ్మహాఘోర
కాంతారంబు తొల్లివిజనంబైన నిప్పుడు జనాకీర్ణంబైన సాకేతపురంబుభంగి
సామ్యదర్శనంబైయున్నది విలోకింపుము ॥ (తే, గీ) హరిఖురోద్ధూత పటు
సాంద్రధరణిరజము । దావమునువ్యోమభాగంబు నావరించ । గాడ్పు మనకుఁ
బ్రియముసేయుకరణిదాని । విరియఁదట్టెడుఁగంటివే వినుతచర్య ॥ (క) తుర
గోపేతములగుసుం । దరరథములుసూతచోదితములయ్యునుస । త్వరగతిఁజ
ననేరకకడు । భరమునవిపినమునఁజిక్కువడియెడుఁ గంటే ॥ (చ) హరిపదవీథి
పైఁబొలుచు నస్మదనీకపరాగజాలమి । త్తఱిఁబరికించివారిదక దంబనుఁటంచ
లచిత్రకూటభూ । ధరశిఖరాగ్రభాగమునఁ దద్దయుఁ జిత్రకలాపజాలము । ల్వి
రివిగఁ బాయవిచ్చిసర విన్శిఖులాడెడుఁగంటెముంగలన్ ॥ (తే, గీ) పద్మగర్భ
నకెనయైన పరమమునుల । కాశ్రయంబిదిగావున ననఘ యీప్ర । దేశము త్రివి
ష్టపముఁబోలి దివ్యమైయు । నామయంబయితోఁచెడి ననఘ కంటె ॥ (తే, గీ)
భాను తేజమనోజ్ఞరూపంబులైన । మృగములుమృగీయుతంబులై యివ్వనమున ।
ధవళసుమములచేఁజిత్రితంబులైన । చందమున నొప్పుచున్నవి చాలఁ గంటె ॥
(తే, గీ) అతులితపరాక్రములు ధీరు లతిగభీరు । లసదృశులు రామలక్ష్మణులధిక
బలురు । మనకుఁజూపట్టునందాఁక వనములోన । వీరభట పుంగవులు చొచ్చి
వెదకవలయు ॥ (వ) అని భరతుండాజ్ఞాపించినఁ దత్క్షణంబ కోఁదలు యోధు
లు శస్త్రాస్త్రపాణులై యవ్వనంబుఁ బ్రవేశించి పురోభాగంబున వర్షాకాల
మేఘంబుకరణి శ్యామంబై యొప్పుచున్న ధూమాగ్రంబు దవ్వులం గాంచి క్రమ్మ
ఱ భరతునొద్దకుం జనుదెంచి దేవా యగ్రభాగంబున దవ్వుల ధూమాగ్రం
బొప్పుచున్నది కృశానుండు లేనిచోట ధూమంబుండదు నిర్జనంబైనస్థానంబు
నఁ గృశానుండుండఁడు నిక్కంబుగా నచ్చట రామలక్ష్మణులు వసించియుండం
బోలు నట్లుగాదేని రామసమానులయిన మునులు నివసించియుండఁబోలునని
యూహించెదమని పలికిన సాధుసమ్మతంబులైన వారల పలుకులువిని యమిత్ర
బలమర్దనుండైన భరతుండు సర్వసైనికుల విలోకించి మీరిచ్చటనుండి పశ్చా
ద్భాగంబునం జనుదెండు వసిష్ఠుండును సుమంత్రుండును నేనును బురోభాగం
బునఁజనియెదమనిపలికిన వారుఁ దద్వచనప్రకారంబునఁ బిఱిందికిఁ జని చిరకా

లంబునకు రామసమాగమంబు దొరకొనియెఁ గదా యని సంతసింపుచు ధూ
మాగ్రగతవీక్షణులై చనుచుండిరి భరతుండును ధూమాగ్రంబు విలోకింపుచుం
బోవుచుండె నంతకు మున్న గిరివనప్రియుండగు రామభద్రుండు తచ్ఛైలంబు

—(*) రాముఁడు సీతకుఁ జిత్రకూటమునందలి విశేషములను జెప్పుట. (*)—

నందు దీర్ఘకాలోషితుండై పురందరుండు పులోమజం బోలె వైదేహినవలో
కించి యద్దేవికిఁ బ్రియంబు సంపాదించువాఁడై వనవాసపరిక్రాంతం బైన తన
మనంబున కభిమతవిషయాంతర వ్యాసంగంబున నానందంబు సంపాదింపుచు
నమ్మైథిలి కిట్లనియె॥ (క) గతసామ్రాజ్యుఁడనయ్యును। హితజనరహితుండన
య్యు నీరమణీయ। క్షితిధరముఁ గాంచి మదిన। ప్రతిమామోదముననున్న వాఁ
డనతాంగీ॥ (క) నానాకూటవిరాజిత। మై నానా ధాతు కలిత మై సాంద్రగ
తిఁ। నానాఖగమృగయుతమై। యీనగము లరారెడి న్మృగేక్షణ కంటే॥ (వ)
మఱియు ధాతు భూషితంబులైన యీశైలదేశంబులు కొన్ని రజత సంకాశం
బులుఁ గొన్ని క్షతజసన్నిభంబులు కొన్ని పీతమాంజిష్ఠవర్ణంబులు కొన్ని మణి
వరప్రభంబులు కొన్ని పుష్యరాగస్ఫటిక కేతకీపుష్పవర్ణంబులు కొన్ని నక్షత్ర
పారదసప్రభంబు లీశైలంబదుష్ట నానామృగ గణ సింహ వ్యాఘ్ర భల్లూకస
మూహంబులుగలిగి విచిత్ర పక్షిసమాకులంబై ప్రకాశింపుచున్నది మఱియు
నామ్రాసనలోధ్ర ప్రియాళుపనసధవ తిమిశాంకోల బిల్వతిందుకారిష్ట వరుణ
మధూక తిలక బదర్యామలకనీప వేత్రధనుర్వనబీజకాది నిఖిలతరువ్రాతంబులు
పుష్పవంతంబులై ఫలోపేతంబులై ఛాయాయుక్తంబులై మనోరమంబులై
యొప్పుచున్నవి విలోకింపుము॥ (క) రమణీయపర్వతప్ర। స్థములందు విరాళిఁ
గాను సమ్మోహితులై। రమియింపుచున్న కిన్నర। రమణీ రమణులను గంటె
రాజీవాక్షీ॥ (క) అంబుజముఖి కనుఁగొనుము ఘ। నంబుగ విద్యాధరాంగనా
క్రీడోద్దే। శంబులు మిక్కిలి నాహృద। యంబున కానందకరములై యున్నవిటన్॥
(క) తరువిటపంబుల వ్రేలెడు। వరమణిమయభూషణములు వస్త్రంబులు సుం।
దరమాల్యంబులు ధనువులు। సురుచిరఖడ్గములు వ్రేలఁ జూడుము తన్వీ॥ (తే,గీ)
జలజముఖి యున్నతప్రదేశమున నుండి। దుమికెడు విశాలగిరినిర్ఝరముల చేత। నల్ప
నిర్ఝరముల చేత నద్రిచాలఁ। గ్రాలెడు ప్రస్రవన్మదం బైన గజముకరణి ॥ (క) ఫలకు
సుమసంభృతంబగు। విలసద్గంధము గ్రహించి విసువక గిరిపైఁ। బలుగతుల వి



సరు కరువలి। చెలియ ప్రవాసులకు సుఖము, సేయక యున్నే॥ (క) నీవును
రాజాన్వయనయ। కోవిదుఁడగు లక్ష్మణుండ, కుంఠితభక్తిన్। సేవింపుచుండ
నిచ్చట। వావిరి నిలువంగ రాదె, వర్షశతంబుల్॥ (క) అతులితఫలకిసల
యసం। గతమును రమ్యంబు పక్షిగణయుతమగు నీ। క్షితిధరశిఖరాగ్రము
పై। రతివంతుఁడనైతి సుమ్మి, రాజీవాక్షీ॥ (క) జనకుని బుణ మీఁగుటయును। గొ
నకొని భరతునకుఁ బ్రియముఁ గూర్చుటయును గా। నవనవాసము చేనాకిటు।
వనజాక్షి ఫలద్వయంబు వచ్చెం జుమ్మీ॥ (తే,గీ) నెలఁత మానసవాక్కాయ,
నియతవగుచు। వివిధచేష్టలు చూచుచు, వేయిగతుల। నన్నుఁ గూడి యీర
మ్యకాననమునందు। నీనగంబునఁ గ్రీడింపు, మింపు మెఱయ॥ (తే,గీ) రమ
ణీయన్యరాజర్షులరణ్యవాస। మమృతమని పల్కి రస్మదీయాన్వవాయ। రా
జులెల్లఁ బునర్భవార్థంబు కొఱకుఁ। గాననని వాస మని రర్థి ఘనత మెఱసి॥
(క) శైలోపరి భాగంబున। నీలారుణపీతధవళ, నిర్మల రుచుల। న్వాలాయ
యముఁ జూపట్టువి। శాలశిలా పటలిఁ గంటె చంచలనయనా॥ (తే,గీ) చా
రువదన యెద్దానికే, సరము విరుల। వృద్ధినొందిన కైపడి వెలసె నట్టి। యీశి
లా పట్టమీక్షింపు, మిదిగో యుష్మ। దర్థమిడినట్లు పరికింప నయ్యెనహహ॥
(వ) మఱియు నిమ్మహీధరంబునం గలదివ్యౌషధులు సహస్రప్రకారంబుల స్వ
కాంతిసంపదల చేత భ్రాజమానంబులై రాత్రియందు హుతాశనజ్వాలలభంగి
వెలుంగుచున్నవి కొన్ని దేశంబులు సదనసదృశంబులయి కొన్ని యెడలుద్యా
నసన్నిభంబులై కొన్ని నెలవులేక శిలారూపంబులయి యద్భుతప్రకారంబునం
జూపట్టుచున్నవి మఱియు నీచిత్రకూట పర్వతంబు ధరిత్రిని భేదించి సముత్థి
తంబయిన మాడ్కి నలరుచున్నది పర్వత శిఖరంబు శుభదర్శనంబై యున్నది
మఱియుఁ గుష్ఠపున్నాగసరళభూర్జపత్త్రోత్తరచ్ఛదంబులయి కుశేశయదళయు
తంబులై కాముకులయాస్తరణంబులు శోభిల్లుచున్నవి తత్పరిసరంబునఁ బరిమ్లానం
బులై మృదితంబులై పుష్పమాలికాసందోహంబులు వ్రాలియున్నయవి చిత్ర
కూటనగంబు బహుమాల్యఫలోపేతంబై యమరావత్యలకాపురంబులను మా
నససరోవర సౌగంధికాఖ్యసరోవరంబుల నుత్తర కురుదేశంబుల నతి రమణి
యత్వంబున నతిక్రమించినట్లొప్పుచున్న దిచ్చటఁ జతుర్దశవర్ష వ్యతిరిక్తపు
రుషాయుఃకాలం బంతయు రాజర్షి సమాచరితంబులైన స్వనియమంబులన

నుసరించి లక్ష్మణునితోడ నీతోడంగూడి విహరించినంగో యంత యేమి వనవా
సవత్సరంబు లిచ్చటఁగడపి యవ్వల రాజ్యసుఖం బనుభవించెదనని యీదృ
శంబులైన శుభవాక్యంబులు సీతకుంజెప్పుచు నప్పర్వతంబుడిగ్గి తత్కటకంబు
న రమ్యజలాకీర్ణయగు మందాకినీనది నవలోకించి రాజీవలోచనుండగు రా
ముండు చారుచంద్రనిభాననయగు జానకి నవలోకించి వెండియు నిట్లనియె॥
(శా) రాజీవేక్షణరమ్యచిత్రపులినన్రమ్యక్షజగత్పావని । నాగిజతైకరవ షండ
మండలయుత స్నానాతటోద్భూతధా । త్రీజాతావృతఁజక్రహంసముఖపత్రివ్యా
కులన్యక్షరా । ద్రాజీవాకరతుల్యనచ్ఛజలపూర్ణన్నిమ్నగంజూచితే॥(సీ)ఒక
వంకనవకైరవోత్పలాంబుజవనాలంకృతంబుమదాళిఝంకృతంబు । నొకచోట
దివ్యగంధోపేతపవనవిరాజితంబుమరాళకూజితంబు । నొక దెసగగనచుంబ్యు
త్తుంగకల్లోలభావితంబుకుళింగ సేవితంబు ।నొకయోరవనదేవ యువతి సంగీత
సన్నాదితంబలసారసోదితంబు॥(తే,గీ)నొక్కయెడనిమ్నగావర్త మొక్కచోవ।
స్తనితగంభీర మొకచాయఁ జక్రవాక । శోభితంబయి యెల్లెడఁ జూడనొప్పె।
నబ్జలోచన యిచటిశోభాతిశయము॥ (సీ) అలివేణికంటె దివ్యారణ్య ఫలప
ల్లవోద్దీపితారణ్య,మొక్కచోటు । కలకంఠికంటె మా, కందపల్లవ భావనో
న్మత్తపికనాద, మొక్కచోటు । పూఁబోఁడికంటె సంపుల్ల కలాపమయూర
నాట్యవిశాల, మొక్కచోటు । రాజీవముఖికంటె, రమణీయతరమృగ యూ
థకోలాహలం,బొక్కచోటు॥ (తే,గీ) చెలువయొకచోటు సిద్ధనిషేవ్యమాన।
మతివయొకచోటు దేవవిహారయోగ్య । మింతియొకచోటు వనదంతి, దంత
యుతము । దేవిచూచితె యీనదీ, తీరమందు( (తే,గీ) తామరసనేత్రిమృగ
నిపీతంబులగుట । వలనఁగలుషోదకంబులై, యలరునట్టి । యీమనోజ్ఞతీర్థం
బు లిం,పెసఁగనాకు । వేడ్కఁబుట్టింపుచున్నవీ, వేళఁగంటె॥ (క) ఘనవల్క
లంబులుజటా । జినములు ధరియించిమాని శేఖరులు ముదం । బునసీనదిలో
మజ్జన । మొనరింపుచున్న వారుయువతీకంటే ॥ (క) రమణీ మఱికొందఱు
పం । యములిచ్చట నూర్ధ్వబాహు, లై నియమునం । గ్రమమున నాదిత్యు
నిస । ర్వమయునుపాసింపుచున్న, వారలుకంటే ॥ (తే,గీ) పత్రపుష్పంబులి
న్నది,పైసృజించు । మారుతోద్ధూతశిఖర,ద్రుమముల చేతఁ । బరగనృత్యం
బొనర్పనుపక్రమించు । పగిదిఁజూపట్టుచున్నది, పర్వతంబు॥ (తే,గీ) వారిజే



క్షణసీరమ్య, వదనజనిత । కాంతినీక్షించి తమకట్టి,కాంతిలేమి । వనరుహంబు
లుసిగ్గుచే,మునిఁగెననఁగ । జలముల మునుంగుచున్నవి,చెలువ కంటె ॥ (క)
ఒకచోట మణినికాశో । దక మొకయెడ విమలసైకతం,బొకచోన । త్యకలం
కసలిల మొకయెడ । వికచసరోజములు గలిగి,వెలసెడుఁ గంటే ॥ (క) శ్వ
సనాహతనవవికచ । ప్రసూనములు పాదపముల,పైనుండిరహిం । న్వోస్రవాలి
పఱచినట్లుగఁ । బోసఁగఁ బ్రవాహంబు వెంటఁ, బోయెడుఁగంటే ॥ (క) వ
నజాతనేత్ర చూచితె । పనివడి జక్కవలు మధుర, ఘణితిని నాదం। బొనరిం
పుచుఁ గమలోత్పల । వనషండములందుఁ ద్రవాలి,వఱలెడు ద్రమోలన్ ॥(తే,గీ)
ఇన్నదీసైకతములందు, నిన్నుఁగూడి । వలసినట్లు క్రీడింపుచు,లలితఘణితి । ని
మ్మహాగిరిపై వసి, యించుకంటె । నతివ పురవాస మధికపుణ్యంబు నాకు ॥
(క) అతులిత తపోదమశమా । న్వితులగు తాపసుల చేత, నిత్యమువిక్షో । భి
తజలయగు నీనది నం । చితభక్తిన్నన్నుఁ గూడి, సేవింపుమికన్ ॥ (వ) క
ల్యాణి నీవిమ్మహానదియందు మత్సమేతంబుగా నవగాహనంబు సేయుము భవ
జ్జఘనకుచాఘాత జనిత తరంగంబుల చేతఁ గమలోత్పలంబులు నటనంబుఁ గా
వింపంగలవు ॥ (క) ఆమందాకిని శక్రుని । కోమలి కనిశంబుఁ బ్రియముఁ,
గూర్చిన క్రియనేఁ । డీమందాకిని నీకును । లేమాయెడఁగూర్చు హితముఁ,బ్రి
యమునుసుఖమున్ ॥ (క) ఈపర్వతరాజమయో । ధ్యాపట్టణ మట్ల యిమ్మ,
హానదిసరయూ । న్వీపవతి యట్ల యరయుము । భూపుత్రీ నన్నుఁగూడి, పొం
దుముసుఖముల్ ॥ (తే,గీ) బాలశశిఫాల నీ వను,కూలవగుచు । హితముఁ
గావింప లక్ష్మణుఁ,డధికభక్తి । నస్మదాజ్ఞా వ్యవస్థితుం, డగుచునుండ । ముద
మునాకబ్బుటకు నింకఁ,గొదవయేమి ॥ (క) క్రమయుక్తిఁ ద్రిషవణస్నా । న
మొనర్చుచు వన్యమనుది,నంబు మెసవుచు । న్నిముఁగూడి నామనంబున । ర
మణీ కాంక్షింప నింక, రాజ్యమునుబురిన్ ॥ (చ) తతమృగ యూథశాలిని
యుఁ, దామరసావృతయు న్మహామృగ । ప్రతతినిపీతతోయయును, బాదప సే
విత యున్మహోర్మికో । న్నత యగు నిమ్మహాతటిని, స్నానమొనర్చి గతక్ల
ముండనా । హతకుశలుండుగాని నరుఁ,డంగన యెవ్వఁడు లేఁడుచూడఁగన్ ॥
(వ) అనియివ్విధంబున రాముండు ప్రియాసహాయుండై బహువిధంబులగు వచ
నంబులుపలుకుచుఁ గొండొకసేపు నయనాంజనప్రభంబైన చిత్రకూటపర్వతం

బునవిహరించియనంతరంబనిజాశ్రమసమీపంబున నొక్కరమణీయగిరిప్రస్థంబు
నందు సీతాసమేతంబుగా సుఖాసీనుండైయిదిమేధ్యం బిదిస్వాదుయుక్తంబిది
వహ్నినిష్టప్తంబని వచింపుచు మృగమాంసప్రదానంబున నద్దేవిని రంజిల్లంజే
యుచుండె నప్పుడు సమీపంబునం జనుదెంచుచున్న భరతుని సైన్యశబ్దంబును
జమూచరణోత్థిత పరాగంబును నింగి ముట్టిచెలంగె నమ్మహాధ్వని విని వార
ణాదిమృగంబులు సయూథంబులై భయంబుఁగొని పెక్కుతెఱంగులం బరుగె
త్తుచుండె నంతరాముండు సైన్యసముద్ధూతశబ్దంబువిని శబ్దసంశ్రవణ సంజా
తసాధ్వసంబునం బఱచు మృగంబులనవలోకించి దీప్తతేజుండైన సౌమిత్రికిట్ల
నియె॥ (చ) జలనిధిఘోషమట్లఘున శబ్దముకై వడి నొక్కనాదమ । త్యలఘు
గతిన్విననంబడియె నద్భుతపాంసువులెల్లదిక్కులం । గలయఁగ నాక్రమించె గజ
ఖడ్గమృగేంద్రవరాహయూథము । ల్బలుగతుల న్భయంబుఁగొని పాఱెఁదొడం
గెఁగుమారచూచితే॥ (తే,గీ) జనవిభుఁడొతత్సముండొయీ వనమునందు ।
వేఁటసలుపంగవచ్చెన వ్విధముగాక । శ్వాపదం బరుదెంచెనో సత్వరముగఁ।
గలతెఱంగంతయునునీవు తెలిసికొమ్మ॥ (క) ఈనగముపక్షిగణముల । కైనను
దుశ్చరములక్ష్మణాయీపగిదిం । బూనుకచనుదెంచెడువాఁ । డేనరుఁడో వేగఁ
దెలియు మెంతటిఘనుఁడో॥ (చ) అనవినిలక్ష్మణుండురయ మారఁగఁబుష్పిత
సాలమెక్కియా । యనువునదిక్కులన్నిగల యంబరికించి యుదఙ్ముఖంబుగాఁ।
గనుఁగొనియెన్మతాంగతుర గద్విపసంకులము న్మృగాధిరా । జనిభపదాతి సం
యుతము సాగరతుల్యముభూరిసైన్యముం॥ (క) ఈరీతిఁ గాంచి యారఘు।
వీరుఁడుసాలముననుండి వెసఁబ్రాంజలియై । యారామునితో సైన్య । ప్రారం
భంబెఱుకపఱచి పలికె న్మఱలన్॥ (క) వీరోత్తమవహ్నినర । ణ్యారోపితుఁ జే
సిసీత నద్రిబిలమునం । జేరిచిరక్కునఁజేయుము । దారుణశరచాపకవచ ధార
ణమునఘా॥ (క) అనివేగిరపడిపలికెడు । ననుజ న్మనిఁజూచి పలికె నారామవి
భుం । డనఘాయెవ్వనిబలమో । కనుఁగొనుము సవిస్తరంబు గాసర్వంబున్॥

—(*)లక్ష్మణుండు శ్రీరామచంద్రునకు భరతాగమనం బెఱింగించుట.(*)—

(ఉ) నావినిలక్ష్మణుండువద నంబునఁగోపము చెంగలింపఁగాఁ । బావకుకైవడిం
గెరలి ప్రాంజలియైతనయన్నకిట్లను । న్దేవకృతాభి షేకుఁడయి ధీరత నిన్నుఁ జ
యింపఁగోరియీ। త్రోవ బలంబుగొల్వభర తుండరుదెంచుచు నున్నవాఁడొ



గిన్॥ (ఆ,వె) మింటిపొడవుగలిగి ఘంటాఘణంఘణ । నినదమెల్లదెసలనిండఁ
దద్ర । థంబుమీఁదనున్నతస్కంధమగుకోవి । దారకేతు వలరు ధర్మనిరత॥
(తే,గీ) చటులగతిగల్గునారట్టజములనెక్కి । విచ్చుకత్తులతళతళ ల్గిచ్చుకొనఁ
గ । సాదులరుదెంచుచున్నారు సాహసమున । వారణారోహకులఁగంటె వాఁ
డిగలిగి॥ (క) మనమాయుధములుగొనిగ్ర । ద్దనగిరి శిఖరంబు పైకి దాటుద
మోలే । కనఘాసన్నద్ధులమై । మునుకొని యిచ్చటనె యుంద మో తెల్పుమె
గిన్॥ (క) క్రొవ్వునమనలందాఁకిన । నెవ్వనికృతమందుమనకు నీగతినిడుమ।
ల్నివ్వటిలెనట్టిభరతునిఁ । జివ్వకురాఁదిగిచి కృపణుఁజేసెదఁగడిమిన్॥ (తే, గీ)
మిహిరకులవర్యయేమిని మిత్తిమీవు । వితత రాజ్యంబు వలనవి చ్యుతుఁడవైతి।
మానుమనియెంతచెప్పిన మానవైతి । వేమిచెప్పుదు నీతాల్మి యింత దెచ్చె॥
(తే,గీ) శాశ్వతంబైననీదురా జ్యంబధర్మ । వృత్తిఁగైకొన్నదుష్టాత్ముఁ డీభ
రతుండు । భాగ్యవశమున నేఁడుసం ప్రాప్తుఁడయ్యె । వీనివధియించిపుచ్చెద వి
మలచరిత॥ (క) వీరోత్తమయీభరతుఁడు । వారని పరిపంథి గాన వధ్యుఁడు
నాకీ । దారుణచిత్తునివధమం । దారయఁగాదోసమించు కైనంగలదే॥(తే,గీ)
అధిపయపగతనిజధర్ముఁడైనభరతుఁ । డార్యగణగర్హితుండు పూర్వాపకారి।
సహజశత్రుండుస్వప్రయో జనరతుండు । తత్పరిత్యాగమున నీకుఁ దప్పులేదు॥
(వ) మహాత్మాయేను నీచేతఁ గృతాభ్యనుజ్ఞుండనై యీక్షణంబు భవద్రాజ్యా
పహారియైన భరతునివధించెద నాచేత నిహతుండైన పుత్రుని హస్తిభగ్నద్రు
మంబునుంబోలె నిరీక్షించి రాజ్యకాముకియైన కైకేయి దుఃఖార్తయై విల
పింపుచుండఁ బదంపడి దానింబట్టి బంధుసహితంబుగావధించి శుష్కారణ్యం
బునందు హుతాశనుంబోలె సైన్యంబునందు మత్క్రోధంబును సత్కారంబు
నంబ్రయోగించి కరితురంగ రథికపదాతుల నిశిత శరంబులం గీటడంచి చిత్ర
కూటకాననంబునెల్ల రుధిరోక్షితంబుఁ గావించెద మఱియు నాచేత నిహతం
బులైన గజహయపదాతి కళేబరంబుల శ్వాపదంబులు భక్షించుంగాక యేని
ట్లు పగతులంబరిమార్చి శరచాపంబుల ఋణంబుఁ దీర్చికొని కైకేయీ కరగ
తంబైన సామ్రాజ్యంబునుం దెచ్చి నీకొసంగి కృతార్థుండ నయ్యెద నీవు ప
ట్టాభిషిక్తుండవై వసుంధరఁ బరిపాలింపు మని యివ్విధంబున నాగ్రహోద
గ్రవ్యగ్ర మానసుండై సమగ్ర బాహు బలంబున భరతునితో విగ్రహించి

నిగ్రహించుటకుం దివురుచున్న లక్ష్మణుంజూచి రాముండు సాంత్వవాక్యంబు
ల ననూనయించుచు నిట్లనియె॥ (క) గురువృత్తివిదుఁడుధర్మ్యో। త్తరుఁడు మ
హాప్రాజ్ఞుఁడధిక ధైర్యుఁడుభరతుం। డరుదెంచుచుండనసిభీ। కరశరచాపము
లనేమి కార్యముచెప్పుమా॥ (క) నరపతిసత్యమెఱింగియు। వరమతిచనుదెం
చినట్టి భరతున్సుగుణా। భిరతున్వధించియీాతు। చ్ఛరాజ్యమున నేమియశము
సంపాదింతుఁ॥ (తే,గీ) తలఁపనెయ్యదిబంధుమిత్రక్షయంబు। నందుఁబ్రా
ప్తించునదిసుధ యైననేమి। గరళమిశ్రితభక్ష్యంబు గతిఁబరిత్య। జింతుఁగాకా
త్మలోనఁగాంక్షింపనయ్య॥ (తే, గీ) ధర్మమర్థంబుకామంబు ధరణిసిరి
యుఁ। గోరుటంతయుమీమేలు కొఱకుఁగాదె। బాల్యమాదిగనాబుద్ధి భ్రాతృవ
త్స। లతఁబరిణమించుటెఱుఁగవే రాకుమార॥ (చ) ఇనకులవార్ధిసోమవిను
మీజగమెంత యధర్మమందునా। కనిమిషలోకరాజ్యపద మబ్బిననైనఁదృణీ
కరింతునే। ఘనసిచాపబాణములఁ బూనుట రాజ్యముఁ గోరుటెంతయు।
న్ననుకొనిమీకునిచ్చలుప్ర మోదమొనర్చుటకంచుఁ జూడుమీ॥ (క) ఈమాట
నిజమ్మయగు। న్సౌమిత్రీనమ్ముమీవు నమ్మవెయేని। న్దీమసముననాయుధములు।
చేముట్టినిజంబుబాసఁ జేసెదననఘా॥ (క) అసదృశచరితుని భరతునిఁ। బసచె
డిదునుమాడిబృహదు పక్రోశమలీ। మసుఁడనయితుచ్ఛమహిమా। నసమున
గణియుంతునేవి నయగుణశాలీ॥ (తే, గీ) నీవుశత్రుఘ్నుఁడునుబుణ్యా నిరతుఁ
డైన। భరతుఁడునులేనియెడనాకుఁ బరగనద్ది। యేనియునొకింతసుఖమబ్బనే
నిదాని। వీతిహోత్రుండునీఱుగా వింపకున్నె॥ (క) కారణము లేక నాకప్ర
కారముఁగావించుకతనఁ గైకనుసుజను। ల్దూఱిరినృశంస యనీనను। దూఱ
రెయిఁకనామెనొడిసి ద్రుంచినయంతన్॥ (తే,గీ) కైకచేసిన యపరాధ కార్య
మునకు। సత్యసంధునిభ్రాతృవత్సలునిబుజునిఁ। బ్రాణములకంటెఁబ్రియుఁడగు
భరతునెట్లు। నిష్ఠురాత్ముఁడనై త్రుంప నేర్తునయ్య॥ (సీ) పుడమియుసిరిఁబాసి,
జడలునారలుదాల్చి జానకీలక్ష్మణసంయుతముగ। వనికినేతెంచిన ననువిని శోక
సంక్షోభితకరణుఁడై క్రూరచిత్త। యగుతనయమ్మకు నవమతిఁగావింపఁదలఁచి
భూపతిప్రసాదంబువడసి। భ్రాతృవత్సలతసా మ్రాజ్యంబునాకుసమర్పించుటకు
భక్తినరుగుదెంచు॥ (తే,గీ) చున్నవాఁడిమ్మహామహుఁడొందువిధము। పూనిగా
దెన్నడేనియుమున్నుభరతుఁ। డెగ్గుఁగావించెనేమనకించుకైన। నట్టిపుణ్యునిపై



నేలవట్టెశంక॥(క) భరతుఁడుమనలంజూచుట। కరుదెంచుటకాలయోగ్య, మనఘు
డుమనయందరయంగనించుకైనను। దురితముగావింపఁడితఁడు, దుర్జనదూరా॥
(తే,గీ) అనఘుభరతుఁడుకలనైన, నప్రియంబుఁ। దలఁపఁడెన్నఁడుఁబరుషోక్తిఁ,
బలుకఁడెప్పుడు, సకలనృపధర్మ సంవేది, శ్లక్ష్ణవాది। మనమెఱుంగని దేవాని,
మానసంబు॥ (తే,గీ) కెరలిభరతునిఁ గూర్చిశంకించెదేటి। కష్టమాత్మనిచే
మున్నొకప్పుడైన। నిట్టిసాధ్వస జనకోక్తి, యించుకైన। పలుకఁబడియెనె
యేలయీా, తలఁపునీకు॥ (తే,గీ) అనఘచరిత్ర క్రౌర్యమ్మున నప్రియోక్తు। లా
కుమారును ద్దేశించి, యాడఁదగదు। వానియందొక దుష్టభావత్వశంక। గ
లిగి యుండిన నేనైనఁ, గనలవచ్చు॥ (వ) వత్సాభరతుండు నీచేతనప్రియం
బును నిష్ఠురంబునగు వాక్యంబు పలుకంవగినవాఁడు గాఁడతని నుద్దేశించినీచే
తఁబలుకంబడియెడు నప్రియోక్తులు నన్నునుద్దేశించిపలుకంబడిన యవిగాఁ ద
లంచెదఁ దనకొకానొక యాపదవచ్చినప్పుడైనను వందనీయుఁడగు తండ్రినిఁ
బ్రాణభూతుండైన భ్రాతనెవ్విధంబున వధింపవచ్చునని పలికి వెండియు నిట్లని
యె॥ (తే,గీ) అనఘుదైవకృతంబున, నైనపనికి। ధర్మ మార్గంబువిడిచి
సత్కార్యులైన। తల్లిదండ్రుల భ్రాతల,దారుణముగఁ। దునిమి జననిందలను
బొంది, మనుటమేలె॥ (తే,గీ) కడఁగి రాజ్యార్థ మన్యాయ, గతినసర్థ।
మివ్విధంబున బోధింప,హితిమెనీకు। సుగుణవంతుని భరతునిఁ,జూచినంత।
రాజ్యమంతయు నతని కీ,రాదెనాకు॥ (చ)అనుపమ లీలనేలుమిల, యంతయుఁ
దమ్ముఁడ యంచుఁబ్రీతినే। ననవినిక్రమ్మఱ న్భరతుఁ డంఘ్రులపైఁబడి రామభ
ద్రమా। కనికము రాజపీవె సిరి,యంతయుఁగైకొనుమంచుదీనుఁడై। పనివడి
పెక్కుచందములఁ, బల్కునొ పల్కఁడొచూచుచుండుమీ॥ (వ) అనియి
ట్లు ధర్మశీలుండగు రాముండుపలికిన వినిలక్ష్మణుండు లజ్జాతిశయంబు వలన
నత్యంత సంకుచిత గాత్రుండై భ్రాతృ వత్సలుండు కావునఁ గేలుదోయి ఫా
లంబునం గీలించి దేవాభవదీయ చిత్తంబు కొలంది నవధరింతువుగాక భర
తుండొక్కరుండె గాఁడు మజ్జనకుండైన దశరథుండును జనుదెంచుచున్న వా
డని తోఁచుచున్నదనినఁ గౌసల్యానందనుండు వెండియు సౌమిత్రింజూచి పర
భావజ్ఞుండు కావున నితండువ్రీడితుండై ప్రసంగాంత రంబుఁ బ్రస్తావింపుచున్న
వాఁడని నిశ్చయించి యాచిత్యంబున లక్ష్మణకృత ప్రస్తావంబునె విస్తరింపంజే

యుచు నిట్లనియె ॥ (సీ) అనఘాత్మ జనకసుతా, మాగమంబది మనకరయనత్యానంతకరముగాదె । మనలవీక్షింపనో, మనకష్టముఁదలంచి మఱి నయోధ్యకు, మనఁలదోడు । కొనిపోవుటకో లేక, కోడలిదురవస్థచింతించి కడుసుఖ, సేవినియని । ప్రోలికిఁ దోడ్కొని, పోవుటకో వచ్చుచున్నవాఁడవిగోమ,హోన్నతములు ॥ (తే,గీ) పవనవేగ నిభంబులు, జవయుతములు । గోత్రవంతంబులైనట్టి ఘోటకములు । రెండు శత్రుంజయాఖ్యవే, దండమొకటి । మ్రోలఁ జూపట్టుచున్నది; పోలఁగంటె ॥ (తే,గీ) మూఁగిచనుదెంచుచున్నయా, మహాకనుము । ఘాతసత్కృతమగు పాండు,రాతపత్ర । మిపుడుతోఁచనికతమున, నృపునిరాక । యందుసందియమయ్యెడి, ననఘచరిత॥ (వ) అనిపలికి రాముండు శంకా కళంకితస్వాంతుండై నిరీక్షింపుచుండ భ్రాతృసేవాయత్తచిత్తుండైన లక్ష్మణుండు రామునిచేత నాజ్ఞప్తుండై సాలంబుడిగ్గి కృతాంజలిపుటుండై పార్శ్వభాగంబున గొలిచియుండె నంత భరతుండు సైన్యంబుల నమ్మహీధరపార్శ్వంబుల విడియ నియమించిన గజవాజిరథాకులంబైన తత్సైన్యంబప్పర్వత ప్రాంతంబున సార్ధయోజన మాత్రప్రదేశంబాక్రమించి నివాసంబుఁగావించె నిట్లునీతిమంతుండైన భరతుండు రఘునందన ప్రసాదనార్థంబరుగుదెంచి ధర్మంబు పురస్కరించి సేనాసన్నివేశంబుఁగావించి దర్పంబు పరిహరించి పాదచారియైయరిగి గురువచనానుష్ఠానపరుండైన రామునిసందర్శింతుంగాక యని నిశ్చయించి శత్రుఘ్నునవలోకించి యిట్లనియె ॥ (శా) నీవాలుబ్ధులఁగూడి రామవిభునన్వేషింపఁగాఁ నేగుమీ । త్రోవన్వెంటగుహుండుజ్ఞాతియుతుఁడై, తోడ్తోడ నేతెంచెడుం । బ్రావీణ్యంబున మంత్రి భృత్యగురు పౌరవ్రాతముంగూడియే । నీవంక న్జనుదెంతు రామచరణ, ప్రేక్షా సమాపేక్షతః ॥ (ఆ,వె) ఎంతలోన రాము, నెంతలో లక్ష్మణు । నెంతలోనసీత, నిపుడుకనుల । కఱవుదీఱఁ జూడఁ,గాఁజాలనంతలోఁ । జిత్తమునకుశాంతి, చెల్లదనఘ ॥ (తే,గీ) ఇందుసంకాశ మరుణార,విందనేత్ర । మగురఘూత్తముఘనసుంద, రాస్యమెంత । లోవిలోకింపలేనంత,లోననామ । నంబునకుశాంతిగలుగద,నఘశీల ॥ (తే,గీ) అనఘరాముని పార్థివ,వ్యంజనాన్వి । తములగుపదంబులెంతలో విమలభక్తి । నాదలఘటింపఁగాఁజాల, నంతలోనఁ । గలుషచిత్తంబునకుశాంతి,కలుగదిపుడు ॥ (తే,గీ) ఇష్ట రాజ్యాపహర్తఁడగు రాముఁ



డెంతలోన । రుచిరసింహాసనమునఁ గూర్చుండి సదభి । షేకపుష్కరక్లిన్నుండుగాక యుండు । నంతలో శాంతిగలుగునే యనఘనాకు ॥ (ఉ) తామరసేక్షణంబుశుభ,దంష్ట్రముసుందరనాసమున్సుధా । ధామనిభంబుహాసకలి,తంబుకృపారసయుక్తమైన శ్రీ । రామునినెమ్మొగంబుమది,రంజిలనిచ్చలుచూచుచున్నశోభాముఁడు లక్ష్మణుండు సుకృ,తవ్రతుఁడయ్యెఁ గదయ్య తమ్ముఁడా ॥ (క) జలనిధి ముద్రితధాత్రీ । తలమున కధినాథుఁ డనఁగ,దగు నిజభర్తం । బలుదెఱఁగుల సేవింపుచు । నలజనకకుమారి ధన్య, యయ్యెంగాదే ॥ (క) నందనమునందు ధనదుని । చందంబున నెందు రామ,చంద్రుఁడమందా । నందమున నుండునగ్గిరి । మందరగిరికంటె నుత్తమం బగుఁగాదే ॥ (ఆ,వె) శత్రుభృద్వరుండు, సవితృప్రతాపుండు । రాముఁడే వనమున,రమణిఁ గూడి । సంతతంబుఁ గ్రీడ,సల్పుచునివసించె । నదియు నతిపవిత్ర, మయ్యెఁ గాదె ॥ (వ)

(*) భరతుండు పాదచారియై శ్రీరామాశ్రమంబుఁ గనుంగొనఁబోవుట. (*)

అని యివ్విధంబున బహువిధాలాపంబులు పలుకుచు మహాతేజుండగు భరతుండు మహారణ్యంబుఁ బ్రవేశించి పుష్పితాగ్రంబులైన గిరిసానుసంజాతద్రుమషండంబు లవలోకింపుచుఁ దన్మధ్యంబునం జనిచని పుష్పితంబైన చిత్రకూటసాలంబు డగ్గఱి తత్సమీపంబునం బొల్చు రామాశ్రమగతంబైన వహ్నిధ్వజంబు విలోకించి యచ్చట రాముండు వసియించి యున్నవాఁడని యెఱింగి జలపాకంబు నొందినవాని తెఱంగున సంతోషవిశేషంబునం బొదలుచు శత్రుఘ్నునిం జూచి పుణ్యజనోపపన్నంబైన రామాశ్రమం బల్లదేయని శత్రుఘ్నునకుం జూపుచు మాతృవర్గంబునుం దోడ్కొని రమ్మని వసిష్ఠునకుం జెప్పి తాను గుహసహితంబుగాఁ బురోభాగంబున శీఘ్రంబునం బోవుచుండె సుమంత్రుండు రామదర్శనకృతాభిలాషుండై శత్రుఘ్నసహితంబుగా నరుగుచుండె నిట్లు ద్యుతిమంతుండగు భరతుండు సత్వరంబుగాఁ బోవుచుఁ బురోభాగంబున నాశ్రమసమీపవర్తిచిహ్నంబులు విలోకించి శత్రుఘ్నునకిట్లనియె॥ (క) ముదితుఁడగుభరద్వాజుఁడు । సదయత నెఱిఁగించినట్టి, శైలోత్తంసం । బిదెదీని డాసితిమి కద । యదెసుమి మందాకినీమ,హానది వత్సా ॥ (వ) అనిశత్రుఘ్నున కచ్చటి విశేషంబు లెఱింగింపుచుం జనిచని యవ్వల నొక్కింత దూరంబునఁ దాపసాలయసదృశంబైన యాశ్రమంబును విలోకించి తత్ప

రిసరంబున నసభగ్నంబు లైన కాష్ఠంబులును సంపాదితంబులైన పుష్పంబు
లును సందంప మార్గపరిజ్ఞానార్థంబుకుశవల్కలంబులచేత రచింపంబడినయభిజ్ఞానం
బునుశీతకారణంబువలనమృగమహిష కరీషంబులచేతనిర్మింపబడినబహుసంచ
యంబులునుసర్వంబునుంజూచివెండియుశత్రుఘ్నునకిట్లనియె ॥ (చ) ముదమున
లక్ష్మణుండు ఘనముగ్గొనికానన సీమనుండితాఁ । బదపడి యాశ్రమంబునకుఁ,
బాయక వచ్చుటకై పథంబున౯ । జెనరక యుండునట్లు విర, చించినగుర్తుల౯
లఁగంటెనీతికో । విద జగతీరుహాగ్రముల, వ్రేలఁగఁ గట్టిన నారచీరల౯ ॥ (చ)
మొనసి నగంబుక్రేవఁ జల, మున్బలముం జెలువారఘోరకా । ననగజముల్మదం
బున ఘనంబులకై వడి నింగిబృంహిత । ధ్వనులు సెలంగ నొండొకటిఁ, దాఁ
కిసముద్ధతిఁ బోరిపోరిన । ల్లనిమలలట్లుబిట్టలసి, క్రాలుచు నున్నవికం టెముంగ
ల౯ ॥ (ఉ) కాననమందుఁ దాపసుల, కల్మషభక్తి ననాతరంబు నె । ద్దానిభ
జించిబ్రహ్మగతిఁ దారుదగంజరియింతు రాబృహ । ద్భానుని ధూమరాజి యదె,
భాసిలుచున్నదియందుజానకీ । జానినిఁ బుణ్యమూర్తి౯ నల, సంయమినిం బతె
నేఁడు చూచెద౯ ॥ (వ) అనిపలికి ముహూర్తమాత్రంబునకుమందాకినీ న
దిం గడచి యనుచరులంజూచి యిట్లనియె ॥ (మ) క్షితి నెవ్వాఁడుసమస్తరా
జ్యపదవీ, సింహాసనార్హుఁడై । సతతంబేలగఁ జాలునట్టి విభుఁడీ, సౌమ్యుం
డు రాముండు మ । త్కృతమం దీదురవస్థ నొంది సుఖముం, గ్రేడించి ఘో
రాటవీ । క్షితిలో నొంటిగనున్న వాఁడకట ఛీ, జీవంబు నాకేటికి౯ ॥ (క) పలు
గతుల నిపుడుల త్పద । ములకు న్సీతాంఘ్రియుగ్మమునకుం బడిత । ద్విలస
త్కృప నొందెదఁగొం । దల పడక పునఃపునఃప్రణామంబులచే౯ ॥ (వ) అని యి

### (*) భరతుండు రామాశ్రమంబుఁ గనుంగొనుట. (*)

ట్లు విలపింపుచుఁ గైకేయీనందనుండు నిజాగ్రభాగంబున సాలతాలాశ్వకర్ణ
పర్ణ సమాచ్ఛాదిత యగు దాని శక్రాయుధ నీకాశ భారసాధన మహాకార్ము
కంబులచేత సమాకీర్ణ యగుఁ దాని శత్రుబాధన మహాసారరుక్మపృష్ఠదీప్త
వదనభానురశ్మి ప్రతీకాశతూణీరగత ఘోరసాయకాలంకృత యగు దాని సు
వర్ణనిర్మిత కోశశోభిత యగుదాని రుక్మబిందు విచిత్రఫలక రాజిత యగు
దానిఁ గాంచనభూషణ విచిత్రగోధాంగుళిత్రమండితయగు దాని నీశాన్యభా
గనిమ్నోన్నత యగు దాని సింహాధిష్ఠితయైన పర్వత గుహా మృగంబుల చే



తం బోలె నరాతులచేత నప్రధృష్య యగుదానిఁ గాకోదరంబులచేత భోగ
వతియుం బోలె నిశిత నారాచంబుల చేత నభిరామ యగు దానిఁ గుశం
బుల చేత యజ్ఞాయతనంబునుం బోలె ఖనిత్ర పిటకంబులచేత నావృతయ
గుదాని విశాల యగు దాని మనోరమ యగుదాని మృదు కుశాస్తీర్ణ
యగు దాని దీప్త పావకయగు దానిఁ బర్ణశాలా మధ్యగత వితర్దిక

### (*) భరతుండు దూరమున రామునిం గనుంగొనుట. (*)

నవలోకించి తన్మధ్య దేశంబున ॥ (క) నిరుపమ గుణ నిధి భరతుం ।
డురువిక్రమ ధనుని ఘనుని, నుటజాసీను౯ । గురుని జటాధరునిజితా । సు
రుని రఘూత్తమునిఁ గాంచె, సుముహూర్తమున౯ ॥ (సీ) ఇందీవరశ్యాము
నందితసుత్రాము ధవళాంశువదనుసౌం, దర్యసదనుఁ । గాంతి తేజోలాభు, గం
ధర్వరాజాభుసరసీరుహాక్షుని, శాలవక్షు । వల్కలాజినవాసు, వరసుగుణోల్లా
సుఁగాంచనాచలధీరు, ఘనగభీరుఁ । జటులసింహస్కంధు, శౌర్యజితస్కందు
మానితదేహునా, జానుబాహు ॥ (తే,గీ) లక్ష్మణోపేతు సీతాభి, రాముఁబద్మ ।
యోనిచందాన నాసీనుఁడైనవాని । రామునీక్షించిభరతుఁ డలంఘనీయ । శో
క వార్ధి౯ మునింగిసం, క్షుభితుఁడగుచు ॥ (క) పలుగతుల నార్తరవమున । వి
లపింపుచుభ్రాతృమోహ, వివశుండైక । న్నులనశ్రులోలుకమనమునఁ । దల
పుచునిట్లనియెఁజాల, ధైర్యమువాయ౯ ॥ (తే,గీ) అనుదినము ప్రజచేనెవ్వాఁ
డభినుతింపఁ । బడియెనట్టిశ్రీరాముఁడు భయదవన్య । దుష్టమృగముల చేఁజా
ల, దుష్ప్రవేశ । వనినుపాసితుఁడైయున్న, వాఁడునేఁడు ॥ (సీ) రమణీయచీనాం
బ, రములుధరించు వాఁడీచీరవల్కల, మెట్లుదాల్చె । విమలవిచిత్రమాల్య
ములువహించువాఁడీ జటామండల, మెట్లు దాల్చె । మహితచందన కర్దమం
బుమై మెత్తువాఁడీ ధరిత్రీరజ, మెట్లుమెత్తె । నెండకన్నెఱుఁగక, యింటవసిం
చువాఁడీఘోరవనవాస, మెట్లొనర్చె ॥ (తే,గీ) నతిసుఖోచితుఁడగురాముఁ, డక
టమన్ని । మిత్తమునన్నిట్లు దురవస్థ, మెలఁగవలసె । నీచమతినైననాకునిం, ది
తములైన । జీవితము లేల ఛీ యెంత, చెట్టనైతి ॥ (తే,గీ) జగతినెవ్వని ధర్మ
సంచయము సముచి । తాధ్వరంబులచేయుక్త, మయ్యెనట్టి । పుణ్యుఁడు శరీ
రదుఃఖసంభూతమైన । ధర్మమొనరింపుచున్నాఁడు, ధైర్యమూఁది ॥ (క)

——(*)భరతశత్రుఘ్నులు రాముని పాదములపైఁ బడుట.(*)——

అనియీగతి విలపింపుచుఁ । గనుఁగవలను దుఃఖబాష్పకణము లొలుకరో
దన మొనరింపుచుఁ దగరా । మునిదివ్యాంఘ్రిల సమీప, మునఁ బ్రాలెవెసన్ ।
(క) ఈరీతి వ్రాలి భరతుం । డారామునిఁ జూచి యార్య, యని యొక మాటు
చ్చారణముఁ జేసి శోకవి । చారంబున మఱలఁ బలుకఁ, జాలకయుండెన్ ।
(క) పదపడి శత్రుఘ్నుఁడు త । త్పదముల కెఱఁగుటయుఁ జూచి, దారుణశోకం
బదనెదుగ రాఘవుఁడు వా । రిదయామతి నాదరించి, ప్రియమలరారన్ ॥ (వ)
శీఘ్రంబున న౦ గ్రుచ్చియెత్తి గాఢాలింగనంబు గావించి కన్నీరునించెనంత సు
మంత్రుండును గుహుండును పొడసూపిన నారామలక్ష్మణులు వారలం గూడి గ
గనంబునందు శుక్రబృహస్పతులతోడం గూడిన దివాకర నిశాకరుల చందం
బునం దేజరిల్లి రిత్తైఱంగునం గూడుకొనిన వారణయూథప సన్నిభులయిన
యారాజనందనుల నల్వురం జూచి యచ్చటి వనచరులందఱు హర్షంబు విడి
చి కన్నీరునించుచుండి రనంతరంబ యుగాంతకాలంబున ధరణిపయిం బడిన భా
స్కరుని చందంబునం దన చరణంబుల పయిం బడి బద్ధాంజలియై బహువిధశో
కాలాపంబుల విలపింపుచున్న వానిజటాజిన వల్కలధరుండగువాని నుపవా
స కృశుండగువాని వివర్ణవదనుండగువాని భరతునిం జూచి యతని నతిప్ర
యత్నంబున భరతునిఁ గానెఱింగి రామభద్రుండు నిజకరంబుల నతనిం గ్రు
చ్చియెత్తి శిరంబు మూర్కొని కొండొకసేపు గాఢంబుగాఁ బరిష్వజించి పదం
పడి నిజోత్సంగంబున నునిచికొని యతిదుఃఖితుండైన యతని దుఃఖం బపనయిం
చుటకుఁ బ్రశ్న వ్యాజంబున ధర్మంబు లుపదేశింపుచు నిట్లనియె ॥ (ఉ) ఎచ్చ
టనున్నవాఁడు కడు' వృద్ధుఁడు మజ్జనకుండు నేఁడు నీ । విచ్చటికేల వచ్చితివ

—(*)రాముఁడు భరతునిం గూర్చి ధర్మప్రశ్నములు సేయుట.(*)—

హీనగుణాఢ్య నృపాలు నొంటిగా । నచ్చట డించి మీరిరువు, రక్కటయీగతి రా
బోసంగునే । యచ్చట నెవ్వరింకఁ గల, రవ్విభుఁ బ్రోచెడు వారు చెప్పుమా ॥
(తే,గీ) దూరమున నుండి వచ్చిన, వారి మిమ్ముఁ । గార్శ్యమాలిన్య వైవర్ణ్య
కములు చేతఁ । బరమదుర్జ్ఞేయ గాత్రులఁ, బరఁగఁ బెద్ద । కాలమునకిందుఁ
బొడగంటిఁ జాలనరిది ॥ (క) వినుమీ విచటికి వచ్చినఁ । దనవునఁ బ్రాణంబు లె
టు తాల్పఁగలండా । జనపతి కడు దీనుండై మునుకొని తత్క్షణమె నాక, ము



నకుం జనఁడే ॥ (క) సరసాత్మక మజ్జనకుఁడ । మరపతి సదృశుండు పేట, మని
యున్నాఁడో । పరువడి లోకాంతరమున । కటగనొ నీ వేల వచ్చి, తడఁకఁ జెప్పు
మా ॥ (తే,గీ) అనఘచారిత్ర బాలుండ వైననీదు । శాశ్వతంబైన రాజ్యంబు
జనపదంబు । సర్వమును నశింపకున్నదె, సత్యరతునిఁ । దండ్రి సేవింతువే నీవు, ధ
ర్మయుక్తి ॥ (ఆ వె) రాజధర్మ విదుఁడు, రాజసూయాశ్వమే । ధాదియా
గకర్త, యనఘమూర్తి । సత్యసంగరుండు, జనకుండు కుశలియై । యున్నవాఁ
డె సుఖముఁ గన్నవాఁడె । (క) జనకుని సేవింతువె నీ । వసిశముఁ గులగురునిఁ బుణ్య,
హరినిభ తేజు । న్ఘనకీర్తిని విద్వాంసుని । మునినాథు వసిష్ఠు నెపుడుఁ బూజిం,
పుదువే ॥ (తే,గీ) అనఘ కౌసల్య సుఖినియె, యల సుమిత్ర । సేమమునను
న్నదే పుణ్య, శీల సాధ్వి । కైక యానందభరితయే, కడమతల్లు । లొప్పుమీఱఁ
గుశలినులై, యున్నవారె ॥ (క) అనసూయుఁ డనుద్రష్టయు । సనయుఁడు
గురుసుతుఁడు వినయ, సంపన్నుండున్ । ఘనుఁడు బహుశ్రుతుఁడు బుజుం । డ
నఘసుయజ్ఞుండు సత్కృ, తాత్ముండగునే ॥ (క) అతఁడు మతిమంతుఁడయి
సం । తతమును వేదోక్తఘణితిఁ దప్పక వహ్ని । త్రితయమున రేపుమాపును ।
హుతమును హోమంబు నీకు, నురుమతిఁ జెపునే ॥ (క) దేవ బ్రాహ్మణవృద్ధు
ల । వావిరిఁ బితృభృత్యమంత్రి, వైద్యుల గురుల । న్భావింపుచు భయభక్తుల ।
సేవింతువె సంతతంబుఁ, జిరశుభలీలన్ ॥ (తే,గీ) అనఘ యిష్వస్త్ర సంప
న్న, నర్థశాస్త్ర । కోవిదుని హితకరుఁ గృత, జ్ఞుని సుధన్వుఁ । గార్ముకాచార్యు స
వినయ, గౌరవమున । నమితభయభక్తిఁ బూజించె, యనుదినంబు ॥ (క) శ్రు
తవంతు లాత్మసములిం । గితజ్ఞులును శూరులును సు, కీర్తికులీనుల్ । జి
తకరణులు నగుమంత్రుల । సతతము మన్నింతె నీవు, సజ్జనతిలకా ॥ (వ) మ
ఱియు నీతిశాస్త్రనిపుణులును మంత్రధరులు నగు మంత్రుల చేతసు సంవృతం
బైన మంత్రంబు రాజులకు విజయమూలంబు గదా యనిపలికి వెండియు నిట్లని
యె (క) కాలంబున నిద్రింపుచుఁ । గాలంబున మేలుకొనుచు, ఘనబుద్ధిని
శా । కాలంబునందు నిత్యం । బాలోచింపుదువె నిశ్చ, లార్థనిపుణతన్ ॥
(క) నిక్కము మంత్రిత మంత్రం । బక్కజముగ గుప్తమగునె, యమ్మంత్రం
బున్ । బెక్కండ్రతోడ మఱినీ । వొక్కండవు సేయఁదగ ద, యుక్తంబనఘా ॥
(క) హితమతులగు మితజన సం । యుతముగ లఘుమూలమును మహోద

యమునుగా । మతినిశ్చయించి కార్యం । బతిరయమునఁ జేయుదే మహాగుణ శాలీ ॥ (వ) మఱియు సామంత మహీపతులు శీఘ్రంబున ఘనోన్ముఖంబుల యిన కార్యంబులును జేయం దలంచిన కార్యంబులు నెఱుంగక నిష్పన్నంబుల యిన కార్యంబులె యెఱుంగునట్లుగా మంత్రగోపనంబు గావించి సర్వకార్యంబులు నడుపుదువె మంత్రులచేతం గాని నీచేతం గాని సుమంత్రితంబైన మంత్రంబులను బరులు తర్కయుక్తులచేత నింగితాదులచేత నెఱుంగకుండుదురు గదా మూర్ఖజనసహస్రంబుకంటెఁ బండితుండైనవాని నొక్కనిం బరిగ్రహించిన నతండు మహీపతి కర్థసంకటంబుల యందు మహైశ్వర్యంబుఁ గావించు మూర్ఖులగువారిం బదివేలజనంబుల నుపాసించిన నించుకయైన సాహాయ్యంబు లేదు మేధావియు శూరుండును దక్షుండును నీతిశాస్త్రవిచక్షణుండగు యమాత్యుం డొక్కరుండైన మహీపతినిఁ గాని తత్సమానునిఁ గాని లక్ష్మీసంపన్నుం జేయు నన్నికార్యంబులందు నట్టి యుత్తమగుణసంపన్నునిం జేర్పఁ దగ దుత్తమకర్మంబులం దుత్తముని మధ్యమకర్మంబులయందు మధ్యముని జఘన్యకర్మంబునందు జఘన్యుని నియోగింపవలయు మఱియుఁ బరీక్షాతీతులగువారి నమాత్యులఁ గులక్రమాగతులఁ గరణత్రయ శుద్ధియుక్తులగు శ్రేష్ఠుల శ్రేష్ఠకర్మంబులందు నియోగింప వలయు నిట్లుక్తప్రకారబునం గావింపుదువె యని పలికి వెండియు నిట్లనియె ॥ (తే,గీ) అనఘ మంత్రులు ప్రీతి నీ,న్నను దినంబుఁ । దీవ్రదండంబుచేసము,ద్వేజితప్ర । జంబు గాకుండఁ బూజ్యరా, జ్యంబుఁ బ్రోచు । వానిగాఁ జేయుదురె నీతి,వరుసఁ దెలిపి ॥ (వ) మఱియు దుదర్జనంబున ధనంబుపార్జించి యాగంబుసేయ నుపక్రమించిన పతితుని యాజకులు వర్జించినచందంబున బలాత్కారంబునం బరిగ్రహింపం దలంచిన కాముకునిఁ గాంతలు పరిత్యజించినకైవడి నుగ్రదండోపాయంబున నదండ్యులగు వారివలన ధనగ్రహణంబుసేయు నిన్నువిలోకించి ప్రజలుపరిత్యజింపక యనురక్తులై యుందురు గదా యనిపలికి క్రమ్మఱనిట్లనియె ॥ (తే, గీ) పార్థివన యజ్ఞ సామాద్య,పాయకుశలు । వైద్యునిఁ గృతఘ్నుశూరు నైశ్వర్యకాము। నాప్తవిఘటనరతు సేధ,రాధిపతివ । ధింపఁడాతని కాపదఁ, దెచ్చునతఁడు ॥ (క) యుక్తుని భృశానురక్తుని । శక్తుని శూరునిఁ గులీను,సదుపాయసమా।యుక్తుని మతిమంతుని వర । భక్తునిఁ గావింతె నీవు,బలపతిఁగాఁగ ॥ (క) బల



వంతులు ముఖ్యులు పర । బలార్దనులు జన్యవిదులు, భక్తులు విక్రాం । తులునైన దండనాథుల । నలఘుగుణా సత్కరించి, యలరుదె ప్రీతిన్ ॥ (సీ) తఱినచ్చినపుడు భూ,వరుఁడు బలంబున కన్నంబు వేతన మర్హ భంగిఁ । బుష్కలంబుగ నిడఁ,బోలు లోభంబున నొసఁగక మత్తుఁడై, యుండెనేని । వానిపైఁ గోపించి, వారుదూషింతురు దాన భూపతికనర్థంబు గలుగుఁ । గాల యాపన మీవు,గావింప కిడుదు వేవీరుల కన్నంబు,వేతనంబు ॥ (తే,గీ) జ్ఞాతులుప్రధానులును భృత్య,జనులు దండ । నాథులనురక్తులై ప్రథ,నంబునందు । వీఁకభవదర్థముంచు జీ,వితమునైన । విడువఁదలకొని యుందురే,వీరవర్య ॥ (తే,గీ) శక్తుఁడువిచక్షణుండు య,థోక్తకారి । పండితుఁడుబుద్ధినిధి జన,పదభవుండు । ఘనుఁడు ప్రతిభానవంతుండ,కల్మషుండు । నైన చారుండు సత్కృతుం,డగు నెయయ్య ॥ (వ) మఱియుఁ బరపక్షంబులందు మంత్రియువరాజపురోహిత సేనాపతిదౌవారి కాంతర్వంశిక కారాగారాధి కృతార్థ సంచయ కృత్యాకార్యాకార్యనియోజక ప్రాడ్వివాక సేనా నాయక నగరాధ్యక్ష కర్మాంతిక సభ్యధర్మాధ్యక్ష దండపాల దుర్గపాల రాష్ట్రాంత పాలకాఖ్యులం గల యష్టాదశతీర్థంబులును స్వపక్షంబునందు మంత్రిపురోహితయువరాజులుం దక్కఁ దక్కిన పంచదశతీర్థంబులును బరస్పరావిజ్ఞాతులైన ముప్పురు చారకులచేత వేర్వేఱ నెఱుంగ వలయు మఱియు వ్యపాస్త పునరాగతులైన శత్రువుల దుర్బలురఁగా నెంచక వర్జింప వలయుఁ జార్వాకులగు బ్రాహ్మణులసేవింపం దగదు వారు బాలిశులై పండితాభిమానులై యనర్థసంపాదన చతురులై వేదమార్గవిపరీతబుద్ధులై శుష్కతర్క విషయబుద్ధి నధిగమించి నిరర్థకంబులైన పూర్వపక్షయుక్తులను సిద్ధాంతోక్తులఁగా నుపన్యసింపుచుందు రట్టివారి నేర్పఱిచి పరిత్యజింప వలయునని పలికి వెండియు నిట్లనియె ॥ (సీ) రవితేజ మత్కులో,ద్భవపూర్వనృపులచే ననిశంబు రక్షితం,బైనదాని । ఘనవీరభట శతాం,గకదంబ గంధేభ హయసంకులద్వార,మైనదాని । నిజకర్మనిరతా వనీసురక్షత్రియ వైశ్య శూద్రులచేత,వఱలుదాని । బహువిధ కాంచన,ప్రాకారహర్మ్యవిమాన విరాజితం,బైనదాని ॥ (తే,గీ) ననవరత మార్యసేవితంబైనదాని । ధన్యముగుదానిమనయయో,ధ్యాపురమును । సత్యనామంబుఁగాఁ జేసి, సంతతంబుఁ । బ్రీతిఁ బాలింపుదువె నీవు,నీతిశీల ॥ (వ) మఱియుఁ జై

త్యాశ్రితజుష్టంబును సుఖోపవిష్టజనాకులంబును దేవస్థాన పానీయ శాలాతటాకోపశోభితంబును బ్రహృష్టనరనారీసంయుతంబును సమాజోత్సవశోభితంబును సుకృష్టసీమాంతంబును బశుమంతంబును హింసాభివర్జితంబును నదీమాతృకంబును రమ్యంబును శ్వాపదపరివర్జితంబును సర్వభయపరిత్యక్తంబును రత్నసువర్ణరజతాద్యాకర సంపన్నంబును బాపరహితంబును బూర్వరాజాభిరక్షితంబును నగు జనపదంబు సుఖంబున్నదె కృషివాణిజ్యగోరక్షజీవులగు వైశ్యాదులు సకలార్థ సంపాదనంబున నభిమతులై క్రయవిక్రయార్థ రూపవాణిజ్యరతులగుచు నుండ నాశ్రితలోకం బంతయు సుఖంబు నొందుచున్నదె మఱియు నావణిజుల కిష్టప్రాపణానిష్ట నివారణంబుల చేత భరణంబు గావింపుదువే యని పలికి వెండియు నిట్లనియె ॥ (క) రక్షకులు లేని వారల । రక్షింతువె నృపతి కాత్మ, రాష్ట్రనిలయుల౯ । రక్షింప వలయు నెప్పుడు । దక్షత నిజవంశయోగ్య, ధర్మము కలిమి౯ ॥ (వ) వత్సా నీవు స్వదారలయందనుకూలుండవై వారల కన్యపురుష సంభాషణాదిదోషంబులు లేకుండ రక్షింపుచు వారలవచనంబు యథార్థబుద్ధినాకర్ణింపక వారితోడ రహస్యంబులాడక వర్తింపుదువే యని పలికి వెండియు నిట్లనియె ॥ (క) అనఘా గజములు పాడమెదు । వనములఁ బ్రోతువె కరేణు, వాజిగజముల౯ । మునుకొని రక్షింపుదువే । యనవరత ముపార్జనంబు, నందుఁ దనియక౯ ॥ (ఉ) ప్రొద్దున లేచి దివ్యమణి, భూషణములై యొనిండఁ దాల్చి బ । ల్గద్దియ మీఁదఁ గూర్చ్చి నిజ, సజ్జనలోచనపూర్ణపర్వమై । తద్దయుఁ బ్రీతి భృత్యులకు, దర్శనమిత్తువె వారు భక్తితోఁ । జెద్దయుఁ బ్రొద్దు నిన్గొలిచి, పిమ్మటఁ బోదురె నిత్యమిండ్లకు౯ ॥ (వ) మఱియు విష్టిప్రభృతి నీచకర్మకరులు నిర్విశంకులై మహీపతియొద్దకుఁ బ్రత్యక్షంబు గాఁ జనుదెంచిరేని యవజ్ఞాధిక్యంబు సంభవించు దర్శనాభావంబు వలనఁ గార్యహానియగు నీయర్థంబు నందు యథోచిత సమనిరీక్షణప్రదానంబు ప్రయోజకంబై యుండునట్లు గావించెదవే యని పలికి వెండియు ॥ (తే,గీ) రాజనందన సర్వదు,ర్గములు రత్న । ధాన్యధనయంత్ర సలిలాయు, ధముల చేత । శిల్పకార్ముక పాణుల, చేత సంత । తంబును బరిపూర్ణంబులై, తనరునయ్య ॥ (తే,గీ) అనఘ విస్తారమగునె ధ, నాగమంబు । వ్యయము కడుఁ గొంచమగునె గా, యక నటవిట । జనుల విషయంబునందుఁ గో,శంబు పొంద । కుండునే భృత్యులుసు



ఖులై,యున్నవారె ॥ (తే,గీ) వీరవర సమాగతులైన, విప్రులందు । దేవతాపితృదేవతా, తిథులయందు । సాధు జనులందు సఖులందు, యోధులందు । ద్రవిణవినియోగ మొనరింతె ధర్మఘణీతి ॥ (వ) మఱియు విశుద్ధ స్వభావుండును గరణత్రయ శుద్ధియుక్తుండును జౌర్యంబు చేయనిచరితుండునగు సజ్జనుండు యదృచ్ఛ చేత నశోధితుండై ధనలోల్యంబున వధింపఁబడకుండునె మఱియుఁ గాలంబున సందృష్టుండై గృహీతుండై పృష్టుండై చౌర్యలబ్ధద్రవ్య సహితుండైన చోరుండు ధనలోభంబున విముక్తుండు గాకుండుఁ గదా యని పలికి వెండియు ॥ (తే,గీ) అనఘ ధనవంతునకు దరి,ద్రునకు నొకవి । వాదరూప సంకటమది, వచ్చినపుడు । వీతధనలోభులై పక్ష, పాతముడిగి । సత్యమాడుదురే గదు, సచివులనఘ ॥ (తే,గీ) అనఘ మిథ్యాభిశస్తులై, యశ్రుకణము । లవని రాల్చిన నవియు భో, గార్థమును । పాలనము సేయు నరపతి, పశుకళత్ర । మిత్రపుత్రుల హింసించు, మిథ్యగాదు ॥ (సీ) అలబాలవృద్ధవై,ద్యులను బూజింతువె తడయక వాఙ్మనోదానములను । గురువులవృద్ధుల, సురలఁ జైత్యంబుల నతిథుల సిద్ధార్థులైన విప్ర । వరుల నుమానులఁ, బరికించి నిత్యంబు గురుతరభక్తి మ్రొక్కుదువె నీవు । ధర్మమర్థంబుచే, ధర్మంబుచే నర్థమవి రెండు నిఖిలభో,గాభికాంక్ష ॥ (తే,గీ) గామమునఁ జాలఁ జెడ్పాటు, గాక యుండఁ । గాతువే మఱి ధర్మార్థ, కామములను । వేఱువేఱ విభాగించి, వీరవర్య । కడమ వడకుండ సేవింతె, కాలమందు ॥ (తే,గీ) న్యాయశాస్త్రార్థకోవిదు,లైన ద్విజులు । పాటిదప్పక నిత్యంబుఁ బౌరజాన । పదులతోఁ గూడి నీకు శు,భంబు గలుగు । నట్లు ప్రార్థింతురే ని,త్య,మనఘచరిత ॥ (వ) మఱియు నాస్తిక్యంబును ననృతంబును గ్రోధంబును ననవధానత్వంబును దీర్ఘసూత్రత్వంబును సాధుజనాదర్శనంబును నాలస్యంబును బంచేంద్రియ పరవశత్వంబును బ్రయోజనంబుల నేక చింతనంబును విపరీతార్థ బోధకులతోడ మంత్రంబును నిశ్చితార్థంబులం దనారంభంబును మంత్రంబు రక్షింపకుండుటయు మంగళంబు లనుష్ఠింపకుండుటయు సర్వదిగవస్థితశత్రురాజుల నుద్దేశించి యేక కాలంబున దండయాత్ర సలుపుటయు నివి పదునాల్గు రాజదోషంబులు మహీపతి వీటినన్నిటిని వర్జింపవలయు మఱియు లోభక్రోధాలస్యాసత్యప్రమాదభీరుత్వాస్థిరత్వమూఢత్వానయావమంతృత్వాదిదశవర్గంబును మృగయాద్యూతదివాస్వప్న పరివాద స్త్రీమదనృత్త గీత వాద్యవృథా

త్యశతజుష్టంబును సుఖోపవిష్టజనాకులంబును దేవస్థాన పానీయ శాలాతటాకోపశోభితంబును బ్రహృష్టనరనారీసంయుతంబును సమాజోత్సవశోభితంబును సుకృష్టసీమాంతంబును బశుమంతంబును హింసాభివర్జితంబును నదీమాతృకంబును రమ్యంబును శ్వాపదపరివర్జితంబును సర్వభయపరిత్యక్తంబును రత్నసువర్ణరజతాద్యాకర సంపన్నంబును బాపరహితంబును బూర్వరాజాభిరక్షితంబును నగు జనపదంబు సుఖంబున్నదె కృషివాణిజ్యగోరక్షజీవులగు వైశ్యాదులు సకలార్థ సంపాదనంబున నభిమతులై క్రయవిక్రయార్థ రూపవాణిజ్యరతులగుచు నుండ నాశ్రితలోకం బంతయు సుఖంబు నొందుచున్నదె మఱియు నావణిజుల కిష్టప్రాపణానిష్ట నివారణంబులచేత భరణంబుఁ గావింపుదు వే యని పలికి వెండియు నిట్లనియె ॥ (క) రక్షకులు లేని వారల । రక్షింతువె నృపతి కాత్మ, రాష్ట్ర నిలయులన్ । రక్షింప వలయు నెప్పుడు । దక్షత నిజ వంశయోగ్య, ధర్మము కలిమిన్ ॥ (వ) వత్సా నీవు స్వదారలయందనుకూలుండవై వారల కన్యపురుష సంభాషణాదిదోషంబులు లేకుండ రక్షింపుచు వారలవచనంబు యథార్థబుద్ధినాకర్ణింపక వారితోడ రహస్యంబులాడక వర్తింపుదువే యని పలికి వెండియు నిట్లనియె ॥ (క) అనఘా గజములు పొడమెడు । వనములఁ బ్రోతువె కరేణు, వాజిగజములన్ । మునుకొని రక్షింపుదువే । యనవరత ముపార్జనంబు, నందుఁ దనియకన్ ॥ (ఉ) ప్రొద్దున లేచి దివ్యమణి, భూషణములై యొనిండఁ దాల్చి బ । ల్లద్దియమీఁదఁ గూర్చు నిజ, సజ్జనలోచనపూర్ణపర్వమై । తద్దయుఁ బ్రీతిభృత్యులకు, దర్శనమిత్తువె వారుభక్తితోఁ । పెద్దయుఁ బ్రొద్దునిన్ గొలిచి, పిమ్మటఁ బోదురె నిత్యమిండ్లకున్ ॥ (వ) మఱియు విష్టిప్రభృతి నీచకర్మకరులు నిర్విశంకులై మహీపతియొద్దకుఁ బ్రత్యక్షంబుగాఁ జను దెంచిరేని యవజ్ఞాధిక్యంబు సంభవించు దర్శనాభావంబువలనఁ గార్యహానియగు నీయర్థంబు నందు యథోచిత సమనిరీక్షణప్రదానంబు ప్రయోజకంబై యుండునట్లు గావించెదవే యనిపలికి వెండియు ॥ (తే,గీ) రాజనందన సర్వదు, గములు రత్న । ధాన్యధనయంత్ర సలిలాయు, ధములచేత । శిల్పకార్ముక పాణుల, చేత సంత । తంబును బరిపూర్ణంబులై, తనరునయ్య ॥ (తే,గీ) అనఘ విస్తారమగునె ధ, నాగమంబు । వ్యయము కడుఁ గొంచమగునె గా, యక నటవిట । జనుల విషయంబునందుఁ గో, శంబుపొంద । కుండునే భృత్యులును



ఖులై, యున్నవారె ॥ (తే,గీ) వీరవర సమాగతులైన, విప్రులందు । దేవతా పితృదేవతా, తిథులయందు । సాధు జనులందు సఖులందు, యోధులందు । ద్రవిణవినియోగ మొనరింతె ధర్మ్యఫణితి ॥ (వ) మఱియు విశుద్ధస్వభావుండును గరణత్రయ శుద్ధియుక్తుండును జౌర్యంబు చేయ కారితుండునగు సజ్జనుండు యదృచ్ఛచేత నశోధితుండై ధనలౌల్యంబున వధింపఁబడకుండునె మఱియుఁ గాలంబున సందృష్టుండై గృహీతుండై పృష్టుండై చౌర్యలబ్ధద్రవ్య సహితుండైన చోరుండు ధనలోభంబున విముక్తుండు గాకుండుఁ గదా యని పలికి వెండియు ॥ (తే,గీ) అనఘ ధనవంతునకు దరి, ద్రునకు నొకవి । వాదరూపసంకటమది, వచ్చినపుడు । వీతధనలోభులై పక్ష, పాతముడిగి । సత్యమాడుదురే ని దు, సచివులనఘ ॥ (తే,గీ) అనఘ మిథ్యాభిశస్తులై, యశ్రుకణము । లవనిరాల్చిన నవియు భో, గార్థమూర్వి । పాలనము సేయు నరపతి, పశుకళత్ర । మిత్రపుత్రులఁ హింసించు, మిథ్యగాదు ॥ (సీ) అలబాలవృద్ధవై, ద్యులను బూజింతువె తడయక వాఙ్మనోదానములను । గురువుల వృద్ధుల, సురలఁ జైత్యంబుల నతిథుల సిద్ధార్థులైన విప్ర । వరుల నుమానులఁ, బరికించి నిత్యంబు గురుతర భక్తి మ్రొక్కుదువె నీవు । ధర్మ మర్థంబుచే, ధర్మంబుచే నర్థ మవి రెండు నిఖిలభో, గాభికాంక్ష ॥ (తే,గీ) గామమునఁ జాలఁ జేడ్పాటు, గాక యుండఁ । గాతువే మఱి ధర్మార్థ, కామములను । వేఱు వేఱ విభాగించి, వీరవర్య । కడమ పడకుండ సేవింతె, కాలమందు ॥ (తే,గీ) న్యాయశాస్త్రార్థకోవిదు, లైన ద్విజులు । పాటిదప్పక సత్యంబుఁ, బౌరజాన । పదులతోఁ గూడి నీకు శు, భంబుగలుగు । నట్లు ప్రార్థింతురే ని, త్యమనఘచరిత ॥ (వ) మఱియు నాస్తిక్యంబును ననృతంబును గ్రోధంబును ననవధానత్వంబును దీర్ఘసూత్రత్వంబును సాధుజనాదర్శనంబును నాలస్యంబును బంచేంద్రియ పరవశత్వంబును బ్రయోజనంబుల నేకచింతనంబును విపరీతార్థ బోధకులతోడ మంత్రంబును నిశ్చితార్థంబులం దనారంభంబును మంత్రంబు రక్షింపకుండుటయు మంగళంబు లనుష్ఠింపకుండుటయు సర్వదిగవస్థితశత్రురాజుల నుద్దేశించి యేకకాలంబున దండయాత్రసలుపుటయు నివి పదునాల్గు రాజదోషంబులు మహీపతి వీటినన్నిటిని వర్జింపవలయు మఱియు లోభక్రోధాలస్యాసత్యప్రమాదభీరుత్వాస్థిరత్వమూఢత్వానయావమంతృత్వాదిదశవర్గంబును మృగయాద్యూతదివాస్వప్నపరివాద స్త్రీమదనృత్తగీతవాద్యవృథా

పర్యటనంబులని యెడుదశవ్యాయామంబులును సాపత్న్యవస్తుజస్త్రీజవాగ్జాతాపరాధజంబులని యెడుపంచవిధవైరంబులునౌదకపార్వత వార్క్షేరిణధాన్వనంబులని యెడుపంచవిధదుర్గంబులును సామదానభేదదండంబులని యెడు చతురుపాయంబులును నౌరసతంతుసంబంధవంశక్రమాగత వ్యసనరక్షితులని యెడు చతుర్విధ మిత్రంబులును న్యాయ ధనార్జన రక్షణవర్ధన సత్పాత్రప్రతిపత్తులనెడు చతుర్విధవృత్తంబులునుస్వామ్యమాత్యరాష్ట్రదుర్గ కోశబలసుహృత్సంజ్ఞలంగల పరస్పరోప కారి సప్తాంగంబులును నిజమైత్ర సమాశ్రితసుబంధుజ కార్యసముద్భవ భృత్యగృహీతనామకంబులగు సప్తవిధపక్షంబులును శ్యేన సూచి గరుడ శకట మకర క్రౌంచపద్మంబులని యెడు సప్తవిధప్రధానవ్యూహంబులును గృషివాణిజ్యదుర్గ సేతుకుంజర బంధనఖన్యాకరకరాదానశూన్యనివేశకంబులని యెడు నష్ట వర్గంబులును పైశున్యసాహసద్రోహేర్ష్యాసూయార్థదూషణ వాక్పారుష్య దండపారుష్యంబులని యెడి క్రోధజనితాష్టగుణంబులును నసాధ్యవస్తువులయందు సముద్యమంబును సాధ్యవస్తువులయందసముద్యమంబును శక్యవస్తువిషయంబునం దకాల సముద్యమంబు ననియెడి వ్యసనత్రయంబును ధర్మార్థకామంబులని యెడి త్రివర్గంబునుప్రభుమంత్రోత్సహానామక శక్తిత్రయంబును శత్రుక్షయస్థానవృద్ధులని యెడి త్రివర్గంబును త్రయీవార్తా దండనీతి సంజ్ఞక విద్యాత్రయంబును ప్రజాపాలనమూలంబైన యింద్రియజయంబును సంధివిగ్రహయానాసనద్వైధీభావ సమాశ్రయసంజ్ఞకంబైన షాడ్గుణ్యంబును హుతాశన జలవ్యాధిదుర్భిక్షమరణంబులని యెడి పంచవిధదైవవ్యసనంబులును నాయుక్తచోర పరరాజవల్లభ పృథివీపతిలోభంబువలననయ్యెడు పంచవిధ మానుషవ్యసనంబులును నలబ్ధవేతనావమానితకోపిత భీషితశత్రు సంబంధివర్గంబుల నభిమతవస్తుప్రదానంబున భేదించుటయును బాలవృద్ధదీర్ఘరోగి జ్ఞాతి బహిష్కృత భీరుకభీరుజనక లుబ్ధలుబ్ధజనక విరక్తప్రకృతివిషయాసక్తానేక చిత్తమంత్ర దేవబ్రాహ్మణ నిందక దైవోపహతక దైవచింతక దుర్భిక్షవ్యసనోపేత బలవ్యసనసంకులాదేశస్థా కాలయుక్తబహురిపుసత్యధర్మ వ్యపేతసంజ్ఞకులైన వింశతి పురుషులతోడ సంధిగావింపక కలహించుటయు రాజ్యాపహరణంబును భార్యాపహరణంబునుస్థానాపహరణంబును దేశాపహరణంబును జ్ఞాతిజనాపహరణంబును ధనాపహరణం



బును మదంబును మానంబును విషయపారవశ్యంబును జ్ఞానవిఘాతంబును నర్థవిఘాతంబును శక్తివిఘాతంబును ధర్మవిఘాతంబును దేవతాతిరస్కారణంబును మిత్రతద్ధనావమానంబులును బంధువినాశనంబును లోకానుగ్రహరాహిత్యంబును స్వామ్యమాత్యాది మండల దూషణంబును స్వాభిమతైక విషయాభిలాషిత్వంబును ననియెడు నివి విగ్రహ కారణంబు లనంబడు నమాత్యరాష్ట్ర దుర్గకోశ దండంబు లనియెడు పంచ విధ ప్రకృతులును బురోవర్తులైన శత్రు మిత్ర శత్రు మిత్ర మిత్ర మిత్ర శత్రు మిత్ర మిత్రులనియెడు వారేరువురునుబృష్టభాగస్థులైన పార్ష్ణిగ్రాహాక్రంద పార్ష్ణిగ్రాహాసారాక్రందాసారు లనియెడు వారు నలువురును మధ్యవర్తి యగు విజిగీషుండును బార్శ్వభాగవర్తి యగు మధ్యముండును వీరల కందఱకు బహిస్థానావస్థితుండైన వాఁడు దాసీనుండు నీపన్నిద్దఱుం గూడి ద్వాదశ రాజాత్మకమండలంబనంబడు నీమండలంబును యాత్రాదండ విధానంబును విగ్రహ్యయాన సంధాయయాన సంభూయయాన ప్రసంగయానో పేక్ష్యయానంబు లనియెడు పంచవిధయానంబులును యానాసనాత్మకంబైన సంధియును ద్వైధీభావ సమాశ్రయాత్మకంబైన విగ్రహంబును వీటి నన్నింటిని నీతిశాస్త్రోక్తప్రకారంబున నెఱింగి గ్రాహ్యాగ్రాహ్యత్వంబున వర్తింపవలయు మఱియుఁ బెక్కండ్రు మంత్రులు గూడి కావించిన మంత్రంబునకు భిన్నత్వసంభవంబువలన నైకమత్యాభావంబువలనను సార్థక్యంబు గలుగదు గావున శాస్త్రోక్తమంత్రిలక్షణలక్షితులగు మంత్రుల నల్వురంగాని ముప్వురంగాని గూర్చి రహస్యంబుగా మంత్రంబుఁగావింపవలయు నివ్విధంబునం బ్రవర్తింపుము వేయని పలికి వెండినిట్లనియె ॥ (సీ) సవన తంత్రాద్యనుష్ఠానంబు చేత వేదంబులుసఫలీకృతంబు లగునె । దానభోగంబుల, ధనధాన్య రత్నాది కంబులుసఫలీకృతంబులగునె । శాస్త్రసంశ్రవణంబు,సఫలీకృతంబగు నేశీలసద్వృత్తనియతివలన । దాక్షిణ్య రతిసుతో, త్పాదనంబునఁ గళత్రంబులుసఫలీకృతంబులగునె ॥ (తే.గీ) రవికులోత్తమనీవాక్క-ఁడవెభుజింప । కిష్టమృష్టాన్నమును బరితుష్టిగాఁగ । మానితాచారులాశంస, మాన్యులైన । మిత్రులకుఁబెట్టుదువెనీవు,పాత్రమెఱిఁగి ॥ (క) ధర్మార్థకామ యుక్తము । నిర్మల సువివేకదంబ,నిత్యము శుభమున్ । శర్మదమగు నాచెప్పిన । ధర్మము

మదిఁ దెలిసికొంటె, దశరథతనయా ॥ (తే.గీ) ఎయ్యది శుభంబు సుజనుల, కి
ష్టమ్మెద్ది । తవిలి మనతండ్రి తాతము, త్తాత లెల్ల । నర్థినెద్దానిసేవించి రను
దినంబు । నట్టినృత్తినిసేవింతె,యనఘనీవు । (తే.గీ) యుక్తదండుండ వై ధర్మ
సం,యుక్తబుద్ధి । నెవ్వఁడిల యేలునట్టిమ,హీవరుండు । పుణ్యజన పుంగవుల
చేతఁ, బొగడువడసి । నైహి కాముష్మిక సుఖంబు,లనుభవించు ॥ (వ) అనియి
వ్విధంబున రాజధర్మంబు లుపదేశింపుచున్న యన్నంజూచి భరతుండిట్లని
యె ॥ (క) కూర్మిమెఱయమీరిప్పుడు । నిర్మలమతిఁ జెప్పినట్టి,నృపధర్మం
బుల్ । ధార్మికులకుఁగాకరహిన్ । ధర్మవిహీనుండ నైన, నాకేమిటికిన్ ॥
(సీ) అనఘూత్తమనవంశ, మునజ్యేష్ఠునకు రాజ్య మవలికనిష్ఠుల,కతనిసేవ ।

—(*)భరతుఁడు రామునికి దశరథమరణంబెఱింగించుట. (*)—

యుచితధర్మంబగు, చుండనీవుభరింపఁదగిన సామ్రాజ్యమ,ధర్మయుక్తి ।
నాకిచ్చియందుకు,నన్నుఁబాత్రముఁ జేసియీఘోరవనమునకిట్లునీకు । రాఁజెల్లు
నేదేవ,రాజ్యపదంబైన నీకుఁగానిదిదాల్ప, నాకువశమె ॥ (తే,గీ) దేవమాకె
ల్లనధిపతి, వీవునన్నుఁ । గరుణఁజూచియయోధ్యాన,గరికిరమ్ము । రాజసన్నిధిఁ
బూజ్యసామ్రాజ్యపట్ట । భద్రుఁడవుగమ్మునృపసభా భవనమందు ॥ (తే,గీ)అ
ధిపధర్మార్థ సహితమై,నట్టిదేవ । లోకసంసాదనీయ కా, స్తోకవృత్త ।మె
వ్వనికిఁగల్గునట్టిమ, హీశుఁడుర్వి । మానుషుండైన దేవత్వమహిమఁగాంచు ॥
(తేగీ.) లక్ష్మణుఁడు సీతయునువెంట,రాఁగనీవు । ప్రోలువెడలిన మాత్రానభూ
వరుండు । పురికినావచ్చుకంటెము,న్నరిగె దివికిఁ । ద్వద్వియోగాగ్ని హేతి సం
తప్తుఁడగుచు ॥ (మ) నినుఁజింతింపుచునిన్నె పేరుకొనుచు,న్నీయందుఁజిత్తం
బుఁజే । ర్చినినుంగూర్చిబహుప్రకారముల విశ్లేషించుచున్నీముఖా । బ్జనిరీక్షా
స్పృహుఁడైభవద్విరహసం,జాతాగ్ని చేఁగ్రాఁగినీ । జనకుండెంతయునస్తమిం
చెజననీస ంఘుంబు శోకింపఁగన్ ॥ (చ) ప్రియతనయుండు ప్రీతినిడు,పిండము
తత్పితృ లోకమందున । క్షయమగునంచు శాస్త్రములు, చాటివచించెడు నీ
వుతండ్రికిం । బ్రియుఁడవుగాన నాయనకుఁ,బ్రీతిగఁబిండ మొసంగుమిప్పుడే।ర
యమున మున్నె చేసితిని,లక్ష్మణసోదర సంయుతంబుగన్ ॥ (క) అనియాగతిఁ
బితృమరణము । వినుపించిన నతనిమాట,వీనులకనిలో । దనుజరిపూత్సృష్టం
బగు । ఘనదారుణవజ్రహేతి, గతిసోఁకుటయున్ ॥ (క) పరశునికృత్తం బగుసు



—(*)రాముఁడుపితృమరణమును వినిదుఃఖించుట.(*)—

ర । తరువుకరణి రాఘవుండు,తద్దయుశోకం । బెరియఁగఁబరవశుఁడైయ । త్తొ
ఱిధరణింబడియెఁజాల,ధైర్యమువాయన్ ॥ (మ) విపులాధీశునిఁ గూర్చియూ
పగిదిని,ర్వేదించుచుంకాలఘూ । తపరిశ్రాంత సుషుప్తదంతి కరణి,న్ధాత్రీ స్థలి
న్వాలియు । న్నపృథూరసుక్షని రాముఁగాంచి వెసనం,తన్భ్రాతలుద్విగ్న
లై ।యుపచారంబులసేవఁదీర్చిరపుడయ్యుర్వీసుతాయుక్తులై ॥(ఆ'వె)అంత గొం
తవడికిన మ్మహాపురుషుండు। తెలివినొందికనులజలములొలుకఁ।దండ్రిమరణమున
కుఁ,దలఁకీదుఃఖింపుచు । నిట్టులనియెఁగైక,పట్టిదోడ॥ (ఉ)భూమి వరుండుసద్గ
తికిఁ, బోవుచు నుండ నయోధ్య యందునే । నేమి యొనర్పువాఁడ జగ,తీశ్వ
ర పాలితమైన యప్పురం । బీమహి నింక నేపురుషుఁ, డేలఁగఁ జాలు దురం
త మీయగా । ధామిత శోకరూప మక, రాలయ మెట్లు తరింతుఁ దమ్ముఁడా॥
(ఉ) ఆతత మద్వియోగజని, తార్తిఁగ నారిలియెవ్వఁడిట్లునా । చేతనసత్కృ
తుండగుచు, శీఘ్రమ్మున న్మృతుఁడయ్యె నట్టి వి । ఖ్యాతగుణాఢ్యకిద్దశర,థావని
భర్తకుఁ బట్టినైసుదు । జ్ఞాతుఁడ నైన నేను వరు, సజ్జనియించుట వ్యర్థ
మేకదా॥ (క) శ్రుతిచోదితగతినీచే । క్షితినాథుఁడు మున్నె ప్రేత, కృత్యంబుల
స । త్కృఁడయ్యెఁగాన నీవిపు । డతులిత చరితార్థకుండ, వైతివి గాదే ॥
(చ) ఇనకుల నాయకుండు దివి, కేగుచు నుండఁ గృతవ్రతుండనై । ననుఁ
బురంబునం దీక్ష ఘ,నంబుగ నెవ్వఁడు ప్రోచువాఁడుపా। వనగతి సన్నివృత్త
వన,వాసుఁడ నయ్యును గ్రమ్మఱం బురం । బునకుఁ జనంగ నోపఁ గృత, పుణ్య
యనాయక మట్లుగావునన్ ॥ (క) ననుఁజూచివంశకరుఁడం । చునృపతియేయే
నుడుగులు శ్రుతిసుఖములుగా । మునుపలుకు నట్టిమాటలు । వినుతగుణాయిం
కనెట్లు విననగునాకున్ ॥ (చ)అనియిటు రామభద్రుఁడు మహా వ్యసనంబునఁ
గైక పట్టితో । నని మగువా భవచ్ఛ్వశురుఁ, డంతమునొందెఁ గదాయటం
చున । జ్జనకజతోడనాడియను,జా పితృహీనుఁడ వైతెయంచుఁద । మ్మునిఁగని
పల్కె నెవ్వగలు, ముంపఁగ నశ్రులు నించెఁగ్రమ్మఱన్ ॥ (ఉ) అన్న తెఱంగుఁ
జూచి భర,తాదులు శోకపరీతచిత్తులై । కన్నుల బాష్పముల్గురియఁ, గా విల
పించుచు సాంత్వ వాక్యసం । పన్నతనాదరించి నర,పాలున కౌర్ధ్వక మాచ
రింపకా । పన్నత నొందె కుండనిటు, పాడియె రాఘవ యంచుఁ బల్కినన్

(తే,గీ) జానకియు స్వర్గగతుఁడైన, శ్వశురునివిని । కనుల నశ్రులుగారఁ రోదనముఁ జేసె । నామహాదేవి నూరార్చి, రాముఁడపుడు । శోకమునఁగుందు సౌమిత్రిఁ, జూచిపలికె ॥ (క) విదితాత్ముండగు తండ్రికి । నుదకక్రియసలుపవలయునుచితంబుగనిం । గుదిపిణ్యాకముచీరయుఁ । గోదువపడకయుండ వేగఁగొనితె

## (*)రాముఁడు దశరథునకుఁబిండప్రదానంబు సేయుట.(*)

మ్మనఘా ॥ (క) జనకకుమారిం దోడ్కొని । యనఘా మందాకినీమహానదికడకుం । జనుమీవు వెంటనేనును । జనుదెంచెదఁదండ్రికర్థి, జలమొసగుటకుఁ ॥ (వ) అనిపలుకు నాసమయంబున విదితాత్ముండును మహామతియు మృదుండును శాంతుండును దాంతుండును భృశానురక్తుండును దృఢభక్తిమంతుండును నిత్యానుగుండునగు సుమంత్రుండు రాజకుమారులంగూడి రామభద్రు నాశ్వాసించితదీయకరంబవలంబించి మందాకినీనదికడకుం దోడ్కొనిచనియె నప్పుడక్కుమారచతుష్టయంబు సదాపుష్పితకాననంబైనమందాకినీనదీతీరంబునకుం జనియకర్దమంబైన యవతరణప్రదేశంబున కతిప్రయత్నంబున డిగ్గి తదీయపుణ్యసలిలంబులం గ్రుంకెనంత రాముండుజలంబులు దోయిటసంగ్రహించి యామ్యదిశాభిముఖుండై రోదనంబుసేయుచు దశరథునుద్దేశించి ॥ (తే,గీ) క్షితివరోత్తమ పితృలోకగతుఁడవైన । నీకుమద్దత్తమైన యీలోకపావ । నోదకంబక్షయంబయి, యొప్పుఁగాక । యనుచునంజలి జలవిసర్జనమొనర్చె ॥ (వ) ఇట్లుసలిలక్రియఁ గావించి దర్భసంస్తరంబునందు బదరీమిశ్రితంబైన యింగుదీపిణ్యాకంబిడి వెండియు దశరథునుద్దేశించి దుఃఖపూర్వకంబుగానిట్లనియె ॥ (ఆ,వె) పృథివిలోనఁ బురుషుఁ, డేయన్నము భుజించు । నతని దేవతలుఁద, దన్నులగుదు । రధిపనా యొసంగి నట్టియీపిణ్యాక । మింపుతోభుజింపుమిపుడునీవు ॥ (వ) అనిపలికివిధిప్రకారంబునఁబిండదానంబుఁగావించి యారఘువల్లభుండుతమ్ములుందానును సీతాసమేతంబుగా వెండియుఁ బూర్వమార్గంబుననప్పర్వతంబారోహించి పర్ణకుటీరద్వారంబుడగ్గఱినిజబాహుదండంబులుసాఁచిభరతలక్ష్మణులంగౌఁగిలించుకొని దీర్ఘస్వరంబునరోదనంబుఁ జేసినవారునుసీతాసమేతంబుగాఁబితృమరణభ్రాతృప్రవ్రాజన సంజాత శోకవిశేషంబునదుఃఖించిరంతనయ్యాక్రందనశబ్దంబు గిరిగుహాముఖంబులం బ్రతిధ్వనులుసెలంగఁ దుముతులంబైయొప్పె నప్పుడు భరతసైనికులు నివాసంబులు విడిచి



## (*)భరతసైనికులందరు రామునిం జూడవచ్చుట.(*)

వారికభిముఖంబుగా రథహయగజశకటంబులెక్కి సత్వరంబుగంజనిరి కొందఱు చిరప్రోషితుండైన రామునిఁ జిరప్రోషితునిగాఁ దలంపుచు ద్రష్టుకాములై తేవనంబునఁ దదీయాశ్రమంబున కరిగి రాసమయంబున ఖురనేమి సమాకులంబులైన సింహవ్యాఘ్రవరాహ భల్లూక మహిష సర్పవానర గోకర్ణగవయాది క్రూర మృగంబులును విత్రాసితంబులై యక్కాంతారంబు విడిచి పృషత సహితంబుగా నొండు వనంబునకుం జనియె రథాంగ హంస కారండవ బక క్రౌంచ శుక పిక శారికాది పతత్రిగణంబులు దీనారావంబులు సేయుచుఁ బఱవం దొడంగె నప్పుడు విత్రస్త పక్షి సంకులంబైన నభంబును విత్రస్త జన సంకులంబైన భూతలంబు నుభయంబు నేకప్రకారంబునం బొల్చియుండె నంత సర్వ జనంబులు పురుషవ్యాఘ్రుండు నకల్మషుండును స్థండిలాసీనుండును యశస్వియునగు రామునింజూచి కైకేయినిమంథరను నిందింపుచు బాష్పపూర్ణ ముఖులై శోకింపుచుండ వారిం జూచిధర్మజ్ఞుండైన రాముండుతల్లిదండ్రులంబోలె సంభావించి ప్రణామాలింగన వచోగౌరవాదుల సంప్రీతులంజేసిన వారుయథార్హస్థానంబులనధివసించి పెక్కుచందంబుల నతనిదురవస్థంజూచి నిర్వేదించుచుండఁ దదీయశబ్దంబు భూనభోంతరంబు నిండి మృదంగ స్వనంబు భంగిఁ జెలంగెఁ దదనంతరంబ ॥ (క) జనపతి భార్యల నందఱ । మునివిభుఁడు వసిష్ఠుఁ డపుడు, ముందిడుకొని గ్ర । క్కున నద్దేశంబునకుం । జనియె న్రాఘవునిఁ జూచుసంభ్రమ మెసఁగఁ ॥ (తే, గీ) అమ్మహా రాజ పత్ను, లి, ట్లరిగి జనక । కన్యకాస్నాన పుణ్యోద, కయును రామ । లక్ష్మణ నిషేవితయునై సు,లక్ష్యమగుచుఁ । గ్రాలుమందాకినీనదిఁ, గాంచి రచట ॥ (క) అప్పుడు కౌసల్యయుఁగను । ఱెప్పల బాష్పంబులాని, ప్రియ తనయునిపై । నొప్పిన యనురాగము తనుఁ । గప్పికొనఁగ నలసుమిత్రఁ, గని యిట్లనియెన్ ॥ (తే,గీ) అకట నిర్విషయీకృతు,లైన రామ । లక్ష్మణు లనాథులై త్రికా, లంబులందు । స్నానమొనరించుటకు నజ,స్రంబుడిగ్గు । నట్టితీర్థ దేశం బిది,యబలకంటె ॥ (క) అతివ యతంద్రితుఁడై నీ । సుతుఁడీతీర్థమున నుండి,సురుచిరముగమ । త్సుతునకు నర్పించుటకై । సతతము సలిలము గ్రహించి, చనుచుండుఁ గదా ॥

(సీ) అతిన నీసుతుఁడు జలాహరణాదిజఘన్యకర్మంబిట్లు, కడఁకతోడఁ । జే
సిన వాఁడయ్యు, శిష్టజనంబుచే నిలఁగర్హితుఁడు గాఁడ, దెట్టులన్న । నన్నకు
శైంకర్యమర్థిఁ జేసిన నదియంతయు గుణయుక్తమసిరిగాదె । భరతుఁడంజ
లిఁ జేసి ప్రార్థనఁగావింప రాముండు ప్రీతిసామ్రాజ్యపదవిఁ ॥ (తే,గీ) జే

—(*) కౌసల్య యింగుదీపిణ్యాక పిండములనుజూచి దుఃఖించుట. (*)—

కొనియెనేని ఘనసుఖోచితుఁడు నీకు । మారుఁడతిదుఃఖశోకవిస్తారమయిన ।
యీనికృష్టకర్మంబు తానిందెవిడిచి । యిపుడె సుఖియించు గృహమున, నిం
పుమెఱయ ॥ (వ) అనియిట్లు లక్ష్మణుని సుహృద్భావంబు బహుప్రకారంబుల
వర్ణింపుచుఁ దత్సమీపంబున దక్షిణాగ్ర దర్భ సంస్తరంబునందుఁ బిత్రు
ప్రీత్యర్థంబుగా రాముని చేత విన్యస్తంబైన యింగుదీపిణ్యాకంబుఁ జూచిఁ
యద్దేవి వెండియు నంతఃపుర కాంతల నవలోకించి యిట్లనియె ॥ (సీ) ఇన
కుల దీపకుం, డిక్ష్వాకునాయకుం డతిసుఖోచితుఁడు మహాత్ముఁడమర । స
ముఁడైన దశరథ, క్ష్మాభర్తకిచట మత్సూనుని చేదత్తమైనదాని । నింగు దీపి
ణ్యాకమిదిగనుఁగొంటిరే భుక్తభోగుండైన, భూవరుండు । చతురంత మేదినీ,
చక్రంబుగుడుచు వాఁడిటువంటి భోజనం, బెటుభుజించె ॥ (తే, గీ) దాశరథి
చేతఁ దండ్రికి, దత్తమైన । దీనిఁ వీక్షించి నంతనా, మానసంబు । వేయివ్రయ్య
లైపోవదువితతవజ్ర । సారమయము గాఁబోలును, సంశయముగ ॥ (వ) అని
యివ్విధంబున నార్తయైవిలపింపుచున్న కౌసల్యనూరార్చి సపత్నులద్దేవిం దో
డ్కొని శీఘ్రంబునం జని స్వర్గచ్యుతుండైన దేవేంద్రుని చందంబున సర్వ
భోగ పరిత్యక్తుండై స్థండిలంబునం గూర్చున్న రామునింజూచి శోక కర్శితల
యి కన్నీరునించుచు సుస్వరంబుగా రోదనంబు చేసి రప్పుడు రాముండు తల్లులం
జూచి శీఘ్రంబున దర్భాసనంబుననుండి లేచి తదీయచరణంబులకుఁ బ్రణామంబుఁ
గావించిన వారు సుఖస్పర్శంబులును మృద్వంగుళీ తలంబులునైన కరంబులున
మ్మహాత్ముని నెమ్మేని రజంబుఁ బరిమార్జించి రంత లక్ష్మణుండునుం బ్రణమిల్లిన
నక్కుమారుని రామునింబోలె నాదరించిరి పదంపడి వైదేహి భక్తిపూర్వ
కంబుగా నమస్కరించి బాష్పపూర్ణ ముఖియయి దుఃఖింపుచు మరుచ్చలి
తవల్లియుంబోలె నడలుచు నుపవాసకృశాంగియై తూలుచు దైన్యంబుతోఁ



—(*) కౌసల్య సీతాదేవినిం జూచి దుఃఖించుట. (*)—

బురోభాగంబున నుండె నప్పుడద్దేవింజూచి కౌసల్య బద్ధస్నేహయై తల్లి కూఁతు
నందుం బలె వాత్సల్యంబు నెఱపుచు నిట్లనియె ॥ (క) జనకుని కూఁతురు దశరథ ।
జనపతి కోడలు సురామచంద్రుని సతి భూ । తనయయగు సీతకిటువిధి । పనినిడుమ
లుగుడుపుమనుచు వ్రాసెనదయుఁడై ॥ (మ) దిననాథాతపతప్త పంకజము రీతిన్, వా
డిదచ్ఛిన్న చంద్రునిభంగి న్నీరసోత్పలంబుగతిరే, ణుధ్వజస్త భర్మంబుచాడ్పున
వీతద్యుతి నున్న సీతవదనంబుం జూచుచో నన్నుఁ ద । ఘ్ఘనశోకానలమాశ్రయం
బు కరణిం, గాల్పం దొడంగెన్ రహిన్ ॥ (వ) అనిబహుప్రకారంబుల దుఃఖింపు
చున్న తల్లిననూనయించి రాముండు సురాధిపుండగు శక్రుండు బృహస్పతికిం
బోలె హుతాశనసమప్రభుండైన వసిష్ఠునకుఁ బ్రణామంబాచరించి యమ్మునిపుం
గవునితోఁ గూడ దర్భాసనంబున నాసీనుండయ్యెఁ దదనంతరంబ భరతుండు
కృతాంజలిపుటుండై సామంతపురోహిత సేనానాథ సహితంబుగా నిజతను
చ్ఛాయావిశేషంబున నక్కాననంబునకు గారుత్మతచ్ఛాయ నొసంగుచుఁ బ్ర
జాపతి కభిముఖుండై కూర్చున్న పురుహూతుండుం బోలె మునివేషధరుండై
న రామున కభిముఖుండై కూర్చుండె నప్పు డచ్చటి వారందఱు రామునకుం
బ్రణమిల్లి యతనిచేత సత్కృతుండై భరతుం డతనితో నేమి సంభాషించునో
యని తద్వాక్య శ్రవణ కుతూహలంబున యథార్హ స్థానంబుల నాసీనులై
యుండి రిట్లు కూడుకొనిన సత్యధృతియగు రాముండును మహాత్ముండగు లక్ష్మ
ణుండును ధార్మికుండైన భరతుండును సుహృత్సమేతులై యధ్వరవేదియం
దు సదస్యులతోడం గూడిన త్రేతాగ్నుల చందంబునం దేజరిల్లుచుండి రంతఁ
గొంతసేపునకు రాముండు గురువత్సలుండగు భరతునిం జూచి ప్రియవచనం
బుల నాశ్వాసించి లక్ష్మణసహితంబుగా నిట్లనియె ॥ (చ) నిరుపమ రాజ్యము

—(*) రాముండు భరతుని జటాధారణ వనాగమన కారణం బడుగుట. (*)—

న్విడిచి, నిత్యముఁ బార్థివరక్ష్యమైన మాత్స్వరమును బాడుచేసి నర, పుంగవ
తాపసవేషధారివై । యఱమర లేక పక్షులకు, నైన గమింపఁగ రానియ
ట్టియా । గురుతర చిత్రకూటమున, కుంజను దెంచితి వేల చెప్పుమా ॥ (క) నా
విని భరతుం డాసీ । తావల్లభు చరణములకు, దండ ప్రణతు । ల్గావించి
మధురభాషా । ప్రావీణ్యము తోఁప బలికెఁ బ్రాంజలి యగుచున్ ॥ (క)

నరపతి నిసుఁ బాసి సుదు। ష్కరమగు పాపం బొనర్చి, కడపట సుత
శో। కరసాబ్ధిమగ్నుఁడై య। ప్పురుషవరుఁడు మేనువిడిచి,పోయెఁదివికిన్॥
(క) రయమున మాయమయగునౌ। కయిచే వినియుక్తుఁడగుచు, ష్టానాయ
కుఁ డ। ట్లయశో హరమగు నీదు। ర్నయకార్యం బాచరించె,రాజకులేశా॥
(క) లోకనుత విధవయగు న। కైకయుబహు దుఃఖశోక,కర్శితయై య।
స్తోకతరరాజ్య పదమును। గైకొనక దురంతనిరయ, గతిఁకి జనియెడిన్॥ (క)
తడయక యిప్పుడె శత్రుని। వడువున సామ్రాజ్య పట్టభద్రుఁడవగుచు।న్గడుకొని

—(*) భరతుఁడు రాముని రాజ్యం బంగీకరింపు మని ప్రార్థించుట. (*)—

దాసుఁడ నగు నా। కిడుము మహా నుగ్రహంబ, హీనగుణాఢ్యా ॥ (క) అ
నఘా పురజనులు మహీ। జనులు సఖులుహితులు మాతృ,సంఘమిచటికిం।
జను దెంచియున్నవారలు। జనవర్య యనుగ్రహంబొ, సంగుము కరుణన్॥(క)
వ్యక్తంబుసానుపుర్వో। ద్వ్యక్తము నీవనుభవింప, నుచితంబుమహా। యుక్తం
బగు రాజ్యంబను। రక్తిం జేకొని హితాప్తులంబ్రోవుమిఁకన్ ॥ (క) భూరికళా
నిధియగుశశి। చేరాకారజనిభంగి శిష్టాచారో। దారవిచారుఁడవగు నీ। చే
రస నాథవతియగుచుఁ, జెలఁగెడు ననఘా ॥ (తే,గీ) అధిప యీయిష్ట సచివ
స మన్వితముగ। నర్థినాచేత శిరముచే,యాచితుండ। వగుచు శిష్యుఁడుదా
సుఁడు, ననుజుఁడునగు। నాకుసమ్యక్ప్రసాదంబొ,నర్పుమిపుడు॥(క)విమలాత్మ
పూజితముపి। త్ర్యము శాశ్వతమున్నమాహితమునిత్యంబున్। సుమహితచరితం
బీమి। త్రమండలముదీనిఁ గడవఁ దగదిఁకనీకున్॥ (క) అని యిట్లుపలికి య
శ్రులు। కనుఁగొనలంగ్రమ్ముచేఁగాఁ గైకేయీ। తనయుఁడు క్రమ్మఱఁదత్పద।
వనజంబుల మీఁదభక్తి వ్రాలెం బలుచన్॥ (తే,గీ) అంతరఘుపుంగవుఁడుదుః
ఖి,తాత్ముఁడగుచు। సమదదంతావళముభంగి, సారెసారె।। కూరుపులు వు
చ్చుచుగలంగి యున్నభరతు। నట్టె కౌఁగిటఁ గదియించియిట్టులనియె॥
(మ) అనఘాత్మా చరితవ్రతుండు నిజవంశాచార సంరక్షణుం। డును
దేజస్వికులీనుఁ డంచిత గుణుం, డు నసత్వ సంపన్నుఁడు। న్వినయో దా
రుఁడు రాజ ధర్మ విదుఁడౌ, నీయట్టివాఁ డివ్విధం। బున దుష్కర్మ
ము రాజ్య కారణము న, న్బోధింపఁగాఁ జెల్లునే॥ (క) మానుగనీయం
దించుక। యైనను దోషంబుఁ గాన, మన్వయనయము। న్మాని భవదంబనిట్లం



జ్ఞానంబున దూఱనగు నెసౌజన్యనిధీ। (వ) వత్స మహాత్ములగువారికి సమ్మతం
బులగు పుత్రకళత్రంబులయందు స్వచ్ఛందకరణంబు విధింపఁబడియున్నది లో

## రాముఁడు భరతునితో దశరథాజ్ఞకు

—(*) లోఁబడ వలయుననుట. (*)—

కంబులయందు సాధువులచేత నెట్లునియమ్యత్వంబునఁ బుత్రకళత్ర శిష్యాదులు
పరిగణితులట్లు మనమునుదశరథునకు నియమ్యులమని నీవెఱింగికొనుము చీర
కృష్ణాజినాంబరుండనై వనంబుననున్నఁ బట్టాభిషిక్తుండనై పురంబుననున్న నా
కమ్మహానుభావుండెరకుకుం డతనివాక్యంబలంఘనీయంబు ॥ (తే,గీ) ధర్మభృ
చ్ఛ్రేష్ఠ యెందాఁకఁ దండ్రియందు। లోకసత్కృతమయిన యస్తోకగౌర।
వంబునుస్థిరమునందాఁకవరుసతోడ। నంబయందుననుస్థించుటదిహితంబు॥(ఆ,వె)
అట్టిధర్మశీలురగుతలిదండ్రుల। చేతరామవనినివసింపు మనుచుఁ। బలుకఁబడిననే
ను సదవఁడివేఱొక్క। చందమెవ్విధమున సలుపువాఁడ॥ (సీ) అనఘాత్మవిను
మయోధ్యాపట్టణముననేకచ్ఛత్రమైన జగత్ప్రభుత్వ। మింపారఁగాఁ గైక
యీకుమారుండుండుఁ గాక రాముండువల్కలజటాజి। నంబులుదాల్చి ఘోరం
బగుదండకా కాననంబున నుండుఁ గాక యనుచు। భూమీశుఁడిట్లు సభామధ్య
మందువి భాగించిపలికిసుపర్వగతికి॥ (తే,గీ నరిగెనాయన గురుఁడుసత్యప్ర
తిజ్ఞుఁ। డధివిభుఁడుతండ్రిధర్మాత్ముఁ డట్లుగాన। నతనిచేదత్తమయిన మహా
హర్షభాగ। మనుభవింపుముతగసందియంబువలదు॥ (ఉ) ఏనును వల్కలాజి
నము లెంతయుఁదాల్చిచతుర్దశాబ్దము। ల్కానుక మానినై గహన భూమిని
వాసమొనర్చితండ్రిచే। మానుగదత్తమైనయస మానయశస్కర భాగమా
త్మల్తో। నూనినవేడ్కతోఁగుడుచు చుండెదమూలఫలాశనుండనై॥ (వ) మఱి
యుదశరథుండు ధర్మాత్ముండును సత్యసంధుండును మహేంద్ర సముండును
లోక సత్కృతుండును గావున నతనిచేత నేభాగంబుదత్తంబయ్యె నదియె య
మృతంబనితలంచెద నేకాని తద్వ్యతిరిక్తంబుగా సంప్రాప్తంబైన సర్వలోకేశ్వ
రత్వంబైనఁ దుచ్ఛంబుగాఁదలంచెదనని యివ్విధంబున రాముండుపలుకుచుండ
సుహృద్గణపరివృతులయి శోకింపుచున్న యప్పురుషసింహుల కవ్విభావరియొ
కర్కచంబంబున నతిక్రమించెనంతఁ బ్రభాతకాలంబుననారాజకుమారులుసుహృ
త్సమేతంబుగా మందాకినీనదికిం జని యందు సుస్నాతులై కాల్యకరణీయంబు

లుదీర్చి గ్రమ్మఱం బర్ణశాలకుం జని రామునిం బరివేష్టించి యందఱు సుఖాసీనులయి యూరకుండి రంతం గొంతసేపునకు సుహృన్మధ్యంబునం గూర్చున్న భరతుండు రామభద్రున వలోకించి యెల్లవారును విననిట్లనియె॥ (చ) అనఘచరిత్రమజ్జనని

—(*) భరతుఁడు నానా విధంబుల రాముని రాజ్యం (*)—

—*) బంగీకరింపుమని వేఁడుట.(*—

యూనరనాథు బలాత్కరించి కై। కొని వెసనాకొసంగినయ కుంఠితరాజ్యము ధర్మయుక్తినా । యనువున నీకొసంగెద మహాత్మ పరిగ్రహణం బొనర్చినా । మనము వికాసమొందంగ నమాత్యులభృత్యుల నేలుమి త్తఱిన్ ॥ (తే,గీ) ఘనసమయనూతనాంబువేగంబుచేత । సేతువును బోలె నీసుప్రసిద్ధమైన । భరతఖండంబు నీకంటెం బరునిచేత । శీర్ణమగుం గాక రక్షణాకీర్ణమగునె॥ (ఆ,వె) హరిగతిని ఖరంబుగరుడగతిని గాక । మనుసరింప లేనియట్లు పరమ । ధర్మమూర్తివగుచుం దనరెడునీగతి । ననుసరింపం జాలనధిప యేను॥ (తే,గీ) చెలంగి యన్యులచేతం బోషింపంబడెడు । వానిజీవంబు కడు సుజీవంబు కాదు । చెలువు మీఱంగం బరులరక్షించునట్టి। వాని జీవంబె కడు సుజీవం బధీశ॥ (వ) మహాత్మా పురుషుని చేత రోపితంబైన వృక్షంబు పరివర్ధితంబై యంతకంతకు వామనుని చేత దురారోహంబగునట్లు రూఢస్కంధంబై మహాద్రుమంబగు నది యెప్పుడు పుష్పించినదై ఫలంబులం జూపకుండెనప్పుడప్పురుషుం డెట్లు ఫలాభావ హేతువువలనం దత్ఫలవిషయప్రీతి ననుభవింపకుండునట్లు నీవు భర్తవై భృత్యులమైన మమ్ముం బాలింపవేని యీయుపమార్థంబున కనుగుణంబగుం గావున నస్మత్పరిపాలనరూపార్థంబు ఱుంగనర్హుండవివ్వుడు సామ్రాజ్యదీక్షితుండవై ననిన్నుం బ్రతాపవంతుండైన సూర్యునిం బోలెం గన్నులారంగనుంగొన నీపౌరశ్రేణులమాత్యులందఱుం బరమాసక్తులై యున్నవారు తురంగ మాతంగంబులు రాజ్యాభిషిక్తుండైన నిన్ను వెనుకొని హేషాబృంహిత ధ్వనులు సెలంగ నరుదేఱంగల వంతఃపుర కాంతలెల్ల సమాహితలై సంతోషంబునం బొదలుచు నీవిఱుందం జనుదెంచెదరు నాయంజలిం గైకొని పురంబునకు విచ్చేయుమని పలికిన నతని వచనంబులకలరి యచ్చటివారలంఱఱు సాధువాక్యంబుల నభినందించిరి యిత్తెఱంగునం గృతాంజలి మస్తకుండై దైన్యంబునం బ్రార్థింపుచున్న భరతునిం జూచి సురక్షితమనస్కుండును ధైర్యవంతుండునగు రాముండు మంచ మధురాలాపంబుల నాశ్వాసింపుచు నిట్లనియె॥



(ఆ,వె) అనఘచరిత యాత్మకైచ్ఛికవ్యాపార । మరయ లేదు పురుషుం డస్వతం

—(*) రాముఁడు భరతునికి ధర్మోపదేశము సేయుట. (*)—

త్రుఁ। డతనిం బట్టి దైవమట్టిట్టు నుడివెట్టుఁ। గడంగి పూర్వకర్మకారణమున (తే,గీ) జగతి జీవితములకు సంచయములకు స । ముచ్ఛ్రయములకు మఱియు సంయోగములకు। మరణముక్షయంబు పతనంబు మఱివియోగ । మంత మని పల్కి రార్యుల నఘశీల॥ (క) ఇలపైంబక్వఫలంబుల । కలయక పతనమునకంటె నన్యభయంబుల్ కలుగని క్రియం గలుగదు మ । ర్త్యులకు మ్మరణమునకంటె నొండు భయంబుల్॥ (తే,గీ) అనఘచరిత దృఢస్థూణమైన గృహము । చెడి దినముం జూడ జూడ నశించునట్లు । ముదిమి నొంది నానాంటికిం బుడమిజనులు । మృత్యువశగతులై నశియింతురెప్పుడు॥ (క) ఇననందనా ప్రవాహము। వనధిం గలసి మఱల రానివై ఖరిధరలోంజనినదినంబులు రాత్రులు। చనుదేఱవు మఱలం గాలసంగతి ననఘా॥ (వ) అట్టియహోరాత్రంబులు నిదాఘంబునందు సూర్యునికిరణంబులు జలంబుం బోలె నీజగంబునందు సర్వప్రాణుల యాయువును హరింపుచుండు నశ్వరఫలసాధనంబులయందువ్యాప్తుండవై ననీవు నిన్నే యుద్దేశించి శోకింపుము పరులనుద్దేశించి యేలవగచెద వేకారణంబున భవదీయంబైన జీవితకాలంబు క్షయింపుచుండు నక్కారణంబునం బరలోకచింతం గావింపుము మృత్యువు శరీరితోంగూడం జను శరీరితోడం గూడియుండు దూరమార్గంబరిగి శరీరితోంగూడ నివర్తింపంబడు బురుషుని దేహంబునందు నానాంటికి వళులును శ్వేతశిరోరుహంబులును సంప్రాప్తంబగు జరచేత జీర్ణుండైన పురుషుండే యుపాయంబు గావింప సమర్థుండగు సూర్యుం డుదయింపుచుండ నర్థార్జనకాలంబు సమాగతం బయ్యె సూర్యుం డస్తమింపుచుండం గామోపభోగకాలంబు సమాగతంబయ్యెనని యిట్లు మనుష్యులానందింపుదురు గాని ఛిద్రఘటంబునందు గ్రహింపంబడిన జలంబుకరణిం బ్రతిక్షణంబు తనజీవితకాలంబు క్షయింపుచున్నదని యెఱుంగరు మఱియు వసంతాది ఋతుసమాగమంబు విలోకించి తత్తద్భోగకాలంబు సంప్రాప్తం బయ్యెనని హర్షింతురు గాని ఋతుపరివర్తనంబున జీవితక్షయం బగుచున్నదని యించుకయైన నెఱుంగజాలరు దియునుం గాక॥ (చ) కడువడి వార్ధిమధ్యమునం గాష్ఠముకాష్ఠముం గూడి మారుతం। బడరవియోగ మొందిచని నట్లు కళత్ర సుతాదులొక్కచో । నుడుగక కూడి పెక్కహము, లుండి పదంపడి పూర్వసంస్కృతిం ।

గడచినియోగ మొందుదురు, కాలవశంబునఁ జేసిమానదా ॥ (తే,గీ) అవ
నినొకఁడైన వలసినట్లాప్తజనులఁ । గలసియుండఁగఁ జాలఁడ, కారణమునఁ ।
బరఁగమృతుని నుద్దేశించి, వగచువాని । కరయలేదు తన్నిరసనమందుశక్తి ॥
(సీ) రాజనందనశరీర ప్రవర్తనమదియంతలోఁగలుగుతా, నంతలోన । గుణ
దోషములేఱింగి, కుత్సితకర్మంబువర్జించి దేహికే,వలతధర్మ । మాచ
రింపఁగఁబోలు, నంగనాపుత్ర గేహారామవిత్తాదు, లతనివెంటఁ । బోవుతాఁ జే
సిన,పుణ్యపాపంబులు తప్పకతనవెంటఁ, దగిలివచ్చు ॥ (ఆ,వె) ఎఱుక గలమ
హాత్మ, లీయర్థము గ్రహించి । పోవరానిత్రోవఁ,బోవనీక । మనసునాఁగిప
ట్టిమహిత ధర్మమునందె । సంచరింతు రెపుడు సత్యమింత ॥ (వ) మఱియు
మార్గగతుండైన పురుషుండు సహచరులైన పథికులం జూచి యేనును మీ
వెంట నరుదెంచెదనని పలికి యనుసరించి చనినట్లు తొల్లింటి పూర్వికుల చేత
నాచరితంబైన పితృపితామహసంబంధి యగుమార్గంబుపుత్రాదులచేత నుపగ
మ్యంబని నిశ్చితంబయ్యె నెద్దానికి వ్యతిక్రమంబు లేదట్టిదాని నుద్దేశించి యాప
న్నుండై శోకించుటెట్లగు ననివర్తియైనప్రవాహంబుకరణి నాయుఃకాలంబరు
గుచుండఁ బ్రజలు ధర్మసాధ్యసుఖాసక్తులుకావునఁ బరలోకహిత చింత చేత
సుఖహేతువగు ధర్మంబునందాత్మ నియోగింపఁదగినయది తండ్రియగు దశ
రథుండు పుష్కలంబులైనభోగంబులనుభవించి ధర్మంబుతప్పకుండ నర్థదా
నంబువలన భృత్యరక్షణపూర్వకంబుగాఁ బ్రజఁ బాలించి దక్షిణాపూర్ణంబు
లైనక్రతుశతంబులచేత దేవతలఁ దృప్తినొందించి విధూతకల్మషుండై చిరకా
లంబు పాపప్రసంగరహితంబుగాజీవించి జీర్ణంబైన మానుష దేహంబువిడిచి
బ్రహ్మలోకవిహారిణియైన తనువు ధరించి దేవసంబంధి సంపద ననుభవింపం
జనియె నమ్మహాత్మునుద్దేశించి శ్రుతవంతుండవు బుద్ధిమత్తరుండవైన నీవు ప్రా
కృతునియట్ల శోకింపందగదు దశరథమరణ మద్వివాసనాది విషయ ఖేదంబు
న బహుప్రకారంబులయిన యీశోకంబులు వ్యర్థంబులు ప్రలాపాశ్రువిమో
చనంబునందుఁ గార్యంబులేదు ధీరుండగువానిచేత సర్వావస్థలయందు నేతా
దృశవ్యసనంబులు వర్జనీయంబులయియుండు నదియునుంగాక ॥ (సీ) అనఘా
త్మ మనతండ్రి యగుదశరథుఁడుని న్నవనిసంరక్షింపు మనుచుఁబలికె । నను



ఘోరకాననంబున కేగుమనిపంచె నమ్మహాత్ముఁడు చెప్పినట్లనీవు । స్వస్థచిత్తుండ
వై సాకేతపురికేగు మేనుగాననమున కేగువాఁడ । నీకునాకును బోలెన్నృపశా
సనములంఘ్య మట్లుగావునఁ జేయుటదిహితంబు ॥ (తే,గీ) మనకుఁదండ్రియు దై
వంబు మాన్యుఁడఖిల । ధర్మసంవేది యమ్మహోదారు పలుకు । ధర్మగతి
నేను వనవాసకర్మమునుస । మంచితంబుగ నింకఁబాలించువాఁడ ॥ (చ) ప
రమతిధార్మికుండు గురువర్తిమృదుండనృశంసుఁడైనవాఁ । డరయఁగ ధర్మ
మార్గరతుఁడై వరలోకజిగీష చేనతి । స్థిరముగఁ దండ్రిమాట విని చేయఁగఁ
బోలుఁ గుమారనీవు న । గ్గురువచనంబు సార్థముగ గోరియొనర్పుమురాజ
నందనా ॥ (క) మనతండ్రియైనదశరథ । జనపతి శుభవృత్తమెఱిఁగి సజ్జనవర
నీ । వనిశంబు స్వభావముతో । ననుపమమతి నిన్నుఁగూర్చు,మవితథభంగిన్ ॥
(వ) అనియిత్తెఱంగున రాముండు పితృనిదేశపరిపాలనంబుకొఱకు సర్థవంతం
బైనవాక్యంబునఁ దమ్మునికి ధర్మరహస్యంబుపదేశించి యూరకున్న నారఘు
నందనుండగు భరతుండు ప్రకృతివత్సలుండగు రాముని వీక్షించి ధార్మికంబు
ను జిత్రంబునగు వాక్యంబున నిట్లనియె ॥ (ఆ,వె) అధిపనిన్నుదుఃఖ మదిబాధి

## ✱ భరతుఁడు యుక్తియుక్తంబుగా రాముని బ్రార్థించుట. ✱

తునిఁజేయ । జాలవలముదంబు,సంప్రమోద । సహితుఁగాఁగఁజేయఁజాలదు
నీయంత । ఘనుఁడు లోకమందుఁ గల్గఁడె యొరుఁడు ॥ (తే.గీ) విమలచారిత్ర
లై త్రివిద్య వృద్ధులయిన । వారికీవు సర్వజ్ఞతావైభవమున । సమ్మతుఁడవయ్యు
ధర్మసంశయములకలుగు । చోటవారలనడిగెదు,సురుచిరముగ ॥ (సీ) మృతుఁడై
నపురుషుఁడే,గతిద్వేషవిషయుండుగాఁ దట్లుమనియున్న,వాఁడుద్వేష । విషయు
డుగాఁడు బల్విడిలేచిదానిపై నెట్లురాగముపుట్టదట్లయున్న । దానిపై రాగమింత
యుఁబుట్టదిటువంటిబుద్ధిలాభముగల,పురుషుఁడేల । పరితాపమొందు నెవ్వఁడు
పరావరవిదుఁడతఁడిట్టివ్యసనంబు, నధిగమించి॥ (తే,గీ) యనుబరితపింపఁదగదీ
వుజనవరేణ్య । యట్టివాఁడవునిముగాని,యూడఁదరమె । సకలలోకైక కర్తవు
సాధువినుత । సద్గుణుండవుశాస్త్రవి,శారదుఁడవు॥ (వ) మహాత్మా నీవుసత్త్వగుణ
ప్రధానుండ వమరతుల్యుండవు మహానుభావుండవు సత్యసంగరుండవు సర్వజ్ఞుం
డవు సర్వదర్శివిబుద్ధిమంతుండవు భూతప్రభవ వినాశ కోవిదుండ విట్టి సద్గుణ
యుక్తుండవైన నీవు మాదృశుల కవిషహ్యంబైన దుఃఖంబనుభవించుటకు న

హర్షుండవు కావని పలికి వెండియు నిట్లనియె॥ (క) సరసుఁడవు సత్యసంధుఁడ । వ
రయఁగఁ బుణ్యాత్ముఁడవు మహాత్ముఁడవీవి । ప్పురుసునఁ బలికి మముబోఁ । ట్లరిమథనా
యేమి సేయనర్హులు ధాత్రిన్ ॥ (ఆ,వె) ఏను బ్రోషితుండనైన చో మాతల్లి క్రూ
రశీల యగుట సారిది నాకుఁ । బ్రీతి సేయనిట్టి పాతకంబొనరించె । నేనెఱుంగను
ది సహింపు మధిప ॥ (ఉ) ఇట్టియఘంబొనర్చిన నయేతర నుద్ధత శీలఁ గైక ।
వేపట్టి వధించుటర్హ మిటు పాపవిచారిణిఁ జంపఁ బాతకం । బెట్టును గల్గదైన
ను నరేంద్రకులీనుఁడనై యకార్యమే । నిట్టొనరింతు నాయని సహించి వధింప
గనైతి నత్తఱిన్ ॥ (ఉ) కాదని తెంపుచేసి యలకైకను జంపితి నేని దేవనీ ।
వేనయమాలి యాజికతి వృద్ధునకు న్ఘనరాజధర్మ సం । వేదికిఁ బుట్టిపుణ్యుఁ
డన విశ్రుతిగాంచి కుమారతల్లినే । లాదునుమాడి తెంత కలుషాత్ముఁడవైతి వఁ
టంచు దూఱవే॥ (తే,గీ) అధిపశుద్ధాభిజనకముఁ డైనదశర । థునకుఁ బుత్త్రుఁ
డవై పుట్టి గురితమనక । కడునధర్మిష్ఠమైన యాకర్మమెట్లు । సేయువాఁడ సా
ధులకిది సెల్లదయ్య ॥ (మ) గురుడు న్వృద్ధుఁడు తండ్రి దైవతము రాఁగుండుం గ్రి
యావంతుఁడు । న్ధరణీభర్తయుఁ బుణ్యమూర్తి యగుటం దాత న్విగర్హింప
నా । కరయం జెల్లదుగాని యెవ్వఁడు ప్రియాహార్థియై యిట్టిని । ష్ఠురకర్మం
బొనరించుఁ బుణ్యులగు రాజుల్మెత్తురే యుప్పనిన్ ॥ (తే,గీ) రాజవర్య వినాశకా
లంబునందు । భూతకోటికి విపరీతబుద్ధి యనెడు । విశ్రుతంబైన మాట పృథ్వీతలేం
ద్రు । చేతఁ బ్రత్యక్షముగ నేఁడు చేయఁబడియె॥ (వ) మహాత్మా క్రోధ మోహసా
హసంబువలన దశరథుని చేత నాచరింపఁబడిన ధర్మాతిక్రమణంబును సమీ
చీనార్థంబను సంధించి నీవు క్రమ్మఱింపుము తండ్రివలనం బొడమిన ధర్మాతి
క్రమణంబే పుత్త్రుండు క్రమ్మఱించు నతండపత్యంబనఁ బ్రసిద్ధి వహించు నట్లుగా
వింపఁడేని విపరీతుండగు నీవట్టి యపత్యంబుగమ్ము ధీరవిగర్హితంబైన జనకు
ని దుష్కృతకర్మంబు నవలంబింపందగదు కైకేయి రాజ్యలోభంబున ధర్మవిరో
ధంబుగా మహీనాథుని నిర్బంధించి మదర్థంబుగా రాజ్యంబుఁ గైకొని దురంతం
బైన పాపం బాచరించె నద్దశరథుండును మోహంబునఁ గైకేయీ వాక్యం బెం
తని నిగ్రహింపం జాలక సాహసంబున సుగుణసంపన్నుండవైన నిన్ను వనంబు
నకుం బనిచి పాపకారి యయ్యె నిట్లు తల్లిదండ్రులు దురితాత్ములై నిరయగతికిం
బోవుచుండ మహానుభావుండైన నీయట్టి సత్పుత్త్రుండు పేక్షించుట యుక్తంబు



కాదు లోభమోహంబులమైమఱచి పలికిన జననీజనకుల శాసనంబు నిగ్ర
హించి రాజధర్మంబెఱిఁగి పితృపైతామహంబైన రాజ్యంబుఁ గైకొని తల్లి
దండ్రులను నన్నును సుహృజ్జనంబులను బాంధవులను బౌరజానపదులను ధ
ర్మంబున నుద్ధరింపుమని పలికి శోకావేశంబున వెండియు నిట్లనియె ॥ (ఆ,వె)
గహనవాసమేడ క్షత్త్రధర్మంబేడ । జడలు దాల్పనేడ జగతిఁ బ్రోచు । టేడ
రఘువరేణ్య యిట్టి విరుద్ధధ । ర్మంబు నాచరింపరాదు నీకు ॥ (ఉ) ఉక్కున
రాజ్యమేలుటకు నోపినతేనికిఁ బట్టబంధనం । బొక్కటరాజధర్మ మగుచుండఁ
గ నీకిటు చేయఁ జెల్లునే । యెక్కడ క్షత్త్రధర్మ మది యెక్కడ భూపరిపాలనంబు
నేఁ । డెక్కడఁ గాననంబు మఱి యెక్కడఁ దాపస వేషమార్యమా ॥ (సీ) మను
జేంద్రపరిదృశ్యమానమైనట్టి యాత్యాగ భోగాభియుక్త ప్రజాది । పాలన ధ
ర్మంబు పరఁగ నవ్వలఁ బ్రోచి సంశయస్థంబు లక్షణవిహీన । మాయతి ఫలము ధ
రాధీశ చేని దియాదిభాగంబున నాచరింప । నెంతయు హితమని యే ప్రమాణం
బునఁ దగ ననిశ్చితమైన ధర్మమెవ్వఁ ॥ (ఆ,వె) డవని క్షత్త్రబంధుఁ డాచరింపఁద
లంచు । నకట విధినిషిద్ధమైన వృత్తి । మూఁడు నేల ధర్మమొప్పారనాల్గువ ।
ర్ణములవారిఁ బ్రోవుమమలచరిత ॥ (తే.గీ మనుకులోత్తమ చతురాశ్రమము
లలోన । నవని గార్హస్థ్యముత్తమంబని రిధర్మ । విదులకారణముగ దాని వృ
థ యొనర్ప । నేల పూని తివిధర్మ మెవ్వఁడనియె ॥ (ఉ) బాలుఁడ జ్ఞానహీనుఁడన
పండితుఁడం గడు దుర్బలుండ భూ । పాలకిరీటరత్నరుచి భాసితపాదయుగుండవై
నన్ । వేలఁగ నర్హమైన ధరనేలఁగ నే నెటులోపువాఁడనీ । శీలము నచ్చి భద్ర
ములఁ జెందెద రిందఱు రమ్ము వీటికిన్ ॥ (సీ) మంత్రకోవిదులైన మంత్రులు బుత్విజు
ఘ్నులు వసిష్ఠాది మునులు ప్రకృతి । మండలంబాప్త సామంతులును గూడి కోర్కి
తో నీ చిత్రకూటమందె । సంప్రీతితో నిన్ను సామ్రాజ్యపట్టాభి షిక్తుని జేసెద రుక్త
భంగి । వీటికిఁ జనుదెంచి వేడ్కతో బాంధవులలరనిష్కంటకంబైన పూజ్య ॥
(తే,గీ) రాజ్యము సుధర్మపద్ధతి రమణతోడ । నేలుచు విశేషయుక్తిచే నెల్లవా
రిఁ । దవిలి వర్ణాశ్రమస్థితు ల్తప్పకుండ । నరసి పాలింపుమయ్య మహాత్మ నీవు॥
(వ) దేవా యేను సద్గుణబుద్ధిరహితుండ బాలుండ స్థానహీనుండ నీమఱుం
గున దాసభూతుండనై జీవింపనర్హుండ నిన్నుం బాసి యొక్క ముహూర్తం

బైన జీవింపనర్హుండుకాని వాఁడ నట్టి యేను భవద్విహీనుండనై రాజ్యంబెత్తెఱంగునం బాలింపనేర్తు నీవయోధ్యాపట్టణ సింహాసనాధ్యక్షుండవై విబుధులచేత వాసవుండుంబోలెఁ బ్రకృతులచేత నుపాస్యమానుండవై భుజాబలంబున లోకంబుల జయించి ఋణత్రయంబువలన విముక్తుండవై వైరులనందఱ నిర్జించి భృత్యజనంబుల సర్వకామంబుల చేత సంతుష్టులం జేయుచు సాధుల కెల్ల సంతోషంబుఁ గావింపుచుఁ గోసలరాజ్యంబుఁ బరిపాలింపుమని పలికి వెండియు నిట్లనియె ॥ (ఉ) అందముగా శిరంబు భవదంఘ్రులఁ సోఁకఁగ మ్రొక్కి వేఁడెదం । బొందుగ వేల్పులందఱుఁ బోలె సుహృజ్జనకోటి యందునా । యందు సుప్రీతి సేర్చి నయమార మదంబుని వేక హైన్యముం । డెందమునన్సహించి కుగతిం బడకుండఁగ దండ్రిఁ గావుమీ ॥ (క) నామాటఁ గైకొనక వన । సీమకుఁ జని తేని రాజశేఖరయేను । న్నీమహాడింకదాపసుఁడనై । సౌమిత్రియుఁ బోలె వెంటఁ జనుదెంతు రఘూ ॥ (చ) అనియిటు కైకపుత్రుఁ డపుడంజలిఁ జేసి యనేకభంగుల । న్వినయమెలర్పఁ దన్నుఁ దగ వేఁడిన రాముఁడు తండ్రిమాటనే । మ్మనమునఁ గట్టిచేసి దయమాలి పురంబుసారంగ రాదనా । కనఘచతుర్దశాబ్దముల నవ్వల వచ్చెదనంచుఁ బల్కినన్ ॥ (తే,గీ) అద్భుతంబైన యతని ధైర్యంబుఁ జూచి । దుఃఖితంబైన జనము సంతోష మొందె । వీటికిప్పుడె రానను మాటవిని ప్ర । హర్షితంబైన జనము శోకార్తి నొందె ॥ (చ) ఆ తెఱఁగంత చూచి సఖులమ్మలు మంత్రులు చుట్లనున్న వా । రాతత దుఃఖశోకమున నశ్రులునించుచుఁ గైకపట్టివి । ఖ్యాతచరిత్రుఁ జాలఁ గొనియాడుచు నాతనిఁ గూడినమ్రులై । భూతనయా మనోహరునిఁ బుణ్యచరిత్రుని వేఁడి యత్తఱిన్ ॥ (తే,గీ) అద్భుతంబైన యతని స్థైర్యంబుఁ జూచి । యక్కటా యింతకఠినాత్ముఁ డగునె రాముఁ । డనుచుఁ గ్రమ్మఱ దత్పదంబుకువ్రాలి । భరతుఁ డెంతయు శోకంబుఁ బ్రబ్బికొనఁగ ॥ (క) సమ్మతితోడ నయోధ్యకు । రమ్మనను గరుణఁ జూచి రాజ్యంబిడెగై । కొమ్మున్నృపాలనశీలివి । కమ్మని ప్రార్థింపుచుండెఁ గడుభక్తి మెయిన్ ॥ (క) క్రమ్మఱ నీక్రియఁ బలికెడు । తమ్ముని వీక్షించి సుగుణధాముఁడు రాముం । డమ్మెయి ననూనమృదువా । క్యమ్మున నిట్టనుచుఁ బలికె నందఱు వినఁగన్ ॥ (చ) అనఘచరిత్ర యోదశరథావనిభర్తకుఁ గైకయందున । త్తనయుఁడవై జనించి యిటు ధర్మవిరోధములాడఁ జెల్లునే । ఘని



వడి భ్రాతృవత్సలతఁ బల్కితి దీనఁ గొఱంత లేదు నీ । వినయవివేక శీలములు వేయి విధంబుల నేనెఱుంగనే॥(వ) వత్సా మనతండ్రియగు దశరథుండు తొల్లి భవజ్జననిం బెండ్లియాడునప్పుడే కైకేయికిం బుట్టిన కుమారునకు రాజ్యంబొసంగెదనని కేకయునితోఁ బ్రతిజ్ఞఁ గావించి వివాహంబయ్యెనాఁటం గోలె నద్దేవి రాజ్యశుల్కయనంబడియె నదియునుంగాక దేవాసుర సంగ్రామంబునందు దశరథుం డద్దేవిచేత నారాధితుండై సమర్థుండు కావున సంతోషవిశేషంబున వరద్వయం బొసంగె నయ్యమ ప్రతిజ్ఞఁ జేసి నీకు రాజ్యాభిషేకంబును నాకు వనవాసంబునుంగా వరంబులు రెండును యాచించె నమ్మహీరమణుండు సత్యవాది గావున ధర్మంబునకు హాని లేకుండ నన్ను వనంబునకుం బొమ్మనియె నిట్లు తండ్రిచేత నియుక్తుండనై పదునాల్గువత్సరంబులు దండకారణ్యంబున నివసింపం బూని సీతాలక్ష్మణసహితుండనై నిర్జనంబైన వనంబునకుం జనుదెంచితి మదీయాభిమతం బనివార్యంబు నీవును బితృనిదేశవ్యవస్థితుండవై రాజ్యంబుఁ గైకొని భవజ్జననికి సంతోషంబొసంగి జనకుని సత్యవాదినిం జేసి కైకేయీ ఋణంబువలన విముక్తునింగావించి రక్షింపుము తొల్లి యశస్వియగు గయుండను రాజర్షిశ్రేష్ఠుండు గయాఖ్య ప్రదేశంబునందుఁ బితరుల నుద్దేశించి కొన్ని గీతలుపన్యసించె నత్తెఱంగెఱింగించెద వినుము ॥ (తే,గీ) తలఁపఁ బున్నామనరకంబువలన జనకుఁ । బ్రోచుఁ గావునఁ దనయుండు, పుత్రుఁడయ్యె । గరిమఁ దండ్రిని నాకలోకస్థుఁ జేసి । మనిచినందున సుతుఁడయ్యె, ఘనగుణాఢ్య ॥ (తే,గీ) మఱియు శిష్టులు యోగ్యులు, మాన్యచరితు । లనఘులు బహుశ్రుతులు పుత్రు, లార్జవయుతు । లెందఱున్నను గయకెవ్వఁ, డేగువాని । పగిదిఁ దండ్రికిఁ బరసుఖప్రదులు కారు ॥ (చ) అని యిటు ధర్మయుక్తి గయుఁ డాడిన నాతని మాటఁ బట్టి ము । న్ననఘవిచారులైన నృపులందఱు నవ్విధమాచరించి రీ । వనుపమ ధర్మశీలుఁడ వనర్ఘగుణుండవు పుణ్యుఁడైన మ । జ్జనకునిఁ బ్రోవుమాయనక, సత్యజదోషము గల్గకుండఁగన్ ॥ (వ) వత్సా నీవు శత్రుఘ్నసహితంబుగా నయోధ్యకుం జని ద్విజాతి సహితుండవై ప్రజలఁ బాలింపుచు శ్వేతాతపత్రచ్ఛాయలం జరింపుచు సౌధప్రాసాద హర్మ్య విమానాగ్రభాగంబుల వసియించి శత్రుఘ్నుండు హితం బాచరింపుచుండ సుఖంబుండుమేను సీతాలక్ష్మణసహితంబుగా దండకారణ్యంబుఁ బ్రవేశించి మునివేషంబున మునిసహితుండ

నై మృగంబులం బాలింపుచు సాంద్రశీతలతరుచ్ఛాయలం జరింపుచుఁ బర్ణశాలలయం దధివసించి లక్ష్మణుండు హితంబాచరింపుచుండ సుఖంబుండెదఁ బుత్త్రిలమైన మనము నల్వురము నరేంద్రుని సత్యస్థునిం జేసి విషాదంబు దక్కి వర్తింపుద మనిపలికిన నప్పుడు రామభరతుల సంవాదంబు విని జాబాలియ (*) జాబాలియను బ్రాహ్మణుఁడు రామున కధర్మ ముపదేశించుట, (*)ను బ్రాహ్మణోత్తముండు ధర్మజ్ఞుండైన రామభద్రునింజూచి వైదికధర్మేతరహితంబైన వాక్యంబున నిట్లనియె ॥ (ఉ) భూవర జ్ఞానహీనునకుఁ బోలెని రర్థకబుద్ధి నేఁడు నీ। కేవిధిఁగల్గె సాధుజనులీగతిఁ జూచినయుక్తమందురే। నీవు సమస్తముం దెలియ, నేర్తువు నీకొకఁ డర్థధర్మము। ల్వావిరిఁ జెప్పఁగావలెనె,వాసవసన్నిభ పొమ్ముపీటికిన్॥ (ఉ) ఎక్కడి తండ్రి యెవ్వనికి, నెవ్వఁడు బంధువుఁడేటిధర్మ మిం। దొక్కఁడు పుట్టుచుండ మఱి,యొక్కఁడు చచ్చుచునుండుఁ గావునం। దక్కకతల్లిదండ్రి యని,ధర్మముఁబల్కెడువాఁడు బాలిశుం। డెక్కడిమాట నిక్కముగ, నెవ్వని కెవ్వఁడు లేఁడు చూడఁగన్ ॥ (మ) అరయంగానొకపీటి కేగి పురుషుం, డారేయి వర్తించి తా। మఱునాఁడొండొక పీటికేగిన క్రియ,న్మర్త్యాలికిన్సంతతం। బరుదారం దలిదండ్రిలిల్లును, ధనం,బావాసమాత్రంబు భూ। వరసుజ్ఞానులు దీనిఁగైకొనరుస,ర్వమ్మిథ్య యంచునృపా ॥ (వ) మహాత్మా పిత్ర్యంబగు రాజ్యంబుఁ బరిత్యజించి కుత్సితమార్గంబును దుఃఖప్రదంబును విషమంబును బహుకంటకంబునగు కాపథంబు నంగీకరించుటకర్తవ్యంబు గాదు పుణ్యసమృద్ధయగు నయోధ్యయందు సామ్రాజ్యదీక్షితుండవై కోసల రాజ్యంబు పరిపాలింపుచు మహార్హంబులైన రాజభోగంబు లనుభవింపుచు శక్రుండు త్రివిష్టపంబునందుంబోలె హర్మ్యవిమాన ప్రాసాదాగ్రమహోద్యానంబులందు సుఖలీల విహరింపుచుండు మనిపలికి వెండియునిట్లనియె ॥ (తే,గీ) దేవ దశరథజనపతి, కీవు లేవు। నిర్మలాత్మకుఁడా జనపతి,నీకు లేఁడు। ఒక్కరాజతఁడీవు వే,ఱొక్క రాజ। వాతనికి నీకు సంబంధ,మరయ లేదు ॥ (తే,గీ) జనకుఁడన బీజమాత్రంబు,జంతువులకుఁ। బరగఁ శుక్లశోణితములు, కరుడుగట్టి। తల్లి యుదరంబునందు,వర్ధిల్లిపిదప। నిర్మలాత్మకరూపమై, నిర్గమించు ॥ (క) జనకుం డెచ్చటనున్నాఁ। డనఘా నీవెచట నుంటి,వతనికి నీకుం। దనుసంబంధం బెయ్యది। జనకుఁడనుచు వానితోడఁ, జనిరే తనయుల్ ॥ (తే. గీ) అనఘ చరిత యేభూతంబు,లందుఁ గలియ। నర్హమగు నట్టిభూతంబు,లందుఁ గలిసె। దశరథునకు నీమర్త్యసం, తతుల కెల్ల। వసుధలోపల నిది స్వభా,వంబు చుమ్ము ॥ (క) జనకుండనఁ దనయుండనఁ। వినుమంతయు భ్రాంతిగాక,విశ్రుతమగునే। తనవారలనుచు వగవరు। చనినపరులఁగూర్చి తత్త్వ,సంగతులుర్విన్ ॥(వ) మహాత్మా ప్రత్యక్షంబైన సౌఖ్యంబువిడిచి కేవలార్థధర్మసంపాదనపరులెవ్వరు గలరట్టి వారలంగూర్చి వగచెద వారీజగంబునఁ గలకాలంబు దుఃఖం బనుభవించి తుది వినాశంబు నొందుదురు కేవలప్రత్యక్ష సుఖానుభవ పరాయణులగు వారినవలోకించి సంతసించెద నదియునుంగాక ॥ (తే.గీ) జనకులకునందనులు పెట్టు శ్రాద్ధమదియు। వ్యర్థమగుఁగాక కుడిచిరె,వారువచ్చి। తనకుఁ దానె స్వతంత్రుండు, తత్త్వవిదుఁడు। చెలఁగి మిథ్యాభివాదంబుఁ జేసదేల ॥ (వ) మహాత్మా యొకనిచేత భుక్తంబైన యన్నంబు వేఱొకని దేహంబుఁ బ్రవేశించెనేని మార్గంబునంజను వానినుద్దేశించి యన్నం బొసంగ వచ్చుఁ దద్భుక్తాన్నంబు పథికునకుఁ బాథేయంబగు నిట్లు గానంబడలేదు గావున మృతుఁడైన జనకునుద్దేశించిచేసిన శ్రాద్ధం బతనికిఁ జరితార్థంబు గానేరదు జనం బష్టకశ్రాద్ధంబనియుఁ బ్రతిసాంవత్సరికం బనియు నెయ్యది పితరులనుద్దేశించి చేయునది యంతయునన్నంబున కుపద్రవం బంతియె కాని ప్రయోజనంబేమియు లేదు ద్రవ్యగ్రహణ కుశలబుద్ధులగు వారిచేత దేవతారాధనంబు గావింపుము యాగదీక్షితుఁడవుగమ్ము తపంబుఁగావింపు మర్థాదికంబుఁ బరిత్యజింపుమని దానవశీకరణోపాయంబులయిన గ్రంథంబులు విరచితంబులయ్యెనవి వర్జనీయంబులు తత్త్వదృష్టి విలోకించిన భవంబనాదిసిద్ధంబు తనంతందాన పొడమి తనంతందాన నశించుదానియుత్పత్తిలయంబులకుఁ బ్రభుండొకఁడు లేఁడు బ్రహ్మవిష్ణు రుద్రాదుల బ్రతుకులు మనబ్రతుకులట్ల వారిదేహంబులు మనదేహంబులుం బోలెఁ గాలవశగతం బెందుచుండు దేహికి సుఖదుఃఖశరీరత్యాగంబులె స్వర్గ నరక మోక్షంబులై యుండుఁ బరమధర్మనిరూపణంబులగు నానాశాస్త్రసిద్ధాంతంబు లాలోకించి నిశ్చయార్థం బెఱుంగక జనంబులు వలసిన చందంబున వాదింపుచుండుదురివి యన్నియు ననుమానోపమానార్థ ప్రతిపత్తిజ్ఞానంబులై యుండు వ్యవసాయాత్మకంబైన జ్ఞానంబుప్ర

త్యక్షంబు ప్రత్యక్షజ్ఞానంబెల్లనారికిఁ జెల్లంబై యుండుఁగావున నీవు పరంబు లే దని నిశ్చయించి ప్రత్యక్ష సిద్ధంబైన రాజ్య భోగాదికంబు ప్రతిగ్రహించి పరో క్షంబుఁబిఱిందికిం ద్రోచి స్వజనసమ్మతంబైన మద్బుద్ధిఁ బురస్కరించుకొని భ

(*) రాముఁడు జాబాలి మాటల నిరసించుట. (*)

రతునిచేతఁ బ్రసాదితుండవై రాజ్యంబుఁ బ్రతిగ్రహించి సుఖంబు లనుభవింపు మనిపలికినవిని సత్యప్రవణ స్వభావులలో శ్రేష్ఠుండైన రాముండు ధర్మాచలి తబుద్ధియై యుక్తియుక్తంబగు వాక్యంబున జాబాలికిట్లనియె॥ (తే,గీ) అనఘమ త్ప్రియకామార్థ,మరయనెద్ది । పరమయుక్తియుక్తంబుగాఁ బలికితి వది। కా ర్యసంకాశమైన య,కార్యమయ్యెఁ । బథ్యసమ్మత మైన య, పథ్య మయ్యె॥ (తే,గీ) అనఘచరితనిమర్యాదుఁ, డైనపురుషుఁ । డవనినెవ్వాఁడు గలఁడు వాఁ,డనుదినంబు । వృజినయుక్తుండు భిన్నచా,రిత్రదర్శ । నుండగుచు నపచితి నొంద,కుండు సభల ॥ (క) ధీరునిఁ బండితమానిని । సూరినిఁ బాలిశునిఁ బరమ, శుద్ధుని మలిను । న్సారగ్రాహినిఁ గుత్సితుఁ । జారిత్రమె చెప్పచుండు.సంయ మివర్యా ॥ (సీ) శిష్టసమ్మతుఁడను, శీలవంతుఁడ లక్షణాఢ్యుఁడ నతిశుచి.నైన యేను। శిష్టగర్హితుఁడు దు.శ్శీలుఁడు లక్షణహీనుఁడు మలినాత్ముఁ.డైనవాని । వైఖరిశుభహేతు, వైదిక కర్మంబు విడిచిక్రియావిధి, విరహితంబు । భువనసం కరమగు, భవదీరితాధర్మ మనిశముధర్మత్వ, మునఁగడంగి ॥ (తే,గీ) మాన కంగీకరించితి, నేనిధాత్రి । శఠుని దుర్వృత్తు లోకదూ,షణుని నన్నుఁ । గాం చితత్త్వవిదుండు సు, కర్మరతుఁడు । యుక్తకార్యుఁడెవ్వాఁడు బహూకరిం చు ॥ (తే, గీ) అనఘ హీన ప్రతిజ్ఞుఁడనై, నట్టివృత్తి । నలమి తిరుగుచు భ వదీరి, తాచరణము । నెవ్వనికి నుప దేశింతు, నిట్టి సాధ । నమున నెబ్బంగిఁ బడయుదు, నాక సుఖము ॥ (తే, గీ) తాపసోత్తమ లోకమం, తయు నుగామ । వృత్తమై సంతతంబు వ, ర్తింపుచుండు । నృపతు లేవృత్తిఁ దాల్చి వర్తింతు రతని । జనము లావృత్తి వర్తింతు, రను దినంబు ॥ (తే,గీ) అనిశ మనృశంసమును సనా,తనమునైన । రాజవృత్తంబు సత్యమై, రహిఁ వహించు । నట్లుగాన సత్యాత్మకం, బయ్యెరాజ్య । మఖిలలోకంబు సత్యంబు,నందునిలుచు॥ (సీ) ఈశ్వరుండును సత్య,మేపారఁగాఁ బద్మ యెపుడుసత్యము నాశ్ర, యించియుండు । సత్యధర్మంబులు, స్వర్గమూలంబులు సత్యమూలంబులు,స



ర్వమునులు । వేదంబులును శాస్త్ర, వితతులు హులమును దపములు సత్యమై, తనరుచుండు । నమరులు ఋషులుస,త్యము సత్యమునకంటెఁ దలపోయఁ బర మపదంబు లేదు॥ (తే,గీ) సత్యవాదిలోకంబునఁ, జతురుఁడగుచు । నాస్తియను చువాదించెడు. నరులనెల్లఁ । గ్రూరసర్పంబులనుబోలె, నేఱి వైచి । ధన్యుఁడై తుది పరమప,దంబుఁగాంచు॥ (తే,గీ) ఒకఁడులోకంబుఁ బాలించు, నొకఁడు కులముఁ । బ్రోచునొకఁడుదుర్గతికిని, బోవునొకఁడు । స్వర్గముననుండునిం దఱు, వరుసతోడ । నేక భంగిఁ బ్రవర్తించి, రేమునీంద్ర॥ (చ) మునివర సత్య సంధుఁ డగు, భూపతి నన్నిటు కాన నోర్వికిం । జనుమని పల్కెనేను ను బ్ర,సన్న మతి న్నృభ యాల కింపఁగాఁ । జని యెద నంచు నీయ కొని, సమ్మతి వచ్చితి సత్య మూఁదియ । జ్జనకుని శాసనంబు కడు, సత్యమొనర్ప కరిత్త్రపుత్త్రునే॥ (ఆ,వె) వేయిపలుకులేల, వినుము తాపసవర్య । చెలఁగి తండ్రి పంపు,సేయువాఁడ । మోహలోభకామ, ములనైనఁ దగ సత్య । సేతువునకుహా ని,సేయనయ్య॥ (ఆ,వె) వినుమసత్యసంధు, ననభిజ్ఞునస్థిర । చిత్తుమలినుసాధు, వృత్తిశూన్యుఁ । జూచిపితరులఖిల, సురులునుహ్నింప । రనుచుఁ బలికిరార్య, లదియువినమె॥ (వ) మునీంద్రా యేను సత్యరూపంబైన యీధర్మంబు నాత్మ యందుఁ బ్రత్యక్షీకృతంబుగా నవలోకించెద సత్పురుషాచరితంబైన జటావ లయాదిభారంబు సత్యరూపధర్మార్థంబభినందింపుచుండు భవదుక్త ధర్మం బు క్షుద్రనృశంస లుబ్ధపాపకర్ములచేత సేవింపందగినయది గాని యస్మదా దుల కంగీకార్యంబుగాద ధర్మప్రచుర ధర్మలేశయుక్త క్షుద్రీయధర్మంబు ప రిత్యజించెద మనోవాక్కాయజంబైన త్రివిధపాతకకర్మంబు నవ్వలంద్రోచి పుచ్చి త్రివిధసుకృతకర్మంబు నంగీకరించి సత్యంబునం బ్రవర్తింప వలయు భూకీర్తియశోలక్ష్ములు సత్యవాదియగు పురుషునిం బ్రార్థింపుచు నతనిస్వ ర్గగతునిఁగాఁ దలంపుచుండు నీవు నిశ్చయించి యిది భద్రంబు దీనిం గావింపు మని యుక్తికరంబులైన వాక్యంబులచేత నన్ను నియోగించితివది యనార్యంబు దానినంగీకరింపందగదేను గురుసన్నిధియందుఁ బదునాల్గువత్సరంబులు వన వాసంబుసలిపెద నని ప్రతిజ్ఞఁజేసి వచ్చినప్పుడు మద్వాక్యంబువినికైకేయి సం హృష్టచిత్తయయ్యె నిప్పుడు గురువచనోల్లంఘనంబుఁ జేసి భరతునివచనం బె ట్లుగావించెద గురువాక్యప్రకారంబున వనవాసంబు సేయుచు నియత వన్యాహా

రుండనై శుచియై పుణ్యంబులైనమూల పుష్పంబులచేత దేవతలం బితృదేవతలం దృప్తినొందించుచు సంతుష్టేంద్రియవర్గుండనై శ్రద్ధధానుండనై కార్యాకార్యవిచక్షణుండనై యకృత్రిముండనై పితృవచనపరిపాలనరూపంబైన లోకవర్తనంబు ననుసరించి ప్రవర్తించెద ననిపలికి వెండియు నిట్లనియె ॥ (క) కర్మమునం గలుగుభవనముష । ష్మింహితకర్మభూమి, నొందినమనుజు । లక్కర్మములు సేయంగానగుం । గర్మంబునం గాని లేవు, జ్ఞానసుఖంబుల్ ॥ (చ) అనఘ ధనంజయానిల శశాంకులు కర్మముచేం బ్రదీప్తులై । తనరిరిగాదె శక్రుండు శతక్రతువుల్ దగం జేసి తా దివం । బునకధినాథుండయ్యె మునిపుంగవు లుగ్రతపంబుం జేసి బ్ర । హ్మనిరతులైరి కర్మమున, నందంగరానిది యేది చెప్పుమా ॥ (వ) అనిపలికి వెండియు నుగ్రతేజుండగు రాముండు తన్నాస్తికవాక్యరూప తర్కంబునిని యసూయమాణుండై యతనివాక్యంబు గర్హించుచు నిట్లనియె ॥ (క) సురవిప్రాతిథిసేవయుం । బరాక్రమము భూతదయయుం, బరహితశీలం । బరదారసత్యధర్మము । లరయంగ సురలోక మార్గ, మనిరిమునీంద్రుల్ ॥ (చ) పరహితబుద్ధి సత్యమును, బాడియుందప్పకయుండునట్టిసు । స్థిరతర ధర్మబోధనము, సేయుచు రాజులనుద్ధరింపనే । ర్పరివగు నీవె ప్రాకృతుని భంగి ననర్థకనాస్తివాదమి । ప్పరుసునం జేసెదింక నల, బాలిశులాడి రనంగం జోద్యమే ॥ (చ) అనిమిషలోకమార్గమని, యార్యులుపల్కుంబల్కినందునం । దనుమతివిప్రులట్లు పర, తత్వముం గన్గొని యేకచిత్తులై । మనుకొని ధర్మము న్సకల, మున్బ్రచరింపుచు జాగరూకులై । యనిశము నాకవాససుఖ, మందం గంగోరుచు నుందురెంతయున్ ॥ (ఆ, వె) తానెఱింగినంత, ధర్మంబుం దప్పక । నడువ వలయునొరుల, నడుపవలయు । నార్యజనులయొద్ద, నాడెడు మాటలే । చాలుం జాలు ధర్మ, సంగతంబు ॥ (తే, గీ) చూడంబడినయర్థంబును, జూపుకొఱకుం । గాదె సకల శాస్త్రంబులు, గలుగుటెల్ల । ధాత్రిం బ్రత్యక్షమగునట్టిధర్మమునకు । సంయమీశ్వర వేదశాస్త్రంబులేల ॥ (వ) మఱియుం బరోక్షధర్మంబు మిథ్యయని పరిహరించి ప్రత్యక్షధర్మం బంగీకరించిన శాస్త్రంబు లప్రమాణంబులగుం బ్రత్యక్షధర్మంబెల్ల వారికిం దెల్లంబై యుండుంగావున నదియె పరమార్థంబయ్యెనేని సర్వజనంబులకు సామాన్యంబు గలుగు దానం జేసి జ్ఞానాజ్ఞానంబులు లేక వర్ణాశ్రమాచారంబులు విడిచి జనంబు లిచ్ఛాప్రకా



రంబున వర్తింతురక్కారణంబున లోకంబంతయు సంకరంబై చెడు వైదికమార్గనిష్ఠారహితుండవు చార్వాకమతానుసారి బుద్ధిప్రవర్తకుండవు పీతధర్మమార్గుండవు నాస్తికుండవైన నీవాక్యంబంగీకరించి జనకుని వాక్యంబెత్తెఱంగున నతిక్రమింతుం జోరుండెట్లు నిరాకరణీయుండగునట్లు వేదబాహ్యత్వంబున నప్రసిద్ధుండైన బుద్ధుండును నిరాకరణీయుండై యుండు నీ లోకంబునం జార్వాకుని సుగతతుల్యునింగా నెఱుంగందగుం గావున నతండు బహిష్కరించుటకు యోగ్యుండు బుధుండగు వాండు నాస్తికవాదశీలునకాభిముఖ్యం బొసంగందగదు నీకంటెం బురాతనులగునట్టిజ్ఞానాధికులగు జనంబులు శుభకర్మంబు లనేకంబులు గావించి యిహపరలోకంబులు జయించి సంతతంబు నుగ్రహానక్షత్రాదిరూపంబులం బరిదృశ్యమానులై వర్తింపుచున్నవారు గావున నది ప్రమాణంబు గాంగొని విప్రులు మంగళాత్మకంబైన కర్మంబును యజ్ఞదానాదికంబును గావింపుచున్నవారు దానగుణప్రధానులైనవారును ధర్మరతులైనవారును నహింసకులైనవారును వీతమలులై తేజోమయులై మునులై సత్పురుషసమేతులై లోకపూజ్యులై ప్రకాశింపుచున్నవారని పలికినం గ్రుద్ధుండైన రామునిం జూచి యవ్విప్రుండు వ్రీళితుండై యనాస్తికంబును దథ్యంబును సత్యంబునగు వచనంబునం గోపోపశమనంబు సేయుచు నిట్లనియె ॥ (చ) కనలకు మేను నాస్తికుండం, గా నిటు నాస్తికవాక్యమేను ప । ల్కిన యది గాదు నాస్తియను, కేవలధర్మము లేదు నిక్కమో । దినకరతేజ యీ భరతు, దీనతం జూచి భవన్నివర్తనం । బునకిటు లంటిం దప్పనక, పుణ్యచరిత్ర సహింపుమిత్తఱిన్ ॥ (వ) మహాత్మా యేను నాస్తికమతంబవలంబించి నీచేతం దిరస్కృతుండనై వెండియుం దన్నాస్తికవాదంబుం బరిహరించి ప్రకృతిగతుండనైతి మదీరితంబైన యీ నాస్తికవాదంబు ధర్మసంకటకాలప్రయుక్తంబని యెఱుంగుము నాచేత నాస్తికవాదం బెట్లు సముదీరితంబయ్యె నట్టి ధర్మసంకటకాలం బిప్పుడు సమాగతంబయ్యె భవన్నివర్తనంబు కొఱకు భరతముఖోల్లాసనంబు కొఱకుం గాలానుసరణంబుగా నిట్టి వాదంబు వాదించితి నిది తప్పుగాం గొనకు మని యిట్లు సాంత్వవాక్యంబుల ననూనయింపుచున్న జాబాలిని వారించి క్రుద్ధుండై యున్న రామునిం జూచి మునిశ్రేష్ఠుండైన వసిష్ఠుం డిట్లనియె ॥ (చ) అనఘచరిత్ర యే పగిది, నైన సుఖార్హుండవైన నిన్ను మె । ల్లన వనసీమనుండి నగ,

రంబునకున్నఅలింపఁ గోరి యీ । యనువునఁబల్కెఁగాక విన,యజ్ఞుఁడు లో
క గతాగతజ్ఞుఁడు । న్గననుతుఁడైన యీతపసి, సత్యమెఱుంగని వాఁడె చెప్పు
మా ॥ (క) లోకేశపుత్ర వినుమీ । లోకసముత్పత్తివిధము, రూఢంబుగన ।
స్తోకమనీషాప్రౌఢిమఁ । జేకొని బోధింతునఖిల, శిష్టులువినఁగన్ ॥ (వ) విను
—(*) వసిష్ఠమహర్షి రామునికి రఘువంశక్రమం బెఱింగించుట. (*)—
మేకార్ణవమైన కాలమునఁ బృథ్వీభాగ మెచ్చోట వి । ష్ణునిచే నిర్మితమ
య్యెనచ్చట సురస్తోమంబుతోఁ గూడఁజ । య్యనఁ బద్మాసనుఁడుద్భవించెఁదరి
తో, నయ్యుర్వి మున్నీటిలో । మునుఁగం గేశవుఁడుద్ధరించెఁ గడిమి,న్భూదా
రవేషంబునన్ ॥ (తే,గీ) అంత నాకాశసంభవుం,డవ్యయాత్ముఁ । డజితుఁ డ
క్షరుఁడనఘుఁడ, నామయుం డ । నఘుఁడాబ్రహ్మ పుత్రస' హాయుఁడగుచు ।
ఘనతనిర్మించె సకలలో,కంబులనఘ ॥ (తే,గీ) అట్టి పరమేష్ఠికిఁగుమారుఁ
డై మరీచి । పుట్టె నాతనికల కశ్య,పుఁడుజనించె । నమ్మహాత్మున కుదయించె
నంశుమంతుఁ । డతనికిజనించె వైవస్వ, తాఖ్యమనువు ॥ (క) అతనికిఁ బు
త్రుఁడుత్రిజగ । ద్ధితుఁడు బుజుఁడు కీర్తిమంతుఁ,డిక్ష్వాకుడునా । జితవైరి గలి
గె లక్ష్మీ । పతికి విరించనుఁడు పోలె, భవ్యగుణాఢ్యా ॥ (తే,గీ) మొదల నె
వ్వాని కమ్మను,ముఖ్యుఁడివ్వ । సుంధర నొసంగెనట్టి వి,శుద్ధచరితు । ననఘుని
క్ష్వాకునృపు నయో,ధ్యాపురమున । కాదిరాజునుగాఁ జూడు, మనఘచరిత ॥
(క) ఆయత తేజోనిధియగు । నాయిక్ష్వాకునకుఁ గుక్షి,యనువాఁడు సుతుం ।
డాయనకుఁ గుమారుఁడు భ । ద్రాయతశౌర్యుఁడు వికుక్షి,యనువాఁడనఘా ॥
(తే,గీ) ఆవికుక్షికినందనుం, డయ్యెబాణుఁ । డాతఁడనరణ్యుఁగనియె వి,ఖ్యాత
కీర్తి । నతఁడనావృషిచోరరో,గాద్యుపద్ర । వంబు లేమియు లేకుండ, వసుధ
యేలె ॥ (క) అయనరణ్యునకు సుతుం । డైయనఘుఁడు పృథుఁడుపుట్టె,న
తఁడు త్రిశంకు । న్ధీయుతునిఁ గనియెనాతఁడు । కాయముతోఁగూడ నాక,గతి
కిం జనియెన్ ॥ (క) అట్టిత్రిశంకు జనపతికిఁ । బుట్టెఘనుఁడు దుందుమార,
భూపుఁడతనికిం । బుట్టెయువనాశ్వుఁడతనికిఁ । బుట్టెన్మాంధాతృనృపతి,పూర్ణే
దుఁడనన్ ॥ (శా) ఆరాజేంద్రునకుం గుమారుఁడు సుసం,ధ్యాఖ్యుండుజన్మిం
చె నా । ధీరుండంతఁ బ్రసేనజిత్తు ధ్రువసం,ధిం గాంచె నాపుణ్యుఁడా । శూరో
త్తంసు మహానుభావు భరతు,న్మద్ధాత్మునిం గాంచె న । వ్వీరశ్రేష్ఠునకు న్గనించె



వసితో,ర్వీభర్త రమ్యాకృతిన్ ॥ (సీ) ఆయసితుండు రా,జ్యం బేలుచుండ
హైహయతాలజంఘాదు, లధికశక్తిఁ । బయినెత్తి వచ్చిన, భండనంబున కోడి
పాఱి పర్వతగుహా,పజ్జడాఁగె । నతనికిగర్భిణు, లగు పత్ను లిరువురు గలరందొ
కర్తియొ, కర్తెమాలు । చెఱుపంగఁదలకొని, గరముఁబెట్టిన నదిప్రాలేయగిరి
కేగి,పరగచ్యవనుఁ ॥ (తే,గీ) గాంచి మ్రొక్కిన నమ్ముని,గరళవహ్ని । నతి
దయామృతధారఁ జల్లార్చి దేవి । లోకవిశ్రుతుఁడైన పుత్రుండు నీకుఁ । గలు
గు నిదినిక్కమని యను,గ్రహముఁజేసె ॥ (గీ) అంతనక్కాంత సమ్మదస్వాం
త యగుచు । మునికిఁబ్రణమిల్లి తనగృహం,బునకువచ్చి । యొక్క సుముహూ
ర్తమునఁ బుత్రు,నుగ్రతేజు । సరసిజదళాక్షుఁ బరమేష్ఠి,సమునిఁ గనియె
(తే,గీ) గరముతోఁగూడఁ బుట్టిన,కారణమున । సగరుఁడను పేరనొప్పియా,
చక్రవర్తి । పెక్కుహయమేధములఁ జేసి, పెంపువడసి । ప్రజల నందఱఁబు
త్త్రుల,పగిదిఁబ్రోచె ॥ (వ) మఱియు నమ్మహీరమణుండు యాగదీక్షితుండై ప
ర్వకాలంబునందు సలిలవేగంబున నీప్రజలనందఱ భయంబునొందించునట్టిస
ముద్రంబుం దన పుత్రులచేత నద్భుతంబుగాఁ ద్రవ్వించె ॥ (క) అతనికి న
సమంజుండను । సుతుఁడొక్కఁడు పుట్టిప్రజల, సుడివెట్టుచు దు । ర్మతియై
కడపటజనహిత । రతుఁడగు తనతండ్రిచే ని,రస్తుండయ్యెన్ ॥ (క) ఆయస
మంజునకుఁ గుమా । రాయత బలశాలిపుట్టె,నంశుమదాఖ్యుం । డాయనఘు
నకు దిలీపుం । డాయనకు భగీరథాఖ్యుఁ,డాత్మజుఁడయ్యెన్ ॥ (తే,గీ) ఆభ
గీరథునకుఁబుట్టె, నల కకుత్స్థుఁ । డతనికుదయించెరఘువుత,దన్వయమునఁ ।
గోమరుఁగాంచిన వారు కా,కుత్స్థులనఁగ । రాఘవులనంగ వెలసిరి, రామచం
ద్ర ॥ (క) ఆరఘుపుత్రుఁడు సత్యవి । చారుండు ప్రవృద్ధుఁడతఁడె, సౌదాసుఁ
డన । న్ధీరుఁడు పురుషాదకుఁడన । నారయఁ గల్మాషపాదుఁ,డనఁదగెనుర్విన్ ॥
(వ) ఆకల్మాషపాదునకు శంఖణుండుపుట్టె నతండు వసిష్ఠశాపంబువలన రా
క్షసత్వంబు నొందిన కల్మాషపాదునిచేత సైన్యసమేతంబుగా భక్షితుండయ్యె
నాశంఖణుని పుత్రుండైన సుదర్శనునకు నగ్నివర్ణుండు పుట్టె నతనికిని శీ
ఘ్రగుండుపుట్టె నతనికి మరువుపుట్టె మరునకుఁ బ్రశుశ్రుకుండుపుట్టె నతని
కంబరీషుండుపుట్టె నతనికినహుషుండుపుట్టె నహుషునకు నాభాగుండుపుట్టె
నాభాగునకజుండును సువ్రతుండు ననునిద్దఱు కొడుకులు గలిగిరయ్యజునకు ద

శరథుండు జన్మించె నా దశరథునకు నీవు జ్యేష్ఠపుత్రుండ వై జన్మించితివి పరమపవిత్రం బైన యిక్ష్వాకువంశంబునం బుట్టిన రాజులలోనం బూర్వజునకు రాజ్యాభిషేకంబును గనిష్ఠునకు తనిసేవయు నుచితం బై యుండు నట్టి సనాతనం బైన వంశక్రమాగత ధర్మంబు నిరాకరింపక స్వకీయం బైన రాజ్యం బంగీకరించి ప్రభూతరత్న యగు నిమ్మహి నెల్లం దండ్రియుం బోలెం బరిపాలింపుమని యివ్విధంబునం బలికి రాజపురోహితుండగు వసిష్ఠుండు వెండియు ధర్మయుక్తం బగు

—(*) వసిష్ఠమహర్షి రామునితో రాజ్యంబంగీకరింపుమని చెప్పుట. (*)—

వాక్యంబున నిట్లనియె ॥ (క) నరనాథశిరోమణి విధి । సరణిం జనకుండనంగ, జనయిత్రి యనం । గర మాచార్యుం డనంగాం । బురుషున కీలోకమందు, మువ్వురు గురువుల్ ॥ (క) కనిపెంచుం దల్లి జన్మం । బునకుం గారణము తండ్రి, బుద్ధిప్రదుండౌ । ఘనుండాచార్యుండు గావున । ననఘా యాచార్యుండెక్కుడౌ మువ్వురిలోన్ ॥ (తే,గీ) అట్టియేను గకుత్థ్సవంశాబ్ధి చంద్ర । వెలుంగి యిక్ష్వాకులకు శేముషీ ప్రదుండ । నైన యాచార్యకుండ నైతి, నట్లు గాన । నాదు వాక్యంబు మీఱంగ, రాదు నీకు ॥ (తే, గీ) ఈసభాసదులైన మహీదివిజులు । పౌరులును జానపదులును, బంధుజనము । లర్థి నూచింపుచున్నవా, రనఘచరిత । వీరికోరిక వృథసేయ, మేరగాదు ॥ (తే,గీ) ధర్మశీలయు వృద్ధయు, నిర్మలమతి । యును గులాచార సంసక్త యును జననియు । నైన కౌసల్య నెమ్మన, మలరం జేసి । పూర్వరాజుల సత్కీర్తిం, బొందు మనఘ ॥ (చ) అరయ గుణాకరుండు నిఖిలార్థవిదుండు మహానుభావుం డీ । భరతుండు భ్రాతృవత్సలుండు, భవ్యచరిత్రుండు రాజధర్మమా । ర్గరతుండు దాసభూతుండటు, గావున రాఘవ వీని యంజలిం । గరమనురక్తిం గైకొని యఖర్వదయామతిం బ్రోవుమిత్తఱిన్ ॥ (వ) అని యివ్విధంబున మధురంబుగాం బలికిన వసిష్ఠుని వాక్యంబు విని పురుషశ్రేష్ఠుండగు రాముం డిట్లనియె ॥ (సీ)

—(*) రాముండు వసిష్ఠుని సమ్మతింపం జేయుట. (*)—

తాపసోత్తమ తల్లిదండ్రులు తపములు । వ్రతములు దేవతారాధనంబు । లుపవాసములు సల్పి, యపురూపముగం బుత్త్రింగాంచి పుట్టిన వెనుకం, గరముప్రీతి । నన్నవస్త్రాభరణాదిదానమున సంవర్ధనంబునం బ్రియవాదనమున । గారవంబునం బెంచి, కడుం బెద్దవానిం గాం జేసిరి వారల, సేత కేమి ॥ (తే,గీ) ప్రతికృతి



యొనర్పంగాం దీఱుం, బరమగురుండు । జనకుండగు దశరథుం డెద్ది, సంతతంబు । సలుపుమని పంచె దాని నౌ, దల ధరించి । సేయుదును గాక యుదిరిత్త, సేయ నయ్య ॥ (సీ) మునివంశశేఖర, మున్ను యావజ్జీవపర్యంతమును బ్రియ, భాషణమునం । బోషంగం బ్రత్యబ్దంబు, భూరిభోజనమునం బ్రీతితో గయయందుం, బిండదాన । మున మూంటిచేతం బుత్రునకుం బుత్రత్వంబు ప్రాప్తించు ననిపేరె, పలికి యిప్పు । డన్యధర్మంబిటు, లాన తీందగునె మహాత్ముండు దశరథుం, డధివిభుండు ॥ (తే,గీ) తాత గావున నానృపోత్తము నిమాట । యనృత మేరీతి నగును సత్యంబె కాక । తల్లిదండ్రులు పంచిన, దానిం జేయ । కొండువెఱంగాని యపకీర్తి, నొందంజాల ॥ (వ) అని యివ్విధంబునం బలికిన రాముని నిశ్చయం బెఱింగి యతని చిత్తంబు ప్రసాదాయత్తంబు గాకుండుటకు దుఃఖింపుచుం బరమోదారుండగు భరతుండు పరమదుర్మనస్కుండై సమీపవర్తియైన సూతుం జూచి కరుణోదారుండగు రాముండు ప్రసన్నుండగు నందాంక నిరాహారుండనై యవకుంఠితాననుండనై ధనహీనుండైన ద్విజుని చందంబున నిప్పర్ణశాలాగ్రభాగంబునం బ్రాయోపవేశంబుం జేసెద నీస్థండిలంబునందుం గుశాస్తరణంబు సంఘటింపుమని పలికిన నాసుమంత్రుండు నివ్వెఱపడియేమియుం దోంచక రాముని వదనంబు విలోకింపుచు నూరకున్న నతనిం జూచి భరతుండు తనకుం దానె ధరణిపయిం గుశోత్తరంబుం బఱచికొని దానియందధివసించిన నతనిం జూచి రాజర్షిసత్తముండగు రాముండు కరుణారసపూరితాంతఃకరణుండై యిట్లనియె ॥ (మ) అనఘా యీదురవస్థ పాఱునకుంగాక య్యారె మూర్ధాభిషి । క్తునకుం జెల్లునె లెమ్ము నాపలుకు సాధుప్రీతిం గైకొమ్మికన్ । జననీవర్గముతోడం గూడి మఱలన్, స్థానీయముం జేరి నా । యనవాక్యంబు తొలంగకుండ ఘనరాజ్యశ్రీలం బాలింపుమా ॥ (క) అనవిని భరతుండచ్చటి । జనములం బరికించి సత్య, సంధుండగు రా । ముని మాట చొప్పు వింటిరె । నను దూష్యునిం జేయం దలంచి, నాండు మనీషల్ ॥ (క) నావిని వారలు కైకే । యీవరనందనునిం జూచి, యిట్లనిరనఘా । దేవర వారికి దయరా । దేవిధి బోధించువార, మింకం గృపణతన్ ॥ (క) ఈరఘువీరుండు సత్యవి । చారుండు పితృవా । క్యమందు, సంస్థితుండై యొ । ప్పారెడుం గావున ధర్మవి । చారాం మఱలింపమాక, శక్యంబయ్యెన్ ॥ (క) అని పలుక నప్పుడు వారివ । చనములు విని మఱల

రామ, చంద్రుఁడుభరతుం । గనుఁగొనివింటివెవీరివ । చనములరెడి సత్యధ
ర్మ, సంహితమగుచున్ ॥ (క) తెమ్మాయీవ్రతమేటికిఁ। బొమ్మానామతిగ్రహిం
చి,పురమునకటుగై । కొమ్మా కోసలరాజ్యముఁ । గమ్మా ధన్యాత్మకుఁ డవక
ల్మషధిషణా ॥ (తే,గీ) మానితాచార యీపౌర, జానపదుల । వచనమును
మత్సమీరిత,వచనమువిని । శీఘ్రముగ లేచినన్ను ను,జీవనమును । సంస్పృశిం
పుము నీవిట్లు,సలుపవలదు ॥ (వ) అనిపలికి భుజంబులం గ్రుచ్చియెత్తిననా
భరతుండు ప్రాయోపవేశంబుఁజాలించి శీఘ్రంబునలేచి క్షత్రియానర్హప్ర
త్యుపవేశన ప్రాయశ్చిత్తార్థంబు జలంబులుపస్పృశించి యెల్లవారును విన
నిట్లనియె ॥ (సీ) ఈసభాసదులు మ, హీసుపర్వులు మంత్రులువినఁజెప్పెద
నేనుభువననాథ। రాజ్యమిమ్మనిదశ, రథునివేఁడఁగ లేదుజనయిత్రిదుర్మంత్ర, ము
నకునీయ । కొనుటలేదుజగద్ధి,తుని సత్యరతునినిన్న డవికిఁ బుచ్చుట,యదియె
ఱుంగ । జనకునివాక్యంబు, సమకూర్పఁగర్తవ్యమేనియారేండేండ్లు,కానన
మునఁ ॥ (తే,గీ) ద్వత్ప్రతినిధిత్వముననేనె,తగవసించు । వాఁడనీవుమత్ప్ర
తినిధి,త్వమునరాజ్య । మేలుమన్లైననీరెంట, నృపునిమాట । సార్థకత్వం
బునొందుమ,హానుభావ ॥ (వ) అనిపలికిన ధర్మాత్ముండగురాముండు త
థ్యంబైన తమ్మునివచనంబు విని విస్మితుండై పౌరజానపదులనందఱ విలోకిం
చియిట్లనియె ॥ (క) మని యుండి మాకు నెయ్యెది । మనుజేంద్రుఁడొసంగెదా
ని మాఱిచికొనఁగాఁ । జన దిపుడు నాకు భరతున । కనఘాత్మకులారసత్య,మది
యెట్లయ్యెన్ ॥ (వ) మఱియు వనవాసకరణశక్తిమంతుఁడనైన నాచేతవన
వాసవిషయంబునందు జుగుప్సితంబైన ప్రతినిధిత్వం బకార్యంబైయుండుఁగై
కేయియుక్తవాక్యంబె పలికె దశరథుండు యుక్తధర్మంబెయాచరించెదశర
థోద్దిష్టంబైనకార్యం బవశ్యం బేనును భరతుండును శిరంబునంబూనినడుపవల
యుభరతుని సత్కారశీలునిఁగా జితేంద్రియునిఁగా నెఱుంగుదు మహాత్ముండైన
జనకుండు సత్యసంధుండగుచుండ భరతునివిషయంబునందు సర్వంబునుం గ
ల్యాణంబగు నేను బదునాల్గువత్సరంబులు వనవాసంబు సలిపి క్రమ్మఱనయోధ్య
కుం జనుదెంచి ధర్మశీలుండైన యీభరతునితోఁగూడ సామ్రాజ్యదీక్షితుండన
య్యెద నని పలికి వెండియు భరతునకిట్లనియె ॥ (తే,గీ) అచల సమధీర జనకుని
వచనమేను । సార్థకంబుగఁ జేసితి, సత్యమూఁది । నీవు నావచనంబున్న, నృపవ



రేణ్య । సత్యమున నుద్ధరింపుమీ,జాలి విడచి॥ (వ) అని పలికెనప్పుడప్రతిమతే
జులైన రామభరతుల పరస్పరాతిశయితసౌహార్దకృతంబైనసంగమంబుఁజూ
చి విస్మితులై యచ్చటిసిద్ధులును బ్రహ్మర్షిదేవర్షులు గుంపులు గట్టి యెవ్వా
ని కిట్టిధర్మజ్ఞులును ధర్మమార్గప్రవర్తకులు నగు వీరిరువురు పుత్రులై పు
ట్టె దశరథుండుధన్యుండయ్యెనని మహాత్ములగువారిం బ్రశంసించిరందు రావణ
వధార్థులగు కొందరుమహర్షులు రఘుశార్దూలుండగుభరతునకిట్లనిరి ॥
(క) ప్రవిమలచిత్తకులీనుం । డవుసువ్రతుఁడవు మహాత్ముఁ,డవుభూరియశుం ।
డవురామునివాక్యముజన । కవాక్యమునుబోలెనీవుగైకొనవలయున్॥ (వ) మ
హాత్మా యీరఘూత్తమునిఁ బితౄణవిముక్తునింగాఁ దలంచెదము కైకేయిఋ
ణంబువలన విముక్తుండయి దశరథుండు నాకంబునకుఁ జనియెనని పలికి యమ్మ
హర్షులు రాజర్షులును శుభదర్శనుండగు రామునిచేతఁ బూజితులయి
యామంత్రణంబువడసి గంధర్వసహితంబుగాఁ దమతమనివాసంబులకుం జని
రంత భ్రాతృవత్సలుండైన భరతుండు త్రస్తగాత్రుండై కేలుదోయిఫాలంబు
నంగీలించి వెండియు గద్గదికోక్తినిట్లనియె ॥ (క) అనఘాత్మ రాజధర్మం ।
బునుగులధర్మక్రమంబుఁ, బొలుపుగమతిఁగై । కొనిమద్వాంఛితముభవ । జ్జన
నీవాంఛితముఁ గరుణ, సమకూర్పనగున్ ॥ (క) పనివడి యేనొక్కరుఁడను।
ఘనమతిరాజ్యంబునేలఁ,గాలేననిశం । బనురక్తులైన జనముల । ననఘారంజింపఁ
జాల, ననుపమశక్తిన్ ॥ (క) మునుకొని హాలికులు పర్జ । న్యునిఁబోలెను
హృజ్జనములు, యోధులు మంత్రు । ల్ఘనబుద్ధి నిన్నె కులపా । వనమదిఁగాం
క్షింపుచున్న, వారనిశంబున్ ॥ (క) అలఘుతర ధర్మకౌశల । బలమున
ఘనబుద్ధియోగ, బలమునఁ గడుదో । ర్బలమున లోకజనంబుల । నలరింప
సమర్థకుండ,వైతిమహాత్మా ॥ (వ) అని యిట్లు భరతుండు పరమార్తుం
డై రాముని చరణంబులపైఁబడి ప్రాంజలియై బహుప్రకారంబులం బ్రార్థిం
చిన నారఘుపుంగవుండతని సద్భావంబుఁ జూచి కరుణాతరంగితాపాంగుండై
యతని నిజోత్సంగంబున నిడికొని యెల్లవారును విన మత్తహంసస్వరంబున
నిట్లనియె ॥ (ఉ) ఎంత నయంబు తెల్పిన మ,హీవర నందన సారెసారెకి ।
ట్లింతకృశించె దేటికి న,హీనమహీపరిపాలనంబు నం । దెంతయునుత్సహింపు
ము మ,హీసురభక్తియు దేవపూజయు । నాస్వాంతమునందు నేమఱక, సల్పు

ము భూజన రంజనుండవై ॥ (ఆ,వె) బుద్ధిమంతులైన, భూసురాచార్యుల । సుప్రసిద్ధభృత్య,సుహృదమాత్య । మంత్రివరులఁగూడి, మంత్రంబుఁగావించి।కార్యతంత్రములకుఁ,గడఁగుమనఘ ॥ (తే.గీ) పార్థివాత్మజ నీవు స్వ. భావముననె । గుణగరిష్ఠుఁడ వదిగాక, గురువినీత । బుద్ధినినుఁబొందెఁ గావునఁ, బుడమిఁ బ్రోవఁ । గడుసమర్థుఁడ వైతివి, కడఁక యేల ॥ (క) కమలారికాంతి వీడిన । హిమవంతుం డాత్మనిష్ఠ,హిమమువిడిచిన । న్గమలనిధి వేలదాఁటినఁ । గ్రమమునఁ బిత్రుశాసనంబు, గడతునె యనఘా ॥ (క) అనఘవిచారక కామం । బునఁ గైనను రాజ్యలోభ,మున నైనభవ । జ్జనయిత్రి నీకుఁగానిది।కనికని కావించె నింకఁ, గడవఁగ నగునే ॥ (వ) అని బహు ప్రకారంబుల ననూనయింపుచున్న విని భరతుండెట్టకేలకు నీయకొనిపదంపడి తచ్చరణంబులు శిరంబునఁ సోఁకం బ్రణమిల్లి యాదిత్యసమతేజుండును బ్రతిపచ్చంద్రదర్శనుండు నగు రామునకి

(*) రాముఁడు తనపాదుకలను భరతున కొసంగుట. (*)

ట్లనియె ॥ (సీ) తరణివంశోత్తమ, ధర్మసంహితమైన భవదీయచిత్తమె, బ్భంగినైన । మఱలింపలేనైతి, వెరవులు వేయేల హాలకులిశాంకుశా,ద్యఖిలదివ్య । లక్షణభూషిత, రమ్యకాంచన పాదుకాద్వయంబైన స,త్కరుణనొసఁగు । మక్షీణరాజ్యయో, గక్షేమ మనిశంబుఁ దత్పాదుకలకు వి,న్నపముఁ జేయు ॥ (ఆ,వె) చుండు వాఁడనని నఁ, బుండరీకదళాయ । తాక్షుఁడైన రాముఁ,డలరియతని । కతిదయాసముద్రుఁ,డై యిచ్చెనవరత్న । ధర్మరచిత రత్న,పాదుకలను ॥ (క) ఇచ్చినఁ గైకొని భరతుం । డిచ్చ నలరి కౌతుకంబు,హెచ్చఁగ భక్తిం । జెచ్చెరఁ బ్రణతుండైనయ । మచ్చుపడఁగ నిట్టులనియె,నన్నకుమఱలన్ ॥ (సీ) అనఘాత్మ నీకుమా,టాడ రాదని దీనికిప్పుడు భయమున, నీయకొంటిఁ । బదునాలుగబ్దము, ల్పాదుకార్పితరాజకార్యుండనగుచున,ల్కలములజిన । ములుదాల్చి ఫలమూల,ములు వేడ్క మెసవుచు నిండిన పురిఁ బాసి,యొండుచోట । మనమున భవదాగ,మనముఁగోరుచుఁగాల మొక రీతిఁగడపుచు,నుండువాఁడ ॥ (తే,గీ) వాసవోపమ సమయాంత,వాసరమునఁ । గనుల పండువుగానిన్నుఁ, గాంచనేని । సొరిదిమండెడి చిచ్చులోఁ,నుఱుకువాఁడఁ । జంద్రసూర్యాగ్నులోకకూట, సాక్షిగాఁగ ॥ (తే,గీ) అనినఁ దమ్ముని దృఢభక్తి,కలరి రాముఁ । డతనిప్రతిన కొడంబడి,సాదరముగ । నపుడు కా



గిటఁ జేర్చిమ,హానురాగ । భరితహృదయుఁడై యిట్లని, పలికెమఱల ॥ (తే,గీ) అనఘచరిత కైకేయి న,త్యంతభక్తిఁ । బ్రోవుమనిశంబు నటుగాక,రోషముంది । కనలిదూషించితేని భూ,తనయచేత । నరయనాచేత శప్తుఁడ, వౌదు వింక ॥ (వ) అని పలికి బాష్పపరీతలోచనుండై యాలింగనంబుఁ జేసి భరతుని సముచితంబుగా వీడ్కొనిన నతండు స్వలంకృతంబైన తదీయ పాదుకాద్వయంబుఁ బ్రతిగ్రహించి ధర్మవిదుండు కావునఁ బ్రదక్షిణంబు గావించి శత్రుంజయ నాగశీర్షంబునం బెట్టి పదంపడి నిజశీర్షంబున నిడికొని రథారూఢుం డ

(*) భరతుఁడు శత్రుఘ్నసహితుండై చిత్రకూటంబునుండి వెడలుట. (*)

య్యెనంత నారఘువంశవర్ధనుండగు రాముండు శత్రుఘ్నునిం గౌఁగిలించుకొని సాదరంబుగా వీడ్కొని పదంపడి గురువృద్ధమంత్రిభృత్య ప్రభృతులనందఱ నానుపూర్వికంబుగా సముచిత ప్రకారంబున సంభాషించి వీడ్కొనియె నప్పుడు బాష్పగృహీతకంఠలై తల్లులందఱు దుఃఖంబున నతని విడిచి పోనం జాలకున్న నమ్మహానుభావుండు వారినందఱ నభినందించి ప్రయాణంబున కొడంబఱచి రోదనంబు సేయుచు సీతాలక్ష్మణ సహితంబుగాఁ బర్ణశాలఁ బ్రవేశించె నంత ॥ (క) భరతుఁడు తత్పాదుకలను । బరువడి తనశిరముఁ జేర్చి, భక్తియలరఁగా । నరదంబెక్కి సుమిత్రా । వరసుత సహితముగ నరిగె, బలములు గొలువన్ ॥ (వ) పదంపడి వసిష్ఠుండును వామదేవుండును జాబాలియు నమోఘ కార్యవిచారనై పుణ్యంబునఁ బూజితులైన మంత్రులును యథార్హయానంబులెక్కి మందాకినీనది నుద్దేశించి ప్రాఙ్ముఖులై చిత్రకూట పర్వతంబునకుఁ బ్రదక్షిణంబుగాఁ దిరిగి యగ్రభాగంబునం జనిరి యుత్తరంబున భరతుండు ససైన్యుండై నానావిధ మనోహరధాతుసహస్రంబు లవలోకింపుచుఁ జిత్రకూటనగపార్శ్వంబునం జనిచని మహాత్ముండు భరద్వాజుం డెచ్చట నివసించి యుండు నట్టి పుణ్యాశ్రమంబు సేరంజని యందు రథంబుడిగ్గి పాదచారియై యమ్మునికడకుం జని నమస్కరించిన నతండు సంతుష్టాంతరంగుండై భరతున కిట్లనియె ॥ (క) అనఘాత్మ పోయివచ్చితె । ప్రణుతగుణుండైన రామ,భద్రు సకాశం । బునకచ్చటివృత్తాంతము । వినుపింపఁగదయ్య మాకు, విననగునేనిన్ ॥ (ఉ) నావిని యత్తపస్వికుల, నాథునితో భరతుండు పల్కెనో । పావనశీల యేను నృ,

—(*) భరతుఁడు రామానుమతంబు భరద్వాజున కెఱింగించుట. (*)—

పాలపురోహితుఁ డీవసిష్ఠుఁడు। న్వేవిధుల ।నఘూత్తముని, వేఁడిన నానృపధ
ర్మవేది సం। భావనఁజేసి యిట్లనియె, మఱుఁగవతోఁడ వసిష్ఠమానికిన్ ॥(క)
గురువర్యయొందు గాథలు। గఱపెదరిట్లేల తండ్రి, గఱపినకరణి। న్దిరముగఁ
బదునాల్గబ్దము। లరణ్యమునను౦డువాఁడ, నతిధీయుక్తిన్ ॥ (వ) అనినవసి
ష్ఠుండు వాక్యజ్ఞుండు గావున యుక్తియుక్తంబగు వాక్యంబున మహాప్రాజ్ఞుండ
గురామునకిట్లనియె ॥ (క) అటులైనసకలరాజమ। కుటఖచిత మహార్హ
రత్న,కోటిమయూఖో। ద్ఘటితమణి హేమపాదుక। లిటుదయసేయుముమహ
త్మ,కృపగలదేనిన్ ॥ (ఆ,వె) అనినన ట్లకాక,యనిప్రాఙ్ముఖుండై ర। ఘుప్రభుం
డురత్న,కోటిచిత్ర। పాదుకలనొసంగె,నాదురాజ్యార్థంబు। కన్నుఁగొనఁ
గరుణ,గడలుకొనఁగ ॥ (వ) ఇవ్విధంబున నద్దివ్య పాదుకలొసంగినం బ్రతి
గ్రహించియమ్మహాత్ముని చేత ననుజ్ఞాతుండనై క్రమ్మఱ నయోధ్యకుం బోవుచు
న్నవాఁడనని సర్వంబు నెఱింగించిన శుభంబైనభరతుని వాక్యంబువిని యమ్ము
నిపుంగవుండు సంతుష్టాంతరంగుండై వెండియునిట్లనియె॥ (తే,గీ) పరఁగ స
లిలంబు నిమ్నభూభాగమునకు। నొడిగిల్లినపగిదిగు, ణోన్నతత్వ। మనఘ
నీయందుఁజేరునీయట్టిశీల। ధర్మవంతునికిది విచిత్రంబుగాదు ॥ (తే,గీ) అ
నఘయెవ్వానికిట్టి, ధన్యాత్మకుఁడవు। ధర్మశీలివినీవుపుత్రకుఁడవైతి। వ
ట్టిమీయయ్య దశరథక్ష్మాధిపుండు। వసుధఁజచ్చియుమనియున్న, వాఁడుగాదె॥
(వ) అనిబహుప్రకారంబుల సాదరంబుగానభినందించియుక్తవాక్యంబులదీవించి
యనిచినభరతుండమ్మహామునికిఁబ్రదక్షిణంబుఁజేసిసారెసారెకుఁ దదీయచరణం
బులకుంబ్రణతుండై సముచితంబుగానామంత్రణంబువడసి చతురంగబలంబును
మంత్రులునుదనవెంటనరుగుదేఱంగదలి రయంబునంబోవుచుఁ గల్లోలమాలిని
యగుయమునానదినుత్తరించి యవ్వలఁ బావనజలసంపూర్ణయగు గంగా
నది దాఁటి శృంగిబేర పురంబు నతిక్రమించి యవ్వల బహుదూరంబరిగి పు
రోభాగంబున ॥ (తే,గీ) దశరథునిచేత జానకీ, ధవునిచేత। విడువఁబడిన
కారణమున, విప్రణష్ట। నాదయై దీనయై నిరా,నందయై వి। పన్నయై శూ
న్యగేహయై, యున్నదాని ॥ (తే,గీ) శ్వానమార్జాల ఘూక సంచలితయై
న। దాని నాలీనవరదంతి,యైనదాని। సాంద్రతిమిర పటలపరి,చ్ఛన్నకృష్ణ।



పక్షయామిని కరణిఁ జూ,పట్టుదాని ॥ (తే,గీ) భీషణాంగారక గ్రహా, పీడిత
యగు। రోహిణీదేవిభంగి ను,త్సాహముడిగి। కంపమొంది నిష్కాంతియై,
సొంపుదక్కి। యున్నదాని సైన్యంబుఁగై,కొన్నదాని ॥ (వ) మఱియు రా
హుగ్రస్త చంద్ర చంద్రిక కైవడి యల్పోష్ణ క్షుబ్ధసలిలయై ఘర్మోత్త
ప్తవిహంగమయై లీనమీనఝషగ్రాహయై కృశించియున్న గిరినది పగిదింగను
పట్టుచున్న దాని మఱియును ॥ (తే,గీ) తొలుతఁ దప్తహేమము భంగి,వె
లుఁగుచుండి। వెనుకదధ్యాదికంబుచే, వ్రేల్పఁబడిల। యంబునొందిన ఘనసవ
నాగ్నిజనిత। కీలకైవడిఁ జెలువఱి, క్రాలుదాని ॥ తే,గీ) వినిహతాయుధ
కవచ కేతనపదాతి। యై వినాశితనాయక,యైవిరుగ్ణ। వాజి వారణరథయై
ఘు,నాజిభూమి। నొప్పుసెడిన వాహినిభంగి, నున్నదాని ॥ (తే,గీ) మొదల
రవఫేనయుక్తయై పిదపశాంత। మారుతోద్ధూతయైసొంపు మాలి రయముఁ
మానియపగతనిస్వన యైనసాగ। రోర్మితోఁగీ ఛందంబునున్నదాని॥ (వ)

—(*) భరతుఁడు దవ్వులనుండి యయోధ్యంగనుంగొనుట. (*)—

మఱియు సుత్యాకాలంబు నివృత్తంబగు చుండ నభిరూపకులైనయాజకులచే
త యజ్ఞాయుధంబులచేతఁ బరిత్యక్తంబగుటవలన నిశ్శబ్దంబై యున్న యాగవే
దికచందంబున గోవృషంబునుబాసి తృణంబుమెసవక గోష్ఠమధ్యంబునం బరి
భ్రమించుచున్న గోపత్నిచాడ్పున సుస్నిగ్ధంబులయిన పద్మరాగాది జాతిర
త్నంబులచేత వియుక్తయయిన నూతనముక్తావళి లాగునఁ బుణ్యక్షయంబువ
లన స్థానచలితయై దివంబుననుండి పుడమింబడి సంహృతద్యుతి విస్తారయైన
తారపగిది వసంతకాలమధ్యంబునఁబుష్పోపేతయై మత్తభ్రమరశాలియైయుం
డి వేగవంతంబయిన దావాగ్నిచేత నీషద్దగ్ధయై వాడియున్న వనలతకైవడిఁ
బ్రచ్ఛన్నశశినక్షత్రయై మేఘంబులచేత నావరింపం బడియున్న దివంబుకరణిఁ
బరిక్షీణమధ్వోత్తమంబులైన భిన్నశరావంబులచేత నభిసంవృతయై సమాహ
తమత్తజనయైయసంస్కృతయై యనావృతప్రదేశంబునందలి పానభూమిమా
డ్కి భిన్నపాత్రసమావృతయై భిన్నభూమితలయయి యుపయుక్తోదకయైభగ్న
యైపుడమింగూలియున్న పానీయశాలభంగిఁ జాపంబునందుసమారోపితయై
బద్ధకోటిద్వయపాశయై యుండి రణమధ్యంబునఁ బ్రతివీరుల బాణంబులచేతఁ
బరిచ్ఛిన్నయై వింటనుండిజారి పుడమింబడిన మౌర్వికీతిహయారోహకుండైన

యుద్ధశౌండునిచేత నిక్షిప్తభాండుండై విడువంబడిన దుర్బల కిశోరియట్లు నిబిడంబయిన ప్రావృట్కాలంబునందు నీల జీమూతంబుల చేతం గప్పంబడిన భాస్కరరశ్మిపోలువున సొంపుసెడియున్నదాని నయోధ్య నవలోకించి భరతుండు పరమదుఃఖితుండై యప్పురంబుం బ్రవేశించి రాజమార్గంబునం బోవుచు సార

(*)భరతుం డయోధ్యం బ్రవేశించి యందలి దుఃఖనిమిత్తంబుల(*)

—*)సారథికిం జెప్పుట.(*—

థికిట్లనియె॥ (క) అనఘాయీనగరంబున। మునుపటివలెంబణవపటహ మురజాద్యసువా। ద్యనినాదంబులుగీత। స్వనములువినరావుకర్ణశర్మకరములై॥ (తే,గీ) వారుణీమదగంధంబుభూరిమాల్య। సౌరభముం జందనాగరుచారుధూప। వాసనలునవ్యకస్తూరి వరపరిమళ। మింపుసొంపార నేడువాసింపదకట॥ (క) అనఘారథనేమిఘన। స్వనములుహయహేషితములు వరవారణస। న్నినదంబులిప్పుడిప్పురి। వినరావుసఖారఘుప్రవీరుండులేమిన్॥ (తే, గీ) చందనములందిక్రొవ్విరిసరులుదురిమి। పురుషులనురూపలైనసుందరులంగూడి। యుపవనంబులం గ్రీడింపం నుత్సహింప। రూర రఘుపుంగవుండు లేని కారణమున॥ (తే,గీ) అకటయీవీటిసొబగుమహానుభావుం। డైనరాముని చేహత మయ్యెనేండు। వృష్టిధారాసమన్విత విశదపక్ష। రాత్రికైవడినున్నది రమణదక్కి॥ (వ) మఱియు నపురూపంబుగా సమాగతంబైన మహోత్సవంబుకరణి మద్భావిత యగు రాముండు నిదాఘకాలంబునందలి మేఘంబుకైవడి నీనగరంబునం దెన్నండు హర్షంబుం బుట్టించు నీరాజమార్గంబులు చారువేషధరులగు పురుషుల మందాంచిత గమనంబులచేత శోభితంబులుగాకున్నవి యని యిత్తెఱంగున బహువిధ దుఃఖాలాపంబులాడుచు సింహహీనంబైన పర్వత కందరంబు చాడ్పున రాజహీనంబై పాడఱియున్న పితృమందిరంబుం బ్రవేశించి తొల్లి దేవాసురసంగ్రామంబునందు స్వర్భానునిచేత భానుండు పరాజితుండగుచుండ

(*)భరతుండు వసిష్ఠాదులతో నయోధ్యలో వాసముం జేయం జాలననుట.(*)

నభాస్కరంబైన దినంబుభంగి నుజ్ఝితప్రభంబై యున్న యంతఃపురంబువిలోకించి కన్నీరునించి తల్లులకుం దఱ స్వగృహంబులకుం బంచి మనంబున దుఃఖించి వసిష్ఠాదిగురువుల నవలోకించి యిట్లనియె॥ (చ) నృపతిత్రివిష్టపంబునకు నేగుచునుండంగంగొనలేయుండుం। దపసివిధంబునన్వనపదంబునకుంజనుచుండ



నిత్యము। న్వ్యపగతకాంతియైభయదమైగహానాకృతినున్న వీటియిం। దిపుడువసింపంజాలంబరిహీనవిశాలమనోరథుండనై॥ (క) రామాగమనముం గోరుచుం। గామితములుమానివిహిత గతిమునివృత్తి। న్నేమంబుననలనంది। గ్రామంబుననుండువాండం గౌతుకమలరన్॥ (క) అనిపలికిన నగ్రైకేయీ। తనయునికుశలోక్తివినిప్రధానులుసచివుల్। మునివిభుండువసిష్ఠుండును। వినయంబునసిట్టులనిరి వెండియుం బ్రీతిన్॥ (తే,గీ) భ్రాతృవాత్సల్యముననీవు పలికినట్టిలపితమది శ్లాఘనీయమైవిపులమోద। కారియయియున్న దంతయు ఘనవివేకివైననీకిదియనురూప మగుటయరుదె॥ (తే,గీ) భ్రాతృసౌహృదస్థితుండవు పండితుండవు। బంధుల్పుండవధికసత్పథగతుండ। వైననీవచనంబుధరాధినాథపుత్రయెవ్వానికైననుబొగడందగదె॥ (వ) అని పలికిన యథాభిలషితంబైన వారల ప్రియవాక్యంబాకర్ణించి ప్రహృష్టవదనుండై తల్లులకందఱ కభివాదనంబుంజేసి శత్రుఘ్నసహితంబుగా రథంబెక్కి మంత్రిపురోహిత సహితుండై రామపాదుకలు శిరంబుననిడికొని ప్రాఙ్ముఖంబుగా నంది గ్రామంబునకుం జనియె నతని యగ్రభాగంబున వసిష్ఠాది మహామునులును మంత్రులును యథార్హయానంబులం జనిరి గజాశ్వరథ పదాతులును బురవాసులు నతనివెనుకం

()భరతుండు సైన్యసమేతముగా నందిగ్రామముం జేరుట.()

జని యిట్లు భరతుండు నందిగ్రామంబుం బ్రవేశించి రథంబుడిగ్గి వసిష్ఠాదిగురువుల నవలోకించి యీరాజ్యంబు సమ్యఙ్నిక్షిప్తద్రవ్యంబుకరణి రామునిచేత నాకొఱకు దత్తంబయ్యె హేమభూషితంబులైనయీపాదుకలు యోగక్షేమంబువహింపంగలయవియనిపలికి దుఃఖితుండై వెండియుం బాదుకలుశిరంబుననిడికొని ప్రకృతిమండలంబునవలోకించియిట్లనియె॥ (సీ) రమణీయతరచామరంబులువీచుండుపట్టుండుఛత్రంబుం బాదుకలకు। ననిశంబుమద్గురుండైనరామునిపాదకమలరజస్సి

—(*)భరతుండు రామపాదుకలకు రాజ్యాభిషేకముం గావించుట.(*)—

క్రముహేమ। పాదుకాయుగళప్రభావంబుచే రాజ్యమందుధర్మంబునిరంతరముస్త్రగ। వర్ధిల్లుచుండునీ, వరపాదుకాప్రీతినిది రాఘవుని చేత, సదమలక్ష్మప (తే,గీ) వెలయనిక్షిప్త మయ్యెనే,నలఘుభక్తి। రాఘవునిరాకం గోరుచు, రమణతోడ। దీనిం బాలింపుచుండెద, మానితముగ। భక్తిం గొలువుండు మీరలీ, పాదుకలను॥ (చ) కడువడిరామపాదములం గ్రమ్మఱనీకమనీయ పాదుకల్। దొడగి

తదంఘ్రిమూలములు,తోడ నెయాదలసోక (మ్రొక్కి-సాం। పడరఁగ రాజ్యభార
ముర,యంబుననమ్మహనీయమూర్తి-పై। నిడిశ్రమ మెల్లవీడి గురు,వృత్తి గన
ముఁడనై భజించెదర్ణ॥(తే,గీ)అడవినుండియే తెంచినయగ్రజునకు।నీయయోధ్య
నిసామ్రాజ్యమీసువర్ణ।పాదుకాద్వయమర్పించి,పరమభక్తి।యలరఁగొల్చెదభూ
త పాపా,ళినగుచు॥ (తే,గీ)ఆప్తులెల్లముదంబున, నలరుచుండ ।రామచంద్రుఁడు
పూజ్యసా,మ్రాజ్యపదవిఁ। జేకొనిసమస్తజనులర,క్షింపుచుండు। నాఁడుగాఘ
లియించుట,నాతసంబు॥ (తే,గీ) గరిమనభిషిక్తుఁడై నరా,ఘవునిఁగాంచి। చె
లఁగిప్రజలెల్లఁగడుసంత, సింపుచుండు। రపుడునీరాజ్యమునకంటె, విపులయ
శము। హర్షము చతుర్గుణాధికం, బగునిజంబు॥(వ) అనిబహుప్రకారంబు
లదీనుండై విలపించుచు మహాయశుండును భాతృవత్సలుండును ప్రతిజ్ఞాతత్ప
రుండు నగు భరతుండువల్కలజటాధారియై మునివేషధరుండై సైన్యసమేతం
బుగా నందిగ్రామంబుననివసించి రామపాదుకలకు రాజ్యాభిషేకంబుఁ గావిం
చిపాదుకాపరతంత్రుండై సర్వకృత్యంబులుపాదుకలకువిన్నవింపుచు నద్దియేని
రాజ్యపరిపాలనరూప కృత్యంబునువస్త్రపుష్పఫలాది కోపాయనంబును మొదల
పాదుకలకునివేదించిపదంపడి సమస్త కృత్యంబునుయుక్తప్రకారంబునంగావిం
పుచు రామాగమనకాంక్షియై రాజ్యంబుసేయుచుండెనిక్కడఁ జిత్రకూటంబున

(*) మునులు శ్రీరామునిఁజూచి గుసగుసలాడుకొనుట. (*)

భరతుండయోధ్యకుం జనిన యనంతరంబరాముండుసీతాలక్ష్మణసహితంబుగా
సుఖాసీనుండై యుండె నప్పుడు తదాశ్రమ నివాసులగు తాపసులురామునిను
ద్దేశించి నయనభ్రూకుటివిక్షేపణంబులును బరస్పర ముఖావలోకంబులును ని
తరేతరంబురహస్యకథలుం గావించిన నారఘుపుంగవుం డింగితాకారాదుల
చేత వారల సభయోత్సుకత్వంబు వీక్షించిచిత్తంబున సంజాతశంకుండై యం
జలిఁగీలించి కులపతియగు మునిపతికిట్లనియె॥ (సీ) మునినాథయుష్మహా,ము
నుల మోములఁజూడ నొక్క చందంబున, నున్నవేల। పూని నావలనసే,మై
న నేరముగల్గెనే ప్రమాదంబున,నీప్రబుద్ధుఁ। డైన సౌమిత్రి య,న్యాయంబుఁ
జేసెనే సేవఁగావించెదు, సీతయందు। దోష మొక్కింతైనఁ, దోఁచెనేసందియ
మగుచున్న దాన తి,మ్మనుచుఁ,బలుక॥ (తే,గీ) విని తపోవృద్ధుఁడును వయో
వృద్ధుఁడధిక। తేజుఁడగు నమ్మహాముని,తిలకుఁడపుడు। వార్ధకంబున నెమ్మే



ను,వడఁకరాముఁ। జూచి యిట్లని పలికె ను,త్సుకతమెఱయ॥ (తే,గీ) అన
ఘ కల్యాణసత్త్వయు,ననుపమాన। ధవళశీలయుఁ బుణ్యాత్మ,త్వరయువంశ।
శీలపరిపాలనయునైన, సీతయందు। దుష్టమతికైనఁ బొడము నె,దోషశంక॥

(*) కులపతియగు మహర్షి రామునకు ఖరాసురబాధ నెఱింగించుట. (*)

(క) జడదారులకు వికారము।కడువడి భవదర్థమందుఁ, గలిగెనిశాటుల్।
విడువక యొనర్చు బాధల। కుడుకుచు గుసగుసలు వోవు, చున్నారనఘా॥
(క) ఈవనమున ఖరుఁడనఁగా। రావణుతమ్ముం డొకండు, రాక్షసుఁడతిగో।
పావిష్టుఁడై జనస్థా। నావాసులమునులననిశ, మారటఁబెట్టుఁ॥ (క) జితకా
శియుఁబురుషాదకుఁ। డతిదుష్టుఁడు కూరచిత్తుఁ, డపలిప్తుఁడుదు। ర్మతియైన
యన్నిశాటుఁడు। చతురతనినుఁ గనిసహింపఁ, జాలఁడధీశా॥ (వ) మఱియు
మహానుభావుండవైన నీవిచ్చటికిం జనుదెంచిన నాఁటనుండి విశేషించి విరూప
లగు రాక్షసులు తాపసులకు విప్రకారంబు సేయుచు జుగుప్సితంబులును దూ
షితంబులును నానారూపంబులును వికృతదర్శనంబులునగు రూపంబులచేత భ
యంబులుపుట్టింపుచు మ్రోలనిలిచి యప్రశస్తంబులగు నశుచిద్రవ్యంబులు ప్ర
యోగించి మఱికొందఱ మునుల వధింపుచు నయ్యాశ్రమ స్థానంబులయం
దు విదితంబుగాకుండ దాఁగియుండి యవసరంబెఱింగి తాపసులవినాశంబు
నొందించి విహరింపుచు హోమంబుగావించునప్పుడు కలశంబులు వోనడుచు
చు వహ్నికుండంబులలోన సలిలంబు నించుచు స్రువాది సాధనంబులు నిర్మూ
లంబులు సేయుచు నిట్లనేక ప్రకారంబుల దురాత్ములగు రాక్షసులుబాధింపుచు
న్న వారద్దానవులచేత నపవిత్రితంబులైన యాశ్రమంబులువిడిచి యొండుదేశం
బునకుంబోవ సమకట్టిమహర్షులందఱునన్నుఁ బ్రేరేపింపుచున్నవారద్దురాత్ము
లచేతఁ దాపసులశరీరంబులన్నియు హింసితంబులయ్యెనింక నిచ్చటనిలువంజాల

(*) మునులందఱుఁ జిత్రకూటమునువదలి యొండుస్థలమునకుఁ బోవుట. (*)

మీయాశ్రమంబు విడచి యిచ్చటికిఁగొండొకదూరంబునబహుమూలఫలోదకం
బైనకణ్వమహామునిపుణ్యాశ్రమంబొప్పుచున్నదచ్చటికింజని శిష్యగణసమేతంబు
గా నివసించెదము ఖరుండుమీయందును విప్రకారంబుఁగావించుఁ గావుననీవి
చ్చటనుండవలదుసమాధానం బగునేనిమాతోడం జనుదెమ్మా దురాత్ముండు
సమర్థుండును గళత్రవంతుండునుసన్నద్ధుండునైయుండు నిచ్చటినివాసంబుసం

దేహజనకంబును దుఃఖకారణంబు నై యుండు ననిన నమ్మునిపతి వచనంబు విని రాఘవుం డేనుండ నీకు భయం బేమి యేను రక్షించెద నని యుత్తర వాక్యంబుల చేత నియోగించిన సమ్మతింపక యత్తాపసోత్తముండు రాముసభినందించి యామంత్రణంబు వడసి యయ్యాశ్రమంబు విడిచి ఋషిసంఘాత సమన్వితంబుగా నరిగె నంత రాముండు ఋషిగణంబుల నొండు దేశంబునకనిచి కులపతికభివాదనంబుఁ జేసి యమ్మహాత్మునిచేత నుపదిష్టప్రయోజనుండై క్రమ్మఱ నిజాశ్రమంబు ప్రవేశించి యయ్యాశ్రమంబు మునిశూన్యత్వంబునఁ బరిత్యాజ్యంబైనను మునివిషయ ప్రేమాతిశయంబున క్షణమాత్రంబు పరిత్యజింపకుండి పదంపడి మునిసందిష్ట భావిప్రయోజనం బాలోచించి బహు కారణంబుల చేత మునిరహితంబైన తదాశ్రమంబున నుండుటకు సహింపక తనమనంబున ॥ (ఆ,వె) ఇచట నాకు భరతుఁ, డిపుడు దృష్టుండయ్యె । మంత్రిభృత్యసుహృద, మాతృమాతృ । నగరవాసులెల్ల, నాయున్నకందువఁ । దెలిసిరింక నిచట, నిలువఁదగదు ॥ (క) భారత భూరిస్కంధా । వారనివేశంబు చేత, వరహస్త్యశ్వో । దారకరీషంబుల చే । నీరమ్యాచలము హీన, వృక్షంబయ్యెన్ ॥ (క) కావున వేఱొక చోటికిఁ । బోవలెనని నిశ్చయించి, భూమిజయు సుమి । త్రా వరపుత్రుఁడు తోడన । వావిరిఁ జనుదేఱ నచటు, వాసి రయమునన్ ।(ఆ,వె) అమ్మహానుభా

(*)రాముఁడు సీతాలక్ష్మణసహితముగా నత్రిమహర్షి యాశ్రమమునకుఁ బోవుట *

వుఁ, డత్రిమహాముని । యాశ్రమమునకరిగి, యమ్మహాత్ము । చరణ పంకజముల, కెఱఁగిన నమ్మౌని । కన్నకొడుకునట్ల, గారవించి ॥ (ఆ,వె) సాదరంబుగాఁగ, నాతిథ్యమొసఁగి సౌ । మిత్రి నాదరించి, మిత్రవంశ । రాజ్యలక్ష్మిఁ బోలె, రాజిల్లుచున్నయు । ర్వీకుమారి గార, వించి మఱియు ॥ (ఉ) వృద్ధను బుణ్యశీలను బ, విత్రచరిత్రను ధర్మచారిణిన్ । శుద్ధవివేకయుక్తననసూయను దాపసి నమ్మహాతప । స్సిద్ధను లోక సత్కృతను, జీరి రఘూత్తముఁ జూచి మానసా । బద్ధనవ ప్రమోదుఁడయి, భవ్యచరిత్రుఁడు మౌని యిట్లనున్ ॥ (సీ) రఘువర్య దశవత్సరముల నావృష్టిచేఁ దగిలి లోకము దగ్ధ,మగుచునుండఁ । గడువడి నేసాధ్వి, ఘనతపోమహిమచే ఫలమూలములు జలంబులు సృజించె । దశసహస్రాబ్దము, ల్దారుణగతి నేతపస్విని యుగ్రతపంబు సలిపెఁ । దగ ననసూయా వ్రతంబుల నేసతి యంతరాయంబులఁ నవలఁద్రోచె ॥ (తే,గీ) దేవకార్యనిమిత్తమ్మె, దేవి మొ



నసి । తవిలి దశరాత్ర మేకరాత్రముగఁ జేసె । నట్టియీపుణ్యశీలనీ, కనవరతముఁ । జననిగతిఁ బూజనీయయై,తనరుచుండు ॥ (తే,గీ) అఖిలభూత నమస్కార్యయైన యీతపస్విని స్వకీయకర్మసంపదలచేత । వసుధ ననసూయ యనఁ బేరు, వడసెఁ బ్రీతి । జనకపుత్రి మ్రొక్కింపుమీ, సాధ్వికిపుడు ॥ (వ) అని పలికిన నారఘువల్లభుం డమ్మహాముని పలుకులకలరి సీతనవలోకించి దేవి మునిము

(*)సీతాదేవి యనసూయాదేవికి నమస్కరించుట.(*)

ఖేరితంబైన వాక్యంబు వింటివే శ్రేయస్కరంబై యున్నదట్లు గావింపుమనిన నమ్మహీపుత్రి రామవచనప్రకారంబున నమ్ముని పత్నికడకుం జని శ్లథసంధిబంధావయవసన్నివేశయు సంజాతపలితాంగియు జరాపాండుర మూర్ధజయు నక్రోధనయు ననిందితయు మహాభాగయుఁ బరమవృద్ధయు వేపమానకృశాంగియు నైన యమ్మహాసాధ్వికి నిజాభిధానంబు నొడివి నమస్కరించి బద్ధాంజలిపుటయై యారోగ్యంబడిగిన నయ్యనసూయ ధర్మచారిణియైన సీత నవలోకించి మధుమధుర వాక్యంబుల గారవింపుచు నిట్లనియె ॥ (చ) తరుణిరో దైవయోగమునఁ, దద్దయు ధర్మగతాగతజ్ఞవై । వరగుణశాలియైన రఘువర్యుని వెంబడి ఘోర కానన । స్థిరకిటు భర్తృభక్తి నరు, దెంచుటఁ జేసి కృతార్థవైతివే । నఁ బమర లేక నిన్నుఁ గని, నంత నెసువ్రతనైతి నెంతయున్ ॥ (క) బహు సుఖముల హితజనముల । నహంకృతియు విడిచి ధర్మ, మరసి కొనరహిన్ । గహనావరుద్ధుఁడగు పతి । నహహా సేవింపవచ్చి, తతిధన్యవుగా ॥ (తే,గీ) వనిత నగరస్థుఁడైన దా, వస్థుఁడైనఁ । బుణ్యుఁడైనను గుజనాగ్ర, గణ్యుఁడైన । ధాత్రి నెవ్వారికి విభుండు దైవమట్టి । యువతులకు లోకయుగము మ,హోదయంబు ॥ (క)

—(*)అనసూయాదేవి సీతయొక్క పాతివ్రత్యంబుఁ గొనియాడుట.(*)—

ధనవంతుండైననుని । ర్ధనుఁడైనను శీలవృత్తరహితుండైనన్ । ఘనకామవృత్తుఁడైనను । వనితకు గతి పతియె సుమ్మి, వారిజనేత్ర ॥ (తే,గీ) సతికిఁ బతికంటె వేఱొక, గతియు లేదు । పతికి సతికంటె నొండొక, ఫలము లేదు । తరుణి యురువుతు పుష్పంబు, తావి కరణి । నింపు సొంపార నేకీభవింపవలయు ॥ (ఉ) కొందఱు దుర్వివేకమునఁ, గోరినవారల కెల్లఁ జిత్తముం । బొందుగ నిచ్చి భర్తయెడఁ, బోడిమి సేయక నీతిబాహ్యలై । యుందురు చుట్టలెల్లఁ దము నొక్కటఁ జీయనిరోయుచుండఁ వా । రందఱు దుర్యశంబున మ,హానిరయస్థితలౌదురంగనా ॥

(ఆ,వె) లోకమందుదృష్ట,లోకపరావర । లమిత సుగుణ వతులు,విమల మతు
లు । నీతిశీలలైన నీయట్టిసాధ్వులు । సురపదంబునొందుదురుమృగాక్షి ॥(వ)
దేవినీవు పతివ్రతాచరణీయంబైన ధర్మంబుననుసరించి రామునకు సహధ
ర్మచారిణివై శాశ్వతంబైనయశంబును ధర్మంబును సంపాదించితివని బో
ధించిన నమ్మునిపత్ని పల్కులకలరి వైదేహి క్రమ్మఱ నద్దేవికి నమస్కరించి మృ
దుమధురభాషణంబుల వినయంబున నిట్లనియె ॥ (శా) తల్లీనీవిపుడన్న చం
దమదిత,థ్యంబింతయునాసాధ్వీకిం । జెల్లుంజిత్రముగాదు నాకునుసతీ శీలంబు
మాతల్లిమర్ । దెల్లంబౌనటు లానతిచ్చెఁగరుణో ద్రేకంబుసంధిల్లనా । యు
ల్లంబందును జిక్కియున్నయదిత ద్యోగంబు రూఢంబుగన్ ॥ (మ) మునుమా
తల్లిసతీగుణంబులు మహా మోదంబునం జెప్పెమ । జ్జనకుండవ్వలనానతిచ్చెఁ
గృపతో సాధ్వీగుణంబంతయున్ । వనవాసంబునకేగు దెంచుతఱిఁ దావణ్ణిం
చెమాయత్తగా । రనురూపంబుగఁ గ్రొత్తఁజేసితివినీ వాయర్థముం గ్రమ్మ
ఱన్ ॥ (క) కావునవిధిదృష్టవిధిన్ । వేవిధములఁజూడసతికి విభుఁడొక్కండే ।
దైవతమనియెడువచనము । దేవీనాహృదయమందుఁ దిరమైయుండున్ ॥ (మ)

## (*)సీతాదేవిశ్రీరాముని గుణంబులఁ బ్రస్తుతించుట.(*)

జగతిన్నీచచరిత్రుఁ డైనవిభుఁడెం,చన్సాధ్వికిన్ దైవతం । బగుచుండ, న్గరుణా
పరుండునిజవం శాచారధర్మజ్ఞుఁడున్ । సుగుణోదారుఁడు మంజువాదిప్రియు
డున్మారుండుశుద్ధాత్ముఁడౌ । మగనిం దైవతమంచుఁ జిత్తమున సంభావించుటా
శ్చర్యమే॥ (శా) అక్రూరుండు దయాసముద్రుఁ డతివి,ఖ్యాతుండు ధన్యాత్ముఁ
డున్ । శత్రాభుఁడును గన్నపుత్రులగతి,న్సర్వప్రజన్బ్రోచిని । ర్వక్రప్రౌఢిమనే
లువాఁడు ఘనుఁడు,న్వంశోచితాచార ధ । ర్మక్రీడారతుఁ డుత్తమోత్తముఁ
డు మత్ప్రాణేశ్వరుండంబికా ॥ (మ) ధరనెవ్వాఁడు జితేంద్రియుండు సుగు
ణో,దారుండు శాంతుండు సిం । ధురయానుండుదృఢానురాగుఁడునుసా, ను
క్రోశుఁడై యొప్పున । క్కరుణోదారుఁడు రాముఁడేగురుత న,కౌసల్యపైఁజే
ర్చునా । గురుతం దక్కిన మాతృవర్గముపయిం, గూర్చున్సమగ్రంబుగన్ ॥
(సీ) పరకాంతనేత్రగో, చరమైనచోదానిఁదల్లినిబలెనాత్మఁ, దలఁచువాఁడు ।ప
రులసంతోషవి,స్ఫురణంబునకుఁదాను నంచితంబుగఁబ్రమో, దించువాఁడు । ప్ర
జల దుఃఖమునకుఁ, బరమాప్తుఁడునుబోలెఁగొంచక దానుదుః, ఖించువాఁడు ।



దీనులు రక్షార్థు,లైనచో,జనకుని రీతిసత్కృపసంత, రించువాఁడు ॥ (తే, గీ)
వరమునీంద్రులఁ గన్నసే,వకుని భంగి । వరుసఁబరిచర్యఁ గావించు, వాఁడువి
నయ । శీలకారుణ్యగుణములఁ, జెలఁగువాఁడు । రమ్య గుణమండనుం డైన
రాఘవుండు॥ (తే,గీ) అట్టిరాజలలామున కెట్టిదుష్ట । కాంతయైనను వశగత
గాకయున్నె । జనకుఁడనిశంబు సహధర్మచారిణిగను । గౌసలేయునకర్పించె
గాదెనన్ను॥ (క) నిరుపమసంపత్కరమును । బరమసుఖాస్పదముభూరి భద్ర

## —(*)సీతాదేవి యనసూయాదేవిని బ్రస్తుతించుట.(*)—

ప్రదము । స్థురుతర కీర్తివిశాలముఁ। దరుణికిఁ బతిసేవ కంటెఁ దపములుగలవే॥
(తే,గీ) సువ్రతంబునఁ బతికిశుశ్రూషఁ జేసి । మున్ను సావిత్రి దేవతా ముఖ్య
యయ్యె । నట్లనీవునుబతిసపర్యావిశేష । జాతమహిమనుధన్యాత్మ వైతిగాదె॥
( తే, గీ ) ధర్మ చారిణి సర్వసుం, దరుల లోన । నుత్తమయు దేవతా
ప్రిమ, దోత్తమాంగ । మండనయు నైన రోహిణి మగనివిడిచి । నిమిష
మైనను జీవింప, నేర్చునమ్మ ॥ ( క ) జగతిన్భర్తృదృఢవ్రత । లగు యువ
తులు దేవ లోక,మందుస్వకీయం । బగుపుణ్యకర్మమునస । ద్భభగభాజన
లగుచుయశముఁబడసెదరెపుడున్॥(క)అనియిట్లువలుకసీతా ।వనితావాక్యము
లకలరి,వారని కృపన । య్యనసూయ శిరము మూర్కొని । యనురాగ మెల
ప్ప మఱల, నవనిజ కనియెన్ ॥ (క) నానావిధ నియమంబుల । మానుగ
సంభూతమైన, మహనీయతపో । నూనబల మాశ్రయించి వ । రాననయా
శీర్వదింతు, నడుగుము వరమున్ ॥ (వ) దేవి మనోజ్ఞంబైన భవదీయవా
క్యంబు విని యానందించితి నింకఁబ్రీతిదానంబు గావించెదఁ గైకొనుమనినన
వైదేహి జాతవిస్మయయై భవదీయచిత్తంబు కొలంది నవధరింపు మనిన న
మ్మునిపత్ని సంతసిల్లి భవదీయహర్షంబు సఫలంబుఁ గావించెద నని పలికి ది

## (*) అనసూయ సీతకు దివ్యవస్త్రమాల్యాభరణాంగరాగానులేపనంబుల (*)

## ( నొసంగుట . )

వ్యంబులైన వస్త్రమాల్యా భరణంబులును మహార్హంబైన యంగరాగంబు
ను మహాపరిమళ ద్రవ్యసహితంబైన యను లేపనంబు నొసంగి యిట్లనియె ॥
(తే,గీ) అతివ యీదివ్యవస్త్రమా, ల్యాభరణము । లింపుసొంపార మేన ధ,

రింపుమిపుడు । మహితమణిమండలప్రభా, మండితంబు । లగుచు నిత్యంబు
లై యుండు,నన్ని నిజము ॥ (తే,గీ) దేవి మద్దత్తమైనయీ, దివ్యలేప । నాంగ
రాగంబుచే విలి, ప్తాంగివగుచు । నబ్జవాసిని పుండరీ, కాక్షునట్ల । కౌసలే
యుని రంజింపఁ, గలవునీవు ॥ (క) అని సాదరంబుగా ని । చ్చినఁ గైకొని
మేనఁదాల్చి,చెలువుగవసుధా । తనయఫలకుసుమకిసలయ । ఘనశోభితయైన
వల్లి, కైవడినలరె ॥ (వ) ఇవ్విధంబున నభూతపూర్వ శోభా విశేషంబున
నలంకృతయై యవ్వైదేహి మునిపత్నినుపాసింపుచు నభిముఖంబుగా నాసీన
యయ్యె నంతనయ్యనసూయ తత్పరిణయకథావృత్తాంతంబంతయుఁ దెల్లంబు
గా నాకర్ణించుతలంపునఁ గ్రమ్మఱనమ్మహీసుతకిట్లనియె ॥ (క) వైదేహిని
న్ను రాఘువుఁ । డాదరమున మున్ను పెండ్లి,యాడినవిధము । న్మోదముతో సె
ఱిఁగింపుము । నాదుమదికి సమ్మదము ఘ,నంబై యుండన్ ॥ (ఉ) నా విని
సంతసంబు వద,నంబునఁగన్పడ నమ్మహీజవా । గ్దేవికి సాటివచ్చుముని, దేవి
ని గన్గొనిప్రీతినిట్లను । న్దేవిరఘూత్తముండు నను, ధీరతఁజేకొనినట్టిచొప్పుసాం।

—(*) సీత తనవివాహవృత్తాంతము ననసూయా దేవికిఁజెల్పుట. (*)—

పావహీంలంగఁ జెప్పెద న,నన్యమతిన్వినుమయ్యు దంతమున్ ॥ (చ) కలఁ
డుసమస్తభూవరని,కాయకిరీట మణీమరీచికా । విలసితపాదపీఠుఁడు వి,వేకవి
శారదుఁడప్రమాదుఁడు । న్సలలిత కీర్తిసాంద్రుఁడు వి, శాల గుణాఢ్యుఁడు ధ
ర్మపారగుం । డలఘుభుజాబలుండు జన,కావనిపాలుఁ డనఘశీలుఁడై ॥
(తే,గీ) అతఁడుపుత్రార్థ మధ్వర,మాచరింపఁ । దలఁచిక్షేత్రంబు దున్నింప
హాలముఖమునఁ । బుడమిభేదింపనేనుసం,భూతనైతిఁ । బొడుపువుమలనుండి
శశిరేఖ,పుట్టినట్లు ॥ (తే,గీ) రమణనిట్లు జన్మించిప,రాగరూషి । తాంగినై
యున్న నన్నుఁ బో,లంగఁజూచి । త్వరితముగముట్టి విక్షేప,తత్పరుఁడగు । జన
కుఁ డతివిస్మితాత్ముఁడై, సంభ్రమమున ॥ (క) ననునుత్సంగంబున నిడి । కొ
నినాకీకన్నె చిన్ని,కూఁతురనుచువా । కొనునెడ నిక్కముసీకుం । దనయయ
నుచు గగనవాణి, తప్పకమ్రోసెన్ ॥ (ఉ) అంతఁబ్రమోదియై జనకుఁ, డా
దృతుఁడైననుఁగొంచు మందిరా । భ్యంతరసీమకేగి తనయగ్రపురంధ్రికి నన్నొ
సంగిన । న్సంతస మంకురింపఁగొని, చయ్యన నయ్యమ మాతృసౌహృదం ।
బెంతయునివ్వటిల్ల నక, లేప్సితము ల్లటియించి పెంపఁగన్ ॥ (తే,గీ) ఈక



రణినాఁటినాఁటికి,వృద్ధిఁబొంది । యున్ననాకీలజవ్వనం, బొదవియొప్పెఁ।గాంచ
నమునకువాసన,గలిగినట్ల । యిక్షుకాండంబునకుఫల,మెసఁగినట్లు॥ (వ) ఇట్లు
పాణిగ్రహణమహోత్సవయోగ్యనై యున్న నన్ను విలోకించిమజ్జనకుండైనజనకుం
డుతనమనంబునఁ గన్యాజనకుండు శక్రతుల్యుండైనను గన్యాగ్రహీతృ తత్సం
బంధి జనంబు సదృశంబైన నీచంబైన వారివలనఁ దిరస్కారంబు నొందు
నట్లనాకును గన్యానిమిత్తంబునఁ దిరస్కారంబువాటిల్లు నని యోచించి నన్న
యోనిజఁగా నెఱింగి నిర్ధనుండు విత్తనాశనంబువలన దీనుండైన పగిది నతి
దీనుండై యభిజనవృత్తాదికంబునవయస్సౌందర్యాదికంబున నాకనురూపుండగు
పతియెవ్వండొకో యనవిచారింపుచు నెందునుంగానక నానా ప్రకారంబులఁ
జింతించి మత్కుమారికి స్వయంవరంబు సేయుదుఁ గాకయని నిశ్చయించి ॥
(సీ) అఖిలజగంబుల,కాధారమైనట్టి కనకాద్రిచందానఁ, గ్రాలుదాని । యా
గసంతుష్టుఁడై, యనుపమకరుణతో నబ్ధినాయకుఁ డిచ్చి,నట్టిదాని । మానవేం
ద్రులు కల,లోనైన గుణమెక్కుపెట్టఁ జింతింపలే, నట్టిదాని । ననుదినంబును
గుసు,మాదికంబులచేత నతిభక్తిఁబూజితంబైనదాని॥ (తే,గీ) మఱియుబహు
కాలమున నుండిమందిరమున । నలరుదాని మాహేశ్వరం,బైన దానిఁ ।జా
పమొక్కటిఁదెప్పించి,సంభ్రమమున । నృపులనందఱరావించి,యిట్టులనియె ॥
(క) ఈనగజాపతిధనువెవఁ । డేనియు సజ్యంబుఁ జేస,నేని ముదముతో ।మా
నక యిచ్చెదవకు న । హీనమతిన్నాకుమారి, నిత్తునిజముగాన్॥ (క) అనిన వి
ని వారుగౌరవ । మునగిరికెనయైనచాప, ముగ్గని సత్వం । బునసజ్యము,గా
వింపం జనిసామర్థ్యంబులేక,చనిరటులజ్జన్ ॥ (ఆ,వె) అంతఁగొంతకాల,మ
రిగినపిమ్మట । నీమహామహుండు, రాముఁడనుజ । గాధిపుత్రయుతము,గామి
థిలేశు యాగంబుఁజూడ వచ్చెఁ, గౌతుకమున ॥ (క) ఘనుఁ డావిశ్వామి
త్రుఁడు । జనకమహీవిభునిచేత, సత్కృతుఁడై య । య్యనఘునినుతించికుతు
కం । బుననిట్లనిపలికె వాక్స,మున్నతిమెఱయన్ ॥ (ఉ) వీరలు రామలక్ష్మణు
లు,వీరలు పఙ్క్తిరథాత్మజుల్మహా । శూరులు చంద్రమౌళివిలుఁ, జూడఁగ వచ్చి
నవారు దానిసాం । పారఁగఁజూపుమా యనిన,నాజననాథుఁడు తత్క్షణంబత ।
ద్భూరి శరాసనంబును స,ముద్ధతిఁ దేరఁగఁబంచెవేడుకన్ ॥ (వ) ఇవ్విధఁబు
న నమ్మహనీయకార్ముకంబుఁ దెప్పించి రామునకుంజూపిన నమ్మహాను భావుం

డు ॥ (క) గుణమెక్కు పెట్టి గ్రక్కునఁ । ద్రుణముగ తిబలంబు కోలఁదిఁ, దెగఁదీ
సిన భీ । షణరవము దిశలు నిండఁగ । క్షణమాత్రములోన శంభు, చాపము విఱి
గెన్ ॥ (వ) అంత సత్యాభిసంధి యగు మజ్జనకుం డనుత్తమంబైన జలభాజ
నంబు గైకొని రామునకు నన్నొసంగ నిశ్చయించిన నప్పురుష శార్దూలుం
డు తనతండ్రి యగు దశరథుని యభిప్రాయంబు దెలియక పెండ్లియాడుట
యుక్తంబు గాదని నన్నుఁ బరిగ్రహింప కుండె ॥ (ఆ,వె) అంత సత్యవాది,
యైన మజ్జనకుండు । రాఘవునకు నన్ను, రమణ నొసఁగఁ । దలఁచి స
త్వరముగ, దశరథు రావించి । మంచిలగ్న మేర్ప, రించి తమిని ॥ (క) మం
గళతూర్య రవంబులు । సంగతి గా మ్రోయుచుండ, జనకమహీశుం । డం
గముసమ్మదమునను । ప్పొంగఁగ రామునకు నన్నుఁ బోలుపుగనిచ్చెన్ ॥ (క)
నాయనుజనూర్మిళను బ । ద్మాయత లోచననొసంగె, నజ్జనకుఁడు భ । ద్రా
యతమూర్తికి సుజనవి । ధేయునకీ లక్ష్మణునకుఁ దేజం బెసఁగన్ ॥ (వ)
తల్లీ యిది మదీయ పరిణయ వృత్తాంతంబు తెల్లంబుగా వినిపించితి ననిసీతాదే
వి విన్నవించిన నయ్యనసూయ వ్యక్తాక్షర పదంబును జిత్రంబును మధురంబున
గు తదీయభాషితంబు విని పరమసంతోషిత స్వాంతయై సీతం గౌఁగలించుకొని శి
రంబు మూర్కొని చెక్కిలి ముద్దుగొని మందమధురాలాపంబుల నిట్లనియె ॥ (క)
కాంతా నీపరిణయవృ । త్తాంతం బంతయును నాకుఁ, దత్పరమతిచే నెంతయుఁ దె
ల్పితిగావున । స్వాంతమునకభూతపూర్వ, సమ్మదమొదవెన్ ॥ (క) సూరుండు గ్రుం
కెదినమా । హారార్థము దిరిగి తిరిగి, యస్తమయమునన్ । భూరుహములని
ద్రార్థము । చేరి విహంగములు రుతముఁ, జేసెదునింతే ॥ (క) సలిలాప్లుతవ
ల్కలులై । కలశోద్యతులై పవిత్ర, గతినభిషేకా । ర్ద్రవసచ్ఛరీరులై ముని ।
లల రుచు నున్నారు కంటె, యంగన యిచటన్ ॥ (తే,గీ) సీత చూచితె తాప
సు, లేయుహోమ । కార్యములనుజ్జ్వలితములై, గాలువహ్ను । లందు వా
తసముత్థిత, మై కపోత । గాత్రరక్త ధూమంబు వి, కాస మొందె ॥ (మ) ముకు
ళించెం దరుపర్ణపఙ్క్తులు ఘనీ, భూతంబు లయ్యె న్వనుల్ । వికసించెన్ గ్ర
హతారక ద్దెసల నుర్విం జీకటు ల్పర్వెఁద । ప్పక రాత్రించరసత్త్వము ల్దిరి
గెడిన్, న్యాభస్వన్మృగశ్రేణికో౦ । చక యుష్యద్గతిఁ దీర్ఘసేవ కరిగెం, జంద్రుం
డుదోఁచెన్ దివిన్ ॥ (ఆ, వె) గగనలక్ష్మి మేనఁ, గపురంపు మెత్తిన । కరణిఁ



బర్వెఁ జంద్రికాచయంబు । రాత్రియయ్యె నింక, రాముని సేవింపఁ । జనుము ధ
ర్మమిదియ సతులకబల ॥ (చ) వదలక మంజులోక్తుల వివాహకథన్వినిపిం
చి నీవు నా । మదికి ముదంబొసంగితివి మానక యింక మదర్పితస్ఫుర । న్మృదు
వసనాంగరాగములు మేనధరించి సతీవిశేష స । మ్మదమొనగూర్పు మీవనిన,
మైథిలి తద్దయు సంతసంబునన్ ॥ (క) అనసూయాదత్తములగు । ఘనపట
భూషాదికములఁ గైసేసినయం । బునమ్రొక్కి జనకనందని । చనియెం గడుఁ బ్రీ
తి రామచంద్రుని కడకున్ ॥ (వ) ఇట్లు మానుష లసదలంకారాలంకృతయై శ్రీ
రాముని యొద్దకుం జనుదెంచి తనకమ్ముని పత్ని యొసంగిన వరాభరణ వస్త్రమా
ల్యాంగ రాగ రూపకంబైన ప్రీతిదానంబు సర్వంబును విన్నవించిన నా రఘువ
ల్లభుండు లక్ష్మణసహితంబుగా సంతసించి యనసూయా ప్రభావంబు బహువా
రంబులు కైవారంబులు సేయుచు సిద్ధులగు తాపసులచేత నర్చితుండై యారాత్రి
దదాశ్రమంబున నివసించి ప్రభాతకాలంబున మేల్కని పుణ్యతీర్థ జలావగాహనం

(*) శ్రీరాముఁడు మునుల యనుమతంబున దండకారణ్యంబు ప్రవేశించుట (*)

బుఁ జేసి యాహ్నికంబుఁ దీర్చి కృతాగ్ని హోత్రులగు మునులకుం జెప్పి గమ
నోన్ముఖుండైన నవ్వీరోత్తముని విలోకించి ధర్మాత్ములగు తాపసు లిట్లనిరి ॥
(మ) అనఘా యీ విపినంబునందసురు లు[illegible]గ్రాకారు లుద్యన్మదం । బున నానాకృ
తులన్ జరింతురనిశం బున్మానిమాంసాదులై । యనుమానింపక వారి నెల్లబలమేపా
రంగ వారించి యీ । మ్మునిమార్గంబున నేగు మచ్చటఫలంబుల్మూలముల్గల్గెడిన్ ॥
(వ) అనిపలికి దీవించి సముచితంబుగా వీడ్కొల్పిన నారఘుశార్దూలుండు
పూర్వోక్తమార్గోపదేశ ప్రకారంబునఁ గృతాంజలులగు మునులచేతఁ గృత
మంగళాశీర్వాదుండై సూర్యుండు మహాభ్రపటలంబుం బోలె సీతా లక్ష్మణస
హితంబుగా మహారణ్యంబుఁ బ్రవేశించెనని వ్యక్తాక్షరపదంబుగా నయోధ్యా
కాండ కథయంతయు వినిపించిన నారాముండు భ్రాతృసహితుండై యటమీఁ
ది కథావృత్తాంతంబు వినిపింపుడని యడుగుటయును ॥

( చక్రబంధము. )

చ ॥ ధరణిప శ్రీవరాకనక దామయదుప్రవరామనోజ్ఞకం । ధరహరిమా
ధవా సకల దానవభక్షక వైనతేయసుం । దరరథ దేవముక్తిఫలదాన రమిత్రక
హీరహారమం । దరధరనాథ మంజుశయ దానధురీణ విధాత్రు వందితా ॥ (క) బృం

దారకనుతినతజన । మందారదురంతయోగమాయాశ్రయసం । క్రందనవందిత పరమా । నందాత్మక యోగిరాజ,నందతనూజా ॥

(స్వాగతవృత్తము)

రాజరాజనుత, రాజనిభాస్యా । భోజరాజకుల, పుణ్యచరిత్రా । రాజమండలవి, రాజితకీర్తీ । భ్రాజమానశత, భాస్కరతేజా ॥

(గద్యము)

ఇతిశ్రీరామచంద్రచరణారవింద మరందరసాస్వాదనతుందిలేందిందిరాయమా
న మానసకులపవిత్ర కౌండిన్యసగోత్ర పద్మనాభసూరిపుత్ర విద్యాసాంద్ర
వేంకటకవీంద్రప్రణీతంబైన శ్రీమద్రామాయణం బను నాదికావ్యంబు
నందు రామగుణానుకీర్తనంబు నభిషేక సమారంభంబును మం
థరాదుర్మంత్రంబును గైకేయీదుష్టభావత్వంబునభిషేకవిఘా
తంబును గౌసల్యాపరిదేవనంబును రామవనవాసగమనంబును
బ్రకృతిజనవిషాదంబును బ్రకృతిజన విసర్జనంబును గుహసం
వాదంబును సుమంత్రోపావర్తనంబును గంగానదీతరణం
బును భరద్వాజదర్శనంబునుజిత్రకూటప్రవేశంబునుబర్ణ
శాలావస్థానంబునుదశరథుశోకవిలాపంబునుదశరథు
నిపరలోకగమనంబును భరత సమాగమనంబును
రాజధర్మోపదేశంబును రామప్రసాదంబును దశర
థునకు సలిలప్రదానంబును పాదుకాభిషేకంబు
ను భరతోపావర్తనంబును నందిగ్రామనివా
సంబును పాదుకా స్థాపనంబు నను కథ
లుంగలయయోధ్యాకాండము
సంపూర్ణము.



శా॥ ఈకావ్యప్రతిపాదితుం డయినసీతేశుండు రామప్రభుం ।
డీకల్యాణకృతీశ్వరుండయిన శ్రీకృష్ణుండుసంప్రీతితో,
సాకల్యంబుగ నిష్టసిద్ధికరులై చంచత్కృపాపూ
ర్ణులై । లోకస్తుత్య కుమారయాచ
ధరణీం ద్రుంబ్రోతు
రెల్లప్పుడున్॥

—(*)—

మంగళమస్తు.



శ్రీ ర స్తు.

శ్రీగణేశాయనమః.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీమద్రామాయణము * అరణ్యకాండము.

శ్రీమానినీమనోహర । సోమాన్వయజలధిపూర్ణ, సోమజితారి । స్తోమ సమిద్ధ్భమ మహో । ధామసుగుణజాలశ్రీమదనగోపాలా॥ (వ) దేవా యవధరింపుము రాజనందనులగు కుశలవు లవ్వాలి కథయిట్లని చదువందొడంగి రియివ్విధంబున ధృతిమంతుండును దుర్ధర్షుండునగు రాముండు మహారణ్యంబగు దండకారణ్యంబుఁ బ్రవేశించి తాపసాశ్రమమండలంబు విలోకించె నది మఱియును॥ (క) శ్రుతికాంతి సమావృతమై । యతులితకుశచీయురక్తమైన

## (*)శ్రీరాముఁడు ఋష్యాశ్రమములకుఁ బోవుట.(*)

భమునను । న్నతివెలయు తపనమండల । గతినతి దుర్దర్శమగుచుఁ, గ్రాలుచునుండెన్॥ (తే,గీ) సర్వభూతశరణ్యంబు, సకలవన్య । మృగకదంబ జుష్టంబును, ఖగనిషేవి । తంబుసతత సమ్మృష్టాంగ, ణంబునగుచు । నతివిచిత్రమంబున, నలరుచుండు ॥ (సీ) చెలువొప్పనప్సర, స్త్రీ నటనంబులు పావకశాలలు, వరసమిత్తుక్ । శౌజినసుశ్రుక్స్రువా, ద్యనుపమయాగోపకరణంబులుసుగంధి, ఘనసుమములు । ఫలమూలములు పూర్ణ, జలకలశంబులు స్వాదుఫలోపేత, పాదపములు । వన్యపుష్పంబులు, పద్మోత్పల వినిర్మలాంబు యుతజలాశ, యములుగలిగి ॥ (తే,గీ) పుణ్యమై వేదఘోష సం, పూర్ణమైస । మగ్ర బలిహోమపూజితం, బైనితాంత । హోమమంత్రవినాదిత, మైమనోజ్ఞ । జలజభవమందిరము భంగి, నలరుచుండు ॥ (మ) అనఘుల్పుణ్యులు బ్రహ్మకల్పులు ఫలాహారుల్తపోలబ్ధని । త్యనితాంతద్యుతు లర్కపావక నిభుల్దాంతుల్పురాణుల్జటా । జినధారుల్ ద్రుమచీరయుక్తులు తపస్సిద్ధుల్పరబ్రహ్మత । త్త్వనిబద్ధాత్ములు తాపసుల్గలిగి నిత్యశ్రీలనొప్పున్ రహిన్ ॥ (వ) అట్టితాపసాశ్రమ సమూహంబుఁ బ్రవేశించి శ్రీమంతుండగు రాముండు తపోవనవర్తిమ్మ

గపక్షిత్రాస నివృత్తికొఱకుఁ జాపంబు నవరోపితగుణంబుఁ గావించినిజ తేజం
బున నమ్మహారణ్యంబు వెలుంగంజేయుచు మందాంచితగమనంబునంజనుచుండ
నప్పుడు ధర్మచారులును దివ్యజ్ఞానోపసంపన్నులు నైనయచ్చటి మహ
లు రామలక్ష్మణులను యశస్వినియగు వైదేహి నవలోకించి ప్రీతిసంహృ
ష్టాంగులై వారలకభిముఖంబుగా నరిగి సంపూర్ణచంద్రుండునుంబోలె

(*)తాపసులు పరమానందంబున సీతారామలక్ష్మణుల నెదుర్కొనుట.(*)

లజనానందకరుండైన రామచంద్రునిఁ గన్నులారం గనుంగొని మంగళాశీర్వా
దంబులు గావింపుచు స్వేష్టదేవతాత్వంబున స్వీకరించి తదీయరూపవిశేషంబు
ను సర్వావయవసుశ్లిష్ట సంధిబంధంబును లావణ్యంబును సౌకుమార్యంబును స
ముచితశృంగారసంపన్నత్వంబును విలోకించి విస్మితాకారులైరి యచ్చటిపశుప
క్షిమృగాది తిర్యగ్జంతువులు వైదేహీ లక్ష్మణసహితుండైన రాముని వలోకించి
పద్మభవాదుల కగోచరుండగు భగవంతుండు పంగూపరిగంగాప్రవాహంబుక
రణి మనముంగలఁ బ్రాదుర్భవించె నని జగన్మోహన దివ్యమంగళ విగ్రహద
ర్శనానంద విచ్ఛేద భయంబున నిమేషరహితంబులైన నేత్రంబులచేతఁ బర
మాశ్చర్యవంతంబులై విలోకింపుచుండె నప్పుడమ్మహర్షులు సర్వభూతహిత
రతుండైన రామునిఁ బ్రియాతిథినింబలెఁ బర్ణశాలకుం దోడ్కొనిచనినివా
సస్థానంబు నివేదించి పరమపురుషుండ వైన నీసందర్శనంబున నేము ధన్యుల
మైతిమని ప్రియవచనంబుల సత్కరించి సలిలాది పూజాద్రవ్యంబుఁ గొని తె
చ్చి సలక్ష్మణుండైన రాముని విధ్యుక్తప్రకారంబునం బూజించి వన్యంబులైన
పుష్పంబులర్పించి యీవస్తువులన్ని భవదీయంబు లని పలికి రాముండు పర
మపురుషుండైన నారాయణుండను నిశ్చయబుద్ధిచేత సముద్భూతభక్తిరసం
బున బద్ధాంజలులై యిట్లనిరి ॥ (సీ) అనఘాత్మ నీవు మా,కందఱకును శర

(*) ఋషులు రాముని నానావిధంబుల స్తుతించుట. (*)

ణ్యుండవు భూరియ,శుండ వఖిల । వర్ణాశ్రమాచార, నిర్ణయవిదుఁడవుఖ
లజననిగ్రహ,కరణవాది । నారాయణుని యవ,తారరూపంబున గురుఁడవుస
కలార్థ,కోవిదుఁడవు । పూజనీయుండవు, రాజరూపంబున మాన్యుఁడవార్య
స,మ్మతుఁడవైతి ॥ (తే,గీ) పుడమినిం ద్రచతుర్థాంశ, భూతుఁడైన । రా
జుమునుకొని ప్రజలధ,ర్మంబుదప్ప । కుండరక్షించుఁగావున,నొప్పుమీఱ । న



ఖిలలోక నమస్కృతుం,డై వెలుంగు ॥ (తే,గీ) విపులవిక్రమసామాన్య, నృ
పునకిట్టి । మహిమ గలుగుచునుండ న,మస్తలోక । పాలనార్థంబు పుట్టిన,
పరమపురుష । నామునకు నీకుఁ గల్గుట,కేమియరిది ॥ (వ) దేవానీవువనం
బుననున్న నగరంబుననున్న మాకధినాథుండవు గావున భవదేక శరణులమైన
యేము నీచేత ననంతకల్యాణగుణైకనిలయజగన్మోహన దివ్యమంగళభవదీయ
మూర్తిధ్యానానందానుభవాంతరాయరూపరాక్షస నివారణ పూర్వకంబు
గా రక్షింపందగదు మితరరాజులు బుద్ధిబలంబున స్వరాజ్యమాత్రరక్షణంబునం
దు శక్తులగుదురు సకలలోక రక్షణధురంధరాసహాయశూరుండవైన నీకు న
గరవాసంబునందేమి బలవృద్ధియు స్వాభావిక నిత్యనిరతిశయ జ్ఞానశక్తిసంప
న్నుండవైన నీకు వనవాసంబునందేమి బలహానియుఁగలుగు నేము నీయందు
విన్యస్తసకలరాక్షస శిక్షాభారులమై పరిత్యక్త శాపాది సాధనులమై జితక్రో
ధులమై జితేంద్రియులమై తపోధనులమై యున్నవారము మమ్ముఁదల్లిగర్భం
బునుంబోలె నతిప్రయత్నంబునరక్షింపుమని పలికి ఫలమూల పుష్ప నీవారగ
ర్భాదులచేతసలక్ష్మణుండైరాముని౦బూజించిమంగళస్తుతివచనంబుల నభినందిం
చిసకలజగత్స్వామియగుటవలన యథావిధిఁ దృప్తినొందించిరి యిట్లమ్మహాత్ముం
డు తాపసులచేతఁ గృతాతిథ్యుండై యిష్టకథా వినోదంబుల నారాత్రి యచ్చటవ
సించి మఱునాఁడరుణోదయంబునఁ గాల్యకరణీయంబులుఁదీర్చిసాదరంబుగా న

(*)రామునకు విరాధుండు గనుపడుట.(*)

మ్మునిపుంగవులచేతనామంత్రణంబువడసి సీతాలక్ష్మణసహితుండై ॥ (శా) నానా
ఘోరమృగప్రకాండయుతము న్నానాఖగవ్రాతము । న్నానాధ్వస్తలతాంత
కుంజమునునా నాజంతునిశ్శబ్దము । న్నానాగాధజలాశయావృతమునానాక్రూ
రఝిల్లీగణ । ధ్వానంబైన యరణ్య మధ్యమునఁబో వంబోవఁగా నొక్కెడన్॥
(శా) ఘోరాకారుఁడుదీర్ఘజిహ్వుఁడుమహా క్రూరుండుశూరుండుగం । భీ
రాక్షుండుమహోదరుండువికటా భీలాస్యుఁడుగ్రస్వన । స్ఫారుండు న్విషముం
డురాక్షసుఁడుబీ భత్సుండుమాంసాసృగా । హారుండద్రినిభుండు మత్తుఁడువిరా
ధాఖ్యుండు దోఁచెనహిన్ ॥ (వ) మఱియు నన్నిశాచరుండు సింహత్రయం
బును వ్యాఘ్రచతుష్టయంబును వృకద్వయంబును బృషద్దశకంబును వసాది
గ్ధంబై విషాణసహితంబైనదాని నొక్కగజశిరంబును నిశాత శూలాగ్రంబు

దారకనుతనతజన । మందారదురంతయోగమాయాశ్రయసం । క్రందనవందిత
పరమా । నందాత్మక యోగిరాజ,నందతనూజా ॥

(స్వాగతవృత్తము)

రాజరాజనుత, రాజనిభాస్యాం । భోజరాజకుల, పుణ్యచరిత్రా । రా
జమండలవి, రాజితకీర్తీ । భ్రాజమానశత, భాస్కరతేజా ॥

(గద్యము)

ఇతిశ్రీరామచంద్రచరణారవింద మరందరసాస్వాదనతుందిలేందిందిరాయమా
న మానసకులపవిత్ర కౌండిన్యసగోత్ర పద్మనాభసూరిపుత్ర విద్యాసాంద్ర
వేంకటకవీంద్రప్రణీతంబైన శ్రీమద్రామాయణం బను నాదికావ్యంబు
నందు రామగుణానుకీర్తనంబు నభిషేక సమారంభంబును మం
థరాదుర్మంత్రంబును గైకేయీదుష్టభావత్వంబునభిషేకవిఘా
తంబును గౌసల్యాపరిదేవనంబును రామవనవాసగమనంబును
ప్రకృతిజనవిషాదంబును ప్రకృతిజన విసర్జనంబును గుహసం
వాదంబును సుమంత్రోపావర్తనంబును గంగానదీతరణం
బును భరద్వాజదర్శనంబునుచిత్రకూటప్రవేశంబునుబర్ణ
శాలావస్థానంబునుదశరథుశోకవిలాపంబునుదశరథు
నిపరలోకగమనంబును భరత సమాగమనంబును
రాజధర్మోపదేశంబును రామప్రసాదంబును దశర
థునకు సలిలప్రదానంబును పాదుకాభిషేకంబు
ను భరతోపావర్తనంబును నందిగ్రామనివా
సంబును పాదుకా స్థాపనంబు నను కథ
లుంగలయయోధ్యాకాండము
సంపూర్ణము.



శా॥ ఈకావ్యప్రతిపాదితుం డయినసీ తేశుండు రామప్రభుం ।
డీకల్యాణకృతీశ్వరుండయిన శ్రీకృష్ణుండు సంప్రీతితో ।
సాకల్యంబుగ నిష్టసిద్ధికరులై చంచత్కృపాపూ
ర్ణులై । లోకస్తుత్య కుమారయాచ
ధరణీం ద్రుం బ్రోతు
రెల్లప్పుడున్ ॥

—(*)—

మంగళమస్తు.



శ్రీ ర స్తు.

శ్రీగణేశాయనమః.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీమద్రామాయణము * అరణ్యకాండము.

శ్రీమానినీమనోహర । సోమాన్వయజలధిపూర్ణ, సోమజితారి । స్తో
మ సమిద్ధభీమ మహా । ధామసుగుణజాల శ్రీమదనగోపాలా॥ (వ) దేవాయ
వధరింపుము రాజనందనులగు కుశలవు లవ్వాలి కథయిట్లని చదువం దొడంగి
రియివ్విధంబున ధృతిమంతుండును దుర్ధర్షుండునగు రాముండు మహారణ్యాం
భగు దండకారణ్యంబుఁ బ్రవేశించి తాపసాశ్రమమండలంబు విలోకించె నది
...తెయును॥ (క) శ్రుతికాంతి సమావృతమై । యతులితకుశచీయురక్తమైన

## (*)శ్రీరాముఁడు ఋష్యాశ్రమములకుఁ బోవుట.(*)

భమునను । న్నతివెలయు తపనమండల । గతినతి దుర్దర్శమగుచుఁ, గ్రా
ఖమునుండెఁ॥ (తే,గీ) సర్వభూతశరణ్యంబు, సకలవన్య । మృగ కదంబ జు
ష్టంబును, ఖగనిషేవి । తంబుసతత సమ్మృష్టాంగ, ణంబునగుచు । నతివిచిత్ర
...మంబున, నలరుచుండు ॥ (సీ) చెలువొప్పనప్సర, స్త్రీ నటనంబులు పావక
...లలు, వరసమిత్కు । శాజినసుక్స్రువా, ద్యనుపమ యాగోపకరణంబులును
...గంధి, ఘనసుమములు । ఫలమూలములు పూర్ణ, జలకలశంబులు స్వాదు
...ఫలోపేత, పాదపములు । వన్యపుష్పంబులు, పద్మోత్పల వినిర్మలాంబు యు
...జలాశ, యములుగలిగి ॥ (తే,గీ) పుణ్యమై వేదఘోష సంపూర్ణమైస ।
...గ్ర బలిహోమపూజితం, బై నితాంత । హోమమంత్రవినాదిత, మైమనోజ్ఞ ।
జలజభవమందిరము భంగి, నలరుచుండు ॥ (మ) అనఘు ల్పుణ్యులు బ్రహ్మక
ల్పులు ఫలాహారుల్తపోలబ్ధని । త్యనితాంతద్యుతు లర్కపావక నిభుల్దాంతు
ల్పురాణుల్జటా । జినధారుల్ ద్రుమచీరయుక్తులు తపస్సిద్ధుల్పరబ్రహ్మత । త్వ
...బద్ధాత్ములు తాపసుల్గలిగి నిత్యశ్రీలనొప్పార రహిఁ ॥ (వ) అట్టితాపసా
...మ సమూహంబుఁ బ్రవేశించి శ్రీమంతుండగు రాముండు తపోవనవర్తిమ్ము

గపక్షిశ్రేణీ నివృత్తి గొఱయు జాపంబు నవరోపితగుణంబుఁ గావించి నిజతేజం
బున నమ్మహారణ్యంబు వెలుంగఁ జేయుచు మందాంచితగమనంబున జనుచుండె.
నప్పుడు ధర్మచారులును దివ్యజ్ఞానోపసంపన్నులు నైనయచ్చటి మహ
లు రామలక్ష్మణులను యశస్వినియగు వైదేహి నవలోకించి ప్రీతిసంభ్రా
న్తాంగులై వారలకభిముఖంబుగా నరిగి సంపూర్ణచంద్రుండునుంబోలె

(*)తాపసులు పరమానందంబున సీతారామలక్ష్మణుల నెదుర్కొనుట.(*)

లజనానందకరుండైన రామచంద్రునిఁ గన్నులారం గనుంగొని మంగళాశీర్వా
దంబులు గావింపుచు స్వేష్టదేవతాత్వంబున స్వీకరించి తదీయరూపవిశేషంబు
ను సర్వావయవసుశ్లిష్ట సంధిబంధంబును లావణ్యంబును సౌకుమార్యంబును సీ
ముచితశృంగారసంపన్నత్వంబును విలోకించి విస్మితాకారులైరి యచ్చటిపశుప
క్షిమృగాది తిర్యగ్జంతువులు వైదేహీ లక్ష్మణసహితుండైన రాముని నవలోకించి
పద్మభవాదుల కగోచరుండగు భగవంతుండు పంగూపరిగంగాప్రవాహంబుక
గణి మనముంగలఁ బ్రాదుర్భవించె నని జగన్మోహన దివ్యమంగళవిగ్రహద
ర్శనానంద విచ్ఛేద భయంబున నిమేషరహితంబులైన నేత్రంబులచేతఁ బర
మాశ్చర్యవంతంబులై విలోకింపుచుండె నప్పుడమ్మహర్షులు సర్వభూతహిత
రతుండైన రామునిఁ బ్రియాతిథినింబలెఁ బర్ణశాలకుం దోడ్కొనిచని నివా
సస్థానంబు నివేదించి పరమపురుషుండ వైన నీసందర్శనంబున నేము ధన్యుల
మైతిమని ప్రియవచనంబుల సత్కరించి సలిలాది పూజాద్రవ్యంబుఁ గొని తె
చ్చి సలక్ష్మణుండైన రాముని విధ్యుక్తప్రకారంబునం బూజించి వన్యంబులైన
పుష్పంబులర్పించి యీవస్తువులన్ని భవదీయంబు లని పలికి రాముండు పర
మపురుషుండైన నారాయణుండను నిశ్చయబుద్ధిచేత సముద్భూతభక్తిరసం
బున బద్ధాంజలులై యిట్లనిరి ॥ (సీ) అనఘాత్మ నీవు మా, కందఱకును శర

(*) ఋషులు రాముని నానావిధంబుల స్తుతించుట. (*)

ణ్యుండవు భూరియ,శుండ వఖిల। వర్ణాశ్రమాచార, నిర్ణయవిదుండవు ఖి
లజననిగ్రహా,కర్ణనవాది। నారాయణుని యవ,తారరూపంబున గురుండవు ప
కలార్థ,కోవిదుండవు। పూజనీయుండవు, రాజరూపంబున మాన్యుండ వార్య
సమ్మతుండ వైతి ॥ (తే,గీ) పుడమినిం ద్రవతుర్థాంశ, భూతుండైన। రా
జుమునుకొని ప్రజలధ,ర్మంబుదప్ప। కుండరక్షించుఁ గావున,నొప్పుమీఱ। వ



ఖిలలోక నమస్కృతుం,డై వెలుంగు ॥ (తే,గీ) విపులవిక్రమసామ,ర్థ్య, నృ
పునకిట్టి। మహిమ గలుగుచునుండ స,మస్తలోక। పాలనార్థంబు పుట్టిన,
పరమపురుష। నామునకు నీకుఁ గల్గుట,కేమియరిది ॥ (వ) దేవా నీవు వసం
బుననున్న నగరంబుననున్న మాకధినాథుండవు గావున భవదేకశరణులమైన
యేము నీచేత ననంతకల్యాణగుణైకనిలయ జగన్మోహన దివ్యమంగళ భవదీయ
మూర్తిధ్యానానందాను భవాంతరాయ రూపరాక్షస నివారణ పూర్వకంబు
గా రక్షింపందగదు మితరరాజులు బుద్ధిబలంబున స్వరాజ్యమాత్రరక్షణంబునం
దు శక్తులగుదురు సకలలోక రక్షణధురంధరా సహాయ శూరుండవైన నీకు న
గరవాసంబునం దేమి బలవృద్ధియు స్వాభావిక నిత్యనిరతిశయ జ్ఞానశక్తిసంప
న్నుండవైన నీకు వనవాసంబునం దేమి బలహానియుఁ గలుగు నేము నీయందు
విన్యస్తసకలరాక్షస శిక్షాభారులమై పరిత్యక్తశాపాది సాధనులమై జితక్రో
ధులమై జితేంద్రియులమై తపోధనులమై యున్నవారము మమ్ముఁ దల్లిగర్భం
బునుంబోలె నతిప్రయత్నంబున రక్షింపుమని పలికి ఫలమూల పుష్ప నీవారగ
ర్భాదులచేత సలక్ష్మణుండై రామునిం బూజించి మంగళస్తుతివచనంబుల నభినందిం
చి సకలజగత్స్వామియగుటవలన యథావిధిఁ దృప్తినొందించిరి యిట్లమ్మహాత్ముం
డు తాపసులచేతఁ గృతాతిథ్యుండై యిష్టకథా వినోదంబుల నారాత్రి యచ్చట వ
సించి మఱునాఁ డరుణోదయంబునఁ గాల్యకరణీయంబులుఁ దీర్చి సాదరంబుగా న

(*)రామునకు విరాధుండు గనుపడుట.(*)

మ్మునిపుంగవులచేత నామంత్రణంబు వడసి సీతాలక్ష్మణసహితుండై ॥ (శా) నానా
ఘోరమృగప్రకాండయుతము న్నానాఖగవ్రాతము। న్నానాధ్వస్తలతాంత
కుంజమును నానాజంతునిశ్శబ్దము। న్నానాగాధజలాశయావృతము నానాక్రూ
రఝిల్లీగణ। ధ్వానంబైన యరణ్యమధ్యమునఁ బోవం బోవఁగా నొక్కెడన్॥
(శా) ఘోరాకారుఁడు దీర్ఘజిహ్వుఁడు మహాక్రూరుండు శూరుండు గం। భీ
రాక్షుండు మహోదరుండు వికటాభీలాస్యుఁ డుగ్రస్వన। స్ఫారుండు న్విషముం
డు రాక్షసుఁడు బీభత్సుండు మాంసాసృగా। హారుండద్రినిభుండు మత్తుఁడు విరా
ధాఖ్యుండు దోఁచె నెదిర్న ॥ (వ) మఱియు నన్నిశాచరుండు సింహత్రయం
బును వ్యాఘ్రచతుష్టయంబును వృకద్వయంబును బృషద్దశకంబును వసాది
గ్ధంబై విషాణసహితంబైన దాని నొక్కగజశిరంబును నిశాతశూలాగ్రంబు

(*)విరాధుఁడు సీతనెత్తికొనుట.(*)

సంగ్రుచ్చికుని వసార్ద్రంబైన వ్యాఘ్రచర్మంబుగప్పికొని రుధిరోక్షితశరీరుం డై సర్వభూతభయంకరుండై బ్రహ్మాండంబు బ్రద్దలువాఱ నార్చుచు పాతాళసదృశంబైన వక్త్రంబువిచ్చికొని ప్రళయకాలంబునందు సంక్రుద్ధుండై యంతకుండెట్లు ప్రజలనుద్దేశించి పరువెత్తునట్లు మహీతలంబుకంపింప నతిశీఘ్రంబు నంబఱతెంచి వైదేహి నాక్రమించి కటిప్రదేశంబుననిడికొని ప్రళయకాలమేఘస్వనంబున రామలక్ష్మణుల నాక్షేపించుచు నిట్లనియె॥ (శా) మీరెవ్వారుజటాజినంబులిటునెమ్మిందాల్చియీదుష్ప్రవే। శారణ్యంబున సంచరించెదరుచాపాస్యంబకంబుల్మునుల్। ధీరత్వంబునఁ దాల్ప నేర్తురె భవ ద్వేషంబులం జూడఁగా। వేరైయున్నదిమానిదూషకులుమీ వృత్తంబుఁ దెల్పుండగుఱ్॥ (క) దారుణవనమిదిదుర్గం। బౌరూఢివిరాధుఁడనుమ హాసురవరుఁడ। న్వారక తాపసమాంసా। హారుఁడనై సంచరింతు ననిశంబిచటన్॥ (క) దురితాత్ములైన మీయి। ద్దఱశూలాగ్రమునఁదుసిమి తడయక రుధిరం। బఱలేక క్రోలి వెసనీ। గరితంగైకొందు భార్యఁగానిపుడుతగన్॥ (వ) అని పలుకుచున్న దురాత్ముండగు విరాధుని సగర్వంబైన దుష్టవాక్యంబు విని వైదేహి సంభ్రాంతచిత్తయై ప్రవాతంబునందుఁ గదలియుంబోలె భయశోకవేగంబున నాకంపించె నప్పు డారఘువల్లభుండు విరాధాంకగతయై భయంబున వడఁకుచున్న సీత నవలోకించి

—(*)రాముఁడు కైకేయీకృత్యమునుదలంచి దుఃఖించుట.(*)—

దీనవదనుండై లక్ష్మణునకిట్లనియె॥ (ఉ) భూరి సుఖార్హ పుణ్యముల ప్రోవుమనస్విని నిత్యమంగళా। చారవిదేహరాజసుత సర్వసతీమణిమత్పురం।ధియా। ధారుణిపుత్రి భీతిఁగొని దైన్యముమీఱఁగఁగంపితాంగియై। ఘోర నిశాటునంకమునఁ గుందుచునున్నదికంటెలక్ష్మణా॥ (తే, గీ) అకట కైకేయి మనకేదురంతదుఃఖ। మటువినోనగూర్చుటకునింత యాచరించె। నదిరయంబుననిపుడెసంప్రాప్తమయ్యెఁ। గాలముదురత్యయంబెంతఘనునకైన॥ (సీ) కేవలజడత నే దేవి సుతార్థంబు రాజ్యాభిషేకమాత్రమునఁ దనివి। సనక సమస్తభూతనివహంబునకనారతమునుమిక్కిలి హితుఁడనైన। యనుతమపిత్తునివినయసంకలితునిఁదనయు రాజ్యస్థిరత్వంబుకోఱకుఁ। దాపసుఁజేసిబాంధవులెల్లదుఃఖింపఁ గట్టిడితనమునఁగానకనిచె॥ (తే, గీ) నట్టిదుర్భ్యముజనయిత్రియైనకైక। సీతదను



జాఢమునిచేతఁజిక్కుచుండ। నేఁడు చాలసకామయై నెగడుఁగాదె। ముదితసంకల్పమెంతయు మోఘమయ్యె॥ (తే,గీ) అకటమనయయ్యదశరథుఁ డన్యలోక। గతికిఁబోవుటకంటెనఖండరాజ్య। హరణమునకంటెసీతయీ పరునిచేతఁ। జిక్కుటకుఁజాలమనమునఁజింతవొడమె॥ (వ) అనిపలికి కన్నీరునించిన నారఘుపుంగవునింజూచి లక్ష్మణుండు కైకేయినుద్దేశించి సంక్రుద్ధుండై మహా

——(*) లక్ష్మణుఁడు రాముని నూరార్చుట. (*)——

నాగంబుకరణి నూర్పులువుచ్చుచు నిట్లనియె॥ (ఆ,వె) సాధుచరిత నీవుసర్వభూతములకు। నాథుఁడవుసురేంద్రు నకుసముఁడవు। వినుతబాహువీర్యఘనుఁడవనాథుని। పగిదిఁబరితపింపనగునెయధిప॥ (ఉ) క్రచ్చఱఁజాపమెక్కిడియు ఖండశరంబులవీనిగుండియ। ల్వ్రచ్చెద నుత్తమాంగమటు వ్రయ్యలు చేసెదఁ గాలుప్రోలికి। న్బుచ్చెదఁగైకపట్టిపయిఁబుట్టినకిన్కకునీదురాత్ముపై। నొచ్చము లేక నేఁడువిని యోగమొనర్చెదనీవుమెచ్చఁగన్॥ (ఆ, వె) అధిపయీదురాత్ముఁ డస్మచ్ఛరాహతి। వజ్రివజ్రనిహతివ్రాలునగము। భంగిఁగూలుచుండఁబడపడి వీనిర। క్తంబునిప్పుడుపుడమిద్రావుఁగాక॥ (తే, గీ) అనుచు లక్ష్మణుఁడన్నతో నాడుచుండ। నవ్విరాధుఁడుభయదాట్టహాసమెసఁగ। వారి నీక్షించి మీరలెవ్వారలెచటి। కేగెదరుచెప్పుఁడనరాముఁ డిట్టులనియె॥ (ఆ, వె) క్షత్రియులము వృత్తసంపన్నులముమను। కులుల ముగ్రగహన గోచరులము। క్రూరులైన దైత్యవీరులదండింప। మీఱితిరుగుచున్నవారమిపుడు॥ (క) నీవెవ్వఁడవోంటిగనీ। దావంబుననేలతిరిగెదవు నీచరితం। బేవిధమునామ మెయ్యది। లావెంత యెఱుంగఁజెప్పురాపాపాత్మా॥ (క) అనవిని వాఁడిట్లనుమ। జ్జనకుఁడుజయుఁడ నెడువాఁడు సత్యారతుఁడుమ। జ్జననిశతహ్రాదనాపే। రనుపమ వైఖరి విరాధుఁ డండ్రుమనిశాటుల్॥ (క) ఘనతపమునమునువనజా। సనునకుఁ బ్రమదంబొనర్చి శస్త్రహతింజా। వనివరమునడసివిక్రమ। మునఁద్రిమ్మరుచున్నవాఁడ ముల్లోకములన్॥ (వ) మఱియు నవ్విరించివలనఁ బ్రాణవియోజనకారణ ఖండన విదారణార్హత్వంబు నొందినవాఁడ నాబారింబడి తొలంగి పోవుటకు నిలింపపతియైన సమర్థుండుగాఁడు మీకుఁబ్రాణంబుల దెస నాసగలదేని యివ్వేలంది నిచ్చటంబరిత్యజించి యథేచ్ఛఁజనుండని పలికిన నారామభద్రుండు రౌద్ర రసోల్లాసమూర్తియై నేత్రకోణంబులం దామ్రదీధితులు నిగుడ నవ్విరాధు న్నీ

క్షించి మేసుగంభీర భాషణంబుల నిట్లనియె॥ (తే,గీ) నీకుధిక్కారమొనరిం

—(*)రామలక్ష్మణులు విరాధునిపై నానావిధశరంబులు ప్రయోగించుట.(*)—

తునీచచరిత। తవిలిమిత్రినన్వేషించె దవునిజంబు। తలఁప నాజికి డాసితి నిలుపుమింక। జగతినాప్రమోాల బ్రతికిపోఁజాలవీవు॥ (క) అలవి యెఱుంగ కరజ్జులు। వలికిననది నీకుబంటుపంతమెనాతోఁ। గలసి పెనంగెదు నప్పుడు। దెలిసెదవు మదీయ బాణ తీవ్రస్ఫూర్తిన్॥ (క) అనిపలికి వైరిసంత్రా। సనముగు బాణాసనంబు చక్కఁగసజ్యం। బొనరించిని శితశరములు। దనుజునిపైగాడనేసెదారుణభంగిన్॥ (ఉ) అంతరఘూద్వహుండుపరిశ,యాంతకుఁకైవడిఁబేర్చి వింటన। త్యంతగుణప్రణాదమొుల, యం బుటుకాంచనపుంఖముగ్రస।ర్వాంతక వాతవేగమగు,నంబకసప్తక మేసె వాని మే।నంతయుఁజించి తీవ్రరుధి,రాప్లుతమై వెసభూమి గాడఁగన్॥ (ఉ) అంతటవాఁడు భూమిసుత, నక్కడ డించి మహోగ్రరూపక। ల్పాంతకుఁడో యనంగ భయ,దాకృతిఁగైకొనిఘోరభంగి గో। ధ్రోంతరమెల్లనిండ వడి,నార్చుచుశూలముఁగేలఁదాల్చి య। త్యంతరయంబునం గవిసె, నారఘువీరులమీఁది కుగ్రతన్॥ (వ) ఇట్లడరినంజూచి॥ (శా)జంటన్రాముఁడు లక్ష్మణుండు మది, నిశ్శంక ప్రణారంభులై। వింటన్ ఘంటలుమ్రోయ నిష్ఠుర రయా,విర్భూతవాతాహతి। న్మింట న్మబ్బులు విచ్చి పాఱ విశిఖా, నీకంబులన్వేఁకతోఁ।వెంటన్వెంటనిగుడ్చిరాదివిజవి,ద్వేష్యంగముల్దూలఁగన్॥

—(*)రాముడు విరాధునిశూలమునుఖడించుట.(*)—

(వ) యిట్లుఖండకోదండపాండిత్యంబుఁ జూపుటయునక్కాండంబులు తంతోపతండంబులై కాలవ్యాళంబుల కరణి నవ్విరాధునిమర్మంబులంగలంచిన నతండు వరదానబలంబున బలవృద్ధికోఁజకు హృదయంబునం బ్రాణంబులునిరోధించుకొని॥ (శా) విద్యుద్వల్లికభంగిఁ బ్రాలుచటుల,స్ఫీతోగ్రశూలంబువాఁ। డుద్యత్క్రూరతఁ బూన్చివే్రియనదిదు,ర్యోగంబునంన్మింటనూ। ర్యద్యుత్యాకృతి రాఁగఁజూచి కడిమినాయ్రిముందు సంక్రుద్ధుఁడై। సద్యోనాశము నొందఁజేసె దృఢచంచత్కాండయుగ్మాహతిన్॥ (చ) ఇటు రఘువీరబాణహతి, నెంతయుఁజూర్ణితమైన శూలమ। క్కుటిలనిశాటుచేవలనఁ, గూలెరయంబున భూతలంబునం। బటుతర దేవరాడ్భిదుర, పాతమున న్పొడిమైశిలాతలం। బటుకనకాద్రినుండి సరయాహతి వ్రాలిన చందమేర్పడన్॥(ఉ) క్రమ్మఱనమ్మహాభుజులు, కాలభుజంగము లట్లుగ్రాలుఖ। డ్గమ్ములఁబూన్చి వానినలుకం

—(*)విరాధుఁడు రామలక్ష్మణులఁ దనభుజంబుల నెత్తికొనిపోవుట.(*)—

బరిహరింపఁ గడంగు నంతలో। నమ్మనుజాశి బాహువుల, నారఘువీరులఁ జిక్కఁబట్టి శీ। ఘ్రమ్మునఁ గానలోని కలుకం జలుకం గొనిపోవఁజూచినన్॥ (ఉ) వాని తలంపెఱింగి రఘువర్యుఁడు లక్ష్మణుఁ జూచి పల్కునో।మానితబాహుశౌర్య విను,మామనలం గొని పోవఁజూచె నీ। దానవవీరుఁ డంతకును,దగ్రతఁజాలిన వాఁడు వీని। చేమానకచిక్కకుండ నస, మాన బలస్థితినూఁది యుండుమీ॥ (వ) మఱియు నీదురాత్ముండగు రాక్షసుండే తెరువునం బోవు నదియెమనకు మార్గంబు గావున నితండు మనల నెత్తుకొని మన మరుగం దలంచిన మార్గంబునం గాని తానరుగం దలంచిన మార్గంబునం గాని యేమార్గంబునం జనినను మనకదిసమ్మతంబై యుండు॥ (చ) అనుసమయంబున న్భుజబ,లాఢ్యుల రాఘవ వంశవర్యులం। బ్రణుతబలుండు వాఁడు పసి,బాలురయట్లనిజాంసభాగమం। దనువుగఁజిక్కఁబట్టి భయ,దాభ్రకటీదిక్కులఁబిక్కటిల్ల ధా। వనమున దారుణాటవిక,వార్యగతి న్వెసఁబోవుచుండఁగన్॥ (ఉ) ఆవిధమంతఁజూచి జన,కాత్మజతాల్మివహింపలేక శో। కావిలచిత్తయై సముది,తార్తరవంబున సర్వలోక సం। భావితుఁడీరఘూత్తముఁడ,మందపరాక్రమశాలి శేముషీ। సేవధి దుష్టదైత్యునకుఁ, జిక్కె సహోదర సంయుతంబుగన్॥ (క) ననుశార్దూలవృకాదులు। తనియఁగభక్షింపనేల,దశరథనృపనం। దనుల విడిపించినను గొని। మునుకొని చనుమసురనాథ,మ్రొక్కెదనీకున్॥ (క) అనియీాగతివిలపించిన। వినిరాముఁడులక్ష్మణుండు, వేగంబున న। ద్దనుజుని వధింపఁ దలకొని। యనుపమ నిశితాసి యుగ్మ,మంకించిరహిన్॥ (తే,గీ) బలిమిసౌమిత్రి వానిడా, పలికరంబు। నరికెరాముఁడువలపటికరమునరికె। భగ్నకరుఁడై విరాధుండు, పవివిలూన। ధారుణీధరంబుచందాన,ధరణిఁగూలె॥ (వ) ఇత్తెఱంగునంబడిన యన్నిశాచరునాక్రమించి యవక్రపరాక్రమంబున జానుకూర్పర ముష్టిఘాతంబుల మర్దింపుచు సారె సారెకు మీఁదికెత్తి శిలాతలంబుమీఁదం గూలవైచుచు ఖడ్గంబులనరుకుచు నిట్లనేకప్రకారంబులఁజిత్రవధక్రమంబాపాదించిన నవ్విరాధుండు నానావిధప్రహారణవిద్ధుం

డై పుడమిపయింబడియును సజీవితుండై యున్నవాని యవధ్యత్వంబు విలోకిం
చి నిజశ్రవణకీర్తనధ్యాననిష్ఠపురుషసకలభయాపహారియగు రాముండు ల
క్ష్మణున కిట్లనియె ॥ (తే,గీ) వరతపంబున దైత్యుఁడ,వధ్యుఁడయ్యె । శస్త్ర
హతి సంగరంబునఁ జంపఁగూడ । దనఘ వీని నిక్షేపింత, మవనిలోన । నను
చుఁ బలికిన నవ్వాక్య,మాలకించి ॥ (వ) విరాధుండిట్లనియె దేవా శక్రతుల్యబ
లుండనైన నీచేత నేను నిహతుండనైతి భవదీయ సచ్చిదానంద ఘటనజగన్మో

(*)విరాధుఁడు రామునితోఁ దనవృత్తాంతంబుఁ జెప్పుట.(*)

హనశ్రీమూర్తిసంస్పర్శభాగధేయంబు కంటె మున్ను నిరవధిక కరుణచేత
మదీయశాపవిమోచనార్థం బావిర్భూతుండవైన శ్రీరాముండవు నీవని య
జ్ఞానంబువలన నాచేత నజ్ఞాతుండవైతి వట్టి పరమేశ్వరుండవైన నీవిప్పుడు రా
మరూపంబున నవతీర్ణుండవైతివని నాచేత విదితుండవైతివి గావున ॥ (క) జన
సుత నిన్నుఁ గౌసల్యా । తనయునిఁ గా లక్ష్మణునిఁ బ్రతాపనిధి నినీ । యనుజన్మునిఁ
గా సీతను । జనకజఁగా నిప్పుడు తెలియఁ, జాలితిబుద్ధిన్ ॥ (క) అనఘా మున్నే
తుంబురుఁ । డనుగంధర్వుండఁ గిన్నరాధిపశాపం । బున నీ యసహ్యరాక్షస
తనువుం గైకొనినవాఁడ దారుణభంగిన్ ॥ (వ) ఇట్లు రంభాసక్తుండనైన యే
ను వైశ్రవణుని చేత నభిశప్తుండనై పదంపడి యమ్మహాత్మునిం బ్రార్థించిననతం
డు ప్రసన్నవదనుండై ॥ (ఉ) ఓరి దురాత్మ యెన్నఁడు రఘూత్తముఁ డుగ్రత నిన్నుఁ బ
ట్టిబలిన్ । దారుణసంగరంబున శితప్రదరాహతిఁ ద్రుంచునప్పుడీ । ఘోరనిశాట
రూపమది, గోల్పడి తొంటి మనోజ్ఞరూపమిం । పారఁగ నొందెదింకఁ జను,మం
చుఁ బ్రసాదమొసంగె నాకొగిన్ ॥ (వ) మహాత్ముండు కుబేరుండానతిచ్చినచందంబు
న నింతకాలంబునకు నీచేత నాకు శాపమోక్షణంబు సిద్ధించెఁ గృతార్థుండ నై
తి నింక స్వర్గంబునకుం జనియెద నిచ్చటికి సార్ధయోజనమాత్రంబు దవ్వుల
బ్రహ్మజ్ఞాననిబిడీకృతాంతరంగుండగు శరభంగుండను మునిపుంగవుండు వసియిం
చి యున్నవాఁ డమ్మహాత్మునిఁ గానం జనుమగ్గై నీకు స్వస్తి యయ్యెడు నన్న వటం

—(*)రామలక్ష్మణులు విరాధుని గుంటద్రవ్వి పూడ్చివేయుట. (*)—

బున నిక్షేపించి కుశలివై యరుగుము గతసత్వులైన రాక్షసులకిది సనాతనధ
ర్మంబు బిలనిక్షిప్తులగు రాక్షసులకు సనాతనంబులైనయుత్తమలోకంబులు స
న్నిహితంబులై యుండునని పలికి తత్క్షణంబ యవ్విరాధుండు బాణక్షతవేదన స



హింపంజాలక సన్న్యస్తదేహుండై దివంబునకుం జనుటకుద్యుక్తుండయ్యె నంత
రాముండు విరాధువచనంబు విని లక్ష్మణునవలోకించి వత్సా రౌద్రకర్ముండై
న యీరాక్షసునకుఁ గుంజరంబునకుం బోలె నివ్వనంబున నొక్క మహాగ
ర్తంబు ద్రవ్వుమని పలికి గర్తంబు ద్రవ్వునందాక విరాధుని కంఠంబుఁ బాదం
బునం ద్రొక్కి పట్టియుండె నంత లక్ష్మణుండు ఖనిత్రంబుఁ గొని విరాధుని పార్శ్వ
భాగంబున నొక్క బిలంబు ద్రవ్విన నా రఘుపుంగవుండు విరాధుని చరణపీడనం
బున శిథిలీకృతకంఠుం గావించి బిలప్రక్షేపంబు కొఱకు శస్త్రవధంబు నిషేధించి బిల
ప్రక్షేపవధంబు వానిచేత నివేదితుండై మిక్కిలి కార్యవిశారదుండు గావున వాని
యవధ్యత్వంబుఁ జూచి బిలనిక్షేపవధంబు కంటె నితరోపాయంబున విరాధునకు
మరణంబు లేదని నిశ్చయించి పరమేశ్వరుండైన రాముని చేత వధంబు సంప్రాప్తం
బయ్యె నతిధన్యుండనైతినని హర్షంబున నాదంబుఁ గావించు వాని సంగరనిర్జి
తుండగు వాని శంకుకర్ణుండగు వాని నవ్విరాధుని భుజబలంబునం బట్టి యెత్తి బిలం
బులోఁ బడవైచి శిలల చేత నమ్మహాబిలంబుఁ బూడ్చి మహాపరాక్రముండగు రా
ముండు లక్ష్మణసహితంబుగా వీతభయుండై పరమానందభరితాంతఃకరణుండై
చంద్రుండునుం బోలెఁ గళాసంపన్నుండై సూర్యుండునుం బోలెఁ బ్రతాపవంతుం
డై విరాధువలని భయంబునఁ బరితపించుచున్న జానకిం గౌఁగిలించుకొని మృ
దుమధురభాషణంబుల నాశ్వాసించి దీప్తతేజుండగు లక్ష్మణున కిట్లనియె ॥ (క)
అనఘా ఘోరవనం బిది । మనకిచ్చట నింక నొంటి మసలఁ దగదు గ్ర । క్కున శర
భంగమునీంద్రునిఁ । గనఁ బోవలెనను చుఁ బలికె గాఢప్రీతిన్ ॥ (తే,గీ) అతనియ
నుమతిఁ గొని రాముఁ డతిరయమున । భావితాత్ముఁడు దేవప్రభావయుతుఁడు ।
నై నశరభంగముని యాశ్రమాంతికంబుఁ । జేరఁ జని కాంచె నందువిచిత్రమొక
టి ॥ (వ) అది యెయ్యదియంటేని ॥ (సీ) తపనీయకేతనదండాగ్రపటవాత

(*) రాముండు దేవేంద్రుని విమానంబుఁ జూచుట. (*)

ఘాతంబు మబ్బులఁ గడలకొత్త । రణితఘంటాఘణంఘణనినాదము లెల్ల నవ్యక్తమ
ధురంబులై చెలంగ । మణిరథాంగసహస్రఘృణిపరంపరలు నభంబున నరుణాత
పంబు నించఁ । జంద్రమండలనిభస్వచ్ఛాతపత్రంబు పాండరాభ్రఖ్యాతిఁ బరిఢ
విల్ల ॥ (తే,గీ) హరితసత్తమవాజిసహస్రకంబు । మహితముక్తావళిప్రభామండి
తంబు । నిరుపమాననిచిత్రమణీశతాంగ । మల్లమొక్కటిఁ గనెనభోమండలము

న॥ (వ) మఱియునవ్విమానమధ్యంబున॥ (సీ) మౌళిఁజుట్టినదివ్యమాలికాసౌ
రభం బళికులంబునకుఁ బేరాసఁగొలుప । తెప్ప గ్రైవేయకచూచు దృక్సహస్రవి
భూతిసర్వతోముఖవిచక్షణతఁ దెలుప । నరుణకటాక్ష వీక్షారూఢి గొండఁలబిం
డిఁజేసిననాఁటిబిఱుసుఁజూప । వృత్రజంభకులఁజం పిననాటిశౌర్యంబు ఁజూరణు
ల్నుడవిజోహారుసేయఁ॥ (తే,గీ) దనకుసములైనదివిజులుతన్నుఁగొల్వ । నమ
రనారీకరాందోళితాచ్ఛదండ । చామరవ్యజనానిల చలితచూర్ణ । కుంతలుం
డైనయలశచీకాంతుఁగనియె ॥ (వ) అప్పు డయ్యింద్రుండురథావతరణంబుఁ
గావించి శరభంగునిపాలికిం జనుదెంచి మహీతలంబుసంస్పృశింపక కొండొ
కపొడవుననుండి యమ్మునిపుంగవునితోడ సంభాషణంబుఁ గావించి రామాగ
మనంబెఱింగి క్రమ్మఱ రథారూఢుండయ్యె నప్పుడారఘువల్లభుండు శరభంగు
నితోడసంభాషించి మఱల రథారూఢుండైన యింద్రునింజూచి తదీయదివ్య
రథంబు నంగుళినిర్దేశంబున లక్ష్మణునకుంజూపి యిట్లనియె॥ (క) సౌమిత్రి
కంటెదవ్వులఁ । గామగమైనట్టిదివ్యకాంచనరథము । నొవ్యోమంబునఁ గార్యాన
వ । ధామముక్రియభూరికాంతిఁ దనరెడుదానిన్ ॥ (క) అనఘా యీదివ్యర
థం । బునకుంబూన్చినతురంగ ములసొబగునురేం । ద్రునిహాయ ములకుంగల
దని । మునువింటిమిగానదివ్య ములెకాఁబోలున్ ॥ (వ) మఱియు నిమ్మహానీ
యరథంబుచుట్టునుం బరివేష్టించి ఖడ్గపాణులై విస్తీర్ణవిపులోరస్కులై పరి
ఘాయతబాహులై పద్మరాగసదృశవసనులై వ్యాఘ్రింబులుంబోలెదురాసదులై
పంచవింశతివార్షిక వయస్కులై జ్వలనార్కప్రతీకాశహార శోభితవక్షులై ప్రి
యదర్శనులై కుండలాలంకృత కపోలభాగులై ప్రకాశింపుచున్న వారు సుపర్వాలి
ప్పుడు యాదృగ్వయస్కులై చూపట్టుచున్న వారదియె వారలకునిత్యంబై యుం
డుననిపలికి వెండియునిట్లనియె॥ (ఉ) చందురువంటినెమ్మొగము చల్లనిచూపుల
మేటియెవ్వఁడో । యిందఱిలోననేండ్లిఱువ దేనును గల్గినప్రాయమొందిచె ।
లొప్పం దెడువానిచందమిటు నొకకమహాత్మముదామసించిచూ । డందగు
నంచుఁబల్కఁగనొడంబడెలక్ష్మణుఁడన్నమాటకున్॥ (తే,గీ) అంతశరభంగ
మునియాశ్రమాంతికమున । కేగుదెంచుచునున్న సీ, తేశుఁజూచి । శక్రుఁడ
మ్మునిచేననుజ్ఞాతుఁడగుచు । నింపుసొంపారమెల్లన, నిట్టులనియె ॥ (ఉ) వే
దుకతోడ రాముఁడతి, వేగమున న్నినుఁ జూడవచ్చుచు । న్నాఁడిట కమ్మహా



త్ముఁడుఘ,నంబగు కార్యమొనర్పఁబూని యు । న్నాఁడిఁకనీఁద నప్పనియొ,న
ర్చినవిమ్మటఁ గంటికింపుగాఁ । జూడఁగఁబోలు నాకిపుడు, చూచుట కార్య
ముగాదనిందితా ॥ (వ) మదభిభాషణంబునకంటె ముందఱ నీరామునిచేత
రావణవధరూపంబైన కర్మంబుకర్తవ్యం బనంతరంబనన్ను విలోకింపం గ
లండు రావణవధానంతరంబున విజయలక్ష్మీవిరాజమానుండై కృతదేవప్రయో
జనుండై యున్న యీమహాత్ముని విలోకించి కృతార్థుండనయ్యెద ॥ (క) అ
నిపలికి వజ్రధరుఁడ । మ్మునినామంత్రణముఁ జేసి, మునులనిమేషు । ల్దను సేవిం

—(*) సీతారామలక్ష్మణులు శరభంగమహర్షిని సందర్శించుట . (*)—

పఁగశీఘ్రం । బునదివ్యవిమానమెక్కి,పోయెందివికిన్ ॥ (తే,గీ) అంత రఘు
వంశనేతకృ,తాగ్నిహోత్రు । ననఘుశరభంగమౌని డా,యంగనేగి । యవని
జాలక్ష్మణోపేతుఁ,డైతదీయ । పాదపద్మంబులకుభక్తిఁ,బ్రణతిఁజేసి ॥ (తే,గీ)
అతనియనుమతి నొక్కద,ర్భాసనమునఁ । బరఁగగూర్చుండి తనకుఁగ,న్పడి
నపురుహు । చందమేర్పడ నడిగిన,సర్వమతని । కెఱుకపడఁజెప్పి వెండియు,ని
ట్టులనియె ॥ (వ) మహాత్మా యద్దివ్యపురుషుండు శక్రుండువరదుండై తపో
బలసముపార్జితంబైన బ్రహ్మలోకంబునకు బ్రహ్మచేత ననుజ్ఞాతుండై నన్నుం
దోడ్కొనిపోవుటకువచ్చినవాఁడేను దపోబలవిశేషంబునం ద్రైకాలికసకలజగ
ద్వృత్తాంతాభిజ్ఞుండఁ గావునఁ జిరకాలంబు మనోమార్గంబున వెతకంబడి
యిప్పుడు నాభాగ్యవశంబున బాహ్యంబునసమీపఁబునందు వర్తింపుచున్నప్రి
యాతిథివైననిన్ను సందర్శింపక నిత్యనిరతిశయనిర్మలానంద స్వరూపుండవు
భక్తమందారుండవైన భవదీయ సందర్శనానందంబు విడిచి బ్రహ్మలోకంబున
కుంబోవుట యుక్తంబుగాదని యున్న వాఁడ భక్తసంరక్షణధర్మశీలుండవుమ
హాత్ముండవు పరమపురుషుండవు నైన నీతోడ సమాగమంబుఁజేసి బ్రహ్మలో
కంబునకుం జనియెద నాచేత జయింపంబడి యక్షయంబులై బ్రహ్మలోక స్వ
ర్గలోకసంభవ భోగప్రదేశ విశేషంబులు సమృద్ధంబులై యున్నవి మామ
కంబులైనవానిం బ్రతిగ్రహింపుమని సర్వేశ్వరుండైన శ్రీరాముని యందు స
మర్పణాభిప్రాయంబునం బలికిన సర్వశాస్త్రవిశారదుండగు రాముండు ము
నీంద్రా యేనె సర్వలోకంబు లాహరింపుచున్నానని సమర్పితఫలస్వీకరణాభి
ప్రాయంబును క్షత్రియునకుఁ బ్రతిగ్రహానర్హత్వాభిప్రాయంబును దేటపడం

బలికి యిచ్చినంబున నాకు నివాసయోగ్యంబైన ప్రదేశంబానతిండనిన నమ్ముని పుంగవుండల్లని యిచ్చటికి సమీపంబున ధార్మికుండైన సుతీక్ష్ణుండను మునీంద్రుని యాశ్రమంబు గలదమ్మహాత్ముని గానంజను మతండు మీకు శ్రేయంబొనగూర్చు నిమ్మందాకినినది ననుసరించి పశ్చిమాభిముఖంగాఁజను మీయాపగపుష్పసల్లవోడుపంబులవహించి యుండునిది మార్గక్రమంబిక్కడ నొక్కముహూర్తంబునిల్చి యితండుకృతార్థుండగుఁగాకయని కరుణాకటాక్ష వీక్షణంబున నన్ను విలోకింపు మురగంబు జీర్ణంబైన చర్మంబునుం బోలె

—(*) శరభంగుఁ డగ్నిప్రవేశముఁ జేసి బ్రహ్మలోకమున కరుగుట. (*)—

సర్వావయవంబులు పరిత్యజించెద నని పలికి తత్క్షణంబ గార్హపత్యవహ్నిం బ్రణయించి మంత్ర పూర్వకంబుగా నాజ్య హోమంబుఁ గావించి మహాతేజుండగు శరభంగుం డప్పావక మధ్యంబునం బ్రవేశించిన నయ్యగ్నిదేవుం డామహర్షిముఖ్యుని రోమంబులును జీర్ణంబైనచర్మంబును సశోణితంబైనమాంసంబును శల్యంబులును దిగ్ధశిఖాపరంపరల దగ్ధంబులుగావించెనంత నారఘుపుంగవుండచ్చెరువడి సూచుచుండ నమ్మునిపుంగవుండుదివ్యదేహంబుధరియించి పంచవింశతి వత్సరవయస్కుండై యయ్యనలుని తేజంబుఁదస్కరించెనోయనం బొలుపొందు దివ్య తేజంబుఁదాల్చి యక్కుండంబువలననిర్గమించి దివ్యయానంబెక్కి స్వర్గలోకాది సర్వలోకంబులతిక్రమించి శాశ్వతంబైన బ్రహ్మలోకంబునకుంజని సానుచరుండగు పితామహుని సముచిత ప్రకారంబున సందర్శించి పరితుష్టుండైన యవ్విరించిచేత స్వాగతం బడుగంబడినవాఁడై యమ్మహనీయమూర్తిం గొల్చియుండె నిట్లు శరభంగుండు దివంబునకుంజనిన యనంతరంబ॥

—()వాలఖిల్యాదిమహర్షులు శ్రీరామునిం జూడవచ్చుట.()—

(సీ) అనుదినంబును ఫలాహారులై పెక్కేండ్లు తపమాచరించినధన్యమతులు। సలిలపానమొనర్చి శైవాలంబులై పెక్కేండ్లునిష్ఠసల్పినమహాత్ము। లతిజీర్ణపర్ణాశులై బహుకాలంబు వినుత సమాధిఁ గైకొనినతపసు। లొడలపుట్టలుగట్ట నిడుద కాలముగాడ్పు మెసవిశోషినిష్ఠ నెసఁగుమౌని॥ (ఆ,వె) వరులువాలఖిల్యవైఖానసాత్రేయ। భార్గవాది సకల పరమమునులు। దేవనుతులుదండకావనవాసులు। వరుస రాముఁజూడ వచ్చిరపుడు॥ (వ) మఱియు భగవత్పాదప్రక్షాళన జాత మహర్షులును బ్రతిదినంబు



ను జీవసాధనంబుసంపాదించి సర్వంబునకును వినియోగంబు సేయునట్టివారును జంద్రికాపాయులునుభక్షణార్థంబు ప్రియంగు ప్రముఖంబుల కర్మంబునందుఁ గుట్టనంబుఁ గావించునట్టివారును జీర్ణపర్ణాశనులును వ్రీహ్యాదికంబు దంతంబులచేత ఖండించి భక్షించునట్టి దంతోలూఖలురును గంఠదఘ్న జలంబునందు నిలువంబడి తపంబుఁగావించునట్టి యున్మజ్జకులును నసంవృతమేదినియందు శయనించునట్టి గాత్రశయ్యులును నొకానొకప్పుడైన శయనం బెఱుంగనియశయ్యులును వాతాతపవర్షంబులందు మిక్కిలి యనాస్తరణదేశంబునందుఁ దపంబుఁగావించునట్టి యభ్రావకాశులును వాయుధారణబలంబున గగనంబునందు విలీనులగునట్టి యాకాశ నిలయులును గుశౌద్యావృత భూతలంబునందు శయనించునట్టి స్థండిలశాయులును వ్రతోపవాస నిష్ఠులును నార్ద్రపటవాసులును సంతతాధ్యయననిష్ఠులును నిరంతర జపపరాయణులును బంచాగ్నిమధ్య సమాచరిత తపోవృత్తులును మొదలుగాఁగల మహర్షులందఱు బ్రహ్మతేజోనిష్ఠులై స్వప్రకాశపరబ్రహ్మంబు రఘువంశంబునం దవతీర్ణంబై యస్మద్భాగ్యవశంబున మనకు దృష్టిగోచరుండయ్యె నేఁడ స్మత్తపోదానాదికంబుఫలితంబయ్యెనని దర్శనానందంబునఁ గృతార్థులగుటకు నిర్ధనులు ధనలాభంబునొందినచందంబునఁ బరమానందనిర్భరులై నానాదేశంబులనుండిచనుదెంచి రక్షఃపీడితులైనతమ కనన్యగతికత్వంబును జగద్రక్షణార్థం బవతీర్ణుండైన రాముని సర్వలోకశరణ్యత్వంబును నిశ్చయించి స్వరక్షణంబుకొఱకు ద

—(*) మునులందఱు రాముని నభయంబుఁ గోరుట. (*)—

యోత్పాదకంబులగు వాక్యంబులనిట్లనిరి॥ (సీ) అనఘాత్మ వేల్పులకలశచీపతిపోలె యిక్ష్వాకుకులమునకీధరిత్రి। కధినాథుఁడవుమహారథుఁడవుయశమున విక్రమంబునజగద్విశ్రుతుఁడవు। పితృభక్తియునుసత్యవితరణంబులుసత్వ మధికధర్మంబునీయందయుండు। ధర్మవత్సలుఁడవుధర్మజ్ఞుఁడవుమహాత్ముఁడవైన నినుఁజేరిమునులమెల్లఁ॥ (తే,గీ) జాలనర్థిత్వబుద్ధివిజ్ఞాపనంబుఁ। జేసెదము మాప్రయత్నంబుచిత్తగించి। సాధుసంరక్షణంబుప్రశస్తధర్మ। మనితలంచి రక్షింపుమువినుతశీల॥ (వ) అని పరమార్థంబుగా విన్నవించి వెండియు లోకరీత్యనుసారంబున రాజధర్మంబు తేటపడనిట్లనిరి॥ (శా) పుష్టిన్సష్ఠపు పాలు పన్నుగొని యేభూభర్త దేశప్రజ। న్నెమ్మిన్ స్వాంతులఁ జేయఁ డానృపతి

యూహింపన్గతశ్రేయుఁడై । కష్టాత్ముండగుచుఁ దండ్రిభంగిఁ బ్రజసత్కారుణ్యుఁడై
బ్రోచువాఁడిష్టా వాప్తివహించు శాశ్వతయశంబేపారలోకంబునన్॥ (క) య
తచిత్తుఁడై సదావన । హితుఁడై భూప్రజలనధిపుఁడిష్టతనయజీ। వితముల కైవ
డిఁ బ్రోచిన । నతనికిఁ జిరకాలమబ్బు నాయువుయశమున్॥ (మ) అనఘా యెవ్వఁ
డు రాజధర్మవిహిత వ్యాపారధౌరేయుఁడై । యనుమానింపక ప్రోచునాతఁడు
తదీయంబైన పుణ్యాంబులో । ఘనతన్నాలవపాలుగైకొని సమగ్ర శ్రేయుఁడై సంత
తం । బునులోకేశ్వరలోకనిష్ఠసుఖతం బొల్పొందునిత్యోన్నతిన్॥ (వ) బ్రాహ్మ
ణభూయిష్ఠంబైన యీ వానప్రస్థగణంబు భవన్నాథంబయ్యు ననాథంబైన చం
దంబున మిక్కిలి రాక్షసులచేత వధియింపం బడుచున్నది భవదధీన చిత్తులమై
నిదిధ్యాసననిష్ఠులమై యున్న మచ్ఛరీరంబులు బహుప్రకారంబుల రాక్షస పీడి
తంబులై యున్నవి విలోకింపుము మహాత్మా పంపానదీ తీరంబునఁ జిత్రకూటప
ర్వతంబున మందాకినీనదీప్రాంత కాంతారంబులఁ జిరకాలంబుననుండి నివసిం
చియున్న పరమర్షుల దురవస్థకోలంది వెట్టనలవిగాదు బహు ప్రకారంబుల
భీమకర్ములగు రాక్షసులచేత క్రియమాణంబైన విప్రకారంబు సహింపంజా
లక సర్వలోకరక్షణ సమర్థుండవైన నిన్ను శరణంబునొందుటకుఁ జనుదెంచి
తిమి సర్వలోకంబుల యందు నీకంటె నైహికాముష్మికసాధన దేవతాంత
రంబెద్దియు లేదుగావున ననన్య శరణ్యులమైన మమ్ము రాక్షసబాధవలన విము
క్తులం జేసి కృపాళుండవై రక్షింపుమని బహుప్రకారంబుల దీనులై ప్రార్థింపు
చున్న యత్తపోధనుల వాక్యంబులాకర్ణించి ప్రసాదసుందర వదనారవిందుం

(*) రాముఁడు మునుల కభయంబొసంగుట. (*)

డై కౌసల్యానందనుండిట్లనియె॥ (ఉ) ఓజటివర్యులార వినుఁ డున్నతవైఖరిఁ గై
కతద్వర । వ్యాజమునన్నిశాచరుల నందఱఁ ద్రుంచిమిముం గృపాగుణ । భ్రా
జితశక్తిఁ గాచుటక రణ్యపదంబున కేగుదెంచితి । నాజితకీర్తినై నన్ను లాతిగఁ
జూచి పచింపఁజెల్లునే॥ (ఉ) మంచిది మీరు నన్ను బహుమానపురస్సరదృష్టిఁ జూ
చి ప్రా । ర్థించితిరట్లుగాన నిఁక దేవవిరోధుల బాహుశక్తిమ । దించెద నీవనం
బుకడుఁ బ్రీతిదలిర్ప నరాక్షసంబుగా । వించెద మీకు హర్ష మొదవించెద నిం
చెదఁ గీర్తి దిక్కులన్॥ (ఉ) చెచ్చెరఁ జాపమెక్కిడి ప్రసిద్ధశరంబుల రాక్షసా
వళిన్ । వచ్చిన వేళ నాదుశర బాధకునోర్వక దైత్యులాజిలోఁ । జచ్చిన వేళనా



దుబల సంపదలక్ష్మణు బాహువిక్రమం । బచ్చుపడంగఁ జూచి మది నచ్చెరువందెద
దరింత యేటికిన్॥ (వ) అనిపలికి సాదరంబుగాఁ దపోధనుల కభయదానంబొ
సంగి వారు తనవెంటం జనుదేర సీతాలక్ష్మణసహితుండై సుతీక్ష్ణమునీంద్రునా
శ్రమంబునకుం బోవ సమకట్టి యచ్చోటు వాసి కొండొకదూరంబరిగి యంత
నంత బహూదకంబులైన నదులు పెక్కుగడచి యొక్కచోట గగనోల్లిఖితశి
ఖరంబైన యొక్క శైలంబు పొడగని తత్ప్రాంతంబున బహుఫలపుష్పద్రుమశోభి
తంబైనయొక్క కాంతారంబుఁ బ్రవేశించి తన్మధ్యభాగంబునఁ జీరమాలాపరిష్కృ
తంబైనయొక్క మహనీయాశ్రమంబు నిరీక్షించి యందు శాశ్వతుండైన బ్రహ్మాచం
దంబున సుఖాసీనుండై మలపంకజటాధరుండై యున్న సుతీక్ష్ణుని సముచితంబుగా

—(*) శ్రీరాముఁడు సుతీక్ష్ణమహామునిని సందర్శించుట. (*)—

సందర్శించి తచ్చరణంబులకు వందనంబాచరించి వినయపూర్వకంబుగా నిట్లనియె॥
(క) అఘాత్మయేను దశరథ । తనయుఁడ రామాహ్వయుండఁ, దగ మిముఁ జూడం । జ
నుదెంచినాఁడ ననునె । మ్మనమునఁ గడు విశ్వసించి, మన్నింపఁదగున్॥ (చ) నావిని
మునినాథుఁడు సీ । తావల్లభుఁ జూచి కరుణ దళుకొత్తఁగ సం । భావించి యిట్టులని
యెను । బ్రావీణ్యము మెలర్ప మధుర భాషా ప్రౌఢిన్ ॥ (క) సురపతికెనయగు నీ
విపు । డరుదెంచుటకతన నిమ్మహావనము శుభో । త్కరమై పావనమై యుఱ ।
మరలేకిట నాథవత్త, మంబయ్యెఁ గదా ॥ (ఉ) రట్టడికైక చేతలను, రాజ్య
ముఁ గోల్పడి భూమిపుత్రితోఁ । బుట్టుట వెంట రాఁ దపసి, పూనికఁ గైకొని చిత్ర
కూటమ । న్నట్టుననున్నవాఁడ వనఁగావిని యెన్నఁడు చూతునంచుని । ప్పట్టున
నున్నవాఁడనన పాయకుతూహలముల్లసిల్లఁగన్ ॥ (వ) మహాత్మా యింతకుము
న్నిచటికి సురేంద్రుండు చనుదెంచి మీరాక యెఱింగించి చనియె నేను భవద్ద
ర్శనాకాంక్షినై దేహంబుఁ బరిత్యజించి దేవలోకంబునకుం బోవకున్న వాఁడఁ
దపోబలవిశేషంబునఁ బుణ్యలోకంబుల నన్నింటిని జయించితి దేవర్షిజుష్టం
బులైన తత్తల్లోకంబులందు జానకీలక్ష్మణసహితుండవై మత్ప్రసాదంబున విహ
రింపుమనిన నా రఘువల్లభుండు మునీంద్రా యేనును సమస్తలోకంబులాహరిం
చి యున్నవాఁడ నిక్కాననంబున నాకు వసియించుటకుం దగిన యాశ్రమం
బానతిమ్ము సర్వభూతహితుండవు మహాత్ముండవైన నీకుశలంబు గౌతముండై
న శరభంగుని చేత నాఖ్యాతంబయ్యెనని నవిని లోకవిశ్రుతుండైన యమ్మునిపుం

గవుండు పరమానంద భరితాంతఃకరణుండై మంజుభాషణంబుల నిట్లనియె ॥ (చ) అనుపమరమ్యమూలఫలమై సుకృతంబులకున్నివాసమై । మునులకు నాటపట్టయి సన్నుతి నొప్పెడు నీవనంబుని । కనఘ నివాసయోగ్యమగు, నైననువన్యమృగంబులెల్లెడ । న్బనివడినీతపంబునకు, భంగముసేయుచు నుండు నిచ్చటన్ ॥ (వ) మహాత్మా యివ్వనంబునకు మృగ సంఘంబులు చనుదెంచి యకుతోభయంబులై యథేష్టంబుగా సంచరించి నానా విచిత్ర వేషంబులఁ దపోభంగంబుఁ గావించి క్రమ్మఱం జనుచుండునిచ్చట మృగప్రలోభనరూప దోషంబుకంటె నన్యదోషంబేమియు లేదనిపలికిన వినిరామభద్రుం డమ్మునికిట్లనియె॥ (చ) ఇనకులతేజ యేనుధను, వెక్కుడి ఘోరమృగావళి న్మహా । శని నిభ శాతబాణములఁ, జంపితినేని తదర్థమందుని । మనమునకు న్విషాదమగు, మాకదిమిక్కిలి పీడసేయు ని । వ్వనమునదీర్ఘకాలముని,వాసమొనర్పఁగఁ జాలనెంతయున్ ॥ (వ) అనిపలికిరాముండు సీతా లక్ష్మణసహితుండై యమ్మునీంద్రునాశ్రమంబున నివాసంబుఁ గల్పించుకొని పశ్చిమ సంధ్య నుపాసించి మునిపతియొసంగిన తాపసభోజ్యంబైన యన్నంబు భుజించియతని చేత సత్కారంబువడసి మునులతోనిష్టకథా వినోదంబుల నారాత్రిపుచ్చి మఱునాఁడరుణోదయంబున సీతాసహితంబుగాఁ బద్మకైరవ సౌరభోల్లసితంబైన శీతసలిలంబున మజ్జనంబుఁ గావించియగ్నిదేవునారాధించి మహర్షులసత్క-

*రాముఁడుసుతీక్ష్ణమహర్షియమునులయాశ్రమంబులఁజూడననుజ్ఞనడుగుట.*

రించి సుతీక్ష్ణమునీంద్రునకు వందనంబుఁగావించి వినయవాక్యంబుల నిట్లనియె॥ (ఉ) ఓమునివర్య నేఁడు సుఖముంటిమి నీకడనీతపోధన । గ్రామణులొక్కరీతినన్నురమ్మని పిల్చుచున్న వారలెం । తోముదమొప్పవారిఁ బరితుష్టులఁజేయుటమేలుగాననా । నామహనీయతాపస వనంబులు గన్గొనఁబోయి వచ్చెదన్॥ (చ) అనఘచరిత్రదుర్నయసమాగత సంపదనొందినట్టిదు । ర్జనుఁడగు రాజుభంగి నవిషహ్యఘునాతపుఁడైనయాత్రయీ । తనుఁడునభంబునం గడుఁ బ్రతాపము నొందక మున్నె లక్ష్మణు । న్జనకజఁగూడి తాపసవనంబులకుంజనువాఁడనెంతయున్ ॥ (క) అనిపలికిసుమిత్రానం । దనసీతాసహితుఁడగుచుఁ దత్పదములకు । న్వినతి యొనరింప నతఁడ । క్కునఁ జేర్చిముదంబెలర్ప గురుమతినిట్లనియెన్ ॥ (ఉ) తమ్మునిఁగూడినీవు నుపథంబున నేగుము భూమిపు



త్రియం । దమ్మునవెంట రాఁగ విపినంబున నున్కియొనర్చి యున్నపు । ణ్యాత్ములప్రోవులైనముని నాథులరమ్యత రాశ్రమప్రదే । శమ్ములు వేడ్కతోడ నరుసం దగఁగన్గొనిరమ్మురాఘవా ॥ (వ) మఱియు ఫుల్లపంకజమండిత ప్రసన్నసలిలయుత హంసకారండవాకీర్ణంబులగు సరోవరతటాకంబులు గలిగి దృష్టిరమ్యంబులగు గిరిప్రస్రవణంబులచేత నావృతంబులై పరస్పరవైరవిరహితప్రశాంతమృగపక్షిగణంబులై మయూరాభిరుతంబులై యొప్పు రమణీయారణ్యంబులు విలోకింపుచు దండకారణ్యనివాసులగుమహర్షులచేత సత్కృతుండవై క్రమ్మఱ మదీయాశ్రమంబునకుంజనుదెమ్మని పలికిన నట్లకాక యని రాముండు లక్ష్మణ సహితంబుగా నమ్మహర్షిచరణంబులకుఁ బ్రణామంబుఁగావించి యపాంసులా శిరోమణియగు వైదేహియొసంగిన శుభతరతూణీరంబులు దీర్ఘంబులగుచాపంబులును గనకత్సరుఖడ్గంబులును దమ్ముండునుం దానును సముచితంబుగాధరించి నిజదేహప్రభాపటలం బక్కాంతారంబునకు గారుత్మతచ్ఛాయ సంపాదింప శీఘ్రంబునఁ బ్రయాణంబున కభిముఖులై రాసమయంబునఁ దదీయసహధర్మచారిణియు నిత్యానపాయినియు దివ్యమంగళస్వరూపిణియు నగుసీతాదేవి నిజభర్తనవలోకించి హృద్యంబగు స్నిగ్ధవాక్యంబునని

(*)సీతరామునిసత్యసంధత్వ పరదారపరాఙ్ముఖత్వాదులనభినుతించుట.(*)

ట్లనియె ॥ (సీ) ప్రాణేశ శాస్త్రోక్త,భంగినేయుత్కృష్టధర్మమీమునికులో,త్తమునిచేతఁ । దప్పకప్రాప్తించెఁదద్ధర్మమీలోక మందుఁగామోద్భవం బైనయట్టి । వ్యసనంబువలనఁ జయ్యననివృత్తుఁడవైన నీచేతనిత్యంబు, నేర్పవలన । నాచరింపఁగశక్య, మైయుండుమిథ్యాభివాదంబు పరసతీ,వర్తనంబు ॥ (తే,గీ) ధాత్రివైరంబులేనిరౌద్రత్వమనఁగఁ । బొసఁగనిమ్మూఁడు కామజవ్యసనములగు । నరయమొదలిమిథ్యాభివాక్యంబుకంటెఁ । దక్కినవిరెండునతిగురుత్వమువహించు ॥ (చ) పరవనితాభిలాషమునుబల్కులు బొంకునుధర్మనాశమం । ద్రరయఁగ నీకులేవు పురుషాగ్రణిమున్నవిరెండుమీఁదటన్। దొరకొనఁబోపునేఁడిచటఁ దోడ్పడెనంచు వచింపనెట్లగుం । గరమురుధర్మశీలికిఁద్రికాలమునందునుగల్గనేర్చునే ॥ (వ) అనిపలికి యారెంటిలోనఁ బరదారాభిగమనాభావంబునందతిశయంబెఱింగించుతలంపునవెండియునిట్లనియె॥

గవుండు పరమానంద భరితాంతఃకరణుండై మంజుభాషణంబుల నిట్లనియె
(చ) అనుపమరమ్య మూలఫలమై సుకృతంబులకున్నివాసమై । మునులకు
నాటపట్టయిన, మున్నతి నొప్పెడు నీవనంబునీ। కనఘ నివాసయోగ్యమగు,
నైననువన్యమృగంబులెల్లెడ । న్బనివడినీతపంబునకు, భంగముసేయుచు నుం
డు నిచ్చటన్ ॥ (వ) మహాత్మా యివ్వనంబునకు మృగసంఘంబులు
చనుదెంచి యకుతోభయంబులై యథేష్టంబుగా సంచరించి నానా విచిత్ర
వేషంబులఁ దపోభంగంబుఁ గావించి క్రమ్మఱం జనుచుండునిచ్చట మృగప్ర
లోభనరూప దోషంబుకంటె నన్యదోషంబేమియు లేదనిపలికిన వినిరామభ
ద్రుం డమ్మునికిట్లనియె॥ (చ) ఇనకులతేజ యేనుధను, వెక్కిడి ఘోరమృగావ
ళిన్మహా। శని నిభశాతబాణములఁ, జంపితినేని తదర్థమందునీ । మనమునకు
న్విషాదమగు, మాకదిమిక్కిలి పీడసేయు ని । వ్వనమునదీర్ఘకాలముని,వా
సమొనర్పఁగఁ జాలనెంతయున్ ॥ (వ) అనిపలికిరాముండు సీతా లక్ష్మణసహి
తుండై యమ్మునీంద్రునాశ్రమంబున నివాసంబుఁ గల్పించుకొని పశ్చిమ సంధ్య
నుపాసించి మునిపతియొసంగిన తాపసభోజ్యంబైన యన్నంబు భుజించియతని
చేత సత్కారంబువడసి మునులతోనిష్టకథా వినోదంబుల నారాత్రివుచ్చి మ
ఱునాఁడరుణోదయంబున సీతాసహితంబుగాఁ బద్మకైరవ సౌరభోల్లసితంబైన
శీతసలిలంబున మజ్జనంబుఁ గావించియగ్నిదేవునారాధించి మహర్షులసత్క

*రాముఁడు సుతీక్ష్ణమహర్షియమునులయాశ్రమంబులఁజూడననుజ్ఞనడుగుట.*

రించి సుతీక్ష్ణమునీంద్రునకు వందనంబుఁగావించి వినయవాక్యంబుల నిట్లనియె॥
(ఉ) ఓమునివర్య నేఁడు సుఖముంటిమి నీకడనీతపోధన । గ్రామణులొక్కరీ
తినను,రమ్మని పిల్చుచున్న వారలెం। తోముద మొప్పవారిఁ బరితుష్టులఁజే
యుటమేలుగాననా । నామహనీయతాపస వనంబులు గన్గొనఁబోయి వచ్చె
దన్॥ (చ) అనఘచరిత్రదుర్నయ సమాగత సంపదనొందినట్టిదు । ర్జనుఁ
డగు రాజుభంగి నవిషహ్యఘునాతపుఁడైనయాత్రయీ। తనుఁడునభంబునం
గడుఁ బ్రతాపము నొందక మున్నెలక్ష్మణు। న్జనకజఁగూడి తాపసవనంబుల
కుంజనువాఁడనెంతయున్॥ (క) అనిపలికిసుమిత్రానం। దనసీతాసహితుఁడగు
చుఁ, దత్పదములకు । న్వినతి యొనరింప నతఁడ। క్కునఁజేర్చిముదంబెలర్ప
గురుమతిననియెన్ ॥ (ఉ) తమ్మునిఁగూడినీవు నుప థంబుననేగుము భూమిపు



త్రియం। దమ్మునవెంట రాఁగ విపినంబున నున్కియొనర్చి యున్నపు। ణ్యా
త్ములప్రోవులైనముని నాథులరమ్యత రాశ్రమప్రదే। శమ్ములు వేడ్కతోడవ
రుసం దగఁగన్గొనిరమ్మురాఘవా ॥ (వ) మఱియు ఫుల్లపంకజమండిత ప్రస
న్నసలిలయుత హంసకారండవాకీర్ణంబులగు సరోవరతటాకంబులు గలిగి
దృష్టిరమ్యంబులగు గిరిప్రస్రవణంబులచేత నావృతంబులై పరస్పరవైరవిరహి
తప్రశాంతమృగపక్షిగణంబులై మయూరాభిరుతంబులై యొప్పు రమణీయార
ణ్యంబులు విలోకింపుచు దండకారణ్యనివాసులగుమహర్షులచేత సత్కృతుం
డవై క్రమ్మఱ మదీయాశ్రమంబునకుంజనుదెమ్మని పలికిన నట్లకాకయని రాముం
డులక్ష్మణ సహితంబుగా నమ్మహర్షిచరణంబులకుఁ బ్రణామంబుఁగావించి య
పాంసులా శిరోమణియగువైదేహియొసంగిన శుభతరతూణీరంబులు దీర్ఘం
బులగుచాపంబులును గనకత్సరుఖడ్గంబులును దమ్ముండునుందానును సముచి
తంబుగాధరించి నిజదేహప్రభాపటలం బక్కాంతారంబునకు గారుత్మతచ్ఛా
య సంపాదింప శీఘ్రంబునఁ బ్రయాణంబున కభిముఖులై రాసమయం
బునఁ దదీయసహధర్మచారిణియు నిత్యానపాయినియు దివ్యమంగళస్వరూ
పిణియు నగుసీతాదేవి నిజభర్తనవలోకించి హృద్యంబగు స్నిగ్ధవాక్యంబునని

(*)సీతరామునిసత్యసంధత్వ పరదారపరాఙ్ముఖత్వాదులనభినుతించుట.(*)

ట్లనియె ॥ (సీ) ప్రాణేశ శాస్త్రోక్తభంగినేయుత్కృష్టధర్మ మీమునికులో,
త్తమునిచేతఁ । దప్పక ప్రాప్తించెఁదద్ధర్మ*మీలోక మందుఁగామోద్భవం బై
నయట్టి । వ్యసనంబువలనఁ జయ్యనవివృత్తుఁడవైన నీచేతనిత్యంబు, నేర్పవల
న । నాచరింపఁగశక్య, మైయుండుమిథ్యాభివాదంబు పరసతీ,వర్తనంబు ॥
(తే,గీ) ధాత్రివైరంబులేనిరౌద్రత్వమనఁగఁ । బొసఁగనిమ్మూఁడు కామజవ్య
సనములగు । నరయ మొదలిమిథ్యాభివాక్యంబుకంటెఁ । దక్కినవిరెండును
తిగురుత్వమువహించు ॥ (చ) పరవనితాభిలాషమునుబల్కులు బొంకునుధ
ర్మనాశమం । ద్రరయఁగ నీకులేవు పురుషాగ్రణిమున్నవిరెండుమీఁదటన్।
దొరకొనఁబోవుసేఁడిచటఁ దోడ్పడెనంచు వచింపనెట్లగుం । గరముధర్మ
శీలికిఁద్రికాలమునందునుగల్గనేర్చునే ॥ (వ) అనిపలికి యారెంటిలోనఁ బర
దారాభిగమనాభావంబునందతిశయంబెఱింగించుతలంపున నొండియునిట్లనియె॥

(తే,గీ) భావముననైనఁ గలనైనఁ భ్రమిసియైన । నన్యకాంతాభిగమనమూవం తయైన నధిప కాలత్రయంబునందరయనీకు । లేదనుటకించుకయుశంక లేదునా కు ॥ (వ) అనిపలికి పరదారాభిగమనమిథ్యావచనాభావంబులందుఁ గ్రమంబున హేతుద్వయంబు పన్యసించు తాత్పర్యంబున నిట్లనియె ॥ (తే,గీ) అనఘచరిత ధర్మిష్ఠుండ వగుచుఁ బ్రీతి । ననిశము స్వదారనిరతుండ వైననీవు । సత్యసంధుండవగుచునా, జనకవాక్య । కారకుఁడవైతి వింతనికఁ-ంబునువ్వ ॥ (క) సత్యముధర్మముసర్వము । నిత్యమునీయందునిలిచి నెగడుచునుండు । నుత్యమజితేంద్రియులకివి । యత్యంతభరంబులగుమ హాగుణశాలీ ॥ (వ) మహాత్మా నీకుమిథ్యావాక్య పరదారాభిగమనరూప వ్యసనద్వయ ప్రసక్తిలేదు భవదీయ వశ్యేంద్రియత్వంబెఱుంగుదు నెయ్యది మూఁడవదియగు పరప్రాణాభిహింసనరూప రౌద్రవ్యసనంబు గలదది మోహంబువలన రౌద్రత్వరూపాధ

—(*) సీతరామునితో జీవహింస చేయఁదగదని చెప్పుట. (*)—

మాంతరంబు సంపాదించునది యిప్పుడు నీకు సముపస్థితంబయ్యె దండకారణ్యనివాసి మహర్షిరక్షణార్థంబిప్పుడు రాక్షసవధంబు నీచేతఁ బ్రతిజ్ఞాతంబయ్యెఁ గైకేయీ వరవ్యాజంబున రక్షోవధార్థంబు శరచాపంబులు గైకొని భార్యాసహితంబుగా దండకావనంబునకుం జనుదెంచితివనియూహించెద రాక్షసవధార్థంబు ప్రస్థితుండవైన నిన్నువిలోకించి భవదీయ సత్యప్రతిజ్ఞత్వస్వదారైక నిరతత్వాదిసద్వృత్తంబు విచారించి యుభయలోక సుఖకాంక్షిణినైన నాకుమనఃఖేదంబగుచున్నదని పలికి వెండియునిట్లనియె ॥ (తే,గీ) రఘుకులోత్తమ దండకారణ్యగమన । మరయనీకు హితంబుగాదని తలఁచెదఁ । గరమునీయర్థమందొక్క కారణంబు । గలదు వినుపింతువినుము నిశ్చలత మించి ॥ (క) ధనువునుశరములుఁ గైకొని । జననాయక నీవుభార్యసహితుఁడవై యు । వ్వనమునకుఁ జనితివేనియు । దనుజులఁగని శరమువిడువఁదవు నృపవరకుల । తేజోభివృద్ధినొసఁగు । నెంతయుసమీపమున నున్న యింధనములు । శ్వాసనసఖునకుఁ దేజంబొసంగినట్లు ॥ (వ) ఇందుకు నొక్క యితిహాసంబు గలదెఱింగించెద వినుము ॥ (శా) దేవా మున్నొక పుణ్యకాననమునన్ ధీ

(*) సీత రామునకు ధనుర్ధారణము వికార హేతువని నిరూపించుట, (*)



రోత్తముండాత్మవి । ద్యానధిష్ఠుఁడువిప్రుఁడొక్కఁడు తపం బాచరింపంగా । దేవాధీశుఁడుతత్తపంబుఁ జెఱుపం దీపించిఖడ్గంబుఁగొం । చావిప్రోత్తముఁ డున్నచోటికి భటుండై వచ్చె దంభాకృతిన్ ॥ (తే,గీ) శస్త్రముఁ డిబ్బంగినతనియాశ్రమపదంబుఁ జేరితనచేతి ఖడ్గము ప్రాపుచేతి । కిచ్చి మునివర్య దీనినా నచ్చునంత । దాక రక్షింపు మని చెప్పి తడయకరిగె ॥ (వ) అంత నవ్విప్రుండు శక్రదత్తశస్త్రంబు పరిగ్రహించి న్యాసరక్షణతత్పరుండై స్థాపితవస్తువిషయవిశ్వాసంబువలన నేమఱక ఫలమూలహరణార్థం బరుగు నప్పుడును ఖడ్గంబుఁ గొనిపోవుచు నతిప్రయత్నంబునదాని రక్షింపుచు వనంబునం జరింపుచు నంతకంతకుఁ గ్రమంబున నత్తపోధనుండు శస్త్రసంవాసంబువలనఁ దపంబువిడిచి క్రూరబుద్ధి నధిగమించి ప్రమత్తుండై యధర్మకర్షితుండై రౌద్రాభిరతుండై నిలయగతికిం జనియె నిది శస్త్రసంయోగకారణంబైన పురాణవృత్తాంతంబు వహ్నిసంయోగంబట్లు వస్తువునకు వికారహేతువగు నట్లు శస్త్రసంయోగంబును శస్త్రధారికి వికారహేతువగునని పలికి వెండియునిట్లనియె ॥ (చ) ఘనుఁడవు నీవునీమతము గాదని పల్కఁగఁజాలనైన బ । ల్చనువునస్నేహదర్శితబలంబున నాడితిదీనఁదప్పుగా । దునిరయమెంతగాదె యనిత్రోయక నావచనంబుఁబట్టినే । ర్పునఁ బలలాశికోటిపయిఁ బుట్టిన రౌద్రతనుజ్జగింపుమీ ॥ (క) పగఁగొనిన వారిఁజంపం । దగుఁగాక నృపాలచంద్ర తడయక నీకు । న్బగఁగొననివారి దైత్యులఁ । దెగఁజూడందగదు కలవె దీనశుభంబుల్ ॥ (తే,గీ) అధిపదైత్యవధారంభ మంతకంత । కఖిలలోకహింసాబుద్ధి నవలఁగలుగఁ । జేయునే యపరాధంబుఁ జేయనట్టి । సర్వజనుల హింసించుట క్షో

—(*) సీత రామునికి వనవాసులకుఁ బరహింస తగదని చెప్పుట. (*)—

ర్వఁజాల ॥ (సీ) క్షత్రధర్మోచిత సాధురక్షణవృత్తులైన వీరులకరణ్యప్రవాసి । మానిసంరక్షణ మాత్రంబె ధనువుచేఁ గార్యంబు సర్వరాక్షసులఁజంపి । మునులరక్షించుట మనకుఁగార్యముగాదు రాజ్యపాలనశీల రాజధార్య । మైనశస్త్రంబేడ మానితరాజ్యంబువిడిచి యిప్పుడుముని వృత్తిఁబూని ॥ (తే,గీ) వచ్చిచొచ్చిన వన మేడ వసుమతీశ । కార్యహింసాభిలక్షణ కర్మమేడ । మఱియుహింసావహితతప శ్చరణమేడ । బుద్ధినరయననన్యోన్యవిరుద్ధమయ్యె ॥ (తే,గీ) దేవమనచేత నిప్పుడు దేశధర్మ । మాచరింపంగఁదగుఁగాక యన్య

మేల । శస్త్రసేవనమునఁ గలుషంబుగలుగు । క్షత్రధర్మం బయోధ్యలో, సలుపవచ్చు ॥ (తే,గీ) రాజ్యముఁ బరిత్యజించి య, రణ్యమునకు । వచ్చినందుకుఁబరహింస, వదలిమౌని । వృత్తిఁ బూనివర్తించెద, మేనిదేవ । తల్లిదండ్రులకధికము,దంబు గలుగు ॥ (క) ధర్మమున ధనముదొరకొను। ధర్మంబునఁ బరమసుఖము,దనరుచునుండు । న్ధర్మమునఁ గలుగుసర్వము । ధర్మదయీజగముధర్మ, సారముసుమ్మీ ॥ (వ) మహాత్మా కృచ్ఛ్రచాంద్రాయణాదికంబులైన నియమంబులచేత శరీరంబు కృశింపంజేసి నిపుణులగు వారిచేత ధర్మంబు ప్రాపింపంబడు సుఖాధిష్ఠానానువర్తనంబున సుఖంబు గలుగదుగావున రాక్షస సంహారోద్యోగంబు కర్తవ్యంబుగాదు నీవును నిత్యంబును శుచిమతివై తపోవనంబున నేతత్కాలసదృశంబైన ధర్మంబుననుసరించి వర్తింపుము త్రిలోకాంతర్వర్తిజన ధర్మాత్మకంబైన సర్వంబును మీకు విదితంబైయుండు మీకుధర్మంబుపదేశించుట కెవ్వండు సమర్థుండు స్త్రీచాపల్యంబుననిదినాచేత సముదాహృతంబయ్యె భ్రాతృసహితుండవై బుద్ధిచేత విచారించి చిత్తంబునకుం దోఁచినభంగి నవధరింతువుగాకయని పలికిన భర్తృభక్తియగువైదేహీ వాక్యంబువిని రాముండు మునిపరిపాలనాత్మక ధర్మస్థితుండైయద్దేవి కిట్లనియె ॥ (చ) చకితమృగాక్షి నీపలుకు, సత్యము క్షత్రియవీరధ

(*) రాముఁడు సీతకు రాజులకు సాధురక్షణం బావశ్యకంబని చెప్పుట. (*)

ర్మదీ । పకముహితంబు పథ్యముశు,భంబునిభంబు మనోహరంబునై । ప్రకటితమయ్యెఁ గార్ముకముఁ,బట్టినభూపతి కార్తరక్షిత । ప్పకతగునంచునీవె యిటు, పల్కితివేయికఁజెప్పనేటికిన్ ॥ (ఉ) వారిజగర్భతుల్యులగు, వారుమహాత్ములు సంతతంబు దు । ర్వారపటుప్రతాపబల,వద్రజనీచరబాధితాంగులై । వారక యేగుదెంచిజిత,వైరినిన న్శరణంబునొంది రం । భోరుమహాగంధియమ్మునులఁ,బ్రోవనినాకు యశంబుగల్గునే ॥ (చ) నరపిశితోపజీవులు ఘ, నాఘనదేహులు క్షుద్రయామినీ । చరులతిఘోరభంగిదము,సారెకుఁ గాఱియఁ బట్టిసంతతాం । తరితమఖాదికార్యకల, నన్గనుదోయికిఁ గూర్కులేకది । క్కులమునిపుంగవుల్గడు సు,ఖస్థితిఁగానకయున్న వార్గిన్ ॥ (తే,గీ) నిత్యమీదండకారణ్య, నిలయులైన । మునులు రాక్షసపీడిత, మూర్తులగుచుఁ । దపములన్నియుఁ జాలించి,తమదురంత । చింతలన్నియు నాతోడఁ, జెప్పుకొ



నిరి॥ (తే,గీ) ఏను నత్తాపసేంద్రము,ఖేదితోక్తి । వినితదంఘ్రులకెఱఁగియో విప్రులార । యింతవగపేలనాకు మీ,చింతలెల్లఁ । జెప్పఁడెంతటిపనియైనఁ,జేయువాఁడ ॥ (క) అనియేను వలుకవిని యి । ట్లనిరిరఘూత్తంస దండ,కారణ్యమునన్ । దనుజులు మముబాధింపుచుఁ । గనారిలుచునున్న వారు,గావుము కరుణన్ ॥ (క) ఎచ్చోటనుండి వత్తురొ । విచ్చలవిడి పర్వహోమ, వేళలశౌలల్ । చొచ్చి శుచికుండముల బలు । మచ్చరముననింతురస్థి,మాంసంబులొగిన్ ॥ (క) దనుజుల రాయిడి కోర్వక । దినకరకుల వర్య నీవె,దిక్కనిదైన్యం । బున శరణమొందినారము । ఘనకృపరాక్షసులఁద్రుంచి.కావుము మమ్మున్ ॥ (సీ) భూరితపోబలం,బున దైత్యులవధింప శక్తులమైనను,జనవరేణ్యా । బహుకాలముననుండి, పడసిన ఘనతపంబునకు హానిజనించు, ననుచుఘోర । దనుజబాధితుల మ,య్యును వారిశాపింపనోడి యున్నాముత, దుగ్రబాధ । నడచిప్రోవుము కరు,ణాంభోనిధి యఁటంచు గురుదైన్యమున వేఁడు,కొనిరిగాన ॥ (ఆ,వె) దీనులైనమునుల, దీనత్వముడుపుట । కంటెవేఱెఫలము, గలదెనాకుఁ । గ్రూరులైన దైత్య,వీరులఁజంపినఁ । బాపమేలగల్గు,పంకజాక్షి ॥ (వ) దేవిరాజత్వం బంగీకరించుటకు సాధుసంరక్షణంబు ఫలంబుగదామునిరక్షణార్థంబు ప్రాణంబులొసంగినం గొఱంతలేదేనుకైకేయీవరవ్యాజంబునవనంబునకుంజనుదెంచుటయు దండకారణ్యనివాసి మునిరక్షణార్థంబనియెఱుంగుము నాయందుసౌహార్దస్నేహవిశేషంబున హితంబుఁజెప్పితివి దానందప్పులేదు ప్రాణంబులకంటెఁగరీయసివిగావున నీపలుకులకు సంతోషించితినిది మొదలు సాధుసంరక్షణార్థంబు రాక్షస వధంబున కుపక్రమించెద ననినానావిధప్రియాలాపంబులనమ్మైథిలరాజనందన గారవించి యద్దేవినడుమనిడికొని లక్ష్మణుండు పిఱుంద దెసంజనుదేఱఁ దానుముంగలియై యచ్చోటువాసి మహారణ్యమార్గంబుఁ బట్టిపోవుచు ॥ (చ) అటఁజనికాంచె రామవిభుఁ, డంబరచుంబరసాల భూర్జరీ । కుటజతమాల తాలవట, కుందకురంటక కోవిదారవి। స్ఫుటకరవీర లోధ్రతరు, చూతమధూక విశాలశింశుపా । పటలవిరాజితంబయిన భాసురదావము భూరిదావమున్ ॥(వ)మఱియు నమ్మహాగహనంబునందు॥ (సీ) పల్వలోత్తీర్ణ శుం,భద్వరాహంబులు గుంపులైసెలయేళ్లఁ గొంపిసేయ । సెలయేటియసుకతి,న్నెల సింహపోతంబు లురుసామజములపై, నురవడింప ।

సెలవులరురుడింభ, పలలసారముగాఁ గ్రోల్పులులొప్పదరిండ్ల, సురికలిడఁగ। సలలితఘాస శాద్వలచరన్మృగపఙ్క్తి భిల్లాగమనభీతిఁ, గ్రేళ్లుదాఁటఁ॥ (తే,గీ) జండగండక వేదండ, శరభభల్ల। శల్యసారంగ చమరికా, శశకఖడ్గ, భూరికా

—(*)రాముండొకానొక తటాకంబునందు వాద్యధ్వనులు వినుట.(*)—

సరమహిష దుర్వారమైన। యమ్మహారణ్యమధ్యమం, దరిగి యరిగి ॥ (మ) ఒకచో రాముఁడుగాంచె నభ్రపద సంయుక్తోర్మిసంచారము। న్వికసత్సా రసచక్రనాక బిసఘు, గ్వేదండరాడ్క్రీడముం। బ్రకటామోదమరాళ సేవితల సత్కంకేరుహోదారముం। బకుళాబ్జాకరతీరముం సువిలసద్వారంబుఁగా నారముం॥ (వ) వఱియునాసరోవరంబు యోజనాయతంబును వనవారుణా లంకృతంబును గమఠమీనగ్రాహ పాఠీనంబును నై యొప్పునందు॥ (క) హృద్యం బై శ్రోత్రశ్రుతి। భేద్యంబై నీటిలోనఁ, బృథుసుందరమై। సద్యస్సుఖసూచకమై। వాద్యధ్వనిదోఁచె దురిత, వారస్ఫూర్తిన్॥ (క) వినిరామభద్రుఁడిచ్చట, జను లెవ్వరులేరు వాద్య.శబ్దమునిట్లన్। వినఁబడుట కేమిహేతువో। యనియచ్చె రువడరఁ గౌతుకాన్వితమతియై॥ (క) అచ్చెరువడఁగాధతపం। బచ్చుపడం జే యుచున్న, యనఘుఁడపస్వి। స్సచ్చరితుధర్మభృతుని। న్వచ్చినకుతుకమునఁ జూచి,యిట్లనిపలికెన్ ॥ (శా) ధ్యానంబొక్కటిపుట్టె నిమ్మడువులో, వర్ణింపఁజేతస్సమా। ధానంబై విన నయ్యెడిం జెవులకే, తన్నిర్జనంబైనచో। స్వానంబేల జనించెఁ గౌతుకముదై, వాఱంగ నీచందము। న్మౌనిగ్రామణి తెల్పనా నతఁడు సన్మానించి తానిట్లనున్ ॥ (సీ) అనఘాత్మవినుము పంచాప్సరంబ

(*) ధర్మభృతుండు రామునకుఁ దటాకమందలి వాద్యధ్వనులకుఁ గా (*)

( రణంబెఱింగించుట. )

ను తటాకంబిదిమునుమాండ, కర్ణియనెడు। మునిపతి తపము పెంపున దీని నిర్మించెఁబదివేలవర్షము, ల్పరమనిష్ఠ। గరువలిభుజియించి,ఘనతపంబొ నరింపఁ దత్తపోవహ్నిసం, తప్తులగుచు। వేల్పులుదలపోసి, విఘ్నంబుఁగావిం పవంచించియప్సరః, పంచకంబు ॥ (తే,గీ) ననుపవారలు వలపుల, నతని ధైర్య। మహిమలోఁగొని నమ్ముని,మదనవశత। దేవకాంతలఁబత్నులఁ, గావరించి। యంపునళుకొత్తఁ జాలఁగ్రీడింపఁదలఁచి ॥ (వ) ఈతటాకంబునం దంత హితగృహంబు నిర్మించి యందునిత్యంబు నవ్వెలందులంగూడి యథేచ్ఛ



విహారంబునం గ్రీడింపుచుండు నీనిస్వనంబు సంక్రీడమానలైనయత్తెలోఁదరుల భూషణస్వనోన్మిశ్రంబైన గీతవాదిత్రశబ్దం బిచ్చట వర్తించువారికి మనోహ రంబుగా వీతెంచుచుండు ననిపలికిన రాముండు పరమాద్భుతంబునొంది యమ్ముని మహత్త్వంబు కొంచొకసేపు వక్కాణించి సీతాలక్ష్మణసహితంబుగా నచ్చోటువాసి కుశచీరపరిక్షిప్తంబును నానావృక్షసమావృతంబునైన యమ్మహా రణ్యంబునం గల తాపసాశ్రమ మండలంబుఁ బ్రవేశించి ॥ (చ) దిన మొక యాశ్రమంబున నతిప్రమదంబున నున్కి సేయుచున్। మునికృత హోమమును దిరవమ్ము ల్వినుచుం బ్రతిపూజనంబుఁగై। కొనుచుఁగు శాస్త్రంబుపయిఁగూ ర్కుచు మూలము లారగింపుచున్। మునులకుఁ జుట్టమై రఘుపు, ఛుంచరించెను దండ కాటవిన్ ॥ (చ) ప్రమదముతో నెదుర్కొని తపఃఫలము బలె రాముని న్మనిల్। దమతమ యాశ్రమంబులకుఁ, దప్పక దోడ్కొని పోయి వేడ్కతోఁ। గ్రమమునఁ బాద్యమర్ఘ్యముష, లంబు గుశాస్త్రణం బొసంగిని। త్యము మముఁగావు మోరఘువ, తంసయటంచు నుతించిరెం తయున్ ॥ (క) చెలువుగ సీగతి రాఘవుఁ। డలయక దినదినము దండ, కా రణ్యమునం। గలతాపసాశ్రమంబులఁ। గలయఁగఁ జరియించెననుజ, కాం తాయుతుండై ॥ (క) ఈరీతిఘోరమగుకాం। తారంబునఁ దిరుగుచుండ, దా శరథికి నొం। పార సమయాబ్దములలో। నారూఢిగ వర్షదశక, మయ్యెం బ లుచన్ (వ) ఇట్లురాముండు వనంబున నొక్కచోట నిఱువది రెండు నెలలు ను నొక్కచోటఁబదునాల్గు నెలలును నొక్కచోటఁ బదియేను నెలలును నొ క్కచోటఁబదియాఱు మాసంబులును నొక్కయెడ నర్ధాధిక దశమాసంబులు ను నొక్కయెడ నర్ధాధికైకాదశమాసంబులును నొక్క యెడఁ బదుమూఁడు మాసంబులును నొక్కయెడఁ బదునెనిమిది మాసంబులును గా నిట్లు దశవ ర్షంబులు గడపె నంత నారఘువల్లభుండు సీతాలక్ష్మణ సహితుండై వెండియు నెప్పటిసుతీక్ష్ణముని యాశ్రమంబునకుం జనుదెంచి యతనిచేతం బ్రతిపూజితుం డై యచ్చటం గొన్ని దినంబులుండి యొక్కనాఁ డమ్మునిం జేరి యిట్లనియె॥

(సుతీక్ష్ణమహర్షి రామున కగస్త్యాశ్రమమునకు దారిఁ దెల్పుట.)

(సీ) మునినాథ యీవనం, బున భగవంతుండు కనక గర్భాభుం డ, గస్త్య మౌని। యున్నవాఁ డని వింటి, మున్నామునిశ్రేష్ఠుఁ డెచ్చటనున్నవాఁ, డెఱుఁ

గఁ జెప్పు । మమ్మహాత్ముని ప్రసా , దమ్ముఁ గైకొను నట్టి తలఁపు జనించెఁ ద
త్పాదనములకు । నెప్పుడు మ్రొక్కుదు , నెపుడు భాషింపుదునోయని తమిఁ
బూని , యున్నవాఁడ ॥ (తే గీ) ననిన నప్పూనినాయకుఁ , డనఘ గేను ।గ
ఱపఁ బూనిన దాని నా, కంటె మున్న । నీవె నొడివితివాముని , నేత లెఱిఁ
గుఁ। దెలియఁ జెప్పెద వినుము సం,దేహ ముడిగి ॥ (వ) మహాత్మాయిచ్చ
టికి యోజన చతుష్టయ మాత్రదూరంబున నగస్త్య భ్రాత యగుసుదర్శముని
తపోవనంబు గల దయ్యాశ్రమంబు పిప్పలీవనశోభితంబును బహుపుష్పఫలో
పేతంబును రమ్యంబును నానాశకుని నాదితంబునుస్థలప్రాయంబును హంసకా
రండవ చక్ర వాకోపశోభిత ప్రసన్న సలిలభాసుర సరోవరతీరవిక సత్పద్మకై
రవకుముదషండ మండలాంతర్గత మకరంద పానమత్తమధుకరఝుంకారసం
కులంబునై యొప్పుచుండు దక్షిణాపథంబున నయ్యాశ్రమంబునకుంజని యందు
నా రేయింగడపి మఱునాఁడరుణోదయంబునఁ గదలి దక్షిణదిశాభిముఖుండవై
యొక్క యోజనం బరిగిన నచ్చటఁ గుంభసంభవాశ్రమంబు బహుపాదపసం
వృతంబై రమణీయంబై యుండు నందు వైదేహి హృద్యం బగు నట్లుగా భవ
త్సహితవై విహరించు నట్లు గావున ॥ (క) ఇనవంశ శేఖరయగ । స్త్యునిఁ జూ
డఁ దలంచితేని , సుముహూర్తమునం । జను మిప్పు డనుచుఁ బలికిన । విని
రాముఁడు మ్రొక్కి యతని, వీడ్కొని పెలుచన్ ॥ (వ)సీతాలక్ష్మణ సహితం
బుగా నచ్చోటుగదలి రమ్యంబులగువనంబులును మేఘ సంకాశంబులగుపర్వ
తంబులును సిమ్నంబులగు సరోవరంబులును దీర్ఘ ప్రవాహంబులగునదీనదం
బు లెడ నెడ నవలోకింపుచు సుతీక్ష్ణోపదిష్ట మార్గంబున దూరంబు చని సం
హృష్టహృదయుండై లక్ష్మణునకిట్లనియె॥ (ఉ)తమ్ముఁడకుంభసంభవుని, తమ్ముని
యాశ్రమ భూమిఁగంటెయం।దమ్మగుచున్న దెంతయును,దగ్రఫలప్రసవప్రకాండ

(*) రాముఁడగస్త్యతమ్ముఁడగు సుదర్శనాశ్రమముఁ జేరనరుగుట .(*)

భా।రమ్మునను న్నతంబులగు,మ్రాకులువ్యోమమునంటిచాలమా।గమ్మున నెల్లెడ
న్దఱుచు, గాబహుభంగులనిండి యుండఁగన్ ॥ (చ) విరిసిన పిప్పలీఫలని,వి
ష్టమనోహర భూరిసౌరభ । బురుగతిగాడ్పు రేఁపఁగటు, కోదయమై వనభూ
మి నిండ బ । ల్తిరముగ నెల్లెడంబరిమ,ళింపుచు నున్నదికంటె యమ్మునీ । శ్వ
రు గుణసౌరభోత్కరము,చారుతరంబుగ వీచెనోయనన్ ॥ (తే,గీ) నరవరా



త్మజకంటె లూ,నంబులైన । లలితవైడూర్యవర్ణ ద,ర్భలునవాంబు । జము
లు సంక్షిప్తకాష్ఠసం, చయములంత । నంతఁజూపట్టుచున్నవి, యాశ్రమము
న ॥ (క) శ్యామాభ్రశిఖరనిభమై । ధూమాగ్రం బివ్వనమునఁ, దోఁచెడిఁగం
టే । యీమునితపోగ్నిధూమం । బీవిధమున నున్నదనఁగ నెసఁగెం దళమై ॥
(క) రమణీయము లగుఘనతీ । ర్థ౦ల౦ గృతస్నానులగుచు,ధరణీదివిజో।
త్తములు సమార్జితసుమముల । సుమోపహారం బొనర్పఁ, జొచ్చిరికంటే ॥
(తే,గీ) నిత్యతపమున మిత్తిని,నిగ్రహించి । భువనహితకాంక్ష నేమహా,పుణ్య
భాగ్రిత । చేత నీదిక్కు లోకప్ర,సిద్ధికెక్కె । నట్టిమునియాశ్రమం బిది, యన

( రాముఁడులక్ష్మణునకగస్త్యకృతవాతాపీల్వలసంహారప్రకారంబుఁ దెల్పుట. )

ఘచరిత ॥ (క) అనఘా మున్నీవనమున । ననిశము వసియించియుండు,రతి
పాపమతుల్ । దనుజులు వాతాపీల్వలు । లనువారలు దేవభూసు, రాంతకు ల
గుచున్ ॥ (తే,గీ) వారిలో నిల్వలుండను,వాఁడు మిగులఁ । గృత్రిమమహీ
సురత్వమం,గీకరించి । వేదభాష భాషింపుచు, సాదరముగఁ । దపసులకుశ్రా
ద్ధమని నిమం,త్రణముఁ జేసి ॥ (ఆ,వె) పూనిమేషరూపుఁ,డైన వాతాపిని ।న
డఁచిచంపి వండి,కుడువఁబెట్టి । వారుదిన్నపిదప,వాతాపిరమ్మని । ప్రీతినిల్వలుం
డు,పిలుచునంత ॥ (క) భీషణరవమున బెట్టుగ । ఘోషింపుచుఁ గడుపుసిం
చి,కొని శీఘ్రమునన్ । మేషాకృతితోనప్పుడు । దోషాటుఁడు వెడలివచ్చుఁ
దోరపుబలిమిన్ ॥ (క) అంతమృతులైన విప్రుల । నెంతయుగృథ్రములపగి
ది,నిద్దఱుదనుజుల్ । వంతులఁబడి భక్షింపుచు । సంతోషింపుదురుదుర్వి,చా
రస్ఫూర్తిన్ ॥ (ఉ) ఇంపుగఁ దారకానికర,మెన్నఁగ వచ్చు మహీరజంబు
లె । క్కింపఁగవచ్చు నీరనిధి,కింగలయూర్ములనెంచవచ్చునా । కంపములే
కనిల్వలుఁడు, గాఱియపెట్టి నికృష్టవృత్తిచేఁ । జంపినతాపసోత్తముల, సంఖ్య
యొనర్పఁగరాదు యేరికిన్ ॥ (వ) ఇట్లు దుర్వార గర్వాతిరేకంబున నప్పా
ర్వగీర్వాణులు ధరణీసుపర్వుల వధింపుచుండు నంతఁ గొంతకాలంబునకు దేవ
మునిప్రార్థితుండై యగస్త్యమునీంద్రుండిచ్చోటికిం జనుదెంచుటయు నెప్ప
టియట్ల నయ్యిల్వలుం డమ్మహాత్ముని బ్రాహ్మణార్థంబు నియమించిమేషరూ
పుండైన వాతాపిం జంపి తన్మాంసంబుఁ బక్వంబుఁ జేసిపెట్టి యతండు గుడి
చినంతఁ దొల్లింటిచందంబున వాతాపింజీరిన నమ్మునీంద్రుండుప్రహసింపుచుని

ల్వలుంజూచి యెక్కడ వాతాపి మదీయజాఠరానిలశిఖాపరంపరల భస్మీభూ
తుండై బహుకాలసంచితదురితవిశేషంబున యమక్షయంబునకుం జనియె న
నిపలికిన నన్నిశాచరుండు క్రుద్ధుండై యగస్త్యునిం బ్రధర్షించిన నమ్మహాను
భావుండు రూక్షప్రేక్షణంబుల నిరీక్షించుటయుఁ దత్క్షణం బారాక్షసుండు శు
ష్కతృణంబుపగిది దంద్యహ్యమాన దేహుండై నిధనంబు నొందె నివ్విధంబున
లోకహితార్థంబు దుష్కరంబైన కర్మంబుఁ జేసినట్టి మహానుభావుం డగ
స్త్యుం డమ్మహామునిభ్రాతృ పుణ్యాశ్రమం బిదియని పెక్కువిధంబుల నమ్మహ
ర్షి ప్రభావంబు వక్కాణింపుచు సూర్యుండు గ్రుంకిన పశ్చిమసంధ్యనుపాసిం
చి సీతాలక్ష్మణసహితుండై రాముండు రమ్యంబగు తదీయాశ్రమంబుఁ బ్రవేశిం
చి సముచితంబుగా నమ్మహర్షి సందర్శించి తచ్చరణంబులకు నమస్కరించి

(*) రాముఁడు సుదర్శనమహర్షిని సందర్శించుట. (*)

యతనిచేతం బ్రతిపూజితుండై ఫలమూలంబు లుపయోగించి యారాత్రియ
చ్చట వసియించి మఱునాఁడు సూర్యోదయ సమయంబునఁ గాల్యకరణీయం
బులుదీర్చి తగిన తెఱంగున నమ్మునీంద్రునిచేత నామంత్రణంబు వడసి సుతీక్ష్ణోప
దిష్టమార్గంబుఁబట్టి జానకీలక్ష్మణోపేతంబుగాఁ బరమానందంబునం జనిచని ॥

(*) రాముండు డగస్త్యాశ్రమముఁ జేరుట. (*)

(చ) ఇనకిరణాలికిం జొరవ,యీని మహాగహనంబునన్రయం । బునఁ జనుచు
న్రఘూత్తముఁడు, పొల్పుగఁగాంచె మదద్విపేంద్రహ । స్తనిహతసాలసంగత
ప,తంగవిరావవిరాజితంబుఁబా । వనకపిశోభితంబు ఫల, వంతమునైన తరుప్ర
తానముల్ ॥ (వ) అప్పుడు ॥ (చ) మిహిర సమాన తేజుఁడు స,మీపగతుం
డును బూజనీయుఁడో । మిహిరకులావతంసు పయి, మేడలనుండి పురాంగన
ల్ప్రహృ । ష్టహృదయులై ప్రసూనములఁ, జల్లినభంగి మరుత్ప్రియుక్తభూ ।
రుహాగతనూత్నవల్లికలు,లోలతఁ జల్లెలసత్సుమంబులన్ ॥ (చ) అనుపమదీ
ర్ఘచాపధరుఁ,డైనను దత్కరుణార్ద్రభావసూ । చనమగు స్నిగ్ధగాత్రము వి,
శంకమనంబునఁజూచుచున్ముదం । బనుపమరాగముం జెలఁగ, నవ్వలఁ బోవక
నిల్చి శంబరాం । గనలు విశాలనేత్రములు, గ్గులుటకు న్ఫల మొందె, నెంత
యున్ ॥ (క) ఈవిధమున రఘుపుంగవుఁ । డావన సౌభాగ్యగరిమ, లటుబ



(*) రాముఁడు లక్ష్మణునకగస్త్యాశ్రమ విశేషముల నభివర్ణించి చెప్పుట. (*)

హుగతుల । న్భావమునకు సమ్మోదముఁ । గావింప సుమిత్రపట్టిఁ,గని యిట్లని
యెన్ ॥ (క) కనుఁగొంటె కుంభభవుపా । వనపుణ్యాశ్రమముఁ జేర, వచ్చితి
మిచట । న్ఘనమృగఖగములు దిరిగెడి । వనవీథుల విగతజాతి, వైరము లగు
చున్ ॥ (క) తరుణులతోడఁ బెనంగెడు । పురుషులచందాన నిచట,భూరు
హచయము । ల్తరుణలతలతోఁ బెనఁగొని । కరమొప్పుచు నున్నవీవు, కంటె
కుమారా ॥ (తే,గీ) చారుపత్రంబులైన వృ,క్షములు శాంత । ఖగమృగంబు
లు గలిగెశ్రం,గారఫణితిఁ । దనరుచున్నవిగాన ని, వ్వనమగస్త్య । మునివరా
శ్రమ మగుసిక్క,మనఘచరిత ॥ (తే,గీ) అనఘుఁ డెవ్వాఁడు లోకంబు, లందు
నైజ । కర్మమున ఖ్యాతి వడసెన,గస్త్యుఁ డనఁగ । నట్టిపుణ్యుని యాశ్రమ,మది
గోకంటె । కన్నులకు విందు సేయుచు,నున్నదిపుడు ॥ (చ) కమలభవప్రభుం
డగున,గస్త్యమహామునినాథుపావనా । శ్రమమిదె రమ్యఁటంచు విల,సత్కిస
లాంగుళిసాలహస్తము । ల్గ్రిమమున నెత్తియున్మదఖ, గధ్వనులన్నఁబిల్చుచు
న్నచం । దమునఁజెలంగుచున్నయవి, తమ్ముఁడకంటెవిశాలసాలముల్ ॥ (వ)
మఱియు నిమ్మహనీయాశ్రమంబు ప్రాజ్యధూమాకులవనంబును జీరమాలాపరి
ష్కృతంబును బ్రశాంత మృగయూథంబును నానాశకుని నాదితంబునై యొ
ప్పుచున్నది విలోకింపుము ॥ (తే,గీ) నిత్యతపమున మిత్తిని. నిగ్రహించి ।
యఖిలహితకాంక్ష నెవ్వఁడీ,యామ్యదేశ । మనుదినంబును మునిశర,ణ్యముగఁ
జేసె । నయ్యగస్త్యునియాశ్రమ,మదిగొకంటె ॥ (క) మేరుముఖభూమిధర
భూ । దారక మఠశేషదిగిభ, తతులకు నెనయై । యీరమ్యాశ్రమమతితే । జో
రాజితమగుచుఁ బొల్చెఁ, జూచితె యనఘా ॥ (తే,గీ) అనఘ యూర్వశి
పుత్రుఁ డీ,యామ్యదిక్కు । నాటపట్టుగఁ గైకొన్న, నాఁటనుండి । యిచటదను
జులు వర్తింతు, రెల్లప్రొద్దు । వరమునీంద్రుల భంగి ని,ర్వైరులగుచు ॥
(సీ) స్వారాజ్యగర్వధూ,ర్వహనహుషైశ్వర్య శోషణం బెవ్వాని, భాషణం
బు । భృతమహోర్మివ్యాప్త, వితతపాథోరాశి వరజలం బెవ్వాని, కరతలం
బు । చటులమేషాకార, కుటిలవాతాపి భక్షణశాలి యెవ్వాని, జఠరకీలి, ।
భూరివింధ్యాద్రి దు, ర్వారమహోత్సేధ నాశనం బెవ్వాని, శాసనంబు ॥
(తే,గీ) నట్టి పరమేష్ఠి సన్నిభుఁ,డైన కుంభ । సంభవుని యాశ్రమిం బిదె, స్వ

గ్రతుల్య। మగుచు రాజిల్లు చున్నది, విగతజాతి । వైరమృగ పక్షి రాక్షసో, దారమగుచు ॥ (వ) మఱియు భగవంతుండైన యగస్త్యమహాముని నామగ్రహణంబున నీదక్షిణదిశ క్రూరకర్ములగు రాక్షసులచేత ధర్షించుట కశక్యంబనియు సజ్జనాభిగమ్యం బనియు ముల్లోకంబులం బ్రసిద్ధి వహించెఁ జిరజీవియైన యీయగస్త్యుని యాశ్రమంబు శ్రీమంతంబై వినీతజన సేవితంబై యొప్పునీలోపాముద్రా కాంతుండు విశ్రుతకర్ముండును లోకార్చితుండును సాధుజన హితరతుండును గావున సమాగతుల మైన మనకు శ్రేయంబొసంగు నట్లగుటం జేసి॥ (ఉ) ఇల్వలభంజనుండయిన, యీమునియంఘ్రులకుత్సుకాత్ములై । చెల్వుగ నిత్యమర్చనముఁ జేయుచుఁ బుణ్యకథేతిహాసము । ల్బల్విడిఁ బ్రీతితో వినుచుఁ, బాయక తత్కృపనొంది యిందుని । చ్చలవన వాసశేషదివ, సంబులుపుచ్చఁ గరాదెలక్ష్మణా ॥ (ఉ) నిచ్చలు దేవదానవము, నిప్రభుచారణ సాధ్యులాదిగా। నిచ్చట నెవ్వనింగుతుక, మేర్పడ వేడ్క భజింపుచుందు రా । సచ్చరితు న్నమస్తముని, సత్తముఁ గీ సుగుణాలవాలుని । న్మచ్చట దీరఁగా మనము, మోదమునం గొనియాడుటొప్పదే ॥ (చ) నరసురయక్షకింపురుష, నాగనభశ్చరసిద్ధసాధ్యకి । న్నరగరుడోరగాదులు న, నారత మిమ్మునినాథుఁగొల్చుచుం। బరమమునీంద్రుల న్వరవి, మానరథస్థులఁ జేసి సమ్మదో । త్కరమున వెంటఁ దోడుకొని, గ్రక్కునఁ బోదుర శక్రువీటికిన్ ॥ (తే,గీ) కామవృత్తుండు క్రూరుండు, ఘాతుకుండు । పండితుఁడు గానివాఁడుశ, ఠుండు ఖలుఁడు । గూఢవిప్రియకారియు, ధూర్తుఁ డిచట । నిలిచి జీవింపఁ గాఁ జాలఁ, డలఘుచరిత ॥ (తే,గీ) మునులనేకు లివ్వనమున, ఘనతపోవి । శేషనిష్ఠలు సల్పి సం, సిద్ధులగుచు । దివ్యదేహులై రవినిభ, దేవయాన । మెక్కి చనుదురు హరిపురి, కక్కజముగ ॥ (తే,గీ) దశరథాత్మజ యిచట భూ, తములచేత । సురలు ప్రార్థితులయి మెచ్చి, పరమకరుణ । వెలయయక్షత్వ మమరత్వ, మలఘురాజ్య। మిత్తుఁ రీయాశ్రమమహత్త్వ, మిట్టి దరయ ॥ (తే,గీ) అనఘ లక్ష్మణ నీవు ము,

**లక్ష్మణుఁడగస్త్యమహర్షికి రాముని రాక యెఱింగించుట.**

న్నరిగి నాదు । రాక యెఱిఁగించి పుచ్చుము, రవిసమాన । తేజుఁడగు కుంభసంభవ, దివ్యమౌని । కనవుడు నతండు నత్తపో, వనముఁ జేరి ॥ (క) అచ్చట నొకముని శిష్యుని । నచ్చుపడం జూచి దశర, థాగ్రతనయుఁడున్ । సచ్చ



రితుఁడగు రాముఁడు । వచ్చినవాఁడిత్తపస్వి, వర్యునిఁ జూడన్ ॥ (వ) ఏనమ్మహాత్ముని యనుజన్ముండ లక్ష్మణుం డనువాఁడ నిత్యంబును భృత్యమాత్రుండనై పరిచర్యాభక్తి యోగంబులం గొల్చి యుండుదు నట్టి యేనును సీతయుఁ దనవెంబడిం జనుదేరఁ బితృశాసనంబున దండకారణ్యంబునం జరియింపఁ జనుదెంచిన వాఁ డనవుడు నమ్మునిశిష్యుండు శీఘ్రంబున నగ్నిశాలకుం జని యగస్త్యుని సందర్శించి కృతాంజలియై దేవా దశరథనందనుండగు రాముండు సీతాలక్ష్మణసహితుండై మిమ్ము సందర్శించి మీకు శుశ్రూషఁ గావింపం జనుదెంచి యున్నవాఁ డని విన్నవించిన నమ్మహర్షిశ్రేష్ఠుం డస్మత్కుల దైవతంబైన శ్రీరాముండు సీతాలక్ష్మణోపేతుండై వచ్చియున్న వాఁడని శిష్యునివలన విని శ్రవణానందం బనుభవించి శిష్యునవలోకించి మద్భాగ్యవశంబున రాముండు చిరకాలంబున కిప్పుడు నన్ను విలోకించుటకుం జనుదెంచె నమ్మహాత్మునిసమాగమంబు నాచేతఁ బెద్దకాలంబుననుండి కాంక్షితంబైన యదియెకదా కల్యాణగుణసాంద్రుఁడైన యారామ చంద్రునిం గన్నులారం గనుంగొని యమ్మహానుభావునకతిథిసత్కారంబుఁగావించి కృతార్థుండ నయ్యెద సీతాలక్ష్మణసహితంబుగాఁ దోడ్కొని రమ్మనిన నతండు రయంబునం జనుదెంచి లక్ష్మణుంగాంచి రాముండెచ్చట నున్నవాఁడు మునీంద్రుండింజూడ నవశ్యంబు చనుదెంచుంగాక యని పలికిన నాలక్ష్మణుండమ్ముని శిష్యునిందోడ్కొనిచని సీతారాములం జూపిన నతండు మునివచనంబారామునకుం జెప్పి వారలం దోడ్కొని యాశ్రమంబుఁ బ్రవేశించె నట్లు రఘువల్లభుండు సీతాలక్ష్మణ సమేతంబుగాఁ బ్రశాంతహరిణాకీర్ణంబైన తపోవనంబుఁ బ్రవేశించి యందు బ్రహ్మస్థానంబును వహ్నిస్థానంబును విష్ణుస్థానంబును మహేంద్రస్థానంబును సూర్యస్థానంబును సోమస్థానంబును భగస్థానంబును గుబేరస్థానంబును ధాతృ విధాతృ స్థానంబులును వాయు స్థానంబును శేష స్థానంబును గాయత్రీ స్థానంబును వసుస్థానంబును వరుణ స్థానంబును గార్తికేయ స్థానంబును ధర్మ స్థానంబును మొదలు గాఁగల దేవ స్థానంబు లన్నియు విలోకింపుచుఁ బరమాద్భుతంబు నొందుచుం జని చని యొక్కచోట శిష్యగణ పరివృతుండై దీప్తతేజులైన మహర్షుల నడుమ శాశ్వతుండైన పరమేష్ఠి చందంబున సుఖాసీనుండై తేజరిల్లుచున్న యక్కుంభసంభవ మహర్షిశ్రేష్ఠుని దవ్వులం జూచివినయవినమిత గాత్రుం

డై యరుగుచుండె నమ్మహర్షి ముఖ్యుండును సీతాలక్ష్మణసహితుండై వచ్చుచున్న రామచంద్రునల్లంతనె విలోకించి దిగ్గునఁ బరమాసనంబు డిగ్గి రయంబున నెదురుగాఁ జనుదెంచుచుండ నప్పు డా రఘువల్లభుండు లక్ష్మణున కిట్లనియె ॥ (క) ఇమ్ముని మన కెదురుగఁ జ । న్రమ్మునఁ జనుదెంచెడు న్ద, పమ్ములకు నిధా । నమ్మగు నీయన నౌదా । ర్యమ్మునఁ గుంభజుఁ డఁటంచు,నాత్మ నెఱుఁగితిన్ ॥(క)

―(*) రాముఁ డగస్త్యమహర్షిని సందర్శించుట. (*)―

అని లక్ష్మణుతో నాడుచు । జననాయకుఁ డతఁడు తాను, సంభ్రమమునభూ । తనయాయుతముగఁ జనియ । మ్మునిపదపద్మముల కొరిగె, మోదం బెసఁగన్ ॥ (క) పదపడి లక్ష్మణుఁ డమ్ముని । పదములకుం బ్రణుతిఁ జేసె, భక్తియుతుండై । సుదతీ రత్నము జానకి । ముద మలరఁగ మ్రొక్కెఁ బిదప, ముని పదములకున్ ॥ (తే,గీ) అంత నమ్మునిశేఖరుం, డమ్మహాను । భావు నాలింగనముఁ జేసి, బహువిధములఁ । బ్రేమ నభినుతిఁ గావించి, సేమ మరసి । హర్ష మిగురొత్తఁ గూర్చుండు, మనుచుఁ బలికి ॥ (వ) శీఘ్రంబున వైశ్వదేవంబుఁ గావించి మొదల బ్రాహ్మణాతిథుల నర్ఘ్యదానంబున నర్చించి వానప్రస్థధర్మంబున వారికిభోజనం బొసంగి తానును సుఖాసీనుండై తన కభిముఖంబుగా రాముని సుఖాసీనుం గావించి రఘువరా తపస్వియగువాఁడు పూజ్యపూజాతిక్రమణంబుఁ గావించెనేని కూటసాక్షియుం బోలెఁ బరలోకంబు నందు స్వమాంసభక్షకుం డగుఁ గావునఁ బ్రత్యవాయ పరిహారార్థంబు నిన్నుం బూజించెద నని పలికి వెండి యునిట్లనియె ॥ (సీ) కనకాసనాగ్రభా, గమున నుండెడు నీకు నీకుశవిష్టర, మిచ్చుటెంత । రమణీయదానధా, రాశాలి వగు నీకు నాయిచ్చు విమలార్ఘ్య, తోయ మెంత । యను దిన శాల్యోద, నాహారి వగునీకు నీమూలఫలము లే,నిచ్చు టెంత । నిరుపమకాంచనాం, బరధారి వగు నీకు నీవల్కలాజిన, మిచ్చుటెంత ॥ (తే,గీ) భక్తి నేనిచ్చు పుష్కర, పత్రపుష్ప । మాత్రమును గైకొనుట గాక, మనుజవర్య । తర మెఱిఁగి నిన్నుఁ బూజింపఁ, దరమె నాకు । నిమ్ముఁ గనుఁగొంటి నంతియె, మేలు గాక ॥ (వ) మహాత్మా నీవు సర్వలోకాధిపుండవు ధర్మచారివి మాన్యుండవు పూజనీయుండవు ప్రియాతిథివై చనుదెంచుట వలనఁ గృతకృత్యుండ నైతి ననిపలికి ఫలమూలపుష్పంబుల యథేష్టంబుగాఁ బూజిం



―(*) అగస్త్య మహర్షి రామునకు దివ్యంబులగు ఖడ్గ బాణ (*)―
―(*) తూణీర కోదండంబు లొసంగుట. (*)―

చి క్రమ్మఱ నిట్లనియె ॥ (సీ) తత హేమకనకభూ, షిత విశ్వకర్మ నిర్మిత దివ్య వైష్ణవ, వితత ధనువు । పద్మసంభవదత్త, పరమ భాస్కర కిరణోపమామోఘశ, రోత్తమంబు । శక్రవిశ్రాణితా, క్షయ సాయ కాంబక సంపూర్ణ దీర్ఘని, షంగములును । రమణీయతర మహా, రజతకోశ ప్రశస్త సువర్ణ భూషిత, శాతఖడ్గ ॥ (తే,గీ) మ ర్థి నొసఁగెద విజయార్థ, మమరవిభుఁడు । కులిశమును బోలెఁ గైకొను మల రథాంగ । పాణి యీసాధనంబుచేఁ, జగముగెలిచి । శతమఖునకుఁ ద్రైలోక్య రాజ్యం బొసంగె ॥ (క) అనిపలికి మహాతేజుఁడు । మునిపతి సత్కరుణ మీఱ, మోదంబలర । న్ధనురాది సాధనంబులు । ఘనమతి రాఘవునకొసఁగి, క్రమ్మఱఁ బలికెన్ ॥ (క) నరనాథ నీకు శుభమగు । ధరణిసుతా లక్ష్మణాన్వి, తంబుగ నన్నుం । బరికింప వచ్చినందునఁ । బరితుష్టుఁడ నైతిఁ దపము ఫలియించె రహిన్ ॥ (ఉ) పిన్నటనాఁటనుండియును, బెక్కు సుఖంబుల వర్ధమానయై । వన్నియఁ గన్న దాట నిటు,వంటి యవస్థలకోర్వలేక యా । పన్నత నొందియున్నది, నృపాలక జానకి కంటె భక్తిసం । పన్నతయు న్సచిత్త్వమ స,మానసతీత్వముమాకుఁ దెల్పెచున్ ॥ (చ) నరవర సద్మసౌఖ్యము మనంబున నెంచక యీవధూటి దు । ర్భరవనవాససంజనిత, బాధఁ దలంపక భర్తృభక్తిచే । వరుస నరణ్యసీమ కిటు,వచ్చుటఁ జేసి యపాంసులాశిరో । వరమణియయ్యెఁ గాదె తన,వారికి నిత్యయశంబు గల్గఁగన్ ॥ (క) వైదేహపుత్రి బాల్యం । బాదిగ సుఖలీలఁ బెరిగె, నటుగాన మనః । ఖేదంబు గలుగకుండఁగ । సాదరముగ నరసి ప్రోవు,మనఘవిచారా ॥ (క) ఈలోకంబునఁ బ్రకృతి । స్త్రీలు పతి సమస్థుఁడైన, సేవింతురతం । డోలి విషమస్థుఁడగు నపు । డాలస్యముఁ జేసి విడుతు,రవహితబుద్ధిన్ ॥ (క) విద్యుచ్చపలత్వము శ । స్త్రోద్యత్తీక్ష్ణతయుమారు,తోరగరిపువే । గోద్యోగతయుం గైకొని । విద్యుద్గాత్రలు నిబెచ్చ, విహరింతురిలన్ ॥ ఏ తాదృశదుర్దోష । వ్రాతపరిత్యక్తయైన వసుధాసుతవి । ఖ్యాతిఁ బొలుపొందు ననసూ । యా తారా పార్వతీర మాదుల కెనయై ॥ (క) జనవర యిచ్చట లక్ష్మణ । జనకసుతలు గొలువ నీవు చరియించితి వా । ఘనదేశ మలంకృతమై । యనవరతం బతిపవిత్ర మైయొప్పుఁ గదా ॥ (వ) మహాత్మా

సూర్యుం డస్తమించుచున్నవాఁ డీరాత్రి యిచ్చట సుఖంబుండుమని పలికిన నారఘూత్తముండు మునివచనప్రకారంబునఁ బశ్చిమసంధ్య నుపాసించి యమ్మునిగ్రామణిచేతఁ బూజితుండై పుణ్యకథేతిహాసంబు లాకర్ణింపుచు సీతాలక్ష్మణసహితంబుగా నచ్చోట వసియించి మఱునాఁడు సూర్యోదయంబున సానుజుండై కాలోచితకృత్యంబులు నిర్వర్తించి సముచితంబుగా నమ్మునివల్లభు సందర్శించి నమస్కరించి యతనిచేతం బ్రతిపూజితుండై యంజలిఁ గీలించి యిట్లనియె ॥ (చ) అనఘ భవత్తపోవనము నందు సుఖించితి నేఁటిరాత్రి భూ । తనయయుఁ దమ్ముఁడుం గొలువఁ దద్దయుఁ బుణ్యధనుండవైన నిన్ । గనుఁగొని ప్రీతిఁ బూజనముఁ గైకొని నందున రాజకోటిలో । వినుతికి నెక్కితిన్ భువన విశ్రుత భూరియశంబుఁ గాంచితిన్ ॥ (వ) మునీంద్రా సీతాలక్ష్మణసహితంబుగా

(*) అగస్త్యుని శ్రీరాముఁడు తాము వసియింపఁదగిన ప్రదేశంబు దెలియఁ (*) జెప్పఁ గోరుట.

నాకు వసియింపం దగిన రమ్యప్రదేశం బొక్కటి యానతిమ్ము నీవు త్రైకాలిక సకలజగద్వృత్తాంతాభిజ్ఞుండవు నీకు గోచరింపని యర్థంబు లేదని పలికిన నమ్మునిశ్రేష్ఠుం డొక్క ముహూర్తంబు చింతించి విజ్ఞానవిలోచనంబున భావికాలవృత్తాంతం బెఱింగి ధీరుండై రాజేంద్రా యిచ్చటికి యోజనద్వయమాత్రంబు దవ్వుల గోదావరీతీరంబున బహుమూలఫలోదకంబైన పంచవటియనం బరఁగు నొక్కపుణ్యదేశంబు గలదచ్చోట రమ్యంబుగా నాశ్రమంబు నిర్మించుకొని యందు సీతాలక్ష్మణసహితుండవై విహరింపుచు వనవాసశేషదివసంబులు పుచ్చుము తండ్రిచేత దత్తంబైన సమయకాలంబు డగ్గరియెఁ గావునఁ దీర్ణ

( అగస్త్యమహాముని రామునికిఁ బంచవటివాసయోగ్యమని యానతిచ్చుట. )

ప్రతిజ్ఞుండవై సుఖంబుగా రాజ్యంబు నధిగమించెదవు యెవ్వండు జ్యేష్ఠపుత్రుండవైన నీచేత యయాతియుంబోలెఁ దారితుండయ్యె నట్టి దశరథుండు ధన్యుండయ్యె నేను కైకేయి దుర్మంత్రంబును దశరథుని ప్రవిలాపంబును భవదాగమనంబును భావికాలవృత్తాంతంబును సర్వంబును దపఃప్రభావవిశేషంబున నెఱింగి యున్నవాఁడఁ గావున మత్సమేతంబుగా మదీయాశ్రమనివాసంబునం దభీష్టంబుగలవాఁడ నయ్యును బంచవటికిం బొమ్మని ధీరతరంబుగాఁ బలికితి నప్పంచవటీ దేశంబు ప్రాజ్యమూలఫలంబై నానాద్విజగణయుతంబై వివిక్తంబై పు



ణ్యంబై రమ్యంబై శ్లాఘ్యంబై యుండు నచ్చట వైదేహి మనోహరంబుండగు హరింపంగలదు నీవచ్చట యథాసుఖంబుగా వసియించి తాపసుల రక్షింపుచుండు మిట్లైన నీకుఁ గార్యసిద్ధియగునని పలికి వెండియు నిట్లనియె ॥ (సీ) జననాథ యిచ్చటికి, కనతిదూరంబునఁ గలదు సాంద్రమధూక, కాననంబు । పరఁగ నవ్వనికి నుత్తరభాగమున నేగఁ గనుపట్టు నొకవట, క్ష్మారుహంబు । దానికవ్వల నొక్క, ధరణీధరం బొప్పుఁ దత్సమీపంబునఁ, దనరు నొక్క । సమతలంబైన దేశంబది యుల పంచవటియను విఖ్యాతి, వఱలు దేశ ॥ (తే,గీ) మనవరతపుష్పి[illegible]మై చెలంగు । నచటి కేగుమటన్న, యయ్యకళంకులుఁడు । మౌనిప[illegible]కరించి న, మస్కరించి । నమ్రుఁడై ప్రీతి నామంత్ర, ణం బువడసి ॥ (ఉ) తానును లక్ష్మణుండు వితతస్ఫుటచాపశరాసితూణముల్ । మానుగఁ దాల్చి మిక్కిలి సమాహితులై రణరంగధీరులై । మానుగ సీతఁ దోడ్కొని స, మంచిత తేజము పిక్కటిల్లన । మ్మౌనివరోపదిష్టమగు, మార్గమునం జని రవ్వనంబునన్ ॥ (క) ఇత్తెఱఁగున నేగుచు రఘు । సత్తములొక చోటఁ గనిరి, శైలనిభు గృ । ధ్రోత్తము నిభీమకాయును । దాత్తబలు వటస్థుఁ బుణ్యు, తమునతివృద్ధున్ ॥ (తే,గీ) కాంచి వాని నిశాటునిఁ, గాఁ దలంచి । ధీరులై యెవ్వఁడవు నీవు, తెల్పుమనిన । నా విహంగమనాథుఁడ, త్యాదరమున । నినకులులఁ జూచి మధురోక్తి, నిట్టులనియె ॥ (క) అనఘాత్ములార నను మీ । జనకుండగు దశరథునకు సచివుని గమనంబు । సనెఱుఁగుఁడనినఁ బితృసఖుఁ । డని యతనికిఁ బూజఁ జేసి రధికప్రీతిన్ ॥ (క)

—(*) జటాయువు తనవృత్తాంతంబు శ్రీరామున కెఱింగించుట. (*)—

వానికులం బాతని యభి । ధానముఁ దెలియంగ నడుగఁ దడయక యతఁడున్ । మానుగఁ దనవృత్తాంతము । ధీనిధి రాఘవునితోడఁ దెలియఁగ ననియెన్ ॥ (వ) మహాత్మా తొల్లి విరించికిఁ బుత్రులైన కర్దముండును విక్రీతుండును శేషుండును సంశ్రయుండును స్థాణుండును మరీచియు నత్రియుఁ గ్రతుండును బులస్త్యుండును నాంగిరసుండును బ్రచేతసుండును బులహుండును ననువారలు సృష్టికారణులై జన్మించిరందు మరీచికిఁ గశ్యపాహ్వయుండు పుట్టె మఱియు బ్రహ్మదక్షిణాంగుష్ఠసంభవుండైన దక్షునకు నఱువది మందికూఁతులు జనించి రందు నదితియు దితియు దనువుఁ గాళికయుఁ దామ్రయుఁ గ్రోధవశయు మనువు ననలయు ననువారి నెనమండ్రఁ గన్యకలఁ గశ్యపుండు వివాహంబై వీరము

ఖిలంబాలింపంగలవారి మత్సమానులఁ బుత్రులఁబడయుండనిన నందది
దితియుఁగాళియు నీముప్పురుపతివాక్యంబునకీయకొనిరి తక్కినభార్యలు
పతివాక్యంబంగీకరింపకుండి రాముప్పురిలోనఁ బతివిశ్వాసతారతమ్యంబు వల
న నదితిత్రయస్త్రింశత్కోటిదేవతలను ద్వాదశాదిత్యులను వసువుల నేకాదశ
రుద్రుల నశ్వినీదేవతలంబడసె దితికి బలవంతులైన రాక్షసులు పుట్టిరి తొల్లి
యీవసుంధర వారల యధీనంబని వినంబడు దనువనుదానికి హయగ్రీవుండ
ను దానవుండుపుట్టెఁ గాళికయను దానికినరకుండును గాళకుండునను వారి
రువురు [illegible] తామ్రయను నది క్రౌంచియు భాసియు శ్యేనియు ధృతరాష్ట్రి
యు శుకియనను నేవురఁ గూతులగనియె నందుఁగ్రౌంచియను దానికినులూ
కంబులుపుట్టె భాసియను దానికి భాసంబులు పుట్టె శ్యేనియను దానికి శ్యే
నగృధ్రంబులుపుట్టె ధృతరాష్ట్రియనుదానికిహంసకల హంసచక్రవాకంబులు
పుట్టె మఱియును దానికి నతపుట్టె నతకువినతజన్మించెఁ గ్రోధవశయనుదాని
కి మృగియు మృగమందయు హరియు భద్రమదయు మాతంగియు శార్దూ
లియు శ్వేతయుసురభియుసర్వలక్షణసంపన్న యగు సురసయుఁగద్రువయునను
పదుగురు కూఁతులుద్భవించి రందు మృగియను దానికి మృగంబులును మృగ
మందయనుదానికిభల్లూకంబులును నీలవాలంబులైన సృమరంబులును శ్వేత
వాలంబులైన చమరంబులును హరియను దానికి సింహంబులును వానరంబు
లునుబుట్టె భద్రమదయనుదానికి నిరావతియనుకూఁతురు గలిగె నయ్యిరావతి
కైరావతంబను మహాగజంబుపుట్టె మాతంగియనుదానికి మాతంగంబులు పు
ట్టె శార్దూలియను దానికి వ్యాఘ్రంబులును గోలాంగూలంబులును బుట్టె
శ్వేతయనుదానికి దిగ్గజంబులుపుట్టె సురభియనుదానికి రోహిణియు గంధర్వి
యునను కూఁతులిద్దరుజన్మించి రందు రోహిణి యనుదానికి గోవులును గంధ
ర్వియనుదానికి హయంబులునుంగలిగె సురసయనుదానికి బహుఫణంబులైన
బర్పంబులుపుట్టెఁ గద్రువయను దానికిఁ బన్నగంబులు పుట్టె మనువను దానికి
సబ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్ర ప్రముఖులైన మనుష్యులు జన్మించిరి యనల య
నుదానికిఁ బిండకారఫలంబులైన వృక్షంబులుపుట్టె మఱియు సురస చెలియల
గు కద్రువకు శేషవాసుకి పురోగములైననాగ సహస్రంబులు పుట్టె నందు
సహస్రశిరుండైన శేషుండు ధరణీధరుండయ్యె శుకిపౌత్రియైన వినతకరుణుం





డును గరుడుండన నిద్దఱు కొడుకులు గలిగి రందరుణునకు మహాబలుండగు
సంపాతియు నేనును జన్మించితిమి మదుత్పత్తికథనార్థంబు సృష్టిక్రమం బం
తయు నెఱింగించితి నరుణుని భార్య వేఱొక్కశ్యేనియని యెఱుంగుము శ్యేని
పుత్రుండనైన నన్ను జటాయువునిఁగా నెఱుంగు మేను మహాబలుండ ఁ శర
థునకు సచివుండ నీవిచ్చట వసించితివేని భవత్కామితంబులు దీర్చుచు ఫ
లార్థులై యొండుచోటికిం బోయినప్పుడు జానకిం బరివేష్టించి రక్షింపుచుం
డెద నిబిడదుర్గమంబగు కాంతారంబు మృగరాక్షస సేవితంబై యుండు నిమ్మ
హాగహనంబున మదీయసాహాయ్యం బంగీకరించుట నీకవశ్యకర్తవ్యంబని పలి
కిన నతని పలుకులకలరి రాముండు వానిఁ బితృసఖునిఁగా నెఱింగి పూజించి
సంతోషించి యతనిఁ గౌఁగిటజేర్చి యతనితోడ సఖ్యంబుఁ జేసి సారెసారె
కు నతనివలనఁ బితృసఖత్వ వృత్తాంతంబు ముదంబున నాకర్ణింపుచునతనిం

—(*) శ్రీరాముఁడు సీతాలక్ష్మణ సహితుండై పంచవటింజేరుట. (*)—

దోడ్కొని సీతాలక్ష్మణసహితుండై యనలుండుశలభంబులంబోలె శాత్రవుల
దహింపుచుఁ గొండొకదూరంబరిగి నానావ్యాళ సమాకీర్ణంబైన పంచవటీ
దేశంబుఁబ్రవేశించి దీప్తతేజుండైన సౌమిత్రినవలోకించి యిట్లనియె ॥ (క)
అగణితమహిమాస్పదుఁడా। యగస్త్యముని చెప్పినట్టియలపంచవటిన్ । సుగు
ణాఢ్య చేరితిమిగద । తగియున్నదికం పుష్పితద్రుమమగుచున్ ॥ (ఉ) ఈవన
మధ్యదేశము సమృద్ధనవాంబు జలాశయాన్వితం । బై వివిధప్రసూనసముదం
చితరమ్యవిశాలవృక్షమై । పావనసంయమీంద్రపరిపాల్యతపోవనరాజిరంజితం ।
బై విలసిల్లుచున్నదవు నామనకిచ్చటనిల్వఁగాఁదగున్ ॥ (క) పొందుగనీకానన
మునఁ। గందువలరయంగనీవుకడునేర్పరివీ । సందునవేడ్కమనకుని । ల్వం
దగుచోటెద్దిదానిఁబరికింపుమికన్ ॥ (చ) నాకునునీకుజానకికి నల్వుగనెద్దిమ
నోజ్ఞమెద్దిప । ద్మాకరయుక్తమెద్ది విమలాంబు సమిత్కుశమూలమెద్ది య ।
స్తోకఫలప్రసూనమయి సొంపుగశోభిలునట్టిచోటఁ బు । ణ్యాకరపర్ణశాలచె
లువార రచింపుము నేర్పుపెంపునన్ ॥ (చ) అనవిని లక్ష్మణుండు వినయంబున
నంజలిఁజేసియిట్లనున్ । మనుకులవర్యనీవు గరిమందగవర్షశతంబు ప్రీతిని । వ్వ
నివసియించియుండఁ బరవంతుఁడనై తినిమీరుచూచితోఁ । చినరుచిరస్థలంబునర
చింపుమఁటంచు వచింపఁ డెంతయున్ ॥ (తే,గీ) అనినఁదమ్ముని మాటలకలరి

రాజ। వర్యుఁడచ్చటరుచిరనివాసమొకటిఁ । గాంచికరముననాతనికరమువట్టి।
యెలుఁగుసమధుయుక్తమగుచుండనిట్టులనియె ॥ (క) తమ్ముఁడయీదేశమురు।
మ్యమ్మై కుసుమితమహీరుహశ్రేణియు। క్తమ్మై యున్నదియిటరుచి। రమ్ముగ
నొకయాశ్రమంబురచియింపుమిఁకన్ ॥ (క) ఘనసురభిగంధిరవినిభ । వనరు
హములచేతమిగులవ్యావృతమైయీ । యనువునవెల్లెడనొప్పెడిఁ । గనుఁగొం
టివెపద్మినీనికాయంబనఘా ॥ (చ) మునిపతిచెప్పినట్లు బహుపుష్పితభూమిరు
హప్రకాండమై । యనుపమచక్రవాక బకహంసమరాళవిరాజమానమై । ప్ర
ణుతనవాంబుసంభవ తరంగకణద్రవగంధవాహమై । కననగుచున్న దల్లదిగో
గౌతమికంటివెయమ్మహానదిన్ ॥ (ఉ) ప్రాంశువినీలకందరవిభాసితమై సితరక్త
నీలపీ । తాంశుపరీతధాతునిచయావృతమైబహుగండశైలమై । కింశుకపాట
లీవకుళ కేతకిసాలతమాలశింశుపా । వంశకరీరచిత్రమయివారక పర్వతసంఘ
మొప్పెడున్ ॥ (సీ) సాలరసాల హింతాలతాలతమాల చందనస్పందనచంప
కామ్రము। లుఁగమాధవమాతులుంగనారంగలవంగపున్నాగనీవారలికుచ । ఖ
ర్జూరపనసాశ్వకర్ణ ధవాంకోలతిలకకురంటకతిమిశఖదిర । కింశుకశింశుపా
వంశపాటలనీపకేతకీబిల్వభల్లాతకాది ॥ (తే,గీ) వివిధతరువల్లికాగుల్మపిహిత
మగుచు । నీవనంబొప్పుచున్నది యిచటనిలిచి । యీఖగేంద్రుని తోఁగూడి
యెలమిసమయ । వాసరంబులు గడపంగవలయుమనకు ॥ (క) అనిరామవి
భుఁడువలికిన । వినిముదమునలక్ష్మణుండువిశ్రుతభంగిం । దనరారునట్లుగ్రకుట

—(*) శ్రీరామునియనుజ్ఞవడసి లక్ష్మణుండుపర్ణశాలనిర్మించుట. (*)—

న। ఘనముగ నొకపర్ణశాలఁ గావించెరహిన్ ॥ (వ) అదిమఱియు రమ్య
యువిపులయు భిత్త్యాకారకృత మృత్తికయు శమీశాఖా సమాస్తీర్ణయు సు
స్తంభయు సుశోభనయు దీర్ఘవంశ కృతగృహోర్ధ్వకాష్ఠయు దృఢపాశా
వపాశితయుఁ గుశకాశ శరపర్ణపరిచ్ఛాదితయు సమీకృతతలయుఁ బ్రేక్షణీ
యయునైయొప్పె నంత లక్ష్మణుండు గోదావరీ నదికిం జనియందుఁ గృతస్నా
నుండై నూతనపద్మంబులు సంగ్రహించుకొనిసఫలుండై రయంబునం జనుదెం
చివాస్తుపూజఁగావించి విధ్యుక్తప్రకారంబున శాంతికర్మం బాచరించిస్వకృ
తంబైన తదాశ్రమపదంబు రామునకుంజూపిన నమ్మహానుభావుండు సీతాసహి
తుండై పర్ణశాలారచనావిశేష విలోకనసంజాత సాంద్రానంద పారవశ్యఁ



బునఁ దమ్ముని గాఢంబుగాఁ బరిరంభించి దుందుభిస్వనకల్పంబగు స్వరంబున
నతిస్నిగ్ధంబుగా నిట్లనియె॥ (తే,గీ) అనఘయద్భుతకర్మమిట్లాచరించి। తీవు
సమ్మోదమొదవెసంభావనార్థ। మొసఁగఁదగినపరిష్వంగ మొసఁగినాఁడ।
జేకొనిమనంబున ముదంబుఁజేర్చుమిపుడు ॥ (తే,గీ) భావవిదుఁడవు కులధ
ర్మకోవిదుఁడవు । ఘనుఁడవు కృతజ్ఞుఁడవు వీతకల్మషుఁడవు । పాలకుఁడ వైన
నీచేతఁబఙ్క్తిరథుఁడు । ధరణిసంవృత్తుఁడయ్యెఁ దథ్యంబువత్స ॥ (క) అనివ
లికి రమావధనుఁ । డనఘుఁడురాముఁడు ప్రియాను జాన్వితుఁడై చ। య్యా
నగృధ్రపతియుతంబుగ । వినుతగతింబర్ణకుటిఁ బ్రవేశించెఁ దగన్ ॥ (చ)
అనిశము మౌనిపూజనము లందుచు నాకము నందుఁబాకశా । సనుఁడునుఁ
బోలె రుచ్యఫల సంభృతమై తనరారుతత్పదం । బునసుఖలీలఁగొన్ని దినము
ల్వశిరైవసియించె నంతనా । జనపతికిష్టమైపొడమె సాంద్రగతిన్ హిమకా
లముద్ధతిన్॥ (ఉ)ఆరఘువంశవార్ధివిధుఁడందొకనాఁటిప్రభాతవేళసాం । పా
రఁగజానకీసహితుఁడై యభిషేక నిమిత్తమర్థిమై । వారకగౌతమీనదిక వా
ర్యగతింజనుచుండవెంటనిం । పారఁగఁబోవుచుండివిన యజ్ఞుఁడు లక్ష్మణుఁడన్న
కిట్లనున్॥ (తే,గీ) ప్రియవచనశీలయెయ్యది ప్రియమునీకు । వర్ష మెద్దానిచే

—(*) లక్ష్మణుండు రామునకు హిమకాలంబు నభివర్ణించిచెప్పుట(*)—

తదుర్వ్యారభంగిఁ । దగనలంకృతమైనచందాననలరు । నట్టివలితఱిసంప్రాప్తమ
య్యెఁగంటే॥ (తే,గీ) పరఁగలోకంబునీహారపరుషమయ్యె। సస్యశాలినియైయొ
ప్పెజగతియెల్ల । యీపగాంబువులనుపభోగ్యంబులయ్యె । వీతిహోత్రుఁడభీష్టుఁ
డై వెలసెనిపుడు॥ (తే,గీ) అనఘచరిత నవాగ్రయణార్చనముల । సురలఁబిత
రులసంతుష్టిపరులఁజేసి। యజ్వలుకృతాగ్ర యణకులై యపగతాఘు। లైమి
గులఁబరిశుద్ధాత్ములగుదురిపుడు॥ (క) సంపన్నగోరసములై। సొంపారఁగజన
పదములుశోభిలుచుండన్। బెంపెసఁగదండయాత్రా । లంపటులై యుందురిపు
డురాజులుధాత్రిన్॥ (క) ఇనుఁడంతకదిగ్భాగము । ననురక్తిభజింపుచుండ న
పరిష్కృతమై । ధనదాశచెలువుఁగోల్పడె । ననుదినమువిహీనతిలక యగుసతి
మాడ్కిన్॥ (క) హిమకోశాఢ్యుండగునా । హిమవంతుఁడు దూరగతదినేశ్వ
రుఁడగుచున్। హిమసిక్తుండై యిప్పుడు । నమజ్జనశరణ్యసత్యనామకుఁడయ్యెన్॥
(వ) మఱియునిప్పుడు దివసంబులు కించిదుష్ణసూర్యంబులై సావశ్యాయంబులై

సమారుతంబులై పటుశీతంబులై హిమోపవాతంబులై శూన్యారణ్యంబులై మ
ధ్యాహ్న కాలంబున సుఖస్పర్శంబులై యత్యంత సుఖసంచారంబులై సుభగా
దిత్యంబులై ఛాయాసలిలదుర్భగంబులై యొప్పుచున్న యవి రాత్రులు నివృ
త్తానావృత దేశభోగిపల్యంకంబులై తుషారధూసరంబులై శీతస్పర్శ మారు
త సమేతంబులై పుష్యనీతంబులై యతిదీర్ఘంబులై చచున్న వదియునుం గా
క ॥ (క) హిమధూసర మండలుఁడై । సముదిత రవికరగృహీత సౌభాగ్యుం
డై । కమలారి యొప్పెగగనప । థమున వినిశ్శ్వాసమలినదర్పణముక్రియన్ ॥
(తే,గీ) నరవరోత్తమ పున్నమనాఁడెపండు । వెన్నెల తుషారమలినమై విపిన
వీథి । నాతపశ్యామమైయెన ధరాత్మజాత । పగిది శోభింపకున్నది భాను తేజ ॥
(క) తడయక నతిశీతలుఁడగు పడమటి గాడ్పడరి యిపుడు ప్రాలేయముచేఁ।
దడుపంబడివనమునసుడి । సెడుగంటివె దేవద్విగుణ శీతలుఁ డగుచున్ ॥ (క)
నవబాష్పచ్ఛన్నంబులు । యవగోధూమాన్వితంబు లగువిపినంబుల్ ।రవిహో
డము వేళ సారస । రవములు రంజితములయ్యె రాఘవకంటే ॥ (క) పరిపూ
ర్ణతండులములగు । నిరుపమ ఖర్జూరపుష్ప నిభ మంజరులన్ । వరకనక
చ్ఛవిశాలులు । కరము వినమ్రంబులగుచుఁ గ్రాలెడుఁ గంటే ॥ (క) రమణీ
య శీల చూచితె । సముదితుఁడగు హేళిసాబగుచనదూరమునన్ । హిమజా
ల పరీతమయూ । ఖములం జందురుని పగిదిఁ గానగనయ్యెన్ ॥ (తే,గీ) వి
నుముదయవేళ నగ్రాహ్య వీర్యమగుచుఁ । పరగ మధ్యాహ్న మున సుఖ స్ప
ర్శమగుచు । గించిదర్జునమై సముదంచితముగ । నవనిపై బ్రాలెఁ గంటె
బాలాతపంబు ॥ (తే,గీ) మహిత ముక్తాఫలసమాన తుహిన బిందు । జాల
పరిషిక్తశాద్వల సహితమైన । గహన భూమిబాలాతప కలిత యగుచుఁ।
జిత్రగతి నున్నదిపుడు వీక్షింపుమధిప ॥ ( తే, గీ ) దేవ వనగజ మత్యంతతృ
షిత మయ్యు । సాంద్ర తరశీత సలిలంబు సంస్పృశించి । చాలదుస్పర్శ
శైత్యవ శంబువలనఁ । గ్రమ్మఱింపుచు నున్నది కరముకంటె ॥ (తే, గీ)
హంసచక్రాది విహగంబు లంబుచరము । లయ్యు సరసీజల సమీప మందుఁ
జేరి । యప్రగల్భంబులై సలి లావగాహ । నంబుఁ గావింపకున్నవి నాథకం
టె ॥ (వ) మఱియు నీవనపఙ్క్తు లవశ్యాయతమస్సంకుచిత పల్లవపుటంబులై



యుపరిపతితనీహారతమశ్ఛన్నంబులై విగత పుష్పంబులై యాంతరికంబైనని
ద్రాతమంబుచేత బాహ్యంబైన నిశాతమంబుచేత ముకుళిత నేత్రంబులై ప్రసు
ప్తంబులైన వానిమాడ్కిఁ జూపట్టుచున్న వదియునుంగాక ॥ (తే, గీ) జనవ
రోత్తమ బాష్పసంఛన్న జలము । లై రుతజ్ఞేయ విహగంబు, లై హిమార్ద్ర ।
వాలుకోదగ్ర తటములై, క్రాలుచున్న । వలఘుచరిత విలోకింపుమ ద్రినదు
ల ॥ (క) అనఘా హిమపాతనమున । ఘన శీతత్వమునసుష్ణ, కరుసి మృదు
త్వం । బున నగము మీఁద నున్నను । వనములు రుచికరము లయ్యె వరుసని
పుడిలన్ ॥ (తే, గీ) పటుజరాజర్ఝరీ భూత, పర్ణశీర్ణ । కర్ణికాకేసర
తుషార, కణపరీత । నాళశేషంబులగు నళి,నములచేత । సుర్విసరసులుశోభిం
పకున్న విపుడు ॥ (ఉ) మానము రాజ్యభోగములు, మానిమహాత్ముఁడు కైక

—(*)లక్ష్మణుఁడు రామునికి భరతగుణములనభివర్ణించిచెప్పుట.(*)—

పట్టిసం । తానితవంశధర్ముఁడయి, తాపసవేషముఁ దాల్చియిత్తఱిన్ । మా
నకనిన్నె నిత్యమును, మానసవీథిఁ దలంచిదుఃఖితుం । డై నెఱిదక్కి శీతమహి
యందువసించి తపంబుసల్పెడిన్ ॥ (తే,గీ) అనఘచారిత్రమనయట్లు, యాంభ
రతుఁడు । నిత్య మికాల మందున, నిద్రలేచి । ప్రకృతి పరివృతుఁడై కడు
భక్తితోడ । నరుగుచుండు స్నానార్థంబు, సరయు కడకు ॥ (క) అతి
సుఖ సంవృద్ధుఁడు ఘనుఁ । డతి సుకుమారుండు భరతుఁ, డత్యంతహిమా ।
ర్దితుఁడయి వేఁకువనేక్రియఁ । గుతుకంబున సరయువందుఁ, గ్రుంకుమహాత్మా ॥
(సీ) కంజాతనేత్రుండు, కమనీయగాత్రుండు నీరదశ్యాముండు,నిరుదరుండు ।
శ్రీమంతుఁడునుధర్మశేవధి మధురుండు హ్రీనిషేధుండు జి, తేంద్రియుండు ।
సత్యప్రతిజ్ఞుండు, సత్ప్రియభాషియు ననుపమ భోగార్హుఁ, డార్యసేవి । సకల
శాస్త్రార్థవి,శారదుండు మృదుండువర్ణనీయుఁడుగురు, వత్సలుండు॥(తే,గీ)
కైకప్రియ నందనుండట్టి, ఘనుఁడుదీర్ఘ । కాలముసమస్తరాజభో, గములు
విడిచి । నిశ్చలప్రీతి నార్యుని,నినుభజించి । నందున మహాత్మ కృతకృత్యుఁ, డ
య్యెఁ గాదె ॥ (వ) దేవా మహాత్ముండగు భరతుండు తాపసకృత్యంబుఁ గై
కొని నీవు వనస్థుండ వైనను నిన్ననుసరించి వివిధభక్తుల సేవింపుచున్న కార
ణంబున నతనిచేత నాకంబు జయింపంబడియె నదియునుంగాక మనుష్యులుపి
తృ స్వభావం బనువర్తింపక మాతృ స్వభావం బనువర్తింతు రను ప్రసి

ద్ధంబైన లోకప్రవాదంబుమాత్రకృతా నయపరిహారంబువలన నతనిచేత నన్య
థాకృతంబయ్యె ననిపలికి వెండియు ॥ (తే,గీ) అనఘచారిత్ర దశరథు,నం
తవాని । కరయఁ బత్నియై భరతుని, యంత వాని । కంబయై ఖ్యాతి వ
డసిన, యట్టికైక । కెలమి నిక్రూరబుద్ధి నేఁ, డేల కలిగె ॥ (క) అనిలక్ష్మ
ణుంతు స్నేహం । బునఁ బలికిన నావిదేహ, పుత్రివి ఘుఁడా । జననీ పరివాద
మువిని । తనమదిని సహింపలేక, తమ్ముని కనియెన్ ॥ (మ) కారుణ్యాదిస
మస్తసద్గుణములం, గన్పట్టుకైకేయిపై । నేరంబేల వచించె దీవు మృదునిర్
నిర్మత్సరుం దత్సుతు । న్శ్రీరమ్యుం బ్రణుతింపుమవ్విభుని సౌ,శీల్యంబె ము
ఖ్యంబుగా । శారామామణి దౌష్ట్య మెన్నఁ దగదో, యబ్జాప్తవంశోత్తమా ॥
(తే,గీ)అనఘచరిత దృఢవ్రత,మయ్యువనవి । హారమందు సునిశ్చిత,మయ్యునా
దు । మానసము భరతస్నేహ, మగ్నమగుచుఁ । దరలత సహింపుచున్నది,
మఱలనిపుడు॥ (తే,గీ) అమృతకల్పంబులు ప్రియంబు, లతిమృదులము । లమి
తసుఖకరములుమధు,రార్థయుక్త । ములు మనోజ్ఞంబు లద్భుతోజ్జ్వలము
లైన । భరతువచనంబు లెంతయు, మఱవఁబడవు ॥ (క) పరమార్థవిదుఁ
డుభరతుఁడు । సరసాత్ముఁడవైన నీవు,శత్రుఘ్నుండున్ । గురుమతి భజింపసంప
ద । నిరవద్యేడునట్టికాల, మెన్నఁడువచ్చున్॥(వ)అనిబహుప్రకారంబుల విలపిం
చుచురాముండుప్రియానుజసహితంబుగా గోదావరీనదికింజనియందుఁగృతాభి
షేకుండైతదీయపావనజీవనంబుల దేవపితృతర్పణంబులుగావించిపార్వతీవిష్ణు
సహితంబుగాఁగృతాభిషేకుండైన భగవంతుండగు రుద్రునిచందంబుననందంబ
గుచునుదితాదిత్యునుపాసించి దేవతోపాస్తిఁగావించిక్రమ్మఱ నిజాశ్రమంబున
కుంజనుదెంచిప్రాతర్హోమాదికంబుఁగావించిపర్ణశాలఁబ్రవేశించితన్మధ్యదే
శంబునసీతారామసమేతంబుగా సుఖాసీనుండైచిత్రాసమన్వితుండైన చంద్రు
నిభంగివెలుంగుచు మహర్షిపూజ్యమానుండై లక్ష్మణునితోడఁబుణ్యకథేతిహా

(*)శూర్పణఖ రామునిఁజూచి మేల్పడుట.(*)

సంబులు వక్కాణింపుచున్న సమయంబున ॥ (చ)దశముఖదైత్యరాడ్భగిని
దారుణలోచనలంబజిహ్వాదు । ర్దశనదురాగ్రహప్రబలతావికటీకృతచిత్త భూ
రినీ । లశిఖరితుల్య గాత్రియొక రాక్షసిశూర్పణఖాభిధానయా । దశరథపుత్రు
నాశ్రమప దంబునకుంజనుదెంచెలీలతోన్ ॥ (వ) ఇవ్విధంబునం జనుదెంచి॥



(సీ) ఇందీవరశ్యాముఁ గందర్పసమధాము నాజానుబాహు నీలాభ్రదేహుఁ ।
గమలపత్రనిభాక్షువిమలశోభనవక్షు నతిసుకుమారు విశ్రుతవిహారు । రాజచి
హ్న సమేతురాఘవాన్వయజాతు దరహాసవదనుసౌందర్యసదను । రమణీయగు
ణజాలువిమలవిద్యాశీలుఁ గరుణాలవాలుభాసురకపోలుఁ॥ (తే,గీ) దరుణయా
వనకలితుసీతాసమేతు । ఘనజటాధారివల్కలాజినవిహారి। రామునందందచూ
చిశూర్పణఖబహుళ । కామభారావసన్నయైకదియవచ్చి॥ (సీ) తనదుమ్ముఖ
ఖత్వమాయనసుముఖత్వంబుఁ గాంచిరెంటికినీడు గాఁదలంచి । తనమహోదర
మునాయనవృత్తమధ్యంబుఁ గాంచిరెండొకటిగానెంచికొనుచుఁ । దనవిరూపా
క్షులాయనవిశాలాక్షులుఁ బరికించిసరియకాఁ బ్రస్తుతించి । తనతామ్రకేశమా
యనసుకేశముఁజూచి తగుననిడెందానఁదమకమూని॥ (తే, గీ) తనదువార్ధక
మాయనతరుణతయును । దనవికృతమూర్తినాయన వినుతమూర్తి । తనదు

(*) శూర్పణఖ రామునికిఁ దనభావంబుదెల్పుట. (*)

భైరవనాదమాయనసునాద । మరసియజ్ఞానబుద్ధిజోడనుచుఁదలఁచి॥ (ఉ)ఆర
ఘుభర్తకిట్లనియె నద్భుతచాపశరాదులింపుసాం । పారధరించితాపసవరాకృ
తిఁగైకొనిపత్నిఁగూడియా । ఘోరవనప్రదేశమున కుంజనుదెంచితివేలనీవునీ।
పేరునునీదుచందమును బేకొనుమింతయునాకునావుడున్॥ (శా) ఆరక్షో
గనఁజూచియిట్లనియె రా,మాధీశుఁడెన్నండుమి । థ్యారూపంబులఁబల్కఁ డట్ల
గుటన,య్యారేవిశేషించినేఁ । డారణ్యంబున నాశ్రమార్హనియమ,వ్యాసక్తి
తో నుండి మి । థ్యారూపంబులఁ బల్కనే విను మదీ, యంబైన వృత్తాంత
మున్ ॥ (చ) కలఁడొక మేదినీశ్వరశి,ఖామణి పఙ్క్తిరథుండు నాఁగన।య్యా
లఘుచరిత్రు పుత్రుఁడమ,దాఖ్యమనీషులు రాముఁడందురీ । జలరుహ మిత్ర తే
జుఁడను,జన్ముఁడు లక్ష్మణుఁడంద్రు వీనినీ । యలికచనాదుపత్ని జన,కాత్మజ జా
నకి యందురీబిడన్ ॥ (క) జననీజనకులచే ని । ట్లనుపంబడి ధర్మకాంక్షి
నైవీరలఁ దో । డ్కొని మునివేషముఁగైకొని । చనుదెంచితి నివ్వనమునఁ,జ
రియుంచుటకున్ ॥ (క) నినుఁజూడ రాక్షసాంగన । యనితోఁచుచున్నది
చటి,కరుదెంచుటకే । పనిగలదు నీదుకులవ । ర్తనములునీపేరుమాకుఁ,దడ
యక చెప్పుమా ॥ (క) నావిని యీరాక్షసినీ । తావల్లభుఁ జూచి మదన,తా
మరసశర । వ్యావిద్ధయగుచు వెసఁదన । భావంబవ్విభున కెఱుక,పడ నిట్లనిె

యోర్ ॥ (చ) అనఘచరిత్ర నాదువిధ,మంతయుఁ దెల్పెదఁ జిత్తగింపు మి । వ్వ
నమున నొంటిమై సకల,వన్యభయంకరినై చరింతున । న్ననుపమశీల శూర్పణ
ఖ,యండ్రుసమస్త నిశాటకోటిలో । వినుతికి నెక్కితి న్భువన, విశ్రుత కామగ
మాప్తినెంతయుర్॥ (చ) అనిమిషగర్వపర్వత మ,హాశనికల్పుఁడుప_జ్క్రకంధ
రుం । డనుపమభూరినిద్రుఁడగు, నాదిమశూరుఁడు కుంభకర్ణుఁడుర్ । విను
తపరాక్రముండు సువి,వేకి విభీషణుఁడుర్ జగన్నుతుల్ । ప్రణుతపరాక్రముల్
గలరు,భ్రాతలుముప్పురు నాకుభూవరా ॥ (చ) ఖరుఁడన దూషణుండనఁబో
గడ్తకునెక్కిన రాక్షసేంద్రులి । ద్దఱుగలరింక రావణుని, తమ్ములు వారిఁబరిత్య
జించియే । నిరుపమదివ్యమంగళవి,నీలశరీరుని నిన్నుఁజూచి య । చ్చెరువడిభ
ర్తృవాంఛనిటు, చేరఁగవచ్చితి మన్మథార్తనై ॥ (చ) మనుజవరేణ్య యే
ను బహు,మాయలు నేర్చినదానఁగామరూ । పను బలవంతురాల నరి,భంజ
నశీలనుగాననన్నుఁగై । కొని సకలేష్టభోగముల, కుంఠితవైఖరి నొందుమక్క
టా । కనికని దీనితోడనువి,కారపు పొత్తు మనంగ నేటికిర్ ॥ (ఉ) చక్కని
వారిలోమిగులఁ, జక్కనివాఁడవు నీవునన్నుఁబోల్ । చక్కనికాంతఁ గూడిబ
లు,చందముల్ సుఖయించుటం తెగా । కిక్కుటిలాంగితోడి చను, వేటికి దీ
నిఁబరిత్యజింపుమా । చక్కెరవింటిసామి నెక, సక్కెములాడెడు రాజమన్మ
థా ॥ (చ) ఇదివికృతాస్య నీకుఁదగ,దీసతిపై ననురక్తిఁ గూర్పరా । దద
యతనిగ్రహింపు మటు,లైనను దోసములేదు గాననీ । హృదయమునందుఁ
గూర్మిమెయి,నింతకోడంబడ వేని లక్ష్మణుం । బదపడిదీనినే నిపుడు, పట్టిగ్ర

(*) శూర్పణఖను రామలక్ష్మణులు పరిహసించుట. (*)

సించెదనంతఁదీరెడిర్ ॥ (క) అనిచుప్పనాతివలికిన । విని రాముఁడుచతురవా
క్య,విదుఁడగుటమనం । బునగర్హింపుచుదానిం । గనిచిఱునగవంకురింపఁ,గా
నిట్లనియెర్ ॥ (క) నీనువంటిరూపవతి నెం । దునుగానక తోలుతఁదగిన,దోత
గనిదాకై । కొనినాఁడదీనివేఱొక । వనితనుమదినింకఁగోర,వచ్చునెనాకుర్ ॥
(ఉ) కన్నులకింపుసేయునినుఁ, గైకొనఁజూచితినేనిసంతతం । బన్నిటనీకునీమ
గువ,కాఱనితీఱనిపోరుగల్గుసా । ఖ్యోన్నతిలేదుమేల్పడిన, యోషనలంచినదోస
మంటివే । నిన్నును గైకొనందగిన, నేర్పరి నాయనుజు న్వరింపుమా॥ (చ) ఇ
తఁడు సుశీలవంతుఁడు న,హీనబలుండు సుదర్శనుండు నా । తతభుజవిక్రముం



డకృత,దారుఁడు నీకనురూపుఁడైన భ । ర్తాతనకుభార్యగాఁదగిన, దాని నొక
ర్తెను గోరుచున్నవాఁ । డితని వరించితేని భజి,యింపుదు వారడిలేని సౌఖ్య
ముల్॥ (వ) కావున సూర్యప్రభ మేరువుంబోలె నీవులక్ష్మణుని భర్తగా భ
జింపుమని యిట్లు రాముండు పరమదయాళుత్వంబునఁ దనయందుఁ గామమో
హంబులచేత సమాగతయైనయువతిని శీఘ్రంబున ధిక్కరించిన దుఃఖించు నని
తలంచి క్రమంబుగాఁదిరస్కరించువాఁడై పరిహాసవచనంబుఁబల్కి లక్ష్మణుం
జూపిన ॥ (క) మనమున హర్షంబడరఁగ । దనుజాంగన కామబాణ,దళిత
హృదయగా । పున నదియొక నిజమనిగ్ర । క్కునలక్ష్మణుఁ జూచిపల్కెఁ, గో
ర్కులునిగుడర్ ॥ (ఉ) చక్కనివాఁడవీవు నృప, సత్తమ చక్కనిదాన నేను
బాం । పెక్కఁగ నన్నుఁగూడిచరి,యింపుము కాననభూమియందు నే । నిక్క
మునిన్నుఁగూడి గిరి,నిర్ఝర కాననకందరంబులం । బెక్కువిధంబులర్ సుఖ
స,మృద్ధివహించెదసొంపుమీఱఁగర్ ॥ (వ) అనినవిని వాక్యకోవిదుండగులక్ష్మ
ణుండుచిఱునగవునగి యుక్తంబుగా దానికిట్లనియె ॥ (క) దాసుఁడనగు ననుఁ
గైకొని । దాసివిగానెట్లునీవు,దలఁచితివోహో । నీసరసమేమిచెప్పుదు । దాసుఁ
డదాశరథికెప్పుడుదానిఁదెలియవే॥ (క) ఏపగిదినైనయధికునిఁ । జేపట్టినవలయు
సుఖము, చేకూరుంగా । కీపట్లసేవకునిననుఁ । జేపట్టిననేమిసుఖముఁ, జెందెదవుబ
లే ॥ (క) కావునరామునిఁగైకొను । మీవృద్ధకరాళనసతి,నీవికృతాంగిం । గేవలత
విడిచిమోదం । బావహిలన్నిన్నె వేగ నవలంబించుర్ ॥ (క) నీచక్కఁదన
ముపోలం । జూచిననెవ్వారలైనఁ జొక్కరెయిపుడే । లాచింతించెదువిభుఁడే ।
లాచేకొనఁడమ్మహాత్ముఁ బ్రార్థింపుమిఁకర్ ॥ (క) నీరూపమిదిగనుంగొని । వా
రకనీతోడిపొందువర్జించిరయం । బారమనుజాంగనలనె । వ్వారువిచక్షణులు

(*) శూర్పణఖ సీతను మ్రింగెదననుట. (*)

గోరవత్తురుచెపుమా॥ (తే,గీ) అనుచులక్ష్మణుఁడాడిన యతని పలుకు । లాల
కించిమహోదరి యైనదనుజ । యువతిపరిహాసకరములైయున్నవనుచు । రాము
నీక్షించియిట్లనె రౌద్రభంగి॥ (తే,గీ) ఈవిరూపనీయబలనీ వృద్ధనసతి । నిర్ణ
తోదరివిడువంగ నేరకిట్టు । లమితసత్వనుస్వచ్ఛందనైననన్ను । మించినకృపా
రతిబహూకరించవైతి॥ (ఉ) ఇప్పుడునీవుగన్గొనఁగ నీమనుజాంగన మ్రింగిపు
చ్చినే । రొప్పుగనిన్నుఁగూడిముద మొప్పఁగనిందుఁజరింతుఁ జూడుమం । చ

ప్పుడుచుప్పనాతిరయ మారఁగ రోహిణినుల్కయట్లనా । కప్పురగంధినింబొదు వఁగాగమకించినఁజూచియుద్ధతిన్ ॥ (ఉ) ఆరఘునాయకుండుజన కాత్మజకట్ల భయంబుఁదెల్పియా । దారుణరాక్షసింబదరి తమ్మునిఁ గన్గొని యానృశంసిని । ట్లూరకచూచుచుండఁదగ దుర్విసుతన్బెదరింపుచున్నది । య్యురుశితాసిధార రయమారఁగదీని విరూపఁజేయుమా॥ (చ) అనవినిలక్ష్మణుండుభయదాకృతి

—✦✦ లక్ష్మణుఁడు శూర్పణఖయొక్క కర్ణనాసికలు ఛేదించుట ✦✦—

ఖడ్గముకేలఁబూనియా । దనుజనికర్ణనాసికలు దగ్రతఁగోసినఁబ్రావృడంబుద । ధ్వనిగతినేడ్చుచున్రుధిర ధారలుగాఱఁగఘోరరూపయై । తనదు విరూపతాఁగ తికిఁ దద్దయుఁగుందుచులజ్జపుట్టఁగన్ ॥ (ఉ) అక్కడఁ బాసిశీఘ్రగతి నంఘ్రియుగాహతిభూతధాత్రియై । గ్రక్కదలంగఁ బాఱిఘన కాయదురాత్మ మహోగ్రదర్శను । న్రక్కసిజేనిఁ గ్రూరతరరాక్షససంగస మావృతున్ఖరు । న్గ్రిక్కనడాసితత్పరిస రంబునవ్రాలెమహోల్కకైవడిన్ ॥ (తే, గీ) ఈకరణిఁ గర్ణనాసావిహీనయగుచు । రక్తధారోక్షితాంగియై వ్రాలియున్న । భగినిఁగన్గొనియిట్లనిపలికెరాత్రి । చరకులసరోజనిసహస్రకరుఁడుఖరుఁడు॥ (ఉ) లెమ్మిటులార్తవైకళవ ళించెదవేటికిసంభ్రమంబుశో । కమ్మును మోహమున్విడిచి గ్రక్కననీదురవస్థఁజెప్పునా । కిమ్మెయినీదుముక్కుఁజెవు లెవ్వఁడుగోసి విరూపఁజేసెవ్వఁ డక్కమ్ముగసర్వమున్దెలియఁగావినుపింపుముచింతయేటికిన్ ॥ (చ) ఎఱుఁగక దుర్విషంబుమది నెవ్వఁడుగ్రోలఁగఁజూచెఁగుండలి । న్గరమునఁగొట్టె నెవ్వఁడల కాలునినెవ్వఁడెదిర్చెఁజిచ్చులో । నుఱుకఁదలంచెనెవ్వఁడెవఁ డొప్పెగళంబునఁ గాలపాశమి । ట్లురిగొననెవ్వఁ డాసఁగొనె నుద్ధతిమృత్యువుతోడి వైరముల్ ॥ (చ) స్థిరమతినాకువిప్రియము సేయఁగఁజాలినవీరునుర్విలో । నరసినఁ గానమిప్పుడున రాసురదైవతపన్నగాలిలో । నిరుపమ బాహువీర్యమున నిన్నిటుపట్టివిరూపఁజేయఁగా । వరుసనమర్థుఁడైనబల వత్తరుఁడెవ్వఁడువానిఁజెప్పుమా॥ (ఉ) హెచ్చినకోపవేగమున నిప్పుడెదారుణబాణసంహతిం । జెచ్చెర వానిగుండియలుసించెదనెమ్ములుసర్వమర్మముల్ । వ్రచ్చెదఁదచ్ఛరీరరుధిరంబులుకాల్వలుగట్టఁజేసెద । న్మచ్చరమంకురింపఁనిదెమాఱ్కొనిపుచ్చెదఁగాలుప్రోలికిన్ ॥(క) భీకరశరమునసరినొక । తాఁకునఁగూలంగనేసితత్పిశితముచే । నాఁకలిఁ దీర్చెదఁగ్రక్కునఁ । గాకోలూకోగ్రజంబుకంబులకాజిన్ ॥ (క) కవనంబుననాచేన



టు। పొదువఁబడినరిపునిఁబ్రోవ పురుహూతాది । త్రిదశవరులైనశక్తులె । విదితంబుగఁదానితెలుఁగు వివరింపుదగన్ ॥ (వ) అని రణాగ్రహోదగ్రన్యగ్రాయమాన

—(*) శూర్పణఖ తనదుఃఖంబును ఖరాసురునితోఁజెప్పుకొనుట (*)—

మానసుండై పలికిన ఖరాసురునివాక్యంబులువిని శోకబాష్పధారా పూరితముఖియై శూర్పణఖయిట్లనియె॥ (చ) తరుణులురూపవంతులతి దాంతులుమూలఫలాశనుల్మును । ల్దరదరవిందలోచనులుదాశరథుల్మునిధర్మకర్మఠుల్ । లురుసుకుమారులద్భుతబ లుర్ఘనవల్కలురన్నదమ్ములు । న్సరసులు రామలక్ష్మణులు నాఁగలరిద్దఱుదండకాటవిన్ ॥ (క) ఘనరాజచిహ్నకలితులు । సనయులుగంధర్వరాజసములగువారి । న్గనుఁగొనివేల్పులొమనుజులొ । యనినేనే నరయంగఁ జాలనైతిసురారీ॥ (ఉ) వారిలసద్విహారములు వారివచోరచనాచమత్కృతు । ల్వారిమనోజ్ఞవేషములు వారిసమగ్ర పటుప్రతాపము । ల్వారి పరాక్రమక్రమము వారిశరాసననైపుణంబునె । వ్వారికిలేవుముజ్జగము వారలలోపలనేమిచెప్పుదున్ ॥ (తే,గీ) దంతియుగమధ్య గతగజ కాంతఁబోలి । దిననిశాంతరగతసంధ్య యనఁగవారి । నడుమఁగాంచన మణిభూషణప్రభూషి । తాంగియైయున్నయొకచకోరాక్షిఁగంటి॥ (క) కనిదానిరూపవిభవం । బునకోర్వక భయదరూపమునభ్రమింగంబో । యినవారుశాతఖడ్గం । బునఁగోసిరికినిసినాదుముక్కుం జెవులున్ ॥ (క) మాయన్నఖరుఁడువిన్నను । మీయుసురుకుహానివచ్చు మీఁదెఱిఁగెదరం । డీయన్నవినకహాస్యము । సేయుచు నన్నంగవికలఁ జేసిరికడిమిన్ ॥ (ఉ) ఇమ్మెయినాదుముక్కుఁ జెవులెవ్వఁడుగోసివిరూపఁజేసెవాఁ । డిమ్మహినీదు బాణముల నెన్నఁడుగూలుఁదదీయరక్తపూ । రమ్మునుదానిశోణితముఁ ద్రావఁగ నెన్నఁడుగల్గునాకునీ । యుమ్మలికంబుదీర్పుమను రోత్తమ తోడజనించి నందుకై॥ (చ) అనవినిదుర్మదుండు ఖరుఁ డంతకుకైవడిఁ బేర్చిక్రుద్ధుఁడై । వినవినవెట్టివింతపృథివీస్థలిఁబుట్టెఖరాసురానుజ । న్మనుజుఁడొకండువట్టుకొనిమానముఁగోల్పడఁగర్ణనాసిక । ల్దునిమివిరూపఁజేసెనఁటదోర్బలమెంతఘనంబొ వానికిన్॥ (వ) అనిపలికి క్రోధమూర్ఛావిశేషంబున మైమఱచి రణలంపటుండైయన్నిలింపవిమతుండు॥ (క) పదివేలమదపుటేనుఁగు । కదుపులకుం గలబలంబుగలరాక్షసులం । బదునలుగురఁగనుఁగొనికన । లొదవఁగనిట్లనియెఘన

—(*) ఖరుఁడు శ్రీరామలక్ష్మణులంజంపఁ జతుర్దశరాక్షసులఁబంపుట. (*)—

రవోగ్రగవమునన్ ॥ (ఉ) ఎవ్వరొ మర్త్యులిద్దఱొక యింతియుఁ గ్రొవ్వునదండకాటవిన్ । దవ్వులనున్నవారఁటయు దగ్రబలంబునఁ గిట్టి మీరలా । ముప్పుర ప్రాణముల్గొనుఁడ మోఘశరంబులఁ జుప్పనాతితా । నవ్వులఁ దత్తనూరుధిర మంతయుదాహముదీరఁ గ్రోలెదన్ ॥ (వ) మదీయ భగినియగు శూర్పణఖ యభిప్రాయంబిట్లున్నదిగావున నమ్మర్త్యుల వధించి మీరు దీని సఫలంబుఁ గావింపుఁడని దండధరుండునుంబోలె నాజ్ఞాపించిన నన్నిశాచరులు వాతప్రేరితులై శూర్పణఖాదర్శితమార్గంబున రయంబునంజని పర్ణశాలామధ్యంబున సీతాలక్ష్మణసహితంబుగా సుఖాసీనుండై యున్న రాముని జూచి సముదగ్రతేజుండగుటవలన వనద్విపంబులు దీప్తవహ్నిం బోలె నమ్మహానుభావునిఁ దేఱిచూడంజాలక నిర్వ్యాపడియుండి రివ్విధంబున శూర్పణఖా సహితంబుగాఁ జనుదెంచిన క్షుద్రరాక్షసులంజూచి రాముండు దీప్తతేజుండైన లక్ష్మణునకిట్లనియె ॥ (క) మన చేత భంగపడియూ । దనుజాంగనయీరసమునఁ దనవారినిదో । డ్కొని వచ్చెవీరె మనతో । ననిసేయఁగ వచ్చినారలసురులు కంటే ॥ (క) ఒక్కముహూర్తము జానకి । నిక్కడఁ గాచికొని యుండు మేనిపుడు హవి । భుక్కులు మెచ్చఁగ వ్రేల్మిడి । రక్కసులం ద్రుంచి వైతుఁ బ్రదర ప్రహతిన్ ॥ (ఆ,వె) అనిన నట్లకాక, యనిలక్ష్మణుఁడు సీయ । కొనియె రాముఁడంతఁ గనకవలయ । చాప మెక్కు పెట్టి, చటులమౌర్వీనాద । మెసఁగ వారిఁ జూచి, యిట్టు లనియె ॥ (ఉ) మూలఫలోపజీవులము, పుణ్యచరిత్రుల మాజినంతకుం । బోలుదు మన్నదమ్ములము; పుత్రుల మాజికి శస్త్రసంపద । ల్చాలఁగ నొప్పమాకు మము, రాముఁడు లక్ష్మణుఁ డందురీవిసీ । లాలకతోడఁ గూడి ముద, మారఁ జరింతుము దండకాటవిన్ ॥ (క) మునుల నియోగంబున న । మ్ముని కంటకులైన మిమ్ము, మోఘాస్త్రముల । న్దునుమాడుటకై యీకాం । చన

—(*) ఖర ప్రేషితులగు రాక్షసులు రామునితో యుద్ధముఁ జేయుట. (*)—

భూషిత కార్ముకంబు, జతనంబయ్యెన్ ॥ (ఉ) ఇమ్మెయి మాపయిం దొడర, నేటికి వచ్చితి రుగ్రభంగి మీ । కిమ్మహిజీవితేచ్ఛ గల, దేని తొలంగి చనుండు కానిచోఁ । గ్రమ్మి మదీయహస్తగత, కార్ముకముక్త నిశాతబాణపా । తమ్మున నాజిలోఁ దునిమి, తప్పక యివ్వుడె తీర్తు పుచ్చెదన్ ॥ (చ) అన విని యా చతుర్దశ ని, శాటులు దారుణ శూలపాణులై । ఘనతరకోప వేగమునఁ, గన్నుల నిప్పులు రాలరక్తలో । చనుఁడయి యున్న రామునివి, శాలపరాక్రమసోమునిం గనుం । గొని కఠినోక్తి నిట్లనిరి, కోపహుతాశుఁడు ప్రజ్వలింపఁగన్ ॥ (చ) దనుజకులోత్తముండు రిపు, దర్పహరుండు ఖరుండు పంపని । ర్ఘనసమరంబునం దునుమఁ, గాఁ జనుదెంచిన వారమిందఱం । జెనకఁగ నీకు నొక్కనికి, జెల్లునె యించుక సేపు నీవు మా । మునుమున నిల్చి పోరుము స, మున్నత సత్వము తెల్లమయ్యెడిన్ ॥ (శా) అస్మద్ఘోరకర ప్రముక్త పటుశ, స్త్రాస్త్రమ్ము లొక్కుమ్మడి । న్విస్స్రారావహ భంగిఁ దాఁకి తనువు, న్భేదింపఁగా దారుణా । పస్మారంబున బీరము న్విడిచి త, ద్బాణానల జ్వాలల । న్భస్మీభూతుఁడవయ్యె దీవు వినుమీ, ప్రాగల్భ్య మింకేటికిన్ ॥ (చ) అనుచు మిడుంగురుల్ సెదర, నద్భుత శూలము లొక్కపెట్టరా । మునిపయివైవ నమ్మనుజ, పుంగవుఁ డుగ్రతఁ జాపశింజినీ । ధ్వనులు సెలంగ భర్మమణి, పర్వ విభూషిత సాయకంబుల । న్దునియలు గాఁగ శూలములఁ, ద్రుంచి ధరంబడ నేసె నుగ్రతన్ ॥ (ఉ) అంతటఁ బోక యుద్ధనుజు, లంతకుకై వడిఁ బేర్చి జానకీ । కాంతునిమీఁద నుగ్రగతి, గ్రావము లొక్కట వీచి వైవ న । త్యంత రయంబున న్ఘనశ, రావళి నాయుపలప్రకాండము । లింతలు తున్కలై వెస మ, హీస్థలి రాలఁ

—(*) శ్రీరాముఁడు ఖరప్రేషితులైన చతుర్దశ రాక్షసులను జంపుట. (*)—

గ నేసె ప్రేల్మిడిన్ ॥ (శా) జ్యావల్లి న్సవరించి దారుణభుజం, గాకార నారాచముల్ । ప్రాపిణ్యంబునఁ గూర్చి శీఘ్రగతిశుం, భద్విక్రమారంభుఁడై । దేవేంద్రుండు నిశాతవజ్రములరీ, తి న్స్నిగ్ధలక్ష్యత్వ వి । ద్యావైదుష్యము మీఱ నేసె వెస నా, దైత్యప్రతానంబుపై ॥ (ఉ) ఆ రఘునాథుఁ డీపగిది, నద్భుతదోర్బల మంతకంతకు । న్మీఱఁ జతుర్దశాసురుల, మీఁదఁ జతుర్దశ సాయకంబులన్ । దారుణభంగి నేయ నవి, తద్ఘనవక్షము లుచ్చి వీఁపులన్ । ఘోరరవంబుతో వెడలి, క్షోణితలంబునఁ బ్రాలె నంతయున్ ॥ (క) ఇమ్మెయి రఘుపతి శరపా । తమ్మున నయ్యసురవరులు, దారుణగతి మూ । లమ్ములు వోయిన ఘనవృ । క్షమ్ముల క్రియ ధరణిఁ గూలి, చచ్చిరి వరుసన్ ॥ (ఉ) అప్పుడు చుప్పనాతి వెస, నంతకగోచరులైన దైత్యులం । దప్పక చూచి భీతిమదిఁ, దట్టుకొనంగ విఘూర్ణమానయై । యుప్పరవీథి నాచు ఖర, యోధ్గతి నేగి ఖరాంతికంబునన్ । దెప్పరమైన శోకమున, దీనతఁ బ్రాలె విషణ్ణరూపయై ॥ (వ) ఇట్లు కించిత్సంశుష్క-

శోణితయై నిశ్వాససహితయైన సల్లకియునుం బోలెఁ దనమ్రోలం బడినదాని స
ర్వరాక్షసవినాశంబుకొఱకు సమాగతయైనదాని శూర్పణఖ నవలోకించి ఖ
రుండు క్రోధంబున నిట్లనియె ॥ (క) నీకుఁ బ్రియంబుగ నిపుడ । స్తోకభుజా
విక్రమోద్ధతుల దనుజులనే । భీకరులఁ బంపితినినీ । వీకైవడిఁ బరితపించె, దే
టికి మఱలన్ ॥ (క)భక్తులు నాక నిశంబును । రక్తులు సంగరమునంద, రాతు
లఁగడువ । న్మక్తులు మన పదునలుగురు । నక్తంచరు లేల చుప్ప, నాతిరొవ

(*)శూర్పణఖ మఱలఖరుని కడకేగుట.(*)

గవన్ ॥ (ఉ)నాకకులద్విపేంద్రమృగ, నాథుఁడనందగు నేను గల్గఁగా । నీకి
టు దుఃఖమొందఁ దగు, నేయహికైవడి వేష్టితాంగివై । శోకము మోహము
న్విడిచి, సుస్థితినిం దగునైన కార్యము । న్నాకు వినంగఁ జెప్పుము ఘ,నంబు
గ నిప్పుడె దీర్చెద పుచ్ఛెదన్ ॥ (ఉ)నావిని చుప్పనాతి నయ,నంబుల నశ్రులు
గ్రమ్మఁ జేఱర । క్షోవిభుఁ జూచి యేమి పురి, కొల్పెద సంహృతకర్ణనాసనై ।
యీవిధి సిగ్గుమాలి యొక, హీనమనుష్యునిచేత నీకడ । న్లావని చెప్పఁ బాల
యితి, రాక్షసశేఖర సారెసారెకున్ ॥ (చ)తొలుతన మోఘవీర్యులఁజ, తు
ర్దశ రాక్షస వీరులన్నను । జ్వలగతి నీవు పంపఁ జని, వారలు రాముని శా
త్రభంగిఁగాఁ । జలమునఁగిట్టి వాఁడిగల, శస్త్రపరంపరలొక్క రీతిగాఁ । గులగి
రిమీఁద మేఘములు, క్రూరత రాశనులట్లఁ గప్పిరన్ ॥ (చ)అలిగి మహోగ్ర
కోపమున, నక్షియుగంబునఁ దామ్రదీధితు । ల్సెలఁగఁగ నారఘూత్తముఁడ, శే
షనిశాటచతుర్దశంబును । జ్వలితచతుర్దశాస్త్రములఁ, జావఁగ నేసిన వా
రు పెద్దకొం । డలక్రియ ధాత్రిపైఁ బడిరి, దానవశేఖర యేమి చెప్పుదున్ ॥ (క)
ఈకరణి నొక్క ప్రేల్మిడి । నాకారులఁ జంపి నట్టి, నరనాథుని య । స్తోకబలో
ద్ధతిఁ జూచితి । తాకున భయమొందియున్న, దానజితారీ ॥ (క)దానవుల ని
ధనమునుఁగని । యేనాతని మ్రోల నిలుట, కెంతయు భీతి । న్మానక నిను శర
ణము గొన । దీనావన మఱలనేగు, దెంచితినిటకున్ ॥ (మ)శరసంధానము
సేయుచోఁ దివియుచోఁ, జాపంబు సారించుచో । నరిమేనం గుఱివెట్టుచోఁ గ
డఁగి ప్రత్యాలీఢపాదస్థుఁడై । పరుషోగ్రాస్త్రము లేయుచోఁ బరులదోః, ప్రా
బల్యము ల్మాన్చుచో । ఖరుఁడాయాతని నేర్పు నెవ్వరియెడం, గానం ద్రిలోకం
బులన్ ॥ (క)ఇక్కైవడిఁ బదునలువుర । రక్కసులం జంపి పిదప, రాముఁడు



నాతో । ముక్కిడి రక్కసి తక్కిన । రక్కసులం గొనుచు వేగ,రమ్మని ప
లికెన్ ॥ (క)ఆమాట చెవికి సోఁకిన । హామిక యోనాఁడి నేఁటి, కసురల సత్వం ।
బీమాడ్కి నవ్వు లాయెఁగ । దామనుజున కనుచుఁ జిత్త, మలమట నొందెన్ ॥
(క)నీకొకని కేల దగము । ల్లోకంబులకైన వాని, ప్రోద్యచ్చౌర్యో । ద్రేకం
బోకించుకైనను । బ్రాకట ధృతియుక్తి నైఁప, రాదసురేంద్రా ॥ (చ)పలు
కులు వేయు నేలరిపు, భంజనముప్పుడె వానిమీఁదికిం । జలమున నెత్తిపోయి
పటు,సాహస విక్రమరేఖ దోఁపఁగా । బలువిశిఖంబులం బొదివి, ప్రాణముఁ
బాపినఁగాని నీకు ని । శ్చలమగు సత్వము న్యశ మ, సహ్య పరాక్రమ ము
ర్వి నిల్చునే ॥ (చ)దనుజవరేణ్య నాకుఁ బ్రమ, దం బొనగూర్పఁ దలంచినేఁ
డు నీ । పనుపున నేగి రాక్షసు ల, పారబలుం డగువాని శక్తిచే । నని
మొనఁ జచ్చి రట్టి రిపు, నంతము నొందఁగఁ జేయ వేని వీఁ । డనిశముభృత్య
ఘాతకుఁడఁ టంచు నిశాటులు నిన్ను దూఱరే ॥ (చ)చెలియలి ముక్కునుం
జెవులసిప్రహతి న్దెగఁగోసి భృత్యుల । న్బలియురఁ గొందఱం దునిమి బాహుబ
లోద్ధతిఁ గ్రాలుచున్నయా । తులువనుబట్టి బల్లతులదోర్బలశక్తి వధించుటం తెపో ।
పిలిచినఁ బోవకున్న కడుఁ జంపొడఁగూడు నెశౌర్యశాలికిన్ ॥ (ఉ)రాక్షసకంటకుండ
యిన రాముని నాతని తమ్ముని నంజకో । రాక్షినిజానకిందునిమియార్యుఁడనాపగఁదీ
ర్పుణమింతకు । న్దక్షతఁజాల వేనిఖర దానవశేఖర నీవు చూడఁగా । నీక్షణమందె
చత్తు మన నేటికిఁ కన్పరివారునవ్వఁగన్ ॥ (చ) అమరవిరోధి యేపగిది నైనర
ణంబునఁ గిట్టియన్నరా । ధముని సతీసహోదరయుతంబుగఁ జంపక యుంటివేని
ని । క్కముగ ధరిత్రిలోనమన కర్బురవంశము నెల్ల నేక కా । లమున వధించు నిం
తకుఁద లంచిన వాఁడిఁక నంతఁ జేయుఁడే ॥ (వ) మఱియు రణశిరంబున రాము
ని నెదిరించి పోరాడునట్టి వీరుండు ముల్లోకంబులం దెవ్వండును లేఁడు నీవల్పవీ
ర్యుండవు నిస్సత్వుండవు మిథ్యారోపితవిక్రముండవు శూరమానివని యూహిం
చెద రామునకుంగల తేజంబును శక్తియు నీకుం గలిగెనేని దండకారణ్యవాసి
యైన యతని జయింపుమంతకుం జాలవేని బంధుసహితంబుగా జనస్థానంబు
విడిచి యొండుకడకుం జను మిచ్చటనుంటివేని రామతేజోభిభూతుండవై రయం
బున నశింపంగలవాఁడ వా రాముండు తేజస్సమాయుక్తుండు వాని తమ్ముండు
మహావీర్యుండు వారిరువురు వహ్నిమారుతకల్పులై వెలుఁగుచున్న వారు ॥ (క)

అనిఖరునకుమదిరోసము । జనియింపఁగ నిట్లు పెక్కు చందంబులశూ । ర్పణఖపురికొల్పిహస్తం । బుననుదరము మోదికొనుచు ఘోరుననేడ్చెన్ ॥ (క) ఈ రీతిశూర్పణఖచేఁ । బ్రేరితుఁడై ఖరుఁడుభయద వేషంబుననా । కారులమధ్యంబునదు । ర్వారోద్ధతిదానిఁజూచి క్రమ్మఱఁబలికెన్ ॥ (చ) భవనవమాన సంజ

—*ఖరుఁడు తాను రామాదులఁ జంపెదనని శూర్పణఖ నూరార్చుట.*—

నిత బంధురరోషము నెమ్మనంబునం । దవిలిబహుప్రకారములఁ దాల్పఁగనాకున శక్యమయ్యెనా । పవిధరుఁడైననాయెదుటఁబ్రస్తుతికెక్కఁడుహీనమానవ । స్తవముసహింపనోపుదునె సారెకుఁగర్ణకఠోరభంగిఁగన్ ॥ (ఉ) ఇంతదురంతచింతవడ నేటికిరామునిసానుజంబుగా । నంతకసాదనంబునకు నంపెదనొక్క ముహూర్తమాత్రమీ । చింతదొఱంగియుండుమటు చేసినపిమ్మటనాజిభూమిలో పంతముమీఱఁదద్రుధిర పానముఁజేసెదుగాక రాక్షసీ॥ (వ)మఱియునారాముండు స్వకీయంబులైన విరూపకరణాది దుష్కృతంబులచేత హతుండై యున్నవాఁడిప్పుడు మద్విశిఖతాడితుండై ప్రాణంబులు విడువంగలఁడు శక్రాదిదిగీశులకు హృదయభల్లంబైన యేను మర్త్యమాత్రుండైన రామునిసరకుగొందునె మత్ప్రబల పరాక్రమప్రకారంబు నీవె విలోకించెదవని పలికి రణోత్సాహ దుర్ధరుండగు ఖరుండు వైరిభీషణుండైన దూషణుండను సేనాపతిం జూచి మచ్చిత్తానువర్తులును భీమవేగులును సమరానివర్తులును నీలజీమూతవర్ణు

—*ఖరుఁడు యుద్ధమునకంతయు సన్నద్ధముచేయుమని యాజ్ఞాపించుట.*—

లును ఘోరదర్శనులును క్రూరకర్ములును లోకహింసావిహారులును సముదగ్రతేజులును శార్దూలదర్పులును గంభీరాట్టహాసులును భీషణఘోషులును తేజోబల సముదీర్ణులును మహాసత్త్వవంతులును దుర్నివారులునగు చతుర్దశసహస్ర రక్షోవీరుల యుద్ధంబునకు సన్నద్ధులంగావింపుము మఱియు సర్వాయుధ పరిష్కృతంబును మేరుశిఖరాకారంబును మణికాంచనభూషితంబునగు రథంబు జవాశ్వంబులంబూన్చి కట్టాయితంబుసేయింపుము దీర్ఘంబులైన చాపంబులును దిగ్ధంబులైనశరంబులును దృఢంబులైన తూణీరంబులును నచ్ఛిద్రంబులైన తనుత్రాణంబులును జిత్రంబులైన ఖడ్గంబులును నానావిధశక్తులును సుందరస్యందనోపరిభాగంబునం బెట్టింపుము రాక్షస కంటకుండైన రామునివధించుటకు మహాత్ములగు పౌలస్త్యులలోన నేను బ్రథమశూరుండనై



తలమిగిలి సంగ్రామంబునకుం జనియెదనని పలికిన నతండు తద్వచనప్రకారంబున సర్వంబునుసమకట్టి తానును సమరసముత్సాహవిశేషంబునఁ గట్టాయితంబై పొడసూపిన॥ (సీ) శబళాశ్వయుక్తంబుచారువైడూర్యకూబరమాసంబాధంబుభర్మశిఖరి । శిఖరసంకాశంబు చిత్రభాను నిభంబు చటులహేమరథాంగసంయుతంబు । సంతతచారుకాంచన భూషణయుతంబు సౌవర్ణకింకిణీసంకులంబు । రణితఘంటాసుంద రముధ్వజనిస్త్రింశ సంపన్నమగు ఘనస్యంద

ఖరుఁడు సైన్యముతో జనస్థానమునుంచి వెడలుట.

నంబు ॥ (తే.గీ) నెక్కి శౌర్యంబుదిక్కులఁ బిక్కటిల్లఁ । గదన సముచితభేరిభాంకారమడర । సమరదోహలియైజనస్థానసీమ । గదలెఁదేజోజితప్రభాకరుఁడుఖరుఁడు॥ (సీ) సంగరరంగానుషంగశాత్రవనేత్ర భీషణుండననొప్పు దూషణుండు । ప్రళయజీమూత గర్జాసముజ్జృంభణ భాషణుం డననొప్పు దూషణుండు । సంగ్రామములయందుశక్రాదిదేవతా భీషణుండననొప్పు దూషణుండు । సకలనిశాటవంశప్రదీపకశిరో భూషణుండననొప్పుదూషణుండు॥ (ఆ,వె) ఖరునివెంటఁజనియెఖరములఁబూన్చిన । యరదమెక్కిదిక్కులదరఁబ్రళయ। కాలవారిధరముకైవడినార్చుచు । దితిజసైన్యవదనతిలకమగుచు॥ (వ)మఱియు గదా ముసల ముద్గర భిండివాల కరవాల తోమర పరశు పట్టిస ప్రాస పరశ్వథ చక్ర శూల కుంత క్షురికాది నానాసాధనంబులఁగైసేసి వెల్లివిరిసిన మహాసముద్రంబుచందంబున నుప్పొంగుచుఁ బరస్పరవీరాలాపంబుల నుత్సహింపుచు రోదోంతరాళంబునిండ నార్చుచుఁ జతుర్దశసహస్రసంఖ్యాతంబగు ఘోరవర్మాయుధధ్వజంబైన రాక్షససైన్యంబు సమరోత్సాహంబున దూషణుని వెనువెంటంగదలె నప్పుడు తదీయ చరణక్షుణ్ణసముద్ధూత మహీపరాగంబు నానావిధనాదంబులతోఁగూడ గగనంబునకెగసె నివ్విధంబున ఖరుండు సేనామంత్రి దండనాథపురస్సరంబుగా రణంబునకువెడలి చిత్రితమత్స్యపుష్పద్రుమశైల చంద్రసూర్యకాంచన పక్షిసంఘ తారాగణాభిసంవృతంబైనరథంబారోహించి సూతునాలోకించి రథంబు రయంబునందోలుమని యాజ్ఞాపించిన నతం డతనిచిత్తంబుకొలంది పగ్గంబులువదలి వాయు జవంబుగల ఘోటకంబులఁదాఁటించి తనసారథ్యనైపుణ్యంబున రథంబుఁదోలిన ॥ (సీ) కాంచననేమిసంఘట్టనంబునఁద్రోవఁ బెనుగట్టుశిలలెల్లపిండిగాఁగఁ । గనకధ్వజాగ్రసం

ఘటితపటప్రభం జనఘాతమున మేఘసమితిపాఱఁ । జటులఘోటకఖురపుటఘ
ట్టనోద్ధూత ధరణీపరాగమంబరమునిండఁ । గనకఘంటాఘణంఘణసనాదంబు
లు దిక్కరికర్ణముల్వ్రక్కలింప॥ (తే,గీ) గగనమునఁజనురవిశతాంగంబుప
గిది । లోచనంబులకతిదుర్విలోక్యమగుచు । శీఘ్రభరమున శేషుండుశిరమువం

ఖరుని సైన్యములో దుర్నిమిత్తములగుపడుట.

ప । గాఢరయమునఁజనుచుండె ఖరునిరథము॥ (వ) ఇవ్విధంబునం జనుసమ
యంబున ఖరాసురున కరిష్టసూచకంబుగా గర్దభ ధూసరంబులైన మేఘం
బులు రక్తవర్షంబుగురిసె దివాకరమండలంబుచుట్టు రుధిర పర్యంతంబై య
లాతచక్రప్రతిమంబై నీలపరివేషంబై తోఁచె రథంబునంబూన్చినహయంబులు
మహావేగంబునంబోవుచు నాకస్మికంబుగా ముందటికి మ్రొగ్గతిలంబడియె స
సముచ్ఛ్రిత హేమదండంబైనధ్వజంబు నాక్రమించి మహాకాయంబగుగృధ్రం
బు దారుణప్రకారంబునం గనుపట్టె జనస్థానసమీపంబున మాంసాదంబులగు
ఖగమృగంబులు విస్వరంబుగా ఖరస్వనంబులు సేయుచుండెఁ బ్రభిన్నగిరిసం
కాశంబులై తోయశోణితధరంబులై భీమంబులై వలాహకంబు లాకాశంబు
నిరవకాశంబుగావించె నుత్పాతవశంబువలన జాజ్వల్యమానంబులైన దిశల
యందుఘోరంబుగాఁదిమిరంబుగవిసెఁ బ్రాతఃకాలంబునందు గగనంబుసంధ్యా
కాలంబునందుంబోలె క్షతజార్ద్రవర్ణాభంబైయుండెఁ గంకగోమాయుగృధ్రం
బులు ఖరునకభిముఖంబుగానఱచుచుండె శివాగణంబులు రణంబునందపజయం
బుదెల్పుచు దుర్నిమిత్తదృష్టాంతభూతంబులై జ్వాలోద్గారి ముఖంబులచేతబ
లంబున కభిముఖంబుగా రోదనంబు సేయుచుండె సూర్యుని సమీపంబునఁ బ
రిఘసన్నికాశంబులైన కబంధంబులు దోఁచె నపర్వకాలంబునందు స్వర్భా
నుండు భానునిం బరిగ్రహించెఁ బ్రతికూలంబులై వాతంబులు సుడిసె దివాక
రుండు నిష్ప్రభుండయ్యెఁ బట్టపవలుఖద్యోతసన్నిభంబులై చుక్కలు పొడిచె
లీనమీనవిహంగమంబులై కమలాకరంబులు చూపట్టె విగతపుష్పఫలం
బులై పాదపంబులు మ్రోడుపడియుండె వాయువులు లేక జలధరారుణంబైన
రజంబు సుడిసె మేఘంబులులేక పిడుగులుపడియె శారికలు వీచికూచియనియ
సుఖకరశబ్దంబులు వలికె సాగరపర్వతకానన సహితంబుగా మహీచక్రంబు చ
లించినట్లయ్యె రథస్థుండైన ఖరుని సవ్యభుజంబుచలించెఁ గంఠనాదంబుహీనం



బయ్యె నేత్రంబుల నశ్రువులుగ్రమ్మె లలాటంబునందు వేదన వొడమె నిట్ట మ
హోత్పాతంబు లనేకంబులు వొడమినం జూచి ఖరుండు ప్రహసింపుచు రాక్ష

(*) ఖరుఁడు దుర్నిమిత్తంబులఁ జూచి ప్రహసించుట. (*)

సులనవలోకించి యిట్లనియె ॥ (క) చూచితిరె మనకమంగళ । సూచకము
లుపెక్కు గతులఁ,జూడ్కికి వ్రేఁగై । తోఁచుచున్నవి సర్వత । మీచరవరు
లార దుర్నిమిత్తములైనన్ ॥ (క) కడిమిగల శూరవరునకు । మిడుతపుశ
కునంబులడ్డమేపగతునిపైఁ । బడితునుముటంతె గాకిటు । పిడుగున కొకవా
రశూల, పృథివిం గలదే ॥ (క) నిక్కముగ నేనుగినిసిన । నొక్క మహాహా
తంబులోన,నురుబాణములం । జుక్కల నిలఁబడనేసెదఁ । దక్కక మృత్యు
వునుబట్టి,తలదెగ వ్రేతున్ ॥ (క) వీర్యోత్సిక్తుండగు రఘు । వర్యునిఁ దడను
జునిఁ బట్టి,వరబాణములన్ । వీర్యమునఁద్రుంప కిటకున । వార్యగతిన్ రిత్తమ
గుడి,వత్తునె పెలుచన్ ॥ (తే,గీ) పార్థివోత్తమ సుతుల వి.పర్యయంబు ।
కడిమినెద్దానికొఱకు సం,ఘటితమయ్యె । నట్టిభగిని సమాహతు,లైనవారి ।
రుధిరపూరంబు తమిదీరఁ, గ్రోలుఁగాక ॥ (క) దురమున మున్నెన్నఁడు నొ
క । పరాజయ మెఱుంగనట్టిప్రబలుఁడ,నెందుం । గరమేను బలికినంతయుఁ ।ది
రముగు నిత్తెఱఁగుమీకుఁ, దెల్లముగాఁగే ॥ (క) దారుణ కులిశముఁ గైకొని ।
యైరావణమెక్కి సురబ,లాన్వితుఁడై జం । భారియనికిఁ బఱతెంచిన । వారక
వధియింతు నెంత,వారలుమర్త్యుల్ ॥ (వ) అని యిట్లు దురాగ్రహంబునం
బలికిన నాఖరాసురుని వాక్యంబులువిని మృత్యుపాశావ పాశితులై రాక్షససై
న్యయోధులు సంతోషవిశేషంబున నతనిం బ్రశంసించి రాసమయంబున శ్యేన
గామియుఁ బృథుగ్రీవుండును యజ్ఞశత్రుండును విహంగముండును దుర్జయుం
డును గరవీరాక్షుండునుబరుషుండును గాలకార్ముకుండును మేఘమాలియు
మహామాలియు సర్పాస్యుండును రుధిరాశనుండు నన బన్నిద్దఱు మహామా
త్యులు ఖరునిం జుట్టుముట్టియగ్రభాగంబునం జనుచుండిరి మహాకపాలుండును
స్థూలాక్షుండును బ్రమాథియుఁ ద్రిశిరుండు నను నలువురు సేనానాయకులుదూ
షణుని పిఱుంద దెసం జనుచుండి రిత్తెఱంగునం గూడుకొని రాక్షస వీర్యసై
న్యంబు భీమవేగంబున గ్రహమండలంబు చంద్రసూర్యులంబోలె రామలక్ష్మణు
లం గదియనడిచె నిట్లు దానవశేఖరుండగు ఖరుండు రథారూఢుండై మహో

గ్రిసైన్యసమేతుండై కోలాహలబహుళంబుగా రణార్థంబు చనుదెంచుచుం
డె నప్పుడు రాక్షసవినాశనార్థంబు సముత్పన్నంబులైన దారుణమహోత్పా
(*) రాముఁడు రాక్షసనాశకంబులగు నిమిత్తంబుల లక్ష్మణునకుఁ జూపుట. (*)
తంబు లన్నియు విలోకించి రాముండు లక్ష్మణున కిట్లనియె ॥ (చ) అసదృశ
మైలయాభ్రము మహాధ్వని సేయుచు ఘోరభంగి నా । కసమున నెత్తురుల్గు
రియఁగాఁ దొడఁగెఁ మఱిభూనభంబులం । దు సకలదుర్నిమిత్తములు, దోఁ
చుచున్నవి యిన్నియుం గరం । బసురవినాశసూచకములై గనుపట్టెడిఁ, గం
టె లక్ష్మణా ॥ (మ) కనకాంశుచ్ఛటలీను మచ్ఛితశరా, ఘంబుల్ సధూమం
బులై । ఘనకోదండమునం జలింపుచును సం, గ్రామప్రహర్షంబుతో । నను
నైయున్నవి నాదుసక్షిణకరం, బాసక్తితో సారెకుఁ । ఘనభంగిన్ స్ఫురణం
బుచేమనకసం, ఖ్యక్షేమముం దెల్పెడిన్ ॥ (క) వనచరసౌమ్య ఖగంబులు ।
మనప్రోల ననేకగతుల, మనకభయంబుల్ । దనుజులకు వినాశనమును । ము
నుకొని దెల్పుచుఁ గరంబు, మ్రోసెడు వింటే ॥ (చ) అని యొనరింపఁ బోవు జ
నులందు గతాయువులైనవారి యా । ననములనిష్ప్రభత్వము గ, నంబడు ని
క్కువమెన్ని చూచిన । న్ననకదిలేదు నీముఖము, మానుగ సుప్రభమై ప్రసన్న
మై । గననగుచున్న దట్లగుటఁ, గయ్యమున న్విజయంబు గల్గెడిన్ ॥ (క) మ
ఱియు ననేకవిధంబులఁ । దఱచుగ నెచ్చోటఁ గన్న, దారుణతరసం । గరపద
ములు గనుపట్టెడు । వరగుణ మనకిపుడు పోర, వశ్యముగలుగున్ ॥ (క) మ
నకుశుభనిమిత్తములిపు । డనేకములు దోఁచుచున్న, వటు గాన రణం । బునఁ బగ
తులకుఁ బరాజయ । మనఘాత్మక మనకు విజయ, మగు నిక్కముగన్ ॥ (క)
దానవవీరుల సింహా । ధ్వానంబులు భూరిదండ, తాడితభేరీ । ధ్వానంబులు శ్రు
తిభయసం । ధానములై మ్రోయఁ దొడఁగెఁ, దమ్ముఁడ వింటే ॥ (వ) సం
గ్రామంబునం దాపదదొలంగం ద్రోచి జయంబుఁ గోరునట్టి పండితునిచేత భా
వికాలసంభావ్య నిష్టంబునకుఁ బరిహారంబు కర్తవ్యంబు గావున ॥ (అ, వె)
(*) రాముఁడు సీతతో గిరిగుహలో నుండుమని లక్ష్మణున కాజ్ఞాపించుట. (*)
ఎంతశూరుఁడైన, నింతితోఁ గూడి సం । గరము సేయరాదు, కడఁగి నీవు । సీత
తోడఁ గూడి, శిఖరిగహ్వర మాశ్ర । యించి కాచి యుండు, మింపుతోడ ॥ (క)
కాదని మారాడినమ । త్పాదంబులయాన యిచటఁ, దడయక త్వరతో । వై



దేహితోడ నుండుము । పాదపసంఘాతమైన, పర్వతగుహలోన్ ॥ (క) అన
ఘా నీవును శూరుం । డనుపమబలయుతుఁడ వాజి, నరులఁ గడిమిమైఁ । దునుమ
గ దక్షుఁడవైనను । దనుజుల నేనొకఁడ చంపఁ, దలఁచితి బుద్ధిన్ ॥ (వ) అని
నీయకొల్పిన నాలక్ష్మణుండు తత్క్షణంబ శరచాపంబులు గైకొని వైదేహీ సహి
తంబుగా దుర్గమంబైన గిరికందరంబు నాశ్రయించె నంత రాముండు లక్ష్మ
ణుని చేత మిక్కిలి యుక్తకార్యంబు కృతంబయ్యెనని పలికి వహ్నిసంకాశంబైన
దివ్యకవచంబు దొడిఁగి తిమిరంబునందు విగతధూముండైన వైశ్వానరుసిచం
దంబునం దేజరిల్లుచు మహనీయశరశరాసనంబులు గైకొని దిగంతరాళంబు నిం
డ గుణప్రణాదంబు సేయుచు యుద్ధసన్నద్ధుండై రాక్షసుల రాక కెదురుసూచు
చుండెనప్పుడు మహర్షి దేవగంధర్వ సిద్ధసాధ్యులు దివ్యవిమానాధిరూఢులై
సంగ్రామదర్శనకుతూహలంబునం జనుదెంచి యంబరంబున నుండి పరస్పరం
బు శుభాలాపంబులు వల్కుచు గోబ్రాహ్మణులకు శుభంబగుంగాక సర్వలోకం
బులు భద్రవంతంబులై యుండుఁగాక రాముండు సర్వరాక్షసుల జయించి విజ
యలక్ష్మి నధిగమించుంగాక యని యీదృశంబులైన భద్రవాక్యంబుల నమో
ఘంబుగా నాశీర్వదింపుచుఁ బెక్కండ్రు రాక్షసులతోడ నొక్క రాముండెవ్వి
ధంబున సంగ్రామంబుఁ గావించునో యని జాతకౌతూహలురై చూచుచుం
డిరి మఱియు సంగ్రామంబునకు సన్నద్ధుండైన రాముని రౌద్రాకారంబు విలో
కించి సర్వభూతంబులు భయభ్రాంతచిత్తంబులై యుండె నప్పుడమ్మహానుభావు
ని యమానుషంబైన రూపంబు క్రుద్ధుండగు విలయకాల రుద్రుని రూపంబు
కైవడి నతిభయంకరంబై యుండెనంత ఘోరవర్మాయుధధ్వజంబును గంభీ
రనిర్హ్రాదంబు నగు రాక్షసానీకంబు కదియవచ్చె నప్పుడు ॥ (చ) దనుజుల

—(*) రాక్షససైన్యంబు రామునిఁ జేరవచ్చుట. (*)—

సింహనాదములు, దగ్రచలద్రథనేమిఘట్టన । స్వనములు వీర హుంకృతులు,
చాపరణద్గుణ టంకృతుల్పట । ధ్వనులును భేరిభాంకృతుల, వార్యములై యొ
కరీతి నమ్మహా । వనమున నుండి పెల్లెసఁగె, వన్యమృగంబులు భీతిఁ బాఱఁగన్ ॥
(వ) మఱియు నమ్మహాసైన్యంబునందు ॥ (చ) పలుమఱు బంటు పంతములఁ, బ
ల్కెడు వారు నిజప్రతిజ్ఞలం । దెలిపెడు వారు శూర్పణఖ, దెల్పిన కైవడి రా
ము చందము । గ్గలయఁగఁ జూచువా రసుర, కంటకు నేనె వధింతు మీరని ।

శ్చలముగఁ జూచుచుండుఁ డని, నాడెడు వారలు నైరి యందఱుఁ॥ (వ) ఇట్లు బహుపరాక్రమంబుల వీరాలాపంబులాడుచు వెల్లి విరిసిన మహాసముద్రం బుపోలిక ననివార్యంబై ఘూర్ణిల్లుచు సంరంభంబుగాఁగదియ నేతెంచి॥ (క) ఆరక్షస్సైన్యము గం। భీరునిధృత చాపముఖ్యు, పృథుసాధనునిఁ। ధీరుని నతిశూరుని రఘు। వీరునిఁ గనుఁగొని యెు విమత, వీక్షణభయదుఁ॥ (క) ఆరామవిభుండును దు। ర్వారంబై వనధి మాడ్కి, వచ్చెడువిలస। ద్దారుణరక్షస్సైన్యము। నారక్తప్రేక్షణముల, నటుచూచి వెసఁ॥ (క) ఘోరంబగు కార్ముకమున। సారంబగు నారిఁగూర్చి, చటులనిషంగ। ద్వారంబువలన శరముల। పారంబుగఁ దీసి కూర్చి, బంధురభంగిఁ॥ (క) దనుజవధార్థము క్రోధం। బనువుగ నంగీకరించి, లయకాలహుతా। శను క్రియ దుష్ప్రేక్ష్యుండై। పెనుపుగ వనదేవతలకు, భీతి నొసఁగుచుఁ॥ (క) దక్షమఖహరణసమయ। ప్రేక్షితుఁడగు శూలపాణి, పెంపున రఘుమా। ర్యక్షుఁడు రాక్షసగణవధ। దీక్షితుఁడై యొప్పెఁ దీవ్ర, తేజస్స్ఫూర్తిఁ॥ (చ) దశరథనందనుం డటులు, దగ్రతరస్ఫుటభీషణాకృతి। న్దశదిశలందుఁ దీవ్ర మగు, దారుణతేజము పిక్కటిల్లఁగా। లశమను కైవడి న్రణశి, రంబున నుండఁగఁ జూచి భూతములు। ప్రశమములేక క్రొత్తయగు త్రాసమునందిచరించె నత్తఱిఁ॥ (తే,గీ) కార్ముకధ్వజభూషణ, కాండచిత్ర। వర్మములచేత నపుడు దు, ర్వారనిజర। రాతిసైన్యము సూర్యోద, యంబునందు। నీలఘనమండలము భంగిఁ, గ్రాలుచుండె॥ (వ) ఇట్లు మండలీకృతకోదండుండై నిజతేజోజాలంబుల శాత్రవనేత్రంబులకు మిఱుమిట్లు గొలుపుచున్న రామునిఁ బరివారసహితుండై దవ్వులం జూచి ఖరుండు సమధిజ్యధన్వుండై గుణప్రణాదంబు సేయుచు రామున కభిముఖంబుగా రథంబు దోలు మని సూతు నాజ్ఞాపించిన నతండు తద్వచనానురూపంబు

—(*) రాక్షసవీరులు రామునిమీఁద శస్త్రంబులం బ్రయోగించుట. (*)—

గా రయంబునం దేరు దోలిన నతనిం బరివేష్టించి కాలజీమూతంబుల కరణిగ గర్జింపుచు రాక్షసు లందఱు నేన నేన రాముని జయించెద మని బిరుదులు పలుకుచుండి రిట్లు ఖరుండు యాతుధానమధ్యంబున రథస్థుండై తారాగణమధ్యంబునం బొల్చు లోహితాంగుని చందంబున నొప్పుచుఁ దీవ్రంబగు బాణసహస్రంబున రణదుర్జయుండగు రామునిం బ్రహరించి నింగిఘూర్ణిల్ల సింహ



నాదంబుఁ జేసె నంత భీమకర్ములగు రక్షోవీరులు నిరుపమానతేజుండగు రామునిం జుట్టిముట్టి నిశితంబులైన గదాశూలపరిఘపట్టిసముసలముద్గరప్రాసకరవాలభిండివాలకుంతాది నానావిధ సాధనంబులం బ్రహరింపుచు నీలవలాహకంబులభంగి మహానాదంబులు గావించిరి మఱియు గజారోహకులు మదపుటేనుంగుల డీకొలిపి నిశాత తోమరంబుల నంకుశంబులం బొడిచిరి రథికులు నానావిధ సాయకంబులఁ బ్రయోగించిరి సాదులు హయంబుల దుమికించి నిస్త్రింశంబుల డరించి రిట్లు పెక్కండ్రు రక్కసు లుక్కు మిగిలి పెక్కువిధంబుల నక్కజంబుగా శస్త్రాస్త్రపరంపరలం గప్పిన నీలజీమూతంబులు గురియు కరకాశనివర్షధారలకుం జలింపని పర్వతంబు కైవడి రాముండు సుస్థిరుండై యాదారుణప్రహారణంబులచేత భిన్నగాత్రుం డయ్యును బ్రదీప్తవజ్రనిపాతంబుచేత వ్యథితంబుగాని మహాచలంబుకరణి వ్యథితుండుగాక సాగరంబు నదీసంఘంబులం బోలె రాక్షసప్రయుక్త నానావిధ శస్త్రాస్త్రనిచయంబుల నిజవిశిఖంబులచేతం బ్రతిగ్రహించి తదీయబాణక్షతసంజాత రక్తధారాస్నపితదేహుండై సంధ్యాభ్రపరివృతుండైన సహస్రకరుని చందంబునం దేజరిల్లుచుండె నప్పుడనేకరాక్షసులచేతఁ బొదువంబడిన రామభద్రు నొక్కని విలోకించి దేవగంధర్వసిద్ధసాధ్యపరమర్షులు విషాదంబు నొందిరంత॥ (శా) ఆరాజాన్వయ కుంజరుండపుడు ప్ర, త్యాలీఢపాదస్థుఁడై। ఘోరప్రక్రియ మండలీకృతచల, త్కో

—(*) రాముఁడు రాక్షసులమీఁద నానావిధబాణంబులఁ బ్రయోగించుట. (*)—

దండుఁడై చాపవి। ద్యారూఢత్వము గాను పింపఁగ రణ న్యాయైకదక్షత్వమే। పారం గాంచనపుంఖకాండములఁ బొ, ల్పారంగ నేసెన్విడిఁ॥ (ఉ) చాపము శక్రచాపముగఁ, జండగుణధ్వని గర్జితంబుగా। దీపితసన్మణీవలయ, దీధితి చంచలగాఁగఁ గ్రవ్యభు। గ్రూపదవాగ్సులారఁగ ర, ఘుప్రవరాహ్వయకాలమేఘము। శాపరిపూర్తిగాఁ గురియ, సాగె నిరంతరబాణవర్షముఁ॥ (ఉ) దండిమెయి న్రఘూత్తముఁడు, దారుణదైత్యుల భండనంబునం। జండభుజావలేపమునఁ, జంపఁగలండిఁక హర్షసంయుతు। ల్గండనుచు న్దిగీశులకు, గ్రక్కునఁ దెల్పఁగఁ బోయి నట్లుకో। దండవిముక్త సాయకవి, తానము లొక్కటఁ బర్వె దిక్కులఁ॥ (ఉ) రాముఁడు జన్యరంగమున, రాక్షసుల న్వధియింపుచున్నచోఁ। హోమును లారయం కభయ, మొందకుఁ డంచు నిరంతరంబుగాఁ। బ్రే

మ సమస్తభూతములు, పెద్దయు మ్రోయుచు నున్నవో యనం। గామణిఘంటి
కాధ్వనుల, గాఢగుణస్వన మొప్పెనవ్వనిన్ ॥ (చ) త్రిదశులతోడ మున్న స
టు,తీవ్రభుజా బలవైభవంబునం। గదన మొనర్చిన చూచితిమి, కామజివార
ల చేతు లంతబ। ట్టిదములుగావుతచ్ఛరప,టిష్ఠత మిక్కుటమంచురక్కసుల్।
మదినతిచోద్యమందుదురు, రామశరంబులు సోఁకువేళలన్ ॥ (సీ) ప్రళయకా
లోదగ్ర, జలధరంబులనుండి పుడమిపైఁ బడెడుబ, ల్పిడుగులట్లు। సద్యస్తమో
నాశ, చటులఖద్యోతమండల నిర్గతాంశుకాం, డములరీతి। లయకాలరుద్ర
నేత్రప్రభూతమహోగ్రసముదగ్రపావక, జ్వాలలగతి। జంతుపారణకళా, చ
తురకాలాంతకదారుణకాలదం, డములపగిది॥ (తే,గీ) నతిదురావారదుర్విష,
హప్రచండ। కంకపత్రకరాళవ,క్త్రంబులైన। రామశరములు రక్షో బ,లంబు
మీఁద। నిగుడెఁబుంఖానుపుంఖంబు,లగుచునపుడు॥ (చ) హరనయనాగ్ని వేఁడి
మి మ,హాశని వాఁడిమి కాలదండని। ష్ఠురతయు ప్రోదినీపరుష, శుద్ధికుమా
రునిభూరిశక్తి, భీ। కరత ప్రతాపవేగమును, గల్గిరఘూద్వహు బాణజాలము।
ల్పరువడివీరరాక్షసబ, లంబులపైఁ బడియె న్మహోగ్రతన్ ॥ (చ) ఇనకిరణాలికిం
జొరవ, యీక సదాగతి రాకకైనఁ బ। ల్చనవడకర్థిఁ సైకతముఁ, జల్లిన రా
లఁగ నీక దట్టమై। దనుజవిముక్తకాండములఁ,దట్టుచు దిక్కుల రామకాండ
ము। ల్సునిశితభంగి నిండుటయుఁ,జూచి సుర ల్వెఱఁగంది రయ్యెడన్ ॥ (ఉ)
రాముని దివ్యసాయకప, రంపరదాఁకునొయంచు ఘోరసం। గ్రామమునందు
దైత్యులు ధ, రాగత వీక్షణులై భయంబున। న్మోములు వాంచి చాల హరి,
ముంగలిదంతుల భంగి నైరిగా। కేమియు సేయ లేరయిరి, యెంతయునివ్వెఱ
పాటుగూరఁగన్ ॥ (చ) నలుదెస లాక్రమించిరఘు,నాథునిచాపగుణచ్యుతాం
బకా। వలులు నిశాటవర్యులన, వార్యగతి న్దనుమాడఁజొచ్చెని। ట్టలముగఁ
బర్వివహ్ని ప్రక,టంబుగ నాత్మశిఖాపరంపర। న్విలసిత తేజుఁడై కడిమి, వేశలభం
బులనేచుఁజాడ్పునన్ ॥ (ఉ) మించికకుత్థ్సనాయకస,మిద్ధధనుర్గుణవిచ్యుతంబు
లౌ। కాంచనపుంఖకాండముల, ఖండరయంబునఁబోయిఘోరస। క్తంచరకా
యములవ్వసన,గల్చిగళద్రుధిరాప్లుతంబులై। యంచితభంగిమింటడహ, నార్చ
లకైవడినొప్పెనయ్యెడన్ ॥ (సీ) రథికసారథి కేతు, రథ్యయుతంబుగా మందరా
చలనిభ, స్యందనములు। కాలజీమూతసం, ఘాతసంకాశంబులై యొప్పుమ



త్తమ,హాగజములు। జవసత్త్వజితమనః, పవమానమాధవ వాహనంబులుఁ న
మి,ద్వాహనములు। కాటుకకొండల, కరణిమేనులు గ్రాల విజృంభించుచున్న
వీరభటులు ॥ (తే,గీ) మడిసి రొక్కొక్క యెడఁ బెక్కు, మలలమాడ్కి।
దారుణాకారరామహ,స్తప్రశస్త। చండకోదండనిస్సృత, చటులకాల। దం
డమండితకాండ ప్ర,కాండహతిని ॥ (వ) ఇవ్విధంబునఁ బ్రళయసమయ జం
తుపారణకళాధురీణుండగు స్థాణునిపోలిక నిజహేతివ్రాతభస్మీభూత సకలలో
కనివహుండైన సంకర్షణాగ్నికైవడిఁ దారకాసుర సంహార సమయసముదీ
ర్ణుఁడగు కుమారునిపగిది సంక్రుద్ధుండైన కాలాంతకుని మాడ్కి రామభ
ద్రుండు క్రౌర్యరసోల్లాసభాసురమూర్తియై యఖండకోదండ పాండిత్యంబుఁ
జూపిన నన్నిశాచరసైన్యంబునందుఁ బరస్పర హేతి ప్రఘట్టనంబున మండుచుఁ
గరులంబడవైచుచు హయంబులనఱుకుచు రథంబులనుగ్గునూచంబులు సేయు
చుఁ బదాతులంద్రుంచుచు శిరంబులంబగల్చుచుఁ గంఠంబులుఁద్రెంచుచు బా
హువులఁదెగవ్రేయుచు వక్షంబులువ్రక్కలింపుచుఁ బ్రక్కలుఁజెక్కుచు నడు
ములుఁదుండెంబులు సేయుచు నూరువులువిఱుచుచు జానువులుఖండింపుచుఁ
బిక్కలుచెక్కలువాపుచుఁ బాదంబులువిలూనంబులుసేయుచు నెత్తురులురిలిం
పుచుఁ గండలురాల్చుచు నెమ్ములు విఱుచుచు భూషణంబులు రాల్చుచుఁ దను
త్రాణంబులుసించుచుఁ జాపంబులఁద్రుంచుచు గదలు పొడిసేయుచుఁ గరవా
లంబులు పఱియలువాపుచు ముసలంబులుగూల్చుచు ముద్గరంబులుతుమ్ముళ్లు
సేయుచుఁ గుంతంబులు రూపుమాపుచుఁ గుఠారంబులుచూర్ణంబులుసేయు
చు భిండివాలంబులు నఱుకుచుఁ దోమరంబులు పుడమిరాల్చుచు నంకుశంబు
లు పొడిసేయుచు ధ్వజంబుల నడిమికి నఱకుచు నిట్లనేకప్రకారంబులఁ గీలాభీ
లంబుఁజేసిన నమ్ముగ్గరంబుచచ్చియు నొచ్చియు విచ్చియు సుడిఁబడియుఁగలం

(*) ఖరసైన్యంబు రాముని పరాక్రమంబునకు వెఱగుపడి మఱలిపాఱిపోవుట. (*)

గియుఁ దొలంగియుఁ జిక్కువడియుసుజీకాకువడియును సైన్యంబు దీనదశకు
వచ్చినం గనుంగొని మహాబలవంతులగు కొందఱు రక్షోవీరులుసాహసంబునం
దలకడిచి వీరావేశంబున రామునకభిముఖులై శూలనిస్త్రింశపరశ్వధంబులం
బ్రహరించిన నయ్యతిరథవర్యుండు తీక్ష్ణాగ్రంబులైన నాళీక నారాచంబులఁ బ్ర
బలహాలికుండు మహారణ్యవృక్షంబులంబోలె వారల నందఱఁ బెక్కుతుండెంబు

లు గావించినంజూచి తక్కిన రక్కసులు సింగంబుఁగన్న లేళ్లచందంబునఁబ్రా
ణభయంబునఁ గనుకనిం బఱచి ఖరుని శరణంబుఁ జొచ్చినం జూచి శత్రుభీష
ణుండగు దూషణుండెలుంగెత్తి గంభీరఘోషణంబునం జేయివీచి పురికొల్పిన
నందఱు నొక్కింతధైర్యం బవలంబించి యంతవట్టునుం గూడుకొని ॥ (సీ) ఆ
నిలునితోడమాఁ, గ్రక్కునఁ బోవు భూరివలాహకంబుల భంగి, రథచయములు ।
నర్యముతోడిఁ బో, రాడఁ బోయెడుపెను చీఁకట్లకైవడి, సింధురములు । పో
రుచాలక పెద్ద, పులిమీఁది కుఱికెడు కోఁదమలెల్లంబోలు, ఘోటకములు । నగ
ణితబలుఁడైన, మృగరాజుపై కేగు శుండాలములభంగి, సుభట వరులు ॥
(తే,గీ) వెల్లివిరిసిన జలనిధి, విధముదోఁప । నొక్కమొగి ఘోరసంగరోద్యో
గకాంక్ష । తనరఁజెలియలికట్టచం, దముననున్న । రామభద్రునిఁబొదివిరి, రా
త్రిభంగి ॥ (ఉ) కొందఱు సాలతాలములు, కొందఱు భూరిశిలాప్రకాండ
ము । లొక్కందఱు శూలకుంతములు, కొందఱుముద్గరభిండివాలము । లొప్పం
దుగఁబూని యందఱొక, పోరికిఁగ్రమ్మికడంగి వ్రేయఁగా । సందడి కయ్యెమ
య్యోనృప, చంద్రున కాఖరదైత్యసేనకున్ ॥ (ఉ) ఆరఘువీరుఁ డప్పుడు భ,
యానకభంగిఁ గడంగిచుట్టును । న్భూరిశిలాంబక ప్రహతిఁ, బోరుచునున్న ని
శాటసైన్యము । న్చారుగఁజూచిదీర్ఘనయ, నంబుల నెఱ్ఱఁదనంబుదోఁపఁగా ।
(*) రాముఁడు రాక్షససైన్యంబుపై గాంధర్వాస్త్రంబుఁబ్రయోగించుట. (*)
వారణయూథముం గనిన, వారణవైరి క్రియంజెలంగుచున్ ॥ (క) మిడుతప
రి గవిసినట్లుగ । నెడతెగక కడంగియున్న, దీసేనబలే । సుడవడియున్నది యి
ప్పుడె । మడియింపఁగ వలయురిత్త, మసలఁగ నేలా ॥ (మ) అని చింతించి
జగద్భయానకకరం, బౌ నట్లుగా శింజినీ । ధ్వనిఁ గావింపుచు లోకపూజ్యము
గు గాం, ధర్వాంబకం బేయఁజ । య్యెన నయ్యస్త్రమహత్త్వమెట్టిదో యసం,
ఖ్యాతంబులై యస్త్రశ । స్త్రనికాయంబులు వుట్టి దిక్కులును నిం,డం బర్వె
గాఢోద్ధతిన్ ॥ (వ) ఇట్లు రాముని ప్రచండ కాండంబులు లెక్కకు
వెక్కసంబులై పుడమి యీనిన తెఱంగున నెల్ల దిక్కుల నాక్రమించి
యాకాశంబు నిరవకాశంబు చేసిన సూర్యకిరణ ప్రసరణంబు లేమిం జేసి గా
ఢాంధకారంబు గప్పుకొనియె నందు వెడందవాతియమ్ముల తాఁకున శిరంబులు
పగిలిగిట్టునం దిరుగుచు భీషణంబుగా ఘీంకారంబులు సేయుచు వజ్రప్రహారం



బుల చెక్కలు దెగిధరణిం బడిన కులాచలంబుల చాడ్పున దంతంబులూఁతగా
ముందఱికి వ్రొగ్గతిలంబడి బాణక్షతవేదన సహింపంజాలక ప్రాణంబులువిడు
చు మత్తశుండాలంబులును శుండాలో పరిభాగంబుల నుండి తోమరాంకుశం
బులఁబ్రహరింప గమకించునంతలోనఁ గత్తివాతియమ్ములుకంఠనాళంబులఁ ద్రెం
చిన నదియేచందంబున ధరణిపయింబడి గామితంబు సఫలంబుగామికి జీవితం
బులువిడువంజాలక కొఱప్రాణంబులం దన్నుకొను గజారోహకులును భల్లబా
ణంబుల శిరంబులం దునిసిపడిరయంబు పెంపుననదియెపోఁగాక యనిమొక్కిం
తదూరం బరిగి యవ్వలంజన నలవిగాక యచ్చటంబడి పొరలుచు నసువులు
విడుచు హయంబులును వాఁడిగలమండలాగ్రంబులు జళిపించుచు వీరావేశం
బునం దెగవ్రేయ గమకించునెడ సింహనఖశిలీముఖంబుల నుత్తమాంగంబులు
దెగిక్రిందంబడియున్న హయకళేబరంబుల మీఁదంబడి తోడనవేల్పులుగురియుం
చు మందారకుసుమవర్షంబులఁ బ్రాణంబులు వచ్చి వెంటనె మింటికెగసి కి
న్నరరూపంబులం బ్రశంసించు వీరరాహుత్తులును రథికసారథులు మడిసినవా
హంబుల వికలంబులై తమయిచ్చకొలంది నీడ్చుకొని పోవ మేదోమాంసమ
స్తిష్కపంకంబునం జిక్కువడి విశీర్ణంబులైన రథాంగంబులతో నఱవఱలై
నయరదంబులును గాలుఁ జరికికొన సామర్థ్యంబు లేక నొక్కింత సాహసం
బున నానావిధప్రహరణంబులం బొడువనుంకించు నంతలోన నెడనెడ వాలిక
నారసంబులఁ జరణజానుజంఘాజఘన మధ్యోదరఖండంబులు తిల ప్రమాణం
బులై రాలిన రూపుసెడిపోవు పదాతులుం గలిగి సంగరాంగణంబు దారు
ణదర్శనం బయ్యె నందు శిరంబులు కమఠంబులును గజంబులు మకరంబులు
ను గేశంబులు శైవాలంబులును భూషణరజం బిసుకయు బాహువులు మీనం
బులును గొడుగులుశతపత్రంబులును మేదోమాంసమస్తిష్కంబులుపంకంబును
శోణితంబు జలంబునుగా ననేకరుధిరనదులుప్రవహించె నందుఁ గడుపులకు వె
క్కసంబుగా మాంసంబు మెక్కి రక్తంబుఁ గ్రోలి రుధిరప్రవాహమధ్యంబున
నీఁదులాడుచు రాముని విక్రమంబుఁ బ్రస్తుతింపుచు ననేక భంగులం గ్రీడించు
భూతప్రేతపిశాచ శాకినీగణంబుల కోలాహలంబు బహులంబై యుండె నివ్వి
ధంబున నొక్కముహూర్తంబులోనఁ గించిదవశిష్టంబుగా రాక్షస సైన్యం
బుమాపుమాపి తమంబు విరియం దట్టి తేజరిల్లు మధ్యం దినమార్తాండు

నకు రెండవ మూర్తియై రామభద్రుం డంతకంతకుఁ బ్రవర్ధమానంబులగు నుత్సాహబలశౌర్యంబులుఁ గలిగి తక్కినరాక్షసుల నిశ్శేషంబుగా వధియింపం గోరుచుండె నప్పుడు హతశేషులగు రాక్షసులు బెబ్బులిం గన్న లేళ్లచందం

**దూషణుండు మఱలిన రాక్షససైన్యమును బురికొల్పుట**

బున నమ్మహావీరుని కట్టెదుట నిలువనోపక భీతచిత్తులై కనుకనిం బఱచినం జూచి రోషభీషణుండై దూషణుండు॥ (ఉ) ఈగతి మీకు నేఁగలుగ నేటికి మర్త్యున కోడి పాఱెదో । స్వర్గము మీఱ నందఱను వీని వధింతుము రండఁటంచు రక్షోగణనాయకుండు పురికొల్పినఁ బంచసహస్ర యోధులు । భ్యాగత కాలకింకరుల యట్లు చెలంగెడు వారలుగ్రతన్॥ (చ) అతనిఁ బురస్కరించుకొని యందఱు రామునిఁ జుట్టిముట్టియ । ద్భుతముసలోపలప్రదర భూరుహపట్టసశూలవర్షము । స్వితత బలాఢ్యులై రఘు వీరుని పైఁ గురియింప నమ్మహా । ధృతి కిఁగలంగక వ్విభుఁడు దారుణబాణహతిం దెరల్చుచున్॥ (క) వడిగుండ్లు గురియు పట్టపు । జడికిఁ జలింపని నగంబు చందము దోఁపం । గడు సుస్థిరుఁడై దైత్యుల । మడియింపఁగఁ బూని రోషమానసుఁ డగుచున్॥ (క) కులిశంబుకంటె బెడిదము । గల వాలిక నారసములఁ గడువడి దోషా । టుల మీఁదం బఱపి బలుదూ । షణు దూషణు మేనఁ జూనిపె భుజబలమలరన్॥ (క) యుగపత్ప్రతిత శరంబుల । యుగపత్పతమాన దారుణోరు శరముల । న్యగపత్ప్రహిత శరంబుల । జగతిపరిస్తీర్ణ యయ్యెసాంద్రముగ రహిన్॥ (ఉ) తోడనె శత్రుదూషణుఁడు దూషణుఁ డంతకు భంగిఁ గ్రుద్ధుడై । వేఁడిమి నివ్వటిల్ల రఘు వీరునిఁ దాఁకఁగఁ దేరుఁ దోలి క్రొ । వ్వాఁడి శిలీముఖంబులని వార్యగతిన్ని గుడించి రాక్షసు । ల్వేడుకతోడఁ జూడఁ దన విక్రమమంతయుఁ జూపె నుద్ధతిన్॥

**రాముఁడు దూషణుని వధియించుట.**

(చ) అతని పరాక్రమంబునకు నల్కనహించి రఘుప్రవీరుఁడ । ప్రతిహతశౌర్యుఁడై యొకశరంబునఁ జాపముఁ ద్రుంచి నాల్గిటం । జతురత వీతులం దునిమి సారథి నొక్కటన ర్ధచంద్రసం । హతిఁ దునుమాడి వాని యురమంటఁగ నేసె నిషుత్రయంబునన్॥ (వ) ఇట్లు విరథుండును వికల సాధనుండును విసహతాశ్వుండును వినిపాతిత సారథియునై యన్నిశాచరుండు గినిసి గిరిశిఖర సంకాశంబును రోమహర్షణంబును గాంచనపట్టవేష్టితంబును దేవసైన్యాభిమర్దనంబును దీక్ష్ణశంకుసమాకీర్ణంబును గాలాయ సమయంబును బరవసోత్కీ



తంబును వజ్రాశని సమస్పర్శనంబును బరగోపురవిదారణంబును మహోరగసంకాశంబును నగు పరిఘంబుఁ గొని పరమసంక్రుద్ధుఁడై రామున కభిముఖంబుగా రయంబునం బఱతెంచు సమయంబున నా రఘువీరుండు రెండుకత్తివాతియమ్ముల సహస్రాభరణంబులైన వాని భుజంబులు రెండును ఖండించిన ఛిన్నహస్తుండయిన వానికరంబుననుండి యమ్మహాపరిఘంబు శక్రధ్వజంబు పోలిక ధరణిపయిం బడియె నిట్లు శరనికృత్తబాహుండై దూషణుండు విషాణంబులు వెఱికిన మహాగజంబు పోలికఁ బుడమిం గూలి తత్క్షణంబ నసంప్రాప్తమరణుండయ్యె నతని పాటుఁ జూచి సర్వభూతంబులును సాధువాక్యంబుల రామునిం బ్రశంసించిరంత॥ (ఉ) దూషణు పాటుఁ జూచి మదిఁ దొట్టిన కోపము నెత్తికెక్కఁగా । రోషకషాయితాక్షులయి రోఁజుచు దానవపండనాయకు । ల్భీషణభంగి ముప్పురి భీకరులొక్కట వీర్యవచ్ఛిరో । ఘూషణుఁడైన రాఘవునిఁ బోర నెదిర్చిరి సాహసంబునన్॥ (వ) ఇట్లు మహాకపాలుండును స్థూలాక్షుండును బ్రమాథియు ననువారలు మృత్యుపాశావపాశితులై తీవ్రవేగంబునం బాఁకి॥ (చ) అలుక మహాకపాలుఁ డొక యాయసశూలము స్థూలనేత్రుఁడు । జ్వలదురుపట్టసంబు నొకశాతపరశ్వథముం బ్రమాథిని । ట్టలముగఁ బూన్చి వ్రేసి వికటంబుగ నార్చిన నారఘూత్తముం । డలయక సాధనత్రయము నస్త్రములన్ వడిఁ ద్రుంచి వెండియున్॥ (చ) అనుపమహేమభూషితశరాహతివేగ మహాకపాలునిం । దుని

**— *రాముఁడు మహాకపాలస్థూలాక్ష ప్రమాథులను ముప్పుర రాక్షసుల* —**

**—(*) జంపుట. (*)—**

మిప్రమాథిని న్వేడఁద తూపున గీటణఁగించి స్థూలనే । త్రుని విషదిగ్ధబాణమునఁ ద్రుంచిన నయ్యసురత్రయంబు వ । జ్రనిహతపర్వతత్రయము చాడ్పునఁ గూలె ధరాతలంబునన్॥ (చ) అంచితవిక్రముండగు మహారథవర్యుఁడు రాముఁ డంతటం । బంచసహస్రరాక్షసులఁ బంచసహస్రశిలీముఖంబులం । బంచతనొందఁజేసి కలభంబులఁ జంపిన సింగమట్లనే । త్రాంచలదీధితుల్ని గుడ నద్భుతనైఖరిఁ బొల్చియుండఁగన్॥ (వ) అమ్మహావీరుని పరాక్రమప్రకారంబుఁ జూచి సహింపక మృతుండైన దూషణుం దలంచుకొని దుఃఖితుండై ఖరుండు వీరావేశంబున॥ (ఉ) గ్రద్దనఁ గోపవేగమునఁ గన్నులనగ్నికణంబులొల్కఁగా । న్నిద్దఱు దండనాథులన హీనబలాఢ్యులఁ జూచి మీరలీ । ప్రొద్దున నేఁగి మానవుని పొంకమడంచి వధిం

చిరండువే। సుద్దులఁజెప్పనేలమన శూరతలెన్నటికింకఁగాల్పనే॥ (వ) అని
బరవసంబుఁజేసి పురికొల్పి తానును రభసాతిశయంబున రామున కభిముఖం
బుగా రథంబుఁ దోలించెనంత ఖరాసురప్రేరితులై శ్యేన గామియుఁ బృథుగ్రీ
వుండును యజ్ఞశత్రుండును విహంగముండును దుర్జయుండును గరవీరాక్షుం
డును బరుషుండును గాల కార్ముకుండును మేఘమాలియు మహామాలియు
సర్పాస్యుండును రుధిరాశనుండునను ద్వాదశమహావీరులు హతశేషులైన సైని
కులంగూడుకొని శీఘ్రవేగంబున ఖరునిం దలకడచి శరాసార ఘోరంబుగాఁ
గవిసి నానావిధ హేతివ్రాతంబులఁ బరఁగించుచు రౌద్రప్రకారంబునం జుట్టు
ముట్టి యట్టహాసంబుఁజేసిన॥ (శా) ఆపద్మాప్తకులుండు రెండవనిదాఘాదిత్యుఁ
డై చాపవి। ద్యాపాండిత్యము దోఁపసాధుముఖప ద్మంబుల్వికాసస్థితి। దీపింప

## రాముఁడు పన్నిద్దఱు రక్షోవీరులఁ జంపుట.

న్ఘనచండకాండకిరణో ద్రేకంబునంగ్రవ్యభు। గ్రూపధ్వాంతముల న్హరించెదిశల
న్నుద్ధప్రభల్గ్రమ్మఁగన్॥ (ఉ) వెండియుఁ జండ కాండములు వేపదివేలునిగు
డ్చియొక్కటం। గొండలఁబోలురాక్షసుల నూర్వ్వరనూరుశిలీముఖంబుల। న్మెం
డుగనొక్కదైత్యవరు నిన్వధియింపుచుఁజిత్రభంగినా। ఖండలుఁ డద్రిశృంగ
ముల కైవడినందఱఁగూల్చెఁబ్రేల్మిడిన్॥ (క) పదిరెండునారసంబులఁ। బదప
డిరాఘవుఁడు వేగఁ బన్నిద్దఱ్రై। ట్టిడులగుసేనాధ్యక్షులఁ। గదనంబునఁ దుని
మిపనిచెఁ గాలునిపురికిన్॥ (చ) అనిమొన రామచండవిశిఖాహతిఁ గూలిన
ముక్తకేశభృ। ద్దనుజులచేఁబినద్ధయయి ధాత్రికుశోక్షితమైన వేదిచా। ప్పునఁ
దనరారెనవ్విపిన భూస్థలిశోణితమాంస పంకమై। ఘనతర నారకస్థలము కైవ
డినొప్పుచునుండెన త్తఱిన్॥ (చ) కదనమునందురాఘవుఁడ ఖండపరాక్రమదు
ర్నివారుఁడై। మదముననొక్కఁడయ్యునర మాత్రకుఁడయ్యుఁ బదాతియయ్యు
ని। ట్లదయతఁదచ్చతుర్దశసహస్రనిశాటుల నశ్రమంబునం। జిదురుపలైధ
రం దొరుఁగఁ జేసెసురల్మదమందిచూడఁగన్॥ (క) ఖరుఁడును ద్రిశిరుండనువా।
రిరువురురాక్షసులుదక్క నెల్లసురారుల్। ధరణీధరముల క్రియను। ర్వ్వరఁగూ
లిరికదనమందురామునిచేతన్॥ (వ) ఇట్లు మహావాతవేగంబునంగూలుమహీ
రుహంబులచాడ్పున నిశాచరులందఱు రఘువీరుని కాండప్రకాండంబులఁ జెగిని
శేషంబుగా మడిసినంజూచి ఖరుండు కోపాటోపంబునరాముని యాటోపంబుఁ



జూచి సహింపక రథంబుఁదోలించుకొని యమ్మహారథున కభిముఖంబుగా నడ
రిన నతని నివారించి వాహినీనాయకుండగు త్రిశిరుండిట్లనియె॥ (సీ)అసురేం
ద్ర యింతసాహసమేలమఱలుము రాక్షసాంతకుఁడైన రాముఁగదిసి। వాఁడిమి
గలనాదు వేఁడిమిఁజూపెది వ్యాఘ్రసంహతివానినిపథిం [illegible] నంతకు
మునువానిచేఁజచ్చి నట్టివారికిఁబ్రీతిపుట్టఁజేసి। వచ్చెదననదిగాక వాఁడునాచేఁజ
చ్చె నేనిక్రమ్మఱనిజస్థానమునకు॥ (తే,గీ) నరుగుమటుగాక యేనమ్మహాత్ముచేతఁ
నిపుడురణమునఁజచ్చితి నేనిమఱల। యుద్ధమునకీవుదొడరినాయుమ్మలికము।
దీర్చఁపుచ్చుము పెక్కులధీరవర్య॥ (వ) రాక్షసేంద్రా యేనాయుధంబుముట్టి
ప్రతిజ్ఞఁజేసెద సర్వప్రకారంబుల రాక్షసులకు వధ్యుండైన రాముని వధించెద
రామునిచేత నేనైనను నాచేతరాముండైనను బంచత్వంబు నొందుట సిద్ధంబు
నీవువెనుకకుం జని రణోత్సాహంబున నిలువఁబడి యొక్కముహూర్తంబు
జయాపజయ నిర్ణాయకుండవగుమని బరవసంబుగాఁ బలికిన ఖరుండు వానికి
రణంబున కనుజ్ఞయొసంగి రయంబున రామునకనభిముఖంబుగా నడిచె నంతఁ
ద్రిశిరుండు కృతాభ్యనుజ్ఞుండై జవాశ్వసంయుతంబగు కనకరథంబెక్కి త్రిశృం

## రాముఁడు త్రిశిరునిఁ జంపుట.

గంబగు పర్వతంబుచందంబున శరీరంబుగ్రాల సలిలధారలుగురియు మేఘంబు
కైవడి శరవర్షంబు గురియుచు మూఁడు నోళ్ల ముల్లోకంబు లప్పళించుటకుం
జాలి జలార్ద్ర దుందుభినాద సదృశనాదంబున గర్జింపుచు రభసాతిరేకం
బుగాఁ గవిసిన నతని యట్టహాసంబుఁజూచి రఘువీరుండు బహుప్రకారంబుల
గు శరపరంపరల వాని బాణంబులన్నిటిని జదియనడఁచుచుఁ బ్రచండభంగి
మార్కొనిన నయ్యిద్దఱకు భీషణంబగు సంగ్రామంబయ్యె నివ్విధంబునం దలప
డి రాముండును ద్రిశిరుండును సింహమదేభంబులచందంబున వాయువలాహ
కంబులపగిది వాసవవృత్రులవిధంబున గరుడపన్నగంబులమాడ్కిఁ బరస్ప
రహుంకారంబుల నితరేతరధిక్కారంబుల నన్యోన్యతిరస్కారంబులఁ గొం
డొకసేపు కన్నులపండువుగా భండనంబుఁజేసి రాసమయంబున॥ (తే,గీ) కన
లిత్రిశిరుండుతీవ్రాంబకత్రయంబు। కౌసలేయునినొసలువాఁకంగనేయ। నించు
కైననుదలఁకక హీనబలునిఁ। గానెతేఁగివానితోడనిట్లనుచుఁబల్కె॥ (ఉ) ఓరి
నిశాటయెవ్వనిమహోగ్రశరంబులుమన్నిటాలమం। దారయఁ బుష్పసన్నిభ

ము లై మృదువై ఖరిం బొల్చెనట్టినీ। శూరత తెల్లమయ్యె నికఁ జూపఁగ నేటికిమ
చ్ఛిలీముఖా। సారము గ్రమ్మఱంగొనుము చయ్యన నీపని చక్కనయ్యెడిన్॥ (క)
అనియుల్లసమాడుచున। ద్దనుజుని వక్షమున ఘోరతర కాలవ్యా। ళనిభశరచ
తుర్దశకము। సునిశితగతిఁ జొనిపియంతనాలయక మఱలన్॥ (మ) ఒకబా
ణంబున వానిచేతిధనువత్యుగ్రంబుఁ గాఁద్రుంచి వే। ఱొక నారాచచతుష్టయంబు
నఁ దురంగోత్సేకమున్మాన్చి త। క్కకసూతున్దృఢసాయకాష్టకమునన్ఖండించి త
త్కేతనం। బొకకాండంబున రెండుగాఁ దునుకలై యుర్విం బడం గూల్చెనన్॥
(వ) ఇట్లు విరథుండై రథంబువలన రయంబునఁ బుడమికి దాఁటి పాదవిన్యా
సంబున భూమి గ్రక్కదలఁ బఱతెంచుచున్న త్రిశిరుని శిరత్రయంబు బాణత్ర
యంబున ఖండించిననవి మహావాతపతితంబులగు తాళఫలంబుల చందంబున
ధరణిం బడియె వానికళేబరంబు శిఖరరహితంబైన పర్వతంబుపగిది నుర్వింగూ
లె నిట్లు త్రిశిరునిఁ దెగటార్చి రఘువీరుండు వృత్రాసురునిం దునిమిన పురం
దరునికైవడి నొప్పుచుండె నంత హతశేషులగు రాక్షసులు బెబ్బులిం గన్న హ
రిణంబులకైవడిఁ గ్రస్తచిత్తులై కనుకనిం బఱచి ఖరుని మఱువు సొచ్చి రతండు
హతులైన దూషణత్రిశిరులను దక్కినచతుర్దశ సహస్ర రక్షోవీరులం దలం
చుకొని శోకరోషంబులు మనంబున ముప్పిరిగొన రాక్షసులపాలిటి యంతకుం
డై కన్నులకుం దేఱిచూడరాక వెలుంగుచున్న రాముని విలోకించి మనంబునఁ
దలంకుచు విమానాగ్రభాగంబులనుండి పెక్కువిధంబుల రామునిఁ బ్రశంసించు
దేవర్షిమహర్షుల యుత్సాహంబుఁ గనుంగొని క్రమ్మఱ రోషంబుఁ గల్పించు
కొని వాసవుం జేరు నముచిచందంబున స్కందునిం జేరు తారకునిపోలిక సంరం
భవిజృంభితుండై రామునిం గదియవచ్చి॥ (మ) బలవచ్చాపము నెక్కువెట్టి గు
ణశబ్దంబుల్ప్రచండంబుగాఁ। జెలఁగన్మిశ్రిత భంగిఘోరతరసం స్ఫీతోగ్ర నా
రాచము। ల్చల మొప్ప న్నిగుడించి సర్వదిశలు న్సర్వం సహాకాశము। ల్గల

## ——— రామ ఖరాసుర ద్వంద్వయుద్ధము. ———

యంజేసిని మేషమాత్రమున నీరంధ్రింబుగాఁ గప్పెనన్॥ (చ) కనిరఘువల్లభుం
డుఘన కార్ముకమున్నవరించి శింజినీ। ధ్వనులు సెలంగ దుర్విషహ దారుణ
కాండములొక్కరీతిగా। మునుకొని దీప్తవహ్నికణ ముల్చెదరన్నిగుడించియా
కసం। బనుపమలీలనుగ్రగతి నస్త్రమయంబుగఁ జేసె గ్రక్కునన్॥ (క) ఖరరా



ముని సర్జితభీ। కరతర బాణములచేత గగనంబు నిరం। తరమయ్యె సర్వదిశ
లును। బరిపూర్ణములయ్యె తెల్లు పరిచిన భంగిన్॥ (క) నిరుపమ సాయకధా
రా। పరివృతుఁడై యినుఁడుఁ గానఁ బడకుని క్కఁ బ్రజ। ల్వెరవేది రేయిఁ బవలే।
ర్పఱుపఁ దరము గాక ఱిచ్చవడియుండిరిలన్॥ (వ) మఱియు నిట్లు తలపడి యి
తరేతర జయకాంక్షలం బోరునప్పుడు॥ (క) ఆలమున ఖరుఁడు రాముని। నాళీక
వికీర్ణ నిశితనారాచముల ( న్వాలుఁడు తోత్రంబుల శుం। డాలంబును బోలె నల
మటం బ్రహరించెన్॥ (క) ఖరు నిరథస్థుని రాక్షస। వరు నిదనుర్ధరునిఁ బర్యవ
స్థితు భూతో। త్కరమవ్పుడు పాశధరుఁడగు। పరేతపతిఁ బోలెఁ జూచి భయమం
దెర హిన్॥ (వ) ఇట్లు దుష్ప్రధర్షుండై ఖరుండు॥ (శా) ధీరుం బౌరుషపర్యవ
స్థితు సము ద్దీప్తప్రతాపు న్మహా। శూరు స్సింహపరాక్రమున్సకలర క్షోభీము రా
మున్బలో। దారుం గాంచి హులతాళను న్డుతచం దానన్వ సన్నాసిదు। ర్వారప్ర
క్రియహీనసత్త్వుఁడనుచు న్భావించి సంరంభియై॥ (క) తనచేతి బలువుగన్పడ।
ఘనశరమున రాము చేతి కార్ముకగుణముం। దునిమివెస సప్తశరములు। సు
నిశితగతి నతని మేనఁ జొనిపెంబ్వలుచన్॥ (క) అటఖరకార్ముకముక్త। స్ఫుటనా
రాచముల చేత భూమీశు నికం। కటమప్పుడు కుబుసముక్రియఁ। బటురయమున
సడలి పుడమిఁ బడియెం గడిమిన్॥ (ఉ) అంతట రాక్షసుండు ప్రళయాంత
కు కైవడిఁ బేర్చి జానకీ। కాంతుని మీఁద దీక్ష్ణవిశిఖంబుల సంఖ్యము లేసి వేగరో।
దోంతర మెల్ల నిండవడి నార్చుచు సర్వసుపర్వలాత్మలో। నెంతయు నుమ్మలింప
ఖరుఁ డిట్లు గడంగె మహోగ్రమూర్తియై॥ (వ) ఇట్లు ఖరబాణపీడితుండై శ
త్రునిబర్హణుండగు రాముండు విగతధూముండగు వైశ్వానరుని చందంబు
నం దేజరిల్లుచు నంతకంత కుత్సాహంబు రెట్టింపఁ దొల్లి తనకుఁ గుంభసంభ
వుం డిచ్చిన గంభీర నిస్స్వాంబగు వైష్ణవచాపంబు లీలం గేలనందుకొని వైరివినా
శనార్థంబు సముచితంబుగా సజ్యంబుఁ జేసి గుణప్రణాదంబు సేయుచు॥ (ఉ)
కాంచనపుంఖ కాండముల ఖండగతిన్నిగుడించి వేగన। క్తంచరు కాంచన ధ్వజ
ము దప్పక త్రుంచిన సర్వదేవత। ల్పంచిన పక్ష బాంధవుఁడు వ్రాలినకైవడిఁ గూ
లెనేలఁద। త్కాంచన దీధితుల్నిఖిల కాష్ఠలయందు వెలుంగుచుండఁగన్॥
(ఉ) వెండియుఁ గ్రుద్ధుఁడై ఖరుఁడు వేగమె మర్మవిదుండు గాపునం। గాండ
చతుష్టయప్రహతి గాత్రము నొవ్వఁగఁ జేసి యార్చెను। ద్దండరయంబునన్సమద

దంతినిదారుణతోమరంబుల । న్దండిగ వ్రేటుపెట్టినవిధంబునఁ గోపరసోగ్రమూర్తియై ॥ (క) ఖరకార్ముకనిస్సృతభీ । కరమార్గణవిద్ధుఁడగుచుఁ, గాకుత్థ్సకులా । భరణుఁడు రుధిరాప్లుతుఁడై । కరమరుదుగ రోహణాద్రి, కైవడి నలరెన్ ॥ (వ) ఇట్లుఖండసంధ్యారాగమండల పరివృతమార్తాండుండుం బోలె దివ్యప్రభాభాసమానుండై రామభద్రుఁడ వష్టంభంబున ॥ (శా) లోకాలోకగుహాముఖంబు ప్రతిని. ఘోషంబు గావింపన । స్తోకజ్యానినదంబుఁ జేసి శరము ల్దోష్ఠోడసంధించివి । ల్లాకర్ణాంతముగా వడిందిగిచి ప్ర, త్యాలీఢపాదస్థుఁడై । వీఁకన్వ్రేఁకనిగుడ్చె బాహురభసో, ద్వేగంబు దీపింపఁగన్ ॥ (వ) ఇట్లమోఘ శరపాతనంబున ఖరుని యాటోపంబడఁగించి వెగడుపఱిచి క్రమ్మఱి

(*) రాముఁడు ఖరుని విరథునిఁ జేయుట. (*)

నాఱుసాయకంబులు నిగుడించి యొక్క వెడందవాతియమ్మున వాని శిరంబును రెండుతూరికంబుల వానిభుజశిఖరంబులును మూఁడర్ధచంద్రబాణంబుల వానివక్షంబునొప్పించి వెండియు సూర్యమరీచి కల్పంబులైన పదుమూఁడు నారసంబులు ప్రయోగించి యొక్కవిశిఖంబున యుగంబునఱికి నాలుగు శిలీముఖంబుల ఘోటకంబుల గీటణంగించి యాఱవశరంబున సారథి శిరంబు ఖండించి మూఁడంబకంబులఁ గూబరంబును రెండమ్ములనొగలును బంద్రెండవమార్గణంబున ఖరునిచేతి కార్ముకంబును బఱియలువాపి వజ్రసంకాశంబైన పదుమూఁడవపృషత్కంబున ఖరునిశిరంబుదూలనేసిన నాఖరుండు భగ్నచాపుండును విరథుండును హతాశ్వుండును హతసారథియునై కాలదండంబుఁ బోని గదాదండంబుఁ బుచ్చుకొని ధరణీగతుండై నిలువంబడియుండె నప్పుడు రాముని పరాక్రమప్రకారం బాలోకించి యంబరంబునం బన్నినమహర్షి దేవతాముఖ్యులు విమానాగ్రభాగంబుల నుండి ప్రాంజలులై పరమానందంబునఁ బ్రశంసింపుచుండిరి యిత్తెఱంగున విరథుండై గదాపాణియైయున్న ఖరునింజూచి రాముండు మృదుపూర్వకంబుగాఁ బరుషవాక్యంబున నిట్లనియె ॥ (ఉ) స్యంద

(*) రాముఁడు ఖరుని నానావిధంబుల దూఱుట. (*)

నవారణాశ్వభట, సంకులమైన బలంబుతోడ నీ । కందువఁ జేరి నీవుచిర, కాలమునుండి సమస్తసాధులం । గొందలమందఁ జేసితివి, క్రూరుఁడు పాపవిచారకుండుగ । ర్వాంధుఁడు సర్వలోకవిభుఁ, డైనను ధాత్రిమనంగ నేర్చునే ॥(క)



లోకవిరుద్ధంబగుపనిఁ । గైకొని కావించునట్టి, కఠినునివిషద । ర్వీకరముఁ బోలె బలియుఁడు । ప్రాకటముగఁ జంపు ఘనన్కృ, పారహితుండై ॥ (తే.గీ) మఱియు నెవ్వాఁడులోభకా, మములఁ జేత । దురిత మొనరించునతఁడు త. ద్దురితఫలము । వెసననుభవించు బ్రాహ్మణీ, వృష్టిశిలను । గ్రుంగిపంచత్వ మొందిన. భంగినసుర ॥ (క) ఘనదండకావనంబున । మునుకొని వసియించియున్న, పుణ్యాచరితుల । న్మునుల వధియించి యేఫల । మనుపమగతి ననుభవింప, నాసించితివో ॥ (క) జనదూష్యులు క్రూరులుభూ । తనింద్యులు సమర్థులయ్యుఁ, దడవుగ నిలపై । మననేరరు చర్చింపఁగ । దనుజాధమ శీర్ణమూల, తరువుల మాడ్కిన్ ॥ (తే,గీ) కర్తయగువాఁడు నిజఘోర, కలుషకర్మ । ఫలమవశ్యంబు నొందు సు, పర్వవైరి । యరయఁగాలంబు సంప్రాప్త, మగుచునుండ । నగములార్తవమగు ప్రసూ, నములబోలె ॥ (ఆ,వె) ఖలుఁడు తనదుఘోర, కలుషకర్మఫలంబు । నప్పుడె తోడుతోడ, ననుభవించు । వెలయభుక్తఘోర విషమిశ్రితోదన । ఫలమునవెనుదివిజ, కులవిరోధి ॥ (తే.గీ) ఘోరపాపంబుసేయుచు, మీఱిలోక । మునకుహింసఁ గావించెదు, దనుజవరుఁడ । బట్టినధియించుటకు నేను, భరతునాజ్ఞ । దుష్టదైత్యసమాసాది. తుండనైతి ॥ (తే.గీ) దానవాధమ వేయేల, తడయకెపుడు । శిష్టులకువిప్రకారంబు, సేయునట్టి । నిన్ను రణరంగమునఁ జంపి, నేఁడు మొదలు । సకలభువనంబులకు మేలు, సంఘటింతు ॥ (తే,గీ) కడిమిదీపింపనాచేత, విడువఁబడిన । హేమభూషితవిశిఖంబు. లిపుడె నిన్నుఁ । గలఁచి వల్మీకమునుబన్న. గములుబోలెఁ । జయ్యనధరిత్రి భేదించి, చనఁగఁగలవు ॥ (తే, గీ) పుణ్యతరమగు దండకా. రణ్యమందు । శిష్టవిద్వేషివైన నీచేతమున్ను । పరఁగభక్షింపఁబడినట్టి. పరమమునుల । నిపుడెగాంచెదు సైన్యస, హితుఁడవగుచు ॥ (క) దనుజాధమ మచ్ఛరముల । ననిలోఁ జెగినిరయగతికిఁ జరిగెడునిన్నున్ । నునుచే బాధితులగు । మునులిప్పుడు చూడఁగలరు, ముదితాత్మకులై ॥ (ఉ) ఓరిదురాత్మ యేటికిపు. డూరక యుండఁగ నీదుశౌర్యమిం । పారఁగఁ జూపు నీశిరము, నద్భుతతాలఫలంబుకై వడి । న్ధారుణిఁ గూల్తునంచు సము, దగ్రతరాఘవుఁ డిట్లువల్కినా । ఘోరనిశాటుఁ డిట్లనియెఁ, గ్రో

(*) ఖరుండు రాముని నధిక్షేపించుట. (*)

ధముదోఁపఁగ రక్తనేత్రుఁడై ॥ (ఉ) కొండఱు బ్రాకృతాసురులఁ, గూల్చితినం

చొరఁబోఁబుబంటువై । డెంపమునందుఁ బొ గుచువ, డిన్నుఁ ద్రియించుకొనంగ నే
లగో । గ్రాఁడగవీర్యవంతులున, రఘుర్జభు లద్భుతసత్త్వవంతులీ । చండమునన్ని
జౌజమునఁ, జక్కఁనగాని దురుస్సులందురే ॥ (క) లోకంబునసత్కృతాత్ములు ।
పాత్రికృతులును రాజనంశ, సాంగసులగువా । రేకరణి రజ్జులాడెద । రాకరణి
నింధ్యకోక్త్యలాడఁగఁదగునే ॥ (క) అనిమొన శూరుఁడు తనుఁదా । విను
తించుకొనంగఁదగునె. వెఱ్ఱితనమున । న్వీను మాత్త స్త్రినాశన । మొనరించుం
గాఁడెఁక్ర, మోర్ధతికెల్లక ॥ (వ) మఱియు మృత్యుకాలసంకాశంబైన సమ
రంబుసంప్రాప్తంబగుచుండ నప్రస్తుతంబునందుఁ గులీనత్వంబుఁ బ్రకటింపుచు
నెవ్వండాత్మప్రశంసఁగావించుకొను వహ్నిబుద్ధిచేతనగ్నివర్ణంబైన యుపలం
బును సంస్పృశించు పురుషునికొఱకనుపలభ్యమానోష్ణస్పర్శంబైన నయ్యు
పలంబుచేతఁదననయగ్నిత్వంబెట్లునిదర్శితంబయ్యెనట్లునీచేతనిన్ను వీరుండనిత
లంచెడు నాకొఱకీయాత్మప్రశంసచేత నీయవీరత్వనామక లఘుత్వంబు నిదర్శి
తంబయ్యె నదియునుంగాక సువర్ణశోధకాగ్నిచేత సంతప్తంబైనసువర్ణప్ర
తిరూపారకూటంబుచేతఁ గార్ష్ణ్యరూపంబైన లఘుత్వంబునిదర్శితంబైనచం
దంబుననీచేత నీవికత్థనంబున నశూరత్వరూపకంబైన లఘుత్వంబుసర్వప్రకా
రంబుల నిదర్శితంబయ్యెనని పలికి వెండియు నిట్లనియె ॥ (క) బహుధాతువిచి
త్రితమగు । మహీధ్రమునుబోలె నన్ను,మదినచలునిగాఁ । రహిఁ బరికింపుము
దోర్బల । రహితునిఁగాఁజూడవల ద.రాత్రిప్రవరా ॥ (తే,గీ) తివిరిముల్లోకము
లను వధింపఁ బూని । దండముపరిగ్రహించిన,దండధరుని । పోల్కిననినిన్ను
వధియింపఁ,బూనిగదను । జేకొని గడంగి నాఁడ వీక్షింపునన్ను ॥ (ఆ,వె) ప్రా
ద్దుఁగ్రుంకవచ్చె,నుద్దులువేయేల । కదనమునకుహాని, గలుగకుండ । నేఁడు ని
న్నుఁజంపి నీచేతఁజచ్చిన । దితిజవరుల వగపు, దీర్చువుత్తు ॥ (వ) అని యివ్వి

### (*) రాముఁడు ఖరప్రయుక్త గదను ఖండించుట.(*)

ధంబునఁ బిఱుసనక మఱుమాటలాడి ఖరుండు సంరంభ విజృంభితుండై కా
లదండసదృశంబైన గదాదండంబు జరజరం ద్రిప్పి కనకవలయరోచులు దిశ
లం జెదర దీప్తాశనింబోలె రామునిపై వైచిన నది మహావేగంబునవృక్షగుల్మం
బులు భస్మంబుగావింపుచు నంతరిక్షంబునఁ బఱతెంచుచున్నం గనుంగొనియా
రఘువీరుండు నిశితాగ్రంబులైనబహువిధశరంబులడరించి దానిఖండించినమ్మృ



త్యుపాశసంకాశయగు నమ్మహాగద రామకార్ముక ముక్తకాండంబులచేత విభి
న్నయై మంత్రౌషధంబులచేతఁ బుడమిం బడిన వ్యాళికరణి ధరణీతలంబునం
బడియె నిట్లుఖరాసుర ప్రముక్తంబైన గదాదండంబుచూర్ణంబు చేసి ధ
ర్మవత్సలుండగు రాముండు స్మయమానుండై వెండియు సంరంభంబుగా
వానికిట్లనియె ॥ (ఉ) ఓరి నిశాట నీదగు బలోద్ధతి సర్వముజూపినట్లునీ ।
శూరతయున్గభీరతయు, సొంపునుబెంపును దెల్లనయ్యెబ । ల్గారుణభంగి నొప్పు
గద, తప్పక మచ్చితసాయకాహతి । ధ్ధారుణిఁగూలెనీకు ఖర,నామము గల్గుట
వ్యర్థమేకదా॥ (ఆ,వె) నేఁడునిన్నుఁజంపి,నీచేతఁజచ్చిన । దితిజవరులవగపుఁ,
దీర్చువుత్తు । ననుచునీవు కడఁక, నాడినవాక్యంబు । వ్యర్థమయ్యెఁ గదని,శా
టవర్య ॥ (క)వధ్యుఁడవునీచుండ వగ । న్మిథ్యావృత్తుండవైన. నీజీవితము । న్త
థ్యము హరింతువసుధన ।సాధ్యుండగు గూఢచరణ, శత్రుండుపోలెక్ ॥ (తే,గీ)
దానవాధమ యిపుడుమ, ద్బాణనిహతి । భిన్నకంఠుండవైకూలి, యున్ననీదు ।
ఫేన బుద్బుదశోభితం, బైనరుధిర ।మిమ్మహీదేవిగ్రోలునం, దమ్ముగాఁగ ॥ (తే.గీ)
గ్రస్తవిన్యస్తభుజుఁడవు, సాంద్రపాంసు । రూషితుండవై దుర్లభ. యోషఁబో
లెఁ । బృథ్విఁ గాఁగిటఁ జేర్చి ని, ద్రింపఁ గలవు । యడిచి పడనేటి కింతలో, న
మరవైరి ॥ (తే,గీ)దానవాధమ నీవు మ, ద్బాణహతివి । దారితావయవుండ
వై, ధాత్రిఁగూలు । చుండ నేఁడాదిగా నొప్పు,చుండనీయ । రణ్యము శరణ్య
కులకు శ, రణ్యమగుచు ॥ (క)ఇమ్ముగ నేఁడు జనస్థా । నమ్మస్మద్బాణపాత,న
మున హతస్థా । నమ్మగుచుండఁగమునులు వ । నమ్మునఁ జరియింతురెడరుఁబను,నమ్ము
గ సుఖులై ॥ (క)హతబాంధవులై బాష్పా । ప్లుతలోచనలై విషణ్ణముఖులై
రక్ష । స్సతు లన్యభయావహముగ।గతిలేకభయార్తి నేడ్వఁ,గలరింక మీఁదన్ ।
(తే,గీ)పసతుల కిట్టి నీవు ప్రా, ణేశ్వరుండి । వట్టి యనురూపకుల భార్య,లంద
ఱాత్మ । హర్షములుదక్కి విధవలై,యనుదినంబు ।నుచితశోకరసజ్ఞలై,యుం
దురింక॥ (తే,గీ) ఓరిక్రూరాత్మక్షుద్రాత్మయోరినీచ । యోరిబ్రాహ్మణకంటక
యోరిఖలుఁడ । పలుకులింకేలయిపుడుమ ద్బాణనిహతిఁ । గూల్చిపుచ్చెదశమ
నునికూటమునకు ॥ (వ) అని బహుప్రకారంబుల ధిక్కరించి పలుకుచున్న
రాముని వచనంబులువిని రోషావేశంబున వికటభ్రుకుటిదుర్నిరీక్షుండై ఖరుం

డు ఖరతిరస్కారంబున నట్టహాసంబు సేయుచు మహాగజంబునకు మదం బెక్కించిన చందంబునఁ గ్రూరవాక్యంబుల నాకు రోషోత్పాదనంబుఁ గావించితివి ప్రాణసంశయకరంబగు సమరంబునందును నిర్భయంబున నవలిప్తుండవై మృత్యువశుండ వైతివని యెఱుంగక పలుకందగని మాటలాడెదవు కాలపాశ పరిక్షిప్తులగు పురుషులు నిర్గతజ్ఞానేంద్రియాంతఃకరణ వ్యాపారులై కార్యాకార్యంబు లెఱుంగక వర్తింతు రిప్పుడు నిన్నుఁ బరిమార్చెదఁ జూడుమని పలికి యచ్చేరువనున్న యొక్క విశాలసాలంబు నిరీక్షించి ప్రహారార్థంబు కరంబులచాని నుత్పాటించి తెచ్చి రోదోంతరంబు నిండ వికటధ్వనిఁ గావింపుచు సంద

—(*) రాముఁడు ఖరాసురునిఁ జంపుట. (*)—

ష్టదశనచ్ఛదుండై దీనం జావుసిద్ధించునని సంరంభంబుగా వీచివైచిన నారాముండు నిశాతశాయకంబుల డరించి యమ్మహీరుహంబు నింతింతలు తునకలై ధరణింబడ ఖండించి యరివధార్థంబు తీవ్రంబగు రోషం బంగీకరించి చిఱుచెమట మొగంబునం గ్రమ్ముదేఱ రక్తాంతలోచనుండై ప్రచండ కాండసహస్రంబున వాని సర్వమర్మంబులు గలంచె నప్పుడు ప్రస్రవణాఖ్య పర్వతంబువలనం దొరఁగు సెలయేళ్లపోలిక వాని శరీరంబుననుండి బహుప్రకారంబుల రక్తధారలు స్రవింపుచుండె నిట్లు జర్జరితాంగుండై విహ్వలుండై రుధిర గంధోపలక్షితుండై మత్తుండై ఖరుండు నానావిధాట్టహాసంబుల గర్జింపుచుఁ గదిసినం జూచి రఘువల్లభుండు శస్త్ర సంధానావకాశార్థంబు త్వరిత పాద విక్షేపుండై తిర్యగ్గమనంబున నొక్కింత వెనుకకుం జని త్వరిత విక్రమాటోపుండై ॥ (క) తడవేలయీడు రాత్మునిఁ । గడురయమునఁ ద్రుంచి దండకనివాసులకుం । బడయంగ రాని సౌఖ్యము । లొడఁగూర్చెద మునులఁ బ్రోచు, టొప్పగుఁ గాదే ॥ (వ) అని యోచించి ఖరు వధించుటకు న, న్యబ్రహ్మదండం బో కో । యనఁ జెలొప్పందుచుఁ దీక్ష్ణమై శుచినిభం, బై గోత్రభిద్దత్తమై । ఘనమై యొప్పు ప్రచండ కాండము సమ, గ్రక్రోధుఁడై కూర్చి జ్యా । ధ్వనిఁ గావింపుచు వేగఁ దీసి విడిచె, న్దర్పంబు శోభిల్లఁగ ॥ (వ) ఇట్లాకర్ణపూర్ణంబుగాఁ దిగిచి విడిచిన ॥ (క) రామధనుర్ముక్తంబగు । భీమాస్త్రం బపుడు వేయి, పిడుగుల క్రమ్మోంత ॥ న్వ్యోమమున నేగి గ్రక్కునఁ । దామసుఁడగు ఖరుని యురము, తప్పక చొచ్చెన్ । (తే,గీ) అంబకము వక్షమునఁ దూఱి, నంతలోనఁ । దత్క్షణము నని చేవిని, దర్పగ్గ



డగుచు । ఖరుఁడు ధరఁ గూలె మును శ్వేత, గహనమందు । హర దృగగ్నిదగ్ధాంధకా, సురుని కరణి ॥ (క) కులిశము చే వృత్రుని క్రియ । జల ఫేనము చేత నముచి, సరణి నశని చే । బలుని గతి రామశరమున । బలవంతుఁడు ఖరుఁడు ధరణిఁ, బడియె నిహతుఁడై ॥ (వ) ఇట్లు పాపాత్ముండగు ఖరుండు గూలిన యనంతరంబ మహర్షి బ్రహ్మర్షి దేవర్షి రాజర్షిగణంబులు పరమానందంబునన చ్చటికిం జనుదెంచి విజయలక్ష్మీ విరాజమానుండై యున్న రఘువీరుని సము

—(*) వనమున నుండు ఋషులు రాముని బ్రస్తుతించుట. (*)—

చితంబుగా సందర్శించి మృదుమధురవాక్యంబున నిట్లనిరి ॥ (క) అనఘాత్మ యేతదర్థము । పనివడి సురనాథుఁడైన, పాకారిరహిన్ । ఘనమగు శరభంగాశ్రమ । మునకుం జనుదెంచె మున్ను, మునులకుఁ జెప్పన్ ॥ (క) అనివార్య శౌర్యులగు నీ । దనుజులఁ జంపుటకు నీవు, తపసుల చేత । న్వినయోపాయంబునఁ జయ్యన నానీతుండ వైతి, వధిపయిచ్చటికిన్ ॥ (క) జనవర నీచే నిప్పని । మును కోని మద్రక్షణార్థ, ముకృతంబయ్యెన్ । ఘనదండకమునఁ దాపస । జనములు సుఖధర్మయుక్తిఁ, జరియింతురికన్ ॥ (చ) అని కొనియాడుచున్న సమయంబునఁ జారణసంయుతంబుగా । ననిమిషసిద్ధసాధ్యవరు, లచ్చటికిం జనుదెంచి చిత్రము । న్ఘనకుతుకంబు హర్షముఁ బె, నంగొన దుందుభినాద మొప్పన । య్యనకులవర్యుమీఁదఁ గురి, యించిరి కల్పకపుష్పవర్షముల్ ॥ (క) ఆడిరి రంభాదులుదగఁ । బాడిరి గంధర్వవరులు, పరమ మునీంద్రు । లీడిరి భయము లుగ్రహములు । గూడిరి శుభరాసులందుఁ, గ్రూరత లేకన్ ॥ (వ) ఇట్లు పరమోత్సవంబుఁ గావించి ॥ (సీ) దోషాచరుల ఖర, దూషణ ముఖ్యులఁ గామరూపులమహా, కలుషమతులఁ । గ్రూరుల దారుణా, కారుల ఖలజనస్థాన వాసులఁ జతుర్దశ సహస్ర । గణితుల నర్ధార్ధి, కముహూర్తమున రామచంద్రుఁడొక్కఁడు శాత, సాయకముల । ననిలోనఁ దునుమాడె, నహహా యేమనవచ్చు నిమ్మహాత్ముని వీర్య, మితని దార్ఢ్య ॥ (తే,గీ) మితని చాతుర్య మితని య, హీనసత్వ । మచ్యుతునకట్లు గన నయ్యె, ననుచు నిట్లు । వేయినోళ్లఁ గీర్తింపుచు, విబుధవరులు । చనిరి గ్రమ్మఱఁ దమతమ, సదనములకు ॥ (ఆ,వె) అంతలోన వీరుఁడగు లక్ష్మణుఁడు సీత । తోడఁగూడ శైల, దుర్గపథము । వలన నిర్గమించి, వరుస సుఖంబుతోఁ । బర్ణశాలఁ జేరె, భద్రయశుఁడు ॥ (తే,గీ) అంత జయశీలుఁడ

గు రాముఁడచటిమునుల । చేతఁబూజితుఁడై సుమిత్రాతనూజు ॥ చేతసంపూ
జ్యమానుఁడై, సీతఁగూడి । పర్ణశాలఁ బ్రవేశించె, భాసురముగ ॥ (వ) అప్పు
డు ॥ (ఉ) ఇంచుకయైన స్రుక్కక యహీననిశాటుల నశ్రమంబునం । ద్రుం
చి మహర్షిముఖ్యపరితోషణుఁడైన రఘుప్రవీరున । భ్యంచితమూర్తిఁ గ
న్గొని మహాప్రమదం బిగిరింప సీత నే । త్రాంచలదీధితుల్ నిగుడ, నట్టెకవుంగి
టఁ జేర్చె నెంతయున్ ॥ (వ) మఱియు ఖరాసురుని సైన్యంబునందు జితకా
శులగు వారెవ్వరెవ్వరు గలరట్టి రాక్షసులతోఁ గూడఁ దాత్కాలిక స్వేచ్ఛా
గృహీతచతుర్దశ సహస్రదివ్యమంగళ విగ్రహంబు గలవాఁడగుటవలన నొ
క్కొక్కరాక్షసున కొక్కొక్కరాముండై కనుపట్టి శక్రాదులకైన నసాధ్యుల
గువారి బలవంతులఁ జతుర్దశసహస్రరక్షోవీరుల నొక్కండె ఘటికాత్రయం
బులోన సంహరించి మహాత్ములగు పరమర్షులకు జగన్మోహన దివ్యమంగళ
స్వమూర్తి సాక్షాత్కారంబునఁ బరమానందంబు సంపాదింపుచు విజయ
లక్ష్మీవిరాజమానుండై లతాప్రతానోద్గ్రథితజటామండలుండై దృఢబంధకక్ష్య
త్వంబున స్కంధావలంబిత తూణీరుండై రణావసాన నిర్వాపిత కోపాగ్ని గల
వాఁడగుటవలనఁ బ్రసన్నముఖుండై సీతాలక్ష్మణ మార్గావలోకనుండై నిర్వ
ర్తితవీరకృత్యుండై వీరవ్రతుండై విగళద్రుధిరాప్లుతశరీరుండై ఘర్మపయఃక
ణౌఘకలితలలాటుండై కోదండదండంబు నవలంబించి తన ముంగలనున్న రా
మభద్రునిం గనుంగొని (యాత్మా వై పురుషస్య దారా) యనెడు నియమంబున
శ్రీరామసత్తచేత తాను సత్తావతినై తిననితలంచి (రామజామాతరం ప్రా
ప్య స్త్రీయం పురుషవిగ్రహ) మ్మనియెడి యజ్ఞానంబున మున్ను తానాడిన వా
క్యాపరాధం బపనయించుకొనుటకును నాయుధవ్రణంబులకుఁ గుచోష్మచేతఁ
బరిహారంబుఁ గావించుటకును గ్రమ్మఱ గాఢంబుగాఁ బరిరంభించి ప్రీతిసంహృష్ట
సర్వాంగియై వదనంబు రాకాశశాంకుని చందంబున నందంబై యొప్ప శశాం

(*) అకంపనుఁడు జనస్థానమండలి రాక్షసవినాశమును రావణునకుఁ దెల్పుట. (*)

కునింగూడిన రోహిణికైవడి వలరుచుండె ॥ (క) అంతనకంపనుఁ డనువాఁ ।
డెంతయు శీఘ్రమున లంకకేగి నిశాంతా । భ్యంతరమున రావణుఁ గని । స్వాంతం
బున నెగులుదోఁపఁ జయ్యనఁ బలికెన్ ॥ (క) దనుజేంద్ర జనస్థానం । బున నున్న ని
శాటులెల్లఁ బొలిసిరి త్రిశిరుం । డును ఖరుఁడును దూషణుఁడును । ఘనరణమునఁ



జచ్చిరేమి గణుతింతు సికర్ ॥ (వ) ఏనొక్కరుండ నతిప్రయత్నంబునం దప్పిం
చుకొని నీకడకుం జనుదెంచితి ॥ (క) నా విని సంక్రుద్ధుండై । రావణుఁ డటు కన్నుఁ
గొనల రక్తిమ నిగుడన్ । దావాగ్నికరణి మండుచు । మోవియదర వానితోసము
ద్ధతిననియెన్ ॥ (సీ) దారుణంబగు జనస్థానమెవ్వాని చే హతమయ్యె నెవ్వాఁడు హా
లహాలము । కానకత్రావె లోకంబులలోనాకు విప్రియ మొనరించి వితతసుఖముఁ ।
బడయ శక్రునికైనఁ బౌలస్త్యునకునైన శమనునికైనను శౌరికైన । నలవిగాదేన
లయమునకు యముఁడ హుతాశనుఁగాల్చు హుతాశనుండ ॥ (తే,గీ) మృత్యు
వును జంపు మృత్యువ నత్యమోఘ । తేజమున వహ్నిభానులఁ దెగడువాఁడ । బల
ము పెంపున వెస మహాబలుని వేగ । మడఁచి భృత్యునిఁ గాఁగొని యలరువాఁడ ॥
(క) అని యిటు మోమున జిడిముడి । గనుపడ సంక్రుద్ధుఁడైన కైకసిపట్టిం । గని
భీతినకంపనుఁడా । య్యనఘ భయము వేఁడెదర్మి తాంజలియగుచున్ ॥ (క) దాన
వవిభుఁడగు రావణుఁ । డానరభోజనున కప్పు డభయ మొసఁగిన । న్నానకపిస్ర
బ్ధుండై । వాసికసిట్లనియె మఱి ల వాఁడభయోక్తిన్ ॥ (ఉ) మానితబాహు
శౌర్యుఁడసమానుఁడునై రికులాంబుముగ్గగ । త్రావణుఁడు సింహసంహననుఁ
డాయతబాహుఁడు వీరుఁడాజికిన్ । సూనుఁడు రామనాముఁడొక శూరుఁడు శో
భిలువాని చే జన । స్థానము నాశమొందె ఖర దానవదూషణ సంయుతంబుగన్ ॥
(క) అనవిని దశకంఠుఁడు నే । మ్మనమునఁ గ్రోధంబు పెరుఁగ మదమున నాగేంద్రు
నిగతి రొఁజుచు వానిం । గనుఁగొని గంభీరభంగిఁ గ్రమ్మఱఁ బలికెన్ ॥ (క) సు

(*) అకంపనుఁడు రావణునికి రాముని పరాక్రమప్రకారముఁ దెల్పుట. (*)

రపతి నిర్జర యుతుఁడై । యురుగతిఁ దోడుపడ వచ్చెనో గాకున్న । న్నరుఁడొ
క్కఁడింత చేసెనె । కరమరుదుగ వాని తెఱఁగు గణుతింపుమికన్ ॥ (క) నా
విని యకంపనుండా । రావణుని తలంపెఱింగి, రాముని బలముం । బ్రావీణ్యము
శౌర్యము సు । శ్రీవిభవము దెలియనిట్లు, చెప్పఁదొడంగెన్ ॥ (సీ) దశకంధర
వినుము, దశరథరాముండు విలుకాండ్రలోనతి, విశ్రుతుండు । నమితతేజుండు ది
వ్యాస్త్రసంపన్నుండు నాలంబులో జిష్ణుఁ, బోలు వీరుఁ । డమ్మేటి యనుజన్ముఁ, డతిబ
లవంతుండు రక్తాంతనేత్రుండు, రాజముఖుఁడు । దుందుభినాదుఁడ, నుందవిక్రమ
శాలి యనురూపుఁడగు లక్ష్మణాఖ్యుఁ డతని ॥ (అ,వె) తోడఁ గూడి గాడ్పు,
తోడఁ గూడిన చిచ్చు । కరణి రిపులమీఁదఁ, గనలుచుండు । మేటి రాము చేత, గీట

ణంగిరిజన । స్థానవాసులైన,దైత్యులెల్ల ॥ (క) అనిమిషులకంత సత్వము ।
వినుతపరాక్రమముశౌర్య,విస్ఫురణముగ । ల్గునెదనుజులతో వైరముఁ । గొను
టకు మదిసందియంబుఁ,గొనఁడసురేంద్రా ॥ (క) రామ ధనుర్ముక్తముల
గు । హేమమయమహోగ్రశరము, లెంతయుహేతి । స్తోమములకరణిసురుల।
భీమపరాక్రములఁ గాల్చె,భీషణభంగిన్ ॥ (క) అనిలోనఁబ్రాణభయమునఁ।
గనికనివడిఁబఱచు నట్టి,క్రవ్యాదులకున్ । వినుమేదిక్కునఁజూచినఁ । బ్రణుతగు
ణా త్రోఁచు రామ,భద్రుఁడుగడిమిన్ ॥ (వ) మఱియుభయకళితులై రాక్ష
సులు రాక్షసత్వగోపనార్థంబె యేరూపాంతరంబులఁ జరింతు రాయాపరిగ్ర
హీత రూపాంతరంబుల మ్రోలనున్న దాశరథినెవిలోకింతు రదియునుంగాకర
ణసాధనత్వబుద్ధిచేత నేయేవస్తువు గొనంజూతు రాయావస్తువు నెల్ల రామాకా
రంబుగా విలోకింతు రివ్విధంబున ॥ (తే,గీ) రాక్షసేశ్వరరణమున,రాముచే
త । నలజనస్థాన మభిహతం,బయ్యెననిన । మానసంబునఁ గోపించి,వానితోఁద ।
శాస్యుఁడిట్లనెనుద్వృత్తి, నట్టెలేచి ॥ (క) ఏమి యకంపనయిప్పుడె । రాము
ని లక్ష్మణయుతముగ,రణమునఁ దునుమం । గామించి పంచ వటికే । నీమెయిఁ
జనువాఁడ శౌర్య, మింపారంగన్ ॥ (క) నావిని యకంపసుండా । రావణు
వాక్యమునకులికి,రక్షోవర యా । భూవరు పౌరుషసత్వ । ప్రావీణ్యము వినుమ
టంచుఁ,బలికెఁగృపణుఁడై ॥ (సీ) అధిప రాముఁడు మహా, యశుఁడురు విక్ర
మంబున నసాధ్యుఁడు శౌర్య,ధనుఁడు కుపితుఁ । డంబుసంపూర్ణ మహా, పగా
వేగంబునైన మహోద్ధతి,నడ్డగించు । సగ్రహతార న,క్షత్రమైన నభంబు నిరవ
కాశము సేయు, నేర్పుకలిమి । నుదకమగ్నావని, నుద్ధరింపఁగఁ జాలుఁ గడువడి
గాడ్పు వే,గమునడంచుఁ ॥ (తే,గీ) దివిరి జలనిధివేల భే,దించిమించి । ము
జ్జగంబుల నీటిలో,ముంచఁగలఁడు । కడిమిమైవారినిధి నరి, కట్టనేర్చున్ । ధరణి
ధరముల మోవంగ, దక్షుఁడతఁడు ॥ (ఆ, వె) సంహరించి మఱల,సర్వలో
కంబులఁ । గడఁగివిక్రమమునఁ, గలుగఁజేయు । సృష్టములయినట్టి, విష్టపంబుల
నెల్ల । నడఁపశక్తుఁ డమ్మ,హాయశుండు॥ (సీ) దశకంఠనాకప దంబపుణ్యుల చే
తఁ గడిమిమీఱజయింపఁ, బడనిమాడ్కి । విష్టపత్రయనుత, విక్రమాధికుఁ డైన
రాముండు నముచిహి,రణ్యకశిపు । శంబరబలివృత్ర,జంభాదివిఖ్యాత దనుజుల
చేనైన,ననిజయింపఁ । బడఁడట్టిఘనుఁడెట్లు, పరఁగనీచేజయించుటకు శక్యుండ



(*) అకంపనుఁడు రామునిం జంపుటకుపాయము రావణునికిఁ జెల్పుట. (*)
గు,సారిదినతఁడు ॥ (తే,గీ) వాసవాదులకైన న,వధ్యుఁడనుచు । మదిఁ దలం
చెదనమ్మహా,మతినిగెలుచు । నట్టిసదుపాయమెఱిఁగింతు,నసురనాథ । మానసం
బెందుఁబోనీక,దానివినుము ॥ (వ) అనియిట్లకంపనుండు రాక్షసుండయ్యుననే
కజన్మాంతరకృతసుకృతపరిపాకవశంబునఁదత్కాలసముత్పన్న శ్రీరామస్వరూప
విషయజ్ఞానంబు గలవాఁడై రాముండని పలుకుటవలన రాముని కోపంబున క
సంహార్యత్వంబును విక్రమంబున నసాధ్యుం డని పలుకుట వలన విక్రమంబు
ప్రవృత్తం బగుచుండ నివారించుట కశక్యుండను తాత్పర్యంబును నుపపసర
హితంబైన యసాధ్య శబ్దంబున బ్రహ్మేంద్రాద్య సాధ్యత్వంబును గుపితుండ
ను శబ్దంబున మర్యాదోల్లంఘన విషయ నిగ్రహవంతుం డను నర్థంబును
మహాయశుం డను శబ్దంబున లోకంబునందు సుప్రసిద్ధవిభవుండను భావంబును
మహాపగావేగంబునైన నడ్డగించునని పలుకుటవలన భవిష్యత్కృష్ణావతారవృ
త్తాంతంబును నభంబు నిరవకాశంబు సేయునని పలుకుటవలనఁ ద్రివిక్రమావ
తారవృత్తాంతంబును నుదకమగ్నావని నుద్ధరింపఁగ జాలునని పలుకుటవలనవ
రాహావతారవృత్తాంతంబును సంసారసముద్రంబున మునింగిన జనంబునకుఁబ
రమపురుషార్థరూపమోక్షప్రదుండని యెడు నభిప్రాయంబును ముజ్జగంబుల
నీటిలో ముంపంగలండని పలుకుటవలన సంహారకారణత్వంబును వారిధి న
రికట్టనేర్చునని పలుకుటవలనఁ గరిష్యమాణసేతుబంధన కార్యంబును గాడ్పు
వేగము నడంచునని పలుకుటవలనఁ బంచభూతవిలయపూర్వకప్రళయ కర్తృ
త్వంబును ధరణీధరముల మోవంగదక్షుఁడని పలుకుటవలనఁ గూర్మావతా
ర వృత్తాంతంబును సంహరించి మఱల సర్వలోకంబుల విక్రమంబునఁ గలుగఁ
జేయునని పలుకుటవలనఁ బూర్వకల్పసంహారసృష్టికర్తృత్వంబును నెండియు
మహాయశుండని పలుకుటవలన షడ్గుణైశ్వర్యసంపన్నత్వంబును శక్తుండని ప
లుకుటవలన ననంతశక్తిమత్త్వంబును సృష్టములైనట్టి విష్టపంబులనణంచునని
పలుకుటవలనవర్తమానసృష్టిసంహారకర్తృత్వంబును దశకంఠయనిసంబోధనం
బుసేయుటవలన రావణుని దశవదనత్వంబును నల్పశక్తిత్వంబును రామునిసహ
స్రశీర్షత్వంబును నపరిమితానంత శక్తిమత్త్వంబును సూచింపంజేసి యెండియు
నిట్లనియె ॥ (ఉ) ఆతనిపత్ని నూత్నకమ, లాయతలోచన మేఘవేణి యై । వా

తృకపుండలాస్య వర, వర్ణిని పల్లవకోమలాంఘ్రి య। జ్ఞాతపాసుణియర్ధశ
శి, ఘాలమనోహరసుందరాంగియుఁ। సీతయనంగఁజెల్వొసఁగుఁ,జేసిన పుత్త్రడి
బొమ్మకై వడిన్ ॥ (ఉ) ఆయెలనాగ చక్కఁదన, మా లికుచస్తనిరూపవైభవం
బాయపిహోమరాజి పలు, కామదవారణయాన మోవి తీ। రాయలివేణిమో
ముసాబ, గామృదు కోకిలవాణి మేని చా। యేయుగమందు నెవ్వరికినెందు
ను గానము రాక్షసేశ్వరా ॥ (తే,గీ) సురసతులయందు గంధర్వసుదతులందు
నురగసతులందు దానవ యోషలందు। నవ్వెలందికి సరియైన యతివలేదు।
నంగనరసతులందుఁ జెప్పంగనేల ॥ (తే,గీ)ఆ నెలఁత రామునకుఁ బ్రాణమట్లు
గాన। దానివంచనఁగైకొంటి వేనియతఁడుఁ। దద్వియోగాగ్ని చేఁగ్రాఁగి తక్ష
ణంబ। చచ్చునిది దక్క వేరొక్క జాడలేదు ॥ (క) అనిన నకంపను వాక్య
ము। వినిదశకంఠుఁడుచాల వెఱఁగుపడి మనం। బునఁ జింతించి రయంబున।
ఘనరవమున వానితోడఁగ్రమ్మఱఁబలికెన్ ॥ (క)అటులైననేమి యఘటన। ఘట
నాచతురుండ నేను గాల్యంబున న। చ్చటి కేగి సీతఁజేకొని। యిటు దోడ్కొ
నివత్తుఁ బలుకు లింకేమిటికిన్ ॥ (క) అని ఖరములఁ బూన్చిన కాం। చనమ

(*) రావణుఁడు మారీచుని కడ కేగుట. (*)

యమగు నరదమెక్కి సర్వదిశలు గ్ర। కుఁన వెలిగింపుచుఁ జనియెను। దన
దుమర్ణంత్రమునకలరి దైత్యులుమెచ్చన్॥ (వ)అప్పుడు ॥ (క)ఆరాక్షసనాథుని
రథ। మారయ సంచార్య మాణ మైయుడువీధిన్। భూరిద్యుతి నేగుచునో
ప్పారె వలాహకములోని హరిణాంకుక్రియన్ ॥ (వ) ఇట్లు గదలి దశగ్రీవుండు
రయంబునఁ దాటకేయుండగు మారీచుని యాశ్రమంబుకుంజని యతనిచేత న
మానుషంబులగు భక్ష్య భోజ్యంబుల నర్చితుండై సముచితా సనంబున
నాసీనుండయ్యె నప్పుడు మారీచుం డర్థ గంభీరంబైన వాక్యంబుననిట్లనియె॥
(క) దనుజోత్తమ నీకును నీ। తనయులకును రాజ్యము నకు దారలకు సు
హృ। జ్జనులకు సేమమె నీవ। చ్చినకార్యం బద్ది దానిఁ జెప్పుము నాకున్ ॥
(వ) రాక్షసేంద్రా లోకంబులకు సేమంబులేదని శంకించెద ఘనప్రయోజనం

(*) మారీచుఁడు రావణునకు హితోపదేశముఁజేయుట. (*)

బు లేక భవదాగమనంబు దొరకొనదు గదాయని పలికిన నారావణుండమ్మా
రీచున కిట్లనియె ॥ (క) అనఘాయేమనిచెప్పుదు। ననుపమభుజవీర్యయుక్తుఁ



డగు రామునిచే। వినిహతులైరి జనస్థా। ననిలయులగు రాక్షసులు ఘనంబగు
నాజిన్ ॥ (ఆ,వె) రాక్షసారియైన,రాముని భార్యాప। హరణమందు మైత్రి
నెరపుమీవు। నావుడువిని దైత్య,నాథుతో నాతడి। ట్లనియెహితమునయము,వి
నుతి కెక్క ॥ (ఆ,వె) మిత్త్రరూపుఁడైన శత్రుఁడెవ్వాఁడునీ। కీయనర్థకార్య
మిట్లుగఱపె। సామదానకలన సత్కృతుండైనవాఁ। డిట్టియశుభ వాక్యమేల చె
ప్పు ॥ (ఉ) సీతను ముచ్చిలింపుమని, చెప్పినదుష్టునిఁ బట్టికత్తిచే। వేతలఁగొ
ట్టరాదె యవి, వేకతఁ గ్రూరత రాహి నోటిలోఁ। జేతులు పెట్టఁజూచెదవు,శి
ష్టుల కీలెఱఁ గొప్పదయ్యయో। పాతకరూప కర్మమున భవ్యయశంబును
లచ్చిపోవదే ॥ (క) కడువడి నెవ్వఁడు సుఖిసు। ప్తుఁడవగు నీయుత్తమాంగ
ముకరంబునఁ జే। డ్పడఁబ్రహరించెనురావణ। తడయక నెవ్వాఁడుచెఱుపఁ దల
కొనెఁగులమున్॥ (చ) సురవినుతప్రతాపమద శుద్ధకులాభిజనాగ్రహస్తసుం।
దరతరదివ్యలక్షణవి తానవిభాసితదోర్విషాణమై। వఱలెడు రాఘవాఖ్యబలవ
ద్ఘనగంధగజంబుపోరిలో। నరుదుగఁ దేఱిచూచుటకు నర్హముగాదు నిశాచ
రేశ్వరా॥ (మ) సమరాంతస్థితిసంధి వాలముసమ స్తక్రూరరాత్రించరో। గ్ర
మృగధ్వంసనలీలమున్నిశితఖ డ్గస్ఫారదంష్ట్రింబును। ప్తముబాణావయ వప్ర
పూర్ణమగుశుంభ దాశ్రిమహార్యక్షము। న్గ్రామమున్గానక మేలుకొల్పఁ దగునే
కవ్యాదవంశోత్తమా ॥ (చ) ఘనభుజవేగపంకమయి గాఢతరప్రదరోర్మి
జాలమై। ధనురవహారమైవిమత దారుణమైనుమహాజలౌఘమై। యనుపమమై
యగాధమయి యద్భుతమైయసిశంబపారమై। తనరెడురాఘవాబ్ధిఁబడ దాన
వనాథదలంపఁజెల్లునే॥ (వ) రాక్షసేంద్రా నీవు మహాత్ముండగు పులస్త్యబ్ర
హ్మవంశంబునం బుట్టినవాఁడవు భుజవీర్యంబునఁ బ్రసిద్ధికి నెక్కినవాఁడవు నీకుఁ
బరదారాభిమర్శనంబు యుక్తంబుగాదు దానివలనఁ బౌరుషంబునకు హాని
సిద్ధించు నావచనంబుఁబట్టి ప్రసన్నుండవై లంకాపురంబుఁ బ్రవేశించి సర్వాం

—(*) రావణుఁడు మారీచు వచనప్రకారంబున మరలి లంక కేగుట. (*)—

తఃపురకాంతలంగూడి సుఖింపుము రాముండు దండకారణ్యంబునందు సీతా
సహితుండై యిష్టోపభోగంబులనుభవింపుచు విహరింపుచుండుఁగాక యనిప
లికిన నద్దశాననుండు మారీచునిచేత నివారితుండై క్రమ్మఱ లంకాపురంబున
కుంజనియె నంత నిక్కడశూర్పణఖ రామునిచేత నిహతులైన చతుర్దశ స

హస్త్ర రక్షోవీరులం జూచి ఖరదూషణత్రిశిరుల నిధనంబునకు దుఃఖింపుచుం ద
నయుంగ వికలత్వంబునకు లజ్జింపుచు ననన్యసాధారణంబైన రాముని పరాక్ర
మప్రకారంబునకు భయంబునొందుచు శోకవిషాదరోషంబులు మనంబున ము
ప్పిరిగొన నచ్చోటనిలువక మేఘంబుకరణిమహానాదంబుసేయుచు శీఘ్రంబున
రావణపాలితంబైన లంకాపురంబుం బ్రవేశించి యందుం గైలాస శిఖర సంకా
శంబైన పుష్పక విమానాగ్రభాగంబున ॥ (క) తరణినిభంబగుచామీ। కరవ
రసింహాసనమునం గర్బురవృతుండై । సురపరివృతుండగుశక్రుని । కరణిం గొలు
వున్న పంక్తికంఠునిం గనియెన్ ॥ (తే,గీ) కాంచనమయేష్టికాపరికలితయాగ। వే
దిమధ్యంబుం బ్రాపించివివిధమంత్ర । వివిధపృషదాజ్యమునం జ్వాలవృద్ధిబొంది। న
ట్టిపావకుచందాననలరువాని ॥ (క) నరగంధర్వామరకి। న్నరచారణసిద్ధసాధ్యనా
గనభస్వ । ద్వరులకజేయునిశూరునిం। బరేతపతిభంగిం గ్రాలుభయదాకారున్ ॥

—(*) శూర్పణఖ రావణుని కడకేతెంచుట. (*)—

(క) బలభిత్సంగ్రామంబునం । గులిశకృతవ్రణుని నభ్రి, కుంజరదంతం । బుల ను
త్కృష్టకిణాంకో । జ్జ్వలనూతనరత్నహార,సంభృతవక్షున్ ॥ (క) పదితలలజో
దుం దగని । ర్వదిచేతులమేటి రాజ,లక్షణయుక్తుం। ద్రిదశభయంకరరూపునిం।
బ్రదీప్తతేజుని సమస్త, రాక్షసరాజున్ ॥ (క) గిరినిభుని మహాస్యునిం బొం। డ
రదశనునిదీర్ఘభుజునిం,దప్తకనకభా । సురకుండలు స్నిగ్ధవిడూ । రరత్నసం
కాశు దేవ,రాజప్రతిమున్ ॥ (క) నరసుర సంగ్రామంబుల । హరిచక్ర నిపాత
నమున,నస్త్రప్రసము। త్కరమునందాడిత దేహునిం । బరమభుజావిక్రమము
నం, బరంగెడు వానిన్ ॥ (క) అక్షోభ్యసమస్తసము । ద్రక్షోభుని శైలదళన,
దక్షుని నుగ్ర । ప్రేక్షణుని సురవిదారిని । రక్షోగణవిభుని ధర్మ,రహితాత్మ
కునిన్ ॥ (ఆ,వె) యజ్ఞవిఘ్నకరుని, నన్యదారాభిమ । ర్శనునిసర్వదివ్య,శస్త్ర
బాణ । మోక్తనమితసత్త్వ, యుతుని స్వహస్తార్జి । తప్రవీరశబ్దు,దైత్యవిభుని॥
(క) కడువడి భోగవతీపురి । కడకుంజని సర్పవిభునిం, గడచి ప్రతాపం । బడరం
గం దక్షుకు భార్యను । గడిమింగొని తెచ్చి నట్టి, ఘనశౌర్యనిధిన్ ॥ (క) మును
వడిం గైలాసాచల । మునకుంజని యందు ధనదుం, బోర గెలిచి త । ద్ఘనకామ
గపుష్పకముం । గొని తెచ్చినవీరు నసుర,కులదీపకునిన్ ॥ (క) అనిమిషపతినం
దనమును । ధననాథుని చైత్రరథము, తక్కిన దేవ । ప్రణుతోద్యానవనంబు



లు । వినశింప నొనర్చినట్టి, విక్రమశాలిన్ ॥ (క) తపనుని తేజముం దారా ।
ధిపు శైత్యము వహ్ని దేవు, తీక్ష్ణత భుజగ । త్వపటిష్ఠత్వంబున నే । యుపరాజి
తుం డడంచె నట్టి యచలాకారున్ ॥ (క) పదివేల వర్షములు వన । పదమునం
దపమాచరించి పదపడి విధికి । స్మదము జనింపంగం దనతల । లదరక నుపహా
ర మిచ్చి నట్టి మహోగ్రున్ ॥ (క) నరుం డొకండు తక్కం దక్కిన । గరుడామ
రసిద్ధసాధ్య గణములచే సం । గరమునం జావక యుండంగ । వర మెవ్వండు వ
డసెనట్టి వ్రతసంసిద్ధున్ ॥ (క) నిరను క్రోశునిం గర్కశు । నరి భంజను లోక
ములకు నహితకరుని దు । శ్చరితుని భయ రూపుని లో । కరావణుని వికృత
ముఖునిం గాపథవర్తిన్ ॥ (సీ) గరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్యసుందరుల నేవీ
రుండు చెఱలం బట్టెం । దనకడ్డమైన శంభుని కాటపట్టగు కైలాస మెవ్వాండు
గాసిచేసె । నలకూబరునితోడం గలయంగం జనెడు రంభను బట్టి యెవ్వాండు
బలిమిం జెఱిచెం । గాంచనమయవిశ్వకర్మనిర్మితమైన లంక కేశూరుండు ర
మణుండయ్యె ॥ (తే,గీ) నట్టి శూరుని దానవ పట్టభద్రుం । దతమణీ భూషణ
ప్రభూషితశరీరు । దివ్యమాల్యోప శోభితు దీప్తవదను । మణివిమానాధిరూ
ఢు రావణునిం గనియె ॥ (వ) మఱియు నధ్వరంబులందును హవిర్దానంబు
లందును బ్రాహ్మణులచేతం బ్రాతరనువాక గ్రావస్తోత్రాది మంత్రంబులచేత న
భిష్టుతంబైన సోమంబు నెవ్వం డపహరించె నట్టి దశగ్రీవునిం బావకసంకాశలో
చనుని మంత్రిమధ్యంబున విలోకించి యభీతచారిణియగు శూర్పణఖ భయమో
హ మూర్ఛితయై తనవైరూప్యంబు దర్శింపం జేసి క్రోధోద్రేకంబున బొమలు
ముడివెట్టుచు దారుణవాక్యంబున నిట్లనియె ॥ (చ) అలయక కామభోగము

—(*) శూర్పణఖ రావణుని నానావిధంబుల దూఱుట. (*)—

ల, యందుం బ్రమత్తుండవై నిరంకుశో । జ్జ్వలుండవు మంద శేముషివి, స్వైరవిహా
రుం డవట్లు గావున । న్నెలియంగం జాల వీవు తల, ద్రెవ్వంగ వచ్చిన వైరి నైననీ।
ల నొకరుండు సాటిగలం, డేదనుజాధిప బుద్ధిహీనతన్ ॥ (చ) సతతము గ్రా
మ్యభోగపరి,షక్తుండు లుబ్ధుండు కామవృత్తుండౌ । క్షితిధవునిం బ్రజల్విరతిం, జెం
దిస్మశానహుతాశనుం బలె । న్మతిం బరికింతు రెవ్వండభి,మానముదక్కి మెలం
గునట్టికు । త్సితుండు సజీవుండయ్యుగత, జీవుండుగాండె తలంచిచూడంగన్ ॥ (క)
కాలమునం దెవ్వండు తా । నాలస్యముం జేసి కార్య,మరయండా భూ । పాలుం

డక్కార్యముచే । వాలాయము చెడు నపేత, వైభవుఁడగుచున్ ॥ (క)జనుల
స్వాధీనుని దు । ర్జనుదుర్దర్శుని నయుక్త,చారుని ధాత్రీ । శుని దప్పులవిడు
తు రధీ । శనిమ్నగాపంకమును గ, జంబులుఁ బోలెన్ ॥ (మ)అరయ న్మేదిని
లోన నేనృపతుల, స్వాధీనులై దేశము । న్బరిపాలింపఁగఁ జాల రట్టినృపతు,
ల్నానాప్రకారంబులన్ । స్థిరసంపన్మహిమావిశేషములచే, దీపింపఁగా జాల
రా । సురవంశోత్తమ వార్ధియందలి ఘన,క్షోణీధర ప్రాయులై ॥ (ఆ,వె)
చపలమతి వయుక్త,సంచారుఁడవు జడా । త్మకుఁడవైన నీవు,ధైర్యవంతు లైన
దేవదాన, వాదులతో విగ్ర । హించి రాజవైతి,వెట్టులకట ॥ (క) మతిహీను
నిఁ గాముకసం । గతునిఁ దెలియఁ దగిన యట్టి, కార్యము దెలియ । న్ధృతిలేని
నిన్ను రాక్షస । పతిఁజేసిన నలువయెంత, బాలిశుఁడోకో ॥ (వ)మఱియుఁ
జారుండును గోశంబును నయంబు నెవ్వారికి స్వాధీనంబులుగా వట్టి నరేంద్రు
లు మూర్ఖజనులతోడ సమానులగుదు రదియునుంగాక ॥ (క)చారులచే
విషయ సమా । చారంబుల నెఱిఁగి యుచిత, సరణి మెలఁగు ధా । త్రీరమణు :
డు దైత్యేశ్వర । యారయఁగా దీర్ఘదర్శి, యనఁదగు నుర్విన్ ॥ (తే,గీ) ధర
ణి నెవ్వాఁడు ఘనజన,స్థానమందుఁ । జచ్చినఖరాదుల నెఱుంగఁ, జాలఁడట్టి ని
న్నుఁ బ్రాకృతసచివసం,పన్నుఁ డధిక । కామభారావసన్నుఁ,గాఁదలంతు॥(ఆ,వె
భీమకర్మములగు, యామినీచరచతు । ర్దశసహస్రములును, త్రిశిరుఁడు
ను ఖ । రుండు దూషణుండు, దండిరాక్షసులొక్క । రాముచేత మడిసి, రేమిగ
లదు ॥ (తే,గీ)రాక్షసోత్తమ నృపుఁడైన, రాముచేతఁ । దాపసుల కెల్ల నభ
యంబు ,దత్తమయ్యె । ధర్షితంబయ్యెనలజన, స్థానపదము । దండకంబులు సు
కృతభ,ద్రంబు లయ్యె ॥ (క) విను మీవు స్వదేశంబున । జనియించిన భయ
మెఱుంగఁ,జాలవయితిగా । పున మత్తుండవు లుబ్ధుఁడ । వనవరతము బాలబుద్ధి
వనుచుఁ దలఁచెదన్ ॥ (క)ధర శఠుని బ్రమత్తుని దు । ష్కరు నల్పుని దీక్ష్ణక
రుని, గర్వితుని మహీ । వరుని సమస్తజనంబులు । నిరసింతురు వ్యసనమందు,
నిందితచరితా ॥ (క)అతిమానియునగ్రాహ్యుఁడు । సతతముఁ గ్రోధనుఁడు నా
త్మ,సంభావితుఁడా । క్షితిపతిని స్వజనమైనను । వితతమతి న్వ్యసన మందు,వి
డుచు నధీశా ॥ (క)తనవారి సేమ మరయక । తనయిచ్చకొలందిదిరుగు,ధ
త్రీశుఁడు గ్ర । క్కున నవారలచేఁ దృణముక్రి । యనెన్నఁబడు వ్యసన సమయ



మందసురేంద్రా॥ (ఆ,వె) కలయలోష్టపాంసు, కాష్ఠసంచయముల । వలనఁగా
ర్య మొకటి,గలుగుఁగాని । దానవేంద్ర వినుము,స్థానపరిభ్రష్టు । లైన నృపుల
చేత,నదియు లేదు ॥ (తే,గీ)రాజ్యపదహీనుఁడైనట్టి, రాజు చతురుఁ । డైననే
మి నిరర్థకుఁ,డై నశించు । దానవేశ్వర యుపభుక్త,మైన పటము । మాడ్కినా
మ్లానకుసుమదా,మంబు కరణి ॥ (తే,గీ) నయనముల నిద్రితుండయ్యు, నయ
విలోచ । నముల సర్వంబుఁ బరికించు, నరవిభుండు । వ్యక్తకోపప్రసాదుఁడై,వ
ఱలువాఁడు । సంతతముఁ బూజ్యుఁడగు సర్వ,జనులచేత ॥ (వ) మఱియు నె
వ్వండు విజితేంద్రియుండై యప్రమత్తుండై కృతజ్ఞుండై ధర్మశీలుండై స్వ
రాష్ట్ర పరరాష్ట్ర వృత్తాంతాభిజ్ఞుండై ప్రవర్తించునట్టి మహీపతి చిరకాలంబు
రాజ్యంబు పరిపాలించు నీవు జనస్థాన నివాసులగు రక్షోవరుల వధప్రకారంబె
ఱుంగని కతంబునఁ బూర్వోక్తసుగుణవర్జితుండవనియు విషయాసక్తుండవని
యును దేశకాలవిభాగ నిర్ణయంబులయం దసమర్థుండవనియును గుణ
దోషనిశ్చయంబునం దయుక్తబుద్ధివనియును జనంబులచేత నెన్నంబడుదువు లో
కాపవాదంబువలన నాయుర్భాగ్యంబులు నశించునని యివ్విధంబున స్వదో
షంబు లుగ్గడించి దూఱుచున్న శూర్పణఖ వాక్యంబులు విని నిశాచర
వల్లభుండును ధన దర్పబలాన్వితుండు నగు రావణుండు క్రోధమూర్ఛితుం
డై మారీచుండు సమరంబు యుక్తంబుగాదని నిషేధించె నీశూర్పణఖ సమ
రంబునం దుత్సాహకల్పనంబు సేయుచున్నది యెయ్యది కర్తవ్యం బని కొం
డొక సేపు విచారించి యమాత్యమధ్యంబునఁ గోపోద్దీపితముఖియై పరుషంబు
లు వలుకుచున్న శూర్పణఖకిట్లనియె ॥ (సీ) రాముఁడెవ్వాఁడు తత్పరాక్రమం
బెచంద మెంత శౌర్యము గల, దెట్టిరూపఁ । మేటికి ఘనదండ,కాటవి కరుదెం
చె లావెంత చలమెంత, రాఘవునకు । నాయుధం బెద్దిఘోరాజిలో ఖరదూ
షణాదినిశాచరు, లతిసమర్థు । లెట్లు రామునిచేత నిండఱుహతులై రిశౌర్యం
బు ప్రకటింపఁ జాలరైరి ॥ (తే,గీ) యనుచు రాక్షసవిభుఁడు ద,శాననుండు।
తెలియనడిగిన విని క్రోధ. దీప్తవదన । యగుచు ముక్కిడి రక్కసి, యన్నతో
డ । నమ్మహాత్మునివృత్తాంత, మంతఁ జెప్పె॥(ఉ) రాముఁడు బహువిక్రమప్ర,రా

శూర్పణఖ రావణునికి రామునివృత్తాంతమంతయుఁ జెప్పుట.

జిత భార్గవ రాముఁ డంబుజ । శ్యాముఁడు దీర్ఘబాహుఁడు జటాజిన చీర

ధరుండు ధీరుఁడుం । గామసమానరూపుఁడు జగజ్జనలోచన రంజనుండు సు। త్రామనిభుండు జక్తి రథ,రాజకుమారుఁడు రాక్షసేశ్వరా ॥ (క) ఘనశక్రచాప నిభమగు । కనకాంకితదివ్యకార్ముక,కంబెక్కిడి గ్ర । క్కున నారాచవితానము । పనివడి దొడిఁగించు ఘోర,ఫణితతిని బలెక్ ॥ (క) విలుసవరించుటయును శర । ములు గుణమునఁ గూర్చుటయును, మునుకొని సైన్యం । బుల పైనేయుటయును ననిఁ । దెలియఁగరాదయ్యె నాది, తేయవిరోధీ ॥ (క) శరవృష్టిచేతఁ గూలిన । సురారిసైన్యమునుబోలఁ జూచితిననిలో । సురవిభునియుశ్మవృష్టిని । సరయాహతి నుర్విఁ బడిన సైన్యమునట్లన్ (క) పదునాల్గువేలదనుజులు । పదాతి యగు నొక్కరామభద్రునిచే దు । మ్మదఖరదూషణయుతముగఁ । గదనావనిఁ బడిరి మూఁడు గడియలలోనన్ ॥ (ఆ,వె) మునులకభయ మొసఁగి,మునుకొనిఖరదూష । ణాదిదనుజవరుల నాజిఁజంపి । విపినపథము నెల్ల, సుపథంబుఁ గావించె । నతని బాహుశౌర్య, మరిదిపొగడ ॥ (తే,గీ) వితతరణరంగధీరుఁడై వెలయునట్టి । రామభద్రుని ఘోరశ,రములచేతఁ । దెగక యేనొక్కదాన న,తిప్రయత్న । మునవిముక్తనై వచ్చితి దనుజవర్య ॥ (చ) అతనికిఁదమ్ముఁడుజ్జ్వలుఁడ హస్కరతేజుఁడు బుద్ధిమంతుఁడ । ప్రతిముఁడు వీర్యవంతుఁడను రక్తుఁడుభక్తుఁడుతుల్యవీర్యుఁడా । శ్రితపరిపోషణుం డభయశీలుఁడమర్షయుదుర్జయుండున । ద్ద్భుతబలుఁడొప్పురాత్రిచర పుంగవలక్ష్మణనామధేయుఁడై ॥ (వ) అమ్మహాత్ముండు రామునకు దక్షిణ భుజమాత్రుండై బహిశ్చరంబగు ప్రాణంబుచందంబున నొప్పుచుండు నదియునుంగాక ॥ (ఉ) ఆతనిప

(*)శూర్పణఖ రావణునికి సీతారూప వైభవంబుఁ బ్రస్తుతించిచెప్పుట(*)

త్ని భీతహారిణాక్షిమనోహరచారుగాత్రియ । బ్జాతసుపాణి యర్ధశశి ఫాలసుకేశిసునాసరూపవి । ఖ్యాతయశస్వినీమణిజగజ్జనసన్నుత శీలపూర్ణిమా ।శీతకరోపమాననముఖి చెల్వగుసీతయనన్ బ్రసిద్ధయై॥ (తే,గీ) కమలవైరినిబాయనికౌముదిగతిఁ । గాయమెడఁబాసియుండని ఛాయపగిది । దనుజవర పువ్వుఁబాయనితావికరణి । భర్తనెడఁబాయకుండునప్పద్మనేత్ర॥ (ఉ) ఆజనకావనీశసుత కాశతపత్రవిశాలనేత్రకా । రాజనిభాస్యకాభుజగరాజమనోహరరోమరాజికా । రాజితరూపవైభవతి రస్కృతనూతనరత్నపుత్రికం । భోజనివాసినీకుధర పుత్రికలైననుసాటివత్తురే ॥ (చ) మనుఫణిలోకసుందరుల మోహన



రూపవిలాసవిభ్రమం । బనిమిషలోకవాసిహరిణాక్షుల శోభనదేవసౌష్ఠవం । బనుపమమర్త్యకామినుల యందముచందముఁబోలఁ జూడమే । దనుజవరేణ్యకానమల దానికిసీడగుదానినెందునన్ ॥(ఉ) ఆమదిరాక్షిచక్కఁదన మాయలికుంతలమాటపొంకమా । శ్యామవచోవిలాసవిధమాలికుచస్తనిచూడ్కిచందమా । రామవిలాసమాయువతి లక్షణమామృదుపాణిసొంపునే । నేమనిచెప్పుదాననసురేశ్వర చూచినఁగానితీరునే॥ (క) ధరలోనెవ్వనికాసతి । యిరువందఁగభార్యయయ్యె నెవ్వానిఁదమిం । బరిరంభించెనతండా । పురుషహాతునకంటెనధిక పూజ్యుఁడుగాఁడే॥ (శా) ఆనీలాలకయాగజేంద్రగతియా యంభోజపత్రాక్షియా । పీనశ్రోణిసురారిసీకుఁదగునా పృథ్వీజకున్ నీవుని । త్యానందంబునొసంగనర్హుఁడవుమీ కన్యోన్యముంజిత్తసం । ధానంబైననభూతపూర్వవిభవౌన్నత్యంబుచేకూడదే॥ (ఉ) దానిమనోజ్ఞవేషమునుదానివచోరచనా చమత్కృతు । ల్గానుగఁజూచినీకుఁదగు మానినియంచుఁ దలంచిపేడ్కతో । నేనుగడంగిబల్వడిగ్ర హింపఁగఁబోయిసుమిత్రపట్టిచే । దానవనాథయిట్టులసి ధారవిరూపితనైతినెంతయున్ ॥ (క) మదనునియాజ్ఞవశరమగు । సుదతీమణి చందమీవుచూచితివేనిం । ద్రిదశారియేమిచెప్పుదు । మదనజ్వరతాపవార్ధిమగ్నుఁడుగావే॥ (క) ఆగజయానను భార్యం । గాఁగైకొనుతలఁపుసీకుఁ గలదేనిసము । ద్యోగివయియిపుడెచెచ్చెర । నేగుమువిజయార్థమీవహీనగుణాఢ్యా॥ (క) రామునిరణభీమునిసు । స్థేమునివధియించియతనిచేమున్నసమి । ద్భూమిని జచ్చినదనుజ । స్తోమమునకుఁబ్రియమొనర్చుదోషాటవరా ॥ (తే,గీ) దైత్యకంటకులైనయాదాశరథుల । నిరువురవధించితేని యాధరణిపుత్రి । యొంటిమైఁజిక్కునవ్వలతుంటవిల్తు । మచ్చరింపుచుభోగింపవచ్చునీకు॥ (క) నావచనంబొనగూర్పఁగ । భావించితివేనిదనుజ పాలకయిపుడే । వేవేగదండకాటవి । కేవెంటంజనుమురాము నెక్కటిగెలువన్॥ (వ) అని యిట్లు బహుప్రకారంబులఁ బాపవ్యవసాయంబునందు బుద్ధి తగులువడునట్లుగా బోధించిన నయ్యసురాంగనవాక్యంబువిని ఖరదూషణుల మరణంబునకుదుఃఖించి సచివముఖంబునఁ గార్యంబు తెలిసికొని వారినందఱ నిండ్లకుఁబోవంబంచి యద్దశగ్రీవుం డంతఃపురంబున కుంజని యనంతరంబ తనమనంబునఁ దత్కార్య పర్యాలోచనంబుఁజేసి సునిశ్చితార్థుండై క్రమ్మఱ దార్ఢ్యంబు కొఱకు నాలోచించి సీతాపహరణకా

ర్యంబు పౌరుషంబునం జేసితినేని గుణంబగుఁ జౌర్యంబునం జేసితినేని దోషంబ.

## రావణుఁడు సీతాపహరణమునకై బైలుదేఱుట.

గునైనను ఖరాదియుద్ధంబునందు రాముని యచింత్యబలపౌరుషంబులు వినఁబడుటవలనఁ బౌరుషంబునఁగావించుటకు శక్యంబైయుండ దుపాయపరికల్పితచౌర్యాశ్రయణంబునందుఁ దాత్కాలికదోషంబులు పరిదృశ్యమానంబులుగావుగావున సీతాపహరణంబు చౌర్యంబునం గావించెదఁ గాక యని నిశ్చయించి స్థిరబుద్ధియై రయంబున యానశాలకుంజని పెద్దలెఱింగిన నివారింతురనితలంచి రహస్యంబుగా రథంబు సన్నద్ధంబుగావింపుమనిసూతునాజ్ఞాపించిన లఘువిక్రముండగు నతండు తత్క్షణంబ పిశాచవదనంబులైన ఖరంబులంబూన్చి కాంచనమయంబును రత్నభూషితంబును గామగమనంబు నగు రథం బాయితంబు చేసితెచ్చిన దానినారోహించి శ్వేతమాల్యవ్యజనుండును శ్వేతచ్ఛత్రుండును స్నిగ్ధవైడూర్యసంకాశుండును దప్తకాంచనకుండలుండును దర్శనీయపరిచ్ఛదుండును దశగ్రీవుండును వింశతిభుజుండును దేవశత్రుండును మునికంటకుండునగు రావణుండు శిఖరదశకసమన్వితంబైన పర్వతంబు చందంబున నందంబై బలాకామాలాసహితంబును విద్యున్మండలవంతంబునైన మేఘంబు పగిది నంబరంబునం జని చని రమ్యంబగు సాగరానూపంబు విలోకించె నది మఱియును ॥ (సీ) బహుపుష్పఫలమహీరుహకదంబయుతంబు పద్మశోభితసరో, భాసితంబు। వేదిమదాశ్రమ, విసర విశాలంబు నానాపతత్రిసు, నాదితంబు। నజమాషవాలఖి, ల్యమరీచిపాత్రేయ వైఖానసాదిసంవాసితంబు। నాగసువర్ణగం,ధర్వకిన్నర సిద్ధసాధ్యవిద్యాధర సంవృతంబు ॥ (తే,గీ) సాలతాలతమాల హింతాలమాతు। లుంగనారంగ లుంగల, వంగబిల్వ। వంశకింశుక శింశుపా,వకుళశిప। మంజరీకుంజ పుంజోప,రంజితంబు ॥ (వ) మఱియు నారికేళకదళీవనోపశోభితంబును నత్యంతనియతాహారపరమర్షిశదాకీర్ణంబును దివ్యాభరణభూషితదివ్యరూపక్రీడారతివిధిజ్ఞదివ్యాప్సరోజనసహస్రసంచారితంబును దేవపత్నీసంసేవితంబును నమృతాశిదేవదానవసంఘవిరాజితంబును హంసక్రౌంచసారసప్రణాదితంబును రమ్యవైడూర్యప్రస్తరంబును బాండరదివ్యమాల్యసంయుతతూర్యగీతాభిజుష్టవిశాలవిమానవిభ్రాజితంబునునగు సముద్రతీరప్రదేశంబు డాయంజని యందుఘ్రాణతృ



ప్తికరనిర్యాసరసమూలచందనాగరువనోపవనంబులును దక్కోలజాతివృక్షంబులును సుగంధిఫలంబులును దమాలపుష్పంబులును మరీచిగుల్మంబులును ముక్తాసమూహంబులును శంఖప్రస్తరంబులును బ్రవాళనిచయంబులును గాంచనరాజతశైలంబులును మనోజ్ఞశిలాఫలకంబులును బ్రసన్నసలిలాశయంబులును ధనధాన్యోపపన్నస్త్రీరత్నశతసంకులగజాశ్వరథసంబాధనగరంబులును విలోకింపుచు సాగరతరంగసంభూతశీతవాతపోతంబులు పైసోఁకనలరుచు నీదేశంబుస్వర్గతుల్యంబై యున్నదని కొనియాడుచుం జని యందొక్కచోటఁ దొల్లిగరుడుండు సుధాహరణార్థంబు స్వర్గలోకంబునకుం బోవుచు గజకచ్ఛపంబులఁ దన్నికొని భక్షణార్థంబు శతయోజనాయతంబైన రోహిణీ శాఖనెక్కిన నది భారంబు మోవంజాలక తత్క్షణంబు విఱుగుటయు దాని నవలంబించి తలక్రిందుగాఁ దపంబు సేయుచున్న బ్రహ్మనఖజాతులైన వైఖానసులను వాలసంభవులైన వాలఖిల్యులను బూతిమాషగోత్రజాతులను నయోనిజులను మరీచిపులను మహర్షుల నవలోకించి వారికి బాధ యగునని యమ్మహాశాఖను నగ్గజకచ్ఛపసహితంబుగా నొక్కపాదంబునఁ దన్నికొని యంతరిక్షంబున కెగసి యందు గజకచ్ఛపంబుల భక్షించి శాఖాసహితంబుగా నిషాదవిషయంబునకుంజని యచ్చటినిషాదులనెల్లమ్రింగి యవ్వనస్పతిశాఖనచ్చటవిడిచి యభిమతభక్షణనిషాదనాశనమునిజనరక్షణజనితసంతోషవిశేషంబున ద్విగుణీకృతవిక్రముండై యమరావతికింజని యందుఁ బక్షిరాజప్రవేశపరిహారార్థంబుని బద్ధంబులైన యయోమయశృంఖలనిర్మితజాలంబులు భేదించి రత్నగృహంబు విధ్వస్తంబుఁ జేసి యందు నిక్షేపించి సురేంద్రగుప్తంబైన యమృతంబుఁ దెచ్చె నట్టిమహర్షిగణజుష్టంబును సుపర్ణకృతశాఖాభంగరూపలక్షణంబును సుభద్రనామకంబునైన న్యగ్రోధవృక్షంబు నిరీక్షించుచుం జనియ

## (*) రావణుఁడు మారీచుని కడకేగుట. (*)

వ్వల నదీపతియగు సముద్రతీరంబున నొక్క పుణ్యకాననంబునరహస్యంబుగా నున్న యొక్క రమ్యాశ్రమంబుఁజూచి యందుకృష్ణాజినజటావల్కలధరుండై నియతాహారుండై తపంబు సేయుచున్న మారీచుండను రాక్షసు నవలోకించి యతనిచేతనమానుషంబులైన సర్వకామంబుల నర్చితుండై సంపృష్టకుశలప్రశ్నుండై వెండియుఁజనుదెంచుటకుఁగార్యంబెద్దియనియడుగంబడిన రావణుండ

తనికిట్లనియె ॥ (క) దనుజోత్తము దీనుఁడనగు । ననుఁగరుణంగాచుటకు ఘనం బుగనీవే । యనుపమగతియటుగావున । వినుపించెద వినుము నాదువృత్తాంతం బున్ (సీ) రాముండు దండకారణ్య దేశమునకుఁ జనుదెంచు టయును లక్ష్మణు నిచేత । రూఢిశూర్పణఖవిరూపితయగుటయుఁ దన్నిమిత్తము జన స్థానవాసు । లగుచతుర్దశసహస్రాసురులనుగూడి ఖరుడుసంగ్రామార్థ మరిగి యచట । రామునిచేతశరప్రపాతనమున సైన్యంబుతోఁగూడఁజచ్చుటయును ॥ (తే,గీ) బలులుదూషణత్రిశిరులు పొలియుటయును । రామువిక్రమ మాతనిదీమసంబు । సర్వమునుదెలియంగసుపర్వవైరి । కడఁగినీతోడఁజెప్పితిఁగాదెతొల్లి ॥ (ఉ) ఇంత టివారితోడనొక హీననరుండతడెంతశూరుఁడో । యెంతయుశంకలేక కలహిం చినభీరునిమాడ్కి నేఁడునా । కెంతయునూరకుండఁదగు నేయసురోత్తమయట్టు లైనజం । భాంతకముఖ్యులన్సురమందుజయించినవాఁడివోవదే ॥ (ఉ) నాదు భుజాబలోద్ధతి తృణంబునకున్సరిగాఁగనెంచిమ । త్సోదరికర్ణనాసికలఁ ద్రుం చివిరూపిణిఁజేసియంతఁబో । కాదటప్రాణమిత్రులఖ రాదులఁజంపినరాముని న్మ ను । ష్యాదనచంపకున్నవిను ప్రాణముమానముఁబోవదేవెస ॥ (ఉ) రాక్షసర క్షితంబగున రణ్యముసొచ్చిఖరాదిరాక్షసా । ధ్యక్షులఁజంపినట్టిమను జాధిపుఁగీ టణఁగింపకున్నచో । రాక్షసవర్గ్యయిప్పుడెతి రంబుగలంకకునేగుదెంచిశి । క్షా క్షముఁడైసమస్తసుర కంటకులన్వధియింపకుండునే ॥ (చ) అతఁడుపదాతియ

()రావణుఁడు మారీచునిఁదనకు సీతాహరణమునందు సహాయునిఁగమ్మనుట()

య్యునొకఁడయ్యునుమానవుఁడయ్యువిక్రమో । ద్ధతులఖరాదిరాక్షసుల దారు ణరూపులఁజంపెనట్టియ । ద్భుతబలశాలిడాసిపలుపోకల వంచననైన శస్త్రసం । హతినెదిరించిరైనమన మందఱమొక్కటఁగూల్పవల్పదే ॥ (వ) చిరకాలంబు ననుండి పరమమునీంద్రులబాధింపుచు మన్నియోగంబున జనస్థానంబున నివ సించియున్న చతుర్దశసహస్ర రక్షోవీరుల నొక్కింతయైనఁ బరుషం బాడక వాక్పారుష్యంబు శరంబులందనుసంధించి యశ్రమంబునం బరిమార్చి దండ కారణ్యంబు సర్వజనశరణ్యంబుఁగావించె నతండు క్రుద్ధుండగు తండ్రిచేతనిర స్తుండై సభార్యుండై వనంబునకుం జనుదెంచి యాకాలంబు మెసవుచు క్షీణ జీవితుండైయున్నవాఁడు విశేషించి దుశ్శీలుండును గర్కశుండును దీక్ష్ణుండును మూర్ఖుండును లుబ్ధుండును నజితేంద్రియుండును క్షత్రియ పాంసనుండును



ధ్యక్తధర్ముండును నధర్మాత్ముండును భూతంబులకహితకరుండునై ధర్మ శీలురగు మనయట్టి పెక్కువంతులచేత నిందితుండై యుండు నెవ్వనిచేతవైరంబు లేక మద్భగినియగు శూర్పణఖ కర్ణనాసాచ్ఛేదనంబున విరూపిత యయ్యె నట్టిదురాగ్రహుండగు రాముని భార్యను సురసుతోపమయగు సీతనువిక్రమిం చి లంకకుంగొనితెచ్చెద నక్కార్యంబునకు నీవు సాహాయ్యంబుఁగావింపుము సకలోపాయజ్ఞుండవు శూరుండవు సర్వమాయావిశారదుండవుగావున వీర్య యుద్ధంబులందును నీకుసమానుండగువాఁడు ముల్లోకంబులందు నెవ్వండును లేఁడు భవత్సాహాయ్యంబునం బడయరాని యర్థంబుగలదె నీవు పార్శ్వవ ర్తివగుచుండ నిక్కార్యంబు సఫలంబుగావించెదనదియెట్లనినవినుము ॥ (చ) అరయసువర్ణచిత్రితమృగాకృతిఁగైకొనిరామునాశ్రమాం । తరమునసీతస మ్ముఖము నంజరియింపుమునీవునిన్నుఁజె । చ్చెరఁబరికించియాకనక చిత్రమృగం బునుబట్టితెమ్మటం । చఱిముఱి రామలక్ష్మణుల నావరవర్ణిని పంపునత్తఱిన్ ॥ (చ) పనివడియంతవారలయ పాయమునందువిధుంతుదుండుచం । ద్రునికళ యట్లయవ్వరవధూటినిబల్మిగ్రహించిరాముడుం । గసికనిగేహినీహరణ కర్శి తుండైపలవింపుచుండనె । మ్మనమునసంతసింపుచుసమస్తసుఖంబులు వేడ్కఁ నొందెదన్ ॥ (క) అనిపలికినరామునికథ । వినినంతనె తత్ప్రతాప విదుఁడగు

## మారీచుఁడు రావణునకు హితోపదేశము సేయుట.

మారీ । చునిముఖమువెల్లనయ్యెను । మనంబధికభయసముగ్రమగ్నంబయ్యెన్ ॥ (వ) మఱియు శుష్కంబులైన యోష్ఠంబులు పరిలిహింపుచు ననిమిషంబులై ననేత్రవ్యాపారంబులచేత మృతభూతుండైనవానియట్లు పరమార్తుండై చేష్ట లుడక్కి రావణుని వదనంబువిలోకింపుచుఁ గొండొకసేపూరకుండి మెండియు నొకింతతెల్వి దాల్చి చేదోయి నిటలంబునసంఘటించి యతనికిం దనకును హి తంబగునట్లుగా వినయవాక్యంబుననిట్లనియె ॥ (తే,గీ) ఆపనలఁ జెప్పునట్టిప్రి యములఁబలుకు । కపటచిత్తులుపెక్కండ్రుగలరుగాని । యాపదఁదొలంగనిడు నట్టియప్రియములఁ । బలుకువారలువినువారుఁ గలుగుటరిది ॥ (సీ) దనుజేంద్రనీ వయుక్తవిచారుఁడవుచప లుండవు గావునఁజండవీర్య । వరగుణోన్నతుశక్రవ రుణాభురాముని నసమానబలునిఁగానరయవైతి । సకలరాత్రించరు లకుస్వస్తి యగుగాక రాముడల్గిజగంబరాక్షసంబు । గావింపకుండుఁగా కమహీజనీపాలి

కుర్విలోమిత్తిగాకుండుఁగాక॥ (తే,గీ) తన్నిమిత్తంబువ్యసనంబుదలఁగుఁగాక।
కామరతుఁడవుదుష్కార్యకారివిశ్వ। రుండవగునిన్నుఁబొందిచెల్వొందులంక।
నిండువేడుకనశియింపకుండుఁగాక॥ (తే,గీ) జగతినెవ్వాఁడుతన్నరాష్ట్రమును
హితులఁ। జుట్టములఁజంపికొనఁజూచెనట్టిదుష్ట।తముఁడునీయట్టిదుర్జాతిదారు
ణుండు। ధర్మహీనుఁడు కలుషుండుదర్కఁగలఁడె॥ (సీ) రాక్షసేశ్వరవిను
రాముండులుబ్ధుఁడు గాఁడుదుశ్శీలుఁడుగాఁడధర్మ। మార్గనిష్ఠుఁడుగాఁడమ
ర్యాదుఁడగువాఁడు గాఁడుభూతద్రోహిగాఁడుపిత్రుని। రస్తుఁడుగాఁడుదు మర్
త్యాదుఁడగు... తిగాఁడుతీక్ష్ణుఁడు గాఁడవిద్వాంసుఁడుగాఁడుకర్క। శుఁడుగాఁడుకులపాంసనుఁ
తిగాఁడు... డుగాఁడుకైకచే వంచితుండగుసత్యవాదిజనకు॥ (తే,గీ) నెఱిఁగితత్ప్రియకా
మూర్ఖమెల్లసిరులు। రాజ్యమును బాసిదండకా రణ్యమునకు। వచ్చె నమ్మహా
త్మునిప్రభావంబుఁదెలియ। కాగ్రహంబుననన్నృతంబులాడఁదగునె॥ (తే,గీ)రామ
భద్రుండుసత్యపరాక్రముండు। ఘనుఁడు విగ్రహవంతుఁడు జననుతుండు। పండి
తుండునుసురలకింద్రుండుపోలె। నఖిలలోకంబులకునాథుఁడసురవర్య॥ (క)అక్షీ
ణతేజముననభి। రక్షితయగురామసతినిబ్రసభంబునలో। కాక్షిరుచియట్లనీవే।
దక్షతచేనపహరింపఁదలఁచితిబుద్ధిన్॥ (తే,గీ) శరశిఖోదీర్ణ మప్రధృష్యంబు
రుచిర। చాపఖడ్గేంధనంబుప్రచండదీప్త। మగుచురాజిల్లురామాగ్నియందుమి
డుత। పగిదినుఱుకఁదలంపనీకగునెయధిప॥ (చ) ఘనతరజీవితంబునుసు ఖం
బునురాజ్యమువీటిఁబుచ్చినీ। వనిశముచాపపాశధరుఁ డన్యచమూ హరణుండ
మర్షణుఁ। డనుపమబాణహేతియుతుఁ డద్భుతకార్ముకదీప్తవక్త్రుఁడై। య
నువగురాఘువాఖ్యవిల యాంతకునింజెనకంగనేటికిన్॥ (తే,గీ) అమ్మహాత్ముని
ఘనతేజమప్రధృష్య। మట్లుగావునఁదత్కార్ముకాశ్రయయగు। భూమిపుత్రి
నిగాననభూమియందు। సాహసంబునహరియింపఁజాలవీవు॥ (చ) అనఘుఁడు
సత్యసంధుఁడుమహాత్ముఁడువిగ్రహవంతుఁడైనరా। మునకుమహీజజీవితముఁబో
లినప్రేయసివీర్యశుల్కయ। య్యనలుని హేతితోనెనయు నాహరిణేక్షణ నాకు
లాంగనం। బనివడినీకువేగతుల బట్టిగ్రహింపఁగరాదురావణా॥ (క) ఏటికిఁద
లఁచితివిప్పని। మాటికి లోకముననింద్య మానుఁడవైదో। పాటకు లేశ్వరని
కృష్ణము। చేటొందెదవంతెగాక చేకొనవశమే॥ (క) అక్షీణతేజముననభి। ర
క్షితమైభానురుచికరణిఁగ్రాలెడుప। ద్మాక్షినిసీతనునీవే। దక్షతచేనపహరింపఁ



దలఁచితిబుద్ధిన్॥ (క) అతులితమగురాజ్యముఁజీ। వితమునుదనుసుఖములనుభ
వింపంగఁదలం। చితివేనిరామునకునప। కృతిసేయకయుండుటదియె హితమసు
రేంద్రా॥ (వ) మఱియు ధర్మజ్ఞులగు విభీషణపురోగములైన సచివులనం
దఱంగూర్చి వారితోడనాలోచించి గుణదోషబలాబలంబులు విచారించి స్వ

(*)మారీచుఁడు రామునిచేఁ దానుపడినపాటు రావణునకుఁదెల్పుట.(*)

పరబల విశేషంబెఱింగి హితాహితంబులఁదలపోసి యవ్వలమేలగునట్టికార్యం
బు నిశ్చయింపలయునందాఁక హితుండనైననాబుద్ధివిని రామునియందు విరో
ధింపక క్షమింపుము భవజ్జీవితంబు రామ దర్శనావసానంబనితలంచెదఁ దొ
ల్లియేను బలవీర్యదర్పంబులచేత నసమానుండనై మదనాగాయుత బలంబుగ
లిగి పర్వతసన్నిభంబైన మచ్ఛరీరంబు నీల జీమూతంబు చందంబునం గ్రాలఁ
దప్తకాంచన కిరీటకుండలంబులు మేనందీపింపఁ బరిఘాయుధంబు కేలందాల్చి
లోకంబునకు భయంబుఁబుట్టింపుచు మహియెల్లసంచరింపుచు దండకారణ్యం
బుఁబ్రవేశించి మునిమాంసంబు భక్షింపుచు స్వేచ్ఛాప్రకారంబున విహరింపు
చుండ నన్నిమిత్తంబున విత్రస్తుండై విశ్వామిత్రుండను బ్రహ్మర్షిశ్రేష్ఠుం డ
యోధ్యకుంజని దశరథుంగాంచి యన్నరేంద్రునకిట్లనియె॥ (తే, గీ) నృపకు
లోత్తంసమాకుమారీచువలన। నధికభయముసముత్పన్నమయ్యెఁగాన। యా
గకాలమునందుసమాహితుండ। నైన నను బ్రోచుఁ గాకనీ సూనుఁ డిపుడు॥
(వ) అని రామసాహాయ్యంబువేఁడిన విని యద్దశరథుండు వెండియువిశ్వామి
త్రునకిట్లనియె॥ (క) బాలుఁడుద్వాదశవత్సరుఁ। డాలంబుల తెఱఁగెఱుంగఁడ
కృతాస్త్రుండే। శీలముగలరామునికి। వాలాయమునాకుఁబంప వచ్చునెయన
ఘా॥ (క) ఏనిప్పుడునానావిధ। సేనలతోఁగూడివచ్చిచెచ్చెరనని లో। మాను
గనీశత్రువులను। బూనికవధియింతులెండు పోదమచటికిన్॥ (వ) అనినన మ్ము
నీంద్రుం డమ్మనుజేంద్రునకిట్లనియె॥ (క) ఆరాక్షసువధియింపఁగ। శ్రీరాముని
కంటెనొరుఁడుత్రిజగంబులలో। పేరుగలవారిలోపల। నారయఁగాలేఁడుదశర
థాధిపవింటే॥ (వ) రాజేంద్రా నీవు సమరంబులయం దారి తేరిన శూరుండ
వు దేవతలరక్షించిన మహానుభావుండవు భవత్కృతంబైన రణ కర్మంబు
త్రిలోకవిశ్రుతంబై యుండు నీకుఁ జతురంగసైన్యంబు కొఱంతలేకుండ నధికం
బై యున్నదైన నికార్యంబు రామునకుందక్కఁ దక్కినవారి కసాధ్యంబుగా
వున నిమ్మహాత్ముండు బాలుండైన గొఱంతలేదు సముదీర్ణంబైన నిజ తేజం

బున గర్వోన్నిగ్రహంబునందు సమర్థుండై యుండు నితనిం దోడ్కొని యరిగెద
నిమ్మహాత్మునకును నీకును భద్రంబు గలుగుంగాక యని పలికి దశరథు నొడంబఱిచి
యమ్మునీంద్రుండు రాముని దోడ్కొని పరమ హర్షంబున నిజాశ్రమంబున
కుం జనుదెంచి పర్వకాలంబున మఖదీక్షితుండై యుండె నంతఁ దన్నియోగంబున
శ్రీమంతుండును బద్మపత్రనిభేక్షణుండును మహావీర్యుండును నజాతవ్యంజనుం
డును బ్రహ్మచర్యస్థితుండును గాకపక్షధరుండును గనకమాలోపలక్షితుండునై
రాముండు చిత్రంబగు చాపంబు సారింపుచుఁ బ్రదీప్తంబగు స్వతేజంబున నయ్యా
రణ్యంబు వెలింగింపుచు నుదితుండగు బాలచంద్రుండుం బోలెఁ దేజరిల్లుచుండె
నంత॥ (క) బలవంతుఁడనగు నేనపు । డలయక వరదానమహిమ నటకేగి చలం ।
బలరఁగఁ బరిఘము కరమునఁ । జెలువారఁగఁ బరవసంబుఁ జేసితిఁ గడిమిన్॥
(క) ననుఁ జూచి రామభద్రుఁడు । ధనువును సజ్యంబుఁ జేసి తలఁకక నచలం । బు
నుబోలె సుస్థిరుండై । మునిపతికి భయంబుఁ దెల్పి మొనయుచునుండెన్॥ (ఆ,వె)
ఇతఁడు బాలుఁ డాజి నెంతని బుద్ధిమో । హమున నేను గడిమి నట్టహాస । మాచరిం
పనంత నతితీక్ష్ణమగు తూపు । వింటివలన నపుడు వెడలివచ్చె॥ (వ) ఇట్లమోఘర
యంబునం బఱతెంచి యమ్మహాశరంబు నన్నుం దాఁకిన నేను శత్రునిబర్హణ
బాణతాడితదేహుండనై శతయోజనంబు దవ్వులం గల సముద్రంబునం బడి
మూర్ఛనొందితి నప్పుడా రాముండు దయాళుండై నన్ను వధియింపక కాచి పు
చ్చె నిట్లు రాముని శరవేగంబున నిరస్తుండనై యచేతనుండనై గంభీరంబగు
సాగరజలంబునం బడి చిరకాలంబునకుఁ గ్రమ్మఱ లబ్ధసంజ్ఞుండనై బ్రతుకు మఱ
లఁ గంటినని తలంచి యత్తెరువునకుం జనక లంకాపురంబుఁ బ్రవేశించితి మత్స
హచరులైన రాక్షసులందఱు రాముని చేత నిహతులైరప్పుడు రాముండు బా
లుండును ననభ్యస్తాస్త్రుండునై యంత చేసె నిప్పుడు యౌవనాధికుండై యస్త్ర
విద్యయం దారితేఱియున్నవాఁ డమ్మహాత్మునితోడ విగ్రహంబుఁ గావించితివేని
ఘోరంబైన యాపద సంభవించు సంశయంబు లేదని పలికి మారీచుండు వెం
డియు నిట్లనియె॥ (తే,గీ) అనయుఁ గ్రీడారతివిధిజ్ఞు లమితబాహు । సత్వులును
సమాజోత్సవశాలులైన । దానవులకు ననర్థసంతాపమేల । పొసఁగఁ జేసెదవి
టు బుద్ధిపూర్వకముగ॥ (క) నిరుపమమణిచిత్రితసుం । దరహర్మ్యవిమానశో
భితంబగు లంకా । పురవరమాసీతకతంబునఁ । గరమభిహతమగుచునుండఁ గాంచె



దనధిపా॥ (తే,గీ) పాపములు సేయకుండియుఁ బరమశుచులు । రాక్షసోత్తమ
పాపసంశ్రయము వలన । నెపుడుఁ బరపాపముల నశియింతు రహిజ । లాశయము
నందు మత్స్యంబు లణఁగినట్లు॥ (క) హరిచందనదిగ్ధాంగులు । వరాభరణభూ
షితులగు వాసవరిపులం । గరము భవద్దోషంబున । ధరణిని బాతితులఁ గాఁగఁ ద
లఁపుము బుద్ధిన్॥ (వ) మఱియు రామశరపాతనంబునఁ దమవారెల్లఁ బొలిసిన
హతశేషులగు రాక్షసులు తమకు రక్షకుండు లేక భయంబునఁ గనుకనిం బఱ
చుచుండ నిరీక్షింపఁగల వదియునుంగాక బహువిధశరశిఖిశిఖాపరంపరల భ
స్మీభూతంబై కూలిన లంకాపురంబుఁ గనుంగొనియెదవు సంశయంబు వలదు
పరదారాభిమర్శనంబునకంటె నధికంబగు పాపంబు వేఱొక్కటి లేదుగావున
నావచనంబుఁ బట్టి స్వదారనిరతుండవై కులంబును మానంబును రాష్ట్రంబును
నిష్టంబగు జీవితంబును గళత్రంబులను బంధువర్గంబును రక్షించుకొను మట్లు
సేయవైతివేని రామశరాత్తజీవితుండవై శీఘ్రంబున బంధుసహితంబుగా య
మక్షయంబునకుం జనియెద వదియట్లుండనిమ్ము మత్పూర్వవృత్తాంతంబు వినుపిం
చితిఁగదా యిప్పుడు వెండియు నాకుం బాటిల్లిన యాపద తెఱం గెఱింగించెద
నిరుత్తరంబుగా వినుము॥ (సీ) అసురేశ యేను మృగాకృతిఁ గైకొని మృగరూప
మగు దైత్యయుగముఁ గూడి । తీక్ష్ణశృంగంబులు దీప్తజిహ్వయు మహాకాయంబు
సత్వంబు గ్రాలుచుండ । ఘనమగు దండకావనముఁ బ్రవేశించి చైత్యవృక్షములం
దు శాలలందుఁ । దీర్ఘదేశములందుఁ దిరుగుచుఁ దపసులఁ దునిమి తన్మాంసంబుఁ ది
నుచువారి॥ (తే,గీ) రుధిరములు గ్రోలి వనగోచరులకు భీతి । పుట్టఁజేయుచు క్రా
దరితమెట్టిపడఁగ । వలసినట్లుగ వనమెల్లఁ గలయ రయము । మిక్కుటంబుగఁ ది
రుగుచు నొక్కనాఁడు॥ (సీ) ధర్మవిచారుఁడై తాపసాకృతిఁ బూని సీతయు సౌ
మిత్రి చేరికొల్వఁ । దాపసోచితవృత్తిఁ దపముఁ గావింపుచు నున్న రామునిఁ గాంచి
మున్ను నాకుఁ । జేసిన యపకృతిఁ జింతించి క్రుద్ధుండనై డాయ గమకించునంత
లోనఁ । దచ్చాపనిర్ముక్తదారుణబాణత్రయంబు మామువ్వుర నతిరయమున॥
(తే,గీ) నశనిసంకాశమై తాఁకె నపుడు తత్ప । రాక్రమవిదుండఁ గావున రాక్ష
సేంద్ర । యేను సాక్కితిఁ దక్కిన యిరువురుగ్ర । భంగిఁ గూలిరి తద్బాణపాతనము
న॥ (వ) ఏను గొండొకసేపునకు మూర్ఛ దేఱి బ్రతుకు మఱలం గాంచి మా
తృగర్భంబున నుండి క్రమ్మఱం బుట్టిన వానిఁగా దలంచుకొనుచు నాఁటంగోలె

—(*)మారీచుఁడు తనకుంగల రామభయమును రావణునకుఁ దెల్పుట.(*)—

నాసురకృత్యంబు విసర్జించి తాపసుండనై యివ్వనంబునఁ దపంబు సేయుచు న్నవాఁడ నదియునుంగాక॥ (చ) భ్రమఁగొనినాఁటనుండి ప్రతి పాదపమందు నురామభద్రుని। న్సముదితరౌద్రుఁగాఁగధృత చాపునిఁగాఁగ మహాత్ముఁగాఁగ సం। యమివరుఁగాఁగవల్కలజ టాజిన ధారినిఁగాఁగ రాక్షసో। త్తమ కనుచు న్నవాఁడనిటఁ దప్పకదారుణకాలుఁ బంబలెన్॥ (క) కనులకు రామసహస్రము। లనవరతముఁదోఁచుచున్న వటుగావునని। వ్వనమెల్లరామభూతం। బనితలఁచు చునున్నవాఁడనసురేశమదిన్॥ (తే,గీ) అసురకులవర్య స్వప్నమందైన రామ। భద్రురూపంబుమదికిఁజూపట్టెనేని। గురుభయంబునమూర్ఛిల్లికొంతవడికిఁ। దెలిసికలయనిక్రమ్మఱఁ దెలివిఁగాంతు॥ (వ) మఱియు రామవిత్రస్తుండనైననాకు రత్నరథాదికంబులైన రకారాదినామంబులు చెవికిసోఁకిన నధిక భయంబు గళవళింపుచుండుదు వేయేల రకారాద్యంబైన భవన్నామంబును వినుట కధి భయంబగుచున్నది కావున నమ్మహాత్మునితోడఁ జివ్వకుఁజోరనొల్ల నతండుబలి నముచి వృత్రాదులనైన లెక్కింపక యొక్కమాత్ర నుక్కడనుక్కడంగించున ట్టి జెట్టిజోదు నీకును రామునితోడి విరోధంబునకుఁ జొరకుండుట క్షేమం బ ట్లుగాదంటివేని తగువారల సహాయులఁగూర్చుకొని నీవె యిప్పనికిఁ గడంగు ము నన్నేల రాముని యమోఘ బాణంబులకు సమర్పించెదవు నాకు సేమం బుఁగోరితివేని నాఁమ్రోల రామ వృత్తాంతంబుఁ జెప్పకుము లోకంబునందు సాధులసేకులు నియమితచిత్తులై ధర్మంబు లనుష్ఠింపుచుండియుఁ బరులయ పరాధంబునసపరిచ్ఛదంబుగ నాశంబునొందుదు రట్లనేనును నీయపరాధంబున నశింపంగలవాఁడ నీతోడి చుట్టరికం బింతకుఁదెచ్చె మహాతేజుండును మహాస త్త్వుండును మహాబలుండును మహానుభావుండునగు రాముండు రాక్షసుల పా లిటి కంతకుండై జన్మించినవాఁడు శూర్పణఖహేతువువలన మహాబలుండగు ఖరుండు నిమిషమాత్రంబునం బొలిసె నతనిపాటునుం దలంపవైతివి నీయట్టిగ ట్టిమగలు పెక్కండ్రైన నమ్మహాత్మునకొక్కనికిసాటిసేయఁదగరు బంధు హితా ర్థినైన నావచనంబునం దనాదరణంబుఁ జేసి రామునితోఁ గలహించితివేని నిశితంబులైన తదీయశరంబులచేతఁ బీడితుండవై బంధుసహితంబుగా మడిసె ద వని యిట్లు బహుప్రకారంబులం బ్రబోధించిన మతిమంతుండు దివ్యౌ



షధంబుం బోలె క్షేమయుక్తంబైన మారీచుని వాక్యంబుఁ గైకొనక కాలచో

—(*) రావణుఁడు మారీచుని దూఱుట (*)—

దితుండై రావణుండు వెండియు బరుషవాక్యంబున నతనికిట్లనియె॥ (తే,గీ) నే రిచినవాని చందాన, నీవయుక్త। భంగినామ్రోల నెయ్యది పలికి తిప్పు। డది విశేషించి నిష్ఫల,మయ్యెనూష। రమున నించినసూత్న బీజములకరణి॥ (తే,గీ) పాపశీలుండు మనుజుండు, బాలిశుండు। చపలుఁడగు రాఘవుసిబౌరు,షముఘ నమని। నీవు పలికిన యంతనె,నృపునికడిమి। కలన భేదింపమాకుశక్యంబుగా దె॥ (చ) హితులను దల్లిదండ్రులన, హీనసుఖంబును లచ్చిఁబాసి ప్రా। కృత మగు కాంతమాట విని,యెవ్వఁడరణ్యముఁ జొచ్చెనట్టిదు। మ్మతియగు రాజ నందనుని ప్రాణసమప్రియ యైన జానకి। న్ధృతిచెలఁగంగ నేనపహ,రించెదని క్కము నీసహాయతన్॥ (క) ధృతిపెంపున నీగతిని। శ్చితమై తగనాదుబుద్ధి చెలఁగెడుదానిం। జతురత మఱలింపదివ। స్పతిముఖ దిక్పాలురైనఁ, జాల రుతలఁపన్॥ (వ) తాటకేయా కార్యా కార్య వినిశ్చయ విషయంబునం దు గుణ దోషంబులును నుపాయా పాయంబులును విచారించి చెప్పుమని నిన్నడిగిన నిట్లు చెప్పవచ్చు మాకట్టి జిజ్ఞాసలేదు గావున లేనియధికారం బు నొంది యిట్లు పృష్టోత్తరంబులు పలుకు టయుక్తంబు గాదెవ్వండు తనకు హితంబుఁ గోరునట్టి విద్వాంసుండగు సచివుండసంపృష్టుండై రాజుమ్రోలని ట్లనుచితప్రసంగంబు ప్రతికూలంబుగాఁ గావింపండు కావున॥ (తే,గీ) కూర్తు వనుచు నీతోడనా, కోర్కెఁదెలియఁ। జెప్పినందుకు హితయుక్తిఁ జెప్పకిట్లు। నేర్పులేర్పడ గుణదోష నిర్ణయంబు। నెఱిఁగినట్లుగప్రతికూలమెన్నఁదగునె॥ (క)తగువై ఖరిననుకూలం। బగువాక్యమువిభునితోడ, నతిమృదుపూర్వం। బ గునట్లుచెప్పవలయును। జగతి న్ప్రతికూలమాడఁ జనదు హితులకున్॥ (వ) మఱియు మానార్హుండగు మహీరమణుండు సన్మానశూన్యంబునుదిరస్కా రసహితంబునగు వాక్యం బెద్ది గలదది హితంబైనను బ్రతిగ్రహింపఁ డదియు నుంగాక॥ (చ) అమితగుణాఢ్యులైన నృపు లగ్నిసురేశ మృగాంకవార్ధిశా। ర్ఙ్గమనుల పంచరూపములు సమ్మతిఁ గైకొని తైక్ష్ణ్యమున్నువిక్రమమును సౌమ్యముందగుతె, జంగున దండము సుప్రసన్నత। న్సముచిత భంగిఁదాల్చి జన, సమ్మతులైచరియింతురెల్లెడన్॥ (క) కావునఁ బృథివీశులు స। ర్వావస్థ

లయందుఁబూజ్యు, లధికులు మాన్యు। ల్నీపది యెఱుఁగక యజ్ఞుని। కైవడిఁ బరుషోక్తులాడఁ గాఁదగ నగునే॥ (వ) ఏనిప్పుడు గుణదోషంబులును గార్యాకార్యంబుల యందు యుక్తాయుక్తభావంబులును నిన్నడుగ లేదే నొక్కకార్యంబునుద్దేశించి వచ్చితి నక్కార్య విషయంబునందునీవుసాహాయ్యంబుఁగా

(*)రావణుఁడు మారీచున కతఁడు చేయవలసిన కార్యముఁజెప్పుట. (*)

వింపవలయు నదియెట్లనిన వినుము॥ (చ) అరయసువర్ణ చిత్రితమృగాకృతిఁగైకొనిరామునాశ్రమాం। తరమునసీతసమ్ముఖము,నంజరియింపుచుబెళ్కుచూపుల। న్వరతను కాంతులంజికిలి, వన్నెలఁ జిన్నెల నాత్రిలోకసుం। దరి కతి విస్మయంబును ము, దంబును మోహముఁ బుట్టఁ జేయుమీ॥ (వ) ఇట్లు కాంచన మయ మాయామృగ స్వరూపకుండ వైన నిన్ను విలోకించి యమ్మహీపుత్రిజాతవిస్మయయై శీఘ్రంబునదీనింబట్టితెచ్చియిమ్మనిరామునింబ్రార్థించునతండుప్రియురాలికిఁబ్రియంబొనగూర్చువాఁడైనిన్నుంబట్టవచ్చునప్పుడునీవతనికింజిక్కకనానాప్రకారంబులంజిక్కులువెట్టుచు నుపాయబలంబున దూరంబునకుంబాపికొనిచని రామవాక్యానురూపకంబుగా సీతాలక్ష్మణులంబేర్కొని యెలుంగెత్తి దీనస్వరంబున విలపింపు మవ్వాక్యంబువిని సీతాప్రచోదితుండై లక్ష్మణుండు సౌహృదంబున రామ మార్గానుసారియై యరుగు నంత నేను రామలక్ష్మణరహితంబైన యాశ్రమంబునకుం జనుదెంచి సహస్రాక్షుండు పులోమజంబోలె నొంటిమైవెలుంగుచున్న వైదేహింజేకొని లంకకుం జనియెద నికార్యంబు సఫలంబుఁగావించితివేని నారాజ్యంబులోన నర్ధరాజ్యంబు నీకొసంగెద మద్వచనంబునమ్మి మనోహరంబైన మృగరూపం బంగీకరించి చనుమేనును రథారూఢుండనై నీపిఱుంద దండకారణ్యంబునకుం జనుదెంచెద యుద్ధంబుగాకుండ రామునివంచించి జానకినపహరించి కృతకృత్యుండనై భవత్స

(*)రావణుఁడు మారీచుని బెదరించుట.(*)

మేతంబుగా లంకాపురంబుఁ బ్రవేశించెద నిట్లుసేయవైతివేని నిశాతంబగు కృపాణంబున భవచ్ఛిరంబుఁ దెగవ్రేసెదఁ బ్రాణభయంబువలన బలాత్కారంబుగా నీవె యిక్కార్యంబుఁ గావించెదవు రాజున కనుకూలుండు గానివాఁడు సుఖం బనుభవింపఁ జాలండనియెడు లోక ప్రవాదం బెఱుఁగుదువెకదా యిప్పుడు మృగరూపంబున రామునిడాసితివేని నీకు జీవితహాని లాభంబులు సం



దిగ్ధంబులైయుండు నాతోడ విరోధించితివేని నిక్కంబుగా జీవిత హానియగు దీనినెఱింగి యెయ్యది యుక్తంబు దానిఁగావింపుమని పలికిన నమ్మారీచుండు రాజాహర్హ వాక్యంబు న నాజ్ఞప్తుండై పరుషంబైన ప్రతికూల వాక్యంబునరావణున కిట్లనియె॥ (సీ)దశకంఠ పుత్రమి, త్రకళత్ర సహితుండవైన నీకేకలు, షాత్ముచేత। నుపదిష్టమయ్యె నీ, విపరీతదుష్కర్మ మెవ్వాఁడు నినుఁ జంపనిచ్ఛగించె। సుఖివైన నీచేత,సారది నేపాపాత్ముఁ డభినందితుండు గాఁ, డయ్యెనకట। తోడరి యెవ్వాఁడు మృత్యుద్వారమున కేగు మని పంచెఁ గరముపాయమునఁ జేసి॥ (ఆ,వె)యధిపహీనవీర్యు, లైన నీరిపులు నీ; కంటె నధికుఁడైన, కౌసలేయు। చేత నాఁగఁబడి నశించెదు నినుఁ జూడఁ। దలఁచి రిది మహోద్భుతంబు సువ్వె॥ (తే,గీ)పాకశాసనవైరియే,పగతు లాత్మ। నిమిత్త

(*)మారీచుఁడు రావణునిఁబరుషముగా దూఱుట.(*)

తోపాయమున నీవు, నిధన మొంది। చనుచునుండ విలోకించి, సమ్మదంబు। సెలఁగనపహాస మొనరింపఁ, దలఁచి రకట॥ (తే,గీ) అధిప శాస్త్రవిరుద్ధమార్గానుసారి। వైననిన్ను నివారించు, నట్టి సఖులు। వసుధ నెవ్వారుగలరట్టి, వారినెల్లఁ। బట్టి నిశితాసిచేఁ దల, గొట్టవలదె॥ (తే,గీ)కాపథరతుండు కలుషుండు, కామవృత్తుఁ। డగుమహీపతి నయవినీ, తాత్ములైన। మంత్రసిద్ధుల చేత స, మంచితముగ। నిగ్రహింపంగఁ బడు నిది, నిక్కువంబు॥ (వ)నివర్తనీయుండవైన నీవేలనిగ్రహింపం బడవైతి వదియునుంగాక॥ (తే,గీ)విమలధర్మార్థకామయ, శములు సచివ। వరులు స్వామిప్రసాదంబు, వలన మిగుల। నొందుదురు తద్విపర్యయ, మందు నవియుఁ। జాలఁగ నిరర్థకంబులై, చను సురారి॥ (వ)మఱియు స్వామివైగుణ్యంబునఁ గేవలామాత్యులే వ్యసనంబు నొందుట కాదు సర్వజనంబును వ్యసనంబు నొందు ధర్మంబును జయంబును రాజమూలంబు గావున సర్వావస్థలయందును రాజులు రక్షితవ్యులై యుండురు॥ (క)క్షితి నవినీతుఁడు తీక్ష్ణుఁడు। ప్రతికూలుండైన భూమి, పాలునిచేతం। జతురంతమహీరాజ్యం। బతులితముగఁ బ్రోవ శక్యమై యుండదొగిన్॥ (ఆ,వె)జగతిఁ గ్రూరమంత్రు, లగుమంత్రు లెవ్వరు। పతిభజింతు రట్టి, హితులు విషమ। మందువానితోడ, మందసూతములైన। హయము లట్లచెడుదు, రధిప వింటె॥ (క)ప్రతికూలుఁడు తీక్ష్ణుఁడు దు। ర్మతి యగు భూవిభునిచే

త,మనుజులు నిత్యో। న్నతి వృద్ధి నొందనేరరు । క్షితి మేషము జ.బుకంబు, చేతంబోలెఁ ॥(క) నిరనుగ్రహుఁడవు క్రూరుఁడ । వరయఁగనజితేంద్రియుండ, వగునీవిల నె । వ్వరికిఁ బతి వట్టి రజనీ । చరులందఱుసీకతమున, సమసెదరింకన్ ॥ (వ) రాక్షసేంద్రా యేనొక్కరుండ యాదృచ్ఛికంబైన పాపంబున నశించెదఁ గావున శోచ నీయుండఁగాను నీవు బుద్ధి పూర్వకంబుగాఁ బాపంబుఁజేసి బంధు సహితంబుగా నశింప నున్నవాఁడవు గావుననీవే శోచ నీయుండవు ॥ (క) ననుఁ జంపి పిదప నిన్ను । న్ఘన రణమునఁ జంపు శీఘ్రి, కాలంబునరా మునిచేతఁ జచ్చి యిప్పుడె । యనిమిష కులవైరినేఁగృ, తార్థుఁడ నగుదున్ ॥ (వ)మఱియు రామసందర్శన మాత్రంబున నేను గెడసెదఁ బదంపడి సీత నపహరించిబంధుసహితంబుగా నీవుఁబొలిసెదవు సందియంబులేదు సీత నపహరించి కొని తెచ్చితి వేని నీవును నేనునులంకయు రాక్షసులును లేరింతియు నిక్కంబురాక్షసేంద్రాహిత కాముండనై ననాచేతనివార్యమాణుండవయ్యును మద్వాక్యంబుఁగైకొనవైతివి క్షీణా యువులగునరు లాసన్నమరణులై సుహృత్సు మీరితం బైన హితంబు విన నొల్లరనియిట్లుబహుప్రకారంబులరావణుని దౌరాత్మ్యంబునకుగహీంచిపదంపడిరావణభయంబున దీనుండై యిట్లనియె ॥ (ఉ)అంత కవిక్రముండయిన,యారఘువీరునిడాసిక్రమ్మఱం । బంత మెలర్ప నా కిచటఁ, బ్రాణయుతంబుగ నుండరాదుకా । లాంతకదండతాడితుఁడ,వైన నిను న్మరలింపఁ జాల నిం । కెంతనిచెప్పువాఁడనివు, డేగెద రావణ నీకుఁబ్రీతిగన్ ॥ (వ) నీకు స్వస్తియగుఁ గాక యని పలికిన నమ్మారీచుని వాక్యంబున కలరి రావణుండు వానింగౌఁగిలించు కొని రాక్షసోత్తమా నీచేత మదభి ప్రాయాను సారంబుగా నీదృశం బైన పౌరుష వా

—(*)రావణుఁడు మారీచుసహితుండై రామాశ్రమునకుఁ బోవుట.(*)—

క్యంబు సముదీరితం బయ్యె నిప్పు డెప్పటి మారీచుండ వైతి వింతకుమున్న ధైర్యావలంబనంబున వేఱొక్క రాక్షసుండ వైతివని బహూకరించి వెండియు నిట్లనియె ॥ (చ) అఱమర లేక జీవిత స,ఖానిను నమ్మిన వానికెంతయు । న్గొఱఁతలు గల్గునేయతిమ, నోహరనూతన హేమభూషిత । స్ఫురదురరాసభంబులను, బూన్చిన చారుమణీశతాంగము । న్బరువడినెక్కుమిప్పుడు సముంచితవైఖరిఁ గార్యసిద్ధికిన్॥ (వ) అని ప్రియంబుఁ బలికిదశగ్రీవుండు మారీచసహితంబుగావిమానంబుంబోని కాంచనరథంబెక్కి శీఘ్రింబుననయ్యాశ్రమంబు నిర్గమించి యంత నంతఁబురంబులు జనపదంబులు నానావిధవనంబులును బత్తనంబులును సరిద్గిరిసమూహంబులును విలోకింపుచుం జనిచని దండకారణ్యంబుఁబ్రవేశించి యందు దవ్వుల రామాశ్రిమంబు జూచిఁ యచ్చటనరథంబు డిగ్గి తనకరంబున నమ్మారీచుని కరంబుఁ బట్టుకొని యిట్లనియె ॥ (క)

—మారీచుఁడు సువర్ణచిత్రమృగ రూపమును గైకొనుట.—

కదళీవనశోభితమె । యదిగోరాఘవుని పావ, నాశ్రిమపద మొ । ప్పిదమైయున్నది నీవిఁక । మదిఁ దలఁచిన పనికిఁ జొరుమ,మర్త్య విరోధీ ॥ (క) నావిని మారీచుండా । రావణు వాక్యంబు వినిత్వ,రంబుగ నాశ్చ । ర్యావహముగఁగైకొనియెను । సౌవర్ణ మృగత్వమపుడు, చతురత మెఱయన్ ॥ (వ)మఱియు నిందిరిసిల రత్నాకారశృంగాగ్రంబును సితాసితముఖంబును రక్తపద్మోత్పలముఖపుటంబును సింద్రినీలోత్పలశ్రవణంబును మధూకపుష్ప సదృశ పార్శ్వద్వయంబును గించిదభ్యున్నత గ్రీవంబును గుందేందు వజ్రసంకాశ పరమభాస్వరతలోదరంబును బద్మకింజల్క సన్నిభంబును వైడూర్యసంకాశఖురంబును దనుజంఘుంబును శ్లిష్టసంధిబంధంబును నింద్రాయుధ సవర్ణపుచ్ఛంబును మనోహర స్నిగ్ధవర్ణనంబును నానారత్న సమావృతంబును మనోహరంబును దర్శనీయంబును నానా ధాతు విచిత్రంబును రౌప్యబిందుశత చిత్రంబును బ్రియదర్శనంబును రాజీవాచిత పృష్ఠంబును బరమ శోభనంబునగుమగ్ధ్రరూపం బంగీకరించి నిజదేహ ప్రభాజాలంబుల నక్కాననంబు వెలింగించుచు వనం బెల్లఁగలయం దిరుగుచు శాద్వలంబులం గ్రీడింపుచువిటపికిసలయంబులు మెసవుచు మనోజ్ఞ గంధ పుష్పంబులు మూర్కొనుచుఁ గుంజగృహంబులఁదూఱుచు సీతాసందర్శనంబు కాంక్షించికదళీషండంబుసొచ్చి మంద గమనంబునఁ గణికారంబుల నాశ్రియింపుచు మెల్లన రామాశ్రమంబుడగ్గిరి ॥ (సీ) ఒకమాటువనమృగ,యూథంబుతోఁగూడి క్రీడించునొకమాటు క్రేళ్లుదాఁటు । నొకమాటుతృణఖాద,నోద్యోగమొనరించు వదలకనొకమాటు బెదరిచూచు । నొకమాటుమెఱయు వి,ద్యుద్వల్లికైవడిఁ జరియించు నొకమాటు,శాద్వలముల । నొకమాటులఘుగతి,నుద్వేగియై పాఱునురువడి నొకమాటుతిరిగివచ్చు ॥ (ఆ,వె) వింతచెలువుఁదాల్చి విహరించునొకమాటు । గంతులి

డుచుఁ జెక్కు గతులనిట్లు। కఠినరాక్షసుండు కపటమృగాకృతి। నలరె రాఘ
వాశ్రమాంతికమున॥ (ఉ) దానిమనోజ్ఞరూపము ముదంబునఁ గన్గొని వన్య
సత్త్వము। ల్గానుగ వెంటనంటి పలుమాఱు చరింపుచు సారెసారెకుం। బూ
నిక నెయ్యమేర్పడఁగ మూఁపటుమూర్కొని వింతజాతియా। కానమెకంబఁ
టంచుఁ బలు కంపమునం బఱుగెత్తు నత్తఱిన్॥(ఉ) ఏడదియీమృగంబు మృ
గహింస యొనర్చెడు నంచుఁ గ్రుద్ధుఁడై। వాఁడిశరంబునం దునిమి, వైచు
ను రాసువుఁడంచు భీతిచేఁ। దోడి మెకంబులం జనువు,దోఁపఁగ మూర్కొ
ని వీడుఁగానిదా। రూఢి వధింపఁ డయ్యె మృగరూపధరుండగు దైత్యుఁడయ్యె

(*)సీత మాయామృగమును జూచి యచ్చెరువొందుట.(*)

డన్ (వ) ఇట్లనేక ప్రకారంబుల సీతాప్రలోభనార్థంబు విచిత్రమండలంబులు
సేయుచు రామాశ్రమపదాభ్యాశంబున నతిరమణీయంబుగా విహరించుచున్న స
మయంబున॥ (సీ) శుభనేత్రయగుసీత, సుమసంగ్రహవ్యగ్రయై శాలముం గలి,క
ళుగు దెంచి। కర్ణికారాశోక, కాంచన చూతప్రసూనము లోఁ-యుచు,సొం
పుమీఱ। ముక్తావిచిత్రాంగ, మును హైమ రాజత వర్ణపార్శ్వంబులు, స్వర్ణ
కాంతి। రుచిరవాలంబును రూప్యధాతునిభ తనూరుహంబులు గలిగి నిజాగ్రభాగ॥
(ఆ,వె) మందదృష్టపూర్వ, మైయొప్పుచున్నమా। యామృగంబుఁజూచి యధి
కవిస్మ। యంబు వొడమ దాని, యతి రమణీయాంగ। శోభకలరి మఱియుఁ
జూచునపుడు॥ (క) ఆకపటమృగముచిత్రతఁ। గైకొనివైదేహిఁజూచి క్రమ్మఱ
వనమ। స్తోకగతి న్వలిఁగింపుచుఁ। బ్రాకటముగ సంచరించె భ్రమజని
యింపన్॥ (ఉ) దానిమనోహరాకృతియు, దానియపూర్వవిచిత్రకాంతియున్।
దానిగతిప్రమాణమును, దానిసమగ్రవిహారదాక్ష్యము। న్దాని విలోచనద్యుతిఘ
నంబుగఁ జూచిన యంతసీతకుం। బూనికఁ దత్పరిగ్రహణ బుద్ధిజనించెను దైవి
కంబుగన్॥ (వ) ఇట్లు క్రీడార్థంబు మాయామృగ గ్రహణ కుతూహలయై
మృష్టకాంచన వర్ణాంగియగు జానకి రామలక్ష్మణులం జీరిన వారచ్చోటికిం

(*)లక్ష్మణుఁడుస్వర్ణమృగము రాక్షసమాయ యని రామునికిఁజెప్పుట, (*)

జనుదెంచి పరమదర్శనీయంబైయున్న యప్పొఁడిమెకంబవలోకించి రప్పుడు
లక్ష్మణుండు దాని విచిత్రరూపంబునకు శంకించి రామునకిట్లనియె॥ (ఉ) అ
చ్చుగఁ దాటకేయుఁడు మృగాకృతిఁగైకొనివక్రబుద్ధినంబుగా। నిచ్చటఁ బూర్వ



వైరమున, నెగ్గొనరింపఁగఁ బూని యొంటిమై। వచ్చినవాఁడు గానలయు వా
సవసన్నిభ యట్లుగాని చో। నెచ్చటనైనఁ జూచితిమె యిట్టివిచిత్రమృగంబు నుర్వ
రన్॥ (క) ఆయథముఁ డిట్లుకపటో। పాయంబున వేఁటవెంట వచ్చిననృపు
లం। బాయక వధించి మెసవుచు నాయిల్వలుఁ బోలి యుండు ననఘాత్మా యి
టన్॥ (క) మదిసందేహముఁ గొనవల। దిదిమాయామృగము గాని యిన
కులకలశాం। బుధిసోమ రామ నిక్కము। సదమలవనమృగము గాదు చర్చింపం
గన్॥ (వ) దేవా యిట్టి రత్నవిచిత్రంబైన మృగంబు జగంబుల నెందునుం గా
నము మాయావి యగు మారీచునిచేతఁ బ్రకాశసంపన్నంబుగా రమ్యాభవనా
కార విశేషంబుగాఁ గల్పింపంబడిన మాయామృగరూపంబిది యనిపలికిననప్పు
డు శుచిస్మితయగు సీత లక్ష్మణునివారించి చమత్కృతచేతనయై నిజభర్తకి
ట్లనియె॥ (ఉ) జీవితనాథ యీ కనక, చిత్రమృగంబు మనోజ్ఞకాంతి నిం। పావ
హిలంగ నాదు హృదయంబు హరింపుచునున్న దెంతయున్। దీవరదీనిఁ బట్టికొ
ని తెమ్ము రయంబునఁ గేళికార్థ మిచ్ఛా విధి దీనిఁగూడి సరసంబుగ నిత్యం

(*)సీత మాయామృగమును బట్టితనకిమ్మని రామునిఁ బ్రార్థించుట.(*)

ముఁ బ్రొద్దుఁబుచ్చెదన్॥ (వ) మఱియు నీయాశ్రమపదంబునందు రూపశ్రేష్ఠం
బులైన సృమరచమరభల్లూక పృషతవానర కిన్నరప్రముఖ నానావిధమృగం
బులు మనోహరంబులై పుణ్యదర్శనంబులై గుంపులుగట్టి నిత్యంబును విహరిం
పుచుండు నింతకు మున్నిట్టి విచిత్ర మృగంబు నాచేత దృష్టపూర్వంబుగా దిది
నానా వర్ణ విచిత్రాంగంబై రత్నబిందుసమంచితంబై చంద్రుండునుం బోలె
నివ్వనంబును బ్రకాశింపం జేయుచున్నది దీనిరమణీయరూపంబును విచిత్రకాంతి
యు స్వరసంపన్నతయు విలోకించి నాచిత్తంబు సమ్మదాయత్తంబైయు
న్నది గావున॥ (సీ) ప్రాణేశ యీసువర్ణ మృగంబు నిప్పుడు ప్రాణంబుతోఁ
గూడఁ, బట్టితెండు। గారవంబునఁ బెంచి గరువంపు మాటల మచ్చికఁ గా
వించి, మెఱుఁగులు గొల్పి। సంతతంబును గ్రీడ, సల్పెద నదిగాక విపినవాసముఁ
దీర్చి వీటకరిగి। నప్పుడు మనకు శుద్ధాంత విభూషార్థ మయ్యెడి భరతు
న, కత్తలకును॥ (తే,గీ) వింతఁబుట్టించు నట్లుగా వింపుమీకు। నలవి గాదేని
శరహతి, నడఁచి దాని। చర్మమైనను గొనితెండు సరగనాకు। వరమృగా
జిన మయ్యెడిఁ, బరమపురుష॥ (వ) మఱియుఁ జాంబూనదమయంబైన దీనిరుచి

ర చర్మంబు బాల తృణకల్పిత తాపసాసనంబునందుఁ బ్రసారితంబగుచుండఁ
దత్సమీపంబున భవత్సహితంబుగాఁ గూర్చుండఁ గోరెదస్వప్రయోజనార్థం
బు భర్తను బలాత్కారంబున నియోగించుటది క్రూరంబు యువతుల కస
దృశంబని యెఱింగియున్నదాననైనను దీనిశరీరశోభా సౌష్ఠవంబుచేతమనంబు
నకు విస్మయంబు సంజాతం బయ్యెఁ బ్రియురాలనగునన్ను దయార్ద్రదృష్టిన
వలోకించి మీకును బ్రియంబు గలదేని యెల్లభంగుల దీనిం బట్టితెండని ప్రా
ర్థించిన సీతావచనంబుల కలరి రాముండు కాంచనరోమంబులును మణిప్రవ
రశృంగంబులును దరుణాదిత్య వర్ణంబును నక్షత్రసదృశ కాంతియుంగలిగియ
ద్భుత దర్శనంబై యొప్పుచున్న యప్పసిండి మెకంబు నవలోకించి దాని య
దృష్టపూర్వ రామణీయకంబున కిచ్చ మెచ్చుచు జానకీప్రచోదితుండై లక్ష్మణు

—(*)రాముఁడు లక్ష్మణునికి మాయామృగము నభివర్ణించి చెప్పుట.(*)—

నకిట్లనియె ॥ (ఉ) తమ్ముఁడకంటె యీమృగము తద్దయుఁ దప్తసువర్ణ కాం
తినం। దమ్మగుచున్నదెంతయునునందనచైత్రరథంబులందు యుక్తమ్ముగ సం।
చరించెడు మృ, గంబులలోపల నిట్టి చిత్రస । త్వమ్మదిలేద నంగ నిఁక, ధారు
ణి నున్న దనంగ వచ్చునే ॥ (వ)మఱియు నిది రూపశ్రేష్ఠ త్వంబున సామా
న్యమృగంబు గాదని తలంచెద ॥ (ఆ,వె)జాతరూప బిందు, శత సమాకీర్ణ
మై । చుట్టుఁ దిరిగి పరమ, సుందరముగఁ । దీర్చి కూర్చినట్లు, దీపించుచు
న్నది । రాజపుత్ర రోమ, రాజికంటె ॥ (క)అనలుని శిఖతో నెనయై । ఘన
మువలన నిర్గమించి, క్రాలెడు సౌదా । మినిభంగి దీని నాలుక । గననయ్యె
డిఁగంటివేము, ఖవినిర్గతయై ॥ (క)మఱియు మసార వినిర్మిత । సురుచి
ర గల్లర్క రూప, సుందరముఖమై । వరశంఖ మౌక్తికనిభో । దరమై యొప్పె
డు మృగంబు,తమ్ముఁడ కంటే ॥ (తే,గీ)పద్మకింజల్క వర్ణంబుఁ,బరమభాస్వ।
రంబు శక్రాయుధాభవు, చ్ఛంబు గలిగి । వఱలు నీమృగరాజ మె, వ్వానిమ
నము । నుష్ణకరవంశ హరియింప, కుండుఁ జెపుమ ॥ (క)నవరత్న మయము
రమ్యము । సువర్ణసంకాశమధిక, సుందర మగునీ । దవమృగముఁగాంచిమ
నమున । భువి నెవ్వఁడు విస్మయంబుఁ, బొందకయుండుఁ ॥ (తే,గీ)కాంచనవి
చిత్రమైనయీ, ఘనమృగంబు । విపులఁబురుష మానసమైన నపహరించు । న
బల కాంతయు ముగ్ధయు, నైన సీత । చిత్తమపహరించె ననుటఁ, జెప్పనేల ॥



(క)వేఁటలకుఁ బోయి నృపతులు । మాటికి సంక్రీడకొఱకు, మాంసము కొఱ
కుం । బాటించి వనమృగంబుల । దాఁటించి వధింతు రధిక, ధర్మంబగుటన్ ॥
(వ)వత్స యిట్టి విచిత్ర వస్తులాభంబు కొఱకు వేఁట కరుగుట కేమియరిది కే
వల మృగహనన మాత్రంబె కాదు మఱియు వజ్రాదిమణి సువర్ణ రజతా
ద్యాకార ధాత్వాధార పర్వత ప్రదేశంబులును హస్తిమస్తక ముక్తాప్రభృతిధ
నంబులును మహావనంబునందు మృగయోద్యోగంబున రాజులచేతనన్వేషింపఁ
బడుఁ గావున శాస్త్రవిరోధోపాయంబున నుపార్జితంబైనధనంబు మనుష్య
మనస్సంకల్పిత ధనం బంతయు శక్రుని కోశగృహంబుఁ బూరింపంజేసిననైనడి
మహీపతుల కోశగృహంబుఁ బూరంపఁజేయు నపూర్వవస్తుకాముండైన పురు
షుండు విచారింపక యేయేయర్థ సాధనోద్యోగంబునంబ్రవర్తించు నదియె
యర్థంబని యర్థసాధన చతురులగు నీతిశాస్త్రజ్ఞులు పలుకుదు రీమృగం
బట్టిదేయని పలికి వెండియు నిట్లనియె ॥ (క) ఈమృగరత్న పరార్థ్యమ । శ్రీమ
హితసువర్ణ మయవిచిత్రాజినమం। దీమగువ మత్సమేతము । గాముదమున
నధివసింపఁ, గాంక్షించెమదిన్ (తే,గీ) పార్థివాత్మజ వినుమృదు స్పర్శన
మున । నావికియుఁ గాదళియును బ్రి, యకియు మఱిప్ర । వేణియును నీ
మెకమునకు వేయి గతుల । నీడు సేయంగ రాదని యేఁదలంతు॥ (తే,గీ) ఇన
కులోత్తమ వినునీమహీమృగంబు । రమణ నభముననొప్పుతా రామృగంబు।
మొనసిశశిలోనిమృగమునీ మూఁడుమృగము । లరయ దేవతా యోగ్యంబుల
నితలంతు॥ (ఉ) తమ్ముఁడనీవుచెప్పినవి థంబుననీ మెకముగ్రదైత్యకృ । త్యమ్మ
గునేనినాకునటులైననుమిక్కిలిలెస్సయట్లుకా । నిమ్మునీంద్ర కోటికివ నింబ
నుబాధలుసేయుచోటవ । ధ్యమ్మగుఁగాదెచూడహృద యంబున నింత విచార
మేటికిన్॥ (శా) ప్రాచుర్యంబుననిమ్మహాటవిమహాపాపాత్ముఁడై చేరిమా। రీచుం
డుకుక్కనఁ జెక్కసంయములధా త్రీనాథులన్ప్భరిమా । యాచాతుర్యముమీఱఁ
జంపెవడిన య్యాదిత్యశత్రున్నరున్ । నీచున్గీటడఁగించియీవిపినమున్నిర్దోష
ముంజేసెదన్॥ (సీ) అనఘాత్మ యీవనంబున మున్ను వాతాపి యనుదైత్యుఁ
డొకఁడుమా యావిదుండు । తొడరిమేషాకృతితోనుదరస్థుఁడై తగస్వగర్భంబ
శ్వతరినిఁబోలి । మునులవధింపుచుమునుకొనిపెద్దకా లంబుననొకనాఁడులావు॥
మెనిఱసి । చతురాస్యనిభునగ స్త్యమహామునీంద్రుని పాలికిఁజనియ త్తపస్విపరున

(తే,గీ) కరయథష్యమై గ్రాద్ధాంత మందుఁబూర్వ । రీతినిజరూపమంగీకరింపఁ దలఁచు । నతనినీక్షించినగియమ్మహానుభావు। డినసమద్యుతివానికి నిట్లులనియె॥ (తే,గీ) భానుతేజులఁబెక్కండ్రఁబరమమునుల । నఘవిదూరుల భక్షించినట్టిఖలుఁడ । నస్మదీయమహాజఠరాగ్నిశిఖల । దగ్ధమైపోతివేడవాతాపియింక॥ (వ) అని పలికెఁగావున నిద్దురాత్ముండగు మారీచుండు వాతాపి పగిదిఁ బంచత్వంబునొందని నాఁడు ధర్మనిత్యుండనైన నన్నెవ్వాఁడు బహూకరించుఁ గుంభసంభవుండు వాతాపిఁ జంపినచందంబున నేనిమ్మారీచుని వధించెదనిదినిక్కంబుగా మృగంబేని వైదేహికిం బ్రియంబగునట్లుగాఁ బట్టి తెచ్చెద నట్లుగాక కపటమృగంబేని తపోధనులకుఁ బ్రియంబుగావధించెద నిక్కార్యంబు రెంటన ధికోదయంబైయుండు మనయత్నంబంతయు నీవైదేహీసంరక్షణార్థంబు కావున నావచ్చునందాఁక నీవు ధనుఃకవచాది సన్నాహయుక్తుండవై సమర్థుండును మహాబలుండును బుద్ధిమంతుండునగు జటాయువు తోడంగూడి ప్రతిక్షణంబు సర్వదిగ్వర్తి రాక్షసులవలనశంకితుండవై యప్రమత్తుండవై వైదేహి రక్షింపుచుండుము పరార్ధ్యచర్మోపలక్షితంబైన యిది రాక్షస మాయాకల్పిత మృగంబుగాని నిక్కంబుగా వనమృగంబు గాదైనను మృగచర్మగతస్పృహయైన సీత నవలోకించి తన్మనఃప్రియార్థంబేను మహాధనుర్ధరుండనై మృగంబువెంట నరిగియుపాయంబున వంచించిపట్టి తెచ్చెదకాదేనిశితవిశిఖంబున దీనిం దెగటార్చి విచిత్రంబైన దీని చర్మంబుఁ గొని రయంబునం బఱతెంచెదనని సౌమిత్రి నొడంబఱిచి రాముండు తత్క్షణంబ జాంబూనదమయత్సరుయుక్తంబైన ఖడ్గంబును ద్ర్యవనతంబైన చాపంబును వజ్రమయంబైన కంక

(*) రాముఁడు మాయామృగమును బట్టుటకుఁగా దాని వెంబడించుట. (*)

టంబును నక్షయబాణ తూణీరంబులును సముచితంబుగా ధరించి వైదేహికిఁ బ్రియంబు సంపాదించుటకు నమిత విక్రమంబున నరిగెనిట్లు తన్నుఁ బట్టవచ్చు రామునింజూచి యప్పైడిమెకంబు॥ (ఉ) గంతులు వేయుచుం జిఱుతకాల్వలు చెంగునఁ జౌకళింపుచు । నంతులు సేయుచుం దరులఁ, బాఁకుచుఁ గుంజములందుఁ దూఱుచుం । బంతముమీఱఁ గన్మొఱఁగి పల్వములన్వెస డాఁగుచు న్వనా । భ్యంతర సీమనిట్లి కు నలాగ్రణి జిక్కులఁ బెట్టె నెంతయున్ ॥ (సీ) ఒక మాటు వనమృగ, యూథంబుతోఁ గూడి గురుతు గన్పడకుండఁ



గొంతసేపు । ఒకమాటు విడివడివెయొక్కటఁ జూడ్కికి గోచరింప నేగుఁగొంతసేపు । ఒకమాటు లఘు గతి వ్యోమమార్గము నంటి వింతగాఁ జూపట్టుఁ గొంతసేపు। ఒకమాటుమృదుశాద్వలోపరిస్థలములఁ గ్రొత్తగడ్డియు మేయుఁగొంతసేపు ॥ (తే,గీ) గొప్పతిప్పల పై కేగుఁ, గొంతసేపు । కుఱుచవాఁకలలోఁ బాఱుఁ, గొంతసేపు । గహనమున నిట్లుమాయామృగంబు సేపుర్ । మీఱదూరంబుగొని యేగె, మిహిరకులుని ॥ (సీ) కడుదూర మేగెనే, కడఁ బట్టరాదని మానినచోఁ బ్రోలఁ, గాన వచ్చు । మిగుల డగ్గరియేఁ బట్టఁగ వచ్చుననిడాయ జవమున దూరదే, శమునఁ దోఁచుఁ । బొదలమాటునఁ బొంచి, పొంచిపట్టఁగఁ బోవ నటు చూపి యిటు చూపి, యవలి కేగు । వలపలిదెసఁ దోఁచు, నెలమిఁ

(* రాముఁడు మాయామృగంబుపైఁ దీక్ష్ణమగు బాణముఁ బ్రయోగించుట. *)

బట్టఁగఁ బోవునంతలో డాపలి, చెంత నుండు ॥ (తే,గీ) నిట్లు చిక్కక కుఁ గ్రమ్మ, మృగము పెక్కు । గతుల నలయింప విసివి రా, ఘవుఁడు కోప । మడర మాయామృగంబని, యపుడు తెలిసి । తెంపుసొంపార దాని వధింపఁదలఁచి॥ (చ) అనుపమశక్రచాపనిభ,మైన మహోగ్రశరాసనంబున । న్ననిశితమైరవిద్యుతిఁ, జోడయి వహ్నిశిఖాసమానమై । ఘనతరదీప్తమై నళిన, గర్భ వినిర్మితమైన బాణముం । బలిమిడి కూర్చి యమ్మెకము, పై నిగుడించె నమోఘవైఖరిన్॥ (వ) ఇట్లనన్యసాధనంబైనయద్దివ్యసాధనంబు రామునివింటివలననిర్గమించి భర్గనేత్రాగ్నియుం బోలె మండుచుఁ దత్క్షణంబ పఱతెంచిమృగరూపధరుండైనమారీచుని శరీరంబుభేదించిన శరాతురుండై యన్నీచుండు తాలప్రమాణంబు మింటికెగసి నిబిడంబుగా భైరవారావంబు సేయుచు నల్పజీవితుండై ధరణిం బడి యమ్మాయారూపంబు విడిచి నిజరూపం బంగీకరించి రావణుని వాక్యంబుఁ దలంచి వైదేహి లక్ష్మణు నేయుపాయంబున నిచ్చటికిఁబంపు జానకి నేయుపాయంబున రావణుం డపహరించునని చింతించి రామవాక్యానురూపంబగునెలుంగున॥

—(*) మారీచుఁడు రామస్వరాను రూపముగా నఱచుట. (*)—

(శా) ప్రాంచద్వైఖరి దైన్యనాద మడర, న్హాసీత హాలక్ష్మణా । యంచుం బేర్కొని యంత శాతశరబా, ధాకల్పిత ప్రాణుఁడై । సంచారంబులు మాని మేననసువుల్ బంధింపఁగా లేకవే । పంచత్వంబును బొందె నప్పుడె నిలిం, పద్వేషి వీతస్పృహన్ ॥ (వ) ఇట్లు మారీచుండు గూలిన యనంతరంబ ॥ (మ) అనిమే

పారి మదీయకస్వరముతో, హాసీత హాలక్ష్మణా । యని వాపోవుచుఁ బ్రాణము
ల్విడిచెన, యార్తధ్వని విన్నచో । జనకక్ష్మాపతి పుత్రి యెంత డలునో, సౌమి
త్రితా నిప్పుడే । మని చింతించునోయంచు రాఘవుఁడు త్రా, సాయత్తచేతస్కుఁ
డై ॥ (వ)లక్ష్మణుం డాడిన తెఱంగంతయు నిజం బయ్యెనని తలంచి యచ్చట
నిలువనొల్లక తత్క్షణంబ వేఱొక్క మృగంబునుం జంపి దాని మాంసంబుగొని శీ
ఘ్రంబున జనస్థాన మధ్యవర్తి నిజాశ్రమంబున కభిముఖుండై వచ్చుచుండె నం
త నిక్కడ వైదేహి రామవాక్యానురూపకంబైన దీనస్వరంబు విని లక్ష్మణునకి
ట్లనియె ॥ (మ)వినవం బొక్కటి పిక్కటిల్లె దిశల, న్దీనస్వరోపేతమై । వినఁగా
నయ్యెడు విం కైకాన మెకము, న్విధ్వస్తముం జేయఁగాఁ । జనియె న్ఘోరము
కాననాంతరమున, న్సౌమిత్రి మీయన్న య । య్యనఘుం, గావఁగ నేగు మీవిపు
డెసా, హార్దంబు సంధిల్లఁగన్ ॥ (మ)కిరిమధ్యంబుననున్న గోవృషము మాడ్కి,

—(*)సీతా లక్ష్మణునితో రాముని రక్షింపఁ బొమ్మని చెప్పుట.(*)—

న్రాఘవుం డాత్మలో । నరయం గ్రూరనిశాచరాంతరగతుం, డైచిక్కెఁగాఁబో
లుసాం । పతి నాచిత్తముభూరిసాధ్వసయుతం బైయున్న దీవేగిచె । చ్చెర న
న్నుం గరుణించి రామవిభునిం, జేపట్టి రక్షింపుమా ॥ (చ)అన విని లక్ష్మణుం
డుహృదయంబున రాముని యుగ్రశౌసనం । బును దలపోసి యచ్చటికిఁ, బోవ
కయుండినఁ జూచి నెమ్మనం । బున జనియించినట్టి వగ, మోమునఁగన్పడ భూరి
దారుణా । శనిసదృశోక్తి నిట్లనియె, జానకి దైవనియుక్తబుద్ధియై ॥ (క) మి
త్రాకృతిచే నన్నకు । శత్రుఁడవై తీవు దుఃఖసమయంబున సౌ । భ్రాత్రము నె
ఱపని కతనను । మిత్రాసుత యిట్టి సేఁత, మేలగు నయ్యా ॥ (వ)మఱియు నీ
వు మత్కృతంబునందు లోభంబువలన భ్రాతృగతుణాయత్తచిత్తుండవుగాకుండు
టం జేసి తన్నాశంబుఁ గోరుచున్నవాఁడ వని యూహించెద నీకు నిక్కంబుగా
రామునియందు సౌహార్దంబు లేదు తద్వ్యసనంబు నీకుఁ బ్రియంబై యున్న
దక్కారణంబున మహాద్యుతి యగు నమ్మహాత్ముని విలోకింపక విస్రబ్ధుండవైయు
న్నవాఁడ వెవ్వండు నీకుఁ బ్రధానంబయ్యెనట్టిరాముండు ప్రాణసంశయంబునొం
దుచుండ నిచ్చట మద్రక్షణంబునందుఁ బ్రయోజనంబు లేదు రామరహితనైయే
నొక్కనిమిషమాత్రంబైన జీవింపఁ జాల నని కన్నీరు నించుచు మృగాంగనచం



(*)లక్ష్మణుఁడు సీత నూఱడించుట(*)

దంబునఁ ద్రస్తచిత్తయై పలుకుచున్న వైదేహి వాక్యంబులకుఁ గటకటం బడి
లక్ష్మణుం డిట్లనియె ॥ (క)ఉల్లమున నేల వగచెదు । తల్లీనీవిభుఁడు దేవ, దాన
వరక్షో । వల్లభులచేత నైనను । దెల్లముదాఁ జిక్కువడఁడు, ధీరుండెందున్ ॥
(సీ)గరుడగంధర్వ కిం, పురుషకిన్నరసిద్ధచారణయక్షురా, క్షసులయందు । రా
మునిఁ బోడరు విక్రమశాలి లేఁడు త్రిలోకపూజ్యుఁడు శూర, లోకనుతుఁడు ।
సురరణంబులనవ, ధ్యుఁడు మహాబలవీర్యుఁ డమ్మహాత్మునకొక, హాని గలదె । య
డల నేటికిఁ జింత, విడువుము మృగమును వధియించి యిప్పుడె, వచ్చు రామ ॥
(ఆ,వె)విభుఁడు లేని చోట, విపినమధ్యంబున । నొంటి నిన్ను విడిచి, యోజలే
క । పోవ నగునె నాకుఁ, బుణ్యచారిత్రిణి । మనుజవిభుఁడు గన్న, మాటరాదె॥
(వ)మఱియు నిది గంధర్వనగరసదృశంబైన రాక్షసుని మాయ గాని రాముని
కంఠస్వరంబు గాదు మహాత్ముండగు రాముండు భవద్రక్షణంబు నందు నన్ను ని
యోగించి చనియెఁ గావున నాకు నిన్నిచ్చట నొంటి విడిచి పోవుటయుక్తంబు
గాదదియునుంగాక ఖరాసురు వధించిన నాఁటనుండి జనస్థానపదంబు నుద్దే
శించి మాయావులగు రాక్షసులు మనయందు విరోధించి హింసావిహారులై
యిమ్మహావనంబునఁ బరవ్యామోహజనకంబులైన వాక్యంబు లుచ్చరింపుచు
న్నవారు నీవు సందియంబువదలి రామునియనివార్యశౌర్యంబెఱింగి నెమ్మది
నుండుమని యివ్విధంబున రాక్షసబాధలు తలంచి మహీపుత్రి నొంటివి
డిచి పోవంజాలకకృతాంజలిపుటుండై సత్యవాక్యంబులం బ్రార్థింపుచున్న
లక్ష్మణుని వచనంబులు వినియద్దేవి కోపసంరక్తలోచనయై పరుషవాక్యంబు
లనిట్లనియె ॥ (క) కులపాంసన వినయేతర । కలుషాత్మక శఠయకార్యకర

(*)సీత లక్ష్మణుని నానావిధంబుల దూఱుట.(*)

ణోద్యుక్తా । యలరాముని వ్యసనమునీ । కెలమింగడుఁ బ్రియమటంచు, నెం
చెదబుద్ధిన్ ॥ (క) రాముని వ్యసనము ప్రియమగు । టేమియుఁ జిత్రంబుగాదు
హితశత్రుత్వం । బీమాడ్కిఁ దగ సపత్నుల । కీమహిఁ గల్గుటనిసర్గ మేగద
తలఁపన్ ॥ (తే,గీ) జగతి నీయట్టి ప్రచ్ఛన్న చారులతిన్న । శంసులెవ్వారు గల
రట్టిశఠులయందుఁ । గూర్పఁదగదు విశ్వాసంబు గూర్చెనేని । వాని కెంత
యుఁ గీడుచే, వచ్చు నిజము ॥ (ఉ) దోసమటంచు నించుకయుఁ । దోఁచక

రాఘవుఁ డొంటినేగిదు । ష్టాసురకోటిచేత విపినాంతరసీమను జిక్కిదీనత ।
న్బాసటగాఁగ నిన్ను పలుమాఱటు చీరినఁబోవవయ్యయో । నీసరిగాఢశత్రుఁ
డన, నింగలఁడే నృపవంశపాంసనా ॥ (చ) అనయముఁ బూని భ్రాతకెటు,
లైననపాయము గల్గఁజేసిత । ఘనతరరాజ్యముం ధనము గైకొని నన్నుఁ బరిగ్ర
హింపఁగా । మనమున నిశ్చయించితివి మానవిహీన దురంతపాతకం । బునఁబడు
టంతెగాక యిదిపోలునె చేకుఱునే కులాధమా । (మ) ఇనవంశోత్తమునంబుజాతు
నిభనీలోత్పలేందీవరశ్యాము నత్యనఘు నార్యునిఁ బాసి కోరుదునె దుష్టాచారు వేఱొ
క్కని । న్ననుఁ డా రాముఁడు లేనిచో నిమిషమైనన్ధాత్రిఁ జీవింపనే । తుఱనె నీవిప్పు
డుజూచుచుండఁగఁ । ద్యజింతు, న్వేగఁ బ్రాణంబులన్ ॥ (వ) అని యిట్లు కర్ణ
కఠోరంబుగాఁ బలికిన సీతం జూచి జితేంద్రియుండగు లక్ష్మణుండు కృతాంజలి
పుటుండై యిట్లనియె ॥ (ఉ) తల్లిరొ బిడ్డవంటి నను దారుణభంగి దురుక్తు
లాడఁగాఁ । జెల్లునె నీచునిం బలెఁ బ్రసిద్ధనయప్రతిబద్ధమైన నా । యుల్లము రా
ముఁడే యెఱుఁగు, నుగ్రవనంబున నొంటినుంచిపో । నొల్లక యుంటిఁ గాని మ

(*) లక్ష్మణుండు సీత మాటలకుఁ గటకటఁ బడుట. (*)

ఁడి, నొండు తెఱంగుఁ దలంచువాఁడనే ॥ (ఉ) ఈగతిఁ బాపముల్పలుక, నేమ
ని యుత్తర మిచ్చువాఁడ నా । రీగుణము ల్ధరిత్రి విపరీతము లౌట యథార్థ
మయ్యెనిం । తేగద నాదు చిత్తవిధ, మెల్లను దైవమెఱుంగు నిప్పుడే । నేగితినే
ని నిక్కము మహీసుత యాపద వచ్చు నీకిటన్ ॥ (ఉ) సత్యము సర్వదేవత
లు సాక్షిగఁ బాపము లేదు నా యెడ । న్నిత్యయశు న్రఘూత్తముని, నిక్కము
తండ్రిని నిన్నుఁ దల్లిగాఁ । బ్రత్యహముం దలంపుచుఁ దిరంబుగ భక్తి యొనర్చు
చున్నచో । భృత్యుఁడటంచుఁ జూడక మహీసుత పాపము లాడఁ జెల్లునే ॥ (వ)
దేవీ యనర్హవాక్యంబులు పలుకుటయు సతులకుఁ జిత్రంబుగాదు స్వభావం
బై యుండుఁ జాపల్యంబును గ్రౌర్యంబును ధర్మహైన్యంబును బరస్పర స్నే
హకార్య విచ్ఛేదకరణంబును వారల గుణంబు లట్లగుటం జేసి నీవలన నిట్టి
క్రూర వాక్యంబు పుట్టె నిది సహింపంజాల నివ్వాక్యంబులు శ్రవణంబునకుఁ దీప్త
నారాచసన్నిభంబులై యున్నవి సత్యవాదినైన నన్ను నీవు పరుసంబు లాడినతె
ఱం గంతయు నిచ్చటి వనదేవతలందఱు సాక్షిభూతలై వినుచున్నవారు గురువా
క్యవ్యవస్థితుండనైన నన్ను విచారింపక యిట్టినిష్ఠురోక్తులు శంకించి పలికితి గా



వున స్త్రీత్వంబు స్వభావంబున దృష్టంబయ్యె నిన్నే మనిగర్హించినం దీఱు ని
ప్పుడ నశింపుమని కోపంబు పెంపున నంబలికి వెండియు రాముని సంస్మరించియ దే
వికి మంగళంబొసంగువాఁడై యిట్లనియె ॥ (ఉ) పోవకయున్న చోశపని, బో
లెనను న్నిరసించె దారుణవై । పోవఁగఁ జూచినన్ రఘుపతిభుం డలుకం గృపవ
ప్పు రెంటనా । కానహిలుందిరస్కరణమైనను నీవచనంబమోఘమా । గావు
న నీకు స్వస్తి యగుఁ, గాక రయంబునఁ బోయివచ్చెదన్ ॥ (వ) దేవీ నిన్ను వనదే
వతలు బహుప్రయత్నంబుల నేమఱక రక్షింపుదురుగాక ఘోరంబులగు నిమి
త్తంబులు దోఁచుచున్నవి గావున నేను రామసహితంబుగాఁ జనుదెంచి క్రమ్మఱని
న్ను విలోకింతునో విలోకింపనో యెఱుంగఁ బరిశుద్ధంబగు మనంబున మారాక
ప్రతీక్షింపుచునుండుమని పలికిన లక్ష్మణుని వచనంబులు విని యమ్మహీ పుత్రి శోక
బాష్పపరిప్లుతయై తీవ్రంబగు వాక్యంబున నిట్లనియె ॥ (సీ) భావజసన్నిభుఁ, బ
రమదయానిధిఁ, గౌసలేయు నిరాముఁ, గానకున్న । మానక గోదావరీనదిఁ బడియైన
న క్షోణిధ్రమునను౦డి, గూలియైన । నుడుగక పెనుఁద్రాట, నురిగొనియైనను వా
లాయము విషంబుఁ గ్రోలియైనఁ । గర మర్థిఁ జిచ్చులో, నుఱికియైనను మేను వి
డుతుఁ గాక మహాత్ము, విభునిఁ బాసి ॥ (తే.గీ) యన్యపురుషునిఁ బదమున నైన సం
స్పృ । శింపనే తుర్నెమహానీయ, శీలునజితు । నమలుఁ ద్రిభువనసన్నిభుం, డై
నరఘుకు । లోత్తమునిఁ బాసి జీవించియున్న మేలె ॥ (వ) అని బహుప్రకారంబు
ల నాక్రోశింపుచు నంతకంత కగ్గలంబైన శోకంబున నుదరతాడనంబుఁ గావిం
చుకొనుచుఁ గన్నీరు మున్నీరుగా రోదనంబు సేయుచు శోకరసాధి దేవతయుం
బోలెఁ జూపట్టుచున్న జానకిం జూచి లక్ష్మణుండు తత్కాలసదృశంబగు వాక్యం
బున ననూనయించిన నద్దేవి లక్ష్మణునితోడ నేమియుం బలుకక యూరకుండెనం
త నా సౌమిత్రి ప్రదక్షిణంబును గావించి యనుజ్ఞఁ గొని కుపితచిత్తుండై జా

(*) లక్ష్మణుండు రామునియొద్దకుఁ బోవుట. (*)

నకి నొంటి విడిచి పోవంజాలక తిరిగిచూచుచు రాముని సమీపంబునకుం జనియె
నంత దశగ్రీవుండు నెడగ నిశ్లక్ష్ణ కాషాయసంవీతుండును వామాంసన్యస్తయష్టి
కమండలుండును శిఖియు ధృతాతపత్రుండును సపాదుకుండును నై సీతావిశ్వా
సార్థంబు కపటపరివ్రాజకరూపం బంగీకరించి వేదఘోషంబు సేయుచుఁ బర్ణ
శాలకడకుం జనుదెంచు సమయంబున ॥ (ఆ.వె) భీమకర్ముఁడైన యామినీ

చరుఁజూచి । గాలివీవకుండెఁ గడుభయమునఁ । గదలకుండెఁదరులు,గౌతమివేగంబు । మాఱి మందసరణిఁ, బాఱుచుండె ॥ (వ) ఇట్లు భయదర్శనుండగు రావణుం డభవ్యరూపుండయ్యును భవ్యరూపుండై పర్ణశాలసేరం జనియం

రావణుఁడు యతిరూపధరుఁడై సీతకడకువచ్చుట.

దుఁ బద్మహీనయైన పద్మచందంబున నొప్పుదాని నపాంసులా శిరోమణియగుదాని ననన్యసామాన్యలావణ్యయగుదాని రామార్తస్వరశ్రవణ సంజాతశోకయై కన్నీరునించుచుఁ బర్ణశాలామధ్యంబున నాసీనయైయున్నదానిశుభస్వరూపిణియగుదాని రుచిరదంతోష్ఠియగుదానిఁ బూర్ణచంద్రనిభాననయగుదానిఁ బద్మపలాశలోచనయగుదానిఁ బీతకౌశేయవాసినియగుదానిసీతనవలోకించి శశిహీనయైనరోహిణిడాయు దారుణగ్రహంబుపోలికఁ జిత్రానక్షత్రంబు నాక్రమించిన శనైశ్చరునికరణిఁ జంద్రసూర్యవిహీనయైన సంధ్యనావరించిన మహాతమంబుకైవడి రామలక్ష్మణరహితయై యొంటినున్నయద్దేవి డాయంజని తదీయసుషమావిశేషంబున కచ్చెరువందుచు మన్మథశరావిష్టుండై ప్రశ్రితంబగు వాక్యంబుననిట్లనియె ॥ (క) సలలితమగునవపద్మిని । జలరుహమాలికను బోలె, స్వర్ణద్యుతిశో । భిలువలువఁ దాల్చియలరెడు । కలికీ యెవ్వతవునీవు,గహనమునందున్ ॥ (క) రతివో హరిణాంకునిమడ । వతివో వైకుంఠవిభుని వరసతివో భారతివో యచ్చరమిన్నవో । యతివా నీచందమతి దయామతిఁజెప్పుమా ॥ (క) ఊరులు కరికరతుల్యము । లారయ జఘనమువిశాల మకుల సితరు । క్తారకములురక్తాంతము । లీరీతిం దనరుచున్న వెంతయునీకున్ ॥ (చ) ధరశిఖరోపమంబుపచితంబుసువృత్తము సంప్రవల్గితం । బరయ మణిప్రవేకరుచిరాభరణంబును స్నిగ్ధముర్ణమనో । హరమతిపీన వృత్తము సమంచితతాళఫలోపమానమై । వఱలెడు నీకుచద్వయము । వారిజపత్రవిశాలలోచనా ॥ (సీ) కలకంఠి నీమోము కలువరాయనికాంతి లోఁగొన్నకైవడి,రూఢి మెఱసె । గోలనీపలుతీరు, కుందకుట్మలములపసఁ జూచి నవ్విన పగిదినొప్పెఁ । గలికి నీకంఠంబు వలముఱిచెలువంబు చూఱకొన్నవిధానఁ జూడ నయ్యెఁ । దరుణి నీనిడుదపెన్నెఱిగుంపుఘనకాంతి రమణఁగైకొన్నచందమున నలరె ॥ (తే,గీ) నళిచికుర నీదుసౌందర్య మంతఁజూచి । నంత నాచిత్తమంతంత కద్భుతముగఁ । గరఁగుచున్నది నూత్నశకంబుచేతఁ । గడఁగి సమ్మగాతీరంబుగరఁగినట్లు ॥ (తే,గీ)



చారునేత్రవిలాసిని చారువేణి । చారునాసిక చారువిశాలజఘన । యొట్టితపములు గావించి యిట్టిచెలువ । మిట్టితనుకాంతి వడసితివిందువదన ॥ (క) పిడికిటఁ బట్టఁగ నగునీ । నడుము తిలసుమంబుఁ దెగడు నాసికబొమలు । న్వాడవింటివానివిలుకై । వడిఁజూడఁగనయ్యెనహహ,వారిజనేత్రా ॥ (ఉ)పన్నగకాంతలన్గరుడభామలఁ జారణచంచలాక్షులం । గిన్నరకామినీమణుల ఖేచరతన్వులసాధ్యకన్యలం । బన్నుగ మర్త్యభామినులఁ,బల్మఱుఁజూచితిఁ గానినీకుజో । డెన్నఁగ మూఁడు లోకముల నెవ్వరిఁ గానముసుందరీమణీ ॥ (క) వెలయఁగముల్లోకంబులఁ । గలకాంతలలోనరూపకౌశలసుషమో । జ్జ్వలసౌకుమార్యములచే । నళిచికురాయగ్రగణ్య.వైతివిగాదే ॥ (చ) అతులితపుష్పపల్లవఫలాసవగుచ్ఛసుగంధిభూజసం । యుతమయియొప్పు రమ్యనగరోపవనంబుల నుక్కుమాసిఘో । రతరమృగాసురస్ఫురద, రణ్యమునందుఁజరింపుచున్నని । న్నతిసుకుమారిఁజూచి హృదయంబునఁ జాలవిషాద మొందెదన్ ॥ (ఉ) మంచిపదార్థముల్గుడిచి, మంజులచేలముఁ గట్టి కాంచనా । భ్యంచితహారముల్దొడిగి, హాటకసౌధములందు సెజ్జపై । మంచి విలాసితోఁ గలిసి, మచ్చికతోడ సుఖింప కొంటిరా । త్రించరజుష్టఘోరవన, దేశమునం జరియింప నేటికిన్ ॥ (తే,గీ )నీవు గుడిచి నయన్నంబు,నీవుదాల్చి । నట్టిసొమ్ముల నీమొలఁ,గట్టినట్టి । పుట్టమును నీవువరియించి, నట్టి పురుషుఁ । డఖిలలోకోత్తరతఁ జాల, నలరుఁదన్వి ॥ (క)తరుణీ విద్యాధరివో । సరసిజముఖి యక్షసతివో,చంద్రానన కి । న్నరివో సిద్ధాంగనవో । వరవర్ణిని లేక యిచటి, వనదేవతవో ॥ (క)సరగంధర్వామరకి । న్నరచారణసిద్ధసాధ్య, నాగనభస్స్వ । ద్వరులివ్వనిఁ జొరవెఱతురు । వరవర్ణిని యెట్లు నీవు, వచ్చితి చెపుమా ॥ (క)వానరవాహన రిపుపం । చానన శార్దూలభల్లు, కాదిమృగంబు । ల్వాని భయపరుపకున్నవె । కాననముననొంటి నుండఁ, గాతరనేత్రా ॥ (క)ఘనతరమదాన్వితములగు । వనశుండాలములు కాల, వాలంబిదియి । వ్వనమునకు నొంటి నేఁ క్రియఁ । జనుదెంచితి వబ్జనేత్ర, సాహసబుద్ధిన్ ॥ (ఉ)ఎచ్చట నుండియెచ్చటికి, నేగుచు నిచ్చటికద్భుతంబుగా । వచ్చితి వుగ్రదైత్యపరి, వారనిషేవితమైన కానలో । నిచ్చకు వచ్చినట్లయిపు, డేల చరించెద వొంటిఁ జిక్కి నీ । సచ్చరితంబు నెల్లవరు, సన్వినుపింపఁ గదే తలోదరీ ॥ (వ)అని యివ్విధంబున దురాత్ముండగు రావణుం డడిగిన వానిఁ

గపటగూపునిం గా నెఱుంగక నిక్కంబుగా బ్రాహ్మణుండ నా నానావిధపూజల
నతిథి సత్కారంబు గావించినం బ్రతిగ్రహించి ॥ (క) విశదంబగు తత్కో
మల । విశాలలావణ్యగరిమ, వీక్షించి తగ । న్దశముఖుఁ డాత్మవధార్థము ।
శశిముఖి హరణంబునందు, స్వాంతము సేర్చెన్ ॥ (వ) ఇట్లు జనక పుత్రి ద్వి
జాతివేషంబునఁ బాభ్రకుసుంభ ధారియై తనకడకు వచ్చిన వాని నపహరణ బు
ద్ధియైనరావణుం జూచి యతిథిత్వంబున ద్వేషంబు సేయుట కనర్హుండైన
బ్రాహ్మణాతిథింబలెనతనిసత్కరించి॥ (క) ఇదియాసనమిది యర్ఘ్యం । బిది

(*) సీత యతివేషధారియైన రావణున కర్ఘ్యపాద్యాదులొసంగుట. (*)

పాద్యం బిది ప్రసూన మిది వన్యఫలం । బిదిమధుపర్కమొసంగితి, సదయ
త జేకొనుము నీవు సంయమివర్యా ॥ (వ) అనిపలికిన నా రావణుండు ప్రతి
పూర్ణ భాషిణియగు జానకిచేత నిమంత్ర్యమాణుండై తత్ప్రతిగ్రహణంబు
నందుఁ జిత్తంబుఁ జేర్చి తద్రూపసౌందర్య రేఖావిశేషంబు విలోకింపుచుం
డె నంత నవ్వైదేహి వాని లక్షణంబెఱయ నుపలక్షించి మృగయార్థం
బరిగిన శోభనాకారుండగు రాముని యాగమనంబుఁ బ్రతీక్షింపుచు సారెసా
రెకు సముద్గ్రీవయై శ్యామంబైన యవ్వనంబు విలోకింపుచు రామలక్ష్మణుల
జాడఁగానక పరివ్రాజకచిహ్నుండును నపహరణబుద్ధియుక్తుండును దురాత్ముం
డునైన రావణునిచేత నిట్లు సంపృష్టయై యితండు బ్రాహ్మణుండునునతిథియుఁ
గావున మద్వృత్తాంతం బెఱింగింపకున్న శపించునోయని యొక్క ముహూ
ర్తంబు చింతించి తనవృత్తాంతంబెఱుకపడ నిట్లనియె॥ (క) అనుపమ తేజోని
ధియగు । జనకునిపుత్రికను రామ చంద్రునిభార్య । న్జనులెల్లనన్ను జానకి । యని
సీతయటంచుఁబిలుతు రనఘవిచారా॥ (క) పది రెండువత్సరంబులు । ముదమ
లరఁగనత్తయింట మునుకొని భోగా । స్పదములగుదివ్యసుఖములు । విదితంబు
గఁజాలననుభవించితివిప్రా॥ (ఉ) అంతఁ ద్రయోదశాబ్దమున నమ్మహీకాంతు
డు రాముని న్ధరా । కాంతునిఁజేయఁబూనికుతుకంబున మంత్రులఁగూడి సమ్మద।
స్వాంతముతోడఁ జక్కఁగవిచారముఁ జేసి సునిశ్చితార్థుఁడై । చింతదొరంగి
యున్నయెడఁ జెచ్చెరఁ గైక యదుష్టచిత్తయై॥ (సీ) తనప్రాణవిభుఁడైన దశరథ

సీతాదేవి తనవృత్తాంతమంతయు రావణునికిఁ జెప్పట.

నృపునిసుకృతముచేఁదగవశీకృతునిఁ జేసి । కఱినవరంబులుకొఱమర్థిఁగాంక్షించి



యొకటికిమన్నాథు నకువివాస । మొకటికి భరతున కుర్వీశ్వరత్వంబుఁ గోరియి
ప్పలసమకూర్చునంత । కాహారనిద్రావి హారాదికములొల్ల నట్లుసేయఁగనోప
నైతివేని (తే,గీ) రామపట్టాభిషేక కాలంబెనాదు । జీవితాంత కాలంబని భావ
మందుఁ । దెలియుమని యిట్లుదారుణోక్తులనలంచి । విభునిచిత్తంబు వేఱొక్క వి
ధముఁ జేసె॥ (వ) ఇట్లు ధర్మంబున నిబంధించి పలికిన సత్య ప్రతిజ్ఞుండగు
నద్దశరథుండు వరద్వయప్రతినిధిత్వంబున నుపభోగక్షమంబులైన సువర్ణర
త్నాదికంబులు గొనుమని ప్రార్థించిన నద్దేవియంగీకరింపదయ్యె॥ (తే,గీ) రూ
పవంతుండుసుగుణుండులోకసమ్మ । తుండు భూతహితుండు శాంతుండు లోక।
కాంతుఁడగునాదుభర్తయకాలమునకు । నిఱువదేనేండ్ల వయసువాఁడెన్ని
చూడ॥ (క) ధరణీసురయేనాఁటికి । బరువడిఁబ్రాయంబుచేతఁబదునెనిమిదివ।
త్సరములదాననువినుమే । మిరువురమివ్వయసుచేత నెనయుచునుండన్ ॥ (క)
కామాతురుండగుదశరథ । భూమివిభుఁడుసతికిఁబ్రీతిఁబుట్టించుటకై । రామాభి
షేచనవ్యా । యామంబునఁజింతవిడిచె నవహితమతియై॥ (క) మునుకొనియ
భిషేకార్థము । జనకునియభ్యాశమునకుఁ జనుదెంచినరా । మునిఁగన్గొనికైక
యియు । ట్లనియెన్నిరికాసపడినిజార్థస్పృహయై॥ (సీ) అనఘ భవజ్జనకుని
చేసమాజ్ఞప్తమైనయీనాదువాక్యంబువినుము । పదునాల్గువర్షము ల్భరతుఁ
డయోధ్యకు నాథుఁడందాఁకఁగాననమునందు । మునివృత్తిఁబూని రాముఁడు
వివాసమొనర్పఁ గలఁడంచువిభజించెఁగాననీవు । రయమునదండకారణ్యము
నకుఁజోయి తండ్రినిబ్రోవు సత్యమునననిన॥ (ఆ, వె) నట్లకాక యనుచు నంబకుఁ
బ్రియముగా । వ్రతముఁబూని యీయరణ్యమునకు । నరుగుదెంచె మత్సమన్వి
తముగనమ్మ । హాత్ముచరితమిదిద్విజాగ్రగణ్య ॥ (తే,గీ) ఒరులకిచ్చుటెగానితా
నొరులచేతఁ, గొనఁడుసత్యమాడుటెగాకమనమునందు । బ్రమసియైననసత్యం
బుఁబలుకఁడెపుడుఁ । బృథివిలోపలమత్పతికిదివ్రతంబు॥ (వ) మఱియునమ్మహా
త్ముని యనుజుండు లక్ష్మణుండు భ్రాతృస్నేహంబున ధనుష్పాణియై రామసహా
యార్థం బరుగుదెంచె నతండు శౌర్యాదిగుణంబుల సుప్రసిద్ధుండు సమరం
బునందు సహాయుండు రాఘవుండిత్తెఱంగునఁ దండ్రిచేత సమాజ్ఞప్తుండై యా
చకులకు యథేష్టంబుగా ధనంబొసంగి రాజ్యాదికంబుఁ బరిత్యజించి జటావ
ల్కలంబులధరించి లక్ష్మణసహాయుండై మత్సమేతంబుగా దండకారణ్యంబునకుం

జనుదెంచెఁ గైకేయీనిమిత్తం బేము మువ్వురము రాజ్యప్రచ్యుతులమై గంభీర తేజంబున నివ్వనంబునం జరియింపుచున్నవార మొక్క ముహూర్తం బిచ్చట నివసించితివేని రురుగోధావరాహంబుల వధించి తన్మాంసంబును వన్యఫలంబులును బుష్కలంబుగా సంగ్రహించుకొని మద్విభుండు చనుదెంచు నయ్యధిపుని చేత నాతిథ్యంబుఁ గొని యవ్వల యథేచ్ఛం జనవచ్చునని కపట విప్రవేషధరుం డైన రావణునితోఁ దనవృత్తాంతం బంతయు నుడివి వెండియు నిట్లనియె॥ (క) ధరణీసురయొంటిగఁ దుశ్చరమగు నీగహనమందు సాహసభంగిం। జరియించెదేల నేర్పడఁ। దిరముగ నీచందమెల్లఁ దెల్పుము నాకున్॥ (ఉ) నావిని యానిశాటకు

## రావణుండు సీతాదేవికిఁ దననిజస్వరూపం బెఱింగించుట.

లనాథుఁడు రావణుఁ డిట్లు పల్కెనో। క్ష్మావర పుత్రికామణిజగత్త్రియ మెవ్వని దుష్ప్రధర్షణాబా। హావిభవంబుచేఁ జకితమై శరణంబు వహించు నట్టి నే। రావణ నామధేయుఁడ ధరాధర ధీరుఁడ దైత్య నాథుఁడన్॥ (చ) జనకతనూజ కుందనపుఁ జాయల నీనెడు నీదు రూపముం। గని నిజదారలం దురతి కాంక్షఁ దొలంగితిఁ దొల్లి బల్మిచే। ననుపమ లీలఁ జేకొనిన నచ్చరమిన్నలలోన నీవు నా। కనిశము నగ్రభార్యవగు మద్భుత సౌఖ్యము నీకుఁ గల్గెడిన్॥ (చ) లవణపయోధిమధ్యమున లంక యనాఁ జెలువొందు మత్పురం। బవిరళభోగభాగ్యముల కాస్పదమై గిరిమూర్ధమందునుం। డు వలసినట్లు నిత్యమును ధోరపు వేడుక నన్నుఁ గూడి ర। మ్యవనములం జరింపుము బలా యిటు లూరక డయ్యెనేటికిన్॥ (చ) అలికులవేణి నాకు ముదమారఁగ గేహిని వైతివేని యు। మ్ములమణిహేమభూషణవిభూషితపంచసహస్రసుందరు। ల్చెలువుగ నీకు దాస్యమునుఁ జేయుచునుండఁగ రాజసంబున। న్విలసదమేయసౌఖ్యముల వీఁగెదవి

## సీతాదేవి రావణునిఁ దృణీకరించి పలుకుట.

ట్లుకృశింప నేటికిన్॥ (తే,గీ) అనవిని సతీశిరోమణియైన సీత। తీవ్రకోపంబుచే వానిఁ దృణముగాఁగ। నెంచి మదినాదరింపక యిట్టులనియెఁ। జూపులనె వాని యాయువు చూఱకొనుచు॥ (సీ) గిరివోలె నచలుఁ డుర్వరఁ బోలెఁ దాలిమిఁ గలవాఁడు హరివోలెఁ గ్రమతేజుఁ। డంబుధి వోలె మహాక్షోభ్యుఁ డాపూర్ణశశివదనుండు ప్రసన్నయశుఁడు। సింహసంహననుండు సింహవిక్రాంతగామియు నృసింహుఁడు మహామేచకాంగుఁ। డాజానుబాహుఁ డనగ్ర శాయుధదీప్తుఁ డతినూతుఁడ



తిధీరుఁ డతిగభీరుఁ॥ (తే,గీ) డధిక సుకుమారుఁ డభిరాముఁ డరివిరాముఁ। డమితగుణధాముఁ డగు రాముఁ డనవరతము। గతియు నాకమ్మహాత్ముని వితతబుద్ధి। బాయ కెప్పుడు సేవింతు ఛాయపగిది॥ (తే,గీ) సర్వలక్షణ యుక్తుండు సత్యసంగరుండు న్యగ్రోధ పరిమండలుండు సుగుణ। ధాముఁడు జితేంద్రియుఁడు నైన ప్రాణవిభుని। మానక ఎప్పుడు సేవించుదాననసుర॥ (చ) రభసము చేత జంబుకము రావణ సింహినిఁ బోలె నీవుదు। లభనగు నన్నుఁ గైకొనఁ దలంచితివక్కట చండభానుమ। త్ప్రభ గతి సేను నీకరము లన్స్పృశియింపనశక్యనింద్రస। న్నిభుఁడగు రాముపత్నియొక నీచునకబ్బునె రాక్షసాధమా॥ (తే,గీ) అకలంకులునకుఁ బ్రియపత్నినైన నన్నుఁ। గరమపహరింపఁ దలఁచిన కారణమున। గుటిలరాక్షస క్షీణభోగుండవగుచుఁ। గనకతరువుల నిప్పుడ కాంచెదీవు॥ (సీ) ఆఁకలిఁ గొన్న గజారి కోఱలు దీయఁ దలకొన్న వాని మందరనగంబు। నరచేతఁ బ్రహరింప నాసచేసిన వానిఁ గాలకూటవిషంబుఁ గ్రోలఁ జూచు। వాని మంగలకత్తి చే నాలుకను ద్రుంచుకొనఁ జూచువానిఁ బ్రస్గుండు మెడను। దవిలించుకొని వార్ధి దాటఁ గోరెడు వాని సూది చేఁ గనుగ్రుమ్మఁ జూచువాని॥ (తే,గీ) రాజకులభూషణుండైన రాఘవునకుఁ। గూర్చు ప్రియురాలినగు నన్ను ఘోరభంగి। నపహరింపఁ దలంచిన యట్టి నిన్ను। రాక్షసాధమ సరిగాఁ దలంపవలదె॥ (సీ) రాక్షసాధమ నీవు రాముని ప్రియభార్యనైన నన్ను హరింప నాత్మఁ దలఁచి। తది యెంత యవివేక మాదిత్యసోములఁ గరములఁ బ్రహరింపఁ గాంక్షయిడిన। యట్లు నిర్ముక్త ఘోరాహిముఖంబునఁ గోఱలఁ బెఱుకంగఁ గోరినట్లు। వారక మండెడు వహ్నిని జెఱఁగున ముడువంగ మదిలోనఁ బూనినట్లు॥ (తే,గీ) మొనసి ఘోర కాలాయససముఖములైన। శూలశూలాగ్రములమీఁద సంచరింపఁ। గాంక్షఁ జేసిన యట్లగుఁ గాదె రాము। కూర్మి పత్నినినను మదిఁ గోరుటెల్ల॥ (ఉ) అంబుధి పల్వలంబులకు హంసబకంబులకున్ ఖగేంద్ర కా। కంబులకున్ మృగేంద్ర శశకంబులకున్ మదహస్తిరాడ్బిడా। లంబుల కెంత యంతరము లాఁగ్గలిఁ గన్పడు నంత తారత। మ్యంబగు నాదుభర్తకు నిశాటకులాధమ నీకుఁ జూడఁగన్॥ (వ) మఱియు నమృతార నాళంబులకును మద్గుమయూరంబులకుఁ గాంచనసీసంబులకుఁ జందనవారిపంకంబులకు సారసగృధ్రంబుల కెంత తారతమ్యంబుగల దంత తారతమ్యంబు రామునకు నీకునుం గల దదియునుం గాక॥ (ఉ) వాసవసన్నిభుండు రఘువర్యుఁడు కార్ముక బాణ

పాణినై । భాసురలీలఘోరరణభాగమునందగ నిల్చియుండనీ । చేసముదగ్ర
దోర్బలము చేహృతనయ్యును నేనులోకసం । త్రాసనమక్షికాన్వితఘృతంబు
గతిఁ జరనొంద నెంతయున్ ॥ (మ) అని యిబ్భంగిన దుష్టభావయగు నయ్యంభోజ
పత్రాక్షి దు । ష్టనిశాటుండగు పఙ్క్తికంధరునితో సక్రోధయై పల్కఁగ । కుక్క
నవాతోద్ధతయైన రంభ గతిసం క్షోభించి కంపించెద । త్తను సందర్శన జాతసా
ధ్వసమునన్ దైత్యుంబు వాటిల్లఁగన్ ॥ (వ) ఇవ్విధంబునఁ దలంకుచున్న వైదే
హిన వలోకించి మృత్యుసమప్రభావుండగు రావణుండు వికటభ్రుకుటి దుర్నిరీ
క్షుండై తనకులంబును బలంబును గర్వంబును నామంబును సర్వంబును
చేటపడ నుల్లంఘించి యద్దేవికి భయంబుఁ బుట్టింతుఁ గాక యని తలంచి సంరబ్ధప

**రావణుండు సీతాదేవికిఁ దనపరాక్రమాతిశయముఁ దెల్పుట**

రుషంబగు వాక్యంబున నిట్లనియె ॥ (ఉ) మానిని మృత్యుదేవతకు మర్త్యులు పో
లె సురాసురాదులె । వ్వానికి సంతతంబుఁ బెను వంతఁ గలంకు దురట్టియే నుదీ । ప్తా
నలతుల్యతేజుఁడ ధనాధిపు తమ్ముఁడఁ బఙ్క్తికంఠుఁడ । న్మానిత బాహుశౌర్యుఁడ
సమస్త నిశాటకులాధినాథుఁడన్ ॥ (చ) రణమున గుహ్యకేశ్వరుఁ బరాజితుఁ జేసి
యతండు భీతిఁ బ । ట్టణముఁ దొలంగి వెండిమల తావుగఁ జేసి వసించియుండఁ ద । న్మ
ణిమయ దేవనిర్మితసమంచిత కామగ పుష్పకంబునై । పుణిఁ గొని మూఁడు లోక
ములు వోవుదుఁ గుంతత లేక నిచ్చలున్ ॥ (క) మృగనేత్ర జాతరోషుఁడ । నగు నాదు
మొగంబుఁ జూచినంతనె సురయ । క్షగరుడగంధర్వాదులు । మిగులఁ బరిత్రస్తు
లగుచు మెలఁగుదు రెందున్ ॥ (చ) కువలయగంధి యే నెచటఁ గోరి వసింతుఁ జరింతు
నచ్చటం । బవనుఁడు వీవనోడు సితభానుఁడు వెన్నెలఁ గాయనోడు నా । రవియుఁ ద
పింపనోడు సకలద్రుమముల్ గదలంగనోడు వ । హ్ని వెలుఁగనోడు ధాత్రిఁ బ్రవ
హింపఁగనోడు నదుల్ భయోద్ధతిన్ ॥ (చ) లవణపయోధిమధ్యమున లంకయనం
గఁ జెలంగు మత్పురం । బవిరళ భోగ్యజాతమున కాస్పదమై మణిసాలసౌధమై ।
పృవిమల పద్మకైరవవిరాజిత నవ్యసరోభిరామమై । దివిబలభిత్పురంబు పగిదిన్
క్షితిభృచ్ఛిఖరాగ్రమండలిన్, (వ) అది మఱియు రమ్యప్రాసాదసంబాధంబును
మణిచత్వరసభాభవనంబును వైడూర్యద్వారతోరణంబును హస్త్యశ్వరథసం
కులంబును విచిత్రశిల్పనిర్మిత హేమకక్ష్యంబును సర్వకామఫలప్రదనానావి
ధసురతరు ఫలకిసలయ కుసుమరసాస్వాదన మత్తకీరశారికాకలకంఠమధుకర



మధురశబ్దాయమాన మహోద్యానశోభితంబును నై యొప్పు నప్పురంబునందు ।
(క) ననుఁ గూడి సంతతంబును । మనమలర వసించితేని మానిని మనుజాం । గన
లసుఖము పుడుతోఁ జెడు । మనమునకుం జూడఁ దృణసమానంబగుచున్ ॥ (వ) మ
ఱియు నాలంకాపురంబున మత్సమర్పిత దివ్యభోగంబు లనుభవించు నప్పుడు
మానుషుండును గతాయుష్యుండునగు రామునిఁ గలనైనఁ దలంచుకోన వది
యునుం గాక ॥ (చ) అనుపమ గాత్రి పంక్తిరథుఁ డగ్రసుతుం డనుకూలభామిని
రా । ముని లఘువీర్యుఁ డంచువన భూమికిఁ ద్రోచి ప్రియా హర్షఁ జొకని । గ్గుని న
రనాథుఁ జేసె నది చూచియు నీవిపుడట్టిహీను న । ర్తనుఁడు జడుండు మర్త్యుఁడగు రా
మునిపైఁ దమిఁ గూర్పనేటికిన్ ॥ (తే,గి) తాపసుండును విగతచేతనుఁడు మఱియు ।
భ్రష్టసామ్రాజ్యుఁడైన యా రాముచేత । నేమికార్యంబు మానవుఁ డెంతవాఁడు ।
విడువుమాతని పైఁ బ్రేమ వినతగాత్రి ॥ (ఉ) ఇంతిరొ నిన్నుఁ జూచి మరుఁ డేపఁగ నిచ్చ
టికొత్తిఁ దూలినా । యంత నె వేఁడ వచ్చితిని, రాక్షసకులాగ్రణినైన నన్ను బ । ల్వం
తలఁ బెట్టితే నియబలా పరితాపము నొందె దవ్వలం । బంతముతోఁ బురూరవునిఁ,
బాసిన యూర్వశి భంగి నంగనా ॥ (వ) మఱియు మానుషుండగు రాముండు
సంగ్రామంబున నా యంగుళిత్రోనైన సాటిసేయం దగఁడు ॥ (చ) తరుణిరో
నీదు భాగ్యమునఁ, దప్పక నిచ్చటి నొంటి నీకు నే । దొరికితిఁ దోడ్చి పుచ్చకి
కఁ, దొరవు వేడ్క భజింపు నన్ను నీదు । భ్వరతర బాహుశౌర్యమున, ద్రా
లిన వాఁడి మగండ రాముఁడుం । గర మని లోన నన్నుఁ జెన, కంగ సమర్థుఁ
డు గాఁడు చూడఁగన్ ॥ (ఉ) నావిని భూమిపుత్రి నయ, నంబుల నెర్జిఁ దనం
బుదోఁపఁ గో । పావిలచిత్తయై వికసి, తానన మొప్ప రఘుప్రవీరుని । న్భావ
మునం దలంచుకొని, మాటికి దుర్వచనంబు లాడునా । రావణుఁ జూచి దారు
ణశ, రప్రతిమోక్తులఁ బల్కె నుగ్రతన్ ॥ (తే,గీ) అఖిలభూతనమస్కృతు,
నమిత తేజు । నగ్రజుని గుహ్యకేశ్వరు, నాదిదేవ । సఖుని దూరమునఁ గదిసి దు,
స్స్పృహామహోగ్ర । కలుష మొనరింప నెబ్భంగిఁ, దలఁచితొక్క ॥ (తే,గీ) పు
డమి నెవ్వారికిట్టిదు, ర్బుద్ధి వీట్ట । కర్కశుఁడ వీట్టి జడుఁడవు, కలుషరతుఁడ ।
వైన నీవధినాథుఁడ, వైతి వట్టి । ఖలురు దైత్యులు నశియింపఁ గలరు నీచ ॥
(క) సురపతి సతియగు శచినప । హరించి బ్రతుకంగవచ్చు, నాదిత్యకులే । శ్వ
రుని సతినైన నన్నప । హరించి బ్రతుకంగఁగూడ, దమరవిరోధీ ॥ (వ) మఱియు

రామభుజ ప్రాకారరక్షితనైన నన్నపహరించి నీవమృతంబుఁ ద్రావినయైన బ్రతు
కం జాల వని యిట్లు నిరసించి పలికిన సీత వాక్యంబులు విని రావణుండు హ
స్తతాడనంబుఁ జేసి ప్రావృట్కాల మేఘంబుకరణి మేనుఁ బెంచి వైదేహింజూ
చి వెండియు నిట్లనియె ॥ (ఉ)మానిని మత్తవౌటవిను, మామకవీర్య పరాక్ర
మంబు లిం। తైన నెఱుంగ వైతి నిఖి, లార్థులు రొంపియొనర్తుఁ మృత్యువుం।
బూనివధింతు బాణముల, భూమిని బ్రద్దలు వాపుదుంగరం। బానలినాప్తచం
ద్రులశ, యంబులఁ దాళగతిస్థిరించెదన్ ॥ (క)భూమీశతనయ రామునిపైమ
మతిఁ బరిత్యజించి, భావమున నను౦। గామించి వల్లభునిఁగాఁ। గామదుఁగాఁ
గామచరునిఁ, గాఁదలఁపు మికన్ ॥ (తే,గీ)అనిపలికె నష్ట సంక్రుద్ధుఁ, డై
న వాని। నేత్రములు భానుమండల,నిభములైక్రూ। శానుకల్పంబులై క్షత, జ
ప్రభంబు। లగుచుఁ బింగళో పాంతంబు, లై తనర్చె ॥ (వ)అప్పుడు రావ
ణుండు సౌమ్యంబైన భిక్షురూపంబుఁబరిత్యజించి సకల భయంకరంబైన నిజ
రూపంబంగీకరించి మహాకాయుండును సంరక్తనయనుండునుదప్తకాంచన కుండ
లుండును నీలజీమూతసన్నిభుండునుదశాస్యుండునువింశతిభుజుండును గార్ముక
కబాణతూణీరధరుండును రక్తాంబరుండును క్రోధావిష్టచిత్తుండునై వసనాభర
ణోపేతయై సూర్యమరీచిభంగి నొప్పుచున్న స్త్రీరత్నంబైన జానకి నవలోకిం
చియిట్లనియె ॥ (మ)వినుతాంగీ కులశీలవంతుఁ ద్రిజగ ద్విఖ్యాతచారిత్రు భ।
ర్తనుఁగాఁగోరితివేని సమ్మదమెల, ర్పన్నన్నుఁ గైకొమ్ము నీ। కనురూపప్రియ
వల్లభుండ భువనా, ధ్యక్షుండ నబ్భంగిఁ గై। కొనవేనిం బెనుఁగిన్కఁ బూని
హృదయ,క్షోభంబుఁ గావించెదన్ ॥ (క)మానుష భావము విడువుము। పూ
నుక నిఖిలాసురోత్తముఁడ నగు నాపై। మానిని భావము సేర్పుము। మాన
సమున నితరచింత, మానుము తన్వీ ॥ (తరల)పడఁతిమాటకురాజ్యసంపదఁ,
బ్రాభవంబెడఁ బాసియు। న్నడిఁ భయంకర కాననోర్వికి, వచ్చి నట్టి గతా
యువు। న్జడుఁడు రాజ్యవిహీనుఁడుంబర, సంభృతుండగురామునిన్। విడువకీవి
పుడే గుణంబుల, వేడ్కఁ గూర్చితి చెప్పుమా ॥ (వ)మఱియు దుమ తియు

(*)రావణుఁడు సీతాదేవి నెత్తికొని పోవుట.(*)

నసిద్ధార్థుండు నగు రాముని మీఁద మోహంబు విడిచి భర్తనుగా నన్నువ
రింపుమని యివ్విధంబున విప్రలాపంబులు పలుకుచు దుష్టాత్ముండగురావణుం



డు కామమోహితుండై వైదేహి డగ్గరి యంతరిక్షంబు నందు బుధుండు రోహి
ణింబోలెబలాత్కారంబున నొక్కకరంబున శిరోజంబులును వేఱొక్క కరంబు
ననూరువులునుం బట్టి యెత్తి యంతలోన సన్నిహితంబైనమాయామయ హే
మాంగ ఖరయుక్తదివ్యరథం బారోహించి యద్దేవి నంక భాగంబున నిడుకొ
ని పరుషవాక్యంబులం దర్జింపుచు రయంబున రథంబుతోఁ గూడ గగనంబు
న కెగసె నప్పుడు తీక్ష్ణదంష్ట్రుండును మహాభుజుండును మృత్యుసంకాశుండును
గిరిసన్నిభకాయుండు నగు రావణుం జూచి భయార్తలై వనదేవత లాక్రో
శింపుచుండిరి యివ్విధంబున నకామయగు దాని భయార్తయైదూరగతుండ
గు రామునిం జీరు దాని సురనాగాంగన భంగి వివేష్టమానయగు దాని యశ
స్విని యగు జానకి బలాత్కారంబునంగై కొని దురాత్ముండగు దశగ్రీవుం డం
బరంబునం జను సమయంబున ॥ (తే,గీ) రావణునిచేగృహీతయై, రామపత్ని।

(*)సీతాదేవి రావణహృతయై రామలక్ష్మణులం దలంచి విలపించుట.(*)

తనదు దురవస్థ కెంతయుఁ, దలఁకి చాల। వగలఁ బొగులుచు నున్మత్త, పగిది
భ్రాంత। హృదయ గతివిలపింపుచు, నిట్టులనియె ॥(ఆ,వె) కామరూపుఁడైన,
ఖలరాక్షసునిచే గృ। హీతనైన నన్ను, నెఱుఁగవైతి। హాకృపావిధేయ,హాసు
మిత్రాసుత। హాగురుప్రసాద, హామహాత్మ ॥ (తే,గీ)ధర్మహేతువువలనన,
ర్థమునుజీవి। తమునుసుఖమును దృణముగాఁ, దలఁచితీవ। ధర్మమునహ్రి
యమాణనై, తలఁకు నన్ను। నృపకులోత్తమ గనుఁగొన, నేరవుగద ॥ (క)అ
నఘా నీవవినీతుల। కనవరతము శిక్షకుండ, వైతివి నేఁడీ। యను పునఁ బాప
ముఁ జేసినఁ। దనుజుని శాసింప వేల, దయ దప్పె నొకో ॥ (వ)అనిపలికి రా
వణునుద్దేశించి యిట్లనియె॥ (తే,గీ) పరఁగనవినీతజనకృతపాపమునకు। జగ
తి సద్యఃఫలప్రదర్శనము లేదు। కాలమందును సహకారికారణమగు। సస్యపాకం
బుననుబోలెసంతతంబు ॥ (వ) కావుననీవు కాలోపహత చేతనుండవై యీక
ర్మంబుఁగావించితి వింక రామునివలన ఘోరంబును జీవితాంతకరంబైన వ్యస
నంబునొందఁగలవని పలికి వెండియు ॥ (క) ఆకస్మికముగదానవుఁ। డీకరణిం
గొనుచుబలిమి నేగెడునన్నుం। బ్రాకృతకర్మఫలంబులు। చేకూడెంగాక యేల
చింతింపంగన్॥ (తే,గీ) కాలచోదితుఁడై వీఁడుకాంక్షచేత। నన్నుఁ గ్రుచ్చిలికొ
నిపోవుచున్న వాఁడు। వీరశేఖరుఁడైననా విభునిచేత। సందియము లేదు పంచ

త్వ మొంపఁగలఁడు॥ (క) ఈపాపాత్మునిచేనే। నీపట్టునఁజిక్కు చుండనిఁకఁ గైక
యిదా। నేపారబంధుయుతముగ। దీపింపుచు నుండుఁగాదె తీఱని కోర్కెన్॥
(ఉ) కాననసీమయందుపశ కంతుఁడుమ్రుచ్చిలిదుర్వినీతుఁడై। పూనుకభూమి
పుత్త్రిఁగొని పోయెడువేగమెనీవుప్రోవరా। వేన్నృప ధర్మశీలరఘు వీరయటం
చుఁగృపారతిజ్ఞన। స్థానసగంబులారయల సౌరకులాగ్రణితోడఁ జెప్పరే॥ (క)
రావణుఁడుజానకింగొని। పోవుచు నున్నాఁడువేగఁ బ్రోవుమటంచు। న్నావిభు
నితోడఁజెప్పుము। వావిరిఁగృపతోడమాల్యవద్గిరినాథా॥ (క) నిరుపమతరంగ
మాలా। పరికలితమరాళచక్రబకసాదనపి। స్ఫురితఘనగాత్రమీనది। నరనాథు
నితోడఁజెప్పునాతెఱఁగెల్లన్॥ (చ)తిరముగనిందయున్నవన దేవతలార మృగం
బులారఘే। చరవరులారసిద్ధముని సంతతులారదశాననుండుబం। ధురగతిసీతనె
త్తికొని దొంగిలిపోయెడు నంచు మీరుమ। ద్వరునకుఁ జెప్పఁడార్తి సతతం
బు మిమున్శరణంబు వేఁడెదన్॥ (చ) యమునకుఁ జిక్కినట్టి సతి నైనవె
స విడిపింప జాలునం। తమహిమ గల్గువాఁడు రఘు, నాయకుఁ డీపని
విన్న యంత వి। క్రమమున వీనిఁదాఁకి పటు, కాండ హతిన్ వధియించి
మించి య। శ్రమమున సీతఁణంత్త సుక, రంబుగ నన్విడిపింపకుండునే॥ (వ)
అని బహుప్రకారంబుల విలపింపుచు నమ్మహీపుత్త్రి పురోభాగంబున వన స్పతి
గతుండైన గృధ్రనాథుండగు జటాయువునుం జూచి భయకంపి తాంగితయైడ
గ్గుత్తికతో నిట్లనియె॥ (చ)రాముఁడు లేనిచో నను న, రణ్యమునం గొనిపో
వుచున్నవాఁ। డీమనుజాశనుండు పత, గేశ్వర వీఁడతిశూరుఁడౌట సం। గ్రా
మ తలంబున న్భుజబ, లంబున నీకు జయింప రాదు సు। త్రాము సమానుఁడైన
రఘు, రామున కింత యెఱుంగఁ జెప్పవే॥ (ఉ) నావిని యజ్జటాయువు వ, న
స్పతిపై నిదురించి లేచియా। రావణు వాని యంకమున, రాముని ఁజేరుచు నే

## (*)జటాయువు రావణునికి హితోపదేశముఁ జేయుట.(*)

డ్చు జానకీ। దేవినిఁజూచి తెక్కలు విదిచిన్ శితాయతతుండుఁడై మహా।గ్రా
వముభంగి గాత్ర మల, రం బరుషోక్తుల వాని కిట్లనున్॥ (ఉ) ఓరి దశాస్య
యేను విహ, గోత్తముఁడ న్భుజవీర్య విక్రమో। దారుఁడ సత్యసంశ్రవుఁడ,
ధర్మవిదుండ జటాయు వంద్రు నా। పేరటు పెక్కు కయ్యములఁ, బెద్దయు
విశ్రుతిఁ గన్నవాఁడ సొం। పారవసించి యుండుదుఁ గ, దా బహు కాలము



నుండి యిచ్చటన్॥ (తే,గీ)సర్వలోకంబునకు రాజు, సత్యసంధుఁ। డింద్రవ
రుణోపముం డతి,హితుఁడు లోక। ములకు శూరుండు దశరథ, పుత్త్రుఁడల
రు। రాముఁ డన సర్వసుగుణాభి, రాముఁ డగుచు॥ (ఉ)ఏసతి నీవు బల్మిని
వు,డెత్తుక పోవఁ దలంచి తాసతిన్। భూసుతఁగా నమేయగుణ, పుణ్యచరిత్ర
నుగాఁ బతిప్రియో। ల్లాసినిఁగా ననంతగుణ, రాశినిగా నల రాముపత్నిఁగా।
శ్రీసమఁగాఁ బవిత్రకుల, శీలను సీతనుగా నెఱుంగు మీ॥ (ఉ)రాముఁడు భా
నుమత్కులల, లాముఁడు భూరిభుజాపరాక్రమో। ద్దాముఁడు కీర్తనీయగు
ణ, ధాముఁడు ఘోరబలాధికాసుర। స్తోమ విరాముఁడుగ్రరణ, సోముఁడువీర్య
జితైకపింగసు। త్రాముఁడుభూరిదోర్విజిత రాముఁడుసుమ్ము నిశాచరాధమా॥
(ఉ) రావణధర్మశీలుఁడగు రాజుపరాంగననెట్లుగోరునా। హావినుమందురా
జసతి యంబయుఁబోలెసురక్షణీయయాఁ। గావున నీతెఱంగుగొఱ గాదిఁకనీ
చమనీషమానుము। ర్వివరుఁడైనరామునకరిష్టముఁజేసిమనంగవచ్చునే॥(తే,గీ)
ధీరుఁడగువాఁడుపరులునిందించునట్టి। పనియొనర్పఁడుతనపత్నితనకునెట్లు।ర
క్ష్యమౌనట్లుపరివిమర్శనమువలనఁ। బరసతులు రక్షణీయలు పరునకెందు॥
(వ) రాక్షసేంద్రా శాస్త్రపర్యాలోచనంబునందతిసూక్ష్మదృష్టిగలవారికైనఁ బ
రమదుర్బోధంబులైన ధర్మార్థకామంబులు రాజుకంటె నితరులగువారు
రాజుననుసరించి కావింతురుకావున ధర్మోపదేశపరుండగురాజునకధర్మ
ప్రవృత్తి యనుచితంబైయుండు సర్వావస్థలయందును ధర్మంబె యాచరింప
వలయు సద్వృత్తులగురాజులు శాస్త్రవిరుద్ధంబైనకామాదికంబునిచ్చగింపరు॥
(తే,గీ) యామినీచరధర్మార్థకామములకు। రాజుస్థానంబుగావున రమణ
తోడఁ। బుణ్యపాపంబులునుయశంబునుశుభంబు। రాజమూలంబులై చెల్లురా
క్షసేంద్ర॥ (తే,గీ) ధరణిఁబాపాత్ముఁడగువాఁడుతనకయోగ్య। మైనదివ్యవిమా
నంబునధిగమించి। నట్లుచపలుండవగునీవనర్హమైన। విభుతనెబ్బంగి నొంది
తివిబుధవైరి। (తే,గీ) పరఁగనెవ్వానికెద్దిస్వభావమదియుఁ। జాలదురతిక్రమం
బగుఁజపలచిత్తు। లైనవారిగృహంబులనధివసింపఁ। జాలదిలఁబెద్దకాల మైశ్వ
ర్యమసుర॥ (ఉ) రాముఁడునీకుఁదొల్లియప రాధముఁజేసి యెఱుంగఁ డట్టిబా।
హామహిమాభిరామునక హస్కర తేజునకెగ్గుసేయఁగా। నీమదినెట్లు చూచితి
వి నిక్కముదీనఁబొసంగుఁజేటుసం। గ్రామమునం దదీయపటు కాలకటాక్షుని

భాస్త్రసంహారికిన్॥ (ఉ) ఏమనుజేంద్రుపత్నినిపు డెత్తుక ముచ్చిలిపోయె దార
ఘు। స్వామిపరాక్రమంబుభుజశక్తియునోర్వఁగనోపునే ఘనుం। డీమహిఁ జుప్ప
నాతికయి యింతకుమున్ను ఖరాసురుండుత। ద్భీమకృతాంత దండనిభ దీప్తశ
రాహతినుర్విఁ గూలఁడే॥ (చ) కడువడిఁ గంఠలగ్నమగు కాలుని పాశముగాఁ జె
యంగున। న్మడిచినవిస్ఫులింగముగఁ బుక్కిటఁ బట్టినదుర్విషంబుగాఁ। గడఁకనె
త్తింగిసీతనిటఁ గ్రక్కునడించితొలంగుమట్లుగా। నొడఁబడవేనిఁ గూలెదుత దు
గ్రశరార్చులఁ గాలిత్రేల్మిడిన్॥ (క) హరివజ్రమునిజహేతులఁ। గరమరుదుగ
వృత్రదైత్యుఁ గాల్చినభంగి। న్నరపతినయనోత్థితభీ। కరదహనార్చులను నిన్నుఁ
గాల్పక యున్నే॥ (వ) రావణా యేభారద్రవ్యంబు నరునిఁ బీడింప దట్టిదాని మో
వందగు నేయన్నంబు రోగంబు నుత్పాదింపక జీర్ణించు నట్టియన్నంబు భుజిం
పందగు నేకర్మకరణంబునఁ గీర్తియశోధర్మంబులు నశించు నట్టికర్మం బె
వ్వండాచరించుఁ బ్రమాదంబునం గావించెనేని దానశరీరఖేదంబు గలుగు నంతి
యేకాని ఫలంబేమియు లేదు నాకఱువదివేలవత్సరంబు లతీతంబు లయ్యె నాఁ
టనుండి పితృపైతామహంబైన ఖగరాజ్యంబుఁ బరిపాలింపుచున్నవాఁడ। (చ)
చిరమగుకాలము న్ననుట చేఁ గడువృద్ధుఁడనైతి నేను నీ। వరయఁగఁ బ్రౌఢమూర్తి
విశతాంగి విధన్వి విఖడ్గి వస్త్రివై। వఱలుదువైన నేమి యసి వారణ చాతురిన
న్నుమీఱియు। ప్పరుసున నీకు రాఘవుని పత్నినిఁ జేకొనిపోవవచ్చునే॥ (వ) మఱి
యు ద్రవద్రవ్యంబగుటవలన క్షీరంబుమాడ్కి సురపేయంబని యెడు నది మొద
లుగాఁగల తర్కసంయుక్తయుక్తుల చేత సుర పేయంబుగాదని నిషేధించు నట్టి
నిత్యంబైన దానినిరపేక్షులక్షణంబైన వేదశ్రుతిని బురుషుండెట్లు హరింపశక్తుం
డుగాఁ డట్లు నీవు శ్రుతిమాడ్కి హేతురాహిత్యంబున నుపదిష్టయైన సీత నా
మోలబలాత్కారంబున నపహరించుటకు శక్తుండవుగావు మహాత్ములగు రా
మలక్ష్మణులు దూరగతులగుచుండఁ జౌర్యంబున వైదేహిం గొని భయంబునం
బరువెత్తుచున్నవాఁడవు నీవు శూరుండవేని నాతో ద్వంద్వయుద్ధంబు సేయుము
కాదేని యొక్కముహూర్తంబు నిలువుము పెక్కుమాఱు లెవ్వానిచేత సంగ్రా
మంబున దైత్యదానవులు పెక్కండ్రు నిహతులై రట్టి జటావల్కల ధరుండైన
రాముండు చనుదెంచి జనస్థాననగతుండైన ఖరునింబోలె నిశాతసాయకంబుల
నిన్నుం బడవైచి తనపత్నిం గొనిపోవు నే నారామునకు సచివుండ నాయెడలఁ



బ్రాణంబులుండ నీవు వైదేహి నెత్తికొనిపోవంజాలవు ప్రాణంబు లర్పించి
యైన రామునకు దశరథునకు హితంబుఁ గావింపందగినవాఁడ నోపినకొలంది
నీకు యుద్ధాతిథ్యం బొసంగెద నీకుఁ బ్రాణంబులపైన నాసగలదేని వైదేహింబ
రిత్యజించి తొలంగిచను మట్లుసేయవేని వృంతంబువలన ఫలంబుంబోలె రథం
బువలన నిన్నుం ద్రెళ్లవైచెదఁ జూడుమని పలికి యజ్జటాయువు రోషావేశంబున

(*) జటాయువు రావణునితో యుద్ధము చేయుట. (*)

నిలునిలుమని యదల్చి తాఁకిన నద్దశగ్రీవుండు సక్రోధుండై వింశతిలోచనంబుల
నగ్నికణంబులొలుకఁ గాంచనకుండలరోచులు గండభాగంబుల నిండుకొన మం
డలీకృతకోదండుండై ప్రచండంబుగా నయ్యండజ మండలాఖండలుం దలపడి
యె నివ్విధంబున మార్కొని పక్షవంతంబులైన మేసుంబులపగిది నితరేతరసం
ఘర్షణంబుల నన్యోన్యప్రహారణంబులఁ బరస్పరధిక్కారంబుల నక్కజంబుగాఁ
బోరుసమయంబున॥ (శా) ప్రాచుర్యంబుగ రావణుండు నిశితోగ్ర క్రూరనాళీకనా।
రాచంబుల్ని గుడింప గృధ్రవిభుఁడు గ్రక్రోధుఁడై జన్యవి। ద్యాచాతుర్యము మీఱఁ
దచ్ఛరములన్ద్రాటించి పెన్గోళ్లన। న్నీచాంగంబు వ్రణంబుఁ జేసె రుధిరోన్మేషంబు
వాటిల్లఁగన్॥ (ఉ) అంత దురంత కోపమున, నద్దశకంధరుఁ డుగ్రవృత్తిఁగా।
లాంతక కాలదండ సదృ, శాంబకముల్పది యొక్క పెట్టన। త్యంతరయంబు
నం బఱపి, యద్భుతభంగి గుణస్వనంబురో। దోంతర మెల్ల నిండఁబత, గా
ధిపు గాత్రము నొవ్వఁ జేసినన్॥ (ఉ) దానికి నించుకైన మదిఁ, దత్తర మంద
క పక్షినాథుఁడా। దానవు తేరిపై బహువి, ధంబుల నాతిఁ గృశింపుచున్న
యా। జానకిఁ జూచి రోషమతి, సాహసికత్వము చెంగలింపఁగా। లానలు
భంగి మోము చెలు,వారఁ బరాక్రమ దుర్నివారుఁడై॥ (చ) అలయక వాని
విల్లు చర,ణాహతిఁ ద్రుంచిన వెండి కోపము। గ్గలముగ నొండు విల్లుగొని, కాం
డము లొక్కట నూఱువేయు ల। క్షులు నిగుడింపఁ దచ్ఛరని, కాయము చే
తఁ బరీతుఁడై మహా। బలుఁడు కులాయమధ్యగత, పక్షివిధంబునఁ జూడనొప్పు
చున్॥ (తే,గీ) మేదురపతత్రజాతస, మీరణమున। రావణశరంబులన్నియుఁ,
బోవఁ దట్టి। కఠిన వజ్రాభచరణాన ఖప్రహతుల। మఱల దశకంధరుని విల్లు

(*) జటాయువుచేత రావణుఁడు విరథుఁడగుట. (*)

విఱిచివైచె॥ (చ) అంతటఁ బోక పక్షివరుఁ, డంఘ్రుల వాని ధ్వజంబు ద్రుం

చియుం। తింతలు తున్కలై వెసమ, హేమస్థలి వ్రాలం బతాకం దన్ని ప। రూం
తముల న్హయంబుల ర, యంబునం జంపి తదీయకంకటం । బంతయుం జించి
సూతుం దెగ, టాచి ఖరనఖంబులం జించె ఛత్రముల్ ॥ (వ) మఱియుం ద్రివేణుసం
పన్నంబును బావకసన్నికాశంబును గామసంచారక్షమంబును మణిహేమవిచి
త్రాంగంబు నగు రథంబుం బఱియలు వాపి గ్రాహక సహితంబుగాం జామరం
బులు భంజించి పక్షీంద్రుం డక్షీణభుజావిక్షేపంబుం జూపిన నద్దశగ్రీవుండు వి
రథుండును హతాశ్వుండును హతసారథియునై నిజాంక భాగంబున వైదేహిని
డుకొని శీఘ్రజవంబున ధరణిపయిం బడుటయు నతని పరాభవంబుం జూచి సక
లభూతంబులు సాధువాక్యంబులం బక్షీంద్రునిం బ్రశంసించి రంత రావణుండు
భూతలపతితుం డయ్యును జరాభారంబునం బరిశ్రాంతుండై యున్న జటాయువు
నుం జూచి సంహృష్టచిత్తుండై క్రమ్మఱ నమ్మహీపుత్రితోడ గగనంబున కెగసి
యతిత్వరితగమనంబునం బోవుచుండ నయ్యండజశ్రేష్ఠుండు తోడనె యెగసి
నిలు నిలు మని యదల్చి పక్షవిక్షేపసంజాతవాతవేగంబున నతనిసుడివెట్టునా
ర్గాగంబుగా నడ్డంబు నిల్చి పరుషవాక్యంబున నిట్లనియె ॥ (చ) అశనిసమా
నబాణుండు మహాత్ముండు రామవిభుండు తత్సతిం । బశుపతిం జేసి బల్మిం గొ
ని, పాపెద వాత్మవధార్థమ మీవయో । దశముఖ చేటెఱుంగక మదంబున
మీనము మాంసబుద్ధిచేం । బిశితము తోడ నున్న పెను గాలము మ్రింగిన
చందమేర్పడన్ ॥ (క) దితిజాధిప బాంధవబల । హితభృత్యామాత్యసుతస,
హితముగ సుపిపా । సితుండుదకముం గ్రోలిన క్రియ । హితమెఱుంగక విషముం
ద్రావి, తేటికిం జెపుమా ॥ (క) అవిచక్షణులగు పురుషులు । భువిలో నా
త్మీయదోష, మున నష్టప్రా । భవులై సీవిధమున నా । సవవైరి నశింతు రిం
త, సత్యంబరయన్ ॥ (ఉ) ఒంటిగ నున్నచో రఘుకు, లోత్తము దేవిని మ్రు
చ్చిలించుటే । బంటుతనంబు నీకుం గుల, పాంసనయమ్మహనీయకాముకుం।
డంటినం గిన్కం దిగ్మవిశిఖాహతి నిన్ను వధించి సీత ని । ష్కంటకవృత్తి వెం
డికొనుం,గాకికై నిన్ను మనంగ నిచ్చునే ॥ (క) అచ్చుపడంగ నీవీగతి। వచ్చి
టయును సీత నిట్లు, వంచించి రహిం । దెచ్చుటయు విని సహింతురె । సచ్చ
రితులు రాజసుతులు, సంగరధీరుల్ ॥ (చ) కడువడిం గాలపాశ మురి, గాంగ
మెడం దవిలించి కొంటి వె । కడం జన వచ్చునీకు దశకంధర పుత్త్రబలా



న్వితంబుగాం । దడయక రాఘవుండు నిశి, తప్రదరానల హేతుల న్రయిం। బ
డరంగ నిన్నుం గాల్చు భయ, దాజిమహీస్థరదైత్యునిం బలెన్ ॥ (క) ధరణిం
తటి వాండైనను । దిర మెఱుంగక నీచబుద్ధిం దాం జేసినదు । ష్కరపాపకర్మ
ఫలమును । గుఱుతుగం దోడ్తోడం గట్టి, కుడువక యున్నే ॥ (క) ధీరుండ వగు
నీచేనిటు । లారయం గడు నింద్యకర్మ, మది కృతమయ్యెం । జోరాచరితప
థం బిది । వీరాచరితంబు గాదు, విబుధవిరోధీ ॥ (క) లోకనిగర్హితమ
గు పనిం । గైకొని కావించు నట్టి, కలుషాత్ముండా । లోకేశుండైన మేదినిం । బ్రా
కటముగ సిరియుం దక్కం, బ్రతుకంగలండే ॥ (వ) దురాత్మా మృత్యుకాలంబునం
దుం బురుషుం డాత్మవినాశనంబు కొఱకు నెట్టి కర్మంబు నొందునట్టి సీతాహరణ
రూపకర్మంబు నొందితివి దీన నీకు మృత్యువు సిద్ధించు నేకర్మంబు నకుం బాపా
నుబంధంబు గలుగు నట్టి కర్మంబు భగవంతుండగు లోకేశ్వరుండైనను గా
వింపండని బహుప్రకారంబుల నుపక్రోశింపుచు నంతకంతకుం గోపం బగ్గలం
బగుటయు నప్పతంగకుల పుంగవుండు శీఘ్రంబునం బఱతెంచి రావణుని వీపు
న వ్రాలి గజారోహకుండు మదవారణం బధిరోహించి యాదృశ వ్యాపారవం
తుం డగు నత్తెఱంగున వాని నాక్రమించి తీక్ష్ణనఖంబుల విదారింపుచు నిశాత
తుండంబున వ్రణంబు సేయుచుం గేశంబు లుత్పాటింపుచు నఖపక్షముఖాయు
ధుండై వెండియు బహుప్రకారంబుల నొప్పించిన నతండు బెండు పడక రోష
విశేషంబున నమర్షస్ఫురితోష్ఠుండై కంపింపుచు వైదేహిని వామాంకంబు
నం గ్రుచ్చి పట్టి కరతలంబున జటాయువు వ్రేసిన నతండు కడు నలిగి యన్ని
శాచరు నాక్రమించి నిశితంబైన తుండాగ్రంబున వాని వామబాహుదశకంబు
ఖండించిన నవి క్రమ్మఱం బొడమి రక్తధారాస్నపితంబులై విషజ్వాలావళీయు
క్తంబులైన పన్నగంబుల కరణి నొప్పుచుండె నిత్తెఱంగున రావణుండు జటా
యువుచేత వ్రేటువడి తాను బ్రౌఢుండయ్యును వృద్ధుండగు జటాయువుం గడు
వం జాలక చిక్కువడి యాడుం గఱచి శీఘ్రంబున వైదేహిం డించియతనితోడ
బాహుయుద్ధంబునకుం దలపడి ముష్టిప్రహారంబులం జరణ తాడనంబుల బడ
లుపడం జేసిన నవ్విహంగమపుంగవుండు వెనుకదీయక రామార్థంబు శరీరా

—(*) రావణుండు జటాయువుయొక్క పక్షపాదంబుల ఖండించుట (*)—

యాసజనకంబైన రణంబు సేయుచు మార్కొనిన నసమాన పరాక్రముండైన

యా రాక్షస నాథపక్షినాథులకుఁ గొండొకసేపు దారుణంబగు సంగ్రామంబు చెల్లె నంత నద్దశగ్రీవుండు ॥ (క) కడిమి మెఱయ ఖడ్గముఁ గొని । కడువడి సమరమున రామ, కార్యార్థము పో । రెడు ఖగపతిపక్షంబులు । కడఁకం బాదములు రెండు, ఖండించె వేసర ॥ (వ) అంత ॥ (క) పక్షివిభుఁ డిట్లు ఖండిత। పక్షుండై యసివిలూన, పాదుండై ర । క్తోక్షిత తనుఁడై యపగత । ప్రేక్షుండై తత్క్షణంబ యిలపైఁ బడియెన్ ॥ (తే, గీ) ఇట్లు ఱంగున దుష్టుఁడై, త్ర్యక్ష సఖ్య । ఖండితపతత్త్ర పాదుఁడై, కడమిడక్కి । పుడమిఁ బడియున్న ఖగపతిఁ, బోలఁ జూచి । జనకసుత శోక మడరంగఁ, జాల వగచె ॥ (వ) మఱియు రావణ భుజావేగ మర్దితుండై శాంతంబైన దావానలంబు పగిదిని స్తేజుండై పుడమిం బడి యున్న వాని నీలజీమూత ప్రకాశకల్పుండగు వానిఁ బాండుర వక్షుండగు వాని మహావీర్యుండగు వాని గృధ్రపతి నవలోకించి దుఃఖార్తయై కరంబుల సంస్పృశించి శశిప్రభానన యగు జానకి భర్త నుద్దేశించి యిట్లని విలపించె ॥

## (*) సీతాదేవి జటాయువును జూచి విలపించుట. (*)

(సీ) పరఁగఁ బింగళ్యాది, పక్షిసర్వజ్ఞాన మక్షి పరిస్పంద, నాదిజన్య । లక్షణజ్ఞానము, లాస్థలి నరులకు గణుతింప సుఖదుఃఖ, కారణంబు । లంద్రు నేఁ డిట్లున్న, న్నసురుఁ డెత్తుకపోవు టెంతయు నిచ్చటి, మృగఖగములు । సూచింపఁ జేయుచు,సారది గుంపులు గట్టి చరియింపు చున్నవి, సంభ్రమమునఁ ॥ (ఆ, వె) ప్రాణనాథ నాకుఁ, బాటిల్లి నట్టియీ । వ్యసన మీవె ఱుంగ, వైతి వేల । నర వరేణ్య నేఁడు, నాయ భాగ్యం బునఁ । జేసి నీదు బుద్ధి, చిక్కెనొక్కొ ॥ (క) ననుఁ గావవచ్చి పాపపు । దనుజుని చేనిహతుఁడగుచు ధరణింబడెనీ । యనఘుఁడు పక్షీంద్రుండీ । తనిబుణమే పగిదిఁ దీర్పఁ దగు నీకధిపా ॥ (శా) హా రాజోత్తమ హా కృపాజలనిధీ, హా రామ హా లక్ష్మణా । ఘోరారణ్యమునందు రాక్షసుఁడు నన్ గొంపోవుచున్నాఁడు దో । స్సారోదారుని వీనిఁ జంపి ననుఁ జం,చత్ప్రీతి రక్షింపరే । రారే వేగమె వీని కడ్డపడరే, రమ్యాకృతు ల్చూపరే ॥ (వ) అని యిబ్భంగి గృశింపుచు న్విభుని సు,వ్యక్తంబుగాఁ జీరుచు । న్ఘనవృక్షంబులఁ గౌఁగిలించుకొనుచుం, గంపింపుచు న్బాష్పము । ల్చినుక న్బొరలన నేడ్చు జానకిని రోషోద్దీప్తగర్వ చూడామణి । న్గని దైత్యాధముఁ డుగ్రుఁడై పరుష వా,క్య ప్రౌఢిఁ దర్జింపుచున్ ॥ (మ) కడిమిం గ్రమ్మఱఁ గైకొనం దలఁచు న,క్కాలంబున న్సా



ధ్వసం । బడరన్దిక్కులఁ జీకటుల్గవిసెఁ బద్మాప్తుండు నిస్తేజుఁడై । జడతం జెందె సమీరణుండు వగ హెచ్చన్నీవ కుండె న్మను । ల్కడు శోకంబున సీత పాటుఁ గనికిన్ గ్రందూఱె రెంతే విధిన్ ॥ (వ) మఱియు సచరాచరంబగు జగంబంతయు నతిక్రాంతనై సర్గకావస్థానం బయ్యెఁ బితామహుండు దివ్యజ్ఞానదృష్టి నాలోచించి దేవతాకార్యంబు కృతంబయ్యెనని పలికె దండకారణ్యనివాసులగు మహర్షులు సీతానిమిత్తంబున రావణునకు వినాశంబు వాటిల్లు నింక సకల లోకంబులకుఁ బరమకల్యాణంబు గలుగునని గుసగుస వోవుచు నప్పటి వైదేహి దురవస్థ విలోకించి దుఃఖింపుచుండిరి యివ్విధంబున రావణుండు రామలక్ష్మణులం బేర్కొని విలపింపుచున్న జానకిని బలాత్కారమున నెత్తికొని శీఘ్రంబున నాకాశంబున కెగసె నప్పుడద్దేవి వస్త్రాభరణసువర్ణాంగియుఁ బీత కౌసేయవాసినియునై సుదామాఖ్యపర్వతంబునం బుట్టిన మెఱుంగు చందంబున నొప్పె మఱియును ॥ (క) కమనీయంబగు సీతా । కమలేక్షణ మంజుపీత, కౌశేయము చే । నసురారి యొప్పె నప్పుడు । సమీరసఖు చేత నీల, శైలము మాడ్కిన్ ॥ (తే, గీ) మఱియు నయ్యింతి లోహిత,సురభిపద్మ । పత్త్రములు రావణుని మీఁదఁ, బడియె నపుడు । పీతకౌశేయపట మొప్పె, నాతపమున । నినమరీచుల చేఁ దామ్ర,ఘనము పగిది ॥ (సీ) చారుతామ్రోష్ఠంబు, చాంపేయ కుసుమోపమాన సునాసా,సమన్వితంబు । పద్మగర్భాభంబు, పాండరదశనాభి రంజితంబ లకాభి,రాజితంబు । శుభదర్శనంబు మం,జులకపోలతలంబు దీర్ఘలోచనసము,ద్దీపితంబు । కనకప్రభంబు శృం,గారలలాటంబు సలలితతారకా,విలసితంబు ॥ (తే, గీ) నగుమహీపుత్రి వదనమొ, ప్పారె నపుడు । శోకభరమున నొక్కింత,సొబగుదప్పి । పవలు గనుపట్టు రోహిణీ,పతి విధమున । రాత్రిఁ గనుపట్టునవ తామరసము పగిది ॥ (తే, గీ) మఱియు నీలాంగుఁడగు దైత్య వరుని యంకమున సువర్ణాంగియగు మహీ పుత్రి యొప్పె । విమల కాంతి శోభిల్లు నీ,ల మణి నాత్రి । యించిన వినూత్న కాంచన, కాంచి పగిది ॥ (తే, గీ) వెండియు వెడంద కాటుక, కొండ పగిదిఁ । గ్రాలు దేవారి యంకభాగమున దీప్త । హేమభూషణ యగు నమ్మహీజ యొప్పె । మేచకాభ్రంబు చెంగట, మించుఁ బోలి ॥ (క)

## —(*) సీతాదేవి ధరించియున్న పుష్పాభరణాదులు పుడమిం బడుట. (*)—

రోషాదరుఁడా జానకి । భూషణ ఘోషమున నలరెఁ, బుష్కరవీధి । న్భీషణము

గళంపాని । ఘూర్ణమాయతి ఘనముక్రియన. కుంతితలీలన్ ॥ (చ) గుఱుతుగ
నమ్మహీతనయ , కొప్పునఁజుట్టిన మంజుపుష్పము । ల్పురకుధరంబుపైఁ । బడె
డు.చుక్కల కైవడిఁ గొన్నియన్నిశా । చరుపయి వ్రాలె వ్రాలె వరు,సన్నతి
కొన్నిమ హీతలంబుపైఁ । గరమవివేకి యైన దశ, కంఠుయశః కుసుమంబు
లోయనన్ ॥ (తే.గీ) మఱియున ద్దేవి కాంచన, మణివిచిత్ర । నూపురముమిం
టనుండిమ నోజ్ఞ ఘణితి । మధురముగ మ్రోయుచును దటిన్మండలంబు । ప
గిదిరయమున ధరణిపైఁ, బడియెనపుడు ॥ (క) తరుపల్లవశోభితయగు । ధ
రణీనందనవినీల,తనుఁడగు రాత్రిం । చరుని వెలయించె నప్పుడు । కరమరుదుగ
హేమకక్ష్య,గజమును బోలెన్ ॥ (క) త్వరితగతి నేగుతఱిన । వ్వరవర్ణిని
దీప్తవహ్ని,వర్ణవిచిత్రా । భరణములిల వ్రాలెనభోం । తరమున సంక్షీణలైన
తారలమాడ్కిన్ ॥ (తే.గీ) చంద్రుచంద్రికగతినొప్పు,జనకపుత్రి । హారధా
రతదీయస్త,నాంతరప్ర । గళితయైయుర్విఁ బడియె న,క్కజముగాఁగ । గగన
మునమండి పడియెడు,గంగఁబోలి ॥ (వ) మఱియునానాద్విజగణ యుతంబు
లగు పాదపంబులుత్పాతవాతాభిహతంబులై విధూతాగ్రంబులచేత వైదేహి
కభయంబుఁ జెల్పినట్లొప్పుచుండెఁ, గమలాకరంబులు విధ్వస్తకమలంబులై వి
త్రస్తమీనవిహంగమంబులై మూర్ఛితయైనసఖింబోలె వైదేహి నుద్దేశించిత
గీయదుర్దశాదర్శనంబువలనసంప్రాప్తనిశ్వాసంబులై దుఃఖించినట్లుండెసిం
హవ్యాఘ్రమృగద్విపంబులురావణునిదౌరాత్మ్యంబునకునాక్రోశింపుచుసిలిచిన
చోటనిలువక రావణవిషయరోషంబున ఛాయానుగతంబులై పరుగెత్తుచుండెఁబ
ర్వతంబులుజలప్రపాతాశ్రుముఖంబులై శృంగంబులను సముచ్ఛ్రితభుజంబులుగ
లిగిగుహాముఖంబుల మొఱపెట్టినట్లుండె దివాకరుండు దీనుండై నిష్ప్రభుండై
పాండురమండలుండయ్యె నపాంసులాశిరోమణియగు వైదేహి నిరావణుండుప్రము
చ్ఛిలిగొని పోవుచున్నవాఁడు లోకంబులనింక నార్జవంబునునానృశంస్యంబు
ను సత్యంబును ధర్మంబును లేదని సకలభూతంబులు గుంపులుగట్టి పెక్కు
చందంబుల విలపింపుచుండె మృగపోతంబులు దీనముఖంబులై బాష్పపాతా వి
తులంబులైన నయనంబుల సారెసారెకు సీతనవలోకించిరోదనంబు సేయుచుం
డె రామలక్ష్మణా గమనకాంక్ష చేత ధరణీతలంబు నవలోకింపుచు బహుప్ర
కారంబులవిపింపుచు రావణాంకగతయై గగనంబునంజనుచున్న జానకినవలో



కించి వనదేవత లాకంపితగాత్ర లైరి రావణుండు సీతనపహరింపుచుండఁ జరా
చరంబగు లోకం బంతయు మీనసంక్షోభచలితంబైన కమలాకరంబు చందంబు
నం జూపట్టె నిర్లజ్జుఁగున దురాత్ముండగు రావణుండు సమాకుల కేశాంతయు
విప్రమృష్టతిలకయునగు వైదేహినపహరించి యాత్మవినాశనంబుకొఱకుఁదనపా
లి మృత్యువుంగొని పోవు కైవడి నతిత్వరిత గమనంబున నాకాశంబునంబోవన
ప్పుడు శరీరంబు వడంక మొగంబునం జెమటచెమట గ్రమ్ముదేరఁ దీఁగె చందంబు
న నడలుచు నుచ్చైస్స్వరంబున రోదనంబు సేయుచు రామలక్ష్మణులం జీరుచు
దిక్కు లాలోకింపుచు వనదేవతలం బేర్కొనుచుఁ దనదురవస్థకు దైవంబుదూ
ఱుచు రోషరోదనతామ్రాక్షియై యలుక వొడమిన చిత్తంబున నమ్మహీపుత్రి
*)సీతాదేవి తన్ను బలాత్కారముగా నెత్తికొనిపోవు రావణుని దూఱుట(*
రావణునుద్దేశించి యశనిపాతకల్పంబైన దారుణవాక్యంబుననిట్లనియె॥ (క)ఓ
రిదురాత్మకమత్పతి । దూరంబున కేగియుండ దొంగిలితినుదు । ర్వారోద్ధతిఁగొని
యీగతిఁ । బాఱుట కటసిగ్గుగాదె పరికింపంగన్ ॥ (సీ) కాంచనచిత్రమృగం
బువచ్చుటయును రహిమీఱఁదత్ప్రతిగ్రహణబుద్ధి । నాకుఁబుట్టుటయునునరనా
యకుఁడుదానిఁబోలుపారఁబట్టఁ తేఁబోవుటయును । వికృతనినాదంబువినవచ్చుట
యునుదోడ నెలక్ష్మణుఁడుపోవుటయునుదలఁప । నిపుడుసీమాయగా నెఱిఁగితిఁ
గాకున్న భిక్షుఁడవై వచ్చి పిదపనింత ॥ (తే, గీ) పనికిఁ జొత్తువె నీచాత్మ ప
క్షినాథు । నధిక వృద్ధునిఁ జిరజీవి, నాహవమునఁ । గడిమి నిటు మన్ని
మిత్తంబు, గా వధించి । తరయ నిది బంటు తనముగా, దసురనీకు॥ (చ)
పతికడలేనిచోటఁబర భామనుబల్మిగ్రహించిపోవుటే । చతురతనీపరాక్రమము
సత్వముసర్వముఁ దెల్లమయ్యెగర్హితమగు నీచకృత్యమొన రించుట కెంతయుసిగ్గు
గాదెకు । త్రిభువనకీర్తిహంబునుంబరము చేకుఱునేరజనీచరాధమా॥ (తే, గీ) కడ
రామలక్ష్మణులసంగ్రామమందు । మెచ్చగజయించినను గొని తెచ్చితేని । య
పుడునీశౌర్యమదిగొనియాడవచ్చుఁ । జౌర్యమునఁగొని తెచ్చుట శౌర్యమగునె
(ఉ) ఎక్కడిసత్వమేటిఘనమెక్కడిశౌర్యముబుద్ధిహీననీ । వక్కట మేటిరక్క
సుల కంజజుకేక్రియ రాజవైతిని । న్నెక్కుడుగాఁగ శూరవరు లేక్రియఁ జూచిరి
యిన్నినాళ్లునీ । వెక్కడనన్నుబల్మిఁగొని యేగుట యెక్కడ రాక్షసాధమా॥
(వ) దురాత్మా కులనిందాకరంబైన యీదుష్కృతకర్మంబాచరించి రామ

భయంబునం బాఱెద వేను యువతి నగుటవలన నివారించుటకు శక్యంబుగా
కున్నది శూరుండ వేని యొక్క ముహూర్తంబు నిలువు మస్త్రైన భవదీయవిక్ర
మం బెల్లవారికిం దెల్లంబగు నమ్మహాత్ముల చక్షుష్పథంబునం బడి బ్రతికిపోవంజా
లవు విహంగమంబులు దీప్తవహ్నిస్పర్శంబునంబోలె నద్దివ్యపురుషుల శరస్ప
ర్శంబు సహించుటకు యమాదులైన సమర్థులు గారు నీవు బుద్ధిమంతుండ
వై జీవితంబునకు హితంబపేక్షించి నన్ను విడువు మట్లు సేయవేని మత్ప్రధర్ష
ణరుష్టుండై రాముండు నిన్ను నాశంబు నొందించు దానంజేసి నీవ్యవసాయం
బంతయు నిరర్థకంబై చను విబుధసన్నుతుండగు రామునిం బాసి యొక్క నిమి
షంబైన జీవింపనేర్తునె నిష్ఫలుండవగు నీకుం జిరకాలంబు లంకావాసం
బును శుభంబును గలుగనేరదు ముమూర్షులగువారికిం బథ్యవాక్యంబసహ్యం
బై యుండు నాసన్నమరణులగువారు మృత్యుగ్రస్తులై విపరీతకర్మంబు లాచ
రింతురు మత్కారణంబున నీవు దుర్నివారంబైన కాలపాశంబునం గట్టువడితి
వింక నెక్కడికిం బోయెదవు శీఘ్రంబున హిరణ్మయవృక్షంబులను రుధిరవాహి
నియగు వైతరణీనదిని భీమంబైన యసిపత్రవనంబును దప్తకాంచనపుష్పంబై
వైడూర్యప్రవరచ్ఛదంబై కాలాయసకంటకచితంబై యొప్పు శాల్మలీపాదపం
బును విలోకించెద వదియునుంగాక॥ (క) రోగాతురుండు మోహంబున। బా
గుగ విషమానినట్లు ఖానుకులునకీ। లాగున నహితము జేసితి। వేగతిభువిలోఁజ
రించెదింకం గుశలివై॥(చ) ఒకనిమిషంబులోఁ గలన నొక్కఁడె యెవ్వఁడు వజ్రక
ల్పసా। యకములచేఁ జతుర్దశసహస్రనిశాటులఁ ద్రుంచెనట్టియ। స్త్రకుశలుఁ
డుగ్రవీర్యుఁడగు రాఘవుఁ డిష్టసతిన్హరించిత। కక్కకచనినట్టినిన్నుఁ బటు। కాండ
ములన్వధియింపకుండునే॥ (వ) అని యేతాదృశంబులగు దారుణవాక్యంబు
లగహీంపుచు నమ్మహీపుత్రి భయ శోక రోషంబులు మనంబున ముప్పిరిగొన

—(*)సీతాదేవి యాభరణంబుల మూటగాఁగట్టి వానరులవద్దవైచుట.(*)—

నానాప్రకారంబుల విలపింపుచు రావణాంకగతయై వడంకుచు నంబరంబునం
బోవుచు నొక్కయెడ॥ (చ) ఒకధరణీధరాగ్రమున నొప్పెడు వానరపంచకం
బుఁ ద। ప్పక పరికించి దివ్యమణి భర్మమయాభరణంబులుత్తరీ। యకమునఁ గ
ట్టి నా దువిధ మంతయు రామునితోడఁ జెప్పుఁడీ। యకుటిలబుద్ధిచే ననుమనప్పుడు
బ్రోచెదరంతరంబునన్॥ (ఉ) ఆవిధ మొంచుకైనను శాస్యుఁడెఱుంగక సం



భ్రమంబునం। బోవుచునుండె నంతఁ బిమ్ముంగలఁ బడ్డ సువర్ణభూషణ। శ్రీవి
లసన్నవీనమృదు చేలము గన్గొనియుద్ధులెత్తిరయెం। తేపడిమింట నేగుధర ణీసు
తఁ గన్గొని రావళీముఖుల్॥ (సీ) రాక్షసేశ్వరుఁడిట్లరుగునఁడనపాలి మృత్యువు
నట్లు మహీకుమారి। వడినెత్తికొని ముదంబడరఁ బంపసుదాఁటి నదులు వనంబులు
నగములంత। నంతఁ జూచుచు విశిఖాసనచ్యుతమైన కాండంబుకై నడి గగనవీధి।
లంకాభిముఖముగా రయమునఁ జనిచని తిమినక్రకచ్ఛప వి స్తీర్ణమైన॥(తే,గీ) వ
సధిఁ గన్గొని దశకంధరునకు దీనఁ। జేటు వాటిల్లునని యెంచు సిద్ధవరుల। పలుకులతి
ఘోరభంగి వీనులను బోలయ। నురుజవంబున నయ్యబ్ధి నుత్తరించె॥ (వ) అప్పు
డవ్వరుణాలయంబు పరిభ్రమంబునం బరివృత్తతరంగంబును రుద్ధమీనమహోర

——రావణుండు సీతనెత్తికొని తన యంతఃపురమున కరుగుట.——

గంబునై యుండె రావణుండు పయోధి నుత్తరించి భుజంగిభంగి వివేష్టమా
నాంగియైన జానకింగొని విభక్తమహాపథంబైన లంకాపురంబుఁ బ్రవేశించి సం
రూఢద్వారబహుళంబైన యంతఃపురంబులోనికిం జని మయుం డాసురియగు
మాయనుంబోలె శోక మోహ పరాయణయగు వైదేహి నచ్చటడించి రాక్ష
సస్త్రీల నవలోకించి యిట్లనియె॥ (శా) నాపుణ్యాతిశయంబునన్ధారికనీ నాకీల
లామంబు మీ। రేపారన్వినయోక్తి నేమఱక నెం తేఁ బ్రీతిమన్నింపుచు। నేప్రొన్నా
పుమదివ్యభూషణమణి శ్రీగంధ మాల్యాంబర। వ్యాపారంబుల నాదరింపుచు
ముదం బారంగ రక్షింపుఁడీ॥ (వ) మఱియు నెవ్వరేని జ్ఞానంబునం గాని య
జ్ఞానంబునం గాని యప్రియవచనంబున నిద్దేవికి మనఃఖేదంబు సంపాదింపుదు
రట్టివారు ప్రాణాంతంబైన మదీయదండంబునకుం బాత్రులగుదు రిక్కాంతను
బుద్ధిపూర్వకముగా నైనను యువతిగాని నాయాజ్ఞలేక విలోకింపంగూడ దట్లు జాగరూ
కలై రక్షింపుండు॥ (చ) అని నియమించి వెండియును రాత్రిహాజారముఁ జేరియిం
కనే। పనిగొనసరించు వాఁడనని భానమునందలపోసి మాంసభో। జనులఁ బరా
క్రమాధికుల శైలనిభాంగుల భూరిసత్త్వుల। ననుజులఁ గొంచుఁ గనిమదంబు
ననిట్లనిపల్కె ధీరత॥ (ఉ) మానితబాహుశౌర్యులసమానబలు ల్ఖరదూష
ణుల్బల। శ్రీనిధులొక్కమానవుని చేహతులైరి బలాన్వితంబుగా। మానుగ
వాసవాదిసుర మండలికిం జొరరాని యాజన। స్థానము సర్వరాక్షసవిశాలమ
రాక్షసమయ్యెవింటిరే॥ (చ) అనుజుని పాటు నేను విని నప్పటినుంచి యహర్ని

—— రావణుం డెనమండ్ర రాక్షసుల జనస్థానంబునకుఁ బంపుట ✱——

[illegible] యునాత్మలోఁ గినుకఁ బూనితి నేక్రియనైన వైరినా । శనమొన
[illegible] పకున్న నిఁక సుస్మితిఁ గంటికి నిద్ర వచ్చునే । యనుపమ సౌఖ్యమబ్బునె మహాసు
[illegible] రాజ్యపదంబు లబ్బునే ॥ (చ) అరివిజయార్థమే నిపుడు యత్నముఁ బూనితి
[illegible] రాక్షసు । స్థిరమగు పౌరుషంబును విశేషబలంబును సంశ్రయించి భీ । కరము
గ నెల్లవారు బలుకైదువులన్ గయిసేసి మీరు సం । గరమునకింక నాయితము గండుప
రాక్రమదుర్నివారులై ॥ (వ) సంగ్రామంబున రిపుండగు రాముని వధించి ధనం
బు నధిగమించిన నిధానుని పగిది నేను సుఖంబు నొందెద నిది మదీయ నిశ్చ
యంబు మీరు సురసంగ్రామంబులందు బహుప్రకారంబుల నారితేరియున్న వా
రు ముల్లోకంబులందు మీకసాధ్యంబద్దియు లేదు మీ తెఱంగంతయు నెఱింగి కా
దె యిక్కార్యంబునకు నియోగింపు మన్న వాఁడ నస్మదీయ శాసనంబున మీరు
కొందఱు తగు సహాయులం గూడుకొని రాక్షస శూన్యంబైన జనస్థానంబున
కుం జని యప్రమాదులై రామలక్ష్మణుల వృత్తాంతం బరయుచు నజస్రంబును
దద్వధంబునందుఁ గృతప్రయత్నులు గండని పలికి బలవంతు లగువారి నెనమం
డ్రిరక్కసుల బంచిన వారు దశగ్రీవుని శాసనంబునఁ బ్రచ్ఛన్నవేషులై శీఘ్రం
బున జనస్థానంబునకుం జనిరంత రావణుండు వైదేహిఁ దనకుం దక్కినదాఁ
గాఁ దలంచి రామునితో వైరంబు సంపాదించి బుద్ధివైపరీత్యంబునఁ దన్నుం గృ
తకృత్యునిఁగాఁ దలంచుకొనుచుఁ గామబాణ పరవశుండై యచ్చట నిలువ
నొల్లక రయంబున రమ్యంబైన యభ్యంతర మందిరంబునకుం జని యందు॥
(చ) కనుఁగవ నశ్రుబిందువులు గారఁగ నేడ్చెడు దాని రాముఁబే । ర్కొని విలపిం
చుదాని వగఁగూరిన చిత్తము దాని దైన్యపూ । ర్ణనను నదోఁచుదాని హరిణంబులఁ
బాసిన లేడిఁబోలెఁ బీ । తినడలు బాసి రాఘవుని దేవిని జానకిఁ గాంచె జెచ్చెరన్॥ (వ)
మఱియును॥ (చ) గురుతర వస్తుభార పరిపూరితమై ఘనమారుతాహతి । న్ది
రిగి మహార్ణవంబున మునింగిన నావయుఁ బోలె శోకసా । గరపరిమగ్నయై మి
గుల, గాసిలి యాస్యము వాంచి శ్వాపదాం । తరగత శంబరాంగనవిధంబు
న భీతిలు దానినెంతయున్ ॥ (వ) సీతనవలోకించి పాపాత్ముండగు రావణుం
డు మదనబాణమోహితుండై మెల్లన నుపసర్పించి బలాత్కారంబున నద్దేవిం
దోడ్కొని కాంచనవిచిత్ర సోపానంబారోహించి తచ్చిత్తంబు వడయు తలంపు



—(✱)రావణుఁడు జానకికిఁ దనభాగ్యముఁ జూపుట.(✱)—

ననిట్లనియె ॥ (సీ) రమణీయ హేమతోరణము విచిత్రసోపానంబు నవర
త్న భాసితంబు । నానాపతత్రిసన్నాదితంబున వేందుకాంతకుట్టిమ దేశ, కల్పితం
బు । నారీసహస్రసంచారంబును మనోజ్ఞసుందుందుభి ధ్వాన, శోభితంబు । హా
టకమణిసౌధ, హర్మ్యాసంబాధంబు శక్రపాశినిశాంత, సన్నిభంబు ॥ (తే,గీ)
దాంతరాజత స్ఫాటిక తాపనీయ । నీలపుష్పరాగోపలస్తంభ, నిర్మితంబు । నగు
చు నవరత్నఖచితమై యలరుచున్న । దంబుజాక్షి మదంతఃపురంబు కంటె ॥
(తే,గీ) తరుణి యిచ్చటి దాంతిక తాపనీయ । హీరవిద్రుమరచిత గవాక్షము
లును । హేమజాలక పరివృత, రామణీయ । సురుచిర మనోజ్ఞ భిత్తులు చూడు
ము బల । (తే,గీ) కాంచనవిచిత్ర భూమిభాగములు రుచిర । మౌక్తికవితా
నములు రత్నమంటపములు । దీర్ఘికలు పద్మినులు మణిదీప్త దివ్య । భవనము
లు శయ్యలును జూడు, పద్మనేత్ర ॥ (ఉ) ముప్పను బాల్యము న్విజయ మూ
ఢత లేని పరాక్రమోన్నతు । ల్ముప్పది రెండుకోట్ల బల ముఖ్యులు దైత్యులు యా
పనాధికు । లొప్పక నన్భజింతురు ప్రతాపమెలర్పఁగ వారిలోన నే । నొప్పుగ నొ
క్క నొక్కనికి నొక్కొకవేవుర నిల్పియుండుదున్ ॥ (ఉ) నాదు బలంబు రాజ్య
ము ధనంబును నీయది గాఁదలంపుచు । న్నాదన కీవు ప్రాణముల కంటెఁ గరీయసి
వౌదు గాననా । కాదర మొప్పు భార్యవగు, మంబుజలోచన దేవదైత్యవి । ద్యా
ధర సుందరీమణుల, కందఱ కీశ్వరివయ్యెదెంతయున్॥ (క) నావచనము విని బు
ద్ధి । ప్రావీణ్యము మీఱ నన్ను, భావజసుమబా । ణావిద్ధునిఁ గాకుండఁగఁ గావుమ
నుగ్రహముఁ జేసి, కాతరనేత్రా॥ (తే,గీ) ఉదధి ముద్రితమై శత, యోజనంబు।
లాయతము గల్గి వరుణ శక్రాదులకు న । గమ్యమై లంక యనుపేరఁ, గ్రాలు ని
దిమ । దీయపట్టణ మబ్జాక్షి, దీనిఁ గంటె ॥ (క) నరసురవిద్యాధర ఖే। చరకిన్న
రయక్షసిద్ధ, సాధ్యాదులలోఁ । బరికింప నాదు జోడా । క్కరుఁడైనను లేఁడు ము
జ్జగంబులయందున్॥ (ఉ) మానవుఁ డల్ప తేజుఁ డశక్తి, మానితపస్వియు రాజ్యహీనుఁ
డు । న్దీనుఁడు దుర్విభావ్యుఁ డవి, నీతుఁడు నీమగఁ డట్టివానికై । మానిని మో
హ మేటికి సమానుఁడ నన్ను భజింపు మస్థిరం । బౌనుగదా పడంతులకు,
యౌవన మంతయు నాఁటినాఁటికిన్ ॥ (ఉ) రామునిఁ జూడఁ గోరకుము, రా
జముఖీ యిఁక నెట్లు రాఁగలం । డామనుజాధముం డిచటి, కాశుగమైనను వీ

వనోషు నుద్దామగతిం బ్రదీప్తశిఖ, దారుణ హేతియుం బోలెనాకడ । స్నేమము
నొందియున్న నినుం, జేకొన నేక్రియ నచ్చువానికిన్ ॥ (క) సురలైన నిమ్మహా
పురిం । జొరవెఱతురు రాముండెట్లు చొరంగలండికనీ । వెఱపేలనాదు రాజ్య
ము । గఱితా నీసొమ్ము గాంగం గైకొనుము రహిన్ ॥ (తే,గీ) భువనములయం
దుం గలమముబోంటి సత్వ । వంతులగు వారు దాసులై వలయుపనులు । సే
యుచుండంగ రాజ్యాభిషిక్తవగుచు । వనిత నన్నుం గూడి సుఖియింపు, మనుది
నంబు ॥ (తే,గీ) వెలంది నీవు చేసినపూర్వ వృజినమెద్ది । గలదదియరణ్యవా
సంబు, వలనసమసెం । బోలంతిరోయింక నీపూర్వపుణ్యకర్మ । ఫల మనుభ
వింపు మిచ్చటం, బంకజాక్షి ॥ (క) ఇన్నాళ్లుకాననంబునం । బన్నుగం దపమా
చరించి, బడలుటకుందుది నిన్నన్నువరియించి సుఖసం । పన్నతనొప్పుటయునీకు, ఫ
లమగుంగాదే ॥(తే,గీ) అంబుజేక్షణ తొల్లిమాయన్నయైన । ధనవిభునిఘో
రసంగరంబున జయించి । తెచ్చినట్టిపుష్పకనామ, దేవయాన । మిదియెచూ
డుముకామగం, బిదిలతాంగి ॥ (తే,గీ) చందనములందితాంబూలమందిదివ్య ।
భూషణంబులం దాల్చియీ, పుష్పకంబు । నందునన్నుంగూడి వలసిన యట్లునీవు ।
సంతతంబు విహరింపు, చంద్రవదన, (క) విమలాంబుజంబులైవడి । రమణీ
యంబగుచుం జాలరాజిలునీయా । స్యముమురుపుడక్కియున్నది । కమలేక్షు
ణవగపుచేతం, గందినకతనన్ ॥ (క) అనవినిజానకిదశకం । ఠునిదుర్వచనము
లకడలి, తోరపుశోకం । బునవేడ్చెం గనుల నశ్రులు । చినుకం బటాంతమున
మోముం, జేర్చి రయమునన్ ॥ (క) ఇమ్మెయిఘనశోకావే, శమ్మున విలపించు
చున్న, జనకకుమారిం । గ్రమ్మఱంగనుం గొని కామవ, శమ్మున నిట్లనియె రాత్రి,
చరుండాతురుండై ॥ (ఉ) సన్నుత గాత్రి యింకంగను సంభ్రమమేలకృతాంతుండీ
గతి । న్నిన్ను సృజించె నాకొఱకు, నేరుపు లేటికిందప్పదింకనీ । యున్నత పాద
పద్మముల, కుత్తమభక్తి నమస్కరించెదం । బన్నుగ నన్ను బ్రోపుమింక, వశ్యుం
డ దాసుండనై తినెంతయున్ ॥ (చ) స్మరశర పీడితుండనయి, సారెకు నేనిపు
డన్నమాటలో । కరివరయాన నీచములు, గామదినెంచకు మాత్రిలోకసుం ।
దరి వగు నీకు వందన మొ.నర్చెను గాని దశాననక్షమా । వరవిభుండెన్నండే
నియొక, చాన పదంబులు వ్రేల ముట్టునే ॥ (ఆ,వె) పరగ ధర్మలోప, భయ
మును సిగ్గును । విడిచి యింక గార, వింపునన్ను । నెలంత మనకు దైవ, నిమ్యం



ద మీబంధ । మూపన్ మగుటం దప్పు, డడలవలదు ॥ (చ) శతమఖముఖ్యులె
వ్వని ప్ర, పాదముం గోరి సమగ్రభక్తిసం । తతము భజింతు రట్టిసుర, దైత్య
శిఖామణి యైన రావణుం । డతిశయ భంగి వేడవిన, దయ్యదియెం
తవి వేక హీన యీ । సతి యని విన్న వారు వెలి, చాటరె వేఱొక రీ
తిం బల్కినన్ ॥ (వ) అని బహుప్రకారంబులం గందర్ప గోచరుండై గా
పున మెమఱచి కృతాంత వశగతుండై వైదేహిం దన సొమ్ముగాం దలంపు
చు దురాలాపంబు లాడుచున్న రావణుంజూచి యద్దేవి భయంబువిడిచి వా

(*) సీతాదేవి రావణుని నిరసించుట. (*)

సిం ద్రుణంబునకు సరిగాభావించిన తెఱంగెఱింగించుకరణి నొక తృణఖండం
బుం జేతంబట్టుకొని శోకావేశంబున నిట్లనియె ॥ (క) దారుణచాపచ్యుతవి । స్ఫా
రశరానలవిదగ్ధ శాత్రవకులకాం । తారుండు దశరథుండనంగా । ధారుణిపెంపుం
దొప్పు సత్యధర్మోజ్జ్వలుండై ॥ (ఉ) ఆనరలోకపాలకున, కగ్రసుతుండు
మహాభుజుండు స । న్మానితబాహుశౌర్యుం డసమానబలుండు జగత్ప్రసిద్ధుండ ।
జ్ఞానుండు డజ్జలోచనుండ, భాస్కరతేజుండు సత్యవాది పం । చాననవిక్రముం
డు గలండార్యుండు రాముండనాం బ్రసిద్ధుండై ॥ (క) హరునకు నుమ కైటభసం ।
హరునకు రమపోలెనమ్మహారాజకులా । భరణమగు రాఘవునకే । నరయంగా
ధర్మపత్ని నగుదు సురారీ ॥ (ఉ) దోసమటంచుం జూడ కిటు, దొంగిలినన్నొ
ని తెచ్చితీవుదు । ష్టాసురయింక మద్విభుండ, హర్పతి తేజుండమోఘవీర్యుం
డా । యాసముద్రోంపకుండంగ ఖరాసురునిం బలెనిన్ను లోకము । ల్సాసట
యైకడంగినను, బాణహతిన్ధరం గూల్పకుండునే ॥ (ఉ) రాముని సాయకంబులు
తరంగము లాపగగట్టునుం బలె । స్భీమముగాంగ నీతనువుం బెద్దయు బ్రద్దలు
వాపుచుండ సు । త్రామ విరోధితీవ్రుండగు తార్క్ష్యుని చే భుజగంబుంబోలె
నా । రామునిచేతం గూలెదవు. రావణసత్వము వీటంబోవంగన్ ॥ (క) దనుజా
ధమ నీచెప్పిన । యనిమిషరిపు లంకతాజ, నాధిపుప్రోలం । బనిచెడి నిర్వి
షు లగుదురు । వినతాసుతు మ్రోల నున్న, విషఫణుల గతిన్ ॥ (మ) ము
నునీ చేనని నోడి పాఱినమరు, న్మఖ్యామర శ్రేణితో । నెనగాం జూచితొ రాఘ
వప్రవరున, య్యిక్ష్వాకువంశేంద్రుండా । ర్యనుతుండు ర్విభవ ద్వినాశనకరుం
డై పుట్టెనిన్నాజిలోం । దునుమున్నిక్కముయూపబద్ధపశువుం, దున్మాడు చందం

బునన్ ॥ (క) అరిఘునాథుఁడుమేఘునరో । పారుణితాంతులనుజూచి సంతనె నీవి । ధారుణి నీతైకూలెద । వారయఁద్రిపురారిచేననంగుఁడుఁబోలెన్ ॥ (క) అటుగాకనమ్మహాత్ముని । పటుబాణ పథంబు నొంది బలవీర్య సము । త్కటతను బ్రతికితివేనియుఁ । గటకటఁ బడియోడిపాఱి, గలవునృశంసా ॥ (క) ఇన విభులు గతులుచెప్పిన । వనగధులింకినను హవ్య,వహుండాఱినమే । రునగముపిఱిగినరాముఁడు । నినుఁబోరిగొన కేలవిడుచు నీచచరిత్రా ॥ (తే,గీ) చెలఁగి యెవ్వాఁడు జలధిశోషింపఁజేయుఁ । జంద్రునెవ్వాఁడు పడఁగూల్ప,జాలుధరణి । నట్టివాఁడుసీతనువిడునెడుమాటఁ । జెప్పవిననిదిమిగులనచ్చెరువుగాదె॥ (క) దనుజాధమ ననుఁగొనితె । చ్చినయప్పుడె నీదుసిరియు జీవితకాలం । బునశించె యశముచెడెలం । కనిజంబుగ వినుమనాథ, గాఁగలదింకన్ । (చ) అనఘుఁడు మద్విభుండు చరితార్థుఁడు రాముఁడుదండకంబులన్ । అనుజసహాయుఁడై నిజభుజాంచిత వీర్యమునాశ్రయించినె । మ్మనమున భీతిదక్క బహుభంగులఁద్రిమ్మరు చున్నవాఁడుతి । గ్మున శరవృష్టి నీబలము గర్వమువీర్యమడంగిపోవదే ॥ (తే,గీ) నాథునెడఁబాసి యున్నచో నన్ను నీవు । మచ్చరంబునద్రుచ్చిలి,తెచ్చితిట్లు । దానవాధమయిది శుభో,దర్కమగునె । కడఁగినీవంశమునునిన్నుఁ గాల్చుఁగాక ॥ (తే,గీ) కాలనిపి,క్వాతమై భూత,జాలములకు । హానియెప్పుడు సమకొను, నపుడుకార్య । మందుఁగాలవశంగతు, లై మనుజులు । కీడుమేలనియించుక, చూడలేరు॥ (తే,గీ)అట్టికాలంబునీకుసంప్రాప్తమయ్యె । దనుజ పాంసన నాకతం, బునసమస్త । రాక్షసక్షయమయ్యెడి, రాముచేత । నమ్ము నావచనమ్ము ని,క్కమ్ముగాఁగ ॥ (క) రాముని సతి నగు నేనీ । చేముట్టన శక్యనై తి,సృగ్భాండసమి । ద్ధోమాలంకృతమగు మఖ । భూమియఁజండాలు చేతఁబోలెదురాత్మా ॥ (తే,గీ)రాజహంసను గూడియు, క్రాంతమబ్జ । షండములయందు సంక్రీడ సలుపు హంసి । మఱియుఁ దృణషండగతమైన,మద్గుకంబు గాంచి యెబ్భంగి మమతఁగా,వించునీచ ॥ (క) రామునివైభవజితసు । త్రామునిధర్మపవిత్రాభి, రాముని సుగుణస్తోమునిఁ బాసి నయవిదూ । రామహినొక నిమిషమైన బ్రతుకంగలనే ॥ (క) పోసఁగ నుపక్రోశమలీ । మసనై బ్రతుకంగ వలనె మనుజాశన స । న్న సనను గట్టినఁ గట్టుము । వెసద్రుంగినముగ్గెం గుమేను వినవీమాటల్ ॥ (క) అనియీగతిఁ గ్రోధంబున । దనుజకులాధము



నిఁజాల దారుణవాక్యం । బున దూఱ నాడి యశ్రులు । చనుదేరఁగనూరకుం

(*) రావణుఁడు సంవత్సరములోపలఁ దనమాట కోడఁబడవలయు(*)

(*) నని సీతను బెదరించుట. (*)

డె,జానకి యంతన్ ॥ (క) సురకంటకుండు మైథిలి । పరుషోక్తుల కలిగివఱల, బంధురకోప । స్ఫురితారుణాక్షుఁడై భీ । కరరవమునసిట్టులనియెఁ గటముల దరఁగన్ ॥ (క) పదిరెండు నెలలు నోర్చెద । ముదితా యక్కాలమునకు, మొనయక యున్నం । బిదపనిటఁ బాచకులు ఖడ్గధారఁ గోయుదురనేక, ఖండంబులుగాన్ ॥(క)అనిపలికిమఱియురావణుఁ । డనుపమకోపమునరాక్ష,సాంగనలఁ గనుంగొనియెట్టులైనమీరీ । వనితామణిదర్పమణఁప, వలయుంజుండీ ॥ (ఆ,వె) అనిన నట్లకాక,యని రాక్షసాంగన । లతిభయంకరాస్య లగుచు మోద్పఁ । గేలుదోయితోడఁ,జాలఁ బంటవలంతి । కూఁతుచుట్టుముట్టుకొనిరియపుడు॥ (ఉ) క్రమ్మఱరావణుండసుర,కాంతలఁ గన్గొనిమీరలీబిడ । న్సమ్మతితో నశోకవిపి, నంబున నుంచి సమగ్రభక్తిని । త్యమ్మును బ్రోచుచున్నపహు వి,ధప్రియభాషల నాదరించినా । సొమ్ముగఁజేసి సమ్మదము, చొప్పడఁ దెండుగజాంగనం బలెన్ ॥ (వ) అనియిట్లు చరణఘాతంబునం బుడమి బ్రద్దలువాఱ నిట్టట్టుచలింపుచు నాజ్ఞాపించిన నయ్యసురస్త్రీలు వైదేహినచ్చటం బాపికొని సర్వపుష్పఫలోపేతంబును సర్వాభిలషిత పదార్థ ఫలవృక్షవిరాజితంబును సర్వకాలమదమృగ పక్షినిషేవితంబు నగు నశోకవనంబునకుం దోడ్కొని చనిరి యిత్తెఱంగున నమ్మహీపుత్రి రాక్షసీవశంగతయై వ్యాఘ్రీమధ్యంబునం జిక్కిన హరిణిచందంబున నడలుచు భయశోకంబులుమనంబునం బెనంగొన రామచంద్రుని దైవతంబుగాఁ దలంపుచు ననన్యపరాణయై యుండె నిక్కడ దండ

(*) రామునికి దుర్నిమిత్తము లగపడుట. (*)

కారణ్యంబునందు ॥ (చ) కపట మృగస్వరూపుఁడగు కల్మషచిత్తునిఁ దాటకేయుని । న్విపులశరంబునం దునిమి,వెండియు రాముఁడు పర్ణశాలకు । న్విపినపథంబుఁబట్టి కడు,వేగమె వచ్చుచు నుండ వెంటనే । యపుడు వినంగనయ్యెనశుభావహ జంబుక నాదముగ్రమై ॥ (క) దారుణమగు తన్నినదము । నారూఢిగ నాలకించి యడలుచుగాత్రిం । బారటపడఁ జిత్తంబునఁ । గూరిన పెనుశంక నిండుకొననిట్లనియెన్ ॥ (తే,గీ) దారుణంబగుజంబుకధ్వానమరయఁ

దగ నమంగళసూచకం, బగుచుఁ దోఁచె । సీత ఘోరాసురులచేతఁ, జిక్కకుండ । దండకమునఁ గుశలినియై, యుండుఁగాక ॥ (సీ) అక్కడమృగరూపుఁ డగు తాటకాసుతుం డస్మచ్ఛరాహతి నవనిఁ గూలు । నపుడు మదీయవాక్యానుకారంబు గా నాక్రందనముఁ జేసె నయ్యెలుంగు । విని మహీసుత నొంటి విడిచి తదాజ్ఞచే ననుజుండు నాచంద మరయవచ్చెఁ । గాఁబోలు ఘోరరాక్షసగణోపేతుఁడై మారీచుఁ డిబ్భంగి మాయఁ బన్నె ॥ (తే.గీ) సీతను వధించు తలఁపునఁ జెలఁగి నన్ను । దవ్వులకుఁ బాపికొని యేగెఁ దలఁప నిదియ । థార్థమగుఁ గానిచో హాహా తోస్సిలక్ష్మ । ణా యనుచు నాదు పలుకుగా నఱచు టెట్లు ॥ (క) తలఁపఁగ నిష్కారణముగఁ । బలువుర రక్కసులతోడఁ బగఁగొంటి సతీతిలకమున కనుజునకు మం । గళముగలుగుఁగాక ఘోర కాననమందున్ ॥ (క) ఘోరనిమిత్తము లెంతయుఁ । దోరంబుగ నాకు నిపుడు తోఁచెడి నకటా । సారసముఖి యెట్లున్నదొ । వీరుఁడు నాతమ్ముఁ డెట్లు విహరించెడినో ॥ (వ) అని బహుప్రకారంబులఁ జింతింపుచు రాక్షసుండు మాయామృగస్వరూపంబునఁ దన్ను దూరంబునకుం గొనిపోవుటయును బదంపడి స్వప్రయుక్తవిశిఖాభిహతుండై మారీచుఁడు మృగరూపంబు విడిచి రాక్షసరూపం బంగీకరించి తనమాటగా సీతాలక్ష్మణులం బేర్కొని ప్రాణంబులు విడుచుటయును ఘోరంబగు జంబుకనాదంబు వినంబడుటయును దీనముఖంబులై ఖగమృగంబు లప్రదక్షిణంబుగాఁ దిరిగి భయంకర నిస్వనంబులు సలుపుటయును మఱియు ననేక దుర్నిమిత్తంబులు దోఁచుటయు నివియన్నియుం దలపోసి రాముండు పరిశంకితుండై తలంకుచు సీతాదర్శనలాలసుండై శీఘ్రంబున నిజాశ్రమంబునకు వచ్చుచుమ్ముందర ॥ (క)

() రాముఁడు తనకడ కేతెంచు లక్ష్మణుఁ జూచి దుఃఖితుండై సీతాక్షేమంబడుగుట ()

గతతేజుండై తనకడ । కతిరయమున వచ్చుచున్న, యనుజన్మునిసు । వ్రతునిం గనిమోమునదీ । నతగన్పడఁ గనులజలక,ణంబులు దొరుఁగన్ ॥ (చ) దనుజనిషేవితంబయిన, దారుణకాననసీమ నేలొకో । జనకజఁ బాసిలక్ష్మణుఁడు, సంభ్రముఁడై చనుదెంచుచున్నవాఁ । డనిధృతి దూలి డగ్గఱి రయంబున నాతని చేయిఁ బట్టినె । మ్మనమున శోకముం గదుర, మాటలు తొట్రువడంగ నిట్లనున్ ॥ (ఉ) తమ్ముఁడ మేదినీసుత ను,దారుణకాననమందుఁ బాసినీ । కిమ్మెయి నొంటిఁ దాక తగు, నే వెఱఁగయ్యెడు నామృగాక్షిని । కక్కముగ ఘోర



రాక్షస మృగంబులచేఁ బడకుండ నేఁడు । సేమమ్మున నున్నదే దనుజమాయ దలంచిన శంక దోఁచెడిన్ ॥ (ఉ) అక్కట యొందుఁ జూచినభ,యంకరవైఖరి దుర్నిమిత్తము । లెక్కుడు దోఁచుచున్న యవి ఖేశజంబుక కాకఘూకము । లక్కట నొక్కరీతి భయ దధ్వని మ్రోయఁదొడంగె రాక్షసు । లిక్కము నేఁడు సీతను హరించిరటంచు విచారమయ్యెడిన్ ॥ (చ) అలయక సంతతంబు నను జాదములిందుఁ జరింతురీవు మై । థిలి నెడఁ బాసివచ్చితివి తెంపున దైత్యులచేతఁ జిక్కెనో । పులులు వరాహముల్ శరభ ముల్వృకులొక్కట హింసఁ జేసెనో । కలఁగెడి నెమ్మనంబడమ కన్ను చలించెడి శోకమయ్యెడిన్ ॥ (ఉ) ఏరమణీమణిన్ విడిచి యిచ్చటికీవరుదెంచితిప్పుడే । నీరదవేణి మోదమున నిత్యము నా కెదురేగుదెంచునే । కైరవగంధి ప్రాణముల కంటెను గారియసిద్ధయై తనరుచున్నా । సారసనేత్రి చంద్రముఖి జానకియున్నెడఁ జెప్పు లక్ష్మణా ॥ (తే.గీ) సిరియు రాజ్యంబు గోల్పడిచిన్నవోయి । కాననంబున మునివృత్తిఁ బూని తిరుగు । నట్టి నాకెంత దుఃఖసహాయయైన । భూమిపుత్రిక యేజాడఁ బోయెనోఁ జెప్పుమ ॥ (తే,గీ) ఏ వెలందిని బాసియొక్కింతకాల । మైన జీవింపఁగానోపనట్టిపంక । జాక్షి నిత్యానపాయినియైనసీత । యనఘచారిత్ర యేచందమయ్యెఁ జెప్పుము ॥ (ఆ,వె) శక్రరాజ్యమైన జానకి లేనిచో । నాత్మకింపొనర్పదయ్యె నాకు । గవ్వొలందికొక్క హానిగల్గినమన । మెత్తినచ్చుటెల్ల రిత్తగాదె ॥ (క) సీతానిమిత్తమిచ్చట । నోతమ్ముఁడ యేను నిధనమొందుచునుండన్ । జాతకుతూహలులైయెవి । ఖ్యాతిగ సుఖియించుఁగాదె కైకయుయింటన్ ॥ (క) మృతసుతయై కౌసల్యా । సతిసుతసామ్రాజ్యవిభవసంజాతసుఖో । న్నతిఁ బేర్గు కైకకిఁక నే । గతి దాస్యముఁ జేసి బ్రతుకఁ గలదు కుమారా ॥ (తే,గీ) ఉజ్జ్వలపనకుశలాప్తినుండెనేని । యచ్చుపడ నాశ్రమమునకు వచ్చువాఁడ । నట్లుగాక వేఱొకభంగి నయ్యెనేని । తడవుగాకుండఁ బ్రాణముల్ విడుచువాఁడ ॥ (ఉ) జీవితతుల్యయైనతరు సీతను గన్నులకర్పుదీఱ హా । ప్రాణవహాభంగి నాశ్రమము నందుఁ గనుంగొనకున్న యప్పుడే । భూవరనందనా వినుము భూరిగభీరవిపత్పయోధిలోఁ । సావయవంబుగా మునిఁగి చచ్చెదగాక మనంగ నేర్తునే ॥ (క) అమ్మహిపుత్రిక ప్రాణయు । తమ్ముగ నున్నదియొ లేక దైత్యులచే దా । నమ్మున భక్షితయయ్యెనొ । తమ్ముఁడ కలరూపు నాకుఁ దడయక చెప్పుమా ॥ (తే, గీ) హాతుఁడనైతి నిలక్ష్మణా యనుచు దుష్ట । దైత్యుఁ డాడిన మాటకుఁ దలఁకి సీత । నిన్నుఁ

బుత్తెంచెఁగాఁబోలునెలఁతవిడిచి। నీవురాఁబోలునింతయునిక్కవంబు॥ (ఆ, వె) చాలకాలముగ్ధురాలుమహాసుకు। మారియామహీశుమారిదనుజ। మధ్యమం దుఁజిక్కిమద్వియోగంబున। నెంతచింతపడెనొక్లాంతయగుచు॥ (మ) ఖరునిం జంపిననాఁటఁగోలెదనుజు లాకాంతారభాగంబునం। బరమక్రోధపరీతచిత్తులగు చు న్నాయాపులై యున్నవా। రరయన్నీవిటు రాఁగఁజూచిజనకక్ష్మాధీశసత్పుత్రిఁ జె। చ్చెరభక్షింపఁగఁబోలునిక్కమిదిని క్షేపంబువాటిల్లెడిన్॥ (తే,గీ) ఇంకనే మనిచింతింతునెందుఁజొత్తు। నెత్తెఱంగునఁదాళుదునెద్దివిధము। ఘోరశోకాం బురాశిమగ్నుండనైతిఁ। గాంతఁగన్నులఁజూడంగఁగలదెనాకు॥ (వ) వత్సా మత్కృతాపకారంబునకుఁ బ్రతీకారంబుఁగావించుటకు రాక్షసులకవకాశంబు నీచేతదత్తంబయ్యె నెల్లభంగులఁ గష్టంబుఁ గావించితివని బహుప్రకారంబుల వైదేహిందలంచి దుఃఖింపుచు లక్ష్మణునిరాకకు గర్హింపుచు క్షుత్పిపాసా భరంబునసోలుచు దీర్ఘంబుగా నిట్టూర్పులునిగుడించుచు వదనంబున వైవ ర్ణ్యంబుదోఁప నేత్రంబుల నశ్రుకణంబులుదొరుఁగ సంతాపవిశేషంబునఁజెమ టగ్రమ్ముదేర రయంబున జనస్థానంబునకుంజని యంతనంతఁ గొన్నివిహార దేశంబు లవలోకింపుచు శూన్యంబైన నిజాశ్రమంబు డగ్గఱి శోకగద్గదకంఠుం డై సౌమిత్రి కిట్లనియె॥ (క) ననుఁబాసియున్నచోసీ। తనుపనమునొంటివి డిచితలఁగిరయమునం। జనుదెంచి తేలయీగతి। వనమునసిను నమ్మి విడిచివ చ్చితిననఘా॥ (క) వనమనియుదైత్యసేవిత। మనియునెఱిఁగిసీతవిడిచియరు దెంచినని। న్గనినప్పటినుండిజగ। జ్జన వినుతా నామనంబు శంకిత మయ్యెన్॥ (క) ఇదియేమిహేతువోని। న్నదటునఁగనినంతనుండి యనఘాత్మకనా। హృద యంబగలెడిశోకము। వొదలెడివామాంకనేత్ర భుజములదరెడిన్॥ (క) నా

*లక్ష్మణుఁడు రామునికిఁ దాను సీతను విడిచివచ్చుటకుఁ గారణంబుఁ దెల్పుట*

వినిలక్ష్మణుఁడతిశో। కావిలచేతస్కుఁడగుచు ననుపమఘనదుః। ఖావేశంబున నడలుచు। భావంబునఁ గుందురామ భద్రునకనియెన్॥ (ఉ) ఇంతననేలదే వమిథిలేశ్వరపుత్రిక నొంటిడించినా। యంతనెయేను దుష్టమతినై చనుదెంచి న వాఁడగానుమీ। చెంతకుఁ బోయిరమ్మనుచుఁ జెచ్చెరనయ్యమతూలనాడనో। క్కింత సహింపఁజాలకిపు డీగతివచ్చిన వాఁడనెంతయున్॥ (మ) అనఘానీ పుమృగంబువెంట మృగయా వ్యాసక్తచిత్తుండవై। చనినంబిమ్మటఁ గొంతసే



పునకుయుష్మత్కంఠనాదంబురీ। తిననుం గావఁగ రారె హాజనకపుత్రీ హాసుమి త్రాసుతా। యనుమాట ల్వినవయ్యె దూరమునవై న్యధ్వానయుక్తంబుగన్॥ (ఉ) ఆనినదంబుకర్ణపుట మంటినయంతనె శంకితాత్మయై। జానకినన్నునీక డకుఁ జయ్యనఁబొమ్మ నివల్కె బల్కినం। గాననమందుఁ బాయుటది కజ్జ ముగా దటులైన సీతకు। న్నాపు ఘటిల్లు నంచువిన యంబున నంజలిఁ జేసినమ్ర తన్॥ (వ) దేవి భవద్వల్లభుండగు రాముండు త్రిలోకఖ్యాత పౌరుషుండు విక్రమవంతుం డమ్మహానుభావున కెందును గొఱంతలేదు నీవు తప్పఁ దలంచితి వి నాచెప్పిన ట్లాపైఁడి మెకంబు రాక్షస మాయ యగుటం జేసి రామ ధను ర్ముక్తసాయకాభి హతంబై మృగరూపంబువిడిచి దైత్యరూపంబునఁ బ్రా ణంబులు విడుచుచు మన మనంబునకు విషాదంబు గల్పించుకొఱకు రామవా క్యానురూపంబగు వాక్యంబున నిట్లాడె నంతియగాక సురాసురాదులోకకోటి యైయెత్తివచ్చిన నసహాయశౌర్యంబున వధించుంగాని రఘువల్లభుండు పౌరు షంబువిడిచి రక్షించుమనియెడి నీచవాక్యంబుఁ బల్కనే యమ్మహాత్ముండు దేవ తలనైన రక్షింపసమర్థుం డిది యేటిచింత రాముండు ముల్లోకంబులయం ద జయ్యుం డప్పరాక్రమధుర్యునిం దొడరి పోరునట్టిజెట్టిజోదు త్రిలోకంబులయం దింతకుమున్ను పుట్టినవారిలోన నింకఁ బుట్టెడువారిలోనైనను లేఁడుగావునఁ గునారీజనసేవితంబైన యీవిచారంబువిడిచి స్వస్థచిత్తవుగమ్మని బహు ప్రకా రంబుల నేనమ్మహాదేవిని బ్రార్థింపుచు ధైర్యంబుఁ దెల్పినఁ గటకటంబడి క న్నీరునించుచుఁ గోపంబు గదిరినమనంబుతో దారుణవాక్యంబుననాకిట్లనియె। (సీ) దురితాత్మనామీఁద దుష్టభావముసేర్చి యున్నాఁడవిదినీకుయుక్తమగునె రాముఁడుమృతుఁడైన రమణతోనన్నుఁజేకొనఁగ నీకువశంబె మొనసిమున్ను॥ దుర్విచారతభరతుండువరంబను నెపమున సామ్రాజ్యమపహరించె। నన్నకునె। టులైనహానిఁబుట్టఁగఁజేసి నన్నుఁజేకొనఁగాననమునకీవు॥ (తే,గీ) వచ్చితివిమీ కునిరువుర కచ్చుపడఁగ। నిదియుసంకేతమగునని యిచ్చఁదలఁతు। నట్లుగాకు న్నవిభుఁడుని న్నార్తిఁబిలువఁ। దోడుపడుటకుఁ జనకయుం డుడువె యిచట్న (తే, గీ) అకట ప్రచ్ఛన్న చారివై నట్టి రిపుఁడ। వైతివీవు రంధ్రాన్వేషి వగుచు ననుఁబ్ర। తిగ్రహించుట కిట్లరు దెంచినాఁడ। వేల చేకూఱునీ క ది హీనచరిత॥ (క) అని యాడరాని మాటల। ననుదూఱినవగలనెమ్మనం

——(*) రాముఁడు లక్ష్మణుని దూఱుట. (*)——

బుంబొగుల । న్ఘనరోషకషాయితలో । చనుఁడనగుచునిట్లువిడిచివచ్చితినఘా॥
(చ)అనవుడు రాముఁ డిట్లనియె,నక్కటలక్ష్మణమత్ప్రభావము । న్ఘనతరవిక్రమం
బు బల,గర్వమెఱింగియు నాఁడుమాటకై । వనమున నొంటిఁ బాసి యిటు, వ
చ్చుటనీకగునయ్య మాటికే । మనఁ గల దింక రోషమున, నాపదఁ దెచ్చితివే
మి సేయుదుఁ ॥ (ఆ,వె)బాల యగుట సీత, భర్తృమోహంబున । నాడరాని
మాట, లాడెఁగాక । తాల్మివిడిచి నీవు. తామసంబున నొంటి । విడిచివచ్చితిది
వి, వేకమగునె ॥ (ఉ)నీవిటు రాఁగఁజూచి రజ, నీచరు లొక్కటఁ బట్టిమ్రిం
గిరో । పావనశీలనెత్తికొని. పాఱిరొ కాననమందు డాఁచిరో । దావ మృగ వ్ర
జంబు వని, తంగబళించె నొ యేమి చేసెనో । యేవిధ మయ్యెనో యడవి, నె
ట్లు వసించెనొ యెంతగుందెనో ॥ (వ) సీతాప్రచోదితుండవై క్రోధ వశంబున
మచ్ఛాసనంబు నుల్లంఘించి వచ్చుటం జేసి సర్వప్రకారంబుల నవినయంబునీ
చేతఁ గృతం బయ్యె నాయందు రాక్షససంహారసామర్థ్యా భావంబు శంకించి వ
చ్చితివంటివేని మదీయభుజావిక్రమవిశేషం బనివార్యం బని యెఱింగి యున్న
నీకిట్లనుట కవకాశంబు లేదు సీతాపరుషవాక్యంబుల లోక నిందయగు నని త
లంచి వచ్చితి నంటివేని యజ్ఞానంబునం బలికిన మైథిలీ క్రోధ వాక్యంబుల గ
హణంబు గలుగనేరదు పరుషవాక్యశ్రవణమాత్రంబున సమాగతుండ నైతి
నని యంటివేని సంక్రుద్ధలగు యువతు లేమేమి పలుకరమ్మాట కలిగియట్టివా
రివిడిచి వచ్చుట యుక్తంబు గాదెల్ల భంగుల నయుక్తకార్యంబుఁ గావించితి
వని పలికి వెండియు నిట్లనియె ॥ (చ)పసిఁడిమెకంబు వెంట బహు, భంగుల
ద్రిమ్మరి పట్ట లేకనే । విసికి శితాస్త్రమేయ నది, వేగ మృగత్వముఁ బాసిఘో
రరా । క్షసుఁడయి మామకస్వరము, గానిను సీతను బిల్చివెంటనే । యసిత
గిరీంద్రు భంగిఁ బడె నంగమున న్విడలంగఁ బ్రాణముల్ ॥ ॥ (తే,గీ) మా
యరక్కసుఁ డిబ్భంగి, మాయమైన । యంత నుండియుఁ దన్నాద, మాలకిం
చి । భ్రమసి మీ రెంత వంతలఁ, బడుచు నున్న । వారొకో యని చిత్తంబు,వ
గలఁబొగిలె ॥ (క)ఏమనఁగ వచ్చు నీవిపు । డామానినిఁబాసి యిచటి,కరు
దెంచుటచే । నామదికిఁ దోఁచి నంతయు । సౌమిత్రీ యిప్పుడిచట, సత్యంబ
య్యెన్ ॥ (వ)అని పెక్కు తెఱంగులం బలవింపుచుం బోవుచుండ నమ్మహా



——(*)రాముఁడు నిజాశ్రమంబునందు జానకిం గానక పరితపించుట.(*)——

నుభావునకు వామలోచనాధఃపక్ష్మంబు చలించె శరీరంబు కంపించె మఱియు
నశుభ సూచకంబులగు పెక్కు దుర్నిమిత్తంబులు దోఁచినఁ గలంకనడి వైదే
హికి సేమంబు లేదని పలుకుచు సీతాదర్శనలాలసుండై రయంబునం జనిశూ
న్యంబైన నిజాశ్రమంబుఁ గని మనస్తాపం బంతకంతకగ్గలం బగుచుండ వేగం
బున నుద్భ్రాంతుండైన వాని పగిది హస్తాద్యవయవంబులు విదుచఁగాఁ మఁ
గొండొకసే పయ్యాశ్రమం బంతయుఁ గలయం దిరిగి యొక్కచోట శోభావి
రహితమై సొబగు దప్పి యున్న పర్ణశాల నవలోకించి యందు జానకింగా
నక శోకసంతాపదళితహృదయుండై వెండియు నామ్లానపుష్ప మృగ ద్విజం
బును శోభావిహీనంబును విధ్వస్తంబును సంత్యక్తవనదైవతంబును విప్రకీర్ణా
జినకుశంబును విప్రవిద్ధబ్రుసీకటంబును శూన్యంబునై వృక్షంబులతోఁ గూడ రో
దనంబు సేయు చున్నదాని పగిదిం జూపట్టు చున్న నిజ స్థానంబుఁ జూచి జానకి
నెందునుం గానక విలపించుచు ॥ (చ)అసురులు సీతఁ జేకొని ర, యంబున నే
గిరొ లేక చంపిరో । మెసవిరొ గౌతమీనదికిఁ, మేయఁగతి న్సలిలార్థమేగెనో।
కుసుమఫలప్రవాళములఁ, గోయుటకున్వనవీధి కేగెనో । విసువకపుష్పవాటీరము,
వెంబడి డాఁగెనొ యెందుఁ బోయెనో ॥ (వ)అనితలపోసి నానాప్రకారంబుల
జానకి నన్వేషించి యెందునుంగానక శోకార్ణవపరిప్లుతుండైన వాని పోలిక
నున్మత్తుని చందంబునం జూపట్టుచు ॥ (మ)ఘనుఁడా రాముఁడు చెట్టు చెట్టుగ
లయం, గాఁజూచుచు న్శైలము । ల్వనము ల్పల్వలము ల్నదీనదము లా,వాసం
బులీక్షింపుచు । న్వనితం గానక వెఱ్ఱిపట్టిన గతి, న్వర్ణింపుచు న్శోకతా । మ్రమని
తాంతేక్షణుఁడై వని న్వేదకనా,రంభించె నుద్వేగియై॥(భుజంగప్రయాతము)
లతాంగి న్ధృతాగణ్య, లావణ్యనబ్జా । యతాక్షిం గదంబప్రి,యన్మత్ప్రియ న్సు

——(*)రాముఁడు వనవృక్షాదులను జానకి పోయిన తెరువడుగుట.(*)——

న్నితంబం గదంబావ, నీజాతమాచూ ।చితే చెప్పుమాయింతి, సేమంబు నాకుఁ ॥
(చామరవృత్తము)లోలనేత్రఁ గానవా వి, లోలనారికేళమా । సాలమారసాల
మా వి,శాలకందరాళమా । తాలమా తమాలమా మ,దస్రవత్ప్రకాండహిం।
తాలమా ప్రవాళమా ఘు,నస్ఫురద్ద్రుజాలమా ॥ (మత్తకోకిల)సారసాయత
నేత్ర పోయిన, జాడఁ దెల్పవె నాకుమం । దారమా సహకారమా సము,దగ్ర)

రుక్కురవీరమా । సారభూతశమీరమా ఘన, సారమా యట వీరమా । భూరి
కాంతిమయూరమా ఫల,పూరమూసుకిరీరమా॥(మత్తకోకిల)మందయానను గా
నవా పిచుమంజమా వట బృందమా । కుందమా యర విందమా ఘన, కోమ
లాంబరచుంబిమా । కందమా నవ కందమా ననుఁ, గాంచి పుణ్యము నొందుఁ
మా । చందనావనిజాతమా వని, జాతమా గిరిజాతమా ॥(తోటకవృత్తము)
ఘనపల్లవకోమల, గాత్రనిగాం । చనవర్ణశరీరిణిఁ, జారుముఖిన్ । ఘనకేశిని
సీతను, గంటి వెకాం । చనవృక్షమ చెప్పు ప్రసన్నమతిన్ ॥ (తరువోజ)దను
జులు కాననాం, తరమున నొకటఁ దరళాక్షి జానకి, దాఁచిరో లేక । గొనిపోయి
రో లేక, క్రూరతఁ బట్టికొని మ్రింగిరో వన్య, ఘోరసత్వములు । మొనసి హిం
సించెనో, మోహనపాణి ముదితకల్యాణిభూ, పుత్రి మత్పత్ని । జనకనందన పు
ణ్యసాధ్వియే జాడఁ జనియెనో చెప్పుమ శ్వత్థపాదపమ ॥ (పృథ్వీవృత్తము)
సరోజముఖి నర్జునప్రియను, జారుబింబాధరి । న్నరేంద్రవరకన్యకన్ఘనర, ణ
స్మణీనూపుర । న్వరాభరణ భూషితాంగి వర, వర్ణిని న్సీత నీ । యరణ్యము
నఁ గానవా వికసి, తార్జునత్క్షోజమా ॥ (చామర వృత్తము) పరాకు మాని
నైసేఁప రాని, బాళి మీఱ వేఁడునా । మొరాల కించి యొందుఁ బోయె, మోహ
నాంగి సీత నీ । వెఱింగితేని వేడ్క నమ్మ, హీంజ జాడఁ జెప్పినా । విరాళిమా
న్పిప్రోవవే ప్రవృద్ధ బిల్వవృక్షమా ॥ (తరల) మదమరాళమ గానవా యల
మందయానను జానకి । న్ముదితచక్రమ గానవా నృప, పుత్రిఁ జక్ర పయోధర ।
న్పదమలాంబుజ పాణిఁ గానవె సంభృతాంబుజ షండమా । కోదమనుంమ్మోద
గానవా నవకోమలభ్రమరీక చన్ ॥ (వసంతతిలకావృత్తము) రంభావనీరుహ
మ రాజితపత్రమాయా । రంభోరు వేగినతెఱంగెఱిఁగింపు ప్రీతిం । గుంభీంద్ర
కుంభకుచఁ గోమల గాత్రిఁ గంటే । కుంభీంద్రమా తెలుపుకోర్కులు వ అమీనా
కున్ ॥ (ద్రుతవిలంబితవృత్తము) మదవతీజన మానససంభ్రమ । ప్రదఅచో
రమ బంధురకీరమా । మధురభాషిణి మత్ప్రియ పత్నియా । సుదతిపోలునచా
ప్పెఱిఁగింపుమా ॥ (వనమయూరవృత్తము) చంద్రకిరణప్రతిమ చారుదరహా
సం । జంద్రముకురాబ్జవిల సన్ముఖవిలాసం । జంద్రనిభ వర్ణ సల చంపకసు
నాసం । జంద్రకిసమూహామర సాతనయఁ గంటే ॥ (స్వాగతావృత్తము) ప
ద్మకేసర విభాసితగాత్రిం । బద్మకుట్మలని భస్తనయుగ్మం । బద్మగంధి నరపా.



లకపుత్రిం । బద్మినీకమల భామినిఁ గంటే॥ (మందాక్రాంతావృత్తము) కాం
తారోర్విన్నను విడిచి భూకన్యదా నొంటి నేగెం । జింతాశోకంబులు వొడమెను
చ్చిత్తముం గాసిలెన్నీ । చెంతన్నేఁడట్లరుగఁ గదు దాచెప్పి వంశంబనాహ్వా । త్సం
తాపంబుం దొలఁగ విడువుమా చాలఁ బుణ్యంబుగల్గున్ ॥ (మాలినీవృత్తము) ని
రుపమగుణరాశి న్నీలజీమూతకేశి । న్నరవరవరపుత్రి న్నవ్యహేమాభగా
త్రి।న్సరసిజ దళనేత్ర న్జానకిం జూపరే యో । సరళ పనస జంబు, క్ష్మాజరాజం
బులారా ॥ (మహాస్రగ్ధర) తరలాక్షిం జెప్పఁ డత్యాదరమునఁ గుసుమోత్తంస
చూతంబులారా ।హరిమధ్యం గాన రేమీ, రతిదయ జెప్పుఁడిం పారసింహంబులారా।
తెఱఁగొప్పన్సీత తానే, తెరువునఁ జనెనో, తెల్పుఁడీరంబులారా।పరపుష్ట శ్రేణులా
రా, పలుకుఁడిపుడు మత్పత్ని సేమంబు నర్థిన్ ॥ (ఇంద్రవజ్రావృత్తము) బాలా
మణిం జూపుము, పారిజాతా। హేలావతిం గానవె, యింద్ర భూజా । లోలేక్షణం
జూపవెలుంగమాహా । రాలంకృతాంగిం జెపుమాలవంగా॥ (ఉపేంద్రవజ్రావృ
త్తము) వినీల మేఘోపమ వేణిలజ్జా । వినమ్రవక్త్రాబ్జను, వీర్యశుల్క । న్మనో
జ్ఞరూపన్గుణమండనన్ । జనందనం జూపుము, సారసంబా ॥ (ఉపజాతివృత్త
ము) సౌదామినీ సన్నిభ, చారుగాత్రి । న్విదేహరాజాత్మజ, విద్రుమోష్ఠిం ।
గాదంబినీసీతను, గానవా స । న్మదంబునం జెప్పుము, నాకుఁ బ్రీతిన్ ॥ (వం
శస్థవృత్తము)ధరాసుతం గంటె క, దంబగుచ్ఛమా । వరాననం జూపు ల,వం
గమంజరీ । గురుస్తనిం జూపవె, కుందకుట్మలా । కరీంద్రహస్తోరువుఁ, గంటె శా
రికా ॥ (స్రగ్విణీవృత్తము.) భామినిం గంటివే, బంధుబంధూకమా । భూమి
జం గంటివే, పుష్పితాశోకమా । కామినిం గంటివే, కమ్రకల్హారమా । రామవీ
క్షించితే, రమ్యమాయూరమా ॥ (శా)మల్లీ కేతకి మాధవీ కురువకా, మం
దారమా మాలతీ । వల్లీమంజునికుంజమా కుటజమా, వామాక్షి వైదేహినా।
యుల్లం బారట పెట్టి నేఁడు చనె నీ,యుగాంతటవీ వీధిలో । ఫుల్లాబ్జాక్షి నెఱిం
గితేని చెపుమా, పుణ్యంబు నీకయ్యెడిన్ ॥ (వ)అని యనేక ప్రకారంబుల న
య్యాశ్రమంబునం గల తరుల తల ఖగమృగంబుల వైదేహి నడుగుచు నెందు
నుం గానక ॥ (తే,గీ)తోయజేక్షణ నీవేల, దూరమునకుఁ । బరువు లెత్తెదు
నాకుఁ, గన్పడితి వీవు । పంతమున భూరుహంబుల, చెంత డాఁగి । యిపుడు
నాతోడ భాషింప, వేల చెపుము ॥ (తే,గీ)కమల ముఖి హాస్యశీలవు, గావు నీ

వు । మించి యీలాగు నన్ను పేక్షించె దేల । కాంత నామీఁదఁ దొల్లిఁటి, కరుణ లేదె । నిలు నిలుముపోయె దేటికి, నీరజాక్షి ॥ (తే,గీ)చారుపీత కౌశేయవ, స్త్రంబుచేతఁ । బద్మలోచన సూచింపఁ, బడితి నిప్పు । డొంటిఁ జను నిన్ను వీక్షింపు, చున్నవాఁడ । నెనరు నామీఁదఁ గల దేని, నిలువుమింక । (ఉ)ఎచ్చటి కేగితే కువల, యేక్షణ పల్కవ దేల కోమలీ । ముచ్చట లాడ రావలదె, మోహనరూపిణి యల్కఁబూని న । న్నిచ్చటఁ బాసి పోవఁ దగ, వేమధురాధరి యీవనంబులో । నెచ్చటనున్న దానవొ మహీసుత వేగమె మోముఁ జూపవే ॥ (క)అని పెక్కు గతులఁ జీరుచు । వినతాంగి మృదూక్తి చెవుల, విన బడ కునికి । న్మనమున నాందోళింపుచుఁ । గనుంగొనల నశ్రులొలుకఁ, గానిట్లనియెన్ ॥ (చ) పిలిచినఁ బల్కదెంతయును, భీత మృగేక్షణ యివ్వనంబులోఁ । గలదను మాట సందియము, గావునదారుణరాక్షసాధము । ల్బలిమి గ్రసించుటో మఱఁగి, పట్టుక పోవుటొ చంపుటో రహ । స్థలమున దాఁచుటో యొకటి, తథ్యముగాఁ గవె తెయున్నదే ॥ (మ)అని నోరెండఁగఁ బాదములవాడక మేఁ నాకంపముం జెంద లో । చనయుగ్మం బతిశోక రోదనముచే సం, ధ్యారుణచ్ఛాయతో । నెనయై యొప్పఁగ మాట తొట్రువడ నెం, తేచిత్తమోహంబుపై । కొన ఫాలంబునఁ జెమ్మటల్వొడమ సం, క్షోభీకృతస్వాంతుఁడై ॥ (చ)కనుఁగవ మోడ్చునుస్సురనుఁ, గంపము నొందుఁగడుం దలంకు హా । జనకకుమారి యంచుఁబలు, చందములన్విలపించు లక్ష్మణా । వనజసుగంధి జాడఁగన, వా యను మాటికిఁ జీరు దైవమా । యను వనితావియోగజని, తార్తిఁ దపింపుచు రాముఁ డయ్యెడన్ ॥ (క)సోలుచుఁ జింతా భరమున । వ్రాలుచుఁ గైదండ యొసఁగు, లక్ష్మణుమేనం । దూలుచు శోకాంబునిధిం । దేలుచుమూర్ఛిలుచు మఱలఁ, దెలియుచు మఱియున్ ॥ (ఉ)ఎక్కడ నల్కదైనఁ దరళేక్షణ వచ్చునఁటంచుఁ జూచునే । యిక్కువఁ జప్పుడైననుమ, హీసుత పల్కని యాలకించు నేఁ । దిక్కు తథుక్కు మన్న సుద, తీమణి మైజిగిగాఁ దలంచులో । నక్కజమైన మోహమున, నారఘునాథుఁడు భ్రాంతచిత్తుఁడై ॥ (వ)ఇట్లు దురంత చింతాభరంబున నమ్మేదినీకాంతుండు కాంతాన్వేషణతత్పరుండై కొండొక సేపయ్యాశ్రమసమీపంబునం గల శైలంబులును గిరిప్రస్రవణంబులును నదీనదంబులును బుష్పపల్లవోపేతంబులై సంచారయోగ్యంబులైన వనంబులును వి



షమంబులైన కాననంబులును విలోకించి యెందునుం గానక శోకసంతప్తచిత్తుండై రాక్షసభక్షణంబు కొఱకు నాచేత విడువం బడియెఁ గావున నమ్మహీపుత్రి పథికసంఘంబుచేతఁ బరిత్యక్తయైన బహుబాంధవయగు యువతి పగిది రాక్షసులచేత నిక్కంబుగా భక్షిత యయ్యె నని తలంచి వలయకంకణాంగదభూషితంబులును జారుపల్లవకోమలంబులును వేపమానాగ్రంబులునైనతదీయబాహువులును జంపక వర్ణాభంబును గ్రైవేయశోభితంబును గోమలంబునైనతదీయకంఠంబును బద్మపత్రనిభేక్షణంబును సంపూర్ణచంద్రప్రతిమంబును శుభదంతోష్ఠంబునురుచిరనాసంబును జారుకుండలంబునైన తదీయవదనంబును మనంబున సంస్మరించి యివియన్నియు రాక్షసుల చేత భక్షితంబు లయ్యె నొకో యనితలంచి నానాప్రకారంబుల విలపించుచు శూన్యంబైన యాశ్రమపదంబునుసీతావిరహయైన పర్ణశాలయును విధ్వస్తంబులైన యాసనంబులును విలోకించి యస్వస్థహృదయుండును ననిష్పన్న మనోరథుండునై భుజంబులెత్తి మాటిమాటికి నుచ్చైస్స్వరమున సీతంజీరుచు లక్ష్మణున కిట్లనియె ॥ (మ) అనఘా యెక్కడ సీత యేవిషయమం, దాసక్తితో నున్న దె । వ్వనిచే భక్షిత యయ్యె నెవ్వఁడు వడి, న్వామాక్షి ( గొంపోయె శో । భనచారిత్రనునన్నుఁ బ్రీతి భజియిం,పన్వచ్చునే యింక నా । మన మానందరసప్రవాహలహరీ,మగ్నంబునై యొప్పునే ॥ (వ)అని పలికి సీత నుద్దేశించి ॥ (క)నాచిత్తము దెలియుట కిపు । డీచాయలఁ దరుల పొంత, నెక్కడనున్నా । వోచాలునుబరిహాసము । నీచక్కఁదనంబుఁ జూపి, నెఱిఁ బ్రోవు మిఁకన్ ॥ (తే,గీ)చారులోచన నినుఁ గూడి, సంతతంబుఁ । గరముక్రీడించు మృగశాబ, కములు నేఁడు । నిన్నుఁ గానక కన్నుల, నీరు గ్రమ్మ । ధ్యాన మొనరింపుచున్నవి, యాశ్రమమున ॥ (వ) అనిపలికి వెండియు లక్ష్మణు నుద్దేశించి ॥ (ఆ,వె)సీతలేని నాకు, సిరి యేల బ్రతుకేల । ప్రాణ మేల పూజ్య, రాజ్య మేల । తద్వియోగ జనిత, తాపాగ్ని చేఁ గ్రాఁగి । మేనుఁ బాయు టిదియ, మేలుగాదె ॥ (ఆ,వె)జానకీవియోగ,జనితార్తిఁ జేడస్సి । మృతుఁడనైన నన్నుఁ ద్రిదశలోక । మందు రావయ్యఁ డైనమజ్జనకుండు । నేఁడుచూడఁగలఁడు నిక్కవముగ ॥ (వ) మఱియుఁ బరలోకగతుండనైన నన్ను విలోకించి మజ్జనకుండగు దశరథుండు చతుర్దశ వత్సరంబు లరణ్యంబుననుండుమని నాచేతనియోజితుండవై తి వకాలంబు పరిపూర్ణంబు

గాక మున్నె మత్సకాశంబునకుం జనుదెంచితివి కామవృత్తుండ వనార్యుండవు మృషావాదివైతివని ధిక్కరించుచుంగాదె యనిపలికి యంతకంతకగ్గలంబగుశోకావేశంబున ॥ (ఉ) మానినిదుష్టచిత్తుఁడగుమర్త్యునిశాశ్వతకీర్తిఁబోలెన। న్నీనుని భగ్నకామితుని దివ్యధితాత్ముని శోకపీడితుఁ।గానన మందుఁబాసి లల, నామణియెక్కడి కేగితే నినుం । గానక యున్న నాకు బ్రతు, కన్వశమే వెసం బ్రోవరాఁగదే ॥ (వ)అని యిట్లు పెక్కు చందంబుల సీతాదర్శన లాలసుండై పంకనిమగ్నంబైన కుంజరంబు చందంబున నిశ్చేష్టితుండై విలపించు చున్న రఘుపుంగవుం జూచి తదీయచిత్తానువర్తియగు లక్ష్మణుండు తత్కాలసదృశంబగు వాక్యంబున నిట్లనియె ॥ (చ)ఇది బహుకందరోపలము, భూరుహమైన వనంబు గౌతమీ । నదికి జలార్థ మేగెనో వనంబునకుం గుసుమార్థమేగెనో । మదిఁ దెలియంగఁ బూఁబొదల, మాటున నెచ్చట డాఁగి యున్నదో । వెదకుము నన్నుఁ గూడి రఘు, వీర విషాదము నొంద నేటికిఁ ॥ (క) ప్రియవనసంచారిణిత । ద్దయు వనసంచారకోవిదయు వనవాస । ప్రియయును గావున జనకత । నయ యెచ్చట నున్నదోవ నంబున నిపుడుఁ॥ (తే,గీ) కమలములఁగోసి తెచ్చుటకమలపంక । జాకరంబుల చెంగటి కరిగఁజనెనో । స్నానమొనరించుటకుఁ బ్రీతినదికిఁజనెనో । వెదకుదముగాకశోకింపవేఱ్ఱితనమె॥ (తే,గీ) అనుచు సౌహార్దమునఁదమ్ముఁడాడినట్టి । మాటకొక్కింతధృతిఁబూనిమనుజనాథుఁ । డతఁడు తానును నవ్విపినాంతరమున । మఱల వెదుకంగఁదొడఁగి రమ్మానవతిని॥ (ఉ) ఆరఘువర్యులీకరణి నవ్విపినంబుననానగాళిలో । ఘోరమహీధ్రకందరని కుంజసరిత్సరసీవనాళిలో । నారసి సీతఁగానకపుడార్తిఁ దపింపుచునుండి రంతనా । ధీరుఁడు లక్ష్మణుండు వగ దేర్చుచు రామునితోడ నిట్లనుఁ॥ (ఆ,వె) ఓమహానుభావ యీమాడ్కి శోకింప । నేల బలిని గట్టి నేలగొన్న । చక్రపాణిపగిది జానకి వడసెదు । ధైర్యము డుగుటిది యుఁగార్యమగునె॥ (చ) అనవిని రాముఁడాస్యమున నంటిన విన్నఁదనంబుతోడనె । మ్మనమున శోకముం గదుర మాటలు తొట్రువడంగ లక్ష్మణుం । గని వనశైలకందరనికాయముఁ జూచితి నిందు నెచ్చటం । గనుఁగొననైతిఁ బ్రాణముల కంటెగరీయసియైన జానకిఁ॥ (వ) అని యిట్లు బహుప్రకారంబుల విలపింపుచు సీతాహరణకర్శితుండును దీనుండును శోకసమావిష్టుండునగుచు నొక్కముహూర్తంబు



విహ్వలుండై ధైర్యంబువదలి గాంభీర్యంబువిడిచి గౌరవంబు దోలంగంబెట్టి చేష్టలుమాని యెఱుకమఱచి యవసన్నాంగుండై తత్తరంబున సారె సారెకు దీర్ఘంబుగా వేఁడి నిట్టూర్పులువుచ్చుచు జానకిం బేర్కొని యుచ్చైర్నాదంబున రోదనంబుసేయుచు సంయతాంజలియై లక్ష్మణుండు శోకాపనోద కారణంబులైన యుపశమనవాక్యంబుల నెంతయనూనయించిన నూఱడిలక సీతావియోగజనిత వ్యామోహోపహత చేతనుండై మాటిమాటికి రోదనంబుసేయుచు దురంతచింతాభరంబునందూలుచు మదనపరవశుండై జానకిం గట్టెదుట నున్నదానిఁగాఁదలంచి యద్దేవిసంబోధించి శోకగద్గదకంఠుండై యిట్లనివిలపించె॥ (చ) వనకుసుమప్రియత్వమున వారిజలోచననీవుముంగలం । బనివడియీ యశోకవిటపంబులమాటున మేనొకింతయుం । గనుపడకుండ నిట్లుజనకక్షితినాథతనూజయుండఁగాఁ । జనునెమనంబులోఁగడువి షాదముపుట్టెడు రమ్ముచెచ్చెరఁ॥ (క) కదళీనిభోరుకాండము । లదటునఁగదళీమహీరుహంబులచెంతఁ। వదలకకనుపడుచున్నవి । సుదతీవెసరమ్మునాకుఁజూడన్వశమే॥ (సీ) వనితనీకుచములకెనయనిడాఁగితో సదమలపుష్పమంజరుల చెంత । సుదతి బాహువులకుజోడనిచేరితో వికసితనూత్నవల్లికల చెంత । సింతినీమోవికి సీడని డాసితో రమణీయనవపల్లవములచెంతఁ । దరుణిపాదములకుసరియనిచేరితో కరమొప్పు మెట్టదామరలచెంత॥ (తే,గీ) యువతి పరిహాసమునకు నన్నొంటివిడిచి । విపినమునడాఁగుటిదియవివేకమగునె । మగువ యీపరిహాసంబు మాకుబాధ । సేయుచున్నదిచయ్యనఁజేరరావె॥ (తే,గీ) అంబుజేక్షణ శ్రాంతుండనైననాకుఁ। గరముపరిహాసముననేమికార్యమిప్పు । డెలమినినుఁగూడి యున్నచోనిచ్చఁబ్రీతి । నొసఁగునేనాకునినుఁగానకున్నచోట॥ (క) పరిహాసప్రియవగుటయు। నిరవొందఁగనీదుశీలమెఱుగుదునైనం । దరుణీ యాశ్రమపథమునఁ । బరిహాసము దగదువీటఁబరువడిఁజెల్లుఁ॥ (ఉ) అక్కటనన్ను నేఁడుపరి యాచక మాడుటకీనగాళిలో । నెక్కడనున్నదానవొమృగేక్షణ నీవిట లేమిఁజేసిన । ద్దిక్కులుని ష్ప్రభత్వమున దిక్కఱియున్న విపణ్ణశాలకుఁ । గ్రక్కున వచ్చిమెచ్చి ననుఁ గౌఁగిటఁజేర్చిముదంబొసంగవే ॥ (చ) అనిపలుమాఱుఁజీరివిభుఁ డవ్వల లక్ష్మణుఁజూచితమ్ముఁడా । యనయముసీతనిక్కముని శాటులచేహృతయయ్యెఁగాక యుం । డినఁదనుఁజీరినంబలుక దేమృగయూథముశోకబాష్పము । లక్కనుఁగవ

నించుచుఁ జనక కన్యకపోయినజాడఁ దెల్పెదిర్॥ (వ) అని వెండియు సీతనుద్దే
శించి॥ (ఉ) అక్కటనన్ను ఘోరవిపినావనినొంటిగ డించినేఁడునీ । వెక్కడకే
గితేకువల యేక్షణనీవిటరాక్షసాలిచేఁ । జిక్కుచు నుండఁగైకయువ శీకృతస
ద్విషయస్థలోకయై । చొక్కుచు నుండుఁగాదెతన సూనుఁడు రాజ్యము నేలు
చుండఁగన్॥ (తే,గీ) నీవుపోయినతెరువునఁబోవుటంతె । గాక క్రమ్మఱఁ బురికె
ట్లునాకుఁబోవు । టొప్పునటులైనఁ గడునిర్దయుండువీర్య । హీనుఁడనిలోకమెల్ల
నన్నెన్నికొనదె॥(ఆ,వె) వారిజాక్షిమునుభవత్సమన్వితముగ । రమణవచ్చితిని
బురంబువిడిచి । నిన్నువిడిచియకట నేఁడెత్తైఱంగునఁ । బురికినేనుమఱలఁ బోవు
వాఁడ॥ (క) వనవాసముసలిపిపురం । బునకుమఱలఁబోయియచటఁ బుత్రస్నే
హం । బునఁగుశలమడుగుజనకునిఁ । గనుఁగొననేపగిది నోపఁగాఁగల నకటా॥
(వ)మఱియు నవ్విదేహవల్లభుండు సీతావిరహితుండనైన నన్నువిలోకించి పు
త్రికాస్నేహసంతప్తుండై నిక్కంబుగా మోహవశంబునొందునని వగచి పదం
పడి లక్ష్మణునాలోకించి॥ (ఆ,వె) నీరజాక్షిలేనినెలవు నాకంబైన । శూన్యమ
గుచునాకుఁజూడనొప్పుఁ । గానవీటికింక నేనుబోవఁగఁజాల । దేవియట్లయిచటఁ
బోవువాఁడ॥ (క) జానకినిబాసినిమిషం । బైననుజీవింపఁజాల నటుగావునన
న్గాననమునవిడిచియయోధ్యానగరికిఁబొమ్ము నీవుతల్లులకడకున్॥ (క)సీతాప
తిచేతనను । జ్ఞాతుఁడవైతివిక ఁబుడమిఁ గావుమనుచువి । ఖ్యాతిగభరతునితోఁ
జెపు । మాతతమతిఁగౌఁగిలించియస్మదనుమతిన్॥ (క) జననిసుమిత్రయుఁగైక
యు । ననఘా కౌసల్యయునన యంబుననభివం । దనపూర్వకముగనీచే । నసిశ
మురక్షింపఁదగుదురనఘవిచారా॥ (క) కావుననావార్తయుసీ । తావృత్తాం
తమునుజెప్పితగమజ్జనని । న్నావిరిఁ బ్రోచుచునుండుము । పావనగుణదుఃఖమున
కుఁబాల్పడకుండన్॥ (క) అనిరఘుపతిదీనుండై । జనకజనెడఁబాసిశోక సంతా
పభరం । బునవిలపించుచునుండం । గనిలక్ష్మణుఁడధికశోక కశితుఁడయ్యెన్॥
(ఉ) ఘోరవిషాదచిత్తుఁడగు కూరిమితమ్మునిఁజూచిరాముఁడు । న్దారుణశోకత
ప్తుఁడయి దైన్యముదోఁపఁగశోకబాష్పము । ల్గారఁగ వేఁడియూర్పుసెలఁగన్వ్య
సనోదితభంగినిట్లనెం । ఘోరినమోహతాపమునఁ గుందుచు రోదనపూర్వకం
బుగన్॥ (ఉ) ఆరతవైభవోదితుఁడ నయ్యనుశోకముమీఁదశోకమీ । రీతిఁడపిం
పఁజేయుసశరీరుఁడనై మనియుంటిఁగావునం । బూతచరిత్రచూడననుఁ బోలిన



దుష్కృతకర్మకారిధా । త్రీతలమందువేఱొకఁడు లేఁడిదినిక్కము రాజనంద
నా॥ (ఉ) తొల్లిఁటిపాపకర్మమిటు తోడుతఁ జేకుఱెనాకుఁగానిచోఁ । దల్లిని
జుట్టలన్విడిచి తండ్రినిరాజ్యముగోలుపోయిసాం । పెల్లఁదొలంగిశోకమునన్నిచ్చ
లుగాసిలు చుండమీఁదఁబా । టిల్లునెయిట్లరణ్యమున దెప్పరమైన సతీవియోగ
మున్॥ (తే,గీ) కడఁగిసీతావియోగదుఃఖంబువలనఁ । గెరలితొల్లిఁటి బహువి
ధక్లేశమంగ । మేర్చుచున్నదిలక్ష్మణాయింధనముల । చేతనుద్దీప్తుఁడగు తీవ్రశిఖి
యుఁబోలె॥ (తే,గీ) రక్కసులచేతిలోఁబడిరాజపుత్రి । తనదుసుస్వరభాషణ
త్వంబువిడిచి । సాధ్వసంబుననేఁడప స్వరముతోడ । నుగ్రవనమున విలపింపు
చుండుఁగాదె ॥ ( ఆ, వె ) అకట లోహితాఖ్య హరిచందనంబున । కనుది
నోచితంబు లైన యువతి । వృత్తపీనకుచము లెంతయు రుధిరసి । క్తంబులగు
చుసొబగు దప్పియుండు॥ (చ)కమలపలాశలోచనము కౌముదిసన్నిభచారుహా
సయు । క్తముమణి కుండలోజ్జ్వలితగండము కుంచితనీలకేశపా । శముమృదు
భాషణంబునగుజానకిమోముపరక్తచంద్రబిం । బముక్రియనుండు నేఁడసుర పాలి
వశంగత యౌటనెంతయున్ ॥ (చ) ఘనతర హారశోభితము కాంత పయో
ధరయుగ్మరంజితం । బనుపమ హేమ కంచుక సమన్వితమైయలరారుమేదినీ ।
తనయయురంబు సించిభయదక్రియఁదద్రుధిరంబు శోణితా । శనులగు రాక్ష
సాధములు చయ్యనఁగ్రోలుదు రేమిసేయుదున్ ॥ (ఉ) ఆయతకాంతనేత్రయ
గు,నాగజగామిని మద్విహీనయై । పాయకనిర్జనం బయినబంధురకాననమం
దునొంటిదై । తేయులచేతఁజిక్కి యతిదీనతఁ దత్పరికృష్యమాణయై । రాయి
డిఁ గోర్వఁజాలకల క్రౌంచిగతి న్విలపించునేకదా ॥ (చ) ఇరవుగనున్నఁ గూడి
తగ నీరమణీయ శిలాతలంబునం । గరము సుఖోపవిష్టయయి క్రమ శుచిస్మి
తయై సుహాసయై । పఁరగనుదారశీలయగుభామినినిన్నటుచూచిమున్న భా ।
సురబహువాక్యజాతమును సొంపుదలిర్పవచించునేకదా ॥ (సీ) రాజకుమా
రయా రాజాస్యసలిలార్థమమల గౌతమీనది కరిగెనొక్కొ । జలజాక్షిపంకజం
బులు దెచ్చుటకుబ్రీతి సరసిచెంతకు వేడ్కఁ జనియెనొక్కొ । చారుపుష్పిత
వృక్షషండ మండితమైన యీవిపినంబున కేగెనొక్కొ । కమనీయతరపు
ష్పగంధబంధురమైనపూఁబొదరిండ్లకుఁబోయెనొక్కొ॥ (ఆ,వె)యతివచాలభీ
రువగుటమున్నెన్నఁడు । నన్నువిడిచియొంటి నదికిసరసి । తటవికీరములకున

టుగదు నేఁడెట్లు । చనియెనాతలంపు సత్యమగునె । (ఉ) లోకకృతాకృతజ్ఞుఁ డవు ।లోకబుతానృత కర్మసాక్షివ । స్తోకవిభావసుండ వజితుండవు వేద మయుండవీవ్రపు । ణ్యాకరమిత్రసీతహృతయయ్యెనొలేకిప్రుడెందుఁబోయెనో । శోకవశుండనై మిగుల స్రుక్కెడు నాకెఱిఁగింపు సత్కృపన్ ॥ (చ) అవిరళ భక్తి వేఁడెద న,రాహిసుపర్వజగంబులందు నీ । కవిదితమైనయర్థ మర,యం గ నొకించుక లేదు దానవు । ల్యువతి హరించిరో కెడపి,రో వనవీథిఁ జరింపు చున్నదో । పవన రయాహతోపవన.భామిని పోయిన జాడఁజెప్పుమా ॥ (వ) అని బహుప్రకారంబుల శోకాధీన దేహుండై విసంజ్ఞుండుంబోలెవిలపింపుచు న్న యన్నంజూచి యదీనసత్వుండగు లక్ష్మణుండు న్యాయసంస్థితుండై కాలో చితంబగు వాక్యంబున నిట్లనియె ॥ (తే,గీ) అధిప శోకంబు విడిచిధైర్యంబుఁ బూని । యుర్వినందన వెదుకంగ నుత్సహింపు । మరయనుత్సాహవంతులు ధ రణి నెట్టి । దుష్కరపుఁబనులందైనఁ, దొట్రువడరు ॥ (క) అనిలక్ష్మణుండువ లికిన , వినివిభుఁడచలుండుగాక విరహజ్వరసం । జనితార్తిఁ జాలఁదూలుచు । ననుజన్మునితోడమఱల ననియెంగృపణుఁడై ॥ (మ)సుదతీరత్నముపద్మముల్ గొ నుటకై పొంపొందఁగాగౌతమీ । నదికింబోయెనొతత్సరఃపులినసం తానంబులం జూచివ । చ్చెదవాయన్ననతండు పోయిమదిరా క్షింగాన కేతెంచిగ । ద్గదకం ఠుండయియన్నకిట్లనియెసం తాపంబువాటిల్లఁగన్ ॥ (వ) దేవా తీర్థవతియై

() రాముఁడు సీతావృత్తాంతమును గోదావరి నడుగుట. ()

న గోదావరికింబోయి తత్తీర్థంబులయందువెదకి యెందునుంగాననైతి నెంత చీరినఁ దద్వాక్యంబువినరాదయ్యె మీరుసని వెదకవలయు ॥ (క) నావినిరఘు నాథుఁడుగో । దావరికింబోయిచాలధరణీసుతన । చ్చోవెదకి కానకతిశో । కా విలచేతస్కుఁడగుచు నన్నదినడిగెన్ ॥ (చ) అడిగినవారి భూతచయ మయ్యె మపోయినజాడెఱింగియుం । గడువడిఁజెప్పదయ్యెనల గౌతమియుంగుటిలుండు రావణుం । డలుకను బూనునోయనుభయంబుననేమివచింపదయ్యెన । ట్లు డుగక చెప్పుమీవనిస ముద్గతిభూతములెంతచెప్పినన్ ॥ (వ) ఇట్లునిరుత్తరుండై రాముండు లక్ష్మణునవలోకించి॥ (చ) జనకజవార్తనించుకయు సమ్మతినీనది చెప్పదయ్యెనే । జనకునకేమిచెప్పుదుఁబ్రసన్నతఁదల్లికినేమిచెప్పుదుం । గనికని దైవమెంతయుప కారమునాకొనరించెనేగతి । జ్జనియెదనెందుఁజొచ్చెదవనం



బుననెట్లువసింతుఁదమ్ముఁడా ॥ (చ) హితులనుబాసి రాజ్యమున హీనబలంబును గోలుపోయియీ । గతిగహనంబులోఁదపసినై వడినాకలమున్భుజింపుచు, స్థితిఁ గనిసంచరింపుచుఁదు దిన్నతిగోల్పడినిద్రలేకదు । మర్తితివిలపించు నాకిచటరా త్రులుదీర్ఘములై చనుంగదా॥ (క) జానకిగనుపడెనేనియు । మానుగనీకుజ ములందుమందాకినియుం । దీనగములయందుజన । స్థానములందిచ్చకోలఁదిఁజ రియింతుఁగదా॥ (తే,గీ) ఈమృగంబులుసారెకు నామొగంబుఁ । జూచుచుమ హీజపోయినచొప్పుచెప్ప । నిచ్చగించిన క్రియఁదదీయేంగితములు । దోఁచుచు న్నవిదుర్జనదూరకంటె ॥ (క) అనిపలికి విభుఁడు సతిపో । యినచందముఁజె ప్పఁడనిన మృగములునభముం । గనుఁగొనుచు వేగదక్షిణ । మునకుంజనియె నశ్రీఘూర్త మునిఁగనుఁగొనుచున్ ॥ (వ) మఱియు నవ్వనమృగంబులు శీఘ్రం

(*)లక్ష్మణుఁడు రామునికి మృగంబులు సీతజాడఁ దెల్పుటను జెప్పుట.(*)

బునలేచి దక్షిణాభిముఖంబులై నభస్థలంబు విలోకింపుచు రావణుఁడు వైదే హినెత్తికొనిచనిన మార్గంబుఁబట్టి రామభద్రునవలోకింపుచు దక్షిణాభి ము ఖంబుగా నరిగె నేకారణంబున మృగంబులు దక్షిణదిశను దక్షిణ దిగ్భూమిని విలోకింపుచు దక్షిణదిశకుబరువెత్తె నక్కారణంబున నామృగంబులు లక్ష్మణు నిచేత గృహీతచేష్టార్థంబులయ్యె నప్పుడాలక్ష్మణుండు మృగంబుల చేష్టాభి ప్రాయంబు వచనసారంబుగా విలోకించి యన్నకిట్లనియె॥ (సీ) కాకుత్స్థవర యీమృ,గంబులుమీచేతనవనిజవృత్తాంత, మడుగఁ బడిన । వగుచు దక్షిణ భూమి, నందంద చూపుచు యామ్యదిశాభి, ముఖ్యంబుగాఁగఁ । బోవు చు నున్నవి, భూపుత్రి పోయిన జాడగా వలయు వి,చారముడిగి ।వెదకుదమా య న్న, విని రాముఁడగుఁగాక యనివేగ ననుజస, హాయుఁడగుచు ॥ (తే,గీ) దక్షిణాభిముఖంబుగా, దావమెల్లఁ । గలయఁ జూచుచుఁ బోయి మా,ర్గము న నొక్క । జాడ రాలిన క్రొవ్విరి, సరులు చూచి । మనుజవిభుఁ డిట్లు లని యె లక్ష్మణునితోడ ॥ (క)మానుగ నీకుసుమంబులు । జానకి ధమ్మిల్లమందు,

(*)రామలక్ష్మణులు మృగసూచిత మార్గమున సీతను వెదకుట.(*)

సవరించినవి।కాననలనాచేదత్తము । లైనవిగుఱు తెఱిఁగికొంటి,ననఘవిచారా॥ (వ) మఱియు నిక్కుసుమంబుల నమ్లానతచేతసూర్యుండు ననపన యంబుచేత సమీరుండును ధారణంబుచేత ధరిత్రియు నీముప్వురు నాకుఁ బ్రియంబుసేయుట

కు నావచ్చు నందాఁక రక్షింపుచున్న వారని తలంచెద ॥ (తే,గీ) అనుచుఁ ద
మ్మునితో నాడి, యధిపుఁ డొక్క । శైలమును గాంచి గిరినాథ, జనకకన్య। నే
మఱెఱుఁగింపు మని పల్కి, చెప్పకున్న । నట్టి కోపించి దానికి, నిట్టులనియె॥
(చ) గిరివర సీత చంద మెఱుఁ, గింపుము నీవటు దెల్పవేని దు । ర్భరశరవహ్ని
చేతనిను, భస్మముఁ జేసెదనిర్ఝరంబులుఁ । గరమునవాంబుహీనములు, గాభ
వదున్నతమేదినీరుహా । తక్కరములు పర్ణహీనములు.గానొనరించెదఁ జూడు
క్రేల్మిడిన్ ॥ (క) పరువడి నీసానువు లవి । ముఱిఁ ద్రుటి తాశ్మములు గాక,
మున్నె సువర్ణాం, బరధారిణి హేమాభను । సురుచిరగాత్రినిమహీజఁ, జూపు
మునాకున్॥(ఆ,వె)చూపవేనియిపుడె,సునిశితశరవహ్ని।భూరితరులుశిలలునీఱు
చేసి।చెలఁగినిన్ను నేఁడ సేవ్యంబుఁ జేసెద।గౌతమీరయంబుఁ,గట్టవైతు॥(క)అనిపలి
కీవిభుఁడుకన్నులు।ఘనతరరక్తాంబుజముల,కైవడినలరం।గనుఁగొనియెమ్రోల
నిడుపై।తనరుడశానను నిపథము,ధారుణియందున్॥(తే,గీ)కాంచియంతట వెండి
యుఁ,గలయ వెదకి । రామకాంక్షిణియును దైత్య, రాజకృష్ట । యును బ్రభావంతి
యును బ్రీతి, యుతయునైన । జనకనందనపదముల,జాఁడగనియె॥ (వ) ఇట్లు
రాముండు ప్రవృత్త విక్షేపంబులైన వైదేహీ రావణుల చరణన్యాస స్థానం
బులు విలోకించి తత్సమీపంబున భగ్నంబై పడియున్న చాపంబును దూణీరం
బును బహుప్రకారంబుల విశీర్ణంబైన రథంబును విలోకించి సంభ్రాంత చిత్తుం
డై ప్రియవాదియగు లక్ష్మణునకిట్లనియె ॥ (చ) అనఘ మహీశపుత్రి వివిధాభ
రణంబులు హేమబిందువుల్ । మునుకొని గంధపుష్పరస ముద్ధరనంతటఁ జూ
డనొప్పెడిన్ । ఘనముగ రక్తబిందువులు,గానఁగనయ్యెడి దైత్యపాళిచే । జనక
జ కాననంబున నిజంబుగ భక్షితయయ్యెఁ జూడఁగన్ ॥ (చ) గుఱుతుగ భూ
మిపుత్రికొఱ, కుంగలహించినిశాటులిద్దఱుం । బోరిబోరి బాహుగర్వమునఁ,
బోరినచందముదోఁచెఁగానిచో । నురుతర హేమభూషిత స,ముజ్జ్వల చాపము

() రాముఁడు జటాయుజేత భగ్నంబైన రావణరథంబుఁగని వితర్కించుట. ()

భగ్నదండమై । నిరుపమ ఘోరథంగినవ, నింబడియుండఁగ నేలచెప్పెమా॥
(క) తరుణాదిత్య నిభంబును । గురుతర వైడూర్యరత్న గుళికాచితము । న్ని
రుపమసువర్ణకవచము । ధరణింబడి యున్నదిచటఁ,దమ్ముఁడ కంటే ॥(తే,గీ)
సురుచిరముదివ్యమాల్యోప,శోభితంబు । శతశలాకంబునగుసితచ్ఛత్రమొకటి।



భగ్నమణి దండమై ధరఁ, బడి వెలుంగు । చున్న దిచ్చటఁ గంటివె, యురుగుణా
ఢ్య ॥ (వ) మఱియుఁ గాంచనమయ తాంకంతింబులును బిశాచవదనంబులు
ను మహాకాయంబులును భీమరూపంబును నగు ఖరంబులు గతప్రాణంబులై పు
డమిం బడియున్న యవి దీప్తపావక సంకాశంబును ద్యుతిమంతంబును సమర
ధ్వజోపేతంబునగు సాంగ్రామికరథంబు భగ్నంబై నేలంబడియున్నది చతుశ్శ
తాంగుళ పరిమితంబులును దపనీయవిభూషితంబులునగు బాణంబులుఖండితా
గ్రంబులై యభిహతంబులై విప్రకీర్ణంబులై రాలియున్నయవి శరపూర్ణం
బులగు తూణీరంబులు విధ్వస్తంబులై పడియున్నయవిపగ్గంబులును దోత్రంబు
లును గేలంగీలించి సూతుండుమృతుండై పడియున్న వాఁడు మణిరత్నమయం
బులైన దివ్యభూషణంబుల రజంబుపుడమిం గప్పియున్నది సోష్ణీషమణికుండ
లురగు పురుషులిరువురు విగతప్రాణులై చామరహస్తులై ధరణిం గూలియున్న
వారివియన్నియు సురాసురోచితసాధనంబులుగాని సర్వసామాన్యంబులు గా
వు కావున॥(క) క్రూరాత్ములైనదనుజులు । ఘోరంబుగసీతనెత్తికొనిపోవుటో తే।
కారయఁజంపుటో భ్రమింగుటో । కాల్చియుపెట్టుటో నిజంబొ కటటితల పోయన్॥
(క) కావునలక్ష్మణయసురుల । తోవైరము మిక్కుటముగ,దొరకొనెనాకు ।
న్భావింపఁగ మచ్ఛరముల । త్రైవలయ మరాక్షసంబు,గాఁగలదింకన్॥(తే,గీ)
పరఁగ ధర్మంబు రాక్షసా,పహృతయైన । యుర్వీనందనరక్షింపకునికిధర్మ।
మాపదలయందు రక్షణంబనెడున్యాయ । మదివిచారింపనేఁడునిరర్థమయ్యె॥
(క) అలయక యనాతురము వే । ల్పులనారాధింపుచుండు, మొనసినభక్తిం।
బలలాశనహృతయగుమై । థిలిఁగావఁదలంపఁ డొక్క, దేవుండైనన్ ॥ (వ) న
త్సకారుణ్యపరుండగువాఁడు సర్వలోకేశ్వరుండైనను మహాశూరుండైనను
వానింజూచి సర్వభూతంబులు తత్స్వభావాపరిజ్ఞానంబువలన నశక్తుండని తలం
చునట్లగుటంజేసి మార్దవాదిధర్మ యుక్తుండును శాంతుండును లోకహిత
యుక్తుండును గారుణ్యపరుండనైన నన్నుఁ ద్రిదశేశ్వరులందఱు నిర్వీర్యుండని తలం
పుచున్నవారు గావున నన్నధిగమించి మార్దవాదికంబు గుణంబైన ననిష్టసా
ధనత్వంబున దోషంబై ప్రవర్తిల్లె నిప్పుడు చంద్రచంద్రికలమాపి సముదితుం
డైన సూర్యుండు తేజరిల్లిన చందంబున సర్వగుణంబులనడుగునంద్రొక్కి మ
త్ప్రతాపంబు సకలరక్షోభూతగణనాశంబుకొఱకుఁ బ్రకాశింపుచున్నది గావున॥

(క) సురగరుడోరగవిద్యా । ధరచారణసాధ్యదైత్య, దానవయక్షా । సురసి
ద్ధతుషితులందో । క్రూరుఁడైననుసుఖముపడయఁ, గాఁజాలఁడికేఁ ॥ (తే,గీ)
(*) రాముఁడు క్రోధంబవలంబించి త్రైలోక్యసంహారంబుఁ జేసెదననుట. (*)
శాతశరములఁ త్రైలోక్య, చరులగమన । ముడిపెదనభంబు నస్త్రస, ముత్కర
మున । నిరవకాశంబుఁ జేసెద, నీరనిధుల । నెల్లశోషింపఁ జేసెద, నీక్షణమున ॥
(సీ) సౌమిత్రివినునేఁడు, సన్నిరుద్ధగ్రహ మావారితోడుని, శాధిపంబు । విప్రణ
ష్టానల, విధుమరుద్భాస్కరచ్ఛవియు సంతమసాభి, సంవృతంబు । విధ్వస్తతరుల
తా, విసరగుల్మంబును శోణితార్ణవమును, శుష్యమాణ । సరిదాశయంబును,
శకలీకృత కులాచలాగ్రంబునై విల, యంబునొందు ॥ (ఆ,వె) విష్టపత్రయం
బు, విబుధులుసీతను । నాకొసంగ రేని, యాక్షణమునఁ । జెలఁగితిరుగలేక, చేష్ట
లుదక్కి పీ । డింపఁగలరుమద్వి, శేషశక్తి ॥ (మ) అలుకన్మత్కర మండితా
తతధను, ర్జ్యాముక్తనారాచప । ఙ్క్తులచేమర్దితమై నిరంతరమునై, తోత్స్తోన
మర్యాదమై । కలితధ్వస్తమృగాండజాతగణమై, కాలోద్ధృతంబై సమా । కు
లమై యీజగమంతయున్మిగుల సంక్షోభించెడుంజూడుమా ॥ (క) ఆకర్ణ
పూర్ణదుస్సహ । కాకోదర కల్పశరని, కాయంబులనీ । లోకంబరాక్షసంబు
గఁ । జేకొని కావింతునింక, సిద్ధము వత్స ॥ (తే,గీ) సముదితమదీయభూరి
రోషప్రయుక్త । కార్ముకవిముక్త దూరాతి, గామినిశిత । సాయకబలంబుఁ
జూచినిజరులునేఁడు । చాలవిత్రస్తులగుదురు, సంభ్రమమున ॥ (క) గురు
తరమత్క్రోధంబునఁ । బరువడి లోకంబులెల్ల, భస్మంబులగు । న్నరయక్షా
సురకిన్నర । సురులునుబొలిసెదరు నేఁడు, చూడు కుమారా ॥ (తే, గీ) విను
ముజరయునుమృత్యువైపు, విధియుఁగాల । మనవరత మప్రతిహతంబు, లైనరీతి ।
మహితరోషరసోద్దీప్త, మానసుండ । నైనయేననివార్యుండ, నైతినిపుడు ॥ (వ)
అని పలికిమార్తాండ వంశమండనుండగు రాముండు సక్రోధుండై నేత్రంబు
లం దామ్రదీధితులునిగుడ నధరోష్ఠంబు చలింప యుగాంతకాలంబున నొప్పు
సంవర్తాగ్ని చందంబున నతిదుర్నిరీక్ష్యుండై జటాభారంబు సవరించి వల్క
లాజినంబులు బిగించి లక్ష్మణుని చేతనున్న ప్రచండ కోదండంబుఁ గేలనందు
కొనిసజ్యంబుఁ జేసి కాల కటాక్షసన్నికాశంబులైన నారాచంబులు సంధించి
లోకక్షోభంబుగా గుణప్రణాదంబు సేయుచుఁ బ్రత్యాలీఢపాదుండై నిలువంబ



డిన నమ్మహనీయమూర్తి మూర్తి విశేషంబు త్రిపురదహనదీక్షాదుర్నిరీక్ష్యుం
డైన యష్టమూర్తి మూర్తి చందంబునం దేజరిల్లుచుండె నిట్లు సీతావియో
గసంజనిత శోకాతిశయంబునం బుట్టిన క్రోధంబునలోకంబుల నన్నింటినొక్క
పెట్టభస్మంబు సేయసమకట్టి నిట్టూర్పులు నిగుడించుచు నదృష్టపూర్వతేజో

—(*). లక్ష్మణుఁడు రాముని మృదూక్తుల ననూనయించుట. (*)—

దుస్సహుండై యున్న యన్నం జూచి లక్ష్మణుండు వెలవెల వోయి చేతులు
మోడ్చి వినయంబున నిట్లనియె ॥ (సీ) అనఘాత్మ నీవుము, న్నతిదయాశాలివి
మృదుఁడ వఖిలభూత, హితరతుండ । వతిదాంతుఁడవు చంద్రు, నందు లక్ష్మియు
సూర్యునందుఁ దేజము వాయు, వందుగతియు । ధరయందుఁ దాలిమి, దగియుం
డు నీయందు నవి యన్ని కీర్తియు; నమరి యుండు । నట్టి మహాత్ముండ, వై
న నీవొక్కని యపరాధమున నిప్పు, డలుకఁ బూని ॥ (తే, గీ) భువనములఁ
గాల్పఁ దగునె యీ, భూరి రథము । నీపరికరంబు గలవాని, నెఱుఁగ మిచ
ట । వీర లిరువురు కలహించు, వెరపుఁ గాన । మొక్క రథ మిందుఁ జూప
ట్టుః, చున్నకతన ॥ (వ) మహాత్మా యీ దేశంబు ఖుర నేమిక్షతంబై రు
ధిరబిందుసిక్తంబై నివృత్త సంగ్రామంబై యున్నదైనను సైన్యస్థానంబుచూ
పట్టని కతంబున మన కపరాధి యగు వాఁ డొక్కండే యని తోఁచు చున్న
ది యొక్కనికిఁగాఁ బెక్కండ్ర వధింపంబూనుట ధర్మంబుగాదు మహీపతు
లు శాంతివహించి మార్దవంబున యుక్తదండులై చరింపవలయు ॥ (ఆ, వె)
జనవరేణ్య నీవు, సర్వభూతములకుఁ । బరమగతివి సాధు, పాలకుఁడవు । నిత్య
కాముఁడవు, నీపత్ని నెవ్వాఁడు । తెంపుఁ జేసి యపహ, రింపఁదలఁచు ॥ (చ)
అరయఁగయాగదీక్షితున, కర్థిమహావసుతులైన ఋత్విజు । ల్గరమపచారమిం
చుకయుఁ, గైకొని చేయఁగ లేనిమాడ్కిభా । స్కరసురయక్ష రాక్షసులు, శై
లములంబుధు లుర్వినీకుసు । స్థిరతర శక్తివిప్రియము, సేయఁగనోప రోకించు
కేనియుఁ ॥ (క) భూపాలవర్య యిచ్చటి । తాపసులనునన్నుఁ గూడి, తడయ
క యిచటన్ । భూపుత్త్రినపహరించిన । పాపాత్ముని వెదకి కాంచి పడఁగూల్పుమి
లన్ ॥ (తే,గీ) అనఘచారిత్ర జానకి నపహరించి । నట్టిదుష్టుఁడు గనుపట్టు
నంతదాఁక । గిరివనాబ్ధిసరిత్సరో, వరనరాహి । సురజగంబులుశోధింత, మురుజ
వమున ॥ (క) సదమలమతిసామంబునఁ । ద్రిదశులు సతినొసఁగరేని, తెంపున

సవల । న్వదలక నుత్థితక్రోధం । బదయతసార్థకముసేయు,మ స్మదనుమతిఁ ॥ (వ) మహాత్మావినయంబున నయంబున నామంబున శైత్యంబున మహీపుత్రివ డయంజాలవేని యవ్వలసురేంద్ర వజ్రప్రతిమంబులైన సువర్ణపుంఖ సాయకంబులుదరించిజగంబులు నిర్మూలంబుగావింపుదువుగాక యనిపలికిలక్ష్మణుం డుత్తిసమాటలఁ దెలివినొందక శోకసంతప్తుండై దురంత మోహంబుననస్వస్థహృదయుండై పరిమ్లానవదనుండై యనాథునిభంగివిలపింపుచున్నరాముని జూచి తదీయచరణంబులఁ బట్టుకొని కొండొకసేపుసాంత్వవాక్యంబుల ననూనయించి వెండియునిట్లనియె ॥ (చ) అనిమిషుఁడా సుధంబడసి,నట్లుగఁబఙ్క్తిరథుండుబల్తపం । బునఘునయాగకర్మమునఁ,బుత్రుసిఁగానినుఁగాంచినీదుపా । వనగుణ బద్ధుఁడైతగ భ.వద్విరహవ్యసనంబుచేఁ దుది । న్మనభరతుండు చెప్పి నక్రమంబున నేగె.సురేంద్రుపీటికిఁ ॥ (క) త్వాదృశులైనమహాత్ములె । యీదృగ్విధదుఃఖమిటుస, హింపకయున్న । న్మాదృశులు స్వల్పమతులే । తాదృశదుఃఖమున కెట్లు,తాళుదురధిపా ॥ (ఆ,వె) తొడరినీవుదుఃఖి,తుండవైజగములు । హీనతేజమునదహించితేని । యనఘుచరితయార్తు,లైభూతములుపద్మ । దళజలంబుభంగిఁ దల్లడిల్లు ॥ (సీ) అలనహుషాత్మజుం, డగుయయాతిసురేంద్ర పదమునొందియుదుఃఖి, పరుఁడుగాఁడె । కొడుకులనూర్వుర, గోల్పడి బ్రహ్మర్షియైన వసిష్ఠుఁడా,యాసపడఁడె । యఖిలభూతంబుల, కాధారమైన యీధరణి యొక్కొక మాటు, తల్లడిలదె । జగతీప్రవర్తకు, లగు చంద్ర రవులకుఁ గలుగదెయొకమాటు, గ్రహణభయము ॥ (తే,గీ) శక్రముఖదేవతలు కడుఁ, జతురులయ్యు । మున్ను పెక్కువిధములవి,పన్నులగుచు । శోక మొంద రెమాత్మీయ,సుఖమువిడిచి । యిదియులోకస్వభావమై,యెసఁగునధిప ॥ (వ) దేవాసమస్త భూతంబులు సర్వభూతాది దేహియగు సర్వేశ్వరుని వశంబునునతిక్రమింపంజాలవు నీవు ప్రాకృతుండుంబోలె వైదేహిం గూర్చి శోకింప నర్హుండవు గావు సమదర్శనులును విషాదరహితులు నగు నీయట్టి మహానుభావు లెట్టికృచ్ఛ్రంబులందైన శోకింపరు మహాప్రాజ్ఞులగు పురుషులు సూక్ష్మబుద్ధియుక్తులై శుభాశుభంబులు చింతింతురుగావున నీవునుబుద్ధిచేత నీదుఃఖంబు నాచేతనెట్లు సంప్రాప్తం బయ్యెనని యథార్థజ్ఞానంబున విచారింపుము శాస్త్రైకసమధిగమ్యత్వంబునఁ బ్రత్యక్షంబుగావిలోకించుటకశక్యంబులైనగుణ



దోషంబులుగల వగుటం జేసి యనిశ్చితఫలంబులైనకర్మంబు లనుష్ఠింపకున్న సుఖదుఃఖంబులు గలుగనేరవు మున్నేను బుద్ధిమోహంబున దైన్యంబు నొందినప్పుడెల్ల బహుప్రకారంబుల ధర్మోపదేశంబునం దేర్చు నట్టి నీవె వైక్లబ్యంబు నొందిన సాక్షాద్బృహస్పతియైన నిన్నుం దేర్చుటకు సమర్థుండు గాఁడు మముబోంట్లఁ జెప్ప నేల మహాప్రాజ్ఞుండవైన నీమతంబు దేవతలకైన దురన్వయంబు శోకంబుచేత నంతర్హితంబైన భవదీయ జ్ఞానంబుఁ బ్రబోధించెదవధానర్హంబైన సాత్త్వికదేవగంధర్వాదిదివ్యప్రాణివర్గంబును బ్రాహ్మణాదిమనుష్యవర్గంబును సర్వలోక సంహార సమర్థంబైన నిజపరాక్రమంబు నాలోచించి వధార్హులగు వారి వధంబు కొఱకు సన్నద్ధుఁడవు గమ్ము సర్వజగత్సంహారంబునందు మన కయ్యెడి లాభంబెద్ది సీత నపహరించిన పాపాత్ముని నెఱింగి వాని వధింపుమనిబోధించిననారఘు వల్లభుండుసారగ్రాహి యగుటంజేసిమహాసారంబైన లక్ష్మణుని వాక్యం బంగీకరించి ప్రవృద్ధంబైన కోపం బుజ్జగించి చిత్రంబైన కోదండం బెక్కుడించి వెండియు లక్ష్మణున కిట్లనియె ॥ (ఆ,వె) ఎందుఁబోద, మతివ నెచ్చట వెదకుద । మెట్లు పోవు వార, మెద్ది తెఱఁగు । చెప్పు మనిననతఁడు, చేతులు మోడిచి । యిట్టు లనియె వినయ, మెసఁగ నెసఁగ ॥ (ఉ)ఓనరనాథవర్య యిటు, లూరక చింతిల నేల యీజన। స్థానము ఘోరరాక్షసవి,తానముగావున నిందుఁ గల్గునా । నానగదుర్గ కందరవ, నంబులఁ గిన్నరమందిరంబుల । న్మానుగ నంతట న్వెదకి,మానినిఁగాంతము రాఘవోత్తమా ॥ (తే,గీ) అన్న మీబోఁటి బుద్ధిసం, పన్నులగు మ । హానుభావులు నాపద, లందు మిగులఁ । గంప మొందరు వాయువే, గంబుచేత । శైలములుఁబోలె ధృతధైర్య, సారు లగుచు॥(వ) అనిబుద్ధిమంతుండగు లక్ష్మణుండు పలికిన నారఘువల్లభుండతనింగూడి యధిజ్య ధన్వుండై క్షురాకారముఖంబైనశరంబుసంధించియవ్వనంబున నెమకుచు నొక్కచోట రక్తసిక్తాంగుండై పర్వత కూటంబు కరణి

(*)రాముఁడు ఖండితపక్షపాదుఁడై పడియున్న జటాయువుం గనుట.(*)

నేలంబడియున్న గృధ్రనాథుండగు జటాయువుంజూచి యిద్దురాత్ముండునిక్కంబుగా నక్కమలగంధిం బట్టుకొని మెక్కిన రక్కసుండు తన మాయవలనంబక్షిరూపంబుఁ గైకొని యున్నవాఁడు నిశితంబులైన ఘోరశరంబుల వీనిం దెగటార్చెద నని యలుక వొడమిన క్షితిచింబునఁ దత్తరింపుచు నొక్కకత్తివాతియ

మ్ము చాపంబున సంధించి పుడమి వడంకునట్లుగా నారి మ్రోయించిన నన్నరశార్దూలుం జూచి పక్షీంద్రుండు భయంబుగొని సఫేనంబగు రుధిరంబు గ్రక్కుచు గీనవాక్యంబున నిట్లనియె॥ (తే,గీ)అధిప యోషధిఁబోలెనీ, వడవిలోన। వరుస నెద్దాని వెదకుచు, వచ్చితట్టి। పరమ సాధ్వియుఁ, బరఁగనాదు। ప్రాణము భయంబు హృత మయ్యెఁ, బరునిచేత ॥ (సీ) అవనీశ యేనుఁ జటాయువగృధ్రనాథుండ నీవును లక్ష్మణుండు లేని। యెడ భవద్దేవిని, గడువడి రావణుండను నిశాచరుఁ డొక్కఁ, డపహరించి। కొనిపోవుచుండ నేఁ, గనుఁగొని యడ్డంబు వచ్చి యాకసమున, వానిఁ మెఱసి। యుద్ధంబుఁజేసి సముద్ధతి నఖతుండహతుల వాని శరీర మంత వ్రచ్చి ॥ (తే.గీ)రథముఁ బడఁదన్ని రథ్యసారథులఁ జంపి। విలు దునిమి ఛత్రచామరంబులను జించి। యలసి మదినిట్లు తన్నిశాతాసిలూన। పక్షపాదుఁడనై నేలఁ బడినవాఁడ॥ (వ)మహాత్మా మదీయనఖ చంచుపుట పక్షంబులం దెగిపడిన తదీయ రథరథ్య సారథిచ్ఛత్రచామర పతాకాధ్వజచాపప్రముఖ పరికరంబులనన్నింటి నవలోకింపు మిత్తెఱంగున శత్రునిందొడరి పోరిపోరి పరిశ్రాంతుండనై ఱెక్కలు దెగి నేలం గూలియున్న నన్ను నీవును బదంపడి వధింపంబూనుట తగవే యని పలికిన నారఘూత్తముండు వాని జటాయువుగా నెఱింగి సీతావృత్తాంతశ్రవణంబున ద్విగుణీకృతశోకతాపుండై మ

(*)రాముఁడు జటాయువుపాటెఱింగి దుఃఖించుట.(*)

హోపకారియగు గృధ్రపతి డాయంబోయి చాపంబుఁ బరిత్యజించి యతనిం గౌఁగిలించుకొని కొండొకసేపు కన్నీరు మున్నీరుగా రోదనంబుఁ జేసి సంతాపవిశేషంబున నవశుండై పుడమిం ద్రెళ్లి యొక్కింతసేపునకుఁ గ్రమ్మఱ లబ్ధసంజ్ఞుండై లతాకంటకసంకీర్ణత్వంబున నెవ్వరికిం బ్రవేశింపరాని యొక మార్గంబున నసహాయుండైన యీ జటాయువు నతిప్రయత్నంబున దురాత్ముండగు రాక్షసుండు వధించి సీతనెత్తికొనిపోయెనని చింతించి లక్ష్మణునవలోకించి యిట్లనియె॥ (సీ) మానదపూజ్యసామ్రాజ్యంబు పోవుట యటవినివాసమిట్లావహిలుట। పత్నీవియోగంబు ప్రాప్తించుటయుఁ బితృ సఖుఁడు జటాయువు చచ్చుటయును। లోకంబులో నిట్టిశోకంబు లెవ్వానికైనను గలవె లోనరసి చూడ। నాయభాగ్యంబె మనంగ వచ్చు సమస్త వస్తుదాహకుఁడగు వహ్నినైన॥ (తే,గీ) నీఱుగావింపనోపు పత్నీవియోగ। జనితతాపనివృత్తికై సలిలరాశిఁ। బడుదునన్న మదీయదౌర్భాగ్య మహిమ



మఁ। జేసి యదియును జాలశోషించిపోవు॥ (తే,గీ)జనవర కుమార నాచేన సహ్యమైన। వ్యసనమిబ్భంగి సంప్రాప్తమగుటవలనఁ। బరఁగ నాకంటె నన్యుఁడభాగ్యతరుఁడు। వసుధలోఁ జూడ నింక నెవ్వాఁడు లేఁడు॥ (క) ప్రియుఁడు పితృసఖుఁడు వృద్ధుఁడు। నయజ్ఞుఁడీగృధ్రవిభుఁడు నాభాగ్యవిప। ర్యయమున విలూనపక్షద్వయుఁడై ధరఁగూలియున్నవాఁడు కుమారా॥ (క) అనిపలికి విభుఁడు శోకము। మనమున సైరించుటకు సమర్థత లేమిన్। జనకజ యెక్కడఁ జెప్పుమా। యని ధరణింబడియెఁ జిత్తమవశత నొందన్ ॥ (వ) ఇట్లు శోకమూర్ఛా పరవశుండై కొండొకసేపునకుఁ దెలివొంది వెండియు సౌమిత్రికిట్లనియె॥ (ఉ) ఈపతగోత్తముండు మనకెంతయుఁ బ్రీతి యొనర్పఁబూని తా। నేపునఁ బోరిపోరి తుది నిట్లు విలూనపతత్రపాదుఁడై। యీపృథివీ తనూజవిధ మర్మిలిఁ జెప్పఁగఁ బ్రాణసంయుతుం।డై పడియున్నవాఁడిటమ దాస్యనిరీక్షణకౌతుకంబునన్ ॥ (వ) అనిపలికి జటాయువునవలోకించి॥ (సీ) అండజోత్తమ రావణుండు జానకి నెట్లు వంచించి కొనిపోయె వానికేమి। విప్రకారంబుఁ గావించితి నేరూపు వాఁడెంత శౌర్యంబు వాఁడు వాని। పట్టణం బెక్కడ బలమెంత చలమెంత కులమెంత దోశ్శక్తి కొలఁదియెంత। గలవాఁడు నిన్ను సంగ్రామతలంబున నేరీతి నిర్జించె నెచటికేగెఁ॥ (ఆ,వె)

—*)జటాయువు రామునకు రావణుఁడు సీత నెత్తికొని పోయిన(*—

(*) తెఱం గెఱిం గించుట. (*)

జెప్పనలవియేని చెప్పుము జానకీ। వనితవార్త నీదు వధవిధంబు। నావుడును బతత్రినాథుండు సన్నపు। టెలుఁగుతోడ విభునకిట్టులనియె॥ (చ) జనవర రావణుండను నిశాచరనాథుఁడు బల్మి జానకిం। గొని గగనంబునం జనుచు ఘోరతరంబుగఁ దాఁకి యడ్డమై। యని యొనరించి బిట్టలసి నట్టి మదీయపతత్రముల్ రయం। బున నసిధారచే నఱికి పోయెన గస్త్యదిగున్ముఖంబుగన్॥ (తే.గీ) అనఘ చారిత్ర యేను జరాన్వితుండ। నగుటవలన రణోర్వి బిట్టలసియుండ। వాతదుర్దిన సంకులావార్యమాయ। నలమి నన్నిట్లు చేసి దశాస్యుఁడరిగె॥ (వ) దేవా ప్రాణంబులు పరిక్షీణంబులయ్యె దృష్టి చలింపుచున్నది యలంకృతాగ్రంబులైన సువర్ణవృక్షంబులు విలోకింపుచున్నవాఁడ రావణుం డేముహూర్తంబున జానకి నపహరించికొనిచనియె నమ్ముహూర్తంబు విజయనామకంబా ముహూర్తంబునందు నష్టంబైన తద్ధనంబు విభునిచేతఁ గ్రమ్మఱ లబ్ధంబగునని శాస్త్రప్రమా

ణంబుగలదు రావణుండు సీతామోహితత్వంబున నది యెఱుంగఁడు ॥ (తే,గీ)
పూనిబడిశెంబుమ్రింగినమీనముగతి। ననఘ జానకినపహరించిన ఖలుండు। శీ
ఘ్రమునఁజచ్చునీకింతచింతయేల। పగతుఁజంపిసుఖించెదుపడఁతిఁగూడి ॥ (వ)
మహాత్మా నీకుం జెప్పఁగలయంతంజెప్పితి నింక నీతోడసంభాషింపంజాల రా
వణుని విశ్రవునకుఁ దనయునిఁగాఁ గుబేరునికిఁదమ్మునిఁగా నెఱుంగుమని యి
ట్లు శాంతిహీనుండై యుత్తరంబిచ్చుచుండ నప్పుడు సామిషంబగురుధిరంబు

(*) జటాయువు మృతుండగుట. (*)

జటాయువు వదనంబుననుండి నిర్గమించెఁ బదంపడి గృధ్రపతి శరీరంబువిడి
చి ప్రాణంబులు గగనంబునకుద్గమించె నిట్లు దుర్లభంబులైన ప్రాణంబులు
విడిచి శిరంబు ధరణింబడవైచి తత్క్షణంబ సంప్రాప్తమరణుండయ్యె నిట్లుపం
చత్వంబునొందిన గృధ్రపతింజూచి పరమ దుఃఖాక్రాంత చిత్తుండై రాముండు
లక్ష్మణునకిట్లనియె॥ (మ) చిరకాలంబుననుండియీవనములో జీవింపుచున్నట్టి
చే। నరుదారన్విహరించునీపతగవం శాధీశుఁడున్నేఁడునా। కొఱకుం గ్రూరని
శాచరాధమునిచే ఘోరాజిలోఁజచ్చెని। ద్ధరలోనిట్టిపరోపకారమృతియుక్తం
బేకదాయేరికిన్॥ (ఉ) ఎక్కడఁబట్టణంబుమన కెక్కడఁబూనియరణ్యసీమకుం।
దక్కకవచ్చుటెక్కడఁబ దంపడిసీతనిశాటుచేతులోఁ। జిక్కుటయెక్కడీవిహం
గ శేఖరుఁడీగతినాజివానిచే। నిక్కడఁజచ్చుటెక్కడని యేమనవచ్చును దైవ
తంత్రమున్॥ (తే,గీ) పెక్కుకాలంబుజీవించిపిదపనిట్లు। నాకొఱకునీ విహంగ
మనాయకునకు। నీవనంబునదనుజుచేఁజావవలసెఁ। గాలముదురత్యయంబెంత
ఘనునకైన॥ (వ) మఱియుఁ బితృపైతామహంబైన గృధ్రరాజ్యంబుఁ బరిత్య
జించి మత్కృతంబునం బ్రాణంబులువిడిచెఁ దిర్యగ్యోని గతులయ్యుండైనను సా
ధులును శూరులును ధర్మాత్ములును శరణ్యులునగువార లిత్తెఱంగునం జూ
పట్టుచుండుదురు సీతావియోగదుఃఖంబునకంటె జటాయుమరణదుఃఖం బధి
కంబైయున్నది యిమ్మహాయశుండు దశరథుండుంబోలె మనకుఁ బూజనీయుం

*రాముఁడు జటాయువునకు దహనాది సంస్కారంబులఁ గావించుట.*

డుగావున నితని సంస్కరించుటకుఁ గాష్ఠంబులఁదెమ్మనిన నతం డట్లకావింప
నారఘువల్లభుండు పావకునింబ్రణయించి యప్పతంగపుంగవుని కళేబరంబు చి
తామధ్యంబునంబెట్టి యజ్ఞశీలురును నాహితాగ్నులును భూదానపరులును



మొదలుగాఁగల పుణ్యాత్ములలోకంబులన్నియుఁ గ్రమంబున నతిక్రమించి నాచే
తసంస్కృతుండవై యనుజ్ఞవడసి పునరావృత్తిరహితులైన నిత్య ముక్తులకుఁ
బరమప్రాప్యంబైన వైకుంఠాఖ్యలోకంబునకుం జనియందు నిత్య నిరతిశయా
నందం బనుభవింపుచుండుమనిపలికి స్వబంధువునకుం బోలె దుఃఖింపుచు జ
టాయువునకు మంత్రపూర్వకంబుగా నగ్నిసంస్కారంబుఁ గావించి యనంత
రంబ వనంబునంజనియందు మహామృగంబులవధించి దర్భాస్తరంబునం దిడి
తన్మాంసంబులు పిండంబులుగావించి హరితశాద్వలంబునందు జటాయువుకొఱ
కుఁ బిండప్రదానంబుఁగావించి మృతుండైన మనుజునకేమంత్రజాతంబు స్వ
ర్గప్రాపకంబని బ్రాహ్మణులునొడివి రట్టి నారాయణసూక్త యామ్యసూక్తాది
కంబుజపించి గోదావరికింజని యందు లక్ష్మణసహితంబుగా సుస్నాతుండై శా
స్త్రస్పష్టంబైన విధిచేత జటాయువునకు సలిలక్రియలు గావించె నిట్లు మహ
ర్షికల్పుండైన రామునిచేత సంస్కృతుండై యప్పతంగకులపుంగవుండు ని
త్యంబైన పరమగతికింజనియె నిత్తెఱంగున నారఘుసత్తములు జటాయువున
కుం బుణ్యలోకంబులుగల్పించి యనంతరంబ సీతాన్వేషణ తత్పరులై యచ్చో
టువాసి విష్ణువాసవులపగిది మహా వనంబుఁ బ్రవేశించి యొక్కింత దూరంబు
వరుణ దిశాభిముఖంబుగా నరిగి క్రమ్మఱ దక్షిణంబునకుం దిరిగి పోవుచు॥
(సీ) చండదంతావళతుండాగ్రవిదళిత చటులతాలతమాలసాలచయము। కరి
కుంభమాంసభక్షణమత్తమృగరాజ ఘోషణఘూర్ణిత కుంజపుంజ। మతులిత
భూరిని,ద్రాసక్తశార్దూలబృందబృందీకృత,కందరంబు। గహనగోచరచర.
న్మహిషసూకరయూథ కర్దమీకృత నిమ్న,గాచయంబు ॥ (తే, గీ) శల్యభ
ల్లూకసారంగ, చమరసృమర। గోధికాసరఖడ్గప్రఘూర్ణితంబు। నగుమహా
రణ్యపదమున, నర్కవంశ। బాలురరిగిరి కోదండ, పాణులగుచు ॥ (వ) ఇ
త్తెఱంగునఁ గ్రోశత్రయమాత్రదూరం బతిక్రమించియవ్వల ॥ (క) నానాఖగ
మృగయుక్తము। నానావ్యాధాన్వితముఘ,నప్రఖ్యము స। న్మానితమగుక్రౌం
చంబను। కాననమునఁ జనిరి భూరి,కార్ముకధరులై ॥ (వ) ఇట్లమ్మహార
ణ్యంబున నర్ధయోజనదూరంబరిగి యంతనంతవైదేహినన్వేషింపుచు నక్కా
ననంబుగడిచి యవ్వల మతంగాశ్రమ సమీపంబునం బొల్చు ఘోరారణ్యంబుఁ
బ్రవేశించి యపరిత్యక్తమార్గంబునంబోవుచుఁ దన్మధ్యదేశంబున ॥ (తే,గీ)

కటికిచీఁకటికతమునఁ, గానరాక । మహితపాతాళలోక సమానమగుచుఁ ।

—*లక్ష్మణుండు తన్ను మోహించినరాక్షసియొక్క కర్ణనాసికాస్తనముల*—

(*) ఖండించుట.(*)

గ్రాలుగంభీరమగునొక్క గహ్వరంబు । పోలఁజూచి తదంతిక భూమియందు ॥
(చ) వికటనుఘోరరూపిణి వివేకవిహీనను ముక్తమూర్ధజ । న్వికృతముఖిం
గరాళను బ్రవృత్తహరిద్విపమాంసభక్షిణిం । గ్రకచసమాన దంష్ట్రినురుకా
యనుదుస్త్వచ సుగ్రనేత్రనం । దొక బలురక్కసింగని తదున్నతికచ్చెరువొం
దుచుండఁగన్ ॥ (తే.గీ) అదిరయంబునఁ జనుదెంచి, యన్నమ్రోల । నున్న
లక్ష్మణుఁగౌఁగిట, నొత్తిపట్టి । యాలిఁగా నన్ను వరియించి, యచలకూట । సాను
వులయందు సంక్రీడ సలుపుమిచట ॥ (చ) అనవిని లక్ష్మణుండు కుపితాత్మ
కుఁడై వెస శాతఖడ్గమును । గొని కుచకర్ణ నాసికలు గోసిన మేఘముభంగి నా
ర్చుచు । న్దనుజయుభీతిమైఁ బఱచె, దారుణవైఖరి నంతరాజనం । దనులతిదు
ర్గకాననపదంబునఁ బోవుచు లక్ష్మణుండొగిన్ ॥ (ఉ) అన్ననుజూచి భక్తిమె
యి నంజలిఁ జేసి మృదూక్తిఁ బల్కెనో । సన్నుతశీల మద్విపుల సవ్యభుజంబు చ
లించెఁ జిత్తమా । పన్నతనొందెడున్మఱియు భవ్యనిమిత్తములెల్లఁ దోఁచెడుం ।
బన్నగవంజుళాఖ్యమగు పక్షి జయావహభంగిఁ గూసెడిన్ ॥ (వ) కావునమ
నకుముందఱ నొక్కయసహ్యంబైన భయంబు గలుగఁ బదంపడి మిఱి వెట్టరాని
శుభంబు దొరకొనుదానిం బరామర్శింప వలయునని పలికిన నతనిపలుకులు వి
ని రఘువల్లభుండడిరెట్లొకో యని విచారింపుచుం బోవునెడ ॥ (తే.గీ) అ
డవిఁగల భూరుహములెల్లఁ బుడమిఁ జాప । కట్లువడఁగ దుమారంపు గాలివిస
రెఁ । గోటిపిడుగుల మ్రోఁతకు సాటియగుచు । విపులశబ్దంబు ఘోరమై వి
నఁగఁబడియె ॥ (వ) మఱియును ॥ (సీ) పొడవుదేహము వాఁడు, వెడఁదవక్షు
మువాఁడు గ్రీవోత్తమాంగముల్లేనివాఁడు । నిశితంబులగు రోమనిచయంబు

—(*) రామలక్ష్మణులు కబంధుని బాహుపాశమునఁ జిక్కువడుట. (*)—

గలవాఁడు కడుపున బలుమోము గలుగువాఁడు । నురునగేంద్రము మాడ్కి,
నున్నతుండగువాఁడు కాలమేఘము భంగిఁ గ్రాలువాఁడు । నీలజీమూతంబు,
లీలగర్జిలువాఁడు భయదాట్టహాస సంభ్రమమువాఁడు ॥ (తే.గీ) పింగళ
తరంబు వృత్తంబు భీమమాగ్ని । కణచయాస్పదమగునొక్క కన్నుదమునఁ । బ



రఁగ నొప్పెడువాఁడు కబంధుఁడనెడు । కఠినరాక్షసుఁ డొక్కఁడు గానఁబడి
యె ॥ (వ) మఱియు నారాక్షసుండు యోజనప్రమాణాయామంబు గల తన
బాహువులు సాఁచి లోఁబడిన సింహవ్యాఘ్రతరక్షుభల్లూకవరాహాది వనమృ
గంబుల భక్షింపుచు మత్తుండై వచ్చుచుండ వానిబాహువుల నడుమఁ జిక్కి
వెడల నుపాయంబులేక క్రోశమాత్రంబరిగి సమీపస్థులగుటయు వాఁడు బలా
త్కారంబున బాహుపాశంబుల నమ్మహాత్ముల నాకర్షించిన వారు కబంధబా
హుపీడితులై వివశత్వంబునొంది రందు రాముండు శూరాగ్రేసరుండు గావు
న నొకింతధైర్యం బవలంబించి వ్యథితుండు గాకయుండె నప్పుడు లక్ష్మణుండు
విషణ్ణుండై యన్నకిట్లనియె ॥ (సీ) మనుజనాయక యేను, దనుజునిచేఁజిక్కి
వివశుండనైతిన, న్నీవునికింక । బలిగాసమర్పించి, ప్రాణముల్దక్కించుకొని నీవు
తొలఁగిపొమ్ము రఘుచరిత । యటులైన వైదేహి, న ప్పకాలంబునఁ బొంది పి
త్ర్యంబైన, పూజ్యరాజ్య । మేలెదవప్పుడు నన్నెలమి మనంబునఁ గడు సంస్మ
రింపుము, కరుణఁజేసి ॥ (తే.గీ) యనవుడును రాముఁడింత భయంబుదగునె
యనుచుఁ దమ్ముని బోధించె, నంతలోనఁ । గ్రూరుఁడగు రాక్షసుఁడు ఘనఘో
షణమున । నమ్మహాత్ములతోడ నిట్లనుచుఁబలికె ॥ (ఉ) ఎవ్వరు మీరలీవనికి
నేటికివచ్చితి రిమ్మహావనం । బెవ్వరుచూడఁగా వెఱతు, రింతకు దైవము దెచ్చె
నిమ్ముమీ । క్రొవ్వడఁగంగఁబట్టుకొని, గొబ్బున మ్రింగెద జీవితంబుతో । నెవ్వి
ధిమీకు నొందుకడ, కేగఁగవచ్చునెఁక న్నయోద్ధతిన్ ॥ (ఉ) నావిని రాఘవుం

—(*) రాముఁడు కబంధు బాహువులఁ జిక్కువడుటకు దుఃఖించుట. (*)—

డు వదనంబున దైన్యముదోఁపఁగా సుమి । త్రావరపుత్రుతోననియెఁ, దమ్ముఁ
డదుఃఖముమీఁదదుఃఖమి । క్కైవడి నుత్తరోత్తరము, గాఢతరంబుగఁ గానఁబు
లో । జీవితహానిగల్గునటు, చేకుఱుచున్నది యేమిసేయుదున్ ॥ (తే.గీ) కా
లమెంతటి ఘనులైనఁ, గడవఁజాల । రనఘ పౌరుషమెల్ల నిరర్థకంబు । గా
ననిన్నును నన్నును, క్కాలమందు । దైవమాపన్నులుఁగఁ జేసెఁ, దలఁపులేల ॥
(వ) వత్సా సర్వభూతంబులలోనఁ గాలంబునకే మహావీర్యంబుగల దక్కా
లంబునకు సర్వభూతసంహారంబు ప్రయాససాధ్యంబు గాదు సులభసాధ్యం
బైయుండు ॥ (తే.గీ) ఎంత బలవంతులైనఁ దా, రెంతశూరు । లైననెంతకృ
తాస్త్రకులైనమనుజు । లవని వాలుకాసేతువులట్లవెసన । శింపుదురు కాలవ

శమునఁ జేసివత్స ॥ (వ) అనియిట్లు పెక్కుచందంబులఁ దనదురవస్థకుం బొక్కుచు దృఢసత్యవిక్రముండును మహాయశుండును బ్రతాపవంతుండు నగు రాముండు సముదగ్రపౌరుషుండగు సౌమిత్రినవలోకించి తనచిత్తంబు స్థైర్యయుక్తంబుఁ గావించుకొనియుండె నప్పుడా కబంధుండు నిజబాహుపాశ పరిక్షిప్తులయిన దాశరథులంజూచి దైవవశంబునం జేసి మీరు క్షుధార్తుండనైన నాబాహువులంజిక్కితి రింకెఁ దడవేల నాకు నాహారంబు గండనవుడు సుమిత్రానంద

(*) లక్ష్మణుఁడు రామునితోఁ గబంధుబాహువులఖండింపవలయుననుట. (*)

నుండు పరమార్తుండయ్యును ధైర్యంబు కలిమి విక్రమంబునందుఁ గృతనిశ్చయుండై రామున కిట్లనియె ॥ (మ) అనఘా వీఁడు దురాత్మకుండు గురుబాహాసత్వయుక్తుండు లో। కనికాయంబుల నొక్కటంగడఁగి భ్రమిం, గంజాలువాఁడింకనా। క్కనిమేషంబెడఁజేసి తేని మనల, స్గరోష్ఠతిన్నింగున। ప్పనికింబూనకమున్నె వీనిభుజము, ల్భద్రాసి ఖండింపుమా ॥ (వ) దేవాయాగబాహ్యంబులైన పశువుల వధించిన వారికిం బోలె నకృతపరాక్రములైన వారి వధించిన వారికిఁ బాపంబుగలుగుంగాని యిట్టిదురాత్మునిం జంపిన వారికిఁ బాపంబు లేదు గావున నాలస్యంబు సేయక వీనికరంబులు ఖండింపుము ॥ (తే, గీ) అనుచు లక్ష్మణుఁ డన్నతోఁ, నాడుమాట। విని కబంధుఁడు కోపప్ర, విష్టుఁ డగుచు। ఘోరపాతాళ నిభమైన, నోరు దెరచి। యసముతో భ్రమింగ గమకించు, నంతలోన ॥ (వ) దేశకాలజ్ఞులగు నమ్మహాపురుషులు నిశితంబులైన కృపాణంబు లంకించి ॥ (తే, గీ) దనుజు దక్షిణ బాహువుఁ, దునిమె రాముఁ। డంతఁ దోఁద్తోడ సౌమిత్రి, యసురు సవ్య। కరము దునియంగ నేసెనీ గతినికృత్త। బాహుఁడై వాఁడురోఁజుచుఁబడియెనపుడు ॥ (వ) ఇట్లు కబంధుండువిలూనబాహుండై సత్తుటందోఁగి జలదంబుమాడ్కిఁ బుడమియు గగనంబు దిక్కులుం బగుల నాచు నాచు మహీతలంబునం దొల్లి దీనుండై మీరెవ్వరని యడిగిన నద్దానవునకు లక్ష్మణుండిట్లనియె ॥ (ఆ, వె) ఇమ్మహానుభావుఁ డిక్ష్వాకుదాయాదుఁ। డనఘు డూర్జిత రాముఁడనఁగనొప్పు। నేనులక్ష్మణుండ నితనికిఁ దమ్ముఁడ। నెపుడు భ్రాతృభక్తి నెసఁగువాఁడ ॥ (ఆ, వె) అంబచేత రాజ్య, మపహృత మగుటయుఁ। బత్నితోడఁగూడి, భానుకులుఁడు। మత్సమేతుఁడనుచు, మహాటవికి వచ్చి। యొక్కచో వసించియుండ నంత ॥ (క) ప్రము



చ్చలి రక్కసుఁడొక్కఁడు। సచ్చరితుని రామవిభుని, సతిఁగొనిపోయెం। జెచ్చెర నద్దేవినిమే। మిచ్చటశోధించు వార, మెంతయుఁగడఁకన్ ॥ (వ) మా తెఱంగిట్టిది నీవెవ్వండ వేమికారణంబున భగ్నజంఘుండవై యురంబునముఖంబుగలిగి కబంధసదృశుండ వై యివ్వనంబునంజరించెదవని యడిగిన నారక్క

కబంధుఁడు రామలక్ష్మణులకుఁ దనచరిత్రం బెఱిం గించుట.

సుండు పరమప్రీతుండై యింద్రవచనంబుఁదలంచి లక్ష్మణునకిట్లనియె ॥ (సీ) అనఘాత్మ నాభాగ్య, మునమిమ్ముఁబొడగంటిఁ బరమకోపమునఁ గృపాణధారఁ। గరములఁద్రుంచిన కారణంబుననాదు వెతలెల్లఁబాసె నీవికృతిరూప। మేనుబూనుటకైన, హేతువుఁజెప్పెద వినుతొల్లియసమానవిక్రమమున। సూర్యపురందర సోములచందాన దివ్యరూపముఁదాల్చి, త్రిభువనముల ॥ (తే, గీ) సంచరింపుచు బలగర్వసంభ్రమమున। లోకభీకరమైనయీరూపమర్థిఁ। దాల్చివనవాసరతులగు, తాపసులకు। నురుభయము పుట్టఁదిరుగుచునొక్కనాఁడు ॥ (వ) స్థూలశిరుండను మునిపతివెఱపింపం బోయిన ఘోరశాపభాషణశీలుండైనయమ్మహాత్ముండు కోపించి లోకవిగర్హితంబును ఘాతుకంబునునైన యిట్టివికృతరూపంబున నన్నుఁదిరస్కరింప వచ్చితివిగావున నిదియెరూపంబున నుండుమని ఘోరంబగుశాపంబిచ్చిన నేనుభయంబుఁగొని కరంబులుమోడ్చి శాపమోక్షణం బనుగ్రహింపుమని ప్రార్థించిన నత్తాపసోత్తముండు దయాళుండై యిక్ష్వాకునాథుండగు రాముండెప్పుడు విజనంబైన వనంబుననీభుజంబులుఖండించి నీశరీరంబు దహించునప్పుడీ వికృతరూపంబు విడిచి శుభంబైనపూర్వరూపంబుఁ గైకొనియెద వనియానతిచ్చె నన్నుదనుపుత్రునిఁగా నెఱుంగుము దియునుంగాక యీవికృతాకారంబుగలుగుటకింద్రకోపంబు గారణంబైయుండు నదియునుంగొంత యెఱింగించెదవినుము ॥ (క) ఏనుగ్రతపంబునఁజతురాననుఁ ముదితాత్ముఁజేసి, యవ్విభుచేత। న్నానుగ దీర్ఘాయువుఁ। న్నానంబునఁబడసి దురభిమానమువేర్మిన్ ॥ (వ) పురందరుండు నన్నేమిసేయంగలఁడని తిరస్కరించి యతనితోరణంబుఁగావించిన నద్దేవతావల్లభుండలిగి శతపర్వంబైన వజ్రంబుఁ బ్రయోగించిన నయ్యమోఘాయుధప్రభావంబున మదీయకంఠంబును నూరువులునుశరీరంబును జొచ్చె శక్రుండునాచేతఁబ్రార్థితుండై విరించివచనంబుఁదలంచి నాకుమృతిలేకుండఁ బ్రసాదించెనంత నేనుభగ్న

స్కంధ శిరోముఖుండనై యాహారంబు లేక బహుకాలం బట్లు జీవింతుననిన నయ్యింద్రుండు యోజనాయతంబైన బాహువులొసంగి తీక్ష్ణదంష్ట్రాకరాళయుక్తంబైన ముఖంబు కుక్షియందుం గలుగునట్లు గా సంఘటించి నీవు కాంతారంబుం బ్రవేశించి సింహద్వీపవరాహ వ్యాఘ్రాదిమృగంబుల నాకర్షించి భక్షింపుచుండుము కొంతకాలంబునకు రాముండు లక్ష్మణయుతుండై వచ్చి నిశితకృపాణంబుల నీబాహువులు ఖండించునప్పుడీ వికృతరూపంబుం బాసి నాకంబునకుం జనుదెంచెద వని యాదేశించె నాఁటంగోలె నేను వికృత దేహత్యాగ కృతోద్యోగుండనై భవదాగమనంబుం గోరుచు నివ్వనంబుం బ్రవేశించి యిది భక్ష్యం బిది యభక్ష్యంబని విచారింపక బాహువులకుం జిక్కిన సత్వంబులనెల్ల నాకర్షించి భక్షింపుచుం జరియింపుచున్నవాఁడ మునిశ్రేష్ఠులచేతం బలుకంబడిన చందంబున నా శాపమోచనకారకుండ వీవె యని యెఱింగితి నీవు దక్క నన్యుండు నన్ను జయించుటకు శక్తుండు గాఁడు మీరు మహానుభావులగుటం జేసి నన్నుం గృతార్థునిం జేయుటకు నిచ్చటికిం జనుదెంచి మదీయభుజంబులు తునియ నేసితిరి నేను మీతోడ సాచివ్యంబుం జేసి కార్యసిద్ధి వడయుటకుం దగిన మిత్రుని నెఱింగించెద ననిన నతని వచనంబులు విని రాముండు లక్ష్మణుండు వినుచుండ వానికిట్లనియె ॥ (ఉ) తమ్ముఁడు నేను గాననపదంబున దూరము పోయి యుండఁ జో । ర్యమ్మున జానకిన్ బలిమి, రావణుఁ డెత్తుక పోయె వానినా । మమ్మును దక్క రూపమహిమంబులు వాసము నెఱుంగఁ దత్ప్రకా । రమ్మెఱిఁగించి మమ్ముఁ గుశలాన్వితులం దగఁ జేయు మిత్తఱిన్ ॥ (క) శోకాతురులమై దిక్కఱి । తేకువ సెడి యున్విధమునఁ, ద్రిమ్మరు మమ్ముం । జేకొని కారుణ్యముతో । భూకన్యక వార్తఁ దెలిపి, పోవుము వేగన్ ॥ (తే,గీ) సత్వరంబుగ శుష్కకాష్ఠములచేత । నిను దహించెద మట్లైన, ననిమిషత్వ । మొందెదవు మది సందియ మందవలవ । దెఱిఁగితేని యుజ్జానకి తెఱఁగుఁ జెప్పుము ॥ (వ) అనినఁ గబంధుండు రామునకిట్లనియె ॥ (శా) అజ్ఞానాకృతినుంటఁ జేసి రఘువర్యా శాపదోషంబున । న్విజ్ఞానం బది లేదు గావున సతీవృత్తాంతముం జెప్పఁగాఁ । బ్రజ్ఞాధిక్యము లేదు యీతనువుఁ గాల్పం బిమ్మట న్బూరిది । వ్యజ్ఞానంబునఁ జూచి చెప్పెద మహాత్మా యట్లు గావింపవే ॥ (వ) మఱియు సూర్యుండు చరమశిఖరి శిఖరాంతరగతుండు గాకమున్నె మదీయ శరీరంబవటంబున నిక్షేపించి విధిప్రకారంబున దహింపు మట్లని సీతావృత్తాంతంబును రాక్ష



(*) రామలక్ష్మణులు కబంధుని కళేబరంబు దహించుట. (*)

సుని చందంబును వానిం బరిమార్చుటకు సఖ్యంబు సేయందగిన వీరోత్తముని నెఱింగించెద నాచేతం బేర్కొనంబడిన వానితోడ నీవు న్యాయవృత్తంబున సఖ్యంబుం గావింపు మతండు నీకు సాహాయ్యం బాచరించు ముల్లోకంబులయందు నతనికి విదితంబుగాని యర్థం బొక్కింతైన లేదతండు మున్నొక్క కారణంబున సమస్త జగంబులం జరించి యున్నవాఁడని పలికిన నట్లగాక యని రఘువల్లభుండు లక్ష్మణుం జూచి యీ రాక్షసుని కళేబరంబు దహింపుమనిన నతండు సమీపంబునం గుంజరంబులచేత భగ్నంబులైన శుష్కకాష్ఠంబు లొక్క బిలంబులోనం గొండపాడవునం గుట్టవైచి దానిమీఁద ఘృతపిండోపమంబైన కబంధుని కళేబరంబు వెట్టి యనలు దరికొల్పిన నయ్యగ్నిదేవుండు మేదఃపూర్ణంబగుటవలన వాని మహాకళేబరంబు మందంబుగాఁ గొండొకసేపునకు నిశ్శేషంబుగా దహించె నంతఁ గబంధుండవ్వికృతరూపంబు విడిచి దివ్యరూపధరుండై యచ్చితామధ్యంబుననుండి గగనంబున కెగసి దివ్యమాల్యోపశోభితుండును దివ్యగంధాధివాసితుండును విరజోంబరధరుండును సర్వప్రత్యంగభూషణుండునై సూర్యుని భంగి వెలుంగుచున్న హంసయుక్తంబగు దేవయానంబునం గూర్చుండి నిజతేజోజాలంబున దశదిశలు వెలుంగంజేయుచు నంతరిక్షంబుననుండి రామున కిట్లనియె ॥ (సీ) భూమీశ యేగుణంబులచేత నీసర్వవస్తుజాతంబన, వరతముర్వి । నతివిచారితమగు, నట్టి సంధియు విగ్రహంబు యానం బాస, నంబునాశ్రయంబు

—(*) కబంధుండు దివ్యరూపముం దాల్చి రామునితో సుగ్రీవ సఖ్యము (*)—
—(*) సేయుమని బోధించుట. (*)—

ద్వైధీభావ, మనుగుణంబులు గలవరయంగ దురవస్థ, నధిగమించి । నట్టి మర్త్యుండు తన, యట్లనే దురవస్థ నొందిన వానిచే, నుత్సుకముగ ॥ (తే,గీ) సేవ్యుఁడగు దాశరథ సర్వ, జవ్యసనము । నధిగమించుట కతనము, హానుభావ । యనుజయుతముగ నీవు హై, న్యంబు నొంది । యధిక దుర్దశాపన్నుండవైతి విపుడు ॥ (వ) కావున నవశ్యంబు సమానావస్థాపన్నుండైన వానితో మైత్రి సేయుట యుక్తం బట్లు సేయుమని నాఁడు కార్యసిద్ధి ధారకొన దట్టివాని నెఱింగించెద వినుము ॥ (సీ) అనిమిషపతిపుత్రుఁ, డగు వాలి క్రుద్ధుఁడై దయమాలి తనుఁ బ్రోలు, దాఁటననుప । నతని తమ్ముఁడు మహా, చతురుండు సుగ్రీవుఁ

డను వానరశ్రేష్ఠుఁ, డధికభీతిఁ । బంపాసరోవర, పర్యంతశోభితంబగు ఋశ్య
మూకాచ, లాగ్రమందు । సచివచతుష్టయ,సహితుఁడై వసియించి యున్న వాఁ
డతఁడుశూ,రోత్తముండు ॥ (తే,గీ) సత్యసంధుండు విక్రమ,శాలిసకల । కా
ర్యవిదుఁడు కృతజ్ఞుండ,కల్మషుండు । వానితో నెయ్యమొనరించి, తేనినీదు । కా
ర్యమంతయు సాధింపఁ, గలఁడధీశ ॥ (వ) మఱియు నతండు ప్రతాపవంతుం
డును నపరిచ్ఛిన్న కాంతియుక్తుండును ద్యుతిమంతుండును వినీతుండును మతిమం
తుండును మహాబల పరాక్రముండును బ్రగల్భుండును సమర్థుండు నైయుం
డు ॥ (ఆ,వె) మానవంతులైన,మముబోఁటి యధికులు । హీనజాతిమైత్రి,నె
సఁగుచెట్టు । లనఁగవలదు కార,ణాంతర మదియు దు । ష్కరముగాదె జగ
తిఁ,గాలసరణి ॥ (చ) అతిబలవంతుఁడైన ప్లవ,గాధిపునింగననేగి వానితో ।
నతిహితబుద్ధిమైత్రి విన,యంబునఁ జేయుము వేగఁ బొమ్ము నీ । వతఁడుకృతజ్ఞుఁ
డాప్తుఁడు బలాఢ్యుఁడు దక్షుఁడు నీదుకార్యమం । చితగతిఁ జక్కఁజేయు నృప,
శేఖర నెవ్వగ దక్కు నెమ్మదిన్ ॥ (చ) మఱియు నతండు వైరికుల,మర్దన ద
క్షుఁడు కామరూపివా । నరవరుఁడున్సహాయుని మ,నంబునఁ గోరెడు వాఁడు
గావునం । గరమనురక్తి మీకునుప, కారము సేయఁ గలండు మీరునుం । బరమ
కృపాప్తి వాని వెతఁ,బాయఁగఁ జేయుఁడు సత్యమేపఁ-డన్ ॥ (క) సిరిపోవుట
కాననమునఁ । జరియించుట మొదలు గాఁగ, సర్వావస్థ । ల్నరవరయతనికి
నీకును । సరియైయున్నయవి చూడ,జతనములగుచున్ ॥ (క) కావున మీర
న్యోన్యము । పావకసన్నిధిని మైత్రిఁ, బ్రకటించిసుఖం । భావితులై ప్రాపుగన
యు । కోవిదకార్యములు దీర్పఁ,గోనుఁడుచితగతిన్ ॥ (వ) దేవా యత్తరు
చరశ్రేష్ఠుండపక్షీణదశాయుక్తుండైనను హితాన్వేషణంబునందు శక్తుండైయుం
డు నతండు కృతార్థుండైనఁ గాకున్న భవచ్చికీర్షితకార్యం బవశ్యంబు గావిం
చు నతండు సూర్యునకౌరసుండు ఋక్షజునకు క్షేత్రజుండు వాలిచేతఁ గృతకి
ల్బిషుండగుటవలన శంకితుండై పంపాతీరంబునం జరింపుచుండు నాయుధంబుల
హిత సమీపంబునం బెట్టి సత్యంబున నతని వయస్యునింగాఁ బరిగ్రహింపు మ
తండు లోకంబునందు తాఁకుసస్థానంబు లెన్నిగల వన్నియు నైపుణ్యంబున శో
ధింపంగలండు గావున ॥ (సీ) నరనాథ భాస్కర, కిరణసంచారంబు గలయం
తధరణిలోఁ, గపికుంజరుండుఁ । దెలుఁగని దేశము, కింతైన లేదట్లు రూపింపఁ



గాఁగాము, రూపులైన । కపుల నద్దెసలకుఁ, గడఁకతోఁ బనిచి నదీశైలదుర్గ
ప్ర, దేశములును । వెదకించి రావణు,వీటిలోపల నున్నఁ గనకాచలాగ్రభా,గము
ననున్న ॥ (తే,గీ) వేచిపాతాళతలమున,దాఁచియున్న । రాక్షసుల నెల్లఁ దెగ
టార్చి,రమణతోడ । జానకిని దోడితెచ్చిప్ర, సన్నభక్తి । నీకునర్పించు మనమ
మున,నెగులువలదు ॥ (వ) అని సీతాప్రాపణంబునందు రామునకుఁ దగినయు
పాయం బెఱింగించి యర్థజ్ఞుండగు కబంధుండు వెండియు నిట్లనియె ॥ (క)
(*కబంధుఁడు రామలక్ష్మణులకు సుగ్రీవునికడకేగుటకు మార్గముఁజూపుట. *)
ఇదిగో మార్గము క్షేమా । స్పదమై పశ్చిమము మిగిలి,సకలద్రుమసం । పద
లం బొలుపొందుచు ను । న్నదికంటకశిలల చేత, నరవరకంటే ॥ (వ) మఱి
యును ॥ (సీ) పనసభూరుహములు,ప్లక్షవృక్షంబులు కరవీరతరువులు,కర్ణి
కార । కుడములు వటువట,కుటజనీలాశోక తిందుకపాటలీ, చందనామ్ర । మం
దారపిప్పలీ,మాతంగపున్నాగ పారిభద్రద్రుజం,బీరజంబు । తిలకాగ్నిముఖ్యా
ది,ఫలిత పుష్పితపల్లవిత మహాద్రుమము ల,ద్భుతముగాఁగ ॥ (ఆ,వె) నలరు
చుండునందు, నమృతకల్పములగు । ఫలములవని రాల్చి,సలలితముగఁ । గాం
క్షఁదీఱమెసవి,ఘనసత్త్వయుక్తులై । యధిక సత్వరముగ,నవలఁ జనుఁడు ॥
(వ) ఇత్తెఱంగున నమ్మహారణ్యంబతిక్రమించి యవ్వల ॥ (క) నందన చైత్రర
థంబుల । చందంబున రమ్యమగుచు, సర్వస్వాంతా । నందకరంబై జనులకు ।
నందంబైయొక్క విపిన,మలరారు రహిన్ ॥ (వ) అమ్మహావనం బుత్తరకురు
దేశంబుల చందంబున మనోహరంబై యలరు నందు మేఘపర్వత సన్నిభంబు
లును ఫలభారనతంబులును మహావిటపసంకులంబులును సర్వర్తు సేవితంబు
లును సర్వకామఫలంబులునగు పాదపంబులు తేనియలు గురియుచుండు నన్న
గంబులెక్కి యమృతకల్పంబులగు ఫలంబులు గోసితెచ్చి లక్ష్మణుండు సమర్పిం
చునవి యుపయోగించి యన్వనంబుదాఁటి యవ్వల నదృష్టపూర్వంబులగు దే
శంబులును వనంబులును శైలంబులు నంత నంత నవలోకింపుచుఁ బోవం బో
వఁ బంపయను పేరంగల యొక్క పుష్కరిణి గానంబడు నదిమఱియును ॥ (క)
కమలోత్పల సేవితయును । సమతీర్థయు నిర్మలయు న,శైవలయునవి । భ్రమయు
మయు నశర్కరయు నక । దమయు సువాలుకయు నగుచుఁ, దనరారు ర
హిన్ ॥ (క) క్రౌంచంబులు కురరంబులు । నంచలు కారండవంబు,లంభోజ

దళ । ప్రాంచన్మధుపము లనిశం । బంచితముగ మ్రోయుచుండు, నతిమధుర ముగన్ ॥ (వ) మఱియు నచ్చటిఖగంబులు జలచరంబులు నెన్నఁడునొక్కిం తభయంబెఱుంగని వగుటవలన నరులంజూచి భయంబుఁగొనవచ్చుటనున్నఘృ తపిండోపమంబులగు స్థూలవిహంగమంబులను రోహిత వక్రతుండనడమీనప్ర భృతిమహామత్స్యంబులను లక్ష్మణుండు వధించి తెచ్చి శూలప్రోతదగ్ధంబులును నకుశానేకకంటకంబులుగాఁజేసి ప్రియపూర్వకంబుగా నీకుసమర్పించి భక్షణా నంతరంబునఁ బద్మగంధబంధురంబును ననామయంబును నక్లిష్టంబునుసుఖశీతం బును శుభంబును రూప్యస్ఫటికసన్నిభంబునగు సలిలంబుఁబుష్కరపత్రపుటం బునం బట్టి తెచ్చి పానార్థంబొసంగు మఱియు జలావగాహనార్థంబు గిరి గుహాశయంబులును రూపాన్వితంబులునగు వరాహంబు లచ్చటికిం జనుదెంచి వృషభంబులభంగి గర్జింపుచు నిత్యంబును సంచరింపుచుండు నచ్చటివృక్షం బులు మాల్యాలంకృతంబులై యుండు నీవుసాయాహ్నసమయంబున నమ్మహా పుష్కరిణీతీరంబున సంచరింపుచుఁ దదీయశీతోదకంబును దత్తీరసంభూతపు ష్పితకాననంబును సంఫుల్లకమలోత్పలంబులును బూర్వోక్త వస్తుజాతంబును సర్వంబును విలోకించి విగతశోకుండవయ్యెద వదియునుంగాక ॥ (సీ) ధర ణీశముఖ్య మతంగశిష్యులు మునిశ్రేష్ఠు లాఘనసర,సీతటమున । వసియించి యుండురు, హరుగుర్వర్థంబు వన్యంబుఁ దెచ్చుచు,వన్యభార । పీడితులగుట యుఁ,బృథుపరిశ్రమమునఁ దక్కాయములనుండి, తఱచుగాఁగ । ఘర్మజలం బులు,గంధవాహప్రేరితంబులై వెసఁ(వ్రా)లెఁ,దరువులఁదు ॥ (తే,గీ) నందుఁ బూచిన కుసుమంబు,లనవరతము । వాడవునశింప వమ్ముని, వరుల భూరి । త రతపోమహిమంబునఁ,దాల్పరెవ్వ । రేమిచెప్పుదు నాచిత్ర,మినకులేశ ॥ (క) చిరజీవిని శ్రమణియుఁద । త్పరిచారిణియును వహఃప్ర,భావాన్వితయున్ । గురు మఱియు శబరియనునొక । పరమతపస్వినివసించు, బాగుగనచటన్ ॥ (తే,గీ) దేవసముఁడవు మానిసం,భావితుఁడవు । మానధనుఁడవు భూతన,మస్కృతుం డ । వైననినుఁబోలఁజూచికృతార్థయగుచు । శబరిస్వర్గలోకమునకుఁజను మహాత్మ॥ (వ) మఱియు నాపుష్కరిణి పశ్చిమతీరంబున గుహ్యంబగునొక్క మహనీయాశ్రమంబు గల దదియె శబర్యాశ్రమం బయ్యరణ్య దేశంబంతయు బహువిధ గజోపేతంబయ్యు నందేకదేశస్థితంబైన శబర్యాశ్రమంబు తదీయత



పఃప్రభావంబున గజరహితంబై యుండు నవ్వనంబు మతంగముని నిర్మాణం బగుటంజేసి మతంగవనంబని విశ్రుతింగన్నయది నందన చైత్రరథ సంకాశం బైన యమ్మహావనంబున నివృతుండవై విహరింపు మదియునుంగాక॥ (సీ)పం పాసరోవరప్రాగ్దేశమునఋశ్య మూకనామక మహా భూధరంబు । గలదదిబా లోరగములచేరక్షిత మగుటదురారోహ మైతనరుఁ । గడువేడ్కతో సృష్టి కాలంబునందువిరించిసొంపారనిర్మించెదాని । నెఱిఁదచ్ఛిరంబుపై నిద్రించున రుఁడు స్వప్నమున నేవిత్తంబుపడయునట్టి॥ (తే,గీ) దానిమేల్కాని వడయుదఁ త్కారణమున । దాతయనవిశ్రుతివహించెధరణినాథ । పరఁగనదివిషమాచార పరులకిలన । సౌమ్యులకుఁబాపరతులకగమ్యమరయ॥ (వ) నరేంద్రా విషమా చారులు పాపకర్ములునగువా రప్పర్వతం బెక్కి నిద్రించిన రాక్షసులు వా నింబట్టుకొని ప్రహరింతురు బాలగజంబుల నిస్వనంబు నిరంతరంబుగా వినంబ డుచుండు మఱియు మేఘవర్ణంబులగు మహాద్విపంబులు పరస్పరాభిహతం బులగుటవలన రుధిరావసిక్తంబులై పృథక్కీర్ణంబులై సంచరించునొక్కొక్క వేళ జలపానార్థంబు పంపా పుష్కరిణికిం జనుదెంచి శీతోదకంబుఁ గ్రోలి కొండొకసేపుజలంబులంగ్రీడించి యథేచ్ఛంజనుచుండు నచ్చటివిశేషంబులన్ని యు విలోకించి శోకంబుఁబరిత్యజించెదవు॥ (చ) జనవరయన్నగాగ్రమున సం భృతభూరిశిలాపిధానమై । ఘనతరదుష్ప్రవేశమయి గహ్వరమొక్కటియొప్పు దానితూ । ర్పునబహుసత్త్వమై రుచిర మూలఫలాన్వితమైసురమ్యమై । యను పమశీతవారియుత మైప్రమోద మొక్కటిపొల్చునయ్యెడన్ ॥(తే,గీ) కపిచతుష్టయ యుక్తుఁడై తపనపుత్రుఁ । డైనసుగ్రీవుఁడాగుహనధివసించి । యుండు నెప్పుడైన నొకవేళనున్నతాద్రి । శిఖరతలములవిహరించుక్షితివరేణ్య। (వ)అనియిట్లు స ర్వంబునుం దెలియఁబలికి కబంధుండు కార్యసిద్ధియయ్యెడునని దీవించి దివ్యదే హప్రభాభాసితుండై వారలచేత ననుజ్ఞఁగొని యంతరిక్షంబున యథేచ్ఛంజని యె నంత రామలక్ష్మణులు మహారణ్యంబుసొచ్చి పశ్చిమదిశాభిముఖులై కబం

(*) రామలక్ష్మణులు శబరింజూచుట. (*)

ధోపదిష్టమార్గంబుఁబట్టి గిరికందరజాతంబులగు క్షౌద్రకల్ప ఫలద్రుమంబు లరదండనిరీక్షింపుచు సుగ్రీవదర్శనకాంక్షులై చనిచని పంపాపుష్కరిణీ పశ్చిమతీరంబుఁబ్రవేశించి యందు బహుద్రుమ శోభితంబైన శబరి రమ్యాశ్ర

మంబుఁజూచి యత్తపస్విని కడకుం జనుటయు నదిలేచి సంభ్రమంబున నెదుర్కొని రామలక్ష్మణుల చరణంబుల కభివందనంబుఁ గావించి యర్ఘ్యపాద్యాదికంబు సమర్పించి కృతాంజలియై కొలిచియున్న దాని నవలోకించి రాముండిట్లనియె॥ (తే,గీ) తపము చెల్లునె విఘ్నము ల్తలఁగియున్నె। మృగభయంబులు దప్పునె ప్రీతిగలదె। గురువులకుఁ బూజసేయు డెపరమభక్తి। గలదె నిత్యసుఖస్థితిగలదెనియతి॥ (ఉ) నావిని యత్తపస్విని మనంబున సంతస మందియిట్లను। న్నేవసమానునిన్నుఁ దమి దీఱఁగఁజూచుటఁ జేసినాకును। శ్రీవిభవంబుగల్గె సుఖసిద్ధి చెలంగెఁ దపంబు పండెహా। పావహామయ్యె నాదుమన మన్నియు నేఁడు ఫలించెనీ యెడన్॥ (ఆ,వె) దేవసముఁడవైన నీవు నా చేత సం। పూజితుండ వగుచుఁ బొల్చియుండ। సకలసిద్ధులబ్బె జన్మంబు సాఫల్య। మొందె నెలవు దివికి నుద్దియయ్యె॥ (వ) భవదీయకరుణాకలిత శీతలకటాక్ష ప్రసరణంబు గలవారికిఁ గొఱంత యేమి భవత్ప్రసాదంబున నింక నక్షయంబులగు పుణ్యలోకంబులకుఁ జనియెద నీవు చిత్రకూటంబునకుం జనుదెంచిన పిమ్మట మద్గురువులు సూర్యసంకాశంబులైన విమానంబులెక్కి దివంబునకుం జనుచుఁ బుణ్యంబైన యీయాశ్రమంబునకు సౌమిత్రిసహితంబుగా రాముండు ప్రియాతిథియై చనుదేరఁగలం డమ్మహాత్ముని సందర్శించి యాతిథ్యంబొసంగి యనుజ్ఞఁగొని యక్షయంబులగు పుణ్యలోకంబులకుం జనుదెమ్మందాఁక నిచ్చట నిలిచిరమ్మని నాతోనొడివి చని రేనునాటంగోలె పంపాతీరసంభూతంబులగు వివిధవన్యఫలంబులు నీకు పాయనంబు సమర్పించుట కుపార్జించి యున్నదానననిపలికిన విని రాముండు నిత్యంబును విజ్ఞానంబునం దబహిష్కృతయైన శబరి నవలోకించి యిట్లనియె॥

—(*) శబరి రామునకు మతంగమహర్షి మాహాత్మ్యం బెఱింగించుట (*)—

(చ) దనుఁడెఱిఁగింపనీగురుని ధర్మమహత్త్వము వింటిఁగ్రమ్మఱం। గనుఁగొనని శ్చయించితిఘనంబుగఁ జెల్వుమటన్న నట్లకా। కనికడు వేడ్కతో శబరియా రఘునాథునకమ్మహావనం। బనుపమభంగిఁజూపివిన యంబున నిట్లని పల్కెనెంతయున్॥ (క) చూచితె సకలఫలతరు। ప్రాచుర్యంబై పయోధరప్రఖ్యంబై। వాచాలపక్షియుతమై। తోఁచెడు నివ్వనపదంబు దూషణవైరీ॥ (వ) ఇది మతంగవనంబనం బ్రసిద్ధివహించియుండు॥ (తే,గీ) ధూతకల్మషులైన మద్గురువులిచట। నిమ్మహీధరగుహాయందు సమ్మదమునఁ। బూనిమంత్రసంపూజితమైన యాగ। మ



ర్థిఁ జేసిరిబుధవ్రాతసమ్మతముగ॥ (వ) మహాత్మా నాచేత సత్కృతులైన మద్గురువు లుపవాసపరిశ్రమంబువలన నుద్వేజితంబులైన కరంబులచేత నిద్దానియందుఁ బుష్పోపహారంబులు గావించి రట్టియీ వేదిప్రత్యక్షస్థలియై యొప్పుచున్న దివిలోకింపుము॥ (తే,గీ) విమలచారిత్ర యీ యాగవేదులమ్మహాత్ముల తపోజనితమహిమాతిశయము। వలననమలప్రభంబులై యలరుచున్న। విప్పటికిఁ జూడ మిచ్చటనినకులేశ॥ (వ) మఱియు నుపవాసపరిశ్రమాలసులగుటం జేసి పోవుటకశక్తులైన మద్గురువులచేతఁ జింతితంబులై సమాగతంబులైన సప్తసాగరంబులును జూడుము కృతాభిషేకులైనవారిచేతఁ బాదపంబులయందు విన్యస్తంబులైన యార్ద్రవల్కలంబులును దేవకార్యంబులు సేయువారిచేత విరచితంబులైన కుసుమకిసలయమాల్యంబులును నేటికి శుష్కింపకున్నవి వీక్షింపుము మివ్వనంబునంగల విశేషంబులన్నియు నెఱింగించితి నింక నీచేత ననుజ్ఞాతనై యీకళేబరంబు విడిచి మద్గురువులకడకుం బోయెద ననినవిని రఘువల్లభుండు హర్ష

—(*) శబరి శ్రీరామానుజ్ఞంబొంది దివంబునకేగుట. (*)—

విస్మయాకులితచిత్తుండై సంశ్రితవ్రతయైన శబరిం జూచి నీచేత నర్చితుండనైతి నింక యథాసుఖంబుగా నరుగుమనిన నది చీరకృష్ణాజినావృతంబును జీర్ణంబునైన శరీరంబు విడిచి దాని హుతాశనశిఖల దగ్ధంబుఁ గావించి దివ్యదేహంబు దాల్చి జ్వలత్పావకసంకాశయు దివ్యాభరణభూషితయు దివ్యమాల్యానులేపనయు దివ్యాంబరావృతయునై మెఱుంగు చందంబున నద్దేశంబు వెలుంగం జేయుచు రాముని చరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి యనుజ్ఞఁగొని సుకృతాత్ములగు నమ్మహర్షు లెచ్చట విహరింతు రట్టిపుణ్యస్థానంబునకు సమాధియోగబలంబునం జనియె నిట్లు శబరి దివంబునకుం జనిన యనంతరంబ రాముండు కొండొకసేపు తత్ప్రభావంబునకాశ్చర్యపడి హితకారణంబగు వాక్యంబున లక్ష్మణునకిట్లనియె॥ (సీ) వివిధవిహంగసేవితము విశ్వస్తమృగవ్యాఘ్రమద్భుతరమునైన। మునిపుంగవుల తపోవనముఁ జూచితిమిందు సప్తాంబునిధుల మజ్జనమునర్చి। పితృతర్పణంబు సంప్రీతిఁ గావించితి మశుభంబు తలఁగెఁ గల్యాణ మొదవెఁ। జిత్తంబునకు వేడ్కక్రొత్తయై విలసిల్లె నింక నా సుగ్రీవు నినకుమారు॥ (ఆ,వె) గానఁబోదమతఁడు గాఁడె సతీపరిమార్గణంబునందు మహిసమర్థుఁ। డనినలక్ష్మణుండు జనపతితోఁ జాగు। సేయ నేటికట్లసేయుమనుడు॥ (తే,గీ) అనఘచరితుఁడు రాముఁ

డయ్యాశ్రమంబు। విడిచిపుష్పాఢ్యమగుమహావిపినపథము।వివిధతరువులుసరసు
లువేడ్కనంతఁ । గంతఁజూచుచుఁ బంపఁగా, యంగఁజనియె॥ (చ) కుసుమిత
వృక్షముల్లతలు కోకిలకీర మయూరశారికా । దిసకలపత్రి సంఘము లతిప్ర
బలద్వీపి ఖడ్గపోత్రి సిం । హసృమరభల్లుకాది నిఖిలాటవికంబులు గల్గిరమ్య
మై । యసదృశకాంతిచేనలరు నవ్వనముంగలయంగఁజూచుచున్ ॥ (చ) సల
లిత శీతలోదకము.చక్రమరాళ బకాళిసంఘము । ల్దళితమనోజ్ఞపద్మ కుముదం
బులునూతన కైరవోత్పలం । బులుఘనమత్స్యములకమఠముల్తటరూఢమహా
ద్రుమంబులుం । గలిగిగభీరమైపొలుచు, క్రమసరోవర పఙ్క్తిఁజూచుచున్ ॥
(క) జనపతిమతంగ సరసం । బునుహ్రదమటుసేరఁబోయి, యందుసుమిత్రా।
తనయాన్వితముగ వెసమ । జ్జనముంగావించియవలఁ,జనియె రయమునన్ ॥

(*) రామలక్ష్మణులుపంపాసరోవరంబుఁ జేరుట. (*)

(తే,గీ) అధిపుఁడీ చందమున నేగి యచటికలిక । లచటి పూగుత్తులలరుల,న
చటితావు । లచటిక్రొవ్విరు లప్పుడుత,న్నంగజాభి । తప్తుఁజేయంగజానకిఁ,దల
చుకొనుచు । (వ) శోకసమావిష్టుండైయరిగి॥ (సీ) పూగనారంగ పు,న్నాగ
శోభితయును గమలసంపీడిత,విమలజలయు । మత్స్యకర్కటకూర్మ, మకర
శోభితయును రమ్యోపవనరాజి, రాజితయును । స్ఫటికాచ్ఛసలిలయుశ్లక్ష్ణవా
లుకయును బ్రసవితలతికాభి, రంజితయును । గరుడగంధర్వకిం,పురుషసేవితయు
ను బల్లవితాశోక,భాసితయును ॥ (తే,గీ) గమలతామ్రయుఁగుముదశు,క్లయు
వినూత । నోత్పల వినీలయును దటజోరుకుంద । మాలతీసప్తపర్ణజాత, పూల
యుతయు । నైనపంపను గాంచెన,య్యవనివిభుఁడు ॥ (వ) మఱియుసఖులచే
తంబోలె నేలాలతలచేతఁ బరివృతయగుదానిఁ గుథయుంబోలెబహువర్ణయ
గుదానిఁ బుష్పితామ్రవనోపేతయగుదాని బర్హిణోద్ఘుష్టనాదితయగు దాని
మాలతీకుందగుల్మావృతయగుదానిఁబరిమళోపేతశీతవారినిషేవితయగుదానిఁ ది
లకబీజపూరక కరవీరభాండీర నిచుళకేతకీ ప్రముఖనిఖిలతరువ్రాతోపేత య
గుదానిఁ శైవాలశిరోజయుఁ బద్మముఖియు నీలోత్పలనేత్రయు శంఖకందర
యు మృణాళదోర్యుతయుఁ జక్రవాకస్తనియుఁ బరిభ్రమనాభియుఁ బుళిననితం
బయు మకరజంఘికయుఁ గూర్మచరణయునై విలాసవతిచందంబున నందంబ
గుదానిఁ బంపాపుష్కరిణిఁడాయంజని తత్తీరంబున నానాధాతుమండితంబును



చిత్రపుష్పితకాననంబునగు పూర్వోక్తఋశ్యమూకంబుఁ గనుంగొను రాముం
డులక్ష్మణునకిట్లనియె ॥ (తే.గీ) అనఘయీశైలమందుమహాత్ముఁడైన । ఋక్ష
రజునిసుతుండు సుగ్రీవుఁడుండు । శీఘ్రమునన వ్వలీముఖ శ్రేష్ఠుఁ జేర । నేగుమ
నిపల్క క్రమ్మఱనిట్టులనియె ॥ (క) దీనుఁడ రాజ్యభ్రష్టుఁడ । మానధనుఁడఁ
దత్ప్రసక్తమానసుఁడఁగరం । బేనెట్లుమనఁగఁజాలుదు । జానకి నెడఁబాసిసా
ధుజనవినుతాత్మా ॥ (వ) అనిబహుప్రకారంబుల రాముండు సీతందలంచుకొ
నికామాతురుండై శోకవిషాదయంత్రితుండై లక్ష్మణునితోడసం భాషింపుచుఁ
గ్రమంబున నవ్వనంబునంగల విశేషంబులఁ గలయవిలోకింపుచుఁ బంపాతీరం
బుఁ బ్రవేశించి యమ్మహాపుష్కరిణీసంజాత ప్రభావిశేష నిరీక్షణంబునంగొం
తశోకంబుమఱచి యుండెనని యారణ్యకాండకథా ప్రపంచంబంతయు సవిస్త
రంబుగావినుపించిన వినియటమీఁద వృత్తాంతంబు వినుపింపుఁడని యడుగుట
యును ॥ (వృత్తకంద గర్భితచంపకము) సురవరసూరిలోకనుత సుందరమూ
ర్తీ నమజ్జనావనా । వరవిభవా రణప్రియ నివారితవైరి సమస్తభద్రమం ।
దిరధరధీరవిష్టపప తీనిరవద్య సురక్ష్యమాణని । జర్ణరకులజాతచోరమణిచం
ద్రకులేంద్ర రమామనోహరా ॥ (క)నిగమాంతవేద్యశుకవా । క్సుగదితమహి
మావిశేష నిత్యానందా । జగదేకనాథసర్వో । పగభగ వచ్ఛబ్దవాచ్య భ
ద్రాత్మహరీ ॥ (పంచచామరము.) పయోజపత్రనేత్ర యోగిపాలభాగధేయమ
నః । ప్రియాదయాపయోనిధీవిరించివందితాజగ । త్త్రియావనానయానయ
జ్ఞతార్క్ష్యవాహనాశ్రితా । భయప్రదాయకామహానుభావ లోకనాయకా॥
(గద్యము) ఇదిశ్రీరామచంద్ర చరణారవింద మకరందరసాస్వాదన తుందిలేం
దిందిరాయమాణ మానసకులపవిత్ర కౌండిన్యసగోత్ర పద్మనాభ సూరిపుత్ర
విద్యాసాంద్ర వేంకటకవీంద్ర ప్రణీతంబైన శ్రీమద్రామా యణంబను నాది
కావ్యంబునం దనసూయాత్రిసందర్శనంబును నంగరాగార్పణంబును సీతావి
వాహకథా కథనంబును దండకారణ్యప్రవేశంబును విరాధవధంబును శరభం
గదర్శనంబును సుతీక్ష్ణసమాగమనంబును సీతానీతిప్రబోధంబును సుదర్శన
దర్శనంబును నగస్త్యదర్శనంబును జటాయుసమాగమనంబును బంచవటీప్ర

వేశంబును హిమవత్కాలవర్ణనంబును శూర్పణఖా సమాగమంబును వైరూ
ప్యకరణంబును ఖరాదివధంబును జానకీహరణోద్యోగంబును మారీచవధంబును
వైదేహీహరణంబును రామునివిలాపంబును జటాయువునకు
సలిలదానంబును క్రౌంచారణ్యప్రవేశంబును గబంధ
వధంబును బంపావనప్రవేశంబును శబరీదర్శ
నంబును మతంగశిష్య మహిమాను
వర్ణనంబును ననుకథలుం
గలయారణ్యకాండము
సంపూర్ణము,

(శా) ఈకావ్యప్రతిపాదితుండయిన, సీతేశుండు రామప్రభుం । డీ
కల్యాణకృతీశ్వరుండయిన శ్రీ,కృష్ణుండు సంప్రీతితో । సా
కల్యంబుగ నిష్టసిద్ధికరులై, చంచత్కృపాపూ
ర్ణులై । లోకస్తుత్య కుమార
యాచ ధరణీం.ద్రుం బ్రో
తు రెల్లప్పుడున్ ॥
—(*)—
మంగళమస్తు.



శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

శ్రీమద్రామాయణము * కిష్కింధాకాండము.

శ్రీకైవల్య రమాధిప । రాకేందు సమాన ముఖపు, రందర మకుటా । స్తోకానేకమణీశో । భాకలితచరణ సత్య, భామారమణా ॥ (వ) దేవా యవధరింపుము కుశీలవులగు కుశలవు లవ్వలి కథయిట్లని చదువం దొడంగిరట్లు రాముండు సౌమిత్రిసహితంబుగాఁ బద్మోత్పలఝషాకులయగు పంపాపుష్కరిణి నధిగమించి మదనోద్దీపన కరంబులగు తదీయసుషమా విశేషంబు లవలోకించి కామశరనిపీడ్య మానమానసుండై లక్ష్మణున కిట్లనియె ॥ (క) విలసిత —(*) రాముడు వసంతఋతువుంజూచి మన్మథాభితప్తుండై విలపించుట (*)— తరుశోభితయై । సలలిత వైడూర్యవర్ణ, సలిలాగ్రనట । జ్జలజోత్పలయుతయై రా । జిలుచున్నది కంటెపంప, చిరశుభలీలన్ ॥ (తే,గీ) ఎచట శిఖరాన్వితములైన, పృథునగంబు । లట్లయుచ్ఛ్రిత తరువులో, ప్పారుచుండు । నట్టిపంపాసరోవర, ప్రాంతచిత్ర । వనముశోభిలుచున్నది, యనఘుకంటె ॥ (తే,గీ) భరతు నెడఁబాసి సతినిగో, ల్పడిదురంత । దుఃఖభారంబుచే స్రుక్కి, తూలుచున్న । నన్నిచ్చటఁ జాలఁబీడింపు, చున్నవాని । మాడ్కినతిశంపుచున్నాఁడు, మాధవుండు ॥ (చ) వివిధసుమోప శోభితయు, విశ్రుతకీర్తియు శీతవారియు । న్నవజలజాతయుక్తయును, నాగమృగద్విజకాండ యున్వ్విచి । త్రవనయునైనపంప పరితాపము నందపియింపు చున్ననా । కవిరళసమ్మదం బహర,హం బొనగూర్చుచు నున్నదెంతయున్ ॥ (తే,గీ) శాడ్వలంబి దెశిఖిగళ, చ్ఛాయగ లిగి । వివిధ పాదపకు

సుమ సం, వీతమగుచు । ఘనపరిస్తోమ ములచేతఁ గప్పఁబడిన । యట్లశోభి
ల్లుచున్నది, యనఘ కంటె ॥ (తే,గీ) ప్రసవ భారసమృద్ధచ, లన్మహీరు
హాగ్ర ములుపుష్పిత తాగ్ర ల,తాభివృతము । లగుచుఁ గాంతాప రిష్వక్త
లైననరుల । కరణిశోభిల్లుచున్నవి, కంటె వత్స ॥ (తే,గీ) జాతపుష్ప
ఫలద్రుమమో, పేతయగుట । నిదిసురభిమాసమికాల,మింపుమెఱయ । గంధ
వంతమైమదనవి, కారహేతు । వైసుఖానిలమ్మెయున్న, దనఘకంటె ॥ (తే,గీ)
తోయదంబులుపరిమళ, తోయమువలెఁ । బుష్పవర్షంబుఁగురియుచు, భూరి
భూజు । హాత్కర లతాభియుత ములై,యొప్పుచున్న । వమలచరితవనస్వ
రూ,పములు కంటె ॥ (క) వివిధ వనభూజములుగం । ధవాహచ లితంబు
లగుచు,ధా రుణియందుం । బ్రవిమలశిల లందుసుపిరు । లవిరళగతిఁగురియు
చున్నవంతటఁగంటే ॥ (తే,గీ) పతితపతమానములునగు,పాద పస్థ । కుసు మము
లచేతఁ బవమా నుఁ,డస దృశ ముగ । వేడ్కమె యిఁబట్టియాడెడు, విధము
తోఁచెఁ । జూచితే కాననము లందు, సూరి వినుత ॥ (క) మానితపుష్పితత
రుశా । ఖానిచయం బులఁ గదల్చి, గాడ్పు ప్రచలిత । స్థానములగు తేఁటుల
చేఁమానుగ నొప్పారె గీయ,మానుఁడువోలెన్ ॥ (క) గిరికందరములు వెలు
వడి । పరభృత్సంగీత నాద,పద్ధతి కిఁదగం । దరువుల పైఁబవమా నుఁడు । స
రసంబుగ నాడుచున్నచం, దముదోఁచెన్ ॥ (తే,గీ) అట్టిపవ నునిచేతనీ య
డవిలోని । విటపి విటపాగ్ర నిచయమె, క్కటికినొకటి । పెనుచు కొనిము
డిపెడక,త నరుచున్న । వనఘ కంటివె రమ్యవ ,నాంత రమున ॥ (తే,గీ) మ
ఱియుని ర్యోడఁద మ్మిక్రొ,వ్వి రులతావి । సంగ్రహించి చివి రోగ జ. శ్రమ
మువాయ । సరసితర గల పైనుండి, చల్లగాలి । విసరుచు న్నదిసం తోష,మె
సఁగఁగంటె ॥ (క) అనిల రజోత్క్షిప్త ములై । ఘనతరువులు మధుప గీత,కల
నమ్మధువా । సనలుల్ల సిల్లు వనముల । ననఘా ధ్వని సేయుచు న్న, యట్లుచె
లఁగెడిన్ ॥ (వ) మఱియు రమ్యప్రస్తర సంజాత పుష్పిత ద్రుమంబుల చేతఁ
బరస్పర సంశ్లిష్టాగ్రంబులై యిచ్చటఁ బర్వతంబులు మహోన్నతంబులైన
పుష్పరాసుల చందంబున నందం బగుచున్నవి యిచ్చటఁ బాదపంబులు పుష్ప
సంఛన్న శిఖరంబులై మారుతోత్క్షేపచంచ లంబులై మధుకరోత్తంసం
బులై గీతంబుఁ బాడుచున్న చందంబునం జూపట్టుచున్నవి విలోకింపుము



(తే,గీ) కుసు మితములైన యీకొండ, గోఁగు,ప్రాఁకు । లంతటఁ జెలంగు
చున్నవి, త్యద్భుతముగ । జాతరూప భూషణము లు,పీతచేల । ములుధ
రించిన పురుషులుఁ బోలెఁగంటె ॥ (చ) అనఘ సతీవియోగజని, తార్తిఁ
దపించెడు నాకుశోకదీ । పనకర మావసంత మిది. బంధు రతాళు కశా
రికార్భటు । ల్తనరెడు మన్మథుండు నిశి, తప్రదరంబుల నేఁచుచున్నవాఁ
డనుపమ భంగిఁబైక ముక, లార్భటిన న్బిలువం దొడంగెడిన్ ॥ (తే.గీ)
అంగజాస్త్రాభి విష్టుండ, నైననాకు । రమ్యకానన నిర్ఝర, రాజియందు ।
దాప మధికంబు సేయుచు, నేపుమీఱి । కూయు చున్నవి యీవారి, కుక్కు
టములు ॥ (క) పన్నగ నాశ్రమపదమున । మున్నీ కుక్కుటరవంబు, భూసు
తవినితా । నన్నుఁ బిలిచి సంతోషా । భ్యున్నతయై కూడియాడు, చుండుం
గాదే ॥ (వ) మఱియు నిచ్చటి ఖగంబులు విచిత్ర పత్త్రంబులై భృంగరాజప్ర
ముదితంబులై మధుర స్వర యుక్తంబులై నానారవ సన్నాదితంబులై యా
త్మీయ వ్యూహాభి నందితంబులై పురుష విహంగంబు లంగూడి వృక్షగుల్మల
తాప్రతానం బులమీఁద వ్రాలుచున్నవి విలోకింపు మీపుష్కరిణీ తీరంబునం
గల వృక్షంబులు నత్యూహాకృతశబ్దంబుల చేతఁ బుంస్కోకిల రుతంబుల చేత
ననంగ ప్రదీప నంబులై ధ్వని సేయుచున్న వానిపోలికఁ జూపట్టుచున్న వది
యునుం గాక ॥ (క) ఏలాల తావృతములై । కూలంబునఁ జూతతరులు, కోకి
లశుకవా । చాలతవిర హుఁడనగున । నోన్లగము ననవ్వి తెగ డు,చున్న వి
కంటే ॥ (క) తరు పల్లవ హేతియు నళి । గురురవ నిస్వ నుఁడ శోక,కుసు
మాంగార । స్ఫురణుఁడగువసంతా నలుఁ । డురుగతి నన్నేచఁ దొణఁగె
నుజ్జ్వలుఁడగుచున్ ॥ (క) మృదుభాషిణినిసు కేశిని । సదమల గుణవతినిబర
మ,సాధ్వి నళికచ । న్మదిత నెడబాసి ధరమా । నదబ్రతుకుట నిష్ప్రయోజ
నంబగుఁ గాదే ॥ (క) సముదంచిత రుచి రార । ణ్యామునభి నవరమ్య కోకి,
లాకులసీమాం । తము నగునీఘన సుమనమ । యముమత్ప్రియ కరయఁ గ
డుఁబ్రి,యంబై యుండున్ ॥ (క) మారాయా సప్రభవము । వారకవర సు
రభిగుణవి, వర్ధిత మగునీ । దారుణ శోకాగ్నినను । న్గాఱియ పెట్టం
గఁదొణఁగె, ఘనగుణశాలీ ॥ (తే,గీ) సీతనెడఁబాసి యీమహీ, జాతముల
ను । బన్నుగావిలోకింపుచు,ను న్నకతన । ననఘ చారిత్ర మన్మథుఁ, డంత

కంతుఁ కధికుఁడై యేచుచున్న వాఁడ, నఘచరిత ॥ (తే,గీ) మనుకులోత్తమ పరిదృశ్య, మానుఁడైన । స్వేదసంసర్గశౌమకాం, 'చిత వసంతుఁ । డరయఁగ నదృశ్యమానయై, నట్టిసీత । యనుమనో వ్యథఁగావింపుచున్న వారు ॥ (తే,గీ) రాజసుత క్రూరుఁడైన చైత్రవనపవనుఁ । డవని విరహులకంతకుం, డగు మధుండు । నన్నిపుడు కానఁబడి యేర్పుచున్న వారు । కానఁబడని వసుంధరా కన్యపగిది ॥ (క) స్ఫటికగ వాక్షప్రతిమ । స్ఫుటపింఛము లనిలవేగమున విచ్చి శిఖుల్ । నటియింపుచున్న వెంతయుఁ । జటులగతిం గంటె సరసి సామీప్యమునన్ ॥ (క) మదమూర్ఛితంబులై తమ । ముదితలతోఁ గూడి కామమున రంజిలుచు । న్మదనవశగతుఁడనగు నన్నుఁ । బదపడి తపియింప సాగె, భవ్యగుణాఢ్యా ॥ (తే,గీ) అచలసానువులందు నృత్యంబు సేయు । విభునిఁ గనుఁగొని మన్మథావిష్ట యగుచు । శిఖిని యొక్కతె నృత్యంబు సేయుచున్న । దనుసరించి విలోకింపు మనఘచరిత ॥ (తే,గీ) అట్లు నృత్యంబుఁ గావించునట్టి శిఖినిఁ । గన్గొని శిఖండి రుచిర పక్షములు విచ్చి । విపుల రుతముల ననుఁ జూచి యపహసింపుచున్న దాని విధంబున నున్న దిపుడు ॥ (క) వనమున నీశిఖి తన ప్రియ । దనుజుం డెత్తికొని పోక తక్కిన కతన । న్వనమున మయూరమునకును । జనసుత భార్యాభియోగ సౌఖ్యము గలిగెన్ ॥ (తే,గీ) జనవరకుమార యీపుష్పసమయమందు । నాతి నెడఁబాసి యుండుట నాకుఁ జాల । దుష్కరంబగుచున్నది తోడరిపక్షి । జాతులందును శాగ మీరీతి నుండు ॥ (చ) తరణికులేంద్ర జానకిని దానవుఁ డెత్తుక పోక యున్న రా । గరసమెలర్ప నీశిఖిని కాంతునిఁ గూడి సుఖించినట్లయా । సరసిజనేత్ర పర్వతవిశాల వనంబుల వల్లికాగృహా । తక్కరములనన్నుఁ గూడి సతతంబు సుఖింపుచు నుండునే కదా ॥ (తే,గీ) లక్ష్మణా యీవసంతకాలంబునందుఁ । జాలసమ్మోదమొనఁగూర్పఁ జాలినట్టి । యీప్రసూనంబులీ తరు లీవనంబు । లీచరులు నిష్ఫలంబులై తోఁచె నాకు ॥ (క) అనఘా యీ సుమములు శో । భనతర చేతోహర ప్రభారుచిరముల । య్యనునిష్ఫలంబులై మే । దినిఁ బడుచున్న యవి కంటె తేంట్లు రొదలిడన్ ॥ (క) కనుఁగొంటె శకున సంఘము । లనంగమదమోహితంబులై మధురరవం । బొనరించెడు నన్యోన్యం । బు నుబిల్చుచున్న వానిపోలిక ననఘా ॥ (క) ఈశుకములీమయూరము । లీశారిక లీపికంబు లెంతయు నాకుం । గ్లేశమును జేయుచున్నవి । లేశము కృపలేక సీ



త లేనికతమునన్ ॥ (ఉ) కాయజుఁ డంబుజాస్త్రములఁ గైకొని మాటికి నేయుఁ గోయిల । లూర్కయ శిఖుల్ నటింప నవకోమల కైరవ పుష్పగంధియై । వాయువు వీవనేగతి నివాసమొనర్చెద నివ్వనంబునం । దాయెలనాగఁ బాసి కుసుమాకరమీగతి గాసిసేయఁగన్ ॥ (తే,గీ) ఈమొగడలీఫలంబులు, నీసుమంబు । లీనలు నీవసంతమందానిలంబు । నామదికి వేడ్కసేయకున్న వి కుమార । యువతి నెడఁ బాసియొంటిగ, నున్న కతన ॥ (క) మారోన్మాదకరములగు । శారికలటు గుంపుగూడి సమనాదముల । న్వాకరయిత రేతరమును । జీరుకొనుచున్న భంగిఁ జెలఁగెడి ప్రేమన్ ॥ (చ) ఇనకులవర్య సీతవసియించినచోట వసంతమేనియు । న్ఘనతర మన్మథవ్యసనకారణమైన తదీయవైఖరు । ల్గనుఁగొని పారవశ్యమున గాసిలి నన్ను మదిం దలంచి నా । యనువునఁ జాలమారజనితార్తికి లోఁబడుఁగాదె లక్ష్మణా ॥ (తే,గీ) సరసిజానన యున్న దేశంబునందుఁ । గంతుసంతాపకరుఁడు వసంతుఁడేల । యుండునట్లుండకున్న నయ్యుత్పలాక్షి । యొంటిమెయి నెత్తెఱంగున నుండఁగలదు ॥ (ఆ,వె) అతివ యున్న దేశమందు నిక్కంబుగ । నీవసంతుఁడుండెనేని యేమి । సేయఁగలదు పరుల, చేఁజిక్కియున్న చోఁ । నతివ దలఁచుకొనిన నడలుగదుర ॥ (తే,గీ) ఆసరోజాక్షియాశ్యామ యాలతాంగి । యామధురమంజుభాషిణి యామృగాక్షి । నిక్కము వసంతుబారిఁ జిక్కెనేని । వెతలఁగుందుచుఁ బ్రాణంబు విడువఁగలదు ॥ (తే,గీ) పరమసాధ్వియు మఱియుమ ద్విరహశోక । తప్తయును గాన ననుఁబాసి ధైర్యమూఁది । సారసేక్షణ జీవింపఁ జాలదనుచు । నామనంబునఁ దోఁచెడు నయచరిత్ర ॥ (తేగీ) ఏనుధీరుండనగుట నొక్కింతబుద్ధిఁ । దాల్మిఁ బూనితి మరునిచైద్యములకోర్చి । భూమిసుత గోలయగుట నాపొందు విడిచి । తెంపు సేయఁగ నెట్లు వర్తింప నేర్చు ॥ (తే,గీ) పురుష శార్దూల నాయందు భూమిపుత్రి । భావము నిరంతరంబెడఁ బాయకుండు । నట్లయద్దేవియందు ననన్యమగుచు । నాదు భావంబు వర్తించుఁ గాదె యెపుడు ॥ (ఆ,వె) వనజముఖినిఁ గూడి వర్తించునాఁడెవ్వఁ । డధిక సౌఖ్యకారియైతనర్చె । నట్టిపవనుఁ, డిప్పుడా సతి లేకుంటఁ । జేసి కాల్పఁదొడఁగెఁ జిచ్చుఁబోలి ॥ (తే,గీ) ఈవసంతానిలుండు మహీకుమారిఁ । గూడియున్న చో నామీఁదఁ గూర్మి నెఱపి । విరులతావులు పైసోఁక వీచుచుండు । నట్టివాఁడెంత యపకారియయ్యెనేఁడు ॥ (చ) అనిబహుభంగులన్ రఘుకులాగ్రణి రాముఁ

డు మన్మథాతురుఁడై । జనకసుతం దలంచుకొని సారెకుఁ బెక్కు తలంపులూరఁగాఁ । దనమది నుమ్మలింపుచుఁ బదంపడి లక్ష్మణు తోడ నిట్లను । ఘనతరమన్మథవ్యసన కారణమైన వనంబుఁ జూచుచున్ ॥ (క) మునుగౌతమీతటంబున । జనకజతోఁ గూడి యున్న సమయంబునఁ దా । వినువీథిఁ జనుచు నీఖగ । మనఘా ననుఁ గాంచి పరుష మాడెం బలుచన్ ॥ (క) అమలగుణాకర యిక్కా । కము నేఁ డిటు మఱల సౌమ్యగతిఁ గొని యీ వృ । క్షము మీఁదనుండి కడు హ । ర్షమునన్ మృదునిస్వనంబు సలిపెడుఁ గంటే ॥ (వ) వత్సా యీ ఖగంబు తొల్లి యాకాశంబుననుండి క్రూరనాదంబు సేయుటది సీతావియోగసూచకంబై యిప్పుడు వృక్షాగ్రంబుననుండి హర్షనాదంబు సేయుటది క్రమ్మఱ సీతాసంశ్లేషసూచకంబై యున్నయది గావునఁ దొల్లి జనస్థానంబున సీతాప్రతిహారకంబైన యీ ఖగంబిప్పుడు నన్ను సీతాసమీపంబు నొందించునని యూహించెద ॥ (తే,గీ) కుసుమితాగ్రంబులగు ప్రమాని, కొమ్మలందు । మధురముగఁ గూయుచున్న యీ మత్తవిహగ । నిస్వనంబులు వింటివె, నృపకుమార । ప్రసవశరుని గుణారవా ర్భటులుఁ బోలె ॥ (తే,గీ) ఘనమదోద్ధూత యగు ప్రోడ గజితనువలె । మారుతోద్ధూతమైన శృంగారతిలక । మంజరిని గూడి యున్న యీ మత్తమధుప । రాజుపాలుపునుఁ జూచితె రాజపుత్ర ॥ (క) విరహులకు శోకవర్ధన । కరమైన యశోకతరువుఁ గంటె ననుసమీ । రరయోత్క్షిప్త స్తబకో । త్కరములఁ దర్జింపు చున్నకరణి నలరెడిన్ ॥ (క) కుసుమిత విటపాగ్రములగు । రసాలధరణీరుహములు లక్ష్మణ కంటే । లసదంగరాగమహిమో । ల్లసితులయిన నరులమాడ్కిఁ గ్రాలెడి మోఱిలన్ ॥ (క) చూచితె లక్ష్మణ యీ పం । పా చిత్రవనంబులందు భావజకేళీ । ప్రాచుర్యంబున నలరెడు । ఖేచరసుర సిద్ధసాధ్య కిన్నర తతులన్ ॥ (క) పరిమళయుక్తములగు నీ । సరసిజములు పుష్పగంధి సలిలంబులపైఁ । దరుణాదిత్యుని వైఖరిఁ । గరమొప్పుచునున్న వనఘ కనుఁగొంటె రహిన్ ॥ (వ) మఱియు నిమ్మహాపుష్కరిణి ప్రసన్న సలిలయై పద్మనీలోత్పలయుతయై హంసకారండవాకీర్ణయై సౌగంధిక సమన్వితయై తరుణసూర్యప్రతీకాశ షట్పదాహతకింజల్క పుంజ రంజితకంజాత శోభితయై చిత్రప్రస్థవనాంతరయై చక్రవాకోపశోభితయై సలిలార్థిమాతంగ మృగయూథ విరాజితయై యొప్పుచున్నది విలోకింపుము ॥ (ఆ,వె) క్రౌంచ చక్రవాక కారండవ బలాక । హంసముఖర



జల విహంగములు । భంగదోలికాభిసంగతి నూఁగుచు । నెసఁగుచున్నవ క్షి, కింపుగాఁగ ॥ (ఆ,వె) పవన వేగచలిత బంధురకల్లోల । తాడ్యమాన నవ్యతామరసము । లనఘచరితకంటె జనకకుమారిక । కన్నులట్ల క్రాలు, చున్నవిపుడు ॥ (తే,గీ) పద్మకేసరవర్ణిని పద్మగంధి । పద్మపత్ర విశాలాక్షి పద్మహస్త । క్షితికుమారిక లేనిచో జీవితంబు । వ్యర్థమని తోఁచుచున్న దవార్యచరిత ॥ (తే,గీ) దూరదేశస్థయును గడుదుర్లభయును । మధురభాషిణి యగు సీత మఱల నిపుడు । సంస్మరింపఁగఁ జేసెనీ సరసిజాస్త్రుఁ । డితని కౌటిల్యమేమని యెన్నవచ్చు ॥ (తే,గీ) వీరశేఖర పుష్పితవృక్షుఁడైన । యీ వసంతుఁడు మిగులనన్నేఁచఁడేని । పరఁగ నభ్యాగతుండైన మరుని బాధ । కోర్చియే చందమున నైన నుండవచ్చు ॥ (క) తొయ్యలిఁ గూడి యున్నపు । డెయ్యవి హృద్యంబు లగుచు నెసగుచునుండుం । దొయ్యలి లేనికతంబున । నియ్యెడ నవి యెల్లఁ జాల హేయములయ్యెన్ ॥ (తే,గీ) నీలకుంతల యగు సీత నేత్రకోశ । సన్నిభములని నాదృష్టి సంభ్రమమునఁ । జూడఁగోరెడు సారెకు శుభచరిత్ర । లలితనవపద్మ కోశపలాశములను ॥ (తే,గీ) అబ్జకేసరసంస్పృష్టుఁడై సుగంధ్య । నోకహాంతరనిర్గతుండై కరువలి । సీతనిశ్వాసపవనంబు రీతి హృద్యుఁ । డగుచు వీచెడుఁ గంటి వెయలఘుచరిత ॥ (క) వారకపంపాదక్షిణ । తీరంబున శైలసాను దేశములందు । న్యాఘరితరద్యుతితోనలరారెడు నదికర్ణికారయష్టినిఁ గంటే ॥ (క) అతులితబహుధాతుసమ । న్వితమగు నీధరము వాయువేగాతిశయో । త్థితమగు విచిత్రరజమును । జితవిమతా సాంద్రముగ సృజించెడుఁ గంటే ॥ (క) సురుచిరపుష్పితనిష్పత్రరమ్యకింశుక తరుప్రతానంబులనీ । గిరిసానువు లొప్పారెడుఁ । గరముజ్జ్వలితంబులైన కైవడిఁ గంటే ॥ (వ) మఱియుఁ బంపాతీరసముద్భాసిత మాలతీ మల్లికా కరవీర కేతకీ సిందువార వాసంతికా మాధవీ కుందగుల్మ చిరిబిల్వ మధూక వకుళ వంజుళ చంపక తిలక నాగవృక్ష నీప వరణ ఖర్జూర పద్మక నీలాశోక లోధ్రాంకోల కురంటక పూర్ణక పారిభద్రక చూత పాటల కోవిదార ముచుళిందార్జున కేతకోద్దాలక శిరీష శింశుపా ధవ శాల్మలీ కింశుక కురవక తినిశ చందన ప్రముఖ నిఖిలతరు లతాప్రతానంబులు పుష్పితాగ్రంబులై గంధవంతంబులై మనోహరంబులై నానావర్ణంబులై మహోన్నతంబులై చూపట్టుచున్నవి విలోకింపుము ॥ (క) అనిలచలితవిటపములగు । ఘనతరసన్నిహిత

వృక్షగణములనుగరం । బనువర్ణింపుచునున్న వి । మునుకొని లతలబ్జముఖులు పురుషులఁబోలెఁ॥ (తే,గీ) ప్రతివనంబును బ్రతిపాదపంబుప్రతిన । గంబుతిరుగుచుఁబవనుండుకరమునేక । మధురసాస్వాదుఁడగుటఁ బ్రమదమునొంది । యున్నచందాన నిటువీచుచున్నవాఁడు॥ (వ) మఱియుఁ గొన్నితరువు లీషద్వికసితకుసుమంబులై కొన్నిపాదపంబులు ముకుళసంవీతంబులై వృంతపర్ణబాహుళ్యంబున శ్యామంబులై ప్రకాశింపుచున్నవి విలోకింపుము॥ (మ) అదె చంచన్మకరందలుబ్ధమధుపం బత్యంతరాగంబుతో । నిదిస్పృష్టంబిది వాసితంబిది మహావాద్యంబఁటంచున్రసా । స్పదపుష్పంబులమీఁదనుండిపరపుష్పశ్రేణిపై వ్రాలుచు । న్నదియీముంగలివృక్షషండములగాంచఁగఁజూపిరోత్తమా॥ (వ) మఱియునిచ్చటవసుంధర తమయంతందామ రాలిపడిననానావిధరుచిరకుసుమసంఘాతపరిస్తీర్ణమైశయనాస్తరణపరిస్తీర్ణయైనదానియట్ల సుఖావహాకృతియైయొప్పుచున్నదియిచ్చటి గిరిసానువులందు విశీర్ణంబులైనవివిధపుష్పంబులచేతనభిసంవృతంబులై వివిధప్రస్తరంబులు పీతరక్తంబులుగా రచియింపంబడినవానిచందంబునంజూపట్టుచున్నయవి హిమాంతంబునందలి వృక్షంబులకుసుమ సంభవంబు వీక్షింపుము పుష్పమాసంబునందుఁ బరస్పర సంఘర్షణంబునం దరువులు పుష్పితంబులైనవానిమాడ్కి నుత్ప్రేక్షింపం దగియున్నవి మఱియుఁ గుసుమోత్తంసవిటపంబులగు మఱికొన్నిపాదపంబులు భ్రమరనాదమిషంబుననొండొంటిం జీరుచున్నవానియట్ల యలరుచున్న వదియునుంగాక॥ (శా) నాకున్మోహముఁబుట్టఁజేయుచు మహానందానురాగంబుతో । నీకారండవ మంగనాయుతముగా నీనీటిలోఁ జొచ్చియు । న్తోకాంభోరుహ షండమండల ములం, దుంగ్రీడఁగావించెనీ । వాకర్ణింపుముతత్కలస్వనముసొంపారంగవీతెంచెడిన్॥ (తే,గీ) ఇనకులోత్తమవినుమిట్టి హృద్యరూప । మెలమిమందాకినికిఁ గల్గెనే నిజగతి । నధికవిఖ్యాతదృష్టిచిత్తాపహారి । గుణములన్నియు దానికిఁ,గూర్పవచ్చు॥ (తే,గీ) ఇట్టిరమ్యవనంబున నిట్టివేళ । నుత్పలేక్షణ నాయొద్దనుండెనేని । యుష్ణకరవంశ తిలకయ యోధ్యనైన । నింద్రపదమైనఁదృణముగా నెంతుఁగాదె । (ఉ) ఆమదిరాయతాక్షి జనకాధిపనందనఁ గూడియిచ్చట । న్గోమలశాద్వలంబులని కుంజములన్విహరింపఁగల్గిన । న్గామరసాసనాదుల పదంబులలోఁగల సౌఖ్యమైనచో । నామదికించుకైన నర నాథతనూజ ప్రియంబు



సేయునే॥ (క) ఈకాననమున వివిధా । నోకహములఁ జూడు మతిమనోహర భంగి । న్నాకుంజిత్తభ్రమణం । బీకరణినొనర్పుచున్నవిపుడుకుమారా॥ (తే,గీ) అనఘ రమ్యాద్రిగిరిసానులందు మోద । మలరఁ గ్రీడించుమృగదంపతులను జనక । కన్యనెడఁబాసిమిగులదుఃఖమునఁగుందు । చున్ననన్నువిలోకింపు,ముదుగుణాఢ్య॥ (క) ఈరమ్యతరులుకుసుమము । లీరాజతపల్లవంబు లీసరసులు నా । కేరీతిఁబ్రియ మొనర్చును । నీరజదళనేత్ర నెదను నిల్పినదాఁకన్॥ (సీ) శుకవాణిమెయితావి సోఁకినప్పుడుగదా యీమందపవమాను డింపొనర్చుఁ । గలకంఠికనుదోయిఁ గాంచినప్పుడుగదా యీపద్మపత్రంబులింపొనర్చు । సుందరిచనుదోయిఁజూచినప్పుడుగదా యీచక్రవాకంబులింపొనర్చు । మదిరాక్షికెమ్మోవి గదిసినప్పుడుగదా యీజపాకుసుమంబు లింపొనర్చు । (తే,గీ) జలజవేణికతోఁగూడి వలసినట్టు । లనుదినంబును విహరించు నప్పుడుగద । యిచటినస్తువులన్నియు నింపొనర్చుఁ । గానిచోదుఃఖకరములు గావెనాకు॥ (వ) మఱియునీ పుష్కరిణి సుశీతలస్వాదుసలిలయై సంఫుల్లహల్లక పద్మకైరవాలంకృతయై చక్రవాకానుచరితయై కారండవనిషేవితయై క్రౌంచప్లవసంపూర్ణయై వరాహమృగసేవితయై కలస్వనంబులుసేయు వివిధముదిత విహంగంబులచేత నభిసంవృతయై నాకుఁగామోద్దీపనంబుసేయుచు నదృష్టపూర్వ శోభావిశేషంబున నతిరమణీయంబై ప్రకాశింపుచున్నది విలోకింపుము॥ (తే,గీ) పద్మనేత్రయు శ్యామయు భద్రకరటి । యానయు వినీలవేణియు నగుధరిత్రికన్యకనుబాసి మేఁ బనేకరణిపిఫుడు । ప్రాణములుదాల్చియుందు భూపాలతనయ॥ (చ) క్షితిపకపుత్రముఁగల విచిత్ర విశాలమహీరుహాభిశో । భితగిరి సానుదేశములఁ బ్రీతిదలిర్ప మృగంబులంగనా । యుతముగ వేడుక ల్సలుపుచున్నవి కంటివెదుఃఖితుండనై । ధృతిచెడియున్న నాకువల తేనివికారముగల్గఁజేయుచున్॥ (తే,గీ) దశరథకుమార చిత్రపత్రికలిత । మైన యీరమ్యపర్వతసానువందు । భామినీమణినాకుఁగన్పట్టెనేని । యవల నాచిత్తమునకు స్వాస్థ్యంబుఁ గలుగు॥ (క) రవికులవర్ధనయిప్పుడు । ధవళేక్షణనన్నుఁగూడితప్పకపంపా । పవనసమగంధబంధుర । పవనునిసేవించెనేని బ్రతుకుదుఁగాదే॥ (తే,గీ) పద్మసౌగంధికయుతంబు పావనంబు । శోకనాశనమత్యంత సుఖకరంబు । నైనపంపోపవనపవమానసేవ । దొరకొనుటయెట్టివారికి దుర్లభంబు॥ (క) అనఘుఁడు ధర్మవిచా

రుఁడు। జననాథుఁడు సత్యరతుఁడు జనకుఁడు కృపతో । వనజాక్షి సేమమడిగిన । ననఘా యేమందు నమ్మహాత్మునితోడన్ । (తే,గీ) తండ్రిపంపున రాజ్యంబు ధనము విడిచి । యడవి కరుదెంచుచున్న నన్ననుసరించి । వచ్చె నే దేవి యడవికి వదలకట్టి । రమణి లేకున్న నేగతి బ్రతుకువాఁడ ॥ (క) జలజాత నేత్రమవని । మలకాభివిరాజితంబునగు తన్ముఖముం । జెలువలరఁ జూడకుండుట । వల్ల నన్నా మనము దుఃఖభాజనమయ్యెన్ ॥ (క) స్మితహాస్యాంతరయుతమును । హితమతులకు మధురమమృత హితమగు ధాత్రీ । సుతవాక్యమింక నెన్నఁడు । వితతగుణా వీనులలర విననగునాకున్ ॥ (ఉ) ఒక్కొకవేళ మన్మథశరోద్ధతి స్రుక్కుచునున్న నన్ను ము । న్నెక్కుడు ప్రేమఁ జూచి హృదయేశ్వరి యేల కృశించెదంచుఁ దా । నొక్కటఁ గౌఁగిలించి మధురోక్తుల నెవ్వగఁ దీర్చుచుండునేఁ । డెక్కడికేగెనట్టి హృదయేశ్వరి నన్నిటఁ బాసి లక్ష్మణా ॥ (తే,గీ) సీత యెచ్చట నున్నది చెప్పుమనుచు । నడుగఁ గౌసల్యతోడ నేమందునింక । దేవి పోయిన తెరువునఁ బోవువాఁడ । ననఘ భరతుని జూడ నీవరుగుమిపుడు ॥ (చ) అనిబహుభంగులన్ సముదితార్తరవంబున దత్తరింపుచు । న్వననిధియందుఁ దొట్రుపడు నావ విధంబున శోకపారము । న్గనుఁగొనలేక పుష్పశయనంబున దీనత వ్రాలియున్నయ । న్ననుఁ

శ్రీరాముని లక్ష్మణుఁ డూఱడించుట.

గని లక్ష్మణుండనియె నవ్యసుధామయమంజులోక్తులన్ ॥ (తే,గీ) ఘనతరంబగు వాయువేగంబుచేతఁ । గిన్నరిని గూర్చి విలపించు కిన్నరుండుఁ । బోలె దేవరయూషంబు చేబురుషవర్య । మిగుల సీతనుద్దేశించి వగచెదీవు ॥ (తే,గీ) అట్టి లావణ్యవతిఁ బాసినట్టిచోట । శోకమునఁ జించుటకు నేమి చోద్యమధిప । సర్వముఁ బరిత్యజించిన సర్గధర్మ । మరసి సేవించుటది శాస్త్రసరణి కాదె ॥ (క) అనఘాత్మ ధర్మరతుఁడగు । జనునకు దుర్లభము లేదు జగతి నొకింతైన్ । నను స్థిరచిత్తుని ధర్మం । బున కెన్నఁడు నొక్కహాని పుట్టదు తలఁపన్ ॥ (క) సూరిజనవినుత ధారుణి । ధీరుఁడు తగవృద్ధినొందు ధీరుఁడధికుఁడా । ధీరునకు సర్వకార్యము । లారూఢింగూడి వచ్చు ననవరతంబున్ ॥ (తే,గీ) అనఘ నీయట్టి కాలపర్యాయకోవి । దుండు ధీరుండు సంప్రాప్తదుఃఖములకుఁ । దలఁక కసహించియుండును దగ్రవార । వేగమునకద్రి తలఁకక సవిధముదోఁప ॥ (ఆ,వె) శక్రతుల్యవీర్య సంప్రాప్తదుఃఖంబు । నవలఁద్రోయఁ జాలక నవరతము । వంతనొందుచెల్ల స్వల్పశేముషి



యైన । నీచుగుణము గాక నీగుణంబె ॥ (చ) కరగత రాజ్యమంచితసుఖంబత్మానుషభోగవైభవో । త్కరముఁ బరిత్యజించి ఘనతాపసవేషముఁ దాల్చి కాననక । ష్టరుదుగ నేగుదెంచిన మహాత్ముఁడవీవు నరేంద్రచంద్ర కా । పురుషుని మాడ్కి ధైర్యమటు పోనిడి మోహమునొందఁ జెల్లునే ॥ (క) అలఘుచరిత్రా వివేకము । గల పురుషుఁడు లోభమోహకామాదిగుణం । బులనాఁగి పట్టుఁ బ్రజ్ఞా । బలమున సూతుండు హరులఁ బట్టినమాడ్కిన్ ॥ (తే,గీ) మానవేశ్వర నీవు సుజ్ఞాననిధివి । ధైర్యసంయుక్తుఁడవు ప్రమాద్యంబులైన । విషయములయందు హృదభినివేశనంబుఁ । జేసి యిబ్భంగి శోకింపఁ జెల్లదయ్య ॥ (వ) మహాత్మా నీవు మహానుభావుండవు మహనీయశుభచరిత్రుండవు దివ్యబోధ ప్రభావుండవు నాయట్టి యజ్ఞానునకు వివేకంబుఁ దెలుపునట్టి విచక్షణుండవు ప్రాకృతజనంబుల భంగిఁ గామాదివికారంబులం బరిభ్రమింప నర్హుండవుగావు త్వల్లింటి తాల్మివహింపుము వనవాసంబు నిర్వర్తించి భార్యాపహారకుండగు పగతునిం బరిమార్చినవై దేహిం జేకొని క్రమ్మఱ నయోధ్యకుం జని యందు మహోన్నతంబైన సామ్రాజ్యంబు పరిపాలింపుచు మత్సహాయుండవై సుఖింపుము పరాక్రమధుర్యుండవైన నీకు విప్రకారంబుఁ గావించిన దురాత్మున కంతకాలంబు దగ్గఱియె నంతె కాక బ్రతుకంగలఁడే యని పలికి లక్ష్మణుం డన్నరపతి చిత్తంబు ధైర్యాయత్తంబుగా నునికి విచారించి వెండియు నిట్లనియె । (సీ) అమలాత్మ నీప్రభావము నీవెఱుంగక శోకించెదిట్లు లశూరవరుల । కింత దైన్యము చెల్లునే సతీవిరహజ వితతదుఃఖము ననామతము వినవు । క్షితినార్ద్రమైనను స్నేహపరిష్వంగమునఁ జేసి వర్తికాగ్ర కుక్కనదహించుఁ । గావున దద్వియోగజదుఃఖముఁ దలంచి విడువుము స్నేహంబు ప్రియులయందు ॥ (తే,గీ) సీతతోఁ గూడ పాతాళసీమయందు । దితిజవరముదుఁడాఁగిన నతిరయమున । దితిజు వధియించి సీతను దెచ్చియిత్తు । వీరశేఖర దైన్యంబు విడువుమింక ॥ (వ) దేవా శోకంబు సకలార్థనాశనకారణంబు గావునఁ గార్యార్థియగువానికి శోకంబు కొఱగాదు నీయట్టి మహాత్మున కిట్టిమందబుద్ధి దొరకొనిన మముబోంట్లకెల్ల నేమియగు నష్టకార్యరూపప్రయోజనులగు పురుషులచేతనైన నర్థంబు ప్రయత్నంబున నధిగమింపంబడు నుత్సాహంబునకంటె నొండులేదుత్సాహవంతునకు లోకంబున దుర్లభం బెద్దియు లేదుత్సాహవంతులగు పురుషులు కర్మంబునందుఁ బరిభ్రమణంబు నొందరు మ

నముత్సాహమాత్రంబు నాశ్రయించి జానకిం బడయుదము శిక్షితాంతఃకరణు
సంగాఁ బరమాత్మునుగా నిన్ను నెఱింగి కామవృత్తత్వంబుఁ బరిత్యజించి శో
కంబుఁ బిఱిందికిం ద్రోచి యుత్సాహసంపన్నుండవై యుండుమని బోధించిన ల
క్ష్మణునివాక్యంబులం దేఱి రాముండు శోకమోహంబులుపరిత్యజించిధైర్యంబ

—(*) శ్రీరాముఁడు శోక మోహంబులుడిగి లక్ష్మణసహితముగా (*)—

(*) సుగ్రీవునిం జేరఁబోవుట. (*)

వలంబించి యచ్చోటు వాసి రమ్య పారిప్లవవృక్ష షండరుచిరయైన పంపాపు
ష్కరిణి నతిక్రమించి నిర్ఝరకందర సుందరంబైన యవ్వనంబు గలయ నవ
లోకింపుచు సీతావయవ సన్నిభంబులైన పదార్థంబుల నవలోకించి నప్పు
డెల్ల నద్దేవిం దలంచుకొని దుఃఖింపుచు నంతలోన ధైర్యంబు కలిమిఁ దద్దుఃఖం
బునపనయింపుచు మత్తమాతంగ విలాస గమనంబునం బోవుచుండె మహా
త్ముండగు లక్ష్మణుం డవ్యగ్రచిత్తుండును నప్రమత్తుండునై ధర్మంబున బలంబు
న రాముని రక్షించుకొనుచు ననురూపగమనంబునం బోవుచుండె నిత్తెఱంగున
నారఘుసత్తములు సుగ్రీవదర్శనలాలసులై ఋశ్యమూక పర్వత సమీపంబు
నం బోవుచుండి రాసమయంబున ॥ (ఉ) ఆరమణీయశైలశిఖ రాగ్రమునన్వి
హరింపుచున్నపం । కేరుహమిత్ర నందనుఁడు కీశకులేంద్రుఁడు బుద్ధిమంతుఁడు।
ధీరుఁడుదోర్బలాధికుఁడు దివ్యవరాయుధ ధారులన్మహో । దారుల రామల
క్ష్మణుల దవ్వులఁగన్గొనిశంకితాత్ముఁడై॥ (చ) భయమునఁజాలఁదొట్రువడి భూ

—(*) రామలక్ష్మణులను జూచి సుగ్రీవుఁడు భయంబున మంత్రులతో (*)—

—(*) నాలోచించుట. (*)—

వమునన్దపియించిదిక్కుల। న్నియుఁబరికించివిభ్రమత నిల్చినచోటను నిల్వఁకా
తుఁడై । రయమునన్నాత్మలోనగురులాఘవముల్దలపోసివాలిని । దఱయుఁడిటు
పంపవచ్చిరని తద్దయుఁగంపముమేనఁబర్వఁగన్॥ (తే,గీ) శాపభయమున వా
నరేశ్వరుఁడువాలి । పరఁగనెద్దానినిత్యంబుసారఁదలంకు । నట్టి మహనీయ తర
మతంగాశ్రమంబు । సొచ్చిరయమున మంత్రులఁజూచిపలికె॥ (చ) ఇదిబహు
సత్వదుర్గవన మిందుజటాజినచీరధారులై । మదిమునదంభరూపమహి మన్దరి
యింపుచున్నవారువీ । రడలునఁగంటిరేశ్రమ ఖాత్మజచోదితులై రయంబు
న । న్వదలకనాకువిప్రియము నపఁగవచ్చుచున్నవారొగిన్ ॥ (వ) అనిన



సుగ్రీవునిసచివు లచ్చోటువిడిచి రయంబున వేఱొక్క శిఖరంబునకుదాటి మ
హాధనుర్ధరులగు రామలక్ష్మణుల దవ్వులంజూచి గిరిశిఖరంబులన్నియుఁ గల
యందిరిగి భయంబువలన నేకాకియైయున్న యూథపశ్రేష్ఠుండగు సుగ్రీవు నధ
గమించి పూర్వప్రకారంబున నందఱు నేకాయనగతులై దుర్గసంశ్రితంబులై
నపుష్పితద్రుమంబులభంజించి తెచ్చి యంసభాగంబులనలవరించుకొని సింహశా
ర్దూలవరాహాదిక్రూరమృగంబుల వెఱపించుచు సుగ్రీవునింబరివేష్టించిసారెసారె
కునన్నుఱ్ఱాత్తిరామలక్ష్మణులవిలోకింపుచుఁ బ్రాంజలులైకొలిచియుండిరప్పుడువా
క్యకోవిదుండగుహనుమంతుడు వాలికిల్బిషశంకితుండగుసుగ్రీవునవలోకించియి
ట్లనియె॥(ఆ,వె) ఋషకులవరేణ్య,ఋశ్యమూకమిదియి । కొండ పైవసించి
యుండుమ నకు । వాలిభయము లేదు,వట్టిశంకయిదేల । చింతవిడిచి ధైర్య.
శీలివగుము ॥ (క)హరి పుంగవ యెవ్వనిచే । నరయంగఁ బరాజితుండ,వైతి
వినీవా । దురితాత్ముఁడైనవాలిని । బరికింపుము వాని భయము, హాటిలదిచ
టన్॥ (క)పరువడి లఘుచిత్తతచే । నరులకుమ ఆనీకుఁ గలబ, లాబల ములు
నీవె । ఱుఁగని కత మున నిపుడో । హరివర రశా ఖామృగత్వ,మదియే ర్పడి
యెన్॥ (తే,గీ)బుద్ధివిజ్ఞాన యుతుఁడవై, పోలుపుమీఱ । భావ సూచ కవ్యా
పార, ఫణితి సర్వ । మాచరింపుము మతి హీనుఁ, డైనరాజు । సర్వభూ తం

—(*)సుగ్రీవుఁడు రామ లక్ష్మణుల కడకు హనుమంతునిఁ బంపుట.(*)—

బులదమిం పఁ, జాలఁ డధిప॥ (వ)అనినవిని సుగ్రీవుం డాహను మంతున కిట్లని
యె॥ (మ) జలజాతాక్షులు దీర్ఘ బాహులు ధను, ష్పాణు ల్కృపాణుల్మ
రుల్విలసద్రూపులు దేవతుల్యు లగువీ:రింజూచినన్భీతిసం । ధిలదే యెవ్వరి
కైనవాలి పనుప, ధీరోద్ధతి న్భీషణో । జ్జ్వలురైవచ్చుచు నున్న వారనిమది,
న్శంకించెదం బావనీ॥ (క)బహు మిత్రులైన రాజులు । మహివిశ్వాసంబుడ,
క్కిమాయావిదులౌ । విహితులగు సఖులచేఁ బ్రత్య।హమును శత్రువులచంధ
మరయుదు రెందున్॥ (క)పగమున మునినిడి కొని తఱి । యగునంతకు గూఢ
వృత్తి, నరయుచుశూరుం । డగుభూ పతిసుల భంబుగఁ । బగతునినిర్జించు
నొంటి, పాటునసధిపా॥ (క) మారుతి బహుదర్శి యు నగు । భూరమణుఁడు
కపటకృత్య, మునఁబగతునిదు । ర్వారగతిఁ దునుము నిలనది । కారణమున
నట్టివానిఁ, గనుఁగొన వలయున్॥ (వ) మఱియు ననేకోపాయ విశారదుల

గురాజులు దీనవేష ధరులైన భృత్యుల చేతఁ బగితులచంపం బరయ వల
యువాలికృత్యంబుల యందు మేధావి కావున నీవుప్రాకృతవేషధారివై వారి
కడకుం జని భావసూచకాది కాయిక వ్యాపారభేదంబుల సౌమ్యరూప స
ల్లాపంబుల వారిభావంబంతయు విమర్శించి దుష్టస్వభావంబు తోఁచినఁ బ్ర
శంసేంగితంబుల సారె సారెకు విశ్వాసంబుఁ బుట్టింపుచు నాకభిముఖంబు
గా నిలుచునట్లు సంఘటించి యీ వనంబుఁ బ్రవేశించుటకుం బ్రయోజనం
బేమియని యడుగుము ధనుర్ధరు లయ్యును శుద్ధాత్ములుగా గోచరించినఁ
బూర్వ ప్రకారంబున నాభిముఖ్యంబు సంఘటిల్లం జేసి యాగమనం బడుగుము
సర్వప్రకారంబుల వారితోడ సంభాషించి వారల దుష్టాదుష్టస్వభావంబు ప
రీక్షించిరమ్మని పలికిన నమ్మారున్నంజనుండు వంచనబుద్ధిత్వంబున వానర రూపం
బువిడిచి యవధ్యంబైన భిక్షువేషంబంగీకరించి రామ లక్ష్మణులకడకుం బోవస
మకట్టియ వ్వేషంబున మస్కారవిరోధంబని మనంబున శంకించి నిగమనిగదిత న్యా
యంబున వారలదర్శనమాత్రంబున సుగ్రీవవిరోధిని రసనక్షములగుదురని యె
ఱింగి గృహీతవేషాంతరుండైన తనచారత్వంబు ప్రకటింపం జేయుటకునై కావిం
చెడు నమస్కారంబు విరోధంబు కాదని నిశ్చయించి సుగ్రీవుని చేత ననుజ్ఞాతుండై
ఋశ్యమూకపర్వతశిఖరంబుడిగ్గి॥(తే,గీ) వానరత్వంబువిడిచియవధ్యమైన ।భిక్షు

(*)హనుమంతుఁడు సుగ్రీవునిపంపున శ్రీరామలక్ష్మణుల సందర్శించుట. (*)

వేషంబుగైకొనియాక్షణంబ! రాఘవులడాయఁజనివినమ్రుతవహించి ।తత్పదాం
భోజములకు వందన మొనర్చెఁ ॥(తే, గీ)అర్ఘ్యపాద్యాదిపూజనం బాచరించి ।
వినయవినమిత దేహుఁడై యనిలసుతుఁడు । వారిఁగన్గొని మృదువాక్య వైభవ
మున । నతిమనోజ్ఞంబుగాఁగనిట్లనుచుఁబలికె॥ (మ)కమనీయాకృతి యోగ్య తేజ
మునని కాననవ్వాలింగింపుచు । నమముదంచచ్ఛర చాపఖడ్గధరులై సంభూత
హర్యక్షువి । క్రములై రాజిలుచున్న వారు సురలో రాజర్షులో తాపసో । త్తము
లో యెవ్వరు మీరు నాకుఁ దెలియన్నాత్యౌత్సుక్యత న్దెల్పరే॥ (ఉ) చీరజటాజినంబులు
ప్రసిద్ధముగా ధరియించి సారెకు । న్దారుణవైఖరిన్మృగకదంబములన్వెఱపింపు

—(*) హనుమంతుఁడు శ్రీరామలక్ష్మణులను నమస్కరించి (*)—

—(*) వారి వృత్తాంతం బడుగుట.(*)—

చున్నదీ । తీరమహీరుహంబులకుఁ దేజమొసంగుచు నివ్వనంబులో । శూరత



సంచరించుమిముఁ జూచిననాకుఁబ్రమోదమయ్యెడిఁ ॥ (సీ) అతిసుకుమారు
లుహస్తిహస్తోప మభుజులుశ్రీమంతులుపుణ్యనిధులు । సింహవిప్రేక్షితుల్సింహా
దిబలవిక్రములున్నృసింహులు మహాభుజులుధీరు । లన్యోన్యసదృశులభాస్కర తే
జులు తతజటామండలధరులురమ్య । జలజలోచనులువిశాలవక్షులుశత్రు భీక
రమూర్తులులోక నుతులు ॥ (తే,గీ) ముజ్జగంబుల నొక్కట భుజమునం
దు । మోవఁజాలినవారు మీరీవిధమున । విండ్లునమ్ములుధరియించివిపినమునకు ।
నేలవచ్చితిరెఱిఁగింపుఁడింతనాకు॥ (తే,గీ) నాకలోకంబువిడిచి యీలోకము
నకు । నరుగుదెంచినసురలో యంబరమువిడిచి । యిలకువచ్చినచంద్రసూర్యులో
మహాత్మ । లారమీచందమెఱిఁగింపుఁ డయ్యనాకు ॥ (క) వీరులు సింహస్కం
ధులు । దారులుసమదవృషభములు తతరాజ్యార్హుల్ । ధీరులుశూరులుమద
నా । కారులుమీరెవ్వరయ్య ఘనగుణులారా॥ (క)విలసితతేజంబున నీ । శిలో
చ్చయము నీయరణ్యసీమనుబంప । న్వెలిఁగింపుచున్నవారలు । తలఁపఁగమీరె
వ్వరిఁద్ర ధనదులో చెప్పుఁడీ ॥ (తే,గీ) విమలమతులారమీలక్షణములఁజూడ ।
నఖిలరాజ్యంబుపాలింప నర్హులనుచు । డెందమునఁదోఁచుచున్నది పొందు
పడఁగ । నీజడలు వల్కలములు మీ,కేల కలిగె । (తే,గీ)పరిఘ సిభములు దీ
ర్ఘములు, లకారటికరస । ములు భూషణ భూషోచి,తములు నైన । కరము
లేటికి భూషణ, విరహితంబు । లగుచు నున్నవి చెప్పరే. యనఘులార॥ (క)
మేరు విభూషితయునువన । వారిధిపరివృతయు నైన, వసుమతినెల్ల । న్వారకప
రిపాలించుట । కారయమీరిరువులర్హు, లనుచుఁ దలఁచెదఁ ॥ (క)చిత్రాను
లేపనంబులు । చిత్రములగు కార్ముకములు చెలఁగెడు మీకు । స్వత్రారికివ
లెనెంతయు । శాత్రవులకు నేత్రభీతి, జనకము లగుచుఁ ॥ (క)ఉరగముల కర
ణినతిభీ । కరదారుణ జీవితాంత,కరనిశితశరో త్కరపూరితతూణీరము । లురు
తరముగ మిగుల నొప్పి, యున్నవి మీకుఁ॥ (క)తపనీయ భూషితంబులు చప
లంబులుదీర్ఘములును, సవిశేషములౌ । విపులకృపాణంబులుఫణి । కుపమా
నము లగుచు నలరు. చున్నవి మిగులఁ॥(క)అనఘాత్ములారమీరలు । పనివడిబ
హుగతుల నిట్లు, భాషించెదన । న్ననిమాటు వలుక రేటికి । వినుపింపుఁడు
మీసమస్త, వృత్తాంతంబుఁ॥ (సీ)అనఘాత్ములార మ,హాత్ముండు సుగ్రీవుఁ డను
కపిపుంగవుఁ, డర్కసుతుఁడు । భ్రాతృ నిరస్తుఁడై, బహుదుఃఖమున నిలనెల్ల

మ్ముఁడ లక్ష్మణాభిధానుఁడని తని। న్గరమరుదుగ సేవింపుచు। నరుదెంచితివిపిన మునకు,నసురూపముగన్॥ (క)గతరాజ్యుఁడువనవాసా।శ్రితుడగునీరాముపిభుని ప్రియసతిరక్షో। హృతయయ్యె విపినముననా। సతిఁగానక మేము దుఃఖసంతాపమునన్॥ (వ)పరితపింపుచు నరణ్యంబున నన్వేషింపుచువచ్చువార మొక్కయెడ శాపంబున రాక్షసత్వంబునొందియున్న దనుండనువానింగాంచి యతనినడిగిన వాఁడుసుగ్రీవుండను వానరశ్రేష్ఠుండు కలం డతండు మహాబలుండు కావున సీతాపహారియగు రాక్షసునిసాధించుటకు సమర్థుం డతనిఁగానంబనుండని పలికి వాఁడు నాకంబునకుం జనియెఁ దద్వచన ప్రకారంబుననేమిరువురము సుగ్రీవుని సాచివ్యంబుఁ గోరి యిచ్చటికిం జనుదెంచితిమని పలికి లక్ష్మణుండు వెండియు నిట్లనియె॥ (క) ధనిమఘుఁ డెక్కొసఁగియశం। బనువుగనార్జించిజనుల, కధినాథుండై। తనరారురాఘవుఁడుకా। ననచరుసిందలఁచెఁడనకు, నాథునిఁగాఁగన్॥ (క)హరివర యెవ్వఁడు ప్రజలకు। శరణ్యుఁడైయొప్పునట్టి జనపతిసుతుఁడీ। పురుషర్షభుండు రాముఁడు। శరణాగతుఁడయ్యెనృత్తు, చరనాథునకున్॥(తే,గీ) ఎవ్వనిప్రసాదమునజను,లెల్లఁ బరమసౌఖ్యమునఁదేలియాడుచు, సంతసింతురట్టి కరుణాకరుండిమ్మహామహుండు। నగచరు ననుగ్రహముఁ గోరి,నాఁడు నేడు॥(తే,గీ)పనరేంద్రునిచేత ధాత్రీశులెల్లఁ। గరము మానితులైరేలు,గాంతురట్టి। పఙ్క్తిరథ పుత్రుఁడీ రామభద్రుఁ డిపుడు। కీశపతితోడి మైత్రిఁ గాంక్షించినాఁడు॥ (వ) మఱియు మహానుభావుండగు రాముండు శోకార్తుండై శరణంబు నొందుచుండ హరి యూథపుండగు సుగ్రీవుండు ప్రసాదంబొసంగ నర్హుండగునని యివ్విధంబున లక్ష్మణుండు కన్నీరు నించుచు గద్గదస్వరంబునం బలికిన నప్పవమాన నందనుండతనికిట్లనియె॥ (క) మిముబోఁటి పరాక్రమనిధు। లమలాత్ములు బుద్ధిమంతు,లగచరుఁగనె। య్యమెునర్పఁగఁ దలఁచుటల।ద్విమల పురాకృత తపఃప్రవీణత కాదే। (చ)అతఁడునురాజ్యలోభజని,తాగ్రహుఁడైతగువాలిచేఁ దిర। స్కృతుఁడయి రాజ్యమున్విడిచి,। దేవినిఁ గోల్పడి వైరమత్తుఁడై। శతమునమున్న వాఁడటులగాన నవశ్యము మీకుఁ దాసహా। యత నొనరించు భూమితన,యా పరిమార్గణమందుఁ బ్రీతుఁడై॥ (క) అనిపలికి మటలమారుత। తనయుం డనుపమ మృదూక్తి, దశరథ తనయా। యనుమెందుపద్మబాంధవ। తనయుండున్నెడకు మైత్రి,తగఁజేయుటకున్॥ (క) నా



పనిసంతోషముమది। నావిర్భవ మందనమ్మహాత్ముసిఁగడుసం। భావించిగ్రక్కున సుమి। త్రావరసందనుఁడుపలికె రామునితోడన్॥(వ) గేవాసమాగతుం డగు నీ యీకపిశ్రేష్ఠుండు మద్వాక్య శ్రవణసంజాత హర్షణుండై యాసుగ్రీవుండు ను గృత్యవంతుండని పలుకుటం జేసి కృతకృత్యుండవైతి పితం డతిప్రసన్నముఖవర్ణుండై వ్యక్తంబుగా భాషింపుచున్నవాఁడితని వాక్యం బసత్యంబుకాదు సుగ్రీవునిపాలికిం బోదమనిపలికిన నారఘుపుంగవుండు ప్రీతియుక్తుండై యట్లసేయుద మని యీయకొనినమె నిట్లుసుగ్రీవుని సాచివ్యంబున కోడంబడిగమనోన్ముఖులై యున్న యా రామ లక్ష్మణుల విలోకించి పవన నందనుండు భిక్షు

()హనుమంతుఁడు శ్రీరామలక్ష్మణులనుసుగ్రీవునియొద్దకుందోడ్కొనివచ్చుట.()

కురూపంబు విడిచి వానర రూపధరుండై యమ్మహాత్ములం దన పృష్ఠభాగంబున నిడికొని తన్నుఁగృత కృత్యునిం గాఁ దలంచుకొనుచు శీఘ్రంబున ఋశ్య మూకంబునకుం జని యచ్చట రామలక్ష్మణుల డించి యంతకుమున్ను రామ లక్ష్మణ దర్శనసంజాత భయ భ్రాంతుండై ఋశ్యమూకంబు విడిచి తత్సరిసరంబున నతి ఘనంబైన మలయాద్రిమీఁదికి దాఁటియున్న సుగ్రీవునిందోడ్కొనివచ్చి యవ్వానరపుంగవునకు రామలక్ష్మణులం జూపి యిట్లని

—(*)హనుమంతుఁడు సుగ్రీవునికి రామలక్ష్మణుల భావంబెఱింగించుట.(*)—

యె॥ (క) అనఘుండు రాముఁడీఘనుఁ। డనుపమ దృఢవిక్రముఁడు, మహాప్రాజ్ఞుండు। న్జనవిభుఁ డనుజయుతంబుగఁ। జనుదెంచినవాఁడు సత్యసంగరుఁడధిపా॥ (సీ) అగచరోత్తమ యీమహామహుఁడి క్ష్వాకు వంశజాతుఁడు గురువత్సలుండు। దశరథతనయుండు, ధర్మసంవేదియునమితవిక్రముఁడురా, మాభిధానుఁ। డనఘాత్ముఁడగుతండ్రి పనుపునవనమునకరుదెంచిరావణా, సురునిచేత। నాలిగోల్పడి శరణార్థియై నినుఁగాన వచ్చినాఁడీతఁడె వ్వానిచేతఁ॥ (తే,గీ)బృథివి సత్యంబుచేతఁబాలింపఁబడియె। నశ్వమేధశతంబెవ్వఁడాచరించె। నట్టిదశరథునకుఁ బుత్రుఁడగునతండు। నీకు శరణాగతుండయ్యె, నెలఁతకతన॥ (క) నీతోసఖ్యముసేయఁగ। నాతురతన్వచ్చినట్టి యనఘులవీరి। న్ఖ్యాతిగఁజేకొనిరదుసం। ప్రీతులఁగాఁ జేయుమిపుడు, వివిధార్చనలన్॥ (ఉ) నావినివాయుపుత్రు వచనంబుల కెంతయుసంతసిల్లిసు। గ్రీవుఁడు శోకమున్భయముఁ గిల్బిష శంకఁ బరిత్యజించిసు। శ్రీవిలసిల్లమానవశ,రీరముఁదాల్చిరఘుప్రవీరుసం।

భావిత్ముఁ జేసియిట్లనియెఁ, బల్కులఁ దేనియ గ్రమ్ము దేరఁగన్ ॥ (క) ధర్మా
పనీతుఁడ వసియును । నిర్మలమతి వనియు నేఁడు నీగుణములు న । త్కర్మ
ముఁడగు వాయుసుతుచే । నిర్మలి నుపదేశితంబు లయ్యె మహాత్మా ॥ (క)
నగచరుఁడనైన నాతో । జగతీవర నీవు సఖ్య సంబంధ మొన । ర్పఁగఁ గోరినకత
మున నా । కగణిత సౌభాగ్యలాభ,మదియబ్బెఁగదా ॥ (క) భూమీశ నీకు సఖ్యం।
బీమెయి నాతోనొనర్ప నిష్టమె యేని । న్నే ముట్టిబాస సేయుము । నామది సంశ
యము విడిచి నమ్మెదన ధిపా ॥ (క) నా పనితన కరము నను । గ్రీవు

—(*)శ్రీరామసుగ్రీవులు పరస్పరమగ్ని సాక్షికంబుగా సఖ్యముసేయుట.(*)—

నిహస్తంబుఁ బట్టి కీశోత్తమునీ । తోవదలక సాచివ్యముఁ గావించితి । ననుచుపవి
భుఁడు, గ్రక్కునఁబలికెన్ ॥ (చ) పవనజుఁడంత శీఘ్రముననఁ, బావకునిం బ్రణ
యించి తెచ్చిన। న్వివిధ సపర్యలిచ్చి కడు వేడ్కఁ బ్రదక్షిణ మాచరించియా।
ప్లవగవిభుండు రాముఁడు పరస్పర వక్త్ర విలోకనంబుల । న్దవిలి కృశానుసమ్ము
ఖమున, న్సుచివ త్వమొనర్చి రిర్వురున్ ॥ (ఉ) అప్పుడు రాఘవుండు ప్లవ, గాధి
పునిం గరుణార్ద్ర దృష్టుల । న్దప్పకచూచి నీవిపుడు నాకు వయస్యుడవైతి కా
వనం। కెప్పుడు దుఃఖము న్సుఖము, నిర్వురకున్సరిగాఁదలంచియు । ట్లొప్పిన సన్మ
హాభావమున నుండుద మీశిఖి సాక్షికంబుగన్ ॥ (చ) అనవిని సంతసిల్లి ప్లవ,గా
ధిపుఁడొక్కవిశాల సాల శా। ఖను శకలించి తెచ్చి యొక, గండశిలాఫలకంబు మీ
దమె । ల్లన మృదురీతిఁ గాఁ బఱచి రామునితోడ సుఖోపవిష్టుఁడై। తనమది నుబ్బ
చుండె వితతంబుగ ముజ్జగ మబ్బినట్లుగన్ ॥ (తే, గీ) అంతఁ బవమాన నందను
డధిక భక్తి । నొక్క చందన తరుశాఖ నురుబలమున । విఱిచి యాస్తరణంబుగాఁ,
బఱచె నందుఁ । జెలఁగి సౌమిత్రియును సుఖాసీనుఁడయ్యె ॥ (వ) ఇట్లు రామసుగ్రీవులు
వహ్ని సమక్షంబునఁ ద్రికరణశుద్ధిగా సఖ్యంబుఁ జేసి లక్ష్మణ సహితంబుగా ను
చితాసనంబుల సుఖాసీనులై పరస్పర వీక్షణంబులు సేయుచుఁ దనివి దీఱక
యుండిరంత గొంతవడికి సుగ్రీవుండు బాష్పవ్యాకులిత లోచనుండై రాము
నింజూచి మధురమధురాలాపంబుల నిట్లనియె ॥ (సీ) అవనీశ దుష్టాత్ముఁడగు వా
లిచే దిరస్కృతుఁడనై రాజ్యంబు వితతసుఖము । విడిచి యిశ్శైలని గోలుఁ, బడి య
సంబున ఘనతర భయాతురుఁడనై వనంబు సంచరించుచుంటి । తోఁచదింతపుము వచ్చియుండి
నీ మహానుభావుని [illegible] ప్రియతరద విషాద, ముగ్గలించు ॥ దిక్కై [illegible] ఁడ, నీక [illegible]



నలవాలి వలనిభయంబెట్లు, తలఁగునట్లు ॥ (ఆ.వె) కరుణఁ జేసినన్నుఁ గా
చి రక్షింపుము । నాథనాథ యనిన, నరవరేంద్రుఁ । డిట్టులనియె నలఘు హితము

(*)శ్రీరాముఁడు వాలిం జంపెదనని శపథముసేయుట.(*)

చిరజ్ఞత । సొంపుమెఱయ సూర్యసుతుఁ జూడ ॥ (క) ఉపకారి శీలియగు నీ
కుపకారము సేయుటిది సముచితముగాదే । కపినాయక నీపత్నిని । జపలతఁ
గైకొన్న వాలిఁ జంపెదఁగడిమిన్ ॥ (చ) " నుకర సవజ్రసన్నిభము లగ్నిని
భంబులు తిగ్మపర్వము । ల్ఘనతర సర్పతుల్యములు, కాలకటాక్ష సమంబులై
నను । త్సునిశిత సాయకంబు లివె చూడుము గ్రక్కున నీశరంబులం । దునిమె
గవాలి నబ్బలవి, దూరుఁడు వజ్రముచే గిరింబలెన్ ॥ (చ) అనిశపథంబుఁ జేసిన
ని. నాత్మజుఁడా రఘుభర్తమాటకు । న్మనమున సంతసించి జన, నాయక మీరిపు
ఘ్నానతిచ్చిన । ట్లనె యొనరింపుఁడేను సుక, రంబుగఁ బత్నిని రాజ్యమున్సుఖం ।
బును సకలార్థముల్వడసి పొల్పువహించెద మీదయారతిన్ ॥ (క) కరుణాదలి
పణఁగఁ బగతునిఁ । బరిమార్చెదననుచు మీరు పలికిన మాత్ర । న్నరవర సక
లార్థములి । త్తఱిఁ జేకూడెనని చాలఁ దలఁచెద బుద్ధిన్ ॥ (వ) అనియిట్లతఁ
గున సుగ్రీవుండును రాముండును శపథపూర్వకంబుగాఁ బరస్పర కార్యసాధ
నోచితంబులగు వాక్యంబులు ప్రసంగింపుచుండఁ దత్ప్రణయ ప్రసంగంబునందు
రాజీవ హేమజ్వలనోపమంబులగు సీతా వాలి రావణుల వామనేత్రంబు లదరె
నప్పుడుపదంపడి సుగ్రీవుండు ప్రీతచేతస్కుండై రఘునందనునకి ట్లనియె ॥ (సీ) దశర
థసుత నీవు, తండ్రిపంపునఁ బ్రోలు వెడలి ప్రియానుజు, ల్వెంటఁ గొలువ । నడవికి
వచ్చుట, యందొక్క చో మీరలిరుపురు నవ్వల, కేగియున్న । తఱిరావణుండు సీత
నుద్రుచ్చిలించుట యంతయు నీబుద్ధిమంతుఁడైన । హనుమంతుఁడెఱిఁగించె నది

(*)సుగ్రీవుఁడు రామునకు సీతను దెచ్చి యిచ్చెదనని శపథముసేయుట.(*)

పదంపడి మీమ్మునడుగంగ నేల మహాత్మ యింక ।(తే,గీ) నల్పకాలంబునం దెభార్యాని
యోగ । జనితశోకంబు విడిచెదు, సత్వరముగ । వెదకి సాధించి తెచ్చిపు, త్త్వకుమారి।
నిక్కువముగ నర్పించెద, నీకునేను ॥ (ఉ) విశ్రుతకీర్తియైన పృథివీ, సుత దేవనరాహి
రాజిలో । కాశ్రిత యయ్యెనేమి రయమారఁగఁ జేకొని నష్టమైనవే । దశ్రుతి
యట్లు తెచ్చి వితతంబుగఁ దప్పగ నీకు నిత్తుదీ । నాశ్రయ నాదు మాట హృద
యంబున నమ్మి త్యజింపు శోకమున్ ॥ (తే,గీ) అధిప వినుకృతఘ్నమైన భవ్యమును

నేత । నీదుపత్ని నిశాచరజా, ద్యాదినిఖిల । దేవదానవులైనను జెల్ల, మగని । నొక్కఁ గొనఁజాల రిది యెంత నిక్కువంబు॥ (వ) అదియునుంగాక ॥ (శా) ఆకాశంబున రావణాంకగతయై, హా రామ హా లక్ష్మణా । హా కల్యాణగుణోత్తరా యనుచు శోకాక్రాంతయై చీరుచుం । బ్రాకంపింపుచుఁ బోవు జానకిని శైలాగ్రంబుపై నుండి నే । నే కాకుత్స్థకుల ప్రదీపకుతుకం బేపార వీక్షించితిన్ ॥ (శా) ఆ వైదేహి యుమమ్ముఁ గన్గొని స్వకీయానర్ఘ రత్నోల్లస । ద్భూషణాభరణంబు లన్నియును భాస్వత్కాంతు లొప్పార నా । త్రోవం బైఁబడఁ జేఱంగున న్విడిచి యెంతో భీతి మూయుండటం । బారిపుణ్యంబునఁ బాఱవైచి చనియె, నద్దుష్టువరాధీనయై ॥ (ఉ) ఆ రమణీయ భూషణము, లన్నియుఁ గైకొని మేము దాఁచి యు । న్నారము తెచ్చి చూపెద ఘనంబుగఁ దన్మహనీయవైఖరు । ల్సారె జనస్తుతా గుఱుతు, చూచికొనం దగునంచుఁ బల్కఁగా । నా రఘుభర్త తెమ్ము ప్లవగాధిపతీ తడవేల నావుడున్ ॥ (చ) హరివరుఁ డంత శీఘ్రమున, నద్రిగుహాంతరసీమఁ జొచ్చియం । దరువుగ దాఁచి యున్న వివిధాభరణంబుల మూటఁ దెచ్చి దా । శరథికి విచ్చి చూపుటయుఁ, జయ్యన నా రఘునేత తద్వరా । భరణములందు దీయ

(సుగ్రీవుఁడు సీతాదేవి తమవద్ద వైచిన భూషణంబుల రామునకుఁ జూపుట.)

మృదుపావన చేలముఁ జూచి దీనుఁడై ॥ (శా) ఈ హారంబులు సీత హారములె సుమ్మీ యంచు లక్షింపుచు । న్నీ హారంబునఁ బంకజారి క్రియ నెంతే బాష్పసంరుద్ధుఁడై । మోహంబగ్గలమందఁ బైకొనిన సమ్మూర్ఛన్ విశేషించి హా । నీహారాంశుముఖీ యటంచు నొరగె న్నిల్వోపలే కుర్విపై ॥ (వ) ఇట్లు ప్రియాభరణసందర్శన సంజాత శోకమూర్ఛాపారవశ్యంబునఁ బుడమిం బడి కొండొకసేపునకు లబ్ధసంజ్ఞుండై బిలస్థంబగు పన్నగంబు చందంబున రోఁజుచుఁ దనయట్ల

## రాముఁడు సీతాదేవియాభరణంబుల లక్ష్మణునికిఁ జూపుట.

బాష్పపూరితముఖుండై దుఃఖింపుచున్న సౌమిత్రి నవలోకించి ॥ (మ) జననాథాత్మజ కంటె భూమిసుతచే, సంత్యక్తమైనట్టి యీ । తనదివ్యాభరణంబులు న్విమలచిత్రక్షౌమచేలంబున । న్ఘనుజుం డెత్తుకపోవుచో గుఱుతుగాఁ, దన్వంగి మైసొమ్ములీ । ఘనశైలంబునఁ బాఱవైచి చనెనిక్కంబింత చింతింపఁగన్ ॥ (వ) మఱియు నీయనర్ఘరత్నాభరణంబు హరితతృణవంతంబైన మృదు మహీస్థలంబున నుత్సృష్టంబులగుటం జేసి యవికలరూపంబులై యున్నవి లో



కింపుము॥ (క) నరవరసుత యీ సొమ్ములు । గుఱుతెఱుఁగు మెయనిన నతఁడు గూరిన శోక । స్ఫురణము మీఱఁగ నద్దిన । కరవంశాంభోధి చంద్రుఁ గని యిట్లనియెన్ ॥ (తే.గీ) అధిప యీ కమనీయరత్నాంగదములు । నీరుచిరకుండలంబులు నే నెఱుంగ । ననవరతముఁ బాదాభివందనమువలనఁ । బదకటకనూపురము లెఱుంగుదు మహాత్మ ॥ (ఉ) నావిని రాఘవుండును మనంబున మోహము నివ్వటిల్లఁ సు । గ్రీవునిఁ జూచి నీవెచటఁ బృథ్వీసుతం గనుఁగొంటి వప్పుడా । రావణుఁ డెందుఁ బోయెఁ గపిరాజ తదీయనివాసమెద్ది వాఁ । డే విధి సంచరించుఁ జల, మెంత బలంబది యెంత జెప్పుమా ॥ (ఉ) దోషమటంచు నించుకయుఁ, దోఁచక దైత్యుఁ డపాంసులాశిరో । భూషణమైన జానకిని బ్రుచ్చిలి చేకొని యేగె వాఁడు మ । ద్రోషమున న్సమస్తజన, దూషితుఁడై త్రుటిలోన నింకని । శ్శేషముగా నశించు హరి, శేఖర యెంతబలంబు గల్గినన్ ॥ (తే.గీ) అనఘచరితమద్భార్యాపహారియైన । రిపునిఁ బేర్కొను మిప్పుడె, విపులవిశిఖ । దహనహేతులవాని దగ్ధంబుఁ జేసి । సత్వరంబుగఁ బంపెద శమనపురికి॥ (వ) వానరేంద్రా

(సుగ్రీవుఁడు రామునితో రావణ నివాసాదికంబు తా నెఱుంగనని చెప్పుట.)

యే నెద్దాని నిమిత్తంబున సర్వరాక్షసుల నాశంబుఁ గావింప నుపక్రమించితి నట్టి సీతను రాక్షసుండు జీవితాంతంబుకొఱకు ప్రుచ్చిలికొని చనియె నద్దురాత్ముండపావృతంబైన మృత్యుద్వారంబుఁ బ్రవేశింపంగలఁడని యిట్లు పరమార్తుండై పలికిన రామునివచనంబు విని సుగ్రీవుండొక్కింత సేపు తనలోన విచారించి యీ రాముండు మిక్కిలి వ్యసనియై యున్నవాఁడే నురావణుని నివాసంబును దత్పరాక్రమాదికంబు నెఱుంగనని యంటినేని యిప్పుడే రావణవధార్థంబు ప్రయత్నంబు గావింపుదమని పలుకు వానర బలంబులం గూర్చి కాని సీతాన్వేషణ రావణవధాదికంబు గావించుటకు శక్యంబై యుండదు వాలిరాజై యుండుటవలన వానరులందఱుఁ దద్వశంగతులై యున్నవారు వారందఱు మదధీనులగుటది మిక్కిలి దుర్లభంబందుఁ గొందఱ నుపాయబలంబున స్వాధీనులం గావించుకొని కార్యయత్నంబుఁ గావింపుదు నంటినేని వాలికి రావణునకుం గల సఖ్యబంధంబువలన వాలి మన్మనోరథంబు సిద్ధింపకుండు నట్టితెఱం గాలోచించి ప్రవర్తించుదానం జేసి యుభయకార్యభంగంబగుఁ గావున మొదల రామునివలన వాలివధపూర్వంబుగా వానరరాజ్యంబు నధిగమించి పదంపడి వానర

బలంబులం గూర్చి సీతాన్వేషణాది కార్యంబుఁ గావింపుదుఁ గాక యనినిశ్చయించి కేలుదోయి ఫాలంబునం గీలించి గద్గదకంఠుండై యిట్లనియె ॥ (సీ) అనఘాత్మ దురాత్ముఁడగు రావణుని భుజవిక్రమంబును వాని విపులబలము । వానినివాసంబు, వానిశౌర్యంబును వానిరూపమెఱుంగ, దానికేమి । మునుకొని ముల్లోకములనెందు డాఁగిన శోధించి రావణాసురునిఁ బుత్ర । మిత్రయుతంబుగా నెయికొని చంపి సీతను దెచ్చియిచ్చెద, దానికైన ॥ (తే,గీ) యత్నమొనరించెదను మది, నడలుదక్కి । ధైర్యమలవడ సుస్థిరోత్సాహపరుఁడ । వగుము నీయంతవారల, కర్హమగునె । రాజకులవర్య యీబుద్ధిలాఘవంబు ॥ (చ) అరయఁగ నేను బ్రాకృతుఁడ నయ్యు వనాటుఁడ నయ్యు దేవ దు । స్తరమగు గేహినీవిరహజవ్యసనంబది యెంత వేఁచిన । న్దరలక తాల్మి పీడకము, నంబున ధైర్యము నూఁదియుండఁగా । నిరవగు ధైర్యశాలివగు । నీవిటులాడుట కేమి చెప్పుదుర్ ॥ (వ) దేవా నీవు మహాత్ముండవు వినీతుండవు సమాపతితంబైన బాష్పంబులు ధైర్యంబువలన నిగ్రహించుట కర్హుండవు మఱియు నర్థకృచ్ఛ్రంబులయందును వ్యసనంబునందును జీవితాంతకరంబైన భయంబునందును ధృతిమంతుఁడగువాఁడు తనబుద్ధిచేత విమర్శించి నశింపకుండు నేనరుండేని బాలిశుండై నిత్యంబును వైక్లబ్యంబు నవలంబించునట్టివాఁడు సలిలంబునందు భారాక్రాంతంబైన తరణికరణి శోకాంబుధియందు నిమగ్నుండగు నెవ్వండు శోకంబు ననుసరించి వర్తించునట్టివాని కెన్నటికి సుఖంబు లేదు వాని తేజంబు దినదినంబునకు నశియింపుచు వచ్చు నతండు జీవించుటయె దుష్కరంబై యుండుఁ గావున భృత్యుండనైన నా యంజలిం బ్రతిగ్రహించి శోకంబు విడిచి ధైర్యంబు నవలంబించి సుస్థిరోత్సాహసంపన్నుండవగు మేను వయస్యభావంబున హితంబుఁ బలికితిఁ గాని యుపదేశించినవాఁడనుగాను మదీయవయస్యత్వంబును సన్మానించి శోకంబు విడువుమని పలికిన మధురంబగు సుగ్రీవునివచనంబులం దేఱి బాష్పపరిక్లిన్నంబైన వదనంబు వస్త్రాంతంబునం దుడిచికొని వేదండశుండాదండమండితంబులగు బా

—(*)రాముఁడు సీతాదేవి నన్వేషింప వలయునని సుగ్రీవునితోఁ జెప్పుట.(*)—

హుదండంబు సాఁచి సుగ్రీవునిం గౌఁగిలించుకొని రామభద్రుండు భద్రవాక్యంబుల నిట్లనియె ॥ (సీ) చండాంశుతనయ మిత్రుండవు హితుఁడవు స్నిగ్ధుండవైన నీచేత నద్ది । కర్తవ్యమదియయుక్తంబుగా ననురూపముగ ననుష్ఠితమయ్యెఁ,



దగవు మెఱయఁ । బలికిన నీమాట, పరమశోకాక్రాంత హృదయుండనగు నన్ను ముదితుఁ జేసె । నిట్టికాలమున నీ, యట్టిచుట్టము నాకు దొరకొను టెంతయు దుర్లభంబు ॥ (తే,గీ) గాదె యొకజాగు సేయుట, గాదు వేగ । నవనిజాపరిమార్గణ, మందు నీవు । యత్నమొనరింపు మరిని గీటడఁచునట్టి । తెఱఁగు చింతించి చెప్పుము తెల్లముగను ॥ (క) హరివరశిఖిసాక్షికముగ । సరుపుర మన్యోన్య మిప్పు, డిచ్చినబాస । లరుగక సన్నృతములాడక । నెఱవేర్చిన మీఁదఁ గాదె, నెగడు శుభంబుల్ ॥ (వ) కపీంద్రా యిప్పుడు నాచేత ననుష్ఠింపందగిన కార్యంబెయ్యది గలదు దాని నెఱింగింపుము వర్షాకాలంబునందు సుక్షేత్రంబునందుం బోలె నాయందు సమస్తంబును సంపన్నంబై యుండు నిప్పుడు నాచేత నభిమానంబునఁ బలుకంబడిన వాక్యంబు యథార్థంబని యెఱుంగుము మున్నెన్నండును నాచేత ననృతంబు సమీరితంబైన యదిగాదిప్పుడు మత్ప్రాణంబు సాక్షిగా సత్యంబుఁ బలికితినని యిట్లు సుగ్రీవవిశ్వాసార్థంబు శపథపూర్వకంబుగాఁ బలికిన న్నరేంద్రుని ప్రతిజ్ఞావచనంబు విని సుగ్రీవుండు సచివసమన్వితంబుగాఁ బరమప్రీతుండై స్వకార్యంబంతయుఁ గృతంబయ్యెనని తలంచి రామభద్రు నభినందించె నిట్లు రామసుగ్రీవు లన్యోన్యసదృశులై యేకాంతంబునం గూడుకొని యెఱమరలేని చిత్తంబున నొండొరుల సుఖదుఃఖములఁ దలపోయుచుండి రంతఁ గొంతసేపునకుఁ బద్మినీకాంతనందనుండు సౌమిత్రి వినుచుండ సీతాకాంతున కిట్లనియె ॥ (మ) అమరేంద్రాదులకైన దుర్లభము గోత్రాధీశ నీతోడి స । ఖ్యము నాభాగ్యవశంబునం గలిగె ని, క్కంబింత యుష్మత్కృపా । సుమునం గోరక యేల భించు నిఖిల, స్వారాజ్యమైనన్ సురా । జ్యము చే కూడుట యెంతవింత విమతత్రాణాధ విధ్వంసకా ॥ (చ) అకలుషచిత్త నీగుణము, లైనను పెంపఁగఁ జాల నట్టి న । న్నొకసరివానిఁ గాఁ దలఁచి యుత్తమ వత్సలతం గృశానుసా । క్షికముగ వేడ్కతోఁ జెలిమిఁ జేసితివేమన వచ్చు నీగుణం । బు కమలమిత్రవంశమణి పొందెద సౌఖ్యము నీదయారతిన్ ॥ (తే,గీ) అధిపక్రమమున నితఁడు మాకర్హసచివుఁ । డనుచు నను మీ తెఱింగెద రాత్మలోనఁ । బరఁగ నిప్పుడు నేనిట్టివాఁడ ననుచు । భానుకులవర్య నీమ్రోలఁ బలుకఁ జాల ॥ (తే,గీ) ఆత్మవంతుల భూరిధైర్యంబుకరణి । ననఘ మీయట్టి శుద్ధాత్ములైనవారి । ప్రీతి నిశ్చలమై యుండు భూతలమున । శిష్టధర్మంబులవి నీకుఁ జెప్పవలెనె ॥ (తే,గీ) రజతమైనను మఱి మహారజతమై

న। నిరుపమానవిభూషణాంబరములైన। సాధుజనులవియెల్లను సాధుజనులు।
తమవియట్లభావింతురు విమలచరిత॥ (తే,గీ) దోషియైననుమఱియునిర్దోషి
యైన। నాఢ్యుఁడైననుగడుఁబేదయైనసుఖితుఁ। డైనదుఃఖితుఁడైనమహానుభా

()సుగ్రీవుఁడు వాలింజంపి తనదుఃఖంబుఁ బాపుమని రామునిఁబ్రార్థించుట()

వ। పరమగతిమిత్రుఁడొక్కండె ధరణియందు ॥ (ఆ,వె) సుఖమువిడిచియైన
సురుచిరభోగంబు। విడిచియైన ధనమువిడిచియైన। మేనువిడిచియైన మిత్రుని
కార్యంబు। చక్కఁజేయుటదియు సఖ్యవిధము॥ (వ) అనియిట్లు బహుప్రకా
రంబుల వాసవసన్నిభుండైన లక్ష్మణుండు వినుచుండ సాచివ్య సామరస్యంబు
వక్కాణింపుచుఁ దొల్లింటియట్ల వేఱొక్క చోటఁ బర్ణబహులంబైన సాల
విటపంబు విఱిచితెచ్చి యాస్తరణంబుఁగావించి దానియందు రామసహితం
బుగా నాసీనుండయ్యె హనుమద్విరచితంబైన పర్ణమయాస్తరణంబునందు
లక్ష్మణుండు సుఖోపవిష్టుండయ్యె నిట్లుయథాసుఖంబుగా నాసీనులైయున్న స
మయంబున నాసుగ్రీవుండు రామభద్రు నవలోకించి దేవా యేను వాలిచేత
నిరాకృతుండనై హృతదారుండనై భయంబుగొని యీఋశ్యమూకపర్వతంబు
నాశ్రయించియున్నవాఁడ నీవుసర్వలోకాభయంకరుండవు వాలివలన భయా
ర్తుండనై దిక్కఱియున్ననాకుఁ బ్రసాదంబొసంగుమని మధురాక్షరవ్యక్తం
బుగాఁబలికినఁ దేజస్వియు ధర్మజ్ఞుండును ధర్మవత్సలుండు నగు రాముండు
సుగ్రీవునివచనంబువిని స్మితపూర్వకంబుగా నిట్లనియె॥ (తే,గీ) జగతినుపకృ
తిమిత్రలక్షణమపకృతి। శత్రులక్షణమటుగాన సాధుచరిత। చెలఁగి నీపత్నినప
హరించినదురాత్ము। వాలినివధింతునిక్కంబు వలదుశంక॥ (వ)అనిపలికిన రా
ముని వచనంబువిని సుగ్రీవుండు వెండియునిట్లనియె ॥ (సీ) అవనీశ యేనుశో
కాభిభూతుఁడనైతి దీనులకెల్లనుదిక్కునీవ। పావకుఁగఱిఁజేసిపాణిప్రదానంబు
చేవయస్యుఁడవైతివీవటంచుఁ। బలికితి వేనును బదపడినీయట్ల బాసయిచ్చితిన
దిపట్టితాల్మిఁ। బూనియుండకచిచ్చుఁబోలినగేహినీ విరహతాపమునన్ను వెత
లఁబెట్టె॥ (ఆ,వె) సైఁపలేకసారెసారెకుభ్రమఁగొని। పలుకుచున్నవాఁడఁబర
మకృపను। నెగులుఁబాపినన్నునిత్యసుఖాత్మునిఁగానొనర్చియశముఁ గాంచుమ
ధిప॥ (వ) అని నిజాభిప్రాయంబు విన్నపించి యంతకంత కగ్గలంబైన శోకం
బున గద్గదకంఠుండై పలుకనేరక నదీవేగంబుచందంబునం బఱతెంచు బాష్ప



వేగంబును వదనంబునం బ్రమార్జింపుచు నిట్టూర్పులువుచ్చుచుఁ గొండొక
ధైర్యంబున నదియడంచుకొని వెండియు రఘువల్లభునకిట్లనియె॥ (సీ)మున్ను
నిష్కారణంబుగ వాలినాతోడ వైరంబుఁగొని పాపవర్తనమునఁ। గదిసిప్రా
ణంబులకంటెగరీయసి యైనమద్గేహినినపహరించి। మిత్రులనందఱమెయిఁగొని
బంధించి కడువడిననుఁబ్రోలువెడలననిచె। బలవంతుఁడగువానిచలమునకోర్వ

### సుగ్రీవుఁడు తనమంత్రుల రామునికిఁజూపుట.

క యేనిందుఁదగవసియించియుందు॥ (తే,గీ) నంతటనుమానకతఁడు బలాఢ్యు
లైన। వారిననుజంపఁబంపినవారినెల్ల। నామమడఁచుచునెప్పటికేమొయనుచు।
భీతిఁగొనియుందు మదిలోనఁబ్రీతిదక్కి॥ (క) అనఘాత్మయేనునినుఁగని। పెను
పుగనిశంకచేత భీతుఁడనగుచుం। గనుకనిఁబఱచితిజనమిలఁ। బనివడిభయహే
తువందు భయపడుఁగాదే ॥ (క) అతఁడెంత కీడుఁజేసిన। క్షితినాయక వీరున
న్నుఁజేకొనినిత్యం। బతులితగతిరక్షింపఁగ। బ్రతికితినిన్నాళ్లువగకుఁబొల్పడకుం
డన్॥ (వ) అనిపలికి మంత్రులంజూపి వారిలో విశేషంబెఱింగించువాఁడై వెం
డియునిట్లనియె॥ (ఉ) మానుగనీతిశాలి ధృతిమంతుఁడు నీహనుమంతుఁడుండఁ
గా। నేనుభయంబునుంబొరయ కెంతయుసుస్థితినున్నవాఁడనో। మానవనాథ
యీతఁడుస మంచితభక్తినహర్నిశంబునుం। బూనుకనిత్యమేమఱక ప్రోచుచు
నుండుననేకభంగులన్॥ (వ) మఱియు నితం డేనునిలిచినచోటనిలుచుచునన్నె
డఁబాయక వెంటవచ్చుచు నయ్యైసమయంబుల నన్నురక్షించుటకుం జేసినస
దుపాయంబులు పెక్కుగల వవియన్నియుం బేర్కొనుటకుంజాల నిప్పుడు సం
క్షేపంబుగా నెఱింగించితి నింక మదభిప్రాయంబువినుము॥ (ఉ) నాకులపత్నిఁ
దక్కఁగొని నన్నుఁబరాజితుఁ జేసియంతటం। బోకటు జీవితంబెడపఁ బూనిన
నాపగవానివాలిన। స్తోకశిలీముఖ ప్రహతిఁ ద్రుంచిరయంబునఁ గూలవైచినం।
గాకమదీయచిత్తమునఁ గల్గినతాపముతీఱిపోవునే ॥ (వ) నరేంద్రా నాసుఖం
బును జీవితంబును వాలివినాశనిబంధనంబని తలంచెదఁ దద్వధంబె శోకార్తుం
డనైన మదీయశోకంబునకుఁ దరియని యెఱుంగు మేను శోకాతురుండనై నివే
దించితిననిపలికి వెండియునిట్లనియె ॥ (క) కరమాపదవచ్చినతఱి। నరనాయ
కధాత్రిసచివు నకుసచివుండే। శరణంబటుగావుననా। కరయఁగ నీవెగతి గాక

()రాముఁడు సుగ్రీవుని వాలికిని వానికిని విరోధమునకుఁ గారణంబడుగుట.()

యన్యులుగలరే॥ (ఉ) నావిని రాఘవుండు కపినాయకుఁ గన్గొని నీకు వాలికి । న్వా విరిఁ జెల్మివోయి పగ వచ్చిన కారణ మేమి చెప్పునా । కావిధ మంతయున్ విని బలా బలములు దిలకించి చెప్పెద । నీవిటు గుందుచుండ మది నెవ్వగ నాకును నివ్వటిల్లె డిన్ ॥ (చ) చతురతసాయకాసనము సజ్యము సేయకమున్నె తద్గుణ । చ్యుతయ మరాట్కటాక్షతులితోగ్రశరంబుసురేంద్రసూతిను । ద్ధతబలశాలి వాలిని వధింపకమున్నె వనాటవర్యనీ । కతనికిఁ దీర్పరానిపగ యైనవిధంబది యంతఁ జెప్పుమా ॥ (వ) కపీంద్రా భవద్భార్యాపహారియగు వాలి నిప్పుడె వధించెద నీకు విప్రకారంబుఁ గావించిన శాత్రవుని మీఁదఁ బొడమిన యమర్షంబు బలవంతంబై ప్రావృట్కాల సలిలవేగంబుకరణి మచ్చిత్తంబున నంతకంతకగ్గలంబగుచున్నది మదీయతూణీరగతంబులైన సాయకంబులివె చూడుము స్నిగ్ధ తేజంబులై ప్రశస్తంబులై కుమారోత్పత్తి స్థాన శరవణోత్పన్నంబులై హేమ విభూషితంబులై కంకపత్ర ప్రతిచ్ఛన్నంబులై మహేంద్రాశని సన్నిభంబులై నిశితాగ్రంబులై సరోషంబులగు పన్నగంబులలీలం గ్రాలుచున్న వీశరంబులం గృతకిల్బిషుండైన వాలిని శైలంబునుం బోలె మేదినిం గూలవైచెదనని పలికిన నవ్వానరోత్తముఁడు రాముని వచనంబులు విని మంత్రిచతుష్టయసమన్వితంబుగాఁ బరమానందంబు నొంది వదనంబున నభూతపూర్వ తేజోవిశేషంబు పల్లవింప నమ్మహాత్ము నవలోకించి దేవా వాలికి నాకును వైరంబు గలిగిన విధంబంతయు విస్పష్టంబుగా విన్నవించెద వినుమని యిట్లనియె ॥ (సీ) అనఘాత్మ మాయన్న, యగు వాలి మునుతఁడ్రికభిమతుండగుచు నా,యందుఁ జాల । వత్సలత్వము గల్గి,వర్తింపుచుండ మాయయ్య దీక్షిన వెన్క,నఖిలమంత్రు । లతని వానర రాజ్య,మందభిషిక్తునిఁ జేసిన నతిధర్మ,శీలియగుచు । నేను శిష్యుని మాడ్కి,నెప్పుడుఁ దనుఁ గొల్వ లీలతో సామ్రాజ్య,మేలుచుండె ॥ (తే,గీ) నంత నొకనాఁ

—(*) సుగ్రీవుఁడు రామునకు వాలికిం దనకును విరోధమునకుఁ గారణ(*)—

## (*) మునెఱింగించుట. (*)

దుదుందుభి,యన్న మయుని । కొడుకు మాయావియనువాఁడు, కడిమిగలుగు । వాఁడు స్త్రీకారణంబున వైరమెత్తి । సత్వరంబుగ నొకనిశా, సమయమందు । (శా) కంధుల్ మ్రోసినభంగి భీమరవ మా,కాశంబు భేదింపగ । ర్వాంధుండా యసురుండు రౌద్రమున ఘో,రాకారుఁడై పేర్చి కి । ష్కింధాద్వార ముఁజేరి వాలిని జయ,శ్రీలోలుఁ దా రామనో । బంధుం గ్రొవ్వున నాజికిం బిలిచె ఘం,భద్వీర్యసంరంభియై ॥ (ఉ) ఆనినదంబు కర్ణపుట,మంటిన దిగ్గన మేలుకాంచియ । వ్వానరవంశదీపకుఁడు, వాలి రయంబున లేచి కాంతలున్ । నేను నురాత్రిఁ బోకుఁడని నిల్పిన నిల్వక ద్రోచిదానవుం । బూని వధింపశీఘ్రమున నేఁ బోయె మహాబలశాలి గావునన్॥ (క) ఒక్కని పోకకుఁ దలఁకుచు । నక్కఁగ వాసవికిఁ గూచున్ సోహార్దమునం । దక్కక నేఁబోసటఁ గా । రక్కసుపై కరిగితి నిదిరంబగు కడిమిన్॥ (వ) ఇట్లు గూడుకొని సంరంభవిజృంభణంబునం బఱతెంచు మాయిరువుర దవ్వులం గాంచి యారక్కసుండు జాతసాధ్వసుండై యాకంపించుచు నాక్రందనపూర్వకంబుగాఁ బాఱందొడంగిన నేమిరువురము నిలునిలుమని యదల్చుచు పిఱుందం దరిమితి మప్పుడు సముదితుండైన చంద్రుని చేత మార్గంబు ప్రకాశీకృతంబైయుండె నిత్తెఱంగునఁ బలాయితుండై రాక్షసుండు తృణంబుల చేతఁ గప్పంబడి దుర్గమంబై యున్న యొక్క ధరణీవివరంబుఁ జొచ్చుటయు వానిం జూచి వాలి రోషవివశుండైనీ వీబిలద్వారంబున సమాహితచిత్తుండవై కాచికొనియుండు మేను బిలంబులోనికిం జని రాక్షసుని వధించి వచ్చెద నావచ్చునందాఁక నిచ్చటనే యుండుమని పలికి సహప్రవేశంబునందు నాచేతఁ బ్రార్థితుండయ్యు నంగీకరింపక పాదస్పర్శనపూర్వకంబుగా నాచేతఁ బ్రమాణంబు సేయించి శీఘ్రంబున బిలంబు సొచ్చె నేనతని శాసనంబున బిలద్వారంబుఁ గాచికొనియుండునంతకు నొక్కసంవత్సరంబు కడచనియె నక్కాలంబునకు వాలిరాకున్న మృతుండయ్యెనని శంకించి స్నేహసమాగత సంభ్రమంబున దుఃఖింపుచునుండఁ గొండొక కాలంబునకు సఫేనబుద్బుదంగు శోణితంబు బిలంబు నిండి వెలికుబ్బి పాఱెఁ బదంపడి రాక్షసుల భయదాట్టహాస నిర్ఘోషంబు వినంబడియె నదియంతయుం బరికించి॥ (తే,గీ) అక్కటా వాలి మృతుఁడయ్యెనని తలంచి । యసురుఁడిట కెత్తివచ్చునో యనుభయమునఁ । బెద్ద పాషాణ మొక్కటి బిలము వాఁత । వైచి నేఁ గిష్కింధకు వచ్చియుందు॥ (వ) వాలివృత్తాంతంబు కొండొకసేపు చెప్పక యతిప్రయత్నంబున మంత్రులకుం దక్కిన వారికిం జెప్పి॥ (క) మది శోకమడర వాలికి । నుదకక్రియ లాచరించి యున్నంతన నుం । బిదపఁ గపిరాజ్యపదమున । కధినాథునిఁ గా నొనర్చి రార్యులు మంత్రుల్॥ (వ) ఇట్లనుష్ఠితరాజ్యాభిషేకుండనై యున్న యవసరంబున నవ్వాలి పగతుండగు

నేఁడు ॥ (తే,గీ) నీదుపత్ని నిగ్రహించి కొన్న నీచచరితుఁ । డార్యచారిత్రదూషకుం డైనవాలి । పరగ నాదృష్టిపథమునఁ బడినదాఁక । బ్రతికియుండు నవ్వలవాఁడు బ్రతుకలేఁడు ॥ (తే,గీ) ఆత్మవత్సర్వభూతాని యనెడున్యాయ । మార్గమున నిన్ను దుఃఖాబ్ధి మగ్నుఁ గాఁగ । నెఱుఁగుదుఁ దరింపఁ జేసెద నింక మీఁద । బుష్కలం బైన కామంబుఁ బొందఁగలవు ॥ (క) అనవుడు ఘనపౌరుషవ । ర్ధనము మధుర మాత్మమోహితంబగు రఘువ । ర్యునివాక్యము విని రవినం । దనుఁ డిట్లని పలికె వినయతాత్పర్యమునన్ ॥ (చ) అరిమర లేదు నిక్కము యుగాంతదివాకరుఁ డీజగంబులన్ । దరికొని యేచునట్లు నిశితప్రదరంబుల వాలినాజిలో । నురుగతి వ్రేల్మిడిం దునుమ నోపుదు వైనను వానిశౌర్యమున్ । గురుభుజశక్తియుక్ధృతియుఁ గోరి వినం దగు నీకుఁ దెల్పెదన్ ॥ (వ) మహాత్మా నావలనఁ దత్పరాక్రమాదికంబు విని యవ్వలఁ గర్తవ్యకార్యంబు నిశ్చయింపు మని పలికి యిట్లనియె ॥ (చ) పడమటివార్ధినుండి నరపాలమణీ యలపూర్వపయోధిక । ట్టుడుగక దక్షిణాంబుధి నుండి రయంబున నుత్తరాబ్ధికిం । గడువడి నశ్రమంబున జగన్నయనుండు దయించు నంత కిం । పడర నతిక్రమించి విమలార్ఘ్యమొసంగును దజ్జలంబులన్ ॥ (చ) ధరములమీఁది కెక్కి పడిఁ దచ్ఛిఖరంబులు దోర్బలంబునం । బఱికి నభంబుమీఁది కెగ మీటుచుఁ గ్రమ్మఱఁ జేతఁ బట్టుచున్ । సురగిరిధీరుఁ డానముచిసూదనపుత్త్రుఁడు క్రీడసల్పుఁ డాఁ । గరమనురక్తి బాలకుఁడు కందుకకేళి యొనర్చుకైవడిన్ ॥ (ఆ,వె) మఱియు నతనికఠిన చరణఘట్టనమునఁ । బిండియగు సమస్తగండశిలలు । భూరిసార

## (*)సుగ్రీవుఁడు రామునికి వాలిదుందుభిని వధించినవృత్తాంతంబుఁ దెల్పుట. (*)

మైన యూరువేగంబున । విఱిగికూలు బ్రబలతరువులెల్ల ॥ (సీ) సమదనాగసహస్రసత్త్వుఁడు కైలాసశిఖరతుల్యుఁడు నరోత్సేకపరుఁడు । దుందుభియను నొకఁడు దుష్టదైత్యుఁడు లులాయాకృతిఁ గైకొని యబ్ధిఁ గదిసి । తనతోడ సంగరంబునకు రమ్మని పిల్వ నతఁడు సమ్ముఖీభూతుఁడగుచు నాకు । నీతోడఁ బోరాడ నేర్పు లేదట్టి బలాఢ్యునిఁ జెప్పెద నభవుమామ ॥ (తే,గీ) యచలనాథుఁడు హిమవంతుఁ డనఁగ దనరు । నతఁడు నీతోడఁ బోరాడ నర్హుఁ డగును । మసిన శరధిభీతుఁ డయ్యె నని తలంచి । రాక్షసుండేఁగెఁ బర్వతరాజుకడకు ॥ (వ) ఇత్తెఱంగునఁ జాపచ్యుతం బైన శరంబుపగిది భీషణరభసాతిరేకంబున హిమవంతుని డాయం జని తదీయవిపులశిఖరంబులు కొమ్ములం జిమ్ముచు గిరినిర్ఝరకందరంబులు ఖురాగ్రంబులం గోరాడుచు భైరవస్వనపూర్వకంబుగా నట్టహాసంబుఁ జేసిన నగ్గిరిరాజు శ్వేతాంబుదాకారుండును సౌమ్యరూపుండును బ్రీతికరాకృతియు నై నిజశిఖరాగ్రంబునం గూర్చుండి యారక్కసుం జూచి యేను సకలమునులకు నాశ్రయుండ రణకర్మంబులయం దసమర్థుండ నన్నుం దొడరుట నీకుఁ గర్జంబు గాదనిన వాఁడు క్రోధసంరక్తలోచనుండై యట్లేని నాకుఁ గయ్యం బొసంగు నంతబలంబు గలవాని నొక్కనిం బేర్కొనుమని పలికిన ననుక్తపూర్వం బైన వానివచనంబు విని క్రోధంబున నతం డిట్లనియె ॥ (చ) అలఘుపరాక్రముండు దివిజాధిపపుత్త్రుఁడు వానరుండు దో । ర్బలవిభవాధికుండు రిపుభంజనుఁ డాహవశీలి వాలినాఁ । గలఁ డొకఁ డమ్మహాబలునిఁ గానఁగ నేగుము తండు దక్కన । న్యులకుఁ దరంబె రాక్షసకులోత్తమ నిన్ను దరించి పోరఁగన్ ॥ (క) రాక్షసనాయక రణమున । దక్షత గలదేని నీకుఁ దరుచరుకడకీ । క్షణమునఁ గిష్కింధకు న । క్షీణజవప్రతాప మడరఁగఁ జనుమా ॥ (క) అని హిమవంతుఁడు పలికిన । విని రక్షోధిపుఁడు క్రోధవివశుం డై గ్ర । క్కునఁ గిష్కింధకు వాలినిఁ । గనవచ్చెం జన్యకాంక్ష గడలుకొనంగన్ ॥ (వ) ఇత్తెఱంగునఁ గిష్కింధకుం జనుదెంచి ప్రావృట్కాలంబునందుఁ దోయపూర్ణం బైన మహామేఘంబు కరణి మేనుఁ బెంచి ఘోరంబగు మహిషరూపంబుఁ దాల్చి తత్పురద్వారంబు నాక్రమించి పాదఘట్టనంబునం బుడమి వడంక సమీపస్థంబులగు వృక్షంబుల నూరువేగంబున బడలుపడం జేయుచు ఖురప్రహతుల ధరణి విదారింపుచు మదోద్దండశుండాలంబులీల విషాణాగ్రంబులఁ బ్రాకారగోపురంబులు విఱుగం ద్రోయుచు నాదుందుభి దుందుభియట్ల గర్జింపుచు నట్టహాసంబుఁ జేసినఁ దదీయభైరవస్వనంబు విని యంతఃపురగతుండగు వాలి యమర్షణుండై తారాసహితుండైన చంద్రుండుం బోలెఁ దారాప్రభృతికాంతాసహితుండై శీఘ్రంబున లేచి యంతఃపురంబు వెలువడి రయంబునం బఱతెంచి యారక్కసుం గాంచి వ్యక్తాక్షరపదం బగు మితవాక్యంబున నిట్లనియె ॥ (ఉ) ఓరి నిశాట వానరకులోత్తముఁ డంచితశౌర్యశాలి జం । భారిసమానవీర్యుఁడు మహాబలవంతుఁడు వాలి తత్పుర । ద్వారమునడ్డగించి భయదక్రియ ఘోష మొనర్చె

దేల నీ । కీరసజీవితాశగల, దేని తొలంగి నిజేచ్ఛ నేగుమీ ॥ (ఉ) నావిని
దానవుండు నయ,నంబుల నెఱ్ఱఁదనంబు దోఁపఁగా । దైవత రాజనందనుని, దప్ప
కచూచి వనాటశేఖరా । నీవొకపోటు బంటుకర,ణిం గఱితల్వినఁ బ్రేలె దేల
నా । లావును నీదులావు సమ,రంబొనరించినఁ దెల్లమయ్యెడిన్ ॥ (సీ) హరి
వరని న్నెప్పు,డాజిఁ ద్రుంపఁగఁ గల్గుదునోయని తమకింపు, చున్నవాఁడ । నైనను మ
దమోహి,తాత్ముండవై యున్నకతమునఁ దునుమయు,క్తంబుగాదు । మత్తాని సు
ప్తుఁ బ్ర,మత్తు నాయుధహీను నాజిఁ జంపిన భ్రూణ,హత్యయంద్రు । గాన నీనిశ నె
ట్టు,లైనఁ దాల్మివహించి యుండెద రణధర్మ,మూఁది నీవు ॥ (తే,గీ) ప్రియ
లతోఁ గూడి మదనసం,క్రీడసలిపి । విత్తమర్థులకొసంగి సు,హృత్తులకుఁ బ ।
దార్థములొసంగి సుతుపిట్టి,కధిపుఁ జేసి । వేగునంతకుఁ బోరికి, వెడలిరమ్ము ॥
(వ) అని పరిహాసంబుగాఁ బలికిన నారక్కసుని వచనంబులకుం గనలి తారా
ప్రభృతికాంతలం బరిత్యజించి నన్ను మత్తుండవని ప్రహసించితివి గదా నీకురణం
బున ధైర్యంబు గలదేని యొక్కింతసేపు దలఁకక నిలిచి మదీయపాణిప్రహారం
బు గొను మీమదంబు యుద్ధోపక్రమంబునం దుత్సాహవర్ధనార్థంబు
గావించిన వీరపానంబున నైన యదిగా నెఱుంగుము మని పలికి సంరంభ వి
జృంభితుండై జంభాంతకసుతుండు పితృదత్తంబైన కాంచనమాల యంసభా
గంబున నిడికొని భీషణరభసాతిశయంబుగాఁ గవిసి వాని విషాణంబులు
కరంబుల నొడిసిపట్టి వెనుకంబడఁ ద్రోచి కరతలంబునఁ దదీయమస్తకంబుఁ జ
ఱచి భూనభోంతరాళంబునిండ సింహనాదంబుఁ జేసిన వాఁడు బెండుపడక గం
డుమిగిలి భండనంబునకుం దలపడిన నయ్యిరువురకు వాసవవృత్రులకుం బో

()వాలిదుందుభికాయము మతంగాశ్రమమునం బడునట్లు పాదాంగుష్ఠముచే()
(*)తఁ జిమ్ముట.(*)

లె ఘోరంబగు సంగ్రామంబయ్యె నప్పుడు తరుపాషాణప్రహారంబుల జానుకూ
ర్పర ముష్టిఘాతంబులఁ బరస్పరజయకాంక్షలం బోరుచుండఁ గొండొకసేపున
కు రాక్షసుని సత్వంబు నశించెఁ బురందరనందనుని బలోత్సాహంబులంతకంతకి
నుమడింపుచు వచ్చె నిట్లు ద్విగుణీకృత విక్రముండై వ్యాపారవీర్య ధైర్యపరా
క్రమంబులం బరిక్షీణుండైన యారక్షఃపతినిఁ గ్రిందం బడఁద్రోచి తానుమీఁదై
కాలం గేల మర్దించి ముఖనాసావివరంబుల రక్తధారలు స్రవింపఁ బంచత్వం



బు నొందించి వాని కళేబరంబు యోజనప్రమాణంబు దవ్వులం బడునట్లుగా వి
సరివైచిన నదిమతంగాశ్రమసమీపంబునం బడుటయు నందు నియతాహారుండై
తపంబు సేయుచున్న మతంగమునీంద్రుండు తద్వదనద్వారవినిస్సృతశోణితబిందు
వులు వాయువశంబున దనమీఁదం బడినం గోపించి ॥ (ఆ.వె) ఎచటనుండి వచ్చె
నీరక్తబిందువు । లెవ్వఁడింత కార్య మొ,ఱిగిచేసె । నట్టివాని దుష్టుఁడని బాలి
శుండని । ధర్మహీనుఁడనియుఁ దలఁపరాదె ॥ (తే,గీ) అనివిచారించి రయ
మున,నడవిదిక్కు । లన్ని పరికించి తనయాశ్రమాంతికమునఁ । గొండపగిది గ
తాసుఁడై కూలియున్న । మహిషరూపాసురునిఁ జూచి మానివరుఁడు ॥ (క) తన
విజ్ఞానంబున నది । యనిమిషపతి సుతుని కృత్య మని యెఱిగి మనం । బునఁ గనలి
శాంతినిధియ । య్యును వానికి శాపమొసఁగ నుద్యుక్తుండై ॥ (సీ) ఏదురాత్ము
నిచేత నీయాశ్రమము దైత్య ఘనకళేబరముచేఁ గప్పఁబడియె । నేమందబు

(*) మతంగమహాముని వాలిని శపించుట. (*)

ద్ధిచే,నీంబువనంగల తరులు భగ్నంబులై విఱిగి కూలె । నేమదోన్మత్తుచే నా
మేను మహిష వదనవినిస్సృత రక్తధారఁ దడిసె । నేపాపచిత్తుచే నీపావనం
బైన విపినంబు నేఁడపవిత్రమయ్యె ॥ (తే,గీ) నట్టిదుర్బుద్ధి వాలి నేఁ డాదిగాఁగ ।
నిమ్మహావనమున కీమ,హీధ్రమునకు । నెన్నఁడేనియు సచివసంపన్నుఁడగుచు ।
వచ్చెనేనియు నప్పుడే చచ్చుఁగాక ॥ (తే,గీ) మఱియు నిమ్మహానీయాశ్రమంబు నం
దు । నెపుడు విహరించు వాలి సుహృత్తులెంద । ఱుఁదఱొండొక దిక్కున కరు
గవలయుఁ । జచ్చునట్లుగ శపియింతు చనకయున్న ॥ (ఆ,వె) వసుధ నెవ్వఁడేని
వాలితోఁ గలహించి । చేరియిచటనునికిఁ జేసెనేని । యతని కెన్నటికిని నాదు
మర్దాంధుని । వలని సాధ్వసంబు గలుగకుండు ॥ (వ) మఱియుఁ బుత్రుండునుం
బోలె నాచేత సురక్షితంబైన యీతపోవనంబునందుఁ బత్రాంకురంబులు విదళిం
పుచు ఫలమూలంబులు నశింపఁ జేయుచు నివసించియున్న వాలిసచివులెవ్వరుగ
లరట్టి వారందఱీదివసంబునం దక్క నెల్లి మదీయదృష్టిపథంబునం బడిరేని తత్క్ష
ణంబ పాషాణత్వంబు నొంది బహుసహస్రవర్షంబులు జడులై యుందురుగా
క ॥ (క) అని శపియించిన విని య । వ్వనమునఁ గల ప్లవగులెల్ల వారనిభీతి । న్వ
నము విడిచి పఱతెంచినఁ । గనివారలకనియె వాలి కడు శంకితుఁడై ॥ (క) కడు
వడి మతంగవిపినము । కడచి భయభ్రాంతులగుచుఁ గపులందఱు నా । కడ కేటి

కివచ్చితిర । కర్కడమీకండఱకుస్వస్తి గలుగఁ జేయనిర్జ ॥ (క) మనమునఁ గుం
ముచు వారా । మునియిచ్చినశాపమెల్ల మునుకొనిసంక్రం । దననందనుఁడోఁజె
ప్పిన । విసియాతఁడుజాలభీతి విహ్వలమతియై ॥ (వ) శీఘ్రంబున నమ్మునిపా
లికింబోయి తదీయచరణంబులకుఁ బ్రణతుండై యంజలిఁ గీలించి ప్రసాదంబు
వేఁడిన నమ్మహర్షి శ్రేష్ఠుండాదరింపక నిజాశ్రమంబుఁ బ్రవేశించుటయు నతం
డు శాపభయంబున నాఁటంగోలె నీఋశ్యమూకంబుఁ బ్రవేశింప నోడియుండు న

(*)సుగ్రీవుఁడు రామునికి దుందుభికాయంబును సప్తసాలంబులను జూపుట.(*)

కార్కరణంబెఱింగి యున్న వాఁడ నగుటం జేసి యేనువిషాదంబు దక్కి మంత్రిస
హితుండనై ధైర్యంబున నిన్నంగంబునఁ జరియింపుచున్న వాఁడ వీరోత్సేకం
బునవాలిచేతనిరస్తంబైన యాదుందుభియస్థినిచయంబిదియె పర్వతోపమంబై
పడియున్న దివిలోకింపు మదియునుంగాక శాఖానృతత్వంబున దుర్జ్ఞేయలక్ష్యం
బులై యతిస్థూలంబులై మ్రోలఁ జూపట్టుచున్న సప్తసాలంబుల వెవిలోకింపుమా
సంక్రందననందనుండిందొక్కసాలంబు లక్ష్యంబుఁ జేసి భుజాబలంబున నిర్గతశర
పత్రంబుఁ గావించుటకు సమర్థుండైయుండు॥ (క) క్షితిపతియతులితముగఁ గపి
పతివిక్రమమెల్లఁ దేటపడ నీకుంజె। ప్పితినతనిసమరముననే। గతిఁజంపెదొ. నీవు
శంకగదిరెడినాతుర్॥ (వ) అనినలక్ష్మణుండు ప్రహసింపుచు సుగ్రీవునవలోకించి
యెట్టికర్మంబున రాముండు వాలినివధింపగలండనినమ్మెద వనియడిగిన నాసుగ్రీ
వుండాసౌమిత్రింజూచి మహాత్మా తొల్లి వాలియీసప్తసాలంబులందునొక్కదా
నిభేదించి దానియందుఖానితంబైన శరంబువెఱికియా సంధియందుఁ గ్రమ్మఱవే
ఱొక్కశరంబునుగీలించిదానిం బెఱికియీవిధంబుననొండొకదానివిదారింపుచు
నిట్లు పెక్కుమార్లీసాలంబులనన్నింటిని ఛిద్రంబులుగావించెంగావున॥(క) వెసవి
భుడీతరువులలో। నసముననొకతరువునొక్క యంబకమునఁనీ। రసఁగూలఁగనే
సినను। గ్రసమరమునవాలిఁజంపఁ,గలఁడని తలఁతున్ ॥ (వ) అదియునుంగాఁ
క ॥ (క) మసలకదుందుభిగాత్రము । దెసలధనుర్ధరశత దేశమునఁబ
డ । న్వైసరాముఁడుపదముననిం । పెసఁగఁగ వడిమీఁటెనేని యెదనమ్మెదగున్ ॥
(వ) అనిపలికి యమ్మార్తాండ నందనుం డొక్కమూహూర్తంబు మౌనం
బుఁబూని యుండి వెండియు రక్తాంతలోచనుండగు రామచంద్రు నవలోకించి
యిట్లనియె ॥ (సీ) శూరఘాతియుమహాశూరుండు ప్రఖ్యాత బలపౌరుషుండు



—(*)సుగ్రీవుఁడు శ్రీరామ విషయమై సంశయించుట.(*)—

దో బలధనుండు । రణములయం దపరాజితుండప్రధృష్యుండమర్షణుఁడ
జయ్యుఁడు సురేంద్ర । తనయుండునిర్జర దైత్యులకైన దుష్కరముతావాఁ
నిదుష్కర్మములను । జింతించిసాధ్వసచిత్తుండనై హనుమంతుఁడాదిగఁ గల్గు
మంత్రివరులఁ ॥ (తే,గీ) గూడిపఱతెంచి యీగిరి కూటమెక్కి । రేయింబవ
లును నిద్దుర లేకఇటనె । యొండుచోటికిఁగదలక యున్న వాఁడ । వానిసాధిం
చునంత సత్త్వంబులేక ॥ (వ) మహాత్మా యింత కాలంబునకు శ్లాఘ్యుండవు
మిత్రవత్సలుండవు మహాధనుర్ధరుండవైన నిన్ను హిమవంతునింబోలె నాశ్ర
యించితి నైనను బలశాలియగు వాలిపరాక్రమ ప్రకారంబు చిరకాలంబున
నుండి యెఱింగియున్న వాఁడఁ గావున భవదీయ విక్రమం బెఱుంగని కతంబు
న నతనికినీకును బలాబల తారతమ్యంబెట్లొకోయని యతనితోడి చివ్వకుంజొ
చ్చుటకు సంశయింపుచున్న వాఁడ భవదీయవాక్యంబును బుద్ధియునచంచల
త్వంబును వేషంబును భస్మఛన్నుండగు వైశ్వానరునియట్ల యనావిష్కృతం
బైయున్న భవదీయ తేజంబును సూచింపం జేయుచున్నవి భృత్యుండనైనన
న్నుఁ గరుణించిమహిషాసురుని కళేబరోత్క్షేపణాద్యభిజ్ఞానంబుల నామనం
బునం బొడుకొనియున్న సంశయంబుఁ బాప వేయని ప్రార్థించిన నతనివాక్యం
బులకు సంతసిల్లి ముఖారవిందంబునకు మందహాసంబు చెలువొసంగఁ గౌస
ల్యానందనుండరవిందబాంధవ నందనునకిట్లనియె ॥ (చ) జలరుహమిత్రపుత్ర
మదిసంశయమూడఁగ నాకు వాలికిం । గలబల తారతమ్య మెఱుఁగన్ దిఁగో
రితివిత్తలంపుని । శ్చలధృతినిచ్చునీవనిన చందమునన్మహిషాస్థిమీఁటెదం । గ
లయఁగఁజూడునాడగునఖండపరాక్రమవిక్రమోర్థతిన్॥ (వ) అనివిక్రమంబుప్రక
టంబుగానిరూపించి ॥ (శా) మోదంబావహిలంగ రాఘవుఁడు సొంపుంబెంపు
దీపింపన । య్యాదిత్యాత్మజుఁ డద్భుతంబుమది నిండారన్విలోకింపఁగాఁ । బా

( )శ్రీరాముఁడుదుందుభికాయమును బాదాంగుష్ఠముచేతదశయోజనదూరం( )

—(*)బునఁ గుజిమ్ముట. (*)—

దాంగుష్ఠముచేతమీటెనిలస త్ప్రాలేయ శైలాభమౌం । సాదాస్థిప్రచయం
బుయోజనదశ ప్రాంతంబునన్ గూలఁగన్ ॥ (క) ఆయనఘుఁ డిట్లు దుందుభి ।
కాయముమీటుటయుఁ జూచికపిపతిమదిలోఁ । బాయనిసంశయమునభ । ద్రా

యిత మృదుసూక్తి మఱలరామునకనియె౯ ॥ (క) మున్నిది మాంసార్ద్రంబై । యున్నది నేఁడెంతకంత యును శుష్కంబై । యున్నది వాసవిబలమఱి । తన్నెను బిట్టలయకీవు తన్నితినఘపా ॥ (వ) అట్లగుటం జేసి ॥ (క) ఆతఁడెక్కుడొ నీవెక్కుడొ । చతురతమీయిరువురందు సత్త్వాంతరము । న్మతినిశ్చయించుటకు రఘు । పతినాకునశక్యమయ్యెఁ బరికింపంగ౯ ॥ (వ) కావున ॥ (ఉ) ఓజగతి ర్పనీవొక మహోగ్రశరంబున నేఁడుసాలప్ప । ధ్వజము నొక్కటి న్వసుమతిం బడఁగూల్చిన నీకువాలికి । నాజిలు సత్త్వసంపద కొలంది యెఱింగి భయంబుఁ దక్కియొ । రాజవరేణ్యనమ్మెదఁ దిరంబుగ నట్లొనరింపఁగాఁదగు౯ । (తే,గీ) హస్తిహస్తంబుకరణినొప్పారునట్టి । యమ్మహాకార్ముకంబు సజ్యంబొనర్చి । కడఁగియాకర్ణపూర్ణంబుగాఁగఁదిగిచి । విపులసాయక మొక్కటి విడుపుమధిప ॥ (వ) అట్లైన నమ్మహనీయశరంబు నిస్సంశయంబుగా సాలంబు భంజించు నాకు సందియంబువాపుట కదియెచాలు నవ్విధంబాచరింపుము ॥ (క) మృగములలోఁ గేసరిప । న్నగఁ దేజోవంతులందు నుండు గిరులలో । తగహిమనంతుఁడునరులం । దగణితగుణనీవుఘనుఁడవై తిరికడిమి౯ ॥ (వ) అనిపలికినసు

—(*)రాముఁడు సప్తసాలంబుల నొక్కబాణమునఖండించుట.(*)—

గ్రీవుని పలుకులకలరి రఘుపుంగవుండు ప్రత్యయార్థంబు మహనీయశరాసనంబులీలం గేలనందుకొని ॥ (చ) ఒకనిశితోగ్రకాండమున నుద్ధతి నెక్కిడినారి మ్రోఁతది । క్చ్రికరముపిండ సాలమును లక్ష్యముగాఁగొని వేసిగుడ్బఁగొం । చ కయుది సాలసప్తకము శైలమగల్చి ధరిత్రిఁ జొచ్చివా । రకనొక యంతలో మఱల రాముపతూణముఁ జొచ్చెలీలతో౯ ॥ (వ) అప్పుడ వ్వానరపుంగవుండు నిర్భిన్నంబులైన సప్తసాలంబులువిలోకించి రాముని శరవేగంబునకు మనంబున విస్మయంబునొందుచుఁ బ్రలంబీకృతభూషణుండై తదీయచరణంబులు తనకిరీటంబుసోఁకం బ్రణమిల్లి కన్నులనానందబాష్పంబులు గ్రమ్ముదేఱ మొగంబునం దెలివిదొరకొన నిటల తటఘటితాంజలిపుటుండై మందమధుర వాక్యంబున నిట్లనియె ॥ (సీ) ఏమహా మహునిచే నీసప్తసాలంబు లొకభాణమునఁదెగియుర్వింగూలె । నట్టిసేవధిప సర్వాస్త్రగోవిదులలో నధికుఁడవురువిక్ర మాస్పతుడవు । నీవుకోపించిన నిజరులైననుబొలియుదురొక వాలిపొలియుటెంత । యమరేంద్రతుల్యుఁడ వగుసిన్ను సఖునిఁగాఁ బడసియుప్పుడు గత వ్యథుఁడనైతి ॥



(తే,గీ) నింకఁదడతేల కరుణార్ద్రదృష్టిమామ । కాంజలిఁ బ్రతిగ్రహించి సమంచితముగ । భ్రాతృరూపకరిపునివి ఖ్యాతబలుని । వాలిని వధించి యుపకారశాలివగుము ॥ (వ) అనియివ్విధంబున నభ్యర్థించినఁ బ్రియదర్శనుండగుసుగ్రీవునిఁ బరమానందంబునం బరిష్వజించి మహాప్రాజ్ఞుండగు రాముండు లక్ష్మణుని యనుమతివడసి శుభవాక్యంబున నిట్లనియె ॥ (ఉ) బంధురవి క్రమస్ఫురణభానుజమున్న గనీవువేగఁ గి । ష్కింధకుఁబోయి వాలినిఁ బ్రసిద్ధభుజాబలశాలివీర్యగ । ర్వాంధునిఁ బోరికింబిలువు మవ్వలమేమునునీపిఱుందనే । మఱంధర

—రామునను మతిని సుగ్రీవుఁడు వాలితోఁ బోరంబోవుట.—

వృత్తివచ్ఛేదమ మానుషసాహసరేఖతోఁపఁగ౯ ॥ (క) హరిపతికిటు రఘుపతివెర । వెఱఁగించికడంగి వానరేశ్వరహింసా । భిరతిం జని తానొకచో । గురుతరుపులుమాటుచేసు కొనియుండెరహి౯ ॥ (క) సుగ్రీవుఁడంత రామున । నుగ్రహమదినచ్చిగతమనో వేదనుడై । విగ్రహరతిఁ గిష్కింధకు । నాగ్రహము నఁజని యెళుఁగుఁ ఘ్రియానప్రౌఢి౯ ॥ (క) ఈగతిఁ గిష్కింధాపురి । కేఁగిగగన మగలునట్ల హీనధ్వానో । ద్యోగంబు సలిపిఘునబా । హాగర్వమెలర్ప వాలి నాజికిఁ బిలిచె౯ ॥ (ఉ) ఆరవమాలకించి హృదయంబునఁ గోపము చెంగలింపఁబా । కారిసుతుండు శీఘ్రమున నస్తతటంబుననుండి లేచునీ । రేరుహమిత్రుచందమున లేచి జవంబునవచ్చితాఁ కెవి । స్ఫారకఠోరబాహుబల సాహసవిక్రమదుర్నివారుఁడై ॥ (క) ఈరీతిం గలపడుటయు । శూరోత్తములైన వాలి సుగ్రీవులకు౯ । ఘోరముగఁ జెల్లెమింటం । బోరుబుధాంగారకులకుఁ బోలెఁదుములమై ॥ (క) పిడుగులకుసాటిరాఁదగు । పిడికిటిపోటులనుఘోరభిరుదముకంకె । న్పడిడముల గుతలహాతు

—*రాముఁడు వాలిసుగ్రీవుల తారతమ్యం బెఱుంగక వితర్కించుట*—

లను । వడిఁ బోరిరిమింటవృత్ర వాసవులక్రియ౯ ॥ (వ) ఇట్లు తారొక్కని యవక్రపరాక్రమంబునం బోరుచుండ ॥ (ఉ) అప్పుడు రాముఁడంబరము నందుఁబెనంగెడువారినిద్దఱం । దప్పక చూచిరూపవద నంబులుమాటలు నొక్కరీతిఁగా । నొప్పుచునుండనందుఁ బురుహూతజు నేర్పఱుపంగ లేకతా । దెప్పరమైనసాయకము ధీరత నేయకయుండె శంకచేక౯ ॥ (ఉ) అంతదినేంద్రసూతి ప్లవగాధిపుచేఁగడునొచ్చి డస్సి మే । నంతయురక్తధారఁదడి యారఘువీరునిఁ గానకాతుఁడై । చింతిలి బుశ్యమూకగిరి చేరువనున్న వనంబులోనిక । ల్యాంతరయుంబునం బ

ఱచె నంగములాతురతన్నడంకఁగన్ ॥ (క) పఱచినసుగ్రీవుఁగని । సురపతిసుతుఁడస్త్వనంబు సారరామికిఁ బ్రే । ల్గఱచుచు బ్రతికితిపోపో । హరితనయాయనుచుఁ బలికి యరిగెంబురికిన్ ॥ (మ) జననాథుండగురాముఁడంతహనుమ త్సౌమిత్రులంగూడిచ । య్యనసూర్యాత్మజుఁడున్న కానకురయం బౌరంగవిచ్చేసినం । గని యాతండొకయింతలజ్జయునుశో కంబుస్వివాదంబుమో । మునఁగన్పట్టఁగ దీనవృత్తిఁబలికెన్భూమిస్వలోకింపుచున్ ॥ (క) విక్రమముఁజూపివాలిన । వక్రగతిం బిలువుమనుచువాకొనితుదిసీ । వీక్రియఁ జేయుటతగవే । చక్రేశ్వర హానిగాదె సత్యంబునకున్॥ (క) ఏనిపుడువాలిఁదునుమఁగ । రానని నాతోడఁ గడుఁ దిరంబుగనపుడే । మానుగ నెఱిఁగించినన । ట్లూని పెనంగుటకుఁ బోక యుండనె యేనున్ ॥ (క) నావిని రఘునాథుఁడుసు । గ్రీవునివీక్షించిపలికెఁ గీశాధీశా । నీవిటు నిష్ఠురమాడం । గావలవదువినుముదానికారణమెల్లన్॥ (వ) నీవును బురందరనందనుండును సమాన విక్రమంబున నంబరంబునం బన్నిపోరునెడ నలంకార

—(*) రాముఁడు వాలిచే నొచ్చిన సుగ్రీవుని ననూనయించుట.(*)—

వేష భాషా ప్రమాణ గతి స్వర ప్రేక్షణంబు లిరువురకు సరియై యున్న కతంబున రూపసాదృశ్యంబువలన మోహితుండనై యందు వాలి నేర్పరింపంజాలక నద్ధిజ్యధన్వుండనయ్యును జీవితాంతకరంబును ఘోరంబును శత్రునిబర్హణంబును మహావేగంబునగు శరంబుఁ బ్రయోగించుటకు నుద్యుక్తుండనయ్యును బ్రాణమిత్రుండవైన నిన్నుం దాఁకునోయను భయంబున శరంబు విడువనైతి దీనిం దప్పుగాఁగొనకుము మదజ్ఞానలాఘవంబులవలన వీరుండవైననీవు విపన్నుండవగుచుండ మద్బాల్యంబును మౌఢ్యంబును జగంబులందుఁ గథితంబు గాదె దత్తాభయవధ పాతకంబునకు నిష్కృతి లేదువినుము॥ (ఉ) ఇంతననేల నన్నుం । బ్లవగేశ్వర నాదగుబుద్ధికౌశలం । బింతియె కానివేఱొకటి యేమినులక్ష్మణుఁడే నుసీతయుం । బంతముతోఁ భవత్కృపకుఁ బాత్రులమైతిమిగాదెనీకుమా । కింతయుభేదముంగలుగు నేసచివత్వమురిత్తవోవునే ॥ (వ) కడచనిన కార్యంబునకు

—(*) రాముఁడు గుఱుతుకై సుగ్రీవుని మెడను గజపుష్పియను లతను (*—
—(*) ధరింపఁ జేయుట. (*)—

వగవంబనిలేదు వినుము॥ (ఉ) క్రమ్మఱధైర్యమూఁదికపి రాజభవద్రిపుమీఁదికీవు శీ । ఘ్రమ్మున నేగుమేను వెనుకంబటు కార్ముకబాణపాణినై । సమ్మతి నేగుదెం



చిపలు చందములన్నడిఁబోరుచుండనో । కన్నునఁగూలనేసెదను హాబలశాలి నివాలినుర్వరన్॥ (ఉ) నీవునువాలియుందొడరి నేర్పునఁబోరుచునుండ వీఁడుసు । గ్రీవుఁడఁటంచునిన్నుఁబరికించుట కేనొక గుర్తొనర్చెద । న్ధీరతదానిఁ గైకొనిమదిన్భయమందకవైరిమీఁదికిం । జ్ఛాబిధిఁ బొమ్మునావలని సంశయముందొలఁగించిగర్జనన్ ॥ (వ) అని సుగ్రీవునొడంబఱిచి రాముండు సౌమిత్రి నవలోకించి॥ (చ) సలలితభంగినీశిఖరి సానువులన్శుభలక్షణాకృతిం । బొలిచినయీప్రఫుల్లగజ పుష్పినివేఁగొని తెచ్చిచాలమే । ల్తలకొన నీకపీంద్రునిగళంబుననిల్పుమటంచుఁబల్కెనే । ర్పలరఁగ నాదినాధిపకులాభరణం బటుసంఘటించినన్॥ (వ) ఇట్లు లక్ష్మణదత్త కుసుమాకుల గజపుష్పీనామ కలతాశోభితకంఠుండై॥ (క) తపనసుతుండాలతచే । నపుడదుతభంగినొప్పె నంబరవీధి । న్విపులోడుమాలచేతను । సుపరీతుండైనసూర్యుచొప్పుననంతన్॥ (వ) మఱియు నాసుగ్రీవుండు బలాకమాలచేతం బొల్చు సంధ్యాభ్రంబు చందంబున నిజదేహప్రభాపటల విరాజమానుండై రామునియనుమతంబున వాలిపాలితంబైన కిష్కింధాపురంబునకుం జనియె రాముండు కాంచన భూషితంబైన దివ్యచాపంబు సజ్యంబుఁజేసి సూర్యసంకాశంబైన శరంబును బరిగ్రహించి బుశ్యమూకంబు నిర్గమించి యతనివెనుకం జనియె నప్పుడారాముని యగ్రభాగంబున సంహతగ్రీవుండగు సుగ్రీవుండును శుభలక్షణుండగు లక్ష్మణుండును

—(*) సుగ్రీవుఁడు రామలక్ష్మణసహితుఁడై కిష్కింధకుఁ బోవుట.(*)—

జనుచుండిరి బుద్ధిమంతుండగు హనుమంతుండును బరాక్రమశీలుఁడగు నీలుండును బ్రశస్తబలుండగు నలుండును గీర్తివిజితతారుఁడగు తారుండును బృష్ఠభాగంబునం జనుచుండి రిత్తెఱంగునం గూడుకొని ॥ (సీ) ఫలభారసన్నతోజ్జ్వలమహీరుహపుంజరంజితకుసుమితారామములును । సానునిర్ఝరగండశైలదరీఘురీ బహుధాతుశోభితపర్వతములు । శీతలసలిలవీచీమాలికా వృతసైకతభూషితసానువులును । వంజులకారండవమరాళసారస కోకసంఘుష్టతటాకములును॥ (తే,గీ) సలలితసుగంధికైరవోత్పలసరోజ । షండమండితరమ్యకాసారములును । మఱియుఁదక్కినవన్యసమాజములును । వరుసనందంద చూచుచునరిగిరపుడు॥ (క) వెసమృదుఘాసాంకురములు । మొసవుచుశాద్వలములందుమెలఁగెడురుసుగో । ధసముదయంబులఁజూచుచు । నసమానప్రోషితనం

దఱిరిగిరివరుసన్॥ (ఉ) తుంగతటాగ్రముల్ వెలుఁగఁ ద్రోయుచు ధాతుపరాగసిక్త స । ర్వాంగములై మదోత్కటకటాభిహతద్రుమమండలంబులై । జంగమపర్వతంబులకు సాటియొడండగు శుక్లదంతమా । తంగములంగనుంగొనుచుఁ దద్దయు వేడుకనేగి రత్తఱిన్॥ (వ) మఱియు నితరంబులగు వనచరంబులను నానావిధ విహంగమంబులను విలోకింపుచు సుగ్రీవవశవర్తులై పోవుచుండ నందొక్కయెడ ద్రుమషండంబగు వనంబునవలోకించి రాముండు సుగ్రీవునింజూచి గగనంబున మేఘమండలంబుంబోలె నీవృక్షషండంబు పర్యంతకదళీవృతంబై యొప్పుచున్నది. దీని తెఱంగంతయు వినఁగోరెదఁ దెల్లంబుగా నెఱింగింపు మనుట

—(*)సుగ్రీవుఁడు రామునికి సప్తజనాశ్రమ వృత్తాంతముఁ దెల్పుట.(*)—

యు నతండు పరమాహ్లాదంబునఁ దత్ప్రకారంబు వినుమని యిట్లనియె ॥ (సీ) చటులతరోద్యానసంపన్నమును స్వాదు మూలఫలోదకంబును విశాల । మగు నాశ్రమంబిది జగతీశ యిచ్చట మునుసప్తజనులను మునులు సంశ్రి । తవ్రతులేడ్వురధశ్శీర్షులై జలశాయులై తపములు సలిపి సప్త । రాత్రంబులకు సమీరము నాహారింపుచుఁ దతదివ్యవర్షశతంబులుండి॥ (తే,గీ) యేడుతనువులతోఁగూడ నింద్రుపురికిఁ । జనిరిదీని తెఱంగిట్టిదనవరతము । సురలసురులైన నీదిక్కుఁ జూడవెఱతు । రమ్మహాత్ముల సత్ప్రభావమ్మువలన ॥ (వ) మఱియు వనగోచరంబులగు ఖగమృగంబులును వర్జించియుండు మున్ను ప్రవేశించిన ఖగమృగంబులు మోహవశంబునం బరిభ్రమింపుచు నేఁటికిం గ్రమ్మఱ రాఁజాలకయున్న వదియునుం గాక॥ (తే,గీ) రాజశేఖర సకలాక్షరంబులైన । భూషణరవంబులును మఱి భూరి తూర్య । గీతనిస్వనంబులు చెలంగెడు మనోజ్ఞ । దివ్యగంధంబు వీచెడి భవ్యసరణి॥ (క) వారక త్రేతాగ్నులు సాం । పారవెలింగెడుఁ బరాక్ర మాఢ్యక పోతాం । గారుణమగు ధూమంబల రారెడిఁ జూచితె మహీరుహాగ్రంబులపై॥ (తే,గీ) సాంద్రధూమసంసక్తమస్తకములగుచు । నిన్నగంబులు పొలుపారుచున్న వధిప । కంకఘనజాలముల చేతఁగప్పఁబడిన । నిరుపమవిశాలవైడూర్యగిరులకరణి॥ (వ) మహాత్మా భావితాత్ములైన యమ్మహర్షిశ్రేష్ఠులకు నమస్కరించువారికెన్నటికి నశుభంబు లొడవనేరవుగావున నీవు లక్ష్మణసహితంబుగా నంజలిఘటించి యత్తపోధనులనుద్దేశించి నమస్కరింపుమని పలికిన నారఘువల్లభుండు భక్తియుక్తంబుగా నవ్విధంబాచరించె నంత నాసప్తజనాశ్రమం బతిక్రమించి హ్రస్వయార



విందంబుల నమందానందంబు పొందుపడ నిజతేజోజాలంబు దిఙ్ముఖంబులకుఁ దెలివొసంగ వరాస్త్రశస్త్రపాణులై శీఘ్రంబునఁ గొండొకదూరం బరిగి సురేంద్రనందన బాహుపాలితంబైన కిష్కింధాపురంబు నవలోకించి శత్రువధార్థంబు లతావితానరంజిత నికుంజపుంజంబుల మాటునం బొంచియుండిరి సుగ్రీవుండు విపులగ్రీవుండై కాననంబున నలుదెసలు పరికించి కేవలంబగు క్రోధంబంగీకరించి పరివారపరివృతుండై వాయువేగపురస్సరంబగు మహామేఘంబుకరణి నంబరంబు పగుల గర్జించి బాలార్కసదృశుండును దృప్తసింహగమనుండునై క్రియాదక్షుండగు రఘుహర్యక్షుననవలోకించి యిట్లనియె ॥ (మ)జయయంత్రాఢ్యయుఁ గీశవాగురయు భాస్వత్తప్తసౌవర్ణసా । లయు దేవేంద్రజబాహుపాలితయునై రాణించు కిష్కింధకు । న్నయమారం జనుదెంచితీ వ్రప్రతిన న్సాఫల్యమొందింపవే । దయతో నాగతమైన కాలము మహాత్మా నూత్నవల్లిం

—(*) రాముఁడు సుగ్రీవునితో వాలిని యుద్ధమునకుం బిలుపుమనుట (*)—

బలెన్॥ (వ) అనిన విని శత్రుసూదనుండగు రాముండు సుగ్రీవునవలోకించియిట్లనియె॥ (సీ) ఈగజపుష్పి చేసిటు కృతాభిజ్ఞాన చిహ్నుండవై తివి చింతయేల। పగతుని దెసఁ బుట్టు పగయుభయంబును రణమున బాణమోక్షణము చేతఁ । బాయఁ జేసెద నాకు భ్రాతృరూపకుఁడైన శత్రునిఁ జూపుము సంభ్రమమునఁ । బలుకులు వేయేల పగతుఁడు నాదృష్టి పథమునఁబడి వెండి బ్రతికి పోయె ॥ (తే, గీ) నేని యవ్వల నాకడ కేగుదెంచి । తిరిరి దోషిగా నెంచి నిందింపు మపుడు । సప్తసాలంబులును ఘోర సాయకమున । నవనిఁ గూలుట నీకి సాక్షి గాదె॥ (తే,గీ) హరివరేణ్యా నాచేత నే కాంబకమున । విఱిగి యాసప్తసాలము ల్వాస ధరిత్రిఁ । బడుట వీక్షించితివి గదా బలవిరోధి । తనయుఁ డాచండమున నేఁడు ధరణిఁ గూలు ॥ (తే,గీ) వృక్షచరనాథ యేను మున్నెన్నఁడైన । నెట్టియాపద లందైన నించుకైన । బ్రమసియైనను బొంకులఁ బలికి యెఱుఁగ । నిప్పుడు నామాట కనృతత్వ మేలకలుగు ॥ (క) అమరపతివృష్టి చేస । స్యమునుం బలెమత్ప్రతిజ్ఞ ననఘ ఫలోపే । తముగాఁ జేసెద నిఁకసం । భ్రమమును సంశయముభయము మానుము మదిలోన్ ॥ (క) ఏనిన దమువిని చెచ్చెర । నానగచరుఁడనికి పచ్చునట్టియహీన । ధ్యానం బొనర్పు మిపుడా । హ్వానార్థము భయము వక్కి వానరవర్యా ॥ (ఉ) అనిన దంబు కర్ణపుట మంటినయం

తనె లేచి తెప్పజాం। బూనసమాలి వాలి వెసఁ బోరికివచ్చు నతండుమున్ను నీ
చేనవిఘర్షితుండు జయశీలుఁడు బాహుబలాధికుండు తే। జోనిధి సంగరప్రి
యుఁడు శూరుఁ డరిందమమానిగావునన్ ॥ (తే,గీ) వినుము సంగరశూరులు,

(*) సుగ్రీవుఁడు వాలివచ్చుటకై సింహనాదము సేయుట. (*)

విమతజనుల। ధర్షణంబు సహింపరు, తపనతనయ। మఱి విశేషించి సతులస
మక్షమందు। నున్నచో వీరమెక్కుడై, యుండుఁ గాదె ॥ (క) తడవేల శక్రతన
యుని। బెడిదంబుగ సమరమునకుఁ, బిలువుము శౌర్యం। బడరఁగఁ దాఁకు
ము తొల్లిటి। వడువునఁ బొఱుంగవలదు, వనచరనాథా ॥ (వ) అని బోధించి
మనంబుఁ గట్టిపట్టి దిన నా రఘువల్లభుని వచనంబులు విని హేమపింగళుండగు
సుగ్రీవుఁడు క్రూరంబుగా నాకాశంబు పగుల సింహనాదంబుఁ జేసిన ॥ (క)
రోషోత్థిత మగు నాని। ఘోషము విని కాంతిదొఱఁగి, గోవులుభీతి। ఘోషిం
పుచుఁ బఱచె నృపతి। దోషపరాఙ్ముఖులైన, తోయ్యలులక్రియన్ ॥ (క) మృ
గములు రణమున శ్రాంతము। లగు హయముల మాడ్కి వికల, తాప్తిఁ బహిం
చె। న్ఖగములటు ఫరిక్షీణము। లగు గ్రహములకరణి నప్పు, డవనిం గూలెన్ ॥
(ఆ, వె) అనిలచంచలోర్మి, యగు సరిత్పతిభంగిఁ। బొంగి యాప్లవంగ, పుంగ
పుండు! నింగి పగుల నార్చి నిడన్ యుఁడై శక్ర। సుతుని రాక కెదురు సూచుచుండె ॥
(వ) అప్పుడంతఃపురగతుండగు వాలి సర్వభూత ప్రకంపనంబైన సుగ్రీవునికం
ఠనాదంబు విని యమర్షణుండై తత్క్షణంబ మదంబు పరిత్యజించి క్రోధంబంగీ
కరించి నేత్రంబులం గెంజాయరంజిల్ల సంధ్యాతపప్రభుఁ డయ్యు నప్పుడు రో
షపరీతాంగుండగుటవలన నుపరక్తుండగు మార్తాండుని వడువున నిష్ప్రభ
త్వంబు నొంది పదంపడి క్రోధంబు పెంపున దీప్తాగ్నియుం బోలెఁ దేజరిల్లుచు
దంష్ట్రాకరాళుండై సముత్పతితపద్మాభంబును సమృణాళంబునునగు హ్రదంబుచం

(*) వాలి సుగ్రీవసింహనాదము విని రోషముతో యుద్ధమునకు వెడలుట. (*)

దంబున నజూపట్టుచు శయనస్థానంబుననుండి లేచి యంతఃపురంబు వెలువడి చరణ
ఘట్టనంబున నంబుడమియదుర వశీఘ్రంబున నంబఱ తెంచుచున్న యతనిం గౌగలించు
కొని భయంబున మనంబు దిలగొన స్నేహదర్శితసౌమనస్యయగు తార హి
తోదర్కంబగు వాక్యంబు నిట్లనియె ॥ (తే, గీ) ఉదయవేళఁ దల్పంబున నుం
డి లేచి। పురుషుఁడనుభూతయై నట్టిపుష్పమాల। యట్లనీవు నదీవేగ, మట్ల



యరుగు। దెంచు నీకోపముఁ బరిత్యజించుమధిప ॥ (తే,గీ) అనఘచరితప్రాతః
కాలమందు నీవు। పోరొనర్చితి వితనితో దారుణముగ। విమత విషయబ
లాబల విషయశంక। నీ మనంబున లేదింత నిక్కువంబు ॥ (క) సమయముఁ జూ
చిన పగతుని। సమయోచితమైన కంఠశబ్దము విని సం। భ్రమముజనియింపుచు
న్నది। సమరంబున కిపుడు పోవఁ జనదు మహాత్మా ॥ (ఆ, వె) విక్రమమునకిపు
డు, వేళ గాదు హృదీశ। సంగరమునఁ గీడు సంభవించు। వలనదనుచు నేల, వా
రించెదనిన న। త్తెఱఁగు విన్నవింతుఁ, దెలియ వినుము ॥ (ఉ) ఇంతకు ము
న్ను వచ్చి హృద, యేశ్వరపోరికి నిన్నుఁ బిల్చి తాఁ। గొంతరణంబొనర్చి తుది
ఘోరతరంబగు నీబలంబుచే। నెంతయు నొచ్చి పాఱె దివ, సేశ్వరనందనుఁ డట్టి

(*) తార వాలికి హితోపదేశముఁ జేయుట. (*)

వాఁడు నేఁ। డింతకు నెత్తివచ్చుటకు నేమియుకో యనిశంకతోఁ జెడెన్ ॥ (చ)
రవిజుని బెట్టిదంబగ బలంబును యత్నముకంఠనాదము। న్వివిధవిధంబులన్మ
నము, విన్నవి కన్నవి గావె తొల్లి నేఁ। డవి విపరీతభంగి విజ, యస్ఫురణంబు నె
ఱుంగఁ జేయుచు। న్నవియది యేమి హేతువొ మ, నంబునఁ జూచి కడంగు టొ
ప్పగున్ ॥ (చ) పలుమఱు నీబలంబును బ్రభావ మెఱింగియు నింతకన్నము।
న్బలమఱి యోడి పాఱియును, భానుజుఁ డీగతి వెండివచ్చుట। ల్దలఁపఁగ శౌర్య
వీర్యబల, దర్పపరాక్రమశాలి యెవ్వఁడో। కలసి సహాయుఁడై యనికిఁ, గావెడ
లించిన భంగితోఁ జెడెన్ ॥ (క) ప్రకృతి వినీతుఁడు నిపుణుఁడు। సకలజ్ఞుఁడు
దేశకాల, సంవేదియతం। డాక వీరుసహాయతఁ బడ। యక వచ్చునె సత్త్వమ
ధిక, మయ్యెనె నేఁడున్ ॥ (చ) వినుము కపీంద్ర యాప్తులగు, వేగుల వారొక
నాఁడు చెప్పఁగా। విని ఘనయంగదుండు మది, విస్మయమందుచు సత్వరంబుగ।
న్వనమున నుండి వచ్చి యొక, వార్తయు నాకు సవిస్తరంబుగా। మునుకొని చె
ప్పె దానివిధ, మున్విహితంబుగ విన్నవించెదన్ ॥ (సీ) వసుధేశు లిక్ష్వాకు
వంశ సంభవు లయోధ్యాధిప సుతులు మ, హానుభావు। లాజి దుర్జయులు ది,
వ్యాస్త్రవేదులు రామ లక్ష్మణులను వారు, రవిసుతునకు। హిత మొనర్పఁగఁ
బూని, ఋశ్యమూకమునకు నరుదెంచి యున్న వా, రందు రాముఁ। డనిలోన
సాహాయ్య, మొనరింపనున్న వాఁడఁట యతండు రువిక్ర, మాన్వితుండు ॥ (తే,గీ)
రణపటిష్ఠుఁ డాపన్న సం, రక్షకుండు। కీర్తినిధి సాధు సంశ్రయుఁ, డార్తిహరుఁ

డు । జ్ఞానవిజ్ఞానఘనుఁ డరి, క్షయకరుండు । దివ్యతేజోధనుండును, ధీవరుండు॥
(క) పితృవాక్యపాలకుండు ధృతవైరివినాశకరుఁడు ధాతువులకుఁ బ । ర్వ
తముకరణి సుగుణంబుల । కతులితగతి నమ్మహాత్ముఁ డాకరమధిపా ॥ (తే,గీ) అ
ట్టిరఘుపతితోడ మహాత్ముతోడ । రాజవరుతోడ సమరకర్కశునితోడ । నప్ర
మేయునితోడఁ గీశాధినాథ । పగఁగొనుటనీకుఁదలపోయఁ బాడిగాదు ॥ (క)
తరుచరవరనీకెయ్యది పరమహితంబట్టిదాని । భర్తృస్నేహా । భిరతిం జెప్పె
దనీవ । త్తెఱఁగువినిఘటింపుమధికధీయుక్తిమెయిన్ ॥ (చ) పగఁదొలఁగంగఁ
బెట్టి పదిఁ బట్టుగఁదాలిమి గీలుకొల్పియీ । పగిది రణస్పృహం జనక భా
నుసుతున్ యువరాజ్యమందుఁ బొం । దుగ నభిషిక్తుఁ జేసి రణ దుర్జయుఁడైన
రఘుప్రవీరుతోఁ । దగసచివత్వమున్ నెఱపి తత్పరత న్సుఖియించుటొప్పగున్ ॥
(ఉ) ఎక్కడనున్న నేమి హృదయేశ్వర సోదరుఁడైన భానుజుం । డొక్కఁడె బాం
ధవుండు మఱి యొక్కఁడు సీ తత్సము నీధరిత్రిలో । నెక్కడఁగాన మాతని పయిం
డెగుబాప్పునె నీకుఁ జెల్లునే । చక్కఁగ దానమానముల సత్కృతుల న్వెలయిం
పుమింపుగన్ ॥ (క) నీ విపుడ నుగ్రహించిన । భావంబునఁ బొంగి వైరభావము
డిగి సు । గ్రీవుఁడు ముదమున విపుల । గ్రీవుండై కొలిచియుండుఁ గేవలభక్తిన్ ॥
(వ) దేవా వానికిప్పు డొండు శరణంబు లేదు గావున హితైషిణి నగు నా మతంబం
గీకరింప్రసన్నుండవై భ్రాతృసౌమనస్యంబవలంబించి రోషంబు పరిత్యజించి
శాంతివహించి శక్రసమాన తేజుండగు రామునితోడి విగ్రహంబునకుం జొరకను

—(*) వాలి రోషమునఁ దారను దర్జించుట. (*)—

గ్రీవుని యౌవరాజ్యంబున కభిషిక్తుం జేసి యతఁడును నీవును బరస్పర బద్ధాను
రాగంబులం గలసి మెలసి సుఖంబుండు మని పలికిన ॥ (క) తారాధిపనిభ
ముఖి యగు తార లహితోక్తులకుఁ, జాలదర్జింపుచు వృ । త్రారిసుతుఁ డంత
కాలము । చేరువ యైయుంటఁ జేసి, చిడిముడిపడుచున్ ॥ (ఉ) తా నొక పో
టుబంటు వలె, దర్పము లర్వఁగ వచ్చి పిల్వఁగా । నే నటు పోక తద్వికృతి, నెట్లు స
హింతు రణానివర్తికి । న్మానితశౌర్యశాలి కభి, మానికి వైరికృతావమాన । మ
జ్ఞానన చాపుకంటె ధర, నక్కటతుచ్ఛము కాదె చూడఁగన్ ॥ (క) అనిసే
యు కౌతుకంబున । నునిచెంచి మదస్వనంబు, సలిపెడుభాస్వ । త్తనయుని పటు
సంరంభము । వనితా యే నెట్లు సైఁచు, వాఁడం జెపుమా ॥ (తే,గీ) కాంతను



త్కృతమందు రాఘవునిఁ గూర్చి । యుమ్మలింపఁగ నీకుఁ గార్యమ్ముగాదు । ధ
ర్మవిదుఁడు కృతజ్ఞుండు, నివర్ణలాత్ముఁ । డమ్మహామహుఁడేల పాపమ్ము నను ॥
(చ) ఎఱుఁగక యిట్లు పల్కఁదగ, వే మగువా పతిసౌహృదంబుచేఁ । గఱపితి
దానికేమి బల, ఘస్మరుఁడైనఁ గొంత లేదు నా । తెఱఁగును సత్త్వసంపదయు
ధీరతయు న్మను సీవెఱుంగవే । మఱలుము మాఱుమాటనక, మానవతీ వనితా
యుతంబుగన్ ॥ (వ) ఏను రయంబునం జని సుగ్రీవుని డాసి ప్రాణంబులం గొ
నుటకుం దెగక కాష్ఠముష్టిప్రహారంబుల నేర్పున దర్పంబుపసంహరించి వచ్చెద
నతండు మదీయపాణిప్రహారపీడితుండై తొల్లింటివడువునఁ బాఱంగలండు నీవం
తఃపురంబునకుం జను మింక మాఱువలికితివేని మదీయప్రాణంబులచేత శాపిత
వయ్యెదవనిన నద్దేవి యతనిం గౌఁగిలించుకొని మందంబుగా రోదనంబు సేయు

——(*) వాలి సుగ్రీవుని కడకేగుట. (*)——

చుఁ బ్రదక్షిణంబుఁ జేసి విజయంబు దొరకొనుటకు మంత్రపూర్వకంబుగా స్వ
స్త్యయనంబొసంగి శోకమోహితయై మఱలి మఱలి చూచుచు నంతఃపుర
బునకుం జనియె నిట్టెఱంగున నందారంబనిచి సంక్రందననందనుండు పరమరోష
ణుండై మహాసర్పంబుకరణి నూర్పులుపుచ్చుచు నతిత్వరితగమనంబున బుర
బు నిర్గమించి నలుదిక్కులుం బరికించి ॥ (చ) అటఁ జనికాంచె శక్రసుతుఁ,
డాహవదీక్షితు నుగ్రదర్శనుం । బటుతర బాహువిక్రముని, భాసుర తేజుని హే
మపింగళుం । గుటిలునిఁ బర్యవస్థితుని, ఘోరరవు న్వికటాట్టహాసు ను । త్కట
మదరోషవిస్ఫురిత, దారుణనేత్రుని భానుపుత్రునిన్ ॥ (క) కని యగ్గలమగు
కోపం । బున వచ్చి తివటర మఱలఁ, బోరికి భాస్వ । త్తనయా యనితత్సంద । ర్శ
నజాతభుజావలేప, సంరంభుండై ॥ (వ) కటితటంబునఁ జేలంబు బిగియించి ॥
(మ) వికటభ్రూకుటి దుర్నిరీక్ష్యుఁ డగుచు, న్విస్రస్తుఁడై శ్లిష్టము । ష్టికఠోరం
బుగఁ దాల్చి భీషణరవ, స్ఫీతాస్యుఁడై వేగడా । సికడంకం దనయట్ల గాఢముగ
ముష్టింబూని యేతెంచు సూ । ర్యకుమారుం గనిపల్కెఁ గాలపవన, వ్యా
లోలమేఘూర్భటిన్ ॥ (క) సునిహితమగు నాముష్టిని । గనుఁగొంటివె యి
ది మహోగ్ర, కఠినాశనితో । నెనయై నీజీవితములఁ । గొను సంగ్రామమునఁ బొ
ఱకుము నా ప్రమోలన్ ॥ (క) నావినిరోషంబునను । గ్రీవుఁడు నాముష్టిఁ జూం
డు, కీశోత్తమనీ । జీవితముఁగొనుచు వజ్రము । కైవడిమస్తకము మీఁదఁ, గడున

డిగ్రాలుఁగ్ ॥ (వ) అని పలికిన సంక్రుద్ధుండై శక్రనందనుండు పిడుగునకంటె గాఢిదంబగు పిడికిటం బొడిచిన ॥ (క) తాడితుఁడై సుగ్రీవుఁడు । గాఢోద్ధతి

(*) వాలిసుగ్రీవులు ద్వంద్వయుద్ధముఁ జేయుట. (*)

శోణితార్ద్ర,కాయుం డగుచుం । బీడితనగు గిరికైవడి । పోఁడిమిసెడక పుడు భూరి,భుజబలయుక్తిన్ ॥ (శా) నాలంబోకట్టి పెల్లగించిపృథుదోస్సత్త్వం బునెపింపఁగా । వాలిన్వైచినవిహ్వలుండగుచుదుర్వారోగ్రవజ్రాహతిన్ । న్నైల ప్రక్రియనేలఁవ్రాలిమిగులన్గంపించె మున్నీటిలో । నాలోలఘ్నవీచికోచ్ఛలితభా రాక్రాంతపోతాకృతిన్ ॥ (ఆ,వె) అంతఁగొంతవడికినమ్మహేంద్రసుతుండు । సేద దీర్చికొనివిశేషబాహు । బలసమగ్రుఁడగుచుఁ బడపడిసుగ్రీవు । నంటఁదాఁకె నాతఁడతనిఁదాఁకె ॥ (వ) ఇట్లెఱుఁగునందలపడి సుపర్ణసమవేగులును భీమబల విక్రాంతులును బ్రవృద్ధఘోరశరీరులునై యవ్వానరపుంగవు లంబరంబునం బన్ని చంద్రసూర్యులచందమున నన్యోన్యచ్ఛిద్రాన్వేషణంబు సేయుచుఁ బోరు సమయంబున ॥ (ఆ, వె) శక్రనందనునకు శౌర్యవీర్యపరాక్ర । మాదికంబులధిక మగుచువచ్చె । నర్కనందనునకునంతకంతకునవి । యన్నియునువిహీనమగుచు వచ్చె ॥ (ఉ) అప్పుడువాలిచేతజల జాప్తకుమారుఁడుభగ్నదర్పుఁడై । చొప్పఱి యుండియుగ్రగతి సొంపుసగొండొకధైర్యముఁదీనే । రొప్పఁగముష్టిజానుచర ణోపలబాహునఖద్రుమంబులన్ । దెప్పరమైనచందమునఁ దెంపునఁ బోరుచు నుండెనుద్ధతిన్ ॥ (క) ఇట్లెఱుఁగునఁ దార్కొనుటయు । నత్తరుచర వీరులకుభ యావహాగతిఁబో । రత్తఱిబలువైచెల్లెవి । యత్తలమునవృత్రునకు బలారికిఁబో లెన్ ॥ (ఉ) ఒండొరుమీఁదసాలముల నుద్ధతివైచుచురక్తధారలొం । డొండదొ రంగమేఘముల యొప్పునమింటరవంబెలర్పఁగాఁ । జండగతిందిరస్కరణశబ్ద ములేర్పడఁబెట్టుదాఁకుచుం । జండనుయూథనందనుఁడుశక్రసుతుండునుబోరిరుద్ధ

—(*)రాముఁడు వాలిపై దారుణబాణమును బ్రయోగించుట.(*)—

తిన్ ॥ (వ) ఆసమయంబున ॥ (చ) నగములపొంతఁబొంచిరఘునాథుఁడుమాటికిఁజూ చుచున్నవాఁ । డగుటరయంబునన్ఘనభుజాంచితసత్త్వముదక్కిదీనుఁడై । సొగసిభ యార్తినద్దెసలుచూచుచునున్నదినేశపుత్రునిం । దగఁబరికించివానిభుజదర్పము సైఁపకతత్క్షణంబునన్ ॥ (ఉ) క్రొంచకక్రూరసత్వనిభఘోరశరంబరిఁబోసి కాలుఁ డుం । బొంచికగాఁలచక్రమును బోలెఁబ్రచండశరాసనంబు పూ । రించివిమృగ



ద్విజంబు లోకరీతి భయంబునఁబాఱనార్చెమో । యుంచిసురేంద్ర పుత్రుని ప యింబరఁగించె జగంబులాగ్రుఁగన్ ॥ (క) ఇమ్మెయిరామధనుర్ము । క్తమ్మగు మహనీయశరము దారుణపవిఘోషమ్మునఁజనవాసవివ । క్షమ్మునవెసనాటెఁ బిడుగు కైవడిఁబెలుచన్ ॥ (క) నాటుటయు వాలిగ్రక్కునఁ । బాటిల్లినవేద నాతి భారముకతనం । బోటఱి నేలంబడె శత । కోటిహతంబైనభూరి కుధర ముమాడ్కిన్ ॥ (వ) మఱియుఁగాల కటాక్షసన్నిభంబును గాంచన రూప్య భూషితంబును నగు నద్దివ్యసాయకంబు సధూమంబగుభర్గనేత్రాగ్నియుంబో లెఁ బ్రజ్వల జ్వాలాజాలభీషణంబై రయంబునంబఱతెంచి వాలివక్షంబునాటి నఁ దత్క్షణంబ పుష్పితాశోకంబుచందంబునక్షతజోక్షిత శరీరుండై పరశునికృ త్తంబగు పాదపంబుకైవడి గాఢదేశంబునం దశ్వయుక్పూర్ణమాసియందుశ క్రోత్సవాఘణంబు సంస్థాపించి యుత్సవానంతరంబునం బడఁద్రోచిన యింద్ర ధ్వజంబుపోలిక ధరణిపయిం బడియెనప్పుడు ॥ (క) బలసూదనాంశ తేజః । కలితుండగు వాలిపడిన, కతమునధాత్రి । తల మిందుఁడులేని నభ । స్థలముప గిదిఁగడు నశోభి,తం బయ్యెంబిహిన్ ॥ (చ) గురుతర సాయకాభిహతిఁ, గాం

(*) వాలి రామబాణ పీడితుఁడై నేలం బడుట. (*)

డవిధంబున నేలఁగూలియుం । దరుచరశేఖరుఁడు పిత్ర్య,రత్నమణీమయ హేమ మాలచే । దరణికరంబులం గలసి.తద్దయు సంధ్యలయందుఁబొల్చుభా । సుర జలదంబు చందమున,శోభిలె శోణితసిక్తగాత్రుఁడై ॥ (వ) మఱియును ॥ (చ) సురవరదత్తవజ్రరుచి,శోభితకాంచనమాలవక్షముం । దురుతరభంగిశోభిలుచు, నున్నకతంబునజీవితంబులు । న్గురుతర విక్రమంబును మ,నోహర తేజముభూరి కాంతియుం । బరువడివాలిగాత్రమును బాయకయుండెమహాద్భుతంబుగాన్ ॥ (క) ధరఁబడిన వాలి మాలయు । శరము శరీరంబు మిగుల సంశోభించెన్ । గురుతరమగుతత్తేజం । బరుదారఁగ మూఁడువిధము లాయెనొయనఁగన్ ॥

—(*)రాముఁడు వాలిసమీపమునకు వచ్చుట. (*)—

(క) రామధనుర్ముక్తంబగు । భీమాస్త్రంబప్పుడు జంభ భేదిసుతునకున్ । దోర్భీమార్గభావనంబై । కామితపరమ గతిదాయకంబై చెల్లెన్ ॥ (వ) అప్పుడు ॥ (సీ) విగతతేజుండగు వీతిహోత్రునిమాడ్కిఁ బుణ్యాంతమున సురపు రమునుండి । యవనిపైఁబడిన య యాతిరీతియు గాంతముందుఁ గాలంబుచే,

నచలమీఁదఁ । బతితుఁడై నదినే శుభంగిసాంపతినేలఁ బడియున్నవాని గోపతి
యుఁబోలె । దుర్ధర్షుఁడగు వాని ధూర్తసర్పముఁబోలెఁ బోరిఁ బోరి
నూర్పులుపుచ్చువాని ॥ (తే,గీ) సింహవక్షుంబు వానిఁ బ్రసిద్ధదీర్ఘ । బా
హువులవానిదీప్తలపనమువాని । కనకమాలినివాలినిగదియవచ్చె । జానకీజా
నిసౌమిత్రి సహితుఁడగుచు ॥ (క) చనుదెంచినరఘురామునిఁ । గనుఁగొనిహ
రివరుఁడు హేతుగర్భితముగని । ట్లనియెంబలుకులధర్మం । బును బారుష్యం
బు న్యాయబోధముగలుగన్ ॥ (క) అంచితధర్మంబరయక । కొంచకసం
గరపరాఙ్ముఖుఁడనగునన్నున్ । వంచించియేమిగుణమా । జించుటకు వధిం
చితివు పృథివీశసుతా ॥ (మ) సమయజ్ఞుండు దృఢవ్రతుండును బ్రజాసంరక్ష
ణోద్యోగియు । త్తమవంశుండునుధర్మవేదియుదయాదాక్షిణ్యసత్త్వాన్వితుం।
డుమదక్రోధవివర్జితుండు రఘునాథుండంచు నీకీర్తని । త్యముఁగీర్తించుస
మస్తభూతనివహం బత్యంతయోగ్యంబుగన్ ॥ (క) దమమును ధృతియునుదే
జము । శమమును సత్యంబుక్షమయు సామంబుపరా । క్రమమపకారుల దం
డనం । బను దానమునృపులకివి ప్రధానగుణంబుల్ ॥ (తే,గీ) అట్టిగుణము
లుగలవాఁడ వనితలంచి । యంగనాప్రతిషిద్ధుండ నయ్యు సేను । నసకిఁ బిలిచినఁ
బోకుండు టనుచితంబు । గానవచ్చితిఁ బగలుని కడిమిఁ జెఱుప ॥ (క) పేరుని
త్రోవవారొకనిప్రతి । వీరుఁడనై పోరుచుండ వెనుకనొదిగిని । ష్కారణముగ
వంచించితివి । దారింపఁగనీకురాజ ధర్మంబగునే ॥ (ఉ) లావును జేవయుం
గలుగు రాముఁడుతోడ్పడి యున్నవాఁడుసు । గ్రీవునకీవుపోవలదు కృత్రిమభం
గి వధించునంచునా । దేవియెఱుంగఁజెప్పినను ధీరతఁగైకొనకమ్మహాత్ముఁడే ।
లావధియించు ధర్మపరుఁ డంచుఁదలంచితిఁగాదెయత్తఱిన్ ॥ (క) నిర్మ
లమతి వనియును నృప । ధర్మవిశారదుఁడవనియుఁ దలఁచితి నిటుదు । ష్క
ర్మమునకుబోయలక్రియ । నమర్మలిఁ బొల్పుడుటఁ దలఁపనైతి నృపాలా ॥

(*) వాలిరాముని నానావిధంబుల నిందించుట. (*)

(క) నీపాటిధర్మపరునకు । క్ష్మాపాలకుమారయిట్టికల్మషకార్యం । బేపాటి
తృణసమావృత । కూపమువనినిన్నెఱింగి కొనలేనైతిన్ ॥ (క) మనమునఁగి
ల్బిషమిడుకొని । మునివేషముఁబూని నెయ్యిఁబూసినయసిసాం । పునభస్మ
చ్ఛన్నుండగు । ననలునిక్రియ నుండుటెఱుఁగనైతి నృపాలా ॥ (క) వినుమెం



తసత్కులంబున । జనియించిననేమికపట చరితుఁడు మదిలోఁ । దనగుణము
విడువనేర్చనె । జనవరనీయందునట్టిచందముదోఁచెన్ ॥ (క) మున్నెచ్చ
ట నైననునీ । కెన్నఁడువిప్రియమొనర్చ నెఱుఁగనినన్నుం । గ్రన్ననినీదగు
దౌష్ట్యం । బెన్నికకెక్కంగఁజంపితేలన్నృశంసా ॥ (క) సదయుఁడు రాఘవుఁ
డేలా । యదయతఁ బాపంబుసేయు ననియేమఱినేఁ । డసరక వచ్చిననన్ను ।
న్వధియింపఁగఁజెల్లెనీకు వంచనచేతన్ ॥ (క) ఫలమూలంబులు మెసవుచు ।
నలయక నిత్యంబు దారుణారణ్యంములం । గలయవిహరింపుచుండెడు । బ
లీముఖుని నన్నుఁజంపఁ బాడియెనీకున్ ॥ (క) కులమును సత్యము తేజము ।
చెలువము విక్రమముధృతియుశీలముయశము । న్బలమెక్కుడగుచునుండఁగ ।
నిలనీమనమునకుహైన్య మేటికిఁగలిగెన్ ॥ (తే,గీ) రాజకులమునఁబుట్టివిఖ్యా
తిఁగాంచి । నట్టివాఁడెవ్వఁడేని నీయట్లకపట । ధర్మలింగప్రతిచ్ఛన్న తావిశే
ష । మలముకొని క్రూరకర్మంబునాచరించు ॥ (తే,గీ) అవనినిట్టియభవ్యుం
డ వైననీవు । పావనంబైన మౌనిరూపంబుఁదాల్చి । యేల విహరించెదవు ధ
ర్మశీలుఁడనఁగ । లోకవిఖ్యాతియెబ్భంగి నీకుఁగలిగె ॥ (తే,గీ) మానవేంద్ర
పాపాత్ముండ వైననీకు । భవ్యతరమైన మౌనిరూపంబిదేల । సమరధర్మప్ర
కారవిశారదులకుఁ । దాల్పఁదగిన యీదివ్యకోదండమేల ॥ (వ) రఘువరా
యేము వనచరులము మీరు మనుష్యులేము మూలఫలోపజీవులము మీరు రాజా
న్నభోజనులు గావున మీకుమాకునించుకయైన వైరప్రసక్తి గలుగదదియునుం
గాక ॥ (తే,గీ) వసుధయును గాంచనంబును వైరమునకు । నైనమూలంబులి
వి మదీయంబులైన । ఫలములందేని లాభంబుఁ బడయఁగోరి । మిహిరకులజ
వంచించి చంపితివిచెప్పుము ॥ (వ) మఱియు నయంబు ననుగ్రహంబు నీరెండు
ను సద్రాజధర్మంబులు విపరీతనయంబును నిగ్రహంబును నీరెండును గుత్సిత
రాజధర్మంబులగు నిట్టిరాజవృత్తి పృథగ్విధంబై గ్రహింపందగియుండునై
నను రాజులుతమయిచ్ఛకొలందినయానుగ్రహంబును దుర్నయనిగ్రహంబులును
గావింపరు నీవు కామప్రధానుండవు కోపనుండవు మర్యాదారహితుండవు సం
కీర్ణరాజచరితుండవు వధ్యావధ్యవిచారంబు దక్కి సాధులహింసించెదు న
ట్టిక్రూరుండవదియునుంగాక ॥ (తే,గీ) మనుజవర్య నీ వర్ణధర్మములచం
ద । మించుకైననెఱుంగలేవింద్రియాను । షంగమునఁజేసి కామసంసక్తిఁదగి

లి। నిత్యముఁ గృశించెదవు బుద్ధి నియతిలేమి॥ (ఆ,వె) అనపరాధినైన నన్నుఁ జంపినిందితి। మైనక్రూరకర్మ మాచరించి। నరవరేణ్య సాధుపురుషమధ్యంబునఁ। దలఁకకేమినీతిఁ బలికెదింక॥ (చ) పతితుఁడు ప్రాణిహింసకుఁడు బ్రాహ్మణహంతయు రాజహంతగ। ద్వితుఁడును నాస్తికుండు పరివేత్త కదర్యుఁడు గోఘ్నుసూచకు। ల్మిత్రజనహంత చోరుఁడజితేంద్రియుఁడుర్గురుతల్పగుండు దుర్గతికిపోవుం బరంబుఁ జెడి క్రక్కునఁబోదురు నిక్కమింతయున్॥ (తే,గీ) పంచపంచ నఖంబులు భక్ష్యములుమ। హీసురోత్తమునకు మాన వేశ్వరులకు। శశము కూర్మంబు గోధయు శల్యకంబు। శ్వావిధంబును ధరలోన జనవరేణ్య॥ (వ) ఏను ధర్మార్థంబనుక్తంబైన పంచనఖజంతువగుటం జేసి॥ (తే,గీ) దశరథకుమార నీయట్టి ధార్మికులకు। నాదు చర్మంబు మెయిఁదాల్ప రాదు నెమ్ము। లంటఁగారాదు మాంసంబు నావహింప। రాదు నన్నుఁ జంపనికేమి లాభమయ్యె॥ (తే,గీ) మానవేశ్వర సర్వజ్ఞుమైన తార। యెఱిఁగి యెంతబోధించిన నరకుగొనక। యంతకాలంబు డగ్గఱినందువలన। మోహవశమున వచ్చితి మోసపోతి॥ (క) వాలాయము నీచేఁ బరి। పాలితయగు భూతధాత్రి భద్రమువడయం। జాలదు ధూర్తవిభుని చే। శీలాలంకారమైన చెలువయుఁబోలెన్॥ (తే,గీ) నికృతి జీవి విశఠుఁడవు నీచమతివ। ధార్మికుండవు మఱియు మిథ్యాప్రశాంత। మానసుఁడవీవు నృపలోక మాన్యుఁడైన। పఙ్క్తిరథుఁడెట్లు సుతునింగఁ బడసెనిన్ను। (తే,గీ) త్యక్తధర్మాంకుశంబు మదాన్వితంబు। భిన్నచారిత్రకక్ష్యంబుభీషణంబు। సాధుహింసోత్థితంబగు సమదరామ। హస్తి చేసేఁడు నిహతుండనైతినకట॥ (క) అనుచిత మమంగళములో। కనిందితమునైన దీని గావించి మహాజన మధ్యంబున భూవర। తనయా యిఁకనేమి పలుకఁ దలఁచితి బుద్ధిన్॥ (తే, గీ) రామ యే నీదు రంత విక్రమము ధాత్రి। ననపరాధులమైన మా యందుఁ గడువి। రాజితంబయ్యె నట్టి పరాక్రమంబు। కడఁగి యపకారులందేమి గానము గద॥ (క) వంచించి కానఁబడక వ। ధించితి గాకెదుట నిల్చి ధీరతననిఁ గా। వించిన నిను యమపురికి నొ। కించుకమాత్రమునఁ బుచ్చనేయవలీలన్॥ (తే,గీ) అవనినాథ దుర్ధర్షుఁడనైనయేను। మునసినీచేతఁ జచ్చితి మోసపోయి। కాలసంయోగమునఁ జేసి గాఢనిద్రఁ। జెందిననరుం డుసర్పంబుచేతఁబోలె॥ (క) నాతోనీదగు కార్యము।



చేతోముదమలరమున్నె చెప్పితివేని। ఖ్యాతిగ నొకగడెలో ధర। జాతనయను దెచ్చియొసఁగనేయవలీలన్॥ (ఉ) భూవరవర్య యొవ్వనిస ముగ్ధతిఁ జంపుటకై గడంగిసు। గ్రీవునితోడ నెయ్యమొనరించి తదీప్సితసిద్ధిఁ గోరిన। న్నీవిధిఁ జంపితక్కదనుజేంద్రుని రావణుఁ గీటడంచి నీ। దేవిని నెందుడాఁచినను దెచ్చియొసంగనె యొక్కక్రేవ్రేల్మిడిన్॥ (క) జలధిజలమందు డాఁచిన। నలయక పాతాళజగము నందు నిడినమై। థిలిని గొనితెచ్చియొసఁగనె। పొలుపుగ శ్వేతాశ్వతరిని బోలెన రేంద్రా॥ (వ) రాజనందనా సుగ్రీవుండు నాకు జ్ఞాతిగావున నన్ను వధించి వానరరాజ్యంబుఁ గైకొనుటది యతనికి యుక్తధర్మంబగుం గాని వంచించి రణంబున నన్ను వధించుటది నీకు యుక్తధర్మంబు గాదు లోకంబునందు మర్త్యులకెల్ల మరణంబు గలుగుటది నిసర్గంబు నీచేతఁ గావింపంబడిన యీకృత్రిమవధరూపకార్యంబు యుక్తంబగునేని సమాధానంబైన యుత్తరంబు యోచించి చెప్పుమని పలికి॥ (క) ఘనుఁడైన పాకశాసన। తనయుఁడు నోరెండఁ దీవ్రతరశరకృతవే। దనకోర్వక దశరథతన। యునిఁ జూచుచు మాటలుడిగి యూరకయుండెన్॥ (తే,గీ) సాధువినుతంబు ధర్మార్థసంహితంబు। పరుషముహి

—* రాముఁడు వాలికిఁ బ్రత్యుత్తరములు చెప్పుట. *—

తంబు యోగ్యంబు ప్రశ్రితంబు। నగపురందరసుతు వాక్యమాలకించి। వాక్యకోవిదుఁ డారఘువర్యుఁ డపుడు॥ (మ) హతభానుండగు భానుభంగి గతతోయాభ్రంబు చందానసం। హతతేజుండగు వహ్నిరీతి వికలుండై యున్నవానిన్ సము। న్నతసత్త్వాఢ్యుని వ్యక్తవాక్యు నిరణన్యాయైకశీలున్ సమి। జ్జితశూరాలిని వాలిఁ గాంచి నయముం జెల్వొందఁ గానిట్లనున్॥ (తే,గీ) అగచరకులాగ్రగణ్య ధర్మార్థకామ। ములును లౌకిక సమయంబుఁ దెలియకిపుడు। బాలిశత్వంబు వలన నీ పగిదినన్ను। నిష్ఠురోక్తులనిందింపనీకుఁదగునె॥ (క) గురుసమ్మతులతిసుగుణో। త్తరులగు పెద్దలవిధంబుఁ దలఁపకిపుడు వా। నరచాపల్యమువలనను। దరమెఱుఁగక నన్ను దూఱఁదగవే నీకున్॥ (క) జలధిగిరిసహితయగు నీ। యిల యిక్ష్వాకులది వారు మృగపక్షిమను। ష్యులసముయమరసికావను। జలమున దండింపనధికశక్తులు ధాత్రిన్॥ (ఉ) అట్టిధరిత్రి నద్భుతదయాకలితాత్ముఁడు రాజనీతికిం। బుట్టినయిల్లు ధర్మముల ప్రోవు శమాదిక సద్గుణాలికిం। బెట్టియ యర్థధర్మముల పేరిటివృక్షము నెమ్మనంబునం। దొట్టిన సత్యయుక్తి భరతుం డిపుడేలుచు

నున్నవాఁడ వోగిన్॥ (క) వినయంబును నయమును సత్యము । ఘనతర విక్రమము దేశకాలజ్ఞత్వం । బును నిగ్రహంబనుగ్రహ । మనుపమగతి నొప్పుచుండు నాతని యందున్॥ (తే.గీ) ఇతరనృపులును మేము సొంపెసఁగ నతని । సత్యధర్మకృతాదేశసరణి నొంది । పరఁగ ధర్మపరంపరా ప్రాప్తి కొఱకు । వసుధ నెల్ల ద్రిమ్మరుచున్నవార మిపుడు॥ (మ) దురితధ్వాంతసహస్రరశ్మి నృపశార్దూలుండు ధర్మజ్ఞుఁడా । భరతుం డేలిక యాచునుండ నయసంపన్నుండుగా కెవ్వఁడు । ర్వ్వరవర్తించు నొకానొకండు జడతన్ వర్తించిన న్వానిబం । ధురశౌర్యంబున నిగ్రహింతుము వడిన్ దుర్వారరాజాజ్ఞచేన్॥ (క) కర్మ విగర్హితుఁడవు నృప । ధర్మవిహీనుఁడవు కామతత్పరుఁడవు స । త్కర్ములగు సాధులూడిన । నిర్మలమార్గమున నిలిచి నెగడవు ధాత్రిన్॥ (క) నీతిజ్ఞుఁడైనవానికి । త్రైతలమున నెఱుఁగవలయుఁ గపివరజ్యేష్ఠ । భ్రాత నుదాత నువిద్యా । దాతను ముప్పురనుదనకుఁ దండ్రులుగాఁగన్ ॥ (క) అనఘచరిత్రుండగు తమ్ముని శిష్యుని మఱియుఁదనకుఁబుట్టినవాని । న్వినుమీ ముప్పురసంక్రమ । దనతనయా పుత్రులనుచుఁ దలఁపఁగవలయున్॥ (వ) కపీంద్రా సర్వభూతహృదయస్థుండైన పరమాత్మ శుభాశుభకారణంబులైన ధర్మాధర్మంబులెఱుంగు నీయట్టివాఁ డెఱుంగంజాలఁడు సూక్ష్మంబైన ధర్మంబు సాధువులకైనను బరమదుర్జ్ఞేయంబు భవాదృశులకుం జెప్పనేల నీవు జాత్యంధులం గూడిన జాత్యంధునిభంగి నకృతాత్ములైన చపలవానరులం గూడి యతిచపలుండవై ధర్మార్థప్రకారంబేమియు నెఱుంగవే నీ పూర్వోక్తవాక్యార్థంబు వ్యక్తంబుగా నీకెఱింగించెద నన్నుఁ గేవలరోషంబువలన నిందింపకుము॥ (సీ) సురనాథతనయ శిష్యునిభంగి నతిభక్తిఁ బాయక శుశ్రూష సేయునట్టి । యనుజుని పత్ని యంచతికామమున ధర్మస్థితి నాతండు బ్రతికియుండఁ । జరియించితివి గానఁ గరము నీయందు దండంబు ప్రయుక్తమైతనరె నిపుడు । ధర్మవిద్వేషికీ దండంబు దక్కవే ఱొకటి నిగ్రహవిధము ర్వి లేదు॥ (తే.గీ) భగినిఁ గూఁతును దమ్ముని భార్య నెవ్వఁ । డధిగమించు నతఁడు వధ్యుఁడని రిమాను । లెఱిఁగి దండించినను బాపమేల గల్గు । నుర్వివిభునకు దండింపకున్నఁ గాక॥ (వ) వానరేంద్రా భ్రాతృభార్యావమర్శనంబు సుగ్రీవునకును సమానంబనియంటివేని సుగ్రీవుండు మాయావి బిలాంతర్గతయుద్ధంబున నీమరణంబు నిశ్చయించి తారయందు వర్తించె నీవు సుగ్రీవుండు సప్రాణుండగుట యెఱింగి



యు నతని పత్నియగు రుమయందు వర్తించితివి గావున నీదోషంబునకును సుగ్రీవుని దోషంబునకును వైషమ్యంబు గలదట్లగుటం జేసి నిన్ను వధించితి దీనదుష్టనిగ్రహశిష్టపరిపాలక సార్వభౌమ భరతమహీపాలకాజ్ఞాకారినగు నాకు దోషంబు లేదు ॥ (ఆ.వె) పరమధర్మవిదుఁడు భరతుఁ డధీశుఁడే । మతనియాజ్ఞఁ బూనియులరు వార । మీవు సాధుధర్మహీనవర్తనుఁడవు । శిక్ష సేయవచ్చు నెట్లు మాకు ॥ (తే.గీ) ధర్మసంస్థాపనంబున ధర్మనిగ్ర । హంబు భరతునకిపనుల గొనియాజ్ఞఁ । బూని చరియించెదము మిముబోఁటి దుష్ట । వర్తనులఁ బట్టి తునిమెదు వాంఛఁ జేసి ॥ (వ) అదియునుంగాక లక్ష్మణునితోడం బోలె సుగ్రీవునితోడ వహ్నిసాక్షికంబుగా దారరాజ్యనిమిత్తంబు సఖ్యంబుఁ జేసి వాలిం బరిమార్చెదనని వానరమధ్యంబున బాసయిచ్చియున్నవాఁడ నా సుగ్రీవుండు నాకు శ్రేయస్కరుండు గావున మిత్రశత్రుండవైన నిన్ను వధించి ప్రతిజ్ఞ నెఱపుట ధర్మవిరోధంబుగాదు ప్రాణసమానమిత్రుండైన సుగ్రీవునకు శత్రుండవైన నీవు నాకు శత్రుండవగుట కేమి సందియంబు నిన్ను వధింపనినాఁడు నాకు మిత్రద్రోహదోషంబు వాటిల్లు నిష్కారణంబుగా నిన్ను వధించినవాఁడఁ గాను భ్రాతృభార్యాపహరణ భరతాజ్ఞాకరణ సుగ్రీవసఖ్యకరణ ప్రతిజ్ఞాకరణాది ధర్మసంహిత సమస్తకారణంబులచేత భ్రాతృభార్యాపహారకుండైన నిన్ను శాసించితి నిది శాస్త్రవిహితంబని నీవును యోచింపవచ్చు సర్వప్రకారంబుల భవన్నిగ్రహంబు సాధుసమ్మతంబగుం గాని నిందితంబుగాదు ధర్మవిశారదుండగు సుగ్రీవునకు మత్ప్రతిజ్ఞాత భవద్వధరూపకార్యంబు కర్తవ్యంబు ధర్మవిశారదుండవగు నీచేత నాత్మవినిగ్రహరూపకార్యంబు శక్యంబై యుండు మదీయదండంబున నీవు దురితంబులం బాసి పుణ్యగతికిం జనియెదవు ఈయర్థంబునందుఁ గొన్ని మనువచనంబులు గలవవి చారిత్రవత్సలంబులై ధర్మకుశలురగు వారలచేత గృహీతంబులై యుండు వత్ప్రకారంబు వినుము ॥ (క) జను లఘములాచరించియు । జనవర కృతదండు లగుచు సన్నుతయశులై ॥ యనిమిషులోక పదమునకు । జని శతగతిఁ జనుదురధిక సుకృతులమాడ్కిన్ ॥ (క) జననిందితమగు వృత్తముఁ । గొనకొని కావించునట్టి కుజనుల దండిం । పనివాఁడు రాజువారల । ఘనతర దోషముల నొందఁ గలఁడు నిజముగాన్ ॥ (వ) అని మనువు చెప్పెనదియునుం గాక తొల్లి నీచేతం బోలె నొక శ్రమణ

షుని చేతఁ బాపం బాచరితం బగుచునుండ మద్వంశ శ్రేష్ఠుండైన మాంధాత చేత నా శ్రమణునియందు ఘోరంబగు దండంబు ప్రయుక్తంబయ్యె మఱియు రాజులు ప్రమత్తులగుచునుండఁ గొందఱుజనులు నీయట్ల పాపం బాచరించి రాన సుధాధిపులు పిమ్మట ధర్మపరామర్శవేళ యందు గతప్రమాదులై నియమపద్ధతి నప్పాపాత్ములకు వధబంధనాదిక ప్రాయశ్చిత్తంబుఁ గావించిరి దండకర్మంబున నమ్మహీపతులకు దుష్కృతంబొదవ లేదు గావున ॥ (ఆ,వె) ఏను దప్పుకార్యమెఱిఁగి నీదగు పాప । మువనివిభునిఁ జెందు ననితలంచి । ఘోరసాయకమునఁ గూలవైచితి దీనఁ । దప్పులేదు రాజధర్మ విధికి ॥ (క) నీవు మదప్రస్ఫాదు । ర్భావంబున ధూర్త ఘోర పాపుఁడవైదే । వా వాసమునకుఁ జనియెద । నీవిధమునఁ బరితపింప నేటికి నింకన్ ॥ (క) వనచర దుష్టుఁడవగుని । న్నని జంపుటవలన నేగ్ర, తాఘుఁడనైతి । న్నీవునుమిప్పుడు నాచేఁజ । చ్చినకతమున స్వర్గపదము, జెందితి వీవున్ ॥ (వ) ఇకార్యంబు మన కిరువురకు నధికోదయంబైన యది దీనికి వగచుట కార్యంబుగా దేము శాస్త్రవశ్యులము గాని స్వతంత్రులము గా మివ్విధంబు ధర్మంబు దప్పకుండఁ బరికల్పితంబ య్యెనట్లని తస్కర కృత్యంబునం బొంచి వంచించి నన్నేల ద్రుంచితి వని యాక్షేపించితి వేని దానికిం గల కారణంబు దెలిపెద హేతుమంతంబైన దాని విని నీ గోపంబును మనస్తాపంబునుం బాయుఁ దత్ప్రకారంబు వినుమని యిట్లనియె ॥ (సీ) మహిలోన మనుజులు మాంసార్థులై పొంచియైన మృగంబుల నిల్చియైన నేమి । బహువిధ వాగురా పాశకూటముల చేఁ బట్టుగొత్తుచున్నను, బడలియున్నఁ । దెలివితోనున్న ని,ద్రింపుచునున్న నేమఱియున్న సంక్రీడ, మఱిఁగియున్న । సౌముఖ్యముననున్న వైముఖ్యముననున్న సటులున్న మృగములఁ జంపసేతు ॥(ఆ,వె) రధిక ధర్మవేత్తలైన రాజఋషులు । ధర్మమనుచు వేఁటఁదగులుపడరె । నృపుల కెల్లఁ గతుల మృగములఁ జంపుట । వలనఁ గల్మషంబు గలుగ దెందు ॥ (క) నీవును శాఖామృగమవు । గావున వంచించి తీవ్రకాండమున హతుం । గావించితిఁ గిల్బిష మే । లావచ్చు న్ధర్మమార్గ లంబగుచుండన్ ॥ (క) సతతము శుభమనఘుస్ఙ । హితమునకును నీతికి నవివేకంబునకు । క్షితినాథులు బాలుఁడన । హితులు

—(*) వాలి రాముని స్తుతించుట. (*)—

పరమ ధర్మనిరతుం డంత యుధాత్రిన్ ॥ (క) అట్టి నృపులనవిసాతిం దిట్టుటయు



ను దెగడుటయును నిందించుటయు । న్నట్లు గుటనేరము పైఁ । బట్టుటదగ దెవ్వరికిని విపినాటవరా ॥ (ఉ) వేల్పులు ధాత్రియందు నృపవేషముఁ బూని చరింతు రిప్పుడీ । వల్పమనీష ధర్మమహిమాతిశయం బెఱుఁగంగ లేక సం । కల్పితముఖ్య రోషమునఁ గామమునం గలుషానుభూతికి । న్నాల్పడి వంశధర్మ పరిపాలు నినన్నిటు దూఱఁ జెల్లునే ॥ (మ) అని రామావనినాథుఁ డాడుటయుఁ గీశాధీశుఁ డవ్వాక్యము । ల్వినిధర్మంబు తెఱంగెఱింగి మది జాలిం జెంది దోషంబు రా । మునిపై లేదని నిశ్చయించి గతకోపుండై చు ఫాలంబునం । దనచేదోయి ఘటించి యిట్లని యెవాజైకపథ్యమే పారఁగన్ ॥ (మ) అనఘా మీరిపుడానతిచ్చినటులే యాసర్వధర్మ ప్రభా । వనిరూఢస్థితిఁ జెల్లె నీకు మఱి లన్యాక్రుచ్ఛ్రమాత్రాదు వాఁ । డనె మౌఢ్యంబున నింతకుం జెడుగు మాటల్పల్కితి నద్ధపుగాఁ । గొనక న్నింటి సహించి కావఁదగ వే ఘోరాఘసంతానున్ ॥(తే,గీ) అనఘచారిత్ర నీవు న్పష్టార్థతత్వ । విదుఁడవు జగద్ధితుండవు విమలబోధ । చిత్తుఁడవు కార్య కారణసిద్ధియందు । నీదు బుద్ధి ప్రసన్నమై నెగడుచుండు ॥ (వ) మహాత్మా యేను కృత్యాకరణవంతుండఁ బురస్కృతవ్యతిక్రాంతుండ నన్నుఁ బ్రియవాక్యంబు చేత నాశ్వాసింపుము ॥ (సీ) మనుజేంద్ర నాకు సామ్రాజ్యంబుపై మేనిపై దారపై మిత్ర బంధువితతిపై నొకించుక యనుభ్రాంతి లేదు గుణాకరుండు సువర్ణాంగదుండు నంగదుండు పిన్నటనాఁటనుండి పెంచినవాఁడు గావున నాపాటు గాంచి వీత । కమల తటాకంబు కైవడి శోషించునో యని చింతింపుచున్న వాఁడ ॥ (తే,గీ) వాఁడు బాలుండు నేరనివాఁడు ప్రియుఁడు । నేక పుత్రుండు బలవంతుఁడిన సుతుండుఁ । బోలె నీచేత సతతంబుఁ బ్రోవఁదగిన । వాఁడు నీపంపుఁ గావించు వాఁడు సుమ్మి ॥ (చ) అన

—(*) వాలి యంగదుని రక్షింపవలయునని రాముని వేఁడుట. (*)—

ఘచరిత్ర నీవును నియంతవు శాస్త్రవు రక్షకుండవాఁ । జనపతి చన్న పిమ్మటఁ బ్రసన్న కృపాప్తి సుమిత్ర పట్టియుం । దనిశముఁ గైక సత్తనయు నందును భానుజునందుఁ గల్గు పా । యనియనురక్తి యంగదుని యందును జేర్పుము నాదు పిమ్మటన్ ॥ (తే,గీ) బహుతపస్విని సర్వజ్ఞ పరమ సాధ్వి । యయ్యుమద్దోష కృతదోష యయ్యెనట్టి । తారని కఁదప్పు లెన్నక తపనసుతుఁడు । ప్రోచునట్లుగ నియమింపఁ బోలు నీకు ॥ (చ) వదలక నీకు భృత్యుఁడగు వాఁడు సుభాస్పదమైన ధారుణి । నృపమలనాక ముస్నడయఁ జాలునె టెంగియుఁ గాదు తావన । ల్వాదనుచుఁ

కొనుచుము। భర్గగతిఁ జనుదెంచె విభుఁడు పడియున్నెడకున్ ॥ (వ) ఇత్తెఱంగున జనుదెంచి॥ (శా) ఉర్విన్ దూలుచు రామబాణహతుఁడై యున్నవాని న్స్వామి। త్కార్తస్వరలక్ష సర్వక్షితివిలస త్సామ్రాజ్య సింహాసనో। ద్ధర్తన్ దుందుభిదానవాదిక సమ స్తారాతిసంతానసం। హర్తన్ భర్తను గాంచెఁ దార రఘునాథోగ్రాకల్పితస్వాంతయై॥ (వ) నట్టియు నామహాపాతకంబు శార్దూలంబుచేత నిహతుండైన మృగరాజుమాడ్కి నిర్వ్యాజ్ఞోపరతమైనుంబుకైవడి సర్వలోకార్చితంబయ్యు సవేదికంబయ్యుఁ గాకీయగ్రహారణవేళయందు నిగూఢనాగగ్రహణంబుకొఱకు గరుడునిచేత నున్మథితంబైన చైత్యంబు పగిది రామశరాభిహతుండై తరణికిరణ సమ్మిశ్రితంబైన సంధ్యాభ్రంబు భంగి రక్తసిక్తగాత్రుండై మహావారణంబులాగిన రణమేదినింబడియున్న వాని మహాపాతసమావిష్ట మహామేఘౌఘస్వన సన్నిభస్వనుండగు వాని శక్రసమాన విక్రముండగు వాని క్రీడాసమయకర కందుకీకృత కులాచలుండగు వాని శూరనిపాతితుండగు వాని హేమమాలిని వాలింబోలనాలోకించి తత్పరిసరంబునఁ బ్రచండ కోదండపాణులై యున్న రామలక్ష్మణులం జూచి ॥ (క) ఆలోలనయన మిక్కిలి। జాలింబడి పరశునిహత సాలముమాడ్కిం। గీలెడలిన జంత్రము క్రియ। నేలంగడు నవశయగుచు విలువున వాలిన్॥ (తే,గీ) ఇత్తెఱంగు వాలి యొక్కింత వడికి। మఱల నిద్రమేల్కాంచినమాడ్కిఁ దెలివి। నొంది కన్నుల శోక బాష్పోదకంబు। లరుగుదేరఁగ తారానాథ యనుచు నేడ్చె ॥ (తే,గీ) కురరికరణి దుఃఖించెడు కువలయాక్షిఁ। దూలఁగఁ దూల సుతు నంగదునిఁ గుమారుఁ। గాంచి రవిజుఁడు శోకంబు గప్పికొనఁగ। వాలిఁ బడిదైన్యమడర విషణ్ణుఁడయ్యె॥ (ఉ) అప్పుడు తార రామవిశిఖాసనముక్తశరాభిసంహతిన్। దెప్పరమైన బాధఁ బడి దీనతఁ జింతిలుచున్న వల్లభున్। దప్పక చూచి చేరఁజని తత్తనువంటుచు వాలిశోకముగ్గప్పికొనంగ భూమిభయుకం

—(*) తార వాలింగూర్చి విలపించుట. (*)—

పితయై విలపించె దీనతన్॥ (వ) తదనంతరవీరయట్లుగణ భూమిపైఁ బడ దీనయై వ నస్నరసి వచింప నేటికిఁ బు దక్కట తెమ్ము ధ జింపు మామునీ। హారశయ నోత్తమంబును మహాత్ములు రాజులు నిమ్మభంగిఁ జెం। కటిగ తభోగయుక్తిఁ గదినావని పైబడియుండ రేకదా॥ (తే,గీ) నిర్గతాసుండవయ్యు నన్నిట్టి యిట్లు। దయగా నెద్దానిసీవృగాగ్రములచేతఁ। గౌఁగిలించి విడిపట్టి సంగ్రామభూమి। యధిపనీవు మిక్కిలి



కాంతయయ్యెఁ గాదె॥ (సీ) మర్కటనాథ ధర్మము దప్పకుండియు ధ్ధము సేయుసి చేతసమ్ము చితముగ। రమణీయభంగి వీరస్వర్గసాధన భూతమహాహవభూమియందుఁ। గోరి కిష్కింధలాగున నేరోకపురంబు గరివని రతిమయ్యెఁ గాకయున్న। నిచ్చోట నేటికి నిట్టు శయనించితి చెలఁగి నాతోడ భాషింపవేల॥ (తే,గీ) యొనర సునఁగూడి మధుగంధి వనములందు। ఘనత నెయ్యోసి మాచేతఁ గాలమందు। నప హ్వాతములయ్యె నట్టిపదార్థములకుఁ। దలఁప నేఁడు విరామంబు గలిగెఁ గాదె॥ (ఉ) అక్కట నీవు రామవసుధాధిపముక్త శరాహతుండవై। చిక్కమునుండవై భవవిశేషముడంగి సుఖంబు పోయె నా। పెక్కువ సమ్మనంబు నశియించె నపారవిపత్పయోనిధిన్। దక్కక ముగ్నవైతి నీక నాకిల నెక్కడి జన్మసారయున్॥ (ఆ,వె) శక్రతనయ నీవు శరనిహతుఁడవై। దండిశోక మొందుచుండఁ గాంచి। పరఁగ నాదు గుండె బ్రద్దలైపోవదు। తాతఁ జేసినదియొ కోత నప॥ (క) అనుజుండగు రవిజుని భా। ర్యను రుమ నన్లపహరించి యాతని వెతలం। బనిచితి వా పాపము నేఁ। డనుపమభంగిఁ బరిపక్వమై చేకూడెన్॥ (చ) అనుజునితోడ నీవు కలహంబునకుం జనువేళఁ గాదువ। ల్దని హితమాడిన న్వినక నక్కట కాలము తాఁ టఁబల్కఁగా। బ్బునఁ గొని తెచ్చినట్లడగు పుట్టఁగ వచ్చితి వచ్చినంతనీ। కనుభవము యొనే చెడుగునై వచియించితినే హరీశ్వరా॥ (క) పుట్టిన్నందును శోకం। బెట్టిదొ యొక్కించుకైన నెఱుఁగని నేనిం। కెట్టు విధవనై దీనత। దట్టపు శోకమున గుంసు దానమహాత్మా॥ (తే,గీ) నగచరోత్తమ యిచ్చట నన్నుఁ బాసి। స్వర్గపురమందు రూపయౌవనవిశేష। దృప్తలైనట్టి యప్సరస్త్రీలఁ గూడి। ప్రీతి వారి చిత్తంబు హరింతుగాదె॥ (క) జితకాశియు నుపలాలితుఁ। డతిసుకుమారుఁడు సుఖార్హుఁడగు నంగదుఁడే। గతి వర్తింపఁగలండిఁకఁ। బితృవ్యుఁడు కరుణవిడిచి కుపితుఁడగుచుండన్॥ (వ) అని పలికి యంగదకుమారు నవలోకించి ॥ (క) తనయా యిట్లా కపిపతిగ। శరనమిఁక దొరకొనుట దుష్కరము నీకెందు। న్దని వాంఛ నిపుడె పోలం। గనుఁగొను మాతండ్రి వదన కమలము వత్సా ॥ (వ) అని పలికిన యంతకంత కగ్గలంబగు శోకంబున నద్దేవి వెండియు భర్తను దేశించి॥ (చ) వితతగుణాఢ్యుఁ డంగదుఁడు వీఁడె భవత్ప్రియనందనుండు నీ। మృతిగని శోకమున్ గడు నేమియుఁ దోఁచక పొక్కుచున్నవాఁ। డితనిని నూనదుఃఖ

మున కెంతియుఁబోల్పఁడఁగుఁడను జువా । క్షితితుల గారవింపుచు శిరంబుఁ
నూరొక్కనిబుజ్జగింపవే॥ (క) ఎటువైన సేమి రాముడుఁ । కుటిలతఁ దంచించి నిన్ను
ఘోరాస్త్రమునం । దటుకున జంపిన నలిసి । పటుతనయుని బుణమువలన విడివ
డియోఁగదా॥ (వ) అనిపలికి యలుకవాడమిన చిత్తంబున నత్తలోదరి యప్లవ
ననుతు నవలోకించి। (క) తెంపుననోరు చేసన్ను ను । జంపించితి కామితంబు స
మగూడెఁగదా । పెంపుగ నిఁక రుమతో భో । గింపు మిరాజ్యము గ్రహించి కృత
కాముఁడవై॥ (వ) అనిసోపాలంభంబుగాఁ బలికి వెండియు భర్తను ద్దేశించి॥
(క) బలరిపునందనయీగతి । విలపించెడునన్ను ప్రేమవీక్షించితగం । బలుకవది
యేలనీ భా । ర్యలనందఱవిరిఁజూడుమాకృప తెలియన్ ॥ (వ) అనిన నత్తారావి
లాపంబువిని యంతకుమున్ను చను దెంచి యచ్చోటనున్న వారగుటం జేసి తక్కి
నవాలిభార్యలగు వానరకాంతలు భర్తృమరణశోకాక్రాంతలై యంగిదుంబ
ట్టుకొని పెక్కు తెఱంగుల నాక్రందనంబు గావించిరి పదంపడి తార జీవితేశ్వ
రుం గౌఁగిలించుకొని॥ (ఉ) సాంగదవీరబాహుయుగ ళాప్రియపుత్రుఁడవైన
సికుని । మంగళవిగ్రహుం బ్రియకుమారుని సద్గుణసన్నివిష్టుని। యుంగదుఁ బా
సిపోవుటిది యర్హముగాదితఁ డెన్నఁడేనియు । న్సంగతి దక్కి విప్రియ మొనర్చనె
బాలుఁడు భక్తిశీలుఁడున్ ॥ (ఉ) అక్కట శీకువానరకు లాధిపవిప్రియ మించుకేని
యు । న్నెకొనిచేసియే నెఱుఁగ నీమృదుకంజసమాంఘ్రిమూలముల్ । దిక్కని
యున్న దాననమ ధీరత నొంటిగ డించిపోవఁగా । నెక్కడె పేగదోడుకొని యేగు
మువెంబడిఁగూడ వచ్చెదన్ ॥ (వ) అని యనేకప్రకారంబుల భర్తృసమీపంబున
వానరస్త్రీసమన్వితంబుగా దుఃఖింపుచు నతని తోడి దెలోకంబని తలంచి ప్రా

—(*) హనుమంతుఁడు తారనాశ్వాసించుట. (*)—

యోపవేశంబు సేయ సమకట్టి యంబరంబునుండి జారిన తారవగిది నేలంబడియు
న్న తారనవలోకించి మందమంద వాక్యంబుల నాశ్వాసింపుచు హనుమంతుండిట్ల
నియె॥ (క) వినుగుణదోషకృతంబగు । తనకర్మఫలంబు దేహితప్పక నొందు । జ్జన
నీయాలోకంబున । ననిశము శుభమైన నశుభమైనం జెలుచన్ ॥ (ఉ) పూనుక
దేహికింబుడమిఁ బుట్టినయప్పుడె చావుసిద్ధమౌ । మానిని వారి బుద్బుదస
మానబగు గాయమునందుఁ జూడనె । శ్వాసికి సేమశోకమను వాంతతప్పవే



కులైనను । జ్ఞానకులోద్భజన్మమరణంబులకుం దలఁకింపరెంతయున్ ॥ (ఉ)
ఈకపిచక్రవర్తి మనుజేశ్వర దివ్యపృషత్కపద్ధత । స్వీకనఘౌఘముల్ దొరఁ
గి నివర్లుఁడై సురరాజపుర్య సం । ఖ్యాకమనీయభూరి విభవాప్తి వహించె
సరోజనేత్ర నీ । వాకులపాటుదప్పి హృదయంబున ధైర్యముఁ గూర్పుమిత్త
ఱిన్ ॥ (చ) అడలెదు నిన్నుఁ జూచి హృదయంబున శోకము విస్తరింపఁగా । నడ
లుచు నున్నవాఁడు సుగుణాకరుఁ డంచితవిక్రముండు నీ । కొడుకితఁ డంగదుం
డితనిఁ గుందక యుండ ననూనముంపుమి । న్విడువున నేడ్చినన్ మఱల వత్తురె
చచ్చినవారలుర్వరన్ ॥ (తే, గీ) మానినీమణి జంతుసంతానమునకుఁ । గాం
మొకరీతివచ్చునే కర్మయుక్త । సరణి యొకవేళ సౌఖ్యంబు సంఘటించుఁ ।
గడఁగి యొకవేళ దుఃఖంబు గలుగఁ జేయు ॥ (తే, గీ) భూతకోటికి నిజకర్మజా
తఫలము । లనుభవింపక రిత్తవో వట్లు గాన । ధరణిఁ బండితుఁ డగువాఁడు త
త్క్రియంబ । తెంగి శుభకర్మములె యాచరింపవలయు ॥ (క) వినువాడ్య
దసంఖ్యలుగల । వనచరులెవ్వానియందు వర్తింపుదురా । యనిమేష లోక
నాయక । తనయుండు దిష్టాంతమొందె దైవనియుక్తిన్ ॥ (తే, గీ) సామదా
నశమతుమా చతురుఁడగుచు । న్యాయదృష్టార్థుఁడై పెక్కు హాయనములు।
ధర్మజితమైన ధాత్రిని దవిలియేలె । నతనిఁ గూర్చి దుఃఖించుట హితమెనీకు॥
(తే, గీ) ఎల్ల వానరపుంగవు లెలమిఁగొలువ । నీకుమారకుఁ డంగదుఁ డీసమ
స్త । కీశరాజ్యంబు నీదు సంక్లేశముడుగ । నట్లు పాలించు ధర్మవిహారపరత॥
(క) జనకుని పరోక్షమునఁద । త్తనయుఁడు తదుపార్జితప్రదానధనంబు । లొ
నుటిది మమోర్చితము । గన యంగదుఁ డేలుఁ గాక కపిరాజ్యంబున్ ॥ (ఉ)
వాలిని సంస్కరించి పరివారము లంగదు నెల్లి ప్రీతితోఁ । బ్రోలికి రాజుఁ జేసె
దరు పొల్పుగ గద్దియనెక్కి రాజ్యల । క్ష్మీలసితాస్యుఁడై యధివసించినపుత్రు
నిఁ గాంచి చిత్తసం । కీలితశోకము న్విడిచి కేవలశాంతి వహించె వెంతయున్ ॥
(వ) అనియనునయాలాపంబులం దేర్చుచున్న హనుమంతుని వాక్యంబులు వి
ని భర్తృవ్యసనపీడితయగు నయ్యంగనయిట్లనియె ॥ (క) అంగదునిఁబోలు త
నయులు । సంగతిగానూర్వురున్న శ్వసనాత్మజయీ । మంగళవిగ్రహుఁడగు
హారి । పుంగవుఁడున్నట్లు మదికి ముదముగలుగునే ॥ (క) పవనసుతయంగదు
నకీ । ప్లవగాధిపతిత్వమేల పతిపిమ్మట యీ । రవిసుతుఁడు రాజ్యతంత్ర ।

వ్యవహారములందు యోగ్యుఁ డగుఁగాక రహిఁ ॥ (క) కనియెత్తి పెంచి గుడు
వం। బనిచెడు జనకుండె నేఁడు బలరిపు పురికిం। జనియెనటయంగదునకుఁ।
బనిసేయునె తుచ్ఛరాజ్య పదమనిలసుతా ॥ (వ) మఱియు మహానుభావుం
డగు నీకపిరాజుసంశ్రయంబుకంటె నాకుభయలోకంబుల నొండొక్కదిక్కు
లేదుగావున నభిముఖహతవీరసేవితంబగు నీశయనంబు సేవించుదాననని పత్యను
గమనవాంఛం జేసి మెత్తనడని చిత్తంబున నత్తార కపిసత్తమునికిఁ బ్రత్యుత్త
రంబిచ్చు యతనినిరుత్తరునింజేసి యనేకవిధంబుల విలపింపుచుండఁ దదీయా

—(*) వాలిసుగ్రీవునకుహితముఁగఁజెప్పి కాంచనమాలయొసంగుట (*)—

ర్తనాదంబువిని సంక్రందననందనుండు నేత్రంబులువిచ్చి చూచి మెల్లననా
శ్వాసింపుచు నంగదునింజూచి తదీయాగ్రభాగంబున సంప్రాప్తవిజయుండై యు
న్న సుగ్రీవునవలోకించి సస్నేహంబును సగౌరవంబుంగా వ్యక్తవాక్యంబునని
ట్లనియె ॥ (సీ) తామరసాప్తనందన వురివెడలంగనిచి పత్నినిడక్కఁగొనియొ
ననుచు। ననుదోషయుతునింగా మనమునఁజూడకు మవితథంబుగ భావిభవము
వలనఁ। బుట్టినయవిరళబుద్ధిమోహంబునఁ గృహ్యమాణునిగా నెఱింగికొను
ము। భ్రాతృసౌహార్దంబు రాజసుఖంబును మనకిర్వురకునొక్కమాటుదైవి॥
(తే.గీ) కమునవిహితమయ్యెలోకంబునందుఁ। బరగనాదైవకృతయుగపదవి
ధాన। మరయనన్యవిధంబుగా నెఱిఁగియున్న। ఘనులకిలఁగోపతాపముల్గలు
గవెపుడు ॥ (వ) అదియంతయు గతజలసేతుబంధంబు తలంచినం బ్రయోజ
నంబులేదింకఁగార్యంబు తెలంగువినుము ॥ (సీ) భానుజకన్నులు గానరావయ్యెఁ
బ్రాణము కంఠంగతమయ్యెనమరపురికిఁ దడయకేఁగెదనుజెప్పెడిదేమినీకిఁకమ
హనీయకీశసామ్రాజ్యపదవి। సిరులనంతఃపుర స్త్రీలనుగైకొమ్ము బాష్పపూ
ర్ణాస్యుఁడై పరగవ్రాలి। దీనుఁడై శోకించువానిఁ బ్రియుండగు వానిఁబ్రాణస
మానుఁడైన వానిఁ ॥ (తే.గీ) దనయు నంగదుఁజూడుమీ తనికినభయ।
మొసఁగి దుఃఖంబు నకుఁ జొరకుండదాత। వైపరిత్రాత వగుచు నాయ
ట్లనీవు। కడఁగి నిత్యంబుఁ గావుము, కరుణ మెఱసి ॥ (వ) మఱియు
నీతారేయుండు నీతోడఁ దుల్యపరాక్రముండును శ్రీమంతుండును నురూపకర్మం
డును దరుణుండును మహాబలుండునుగావున నీకుబాసటయై నీవుచూడ రణం
బున నవక్రపరాక్రమంబున నాక్రమించి క్రవ్యాద లోకంబునెల్ల నశ్రమంబున



నిర్జింపఁగలం డదియునుంగాక ॥ (తే.గీ) తపనజసుషేణపుత్రియౌ తారసాధ్వి।
యర్థసూక్ష్మవినిశ్చయమందుఁజాల। నేర్పుగలది కార్యాకార్య నిర్ణయజ్ఞ।
తగవుధర్మంబు నడపెడుతన్విసుమ్మి॥ (క) ఈనెలఁతభావమొక్కిం। తైననువి
ఫలత్వమొందదటుగావుననో। భానుసుత యెద్దిపల్కిన। దానింగావనకసేయఁ
దగునీకెపుడుఁ॥ (వ) మఱియు నొక్కహితంబుఁ జెప్పెదవినుము॥ (క) అవి
శంకమ్ముగ నీరా। ఘవకార్యము నీకవశ్య కర్తవ్యమగుఁ। న్దవిలి యొనర్పకయుం
డిన। రవిసుత నను బోలె నినుశ రంబునఁద్రుంచుఁ॥ (క) ప్రాకటముగ నినునం
దన। కైకొనుమీదివ్య హేమకంజాతసహ। స్రాకీర్ణ మాల యిదియ। స్తోకబ
లారోగ్యవిజయ శుభములనొసఁగుఁ। (వ) అని భ్రాతృసౌహార్దంబునం బలి
కిన వాలిపలుకు లాకర్ణించి హర్షంబుఁబరిత్యజించి క్రమ్మఱ దీనుండై గ్రహ
గ్రస్తుండైన చంద్రునిమాడ్కి నిష్ప్రభత్వంబునొంది కొండొకసేపునకుఁదదీయ

—(*) వాలి యంగదునకు హితముఁగఁజెప్పుట. (*)—

మృదుమధురాలాపంబుల దేఱి యతనిచేత ననుజ్ఞాతుండై యక్కాంచనమాలఁ
బరిగ్రహించె నిట్లుసుగ్రీవునకు హేమమాలయొసంగి పురందరపుత్రుండు ని
జపుత్రునవలోకించి పుత్రస్నేహంబున వాత్సల్యంబు నెఱపి యనునయాలాపం
బులనిట్లనియె॥ (తే.గీ) దేశకాలంబులెఱింగి సుధీవరేణ్య। సుఖము దుఃఖంబుస
మముగాఁజూచికొనుచుఁ। బ్రియమునందప్రియమునందు బొగడువడక। క్షమగ
లిగి సూర్యసుతవశగతుఁడవగుము॥ (ఆ.వె) వత్సయేనపోలె వాత్సల్యమునదివా।
కరసుతుండు నిన్ను గారవించు। నతనిరిపులరిపులకయ్యెడువారల। విడిచియుఁ జిత్త
వృత్తి వెలయుమింక ॥ (క) అనిశంబప్రణయమతి। ప్రణయంబు బీరెఁడొసంగుబ
హుదోషముల। న్విను మటుగావునఁబ్రియనం। దనమధ్యమభావమొంది తన
రుము నీవుఁ॥ (వ) అని బోధించి శక్రపుత్రుండు శరసంపీడితుం డగుటం జేసి
వివృత్తనేత్రుండును వికృతవదనుండునునై జీవితంబులు విడిచె నిట్లు సంప్రాప్త
మరణుండైన వాలినాలోకించి ప్లవంగపుంగవులెల్ల నాహాకారంబులు సేయుచు
వెలవెలంబోయి బహుప్రకారంబుల దుఃఖింపుచుండిరి కిష్కింధాపురంబు
శూన్యచత్వరవేశ్మాంతంబై యుండె నుద్యానంబులును బర్వతంబులును గానన
బులును దక్కిన వాలివిహారప్రదేశంబులన్నియుఁ బాడఱెనట్లు చూపట్టె నప్పు
డువానరులంవఱుం గూడుకొని శోకావేశంబున ॥ (తే.గీ) కడిమి నెవ్వాఁడు భూరి

వేగమునఁ గాన । నములునను ములుమృదుల తాంతములచేత । ననిశమనుబద్ధము

**మృతుండైన వాలింగూర్చి వానరులందఱు విలపించుట.**

లుగఁ జేయంగఁబడియె । నవ్విధంబింక నిపు డెవ్వఁడాచరించు ॥ (సీ) సత్త్వసం పన్నుండవుచతురుండవుగోలభుం డనియెడుగంధర్వుఁడాజికాంక్షుఁ । డై నెత్తివచ్చి నఁబరగ నెవ్వఁడువది యేనువత్సరముల సమానలీలఁ । బవలు రేయును ఘోర భంగిఁగయ్యమొనర్చె. యంతషోడశవత్సరాంతమందు । దుర్వార భుజవీర్యగ ర్వంబు పెంపున గోలభునవలీలఁగూలఁదన్ని ॥ (తే, గీ) కడఁగిమూకందఱకు వేడ్కఁ గలుగఁ జేసె । నట్టిజితకాశిబలరాశియమితబాహు । బలవినిర్జిత తైతేయవాలి వాలి । యిట్టులంగునహతుఁడయ్యె నృపునిచేత ॥ (వ) అని యద్భుతశోకంబులు మనంబునం బెనంగొన నందఱు దీనవదనులై సింహ యుతంబైన మహాకాననం బున వృషభంబు పడినందలంకు ధేనువులచందంబున సుఖంబుపడిచియుండిరం త దారా మృతుండైనపతినవలోకించి శోకార్ణవ పరిప్లుతయై పరశుచ్ఛిన్నం బైన మహాద్రుమంబునాశ్రయించిన వనలతకై వడి నతనిం బరిరంభించి శోక బాష్పకణంబులు తదీయముఖంబున సాంద్రంబుగాఁగురియ నేడ్చుచు నిట్లని విల పించె ॥ (ఉ) హా హృదయేశ యెంతహిత మూడిననైకొన కీవు వైరసం । దోహ పినాశకారిరణ దుర్జయరామశరాహతుండవై । యూహగలుగికర్కశశిలా పచితంబగు దుప్రవేశఘో । రాహవభూతలంబుపయినక్కట చేడ్పడి నేఁడు గూ లితే ॥ (క) కరయుగమునని మ్మేదినిఁ । బరిరంభింపుచు మహాత్మ పలుకవు నాతో । హరివరయిడినా కంటెను । గరమెక్కుడు నెయ్యమేమి గావించెనొ గిక ॥ (క) కా లానుసారి వైతే । డీలాగున బఱుపాతి మోసఁగ విధియహో । మేలించుకైనఁ దె లియక । వాలాయము సూర్యపుత్రవశగతుఁడయ్యె ॥ (క) కృపమాలిదైవమి టునీ । కపకారముఁ జేసెనింక నర్కకుమారు । నిష్ఫలయశోనిధిఁ బతిఁ గాఁ । గ పివంశజులెల్లభక్తిఁ గావింతురొ గిక ॥ (క) ఈవిధమునవిలపించెడు । నా వాక్య ముదీనుఁడగుత నయువాక్యముసం । భావించి కరుణ మెఱయఁగ । దేవేంద్రత నూజనములతేర్చవుమ్మ ॥ (సీ) జీవితనాథనీచేతనుమ్మునిహతులై రక్కసులె క్కుడదిక్కుమాలి । పడియుండిరక్కడఁ బగతుని చేతఁ జేటొందినీవిటు పడియుం డవలెనె । దగవా నన్నునాథ నుజేసితెంటిగ విడిచిపోవఁ గ నీకు వీరునకును । గ స్వానొసంగునటుగాదటులైననా పగిదిననాథ హాయవగలఁ బోగులు ॥ (తే, గీ) టంతియె



ఫలంబునా పూనమదియడంగె । సుఖము నశియించె వైభవ స్ఫూర్తిపోయె బరిమగతిభగ్నయయ్యెనపారదుఃఖ । వార్ధిలోనముంగితివానరనాథ ॥ (క) వనిహతుఁడవైననిన్ను । న్వనిక నీయునునాదుగుండె వేయి వ్రక్కలయ్యె । చనుకల యేమివగచెద । మనోహరా వజ్రసారమయమగుఁ దలఁపక ॥ (క) పరిపా యుఁడవు శూరుఁడ । వరయఁగ బంధుఁడవు భర్తవగుచీటుసం । గరమున సహతుఁడవై । యురువిక్రమ ధుర్యవిధన మొందితె యకటా ॥ (క) సుతశతకవం గల్గినమఱి । సతతము ధనధాన్యవస్తు సమితిఁ గలిగిన । న్పతిహీనయైనసతికా యు తవిక్రమ పోనెవిధవ యనుమాట ధుర్య ॥ (వ) మఱియుఁ గ్రిమిరాగ పరిస్తోమంబై న శయనంబునందుం బోలె స్వగాత్రప్రభవ రుధిర మండలంబునం బెట్లు శయి యించితివి రేణుశోణిత సంవీతంబైన భవదీయ గాత్రంబు నెట్టులంగున బాహు వులఁ బరిరంభింపనేర్తునని వగచి వెండియు ॥ (ఉ) పూసిన రామకాముకనిష ముక్తవరైకశరంబుచేతనె । వ్వానిభయంబునృక్షచర వంశపతీ హా మయ్యె నేక్ష కా । భానుసుతుండు ఘోరమగు బంధుర వైరమునందు నెవ్వగ । గ్లాని క్ష్మాతా ఘుఁడయ్యెఁగద రాజ్యసతీబలకోశయుక్తుఁడై ॥ (వ) మహాత్మా నీవు పంచ త్వంబు నొందుచుండ నిన్నువిలోకించి యేను భవదాలింగన విషయంబునందు హృదయలగ్నంబైన శరంబుచేత నివారితనైతినని యనేక ప్రకారంబుల విల పింపుచునుండ నప్పుడు వాలి గాత్రగతంబైన శరంబుననలోకించి నీలుండు గిరి గహ్వర సంలీనంబైన దీప్తాశీవిషంబునుంబోలె దానిను త్పాటించి వెచె నిట్లుని ష్కృష్యమాణంబైన యబ్బాణచ్ఛవి యస్తగిరిమస్తక సంరుద్ధదినకర వినిస్సృ తరశ్మియుంబోలెఁ జూడ్కికిఁ గ్రొవ్వేఁగగుచుండె నప్పుడు శరపాదప శిలాజనితంబు లైన తచ్ఛరీరవ్రణంబులనుండి శోణితధారలుధరాధరంబుననుండి తామ్రనైరిక సంపృక్త జలధారలుంబోలె సాంద్రంబుగా ప్రవింపుచునుండె నెండియున ట్లేపి రా మాస్త్ర సమాహతుండై రణరేణుపరికీర్ణుండై రుధిరోక్షితసర్వాంగుండై నేలఁగూ లియున్న భర్తనవలోకించి లోచనప్రభవంబులగు శోకబాష్పంబులఁ నతని బ్రమా ర్జింపుచు నుచ్చైస్స్వనంబున రోదనంబు సేయుచుఁ బింగాక్షుండగు నంగదకుమా రునుద్దేశించి ॥ (సీ) తనయనీ జనకుని దారుణపశ్చిమా వస్థనుజూడుము వైరమెల్ల । కడచనెజమునిని, శాంతంబునకుఁ బోవుచున్న వాఁడీనవా, రోఁదయాంగుఁ । దూనిన భక్తిఁ ద, న్మాననీయాంఘ్రియుగ్మంబున కభివాదనం బొనర్పు । మన

వుచు భక్తితో నతివేగమున లేచి పీనస్నిగ్ధములగు పృథుభుజముల ॥ (తే,గీ)
నంగదుండ నేనని నిజాహ్వయంబు నొడివి । యతని చరణాబ్జములు సమున్నతిం
బట్టి । హింసించి విడువని శోకంబు హృదయసీమ ఁ దట్టమై పర్వ మిగుల సంతాప
మొందె ॥ (వ) ఇట్లు దుఃఖంపుచున్న కుమారుం జూచి తార వెండియు భర్త
నుద్దేశించి ॥ (చ) అనుపమభంగి నీకుఁ బ్రియంబున మున్న భివందనంబుఁ జే
సిన సుతు గారవించి చిరజీవిసు శోభన పుత్త్రయుక్తుమంచుమం । ఛనయనురక్తిఁ దేట
పడఁ జేయుచు దీవన లిత్తువేటికో । యనఘచరిత్ర పల్కవిపుడక్కట తొల్లిటి
ప్రేమ దప్పెనే ॥ (తే,గీ) అధిప యేను పుత్త్రసహాయనై వినిహత । చేతనుడ
వైన నిన్ను సాంత్వించితి నిపుడు । ఘోరకంఠీరవావలీఢ గోవృషమును । గూడి
వత్ససహితయైన గోవు కరణి ॥ (తే,గీ) హా మనోనాథ నీవు సంగ్రామయజ్ఞ
మద్భుతంబుగఁ జేసి రామాస్త్రముల । మందు సతినగు నను బాసి యవబృ
థంబు । నందు నెట్లు సుస్నాతుండ వైతివిపుడు ॥ (తే,గీ) కపికులోత్తమ తొ
ల్లి సంగ్రామమందు । మెచ్చి పరితుష్టుఁడై యనిమిషవిభుండు । కరుణతో నీ
కొసంగిన కనకమాల । యేల కనుపట్ట దఱుత నేఁ డెందుఁ బోయె ॥ (తే,గీ)
అద్రిరాజ ప్రదక్షిణ మాచరించు । భానురుచి యమ్మహాత్మునిఁ బాయని
క్రియ । వానరేంద్ర గతాసుండ వైన నిన్ను । రమ్యముగఁ బాయకున్నదీ రాజ
లక్ష్మి ॥ (వ) మహాత్మా పథ్యంబగు మదీయ వాక్యం బంగీకరింపక క్రోధిపు
చ్చివచ్చితి వేను భవదీయమతినివారణంబునం దసమర్థనై యుపేక్షిం
చినందువలన నిట్టియవస్థ దొరకొనియె నీయట్ల యేనును బుత్త్రసహితంబుగా ని
హతనైతి రణహతుండవైన నీతోఁ గూడ రాజలక్ష్మి నన్నుఁ బాసిచనియె నని పె
క్కుతెఱంగుల విలపించుచు శోకార్ణవపరిప్లుతయై కన్నీరు మున్నీరుగా రోద
నంబు సేయుచున్న తార నవలోకించి తరస్వి యగు సుగ్రీవుండు భ్రాతృవధజ
నిత శోకాక్రాంతుండై మొగంబున దైన్యంబు దోఁప గన్నుల బాష్పజలంబు
గ్రమ్ముదేఱ మనంబు దిలకొన భృత్యపరివృతుండై మెల్లన రాముని సమీపంబున
కుఁజని గృహీతచాపుండును గాలవ్యాళతుల్యబాణుండును రాజలక్షణలక్షి
తాంగుండును మహోదాత్తుండును యశస్వియు నగు నమ్మహానుభావున కిట్లని

(*) సుగ్రీవుఁడు వాలివధంబును గుఱించి పరితపించుట. (*)

యె ॥ (సీ) జననాథ నీవు సంశితబాణ తప్పక బలభేదిసుతుఁ జంపి ప్లవగరా



జ్య । మొసఁగితివైన నీ యుత్తమవీరుండు పడుటయుఁ దార విలపించుటయును
నంగదుండధిక శోకార్తిఁ దూలుటయును వీక్షించి నామనంబిపుడు రాజ్య । సు
ఖభోగముల యందుఁ జొప్పడకున్నది యురుదుఃఖమునఁ గుందుచున్నవాఁడ ॥
(తే,గీ) సిరికిఁగా నింత పాపంబుఁ జేసినాఁడ । నన్న లేకున్న సురపదంబైన న
ల । తుచ్ఛరాజ్యంబు విడిచి నే దొంటిపగిది । ఋశ్యమూకంబునందుఁ జరిం
చువాఁడ ॥ (వ) మహాత్మా మహానుభావుండగు మదగ్రజుండు నిహతుండై
య్యె నంగదుండు పితృమరణదుఃఖంబున జీవించునో జీవించఁడో యని సంశ
యవిషయభూతుండయ్యె మచ్చిత్తంబు మిక్కిలి శోకాయత్తంబై యున్నది క్రో
ధంబున నమర్షంబున నధర్మంబున నన్నుం జంపించితి నాయట్టి పాపాత్ము
నిహపరంబు లెక్కడివి భ్రాతృవధంబువలన లభించిన త్రైలోక్యసామ్రాజ్యం
బైన నామనంబునకు సమ్మదం బొసంగ నేరదు వానరరాజ్యం బంతగర్హిత
కృత్యంబువలనం జేకూడిన తుచ్ఛసుఖం బనుభవించుటకంటెఁ గపిజాతి కుచితం
బైన జీవనంబు నాశ్రయించి శైలకాననంబులం జరియించుట యుక్తంబుగాదే
యని పలికి వెండియు నిట్లనియె ॥ (తే,గీ) ఇపుడు నిన్నును హింసింప నిచ్చకో
లదు । దిరుగుమని యెద్దిపలికె నాధీరవర్యుఁ । డతనికా మాట యనురూప మ
య్యెనట్టి । యనఘుఁ జంపించుట నురూపమయ్యెనాకు ॥ (చ) పొలుపఱి యే
ను పెక్కుడలఁ బోరులఁ జిక్కిన మున్ను కోపము । న్గలిగియు భ్రాతృసౌహృద
ము నం గృపతో విడిపించుఁగాని యె । గ్గులు దలపోసి ప్రాణమునఁ గుం దెగఁ బట్ట
దయాళు నీగతిం । జలమున నెంత దుర్మతినొ చంపుట కోర్చితి రాజ్యకాము
తన ॥ (తే,గీ) భ్రాతృవధమునఁ గలుగు సామ్రాజ్యలాభ । మెక్కుడో భ్రా
తృవధమున నెసఁగు దుఃఖ । మెక్కుడో యని చింతింప రెంతపనికిఁ । బూనునే
యెవ్వఁడైన దుర్బుద్ధి యగుచు ॥ (వ) మహాత్మా మద్వధంబు స్వమాహాత్మ్య
నుల్లంఘనంబు వలన వాలికి సమ్మతంబుగాదయ్యె నాకు బుద్ధిదౌరాత్మ్యంబువలన
భ్రాతృవధరూపవ్యతిక్రమంబు సమ్మతంబయ్యె నేను ద్రుమశాఖావభగ్నుండనై
యొక్కముహూర్తం బార్తనాదంబు సేయుచు వెండియు నిట్లు గావించుటక
ర్హుండవు గావని యెవ్వని చేత నాశ్వాసింపఁ బడితి నట్టి వాలిచేత భ్రాతృత్వం
బును నార్యభావంబును ధర్మంబును సురక్షితంబయ్యె నాచేతఁ గ్రోధంబును
గామంబును గపిత్వంబును బ్రదర్శితంబయ్యె వాలి నివంచించి చంపించిన కార

ణంబున విశ్వరూప వధంబువలన నింద్రునకుంబోలె నాకును బాపచింతకులచే తనైన నచింతనీయంబును బాపకృత్యులచేనైనం బరివర్జనీయంబును బాపశీలురచేతనైన ననీప్సనీయంబును బాపసర్శులచేనైన ననపేక్షణీయంబు నగు మహాపాతకంబు సంప్రాప్తంబయ్యె నింద్రుని పాపంబు భూమియు జలంబును వృక్షంబులును యువతులును బంచికొని గుడిచిరి శాఖామృగంబునైన నాపాపం బెవ్వరు పంచికొనువారు కులనాశయుక్తంబు నధర్మయుక్తంబు నగు నిట్టిదుష్కృతకర్మంబాచరించియున్న యేను బ్రజాసన్మానంబునకును యౌవరాజ్యంబునకును యోగ్యుండం గాను మహారాజ్యంబున కెట్లు యోగ్యుండనగుదు లోకాపవాదంబైన గర్హితక్షుద్రపాపంబునకుం బ్రవర్తకుండనైతి వృష్టిసలిలవేగంబు నిమ్నంబునుం బలెనీదురంతశోకంబునన్ను నుసరింపుచున్న దనిపలికి వెండియు నిట్లనియె॥ (క) క్షమభ్రాతృవధాపరకా । యము సంతాపోర్ధ్వకాయమగు పాపమయా। భ ముపీడింపుచున్నది । క్రమమున నన్నదిసియేటి గట్టును బోలెన్ ॥ (వ) రాజేంద్రా నాహృదయంబునం గలవివేకధైర్యరూపంబైనయీసాధువృత్తంబుతనతోఁగూడవర్తింపుచున్న భ్రాతృవధజనితపాపంబును సహింపక వివర్ణంబైన జాతరూపంబు వహ్నియందుఁ బరితప్యమానంబగుచుఁ దనతోఁగూడియున్న బుజీషాంశమలంబును సహింపక తాను వేఱైన చందంబుఁ బృథగ్విధంబగుచున్నది ॥ (సీ) నరనాథ నాదుమర్న యమీకుమారుని శోకతాపముఁ జూచి శోకమడర । సురబల వానర యూథపయూథంబు పరగనధఃస్థిత ప్రాణముక్రియు । నయ్యోడుననిహ్వాద యంబునఁ దలఁచెదసుతుఁడు సులభ్యుండు సుగ్రతుండు । సుమతిసువశ్యుండు సుజనుఁ డంగదునకు సరియైనతనయుండు జగతిఁగలఁడె ॥ (తే,గీ) యనఘచారిత్ర యేదేశమందు భ్రాతృ । సన్నిధానంబు మిక్కిలి సంఘటిల్లు । నట్టిదేశంబు లేదింతయఘముఁ జేసి । శిష్టజనపార్శ్వ మేమని చేరువాఁడ ॥ (క) హితకరుఁడీతారేయుఁడు । బ్రతికినన త్తారవీనిఁ బాలించుటకున్ । బ్రతుకునటుగాక తక్కిన । బ్రతుకు నెరయొక నిమిషమైనభానుకులేశా ॥ (మ) భువనస్తుత్య భవన్నిదేశగతులై పాల్పొందినీవత్సమా । నవనాటోత్తము లంచతాఁజనకభూనాథాత్మజన్సద్గుణ । స్తవనీయందిలకించివచ్చెదరుతథ్యం జేసు తారేయువా । సవిసఖ్యంబ్జవగోత్రి మేనుదహనజ్వాలాలి కర్పించెదన్ ॥ (వ) దేవా యేనుమృతుండనగుచునుండ సర్వకార్యంబులు సమర్థింపుచుకొనుట



కుమీరెచాలుదు రజీవనార్హుండను గృతాపరాధుండను గులహంతృకుండనైన నాకనుజ్ఞయొసంగుఁడు ॥ (తే గీ) దురితచిత్తుండఁ గులనాశకరుఁడనైన । యేనులేకున్న రామనీ కేమికొదవ । వాయుపుత్రాది వానర వరులెనీదు। కార్యమంతయు సాధింపఁగలరధీశ ॥ (వ) అనిదుఃఖావేశంబునం బలికి కన్నీ

*వానరులు తారను రామసమ్ముఖమ్మునకుఁదోడి తెచ్చుట.*

రునించిన సుగ్రీవుని పరిదేవనంబు విని రాముండు కించిదశ్రుపూరితముఖుండై కొండొకసేపూరకుండి భువనరక్షకుండును క్షితిక్షమావంతుండు నగు రాముండు శోకాపనయనసముత్సుకుండై వాలిం గౌఁగిలించుకొని రోదనంబుసేయుచు నతనితోడిదె లోకంబని పడియున్న తారనవలోకించి తదీయసంతాపంబుడుపుటకుఁ దగినమాటలాడం గలవాఁడై యున్న సమయంబునఁ గొండఱుమంత్రులమ్మహాత్ముని యనుమతివడసి యనునయాలాపంబుల నద్దేవి నూరార్చి రామునిసమీపంబునకుం దోడ్కొనివచ్చిన నత్తార నిజతేజంబున భాస్కరునిభంగి వెలుంగుచున్న వానిఁ గరధృతశరచాపుండగువానిఁ జారులక్షణలక్షితుండగువాని మహేంద్రకల్పుండగువాని దురాసదుం డగువాని రాజీవతామ్రలోచనుండగువాని నదృష్టపూర్వుండగువానిఁ బురుషప్రధానుండగువాని రామునవలోకించి మున్నంగదుండెఱింగించిన లక్షణంబు లుపలక్షించి యతనిరామునిఁగా నెఱింగి వ్యసనాభిపన్నయై విహ్వలింపుచు శోకసంభ్రాంతశరీర భావయగుచు విశుద్ధసత్త్వుండును రణోత్కర్షణలబ్ధలక్ష్యుండునగు నమ్మహానుభావునకిట్లనియె ॥ (సీ) అవనీశతిలక నీవప్రమేయుండవు విజితేంద్రియుండవు వీరవరుఁడ । వంచితసత్కీర్తివతిధార్మికుండవు క్షతజోపమాక్షుండ వతులితుండ । వనుపమబాణబాణాసనపాణివి సత్యసంధుఁడవు విచక్షణుఁడవు । సుదురాసదుఁడవు వసుమతీ క్షమావంతుఁడవు శూరజనముఖ్యుఁడవు మృదుండ ॥ (తే,గీ) నధికరూపోపపన్నుండ వచలధృతివి । తలఁపఁగమనుష్యదేహంబుఁ దాలఁగవిడిచి । దివ్యదేహామయంబున దేవమర్త్యా । చక్రిజగములఁ బాలింపఁజాలుదీవు ॥ (చ) ననునిమిషంబుఁ జూడకమనంగసమర్థుఁ

—(*) తార తన్నును వాలినట్ల చంపుమని రామునిఁ బ్రార్థించుట. (*)—

డు గాఁడు వాలియే । సునిశితబాణరాజమునఁ జొప్పడవాలినిఁ జంపితాశరంబున నేననున్న వధింపుమిఁక భూమివరా యటులైననిప్పుడే । చనియెద నమ్మహా

మహాత్మునిఁ జారుపదంబులు గూడముట్టఁగఁ ॥ (చ) అరుదుగ నాకలోకగతుఁ డయ్యును మత్ప్రియవల్లభుండుబం । ధురనిరపాయయౌవనమనోహరతామ్రసుమాననతంసకా । ప్సరసలపొందుమానియని శంబునుమద్విరహప్రభూతభీకరపరితాపపావకశిఖా నిచయంబులఁగ్రాఁగి కుందఁడే ॥ (ఉ) ధీవరనాకమందయిన దేవపతిప్రియనందనుండునా । నావనసానుకందరపి నర్ధనగేంద్రతటావకాశమం । దావనజాక్షిఁబాసి బహుళార్తిఁ దపించెడు నీదుకైవడిం । భావమునందపింపఁడొకో మద్విరహాంబుధి మగ్నచిత్తుఁడై ॥ (తే,గీ) అనఘపత్నీవిహీనుఁడై నట్టితరుణ । పురుషునకుఁగలసంతాప మరయనింత । యనుచునీ వెఱుంగుదు వనితఁగూడఁ । బనుపుమతఁడుండ లేఁడునన్బాసియచట ॥ (వ) మహాత్మా మద్వధంబున నీకు స్త్రీఘాతదోషంబు గలుగు ననితలంపవలదు పురుషున కర్ధశరీరంబుపత్నియని నానాశాస్త్రంబులువేదంబులు పలుకుటంజేసి మద్వధంబు వాలి వధంబయగు నీకు స్త్రీవధదోషంబు లేదు మఱియుజ్ఞానవంతులగు వారికి లోకంబునందు దారప్రదానంబుకంటె నొండుదానంబులేదు గావుననీవు ధర్మప్రకారంబువిచారించి నన్నుప్రియభార్యండగు వాలికొఱకుగుము దీననీకుఁ బుణ్యంబు గలుగు నధర్మసంయోగంబుగలుగనేర దెల్లభంగుల ననాథనై విలపింపుచున్న నన్నువధింపు మేనామత్తమాతంగ విలాసగమనుండును ధీమంతుండును బ్లవంగలోకవల్లభుండును వరాహార్ణత్తమహేమమాలియు నగు వాలింబాసి యొక్కనిమిషంబైనజీవింపంజాల నదియునుంగాక ॥ (చ) అనుపమబాహువిక్రమ విహారుఁడుధీరుఁడు శూరుఁడున్యశోధనుఁడగువాలికిందు నిటుతప్పక యొగ్గొనరించితీవున । ఘనతర వజ్రతుల్య విశిఖంబునఁ బంచతనొందఁజేసియు । య్యనఘునిఁగూడఁ బుచ్చినృప యచ్చటనైనహితంబు సేయవే ॥ (వ) అనిన నారఘువల్లభుండు తారావాక్యంబులు విని

## (*)శ్రీరాముఁడు తార నూఱడించుట. (*)

యద్దేవి తారాశ్చి హితంబుగానిట్లనియె ॥ (సీ) వీరపత్నిరొయింతి విమతిసేయఁగనేల జగము విరించుఁడు నెగడఁజేసె । నతనికృతంబున నగుసుఖదుఃఖంబు జగములన్నియువాని శాసనమునఁ । దప్పకవర్తించుఁ దత్కారణంబుననీవు భూరిసంతోషంబుఁ బొందఁగలవు । సంగతినీపుత్రుఁ డంగదుఁడిఁక మీఁద యౌవరాజ్యాధిపత్యంబునొందు ॥ (ఆ,వె) వీరపత్నులింత వెఱ్ఱులై పరిదేవ



నంబుసేయఁదగవె యంబుజాక్షి । యనినన వ్వెలంది జనపతిమాటలఁ । దేకొంతకాల మూరకుండె ॥ (వ) వెండియునామహీవల్లభుండు లక్ష్మణునియనుమతి వడసిసుగ్రీవాంగదతారల నవలోకించి మీరింక శోకించిన ప్రయోజనంబులేదు తదనంతరకార్యంబెయ్యది దానింగావింపుఁడు బాష్పమోక్షణంబు చాలింపుఁడు పారలౌకిక కర్మంబుల్లవారి కనుష్ఠేయంబు హితకాలంబునకంటె నుత్తరకాలంబునందించుకయైనఁ గర్మంబుపాసించుటకు శక్యంబుగాదు లోకంబునందుఁ గాలంబు కారణంబై సమస్తకర్మసాధనంబై సర్వభూతనియమనంబునందు నిదానంబైయుండుఁ గాలంబుదక్క నెవ్వని కెవ్వండును బ్రవర్తకుండు లేఁడు నియోగంబునందెవ్వండును స్వతంత్రుండుగాఁడు స్వభావంబైన కాలంబు వర్తింపుచుండ లోకంబుపరతంత్రంబై ప్రవర్తిల్లుఁ గావున నాలోకంబునకుఁ గాలంబిష్టప్రాపకత్వంబునఁ బరమప్రాప్యంబై యుండుమహాకాలం

## —(*)రాముఁడు వాలికిం బ్రేతసంస్కారాదులఁగావింపుఁడని సుగ్రీవా(*)— (*)దులతోఁ జెప్పుట.(*)

బుసర్వప్రాణులకు సుఖదుఃఖప్రాపకత్వంబున దివసపక్షమాసత్వాదిరూపకోపాధికకాలంబు నతిక్రమింపంజాల దట్లగుటంజేసి కాలంబున్యూనత్వంబునొందదు స్వతంత్రంబైన కాలంబు స్వకృతవ్యవస్థ నతిక్రమింపం జాలదనఁ బరతంత్రుండైన యన్యునకేమి చెప్పవచ్చుఁ గాలంబునకుఁ బురుషునితోఁ గూడ వశీకరణ హేతుభూత మిత్రజ్ఞాతి సంబంధంబు లేదు వశీకరణ హేతుభూతంబైన బంధుత్వంబును లేదు వశీకరణోపాయ భూత పురుష కృతోపకారాదికంబు లేదు వశీకరణోపాయ భూతపురుషకృత పరాక్రమంబును లేదు గావున సర్వకారణ భూతంబైన కాలంబు పురుషునకు వశ్యంబుగాదింక నేమన్నను హితంబుఁగోరువానిచేత స్వాపేక్షిత హేతుభూత కాలపరిణామంబు ద్రష్టవ్యంబైయుండు ధర్మార్థకామంబులు కాలక్రమాయత్తంబు లగుటంజేసియే కాలంబున నెయ్యదికర్తవ్యంబగు నక్కాలం బలంఘనీయంబైయుండు నిప్పుడు భవద్వల్లభుండగు వాలి మద్బాణకృత ప్రాయశ్చిత్తత్వంబునస్వకీయపరిశుద్ధ భావంబునధిగమించి యీలోకంబుననుండి విహితకాలానుష్ఠిత ధర్మార్థకామసంబంధంబులచేతఁ బవిత్రంబైన క్రియాఫలంబునొందెనమహాత్మునిచేత స్వవిహిత ధర్మానుష్ఠానంబువలన జితంబును వశీకృతంబైన

స్వర్గంబిప్పుడుపరిగృహీతంబయ్యె నితండెద్దానినధిగమించె నట్టియీనియతి
శ్రేష్ఠతరమైనది గావున పరితాపంబుడక్కి వాలికిసంస్కారాది క్రియలు నిర్వ
ర్తింపుండని రాముండు బహుప్రకారంబులం బ్రబోధించునెడ రాముని
వాక్యంబుల కనురూపంబుగా లక్ష్మణుండును దత్కాల సదృశం బగు

( లక్ష్మణుఁడు సుగ్రీవునితో వాలికిఁబ్రేతసంస్కారంబుగావింపుమని చెప్పుట. )

వాక్యంబున సుగ్రీవున కిట్లనియె ॥ (ఆ, వె) అనఘ నీవుప్రీతి,నంగదతారాస ।
మన్వితుండవయి,సమంత్రకముగ । నర్హవిధుల వాలి,కగ్ని సంస్కారంబుఁ।
జేసి ప్రేతవిధులు, సేయు మవల ॥ (చ) చందనముఖ్య దివ్యరస, సంయుత
నూతనశుష్కకాష్ఠము । లొప్పందుగఁ దేరఁబంపు మిఁకఁ, బుత్రుననన్యశరణ్యు
నంగదుం । గ్రందుగ దుఃఖశోకములఁ,గార్శ్యము నొందక యుండనంశుమన్నం
దన మంద మంజుకల, నామధురోక్తుల బుజ్జగింపుమా ॥ (తే,గీ) వివిధమా
ల్యవస్త్రంబులు,వివిధగంధ । ములును దైలంబు ఘృతమును,వలయునట్టి । పరి
కరంబులుఁదేరంగఁ, బనుపుమజ్జ । మిత్ర నందన యంగదుఁ, బుత్రు నిపుడు ॥
(తే, గీ) తారునిప్పుడు శిబికను,దేరఁబనుపు । వాసవకుమారువాలిని,వానరేం
ద్రు । మోవఁజాలిన వారి న,మోఘరయులఁ । గిశుల బలాఢ్యులను నియో,
గింపుమిపుడు ॥ (వ) భానునందనా యీబాలిశత్వంబు విడువుమీపురంబుభ
వదధీనంబు శీఘ్రింబుగ సర్వకార్యంబులు నిర్వర్తింపు మని పలికి సుమిత్రా
నందవర్ధనుండగు లక్ష్మణుండు రాముని సమీపస్థుండై కొల్చియుండె నతని
వాక్యంబులు విని తారుండు మిక్కిలి సంభ్రాంతచిత్తుండై శీఘ్రింబునగిరిగహ్వ
రంబు కడకుంజని యందుడాఁచియున్న దాని నతిరమణీయమైన శిబికననేకవా
నరులచేతం దెప్పించిన రాజాసనసంయుక్తయు దివ్యయు మహనీయస్యందనో
పమయుఁ బక్షిప్రతికృతికర్మ విభూషితయుఁ జిత్రరూప పదాతి సమాచితయు
శోభనస్వరూపసన్నివేశయు సిద్ధవిమానసమానయుఁ గుడ్యోపరిభాగతిర్యగవ
స్థితఫలకనిర్మిత నానావిధసన్నివేశరంధ్రివాయు ప్రవేశనిమిత్తగవాక్షాకార
రంధ్రయుక్తయు సునియుక్తయు విశాలయు సుకృతయు విశ్వకర్మవిరచితయు
దారునిర్మితక్రీడాచలయుతయుఁ జారుకర్మపరిష్కృతయు వరాభరణహార
విచిత్రమాల్యోపశోభితయుఁ క్రీడార్థనిర్మిత గుహాగహనసంఛన్నయు ర
క్తచందనభూషితయుఁ బుష్పౌఘసమభిచ్ఛన్నయుఁ బద్మమాలాలంకృతయు వి



భ్రాజమాన తరుణాదిత్య వర్ణోపేతయు నగు శిబిక నవలోకించి రాముండు
సుగ్రీవున కిట్లనియె ॥ (ఉ) అన్నకుఁ బ్రేతకార్యము ర,యంబునఁ, జేయు ము
టంచుఁబల్కఁగా । నన్నలినప్రియాత్మభవుఁ, డంగద సంయుతుఁడై మహాధ్వ
నిం । గన్నుల శోకబాష్పములు, గారఁగ నేడ్చుచుదీనుఁడై సుమే । రున్నత
వాలిగాత్రమిడె నొయ్యనఁ,దచ్ఛిబికాంతరస్థలిన్ ॥ (తే.గీ) ఇత్తెఱంగున శిబి

—(*) అంగదాదులగు వానరులు వాలి కుత్తరక్రియలు గావించుట. (*)—

కయం,దింద్రసుతుని । తనువు జేర్చి నానావిధ, ధవళమాల్య । వితతనూత్న చే
లాద్యలం,కృతులచేత । నొప్పఁబూజించి మంత్రసం,యుక్తముగను ॥ (తే.గీ)
ఆర్యునకు నౌర్ధ్వదైహిక,మాచరింపుఁ । డనుచునానతి యీఁగొంద, ఱమిత
సత్త్వ । లాశిబిక నెత్తుకొనిపోయి ,రందుఁ గొంద । ఱర్థులకు ధనమిచ్చు
చు,నరిగిరపుడు ॥ (వ) మఱియుఁ దక్కిన తారాప్రభృతి వానరకాంత లంగ
దుంబట్టుకుని వీరవీరయనునార్తనాదంబుల భర్తనుద్దేశించి రోదనంబు సేయు
చు వెనుకొనిచనిరి తదీయరోదనశబ్దంబుచేత వనాంతరంబునందు గిరిగుహాము
ఖంబులతోడ వనంబులుదుఃఖించుచున్నట్లుండె నిత్తెఱంగునం జని వివిక్తజనసంకు
లంబగు నొక్కనదీపులినతటంబునం జేర్చియున్న చితాసమీపంబున శిబికనుని
చి రప్పుడు తార శిబికాంతరశాయియగు పతినాలోకించి తచ్ఛిరంబు నిజాం
కంబునం జేర్చుకొని దుఃఖితయై యిట్లనియె ॥ (శా) హాకీశోత్తమ హాకృ
పాజలనిధీ,హాగోత్రభిన్నందనా । హాకల్యాణగుణోత్తరా సుజనవ, ర్యా హామ
నోనాయకా । శోకవ్యాకులచిత్తనై మిగుల సంక్షోభించుచున్నిప్పుడే । లాకారు
ణ్యమెలర్పఁజూడవిటు నే,రంబేమిగావించితిన్ ॥(క) వనచరవర చుట్టనుబడి।
ఘనతరశోకమునఁజాల,గాసిల్లెడు నీ । జనమును గరుణఁబలుకఁగఁ । గనుఁగొ
నిభాషింపవింత,కఠినతదగునే ॥ (చ) అనిమిషనాథనందన గ, తాసుఁడవైన
ను నీముఖంబును । తనజలజాభమై యుదిత, తామరసప్రియ వర్ణతుల్యమై।
యనుపమ భూరిసమ్మదర, సాప్లుతమైమని యున్ననాఁటిచా । డ్పున రమణీయ
కాంతిఁ గడుఁ బొల్పుగ నొప్పుచునున్న దిప్పుడున్ ॥ (సీ) ప్లవగేంద్రకాలుం
డు,రామరూపంబున నినుఁబొలివుచ్చెనే,నీతిమాలి । దిక్కఱి విధవనై,దీనత నే
డ్చుచు నీపత్నులందఱు,నిన్నుఁగొలువ । నొక్కటఁ జనుదెంచి,యున్న వారేటి
కిఁ బలుకవు సతిసర్వ,వారజాన । సఖులు భృత్యులు చమూ,పతులు మంత్రు

లుప్రీతిఁజనుదెంచి యున్నారు,సముచితముగ ॥ (తే,గీ) వారినెల్ల సంభావిం
చి,వరుసతోడ । వీడుకొలుపుము పిమ్మట,వేడుకలర । నీవు మేమునుగలసిమ,
హావనసుల । సంతతంబును గ్రీడఁగా,వింత మధిప ॥ (వ) అని బహుప్రకా
రంబుల దుఃఖింపుచుండనంత నంగదుండు సుగ్రీవ సహితంబుగా రోదనంబుసే
యుచుఁ బితృకళేబరంబుఁ జితామధ్యంబునం బెట్టి విధిప్రకారంబున ననలుదరి
కొల్పిన నప్పావకుండాత్మశిఖాపరంపరల వాలికళేబరంబు భస్మంబుఁ జేసెనం
త సంచయనాదికృత్యంబులు నిర్వర్తించి పదంపడి నదీజలంబుల వాలికుదక
క్రియలు గావించె దక్షిణబంధుమిత్రజ్ఞాతులు వేర్వేఱ నుదకదానంబుగావిం
చి రంతఁ బ్రేతకార్యంబు లన్నియు నిర్వర్తించి కృతకృత్యులైరి తదనంతరంబ
సుగ్రీవుండు సలక్ష్మణుండగు రామునుపాసించియుండె సమస్తవానరులు మం
త్రిసహితంబుగా సుగ్రీవునింబరివేష్టించి కొల్చియుండిరి తత్తఱంగున నందఱుఁగృ
తాంజలిపుటులై మహర్షులు పితామహునింబలె నక్లిష్టకర్ముండగు రామ
చంద్రునిం గొల్చి యుండ నప్పుడు సుమేరుసమానశరీరుండును దరుణాదిత్యస

—(*) హనుమంతుఁడు రామునిఁ గిష్కింధకువిచ్చేయఁ బ్రార్థించుట. (*)—

న్నిభముఖమండలుండునగు హనుమంతుండు ఫాలకీలితాంజలిపుటుండై రఘు
వల్లభున కిట్లనియె ॥ (మ) దురితోద్వర్తనులైన వానరులకుఁ,దుష్ప్రాపమై
నట్టి యీ । హరిరాజ్యంబు భవత్ప్రసాదమున నీ,యాదిత్యపుత్రుండు సు । స్థిర
తంజేకొనెమంత్రియుక్తముగఁగిష్కింధఁ బ్రవేశించి భూ । వరమీయానతిసర్వ
కార్యములు నిర్వర్తించు వాఁడెంతయుఁ ॥ (చ) స్ఫురదురు దివ్యమాల్య
మణిపుంజసుగంధిమహౌషధంబులఁ । గురుమతి నీకొసంగి కడుఁ,గోరికతో
భజియింపుచుండు నీ । తరణిసుతుండు కీశసము,దాయము సంతసమంది చూ
డ స । త్వరముగమీరు రావలయుఁ,దద్దయుఁబ్రీతిఁ బురంబులోనికిఁ ॥ (చ)
అనవిని రాఘవుండుసుబుది,తాత్మకుఁడై హనుమంతుఁజూచి పా । యని యనుర
క్తిఁ బెంపుమెయి,నాడితి గాదనఁగూడదైన మ । జ్జనకుని యాజ్ఞఁబ్రోల్చొరక,
సంయమినై పదునాల్గువర్షముల్ । వనముననుండు వాఁడనని, వాక్కు నియో
కృతవ్రతంబుఁబూనితిఁ ॥ (క) పూనిన వ్రతంబు నిండినఁ । గాని పురంబుఁ
జొరరాదు,గావునమీరల్ । మానుగఁబురికేఁగుఁడిపుడు । భానుజునకుఁబ్లవగరా
జ్యపట్టముఁగట్టఁ ॥ (సీ) అనిపల్కి సుగ్రీవుఁ,గనుఁగొని రాముఁడిట్లని యెనీయం



—(*) రాముఁడు సుగ్రీవుని వీడు కొలుపుట. (*)—

గదుఁ,డధికసత్త్వుఁ । డన్నకుఁదనయుండు,యౌవరాజ్యమునకుఁబాత్రంబుగానఁ
ద,త్పదము నందు । నిలుపుమీతని నిది, సలిలాగమంబైన శ్రావణమాసంబు,జగ
తికెల్ల । నిమ్మాసమాదిగా,నిఁకనాల్గునెలలు వార్షికసంజ్ఞకంబులై, చెలఁగుని
ట్టి ॥ (తే,గీ) కాల ముద్యోగకాలంబు,గాదు కార్తి । కంబుసంప్రాప్తమగు
చుండఁ, గడిమి రిపువ । ధార్థమరుగంగ వలయు నీ,వంతదాఁక । నూర న
త్యంతసుఖలీలనుండిరమ్ము॥ (వ) ఏ నీపర్వతిగహ్వరంబున లక్ష్మణ సహితుండనై
నీవచ్చునందాఁక నుండెద నిదిరమణీయంబై విశాలంబై ప్రభూత సలిల కమ
లోత్పలంబై యున్నదని పలికిన నట్లకాకయని సుగ్రీవుండు రామునిచేతననుజ్ఞా
తుండై యనేక వానరసమన్వితంబుగా వాలి పాలితంబైన కిష్కింధాపురంబుఁ
బ్రవేశించి రాజమార్గంబునంజనుచు నెడనెడ నచ్చటవానరులందఱుఁదన్నె
దుర్కొని యభివందనంబులుగావించిన నయ్యైతెఱంగుల సంభావించుచు నం
తఃపురంబునకుంజనియె నప్పుడు బంధుమిత్రామాత్యులు సుగ్రీవున కభిషేకం
బుసేయ సమకట్టిరందుఁగొందఱు హేమపరిష్కృతంబైన పాండరాతపత్రంబు

—(*) వానరులు సుగ్రీవునకు రాజ్యాభిషేకముఁ గావించుట. (*)—

ను సువర్ణదండమండితంబులైన శుక్లవాలవ్యజనంబులును గరంబుల ధరించి
రి కొందఱు సర్వరత్నంబులును సర్వ బీజంబులును సర్వౌషధులును క్షీరవం
తంబులైన తరువులకుసుమంబులును శ్వేతమాల్యానులేపనంబులును స్థలజల
జంబులగు సుగంధి మాల్యంబులును దివ్యంబులగు చందనంబులును జాతరూ
పంబును హరిద్రాక్షతంబులును బ్రియంగుమధుసర్పిర్దధిప్రముఖ నిఖిలమం
గళద్రవ్యంబులును వైయాఘ్రంబగు చర్మంబును గోరోచనమ్మును మనశ్శిల
యునుం దక్షిణసర్వోపకరణ సంభారంబులన్నియు సమకూర్చిరి పదియా
ఱుగురుకన్యకలు సర్వాలంకారశోభితలై యభిషేకార్థంబు పూర్వోక్త మం
గళద్రవ్యంబులు కరంబులంగొని చనుదెంచిరంత యథాకాలంబున నన్నవస్త్ర
సువర్ణమణిప్రదానంబుల వానరజాతీయ విప్రులంబూజించి మంత్రకోవిదు
లగువారు కుశపరిస్తీర్ణయగు వేదికయందుననలుం బ్రతిష్ఠించి మంగళాభ్యు
దయార్థంబు మంత్రపూతంబులైనహవిరాజ్య హోమంబులు గావించి వరా
స్తరణ చిత్రమాల్యోపశోభిత సువర్ణప్రాసాద శిఖరోపరివిరచిత మణిమయ

సింహాసనంబునఁ బ్రాఙ్ముఖంబుగా సుగ్రీవునాసీనుంగావించి సువర్ణకలశశృంగంబులంబట్టి తెచ్చిన సకల నదీనదసముద్ర సరోవర పుణ్యతీర్థంబులచేత మహర్షివిహిత శాస్త్రదృష్టవిధానంబున గజగవయగవాక్ష గంధమాదనశరభ మైందద్వివిద జాంబవదాంజనేయ ప్రభృతి నిఖిలవానరులు వసువులు వాసవునింబోలె సుగ్రీవు నభిషేకించిరప్పుడు॥ (తే,గీ) అనఘుఁ డినపుత్రుఁ డభిషిక్తుఁ డగుచునుండ। నఖిలవానరపుంగవులమితహర్ష। కలితచిత్తులై గుంపులుగట్టి భద్ర। వాక్యములజయపెట్టిరవార్యసరణి॥ (క) జనవిభుఁడగు రాముని శాసనమున సుగ్రీవుఁ డాత్మసమునంగదుని। ఘనముగ సంభావింపుచుఁ। బనివడి తగ యౌవరాజ్యపదమున నిలిపెన్॥ (ఉ) అంగదుఁ డర్కవర్ణకన కాంగదుఁ డిట్లు కృతాభిషేకుఁడై। సంగతిమీఱ దివ్యవిల సన్మృదు తేజమున న్వెలుంగుచుం। డంగని సర్వవానరులు తద్దయుసంతసమంది కౌశలో। క్తింగడు సన్నుతించిరలకీశపతిన్రఘువంశవర్యులన్॥ (క) నిరుపమహర్షోత్కర్షిత। గురుకపి హర్షప్రభూతకోలాహలసం। భరితంబై కిష్కింధా। పురమప్పుడు సలిలరాశిపోలెఁ జెలంగెన్॥ (ఉ) అంతనిజాభిషేకకథయంతయు సూర్యసుతుండు రామభూ।

(*) రామలక్ష్మణులు ఋశ్యమూకముఁ జేరుట (*)

కాంతునితోడఁ జెప్పితన కాంతనునారుమఁ గూడిసమ్మద। స్వాంతముతో మనోజసుఖ వారిధిఁ దేలుచు ధర్మయుక్తిచే। నెంతయుఁ గీశరాజ్యపద మేలుచు నుండెఁ గుమారయుక్తుఁడై॥ (తే,గీ) అర్కనందనుఁ డభిషిక్తుఁ డగుచునుండ। రామభద్రుండు తేజోభిరాముఁ డగుచు। నపుడు లక్ష్మణసహితుఁడై యచటువాసి। శీఘ్రమున ఋశ్యమూకంబుఁ జేరఁ జనియె॥ (వ) మఱియును॥ (సీ) శార్దూలగోపుచ్ఛ చమరవరాహపంచానన సేవితంబైనదాని। నానామనోజ్ఞవల్లీనికుంజమహీరుహావళి సంకులంబైనదానిఁ। గమనీయశీతలవిమలోదక విరాజమానజలాశయంబైనదాని। లలితప్రసూనసౌరభసంగ్రహణపవమానమానితతలంబైనదాని॥ (తే,గీ) నచలశిఖరాగ్రమెక్కి యందతివిశాల। రమ్యతరమైనయొక గహ్వరంబు సొచ్చి। మిత్రకులవర్ధనుండు సౌమిత్రిఁ జూచి। యింపుదళుకొత్త మెల్లన నిట్టులనియె॥ (క) అనఘాయీపర్వతగుహ। యనుపమమైయుక్తవాసయోగ్యయైయున్నది గా। వునమనము వర్షరాత్రులు। చనునంతకు నిచట వసతి సల్పుదమురహిన్॥ (వ) మఱియు నిప్పర్వతశిఖరంబు శ్వేతకృష్ణతామ్రశిలోచ్చయశోభితంబును నా



నాధాతు సమాకీర్ణంబును దరినిర్ఝర విరాజితంబును నిరంతర కుసుమిత మాలతీకుందగుల్మ సింధువారకురంటక కాదంబార్జున సర్జప్రముఖ వివిధలతాతరుషండమండితంబును శుకపిక శారికామయూర మరాళప్రముఖ నిఖిలపతత్రిరవనాదితంబును నై యొప్పుచున్నది యిచ్చటికి సమీపంబున మనోహర సంఫుల్ల కమలకల్హార కైరవమండితంబైన యొక్క సరోవరంబు రమ్యంబుగాఁ బ్రకాశింపుచున్నది మఱియు నీగుహ నైరృతిద్వారయుక్తయగుటం జేసి వర్షప్రవేశాభావంబువలన మిక్కిలి తెస్సయై యుండుఁ బశ్చాద్భాగోన్నతయగుటం జేసి పురోవాతనిరోధకత్వంబువలన నివాతమైయుండు నీగుహాద్వారంబునందు సమతలంబై దీర్ఘంబై భిన్నాంజనచయోపమంబై స్నిగ్ధంబై యొక్కపాషాణంబున్నది యిచ్చటికుత్తరంబు నీలజీమూతంబు కరణి సముత్థితంబై భిన్నాంజనచయాకారంబై యొక్క నీలశిఖరంబును దక్షిణంబునఁ గైలాసశిఖరప్రఖ్యంబై నానాధాతువిభూషితంబై యొక్క శ్వేతశిఖరంబును బ్రకాశింపుచున్నయవి యిచ్చటికిం దూర్పునఁ బ్రాచీనవాహినీయగు నొక్కనది యకర్దమమై త్రికూటంబునందు జాహ్నవింబోలెఁ దేజరిల్లుచున్న దయ్యాపగాలలామంబు మఱియును॥ (చ) పులిననితంబయుక్తయుఁ బ్రఫుల్లసరోరుహపత్రనేత్రయు। న్లలితమృణాళదోర్యుతయు రాజితశైవలకేశపాశయు। న్విలసితవీచికావళియు విశ్రుతచక్రపయోధరాఢ్యయై। చెలువయుఁబోలె నొప్పెడుఁ బ్రసిద్ధచరిత్రకకంటెనిమ్నగన్॥ (మ) తటినీతీరములందుఁ బొల్చెడిమహాత్మా చూచితే శింశపా। వటహింతాలరసాలసాలధవనింబప్లక్షజంబీరక। స్ఫుటభల్లాతక మాధవీకురవకాశోకావళీపాటలీ। కుటజాశ్వత్థకురంటకాదివివిధక్షోణీరుహవ్రాతమున్॥ (చ) అలఘుచరిత్రకంటె హ్రదయంబులఁ గూరినరాగపూరము। ల్వెలికుఱుకం బతత్రములు విప్పుచుఁ గప్పుచుజోడుగూడియీ। పులినములందుఁ జెక్కడలఁ బుష్పశరోద్ధతిఁ గేళిసల్పెడున్। గళరవమాధురీమహిమ గ్రాలఁగఁ జక్రమరాళదంపతుల్॥ (ఉ) ఒక్కెడమందమారుతరయోత్థితనూతనపుండరీకమై। యొక్కెడశీతలోదకకణోక్షితకోకనదప్రకాండమై। యొక్కెడగంధలుబ్ధమధుపోదరనీలపయోజషండమై। యొక్కెడహృద్యసంపదల నొప్పుచునున్నది కంటెనిమ్నగన్॥ (క) పారిప్లవశతశోభిత। మైరమణీయాండజాతరవనాదితమై। సూరిజననిషేవితమై। యారూఢింబొల్చుచున్నదాపగ కంటే॥ (క) చందనతరు

బృందంబుల । మందమనోహరసుగంధి మహనీయములై । కందళిత విద్రుమము
లై । యందంద చెలంగుచున్న వంతటంగంటే॥ (తే,గీ) అనఘయీదేశ మతిరమ్య
మగుచుం బొల్చెం । బర్వతోద్భూతసకలసంపదలచేత । వర్షరాత్రంబు చను
దాంక హర్షమెసంగ । నిచట వసియింత మఖిలార్థ హితము పొంటె॥ (వ)
మఱియు సుగ్రీవ పాలితంబైన కిష్కింధాపురం బిచ్చటికి సమీపంబై యుం
డు మృదంగా డంబరంబుతోం గూడి గీతవాదిత్ర నిర్ఘోషంబును వాన
రుల కోలాహలశబ్దంబును వినంబడుచున్నదనిపలికి వెండియు రాముండిట్లనియె॥
(క) హరిరాజ్యంబునుభార్యను । నిరుపమగతినధిగమించినిత్యశ్రీవి । స్ఫురణానిన
నందనుండత్యురుతరసుఖగోష్ఠినలరుచుండుంగాదే । (వ) అనిపలికియారఘుకుం
జరుండు బహుదృశ్యదరీకుంజ పుంజరంజితంబైన యన్నగంబునం బొల్చు గు
హయందు నధివసించెనప్పుడు॥ (క) నిరుపమధాతుసముజ్జ్వల । సురుచిరమణి
కటకసానుశోభితమయ్యు । న్గిరిసీతావిరహితుండగు । నరవిభునకుసమ్మదంబొన

—(*) రాముండు సీతందలంచుకొని దుఃఖించుట. (*)—

ర్పకయుండె॥ (వ) ఇత్తెఱంగున నారఘుసత్తముండు లక్ష్మణసహితంబుగా
గిరిగుహానాశ్రయించి॥ (ఉ) అచ్చటిపద్మకుట్మలము లచ్చటిమత్తమధువ్రతవ్ర
జం । బచ్చటినూతనోత్పలము లచ్చటిదాడిమ బీజసంచయం । బచ్చుగజానకీ
కుచక చాక్షిరదద్యుతిం దెల్పనాత్మలో । హెచ్చిన శోకతాపమున నెంతయుండ
త్పరతన్స్మరింపుచుండె॥ (చ) చిలుకలుమ్రోయంగోయిలలు చెంగటంగూయంగం
బిన్న తెమ్మెర । ల్గలయంగవీవం బ్రాణముల కంటెగరీయసియైనజానకి । స్ఫులంచు
చురాత్రులందుహిమ ధామునిరాకకు బెగ్గలింపుచుం । గళవళ మందుచు న్మిగు
లం గంటికింగూరుకురాక వేంగుచుండె॥ (ఉ) ఎప్పుడురావణుంగదిసి యేపునగీ
టడంగింతునెప్పుడా । కప్పురగంధినొక్కటను ఖంబగునట్లుగంగౌగిలింతునీ । డె
ప్పరమైనశోకజల ధిందగనెప్పుడుదాంటువాండహా । యొప్పుల కుప్పయంచువి
భుండాయ్యెనదుఃఖితుండయ్యెనెంతయుండె॥ (వ) ఇట్లు ప్రియావిరహసంజాత
శోకపారవశ్యంబున నైమఱచియున్న యన్నంజూచి సమానదుఃఖుండయ్యును
లక్ష్మణుండు కొండొకధైర్యంబున బహువిధ మందమధురాలాపంబులం దేర్చు
చుసిట్లనియె॥ (చ) అనుపమధైర్యశాలివిజితారివిదేవపరాయణుండవీ । య
నువుననీవుప్రాకృతునియట్లుగ కృశింపంగ జెల్లదయ్యపా । వనగుణమీకుం జెప్పంగల



వాండనె శోకము సర్వకార్యనా । శనకరమంచుం బెక్కండల సాధులుచెప్పరెమీ
రెఱుంగరే॥ (తే,గీ) అనఘమీకంటె ధర్మజ్ఞుండధిక ధైర్యుం । డమిత శౌర్యుం

—(*) లక్ష్మణుండు శ్రీరాము నూఱడించుట. (*)—

డువేఱొక్కండవసింగలండె । ఘోరసంగ్రామమునదైత్యుంగూలనేయు । దక్షుం
డవుదివ్యకోదండదీక్షితుండవు॥ (ఉ) అంబుధినిమ్నగాగిరివ నాకులమైన ధరి
త్రినొక్కవా । లంబునంగూల్పంజాలినప రాక్రమశాలికినీకునొక్కండై । త్యుంబ
రిమార్చుటెంతమది నుమ్మలికంబుదొలంగంబెట్టిరా । ద్రంబునరావణుంగదిసి
తప్పకచంపుము సంగరంబునన్॥ (వ) మహాత్మా యిప్పుడు ప్రావృట్కాలంబు
సమాగతంబైయున్నయది యింకమీంద శరత్కాలంబు చనుదెంచు నప్పుడు
ప్రాతఃకాలంబునందు దీప్తాహుతులచేత భస్మచ్ఛన్నుండగు వైశ్వానరుంబో
లె నేను విక్రమోచితవాక్యంబులం బ్రసుప్తంబైన భవదీయ వీర్యంబుం బ్రబో
ధించెద మద్వాక్యచోదితుండవై పురరాష్ట్ర పరివార సహితంబుగా రావణుం
బరిమార్పుమనిపలికిన స్నిగ్ధంబులగు లక్ష్మణుని వచనంబులువిని రాముండు ల
క్ష్మణుంజూచి యనురాగయుక్తంబును గాలోచితప్రియపరంబును హితోదర్కం
బును నమోఘవిక్రమయుక్తంబునగు వాక్యంబు నీచేత సముదీరితంబయ్యె నీ
చెప్పినట్లు సర్వకార్యావసాదకంబైన శోకంబుం బరిత్యజించి యప్రతిహతంబగు
తేజంబంగీకరించి శత్రువధంబునకుత్సహించి సుగ్రీవసమాగమనంబుం గోరుచు
శరత్కాలంబుం బ్రతీక్షింపుచుండెద నుపకార యుక్తుండగు పురుషుండు ప్రతీ
కారంబుగావించు కృతజ్ఞుండుగాక యకృత ప్రతికారుండయ్యెనేని యతండు
పరమసాత్త్వికులమనంబును క్షోభింపంజేయునని పలికిన నన్నమాటలు విని సౌ
మిత్రి కృతాంజలిపుటుండై తద్వాక్య కౌశలంబు బహువారంబులు గైవారం
చేసి యభిరామదర్శనుండగు రామునివిలోకించి యతని ప్రసాదంబు వడసి
స్వకీయంబైన శుభ మతంబు ప్రకటింపం జేయుచు దేవా సుగ్రీవుండు కృత
జ్ఞుండు ప్రవర్తకుండు భవదీప్సితంబు సిద్ధింపం జేయుటకు సమర్థుండు శర
త్కాలంబు వచ్చునంతకుం జనుదేఱంగలండు కోపంబుపసంహరించిశరత్కా
లంబుప్రతీక్షింపుచునిన్నాల్గుమాసంబులు సహించిమృగరాజసేవితంబైనయీప
ర్వతంబునందు మత్సమేతంబుగావసింపుమనిన నతనివాక్యంబులచేత నుపశమి
తకోపతాపుండయ్యె నిట్లువాలింబరిమార్చి సుగ్రీవునభిషిక్తుంజేసి మాల్యవత్ప

ర్వత పృష్ఠభాగంబున నధివసించి రాముండు లక్ష్మణునకిట్లనియె ॥ (క) విరహు

## శ్రీరాముఁడులక్ష్మణునితో వర్షాకాలమునభివర్ణించి చెప్పుట.

లకు మదన వర్ధన । కరమైతనరారువృష్టి, కాలంబిదియం । బరమచలసన్ని
భాంభో । ధరసంవృత మగుచుఁ బొల్చెఁ, దమ్ముఁడకంటే ॥ (క) వనధిరసము
నినకరముల । ఘనముగఁ ద్రిగిచికొని క్రోలి, గగనాంగన మె । ల్లననవమాస
భృతరసా । యనగర్భముఁ గన్నచంద, మయ్యెడిఁ గంటే ॥ (తే,గీ) మేఘ
సోపాన పఙ్క్తుల,మిన్ను ప్రాఁకి । నవమనోహరకుటజార్జున ప్రసూన । మా
లికలచేతఁ దగనంశు,మాలినిపుడు । జనసుతయలంకరింపంగ, శక్యమయ్యె॥
(క) అలసానిలనిశ్వాసము । లలితాపాండరలసజ్జ,లధరము సంధ్యా । మల
యజలిప్తమునైనభ । మలరెడుఁ గామాతురునిక్రి, యంగనుఁగొంటే ॥ (వ) మ
ఱియు నీగగనం బంతరాంతరా సముద్భిన్న సంధ్యారాగంబు లగుటవలనఁ దా
మ్రంబులై పర్యంతంబులం దధిక పాండరంబులై కించిజ్జల రస సంబంధంబులై
యొప్పు మేఘపటచ్ఛేదంబులచేత బద్ధవ్రణంబైన దాసియట్ల చూపట్టుచున్న
ది విలోకింపుము ॥ (తే,గీ) దశరథకుమారఘర్మసంతప్తయైన । ధరనవోద
కసిక్తయై, విరహతాప । తప్తయైనట్టి మేదినీ, తనయభంగి । బాష్పములుని
చుచున్నది పరఁగఁగంటే ॥ (తే,గీ) అంబుదోదరముక్తంబు, లైవినూత్న । లలి
తకల్హార సుఖశీత,లంబులై సు । కేతకీసౌరభంబులై వాతములుక । రాంజలు
లఁబట్టి విడుచుట, కర్హమయ్యె ॥ (క) వికసితమకుటార్జునకే । కతభరి
తమైనయీకుధర మారవిపు । త్రకుని విధంబునవర్ష । దకముల నభిషిక్త
మయ్యెఁ, దమ్ముఁడకంటే ॥ (క) ధారాధరాజినంబులు । ధారాయజ్ఞోపవీత,ధ
రములును మరు । త్పూరితగుహములునగు గిరు । లారయ శ్రుతిచదువుచున్న
యట్లయలరెడుఁ ॥ (వ) మఱియు నంబరంబు కాంచన కశలచేతం బోలెడుఁ జం
చలలచేతఁ దాడితంబై యంత స్తనిత నిర్ఘోషంబై వేదనాసహితంబైనదానిఁబోలి
కనొప్పుచున్నది విలోకింపుము ॥ (మ) సరసాగ్రేసర రమ్య చంద్రకరసంస్ప
ర్శ ప్రభూతప్రమో । దరసోన్మీలితతారయైమిగులసంధ్యాలక్ష్మియాత్మీయభా ।
సురచేతోహరశోహితప్రభలచే సొంపొందఁగానిప్పుడం । బరముం జాలనె
లుంగఁజేసెడి మహాత్మా వేడ్కవీక్షించితే ॥ (తే,గీ) అనఘ మేచకమేఘంబు నా
శ్రయించి । శంపచూచితె జ్వాలఁజలింపుచున్న । దకటదుష్టాత్ముఁడైనదశాస్యునం



క । తలమునఁగృశింపుచున్న భూతనయపోలె ॥ (తే,గీ) అభ్రలిప్తలై నష్టగ్రహా
బ్జలగుట । వలన నజ్ఞాతభాగలై యలరుదిశలు । మీఱిమదనోత్సవముసేయువారి
కెల్ల । హితమొనర్చుచున్నవి నృపకుమార ॥ (చ) అకలుష చిత్తకంటెవిపి
నాచలసానువు లన్ఘనోదయో । త్సుకకుటజావనీజములు శోకపరీతుఁడనైన
నాకుఁబో । యకమదనప్రదీపనములై సముదంచితపల్లవంబులై । వికచసుమంబు
లైమదికి వేడ్కయొనర్చుచున్నవెంతయుఁ ॥ (చ) రవికులవర్యచూచితివెరమ్య
పయోధరకాల సంగతిం । బవనుఁడు శైత్యమొందె నలభానుఁడుమందగభస్తి
యయ్యెన । య్యవనిరజంబడంగెనదు లన్నియునిండెఁబ్రవాసులైనమా । నవు
లుస్వదేశభూమికి ఘనంబుగఁబోవుచునుందు రిత్తఱిఁ ॥ (క) ఎడతెగక కురియు
దట్టపు । జడివానలమిట్టపల్లసమతలమైకా । లిడరాకరొంపిగొనియె । ప్పెడువ
నమార్గములుకంటె పృథివీశసుతా ॥ (తే,గీ) కంటివె మరాళములునిజాంగ
నలఁగూడి । పరఁగమానసదానతత్పరములగుచు । బహుళవర్షాంబువిహతప
థములందుఁ । గాలిడకపోవుచున్న విగగనమందు ॥ (తే,గీ) చక్రహంసబకక్రౌం
చసారసములు । నష్టకుముదాంబురుహకోకనదములైన । సరసులందుండఁజా
లకసంభ్రమమున । సొలయుచున్నవికంటివే జోడువాసి ॥ (ఉ) తెక్కక వారివా
హసము దంచితమైనసుపర్వమార్గము । న్నక్కవతోడఁ జూచితివె మానద
యొక్కెడసత్ప్రకాశమై । యొక్కెడనప్రకాశమయి యొప్పుచునున్నది యక్క
డక్కడం । జక్కగశైలరుద్ధమగు శాంతమహార్ణవరూపవైఖరిఁ ॥ (వ) మఱి
యు సర్జకదంబ పుష్పవ్యామిశ్రితంబై పర్వతకూటంబులుడిగ్గి తదీయ ధాతు
రాగతామ్రంబై మయూరకేకారవానుస్యూతంబై జలజలనం బఱతెంచున
వోదకంబునహించి ఘుమాఘుమారావంబులతో శైలాపగలు ప్రవహింపుచు
న్నవి తదీయశీకర పరంపరాసంవర్ధిత జంబూతరుశాఖాగ్ర షట్పదాయమా
నపరిపక్వ పరిపతితజంబూఫలంబులును బవనావధూతంబులై పుడమింబడునా
నావర్ణ విపక్వచూతఫలంబులును జనులచేత భక్షింపంబడుచున్న విశంపా
పతాకంబులై బలాకామాలాసమన్వితంబులై మహీధరశిఖర సంస్థానసంకాశం
బులై మహానాదంబులై మేఘంబులు సంగ్రామస్థంబులగు మహామదగజేం
ద్రంబులవడువున గర్జింపుచున్నయవి వర్షసలిలసంపృక్తశాద్వలంబులై నృ
త్యోత్సవక్రీడాభిరత మయూరంబులై నివృష్టమేఘంబులై వనంబులపరాహ్ణ

కాలంబున నతిరమణీయంబుగాఁ బ్రకాశింపుచున్నవి మఱియు జీమూతంబులు సలిలాభిభారంబు వహించి సబలాకంబులై మహానాదంబులు గావింపుచు సమున్నతమహీధర శిఖరంబుల మీఁద విశ్రమింపుచుం బోవుచున్నయవి గర్భధారణార్థంబు మేఘంబుకడకుం జనుసంజాతసమ్మోదయైన బలాకాశ్రేణి నింగికిం గట్టిన వాతావధూతలంబమాన సితాంభోరుహరేఖ చొప్పున నొప్పుచున్నది బాలేంద్రగోపాంతర చిత్రిత నూతనశాద్వలంబు చేత వసుంధర గాత్రానుషక్తశుకప్రభలాక్షోక్షితకంబళంబు చేతఁ గాంతయుం బోలె నభిరామయై యున్నది మఱియు వర్షాగమసంహృష్టంబులగు వనగజంబులు కేతకీగంధాస్వాదనసంజాత సంతోషవిశేషంబునధిగమించి వననిర్ఝరంబులయందుఁ బతనకృత శబ్దాకులితంబులై మదవిశేషంబున మయూరంబులం గూడి నాదంబు గావింపుచున్నవి మఱియుఁ జంచరీకంబులు వర్షధారానిపాత హన్యమానంబు లగుటవలనఁ గదంబశాఖ లవలంబించి తత్క్షణసంపాదితంబైన కుసుమరసోత్పన్న మదంబు పరిత్యజించుచున్నవి మఱియు నంగారచూర్ణోత్కర సంకాశ సరస సమృద్ధఫలంబుల చేత జంబూతరుశాఖా కదంబంబులు నిలీయమాన షట్పద సమూహంబుల చేతం బోలె మనోహరంబులై యొప్పుచున్నవి తటిత్పతాకాలంకృతంబులును సముదీర్ణగంభీర మహాఘోషంబులునగు నీలజీమూత స్వరూపంబులు రణోద్యతవారణ స్వరూపంబుల భంగిఁ జూపట్టుచున్నయవి యొక్కమదగజేంద్రంబు స్వనివాసస్థానంబైన శైలవనంబునకు సుపథంబునం బోవుచుఁ బృష్ఠభాగంబున మేఘనాదంబు విని ప్రతినాగంబని శంకించి యుద్ధార్థంబు మఱలుచున్నయది మఱియు వనమధ్యంబులొక్కయెడ మధువ్రతంబుల చేతఁ బ్రగీతంబులైనమాడ్కి నొక్కయెడ నీలకంఠంబుల చేతఁ బ్రనృత్తంబులైనకరణి నొక్కయెడ సామజేంద్రంబుల చేతఁ బ్రమత్తంబులైన భంగి ననేకాశ్రయంబులు గలవియై యలరుచున్నవి మఱియు వనాంతభూమి కదంబ బంధూకార్జున శిలీంధ్రపుష్పోపేతయై నూతనసలిలసంపూర్ణయై మత్తమయూర నాదనృత్తంబుల చేతఁ బానభూమియుం బోలెఁ గనుపట్టుచున్నది మఱియు ముక్తాసంకాశంబును విమలంబును బత్రపుటలగ్నంబును సురేంద్రదత్తంబునైన పతజ్జలంబును నానావర్ణపక్షంబులైన చాతకంబులు తృష్ణావిశేషంబునం గ్రోలుచున్నవి మఱియు మత్తభ్రమర తంత్రీమధురనాదంబును మండూక సముదీరిత



కంఠతాళంబునగు సంగీతంబు జలధర మృదంగనాదంబుల చేత నావిష్కృతంబై మహారణ్యంబులయందుఁ బ్రవర్తింపుచున్న దాని యట్ల విననగుచున్నది మఱియు నీసంగీతంబునకు నృత్యంబు గావింపుచున్న కొన్ని మయూరంబులు నర్తకస్థానీయంబులై కేకారవంబులు గావింపుచున్న కొన్ని మయూరంబులు మృదంగగాయకస్థానీయంబులై మహీరుహాగ్రనిషణ్ణగాత్రంబులైన కొన్ని మయూరంబులనుభవితృస్థానీయంబులై యొప్పుచున్నవి ఘనస్వనంబుల చేతఁ జిరకాలసన్నిరుద్ధయైన నిద్రం బరిత్యజించి మేల్కొని నానావిధవర్ణరూపనాదంబులైన మండూకంబులు నూతనసలిలధారాభిహతంబులై ఘోషింపుచున్నవి మఱియు నద్యంగనలు వారిపూర్ణోన్మిత చక్రవాకంబులై శీర్ణంబులైన తీరంబులనతిక్రమించి యతిదృప్తలై నూతనఫలాద్యుపహార చందన కర్పూర కుసుమ తాంబూలాదికసమన్వితలై నిజభర్తయగు సముద్రునిం గలయుటకు నతివేగంబునం బోవుచున్నయవి దవాగ్నిదగ్ధంబులైన పర్వతంబులయందు బద్ధమూలంబులగు దవాగ్నిదగ్ధపర్వతంబుల కరణి నీలమేఘంబులయందు సంసక్తంబులైన నూతనవారిపూర్ణ నీలమేఘంబులు గగనంబునం బ్రకాశించుచున్నవి మఱియు మదోద్దండ వేదండంబులు సంప్రహృష్ట మయూరనాద ముఖరితంబులును శక్రగోపనామక కీటవిశేష ప్రచుర శాద్వలంబులును నీపార్జున వాసితంబులునైన వనమధ్యంబులయందుఁ జరింపుచున్నయవి చంచరీకంబులు నవవారిధారాహతకింజల్కంబులైన సరోరుహంబులం బరిత్యజించి సకేసరంబులైన కదంబపుష్పంబులయందు రయంబునం బ్రవేశించి యానందింపుచున్నవి మఱియు గజేంద్రంబులు మదోన్మత్తంబులై గవేంద్రంబులు సంప్రహృష్టంబులై మృగేంద్రంబులు మహారణ్యంబులయందు విశ్రాంతతరంబులై పర్వతేంద్రంబులు పల్లవపుష్పాంకురాదుల చేత నతిరమ్యంబులై నరేంద్రులు నివృత్తదండయాత్రులై యున్నవారు సురేంద్రుండు వారిధరంబులతోడం గ్రీడింపుచున్నవాఁడు మఱియు మహామేఘంబులు గగనంబు నాశ్రయించి సముద్ధూత సముద్రనాదంబులై మహాజలౌఘంబుల చేత వాపీకూపతటాక సరోవర నదీసంఘంబులఁ బూరింపం జేయుచున్నవి మేఘంబులు మహావేగంబులై నిరంతరంబుగా వర్షింపుచున్నయవి వృష్టివాయువులు సముదీర్ణఘోషంబులై వీచుచున్నయవి మహానదులు నష్టకూలంబులై విప్రతిపన్నమార్గంబులై ప్రవహింపుచున్నయవి మఱి

యు నరేంద్రులునరులచేత నభిషిచ్యమానులై యాత్మీయ సంపద నవలోకిం పంజేసినకైవడిఁ బర్వతేంద్రంబులు సురేంద్రదత్త పవనోపనీత ఘనాంబు కుంభంబులచేత నభిషిచ్యమానంబులై నైర్మల్యవివిధ ధాతుభూషిత నానావిధ కుసుమితతరు లతాద్యలంకృతివిశిష్టంబైన నిజాకారంబు దర్శింపంజేయుచున్నయవి జలదోపపన్నంబగుటవలన నక్షత్రగ్రహభూషితంబైన నభంబునుసూర్యమండలంబునుం గనుపట్టకున్నయది గాఢసంతమససంవృతంబు లగుటంజేసి దిక్కులును నిరంతర వారిపూర పరిచ్ఛన్నంబగుటం జేసి మహీతలంబునుం బ్రకాశింపకున్నయది మఱియు మహోన్నతంబులైన శైలశిఖరంబులు నవవారిధారాధౌతంబులై మహాప్రమాణవిపుల నిర్ఝరంబులచేతనుపలక్షితంబులై లంబమాన ముక్తాకలాపంబులచేతంబోలె మిక్కిలి యభిరామంబులై యున్నయవి మఱియు శైలేంద్రోపరిసంజాత విపులప్రవాహంబులు పర్వతోపల విశీర్యమాణ వేగంబులై మత్త మయూరరుత ముఖరితంబులైన గుహా ముఖంబులందు వికీర్యమాణ హారంబులభంగిఁ జూపట్టుచున్నవి మఱియు మహావేగంబులైనకొన్నివిపుల ప్రపాతంబులు నిర్మలీకృతశిఖరిసమీపతలంబులై ముక్తాకలాపప్రతిమంబులై డిగ్గుచు శైలగుహామధ్యప్రదేశంబులచేతధరింపంబడుచున్నవి సురతక్రీడాసంఘర్షణ విచ్ఛిన్నంబులైన దేవతాంగనాహార మౌక్తికంబులవడువునఁదోయధారలునిరంతరంబుగా దిక్కుల యందుఁ గురియుచున్నవి నదులకు శీఘ్రప్రవాహంబును ఘనంబులకు నీలిమయు మత్తగజంబులకు ఘీంకారంబులును వనాంతరంబులకు రామణీయకంబును విరహిణీ జనంబులకు రతిధ్యానంబును మయూరంబులకు నృత్యంబును బ్లవంగంబులకు సమాశ్వాసనంబునుం గలిగి కులాయలీయమాన విహంగమంబులచేతను ముకుళితంబులగు పంకజంబులచేతను వికసితంబులగు మాలతీకుసుమంబులచేతను సూర్యాస్తమయ నిరూపణంబు సేయుటకుం జగియొవ్వ నిశాకాలంబునందు ॥ (క) ముదమున బలాకలునవా । రిదసంగతి నొందెఁగాంత, ప్రియునిం జెందె । న్నదులంభోనిధినొందెను । బదపడిహరి నిద్రఁ జెందె,బాధిత వతనయా ॥ (క) జననాథపుత్ర భూసుర । జనములకిది వేదపాఠ,సమయము ధరలో । ఘనసామ వేద ఘోషము । వినవచ్చున్మధురఫణితి విస్ఫుల యుండ్లన్ ॥ (క) సలిలసమీకృతపథములు । గలుగుటచే వైరమడిగి, క్ష్మాపతులు బలారి । బుల నిలిపి దండ



యాత్రకు । నిలనెవ్వరు చనకయుందు రికాలమునన్ ॥ (తే,గీ) అనఘసంచితసంచయుఁడై భరతుఁడు । రమణ నాషాఢశుక్లపూర్ణిమ మొదలుగ। మనుకొని నివృత్తి కమర్హయ, తనుఁడు నగుచు । నూరవ్రతమూని నియతుఁడై, యుండుఁగాదె ॥ (క) అనఘ సమాయాతుఁడనగు । ననుఁగని సాకేతనిస్వనముకై ఎడినూ । తనజలపూరితసరయూ । ధునీ రయముసాంద్ర మగుచుఁ, దోఁచుంగాదే ॥ (క) తమ్ముఁడ యీవర్షాకా । లమ్మున రవిసుతుఁడు లబ్ధ, రాజ్యపదుండై । యిమ్ములనాత్మసతీయు । క్తమ్ముఁగ గ్రీడింపుచుండుఁ, గదగతరిపుఁడై ॥ (క) ఏనెంతయభాగ్యుఁడనో । జానకి నెడఁబాసి విగత, సామ్రాజ్యుఁడనై । నానుచు నున్నాఁడ మది । దీనతలోఁగొన్న ఘనఘ, సీతటము క్రియన్ ॥ (క) అని బహుభంగుల రాఘవుఁ । డనుజునితో వగలఁ బొగిలి. యంతటమఱలన్ । దనమదిశోకము తాలిమిఁ । దనరఁగనిట్లనియెఁగార్య, వశతెలియంగన్ ॥ (చ) కుధరములప్రధృష్యములు, ఘోర వనంబులు దుష్ప్రవేశము । ల్పథములు దుర్గమంబులు న,పారము కంధి దశాస్యుఁ డంటిమా। ప్రధనములందవారిత ప,రాక్రముఁడిన్నియు నిస్తరించిశౌ । ర్యధనుఁడనైననాకెటుధ,రాతనయం బడయంగఁజొప్పడున్ ॥ (క) ఒక్కమ్మునఁ బురుహూతజుఁ । డక్కకకూలంగ వైచి, తపనసుతునితో । నొక్కట శిఖిసాక్షికముగ । నిక్కడసఖ్యంబుసేయు,టెంతకుఁగాదే ॥ (సీ) జనకజాన్వేషణ,దనుజేంద్ర హింసనోద్యోగ మిప్పుడెమన, కుచితమనుచు । నినసందనుండు ప్రహృష్టభూతుఁ డగుచుండఁ గడుదుర్గమములైన. ఘనపథములు । నవనీంద్రదండయాత్రాభావమునుజూచి మాఱుమాటాడక, యూరకుంటిఁ । జెక్కుబాధలఁ బడి, పెద్దకాలమునకుఁదనపత్నిఁ గూడి యత్తరుచరేంద్రుఁ ॥ (తే,గీ) డతను పరతంత్రుఁడై సౌఖ్య,మనుభవింపు । చున్నవాఁ డావిధంబున. నుండనిమ్ము । తృప్తినొందక మున్నెయా,ధీరవరునిఁ । బిలువనంపిన దోషంబు,గలుగుమనకు ॥ (మ) తనివొందన్సుఖియించి యవ్వలఁ దనం,తందానె కాలంబెఱిఁ । గినిజానీకముతోడ రావణవధ,క్రీడాకళాలోలతన్ । జనుదేరంగలఁడేను దన్ముఖనిరీ,క్షాపేక్షనం దాఁకనీ । ఘనశైలాగ్రమున న్వసించెద శర,త్కాలోదయాకాంక్షినై ॥ (క) ఉపకారికిఁ బ్రతికారము । నిపుణతఁ గావించునతఁడు, నిజముగ నటుగా । కపకారి యయ్యెనేనియుఁ । గపిపతి యగు వాలి యట్ల,కట్టికుడువఁడే ॥ (చ) అ

నప్పుడు లక్ష్మణుండు ఘటితాంజలియై రఘుభర్తఁ గాంచి యి ట్లనుజగదేకవీ
ర యిట్టు,లానతియీఁదగ దార్తబంధుఁడా । యినసుతుఁ డట్టివాఁడె భవ,దీప్సి
తమందుఁ బ్రసన్నచిత్తుఁడై । పనిపడివచ్చు నిక్కముగఁ బ్రౌఢపాయమునన్స
సైన్యుఁడై ॥ (వ) అని రాముండును లక్ష్మణుండును బరస్పరాలాపంబులఁ గా
ర్యచింతాతత్పరులై యుండి రటఁ గిష్కింధాపురంబునందు గతవిద్యుద్బలాహ
కంబును సారసారవసంఘుష్టంబును రమ్యజ్యోత్స్నానులేపనంబును విమలం

(*) హనుమంతుఁడు సుగ్రీవుని బ్రమాదమును గుఱించి చింతించుట. (*)

బునగు గగనంబు నవలోకించి హనుమంతుండు ॥ (క) జడివెలసె శరత్కా
లము । కడువడిఁ బఱతెంచె నింకఁ, గమలాప్తజుఁడున్ । గడకొని రాముని
కార్యము । జడతం గావింపఁడయ్యె, సంభ్రమపరుఁడై ॥ (చ) తనదగురా
జ్యభారము ప్రధానులపై నిడి కామలోలుఁడై । జనపతివిక్రమం బెఱుఁగఁ, జా
ల కహర్నిశమున్నిజాంగనా । ఘనసురతానుభూతిమెయిఁ, గానక చేడ్పడి
యున్నవాఁడు మే । దిని మదనాభిపన్ను నకుఁ, దెల్పియుబోధము పుట్టసేచుర
నే ॥ (వ) అని యోచించి యుత్తేజగుననైన నితని చిత్తంబు కార్యాయత్తం
బు సేయుదునని తలంచి నిశ్చితార్థతత్త్వజ్ఞుండును దేశకాలవిశేషధర్మ
విదుండును నీతిమంతుండు నగు హనుమంతుండు సమృద్ధార్థుండును మంద
ధర్మార్థసంగ్రహుండు నసన్మార్గప్రవర్తకుండును నేకాంతగతమాన
సుండును నివృత్తకార్యసిద్ధార్థుండును నిరంతరప్రమదాభిరతుండును సర్వమ
నోరథసంసిద్ధుండును దారాసక్తమనస్కుండును మంత్రిన్యస్తసమస్తకార్యుం
డును మిత్రానపేక్షకుండు నుత్సన్నరాజ్యసందేశుండును గామవృత్త్యావస్థితుం
డును గృతార్థుండును విగతజ్వరుండునై నందనోద్యానంబున నప్సరసలం గూ
డి క్రీడింపుచున్న పురందరుని పడవున వానరకాంతలం గూడి దివారాత్రంబు
లెఱుంగక యంతఃపురంబునఁ గ్రీడింపుచున్న సుగ్రీవుని విలోకించి కొండొకసే
పు మనోరమంబులును హేతుమంతంబులు నగు ప్రసాదజనకవాక్యంబులచేత
నతని చిత్తంబు ప్రసాదాయత్తంబు గావించుకొని హితంబును సామధర్మా
ర్థనీతిమంతంబును బ్రణయప్రీతిసంయుక్తంబును విశ్వాసకృతనిశ్చయంబు న
గు వినయవాక్యంబున నిట్లనియె ॥ (ఉ) రామునిసత్కృపం బ్బడగ, రాజ్యప



—(*) హనుమంతుఁడు సుగ్రీవునకుఁ గర్తవ్యాంశమును బోధించుట. (*)—

దస్థుఁడవై తివీవు నీ । కామితము ల్ఫలించె నధి, కంబుగ సౌఖ్యముకీర్తిఁ గల్గెనా।
ధీనుహితుండు కానల నతీవిరహార్తిఁ జెపించుచుండెఁ ద । త్కామిత మీవుదీ
ర్పకిటు, కాలమెఱుంగక నుండఁజెల్లునే ॥ (ఉ) కాలమెఱింగి యెవ్వఁడను,
కంపవలిపర్ఁగ మిత్రులం గనె । కార్యములనన్యభావమునఁ, గర్జమెఱింగిచ
రించునట్టి భూ । పాలుని రాజ్యమున్యశము, భాగ్యము తేజము నాటినాటికి ।
న్వోలఁగఁ బూర్వపక్షశశి, పోలిక వృద్ధినహించు నెంతయున్ ॥ (మ) క్షమనె
వ్వాఁడుకృతజ్ఞుఁ శేముషీ సుహృ, త్కార్యావనోద్యోగియై । విమతోత్పాటనయ
త్నతంబరఁగు నా. విశ్వాసికింగాకరా । జ్యముచేకూడునె కీర్తిహెచ్చునె సమ,
స్తైశ్వర్యములబ్బునే । ఖ్యముపర్తిల్లునె మిత్రకార్యఘటన, వ్యాపారియౌ
వానికిన్ । (వ) మహాత్మా నీవు వృత్తసంపన్నుండవు సాధుమార్గసంస్థితుండవు
గావునఁ బరమమిత్రుండగు రామునకుం బ్రియంబుగా సీతాన్వేషణయత్నంబు
గావింపుము ॥ (ఉ) కార్యము లన్నియు న్విడిచి, గాదన కెవ్వఁడు ధాత్రిలో
సుహృ । త్కార్యమునందు సేమఱక, శ్రద్ధయుఁ బ్రీతిఁ జరించునట్టి వాఁ । డార్య
పథానువర్తియయి, యాపదలం జెడిపోకసంతతై । శ్వర్యమునం జెలంగునని, వా
రణచాతురిగల్గునన్యుగన్ ॥ (సీ) వినుముకాలంబు పోయిన వెనుక మిత్రకార్య
ములందు నెవ్వఁడూ, రక చరించు । నతనిచేదుష్కరంబైన కార్యమొనర్పఁబడి
యునువ్యర్థమై, పరఁగుచుండు । నటుకాన నీవుధ, రాధీశునకుఁ బ్రియమొద
వఁగా జానకి, వెదకఁ బంపు । మింకజాగుసేయుట, హితముగాదు వనాటరాజ
నీచేతఁగర్తవ్యమైన ॥ (ఆ, వె) మిత్రకార్యమెద్ది మెయికొని నర్తించు । నట్టిరా
మకార్యమరయనీకుఁ । గరమతీతయుక్తకాలమైనదంపు । చున్న దెఱుఁగకి
ట్టులుండఁదగునె ॥ (వ) కపీంద్రా నీవు కాలజ్ఞుని చేత నప్రబోధితుండవగుటం జే
సి కాలంబెఱుంగకున్నవాఁడవు మహాప్రాజ్ఞుండును గుణగ్రాహకుండును దీర్ఘబం
ధుండును నప్రమేయస్వభావుండును నసమానగుణగరిష్ఠుండు నగు రాముండు
ధీరపరాయణుండయ్యును భవద్వశానుగుండగుటం జేసి నిన్నుఁ బ్రేరేపింపకున్న
వాఁడమ్మహాత్ముని చేత యుష్మత్కార్యంబు కృతంబయ్యె నీవా మహాత్మునికా
ర్యంబు సేయుము హరిశ్రేష్ఠులగువారినెల్ల దిక్కులకుం బనుపుము కాలాత్య
యంబగుచుండఁ జోదనానంతరంబునఁ గృతంబైన కార్యంబునకుఁ గాలాతిక్ర

మణదోషంబు గలుగుంగాని ప్రేరేపింపకయున్నఁ గ్రియమాణంబైన కార్యంబునకుఁ గాలాతిక్రమణదోషంబు గలుగనేరదు గావున నీకిప్పుడు వానరానయనోద్యోగం బవశ్యకర్తవ్యంబు నీవనుపకారి కార్యంబునకైనను బ్రవర్తకుండవు మహోపకారియగు రామునకు రాజ్యధనంబులచేతనైనఁ బ్రతికారంబు గావించుట కేమిసందియంబు శక్తిమంతుండవయ్యును విక్రాంతుండవయ్యును వానరర్క్షగణేశ్వరుండవయ్యును దాశరథికిఁ బ్రియంబు సేయుట కుపేక్షించుట తగవు గాదు వినుము॥ (ఉ) ఆనరనాథమౌళి దివిజాసురయక్షమహోరగాదుల । న్జానుగనమ్ములం దనవశంబుగఁ జేసికొనంగఁ జాలువాఁ । డైనను నీప్రతిజ్ఞ దెలియం దలపోయుచున్నవాఁడు త । న్స్థానిని గ్రక్కున న్వెదక నంపుము దిక్కులకున్ వానరుల్॥ (క) సురగరుడోరగనరఖే । చరకిన్నరసిద్ధసాధ్యచారణులతని । న్వా అపింపఁజాలరెంతయు । హరితనయా తుచ్ఛదైత్యులన నెంతమహిన్॥ (ఉ) అట్టి మహానుభావునకు నట్టిపరాక్రమశాలికిం గరం । బట్టి మహోపకారికిని మంచితకీర్తికి రామమూర్తికి । న్గట్టిగ నీవు సత్ప్రియము నర్పుము నీ దగుపంపు సేయఁగా । నిట్టలమేటి వానరుల నేకులు నేర్పరులున్నవారలన్॥ (సీ) భాస్కరనందన భవదాజ్ఞ చేనభశ్రీ మందుభోగిజగంబునందు జలము । లందుఁ గాంతారంబులందుఁ జరింపంగ నసమర్థుఁడైనవాఁ డద్రిచరుల । లోనొకఁడైన విలోకింపఁగా లేఁడు ఘనులప్రధృష్యులు కామచరులు । కపులు కోట్యధికులు గలరు నీకందులో నెవ్వానిఁ బంచిన నేమి సేయు॥ (తే.గీ) రఖిలదిక్కులనున్న వనాటవరుల । నంఘుసత్త్వులనందఱఁ బిలువఁ బంపి । రామపత్ని నన్వేషింప రయముతోడ । నెల్లచోట్లకుఁ బనుపుము హితము మెఱయ॥ (క) అనిహనుమంతుఁడు కాలం । బునఁ గార్యవిచా

—(*)సుగ్రీవుఁడు సేనలనెల్ల రావింపుమని నీలునకాజ్ఞాపించుట.(*)—

రబుద్ధిమునుకొని బోధిం । చిన విని సుగ్రీవుఁడు తన । మనమునఁ జెలిపొంది వేగ మతిమంతుండై॥ (క) తనసేనాపతియగు నీ । లుని విక్రమశీలుని నివ్వ లోకించి రయం । బున నిట్లని యాజ్ఞాపిం । చె నిజస్వామిత్వమహిమ చెలువారంగన్॥ (ఉ) వారిధివాసులన్ వనని వాసులఁ బర్వతవాసులన్ బలో । దారుల సింహవిక్రముల దారుణవేగుల శీఘ్రగాముల । న్వీరుల శూరులం దపనతేజుల వానరవర్యుల న్రయం । ర బారఁగఁ బిల్వనంపుము మదాజ్ఞ రఘుప్రభుకార్యసిద్ధికిన్॥ (వ) మఱియు వ్యవసాయులగు సేనాపర్యంతపాలకులును వేగవంతులగు యూథపులును సైన్యస



మేతంబుగాఁ బంచదశరాత్రంబులోన నిచ్చటికి వచ్చువారుగా సంఘటింపుమంతకు నెవ్వండు మత్తుండై రాక మసలు నతండు ప్రాణాంతికంబగు మదీయదండంబునకుఁ బాత్రంబగునని చాటంబంపు మికార్యం బంగదుండును నీవును మదీయశాసనంబునఁ గావింపుఁడని యాజ్ఞాపించి సుగ్రీవుండు నిజగృహంబు ప్రవేశించెనంత నక్కడ రాముండు హేమధాతువిచిత్రంబగు పర్వతాగ్రంబున నధివసించి॥ (చ) నిరుపమకాంతిశోభితవి నిర్మలశీతకరాస్యమండల । స్ఫురుతరపక్ష్మలక్షితచకోరవిలోచన రమ్యచంద్రికా । స్ఫురదను లేపనస్వమల సుందరతారనఖన్నరన్నిశా । తరుణినిజూచి రాఘవుఁడు తద్దయుశోకపరీతచిత్తుఁడై॥ (మ) ధరణీపుత్రినెదం దలంచుకొని హృత్సంతాపమంతంతకు । న్బెరుఁగం

—(*)రాముఁడు శరదృతువునందు సీతం దలంచుకొని దుఃఖించుట.(*)—

బెక్కుతలంపులూరఁగఁగడు న్భిత్తిల్లి కామవ్యథా । తురతన్వా తరుణీమణీ యనుచు నెంతో పారవశ్యంబునొం । దిరయం బారముహూర్తకాలమునకుం దెల్వొందితాఁ గ్రమ్మఱన్॥ (తే.గీ) సీతనైత్యాధముని చేతఁ జిక్కుటయును । మత్తుఁడై భానుజుఁడు రాక మసలుటయును । గడఁగి యుద్యోగసమయంబు గడచుటయును । దలఁచి భూరిసంతాపసంతప్తుఁడగుచు॥ (వ) ఇట్లని విలపించె॥ (సీ) ఏ రామ విమలకాసారతీరవిహారి కలహంసిపద్ధతిఁ గలసియాడు । నే తన్వి చూతభూజాతపల్లవఖాదికలకంఠిపద్ధతిఁ గలయమ్రోయు । నే తలోదరి దాడిమీతరువ్యాలంబి రాజకీరప్రౌఢి రద్దుసేయు । నే రాజవదన శృంగార శాడ్వలచర తృప్రషదంగనాస్ఫూర్తి జెదరి చూచు॥ (తే.గీ) నట్టి జానకి నాయుల్ల మధికహర్ష । కలితమగునట్లు లెప్పుడు గానవచ్చు । నెట్లు పరిరంభణస్ఫూర్తి యొసఁగఁగలుగు । నీవియోగాబ్ధి తరియింప నెపుడు వచ్చు॥ (తే.గీ) సారసారవసముదితస్వనముచేత । నాగ్రముంబున విహరించునట్టిబాల । జనకనందన దుష్టరాక్షసుని చేతఁ । జిక్కి యెబ్భంగి విహరించుఁ జెప్పుము నాకు॥ (క) కుసుమితకాంచనమయలస । దసనరసాలద్రుమములనటు చూచుచు నా । బిసరుహముఖి ననుఁ గానక । నసువుల నేక్రియ ధరించునక్కట చెప్పుమా॥ (క) కలహంసరవంబుల మే । ల్కొలుపంబడునట్టిసీత క్రూరక్రవ్యా । దుల రవముల చేనెట్టు మే । ల్కొలుపంబడు నట్లు నైనఁ గూడున్నాకున్॥ (తే.గీ) సంతతంబును సహచరచక్రవాక । కలరవంబులు విని యొడుకలుపకంటి । దారుణాకారదుర్మదక్రూరదనుజ । వికృత హుంకృతులె

బ్బంగిపినఁగనేర్చు ॥ (ఉ) ఒంటిగ నాశ్రమంబునను ముత్సుకతి న్వరియించు వేశ
లక్। గొంటరిజంటకోయిలలు కూయఁగ మేను చెమర్చ నాత్మలో । నంటిన ఖేతిన
చ్చిచిగి యన్ననుఁ గాఁగిటఁ జేర్చునట్టివా । గ్రంటిమహీజ నెమ్మనము గందడె శార
దకాల సంగతిన్॥ (ఉ) అక్కట సీత దైత్యహృత యై వెతలం బడి కుందుచుండ
నా । కిక్కడి రమ్య కందరము లిక్కడి నవ్య సరోవరోత్కరం । బిక్కడి కాననప్ర
చయ మిక్కడి నూతన శీత సైకతం । బిక్కడి వల్లికాగృహము లించుక చూడ్కికి
నేడ్కఁ జేయనే॥ (ఉ) మక్కువ తోడ నన్నలసి మాటికి నిచ్చ సుఖించునట్టియా। చ
క్కని గోలయొంటి మృగశాబముకై వడిఁ జిక్కి యుండఁగా। నక్కట తచ్ఛరద్గుణని
రంతరుఁడై కుసుమాంబకుం డుదా । మిక్కుటమైన గర్వమున మిన్నక పీడ యొన
ర్పకుండెడున్ ॥ (వ) అనియిట్లు విధంబున నమ్మహీరమణుండు పురందరుని వల
న సలిలంబు నుద్దేశించి విలపించు చాతకంబు భంగి నతిదీనుండై విలపింపుచు నెం
డియు లక్షణవంతుండైన లక్ష్మణ రాజుండు పుష్పిత మహీరుహ లతావితాన
రంజిత ధరాధర సానుకందరంబులు విలోకించి ముద్దియ యందలపోసి తద్దయు మో
హాతురుండై॥ (చ) కనుఁగవ మోడ్చు విచ్చుఁ గమకంబున నాకస మట్టె చూచు
నెక్కొని నవిరాళి నూర్పులుని గుచ్చు దిశల్పరికించు హా మహీ। తనయ యటంచు ర

లక్ష్మణుఁడు రాముని నూరార్చుట

మ్యకుశ తల్పముపై వెసఁ ద్రావాలు లేచునా। జనపతి యిట్లు పంచశర శాత శిలీముఖ దూ
యమానుఁడై ॥ (క) ఇత్తెఱంగున నడలఁ గెడు రఘు। సత్తముఁ గని లక్ష్మణుండు సామో
క్తులఁ దచ్చిత్త పరితాపము డుపుచు। నుత్తమ బుద్ధి ప్రయుక్తి నొయ్యనఁ బలికెన్॥
(వ) మహాత్మా యే కాలంబునందుఁ జిత్త సమాధానంబు సంపాదనీయంబగు న
ట్టి కాలంబునం బడి యేల యుపగతంబయ్యెఁ గాముని వశంగతత్వంబున నాత్మ పౌ
రుష పరాభవంబున నివర్తితోత్సాహంబున నేమి యగుఁ గార్యోద్యోగంబును
మనః ప్రసాదంబును ధైర్యోపాయంబుల చేత ననుబద్ధంబైన కాలంబును సుగ్రీ
వాది సహాయ సామర్థ్యంబును స్వదేవతోపాసనాత్మకంబైన హేతువును గా
ర్యసిద్ధి యందుఁ గారణంబు గానోనరింపుము పతివ్రతా శిరోమణియైన జానకీప
రుని చేత సులభయై యుండదు సముజ్జ్వలితయైన వహ్నిశిఖ నంటుకొని యు
న్నింపు దహింపంబడకుండు మహానుభావుఁడవైన నీవిట్లు వైక్లబ్యంబున వలం
బింపం దగదని పలికిన యుక్తియుక్తంబును స్వభావ సిద్ధంబును శుభోదర్కం



బును సుఖకరంబును నీతిమార్గ యుక్తంబును బథ్యంబును సామవాద సహి
తంబును ధర్మార్థ సహితంబు నగు వాక్యంబునం బ్రబోధించునట్టి సలక్ష
ణుండైన లక్ష్మణు నవలోకించి రాముండు కుమారా నీ చెప్పినట్ల సంప్రవృ
త్తంబును దురాసదంబు నగు సీతా ప్రాప్తి రూప కార్యఫలం బవశ్య చింతనీ
యంబై యుండు నుత్సాహాదికంబు ననువర్తితవ్యంబై యుండు సీతా న్వేష
ణాది కార్యంబు నిస్సంశయంబుగాఁ గర్తవ్యంబై యుండునని వెండియు నా
రఘు వల్లభుండు జానకిం దలంచుకొని వదనంబున విన్నఁదనంబు గదుర ల

రాముఁడు లక్ష్మణునితో శరదృతువు నభివర్ణించి చెప్పుట.

క్ష్మణు నవలోకించి యిట్లనియె ॥ (క) శరములచే విశ్వంభర। బరితు
ష్టిం జెందఁ జేసి, బహుసస్యములం । గరము ఫలియింపఁ జేసియ । మరపతి కృ
తకృత్యుఁ డయ్యె, మానసకంటే ॥ (మ) ఘననీలోత్పల కృష్ణ మేఘము మృదం
గస్నిగ్ధ గంభీరని। స్వనమై దిక్కులఁ జీకటుల్గవియ జం, చచ్చంచలా స్ఫూర్తి
నిం। డిన తోయంబులు పాఱఁ జల్లి లఘువృత్తి న్వేగముం దక్కి యెం । దును
జూపట్టెడుఁ గంటె వత్సవిమదోత్తుంగ ద్విపేంద్రాకృతిన్ ॥ (చ) శరముల
యందుఁ బుట్టివిలసత్కుటజార్జున సౌరభంబులై । తిరుపులు బల్తు పాకములు
తమ్మికొలంకులు తల్లడిల్లఁగాఁ । బరువడి భూరివేగమున, బంధురవైఖరి వీచివీచి
ఛా। స్వరతర వృష్టి వాతములు, శాంత విహారములయ్యెఁ గంటివే ॥ (క) ఘన
నాదము ప్రస్రవణ । ధ్వని బర్హిగళ స్వనంబు, వారణ నినదం। బు నదీప్ర
వాహ శబ్దము । వినుత గుణా చెవులకిపుడు, వినరా వయ్యెన్ ॥ (క) ధరణీ
వర నందనశశి । కిరణ వ్యాప్తంబులగుచు, గిరిశిఖరంబు । ల్వరచందనలిప్త
ములగు । తరుణుల పాలిండ్ల పగిదిఁ, దనరెడుఁ గంటే ॥ (క) కనుఁగొంటె
శరన్నదుల । ల్లనఁ దమ తమ సైకతంబు, లం జూపెడు నా । తనసంగమల
జ్జితలగు । తనుమధ్యలు చూపు జఘన, తలముల మాడ్కిన్ ॥ (చ) హరిరుచు
లందుఁ జంద్రకళ,లందు మదావళ లీలలందు భా। స్వరతర సప్తపర్ణతరు, శా
ఖలయందుడు కాంతులందు సు। స్థిరముగ భూరికాంతి విభజించి శరన్నవల
క్ష్మి నేడు భా। సురనవయౌవన ప్రమద, చొప్పున నొప్పుచునున్న దెంతయున్॥
(వ) మఱియు శరత్కాల గుణోపనీతయగు లక్ష్మి యిప్పు డనేకాశ్రయ చిత్ర
శోభయై ప్రథమ ప్రసృత సూర్య కిరణంబుల చేత వికసితంబులైన పద్మాకరంబుల

యందు మిక్కిలి ప్రకాశించుచున్న యది విలోకింపుము ॥ (చ) నిరుపమసప్త
పర్ణ ధరణీరుహ పుష్పసుగంధియై మనో । హరమకరందపానసమదాకుల
షట్పద గీయమానమై । కరము వనాంతరంబులఁ దగం జరియించెడు గాడ్పుబ
ల్విడిం । దఱుచుగ మత్తగంతురకు, దర్పమెసంగుచునున్న దెంతయున్ ॥ (చ)
జలజరజః ప్రకీర్ణములు చారువిశాలపత్త్రములుస్సరి । తలపులినోపయాతము
లు, దగ్రతరస్వనములస్సరఃప్రియం । బులునగుచక్రవాకముల, పొత్తునహత్తిమరా
ళదంపతు ల్గలయఁ జరింపుచున్న యవి,కంటె మనోభవకేళిలోలతన్ ॥ (ఉ)భూరి
మదప్రగల్భకరిపుంజములందును గోగణంబులం । దారయ నిమ్నగాంబుకూలి,
తాపగలందు లసన్మరాళికా । సారములందు హృద్యముగ , సాంద్రగతిం బ్ర
విభక్తమై రహి । న్శారద లక్ష్మికంటె బలుచందములం దనరారెనెంతయున్ ॥
(చ) ముదిరవిముక్తమైన నభముస్న రికించి మయూరసంఘము । ల్మదముదొ
లంగఁ బెట్టుకొని, ముక్తకలాపవిభూషణంబులై । పొదలననూన దుఃఖములఁ
బొందుచు సొంపఱి జోడువీడిదై । న్యదిశ చెలంగఁ గట్టెదుట, ధ్యానము సే
యుచునున్న వెంతయున్ ॥ (ఉ)కేవలహృద్యగంధపరి, కీర్ణము లంచిత నవ్యపు
ష్పభా । రావనతాగ్రశాఖముల, నల్పములం దపనీయగౌరరే । ఖావిభవం
బులైన ప్రియకంబులచే నయనాభిరామశో । భావహభంగి నొప్పెడు నృపా
త్మజ కంటె వనాంతరంబులన్ ॥ (చ)విమలసరఃప్రియంబు లట, వీరతముల్ కు
సుమోద్ధతంబులు । త్తమమదగంధ లుబ్ధవిత, తభ్రమరీరమమాణరమ్యగంధ
ములు ప్రియాన్వితంబులు ఘనాఘనతుల్యములైన దంతిసం । ఘములవె మంద
మందగమనంబుల నేగెడుఁ గంటెలక్ష్మణా ॥(వ)మఱియు నిశాకాలంబు వీతమే
ఘం బగుటవలన ధౌతవస్త్రవర్ణంబైన నభంబును గృశప్రవాహంబులైన న
దీజలంబులును గల్హారశీతంబులైన మారుతంబులును దమో విముక్తంబులైన
దిశాముఖంబులునుం గలిగి యొప్పుచున్న దదియునుంగాక ॥ (ఉ)కోమలవాతపో
తపరి, కుంచితధూళియు భాస్కరాతప । క్రామణ నష్టకర్దమయు, రమ్యజ
లోత్కరనిమ్నగాఢ్యయై । భూమి చెలంగుచున్న యది,భూవరనందన యిప్పు
డెంతయున్ । భూమివరుల్ రణంబులకుఁ,బోవుటకుం దఱియయ్యె నుర్వరన్ ॥
(ఉ)ఆయుతపాంసు దిగ్ధసము, దంచిత కాయములున్ శరద్గుణా । ప్యాయిత



రూపకాంతులు ప్రహర్షితముల్ సముదగ్రశృంగరే । ఖాయుతముల్హిమాద్రిని
భగౌరములైన లసన్మహోక్షము । ల్పాయక ధేనుమధ్యమున, అంకెలు వై
చెడుఁ గంటెంముంగలన్ ॥ (మ) అనఘా చూచితివే కరేణువులు సయ్యాటం
బునం జిత్తమం । దనురాగంబులు నిండి పర్వ సలిల, వ్యాయామమోదంబున ।
న్జను భర్తన్ వడిఁ జుట్టుముట్టుకొని చం, చన్మందయానంబుల । న్వనమధ్యం
బునఁ బోవుచున్నయవి దుర్వార ప్రకారంబునన్ ॥(చ)సుమహితరూప యల్ల
దియె, చూచితె మ్రోల మయూరజాలము । త్యమల నదీతటోపగత, మైతన
కాభరణంబులైనబ । ర్హమును బరిత్యజించి ప్రమదాకుల సారసతర్జ్యమా
నమై । భ్రమఁగొని దీనభావమడ, రన్నిజగర్వముదక్కి పాఱెడిన్ ॥ (ఉ)చం
డతరప్రణాదముల, సారసభృంగమయూర హంసకా । రండవ టిట్టిభంబులు
కరంబు భయంబునఁ బాఱమత్తవే । దండచయంబు బద్ధకమ, లాభరణం బగు
టెంకిఁజొచ్చిత । తాకండములం దెరల్చుచుము, దంబునఁద్రావెడుఁ గంటెలక్ష్మ
ణా॥(తే,గీ) తమ్మితూండ్లు భుజించి కెందమ్మివిరుల । జోడుగూడి మనోజసం, క్రీ
డసలిపి । రాజహంసలు తద్రతి, శ్రమము వాయ । ఘనధునీవారిఁ బడియెడుఁ,
గంటెవత్స॥(చ) అడవినవోదితంబులగు, నంబుధరంబులనుండి ధాత్రిపైఁ । బడి
జడివానకుం దలఁకి, పాములు పుట్టల డాఁగి యుండియి । ప్పుడు కడు దీవ్రవే
గమున, బొక్కలు వెల్వడి వాతదుర్విషం । బడరఁగ నూర్పుచు గాడ్పు లోల
యం జరియించెడుఁ గంటెలక్ష్మణా॥(తే,గీ)చంచదిందు కరస్పర్శ,సముదితప్ర
హర్షవికసిత తారక, యగుచు నిపుడు । రాగవతియైన సంధ్యకరంబు తా
నె । యంబరంబును విడిచెడు, ననఘ కంటె॥(ఉ)లాలితచంద్రమండల వి,రాజి
తవక్త్రియుదారకాగుణో । న్మీలిత చారునేత్రయువి, నిర్మలమంజులనవ్యచం
ద్రికా । చేలయునై శరద్రజ,ని చెల్వు వహించెఁ గుమార చూచితే । లీలను
ధౌతచేలము ధరించిన యౌవనకాంత కైవడిన్ ॥ ( క ) అసదృశ విపక్వ
శాలి । ప్రసవంబులు మెసవి హంస, పఙ్క్తి విలాసం । బెసఁగ నెసమిం
టఁ జనియెడు । శ్వాసన సముద్ధూత పాండు జలరాశి క్రియన్ ॥ (క) కుము
దోపేతము సుప్తైకమరాళము నగు హ్రదస్థకాండము కంటే । విమలోడుయుతము
శశియు । క్తముననగు రజనీనభంబు కరణినలరెడిన్ ॥ (ఉ) పూచిన పద్మకోకనద పు
ష్పమరందము గ్రోలి తుమ్మెద । ల్వ్రేచులమీఁద రేఁగి సరవిన్ రొదసేయ మరాళ

దంపతుల్। వేచిమృణాళముల్ మెసవి వేమఱుజూరు రతిప్రసంగసం। సూచన
చేయుచున్నయవి చూచితెరమ్యసరోవరంబులన్ ॥ (మ) కినుఁగొంటేన్నృపపు
త్రిఘాతవిమల క్షౌమాంబరోల్లాసికా। శనికాయంబులు మంద మంజుల మరు
త్సంచాల్యమానంబులై। కనదుద్యత్కుసుమప్రభాసములునై కందోయికిన్వేడు
కల్। జనియింపందటినీతటంబులనుశు భ్రిచ్ఛాయఁజూపట్టెడిన్ ॥ (తే,గీ)కుసు
మమకరందరసమునుగ్రోలివేడ్క। నంబురుహరేణుగౌరఁబులైమదించి।యాఁ
డుతేఁటులఁగూడివాతానుయాత్ర। సలుపుచున్నవికంటివేషట్పదములు॥ (క)ప్ర
విమలుఁడగుచంద్రుఁడువ్మృదు। పవనుఁడుక్రౌంచస్వనమువిపక్వకమలశా। లిప
నమురమ్యజలమ్ముకై।. రవరమదెల్పెడిలసచ్ఛరత్కాలగతిన్ ॥ (వ) మఱియుఁ
బ్రకీర్ణహంసాకుల మేఖలలును బ్రబుద్ధపద్మోత్పలపఙ్క్తులునగు వాప్యుత్తమం
బుల రమణీయకాంతి విభూషితలగు వరాంగనల కాంతిపగిది మిక్కిలి ప్రకా
శింపుచున్నయది ప్రత్యూషకాలంబునందు గోపాలకులుసేయు వేణువాద్యస్వ
నంబులును గోపికలుసేయు దధిమథనభాండశబ్దంబులును గోవృషంబులుసేయు
మహానాదంబులును బవనసంప్రవృత్తంబులై యిక్కాలంబున వినంబడుచుండు
మీనోపసందర్శితమేఖలలగు నదీయువతుల గమనంబులు ప్రభాతకాలంబునం
దుఁ గాంతోపభుక్తాలసగామినులగు కామినుల గమనంబులుంబోలె మందం
బులైయున్నయవి సచక్రవాకంబులును సశైవలంబులును గాశదుకూల సంవృ
తంబులుననగు నదీముఖంబులు సపత్రలేఖంబులును సగోచనంబులునగువధూ
ముఖంబులుంబోలె నొప్పుచున్నవదియునుంగాక ప్రఫుల్లబాణాసన చిత్రితంబు
లును సంప్రహృష్టమధువ్రత నికూజితంబులునగు వనంబులందుఁ బంచశరుం
డు గృహీతచాపోద్యత చండదండుండై వియోగుల నేఁచుటకు విహరింపున్న
వాఁడు సువృష్టిచేతలోకంబునుబరితుష్టినొందించి నదీతటాకంబులుపూరించి వ
సుంధర నిష్పన్నసస్యఁగావించిమేఘంబులు నభంబునుబరిత్యజించి తమకిమ్మగు
నెలవుల డాఁగియున్నవి మహాసనకోవిదార సప్తపర్ణబంధు జీవశ్యామలతా
విశేషంబులు రమ్యంబులగు గిరిసానువులందు సొంపువహింపుచున్నయవి నదీ
పులినంబులు హంససారస చక్రవాకకురర సమూహంబులచేత సమాకీర్ణం
బులై శోభిల్లుచున్నయవి మఱియుఁ బ్రసన్న సలిలంబులగు జలాశయంబులు
క్రౌంచవినాదితంబులై చక్రవాకోపశోభితంబులై మిక్కిలిప్రకాశింపుచున్నయ



వి విలోకింపుము॥ (తే,గీ) పార్థివాత్తజయన్యోన్యబద్ధవైరు। లునుజిగీషులు
నగునృపాలురకునిదివ। లంపనుద్యోగసమయంబురవికుమారుఁ। గానమట్టాలు
ద్యోగంబుగానమిపుడు॥ (చ) ఘనగుణశీలప్రాణముల కంటెఁగరీయసియైనధా
రుణి। తనయనుబాసిశోకమునఁ దద్దయుప్రూన్పడి యున్ననాకుని। వ్వనమున

## రాముఁడు లక్ష్మణునితో సుగ్రీవుని దుర్నయమును జెప్పుట.

దుఃఖ హేతువగు వార్షిక మాస చతుష్టయంబు నె। మ్మనమునఁ దోఁ
చె నేటికిటు మానక వర్ష శతోప మానమై॥ (ఆ, వె) అనఘ చరిత్ర
భర్త నైననా వెనువెంటఁ। జక్రవాకిఁబోలె జనకపుత్రి। ఘోరవనమునకు
గృహారామ వాటికిఁ। బోలెవచ్చెఁగాదె పొలుపుమీఱ॥ (తే,గీ) ఏనుజానకి
నెడఁబాసియీనగేంద్ర। కూటతటమునశోకార్తిఁగుందుచుండ। మిహిరనంద
నుఁడిపుడు నామీఁదఁ గరుణ। సేయకున్నాఁడు దుర్నీతిచేతఁబట్టి॥ (సీ) భ్రా
తచేఁశసామ్రాజ్యంబుగోల్పడి దిక్కుఱిదైన్యంబు నెక్కొనంగఁ। బురమువె
ల్వడిభీతిఁబఱచియొంటిగనలు దిక్కులువెసదిమ్మఁదిరిగితుదిని। ననుశరణంబువేఁ
డినవచ్చికపిరాజ్య మిచ్చినఁగైకొనియింపుమెఱయ। జలధరకాలంబు చనినపి
మ్మటసీత వెదకనీకడకువచ్చెదనటంచు॥ (తే,గీ) సత్యముగఁబల్కి పోయిభా
స్కరసుతుండు। మత్తుఁడైగ్రామ్యసుఖములమఱగికృతము। మఱచి కడుబుద్ధి
హీనుఁడైతిరిగిరాక। సమయభంగంబుగావించెవిమలచరిత్ర॥ (క) నీవిప్పుడుకి
ష్కింధకుఁ। బ్రావీణ్యముమీఱనేగి బాలిశుఁడగుసు। గ్రీవునితో నామాటలు।
గావెఱపుజనించునట్లుగానిట్లనుమీ॥ (క) ధరనెవ్వాఁడుపపన్నులు। నరయఁగ

## —*) రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పవలసినమాటల లక్ష్మణునకుఁజెప్పుట (*—

నుపకారులైనయర్థులకామం। బొఱఁగియొనరింపఁడాతఁడు। పురుషాధముఁ
డంద్రుప్లవగపుంగవపెద్దల్॥ (తే,గీ) పరఁగనెవ్వఁడుశుభమైననఁబాపమైనఁ। దా
నుబలికినవాక్యంబుదప్పకెపుడు। విమలమతిదానిఁగడుసార్థకముగఁజేయు। న
తఁడుమఱిపురుషోత్తముఁడంద్రుబుధులు॥ (వ) మఱియునెవ్వండుకృతార్థుం
డై కృతార్థుండుగాని మిత్రునకుంగాక చరించునట్టి కృతఘ్నుండు మృతుం
డైనఁ దదీయకళేబరమాంసంబు శునక కాక జంబుకాదులైన భక్షింప వది
యునుంగాక నాచేతవికృష్టంబైన కాంచనపృష్ఠకార్ముకస్వరూపంబు చూ
డను వజ్రనిర్ఘోషంబుంబోలె భీషణంబైనతదీయజ్యాతల నిర్ఘోషంబుఁ

భక్తిఁ । బ్రణతుఁడై తదాజ్ఞఁ బాటించి వానర । నేతపాలి కరుగ నిశ్చయించి॥
(సీ) కాలదండాభీల, కార్ముకదండంబు తపనీయరుచుల హస్తమునఁ గ్రాల।
క్రూరసర్పాభీల, ఘోరనారాచము లక్కడు దీర్ఘమగు నిషంగమున దనర।
పవిసన్నిభస్పర్శ పాదఘట్టనమునఁ గొండలతా లెల్లఁ బిండిగాఁగ। నూరువేగ స
ముత్థితోరు వాతస్ఫూర్తి వివిధవృక్షంబులు విఱిగి కూల॥ (తే,గీ) భూమి వలుముడి
వడఁగ నుల్లరక్తిమ చెలంగ। నధరము చలింప క్రోధమంతంత కెదుగ। నిడుదజంగ
ల వేయు మంబుధి మునవడఁకఁ। గడు రయంబున సౌమిత్రి తడయ కరిగె॥ (వ) మఱి
యును మహాప్రాజ్ఞుండును భ్రాతృప్రియహితరతుండును శుభబుద్ధియు నగు లక్ష్మ
ణుండు ప్రతివృత్తిహాననాధ్యవసాయుండై బృహస్పతి సమబుద్ధి యగుటం జేసి
సుగ్రీవు నుద్దేశించి తనచేతఁ బలుకం దగిన రామోపదిష్ట వచనంబును దనమాట
కు సుగ్రీవునిచేతఁ బలుకంబడియెడు నుత్తరంబును దానికిఁ దనచేత వక్ష్యమా
ణంబైన యుత్తరంబును విచారించి జంతుపూరణకళాలోలుండైన కాలుని పోలి
క విచిత్రధాతు రాగ సముద్దీపిత సానుసుందరంబైన మందరంబు చందంబున
నాతత్రేరితంబైన వహ్ని రీతి నంబరమధ్యగతుండగు పుండరీక వనబంధుని మా
డ్కిఁ జూడ్కికి వ్రేఁగగుచు నిజదేహప్రభాజాలంబున నక్కానన వెలింగింపుచు
నమోఘరయంబున నంజని చని ముందఱ ననతిదూరంబున॥ (క) నరవరసూనుఁ
డుదుగ్రమ। గిరిసంకటమందు ఘోరకీశచమూసం। భరితంబగు కిష్కింధా।
పురమును విభవజితనాక పురముం గాంచెన్॥ (క) కనిదాని మహిమ కెంతయు।

## లక్ష్మణుఁడు కిష్కింధఁ జేరుట

మనమున నచ్చెరువుగ దుర మఱిమఱి డాయం। జని పురి బాహ్యవనంబులఁ। గ
నుఁగొని యెన్ గుహరక్షీమ కాయులఁ గపులన్॥ (ఉ) వారును దన్నుఁ గాంచి బల
వైభవ మొప్పవిశాల సాలధా। త్రీరుహ శైలశృంగములు లీల ధరించి కరీంద్రస
న్నిభో। దారశరీరులై యెదుటఁ దప్పక నిల్చినఁ జూచి భీషణా। కారుఁడు లక్ష్మణుం
డు శిఖ్యైవడిఁ గోపము హెచ్చఁ బొల్చినన్॥ (ఉ) ఆరవివంశవర్యు భయదాకృతిఁ
జూచి కపుల్పురారి యో। దారుణమృత్యువో విలయదండధరుండో యటంచు
నాత్మలోఁ। గూరిన భీతిచేఁ బురము గొబ్బునఁ జొచ్చి కపీంద్రు మందిర। ద్వార
ముఁ జేరి లక్ష్మణుని దారుణకోపముఁ దెల్పిరయ్యెడన్॥ (క) ఆసూర్యజుఁడే కాం
తా। వాసంబునఁ దారఁ గూడి వారకరతికే। లీసక్తుఁ డౌట కతమున। మోసం



బునఁ గీశవరుల మొఱవినఁ డయ్యెన్॥ (వ) అంతన వ్వానరులు సచివసందిష్టు
లై శీఘ్రంబున నగరంబు వెలువడి గిరికుంజర మేఘాభులును నఖదంష్ట్రాయుధు
లును ఘోరాకారులును వికృతదర్శనులును శార్దూల దర్పులును వికృతవ
దనులును దశశతసహస్రాయుతనాగబలులును వాయువేగులును సింహపరాక్ర
ములును భానుప్రతాపులును గామచారులు నగు హరిపుంగవులు నభోంతరం
బు నిండ సింహనాదంబులు సేయుచు నగరద్వారంబుల నాక్రమించి యుదంచిత
విక్రమాటోపంబునం బొలిచియుండి రందుఁ గొందఱు బహిర్ద్వారంబున యు
వరాజగు యంగదుని నక్షత్రంబులు చంద్రునిం బోలెఁ బరివేష్టించి యుండి రిత్తె
ఱంగున నంగూడుకొనిన యవ్వానరసైన్యంబు చేత నమ్మహాగుహ మేఘసమూహం
బుచేత గగనంబుం బోలెఁ బరిపూర్ణంబై యొప్పె నిట్లు గూడుకొనిన మహాద్రు
మహస్తంబైన కపిసైన్యంబును దురాసదయైన కిష్కింధను బరిఘప్రాకారాం
తరంబువలన నిర్గమించి సాలతాలపాణులై యుదగ్రవిక్రమంబున గుంపులుగ
ట్టి పఱతెంచు వీరవానరులనుం జూచి సుగ్రీవుని ప్రమాదంబును రాముని విరహ
శోకంబును దలంచుకొని దీర్ఘోష్ణమహోచ్ఛ్వాసవశనుండగుచు నేత్రంబు
లం దామ్రదీధితులు నిగుడ సధూమంబగు పావకుని చందంబున వెలుంగుచు మ
హావీరుండగు లక్ష్మణుండు శంకింపక నందఱం ద్రోచికొని సుగ్రీవపాలితయైన
కిష్కింధఁ బ్రవేశించి రాజమార్గంబునం బోవుచు ముందట॥ (క) శ్యామాభ్ర
సన్నిభంబును। జామీకరవేదికంబు సముదితమణిమా। లామండితంబు దివ్యర।
మామహితము నైన యొక విమానము గాంచెన్॥ (క) కనియందు గీతవాది। త్ర
నినాదము వానరీచరణనూపురని। స్వనము పరస్పరహసిత। ధ్వనులును మణిహా
రకలరవంబులు వినియెన్॥ (వ) ఇత్తెఱంగున నాకర్ణింపుచు॥ (క) తేజోవిష
సంభూతుఁడు। రాజిత శరశల్యవిస్ఫురజ్జిహ్వుఁడునై। రాజసుతుఁ డొప్పెఁ
గాముకక। రాజత్ఫణుఁ డగుచుఁ బంచ లపనాహిక్రియన్॥ (వ) అప్పుడు॥

## —*లక్ష్మణుఁ డంగదునితోఁ దనరాకను సుగ్రీవునికిం జెప్పుమని చెప్పుట*—

(క) ఘనదీప్త వహ్ని చందం। బునఁ దేజం బెసఁగ వచ్చు భూమీశ సుతుం।
గని యంగదుండు భయమున। ననుపమ వినయంబు దోఁప నటుపోడ సూ
పెన్॥ (క) వచ్చిన తారేయునిఁ గని। చెచ్చెర లక్ష్మణుఁడు చాలఁ జిడిముడి
పడుచున్। మెచ్చక ప్రళయాభ్రము క్రియ। నుచ్చైర్నాదమునఁ బలికె నను

గ్రుం డగుచుఁ ॥ (చ) అనుపమ తేజుఁ డారఘుకు, లాగ్రణి రామవిభుండు పంపఁగ । ద్దనఁబనిఁ బూని తద్వ్యసన, తప్తుఁడనయ్యుఁ దదుక్తి కౌశలం । బినసుతుతోడఁ జెప్పుటకు,నిచ్చటికిం జనుదెంచినాఁడ న । య్యనఘుని పాలికిం జని మ,దాగమనం బెఱిఁగింపు నావుడుఁ ॥ (శా) తారేయుండు విషణ్ణుఁడై మొగమున న్దైన్యంబు వాటిల్లఁగా । ధీరత్వంబుదొలంగఁ బెట్టిభయము,ద్రేకింపఁగానాతుఁడై । యారామానుజు శాసనంబున రయం, బారంగనంతఃపుర । ద్వారంబుద్ధతిఁ బాసియంతిపురి చెం,తంబోయె దుర్వారుఁడై ॥ (వ) ఇత్తెఱంగునంజని సుగ్రీవునిడాసి యతని చరణంబులకుంబ్రణమిల్లి పదంపడి తారకభివందనంబుగావించి రుమాపదంబులకు మ్రొక్కి యంజలి ఘటియించి యిట్లనియె ॥ (ఉ) సచ్చరితుండు రామ నృప,చంద్రుఁ డుపంపఁగ లక్ష్మణుండు తా । వచ్చిమహోగ్రకోప మొద,వం దలవాకిటనిల్చియున్నవాఁ । డచ్చతురుండు లోకముల,నన్నిటిఁ గాల్పఁగఁ జాలువాఁడు నీ । విచ్చటఁగామినీసుఖ స,మృద్ధివహింపుచు నుండఁజెల్లునే ॥ (వ) అని ప్రబోధించిన నతండు మదమత్తుండును మదనమోహితుండును నిద్రాగ్లానిసంపీడితుండును గావున మైమఱచి మేల్కొనకున్న నత్తెఱంగాలోకించి సౌమిత్రిచిత్తం బధికరోషాయత్తంబు గాకుండు నట్లుగా వినయవాక్యంబులం బ్రార్థింపుచుఁ దత్సమీపంబునం గూడుకొని వానరులు ప్రళయకాల ధారాధరంబుల నుండి యెడతెగక కడువడిఁబుడమింబడు పెడిదంపుఁబిడుగుల మ్రోఁతకు దీటగునట్లుగా బెట్టఱచుచునట్టహాసంబుఁ జేసిన నమ్మహాశబ్దంబువిని సుగ్రీవుండు మేల్కొని మదవిహ్వలతామ్రాక్షుండును వ్యాకులస్రగ్విభూషణుండునై లేచి పర్యంకంబునం గూర్చుండె నప్పుడంతఃపుర ప్రవేశ యోగ్యులును రాజ సమ్మతులును మంత్ర కుశలురును ధర్మార్థనిపుణులునగుప్లక్ష.ప్రభావులను మంత్రులిరువు రంగదవాక్యచోదితు

—(*) అంగదుఁడు సుగ్రీవునికి లక్ష్మణుని రాక యెఱింగించుట. (*)—

లై యతండునుం దామును సుగ్రీవుని డాయంజని సౌమిత్రి రాకయుఁ దదీయరోషవిశేషంబు నెఱింగించిరి పదంపడి సామనిశ్చితంబులగు వాక్యంబులచేత దచ్చిత్తంబు ప్రసాదాయత్తంబుగా నొనరించుకొని శక్రుండునుంబోలె సుఖాసీనుండైన యతనింబరివేష్టించి యిట్లనిరి ॥ (చ) అతులిత బాహుశౌర్యులును మహాత్ములు మిత్రులు రాజ్యదాయకు । ల్చతురులు సత్యసంధులు ప్ర,సన్నయశోధ



నులన్నదమ్ములు । ద్భుతగుణ ధార్మికుల్నిఖిల, భూభరణాపహార్యులు రామలక్ష్మణు । ల్క్షితిధరకందరంబున వ,సించుట యెంత యెఱుంగుదే కదా ॥ (ఉ) అందొకరుండు లక్ష్మణుఁడ,నాఁడగు నాతఁడు రామునానతిం । బొందుగఁ జాపబాణములు,పూనికయంబునవచ్చి కీశులం । గ్రందుగ వేఁడిచూపులనె,కాల్పఁగఁ జాలిహజార మందు మ । ధ్యందినభానుకైవడిఁబ్ర,తాపమెలర్పఁగ నున్నవాఁడొగిఁ ॥ (చ) అతనిమహోగ్రకోపము స,ముంచిత తేజము గాంచివానరు । ల్వితతభయంబు నన్నిగుల,విహ్వలురై బహుళార్తిఁ మ్రోయుచు । న్గతి సడిపాఱఁజొచ్చిరిదె, కంజవనాప్తకుమార యాలకిం । చితె జితకాలవారిధర,సింధురవంబగు తన్మహాధ్వనిఁ ॥ (క) ఆతనిచేఁ బ్రేషితుఁడై । నీతనయుండంగదుండు,నీకడ కెంతో । భీతిఁ జనుదెంచి యున్నాఁ । డోతపనజ తత్ప్రవృత్తి,నొగిఁ దెల్పుటకుఁ ॥ (ఉ) రాజవరేణ్యుఁడైన రఘు, రాముని తమ్ముఁడు సింహద్వారమం । దోజవలర్పఁగాచికొని యుండఁగ నర్హుఁడె వేగలేచి నీ । వాజగదేకవీరుని ర,యంబునఁ దోడ్కొని వచ్చి ప్రీతితోఁ । బూజలొనర్చి చిత్తమునం,బుట్టినకోపముదీర్పుమిత్తఱిఁ ॥ (క) అనుపమ శేముషీదత్పద । వనజములకుఁ బుత్రబంధు, వర్గయుతముగా । వినతి యొనరించి రోషము । చనునట్లారాధనంబు,సలుపుముభక్తిఁ ॥ (శా) నీకై కాదె యసాధ్య విక్రమయుతు, స్మేరూపమానాంగు నా । పాకారాతికుమారు నొక్క విలస,ద్బాణంబునం గూల్చె నీ । తాకాంతుండు తదీయకార్యము సమ,ర్థత్వంబునం దీర్చునం । గాకిట్లుండినఁ బ్రాభవంబు యశము, న్ప్రాణంబులుం దక్కునే ॥ (క) మతిగలిగి యింకనైనను । క్షితిపతితో నన్నమాటఁ,జెల్లించినెస । న్గృతకృత్యుండవు సత్యా

—(*) సుగ్రీవుఁడు భయముచే మంత్రులతో నాలోచించుట. (*)—

ప్రతిశ్రవుఁడ వగుము చండ,భానుతనూజా ॥ (వ) అని పలికిన నంగదుని వచనంబువిని లక్ష్మణుండు కుపితుండై వచ్చియున్నవాఁడనుమాట కదరిపడి దిగ్గన నిజాసనంబు డిగ్గనుఱికి మంత్రజ్ఞుండును మంత్రప్రయోగ కుశలుండు నగు సుగ్రీవుండు గౌరవలాఘవంబులు నిశ్చయించి మంత్రంబులందుఁ బరినిష్ఠితులైన మంత్రులనవలోకించి యిట్లనియె ॥ (తే,గీ) రఘుకులాగ్రణి కేనప,రాధమింతు । కైనఁగావింప బదుసుబ్బు,లాడియెఱుఁగ । నూరకేలొకొనామీఁది,గారవంబు । వీడిసౌమిత్రి కలుషించి,నాఁడునేఁడు ॥ (తే,గీ) వృజినచిత్తుఁడై రంధ్రాంబు,వె

దకునట్టి। శాత్రవుని చేత లేసి దోషంబు లెవ్వి। యైన నామీఁద వినియెనో, గాని
చోన్న। పాత్మజుండేల కోపించె నకట నేఁడు॥ (క) తలఁపోయఁగ మును నాపై। గల సౌ
హృద మెల్లమాని కలుషించుటకుం। గల హేతు వేమొ తెలియదు। విలసద్గుణు
లార మీరు వివరింపుఁడీ కర్జ॥ (ఆ,వె) నన్నుఁ బ్రీతిఁ జాల మన్నించి సామ్రాజ్య।
మిచ్చినట్టి చంద మెల్ల నాత్మఁ। దలఁచుకొనిన నాకు దశరథపుత్రుల। వలని సాధ్వ
సంబు గలుగ దిపుడు॥ (వ) ఐనను కాలంబునందుఁ గుపితుండైన మిత్రుండు సంభ్ర
మంబుఁ బుట్టింపుచున్న వాఁడు సర్వప్రకారంబుల మిత్రుండు సుకరుండైనను బరిపా
లనంబు దుష్కరంబై యుండుఁ జిత్తంబులకనిత్యత్వంబు గల్గుటవలన స్వల్పాప
రాధంబు నందైనను బ్రీతి భేదింపంబడు మహాత్ముండగు రాముని చేత మహోప
కారంబు గావింపంబడియె దానికి సదృశంబైన ప్రత్యుపకారంబేను గావింపన
మర్థుండను గానందువలన మిక్కిలి విత్రస్తుండనైతి నని పలికిన సుగ్రీవుని వచ
నంబులు విని వానరపుంగవుండైన హనుమంతుండు వానరమంత్రులందఱు విను
చుండ నిజతర్కంబున నిట్లనియె॥ (సీ) రవికుమార నరేశ్వర కృతోపకారంబు

—(*)హనుమంతుఁడు సుగ్రీవునికి లక్ష్మణాగమన కారణముఁ జెల్పుట.(*)—

మానసంబున నీవు మఱవకునికి। సర్వవిధంబులఁ జర్చింపఁ గడు విచిత్రము గాఁ
దు ధీరుఁడా రామవిభుఁడు। కాంతా వియోగ శోక పరీతచిత్తుఁడై సీ యట్ల తాళిమి
నిలుప లేక। సమయ కాలము కడచనినంత కీవు రాకున్న మత్తుఁడవని నిన్నెఱిం
గి॥ (తే,గీ) ప్రణయకోపంబుచే మీ తెఱంగెఱింగి। రమ్మనుచుఁ బంపఁ గ్రుద్ధుడై ల
క్ష్మణుండు। నాఁడిదీపింపఁ జనుదెంచి నాఁడు నేఁడు। తెలియ నీ యర్థ మందు
సందియము లేదు॥ (క) శూరుఁడ గురఘుకుమారుఁడు। సారబలోదారుఁడై
నశక్రతనూజు। న్మారయ భవత్ప్రియార్థము। ఘోరరణోర్వీతలమునఁ గూ
ల్చెంగాదే॥ (క) వానలు వెలిసిన పిమ్మట। భూనాథుని సతిని వెదకఁ బుచ్చెదన
నుచుం। బూనిమును పలికితిప్పుడు। వానలు వెలిసెను శరత్తు వ్రాలఁగ జొచ్చెన్॥
(చ) సరసులు దేటఁదుమ్మెదలు సారసపఙ్క్తులఁ జేరదిక్కులం। దఱచుగఁ దె
ల్పులూరె మఘామునితేజము మీఱె మబ్బులం। బరమున నుండి జాఱెఁ గలభం
బుల మాహామదీ తెజకవ। ల్పురతముఁ గోరె సూర్యసుత చూచితె శారదకా
లసంగతిన్। (క) తతియొఱుఁగక గతిసుఖత। త్వరతన్నీ పునికిఁ బ్రణయపరకో
పమున। ద్ధరణీశుఁ డనుప లక్ష్మణుఁ। దురువిక్రమశాలి వచ్చె నుగ్రుండగు



చున్॥ (క) గత రాజ్యుఁడు దీనుండుప। కృత శీలుఁడు మానధనుఁడు,
హృతదారుఁడు నా। క్షితినాథునకు రయంబున। హిత మొనరించుట నీకు,
హితమగుఁ గాదే॥ (క) ఉపకారియైన లక్ష్మణు। కృప వెలయుట కంజలి నొసం
గు కీశాధీశా। యపరాధివి కృపణుండవు। చపలాత్ముఁడవైన నీకు, శరణము గ।
లదే॥ (క) పతికిఁ బ్రధానులు కాలో। చిత గతి భీతిలక కీడు చెందక యుండ।
న్హితమాడవలయు నేనా। గతి నీకు భయంబు దక్కఁ గఱపెద బుద్ధిన్॥ (క) సక
లామర రక్షోగు। హ్యాకభరితంబైన జగము నాత్మ వశముఁ జే। సికొనంగ జాలు
రాముఁడు। ప్రకటితముగ విల్లు చేతఁ బట్టిన యంతన్॥ (తే,గీ) అట్టి జగదేకవీ
రున కలుక వొడమ। కుండ నట్లుగ నీవు పూర్వోపకార। మెఱిఁగి మును చేసిన ప్ర
తిజ్ఞ నెఱపి భూరి। కీశసామ్రాజ్యపదము దక్కించుకొనుమ॥ (తే,గీ) మత్రి
యుబాంధవ మంత్రిసమన్వితముగ। రాముని పదాంబుజములు శిరంబు సోకఁ।
బ్రణతిఁ జేసి తద్వశుఁడవై బ్రతుకు మధిప। భర్తృవశగతయై పొల్చు భార్యప
గిది॥ (వ) కపీంద్రా సురేంద్ర తేజులైన రామలక్ష్మణులదివ్యాస్త్రాదిబలంబు సా
లగిరిచ్ఛేదనాది కార్యంబులందు దృష్టచరత్వంబు వలన నీకు విదితంబైనయది
యెకదా యమ్మహానుభావుల శాసనంబు నుల్లంఘించుట యుక్తంబు గాదని ప
వననందనుండు సుగ్రీవునకు హితోపదేశంబు సేయుచుండె నంత లక్ష్మణుండు మొ

—(*) లక్ష్మణుఁ డంగదాది వానరగృహంబులఁ జూచుట. (*)—

గసాల విడిచి దౌవారికులు సంక్రుద్ధంబైన తనరూపంబుఁ జూచి భయభ్రాంతులై
డాయ నోడి కృతాంజలిపుటులై యంత నంతఁ బరివేష్టించి వచ్చుచుండ వా
రినందఱ నిరాకరించి వెచ్చ నూర్చుచు శీఘ్రంబున నంజని వింధ్య మేరు మహీ
ధర సంకాశ నానావిచిత్ర మణిసమాకీర్ణ రమ్యహర్మ్య ప్రాసాదసంబాధ
యైన దాని ననంతవస్తు సంచయ సమంచిత నానాపణోప శోభితయగు దా
ని నతిరమణీయ పుష్పిత సర్వకామ ప్రదదివ్య ఫలరంజిత మహీరుహ వ్రాత
సంశోభిత మహోద్యాన సంకులయగు దాని నతిసురభి చందనాగరు పద్మమై
రేయ మధుసమ్మోదిత మహాపథయగు దాని నమేయబల సంపన్న దేవ గంధ
ర్వాంశ సంభూత దివ్యాంబర స్రగ్విభూషిత కామరూప సంచారి వీర వానర
పరిపూర్ణయగు దాని నొక్క మహాగుహ ప్రవేశించి యందు ప్రథమంబున నం
గదుని గృహంబును మైందద్వివిద నివాసంబులును గజగవయ గవాక్ష గంధ

యా వెలంది కపినాథుని యానతి నుల్లసస్మితం । బౌవృత మేఖలాగుణ
సముంచిత నూతన హేమ సూత్రయై । తావులు గ్రుమ్మరించు విరిదండలు చెం
తల జీరువాఱఁగా । భూవర పుత్రుసన్నిధికిఁ బోయెఁ బ్రియోక్తి ననూ
నయింపఁగన్ ॥ (వ) మఱియుస్వభావరమణీయగమనసౌందర్యయైన యత్తార
కాంత సంశ్లేషకృతాయాసంబున నడుగులో నడు గిడుచు భోగసంవర్ధ
నమధుపానమదవిహ్వల నేత్రయై శయనస్థానంబునం బవ్వళించి యున్నయట్ల
నెరయంబునలేచి చనుదెంచుచున్న దగుటం జేసి ప్రలంబకాంచీగుణ హేమ
సూత్రయై వ్యక్తసంభోగలక్షణయై స్తనహారంబునఁ గించిన్నమితాంగయష్టి
తోఁజని లక్ష్మణుని సందర్శించి డాయంజనిన నవ్వానరపత్ని నవలోకించిమ
హాత్ముండగు లక్ష్మణుండు దాసీనత్వంబు గలవాఁడగుటచేత నొక్కింత మొగం
బువాంచి స్త్రీసన్నికర్షణంబువలన నివృత్తకోపుండై యుండె నప్పుడత్తారపాన
యోగంబువలన నివృత్తలజ్జయై సౌమిత్రి నవలోకించి యతనిదృష్టిప్రసాదంబు
వలన భయంబువిడిచి ప్రణయప్రగల్భంబును బరిసాంత్వనయుక్తంబును నర్థ
వంతంబును నగు వాక్యంబున నిట్లనియె ॥ (మ) కృపపోఁబెట్టి దురంతకోప
మున ని,ర్వేదించెదిట్లేలకో । నృపవంశోత్తమ యెవ్వఁడీకపులలో, నీయాజ్ఞ
కుంగాక దు । శ్చపలుండై చరియించె నెవ్వఁడిట శు,ష్కక్ష్మాజకాంతారభా ।
గపతద్వహ్నిని నిర్విశంకతఁ జోరం,గాంక్షించెదుర్బుద్ధియై ॥ (వ) అనిసాం

(*) లక్ష్మణుఁడు తారతోసుగ్రీవుని యందలి దోషంబులుగ్గడించుట . (*)

త్వపూర్వకంబుగాఁ బలికిన నయ్యంగన వచనంబువిని లక్ష్మణుండు ప్రణయదృ
ష్టప్రయోజనంబగు వాక్యంబున వెండియు నద్దేవికిట్లనియె ॥ (తే,గీ) అతివ
నీపతిలుప్తధర్మార్థసంగ్ర । హుండు కామపరీతచిత్తుండఁటంచు । నెఱుఁగ
వేటికిభర్తకుహితముఁగోరు । కాంతపతిచందమునుమదిఁగానవలదె॥ (క)తల
పోయఁడు రాజ్యార్థము । తలపోయఁడుశోకవేగ దళితులమమ్ముం । దలపోయఁ
డుపరిషద్విధిఁ । జెలియానీమగఁడుపానసేవారతుఁడై ॥ (తే.గీ) మాసములు
నాల్గుచనినవిస్మృతుమహీజ । వెదకఁబంపెదననిసత్య మొదవఁబలికి । పానసేవా
మదంబునమేనుమఱచి । తఱియెరుఁగునంతకునుదానిఁదలఁపఁడయ్యె॥ (క) పాన
మెపురుషార్థమునకుఁ । దానకమనినెమ్మనమునఁ దలఁచినవాఁడా । భానుజుఁ
డుపానసేవను । బూనుకధర్మార్థకామములుచెడిపోవుగా ॥ (తే,గీ) అతివ



యుపకృతివిషయంబునందునీతిఁ । బట్టిప్రత్యుపకృతి సేయనట్టివాని । కనఘమతి
యైనమిత్రనాశనమునందుఁ । బరఁగధర్మార్థకామలోపంబుగలుగు॥ (తే.గీ)
సత్యధర్మార్థకామవిచారుఁడైన । మిత్రునిఁ బరిత్యజించిన మిహిరసుతుని।
చేతనిన్నాళ్లునుబరిత్యజింపఁబడియెఁ । గాదెయేమన్న నిఁకవివేకంబుగలుగు॥ (వ)
హరీశ్వరుండగు సుగ్రీవుండిట్లు వివేకహీనుండయ్యె నింక నేమనిన నేమికార్యం
బులేదుగావున ధర్మార్థకామవిలోప హేతుభూత మిత్ర పరిత్యాగ లక్షణ
కార్యంబిట్లుప్రస్తుతంబగుచుండ నుత్తరకార్యంబెయ్యదిమాచేతఁగర్తవ్యంబు
నీవు కార్యతత్త్వజ్ఞవుగదా దానింబేర్కొనుమనిపలికిన ధర్మార్థస్థైర్యసం
పాదకంబును మధురస్వభావంబునగు లక్ష్మణుని వాక్యంబువిని యత్తారరామ
కార్యంబునం దవగతప్రయోజనయై క్రమ్మఱ విశ్వాసయుక్తంబగు వాక్యంబున

తార లక్ష్మణు ననునయించుట

నన్నరేంద్రపుత్రునకిట్లనియె॥ (సీ) భూపాలసుతయిది కోపకాలముగాదు స్వ
జనంబునందుదోషంబుసేయఁ । జనదుభవత్ప్రయోజనపరుండగు కపి వరుప్ర
మాదముసైఁపవలయుసత్వ । గుణయుక్తుఁ డగువాఁడు గుణహీనుఁ డగువాని
యందుఁగోపముసేయనర్హమగునె। సత్వావరుద్ధుండు శాంతిదాంతిక్షమాచ
తురుండునీయట్టిసాధుజనుఁడు॥ (తే,గీ) జగతినెవ్వాఁడు కోపవశంబునొందుఁ।
బరగఁగోపంబువలనఁదాపంబుగలుగుఁ । దాపమునఁబాపముఘటిల్లుఁద్వద్విధు
నకుఁ । బాపమార్జించుటదిధర్మఫణితిగాదు॥ (వ) మహాత్మా హరివీరబం
ధుండగురాముని యమోఘరోషంబును నుద్యోగకార్యమునకుఁ గాలవిలంబ
నంబగుటయును సుగ్రీవునకు మీరుచేసినయుపకారంబును సుగ్రీవుని వైభవంబు
భవదధీనంబగుటయును సుగ్రీవునకు సీతాన్వేషణాదికార్యంబు కర్తవ్యం బగు
టయును శరీరజకామబలం బవిషహ్యం బనియును రాముండు విరహ వేదనా
కంపితుండై యునికియుఁ గామంబుచేతనసక్తుండైన సుగ్రీవుండిప్పు డనవరతం
బవబద్ధుండై యుండుటయు నట్టిసుగ్రీవుం డేజనంబునందవబద్ధుండయ్యె నట్టికాం
తాజనంబును నెఱింగియున్నదాన వినుము॥ (తే,గీ) ఇనకులోత్తమ నేడునీవె
ట్లుకోప । వశమునొందితివట్లుదుర్వారకామ । తంత్రములయందునీబుద్ధితగులు
పడదు । తగిలియున్నఁదాదృశునిట్లు దెగడవిపుడు॥ (క) కామరతులైనమనుజు
లు । భూమీశ్వర దేశకాలములుధర్మార్థ । ప్రామాణ్యంబులు దెలియక । వ్యా

మోహితులగుచుఁ జాలవర్తింతురిలన్ ॥ (చ) పనివడి పానయోగమున భానుసుతుండు మసివృత్తిలజ్జుఁడై । యనిశముమ్ముఁ గూడి పాలుపారఁగ మన్మథకేళిఁ దేలుచున్ । దనియక మత్తుఁడై యునికిఁ దప్పు సహింపఁగఁ బోలు భ్రాంతపైఁ । గనలఁగఁ జెల్లునే విభుని కార్యము చేరన్ ఁగ రాగలం డిఁకన్ ॥ (చ) అతిచపలస్వభావుఁడు ప నాటుఁడునైన దినేంద్రపుత్త్రుఁడు । ధృతిధృతి మాలి పుష్పశర ధాటికి లోఁబడి యుండుఁ జెంతపో । యతులతపోవిభూతిమహిమా ప్తిజితేంద్రియులైన తాపసుల్ మతిచెడి కామినీసుఖ సమన్వితులై వెసఁజిక్కియుండరే ॥ (వ) అనియిట్లు మహార్థయుక్తంబగు వచనంబు పలికి వెండియు నత్తార సఖేలంబును మదవిహ్వలంబును భర్తృహితయుక్తంబునగు వాక్యంబున నిట్లనియె ॥ (సీ) క్షితినాథసుత భానుసుతుఁడు రామునకు విధేయుఁడై కార్యంబు దీర్చఁగోరుచు । మునుకొని యుద్యోగ మొనరించియున్న వాఁడెల్లుండి రేపట నేపుమీఱ । నఖిల దిక్కులనుండి యంబరసంచార చతురులు దుర్దాంతసత్త్వయుతులు । కామరూపులు వీర్యఘనులు కోట్యర్బుద సంఖ్యాతులగ చరసైన్యపతులు ॥ (తే,గీ) వచ్చెదరు వారినందఱ వరుసతోడఁ । దోడుకొని రాముకడకతితూర్ణభంగి । రాఁగలఁడు మీరలింతలో వేగిరపడి । పరుష వాక్యంబులిట్లు బలుక నేల ॥ (వ) రాజనందన

## తార లక్ష్మణుని సుగ్రీవునికడకుఁ దోడుకొనిపోవుట.

నీవు పరజనాభ్యంతర మందిరప్రవేశం బనుచితంబని యిచ్చట నె యుండుటం జేసి నీచేత సదాచారంబు రక్షితంబయ్యె మిత్రభవనంబునందు మిత్రదారావలోకనంబు సేయుటవలన సత్పురుషులకు ధర్మలోపంబు గలుగదు గావున నీవంతఃపురంబులోనికి విచ్చేయవలయునని ప్రార్థించిన నద్దేవి వాక్యంబులచేతఁ గించిదుపశమితక్రోధుండై తారోపదిష్టమార్గంబున నంతఃపురంబు ప్రవేశించియుండు ॥ (సీ) ఉదయాద్రిపై నొప్పు నుష్ణాంశుక్రియఁ గాంచనాసనఘనపీఠిపైన లరువాని । దివ్యాభరణమాల్యదివ్యగంధాంబరహారశోభితగాత్రుఁడైనవాని । గమనీయ వారుణీగంధఘుమఘుమితాధరకిసలయుండైనవాని । నసమాన మధుపానలసితాతిమదఘూర్ణమానశోణితనేత్రుఁడైనవాని ॥ (తే,గీ) వానరీహస్తచామరవ్యజనముంజు । లాసిలాందోళితాలకుండైనవాని । భూరిపరిమళవాసితపుష్పదాము । కిరణసంభృతగ్రీవుసుగ్రీవుఁగని యె ॥ (వ) మఱియు నాదిత్యసన్నిభుండగువాని దివ్యరూపుండగువాని మహేంద్రుండుంబోలె దుర్జయుం



డగువానిఁ దివ్యాభరణమాల్యోపేత ప్రమదాజనపరివేష్టితుండగువానిఁ దప్తకాంచనవర్ణుండగువాని విశాలాక్షుండగువాని రుమాపరిరంభ సంభావనా సంభ్రముండగువాని సుగ్రీవునవలోకించి ॥ (క) ఘనతరతద్విభవాలో । కనజాతదురంతరోషకలుషారుణితా । ననలోచనుఁడై కాలుని । యనువున శోభిల్లెనతి భయావహభంగిన్ ॥ (ఉ) అంత దినేంద్రపుత్త్రుఁడు దురంతనితాంత మహోగ్రకోపకాలాంతకుఁ బోని క్రూరాలుచుర యంబున వచ్చు మహీశపుత్త్రునన్ । ల్లంతనె చూచి దిగ్గనని జాసనముద్ధతిడిగ్గియాత్మలో । నెంతయు భీతిపర్వఁ జలి యించె మహీంధరభిద్ధ్వజాకృతిన్ ॥ (తే,గీ) అప్పుడు రుమాప్రభృతికాంత లతిరయమున । భర్తతోఁ గూడ లేచి సంభ్రమము మెలర్ప । గగనమునఁ దారకలు నిశాకరుని బోలె । సురుచిరంబుగ నాతనిఁ జుట్టుకొనిరి ॥ (క) ఇక్ష్వాకువడిరవినందనుఁ । డక్కనకాసనము డిగ్గి యంజలియుతుఁడై । మిక్కిలి భయభక్తులతో । గ్రక్కున సౌమిత్రి యంతికంబు ననిలిచెన్ ॥ (వ) ఇట్లు కాంతాజనపరివృతుండై కల్పవృక్షంబు చందంబునఁ జలింపుచు నంజలియుతుండై తనముందు నిలువంబడియున్న సుగ్రీవునవలోకించి

## (*) లక్ష్మణుఁడు సుగ్రీవుని దూఱుట. (*)

లక్ష్మణుండు దారుణవాక్యంబున నిట్లనియె ॥ (తే,గీ) సత్యనిష్ఠయు నింద్రియజయము కృపయు । సత్త్వసంపన్నతయుఁ గృతజ్ఞత్వమార్గ । రక్షణాసక్తి యొప్పునే రాజునందు । నతఁడు సంపూజ్యుఁడగుచు నేపారు సిరిని ॥ (క) ఉపకారులైన మిత్త్రుల । కుపకారము సేయఁ బ్రతిన యొనరించి తుది । న్నృపమాలి తప్పి నడిచిన । చపలాత్ముని కంటె శఠుఁడు జగతింగలఁడే ॥ (తే,గీ) మొదలఁ దానుగృతార్థుఁడై పిదపసఖుల । కవని నెప్పుడు ప్రతికార మాచరింపఁ । డా కృతఘ్నుఁడు సర్వభూతావలులకు । నిక్కముగ వధ్యుఁడనిరి వినీతివిదులు ॥ (సీ) అశ్వానృతుండు శతాశ్వహంతయు మఱి గోనృతుండు సహస్రగోఘ్నుఁడనియు । బురుషానృతుండగు పురుషాధముండాత్మహంతయు నిజబంధుహంతయనియు । మొదవు నుజంపిన మూఢాత్మునకు జోరునకును భగ్నవ్రతునకును బాన । నింతు నికిలనొక్క [illegible]కృతిగలదుగా నరయఁ గృతఘ్ననకది యులేదు ॥ (తే,గీ) మఱియు నకృతఘ్నుండు సిరికినాయు । పునకుఁ గాక నిరస్తుఁడౌనని యునిట్లు । మును కృతఘ్ను నిఁ గూర్చి సమ్మోదమొసఁగ । నబ్జగర్భుండు గాథలయందుఁ జెలిపె ॥ (క) మొదలఁ గృతార్థుఁడవై పెం । పొదవఁ జెలికి హితము సేయకున్న

కతననీ। వదయుఁడవనాద్యుఁడవుదు। మఱుదుఁడవును గృతఘ్నుఁడవు ప్రమా
దివితలఁపఁ॥ (తే,గీ) భానుతనయకృతార్థుఁడవైననీకుఁ। గరుణనకృతా
ర్థుఁడైనరాఘవునిదేవి। వెదకఁబుచ్చుట కర్తవ్యమదియె గాక। గ్రామ్య
సుఖవృత్తినిట్లుంట కార్యమగునె॥ (క) ఘనుఁడారాముఁడమిత్రుఁడు। వనినీ
కై పూనివాలి నతిబలశాలిం। దునిమెంగడు మండూక। స్వనఘణివని నిన్నె
ఱుంగఁజాలక యకటా॥ (క) జనపతికరుణనకాదే। యనుపమ సంపదలుగలి
గె నటుగాకున్న। న్మనుపటివలెగిరికందర। ఘనదుర్గము లందుఁజాల గా
సింబడవే॥ (క) క్షితినాథునికార్యముదు। మఱతివైగావింపవేని మచ్ఛితవి
శిఖా। హతిఁగూలవై చియిప్పుడె। యతిరయమున వాలిఁగూడనని చెదనిన్నుఁ॥
(తే,గీ) అతిబలుండైనవాసవ సుతుని ఱొమ్ము। వ్రక్కలించినవిశిఖంబు మొక్క
పోయె। ననితలంచితో యవ్వాఁడిమినిగడంగి। నేఁడునినుఁద్రుంపఁగాఁ జాలు
నీచచరిత॥ (తే,గీ) రామబాణాభిహతుఁడై పురందరాత్మ। సంభవుఁడు పోయి
నపథంబు సంకుచితము। గాదునీకునుదత్ప్రతిగ్రహణబుద్ధి। గల్గినను రామవిప్రి
యకారివగుమ॥ (క) క్షితిపతికిహితముగావిం। చితివేనియుఁదన్మహా విచిత్రశ

## (*) తార లక్ష్మణుని ననునయించుట. (*)

రాస। చ్యుతవజ్రసన్నిభాశుగ। వితతులఁగనుఁగొనకసుఖిత వెలసెదవిచటన్॥
(క) అనిపెక్కుగతులలక్ష్మణుఁ। డనుపమ కోపంబుగోహి తాకృతిఁగనులం
గనుపట్టఁగఁబల్కినన। య్యినవంశజుఁజూచితార యిట్లనిపలికెన్॥ (చ) అనఘు
భవన్ముఖేరితమ హాశనిసన్నిభ దారుణోక్తుల। న్వినఁజతురుండు గాకకడు వెల్వె
లఁబోవుచు నున్నయాతఁడీ। యినజుఁడొకింత నేరమున కింత తిరస్కరణంబుసే
యఁగాఁ। జను నెవయస్యునిందొడరి చంపినదోషముగా దెయారయన్॥ (చ)
తరణితనూజుఁడకర్కటకృతఘ్నుఁడుగాఁడుశఠుండుగాఁడుదు। శ్చరితుఁడుగాఁడు
కేవలస్మ రసుఁడుగాఁడు కృతోపకారవి। స్మరణయుతుండుగాఁడు నృపసత్త
మునాజ్ఞయుఁదప్పఁడేటికి। ప్పరుసునమాటలాడెదవు భానుకులోత్తమ యన్య
నిర్బలెన్॥ (ఉ) రామునిసత్కృపం బ్లవగ రాజ్యము శాశ్వత కీర్తియున్మహా
హాయి। ద్దామయశంబుగల్గెఁగడుధన్యుఁడనై తిఁదదిష్టసిద్ధికై। భూమిజనింకవే
వెదకఁబుచ్చఁగఁబోలునటంచు మహాక్షుఁదా। వేమఱునొంటి మైఁదిరుగు వేళలఁజె
ప్పునితంబు నిత్యముఁన్॥ (చ) మఱచినవాఁడుగాఁడు గుణమండనయాతఁడు రా



మకార్యము। స్గుఱుతుగఁబెద్దకాలమున కుందగ మీకృపభూరిసౌఖ్యముల్। దిర
ముగనబ్బఁగానఁదమి దీఱకయిన్ని దినంబులిచ్చటన్। వెరవునజాగుచేసెనిది నే
రముగాఁగొననీకుఁబాడియే॥ (చ) క్షితివరపుత్రమేనకకుఁ జిక్కిమనోభవరా
గమత్తుఁడై। యతులతపోవిశేషమహిమాదికముల్విడనాడి కానలో। యతిమ
గుగాధిపుత్రుఁడుదశాబ్దములుండఁడెతొల్లి వానరుం। డతిచపలాత్ముఁడైన కప
నాత్మజుఁడుండుటయెంత చెప్పుమా॥ (ఆ,వె) కాయధర్మగతుఁడ కామసంతు
ష్టుఁడు। మహితభోగయుతుఁడు మద్యపాన। నిరతుఁడైన రవిజునేరంబు సైరించి।
యవనివిభుఁడుగావ నర్హుఁడధిప॥ (తే,గీ) నిశ్చితార్థంబు దెలియక నృపకు
మార। ప్రాకృతునిమాడ్కి నీయట్టి భవ్యమతులు। పాపమెంచక భృత్యునిపైన
కార। ణముగఁగోపింతురయ్యయన్యాయముగను॥ (క) వివిధధనధాన్యవసువు
లు। ప్లవంగరాజ్యమును రుమనుబవపడినన్నుం। దవిలినృపతిప్రియార్థము। రవిసు
తుఁడు త్యజించుననిత లంపుము బుద్ధిన్॥ (తే,గీ) అనఘచరిత సుగ్రీవాజ్ఞ
మందునీవు। సాహసంబును రోషంబు సంభ్రమమును। వేగవిడిచి ప్రసాదంబు
వెలయఁజేయు। మవనిసర్వజ్ఞునకు సీతులాడవలెనె॥ (తే,గీ) ఇనతనూజుఁడు ద
శకంఠునని వధించి। సీతతోఁగూడ రామభూనేతఁదోడి। తెచ్చు రోహిణీయుత
ముగధృతిఁజెలంగి। మెచ్చుగఁదుషారధాముని దెచ్చినట్లు॥ (వ) మఱియులం
కాపురంబునందుఁ గ్రూరకర్ములును గామరూపులునగు రాక్షసులు శతకో
టిసహస్రాయుత షట్త్రింశత్సహస్రశత సంఖ్యాతులు ముఖ్యనాయకులున్నవా
రు వారినందఱ నిర్జింపక కాని దురాత్ముండగు రావణుంజంప నలవిగాదుగా
వున సహాయ రహితుండగు సుగ్రీవునిచేతఁ గ్రూర కర్ముండగు రావణుండు
రణంబునవధించుటకు శక్యుండుగాఁ డివ్విధంబు నీకెట్లు విదితంబయ్యెనంటివేని
యంగదోక్త రామ సుగ్రీవసఖ్య కరణవృత్తాంత శ్రవణానంతరంబున మద్వల్ల
భుండైన వాలి రావణుని బలాధికత్వం బుగ్గడించి మహా బలపరాక్రమ రావణ
నిరసనవిషయంబునందు నన్నువిడిచి దుర్బలుండైన సుగ్రీవు నెవ్విధంబున న
వలంబించె రాఘవుండని నాతోడం జెప్పెఁ దత్ప్రకారంబు నీతోడ విన్నవిం
పుచున్నదానఁ దత్సహాయనిమిత్తంబు సమస్తదిక్కులంగల వానరయూథపు
లందోడ్తెచ్చుటకు వేగవంతులగు వానరులు చనియున్నవారు సుగ్రీవుండుగ్గ్రీవుం
డై వారిరాక కెదురు సూచుచున్నవాఁడు మున్ను పల్కిన చందంబున

ప్రతిజ్ఞా తత్పరుండగు నితండు బలంబులం గూర్చుకొని రాముని యర్థ సిద్ధికొఱకు సముత్సాహ సమేతుండై యిప్పుడ నీతోడం జనుదెంచు నత నిం బరివేష్టించి భల్లూకకోటి సహస్రంబులును గోలాంగూల శతంబులును మఱియు ననేకకోటి వానరలును బరతెంచెద రిప్పుడు కోపం బుపసంహ రించి ప్రసన్నముఖుండవుగమ్ము కోపసంరక్తలోచన ప్రభావీచీ సమీచీనం బై నభవన్ముఖంబు నవలోకించి హరివరకాంతలెల్ల వాలివధజనిత భయ శంకితు లై శాంతినొందక యున్నవారని పలికిన నత్తారవచనంబువిని లక్ష్మణుండుమృ దుస్వభావుండై కోపంబుం బరిత్యజించెనప్పుడు శాంతుండైన సౌమిత్రినవలోకిం చి సుగ్రీవుండు శిథిలవస్త్రంబుం బోలె నతనివలని భయంబు విడిచి కంఠల గ్నంబైన బహుగుణ విచిత్ర దివ్యమాల్యంబు పరిత్యజించి పానమదంబునం దే

(*)సుగ్రీవుఁడు లక్ష్మణుని ననునయించుట.(*)

లి పరమానంద కందాయమాన మానసుండై ప్రశ్రితంబగు వాక్యంబున నిట్లని యె॥(క)అనఘా రాముని కృపనీ । యనుపమ రాజ్యంబు శాశ్వతైశ్వర్యంబు । ఘనరత్నవస్తువాహన। ధనవసువులుమఱలఁగలిగె, ధన్యుఁడనైతిన్॥ (క)పన్నగ రాముఁడు నాకున । మున్నతిఁ గావించునట్టి, యుపకృతికి మహీ । భృన్నంద న ప్రత్యుపకృతి । యెన్నిక కెక్కంగఁజేయ, నేశక్తుఁడనే॥(తే,గీ)మనుజశేఖరుఁ డాత్మకర్మములచేత । నధిక విఖ్యాతుఁ డగునట్టి, యవ్విభునకు । ధాత్రిఁబ్రతి కార మొనరింపఁ, దగినయట్టి । నిపుణుఁ డెవ్వఁడులేఁ డింత, నిక్కువంబు॥(సీ) అనఘాత్ముఁడొక బాణమున నే మహాత్ముండు సప్తమహామహీజములగిరిని । ధ రణినిభేదించె, మఱియు నెవ్వనిధనుర్జ్యా నిస్స్వనంబున, జగతియెల్లఁ । గం పించె నట్టి రా, ఘవునకు నొకనిసాహాయ్య మేల నిమిత్త,మంతెగాక । తోడరిస హాయమాత్రుండనైన ననుఁగూడిఁనిజ తేజమునవైరి, నెగిచిచంపి॥ (తే,గీ)జన కపుత్రిని జేకొను,సత్యముగను । బంధుయుతముగ రావణుఁ,బరిభవించు । ట కుఁజమూసంయుతుండనై, ప్రకటభంగి । రాఘవుని వెంటవచ్చెదఁ, బ్రాభవ మున॥(వ)శిష్యుండనైన యేను ప్రణయవిశ్వాసంబులవలన నొక్కింతయపరా ధంబు గావించిన నదియంతయు రఘువల్లభుండు సహింపనర్హుండగునని ప లికిన మహాత్ముండు సుగ్రీవుని వచనంబులువిని లక్ష్మణుండు ప్రీతచేతస్కుండై ప్రేమాతిరేకంబునసిట్లనియె॥(క)నాథుఁడవగు నీచేరఘు । నాథుండు సనాథుఁడ



య్యె, నగచరవర్యా । సాధారణముగ రాజ్య । శ్రీధనభోగములు గుడువఁ,శ

(*)లక్ష్మణుఁడు శాంతుండై సుగ్రీవునిఁబొగడుట.(*)

ల్గున్నీకున్॥(ఆ,వె)శౌర్యవంతుఁడైన, జనపతినీసహా । యతనుబొందిదారుణా భూమి । నిఖిలదనుజవరుల,నిర్జించి నిజముగఁ । బడమికన్నెనింకఁ, బడయ గలఁడు॥ (వ) మహాత్మా ధర్మజ్ఞుండవు కృతజ్ఞుండవు సమరాని వర్తనవగు ని వాక్యం బుపపన్నంబై యున్నది రాముండును నీవునుం దక్కనన్యుఁడెవ్వం డిట్టి యుక్తియుక్తంబైన వచనంబుఁబలుక నేర్చు బలపరాక్రమంబులచేత నీవు రా మునకు సరివచ్చువాఁడవు రఘుపుంగవునకు నీసాహాయ్యంబు పెద్దకాలంబున కు దైవసంఘటితంబై చేకూడినయది శీఘ్రంబున నింకనాతోడం జనుదెంచిభా ర్యాహరణ కర్శితుండై యున్న రామునిం బ్రణయ సల్లాపంబులం దేర్పుము॥ (క)జనవిభుని కోపతాపముఁ । గనుఁగొని మదిఁదాల్మి, సిల్పఁ, గా లేకనినుఁ గనలి పురుషోక్తులాడితి । నినతనయాకరుణచేస,హింపుముదాసిన్॥ (వ)అని యన్యోన్య ప్రణయవచనంబుల మైత్రిం బ్రకటింపుచు సరిలేని సౌహృదంబునం బొల్చి యుండిరి పదంపడి కార్యవిచార తత్పరుండై సుగ్రీవుండు నిజపార్శ్వ వర్తియగు హనుమంతు నవలోకించి॥(సీ) వింధ్యాచలమునందు, వృషభపర్వత మందు మందరగిరియందు మలయమందు । మేరుశైలమునందుఁ, బారియా త్రమునందు శంకరగిరియందు, సహ్యమందు । హిమశైలమందు సిం, హామ హీధరమునందు హరిశైలమందు నీ,లాద్రియందుఁ । బార్క్షపర్వత మునందుఁ,

()సుగ్రీవుఁడునానాదేశములనుండు వానరులరావింపుమని()

—(*)హనుమంతునికాజ్ఞాపించుట.(*)—

పశ్చిమగిరియందు ధూమ్రాద్రియందు దు,ర్దరమునందు॥( తే,గీ) మఱియునా నాట వీద్వీప, శరధినిమ్న । గాసరోవరకటక సం,కటములందు । వసతిఁగా వించి యున్నదు,ర్వారబలుర । వృక్షచరులను వేగ రా,వింపుమనఘ॥ (శా)కీ రోదారుల సింహవిక్రముల ను,ద్దీప్త ప్రతాపాఢ్యుల । స్వైరోత్తంసుల మేఘన ర్జుల జగద్విఖ్యాత శౌర్యోల్లస । ద్ఘోరాకారుల వానర ప్రవరుల, న్దోర్దర్ప రఁగాము న్నసాం । ఘోరంజారులఁ బుచ్చి నాఁడను సమ,స్తాశావకాశంబులన్॥ (క)నావచనంబున నీవును । భూవల్లభ కార్యసిద్ధి, పొంకెబ్లవగుల । స్థివిలసి తులను బొల్లిఁటి । త్రోవలవెసఁబుచ్చు మిటకుఁ,దోడ్తెచ్చుటకున్॥ (వ)మఱి

యుఁదరుణాదిత్యవర్ణులును గాంచనాచల సంకాశులును నీలజీమూతసన్నిభులును భీమకాయులును బద్ధతాళ వనవాసులును గుంజరప్రతిమాజులును మనశ్శిలా గుహావాసులును గనకప్రభులును దాపసాశ్రమనిలయులును దీర్ఘసూత్రులును మధుమైరేయాసవ గంధ సంవాసిత ముఖులునగు వీరవానరుల సామదానాద్యుపాయంబులచేత వశీకృతులఁ గావించుకొని రణంబునకుం దోడి తెచ్చుటకు నేర్పరులగు గతిజ్ఞుల మదీయ శాసనంబునం బుచ్చుము॥(క)పదిరాత్రులలో నెవ్వఁడు । మదయుతుఁడై రాకయుచట, మసలు నతఁడు బె । ట్టిదముగ నాచే మిక్కిలి । పదపడి హింతప్పుఁడనుచుఁ, బలుకుము వీరల్॥(క) పోలిపోనకుండ జగతిం । గలవానరులెల్ల రామ,కార్యార్థముగా । బలదర్పములుసెలంగఁగఁ । గలసి మెలసి వచ్చువారు, గాఁ జేయు ముగిల్॥ (క) నావిని మరుత్తనూజుఁడు । భూవరు కార్యంబు పొంతె, భూరిబలురను । శ్రీవిభవయుతులఁ గీశుల । ధీవరులను వేగ నెల్ల దిక్కులకనిచెల్॥(ఉ) పంపిన వారుతీవ్రయుగు, భానుకుమారుని యాజ్ఞనుర్వికం । పింపఁగ నప్పుడేకడలి, భీషణభంగి నభోంతరంబునన్ । గుంపులు గట్టిపోయి వన,గోత్ర పయోధిని వాసులన్నమి । ల్లంపటుల న్వనాటులఁ బు,రంబునకుం బయనంబుచేసిరన్॥(ఉ) వారును మృత్యుతుల్యుఁడగు, వారిజమిత్ర కుమారునానతి । స్మీఱఁగలేక బంధుసుత, మిత్రసహోదర యుక్తులై రయం । బారఁగఁ దత్క్షణంబభయు, ఖాభకటుల్ లొప్ప నభఃప్రచారులై । భూరిజవంబునంగడలి, పోవఁదొడఁగిరి రాజువీటికిన్॥ (ఉ)

### () సమస్తదేశములనుండు వానరులు కిష్కింధకు వచ్చుట.()

ఉదుగక యంజనా చలము, నుండిన వాంజన సన్నిభాకృతు । ల్దళితవిరోధివీరులతిధైర్యులు కాంచన శైలసన్నిభు । ల్కడువడి మూఁడుకోట్లప్లవ, గప్రవరులవిపుత్రువీటికిం । పదరఁగ నేగుదెంచి రపు,డద్భుతభంగి దివంబు ఘూర్ణిలల్లన్॥ (చ)ప్రతిదివసాంతమందుఁ గమ,లప్రియుఁ డెచ్చట నస్తమించునా । శిఖరకోటిపై నునికిఁ, జేయుచునున్న సువర్ణవర్ణుల । ప్రతిమపరాక్రముల్ గిరివ,ర ప్రతిభు ల్దశకోటి వానరు । ల్ధృతి సెలఁగంగఁ వేగఁ జనుదెంచిరి సూర్యజురాజధానికిన్॥(తే,గీ)సింహకేసర వర్ణులు, సింహబలురు । సింహవిక్రాంత గమనులు, సింహసములు । కీశులొక వేయికోట్లు కి ష్కింధకప్పుడు । రజతగిరి నుండివచ్చిరి, రయము మెఱయ॥(చ)చలివాల నాశ్రయించి వరు, స,న్నఁమూ



లము లాహరించుచు । న్బాలుపుగఁ దద్గుహాగహన, భూములఁ ద్రిమ్మరువారు సంచల । త్కులగిరిసన్నికాశులొక, కోటిసహస్రసహస్రవానరు । ల్బలముగ నేగుదెంచిరిద,శంబుగ భానుజుఁడేలువీటికిన్॥ (క)ఘోరాంగారక తుల్యులు । దారుణవిక్రములు కపివ,తంసులు వేగం । బారక సహస్రకోటులు । వారక వింధ్యమున నుండి వచ్చిరి వరుసన్॥(వ) మఱియు నానావనోప వన గిరిగహ్వర సరిత్సరోవరనివాసులును క్షీరోద వేలానిలయులును దమాలవన వాసులును నారికేళాశనులును నసంఖ్యేయులునగు వానరులు మార్తాండమండలంబు నిరోధింపు మశీఘ్రంబుగఁ గిష్కింధకుం జనుదెంచి తత్పట్టణ బాహ్యాంతర దేశంబులు నిండి చెలఁగిరంత॥ (క) ధరణిఁ గలకపులనందఱు । వరుసం దోడ్తేరఁ జనిన వానరవరులా । గిరిచరులకందఱుకుఁ గపి । వరునానతిఁ దెల్పి మఱలవచ్చుచుఁ ద్రోవన్॥ (సీ)ఎచ్చటమున్న మాహేశ్వరంబగు యజ్ఞ మఖిలదేవస్తుత్యమై తనచెల్ । నట్టిహిమాచలంబల్లనవీక్షించి యందుదివ్యాన్ననిష్యందజాత । ఫలమూలములు గాంచి యిలనెవ్వఁడెద్దానినొక మాటు భుజియించి యొకనెల మాస । మాఁకటఁబడకుండు నట్టి దివ్యామృత స్వాదుకల్పములగుసరసదివ్య॥ (తే,గీ) మూలఫలములు నౌషధిజాలములును । సురభిపుష్పంబులును గొంచు సురుచిరముగ । యూధపులు శీఘ్రజవమున నుష్ణకరుని । సుతునివీటికి వచ్చిరి సొంపుమీఱ॥ (తే,గీ) వచ్చి సుగ్రీవుఁ గనుఁగొని వరుసతోడఁ । దాము దెచ్చినబహుపదార్థంబులన్ని । కానుకల పిఁరంచి యంజలికలితులగుచు । విన్నవించిరి మెల్లన వినయమెసఁగ॥ (ఉ) దేవరవారియానతిని తీవ్రమదంబున నేగి మేమునా । నావిధదుర్గకందరవ నక్షితిభృత్సరిదబ్ధిముద్రిత । క్ష్మావలయంబునంగలస మస్తవనాటులనీదువీటికిం । తోవడిఁగార్యముం దెలిపి తోడ్కొనివచ్చిన వారమెంతయున్॥ (ఉ) నావిని సంతసంబువద నంబునఁ గన్పడ నాత్మఁగౌతుకం । బావహిలంగఁ దత్కరములన్నియుఁగైకొని వారినెల్లసం । భావనఁ జేసి వేగగరి మంబున నిండ్లకు వీడుకొల్పిను । గ్రీవుఁడు తన్నుఁ దాలఁ గృతకృత్యునిఁగాఁ దలపోయుచున్నెడన్॥ (చ) అప్పుడు లక్ష్మణుఁడు ముద మందిసముద్ధతి హర్షబాష్పముల్ । తెప్పల మీటుచున్న శుభచరితుని భానుజుఁ జూచి కౌతుకం । బుప్పతిలంగ రాఘవుని యొద్దకుఁ బోదమె యన్న సాతఁడా । చొప్పున కంతనీయకొని సొంపలరారఁగ దక్షణంబునన్॥ (తే,గీ) ప్రేముదాతారప్రభృతికపిస్త్రీలఁ జూచి । యిండ్లకడ నుండుఁడని వారి నియ్యకొల్పి । క

డురయంబున బయనంబు గండటంచు । నెల్ల వానరులకుఁ జెప్పె నింపుమీఱ॥ (క) చెప్పిన వాసరయంబున । నప్పుడె తత్సమయిండ్లకరిగి యాంగ్రేకు మోదం । బుప్పతిల వేగఁ బయనముఁ । జెప్పి మఱల వచ్చిరిన జుచెంతకుఁ బెలుచన్॥ (క) వచ్చిన వారలఁ గనుఁగొని । మచ్చికనర్కజుఁడు చాల మన్నించుచు మీ । రచ్చుపడనింక దివిజు । లెచ్చఁగఁ బ్రస్థానభేరి వ్రేయింపుఁడనన్॥ (సీ) మేరుమందరవింధ్యధారుణీధరగుహాద్వారంబులను బ్రతిధ్వనులు సెలఁగ । భూరిదండాగ్ర విస్ఫోటితకుంభంబు పగిది బ్రహ్మాండకర్పరము పగుల । వెసనిండఁ గ్రాఁగిన యెసరులచందానఁ బొంగి పయోనిధుల్నింగిముట్ట । భూనభోదిగ్వాసిభూతసంతానము ల్వినలేక చె

—(*) సుగ్రీవుఁడు లక్ష్మణసహితుఁడై రాముని కడకుఁ బోవుట. (*)—

వులలో వ్రేళ్లు చొనుప॥ (తే,గీ) దిక్కరులకర్ణరంధ్రముల్ వ్రక్కవాఱ । ధాత్రి కంపింపఁగ నక దండములఁ బూని । వీరవానరపుంగవు ల్వేయిగతుల । మించి ప్రస్థానభేరి వాయించిరపుడు॥ (చ) ఇనసుతుఁ డంతఁ గీశులన హీనబలాఢ్యులఁ జూచి మీరుమ । ధ్ఘనతరదివ్యరత్నశిబికం గొనితెండని పల్కవారు గ్ర । ద్దనఁ గొని తెచ్చిన ంగనిము దంబున లక్ష్మణుఁ గాంచి మీరలీ । యనుపమదివ్యయానము రయంబున నెక్కుఁడటంచుఁ బల్కినన్॥ (క) ఆసౌమిత్రియుఁ బ్రమదో । ల్లాసంబున దానినెక్కె రవిజుండును బ్ర । త్యాసత్తి మెఱయ లక్ష్మణు । శాసనమునఁ బిదప నెక్కె సముచితభంగిన్॥ (వ) ఇట్లిరువు రేకయానస్థులై॥ (సీ) కమనీయకోటీర ఘటితరత్నప్రభా కాండదీధితులు నీరెండగాయ । నిరుపమానవిశాలహారిణాతపత్ర రోచులు నింగి పండువెన్నెలలు నెఱప । మణిదండచారుచామరరుచుల్ దిక్సతీవదనంబులకు వింత వన్నెఁ జెట్ట । బటహకాహళశంఖపణవవీణావేణుభేరీధ్వనులు మింటఁ బోరుకలుగ॥ (తే,గీ) వందిమాగధజనములందంద పొగడ । బలిసి చుట్టును వానరబలము గొలువ । రామవిభుఁ డున్నచోటికి రయము మెఱయఁ । జనియె రవిజుఁడు సౌమిత్రిసహితుఁడగుచు॥ (వ) ఇట్లంగునంజని మాల్యవంతంబు సమీపంబగుటయు నాక్షేపిస [illegible] రఘుసత్తముని దవ్వులం గాంచి తత్తరంబున లక్ష్మణసహితంబుగా [illegible]బుడిగ్గనుఱికి॥ (చ) కరములు మోడ్చి పాలఫలకంబునఁ జేర్చి సమగ్రభక్తి [illegible] । స్ఫురణ దలిర్ప హస్తములు మోడ్చి ర యంబున డాయఁ బోయి భా । [illegible]దీపిత సువర్ణకిరీటనితాంతకాంతితో ।



—(*) రాముఁడు ప్రణయకోపంబున సుగ్రీవుని దూఱుట. (*)—

త్పుర చిరసాదమూలములు సోకధరంబడి లేవకుండినన్॥ (క) అప్పుడు రఘుపతి రవిజునిఁ । దప్పక వీక్షించి హస్తతలమున మోదం । బుప్పతిల నెత్తికనులం గప్పుకొని దయాసమృద్ధిఁ గౌఁగిటఁ జేర్చెన్॥ (వ) ఇట్లు గారవించి కృతాంజలిపుటులై తన మ్రోల నిలువంబడియున్న హనుమదాదుల నయ్యై తెఱంగుల సంభావించి యందఱం గూర్చుండ నియోగించి సుఖాసీనుండై యున్న సుగ్రీవునవలోకించి కించిదుదంచిత ప్రణయకోపంబున నిట్లనియె॥ (క) ధర్మార్థకామములు మది । నర్మిలి విభజించి కాలమందని శంబు । న్నిమ్మలమతి సేవించె [illegible] । ధార్మికుఁడిల రాజనంగఁ దగు నినతనయా॥ (తే,గీ) పుడమినెవ్వాఁడు ధర్మార్థముల తెఱంగు । విడిచి కామంబు నెపుడు సేవించు నతఁడు । దీర్ఘ [illegible]గ్రమందు నిద్రించి పుడమిఁ । బడియెడు నరాధముని యట్లు చెడుఁగ పీంద్రా॥ (క) శత్రులఁ జంపఁగఁ బూనుట । మిత్రులకు హితంబొనర్ప మెయికొనుటయు [illegible] ర్గత్రయఫలభోక్తయగుట । ధాత్రీపతి కొప్పు నతఁడు ధర్మాత్ముఁ డగున్॥ (తే,గీ) అనఘ యుద్యోగవేళ సంప్రాప్తమయ్యెఁ । బుడమికన్నెన న్వేషింపఁ బుచ్చుటుడిగి । నాయవస్థఁ దలంపక పాయకింట । గ్రామ్యసుఖవృత్తి నిట్లుంట గార్యమగునె॥ (క) నావినిభయభక్తులు మది । నావిర్భవమందఁ గాఁ గృతాంజలియై [illegible] । గ్రీవుఁడు వినయంబున నర । దేవుని వీక్షించి యలుక దీర్పఁ బలికెన్॥ (క) క్షి

—సుగ్రీవుఁడు రాముని ననునయించుట—

[illegible]నాయక మీకృపచే । గతలక్ష్మియు గతయశంబు గతరాజ్యము శా । శ్వతసౌఖ్యము [illegible]మ్మటనా । కతులితముగఁ గలిగె నేఁ గృతార్థుఁడనైతిన్॥ (తే,గీ) అధిప మీరా [illegible]చ్చినయట్లు తనకు । మైత్రి నుపకృతిఁ జేసిన మిత్రవరులఁ । బూని ప్రతికృతి వెలయింపఁ జేనియాతఁ । డవనిలోఁ బురుషాధముఁ డనఁగఁ బరఁగు॥ (వ) మహాత్మా [illegible] మహోపకారివైన నీకుఁ బ్రతికారంబు గావింపని నాఁడే నట్టివాఁడనగుటకు సందియం బేమని పలికి తన కెలంకుల నలంకృతులై యున్న కొందఱు వానరులం జూపి [illegible]రడియు నిట్లనియె॥ (చ) నరవర నాదు శాసనము నం జనివీరు భవత్ప్రియార్థ [illegible] । ద్ధరగల సర్వదావవసు ధాధరసాగరనిమ్నగాదులం । దిరవుగనున్న కీశుల [illegible]నేక సహస్రసహస్రకోట్లబలం । బురగతి నాదుసన్నిధికిఁ దోడ్కొనివచ్చిన వార [illegible]ంతయున్॥ (క) కొందఱు వానరులిప్పుడు । గ్రంథుగఁ జను దెంచినారు శావ

సినవా । రంపఱికెంబుడమిదిక్కులు । కొందలమందంగం గూడి కొనియెద రిచ
టక ॥ (వ) మఱియుఁ గాంతారదుర్గనివాసులును వింధ్యమేరుకృతాలయు
లును మేరు మందర సంకాశులును మహేంద్ర సమవిక్రములును ఘోర
దర్శనులును గామ రూపులును దేవ గంధర్వాంశ సంభూతులునగు యూ
ధపులు కొందఱు శత సహస్రవానరోపేతులై కొందఱు దశ లక్ష వనచర
సహితులై కొందఱు దశకోటి కీశసమన్వితులై కొందఱు శతకోటి వలీముఖ
యుతులై కొందఱు లక్షకోటి ప్లవంగ సంగతులై కొందఱు శంఖ సహ
స్రశాఖామృగసహాయులై కొందఱు దశార్బుదగిరిచర సంయుక్తులై కొంద
ఱు దశమధ్యవనచరపరివేష్టితులై కొంద ఱంతవింశతి కపిసంయుక్తులై కొం
దఱు త్రింశత్పరార్ధ హరివీరులం గూడి వచ్చుచున్నవా రొక్కముహూ
ర్తంబునకు భవత్సాన్నిధ్యంబునం గూడికొని యెదురువారుబల పరాక్రమశౌ
ర్యవీర్య ధైర్యసాహసోత్సాహంబులచేత ముల్లోకంబులనైన నొక్కయెత్తున
నోర్చువారు దురాత్ముండైన రావణునిబంధుమిత్ర యుతంబుగా రణంబునం
బరిమార్చికళ్యాణగుణసమేతయైన సీతం దోడ్తెచ్చి నీకుసమర్పించెద రనిపలికిన
నిజనిదేశవర్తియగు సుగ్రీవునివచనంబులకలరి రఘువల్లభుండు వికసితనీలో

—(*)రాముండు సుగ్రీవునిం బొగడుట.(*)—

త్పలంబుపగిది దర్శనీయవర్ణుండై యతనింగరంబుల గాఢంబుగాం బరిరం
భించి హర్షపులకలెసంగ మందమధురవాక్యంబుల నిట్లనియె ॥ (సీ) వాసవుం
డుర్విపై వానలుగురియుట యర్కుండు తిమిరాపహారియగుట । విధుండు శీత
ద్యుతివెన్నెలగాయుట జగదుపకారార్థ మగుటం జేసి । కడువిచిత్రముగాని
కరణిభవాదృశు ల్ప్రీతిమిత్రులకుప కృతియొనర్తు । టదివింతగాదు పద్మాప్త
నందననీవె నాకుమిత్రుండవు నాయకుండవు ॥ (తే,గీ) దాతవు వయస్యుండవు
పరిత్రాతవరయ । నీసహాయతచేనింక నిఖిలరిపుల । నాలమున నోర్వదక్షుం
డనైతినిపుడు । ఘనునితోడిసాచివ్యంబకార్యమగునె ॥ (క) ప్రియవాదివైన
నీవింక । రయమూరంగ నాకుదైత్యరణమునం బ్రీతి । న్నయ మొప్పంగ సాహాయ్య
ము । దయతోం గావింపలయు, దక్షత వెలయన్ ॥ (క) సురరిపుం డాత్మవినాశ
ము । కొఱకై వంచించి సీతం గొనిపోయె విభా । కరపుత్ర యనుష్ఠాదుండు
గుఱుతుగ మున్నింద్రసతిని గొనిచనినక్రియన్ ॥ (క) ఏనారావణు ననిలో



మానుగ నానావిధోగ్ర, మార్గణ తతులం । బూని వధించెద శత్రుండు। జా
నుగ మున్నింబులోముం జంపినమాడ్కిన్ ॥ (వ) అనిబహుప్రకారంబుల ర
ఘువల్లభుండు సుగ్రీవునితోం బగతునిం బరిమార్చుటకుం దగిన తెఱంగునమా
టలాడుచున్న సమయంబున॥ (సీ)ఘనసింహనాదము, ల్వినిభయంబునం బొఱు
ఖచరులుడాంగంజీకటులం జేసి । భూరిభేరీస్వన,స్ఫోటితాగ్రమునకుం బాయంగా
మిన్నెఱు, బురదం జేసి । మితిలేనిగాందిశీకతం జూచుని జర్జరకుసుమగంధులకు
మేల్మునుకుం జేసి । కడదీవులందుండి, నడతెంచు కపులకు జలధులెల్లను గాలిన

—(*) సుగ్రీవుని సైనికు లందఱు రామునికడకే తెంచుట. (*)—

డలుచేసి॥ (తే,గీ) లలితకాష్టాంగనాసముల్లసదురోజ । ములకుంబాయగంగంధ
పుంబూంతచేసి । నిరుపమానోరు వీరవా,నర మహోగ్ర । సైన్యధూతసాంద్ర
ధూళికా,జాలమడరె ॥ (వ) అనంతరంబ ॥ (చ). ఒకనిమిషాంతరంబునను,
నుగ్రకరాళముఖుల్మహాబలు । ల్ప్రకటితబాహువిక్రములు, పర్వతతుల్యులుమే
ఘసన్నిభు । ల్క్రకచసమానదంష్ట్రికలతి,కర్కశ దేహులు వానరుల్దిశా । ప్ర
కరము భూమియున్గగన,భాగమునిండి రసేకులయ్యెడన్ ॥ (వ) తదనంతరం
బ పద్మకేసరవర్ణులును దరుణార్కప్రతాపులును మేఘనిర్ఘోషులును శశి
గౌరులును గామరూపులును గామసంచారులును నగు నాదేయ పార్వతేయ
సాముద్రంబులైన భల్లూక వానర గోలాంగూలబలంబు లసంఖ్యాతంబులు చ
నుదెంచెం బదంపడి యూథపులు రాందొడంగి రందు ముందఱ ॥ (క) మేరు
మహీధర నిలయులు । క్రూరమతులు దశసహస్ర,కోటిప్లవగు । ఘోరాకారు
లుగొలువంగ । సారబలోదారుండైన,శతవలివచ్చెన్ ॥ (ఉ) భూరిమహీధ్ర
శృంగములు, భూరుహము లకాశినోపలంబు లిం । పారంగం గేలంబూనిరయ,
మారననేకసహస్రకోట్లుదు । ర్వార పరాక్రమక్రములు,వానరవీరులు గొల్వ
వచ్చెభు । జ్జ్వారపిశంగవర్ణుండిన,సూనుని మామ సుషేణుం డయ్యెడన్ ॥
(మ) తరుణాదిత్య నిభాననుండు సుగుణో,దారుండు నీరేజకే । సరవర్ణుం
డు మహాభుజుండఖిలకీ, శశ్రేష్ఠుండు దుగ్యత్పవిభా । కరుండున్నావనిం గన్నవాం
డుభయదా,కారుండు ధీరుండుకే । సరియేతెంచె ననేకవానరులు చం, చద్భ
క్తిందన్గొల్వంగన్ ॥ (శా) కాలాంభోధరసన్నిభుండు విలస,త్కల్పాంత కా
కారుండు । నైశ్మలేంద్రప్రతిమాన గాత్రుండు భుజా,సంరంభ విస్ఫారుండు । న్గో

లాంగూలవిభుండు వీరుఁడు గవాక్షుం డప్పుడే తెంచె శౌ । ర్యాలంకారుఁడు వేయికోట్లు కపులు వ్యత్ప్రీతి సేవింపఁగన్ ॥ (క) వారక కోటిసహస్రము లారయ భల్లూకబలము లమితలి గొలువ । ధీరోదారుఁడు ఘోరా । కారుఁ డుధూమ్రుండు వచ్చెఁ గడు రభసమునన్ ॥ (క) గిరినిభులు ఘోరరూపులు । వరవర్ణులు మూఁడు కోట్లు వానరముఖ్యుల్ । కర మనురాగంబునఁ దనుఁ । బరివేష్టింపంగ వచ్చెఁ బనసుఁడు ప్రీతిన్ ॥ (క) శూరోత్తములగు వానర । వీరులు పదికోట్లు తన్నుఁ విడువక గొలువ । ధీరుఁడు నీలాద్రిచయా । కారుఁడు నీలుండు వేడుకఁ జనుదెంచెన్ ॥ (క) కనకాద్రినిభుఁడు నీలాం । జనచయసంకాశుఁ డమితసత్త్వుఁడు శూరుం । డనఘాత్ముఁ డైదుకోటులు । తనుఁగొల్వఁగ గవయుఁ డటకుఁ దడయక వచ్చెన్ ॥ (చ) పరుస సహస్రకోట్లు బలవంతులు కీశులు తన్నుఁ గొల్వఁగా । గురుతర విక్రమక్రముఁడు కుంఠితశౌర్యుఁడు శైలసన్నిభుం । డురుబలశాలి మేచకపయోధరవర్ణుఁడు ఘోరసంగర । స్థిరుఁడు దరీముఖుండు చనుదెంచె దినేశకుమారు పాలికిన్ ॥ (మత్తకోకిల) కోటికోటిసహస్రసంఖ్యలు ఘోరకీశులు గొల్వఁగా । హాటకాచలసన్నిభాకృతు లశ్విపుత్రులు పర్వతో । త్పాటనక్షము లుగ్రరూపులు బంధురార్భటిన్ బెసల్ । దాఁటుగట్టఁగ మైందుఁడుం ద్వివిదుండు వచ్చిరి లీలతోన్ ॥ (క) బలవంతులైన కీశులు । దశముగ నొక నూఱుకోట్లు తనుసేవింపం । గులకుధరతుల్యరూపుఁడు । బలవంతుఁడు గజుఁడు వచ్చె భానుజుకడకున్ ॥ (క) దశకోటి భల్లుకంబులు । విశదంబుగఁ దన్నుఁ గొలువ వీర్యోత్సేకా । వశుఁడు చిరజీవి భానుజ । వశవర్తియు నైన జాంబవంతుఁడు దోఁచెన్ ॥ (ఉ) అంతకసన్నిభాకృతుఁడ భాస్కరతేజుఁడు భూరిశౌర్యవి । క్రాంతుఁడు ఘోరవిక్రమధురంధరుఁ డద్రినిభాంగుఁడుం బ్రభా । వంతుఁడు నూఱుకోట్లకపివర్యులు వేఁదనఁ గొల్వఁగా రుమ । ణ్వంతుఁడు వచ్చె మారుతజవంబున భానుకుమారుఁ డుబ్బఁగన్ ॥ (చ) అలయక యేగుదెంచెఁ గతనాశనితుల్యుఁడు ఘోరవిక్రమా । జ్జ్వలుఁడు సమీరవేగియును వారితశౌర్యుఁడు మేఘవర్ణుఁడుం । గులకుధరాభుఁ డొక్కశతకోటిసహస్రసహస్ర వానరుల్ । గొలువఁగ గంధమాదనుఁ డకుంఠితసత్త్వుఁడు తత్క్షణంబునన్ ॥ (ఆ,వె) పదిఁగ శంఖశతము పద్మసహస్రంబు । ప్లవగబలము తన్నుఁ బలిసి కొలువ । నుగ్రదర్శనుండు, యువ



రాజు పితృతుల్య । వీర్యుఁ డంగదుండు, వేగ వచ్చె ॥ (క) ఘోరాకారుఁడు ధీరో । దారుఁడు పద్మకోట్లకపులు, తను సేవింపం । దారద్యుతితోఁ దారుఁడు । దూరంబున భానుజునకుఁ దోఁచెన్ మిగులన్ ॥ (ఆ,వె) పదునొకండుకోట్లు ప్లవగులు తనుఁ గొల్వ । ఘోరదర్శనుండు, కులగిరీంద్ర । సన్నిభుండు మేఘ, సంకాశదేహుఁడిం । ద్రానుజుండు వచ్చె నచటి కపుడు ॥ (ఆ,వె) కాలమేఘనిభులు, కామరూపులు వజ్ర । కల్పు లద్రినిభులు, ఖర్వబలులు । స్వామికార్యరతులు, శతసహస్రాయుత । కపులు గొలువ రంభుఁ డప్పుడు దోఁచె ॥ (క) ధీరుఁడు మహనీయభుజా । సారుఁడు దుర్ముఖుఁడు దోఁచె సరభసవృత్తిన్ । దారుణచిత్తులు కీశులు । ఘోరాకృతు లపుడు రెండుకోట్లు గొలువఁగన్ ॥ (సీ) పవిసన్నిభస్పర్శపాదఘట్టనమున గొండలశిల లెల్ల బిండిగాఁగ । వాలవిక్షేపదుర్వారవాతాహతి ఘోరమేఘము లద్రిగుహల నడఁగ । నూరువేగసముత్థితోరువాతస్ఫూర్తిఁ జెట్టు లన్నియుఁ జాప కట్టుపడఁగ । ప్రబలవానరవీర భయదకోలాహలార్భటుల బ్రహ్మాండకర్పరము పగుల ॥ (తే,గీ) ఘోరరూపులు కీశులు, నూఱుకోట్లు । బలిసి తనుఁ గొల్వ నిజముఖ, జలజమిత్ర । కిరణసందోహవికసిత, నరవరాస్య । వనజుఁ డై తోఁచె పవమాన, తనయుఁ డపుడు ॥ (తే,గీ) చటులగతి వానరులు దశ, శతసహస్ర । కోట్లు సేవింపర విజునిఁ, గొలువ వచ్చె । వానర చమూసముద్రజై । వాతృకుండు । కలితరిపువంశ వనదవా, నలుఁడు నలుఁడు ॥ (క) పదికోట్ల వానరులు తను । ముదము సేవింపవచ్చె, మున్నాఁడె జగ । ద్విదితబలుఁ డద్రితుల్యుఁడు । దధిముఖుఁడు విశాలభుజుఁడు, తపనజుఁ డలరన్ ॥ (వ) మఱియు మహాసత్త్వుండగు వినతుండును శరభుండును గుముదుండును వేగదర్శియు దుందుభియు విజయుండును సంపాతియు మొదలుగాఁగల యనేకయూథాధిపతు లగణితవీరవానరవాహినీసందోహపరివృతులై చనుదెంచి మాల్యవత్పర్వత ప్రాంత కాంతారంబులును గిరిసానుగహ్వరంబులును బ్రత్యంతపర్వతంబులును నధిత్యకోపత్యకా ప్రదేశంబులును బలు దెఱంగుల నాచ్ఛాదించి పుడమి యీనిన తెఱంగున నెక్కడఁ జూచినం దెఱపి యొక లెక్కకు వెక్కసంబై కోలాహలబహుళంబుగా నిండియుండి రప్పుడు ॥ (చ) పరుగులు పాఱుచున్ దరులఁ బ్రాఁకుచుఁ దోఁక లుద్రిప్పి యాడుచు । ఝరియలఁ గ్రేళ్లు దాటుచు వనంబుల డాఁగుచు వల్లికాగృహో । త్కరములఁ దూఱుచున్ ఘనములై వడిగర్జలు వెట్టొనర్చుచు । న్సురుచిరభంగి నర్కజుని సూరె

లనిల్చిరికీశయూథపుల్ ॥ (వ) మఱియుఁ గొందఱు యథోచితంబుగా వస్త్రాదికంబు సంకుచితంబుచేసి బద్ధాంజలులై సుగ్రీవునిం బరివేష్టించియుండిరి సుగ్రీవుండు త్వరితుండై యాసమస్తవానరశ్రేష్ఠుల నయ్యైతెఱంగులం బ్రణామాలింగనవచోగౌరవాదివిశేషంబులం బ్రీతచేతస్కులం జేసి రామునకు సమర్పించి పదంపడి ధర్మజ్ఞుండుగావున బలంబుల నెల్లం బర్వతనిర్ఝరంబుల యందును సమస్తవనంబులయందును యథాసుఖంబుగా విడియ నియమించి మీమీ బలంబుల విభజించుకొని తత్ప్రదక్షణంబునం దేమఱకయుండుండని సేనాపతులకె

—సుగ్రీవుఁడు తనసైనికుల రామునకు నొప్పగించుట.—

ల్లనాజ్ఞాపించి ఫాలంబునం గేలుగీలించి రామునవలోకించి వినయవాక్యంబున నిట్లనియె॥ (సీ) నృపవర మద్దేశనిలయులైన సమస్త కపులు దిక్కులనుండి కడు రయమున। వచ్చిరి వీరు దుర్వారబలాఢ్యులు కామరూపులు భయంకరశరీరు। లమితసంఖ్యాతులు ఖ్యాతకర్మపదానులు మహాభుజవీర కలితులభయు। లుత్తమవ్యవసాయులు రువిక్రములు దేవ దైత్యసన్నిభులు కాంతారచరులు॥ (తే,గీ) హరిసీకింకరులుగాఁగ విశదబుద్ధి। జేకొని బలాబలంబుల స్తోకయుక్తి। నెఱిఁగి తగుభంగి మన్నించి హితము నెఱిపి। ప్రాభవంబున నీవింకఁ బనులుగొనుము॥ (ఉ) అందఱు స్వామికార్యరతు లందఱు భూరివివేకయుక్తులిం। దందఱుఁ గాలకింకరనిభాకృతు లందఱరిందము లక్కరం। బందఱు శత్రులోచనభయంకరమూర్తులు వీరిలో నవీఁ। కందగువారి సీత వెదకం దగఁ బుచ్చుము రాజశేఖరా॥ (క) నావిని సంతోషము మది। నావిర్భవమంద రఘుకులాగ్రణి దగసం। భావించి మధురముగసు। గ్రీవునితో నిట్టులనియెఁ బ్రియము లరారన్॥ (ఉ) ఎచ్చటఁ బఙ్క్తికంఠుఁడు వి శృంఖలవృత్తి వసించియున్నవాఁ। డచ్చటికేగి సీతవిధ మంత యెఱింగి ముదంబు నీ అవే। వచ్చెడునంత శక్తిఁగల వానరులెవ్వరొ నేఱుంగనీ। వచ్చపడంగ నట్టివిపిఁ నాటుల నారసి పంపఁగాఁదగున్॥ (క) ఘనులగు కీశులు ముందుగ। జనిజానకిజాడఁ బొడఁగాంచియున్న చందమెఱిఁగివ। చ్చినపిదప బలయుతులమై। మనమరుగుదమధికశక్తిమూర్తు నిపైకిన్॥ (ఉ) నీవె సమస్తకార్యములు నేర్పునఁ దీర్పంగఁజాలువాఁడవు। నీవె సఖుండ వాప్తుఁడవు నిర్మలకర్మవిధాయకుండవు। నీవెను హీసుత న్వెదకి నిక్కము దేఁగలవాఁడ వార్యసం। భావిత వేయు యేటికిఁక భారము నీయది గాఁ దెసూడఁగన్॥ (ఉ) నావిని సూర్యజుండు వదనంబున మోదము



లర్పసిట్లను। న్దేవర వారికార్యమిటు దీర్పఁగ నాకుఁగళంకమేమిమీ। రీవిధినానతీవలవ దేఁగడవాఁడను గాను జానకి। న్నేవెదకంగఁ బుచ్చెదఁ బ్రవీణతవానరులన్రఘూత్తమా॥ (క) అనిపలికి సూర్యతనయుఁడు। తనమనమున ముదముగదు

—(*) సుగ్రీవుఁడు వినతునిఁ దూర్పుదిక్కున సీతను వెదకఁ బొమ్మనుట (*)—

రదశరథతనయు। ల్వినుచుండఁగ నరవాభాటి। వినతుండను యూథపునకు వెసనిట్లనియెన్॥ (వ) కపివర్యా నీవు దేశకాలనయజ్ఞుఁడవు కార్యాకార్యవినిశ్చయంబునందు నిపుణుండవు గమనాగమనవిచారతత్పరుండవు శైలసంకాశుండవు బలవంతుండవుగావున సోమసూర్యాంశసంభవులగు వారి శతసహస్రవానరులం గూడి హిమాచల వింధ్యమధ్య గతంబైన యార్యావర్త దేశంబు మొదలుకొని సరిద్గిరివనాకులమైన తూర్పుదిక్కునకుం జని యందు జాహ్నవియు సరయువుఁ గౌశికియుఁ గాళిందియు సరస్వతియు సింధునదంబును శోణనదంబును బరిశోధించి తత్తీరవనంబులును యామునాదిపర్వతంబులును వెదకి యందలి కృష్ణభూమిం డిలకించి విదేహమాళవ కాశీ కోసల మగధ పుండ్రవంగదేశంబులు పరీక్షించి యవ్వలఁ గోశకారుల పట్టణంబులు రజతాకరభూమి యుశోధించి యచ్చటి గిరిశృంగంబులందును వనంబులందును నదులయందును వైదేహిని రావణునినిలయంబును విమర్శించి యవ్వల సముద్రాంతగతంబులైన పర్వతంబులును వనంబులును బట్టణంబులునుం జూచి యటమీఁద మందరకోటి సంశ్రితులును గర్ణప్రావరణులు నోష్ఠకర్ణులును లోహముఖులు నేకపాదులును బలవంతులు నక్షయ్యులును గర్ణచూడులును బురుషాదకులును హేమాంగులునగు కిరాతులు కాఁపున్న స్థలంబులు విలోకించి యవ్వల నంతర్జలచరులును ద్వీపవాసులు నామమీనాశనులు ఘోరరూపులును నరరూప వ్యాఘ్రరూపులునగు ఘుటికొందఱు కిరాతులు కాఁపున్న గేహంబులన్నియుం గామరూపులై వెదకి యవ్వల గిరులచేత లంఘనంబుచేత నుడుపంబులచేత నధిగమింపం దగిన ద్వీపాంతరంబు లతిక్రమించి యవ్వల యవద్వీపంబన నొక్కయుత్కృష్టద్వీపంబు గలదది రత్నవంతంబై సప్తరాజ్యోపశోభితంబై సువర్ణరూప్యకంబై సువర్ణాకరమండితంబై యుండు దాని నతిక్రమించి యవ్వల॥ (చ) హరిపదచుంబి దీర్ఘశిఖరాన్వితమై సురదైత్యసేవ్యమై। సురుచిరరత్నకందరసుశోభితమై శిశిరాఖ్య మేదినీ। ధరమల రారుఁబద్ధిరిని తంబగుహాగహాన।

హ్వరములయందు వేవేగకుఁ డంచితభంగిమహీకుమారికన్॥ (వ) అమ్మహాపర్వ
తంబతిక్రమించి యవ్వల లవణసముద్రంబు దాఁటి తత్తీరదేశంబున సిద్ధచారణసే
వితంబై యగాధంబై రక్తజలంబై శీఘ్రగామియై శోణాఖ్యనదంబు శోభిల్లుర
మ్యంబులైన తదవతరణప్రదేశంబులందును విచిత్రంబులైన వనంబులందును వైదే
హీసహితంబుగా రావణునన్వేషించి యవ్వలఁ బర్వతసంభూతలైన నదులును ర
మ్యంబులైన బహునిష్కుటంబులును దరీమంతంబులైన పర్వతంబులును వనం
బులును గలవం దెల్ల వైదేహి వెదకి యవ్వలఁ బ్లక్షద్వీపంబును నుపద్వీపంబులు
నుం బరిశోధించి యటమీఁద నూర్మిమంతంబును మహారౌద్రంబును వాతోద్ధ
త తరంగమాలాసంకులంబును గాలమేఘప్రతిమంబును మహోరగ నిషేవితం
బును మహానాదంబునగు నిక్షుసముద్రంబు గనుంగొని దానినుపాయంబున నధిగ
మించి యిక్షుసముద్రమధ్యద్వీపంబులన్నియుం బరిశోధించి యమ్మహోదధియం
దుఁ గమలాసనుశాసనంబున మహాకాయులగు రాక్షసులు దీర్ఘకాల బుభుక్షితు
లై నిత్యంబును ఛాయాగ్రాహులై యుందురు తత్ప్రదేశంబు నుపాయంబున దాఁ
టి యవ్వలఁ గుశద్వీపంబు వెదకి యవ్వల మహాభీమంబును రక్తజలంబు నగు
లోహిత నామసాగరంబును మధుసముద్రంబు నవలోకించి యవ్వల శాల్మలీ
ద్వీపంబు విలోకించి యందుఁ గైలాస శిఖరసంకాశంబును నానారత్నవిభూ
షితంబును విశ్వకర్మ నిర్మితంబును వైనతేయుని దివ్యమందిరంబు గలద
చ్చట శైలసంకాశులును భీమదర్శనులును నానారూప భయావహులు నగు
మందేహ నామరాక్షసులు గాయత్రీప్రభావహతులై పవలెల్ల మార్తాండకి
రణంబుల వేఁడిమికిం గాక సముద్రజలంబులం బడి మునింగి యుండి రాత్రికా
లంబున జలంబులు వెడలివచ్చి గిరిశిఖరంబులందు వ్రేలుచుండుదురు వారిన
వలోకింపుచు నవ్వల సర్పిస్సముద్రంబును దధిసముద్రంబునుం బరీక్షించి
యటమీఁదఁ బాండురమేఘ సంకాశంబై క్షీరసముద్రంబు శోభిల్లు నది
మహామునులచేత ముక్తాహారంబులై వడి నొప్పుచుండుఁ దన్మధ్యభాగంబున నది
వ్యతికరకుసుమ విసరవిరాజిత నానాతరువ్రాత సంకులంబై వృషభనామకంబై
న యొక్క శ్వేతపర్వతంబు విలసిల్లుఁ దదుపరిభాగంబున విలసితరజత [illegible]
కింజల్కపుంజరంజిత శతపత్రవిలీయమాన [illegible] రసంబై సుద
ర్శన నామసరోవరంబు శోభిల్లు నమ్మహానలినికిం సిద్ధచారణ యక్షకిన్నర గరుడ



గంధర్వోరగ సాధ్యాదులు జలక్రీడా తత్పరులై నిత్యంబు నేతెంతురు తద్విహా
ర కౌశలంబు నిరీక్షింపుచు క్షీరసాగరంబు గడచి యవ్వల సకలభూత భ
యావహంబైన శుద్ధోదక సముద్రంబు డాసి తన్మధ్యదేశంబున నౌర్వకోప
సంభూతంబైన తేజంబు హయముఖంబుగాఁ గృతంబై వర్తింపుచుండు నమ్మ
హాతేజంబునకు సంహారవేళయందు సచరాచరంబైన తజ్జలం బింధనంబని చె
ప్పుదురు తత్ప్రదేశంబునం దబ్బడబా ముఖంబుఁ గని తదీయవేదన సహింపంజా
లక యాక్రోశించు జలచర భూతంబుల యాక్రందనంబు వినంబడుచుండు నమ్మ
హోదధి యుత్తర తీరంబునం బదుమూఁడు యోజనంబుల పొడవు నంతియ వె
డల్పును గలిగి జాతరూప శిలనామకంబైన యొక్క కనకపర్వతంబు గల దా
శైల శిఖరాగ్రంబునం బూర్ణచంద్ర ప్రతీకాశుండును సర్వభూత నమస్కృ
తుండును బద్మపత్రవిశాలాక్షుండును నీలాంబరుండును సహస్ర శిరుండును ధర
ణీధరుండునగు ననంతదేవుం డనంత మహిమా విశేషంబున నాసీనుండై యుం
డు నమ్మహానుభావునకుఁ ద్రిశిరంబై సువర్ణమయంబై సవేదికంబై తత్పర్వ
తాగ్ర సంస్థాపితంబై తాలరూప కేతువు విలసిల్లు నది పూర్వదిశావధిత్వంబు
నం ద్రిదశేశ్వరుల చేతఁ గల్పితంబయ్యె దాని విలోకింపుచుం జని యవ్వలఁ బు
ష్కరద్వీపమధ్యభాగంబున నఖండ ప్రభాపటల జటిలంబై యుదయ పర్వతం
బొప్పు గగనంబుతో రాయుచు శతయోజనంబుల పొడవు గలిగి ప్రతప్తకాం
చనమయంబై వేదికాసహితంబై యప్పర్వత శిఖరం బొప్పు జాంబూనదమ
యంబులును సుపుష్పితంబులును రవిసన్నిభంబులును నగు సాలతాల తమాలర
సాల కర్ణికారంబులు తదుపరిభాగంబున నలరారుచుండు నచ్చట యోజన
విస్తారంబును దశయోజనోత్సేధంబును గలిగి జాతరూపమయంబై సౌమన
సంబను వేఱొక్క శిఖరంబు గల దందుఁ దొల్లి దామోదరుండు త్రివిక్రమ
ప్రస్తావంబునందుఁ బూర్వపదంబుఁ బెట్టి రెండవపదంబు పశ్చిమ దిగవధిభూ
తంబైన సావర్ణి నివాసమేరు శిఖరంబునం బెట్టె దివాకరుం డస్తమయా
నంతరంబున జంబూద్వీపంబు నుత్తరంబుఁ బరిక్రమించి మహోచ్ఛ్రయంబైన
తత్సౌమనస శిఖరంబుఁ బ్రాపించి మేరుదక్షిణ భాగవర్తుల కెల్ల భూయి
ష్ఠముం గాఁ గానంబడుచుండు మఱియు నప్పర్వత శిఖరంబునందు వైఖానసు
లును వాలఖిల్యులును సూర్యకిరణంబు లాహారంబుగాఁ గొని సూర్యతేజం

బున దిశలు వెలుంగంజేయుచు తపంబు సేయుచుండుదురు తన్మహాతేజంబు మోలిశోభనంబై సుదర్శనాకారంబై జంబూద్వీపంబు ప్రకాశింపు చుండు సుమేరు శిఖరప్రదక్షిణ దక్షుండగు జగచ్చక్షుండె ద్దానిం బ్రాపించి జంబూద్వీప నివాసులకెల్లం గానంబడుచు సమస్త ప్రాణులకుం గన్నులకు వెలుంగై యుండు నప్పర్వతప్రాంత కాంతార కుంజపుంజ సుందరకందరంబుల వైదేహీసహితంబుగా రావణు నన్వేషింపుఁడు మఱియు నక్కాంచన శైల తేజంబున సూర్య తేజంబున సమావిష్టమై పూర్వసంధ్య రక్తచ్ఛాయం దేజరిల్లు నేకారణంబున నిది పృథివికి భువనంబునకుం బ్రథమద్వారంబుగా బ్రహ్మచేతసృష్ట్యాదియందుఁ గల్పితంబయ్యె మఱియు సూర్యపరిభ్రమణంబునకు మొదల నిది యుదయస్థానంబుగాఁ గల్పితంబయ్యె నక్కారణంబున నిది పూర్వదిక్కనంబరఁగుఁ దత్పర్వతపృష్ఠంబులందు నిర్ఝరంబులయందు గుహలయందు వైదేహీసహితంబుగా రావణునన్వేషింపుఁడు తత్పూర్వభాగంబెల్ల చంద్రసూర్యరహితంబై తిమిరావృతంబై యదృశ్యంబై యింద్రాది దేవావృతంబై యగమ్యంబై యుండు నదితుదిగా నిది మొదలుగా నీసందునంగల కందువలెల్లనరసి సీతారావణులఁ దొప్పెఱింగి యొక్కమాసంబులోనం గ్రమ్మఱ మత్సమీపంబునకుం జనుదెం డంతకురాక మసలితిరేని తీవ్రంబగు మదీయదండంబునకుం బాత్రంబులరగుదురనిపలికి వెండియు మార్తాండనందనుం డిట్లనియె॥(చ) వనచరులారమీరతిజవంబుననాఱొత్తఁగించినట్లుచ। య్యనఁజనిజానకిన్వెదకి యయ్యమఁగన్గొనిరండువేగన। త్యనుపమబుద్ధితోడజన కాత్మజఁగాంచితి నంచుఁబల్కువాఁ।డనిశమురాఘువేంద్రుకృప కర్హుఁడగున్భువనప్రసిద్ధుఁడై॥ (ఆ,వె) మఱియునట్టిమేలు మాటచెప్పినవాని। రాజుఁజేతునర్ధరాజ్యమిచ్చి। యతఁడుపుడమియుండు నంతకాలములోక। పూజ్యుఁడగుచుసిరులఁబొల్చియుండు॥ (చ) అనియినజుండుపల్కెనేద దాజ్ఞశిరంబునఁదాల్చి మ్రొక్కికాం। చనగిరిసన్నిభుండువిల సద్భుజవిక్రమశాలికాలదే। శనయవిదుండుగంధవహసన్నిభవేగుఁడుమేఘువర్ణుఁడు। న్వినతుఁడువోయెఁ దూర్పునకు వీరవలీముఖ సైన్యయుక్తుఁడై॥ (క) వెండియుఁదనమనమునమా। ర్తాండసుతుఁడుయామ్యదిశకునరిగిమహీజ। న్నిండారఁగాంచిమఱలన। ఖండగతిన్వచ్చునట్టి కపులెవ్వారో॥



## సుగ్రీవుఁడు హనుమదాదుల దక్షిణ దిక్కునకుం బొమ్మనుట

(చ) అనితలపోసినీలుఁబవ నాత్మజునంగదునిం గృశానునం। దనునిసుషేణునిన్గజునిఁ దారునిరంభుగవాక్షుగంధమా। దనునిసుహోత్రునర్క గవయు ధాతృకుమారునివిదప్రపుత్రులం। గనుఁగొనిచేరఁబిల్చికొని కంజవనప్రియ పుత్రుఁడిట్లనుర్క॥ (చ) కపికులవర్యులారపతి కార్యధురంధరులారమీరుబ। ల్మిపుణులు దేశకాలనయ నిర్ణయశీలురుగావునంబరే। తపతివసించుదిక్కునకుఁ దద్దయు వేగముతోడఁగొంచుఁ। గపులనుగూడిసీతవెద కంజనుఁడీ రఘుభర్తమెచ్చఁగర్క॥ (వ) తన్మార్గక్రమంబ్జెప్పెదనిన నార్యావర్త దేశ దక్షిణభాగంబును సహస్రశిరంబును నానాద్రుమలతాయుతంబునగు వింధ్యపర్వతంబుఁ జేరి యందు సర్వస్థలంబులు నన్వేషించి తత్పర్వత పశ్చిమ భాగంబున మహోరగ నిషేవితంబులైన నర్మదా భోగవతీ వరదా మేఖలోత్కలా ప్రభృతి నదీనదంబులును దశార్ణ నగరంబులును దక్షిణ భాగంబునఁ గృష్ణవేణీమహానదియును ఋషీక విదర్భ మాహిషిక వంగ కళింగ కౌశిక విషయంబులును బరిశోధించి తత్పూర్వ భాగంబున సపర్వత నదీగుహాంబైన దండకారణ్యంబు నెమకి తదంతర్వర్తి గోదావరీ ఖండంబును విలోకించి యటమీఁద నంధ్రపుండ్రచోళపాండ్య కేరళ దేశంబుల వెదకుచు నయోముఖంబైన సహ్యశైలంబు నెమకి యవ్వల। (చ) సుమిత విచిత్ర కాననము సుందర కందరసాను శృంగయు। క్తము ఘనధాతు మండితము, క్రమపయోజ సముల్ల సత్సరః। కమలవిహారి మత్తకరి, కాండమునై మలయాభిధానశై। లము తనరారునచ్చట నీ, లాతనయం దిలకింపుఁ డింపుగర్క ॥ (ఉ) ఆమహనీయశైల శిఖ, రాగ్రమునందు మనోజగంధభృ। త్కోమలచందనాటవులఁ, దోయరుహాసనసన్నిభుండు ని। ష్కాముఁడు కుంభ సంభవుఁడు, సంత తము న్వసియించియుండు మీ। రాముని దివ్యకోమలపు, ఘాంఘ్రులకుంబ్రణామిల్లియంతటన్ ॥ (వ)సముచితంబుగా నమ్మహాత్మునిచేత ననుజ్ఞాతులై యగ్గిరివరంబు డిగ్గి ॥(ఉ) అమ్మలయాద్రిఁ జుట్టి సము, దంచిత నూతనపుష్పమాలచం। దమ్మున నొప్పుదాని సుర,తాపస సేవితమైన దానిఁగెం। దమ్మికొలంకులం దనరు, దాని సవోదకమైన దానిఁదీ। రమ్ముల వృక్షషండములఁ, గ్రాలెడుదానిఁగ వేరకన్యకన్ ॥ (క)కని తత్తీరవనంబుల। ఘనతరపుళినముల నన్య,కాసాగమునన్ । జనకజను

బంజిక్కించుని। వినుతబలోదారులార, వెదకుఁడు ప్రీతిన్॥ (క) అటఁ జని మ
నోజ్ఞగంధో। త్కటచందనమూలతిల, తావిసరసము। త్కటమైన తామ్రప
ర్ణీ। తటినిం గనియాస్రవంతి, తరియించి వెసన్॥ (ఆ,వె) కాంతయైనయు
వతి, కాంతునింబోలెన। చ్చోటఁ దామ్రపర్ణి, సురుచిరముగఁ। గడలి వీచి
కలను, గౌఁగిటఁగదియించు। నట్టిదేశమెల్ల, నరసికొనుచు॥ (వ) అచ్చోటు
వాసి హేమమయంబును దివ్యంబునుయుక్తంబును ముక్తామణి విభూషితంబు
నగు పాండ్యుల నగరద్వారకవాటంబు నిరీక్షింపుచు నవ్వల సముద్రంబు దరి
సి తత్తీరంబునఁ బున్నాగచందనకేతకీతాలవనంబులు విలోకింపుచుఁదొల్లిమ
హాత్ముండగు నగస్త్యుండు దేవపూజార్థంబు సంగ్రహించిన పుష్పోపహారంబును
వీచికాసందోహంబులచేతవితథంబుఁ జేసిన నయ్యగస్త్యుండు కోపించిసిస్తరం
గుండవు గమ్మని శపించుటయుఁ దచ్ఛాపకారణంబున నాఁటంగోలె సముద్రుం
డు నిస్తరంగుం డయ్యె నచ్చటి దేశంబతరంగాభిధానంబునందనరు నట్టిదేశం
బునసీతనన్వేషించి యటమీఁద॥ (సీ) భవ్యవిచిత్రంబు ప్రత్యంతపర్వత సం
వేష్టితంబు విశాలఫుల్ల। వృక్షలతాగుల్మ విసరశోభితము కిన్నరయక్ష చార
ణగరుడసిద్ధ। సాధ్యదివ్యాప్సరో జనతాపసోరగ దేవగంధర్వ నిషేవితంబు।
నగుమహేంద్రంబను నగమొప్పునదిబలహరునకుఁగ్రీడాద్రి యగుచు వెలయు॥
(తే,గీ) నచటికాదేవవల్లభుం డనుదినంబు। నప్సరోగణపరివృతుండై కడంగి।
వేడ్కఁగ్రీడింపవచ్చుఁ దద్దివ్యపులశిఖర। సానువులసీత వెదకుఁడు, సంభ్రమమున॥
(వ) అమ్మహాపర్వతంబతిక్రమించి యవ్వలదక్షిణసముద్రమధ్యంబున నొక్క
యోజనశాలిక ద్వీపంబుగల దదిశతయోజనాయతంబై యుండు నదిలంకాద్వీపం
బనంబరఁగు మఱియునాద్వీపంబు మనుష్యులకగమ్యంబై యుండు నాదేశంబు
దురాత్ముండును వధ్యుండును సహస్రాక్షసమద్యుతియు రాక్షసేశ్వరుండు నగు
రావణునకు నివాసంబై యుండుఁ గావున మీరువిశేషించి బహు ప్రయత్నంబున
నచ్చటజానకి నన్వేషింపం దగు మఱియు దక్షిణ సముద్రమధ్యంబున నంగార
క యనునొక్కరాక్షసి జలంబులోనుండి నభంబునంజనువారికాయచ్ఛాయనొ
డిసిపట్టివారిందిగిచికొని భ్రమింగుచుండునారాక్షసికిం జిక్కక యవ్వలం జని లం
కాద్వీపంబునం గలసర్వస్థలంబులు పరిశోధించి సంశయంబులనెల్ల నిస్సం
శయంబులం జేసి నష్టసంశయులై నజేంద్రపత్ని నన్వేషించి లంకాద్వీపంబున



తిక్రమించి యవ్వల శతయోజనంబుల దవ్వుల సముద్రమధ్యంబునఁ బుష్పితక
నామకంబైన యొక్కపర్వతంబుగలదదిసిద్ధచారణసేవితంబై చంద్రసూర్యాం
శుసకాశంబై సాగరాంబుసమావృతంబై గగనచుంబి శిరస్సహస్రకలితంబై
యొప్పునన్నగంబున నొక్కహేమశిఖరంబున సూర్యుండును వేఱొక్కరజతశి
ఖరంబునఁ జంద్రుండునుం ప్రకాశింపుచుండుదురు కృతఘ్నులకు నృశంసుల
కు నాస్తికులకన్నగంబగోచరంబై యుండునగ్గిరికి నమస్కరించి యందుజాన
కినన్వేషించి యచ్చోటువాసి॥ (సీ) సురవరులకునైనఁ జొరరానిక్రోవల న
రిగియవ్వలఁబొండనలవిగాని। దానినొప్పుగఁజతుర్దశయోజనాయతంబగుదాని
సూర్య పదాఖ్యమైన। ధరణీధరముఁగాంచి దానిమెల్లనదాఁటి వైద్యుతంబను
గిరివరముఁజేరి। యందెప్పుడునుమనోహరములై బహుకామఫలవృక్షములుచాల
నలరుచుండు॥ (తే,గీ) నచటిమధువులువెసఁగ్రోలి యమృతకల్ప। మూలఫ
లములు భుజయించి ముదముఁతోడఁ। దద్గుహాసానువులఁ గొంతదడవువిశ్ర।
మించియప్పర్వతమతిక్రమించి యవల॥ (వ) కొండొకదూరంబున శక్రధ్వజా
కారంబై కుంజరపర్వతంబుగల దక్కొండచూపరుల కతివిస్మయకరంబైయుం
డు నందువిశ్వకర్మనిర్మితంబైన యగస్త్యభవనంబు విలసిల్లునది మఱియు
యోజనవిస్తారంబును దశయోజనోచ్ఛ్రితంబును గాంచనమయంబును నానా
రత్నవిభూషితంబును దివ్యంబై శోభిల్లుమఱియు నందు విశాలకక్ష్యంబును దు
ర్ధర్షంబును మహావిషఘోర పన్నగసురక్షితంబునురమ్యంబును భోగవతీనా
మకంబైన సర్పాలయంబున్నది యందుమ్మహాఘోరుండునుదీక్ష్ణదంష్ట్రుండును
సహస్రశిరుండునగు వాసుకియను సర్పరాజు నివసించియుండు నప్పట్టణంబు
న సర్వస్థలంబులవై దేహినన్వేషించి యాపురినతిక్రమించి యవ్వలవిచిత్రంబు
లగు పర్వతారణ్యంబులు విలోకింపుచుంజనియవ్వలరత్నమయంబును శ్రీమం
తంబును దేవగంధర్వనిషేవితంబును వృషభాకారసంస్థితంబునగు వృషభనా
మపర్వతంబు గలదందు గోరోచనాసదృశవర్ణంబు బద్మదళసమానవర్ణం
బును గుంకుమతుల్యవర్ణంబును దమాలపత్రనిభవర్ణంబును వహ్నిసంకా
శవర్ణంబును దివ్యంబునగు చందనవనంబుశోభిల్లునది యెవ్వరికిం దేఱిచూడ
నలవిగాకయుండు రోహితనామకులైన గంధర్వులునిత్యంబు నవ్వనంబురక్షిం
పుచుందురు మఱియు శైలూష గ్రామణీ శిగ్రు శుభ్ర బభ్రులనంగా నేవురు

గంధర్వపతులు రవిసోమాగ్నిసమప్రభులై నిత్యంబునుం గ్రీడింపుచుండుదురు పు
ణ్యకర్ములగువారి కదినివాసంబై యుండు మఱియుం బృథివికవధియై యుండు
నవ్వలను దారుణంబైన పితృలోకంబును గష్టతమశ్ఛన్నయైన వైవస్వతుని రాజ
ధానియు శోభిల్లుం గావున నచ్చోటు మీకు దుష్ప్రవేశంబై యుండు నాచెప్పిన స
ర్వస్థలంబులను నాచెప్పినచోట్లను జానకి నన్వేషించి శీఘ్రంబున జనుదెండెప్పం
డుమాసంబులోన సీతం జూచివచ్చితిననిపలుకునతండు మత్తుల్యవిభవుండై భో
గంబులనుభవింపుచు సుఖియై విహరింపంగలండతనికంటె నన్యుండు నాకుం బ్రి
యుండుం లేఁడతండు ప్రాణంబులకంటె గరీయుండై యుండు నతండెంత యపరా
ధంబు చేసిన వధ్యుండుగాక యుండు మీరు బలపరాక్రమయుతులును గులశీలంబు
లం బ్రసిద్ధికెక్కిన వారుగావున నేయుపాయంబునైన సీతను గనుంగొని కృతా
ర్థులై నన్నుం గృతార్థుం జేసి పురుషార్థంబు దక్కించుకొనుండు ॥ (క) అ
నిహనుమదంగదాదిక । వనచరవీరులను వేగ వైవస్వతుది । క్కునకుం జానకి
(*)సుగ్రీవుఁడు సుషేణమారీచులఁ బశ్చిమ దిక్కునకుం బోవ నియమించుట.(*)
వెదకంగ । జనుఁడని నియమించి తపనసంభవుఁడంతన్ ॥ (ఆ,వె) తారతండ్రి
ఘనునిఁ దనమామ భీమవి । క్రముని మేఘనిభుని విమలయశుని । వీరు నింద్రతే
జు వినతాసుతసమాన । శీఘ్రవేగునల సుషేణుఁ గాంచి ॥ (వ) నమస్కరించి
పదంపడి మహేంద్రతుల్య విక్రముండు నచింత్యమంతుం డును ఘోర వా
నర పరివృతుండును మహాబలుండు నగు మరీచి పుత్రుండైన మారీ
చుండును వానినవలోకించి మీరిర్వురు మహాబలురైన మరీచిపుత్రులగు మారీ
చుల రెండు లక్షలం బ్లవంగ వీరులం గూడి యార్యావర్త దేశంబు మొదలు
కొని పశ్చిమ దిగ్భాగంబునకుం జని సురాష్ట్రబాహ్లీక శూరసేన దేశంబులు వె
దకి తత్తద్విషయసంస్థితంబులైన నానావిధ పట్టణంబులునుం బరిశోధించి వకు
ళోద్దాలకాకులంబును బున్నాగ గహనంబునగు కుక్షియను దేశవిశేషంబు ప
రీక్షించి యచ్చటం గేతకీషండంబుల నారికేళవనంబులం దిలకించి మఱియుం బ
శ్చిమ వాహినులగు శీతసలిల పూర్ణనదీనదంబులం దాపసారణ్యంబులం గాం
తార దుర్గంబుల గిరిసానుకందరంబుల జానకి నన్వేషించి సింధు సౌవీరత్రి
గర్తవిషయంబులు శోధించి యచ్చట మరుప్రాయంబులగు స్థలంబు లన్నియు వీ
క్షించి యవ్వలం దిమినక్ర ఝషాకులంబైన పశ్చిమ సముద్రంబుం జేరి యచ్చ



ట గేతకీషండంబులం దమాలగహనంబుల నారికేళ విపినంబుల మఱియు వేలాంత
టనివిష్టంబులగు పర్వతకాననంబుల వైదేహి నన్వేషించి పశ్చిమ సముద్రమధ్యం
బున మురచీ పట్టణంబును జటీపురంబు నవంతియు మొదలుగా గల విశాలం
బులగు పట్టణంబులును రాష్ట్రంబులును లక్షితంబులై నవనంబులును సింధుసాగర
సంగమంబును నిరీక్షింపుచు నాసింధు సాగరసంగమప్రదేశంబున నూఱు శిరంబు
లుగలిగి మహోన్నత తరువ్రాతంబుల కాకరంబై మహోన్నతంబై యొక్క
హేమగిరి యొప్పు రమ్యంబులైన తత్పర్వత ప్రస్థంబులందు సపక్షంబులగు
సింహంబులు తిమిమత్స్యగజంబుల స్వనివాస స్థానభూత వృక్షాగ్ర కులాయం
బులకుం దోడ్కొనిచని కలసిమెలసి విహరింపుచుండు విశాలంబగు తోయ
పూర్ణస్థలంబునందున్న గజంబులు గిరిశృంగగతంబులగు గజంబులును సింహ
నీడాశ్రయసానువులయందు విహరింపుచుండు నప్పర్వత శృంగంబు గగనంబు
తోరాయుచుం జిత్రపాదపంబై కాంచనమయంబై యొప్పునందుం గామరూపులై
సీతనన్వేషించి యవ్వల సముద్రమధ్యంబున శతయోజన ప్రమాణంబు గలిగి సు
వర్ణచ్ఛాయలం దేజరిల్లుచు నెవ్వరికిం జొరరాక పారియాత్రపర్వతకూటకోటి విల
సిల్లునందు బలవంతులును ఘోరాకారులును గామరూపులును వహ్నిసంకాశు
లునగు చతుర్వింశతికోటి గంధర్వులు తదీయదివ్యామృతకల్ప స్వాదుమూల
ఫలంబులం గాచికొనియుండుదురు వారందఱు దురావారులును దుష్ప్రసహు
లును దురాసదులునై యుందురవ్వనంబులోనుండి యొక్క ఫలంబైనం దెచ్చుట
కు మీకు శక్యంబుగాదు వారిచెంతం జేరక నచ్చోట సీత నతిప్రయత్నంబున న
న్వేషింపుఁడు వారివలని భయంబు మిమ్ముం జెందకుండు మఱియు నాపశ్చిమస
ముద్రమధ్యంబున వైడూర్య వర్ణసంకాశంబై వజ్రసంస్థానసంస్థితంబై నానా
ద్రుమలతాకీర్ణంబై శ్రీమంతంబై శతయోజనప్రమాణంబై వజ్రంబను పర్వ
తంబొక్కటి చంద్రమండలసంకాశంబై యొప్పుం దద్గుహాగహన దేశంబుల నప్రమ
త్తులై యతిప్రయత్నంబున జానకి నన్వేషించి యటమీఁద ॥ (క) హరిచందన కల్పత
రూ । త్కరశోభితరత్నసాను, కటకశిఖరమై । శరనిధి నాలవపాలై । వఱలు
నొకనగంబు చక్రవంతంబనఁగన్ ॥ (క) అటఘోరవహ్నికీలా । చటులమగు స
హస్రకోటి, చక్రము రక్షో । భటనాశ నార్థమును సము । త్కటముగమును వి
శ్వకర్మ, గావించె రహిన్ ॥ (క) దానిం గొని పంచజనుఁడను । దానవు హయము

ఖుచించంపి, తత్కుక్షిగతం । బైనఘనపాంచజన్యము । మానుగవిష్ణుండుగొని
యె, మహిమకలర్పన్॥ (క) ఆనగకందరములనా । నానిర్ఝర రత్నసాను, స
ళినీకటకో । ద్యానంబులవై దేహిని । దానవునిలయంబు వెదకఁ, దగుమీక చ
టన్॥ (వ) మఱియు నగాధంబగు వరుణాలయంబునందు సువర్ణశిఖరంబై చ
తుష్షష్టియోజనంబులతనర్పుగలిగి వరాహనామకంబైన పర్వతంబుగలదందు
జాతరూపమయంబై ప్రాగ్జ్యోతిషంబనుపురంబు శోభిల్లునందు దుష్టాత్ముండ
గు నరకుండను రాక్షసుండు నివసించియుండు నచ్చటివిచిత్రసానువులును వి
శాలకందరంబులును బరిశోధించి యప్పర్వతంబు గడచి యవ్వలఁ గాంచనాం
తరనిర్ఝరంబును నానాప్రస్రవణయుతంబును సర్వసౌవర్ణంబును సహస్రధా
రాపరివృత శిఖరంబును నభ్రంకషంబునునై మేఘవంతంబను పర్వతంబు గల
దందు గజవరాహసింహవ్యాఘ్రంబులు స్వకీయనాదోత్పన్నప్రతిధ్వని చేత దర్పి
తంబులై యప్పర్వత కందరంబులయందు గర్జింపుచుండు మఱియుశుకపిక శా
రికామయూరసంఘంబులు శ్రవణసుఖంబుగా మధురధ్వనులు సేయుచుండు న
న్నగో పరిభాగంబునఁ దొల్లి పాకశాసనుండగు మహేంద్రుండు సురగణంబుల
చేతనభిషిక్తుండయ్యె నట్టిశైలంబుదాఁటి యవ్వలఁదరుణాదిత్య వర్ణంబులునుభ్రా
జమానంబులును జాతరూపమయ తరులతా శోభితంబులును గాంచన మయం
బులునగు యఱువదివేలకొండలు విలసిల్లు నప్పర్వతంబుల నడుమ సర్వ పర్వ
తోత్తమంబైన మేరుపర్వతంబుశోభిల్లునది ప్రసన్నుండగు దివాకరుని వరప్ర
సాదమహిమం జేసి సన్నిహితసమస్తవస్తువులనెల్ల నిజవర్ణ దీప్తులచేత దివా
రాత్రంబును సువర్ణమయంబులుగాఁ జేయుచుండు నగ్గిరియందు వసియించు
దేవగంధర్వదానవులు తత్ప్రభామహిమం జేసి నిత్యంబును గాంచనప్రభులైవె
లుంగుచుండుదురు దేవతలును విశ్వదేవులును వసువులునుమరుత్తులును బశ్చి
మసంధ్యోపాసనాపేక్షులై శైలోత్తమంబైన మేరువుం బ్రాపించి వర్తమా
నుండగు సూర్యునింబూజింపుచుండుదురు వారిచేత సూర్యుండు పూజితుండై
ముహూర్తార్థంబునకు ద్విశతసహస్రయోజనంబులప్పర్వతం బతిక్రమించి
యాదిత్యుండు సర్వభూతంబుల కదృశ్యుండై యస్తమించు నప్పర్వతశిఖరంబు
నందు సూర్యసంకాశంబై మహోన్నతంబై ప్రాసాదగణసంబాధంబై నానాప
క్షిసమాకులవిచిత్రతరు శోభితంబై విశ్వకర్మనిర్మితంబై వరుణుని దివ్యభ



వనంబుశోభిల్లు నమ్మేరుశైలాస్తశైలంబుల నడుమ విచిత్రవేదికంబై సువర్ణ
మయంబై దశశిరంబై యొక్కతాలంబుశోభిల్లు నచ్చటి సమస్త దుర్గంబుల
యందు నదులయందు సరస్సులయందు వైదేహీసహితంబుగా రావణు నన్వే
షింపందగు నయ్యస్తగిరిసమీపంబున సావర్ణిమేరువను నొక్కపర్వతంబుగల
దక్కొండమీఁద విశ్వకర్మనిర్మితంబైన యొక్క కాంచనమందిరం బున్నది
యందు ధర్మజ్ఞుండును దపస్సంభావితుండును ద్రిలోకవిఖ్యాతుండును బ్రహ్మ
సముండును సూర్యసన్నిభుండును మహర్షిశ్రేష్ఠుండునగు మేరుసావర్ణి తేజ
రిల్లుచుండు నమ్మహాత్మునిసందర్శించి తచ్చరణంబులకుం బ్రణమిల్లి సీతా వృ
త్తాంతంబడిగి యప్పురంబునంగల సర్వస్థలంబుల సీతనన్వేషింపుఁడు భాస్క
రుండు రజనీక్షయంబునం దుదయాస్తమయాద్రి మధ్యగతంబైనజీవలోకంబు
ను సర్వంబును దిమిరహీనంబుగాఁజేసి యప్పర్వతంబున నస్తమించు నప్పర్వ
తంబుదనుక నరుగుటకు మీకుశక్యంబైయుండు నవ్వల నభాస్కరం బమర్యా
దంబుగావున మీకగమ్యంబైయుండు నయ్యస్తాద్రిపర్యంతంబరిగి నాచెప్పినసర్వ
స్థలంబుల జానకినన్వేషించి యొక్కమాసంబులోనఁ గ్రమ్మఱ మత్సమీపంబు
నకుఁ జనుదెండనిపలికి సుగ్రీవుండు వెండియు వనచరుల నవలోకించి యిట్లని
యె॥ (క) భూసుతనువెదకియెవ్వఁడు । మాసములోపలనురాక మసలునతఁడు
మ । ద్భాసురదండమునకనా । యాసంబుగఁజాలఁబాత్ర మగునిక్కముగన్॥
(క) మీకున్బ్రాసటయైయ । స్తోక పరాక్రమ ధనుండు శూరుం డతిఘో । రా
కారుఁ డీసుషేణుఁడు । వీకం జనుదెంచునధిక వేగోద్ధతుఁడై॥ (ఆ, వె) ఇ
తఁడు నాకుగురుఁడు హితుఁడు మామయుఁగాన । నిమ్మహాత్ముతోడ నెల్లపను
లు । దడయ కప్పగించి తద్వశ వర్తులై । యపరదేశమెల్ల నరసిరండు॥
(చ) ఘనమతినెవ్వఁడుర్విజను గన్గొని క్రక్కుననచ్చిరామభ । ద్రునివెతమా
న్పి మమ్ముఁగడు, రూఢిఁగృతార్థులఁగా నొనర్చునన । వ్వనచరవంశవర్యున
కుఁబంచిసగంబగురాజ్య మిత్తున । త్యనుపమభోగభాగ్య యుతుఁడై సుఖియిం
చు నహర్నిశంబులున్ ॥ (ఆ, వె) వినుతబలము కులము వేగంబు తేజంబు ।
బాహువిక్రమంబు, పరహితంబు । కొఱకుఁగాదె ధాత్రి, గుణవంతుఁడగువాని ।
కవి విహీనమైన, నవియుమేల ॥ (క) అనిపలికి వీడుకొల్పిన । వినుతబలోదా
రులమిత, వీర్యులుత్రిజగ । ద్వినుతులగు సుషేణాదులు । చనిరివరుణుఁ డేలుదిశ

కు,జవయుతులగుచుఁ ॥ (వ) ఇత్తెఱంగున ॥ (క) ఇనజుఁడు సుషేణుఁ బడ

(*) సుగ్రీవుఁడు శతవలి నుత్తరదిక్కునకనుచుట. (*)

మటి । కని చివలీముఖకులాధ్యుఁ,డైన శతబలిం । గనుఁగొని యిట్లనిపలికెను ।ద నకుఁ బ్రాముననుఁగడుహి,తంబగునటులన్ ॥ (చ) వనచరవీర నీవు బల,వంతు ల లక్షవనాటవీరులం । గొని సచివాన్వితుండవయి,కోరి హిమాద్రివతంసమై న యా । ధనదునిదిక్తటంబున కు,దగ్రతనేగి సమాహితుండవై । జనకకుమా రినందు వరు,సం బరికింపుము నేర్పు మీఱఁగన్ ॥ (ఆ,వె) పుణ్యసాధ్వియైన భూమికుమారిక । నెటులనైన వెదకి,యెచటనైనఁ । జూచివచ్చివిభుని,శోకంబు మాన్పుట । తలఁపఁ బుట్టువునకు, ఫలము గాదె ॥ (క) సీతను వెదకుట పిదప న । రాత్రిని సమరమునఁ జంపి, రామవిభునకుం । బ్రీతి సమర్పించుటవి । ఖ్యాతి గనివి మనకవశ్య,కర్తవ్యంబుల్ ॥ (క) తగవు మెఱయ నీకార్యము । నగచ రవర సాఫల్యం బొ,నర్చితి వేని । న్జగతి ఋణవిముక్తులమై । యగణిత సౌభా గ్యగరిమ,లం బెదము రహిన్ ॥ (క) ఇనకులవర్యుఁడు రాముఁడు । మన కుప కారంబు చేసె,మానుగ మఱియు । న్మనమతనికిఁ బ్రతికారం । బొనరింపక యు న్న సుకృత, మొదవునె చెపుమా ॥ (క) ఉపకారశీలునకుఁ బ్ర । త్యుపకారముఁ బ్రీతితోడ,నొనరించిన యా । విపులయశోనిధిమిక్కిలి । విపులం గృతకృత్యుఁ డగుచు,వినుతికినెక్కున్ ॥ (క) కావుననాకుఁ బ్రియంబుగ । నీవా ధనదాశ కేగిఁ నేర్పలరంగా । నేవిధముననైననురఘు । భూవరుసతి వెదకి రమ్ము,పొమ్ముక పీంద్రా ॥ (క) ఈనరనాథశిరోమణి । మానుగ లోకముల కెల్ల, మాన్యుండ స్మ, న్మానితపుణ్యా ఫలంబునఁ । దానిచ్చట దొరికె భూమి,ధరచర వర్యా ॥ (క) ఈవిపినదుర్గముల నా । నావాహినులం దటాక, నళినీనగర । గ్రావస ముద్రములందును । వేవేగ మహీకుమారి, వెదకుఁడు ప్రీతిన్ ॥ (వ) తన్మార్గ కమం బెట్టిదనిన నార్యావర్త దేశంబు మొదలుగ నుదగ్దిశకుం జని మ్లేచ్ఛపు ళిందశూరసేన విషయంబులు నింద్రప్రస్థహస్తిపుర మద్రదేశంబులును గురుత్తే త్రజనపదంబులును గాంభోజయవనశకారట్టక చీనపరమచీన బాహ్లీక ఋషిక పౌ రవటంకణాది దేశంబులును సారసారకు నిరీక్షింపుచుం దత్తద్దేశసంస్థితపురీదు ర్గసరిత్సరోవరగిరిబిల వనస్థలంబులునుం గలయ వెదకుచు హిమవంతంబుఁ జేరియందులోధ్రపద్మకషండంబుల దేవదారువనంబుల వైదేహినన్వేషించియ



టమీఁదసోమాశ్రమంబు జేరియందు జానకిం దిలకించి యవ్వలసానుమంతంబైన కాళంబను శైలంబుఁ బ్రవేశించి యచ్చటిదరీఝరీగుహాగహనంబుల మహాభాగయగు రామపత్ని నన్వేషించి యప్పర్వతంబుఁ గడచి యటమీఁద సుదర్శననామకంబైన పర్వతంబుఁ జేరి దాని నతిక్రమించి యవ్వల నానాపక్షిగణాకీర్ణంబును వివిధద్రుమభూషితంబును బతగాలయంబునగు దేవసఖంబను పర్వతంబున కేగి యచ్చటనిర్ఝరంబుల గుహామధ్యంబులవైదేహీసహితంబుగా రావణున న్వేషించి దాని నతిక్రమించి యటమీఁదఁ బర్వతనదీవృక్షహీనంబును సర్వసత్త్వ వివర్జితంబు నగు శూన్యారణ్యస్థలంబు శత యోజనాయతంబై యుండు నచ్చటం దడయక శీఘ్రంబున దాఁటి యవ్వల ॥ (క) భాసుర పాండుర శిఖరో । ల్లాసము సురసిద్ధ సాధ్య. రక్షోగణ సం । వాసము సువికాసము కై । లాసము శివపార్వతీ వి,లాసం బలరున్ ॥ (తే, గీ) అందుఁ బాండరమేఘాభ, మభ్రచుంబి । శృంగయుతము సువర్ణప. రిష్కృతంబు । శర్మదము విశ్వకర్మవినిర్మితంబు । నగు కుబేరుని మణినిల,యంబు దనరు ॥ (ఆ,వె) అచటఁ గ్రౌంచచక్ర, హంసకారండవా । కీర్ణయును సువర్ణ.వర్ణపద్మ । కుముదయును సుపర్వ, రమణీయుతయు నైన । నళినియొప్పు స్వాదు,సలిలయగుచు ॥ (క) ఆదివ్యభవనరాజం । బాదిత్యులు కిన్నరులును యక్షులు సిద్ధుల్ । మోదంబున సేవింపఁగ । శ్రీదుఁడు పాలింపుచుండుఁ,జిరశుభలీలన్ ॥ (క) ఆశైలంబున శశినీ । కాశములగు మందిరముల, ఘనగుహలవనో । ద్దేశంబుల గిరిబిలముల । దాశరథి ప్రియను వెదకఁ, దగుమీకు రహిన్ ॥ (వ) అటమీఁద గ్రౌంచపర్వతంబునకుం జని యందు దుష్ప్రవేశంబై సుదుర్గమంబై కుమారశక్తికృతబిలంబు విలసిల్లు నది యెవ్వరికిం జొరుట కశక్యంబై యుండు నప్రమత్తులై యమ్మహాబిలంబు ప్రవేశించి యచ్చట సూర్యసంకాశులును దేవరూపులును మహాత్ములునగు మహర్షులు దేవతలచేతం బూజితులై యొప్పుచుండుదురు వారి సందర్శించి నమస్కరించి క్రౌంచపర్వత గుహాగహనసానుశిఖరనిర్దరనితంబంబులయందు జానకి నన్వేషింపుఁడవ్వృక్షాఖ్యంబైన తదీయప్రధానశృంగంబును మానసాఖ్యంబును గామశైలాఖ్యంబునునగు తత్ప్రత్యంతపర్వతంబులును శోభిల్లునవి దేవదానవరక్షోయక్షగుహ్యకాదులకైన నగమ్యంబులై యుండు నచ్చటి సర్వస్థలంబులు శోధించి యప్పర్వతంబతిక్రమిం

చి యవ్వల మైనాకపర్వతంబునకుం జనియందు ॥ (తే. గీ.) పలువురుతపఃప్రభావసంపన్నులనఘు।లుత్తములు తాపసశ్రేష్ఠు,లున్నవారు।వినయమున వారిఁ జేరి భూతనయవార్త । నడిగి యామంత్రణము గొని, యంత మీఁద ॥ (వ) హేమపుష్కరసంఛన్నంబును దరుణాదిత్యసంకాశ హంసకారండవ సారసచరితంబు నగు వైఖానసంబను కమలాకరంబు గల దందుఁ గుబేరున కౌపవాహ్యంబైన సార్వభౌమంబను దిగ్గజంబు కరేణుసంఘంబులతోఁ గూడి నిత్యంబునుం గ్రీడించుచుండు నచ్చట శోధించి దాని నతిక్రమించి యవ్వల నష్టచంద్రదివాకరంబును నక్షత్రగ్రహశూన్యంబును బయోధరవిహీనంబు నగు వ్యోమంబ నాదికాలంబునందుం బోలె సర్వశూన్యంబై నిజతేజోజాలంబున సూర్యప్రభలచేతం బోలె వెలుంగం జేయుచు నతిశాంత దేవకల్ప స్వయంప్రభ తపస్సిద్ధమహర్షి సేవితంబై యొప్పుచుండు నాదేశం బతిక్రమించి యవ్వల శిలావతియను నది గలదు తత్తీరంబునఁ గీచకంబులును వేణువులు గల వొండొంటిం బెనచుకొనియుండు నవ్వేణువు లాధారంబుగా నమ్మహానది నుత్తరించి యుత్తరతీరంబుఁ జేరి కృతపుణ్యప్రతిశ్రయంబులగు నుత్తరకురుదేశంబులు ప్రవేశింపుడందుఁ గాంచనమయపద్మపద్మినీకృతోదకలును నీలవైడూర్యపత్రాఢ్యలునగు నదులు గలవు మఱియు హిరణ్మయరక్తోత్పలవనమండితంబులును దరుణాదిత్యసంకాశ రక్తాంభోజరాజితంబులును గాంచనమయకింజల్కపుంజరంజిత మహార్హమణిపత్రచిత్ర నీలోత్పలవనసేవితంబులును జాతరూపమయసైకత విభ్రాజితంబులును నిజాంతర్గుప్త నిస్తుల ముక్తామణిపూర్ణ శుక్తిసంపుట సమలంకృతంబులును గు రమణీయకమలాకరంబులు గలిగియుండు మఱియు సర్వరత్నమయ విచిత్రంబులును జాతరూపమయంబులును హుతాశనసమప్రభంబులు నగు పర్వతంబులు గ్లుచుండు నందు నిత్యపుష్పఫలోపేతంబులును సువర్ణపత్ర విహంగశోభితంబులును దివ్య గంధ రస స్పర్శంబులును సర్వకామ ఫల ప్రదంబులు నగు వృక్షంబులు విలసిల్లుచుండు నచ్చటి భూమి నిస్తృణకంటకయుఁ బాండువర్ణయు సదమలయు విగత బాధయు నారోగ్యవతియు శాద్వలవతియు సర్వకామప్రదఫల వృక్ష శోభితయుఁ జారు చామీకర మణిమండితయు సువర్ణ మణిగణ విరాజితయునై యలరు మఱియు బ్రహ్మనిర్మితకల్పవృక్షంబులు శోభిల్లుచుండు నందుఁ గొన్ని కుజంబులు నానావర్ణ మృదులాంబరంబులను గొన్ని తరువులు నారీ పురుషుల కనురూపంబులైన ముక్తా వైడూర్య విచిత్ర భూషణంబులను గొన్ని పాదపంబులు సర్వర్తు సుఖ సేవలను గొన్ని నగంబులు చిత్రాస్తరణవంతంబులైన మహార్హ విచిత్ర హైమాయతశయనీయంబులను గొన్ని వృక్షంబులు మనఃకాంతంబులగు మాల్యంబులను గొన్ని ద్రుమంబులు మహార్హ వివిధపానభక్ష్యంబులను గొన్ని భూరుహంబులు రూపయౌవన గుణసంపన్నలగు యువతులును నిత్యంబును గురియుచుండు గంధర్వకిన్నర సిద్ధవిద్యాధరులు నిజసుందరీయుక్తులై క్రీడింపుచుండుదు రందున్న నరందఱును సుకృతకర్ములును రతిపరాయణులును ధర్మకామార్థసహితులునై యాత్మీయకాంతలం గూడి జ్వలద్భాస్కర తేజంబున వెలుంగుచుండుదురు. గీతవాదిత్రశబ్దంబును బరస్పరహాసితస్వనంబును సర్వభూత మనోహరంబై సరితతంబును వీతెంచుచుండు నందు సంతోషరహితులు నసత్ప్రియులు లేరచ్చట నహరహంబును మనోహరంబులై గుణంబులు వృద్ధినొందుచుండు నాదేశంబులయందు సర్వస్థలంబుల సీత నన్వేషింపుచు నవ్వలం జని యగాధంబగు నుత్తరలవణసముద్రంబు దరిసి తన్మధ్యదేశంబున హేమమయవిచిత్ర గుహానునిర్ఝరశోభితంబైన సోమశైలం బొప్పునది గగనచుంబి శిరస్సహస్రకంబై యుండు నింద్రలోకంబునకుం జనువారలు బ్రహ్మలోకంబున కరుగువారలు దేవర్షిగణంబు లాగిరి నవలోకింపుచుం బోవుచుండుదురు తత్సమీపదేశంబు విగతసూర్యకిరణంబయ్యును నగ్గిరిప్రభ చేత వెలుంగుచుండు నాసోమగిరిప్రభ సంకీర్ణించి సూర్యుండు సూక్ష్మదర్శనులకు భానుతేజోమయుండై కానంబడుచుండు నందు భగవంతుండగు విష్ణుండు నేకాదశాత్మకుండైన రుద్రుండును దేవేశుండగు బ్రహ్మయు బ్రహ్మర్షిపరివృతులై నివసించి యుండుదు రయ్యద్రిగుహాగహన సానునిర్ఝరకటక గంధర్వభవనంబుల సీత నన్వేషించి యట మీఁద రవికిరణసంచారంబు లేమింజేసి మూఢునిహృదయంబు కరణిఁ దమశ్ఛన్నంబై యజ్ఞాతమర్యాదంబై యుండుఁ గావున నవ్వలం బోక సోమాద్రినుండి క్రమ్మఱం జనుదెండు॥ (క) నాయెఱిఁగించినచోటుల । మీ యెఱిఁగినచోటులందు మెయికొని ఖిలవిధో । పాయములసీత నారసి । పాయక నెలలోన రండు ప్లవగప్రవరుల్ ॥ (చ) ఘనముగ జానకిన్ వెదకి కాంచి రయంబున వచ్చి నాకుఁ దా । మునకుఁ బ్రియంబొనర్చిన కడు మోదమునన్ నుత గేహినీసుహృ । జ్జనయుతులై ప్రశాంతరిపు సం

తతులై భువనప్రసిద్ధులై। యనిశముభోగభాగ్యమహిమా ప్తిసుఖింపుచునుండుఁ డెంతయున్॥ (క) అనిపలికినశతవలిరవి। తనయునకును రాఘవునకుఁ దద్దయు భక్తి। న్వినతియొసరించిగ్రక్కున। ధనదుని పెసకరిగెఁగపివితానముగొలువన్॥ (వ) ఇత్తెఱంగున నత్తపననందనుండు రామకార్యార్థసిద్ధికొఱకు బలవంతులైన వానరశ్రేష్ఠుల నాల్గుదిక్కులకుం బొమ్మని నియమించి మరున్నందనుండగు హనుమంతునందుఁ గార్యసాధకత్వంబు నిరూపించి యమ్మహాత్మునవలోకించి

—*సుగ్రీవుఁడు హనుమంతునియందుఁ గార్యసాధనము నిరూపించుట*—

ప్రీతిసంహృష్టసర్వాంగుండై యిట్లనియె॥ (క) తగవునుధర్మము నెఱయఁగ। జగతీనాయకునిపనులు సాధించినను। దగుభంగినిలిపినీకు। న్నగములచేఁబొగడువడయుసమయమువచ్చెన్॥ (తే,గీ) అనిల నందన ధరణియం దంతరిక్ష। మందునంబరమందుసురాలయంబు। నందు సలిలంబునందు నీవరిగివెదక। దక్షుఁడవుసర్వకార్యవిచక్షణుఁడవు॥ (క) సురగరుడయక్షకిన్నర। నరవసుగంధర్వసిద్ధనగసాగరసం। భరితమగుజగత్త్రియమును। హరిశేఖరనీకువిదితమైయుండుగదా॥ (క) సువిహితతేజోబలగతి। జవవీర్యములందునీకుసాటియొనర్పం। బవమానుఁడొక్కరుఁడెగా। కవనిన్వెఱొకఁడుగలఁడెయగచరవర్యా॥ (ఉ) సాహసముం బరాక్రమము శక్తియుయుక్తియుసద్వివేకము। త్సాహము దేశకాలవిహితక్రమమున్వినయంబునీతియుం। బ్బాహుబలంబునీకెతగు మైథిలినేగతినైనఁజూచిర। మ్మోహనుమంతనీవుమది నుంచినకార్యముగాకపోవునే॥ (వ) అని సుగ్రీవుండుపలికిన యనంతరంబ రాఘవుం డాసుగ్రీవుని వచనంబువలన హనుమంతునియందు సుగ్రీవునిచేతఁ గార్యభారంబు నివేశితంబయ్యెనని యెఱింగి తానును హనుమంతునిఁ గార్యసాధకునిఁగా నిరూపించి యీవానరవల్లభుండు మారుతియందు సర్వప్రకారంబుల నిశ్చితార్థుండయ్యె నాకుంజూడనితండు కార్యసాధనంబునందు నిశ్చితార్థకరుండని తోఁచుచున్నవాఁడు భర్తచేతఁ బరిగృహీతుండై కర్మంబులచేతఁ బరిజ్ఞాతుండైయొప్పు నితనికిఁ గార్యఫలోదయంబు ధ్రువంబగుననివిచారించి వ్యవసాయోత్తరుండైన యీహనుమంతు

—(*)రాముఁడు తనయంగుళీయకమును హనుమంతునిచేతికిచ్చుట.(*)—

నవలోకించి ప్రహృష్టేంద్రియమానసుండై తన్నుఁగృతార్థునింగాఁ దలంచుకొని యఖండసంధ్యారాగమండలాంతర్గతమార్తాండమండలంబుంబోలె



ననర్ఘమణిప్రభాపటల జటిలంబైన స్వనామాంకోపశోభిత రమణీయాంగుళీయకం బభిజ్ఞానార్థం బాహనుమంతునకుంజూపి యిది మన్నామాంకితమైనరత్నముద్రిక దీనింగని జనకనందని మత్సమీపంబుననుండి చనుదెంచినవానిఁగాని న్నెఱింగి నిరుద్వేగయై వివిధసత్కారంబుల నిన్నుసంప్రీతుంజేయు భవదీయవ్యవసాయంబును దేజంబును బరాక్రమంబునుబలంబును సుగ్రీవుసందేశంబును గార్యసిద్ధిని సూచింపంజేయుచున్నదని పలికి యద్దివ్యమణిగణక్రమకిరణసముజ్జ్వలంబైన యంగుళీయకం బాహనుమంతునిచేతికిచ్చి బహుప్రకారంబులనాశీర్వదించి కార్యసిద్ధియయ్యెడు నరుగుమనిపంచిన నప్పవనతనయుం డారత్నముద్రిక శిరంబుననిడికొని యభూతపూర్వశోభా విశేషంబునం బొల్చుచు ద్విగుణీకృత వీర్య ధైర్య శౌర్య సాహసోత్సాహబలవేగ తేజోవిశేషుండై రామునిచరణంబుల కభివందనంబు గావించి కృతాంజలియై యనుజ్ఞఁగొని యంగదాదులంగూడి దక్షిణదిక్కునకుంజనియె నిట్లు సుగ్రీవుని యుగ్రశాసనంబు శిరంబులందాల్చి పూర్వోక్తప్రకారంబున వినతుండు పూర్వదిక్కునకును దారాంగదాదిసహితుండై విగతమేఘంబైన గగనమండలంబు నందు విశుద్ధమండలుండై నక్షత్రగణంబులంగూడినచంద్రునిభంగివెలుంగుచు హనుమంతుండు దక్షిణదిక్కునకును సుషేణుండు పశ్చిదిక్కునకును శతవలి యుత్తరదిక్కునకును ననేకవీరవానరపరివృతులై శలభంబులకరణి భూమి నాచ్ఛాదింపుచు సుగ్రీవోపదిష్టమార్గంబులం జనిరప్పు డందొక్క కపివీరుండు గర్జింపుచు నిట్లనియె॥ (క) ఏనొక్కరుండ కరమభి। మానం బేపారఁజనియ మర్త్యవిరోధిన్। బూనివధియించిగ్రక్కున। జానకిఁ గొనివత్తు రామచంద్రునకిత్తున్॥ (వ) మఱియు నొక్కవానరపుంగవుఁడు గంతులువైచుచునిట్లనియె॥ (క) తడయక యేనొకరుండనె। కదురయమున నేగి పఙ్క్తికంఠుని ననిలోఁ। గడతేర్చి బాహుదర్పం। బడరఁగ నెచ్చోటనున్న నవనిజఁదెత్తున్॥ (వ) వేఱొక్కకీశోత్తముండు సింహనాదంబుసేయుచు నిట్లనియె॥ (క) ఇందఱువానరులేటికి। మందగతిన్నేనొకండమానుఁగ జనిదై। త్యుం దునిమిరామవిభుఁడా। నందంబునఁజూడ జనకనందనఁదెత్తున్॥ (వ) మఱియొక్క వలీముఖశేఖరుండిట్లనియె॥ (క) భూతలనభస్స్థలంబులఁ। బాతాళజగంబునందుఁబరికించిమహా। ఖ్యాతిగ నెచ్చటనున్నను। భూతనయను దెత్తుమృత్యుముఖమునఁడక్కన్॥ (వ) ఒండొక్కమర్కటవీరుండి

ట్లనిరి॥ (క) భువి నెవ్వియు నాజవమున । కవరోధము సేయఁజాల వటుగావున నీ । జవమున శతయోజనములు । ధ్రువముగఁ జని వెదకి రాముతో యొల్లిఁ దెత్తుర్ ॥ (వ) మఱియు నొక్క వనచరుఁడు దర్పావేశంబున నిట్లనియె ॥ (మ) తరులం గూల్చెదనాకసంబుపగులన్ దాఁటించెదన్ మేదినీ । ధరములూర్చముచేసి దన్నుజగులఁ ద్రుండించెదన్వీఁకతో । శరధివ్రాతమునింకఁ జేసెదమహీ చక్రంబు భేదించెద । న్ధరణీపుత్రిని దెచ్చెదన్విభునకున్ భక్తిన్ సమర్పించెదన్ ॥ (వ) ఇవ్విధంబున మఱియు ననేకులనేకప్రకారంబుల సుగ్రీవుని సన్నిధియందుఁ బంతంబులాడుచు దర్పోద్రేకంబున॥ (లయగ్రాహి) పేరెములు పాఱుచు విహారములు సల్పుచుఁ గరీరములు డాయుచు సమీరచలితఘ్నో । ణీరుహము లెక్కుచు ఘనారవము సేయుచు శరీరములఁ బెంచి పువుటీరములసందు । ల్దూఱుచు వనంబులకుఁ దారుచు ఘనంబులకు మీఱుచు నదంబులకుఁ జేరుచు పడిన్వ్మం। కారములు సేయుచు విచారములు మాని కపి వీరులు చెలంగిరి మహారమణుఁ డుబ్బన్ ॥ (వ) ఇట్లు బహుగతులం దిరుగుచుఁ గపివీరులు సీతాన్వేషణతత్పరులై తమదిక్కులకుం జనిరంత రఘుపుంగవుండు కపిపుంగవు నవలోకించి విస్మితుండై యిమ్మహీమండలంబెల్ల నెన్నఁడు సందర్శించితివని యడిగిన వానరేంద్రునకు వానరేంద్రుం

(*) సుగ్రీవుఁడు రామునకుఁ దాను భూమండలంబెల్లసందర్శించిన (*)

(*) ప్రకారం బెఱింగించుట. (*)

డిట్లనియె॥ (సీ) మునువాలి దుందుభి యను దానవునిఁ జంప దలకొనినడు రేయిఁ దఱుమ వాఁడు । పఱచి శైలబిలంబు భయమునఁ జొచ్చిన బిలము వాకిట నన్ను నిలిపి వాని । తోడనె గుహఁ జొచ్చి యేడు తానందుండె నంత శోణితపూరమా బిలంబు । నిండిన నేఁ జూచి నివ్వెరపడి వాలి హతుఁడయ్యెనని కరినాశ్మమొకటి॥ (ఆ,వె) బిలము వాత వైచి బిఱబిఱఁ బురికేగి । విపినచరుల కెల్ల విభుఁడనగుచు । రుమను దారఁ గూడి సముచిత వైభవ । స్ఫూర్తి నెల్ల సిరులఁ బొందియుంటి॥ (ఆ,వె) అంతఁ గొంతకాల మరిగిన నవ్వాలి । పోర దైత్యుఁ జంపి పురికివచ్చి । ప్లవగరాజ్య భోగ భాగ్యోన్నతుండనై । యున్న నన్నుఁ గాంచి యుగ్రుఁ డగుచు । (క) దానవుఁ ద్రుంచిన కైవడి । మానిక నినుఁ ద్రుంతు ననుచు మండుచుఁ గవియన్ । దీనుఁడనై యేనంతయు । మానుము మానుమని వేఁడి మానక యున్నన్ ॥ (క) బలవంతుఁడైన వాలికి । జలజాప్తకుమారుఁ డదె వెడలి త్వరతో



మంత్రుల్ । గలసి చనుదేఱవడి వడి । నిలువక దిరిగితిని మేదినీతలమెల్లన్॥ (వ) ఇట్లు ఱంగునం బఱచి వివిధారణ్యనదీనదంబులన్నియు విలోకింపుచు నాదర్శతలసంకాశంబు నలాతచక్ర ప్రతిమంబునగు మహీమండలంబెల్ల గోష్పదమాత్రంబుగాఁ గలయందిరిగి యటమీఁదఁ బూర్వదిక్కునకుం జని యచ్చటి వనంబులును నదులును బర్వతంబులును సరోవరంబులును సముద్రద్వీపంబులును విలోకింపుచు సముద్రంబులన్నియు నతిక్రమించి యుదయపర్వత పర్యంతంబుఁ జని యచ్చటనుండి తిరిగివచ్చి క్రమ్మర వాలిచేత నభిద్రుతుండనై యగస్త్యచరితంబైన దక్షిణదిగ్భాగంబునకుం జని వివిధద్రుమభూషితంబైన వింధ్యపర్వతంబాదిగాఁ గల పర్వతంబులును దండకారణ్యాది మహారణ్యంబులును విలోకింపుచు సముద్రద్వీపంబులు గడచి పితృలోకంబు దనుకనరిగి యచ్చట నుండి తిరిగివచ్చి వెండియు వాలిచేత సమభిద్రుతుండనై పశ్చిమదిక్కునకుం జని యందలి నానాదేశంబులు విలోకింపుచు నస్తగిరిడాయం జని యచ్చటనుండి పదంపడి వాలిచేతనిరస్తుండనై యుత్తరదిక్కునకుం జని హిమవంతంబు మొదలుకొని మేరుపర్వతంబు దాఁక నరిగి యచ్చటనుండి తిరిగివచ్చి వాలికిం బ్రవేశింప రానిచో టెందునుం గానక విచారింపుచున్న నన్నుం జూచి బుద్ధిమంతుండైన హనుమంతుం డిట్లనియె॥ (సీ) కపినాథ మున్నొక్క కారణంబున మతంగుండను మునినాయకుండు గినిసి । యిది యాదిగాఁగ సురేంద్రపుత్రుఁడు వాలి యీమలయాచలంబెక్కెనేని । కులగిరి కైవడిఁ దలనూఱు వ్రయ్యలై చచ్చుఁ గాక నిఘోర శాపమిచ్చె। నా శాపభయమున నది మొదలా కొండ సురనాథ సుతుఁ డెక్క వెఱచి యుండు॥ (తే,గీ) నధిపమనమిప్పుడా కొండ నాశ్రయించి । యుందమం చ్చట నొక కీడుఁ జెందదనిన । వినిమనంబున హర్షించి జనవరేణ్య । పన్నగానాఁటఁ గోలె నిందున్నవాఁడ॥ (క) నరవర మతంగముని పతి । పరమకృపన్ నిప్పులవలని భయము విడిచియీ । గిరిమీఁద నుండఁ గంటిని । నరమతిఁ గని నాఁడనాఁడు వసుమతి యెల్లన్॥ (క) అని చెప్పిన విని దశరథ । తనయుఁడు సంతోషమంది తమ్ముఁడుదానున్। జనకసుత యున్న వార్తను । వినఁ గోరుచునుండె దినము వేయేఁడులుగన్॥ (క) జానకిని వెదకు తలఁపున । భానుకుమారోపదిష్టపథసంశ్రితులై। వానరులు నాల్గుదెసలకు । మానసవేగమునఁ జని సముంచితబుద్ధిన్ ॥ (చ) కులకుధరంబులాఘగలు ఘోరవనంబులు పట్టణంబులున్। జలధులు ద్వీపముల్ గుహలు సానువులున్ ల్లుం

సజ్జలాశయం । బులువివిధద్రుమంబులున మున్నతదిక్పతి రాజధానులు । న్గల
యఁగఁ జూచుచుఁ బ్లవగ, నాథుఁడు చెప్పిన జాడ నేగుచుఁన్॥ (క) పగ లెల్లన్ శై
లవనదు । ర్గగుహాధిత్యకల యందుఁ, గలయ వెదకుచు । న్దిగి వచ్చి రాత్రులు
న్నత । జగతి న్నెమకుచు సమగ్ర, జవబలయుతులై ॥ (క) ఉదయాస్తాద్రులు
మేరువు । తుద గానీనడుమ నున్న, దుర్గ గిరినదీ । నదవనసాగరపురజన । ప
దభూముల యందు నచ్చు, పడఁగ వెదకుచున్ । (క) మాసంబు నిండు నంతకు ।

—(*) వినతసుషేణశతవలులు సీతం గానక సుగ్రీవుని కడకు వచ్చుట. (*)—

భూసుత నుధరిత్రి నెందుఁ, బొడగానకయు । న్లాసములు దక్కి యెల్ల । ఓ
సలుడిగి రవిజు కడకు, నరుదెంచి రోగిన్॥(వ) అప్పుడు॥ (క) అనిమిషపతిదిశక
రిగిన । వినతుండచ్చోట నున్న, వివిధవిషయముల్ । గని సీత నెందుఁ గానక ।
తన సైన్యముతోడ వచ్చెఁ, దపనజు కడకున్॥(క) వరుణుని దెసకరిగిన వా । నర
నేత సుషేణుఁ డచటి, నానాస్థలము । ల్వరకించి సీతఁ గానక । పరువడిఁ జను
దెంచె నపుడు, భానుజు కడకున్॥(క) ధనదుని దిక్కునకరిగిన । యనఘుఁడు శ
తవలిబలాఢ్యుఁ, డా దెస ధాత్రీ । తనయను గానక కీశులు । తనుఁబరివేష్టింప వచ్చెఁ,
దపనజు కడకున్ (వ) ఇట్లు పూర్వపశ్చిమోత్తరదిగ్భాగంబులకుం జనిన వినత
సుషేణశతవలులు సైన్యసమేతంబుగాఁ జనుదెంచి మాల్యవత్పర్వత పృష్ఠ
భాగంబున రామలక్ష్మణసహితంబుగా సుఖాసీనుండై యున్న సుగ్రీవుని సము
చితంబుగా సందర్శించి యభివాదనంబులు చేసి యిట్లనిరి॥(చ) హరివర నీదుపం
పున ర,యంబ సంగంజని పూర్వపశ్చిమో । త్తరదిశలందుఁ గల్గు వసుధాధ
రకందర సానుదుర్గ సా । గరపురరాష్ట్రగోష్ఠపద, కాననపక్కణ నిమ్నగాస
ము । త్కరముల జానకి న్వెదకి, కానక వచ్చిన వారమెంతయున్॥(ఉ) దక్షిణది
క్తటంబున కు,దగ్రత నేగిన వాఁడు కీశహా । ర్యక్షుఁడు కార్యదక్షుఁడు మహాబ
లశాలి మరుత్సుతుండు । ప్రత్యక్షముగాఁగ నందు వసు, ధాతనయం గని వచ్చి వే
గరా । మక్షితినాథు నెవ్వగలు, మాన్చు ముదం బొనగూర్చు నిర్యోడన్ ॥
(క) పావని భాస్వత్తనయుఁడు । భూవరుఁ డును లక్ష్మణుండు, బొందికతో
డన్ । బావని రాకఁ దలంపుచు । గ్రావంబున నుండిరపుడు, కౌతుకమలర॥
(వ) అట దక్షిణదిగ్భాగంబునకుం జనిన హనుమంతుండు తారాం
గద జాంబవత్ప్రముఖ వీరవానరకులం గూడి సుగ్రీవుండు చెప్పిన దేశవిశేషం



బు లన్నియు విలోకింపుచు దూరం బరిగి సహస్రశిరంబైన వింధ్యపర్వతంబు
పొడగని తదారోహణంబుఁ జేసి యందలి గుహాగహనసరిత్సరోవరవిమలద్రు
మశిఖర దుర్గకటకనితంబాధిత్యకోపత్యకలయందుఁ దిలకింపుచు ॥ (క) జ
నకజను వెదకి కానక । ఘనఫలమూలములు మెసవి, కడు వేగమునన్ । జనియ
చటనొండు దేశముఁ । గనుఁగొని రఘువిభుని సతిని, గలయ వెదకుచున్ ॥(వ)
ఆదేశంబు దురన్వేషంబై గుహాగహనవంతంబై నిర్జనంబై జలరహితంబై
గగనంబు పగిది శూన్యంబై రోమహర్షణంబై యుండుటకచ్చెరు వొందుచు
నాదేశంబతిక్రమించి తాదృశంబులగు వనదుర్గంబులనేకంబులు విలోకింపు
చుఁ జనిచని యవ్వలఁ బుష్పఫలపర్ణరహిత వృక్షంబులును నిస్తోయంబులగు
సరిత్సరోవర తటాకంబులును భ్రమరపరివర్జిత ప్రేక్షణీయ సుగంధిస్థలపద్మం
బులును గుసుమహీనలతావితానంబులును సంఫుల్లకమలోత్పలకైరవవిహీనం
బులైన ప్రసన్నసలిలాశయంబులును విహంగమశూన్యంబులైన నీడంబులును
మృగపరిత్యక్త కుంజపుంజంబులును గలిగి దురాధర్షంబై దుష్ప్రవేశంబై స
ర్వౌషధీరహితంబై యున్న వేఱొక్క దేశంబు విలోకించి రదితొల్లి మహాభాగుం
డును సత్యవాదియుఁ దపోధనుండును నియమంబులచేత దుష్ప్రధర్షణుం
డును బరమామర్షియునగు కండువను మహర్షి షోడశవార్షిక బాలకుండై
న తనపుత్రుండవ్వనంబునం బ్రణష్టుండైనఁ గోపించి యీవనంబు సర్వసత్త్వవి
వర్జితంబై యశరణ్యంబై దురాధర్షంబై యుండుఁగాక యని శపించిన కార
ణంబున నట్టి దయ్యె నవ్విపినంబుఁ బ్రవేశించి యచ్చటి పర్వతారణ్యానదీనదంబు
లు విలోకించి యెందును జానకిం గానక వెండియు సర్వస్థలంబులు శోధించి॥
(ఉ) రావణు రామభూవిభుని రామను గానక వేగనమ్మహా । దానము దాఁటి
యొండువను ధాధరముద్ధతిఁ గాంచి యందుగు । ల్మావృతమైన దారుణగుహాంగని
యాఁ గుహలోన భీషణ । గ్రావము భంగిఁ గ్రాలు ఘన కాయుని దైత్యునిఁ గాంచిరొ
క్కనిన్॥ (క) కనివాని డాయఁ బోయిన । ఘనతర కోపమున వాఁడు కన్నులని
ప్పుల్ । చినుకఁ గ వానరవీరులఁ । దునిమెదనని ముష్టిఁ బూన్చి తోతెంచుటయున్॥
(ఉ) వచ్చెడు రాక్షసాధముని వారక కన్గొని వాలినందనుం । డచ్చు పడంగఁ బ
ట్టి కుముఖుఁ డంచుఁ దలంచి మహాగ్రహంబునం । జెచ్చెర హస్తతాడితునిఁ జేసిన
నెత్తురు వాతఁ గ్రక్కుచుం । జచ్చి ధరిత్రిపైఁ బడెని శాచరుఁ డొక్క నగంబు చా

డ్చునర్॥ (వ) ఇత్తెఱంగున మారీచతనయుంబరిమార్చి జితకాశులగునంగదాదులు హనుమత్పురోగములై తద్గుహాభ్యంతరంబు సర్వంబునుం గలయశోధించి యందుజానకింగానక దానినిగ్గమించి గ్రమ్మఱ భయావహంబైన వేఱొక్క గిరిగహ్వరంబుఁజొచ్చి యచ్చట బహుప్రకారంబుల వెదకి సీతంగానక వెడలివెండియు వనంబంతయుఁబరిశోధించి యందునుం గానక॥ (క) సోలుచు

(*)డప్పిగొనిసోలిన హనుమదాదుల కంగదుఁడు త్సాహముకలుగఁజేయుట(*)

దుఃఖభరంబునఁ। దూలుచువదనములువాడఁ దోరపుటార్తిన్। వ్రాలుచుఁగపివరులొకతరు। మూలంబునఁజేరిచింత మునుఁగుచు నుండర్॥ (వ) అప్పుడంగదుండు వానరులనందఱఁ గలయవీక్షించి మృదువాక్యంబుల మెల్లన నాశ్వాసింపుచు నిట్లనియె॥ (చ) నదులును బర్వతంబులువ నంబులు దుర్గములున్దరీగుహా। ల్నదములుపట్టణంబులుస రఃపులినంబులుపల్లెలన్నియు। న్వెదకితిమిందునెందుఁబృథివీసుతగన్పడదయ్యె రావణుం। డడయత నిమ్మహాగిరిగుహాంతరసీమలనెందుడాఁచెనో॥ (ఉ) మాసమునిండవచ్చెరుచి మాలితనూభవుఁడుగ్రశాసనుం। డీసునఁద్రుంచివైచుఁదడవేటికిఁదోఁచినయంతపట్టుధా। త్రీసుతనీగుహాగహనదేశములంగిరిభూములందునా। యాసముమానివెవేదకుఁడాక్షణయుశోకముఁదక్కుధీరతన్॥ (తే,గీ) వినుఁడు ధైర్యంబుదాక్ష్యంబుమనసుకలిమి। కరమనిర్వేదమును ధాత్రిఁగార్యసిద్ధి। కరములని చెప్పుచుందురు గాననను। తడయకిప్పుడు చెప్పెదదానిమీకు॥ (చ) వదలకతానొనర్చినయనారతకర్మఫలంబుదేహికి। న్నదిరముగాకతోడుతనె చేకుఱుదానికి చింతయేలమీ। రిదిబహుదుర్గఘోరవన మిందుసమస్తదరీముఖంబుల। న్వెదకుఁడుభూమిపుత్రికను వెండియుఖేదముదక్కుధీరతన్॥ (చ) సమధికశౌర్యలిండఱతి సాహసులద్భుతకర్మశీలుర। త్యమితబలాఢ్యులొక్కపని నైరయమారఁగఁ బూనివచ్చియే। క్రమమున నైననప్పనితి రంబుగఁదీర్పక వెండిపోవ భూ। రమణుఁడు భానుజుండుమన లంగరుణామతివిశ్వసింతురే॥ (చ) అనవిని గంధమాదనుఁడు నంగదుఁడాడినమాటనిక్కమా। మనమిటులుండనేటికిరుమాపతి చెప్పినయట్లభూమిభృ। ద్వనగిరిదుర్గతాపసని వాససరిత్కటకాపగాదులం। దనుపమభంగిభూమిఁదన యుంబరికింతము లెందుచెచ్చెరన్॥ (వ) అనినవిని యవ్వానరపుంగవు లందఱులేచి శీఘ్రంబున వింధ్యపాదపసంపూర్ణంబైన దక్షిణదిగ్భాగం



బంతయుఁ గలయ వెదకుచుఁ దత్సమీపంబున శారదాభ్రప్రతిమంబును శృంగవంతంబును దరీమంతంబును శ్రీమంతంబునగు రజత పర్వతంబు పొడగని యాయంబున నన్నగంబెక్కి యందురమ్యంబులగు లోధ్రవనంబులును సప్తపర్ణవనంబులు నన్వేషించి పరిశ్రాంతులై తదీయ శిఖరాగ్రంబునం గూర్చుండి దృష్టిమార్గంబునంబడిన సర్వస్థలంబులు వీక్షింపుచు రామపత్ని నెందుం గానక వెండియు (క) చొచ్చినచోటులె చొచ్చుచు। విచ్చలవిడితిరిగితిరిగివేసరిధరణీభృచ్చరులచ్చట మెచ్చుగ। నెచ్చటజానకిసిగానకెంతయువగలన్॥ (క) బిట్టలసిగట్టుడిగ్గియొక। చెట్టుకడం జేరిచాలఁ జింతింపుచున। ప్పట్టున ముహూర్తమాత్రము। గొట్టనిలిచి సేదదీర్చికొనిమఱియంతన్॥ (ఉ) వెండియు నంగదాదికపి వీరులువృక్షమువిడివీకతో। నొండొరుఁ జేరఁబిల్చుకొని యొక్కపదంబునుదప్పకుండఁగాఁ। గొండలుకాననంబులునికుంజములద్రినితంబభూములు। న్నొండుగమూఁకలై వెదకి మేదినిపుత్రినిగానకెంతయున్॥ (ఉ) అందఱువింధ్యశైలశిఖ రాంచితదక్షిణకోటిపైనిరా। నందముతోడఁజేరివిపి నంబులఁ బర్వతకూటకోటులం। గ్రందుగజానకిన్వెదకి కానకవెండియుశోకమున్భయం। బొందఁగనందుఁద్రిమ్మరుచు నుండఁగమాసమునిండెవారికిన్॥ (వ) అంతహనుమంతుండు తనమనంబున॥ (ఉ) శైలములాపగల్విషయ సంఘములన్నియుఁ బోలఁజూచితిన్। గాలమతిక్రమించెనృపకన్యకనెందునుగాననైతినీ। వాలితనూభవాదికపి వర్యులుచేడ్పడియున్నవారలే। లీలఁజరింతువీరిమఱిలింతునొ జానకిజాడఁగాంతునో॥ (చ) కళవళమేటికీసమయ కాలముపోయినఁ బోవనిమ్ముమత్కులపతియైనసూర్యజుఁడుకోపముచేసినఁజేయనిమ్ముపో। సొలయకమేదినీసుతనుజూడకపోవుటగాదుయుక్తము। గ్గలికసమస్తము న్వెదకి కాంచెదఁగాక నినిశ్చితాత్ముఁడై॥ (వ) తారాంగదప్రముఖ కపివీరులంగూడి దురన్వేషంబును గుహాగహనవంతంబునగు నప్పర్వతంబెక్కి సింహశార్దూలజుష్టంబులైన విషమస్థలంబులందలి శిలాసంకటంబులును మహాప్రస్రవణంబులందలి నదులును శోధింపుచుండె నప్పు డంగద గజ గవయ గవాక్ష గంధమాదన శరభ కుముద మైంద ద్వివిద సుషేణ తారనల జాంబవ ప్రముఖ వానరవీరులు ప్రత్యేకంబుగా నరిగి గిరిజాలావృతంబులైన దేశంబు లన్నియుఁ బరిశోధించి యెందును మహీనందనం గానక యలసి యధిక క్షుత్పిపాసా ప

రవశులై వెండియు నందఱు హనుమత్సమేతంబుగా నొక్కయెడం గూడికొని సలిలార్థులై యరుగుచు ముందఱ నతిదుర్గమంబును వివృతంబునుమ యదానవాభిరక్షితంబును లతాపాదపసంఛన్నంబును మహాద్భుతదర్శనంబును ఋక్షబిలనామకంబునగు నొక్కబిలంబుఁ జూచి తత్సమీపంబునకుం జ

—(*) హనుమదాదులు ఋక్షబిలమను నొక్కబిలముఁ జొచ్చుట. (*)—

నిరప్పుడు ॥ (క) అమలార్ద్రపక్షములతోఁ । గమలరజస్సిక్తరక్తగాత్రంబులతో । నమరుచు జలవిహగంబులు । విమలంబుగ నబ్బిలంబు వెలువడి వచ్చెన్ ॥ (వ) వానినవలోకించి యబ్బిలంబు డాయంజని ॥ (చ) అలఘుపరాక్రముల్గనిరి యంతఁ దమోవృతమై యగాధమై । విలసితభూరిభూజపరివేష్టితమై కడుదుష్ప్రవేశమై । సలలితపుష్పగంధియయి సర్వమృగద్విజకాండయుక్తమై । యలరెడుదాని సర్పనిలయంబునుబోలు బిలంబునయ్యెడన్ ॥ (వ) ఇట్లు దుర్గమంబైన బిలంబుగనుంగొని బలవంతులగు వానరపుంగవులు దాని యనావిష్కృతరామణీయకంబున కచ్చెరువునొందుచుండి రప్పుడు సుమేరుసమానశరీరుండును గిరికాంతారవనకోవిదుండునగు హనుమంతుండు ప్లవంగపుంగవులనెల్లఁ గలయనవలోకించి యిట్లనియె ॥ (చ) ఇలఁ గల సర్వదేశముల హీనగిరీంద్రగుహాదరీఝరుల్ । విలసితకాననంబులు సరిత్పుళినంబులు పట్టణంబులు । న్గలయఁగఁ జూచియున్జనకనందని నెందునుగానలేక బి । ట్టలసితిమెండ తాఁకునకు నాతఁ కాలమైతిమి క్షుత్పిపాసలన్ ॥ (మ) నలువొప్ప న్సలిలార్ద్రపక్షములతో నాళీకపాంసుచ్ఛటా । కలితాంగంబులతో బలాకలును జక్రక్రౌంచహంసంబులు । న్బిలము న్వెల్వడి వచ్చుచున్న వగముల్ స్నిగ్ధంబువై యొప్పెడిం । గలదిప్పట్టున నిక్క మొక్క హ్రదమో కాసారమో కూపమో ॥ (ఆ.వె) ఈబిలంబుఁ జొచ్చి యిచ్చటఁ గడుపార । నీరుద్రావి మనము సేర్పుమెఱసి । జనకపుత్త్రి వెదకి సాధింతమనవుడు । నట్లగాక యనుచు నద్రిచరులు ॥ (వ) పావనిం బురస్కరించుకొని శీఘ్రంబున నబ్బిలంబు ప్రవేశించి యచ్చటనున్న యదృష్టపూర్వసింహశార్దూలవరాహభల్లూకాదిక్రూరమృగంబుల నదలింపుచుఁ బక్షిసంఘంబుల నెగయం జోపుచు నంధకారబంధురంబై దృష్టికిం జొరవయికాక తేజంబునకు గమ్యంబుగాక విక్రమంబునకుపక్రమింపరాక నానాపాదపలతాసంకులంబై రోమహర్షణంబై యచంద్రసూ



ర్యకిరణంబై సుదుర్గమంబై యున్న యబ్బిలమార్గంబున నొండొరులం గాఁగిలించుకొని యతిసాహసంబున నొక్కయోజనం బరిగి యంతకంతకుఁ దిమిరంబగ్గలంబగుటయు వినష్టమార్గులై ॥ (తే.గీ) అలసి సలిలార్థులై జీమితాసవిడిచి । వదనములు వాడ దైన్యంబు గదురసంభ్రమమున నొక్కింత వడిబిలమధ్యమందుఁ । బరితపింపుచునాఁకట బడలియుండి ॥ (వ) వెండియు నొక్కింత ధైర్యంబున నబ్బలీముఖపుంగవు లొండొరులం బట్టుకొని యబ్బిలంబులోన మఱికొంతదూరం బతిప్రయత్నంబున నరిగియవ్వల ॥ (క) అరుదార మృగాంకదివా । కరనక్షత్రగ్రహప్రకాండద్యుతుల । త్తిఱిఁ గుప్పగూర్చినట్లుగఁ । గరమొప్పెడు నొక్కవెలుఁగుఁ గాంచిరి ప్రమోలన్ ॥ (వ) కని డాయంజని యందు వైశ్వానరసమప్రభసువర్ణమయ కుసుమకిసలయ ఫలస్తబకలతావిలసిత శాఖాశిఖోల్లసితంబులును గాంచనమయవిచిత్ర పత్త్రలక్షిత కలరవ కలకంఠ కీర శారికా భ్రమర సంకులంబులునగు సాల తాల తమాల తక్కోల రసాల హింతాల నారికేళ పున్నాగ నాగ వకుళ చంపక కర్ణికార జంబీర జంబూ నింబ కదంబ ఖర్జూర కకుభాది దివ్యతరునికర సురుచిర విభూషణభూషిత హేమాభిరామంబులును హిరణ్మయ కమలోత్పల కైరవ మత్స్య కచ్ఛప హంస క్రౌంచ చక్రవాక సారస బక కారండవ సంకులంబులగు నీల వైదూర్య వర్ణ సరోవరంబులును దరుణాదిత్యసంకాశంబులగు వైదూర్యమణివేదికాతలంబులును బ్రవాళమణిసన్నిభంబులగు నానావిధ పుష్పలతావితానంబులును బురుషోపల గారుత్మత వైదూర్య ముక్తాజాల విరచితగవాక్షకుటక వాటద్వారతోరణ స్తంభాలంకృత సువర్ణగృహముఖ్యంబులును మణికాంచన విచిత్ర మహార్హశయనాసన యానంబులును హైమరాజతకాంస్యంబులగు భాజనంబులును దివ్యంబులగు చందనాగరు నిచయంబులును మనోజ్ఞంబులగు మూలఫలంబులును రసవంతంబులగు మధుమైరేయాది పానద్రవ్యంబులును గాంచనమయంబు లగు దివ్యాంబర స్రగ్విభూషణ చిత్రకంబళాజినంబులును సుగంధబంధురంబు లగు దివ్య గంధంబులును సమంతతోన్యస్త దీప్త వైశ్వానరోపమ సువర్ణ రత్నసంచయంబులునుం గలిగి యమరావతీపట్టణంబు నాక్షేపించుచున్న యొక్కదివ్యపట్టణంబు పొడగని సువర్ణ వైదూర్య చంద్రకాంతమణిస్థగితంబులగు తత్పురీబాహ్యాభ్యంతర ప్రదేశంబులు వీక్షింపుచుం జని ॥

—(*) హనుమదాదులు స్వయంప్రభయను తపస్వినిం గాంచుట. (*)—

(ఉ) లీలమృగాజినంబు సవరించియినాంశుల సజ్జటాచ్ఛటల్ । గ్రాలఁగ ఘో
రనిష్ఠ నచలస్థితిఁ బూర్ణసమాధియుక్తయై । చాలఁదపంబు సేయుచు నిజప్రభ
లంబురమెల్లఁ బిచికో । ద్వేలము సేయుచున్నయొక దివ్యతపస్వినిఁగాంచిరప్పరిన్ ॥
(క) కనిదానిమహిమ కెంతయు । మనమున నచ్చెరువుగదుర మఱిమఱిడాయం।
జనిమర్కటవీరులుచ । య్యనఁబరివేష్టించియుండిరధికప్రీతిన్ ॥ (వ) అప్పుడుహ
నుమంతుండత్తపస్విని కభివందనంబు చేసియిట్లనియె ॥ (చ) నిరుపమ పుణ్యనె
వ్వతెవు నీవిటనొంటిచరించె దోటలే । కరయఁగ నీమహాబిలమనర్ఘ మణీత
పసియరాసులీ। సురుచిరదివ్యరత్న పరిశోభిత మందిర పఙ్క్తులేమహా । ఫు
రుషునివాత్మ కచ్చెరువుఁ బుట్టఁగఁజేయుచునున్న వెంతయున్ ॥ (ఉ) ఆకటదప్పి
చేబడలియంధతమీతిమిరాప్రకాశితా । స్తోకబిలంబుసొచ్చియొక చోప్పునవచ్చి
సమగ్రకాంచనా । నోకహపఙ్క్తులద్భుతమనోజ్ఞసువర్ణవిశాల సౌధప ।
ద్మాకరముల్ గనుంగొని భయవ్యథితాత్ములమైతిమెంతయున్ ॥ (సీ) ఏమహా
పురుషుని దీదివ్యపట్టణం బీమూలఫలజాత మీవిశాల । హైమకవాట గవా
క్షకుడ్యస్తంభ మహనీయ సుందర మందిరములు । నీవృక్షషండంబు లే
మహాత్ముని తపోమహిమచేఁ గాంచన మయములయ్యె । నీసరోవరపఙ్క్తు
లెవ్వానితపమునఁ గాంచనమయదివ్యకమలకుముద॥ (తే,గీ) మత్స్యకచ్ఛప
కర్కటమకరచక్ర । సారసక్రౌంచవిమలహంస ములఁబడసె । నీసురభి పుష్ప
సంచయమెట్లుగలిగె । మఱియునీభర్మరాసులే కరణినొప్పె॥ (క) ఈవిమల
*)స్వయంప్రభ హనుమదాదులకు ఋక్షబిలోత్పత్తిప్రకారంబెఱింగించుట(*
దివ్యగంధం । బేవిధమునఁగలిగెఁదాపసీమఱియేలా । గీవిధముఁదేటపడఁజెపు।
మావినియెదమనినతని కదియిట్లనియెన్ ॥ (చ) చతురుఁడుశిల్పనైపుణవిశా
రదుఁడద్భుతతేజుఁడార్యస । న్నుతుఁడుమయుండనాఁబరఁగుమాన్యుఁడుదానవవి
శ్వకర్మయీ । వితతబిలంబునందుఁగడు వేడ్కసమస్తపదార్థముల్గరం । బ
తులితరత్నకాంచనమ యంబులుగానొనరించెనెంతయున్ ॥ (వ) మఱియున
మ్మయుండు తొల్లి దివ్యవర్షసహస్రంబులు విరంచిఁగురించి తపంబుగావించి
యద్దేవుని ప్రసాదంబువలన విచిత్రనిర్మాణప్రతిపాదక శిల్పశాస్త్రజ్ఞానంబు
వడసిమాయావియై విచిత్రశక్తిచేతనీదివ్యజాతరూపమయభవనరాజంబు నీమ



హనీయకాంచనవనంబు నిమనోజ్ఞసువర్ణకమలాకరంబులు నిర్మించియూశనసం
బైన ధనంబంతయుఁ బడసి యిమ్మహావనంబున హేమయను నప్సరసంగూడి
కొంతకాలంబు లీలావినోదంబులందగిలి కామోపభోగంబులనుభవింపుచుం
డదానికిసహింపక పురందరుండు మయుని వజ్రధారావినిపాతితుం జేసెనంతఁ
బరమేష్ఠియీకాంచనవనంబు నీదివ్యభవనంబును శాశ్వతంబులగు కామభోగం
బులును హేమకొసంగె నేనాహేమకు వయస్య నగుటం జేసి తత్ప్రసాదంబు
వడసి యీపురంబు గాచికొనియున్నదాన నేను మేరుసావర్ణికూఁతుర స్వ
యంప్రభయను దాననను పలికి వెండియు నత్తాపసియిట్లనియె॥ (క) మీరెవ్వరిట
కునేగతిఁ । జేరఁగ వచ్చితిరి యప్రసిద్ధమగు బిలం । బేరీతిఁ జొచ్చితిరిమీ । ధీ
రత్వము పొగడఁ జెల్లదే నాకిచటన్ ॥ (క) వలసిన ఫలమూలాదులు । నలువు
గఁజిత్తములు దనియ, నమలుఁడు మధురా । మలజలములుగ్రోలుఁడునే। ద
లువాయఁగ ననుడుఁ బ్రీతిఁ,దరుచరవీరుల్ ॥ (క) మెప్పుగ మూలఫలంబులు ।
తప్పక భక్షించిఘనసు, ధాసమసలిలం । బప్పుడటుగ్రోలి యాఁకలి । దప్పి
యుఁదీర్చికొని గత ప్రశ్రమములగుచున్ ॥(వ)అలరుచున్న వారలం గనుంగొ
ని యత్తపస్విని వెండియు॥ (క)అనుకంప గదురనిట్లను । ఘనముగ నీబిలము
నెట్లుఁగంటిరిమీరే । యనువునఁ జొచ్చితి రెక్కడి । వనచర లేమిటికి నిటను,

—(*)హనుమంతుఁడుస్వయంప్రభకుఁదాము ఋక్షబిలముఁబ్రవేశించిన (*)—

(*) విధంబుఁదెల్పుట(*)

వచ్చినవారల్ ॥ (క) మీతెఱఁగంతయు నేర్పడ । నాతోవివరింపుఁడనిన, నగచర
వరుఁడా । వాతాత్మజుండు దానికిఁ । జేతోముద మలరనిట్లు, చెప్పఁదొడం
గెన్ ॥(సీ) వసుధేశుఁ డిక్ష్వాకు, వంశజుండు సుపర్వరాజ తుల్యుఁడు దశ, రథత
నూజుఁ । డనఘాత్మకుఁడు రాముఁ, డనుజుఁడు భార్యయుఁగొలువఁ గాంతారసీ
మలకువచ్చి । నెఱిఁబంచవటమున, నివసించియుండనన్నరపతి సతిని జానకి
నిబల్కి । వదనుండుబలిమిచే, వంచించికొనిపోయె రామునిసఖుఁడు మర్కట
విభుండు॥ (తే, గీ)ఘనుఁడుసుగ్రీవుఁడమ్మహీ, తనయవెదకి । రమ్మనుచుదక్షిణాశకు
మమ్ముఁబనుప । నంగదాదులఁ గూడిర,యంబుమెఱయ । మానినీమణి వెదకం
గఁబూనిచ్చి॥ (చ) పొలయక యెల్ల దేశములఁ, జూచుచు వచ్చి యగస్త్యదిక్
కుగనం । గల తటినీసరః పులిన, కాననపర్వతకందరంబులం । గలయఁగఁజూ

చియందున్నృప, కాంతను గానఁగలేక ఘూర్ణిపా । సలఁగడు డస్సియందఱము ర్వీరుహ మూలముఁ జేరిదీనతన్॥(ఉ)నాలుక లెండఁ దండి వడ,నంబుల నెల్లఁద నంబు దోఁపఁగాఁ । జాలఁ దపింపుచు న్ధృతియు, జాఱనపారవిపత్పయోనిధిం । దేలుచు దిక్కులారయుచు, నీరెచటం గలదో యఁటంచునే । లీలఁ జరింత మెట్లు విహ,రింత మఁటంచుఁ దలంపుచున్నెడన్॥(వ)లతాపాదపసంఛన్నంబై సాంద్ర తిమిరసంవృతంబై యొక్క మహాబిలంబు మాకుం జూపట్టెఁ బదఁపడి సలిలవి హారజలక్లిన్నపక్షంబులతోఁ గమలరజస్సిక్తరక్తాంగంబులతో హంసచక్రక్రౌం చ సారస కారండవాది జలపతత్త్రి ప్రకరంబులా బిలంబు వెల్వడి మింటికెగసినం దత్ప్రకారంబు గని యబ్బిలంబులోన నొక్క జలాశయం బుండునని యూహిం చి సలిలార్థులమై యున్నవారము గావున శీఘ్రంబున నేమందఱ మచ్చటికిం జ నియతిసాహసంబున నబ్బిలంబుఁ జొచ్చి యొండొరులం గౌఁగిలించుకొని యతి ప్రయత్నంబున వచ్చి యిచ్చోట నిన్ను సందర్శించి భవత్ప్రసాదంబునఁ బ్రా ప్తించిన యీ రుచిర ఫలమూలంబు లుపయోగించి యమృతకల్పంబు లగు వి మలజలంబులు గ్రోలి యాఁకలి నీరువట్టును బాపికొని యుపగత వ్యాయామఖే దుల మైతిమని పలికిన నత్తపస్విని మహాత్ములగు మిమ్ముఁ బూజించుట వలన నే సుకృతార్థనైతి మీయట్టి పుణ్యాత్ముల సందర్శనంబు దొరకొనుట బహుజ న్మకృతసుకృత పరిపాకంబు గదా యని బహూకరించె నంత హనుమంతుండు వెండియు నత్తాపసి కిట్లనియె॥(క)జనకసుతను మాసములోఁ । గనుఁగొనిచను దెండఁటంచుఁ, గపిపతి యనుపం । జనుదెంచి కాలమంతయుఁ । జనఁ జెడి యు న్నారమొందుఁ, జనలేకిచటన్॥(చ)జనకజఁ గానమైతి మిటఁ,జయ్యనఁ గాలము పోయె భానుమ । త్తనయుఁడు తీవ్రశాసనుఁడు, తప్పక నీక్షణ మేమి సేయునో । యనిమదిలోనఁ గూరిన భ,యంబునఁ జేడ్పడి యున్నమమ్ము నీ । ఘనగుహ వె ల్వరించి యను, కంపదలిర్పఁగఁ బ్రోవఁగాఁ దగున్॥ (క) నరపతిపుణ్యచరిత్రుం । డరయఁగఁ దత్సతిని వెదక, నరుగఁగ వలయుం । గరుణ దలఁకొత్తమమునీ । ని రుపమగుహ వెల్వరింప, నీకుం జెల్లున్॥(వ)అనిన నత్తాపసి యిట్లనియె॥(ఉ) ఈ వివరంబుఁ జొచ్చిధర, నెవ్వఁడుఁ గ్రమ్మఱఁ బ్రాణయుక్తుఁడై । పోవఁగఁ జాలఁడే నిపుడు, భూరిసమగ్రతపోబలంబున । న్వెడలింతుఁ గన్నులటు, వేగమె మూ యుఁడు మూయకున్న నీ । క్రేవఁ దొడంగి మిమ్ము వెడ, లింపఁగ నాకు నశక్య మి



(*)స్వయంప్రభ తపోబలంబున ఋక్షబిలంబునుండి వానరుల వెల్వరించుట.(*)

మ్మెయిన్॥(వ)అనిన విని యబ్బలీముఖ పుంగవు లట్లు గాక యని శీఘ్రంబున బిలం బు నిర్గమించు నాసం జేసి॥(మ)సుకుమారాంగుళి హస్తరుద్ధముఖులై, చూ పట్టినం జూచిత । ప్పక యత్తాపసి సంతతార్జితతపః,ప్రాప్త ప్రభావంబుచే । నొకకాష్ఠంబునకబ్బిలంబును రయం,బొప్పారదాఁటించె సూ । ర్యకుమారాగ త భావిశిక్షణ భయభ్రాంతాత్ములం గీశులన్॥(వ)ఇత్తెఱంగున నబ్బిలంబు వెల్వ రించి యత్తాపసి వానరుల నందఱ నాశ్వాసించి యిట్లనియె॥ (మ)ఇది నానా ద్రుమగుల్మవల్లికలచే, నేపారు వింధ్యాచలం । బదెయుత్తుంగతరంగ ఘట్టనస ము,ద్యద్భూరినిర్ఘోషణా । స్పదమై యొప్పెడు, గంధివీకు నలువా, ప్ర న్స్వస్తియౌఁ గాకవే । డ్కదలిర్పంగ బిలంబులోనికిఁ గశీ, ఘ్రంబొప్ప నేఁబో యెదన్॥(క)అనిపలికి యాస్వయంప్రభ । వినయంబున విపినచరుల, వీడ్కొ నిశీఘ్రము । బున శైలబిలములోనికిఁ । జనియె దపోమహిమఁ జేసి, సంతసమ లరన్॥(ఉ)అంతబలీముఖ ప్రవరు, లగ్గిరికూటము డిగ్గి క్రేవఁ బ్ర । త్యంతనగం బుమీఁదరయ,మారఁగఁ గూర్చుని యూర్మిమాలికా । క్రాంతనభోంతమైనజ ల,రాశిని బల్లవరాగతామ్రవా । సంతికవల్లికాతరు వి,శాలవనంబులఁ గాంచి యందఱున్॥(తే,గీ)ఘనవసంతము చనుదెంచె, ననియెఱింగి। మనమున భయం బు శోకంబు, మల్లడిగొన । నప్పుడు నష్టసందేశ కా,లార్థులగుచుఁ । గడుర యంబునఁ గీశులు, ప్రడమిఁ బడిరి॥ (వ)ఇత్తెఱంగున సుగ్రీవభయశంకితులై మై మఱచి నేలఁ ద్రాలి యున్న వనచరులం జూచి సింహర్షభ స్కంధుండును దీనా యతమహాభుజుండును మహాప్రాజ్ఞుండును యువరాజునగు నంగదుండు మంద మధురాలాపంబులం దేర్చి వారికిట్లనియె!(ఉ)అక్కపినాథునాజ్ఞ మన, మందఱ ముం బనిఁబూనివచ్చియీ । దిక్కునఁ బోలఁజూచి నృప, దేవినిగానక యీబి

—(*)అంగదుఁడు హనుమదాదులకు మాఘమాసప్రవేశం బెఱింగించుట(*)—

లంబులోఁ । జిక్కితి మిచ్చట న్మనకుఁ, జెచ్చెర మాసమతిక్రమించెనిం। దొ క్కర మత్తెఱం గెఱుఁగ,ముష్ణకరాత్మజుఁడు గ్రుఁడారయున్॥(వ)మఱియుఁ బు ష్పాతిభారాగ్రంబులైన చూతాదివాసంతికద్రుమంబుల విలోకింపుఁ డయ్యావి వసంతకాలంబున ఫలించునట్టి వృక్షంబులు శిశిరాదియందుఁ బుష్పించి యుం డునట్లు పుష్పవంతంబు లగుటం జేసి వసంతకాలంబు ప్రత్యాసన్నం బయ్యె

నిప్పుడు శిశిరకాలంబు ప్రవర్తింపుచున్నది సుగ్రీవుండు మార్గశీర్షమాసంబునందు సేనలం గూర్చి పౌషమాసం బవధి యొసంగి సీతాన్వేషణార్థంబు వానరుల నెల్ల దిక్కులకుం బనిచె నిప్పుడు పౌషంబతిక్రమించె మాఘమాసంబు వర్తింపుచున్నది గావున వసంతకాలంబు ప్రత్యాసన్నంబగుటకు సందియంబు లేదు బిలపరివర్తులమైన మనకు సుగ్రీవ పరికల్పిత మాసంబతిక్రమించె నెవ్విధం బెఱుంగ మైతిమి శిశిరకాలచిహ్నాభూత పుష్పసందర్శనంబున వసంతకాలసమాగమం బెఱింగిన వారము మనమాశ్వయుజమాసంబున హనుమత్ప్రేరితుండైన సుగ్రీవునిచేతఁ ద్రిపంచరాత్రసంఖ్యచేత నియమింపబడి సమాహూతులమైతిమి పదంపడి మార్గశీర్షంబునందు లక్ష్మణచోదితుండైన సుగ్రీవునిచేత దశరాత్రసంఖ్యచేత సమాహూతులమై యతనివలనఁ బౌషమాసంబవధి వడసి సీతాన్వేషణార్థం బరుగుదెంచితిమి గావున నాశ్వయుజమాసంబు మొదలుకొని కాలసంఖ్యచేత వ్యవస్థితులమైన మనకుఁ గాలవిస్మరణంబు సంయుక్తంబయ్యె నింక నెయ్యది కర్తవ్యంబని పలికి యంగదుండు వెండియు నిట్లనియె॥ (ఉ) మీరు దినేశపుత్రునకు మిక్కిలి మాన్యులు ఖ్యాతపౌరుష । ధీరులు సా

## (*)అంగదుఁడు సుగ్రీవభయంబున దుఃఖించుట(*)

త్వికుల్నయగరిష్ఠులు శూరులు నన్నుఁ గౌతుకం । బారఁ బురస్కరించుకొని యందఱుఁ గార్యభరంబుఁ బూనిత । ప్రేరితులై గడంగిచను దెంచితి రప్రతిమాన శూరతన్॥ (క) ఇనతనయుఁడు మితి చేసిన । దినములిపుడతిక్రమించెఁ దిరుగఁగ మనమా । జనకజఁ గానక యచటికిఁ । జనిన న్రవిజుండు మనల శాసింపఁడొకో॥ (క) ఇనతనయుని సందేశం । బొనరింపక ధాత్రిసౌఖ్యమొందఁగరాదె । వ్వనికైనఁ గానమనకా । వనచరపతివలన మృతి యవశ్యము గలుగున్॥ (వ) మఱియు సుగ్రీవుండు తీక్ష్ణస్వభావుండును స్వామిభావ వ్యవస్థితుండును గావున నపరాధులమైన మనలం జూచి యనుకంపఁ దలంపక చంపం జూచునదియునుం గాక నతండు మత్పితృకారణంబునఁ బూర్వవైరంబుఁ దలంచి నన్నుఁ బరిభవించుటకు సమయం బన్వేషింపుచుండు మహాత్ముండగు రాముని శాసనంబు నిరాకరించినఁ దనకు హైన్యంబు వాటిల్లునను భయంబున యౌవరాజ్యపదంబునందు నన్నభిషిక్తుం జేసెంగాని తనంతం దాను గృపావిశేషంబునం బూన్చినవాఁడు గాఁడిప్పుడు కృతాపరాధుండనైన నన్ను నిస్సంశయంబుగా వధించు నతనిచేతం జచ్చుట



కంటెఁ బుత్రదారధనధాన్యగృహక్షేత్రాదులు పరిత్యజించి పుణ్యంబైన యీ సాగరానూపంబునందుఁ బ్రాయోపవేశనంబుఁ జేసి ప్రాణంబులు విడుచుట మహోదయంబని తోఁచుచున్నది గావున నట్లు గావించెదనని పరిదేవనంబుగాఁ బలికిన నంగదుని మాటలకు నిర్వేదించి యక్కపిపుంగవులు సకరుణంబుగా నిట్లనిరి॥ (ఉ) భానుజుఁడట్టివాఁడగున్న పాలుఁడు చాలఁ బ్రియానురక్తుఁడా । జానకిఁ గానకిప్పుడు వెస న్మనమేగినఁ గాంచి క్రుద్ధుఁడై । మానుగ విశ్వసింపక భిమానముతోఁ బతికిం బ్రియంబుగాఁ । బూని వధించు నిక్కముగఁ బోవఁగఁ జాలము వానిపాలికిన్॥ (క) జనకజఁ గానక యచటికిఁ । జని వానరవిభునిచేతఁ జచ్చుట

## —*తారుఁడంగదునకు సుగ్రీవభయంబు తొలఁగుట కుపాయము చెప్పుట.*—

కంటె । ఘనముగ నిందఱుపవే । శనముం గావించి యిచటఁ జచ్చుట యొప్పున్॥ (తే,గీ) మృత్యుముఖమునకైనఁ బోయెదము గాని । తరణిపుత్రుని సన్నిధికి పుగఁ జాల । మనవుడు భయాకులాత్ముఁడై యల్లతారుఁ । డెల్లవారలు వినుచుండ నిట్టులనియె॥ (చ) వనచరులార యింత వగవం బనిలేదు బిలంబుఁ జొచ్చియుం । డను వుగఁ దాఁగియుండ మది యన్యులకుం జొరరాదు దుర్గమం । బనుపమ దివ్యభూరుహాల తామలపుష్కరభోజ్యపేయకాం । చనమణిమందిర ప్రచయ సంభృతమై తనరారు నెంతయున్॥ (క) అందున్న మనల నలసం । క్రందనుఁడైనఁ బరికింపఁ గాఁ జాలఁడనం । బొందుగ నరవానరసం । క్రందనులటు దేఱిచూడఁ గాఁ జాలుదురే॥ (వ) అనినఁ దారాంగదుల వచనంబులు విని ప్లవంగపుంగవులత్తెఱంగు కర్ణంబుగాఁ గొనియుండి రప్పుడు నీతిమంతుండగు హనుమంతుండు తనమనంబున నంగదునియందు రాజ్యపాలన సామర్థ్యంబు గలదని తలంచి శుశ్రూషాశ్రవణ గ్రహణ ధారణ తత్త్వజ్ఞానార్థ విజ్ఞానోహాపోహాది బుద్ధిగుణసంయుక్తుండును బాహుబలమనోబలోపాయ బలబంధుబల సమన్వితుండును సామాది చతురుపాయకుశలుండును దేశకాలజ్ఞత్వ దృఢత్వ సర్వక్లేశసహిష్ణుత్వ సర్వవిజ్ఞానసంపన్నత్వ దక్షత్వోర్జసంవృతమంత్రత్వావిసంవాదిత్వ శూరత్వ శక్తిజ్ఞత్వ కృతజ్ఞత్వ శరణాగత వత్సలత్వామర్షిత్వాచపలత్వ నామక చతుర్దశగుణయుక్తుండును తేజోబలపరాక్రమాధికుండును దినదినప్రవర్ధమాన శుక్లశశిప్రతీకాశుండును పితృతుల్య పరాక్రముండును బృహస్పతితుల్య మనీషుండును సర్వశాస్త్రవిశారదుండును బృహస్పతి వాక్యానుసారియగు శ

క్రముండుం బోలెఁ దారవాక్యానుసారియునగు వాలిపుత్త్రుంగనుంగొని యతనిమ
నస్సమాధానంబు గావింతుఁగాకయని నిశ్చయించి॥ (తే,గీ) పృథివిఁగలయు
పాయములనాల్గింటిలోన । నధికమగుమూఁడవయుపాయ మాశ్రయించి। వా

**హనుమంతుఁ డంగదునితో దాఁగియుండవలదని చెప్పుట.**

క్యసంపదవానరవరులలోనఁ। గడఁగియన్యోన్యభేదంబుఁగలుగఁ జేసి॥(క)ఆయిం
ద్రినందనాత్మజుఁ। బాయకవీక్షించిపలికె బహువిధ కోపో। పాయసమన్విత
వాక్కుల। వాయుకుమారుండుమతనివారకబుద్ధిన్॥ (తే,గీ) అనఘయుత్సా
హవంతుఁడవాలమందుఁ। బగతులనడంచునట్టిదోర్బలయుతుఁడవు। భవ్యుఁడ
వువాలిభంగినీప్లవగ రాజ్య। భూరిభారంబుఁదాల్పనోపుదువునీవు॥ (తే,గీ) సం
తతముఁ వానరులుకడుఁజపలచిత్తు। లగుటవీరలుపుత్త్రదారాదికమును। విడిచినీ
పంపుఁగైకొనియడవులందు। వెతలఁబడుచుందురనుమాటవిడువుమిపుడు॥(క)
పనసుఁడు తారుఁడుపావక। తనయుండేనునువిరించితనయుఁడుభాస్వ। త్తనయు
నివారమగుటచే। నీనుఁగైకొనియతనివిడువనేరముకడఁకన్॥ (తే,గీ) ఎంతసా
మంబుఁజేసిననెంతిదాన। మిచ్చినను భేదపుచ్చిననచ్చపడఁగ। దండ మొసఁగిన
నూతాఁడతనయుఁబాసి। సూరినుతనీకువశ్యులుగారువీరు॥ (తే,గీ) తోడ
ఁపగయైనదుర్బలుతోడబలయు। తునకుఁగాకబలాఢ్యుతో దుర్బలునకు। నగు
నెవ్వక్షేమకారియైనట్టియుబలుఁ। డిలబలీయునితోవిగ్రహింపఁడెందు॥ (క)క్షు
మనెవ్వరైనదేశ। క్రమమునుగాలమునెఱింగిప్రబలునితోనె। య్యా మొనర్తు
రుగాకవివే। కమునన్దుర్బలునిపొందుఁగాంక్షింపుదురే॥ (క) బిలమునడాఁగిన
నెవ్వా। రలయుకభేదింపఁజాల రనితలఁచితెయా। బిలదళమును సౌమిత్రి। జ్వ
లదంబకములకయత్న సాధ్యముతలఁపన్॥ (ఉ) వాసవుఁడల్గితొల్లియొక వజ్ర
ముచేవివరంబొనర్చెను। ఖ్లాసమునిచ్చునట్టిపరి సన్నిభబాణము లెన్నయేన్ను
షు। త్రోసుతునొద్దనుండెడినతండలసాయకపంక్తినీగుహా। వాసిగవ్రక్కలిం
చుఁగపి వర్యపలాశపుటంబునుంబలెన్॥ (తే,గీ) పుత్త్రదారాదికంబులఁబొందు
విడిచి। యూఁకటనునీరువట్టుచుననవియులేక। యేటివోరమనకితఁడనియుల్లకఫలు।
విషమకాలంబునందుని న్విడుతురనఘ॥ (క) హితకాములైనచుట్టల। హితు
లనుబడఁబాసియొంటినీవీగుహనే। గతినుండెదవటులైనను। స్తుతికిం బాత్రమ
వుగాకచుల్కనగావే॥ (తే,గీ) కార్యవైఫల్యమొనరించికపటవృత్తి। మాఁది



యిచ్చటడాఁగినసుగ్రీవుఁడగుచు। నినునధింపఁడెసౌమిత్రినిరుపమాన। సాయక
ములేసియొకనిమిషంబులోన॥(వ) మఱియుసుగ్రీవుండు ధర్మకాముండునునీకుఁ
బితృవ్యుండునుసత్యప్రతిజ్ఞుండును ధృఢవ్రతుండునుశుచియును బ్రీతికాముండును
వీశేషించితారకుంగూర్చువాఁడునుగావుననద్దేవికిఁబుత్త్రుండవైన నిన్నుహింసిం
పందలంపఁడీవలవనిభయంబువిడిచి మమ్ముంబురస్కరించుకొని సుగ్రీవునిపాలి
కింజనుదె మ్మట్లైననతండుక్రమంబుగా నిన్నుఁగపిరాజ్యంబున కభిషిక్తునింజేయు

**(*) అంగదుఁడు హనుమంతునితో సుగ్రీవుని దుర్గుణంబులు చెప్పుట. (*)**

నని పలికినఁ బ్రశ్రితంబును ధర్మసంహితంబును స్వామిసత్కారసంయుక్తం
బునగు హనుమంతుని వచనంబు విని యంగదుం డిట్లనియె ॥ (తే, గీ) అ
కట సుగ్రీవునందుస్థైర్యంబుశౌచ। మార్జవము ధైర్యమునుసత్త్వ, మా
నృశంస్య। మరసిచూచిన నించుక,యైనలేదు। తద్గుణాంభ్రాంతయును విదితం
బకాదె ॥ (సీ) ధర్మంబుగలఁపక, తల్లితోసరియైన యన్నభార్యను గామి,
యైవరించె। నరయజ్యేష్ఠభ్రాత,యనకవాలిని శంకవిడిచి చంపించెభూ, విభు
నిచేత। రాక్షసుఁజంపబి,లంబుఁజొచ్చిన వెండిరాకుండ గుహావాత రాయివై
చెఁ। దనకు మేల్చేసిన,ధరణీశుకార్యంబు మఱచియింట సుఖంబు,మరిగియుం
డె ॥ (తే,గీ) నతనికెయ్యవి సుగుణంబు,లరసిచూడఁ। జపలచిత్తుండుక్రూ
రుండు,శఠుఁడుమర్త్యుఁ। కాముఁడగుబుద్ధిహీనుండె, గాక జీవి। తాశగలవాఁ
డుగోపనే,యతనిపొత్తు ॥ (చ) తనకుపకారియైన నృపు,తన్విని వేవెదకంగ
బుత్తుఁగా। కనిసమయంబుఁజేసి యది,యాత్మఁదలంపక కామసక్తుఁడై। తని
యకయున్న లక్ష్మణుఁడు,దగ్రతఁ గోపమెలర్పఁబిల్వఁబో। యినమఱవచ్చెఁగా
నిక్కృత,మెంచి తనంతనతానువచ్చెనే ॥ (ఆ,వె) అవనిబుద్ధిమంతుఁ,డైనరా
జకుమారు। రాజుఁజేయుబూజ్య,రాజ్యమునకు। నిట్టిచపలచిత్తుఁ,డేవగించక
తానె। యేలుఁగాక పుత్త్రు,నేలదలఁచు ॥ (తే,గీ) ఏను బుత్త్రుండనైయున్న,
నిననసుతుండు। పరగగుణదోషములు గణిం,పకవనాట। రాజ్యమందుఁ బ్రతి
ష్ఠించు,రమణతోడ। విమతపుత్త్రుని నన్నేల,విశ్వసించు ॥ (తే, గీ) దుర్బ
లుండనుభిన్నమం,త్రుండశక్తి। హీనుఁడఁ గృతాపరాధుండ,నైనయేను। గీశ
శేఖరయిపుడు కిష్కింధకేగి। యనదచందాననేరీతి,మనఁగనేర్తు ॥ (ఆ,వె)
ఇప్పుడేనుబోవ,నినవందనుఁడురాజ్య। కారణమున నంటఁ,గట్టివైచు। నతనిచే

తఁజిక్కి, యచట,జచ్చుటకంటె । నిచటనుపవసించు,టిదియొమేలు ॥ (ఉ) ఏ
నుగడంకతోఁ బురికి, నిప్పుడువచ్చి దురాత్ముఁడైన యా । భానుసుతుండొ స
చ్చరితుఁ, బాధలఁ గోర్వఁగఁజాల నిచ్చట । స్నానక మానినై నిరశ, నవ్రత

(*) వానరులు ప్రాయోపవిష్టులగుట. (*)

ముందగఁబూనియోగవి । చ్యానిరతుండనై తగు వి,ధంబున మేను పరిత్యజించె
దన్ ॥ (ఉ) మీరిపుడూరికేగి యల, మిత్రకుమారుని రాజవంశవి । స్తారుల
రామలక్ష్మణులఁ, దక్కిన బంధుజనంబులన్నుమా । తారల మిత్రవర్గములఁ,ద
ప్పకకాంచినమస్కరించి యిం । పారఁగనాదుచందమిది, యంతయుఁ దెల్లము
గాఁగఁజెప్పుఁడీ ॥ (వ) విశేషించిమజ్జననియగు తారయేకపుత్రయు సానుక్రో
శయుఁ దపస్వినియుఁ గావునమ్మృతుండనైన నన్నువినిపుత్రమరణశోకంబుసహిం
పంజాలక నిశ్చయంబుగాఁ బ్రాణంబులు పరిత్యజించు నట్లుగాకుండనద్దేవిందగి
నయనునయాలాపంబులం దేర్పుఁడని పలికి యంగదుండు వృద్ధులగు జాంబవ
దాదులకు నమస్కరించి ప్రాణత్యాగంబునందుఁ గృతనిశ్చయుండై రోదనంబు
సేయుచు దర్భాస్తరణసంవృతయైన మేదినియందుఁ బ్రాయోపవిష్టుండయ్యె
నంతఁ దక్కిన వానరులందఱు బాష్పధారాపూరితముఖులై దీర్ఘస్వరంబుల
రోదనంబు సేయుచు సుగ్రీవుని నిందింపుచు వాలిం బ్రశంసింపుచు నంగదునిమ
తం బెఱింగి యతని యట్ల ప్రాయోపవేశంబు సేయ సమకట్టి నిర్మలజలంబు
లుపస్పృశించి దక్షిణాగ్రంబులగు దర్భాస్తరణంబులయందుఁ బ్రాఙ్ముఖంబుగా
నాశీనులై యందఱేకవాక్యంబున రాముని వనవాసంబును దశరథునిమరణం
బును జనస్థాన వధంబును జటాయువు పంచత్వంబును వైదేహీహరణం
బును వాలివధంబును రాముని కోపంబును సారెసారెకుం దలపోయుచు నాక్రం
దనంబుఁ జేసిన ॥ (క) గిరినిభులగు ప్లవగులచే । ధరణీధర మపుడు ఘోషి,త
విశాలగుహాం । తర మయ్యె నదద్భయద । స్ఫురదురు మేఘములచేతఁ, బోలె
న్మిగులన్ ॥ (సీ) అప్పుడు సంపాతి, యను గృధ్రనాయకుండతివృద్ధుఁ డమిత
స, త్త్వాన్వితుండు । ఘనవీర్యుఁడు జటాయువునకు జ్యేష్ఠభ్రాత భూరివిక్రముఁ

(*) సంపాతి వానరుల భక్షింప వచ్చుట. (*)

డు బు, భుక్షితుండు । హరివరుల్ గానించు,నాక్రందనధ్వనివిని యద్రిగుహ నుం
డి, వెడలి వచ్చి । ప్రాయోపవిష్టులై, పడి యున్న కీశులఁ గనుఁగొని సమ్మోద,
కలితుఁడగుచు ॥ (తే,గీ) నహహ లోకంబు విధివశం, బగుటఁ జేసి । యతఁడు భూ



తంబులకు విహి,తాశనంబు । నిత్యమొనగూర్చు నాకట్లు, నేఁడుకరుణఁ । ది
నుమఁటంచునీభక్ష్యంబు,దెచ్చిపెట్టె ॥ (క) చిరకాలంబాహారం । బిరువుకొనందు
రుగలేని, యేనింక నుజె । చ్చెరముండట మరణేచ్ఛా । పరులై యీల్లువనచరు
ల,భక్షింతు వెసన్ ॥ (వ) అనిపలికినభక్ష్యలుబ్ధుండగు సంపాతివచనంబువిని ఘు
మాయస్తుండై యంగదుండు హనుమంతునకిట్లనియె ॥ (క) ఆక్షితిజా వ్యాజంబు
న । సాక్షాద్దైవస్వతుండు, శమనుఁడిచటికి । న్నృక్షచరవిపత్తికిఁ బ్ర । త్యక్ష
ముగా వచ్చెఁగంటె, యనిలతనూజా ॥ (క) ఇనజుని వాక్యము రఘునం । దను
కార్యముఁ బ్రీతితోన్, నొనర్పనిదోషం । బునమన కాకస్మికముగఁ । బనివడియీ

—(*) అంగదుఁడు సంపాతిం జూచి జటాయుర్మరణాదుల నుగ్గడించి (*)—

(*) దుఃఖించుట. (*)

గతివిపత్తి, ప్రాప్తించె వెసన్ ॥ (క) ధరణిజ కొఱకాఖగశే । ఖరుఁడు జటా
యువుకడంగి, కావించినదు । ష్కరవర కర్మంబునుని । వ్వెరపడి మనమె
ల్లఁ దొల్లి, వింటిమిగాదె ॥ (క) ఇలదిర్యగ్యోనిగతం । బులైనభూతఁబులెల్లఁ,బో
లుపుగఁబ్రాణం । బిలువిడిచియైన నృపతికి । నలువొప్పఁగఁదొల్లి ప్రియమొ
నర్చెనో లేదో ॥ (క) మనుజేంద్రునకుఁబ్రియంబుగ । జననుతుఁడు జటాయువే
ల్లి, సద్గతివడసె । న్మన మాఖగపతి కైవడి । మనుజపతికిఁ బ్రియముగాఁగ, మ
డియుద మిచటన్ ॥ (క) కారుణ్యానియంత్రితులై । వారక రామునకునెల్ల,వారలుఁ
బ్రియమిం । పారఁగ నొనర్పుచుండఁగ । భూరుహచరులార మనకుఁ,బోలదె
సేయన్ ॥ (క) గిరివనదుర్గంబులయం । దరసిధరాసుతను గాన, మైతిమిమన
మిం । కరయంబునఁ బురికరుగుట । నరవరునకు శోకభయ మొ,నచఁటకెక
దా ॥ (క) జనకజను వెదకికనుగొని । జనవిభునకు ముదముగూర్పకఁ, జాలమయి
తిమె । ల్లనఁ బ్రాణములువిడిచియై । ననుమనమిచ్చటఁ బ్రియంబొ, నర్పఁగ వ
మింకన్ ॥ (క) రామహితంబుగ మార్కొని । రామునిసతికొఱకుఁ బోరి,
రావణుచేసం । గ్రామమునఁ జచ్చినిర్జర । ధామంబు జటాయు వొందె
ధన్యుండగుచున్ ॥ (చ) వరగుణశాలిరాముడవన, వాసమురాజవరేణ్యుఁడైనద
శ్రరథునిచావు రాముని సతీహరణంబును గృధ్రవంశరాణ్మరణము వాలి
పోక నిధనంబిచటన్ ఘనకిట్లు వాయుటల్ । పరువడిఁగ్గలైనన్నియును, శాప
ఫుఁగైకమొ కారణంబుగన్ ॥ (క) చెడుతెవులు ముదిమియును లే । కడలునహిత

పుత్రమంది, రారామముల । న్విడిచిమన మకారణముగఁ । గడువడినిటఁ జా
వ వలసెఁ,గైక కతమునఁ॥(వ)మఱియు జటాయుమ్మరణంబున దశరథవినా
శనంబున వై దేహీహరణంబున మనకుఁ బ్రాణసంశయంబు సమాగతంబయ్యె
జటాయువీల్గకున్న రావణునిచేతజానకి యపహృత గాకయుండు దశరథుండు
గెడయకున్న సీతారామలక్ష్మణుల నెవ్విధంబున నైనఁగ్రమ్మఱఁ బురంబునకుం
దోడ్కొని యరుగు వైదేహి రాక్షసునిచేత నపహరింపఁబడకున్న రామునకు
సుగ్రీవునితోడి సఖ్యసంబంధంబుగలుగమింజేసి మనకుమరణంబుగలుగకుండుఁ
గైకేయీ వరదాన కారణంబున రామవనవాసంబు మొదలుగఁబ్రాయోపవే

—(*)సంపాతి జటాయువుమరణంబువిని దుఃఖితుండై యంగదుసఁ ద(*)—

(*)వృత్తాంతంబడుగుట(*)

శనపర్యంతంబు నెయ్యదిగలదది సర్వంబుఁబ్రాప్తించె ననిబహుప్రకారంబుల
నిర్వేదింపుచున్న యంగదాదుల వచనంబులువిని మరణేచ్ఛాపరులై పడియు
న్న వానరుల నందఱ నవలోకించి తనయనుజుండగుజటాయువు వృత్తాంతంబు
శ్రవణతాడితంబగుటకు శోకమోహంబులు మనంబునంబెనంగొనసంపాతియుం
గదున కిట్లనియె॥ (చ) ఘనగుణశాలిప్రాణముల కంటెఁబ్రియుండు మహాబ
లుండునా । యనుజుఁడుభీమకాయుఁడు మదాసురహంత జటాయువాఖగేం ।
ద్రుని మరణంబునామనము దుఃఖవశంబుగఁజేయుచిట్లువా । కొనిమొదు పెక్కు
మాల్కనయకోవిదయెవ్వఁడవీవుచెప్పుమా ॥ (మ) చలమొప్ప న్వడిఁ బేర్చి
దారుణ జనస్థానంబునఁ గృధ్రుఁడై । త్యులకెబ్బంగిరణంబు వాటిలె జటాయుం
బట్టదై తేయుఁడె । ట్లలుకంద్రుంచెను బెద్దకాలమున కత్యానంద సంపాదియై ।
చెలువొప్పంగ రహిన్వినంబడియె నాచేభ్రాతృనామంబిటన్ ॥ (క) పెనుపొం
దఁ బెద్దకాలం । బునకున్మహనీయవిక్రముండగునాత । మ్మునికీర్తనంబు చేసెఁ।
డనఘాత్మక యేనుసమ్మదాత్ముఁడనై తిన్ ॥ (క) వానరకులవర్యజన । స్థాననివాసి
యగునాదు తమ్ముండనిలో । దానవుని చేత నిహతుం । డైన తెఱంగెల్లఁజెప్పుమ
దివిభవలతున్ ॥ (క) వనచరవర యెవ్వానికిఁ। బెనుపొందఁగ రామవిభుఁడు,ప్రియ
పుత్రుండై । జనియించె నట్టిదశరథ । జనవిభుఁడు జటాయువునకు సఖుఁడెట్ల
య్యెన్ ॥ (క) వృతుచరవీరనాకును । బక్షంబులు లేవుగాఁన బదములనడలే ।
కక్షముఁడనై తినీదుస । పక్షంబునకుఁగొనిపొమ్ము మానుగనన్నున్ ॥ (వ) అ



నిశోకగద్గదకంఠుండై పలికిన సంపాతివచనంబులు విని భక్షణకర్మ ప్రతిపా
దకవాక్యంబున భీతులై యంగదాది కపివీరులీపక్షీంద్రుండు రౌద్రదర్శనుండై
యున్నవాఁడు మనలనందఱ వరుసంబట్టుకొని మ్రింగునోయని శంకించి సర్వ
ప్రకారంబులఁ బ్రాయోపవేశంబుచేసి మరణకాముల మైపడియున్న మనలమ్రిం
గిన మ్రింగనిమ్ము పరమసిద్ధినొంది కృతకృత్యులమయ్యెదమఁ నిశ్చయించి పర్వ
తశృంగంబుమీఁద నుండి సంపాతిం దిగిచికొని తెచ్చితమముంగలనిడికొనిరప్పు
డంగదుండు సంపాతినవలోకించి యిట్లనియె ॥ (ఉ) ఆవిధికిం దనూజుఁడుమ

(*)అంగదుఁడు సంపాతికి జటాయువు మరణ ప్రకారంబెఱింగించుట.(*)

హాత్ముఁడు ఋక్షరజుండులోకసం । భావితుఁడొప్పునాతనికి మానుగఁబుట్టిరిధా
త్రివాలిసు । గ్రీవులనంగ నందల బలీముఖనాయకుఁడైనవాలికి । నీనరయేను
నందనుఁడ ధీరుఁడనంగదనామధేయుయుఁడన్ ॥ (మ) ఇనవంశోత్తముఁ డాజికగ్ర
తనయుండిక్ష్వాకునాథుండుర । మన రేంద్రుండుమహారథుండుత్రిజగన్మాన్యుండు
తమ్ముండుగే। హినియుంగొల్వఁగఁదండ్రిపంపుననయంబేపారఁగాధర్మమా।
గన్నిరూఢస్థితిగండకాటవికి వేగంబొప్ప వచ్చెన్రహిన్ ॥ (ఉ) ఆనరనాథపత్ని
సుగుణాకరచిత్తను జానకిన్జన । స్థానమునందు రామరహితంబుగనుండెడువేళ
వంచన । న్దానవభర్తరావణుఁడు దగ్గగ తింగొనిపోఁగఁజూచితా। త్కాననవాసి
యూ దశరథప్రియకారి జటాయువయ్యెడన్ ॥ (శా) వీఁకందాఁకిదశాస్యుతోఁ
దొడరియు ద్వృత్తిన్నలోదగ్రుఁడై । లోకంబంతయు మెచ్చఁగొంతవడి సంగ్రా
ధఁబుగాఁబోరియ । స్తోకప్రౌఢిమఁదగ్రథంబడచిసంధుల్ ద్రచ్చిబాహాబలో
ద్రేకంబున్బెడఁబాపిబిట్టలసినీల్గెన్వాని చేతంబుదిన్ ॥ (తే,గీ) అంతరఘుపుంగ
వుఁడుతనకాంతయైన । సీతవెదకుచునచ్చోటుఁ జేరవచ్చి । యసురఖడ్గధారా
హతుండై ధరిత్రిఁ । గూలియున్నజటాయువుఁబోలఁజూచి ॥ (వ) మిక్కిలిశో
కించితనతండ్రియగు దశరథునకుంబోలె నతనికి సంస్కారంబు గావించి శా
శ్వతమైనసద్గతికింబుచ్చియచ్చోటువాసి ॥ (ఉ) ఆవలఋశ్యమూకమున కద్ధిర
యంబున నేగియందుసు । గ్రీవునితోడ నెయ్యమొనరించి రఘుప్రవరుండులోక

—(*) అంగదుఁడు సంపాతికిఁ దాము ప్రాయోపవిష్టు లగుటకుఁ(*)—

(*)గారణము చెప్పుట.(*)

సం । భావితసత్త్వయుక్తుఁడగు మజ్జనకున్బలశాలివాలినేఁ । లేపడిఁద్రుంచిభా

నుసుతు నింబతిఁ జేసె వసాటకోటికిన్ ॥ (వ) ఇట్లు రాముని చేత నభిషిక్తుండైన సుగ్రీవుండు ॥ (ఉ) రాముని గేహిని న్వెదకి రమ్మని యాతఁడు మమ్ముఁ బంపఁగా । నేముగడంగి యామ్యదిశ కిందఱము న్జనుదెంచి యుందునా । నా మహనీయ శైల విపినంబుల నారసి యందు జానకి । న్యామిని యందు భానురుచి యట్లగనుంగొనలేక దీనతన్ ॥ (మ) రయమారం దగ వింధ్యశైలకటక ప్రాంతంబులం జూచుచు న్మయమాయామయమైన యొక్క బిల మధ్యానంబునం జొచ్చి వెం । డియుఁ రాఁజాలక రామభూమివిభు పత్నిం గానక చోటఁద । న్మయతంద్రిమ్మరుచుండ మాసమరిగెన్ మాకు న్విహంగోత్తమా ॥ (వ) అంతనొక్క పెరవున నబ్బిలంబు నిర్గమించి ॥ (మ) విమలాత్ముండగు రామ భూవిభుని దేవిం గానకీట్లుగను । గ్రమనస్కుండగు భానుజుండు మనలన్ ఖండించు నోయంచుఁ జి । త్తమునం గూరి నభీతినందఱము శ్యాగేచ్ఛ ప్రాయోపవే । శము గావించుచు నున్నవారము చట న్సంజాతఖేదంబునన్ ॥ (వ) అనిత మవృత్తాంతంబు సవిస్తరంబుగాఁ జెప్పిన విని బాష్పవ్యాకులలోచనుండై సంపాతి యవ్వానరులం జూచి యిట్లనియె ॥ (మ) ఇనచండాంశులఁ బక్షముల్ గమలియే నచ్చోటికిం బోవలే । కునికిన్ వార్ధికమొందుట న్ఘనబలంబొప్పారఁ గాలేమి నా । యనుజుం జంపిన నీచ దానవుని మాయింజేయ లేనైతిఁ గా । కనఘా పక్షములున్నఁ బాపనతదీయ ప్రాణముల్ వేనికిన్ ॥ (వ) మున్ను వృత్రవధకాలంబున నేనును నాతమ్ముండగు జటాయువును జయార్థులమై యొక్కనాఁడు సప్తమారుతజవంబున మింటికెగసి యాకాశంబు నావరించి సప్తాశ్వమండలంబుదాఁక నరిగి యంబరమధ్యగతుండైన చండకరుని కిరణంబుల వేడిమికిం గాక జటాయువు సొలసిన నేను సూర్యకిరణాదీర్ణుండనై యతనిఁ బక్షంబులం గప్పిన నా పక్షంబులు దగ్ధంబులగుటయు సంచారంబు దక్కి విహ్వలుండనై వింధ్యాద్రిపయిం బడితి నాటంగోలె నజ్జటాయువు వసించిన చోటెఱుంగకున్నవాఁడ ననిపలికిన నా సంపాతి వచనంబులు విని యంగదుండు వెండియు నిట్లనియె ॥ (చ) అనుజుని జంపచన్న దివిజారివధిం చెడనంచుఁ బల్కితి । వనఘ వయోధికుండవు సమస్తము గానఁగ నేర్చు దైత్యుఁ డిం । పెనయుఁగ మేదినీతనయ నెచ్చట డాఁచిన వాఁడు తన్నికే । తనము దియేడ నిచ్చటికి దవ్వొ సమీపమొ నాకుఁ జెప్పవే ॥ (క) నా విని సంపాతి ముదం । బావిర్భవమందఁగ ఘనసందోహాషణ । ప్రావృతచిత్తులఁ జేయుచు । నా వాలిత పూజు తోడ నపు



డిట్లనియెన్ ॥ (చ) ఖరకరురశ్మిఁ బక్షములు గాలి బలంబఱియున్కిఁ జేసి భా । స్కరకులుఁడైన రామునకుఁ గర్జము చేనుపకారమేమియు । న్బరువడిఁ జేయఁ జాలఁగ పినాథ తనూభవ మాటమాత్రమే । నరుదుగ నాజితారికి సహాయుఁడ నయ్యెదనాలకింపుమీ ॥ (వ) మఱియు దశరథసఖుండనైన నా చేత రామసాహాయ్యంబవశ్యకర్తవ్యంబై యుండు నతలాద్యధోలోకంబులును భూమ్యాద్యూర్ధ్వ

—(*)సంపాతి యంగదునకు సీతయున్న స్థలంబెఱింగించుట.(*)—

లోకంబులు నెఱుంగుదు నదియునుంగాక ॥ (మ) మును విష్ణుండు త్రివిక్రమాకృతి జగంబుల్ నిండి వ్యాపించుటల్ । దనుజుల్ దేవులు వార్ధి దరచ్చి సుధ నందం బొప్పఁ బుట్టించుట । ల్విను మానాకెఱుకయ్యె నిప్పుడు జరావిస్ఫూర్తిఁ దేజంబు మా । సెను గాత్రంబు వడంకఁ జొచ్చె నసువుల్ జీర్ణంబులయ్యెన్ గడున్ ॥ (మ) ఒకనాఁడే నిటనొంటిమై నగడఁ కత్తో నుండంగ వ్యోమంబున । న్వికటాకారుఁడు పంక్తికంఠుఁడొకత న్విస్రూప సంపన్నన । త్యకలంకోజ్జ్వలదివ్యరత్నమయ హారాలంకృతాంగిం దుషా । రకరాస్యన్జలజాతనేత్రఁ గొనిశౌర్యప్రౌఢి నేగెన్ వడిన్ ॥ (మ) అపుడా భామిని రావణాంకగతయై హా రామ హా రామ హా । నృపవంశోత్తమ లక్ష్మణా యని రహి న్బెర్వొంచు బిట్టేడ్చుచు । న్విపులోత్తంసములూడ్చి వైచుచుఁ గడు న్విభ్రాంతయై శోకబా । ష్పపరీతేక్షణయై వెసం జనెనభోభాగంబు కంపింపఁగన్ ॥ (క) ఆసతి నవీనకోమల । కౌసుంభపటంబు నీల కాయుండగుదు । ష్టాసురుని కడనలరెఁ దా । రాసుత నీలాబ్దమందు ప్రాదినిఁ బోలెన్ ॥ (క) మానుగఁ గీశోత్తమ వినుము । మేసిపుడా పద్మనేత్రనెంతయు రామ । క్ష్మానాథు కీర్తనంబున । జానకిఁగానెఱిఁగి కొంటి సంభ్రమమెససఁగన్ ॥ (వ) ఇంక దురాత్ముండగు రావణుని చందంబు వినుము ॥ (చ) ప్లవగవరేణ్య వాఁడలపు లస్త్యసి పౌత్రుఁడు పుణ్యుఁడైన వి । శ్రవు తనయుండు శ్రీదునను జన్ముఁడు వాని పురంబు లంకనా । లవణపయోధిమధ్యమున రాజిలుఁ దొల్లి సురోత్తముఁడు శి । ల్పవరుఁడు విశ్వకర్మ సుచరిత్రుఁడు దాని రచించె నేర్పునన్ ॥ (క) అది మఱియుఁ దప్తజాంబూ । నదచిత్రద్వారతోరణవరణయైశో । భదయై రమ్య విలాసా । స్పదమై యెతనరారునతి విశాలవిభూతిన్ ॥ (వ) అప్పురంబిచ్చటికి నూఱు యోజనంబుల దవ్వులం బ్రకాశింపుచుండు ॥ (క) అందు దశాస్యాంతఃపుర । మందునిశోకనిరుద్ధయై జానకిచిం । తం దలఁకుచు సంతాపము । నొందుచుఁ ద్రానుప

గలఁబొగులు చున్నదియనఘా॥ (చ) అరుదుగనూఱుయోజనము లంబుధిన
శ్రీమలీలమీరుస। త్వరముగదాఁటిరమ్యమగు దక్షిణపారముఁ జేరియందుసా।
గరపరిఘాపరీతయయి గ్రాలెడులంకను జొచ్చియచ్చట। న్గుఱుతుగ జానకిన్దశ
ము ఖుఁగనుఁడెంతయుసంతసంబునన్॥ (వ) ఏను జ్ఞానదృష్టింజూచి చెప్పెద
మీరశ్రమంబున సముద్రంబు దాఁటి జానకిం జూచి శీఘ్రంబునం బఱతెంచెదరు
నీకిట్టిదివ్యజ్ఞానం బెట్లుగలిగెనంటివేని మహీసమీపగగనచారి ధాన్యజీవి కుళిం
గాది పక్షివిశేషంబులకుఁ బ్రథమగతియు వృక్షఫలాశనంబులైన వాయసాదు
లకు ద్వితీయగతియు భాసక్రౌంచ కురరంబులకుఁ దృతీయగతియు శ్యేనంబుల
కుఁజతుర్థగతియు గృధ్రంబులకుఁబంచమగతియు బలవీర్యరూపయౌవనవం
తంబులైనహంసలకు నాఱవగతియు వైనతేయునకు సప్తమ గతియుఁ గలిగి
యుండు నే మావైనతేయవంశసంభవుల మగుటం జేసి మాకాసప్తమగతిగలి
గియుండునందువలన మాకుదివ్యజ్ఞానంబు గలిగియుండుదానం జేసి యేనిచ్చ
టనుండియు లంకాపురంబుననున్న రావణుని జానకిని విలోకింపుచున్నవాఁడ
నదియునుంగాక మాకు దివ్యజ్ఞానమాత్రంబగాదు బహుదూరదర్శియైనదివ్య
చక్షుర్బలంబునుం గలిగియుండుఁగావున నాహార వీర్యంబుచేతను సౌపర్ణ
త్వనిబంధన స్వభావంబుచేతను నిత్యంబును శతయోజనపరిమితదూరంబునం
గల సమస్తవస్తువుల విలోకింపుచుండుదుము మాకు దూరదేశస్థిత భక్ష్యగ్ర
హణంబు స్వభావంబున విహితంబై యుండుఁ గుక్కుటాదులకుఁ బాదవికీర్ణ
ప్రదేశంబునందు జీవనంబువిహితంబై యుండు నెవ్వనిచేతనిందితకర్మంబు కృ
తంబయ్యె నట్టిరావణునకు మద్భ్రాతృకారణంబున మీచేతఁబ్రతీకారంబు కృతం
బుకాఁగలదు గావున మీరుశీఘ్రంబున సముద్రలంఘనంబునం దుపాయంబుచిం
తింపుఁడు నిక్కంబుగా జానకినిసందర్శించి కిష్కింధకుం జనియెదరు స్వర్గ
తుండునుమద్భ్రాతయునగు జటాయువునకుదకదానంబు గావింపవలయు నన్ను
సముద్రతీరంబునకు దోడ్కొనిపొండని పలికిన నవ్వానరపుంగవు లట్లకావిం
చి యెప్పటియట్ల నిదగ్ధపక్షుండైన సంపాతిందెచ్చి సుఖాసీనుం జేసి యుండ
ఱు సీతావృత్తాంతంబునుపలంభించి సంప్రహృష్టచిత్తులై సంపాతిం బరివేష్టిం
చియుండిరప్పుడు హరిశ్రేష్ఠుండగు జాంబవంతుండు సంతుష్టహృదయుండై ర
యంబున సర్వవానరసమన్వితుండై లేచి సంపాతి కిట్లనియె॥ (మ) ధరలోనె



వ్వాఁడురామకార్ముకవిముక్తక్రూరవజ్రోపమ। స్థిరబాణంబుల తీక్ష్ణవేగము
మదింజింతింపకామేదినీ। వరపుత్రింగొనిపోయెనెందుఁగడుదుర్వ్యాపారుఁడై
డాఁచెన। త్తెఱంగెల్లన్వినుపింపునీవెగతిగా దేమాకునిప్పట్టునన్॥ (క) అనవి

—*సంపాతితనకు రావణకృత సీతాపహారంబు దెలిసిన తెఱంగు*—

—(*)వానరుల కెఱింగించుట.(*)—

నిసంపాతిమనం। బునసంతోషించిప్రీతిఁబుట్టింపుచుభూ। తనయావృత్తాంతము
మది। వినఁగోరెడుకపులఁగాంచి వేడుకననియెన్॥ (క) ఎవ్వాఁడుసీతఁగొనిచ
నె। నెవ్వాఁడవ్వార్తనాకు నెఱిఁగించెగరం। బవ్వసితయున్న పట్టణ। మవ్విధ
మెఱిఁగింతుమీకునంతయువినుఁడీ॥ (వ)బహుయోజనాయతంబైన యీగిరిదు
ర్గంబున నేను చిరకాలంబుననుండి దగ్ధపక్షుండనై నివసించి యుండ నాపు
త్రుండుసుపార్శ్వుండనువాఁడు నిత్యంబు నాకాహారంబుఁ దెచ్చి యొసంగుచుం
డు వాఁడొక్కనాఁ డామిషార్థియైచని రాత్రిరాక మఱునాఁడు నిరామిషుం
డై నాకడ కరుగుదెంచిన వానింజూచి గంధర్వులకుఁ గామంబును సర్పంబుల
కుఁగోపంబును మృగంబులకుభయంబును మాకుక్షుధయు నైసర్గిక ధర్మం
బుగావున నేను క్షుత్పిపాసాపరవశుండనై కోపించి నిష్ఠురోక్తులం దూలనాడి
న నక్కుమారుండు భయవిహ్వలుండై కేలుగీలించి వినయంబుననాకిట్లనియె॥
(సీ) అనఘాత్మనీకునాహారంబుఁగొనితెచ్చు వేడ్కనేనాకాశ వీధికేగి। తగమ
హేంద్రనగంబుదరిసితద్వారంబు గాచిసాగరచరకమఠముఖర। సత్వంబులను
బొంచిసంగ్రహించెదుకాంక్షఁ దలవంచియొకచోటఁదిరలకుంటి। నపుడొక్క
నీలాచలాకృతిగలవాఁడు భాస్కరప్రభ భంగిఁబరఁగునొక్క॥ (తే,గీ) వనితఁ
గొనిశీఘ్రగతిమింటజనుచునన్నుఁ। గనుఁగొనివినీతుఁడగుచుమార్గంబునడిగి।
నావలనఁద్రోవనెఱిఁగి తేజోవిశేష। మంబరమునిండఁజేయుచు నవలఁజనియె॥
(వ) అంత మహర్షులును సిద్ధచారణాదులును నాకడకుం జనుదెంచి నన్నా
శ్వాసించి ఖగేంద్రానీవు దైవికంబున జీవించితి వింకనీకు నిస్సంశయంబుగా
స్వస్తియగునని పలికిన నదియేమియనియడిగిన నమ్మహాత్ములు నాకిట్లనిరి॥ (చ)
అనుపమశక్తియుక్తుఁడుద శాస్యుఁడురాక్షస భర్తవాఁడురా। మునిసతిబల్మిఁ
గైకొనిస ముద్ధతినేగెడువానికడ్డమై। యనిమిషులైననిల్వఁగస మర్థులుగా
రిపుడీవువానికి। న్గనుపడిక్రమ్మఱన్బ్రతుకుఁ గంటివినేఁడిటు దైవికంబునన్॥ (మ)

అనఘామాయాదివిజారియంకగతయై హారామహాలక్ష్మణా । యనివాపోవుచుదివ్య
కాంచనమణీ హారావళులప్పుచ్చుచుం । గనులన్నాప్పు జలంబుగాఱ నోడలాకం
పింపనాక్రందన । స్వనముం జేయుచుఁజన్న కాంతనుమది౯ త్రైపుత్రిం గాంచూడు
మీ॥ (వ) అనిపలికి యమ్మహర్షిశ్రేష్ఠులు నన్నూఁబంచిన । (క) ఆకారణము
ననేనిపు । డాఁకలిగొనియున్న నీకునాహారంబు । న్దేకూరకేవచ్చితినని । ప్రాక
టముగనంతయునుసు పార్శ్వుఁడుచెప్పె౯ ॥ (ఉ) చెప్పిననాఁటనుండి యనుజి
త్తమునంగడుఁగోపనూఁదినే । నెప్పుడుపంక్తికంఠువధి యింపుదుసీతను రామ
భర్తకే । నెప్పుడుభక్తినిత్తుననియంతయుఁజింతిలుచుందుఁజెప్పిన । ట్లొప్పుగఁజే
యలేనయితినొక్కటతెక్కలులేమినారయ౯ ॥ (వ) నాకునుమీకుంబోలె రామ
కార్యంబవశ్యకర్తవ్యంబైయుండు వాగ్బుద్ధిగుణవర్జితుండైననాచేత నెయ్యదిహి
తంబాచరింపఁ గర్తవ్యంబంటిరేని వాక్కుచేతను బుద్ధిచేతను మీకందఱకుహి
తంబాచరించెద మీరుబలవంతులును బుద్ధిమంతులును రామలక్ష్మణుల దివ్యా
స్త్రంబులమోఘంబులు ముల్లోకంబులనైన నొక్కయెత్తున భస్మంబుసేయనో
పు సుగ్రీవుండు తేజోబలసమన్వితుండు మీరిందఱకోద్యోగులైకడంగిన దురా
త్ముండగు రావణుండుపాలియుటకెంతయనశ్రమంబున వారింబరిమార్చి౯ కళ్యా
ణగుణసమేతయైన సీతంజేకొని రామునకు సమర్పించెదరు గానఁగాలవిడం
బనంబు సేయక భవిష్యదర్థంబునందు బుద్ధినిశ్చయంబుగావింపుఁడు భవా
దృశులైనబుద్ధిమంతులు కార్యంబులందుఁ జిక్కుపడరని పలికి వెండియుజని
త విశ్వాసుండై సంపాతి సంతోషవిశేషంబున నంగదు నవలోకించి నావృ
త్తాంతంబును సీతావృత్తాంతంబును విస్పష్టంబుగా వినుపించెద నేకాగ్రచిత్తు
లై వినుండనియిట్లనియె ॥ (క) మునుచండకరునికరముల । ఘనముగ నాప

—(*)సంపాతి వానరులకుఁ దనపూర్వ వృత్తాంతము సెప్పుట.(*)—

క్షయుగము గాలిమహీంధ్రం । బునఁబడితినన్న వాతజను । వినుపింపఁగ మీరలె
ల్ల వింటిరిగాదే॥ (వ) ఇట్లుశిఖరిశిఖరంబునంబడి యుండియాఱు రాత్రంబులకు
మూర్ఛదేఱి దిక్కులుపరికించి సాగరశైలనదీనదసరోవరంబులన్నియు వీక్షిం
చిసముద్రవేలావనంబులు విలోకించి కొంతతడవునకుఁదరుకందర సానునిర్ఝ
రాద్యభిజ్ఞానంబుల వలననిది దక్షిణసముద్రతీరంబునం బొల్చువింధ్యపర్వతం
బుగదాయని తెలిసికొంటి నిచ్చటనప్పుడునిశాకరుండను మహర్షిశ్రేష్ఠుండు



బ్రహ్మాసముండొక్క మహాసీయాశ్రమంబు నిర్మించుకొని యందు నేనుసుజటా
యువు నిత్యంబుసేవింపుచుండఁ బెద్దకాలంబత్యుగ్ర తపంబు గావింపుచుండెన
తండిప్పటికి నెనిమిదివేలేండ్లముందఱయదేచ్ఛంబుగనాకంబునకుంజనియె నేనాప
ర్వతాగ్రంబుడిగ్గి దర్భకంటక పరివృతయైన విషమభూమినతిప్రయాసంబున సం
చరించి క్రమ్మఱ నతివిశాలరమణీయనిరంతర కుసుమఫలభరితవివిధతరులతావి
సర విభ్రాజితమహోద్యాన సంకులంబైనయమ్మునియాశ్రమసమీపంబునకుంజ
నియొక్కవృక్షమూలంబున నాసీనుండనై మందమారుతానీత పరిపక్వఫలకుసు
మవిసరదివ్యగంధం బాఘ్రాణించి యరుదందుచు భగవంతుండైననిశాకరము
నిరాకఁగోరుచుండ ననతిదూరంబున భానుప్రభాభాసమానుండుసుగ్రతాభిషే
కుండును దుర్ధర్షుండును నుదఙ్ముఖుండునై వచ్చుచున్న నిశాకరమునీంద్రున
వలోకించి సంతసించి తద్గతవీక్షణుండనై యుండునప్పుడు ॥ (చ) పరువడిధాత
వెంటఁజను ప్రాణులకైవడి మాని వెంబడిం । గరిహరిముఖ్య దారుణమృగంబు
లుపోయిమునీంద్రుఁడాత్మమం । దిరముసారంగ వెన్క కరుదెంచె నృపుండుగృ
హంబుసేరను । స్థిరముగ మంత్రులు౯ హితులు సేనలువెన్కకుఁ బోవునట్లు
గ౯॥ (వ) అట్టివిచిత్రంబుఁజూచియేను నమ్మహర్షిశ్రేష్ఠుని వెంటంజని యాశ్రమ
ద్వారంబుననుండితి ॥ (క) మునివరుఁడునన్నుఁగనుఁగొని । మనమున గుఱుతి
డఁగ లేకమానుగనుఁటజం । బునకేగినిమిషకాలము । చనునంతకు మఱలివచ్చి
సంభ్రమమెసఁగ౯॥ (వ) నన్నువిలోకించి ॥ (తే,గీ) ఎవ్వఁడవునీవు పక్షంబులే
టికిట్లు । గమలెనీచర్మమేటికిఁ గందెనిపుడు । రోమవైకల్యమునఁజేసి నామ
నమున । గుఱుతిడఁగ లేకయున్నాఁడ నెఱుఁగఁజెపుమ॥ (క) ఖ్యాతిగ నిచ్చటము
నుసం । పాతిజటాయువులనంగఁబక్షిప్రవరు । ల్భ్రాతలువిశ్రుతపౌరుషు । లా
తతబలురిద్దఱుండు రధికప్రీతి౯। (తే,గీ) అందుసంపాతిపెద్దవాఁడతనితమ్ముఁ
డాజటాయువు వారిద్ద ఱనయకామ । రూపులౌటచేమానుష రూపులగుచు
నొప్పిదంబుగననుఁగొల్చుచుందు రెపుడు ॥ (క) శూరులు సమీరవేగులు । సా
రబలోదారులమితజవసత్వయుతు । ల్వారిప్పుడెచ్చటికిఁజని । నారోగులు తెలిఁగి
తేని నాకుంజెపుమా ॥ (వ) అనిననమ్మునీంద్రుపలుకులువిని యేను ప్రీణానన్ద
నుండనై భక్తితాత్పర్యంబున నంజలిగీలించి యేనుసంపాతి ననిపలికి పదంప
డి నావృత్తాంతంబంతయు సవిస్తరంబుగా నెఱింగించు వాఁడనై యేనిట్లంటి॥

(సీ) అనఘాత్మ యేనుజటాయువుఁ దర్పమోహితులమై జవసత్త్వ మెఱుఁగఁగో రి। మనలోన నెవ్వఁడుదినములోపలసూర్యుమును ముట్టువానికి, ముట్టనట్టి। వాఁడర్ధరాజ్యంబు పరుసతోడనొసంగు నట్లుగామునుల సమక్షమందుఁ। బన్నిదం బిడిశంభు,పర్వతంబున నుండి యేకకాలంబున,నిరువురమును॥ (ఆ,వె) మింటికెగసి గాడ్పు, కంటె ఖగేంద్రున। కంటె మానసమున, కంటెనధిక। జవముతోడ గగన,చరభూతసంతతి। నంతనంతగనుచు నరిగి యరిగి॥(మ) గరిమన్ దివ్యుల భవ్యవాద్యరవముల్, గంధర్వగానస్వరో। త్కరముల్దేవసతీవిభూషణకల, ధ్వానంబులు న్నామగా। నరవంబుం దగవించు నిర్జరవిమా, నశ్రేణులం జూచుచు। న్నేరవొప్ప న్సుర సిద్ధసాధ్యతతుల, న్వీక్షింపు నొవ్వుచున్॥ (సీ) మఱలిమాడఁగఁదోచె,మాకుశతాంగ రథాంగప్రమాణంబు లైపురములు। శిఖరి సంఛన్నమై, చిరుపఱ్ఱాల్పఱచిన చేని కైవడి భూమి గానవయ్యె। మడుగులోఁజిక్కిన, మాతంగములమాడ్కి వింధ్యాదికులశైలవితతులొప్పెఁ। జంపకారణ్యాది, సకల కాంతారము ల్పచ్చికతిన్నెల, పగిది దోఁచె॥(తే,గీ) బేరుగలనదులన్నియువేఱువేఱు। ముత్తియపుఁ జేలచందాన మొనయుచుండె। శరధు లద్దపు బిళ్లల, కరణినలరెఁ। బాదపము లెవ్వియు నుగను, పట్టవయ్యె॥(తే,గీ)అంతమఱికొంతదూరమ ట్లరిగియరిగి। యేమిదోఁచక మది ఖేద, మినుమడింప। నేలవచ్చితి మిటకు నిం, కెట్లఁటంచు। మోహవశమున నెంతయు,మూర్ఛఁదగిలి॥ (క) ఇది దక్షిణమిదియుత్తర। మిదితూర్పిదిపశ్చిమాశ, యివిమూల లఁటం। చదియేర్పరింపజాలక। మదిసంకటపాటు సంభ్రమం బిగురింపన్॥ (క) సుడివడి కన్నులుదెఱవక। కడురయమునఁబుడమి కుఱుకఁ,గాలేకవడిన్। బొడగవెయుటకుంజాలక। జడతన్గొంతవడి భీతిసంత్రస్తులమై॥ (వ)ఉండి వెండియునొక్కింత ధైర్యంబునఁగన్నులువిచ్చికొండొకపొడ వెగయ ననతిదూరంబునఁ బ్రళయకాలాగ్ని చందంబున వెలుంగుచు రక్తవర్ణంబై భూమండలప్రమాణంబై దేదీప్యమానంబై మార్తాండ మండలంబు గానంబడియె నప్పుడ త్తేజోమూర్తితిగ్మకిరణప్రసరణ సంజాత గాఢమూర్ఛాగతమంబుగవియ వివశుండై జటాయువు తలక్రిందుగాఁగ డువడిఁ బుడమింబడుచుండ నతనిం జూచి యేనుబూర్వాధిష్ఠితాకాశప్రదేశమున నుండి జటాయూరక్షణార్థంబు ప్రసారితపక్షుండనై తదుపరిభాగంబున దిగంబడుచుండ



నాజటాయువు మత్పక్షరక్షితుండై దహింపంబడకుండె నేను బ్రమాదంబున దగ్ధపక్షుండనై వాయుపథంబుననుండి వింధ్యపర్వతంబునంబడితి జటాయువుజనస్థానంబునంబడియెననివింటి నిట్లువింధ్యాద్రిపయింబడియేను దగ్ధపక్షుండనై రాజ్యహీనుండనై విక్రమరహితుండనై జటాయువునుంబాసి దుఃఖింపుచుఁ బక్షంబులు లేనినాకు నింకెక్కడిజీవనంబని తలంపుచు శైలశిఖరంబుననుండి విఱుగం బడియైనఁ జచ్చెదఁ గాక యని మరణకాముండనై యిట్లున్నవాఁడ॥ (క) అని పలికి బాష్పధారలు। కనుగొనలం గ్రమ్ముదేఱ, ఘనతరదుఃఖం। బున నన్నన్నుఁ గనుఁగొని। తన మదిఁ దలపోసి మాని,తగ నిట్లనియెన్॥ (ఉ)పక్షివరేణ్యా ప్రాకృతుని, భంగిఁ గృశింపఁగ నేల నీకు నీ। పక్షములుం బరాక్రమము, ప్రాయము సత్త్వము మున్నపోలెనీ। కక్షయమై ఖరిన్బొలుచు, నారసిదానికి హేతువేను బ్ర। త్యక్షముగాఁగఁ గంటి విను, మాకథ యంతయు నీకుఁ జెప్పెదన్॥ (సీ) దశరథాఖ్యుఁడగు, ధరణీశునకు రాముఁ డనఁగ నందనుఁ డొక్కఁడవతరించు। నమ్మహామహుఁడు ప్రి,యానుజయుక్తుఁడై జనకుపంపునవనంబునకువచ్చు। రావణుండనుదుష్ట, రాక్షసుండొక్కఁడా యవనీశ్వరునిదేవి,నపహరించు। నద్దేవిరాక్షసా,హారంబు గొనకున్న నమరేంద్రుఁ డమృతద, వ్యాన్న మొసఁగు॥ (తే,గీ) రమణదేవత్వ మొందిన,బ్రతికియున్నఁ। బరఁగ నీయన్నమారఘు,వరుల కనుచు। నగ్రభాగంబుఁగైకొని,యమ్మహీజ। ప్రియము మెఱయఁగఁ బెట్టుధ, రిత్రిమీఁద॥ (క) ఆరమణిని వెదకుచుసాం। పారఁగరఘురామదూత,లగు కపులిటకుం। గోరిక రాఁగలరప్పుడు। వారికినీవామహీజ,వార్తం జెప్పుమా॥ (క) ఆకపులతోడ నీవును। జేకొనిసంభాషణంబుఁ,జేసితివేని। న్నీకెప్పటివలె ఱెక్కలు। ప్రాకటముగ జవము బలము,ప్రాయమువచ్చున్॥ (క) మరణేచ్ఛవిడిచియండజ। వరయిచ్చట దేశకాల,వర్తనములలో। గరయుచుఁగీశాగమనము। నురువడి నెప్పుడును గోరు,చుండుముప్రీతిన్॥ (క) ఏనిప్పుడునీకుఱెక్కలు। మానుగ నీఁగలనయైన, మానకనీవి। చ్చోనుండవలయుసృష్టికిఁ బూనికఁగడుహితము సేయు,పొమ్మిఖగేంద్రా॥ (క) నాకునుపిప్రోత్తములకుఁ। బ్రాకటముగ లోకములకుఁ,బరమునులకు। న్నాకస్థులకును సురలకు। నీకార్యము ఖగవరేణ్యా, హితమై యుండున్॥ (వ) నాకును రామలక్ష్మణులం జూడ వాంఛగలదైనను జిరకాలంబు

నసుండి జీర్ణంబైన యీశరీరంబునందుఁ బ్రాణంబులు నిలుపుకొనుటకు భారంబై యున్నది గావునఁ గళేబరత్యాగంబుఁ జేసి దివంబునకుం జనియెద నని పలికి యమ్మునీంద్రుండు నిజాశ్రమంబు ప్రవేశించె నంత నేను గిరికందరంబువలన నిర్గమించి మెల్లన వింధ్యపర్వతాగ్రంబు నారోహించి మునివచన ప్రకారంబున భవత్పరిపాలన కర్మంబునందు సమాహితుండనై దేశకాలంబులు ప్రతీక్షింపుచు శీతవాతాతపంబులకుం జావక ప్రాణంబులు చిక్కఁబట్టుకొని యుంటి నంతఁ గొంతకాలంబునకు నమ్మునీంద్రుండు మహాప్రస్థానంబుఁ జేసి దివంబునకుం జనియె నాఁటఁగోలె నేను పరమదుఃఖంబునం బొగులుచు మరణంబునందు సముత్థితమైన బుద్ధిని మునివాక్యంబులచేత నివర్తింపుచుఁ బ్రాణసంరక్షణంబు గావు మునీంద్రునిచేత నయ్యది దత్తంబయ్యె నట్టి వివేకంబుచేత దీప్తాగ్నిశిఖచేతఁ దమంబుం బోలె దుఃఖంబు నపనయింపుచు మీరాక కెదురుసూచుచు నిన్నగంబునందున్నవాఁడనని పలికి సంపాతి మెండియు నిట్లనియె ॥ (ఉ) ఏనుజవాతిరేక

(*) సంపాతికిఁ బక్షములు మొలుచుట. (*)

మున, నెంతయు వారిధి దాఁటి లంకలో । జానకిఁ గాంచి మీకడకుఁ, జయ్యన రాఁగలనైన నిప్పుడో । వానరవీరులార కడు, వార్ధకమొందుటఁ జేసి దుర్మదుం । డైన దశాస్యునిం దొడరి, యాలము నప్పగఁ జాలఁ బల్విడిన్ ॥ (క) అని యుచితోక్తుల మోదము । జనియింపఁగ మాటలాడు, సంపాతికిఁ జ । య్యనఁ గపులు చూచుచుండఁగ । ఘనముగఁ బక్షములు రెండుఁ, గ్రక్కున మొలిచెన్ ॥ (క) శౌర్యము సత్త్వము తేజము । ధైర్యము విక్రమము జవము, దర్పము బాహావీర్యము మును పటిపోల్కిన । వార్యగతిం దోఁడుతోఁడ, వరుసన్ బొడమెన్ ॥ (వ) అభినవరూపయౌవన పక్షవంతుండై యప్పక్షీంద్రుండు పరమానందభరితాంతఃకరణుండై వానరుల నవలోకించి యిట్లనియె ॥ (చ) అమరవిశోకరుండు దయ, నాదినకై వడి సూర్యరశ్మిచేఁ । గమలిన నాదుపక్షములు, గ్రక్కున నిప్పుడు పచ్చెభూరి తేజము జవసంపద లగ్గలిగె, సత్త్వము చేకుఱె పస్ఫురత్పరా । క్రమము లరారె శౌర్యమును, బ్రాయము శోభితెఁ బూర్వవైఖరిన్ ॥ (చ) జనకజవార్త మీకు వరుస, న్వినుపించితిఁ బుణ్యుఁడైన రా । మునకు హితంబుఁ జేసితిని, మున్నతిధన్యుఁడనైతి మీరుచ । య్యనజలరాశి దాఁటఁగఁ బ్ర, యత్నము సేయుఁడు కార్యసిద్ధిఁ గై । కొనుఁడిక వేడ్కనేను నయ, కోవిదులార తమిఁ జరించెదన్ ॥ (క) అని పలికి వానరుల



వీ । డ్కొని వాయుసమానజవుఁడ, కుంఠితశౌర్యం । డనఘుఁడు సంపాతి రయంబున నంబరవీథి కెగసి, పోయె న్గడిమిన్ ॥ (వ) అంతఁ దారేయాది వానరవీరులు

(*) వానరు లందఱు సముద్రతీరముఁ జేరుట. (*)

సంపాతి వచనంబులు విని ప్రీతిసంహృష్టమానసులై ప్రాయోపవేశంబు చాలించి విక్రమబల పౌరుషంబు లాశ్రయించి సీతాదర్శన లాలసులై యచ్చోటు వాసి యందఱు సమీరసమాన వేగంబున నాకాశంబున కెగసి దిక్కులదురు వసింహనాదంబులు సేయుచు నుత్సాహసమేతులై రావణ నిలయభూతలంకాద్వీపంబు నుద్దేశించి తన్మార్గభూతంబైన సాగరంబు డాయ సమకట్టి యొక్కింత దూరంబరిగి సమస్తలోక ప్రతిబింబాధారభూత ముకురతలంబుం బోలె నొప్పుచున్న దక్షిణసముద్రోత్తరతీరంబుఁ జేరి యచ్చట సన్నివేశంబు గావించి ॥ (చ) అనఘులు వానరప్రవరు, లంబరచుంబితరంగపంక్తిచే । ఘనబలిసద్మవాసిభుజ, గంబులచే రజనీచరాలిచే । ననుపమ మీనకూర్మ మకరాదిమహాజలసత్త్వకోటిచేఁ । దనరెడు దానిఘోరమగు, దానిఁ బయోనిధిఁ గాంచి రయ్యెడన్ ॥ (వ) మఱియు రోమహర్షణకరంబును గగనంబుభంగి దుష్పారంబగు మున్నీరు కన్నారం జూచి ॥ (చ) అతిభయదాకృతిన్ జగము, లన్నియు నొక్కట ముంపఁజాలి యా । తతఘనవీచికావళులఁ, దర్పయు నొప్పెడు నీపయోధియే । గతిఁ దరియింత మెయ్యదిఁ కఁ, గార్యమటంచు విషణ్ణమూర్తులై । ధృతిచెడియుండి రప్పుడున, దీశవిలోకనజాతఖేదులై ॥ (వ) ఇట్లు సాగరనిరీక్షణంబువలన విషణ్ణులై యున్న వానరుల నవలోకించి వీరందఱు భయాతురులై విషాదంబు నొంది యున్నవారు విషాదంబువలనఁ బురుషార్థంబు సిద్ధింపదని విచారించి మతిమంతుండును మహాబలుండు నగు వాలిసూనుండు వారినందఱ నాశ్వాసింపుచు నిట్లనియె ॥ (ఉ) ఏలవిషాదమొందఁ బ్లవ,

(*) అంగదుఁడు వానరులకు నుత్సాహము కల్గునట్లు బోధించుట. (*)

గేశ్వరులార విషాదముర్విలోఁ । జాలఁగ దోషమందురు వి, షాదమ దెంత వివేకినైనఁ బో । బాలునిఁ గ్రూరపన్నగము, భంగి నశింపఁగఁ జేయు విక్రమో । ద్వేలితనాయుపున్ ధృతిని, దేజము నష్టముఁ జేయు నెంతయున్ ॥ (క) శోకంబు నొందఁ జనదు వి । వేకము గలనరుఁడు కార్య, విఘ్నమొనర్చు । న్శోకంబు మఱియు శోకముఁ । బోకార్చును ధాత్రిఁ బురుషుఁ, బురుషార్థంబుల్ ॥ (వ) కా

వ్రున మీరుశోకవిషాదంబులుదక్కి యుత్సాహవంతులుగండని బోధించిన నంగదువచనంబులం దేఱి యావానర పుంగవులు దేవతలు వాసవునింబోలె నతనిం బరివేష్టించియారాత్రి గొల్చియుండిరి ॥ (క) జలనిధికెనయగు వానర । బలమును వడినివ్వెరింపఁ, బావనికిమహా । బలుఁడగునంగదునకుఁగా । కిలవేఱొక్కనికి శక్య, మే తలపోయన్ ॥ (వ) అంతనమ్మఱునాఁ డంగదుండు పెద్దలగు జాంబవదాదులతో నాలోచనంబుఁ జేసి వారి యనుమతి వడసి యెల్లవానరులువినుచుండ నిట్లనియె ॥ (ఉ) ఎవ్వఁడు నూఱుయోజనము లిప్పుడు నీరధి దాఁటఁజాలువాఁ । డెవ్వఁడు భానుమత్తనయు, నెంతయుసత్యము చేతఁ బ్రోచువాఁ । డెవ్వఁడు నీబలీముఖుల, నెల్లఁగృపామతి నుద్ధరించు వాఁ । డెవ్వఁడు లంకఁజొచ్చి,పృథివీసుతం గని రాఁగలం డొగిన్ ॥ (ఉ) ఏహరివీరుసత్కరుణ, నిందఱు మిక్కడఁ బోకజానకి । న్సాహసమొప్పఁ గాంచి రఘు, నాథునకాసతి వార్తఁజెప్పియు । త్సాహ మెలర్ప వీటికి వె, సం జని మిత్రకళత్రపుత్రక । వ్యూహముతోడఁ గూడి సుఖ, యుక్తిఁ జరించెద మిండ్ల, పట్టునన్ ॥ (క) ఏపుణ్యాత్ముఁడుమనకిపు । డీపట్టుననభయ మొసఁగి యిందఱఁగృపచే । నే పారఁబ్రోచునెవ్వఁడు । భూపాలకమోదకారి పొలుపుగఁజెపుఁడీ ॥ (క) అనియంగదుండుపలికిన । వినికపివరులెల్లఁజాల వెఱఁగందుచునా । ననములువాంచి మఱిలనే । మనకుండినవారికనియె నాతఁడుమఱలన్ ॥ (ఉ) మీరుభుజాబలాధికుల మేయపరాక్రమ శీలురిందఱి । ట్లూరకయుండఁజెల్లునెప యోధినొకండొకఁడెంతదవ్వుపాం । పారఁగదాఁటనోపునుబలాబలము ల్దలపోసిచెప్పుఁడే । పారఁగరామకార్యమెటు లైననొనర్చుటవశ్యమేకదా ॥ (క) ఏలోకంబునఁడాఁచిన । వాలాయముసీతఁ గాంచివచ్చెదమనిస । ల్లాపములు పలికితుది । నీలాగునవెఱఁగునొందు టిదిఘనమగునే ॥ (వ) అనిన నయ్యంగదు వచనంబులువిని గజగవాక్షగవయ శరభ గంధమాదన మైందద్వివిద సుషేణ జాంబవంతులు తమతమ బలంబులకొలంది తలపోసి యత్యంతశక్తియుక్తుండైన రావణుం

—(*)వానరులు తమతమ జవసత్త్వంబుల నంగదునికిఁ జెప్పుట(*)—

డధిష్ఠించియున్న లంకఁబ్రవేశింపను జానకినన్వేషింపను సుదుష్కరంబనితలంచి తావృశ కార్యసాధకుండైన వీరుండు హనుమంతుండనియెఱింగి తత్రోత్సాహనాశనంబు మనమునందలమల్పంబుగా స్వస్వప్లవనశక్తినిరూపించి చెప్పవలయునని నిశ్చయించి యంగదునవలోకించి ॥ (సీ) నలువొప్పఁ బదియోజనంబులంబుధిదాఁట గలవాఁడనని వేడ్కగజుఁడుపలికె । నమరనిర్వదియోజనములు త్తరించెద నని సంభ్రమమునఁగవాక్షుఁడనియె । ముప్పదియోజనంబులువార్ధి దాఁటంగఁ గలవాఁడననిపల్కెఁగవయుఁడప్పు । డురువడినలుబది యోజనంబులుదాఁటఁ జాలుదునేనని శరభుఁడనియె ॥ (తే,గీ) మొనసి యేఁబదియోజనములుపయోధి । దాఁటఁగలననిగంధమాదనుఁడువలికె । నురుజవంబున నఱువదియోజనములు । దాఁటెదనఁటంచుమైందుండుచాటిచెప్పె ॥ (క) పొలుపుగడెబ్బదియోజన । ములునెనుబదియోజనములు మున్కొనిదాఁటఁ । గలవారమనుచుద్వివిదుం । డెలమిసుషేణుండుపలికి రెంతయుఁబ్రీతిన్ ॥ (వ) ఇట్లందఱుఁ దమతమ సత్త్వంబులకొలంది పలుక వారలఁజూచి యతివృద్ధుండును బలవంతుండునగు జాంబవంతుండిట్లనియె ॥ (ఆ,వె) వయసునాఁడునాకు వైనతేయునకంటెనొండు కార్యంబునధికజవముగలదు । కపివరేణ్యులారకడువృద్ధుఁడగుటచే । సయ్యెనుగ్రమ్మఱ । జ్ఞానమయ్యె ॥ (చ) అయిననురామభూవిభున కయ్యనసూతికిఁగూర్చువాఁడనైన ప్రియమునఁదోఁచినంతయొనరింపకప్రాణము దాఁచికొందునే । నియమమెలర్పనేనిపుడు నీరధిఁదొంబదియోజనంబులు । ద్రయముగదాఁటువాఁడనవలంజనఁజాలనువృద్ధుఁడౌటచేన్ ॥ (క) అనియిట్టులవ్వివరించ

—*జాంబవంతుం డంగదునకు మున్ను తాఁజేసిన సాహసంబులఁ జెప్పుట*—

న । తనయుండువచించిమఱిఁదరుచరవరులం । గనుఁగొనియుత్సాహముతోఁ దనపూర్వవిధంబుఁజెప్పఁ దగనిట్లనియెన్ ॥ (క) మునునేనుబలిమిఁగావిం । చినకార్యములెల్లనిపుడు చెప్పితినేనిన్ । ఘనులార విన్నవారల । కనిశముఁబరిహాసకరము లైయుండుఁగదా ॥ (వ) అయిననుం జెప్పెద వినుండు ॥ (మ) కనియున్నాఁడను దొల్లి శైలములు తె, క్కల్గల్గి వర్తించుట । ల్గనుఁజూల్వేల్పులు వార్ధిఁ ద్రచ్చి సుధనం దంబొప్పఁ బుట్టించుట । ల్ఘనుఁడౌ తార్క్ష్యవిభుండు పుట్టుటయు నీ, కర్ణానాక నాథుండులో । చనయుగ్మంబున నొప్పియుండుటయుని, స్పష్టంబుగానెంతయున్ ॥ (మ) బలభేదిం గృపఁ జూచి విష్ణుఁడుబలి న్బంధించిసాటోపుఁడై । పొలుపారంగఁద్రివిక్రమాకృతిజగంబుల్నిండవ్యాపింపని । మ్ములనమ్మేనికిఁదొల్లియేనువరుస న్మర్త్యేఁడుమాఱుల్ప్రర । ల్దిలకింపంగఁబ్రదక్షిణంబుఘనభక్తిన్జేసితిన్వేల్మిడిన్ ॥ (ఆ,వె) పొడుపుకొండమీఁదఁ

పున మీరుశోకవిషాదంబులుదక్కి యుత్సాహవంతులుగండని బోధించిన నంగదువచనంబులం దేఱి యావానర పుంగవులు దేవతలు వాసవునింబోలె నతనిం బరివేష్టించియారాత్రి గొల్చియుండిరి ॥ (క) జలనిధికెనయగు వానగ । బలమును వడినిల్వరింపఁ బావనికిమహా । బలుఁడగునంగదునకుఁగా । కిలవేఱొక్కనికి శక్యమే తలపోయన్ ॥ (వ) అంతనమ్మఱునాఁ డంగదుండు పెద్దలగు జాంబవదాదులతో నాలోచనంబుఁ జేసి వారి యనుమతి వడసి యెల్లవానరులువినుచుండ నిట్లనియె ॥ (ఉ) ఎవ్వఁడు నూఱుయోజనము లిప్పుడు నీరధి దాఁటఁజాలువాఁ । డెవ్వఁడు భానుమత్తనయు, నెంతయుసత్యము చేతఁ బ్రోచువాఁ । డెవ్వఁడు నీబలీముఖుల, నెల్లఁగృపామతి నుద్ధరించు వాఁ । డెవ్వఁడు లంకఁజొచ్చిపృథివీశసుతం గని రాఁగలండొకో ॥ (ఉ) ఏహరివీరుసత్కరుణ, నిందఱ మిక్కడఁ బోకజానకి । న్సాహసమొప్పఁ గాంచి రఘునాథునకాసతి వార్తఁజెప్పియు । త్సాహమెలర్పఁ బీటికి వె, సం జని మిత్రకళత్రపుత్రక । వ్యూహముతోడఁ గూడి సుఖయుక్తిఁ జరించెద మిండ్ల, పట్టునన్ ॥ (క) ఏపుణ్యాత్ముఁడుమనకిపు । డీపట్టునభయమొసఁగి యిందఱఁగృపచే । నేపారఁబ్రోచునెవ్వఁడు । భూపాలకమోదకారి పోలుపుగఁజెపుఁడీ ॥ (క) అని యంగదుండుపలికిన । వినికపివరులెల్లఁజాల వెఱగందుచునా । ననములువాంచి మఱిలనే । మనకుండినవారికనియె నాతఁడుమఱలన్ ॥ (ఉ) మీరుభుజాబలాధికుల మేయపరాక్రమశీలురిందఱి । ట్లూరకయుండఁ జెల్లునెవ యోధినొకండొకఁ డెంతదవ్వుపోం । పారఁగదాఁటనోపునుబలాబలము ల్దలపోసిచెప్పుఁడే । పారఁగరామకార్యమెటు లైననొనర్చుటవశ్యమేకదా ॥ (క) ఏలోకంబునడాఁచిన । వాలాయముసీతఁగాంచివచ్చెదమనిస । ల్లాపములు పలికితుది । నీలాగునవెఱఁగునొందు టిదిఘనమగునే ॥ (వ) అనిన నయ్యంగదువచనంబులువిని గజగవాక్షగవయ శరభ గంధమాదన మైందద్వివిద సుషేణ జాంబవంతులు తమతమ బలంబులకొలంది తలపోసి యత్యంతశక్తియుక్తుండైన రావణుం

—(*)వానరులు తమతమ జవసత్త్వంబుల నంగదునికిఁ జెప్పుట(*)—

డధిష్ఠించియున్న లంకఁ బ్రవేశింపను జానకినన్వేషింపను సుదుష్కరంబనితలంచి తామెల్ల కార్యసాధకుండైన వీరుండు హనుమంతుండనియెఱింగి తత్తత్ప్రా ష్వాణంబు మనముండఁ నమల్పంబుగా స్వస్వజవశక్తినిరూపించి చెప్పవల



యునని నిశ్చయించి యంగదునవలోకించి ॥ (సీ) నలువొప్పఁ బదియోజనంబులంబుధిదాఁట గలవాఁడనని వేడ్కగజుఁడుపలికె । నమరనిర్వదియోజనములుత్తరించెద ననిసంభ్రమమునగవాక్షుఁడనియె । ముప్పదియోజనంబులువార్ధిదాఁటంగఁ గలవాఁడనని పల్కెగవయుఁడప్పు । డురువడినలుబది యోజనంబులుదాఁటఁ జాలుదునేననిశరభుఁడనియె ॥ (తే,గీ) మొనసి యేఁబదియోజనములుపయోధి । దాఁటఁగలనని గంధమాదనుఁడుపలికె । నురుజవంబున నఱువది యోజనములు । దాఁటెదనఁటంచుమైందుండుచాటిచెప్పె ॥ (క) పోలుపుగ డెబ్బదియోజన । ములునెనుబదియోజనములు మున్కొని దాఁటఁ । గలవారమనుచుద్వివిదుం । డెలమిసుషేణుండుపలికి రెంతయుఁబ్రీతిన్ ॥ (వ) ఇట్లందఱుం దమతమ సత్త్వంబులకొలంది పలుక వారలఁజూచి యతివృద్ధుండును బలవంతుండును నగు జాంబవంతుండిట్లనియె ॥ (ఆ,వె) వయసునాఁడునాకు వైనతేయునకంటె । శ్వాసనుకంటెనధికజవముగలదు । కపివరేణ్యులార కడువృద్ధుఁడగుటచే । నిప్పుడదియుఁజాలహీనమయ్యె ॥ (చ) అయినను రామభూవిభున కయ్యినసూతికిఁగూర్చువాఁడనై । ప్రియమునఁదోఁచినంతయొన రింపక ప్రాణము దాఁచికొందునే । నియమమెలర్పనేనిపుడు నీరధిఁదొంబదియోజనంబులు । వ్రయమునదాఁటువాఁడనవ లంజనఁజాలనువృద్ధుఁడౌటచేన్ ॥ (క) అనియిట్టులవ్వివరించ

—*జాంబవంతుం డంగదునకు మున్ను తాఁజేసిన సాహసంబులఁ జెప్పుట*—

న । తనయుండువచించిమఱలఁ దరుచరవరులం । గనుఁగొనియుత్సాహముతో । దనపూర్వవిధంబుఁ జెప్పఁ దగనిట్లనియెన్ ॥ (క) మును నేను బలిమిఁ గావిం । చినకార్యములెల్లనిపుడు చెప్పితినేనిన్ । ఘనులార విన్నవారల । కనిశముఁబరిహాసకరము లైయుండుఁగదా ॥ (వ) అయినను జెప్పెద వినుండు ॥ (మ) కనియున్నాఁడను దొల్లి శైలములు తె, కల్గల్గి వర్తించుట । ల్గనుజుల్వేల్పులు వార్ధిఁ ద్రచ్చి సుధనందంబొప్పఁ బుట్టించుట । ల్ఘనుఁడౌ తార్క్ష్యవిభుండు పుట్టుటయు నీఁ, కన్నాక నాథుండులో । చనయుగ్మంబున నొప్పియుండుటయువి, స్పష్టంబుగానెంతయున్ ॥ (మ) బలభేదిం గృపఁ జూచి విష్ణుఁడుబలి న్బంధించిపాటోపుఁడై । పొలుపారంగఁద్రివిక్రమాకృతిజగంబుల్నిండవ్యాపింపని । మ్ముల నమ్మేనికిఁదొల్లియేనువరుస న్మున్ముయ్యేఁడుమాఱుల్పుర । ల్దిలకింపంగఁ బ్రదక్షిణంబుఘనభక్తి న్జేసితిన్వేల్మిడిన్ ॥ (ఆ,వె) పొడుపుకొండమీఁదఁ

మహానతనూజ నీవుపరికింపంగన్ ॥ (చ) ఖగపతివైన తేయుఁ డలకశ్యపపుత్త్రుఁడు శౌర్యశాలిప । న్నగకులవైరి మున్నురగనాథుఁ జేకొని పెక్కుమాఱుల । వ్యగణితసత్త్వసంపదల, నంబుధి దాఁటఁగఁ గంటివానిప । ఖగతబలంబు నీఘన భుజంబులకుం గలదెన్నిచూడఁగన్ ॥ (తే,గీ) బలము తేజంబు బుద్ధియుఁ బ్రాభవంబు । విక్రమము శౌర్యసంపద వేగమఖిల । భూతములకంటె నీకువిఖ్యాత

## (*) జాంబవంతుఁడు హనుమంతునిం బొగడుట. (*)

భంగి । నెక్కుడైయుండు నింతయు నిక్కువంబు ॥ (సీ) అమరవేశ్యలలోన, నతికీర్తనీయమైయలరారుఁ బుంజికస్థలయనంగ । నదిశాపవశమున, నగచరప తియైనకుంజరునకుముద్దుకూఁతురగుచు । జనియించియంజన యనుపేరలోకవి శ్రుతిఁ గాంచియసమాన,రూపమహిమఁ । దనరారికేసరి, యనుబలీముఖవీరు నకుఁబత్నియైయొక్క,నాఁడు వేడ్కఁ ॥ (తే,గీ) గామరూపిణిగావునఁ గాంచుతోడ । వలుఁదచన్నులువాలుచూ,పులువిశాల । జఘనము వినీలకచములుచారు ముఖము । గ్రాలశృంగారముగమర్త్యకాంతయగుచు ॥ (సీ) తనముద్దుమోముఁగన్గొనినవాంభోజాత మని తేఁటిగమికొంత చెనకదివురఁ । దనమోవిమురువుఁగన్గొని బింబఫలమని రాజకీరంబులు, రద్దుసేయఁ । దనపాదముల యంద మనువుగాఁబరికించి విద్రుమభ్రాంతిఁ గోవెలలుగలియఁ । దనబాహువులఁగాంచి,ఘనమృణాళములంచు నెంచియంచలు వేడ్కమించియలరఁ ॥ (తే,గీ) గటకనూపురమేఖలా, ఘటితరత్న । ఘంటికా నాదములు ఘల్లుఘల్లనంగ । శైలకటకాంతరస్థవి,శాలరమ్య । చందనోద్యానముననాడు, సమయమందు ॥ (చ) విడువకపద్మకుందకర, వీరసుగంధము సంగ్రహించిసాం । పడరఁగవృక్షషండముల, నల్లనఁబొంచి రసాలపఙ్క్తిపై । సుడియుచుభృంగసంగముల,ఝుమ్మని రేఁపుచు గాడ్పులీలతోఁ । గడువడివచ్చికాంత మొలఁ గట్టినచీరఁ దొలంగఁ జేట్టుచున్ ॥ (సీ) కరికరంబులుమెచ్చి, కదళితోసరివచ్చురమణీమృదూరుకాండములఁజూచి । స్యందనాంగము నెంచి, సైకతంబుహసించు పద్మలోచననితంబంబుఁజూచి । యావర్తముల మీఱి,సరిదిపొన్నలఁగేరు నాళీకముఖినత, నాభిఁజూచి । కరికుంభములఁబోలి, కలశంబులనఁజాలు నలికచవక్షోరుహములఁజూచి ॥ (తే,గీ) విమలదర్పణతుల్యక,పోలములఁజూచి । వారివీచుల కెనయగు,వళులఁజూచి । యహివిభునిఁబోలు మొలక నూగారుఁజూచి । యనిలుఁడు ప్రసూనశరమోహితాత్ముఁడగుచు ॥ (క) తనమదిఁ దమకంబడరఁగ । ఘనభుజములనవ్వె



లందిఁ,గౌఁగిటఁగదియిం । చినసంభ్రమమునననయ్యం । జనయిట్లనె భూరికోప సంయుతయగుచున్ ॥ (క) చాపల్యంబున నెవ్వఁడు । నాపాతిప్రత్యనాశ,నంబొనరింపం । జేపట్టెనిప్డునావుడు । నాపవనుం డుచితభంగి, నంగ నకనియెన్ ॥ (క) అంగననీతోమానసి । సంగతిఁజేసితినిదీన,సతతమునీకు । న్మంగళము లొదవువ్రతమది । వింగడమైచనదు మదిని వెఱవకుమింకన్ ॥ (మ) జలజాతేక్షణ నీకుఁ బుణ్యుఁడుమహా సత్త్వుండు మద్వారదో । ర్బలయుక్తుండుమహాభుజుండు త్రిజగత్ప్రఖ్యాతశౌర్యుండుకీ । శలలాముండుసుపర్ణవేగియుసుధీసంపన్నుఁడబ్జప్రియో । జ్జ్వలతేజుండు జగద్ధితుండొకఁడు వేజన్మించుమత్తుల్యుఁడై ॥ (క) అనిపలికి యనిలుఁడరిగిన । మనమునసంతోషమంది మానుగనయ్యం । జనని నుగిరిగహ్వరమునఁ । గనియెన్నుర్వ్యాశరదిని గన్నవిధమునన్ ॥ (సీ) భూరుహచరవీర,ఘృష్టనవ్యజపానిభ బాలార్కుబింబంబుఁ గాంచి । ఫలమని కాంక్షచే బంధురజవమున నురువడిమున్నూఱు,యోజనములు । గగనంబునకుఁ బ్రీతి,నెగసిభానుని కరంబుల వేఁడిమికిఁ గాక,నాఁడిపిదప । నింద్రనక్రాహతి, నెంతయు మూర్ఛిల్లి వ్యోమమార్గంబున నుండివాలు ॥ (తే,గీ) హనువుభగ్నంబుగాఁగమ,హాద్రిమీఁదఁ । గడురయంబునఁబడితివి కారణమున । నీకుహనుమంతుఁడనుపేరు,నెగడెనంత । నిన్నుఁగనుఁగొని పవనుండు,నెఱియఁగినిసి ॥ (వ) త్రైలోక్యవ్యాపకంబైన తనరూపంబు కుంచితంబుచేసిన ముల్లోకంబులు సంక్షోభితంబులయ్యె సురాసురాదులు సంచారంబులు మాని సంభ్రాంతచిత్తులై పరమేష్ఠిం బురస్కరించుకొని బహుప్రయత్నంబున నవ్వాయుదేవునిం బ్రార్థించిన నద్దేవుండు సురమునిగణప్రార్థితుండై రోషంబువిడిచి ప్రసన్నుండగుట యు లోకంబులెల్ల నప్పటియట్ల తేజరిల్లెనప్పుడప్పరమేష్ఠి నీకు సమరంబునందుఁ జావులేకుండ వరంబొసంగెఁ బురందరుండు వజ్రాయుధంబుచేత హానిలేకుండ ననుగ్రహించెఁ దక్కిన దిక్పాలకులెల్లఁ దమతమ యాయుధంబులచే మరణంబులేకుండఁ బ్రసాదించిరి సకలదేవతలు జరారోగభూతోపద్రవంబులు నిన్నుం జెందకుండునట్లుగాఁ దీవించిరి మహర్షి బ్రహ్మర్షి దేవర్షులు స్వచ్ఛందమరణంబయ్యెడుఁగాక యనిపలికిరి ॥ (క) అనిలునకౌరసపుత్త్రుఁడ । వనఘాత్మకక్షేత్రజుండ, వాకేసరికిన్ । ఘనలంఘనలాఘవముల । ననవరతము సాటివత్తువనిలునితోడన్ ॥ (క) తేజంబున రెండవఖగ । రాజవునీవబ్ధిదాఁటి, లంకాపురిలో । నాజానకిఁగనిమముని । చ్చోఁజావక యుండఁ బ్రోవు సురుచిరకీ

లన్ ॥ (వ) ఏను తొల్లి త్రివిక్రమావతారంబునం దిరువదియొక్కమాటు ధరణి
కిం బ్రదక్షిణంబు చేసితి మఱియు సర్వౌషధీజాలంబులు పయోనిధిం బడవైచి యు
క్కడలిఁ ద్రచ్చి యమృతంబు వడసి యయ్యమృతంబు దేవత లుపయోగించు
నాఁడేను నొక్కవేరవున నమృతంబు ద్రావి ద్విగుణీకృతబల విక్రమసంపన్నుం
డనైతి నిప్పుడు మహావృద్ధుండ నగుటం జేసి పరాక్రమ హీనుండనై యున్న
వాఁడ నీవు సర్వగుణోపేతుండవు బల పరాక్రమ సంపన్నుండవు గావున ॥
(క) నీవిక్రమంబుఁ జూడఁగ । నీ వానరు లెల్ల వేడ్క నెసఁగుచు నున్నా । రో
వాయుతనయ చూపుము । నీవీర్యమహత్త్వ మెల్ల నివ్వెఱపఱుపన్ ॥ (ఉ) ఈవన
రాశి దాఁటి జనకేశసుతం గని వచ్చి మమ్ము ను । గ్రీవుని గావ నోపిన మహీప్రభుఁడె
వ్వాఁడొ యంచు మీరుచిం । తావిలచిత్తులై కడు భయంబున గాసిలుచున్న వారలో
పావని మీరినందఱుఁ గృపామతిఁ గావుము చావకుండఁగన్ ॥ (ఉ) లెమ్ము పయోధి
నీవు నవలీలను దాఁటి సురారిపట్టికిం । బొమ్ము మహీసుత న్వడకి పొల్పుగఁ గాంచి
మహాజవంబుతో । రమ్ము మహాత్ముఁడైన రఘు రామునకు న్మితిలేని సంతసం । బి
మ్ము వనాటవంశమున కెంతయు మేటివి గమ్ము మారుతీ ॥ (ఉ) మించుము వీర్యగ
ర్వమున మేటి త్రివిక్రమదేవు కైవడిం । బెంచుము మేను నిర్జరులు మేలనన ద్భు
తవైఖరి న్విజృంభించుము క్రూరకమఠంబగు భీకరదైత్యుల కెల్ల భీతిఁ బు । ట్టించు
ము తాత్త్వికుల్ బాగునన నటించుము నించుము కీర్తి దిక్కులన్ ॥ (వ) అని జాంబ
వంతుండు బోధించిన నాహనుమంతుండు పర్వకాలంబునం బొంగు సముద్రం
బు భంగి నుప్పొంగి యభంగతరంగమాలికాజాలంబుల లీల నిజతేజోజాలం
బు లంబరంబునం బర్వఁ దదీయభీషణ నిర్ఘోషంబు భంగి మహానాదంబు సే
యుచు నవక్రపరాక్రమంబున జగత్త్రయంబును బాదత్రయంబున నాక్రమింప
నుపక్రమించు త్రివిక్రమదేవు పోలిక సుధాహరణ దీక్షాదుర్నిరీక్ష్యుండగు నండ
జమండలాఖండలుని కైవడిం దనశరీరంబుఁ బెంచి విజృంభించి బంగరుగట్టుమా
డ్కి దిట్టయై యాకరువలిపట్టి చూపట్టె నప్పుడు వీర్యశిఖామణి రూపంబు తేజః
పూర్యమాణంబై యనృష్టపూర్వశో[illegible]బునం బొలిచె నంబరీషోపమంబై
నతదీయవదనంబు ప్రదీప్తంబై [illegible]ని మాడ్కి శోభిల్లె నాసామయం
బున (సీ) తోడరి దైత్యులపాలి[illegible] తెలుఁగుఁ జదగిన వా[illegible]బు వాని ।
[illegible]బింబంబు పగిది సమ[illegible] మైనమ్ముము వాని । మే
రుమందరమహా మేదినీధరతుల్య కమనీయదివ్యవిగ్రహము వాని । బ్రళయకా



లమునాఁటిభయదమేఘము భంగి నురువడిఁ గర్జింపుచున్న వాని ॥ (తే,గీ) సక
లదిక్కులు భూరితేజంబుచేత । నుజ్జ్వలంబుగ వెలిఁగింపుచున్న వాని । దండిమె
యిమ్ముజగంబులు నిండినట్టి । ఘనుఁడగు త్రివిక్రముని భంగిఁ గ్రాలువాని ॥ (చ)
అనిలతనూజుఁ గాంచి కపు లందఱు శోకము వీడి మానసం । బునఁ గడు విస్మయం
బును సమున్నతహర్షము పిక్కటిల్లఁగా । ఘనముల కైవడి న్నిగుల గర్జిలు
సల్పుచు వేడ్కతోడ న । య్యనఘునిఁ గొల్చియుండిరి జయధ్వనులం గడు సన్ను

—*హనుమంతుఁడు వర్ధమానబలుండై వీరాలాపంబు లాడుట.*—

తింపుచున్ ॥ (వ) ఇట్లు విజృంభమాణ శరీరుండై యప్పవమాన నందనుండు
స్తోత్రవాక్యంబులచేత నంతకంతకు త్సాహంబు రెట్టింప సింహంబు గిరిగహ్వరం
బునందు విజృంభించినమాడ్కి విజృంభించి రోమాంచ కంచుకిత దేహుండై
కపులనందఱ నానందసముద్ర వీచికాసందోహంబులం దేల్చుచు రయంబున
నాహరి మధ్యంబుననుండి వెల్వడి హరివృద్ధులగు జాంబవదాదుల కభివందనం
బులు చేసి మేసుగంభీర భాషణంబుల నిట్లనియె ॥ (ఉ) ఎవ్వఁడు ప్రాణమీ జగతికె
న్నఁడు నిర్జరమార్గగోచరుం । డెవ్వఁడు హవ్య వాహసఖుఁ డెవ్వఁడమో
ఘరయుండు శీఘ్రగుం । డెవ్వఁడునట్టి వాయువున కేను గుమారుఁడఁ గానమత్స
ముం । డెవ్వఁడు లేఁడు ధారుణిని హీనపరాక్రమసత్త్వసంపదన్ ॥ (సీ) వాలవి
క్షేపదుర్వారవాతాహతి జలధరంబులు దూలి మలల వాఁగ । నతులభుజోరువా
తాతివేగమున నంభోనిధిగ్రాహముల్ ఘూర్ఘ నొందఁ । గమనీయవక్షోవిఘట్టనం
బున శైలవృక్షషండంబులు విఱిగికూల । దారుణాశనిసన్ని, భోరుఘట్టనమునఁ
బృథివీధరంబులు, పిండిగాఁగ ॥ (తే.గీ) వీఁక జలరాశి నవలీల, వేఁగ దాఁటి । శంక
లేక ముదంబున లంకఁ జొచ్చి । సీతఁ గనుఁగొని కృతకార్యసిద్ధితోడ । నేగుదెం
చెదము ఖాఁదు డెల్లకపులు ॥ (క) పరువడిఁ గమలవనప్రియుఁ । డురుదుగ నొక
మాటు దిరుగునంతటిలోఁబం । గరుగట్టు వేయిమారులు । తిరముగ నయ్యినునిఁ గ
డచి తిరిగెదఁ గడిమిన్ ॥ (క) దివినుండి వైనతేయుం । డవిరళగతిఁ బుడమి దిరు
గునంతటిలోనే । జవమున వేమఱు దివికిన్ । భువికి న్దాఁటెద సమగ్ర భుజబల యు
క్తిన్ ॥ (తే,గీ) సూర్యుఁడుదయాద్రిపయినుండి యస్తగిరికిఁ । బోవు నంతటిలో
నేను భూ[illegible]జవము । మెఱయనుదయాద్రినుండి యాచరమగిరికి । వేయిమారులు
పోవుదు [illegible]సరణి ॥ (క) జలనిధులన్నిఁ గడచియా । వలితీరముఁ జేరియచట
వాలిక[illegible] । న్నలువిడి మగుడి కడచియా । వలితీరముఁ జేరుదు[illegible]

మెఱయన్ ॥ (క) ఏపునముల్లోకములది । శ్రీపాలకపట్టణముల సరభసవృత్తి । న్యాపుత్త్రి వెదకికనుఁగొని । భూపతికిం దెచ్చియిత్తుభుజబలమలరన్ ॥ (చ) పరువడిమూఁడులోకములు భస్మముచేసెద శైలశృంగము । ల్పెఱియలువాపెదన్నుడమి ద్రచ్చెదమృత్యువుఁబట్టితున్మెద । స్థిరుసున మేఘముల్వెఱియఁ దోలెద దాఁటెదనేఁడు దీవులు । న్మరధిగలంచెదన్విదకి జానకిఁదెచ్చెద భర్తకిచ్చెదన్ ॥ (క) ఉరుగతినాకాశంబున । కిరిగెడుతెఱఁగిన న్నుఁ జూచిహాపర్ణంబునసం । బరచరభూతములుసుధా । హారణార్థంబరుగుగరుడుఁ డనివలచువడిన్ ॥ (క) దివినావరించిహేమా । ద్రివిధంబునఁగాయమలర ధృతిసభ్రిముభ్రిం । గవడింబోయెడుకైవడి । దవులంజనునన్నుఁ గాంచెదరుకపివర్యుల్ ॥ (క) పరువడినంబుధి దాఁటెదు । తఱిఁబవమానుండుమఱియుఁ దాత్స్యుర్ణుడుదక్క । న్దరలో వేఱొక్కఁడుదు । ష్కరగతినన్నను సరిపఁగాఁజాలరొగిన్ ॥ (క) వినుఁడొకనిమిషాంతరమున । ననుపమగతిమెఱుఁగు మెఱసినట్లునిరాలం । బనమగుగగనమునకుంజయ్యననెగసెదమీరుచూచి హర్షమునొందన్ ॥ (క) ప్రమదముననబ్ధిదాఁటెదు । సమయంబుననస్మదీయ చటులాద్భుతరూ । పమునుసమానాథుత్రివి । క్రమరూపమునట్లుమీరు గాంచెదరిచటన్ ॥ (క) సురనాథునోర్చి గరుడుఁడు । తిరముగ నమృతంబుమున్ను దెచ్చినభంగిన్ । సురవైరినోర్చి యిచటికి । ధరణీపుత్త్రికను నేనువడయకతెత్తున్ ॥ (చ) అమరననేక యోజనము లశ్రమలీలఁ గడంగి దాఁటెద । న్నమయుననింగియున్ఫణిజ గంబుచరించెద రెండుచేతుల । న్గ్రిమమున నాత్రికూటనగ రాజమునుద్ధగబుఱ్ఱముకెత్తై । లముఁగొని తెచ్చియిచ్చటనె రామునిరాజకుమారిఁగూర్చెదన్ ॥ (వ) అనిబహుప్రకారంబులవిజృంభమాణశరీరుండై యమితబలపరాక్రమశాలియగు హనుమంతుండు నికట్టంబుగా స్వోక్తవిశేషణ విశిష్టుండయ్యెను దుఃఖసాగరమగ్న వానరవాహినీసంతోషార్థమే తాదృశవీరాలాపంబులుపలికి వనచరులకు వేడ్కఁ బుట్టించిన నమ్మారుతనందను నవలోకించి పరమానందభరితాంతఃకరణుండై జాంబవంతుం డిట్లనియె ॥ (క) మారుతనందననీకె । వ్వారుర్వర సాటిగలరు వారకనీచే । ధీరోద్ధతిఁగపివీరుల । దారుణశోకము వినాశితంబయ్యెరహిన్ ॥ (క) ఈహరిముఖ్యులునీకుస । మాహితులై కార్యసిద్ధి యగుత్వనుదునంచున్ । మాహాత్మ్యంబలరఁగను । త్సాహంబున మంగళంబొసంగెదరనఘా ॥ (క) గురులప్రసాదంబునమునిం । వరులప్రసాదము నగ్నివరులప్రసాదో । త్కరమున నీవిప్పుడుస । త్వరముగ సింధుంబు రాశి



దాటుము లీలన్ ॥ (క) నీవసుగుదెంచు నంతకు । జీవితములు త్వద్గతములు చేసి యిచట సాం । పావహిలఁగ నిందఱమును । భావని యుండఁగలమేక, పాదస్థులమై ॥ (వ) అనిన నప్పవమాన సూనుండు వానర వీరులనందఱఁ గలయ నవలోకించి యేనతి జవంబున నాకాశంబున కెగయుటకుం బ్రాదంబు లూఁదిన నిమ్మహిభరింపంజాలక దిగంబడుఁ గావున నిమ్మహేంద్రనగంబెక్కి తదీయశృంగశృంగాటకంబుల మీఁదనుండి యవలీలదాఁటెద నని పలికి

(*) హనుమంతుండు మహేంద్రపర్వతం బెక్కుట. (*)

మహేంద్రసమ విక్రముఁడగు మహాబలనందనుండు నానావిధతరువిసర విభ్రాజితంబును మృగసేవితశాద్వలంబును లతాకుసుమసంబాధంబును నిత్యపుష్పఫలద్రుమంబును సింహశార్దూల చరితంబును మత్తమాతంగ నిషేవితంబును మత్తద్విజగణ సంఘుష్టంబును సమంతతో నిస్సృత నిర్ఝరసంకులంబును శిలాతుంగ ప్రదేశభూయిష్టంబును మహోన్నతశృంగసంగతంబగు మహేంద్ర పర్వతంబెక్కి యన్నగోపరిభాగంబున ॥ (క) ఆతత పద్మాకరమున । మాతంగముఁబోలె రుచిర, మరకతమణిసం । స్ఫీతమగు శాద్వలంబున । వాతసుతుఁడు సంచరించె,వనచరు లలరన్ ॥ (వ) అప్పుడు ॥ (క) ఆభూమిభృచ్ఛిఖామణి । భీభత్సకపీంద్రపాద, పీడితమైసిం । హాభిహతకుంభమగుమ । త్తేభముచందానొప్పె, నెంతయుఁగడఁకన్ ॥ (క) హరివరువివజ్రసన్నిభ । చరణాహతికోర్వలేక, శైలంబుపోరిం । బొరివిడుచు బాష్పజలముల । కరణిన్ గిరినిర్ఝరములు, గానఁగనయ్యెన్ ॥ (సీ) మానితమణిచిత్ర, సానుగోచరులగుసురసిద్ధసాధ్యులు వెడలిపాఱ । నిరుపమరత్నకందరములఁ గ్రీడించు భీకరమృగములు, భీతిఁబఱవ । భూరుహ శాఖాగ్రములమీఁద నివసించు పక్షి సంఘములు విభ్రాంతి నొందఁ । గమనీయ సైకతాగ్రములపై విహరించు కిన్నరమిథునముల్, కృశతఁగుందఁ ॥ (తే, గీ) జటులమరకత మణిరుచి, శాద్వలములఁ । బ్రీతిమెయినాడు హరిణముల్, బెదరిపఱవఁ । గఠినహరివీర ఘనపదా, ఘాతమునకు । భీతిగొనిగోత్రవరము కంపించెనపుడు ॥ (వ) మఱియునమ్మహాశిలోచ్చయం బర్ధవినిస్సృతంబులైన భుజంగంబులచేత నుద్దీపితకేతనంబులచేతంబోలె నభిరామంబై యొప్పె మఱియుఁ ద్రాసనంభ్రాంతులైన మహర్షులచేతఁ బరిత్యజ్యమానంబై యన్నగోత్తమంబు సార్థహీనుండైన పథికునికైవడిఁజూడనొప్పె నప్పుడుమహావేగుండును బరవీరహంతయునగు హనుమంతుండు వేగంబునందు సమ్యక్సమర్పితచిత్తుండై లంకాపురంబునకుం జ

నుటకు మనస్సమాధానంబు గావించెనని యిట్లు కిష్కింధాకాండకథాప్రపంచం బంతియు సమగ్రంబుగా వినుపించిన విని సంప్రహృష్టచిత్తుండై రామభద్రుండు భద్రవాక్యంబుల వారలం బ్రశంసించి యటమీఁది కథావృత్తాంతంబు వినిపింపుఁడని యడుగుటయు ॥ (కందగీతద్రుతవిలంబితస్వాగతాగర్భచంపకము.) కరివరకామదా దనుజ,ఘస్మర ధన్యకథాజితారిమా । వరవిభవామనా వినుత,వాసవ విశ్వపవిత్రమాధ్యభూ । ధరహరి ధామదాకనక,దాస్థికార్యజగన్నుతాఖ్యశ్రీ । కరజన కాముకాప్రణుత,కాముకబాణ విపన్నపాలకా ॥ (ఖడ్గబంధము) రాజరాజ రాజసేవ్య, రాజపూజకాజరా । రాజితామలోరు కీర్తి రమ్యసద్గుణాకరా । రాజవంశవర్య దైత్య,రాజవైరియిందిరా। రాజసన్నిభాననాభి,రాజితాబ్జభాస్కరా ॥ (చతుర్విధకందము) సురవరసర్వశరణ్యా । సరమామురహర సరసిజచరణాకరిపా । హరసఖశశిరవినయనా। సరసాయదువర ధరధర,సరసాత్మహరీ ॥

( గద్యము. ) ఇతిశ్రీరామచంద్రచరణారవింద మకరందరసాస్వాదనతుందిలేందిందిరాయమాణ మానసకులపవిత్ర కౌండిన్యస గోత్రపద్మనాభసూరిపుత్ర విద్యాసాంద్ర వేంకట కవీంద్ర ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబను మహాకావ్యంబునందు రామవిరహ శోకంబును హనుమత్సమాగమంబును ఋశ్యమూకగమనంబును సుగ్రీవసఖ్యంబును సీతాభరణ ప్రదానంబును వాలిసుగ్రీవులవైరానుకథనంబును సాలభేదనాదికంబుచేత సుగ్రీవునకు విశ్వాసంబుపుట్టించుటయు వాలిసుగ్రీవుల యుద్ధంబును వాలిమథనంబును సుగ్రీవరాజ్యస్థాపనంబును దారావిలాపంబును రామసుగ్రీవుల సంకేతంబును వర్షరాత్ర నివాసంబును ఋతువర్ణనంబును రాముని కోపంబును వానరుల పరస్పరమేళనంబును హరిత్ప్రస్థాపనంబును మహీసంస్థానకథనంబును నంగుళీయకప్రదానంబును సీతాన్వేషణంబును బిలప్రవేశంబును స్వయంప్రభా వృత్తాంతంబును బ్రాయోపవేశంబును సంపాతిసంవాదంబును బర్వతారోహణంబు నను కథలుగల కిష్కింధాకాండము సమాప్తము.



(శ్లో) ఈకావ్య ప్రతిపాదితుండయిన సీ, తేశుండు రామప్రభుం । డీకల్యాణకృతీశ్వరుండయిన శ్రీ,కృష్ణుండు సంప్రీతితో । సాకల్యంబుగ సిష్టసిద్ధికరులై, చంచత్కృపాపూర్ణులై । లోకస్తుత్య కుమారయాచధరణీం,ద్రుం బ్రోతు రెల్లప్పుడున్ ।

